## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

# వాసిష్ఠ రామాయణము

అను

# శ్రీయోగవాసిష్ఠము.

(తాత్పర్యప్రకాశికయను ఆంధ్రానువాదసహితము.)



వ - 8

## మహర్షివాల్మీకి ప్రణీతము.

ఉత్తరార్ధము.

అనువాదకుఁడు :— శ్రీపూర్ణానంద.

సంపాదకులు:

శ్రీవ్యాసాశ్రమము, (ఏర్పేడు P. O., చిత్తూరుజిల్లా)

1940 క్రీ. శ. ౧౮౬౩ శా. శ.

ఓమ్.

# విషయానుక్రమణిక.

## నిర్వాణప్రకరణము (పూర్వార్ధము.)

—:O:—

ఓమ్.

# విషయానుక్రమణిక.

## నిర్వాణప్రకరణము (పూర్వార్థము)

ఓమ్.

# విషయానుక్రమణిక.

## నిర్వాణప్రకరణము (పూర్వార్ధము)

ఓమ్.

# విషయానుక్రమణిక.

## నిర్వాణప్రకరణము (పూర్వార్ధము)

# విషయసూచిక.

## నిర్వాణప్రకరణము (ఉత్తరార్ధము.)

ఓమ్.

శ్రీ వాసిష్ఠ్యనమః.

'ఓం నమోస్తు మిత్రావరుణయో రుర్వశ్యాత్మజాయ శతయాతనే వసిష్ఠాయ'

# శ్రీ వాసిష్ఠ మహారామాయణము.

## నిర్వాణప్రకరణము.

(పూర్వార్ధము)

### ప్రథమః సర్గః.

[మునివాక్యాదిహోత్థానం శ్రోతౄణామాహ్నికీ క్రియా
శ్రుతార్థచిన్తానిద్రాభ్యాం రాత్రియాపనమీర్యతే.

మునివాక్యముల విని సభ్యులు లేచుట; ఆహ్నికక్రియ; వినిన యర్థమును చింతించుట; యందును, నిద్రయందును నాటి రాత్రి గడపుట యను నీవిషయము లీ సర్గయందు వర్ణింపబడినవి.]

శ్రీ వాల్మీకి రువాచ :—

ఉపశమప్రకరణాదనన్తర మిదం శృణు
త్వం నిర్వాణప్రకరణం జ్ఞాతం నిర్వాణదాయి యత్. 1

(శ్రీవాల్మీకి:- రామా! నీ వింతవరకు ఉపశమప్రకరణము వింటివి. ఇక నిర్వాణప్రకరణమును వినుము; దీనిని విన్న నిర్వాణము లభింపగలదు.

కథయత్యేవముద్దామ వచనే మునినాయకే
శ్రవణైకరసే మౌనస్థితే రాజకుమారకే. 2

మునివాగర్థనిక్షిప్త మనస్యస్త తపఃక్రియే
రాజలోకే గతస్పన్దే చిత్రార్పిత ఇవ స్థితే. 3

వసిష్ఠవచసామర్థం విచారయతి సాదరమ్
లసదఙ్గులిభఙ్గేన మునిసార్థే స్ఫురద్భ్రువి. 4

విస్మయాలోకనోల్లాస ప్రోత్ఫుల్లనయనాలిని
పురన్ధ్రివర్గే గమ్భీరతరమఞ్జరితాం గతే. 5

ఖే వాసరచతుర్భాగదేశే దినకరే స్థితే
కించిజ్జనోదయాత్సౌమ్యే కించిచ్ఛ్రమముపేయుషి. 6
శ్రవణాయేవ సంశాన్తే వితానస్పన్దమాలితే
మౌనం మరుతి మన్దార మధురామోదదాయిని. 7
పుష్పదామ సుషుప్తాసు మహాభ్రమరపఙ్క్తిషు
జ్ఞాతజ్ఞేయతయా నూనం సమ్యగ్ధ్యానవతీష్వివ. 8
ముక్తాజాలకలాపా న్తర్గతాస్వన్తరభూమిషు
కచత్యపగతస్పన్దం తోయే శ్రోతు మివాస్థితే. 9
గృహాన్తరం ప్రవిష్టేషు గవాక్షే దూరమంశుషు
విశ్రామార్థ మివాదీర్ఘం నభః పాన్థేషు శీతలమ్ 10
ముక్తాజాల ప్రభాజాల భస్మనోద్ధూలితాత్మని
శంసతీవ శమం శామ్యద్దినదేహే దివాతపే. 11
కరే లీలా సరోజేషు శేఖరేషు చ భూభృతామ్
శ్రుత్వా సురసమామోదాదవృత్తిషు మనస్స్వివ. 12
బాలకేష్వఙ్గలోకేషు లీలాపక్షిషు సాదరమ్
భోజనార్థం వధూలోక ముపరుద్ధత్స్వనారతమ్. 13
భ్రమద్భ్రమరపక్షోత్థ వాతధూత రజస్వలమ్
కౌముదే పరివిశ్రాన్తే చామరేష్వక్షిపక్ష్మసు. 14
రశ్మిష్వగగుహాన్మ్లక్తచ్ఛాయాజాలభయాదివ
గవాక్షాదిష్వివోడ్డీయ ప్రవిష్టేషు గృహాన్తరమ్. 15
ఆసీద్దినచతుర్భాగ సత్తావేదన తత్పరః
భేరీపటహశఙ్ఖానాం దిఙ్ముఖాపూరకో ధ్వనిః. 16

మహావక్తయును, మునిశ్రేష్ఠుఁడునగు వసిష్ఠుడిట్లు ఉపదేశ మొసఁగుచుండ రాజకుమారుడగు రామచంద్రుడు మౌనమును దాల్చి, స్థిరుడైయుండెను. సభాసదులందరు గూడ స్థిరులై స్పందనరహితులైయుండిరి. వారి మనస్సులు క్రియారహితము లయ్యెను; శరీరములు జడమువలె దోపట్టుచుండెను. చూపరుల కయ్యది దశరథుని సభవలెగాక, చిత్రపటమువలె తోచుచుండెను. మునివర్యులు గూడ వసిష్ఠుని వాక్యముల లోలోనగ్రహించి, వ్రేళ్లతో సైగలొనర్చుచు, కనుబొమ్మల ముడువసాగిరి. అంతః పురవాసినులుగూడ వసిష్ఠోపదేశబలమున పరమాశ్చర్యరూపమున పరమాత్మను జూచుచున్నట్లుండిరి. ఆనందమున వారి శరీర ముబికి, గగుర్పాటు నొందుచుండెను. భ్రమరసుందరములగు వారి నయనములు ఆశ్చర్యమున విస్ఫారితము లయ్యెను; రెప్పపాటు పడకుండెను; శరీరము కదలకుండెను; చూపరులకు సద్యోప్రస్ఫుటితమును, నివాత నిష్కంపమును నగు తరుమంజరి కూర్చొనినట్లున్న, అందు భ్రమరద్వయము నాశ్రితమైనట్లును తోచుచుండెను. ఇట్లు, దినమంతయుఁగడచి సాయం సమయమున సూర్యుఁ డస్తదేశమును జేరుకొనెను. వసిష్ఠదేవుని ఉపదేశవాక్యములను విని, ప్రియవస్తువుల అనిత్యత్వమును

వియోగమును గ్రహించి, జ్ఞానోదయ మన, సూర్యుడు తీవ్రత్వమును బరిత్యజించి, సౌమ్యరూపమును ధరించి, ఒకింత శాంతిని బడసినట్లుండెను. క్రమముగ సాంధ్యవాయువులు వీవదొడగెను. వాటి తీవ్రతకూడ తగ్గవడెను. ఉపదేశశ్రవణముననే వాటికిగూడ, మందగమనము, మౌనభావము అబ్బినట్లుండెను. మెల్లగ, సభాస్థల — వితాన — పుష్పములను గదల్పసాగెను. నలువైపుల నుండాగ పుష్ప సౌగంధము క్రమ్మకొడగెను. భ్రమరములు శ్రేణీబద్ధములై, పుష్పమాలా సమూహముల నిద్రితము లయ్యెను; అవి జగత్తున దెలిసికొనదగినదానిని దెలిసికొనియే, ధ్యానమగ్నము లైనట్లుండెను. ముక్తాజాలముల ఆవరితములగు క్రీడాపుష్కరిణీజలముగూడ మధుర — ఉపదేశమును వినగోరియే, అచంచలమైనట్లు ఉండెను. నేడందఱును శాంతికాములు. సూర్యుడంతులేని ఆకాశమార్గమున అనంతకాలము తిరుగాడి, నేడు శాంతినిగోరి, గవాక్షపథమున సుశీతలమగు గృహమధ్యమున బ్రవేశించుచుండెను. సాంధ్యకరముల ఉజ్వలమధుర దేహమును గైకొని, దినముక్తాశుభ్ర కాంతియును ధిక్కృతమును అలసి కొని, ఆ ప్రశాంతమూర్తి నలుదిక్కుల శాంతివార్తను, వెదజల్లుచున్నట్లుండెను. రాణుల, వారి మస్తకస్థితములగు లీలాపద్మములు, ఉపదేశ శ్రవణమునందినవారి మనస్సులవలె, వికసితములవసాగెను. బాలురు, మూర్ఖులు, పంజరమునందలి పక్షులు, ఆహారార్థము వధువుల పీడింపసాగిరి. కుసుమ పుష్పముల పరాగము, ఇటునట సంచరించు భ్రమరముల పక్షవాయువున అంతర్హిత మవసాగెను. రజము * తొలగిన, తత్సంబంధమగు అశాంతిగూడ తొలగిపోవును; వాటి అశాంతిగూడ సొలగిపోవ, అవి విశ్రామసుఖము నందదొడగెను. సభాస్థరాజగణము బాహ్యస్థితివ్యగ్రహీతమగుటవలన, చామరవ్యజన మాగిపోయెను. దృష్టి స్థిరము- నేత్రపల్లవములుగూడ నేడు విశ్రాంతి నందెను. సూర్యుని ప్రబలప్రతాపమునజేసి, అంధకారమంతయు అంతవఱకు పర్వతగుహల దాగియుండెను; సంధ్య అయినను విజేత * దుర్బలు డయ్యెను. సమయమును గనిపెట్టి అవి క్షీణశక్తియగు సూర్యకిరణముల నాక్రమించెను. అవి నిరుపాయములై, గవాక్షమును వీడి, గృహాభ్యంతరమును బ్రవేశింపదొడగెను. అప్పుడు దిక్కుల నావరించుచు, భేరీపటహశంఖముల మహాచ్ఛబ్దము లేవదొడగెను; జనులు రేజాముగియుటకొక జామున్నదని గ్రహించిరి.

తేన తత్తారమప్యాశు వచోఽస్తధ్వానమాయయౌ
మౌనం జలదనాదేన మాయూర ఇవ నిఃస్వనః. 17

మహర్షియొక్క ఉచ్చైస్స్వర మా మహాధ్వనియందు మేఘగర్జనమున కేకారవమువలె, అంతర్హితమయ్యెను.

ఆక్షుబ్ధా క్షుబ్ధపక్షాలిః పఞ్జరస్థా ఖగావలీ
భూకమ్పే తరసా తాలీపల్లవేవ వనావలీ. 18
ఆయయుర్భయవిత్రస్తా బాలా ధాత్రీకుచాన్తరమ్
సారవం పావృషీవాబ్దాః ప్రోన్నతం శృఙ్గకోటరమ్. 19
ఉత్తస్థురవతంసేభ్యో భూభృతాం భ్రమరస్రజః
ఈమత్కారాలవాహాభ్యః సరిద్భ్యోఽమ్బుకణా ఇవ. 20

*రజము:- పుష్పపక్షమున పుప్పొడి, అన్యత్ర రజోగుణము. విజేత—అను సూర్యుడు, జయము నందిన వాడు, అని ద్వ్యర్థి.

ఏవం ప్రక్షుభితే తస్మిన్గృహే దాశరథే తదా
ప్రాప్తే వాసరవృద్ధత్వే శాన్తశఙ్ఖస్వనే శనైః. 21
సంహరన్ప్రస్తుతం వస్తు వచో మధురవృత్తిమత్
ఉవాచ మునిశార్దూలః సభామధ్యే రఘూద్వహమ్. 22

హఠాత్తుగకలిగిన భూకంపమున కంపిత తాలవృక్షమగు వనావళివలె, పంజరస్థములగు పక్షిసమూహములు సంచలిత గాత్రము లయ్యెను. వర్షాకాలమున మేఘములు గర్జనమొనర్చుచు, ఉన్నత గిరిశిఖర ద్వయ మధ్యమును ఆశ్రయించునట్లు, ఆ శబ్దమును విని బాలకులు, భయవ్యాకులితులై ఏడ్చుచు, ధాత్రీస్తనయుగళ మధ్యమున మస్తకముల దాచసాగిరి. మరుద్వేగమున ఈషత్ప్రకంపితమగు సరోవరము నుండి, జలబిందువులులేచి ఇటనట బడునట్లు, రాజుల పుష్పాభరణముల నిద్రించు భ్రమరములు ఆ వికటశబ్దమునకు ఉలికిపడి లేచి, పుష్పపరాగరంజితములగు శుభ్రశరీరముల విహరింపసాగెను. ఇట్లు, దశరథుని సభాగృహము సాంధ్యధ్వనుల విచలితమవ, శంఖధ్వనులు నెమ్మదిగ ఆగిపోవుటను గ్రహించి వసిష్ఠుడు సంధ్యయగుటవలన ఉపదేశవాక్యముల నుపసంహారించెను. మఱియు, రామచంద్రు నుద్దేశించి ఇట్లు మధురముగ పల్కదొడగెను:—

రాఘవానఘ వాగ్జాలం మయైతత్ప్రవిసారితమ్
తేన చిత్తఖగం బద్ధ్వా క్రోడీకృత్యాత్మతాం నయ. 23

రాఘవా! అనఘా! నేనింతవఱకు విస్తరింపజేసిన వాగ్జాలమున, నీచిత్త-విహంగమును బంధించి, హృదయ-పంజరమున నుంచి, వశమొనర్చుకొనుము.

కచ్చిద్గృహీతో భవతా మద్గిరామర్థ ఈదృశః
త్యక్త్వా దుర్బోధమక్షీణో హంసేనేవామ్భసః పయః. 24

హంస నీటినుండి పాలను వేఱుపరచి గైకొనునట్లు, నీవు నా దుర్బోధ్యవాక్యముల విడచి సారమును గ్రహింపగలిగితివా?

విచార్యైత దశేషేణ స్వధియైవం పునఃపునః
అనేనైవ పథా సాధో గన్తవ్యం భవతాధునా. 25

నేను ఉపదేశించిన, ఈ వాసనాక్షయ, మనోనాశ, ప్రాణసంరోధ, జ్ఞానాభ్యాసపథమును జక్కగ స్వబుద్ధితో పరిశీలించి, అనుగమింపవలెను.

అనయైవ ధియా రామ విహరన్నైవ బధ్యసే
అన్యథాధః పతస్యాశు విన్ధ్యఖాతే యథా గజః. 26

ఈ పథము ననుసరించిన బద్ధుడవుగావు; అన్యత్ర పతన మనివార్యము. అయ్యది, వింధ్యగర్తమున గజపతనమును బోలునది.

సుగృహీతం ధియా రామ మద్వచో న కరోషి చేత్
తత్పతస్యవటే త్యక్తదీపో వాన్ధో నిశాస్వివ. 27

నా వచనముల జక్కగా గ్రహించి, అనుసరింపనిచో, నీవు, అంధుడు లేక, దీపరహితుడు గాఢాంధకారమున గర్తపతితుడగునట్లు, పతనము నందెదవు.

అసఙ్గేన యథా ప్రాప్తో వ్యవహారోఽస్య సిద్ధయే
ఇత్యేవ శాస్త్రసిద్ధాన్త మాదాయోదారవాన్భవ. 28

ఆసంగచిత్తమున యథాప్రాప్తములగు లోకవ్యవహారముల నాచరించుటయే, శాస్త్రసిద్ధాంతము. దీనిని గ్రహించి ఉదారచిత్తుడవు కమ్ము.

హే సభ్యా హే మహారాజ రామలక్ష్మణభూమిపాః
సర్వ ఏవ భవన్తోఽద్య తావద్వ్యాపారమాహ్నికమ్. 29
కుర్వన్త్వయం హి దివసః ప్రాయః పరిణతాకృతిః
శేషం విచారయిష్యామో విచార్యం ప్రాతరాగతాః. 30

సభ్యులారా! మహారాజా! రామలక్ష్మణులారా! భూమిపతులారా! ఇనాటికి సూర్యుడు, మాధ్యాహ్నికృత్యము లొనర్పవలెందు! మిగిలినది రేపు విచారింతము.

శ్రీ వాల్మీకి రువాచ :—

ఇత్యుక్తా మునినా తేన సా సర్వైవ తదా సభా
ప్రోత్తస్థౌ పద్మవదనా సవికాసేవ పద్మినీ. 31

వాల్మీకి:- ముని ఇట్లుపల్కఁ సభాసదులందరు సహాస్యవికసిత పద్మవదనులై, లేచిరి.

రాజానః స్తుతరాజానః కృతరాఘవవన్దనాః
పరిష్టుతే వసిష్ఠే తే జగ్మురాత్మనివేశనమ్. 32

దశరథుని, రామచంద్రుని, వసిష్ఠుని స్తుతించుచు, జనులందరు స్వగృహములకేగిరి.

విశ్వామిత్రేణ సహితో వసిష్ఠో గన్తుమాశ్రమమ్
ఉత్తస్థావాసనాచ్ఛ్రీమాన్నమస్కృత నభశ్చరః. 33

వసిష్ఠుడు గూడ దేవగణమునకు వందనమొనర్చి విశ్వామిత్రసహాయుడై, ఆశ్రమమునకు గమనోద్యతుడయ్యెను.

దశరథప్రభృతయో రాజానో మునయస్తథా
యథానురూపం వక్తారమనుగమ్య మునిం చిరమ్. 34
ఆపృచ్ఛ్య కేచిద్గగనం యయుం కేచిద్వనాన్తరమ్
కేచిద్రాజగృహాం సన్తో భృఙ్గాః పద్మోత్థితా ఇవ. 35

దశరథప్రభృతులు మునినొకింత అనుసరించి, యథానురూపము పల్కి, కొందఱు గగనదేశమును, కొందఱు వనదేశమును, కొందఱు రాజగృహమును, పద్మోత్థిత భృంగములవలె, ప్రవేశించిరి.

వసిష్ఠపాదయోస్త్యక్త్వా పుష్పాఞ్జలిమనావిలమ్
దారైరనుగతో రాజా ప్రవివేశ గృహాన్తరమ్. 36

వాసిష్ఠ పాదపద్మముల నిర్మల పుష్పాంజలి నర్పించి, దశరథుడు పత్నులతోఁగూడి స్వగృహమును ప్రవేశించెను.

రామలక్ష్మణశత్రుఘ్నాః ప్రాప్తస్య స్వాశ్రమం గురోః
అభ్యర్చ్య చరణౌ భక్త్యా త్వాజగ్ముర్నృపమన్దిరమ్. 37

రామలక్ష్మణశత్రుఘ్నులు ఆశ్రమగతుడగు గురుని చరణముల నర్చించి, రాజమందిరమున కరుదెంచిరి.

సదనాని సమాసాద్య శ్రోతారః సర్వ ఏవ తే
సస్నురానర్చురభ్యేయు ర్దేవాన్విప్రాన్పితౄం స్తథా. 83

శ్రోతలందఱును గృహముల కఱిగి, దేవ బ్రాహ్మణ పితృదేవతా, అతిథి పూజలనొనర్చిరి.

యథాక్రమం స్వభృత్యాన్తైర్విప్రాద్యైశ్చ పరిచ్ఛదైః
సమం బుభుజిరే భోజ్యం వర్ణధర్మక్రమోదితమ్. 39

పిదప, వర్ణధర్మక్రమము ననుసరించి, భృత్యాదుల నాదరించి, తాముగూడ భుజించిరి.

అస్తం గతే దినకరే సమం దివసకర్మభిః
అభ్యాగతే రాత్రికరే సమం రజనికర్మభిః. 40

దినకర్మల వెంటనిడికొని సూర్యుడస్తమించెను; చంద్రుడు రాత్రికర్మల వెంటనిడికొని అరుదెంచెను.

స్థిత్వా తల్పేసు కౌశేయశయనేష్వాసనేషు చ
భూచరా మునిరాజానో రాజపుత్రా మహర్షయః. 41
సంసారోత్తరణోపాయం వసిష్ఠవదనేరితమ్
యథావదేకాగ్రధియశ్చిన్తయామాసురాదృతాః. 42

అప్పుడు, తల్ప, కౌశేయ, శయన, ఆసనములనుండియే, మునులు, రాజులు, రాజపుత్రులు, మహర్షులు, వసిష్ఠప్రోక్తమగు సంసార తరణోపాయమును ఏకాగ్రచిత్తమున, ఆదరముతో, చింతింప సాగిరి.

తతః ప్రహరమాత్రేణ నిద్రాముద్రితాననాః
ఉత్స్వప్నసున్దరీమాయుః పద్మా ఇవ దినార్థినః. 43

అనంతరము, శేషప్రహరమున వారు ఉత్స్వప్నసుందరమును, దినార్థమునునగు పద్మము వలె, నిద్రాభిభూతులైరి.

రామలక్ష్మణశత్రుఘ్నాః ప్రహరత్రయమేవ తత్
వాసిష్ఠముపదేశం తే చిన్తయామాసురక్షతమ్. 44

రామలక్ష్మణశత్రుఘ్నులు ప్రహరత్రయము ఎడతెగకుండ వసిష్ఠోపదేశమును చింతించిరి.

ప్రహరస్యార్ధమాత్రం తే తత ఆముద్రితేక్షణాః
ఉత్స్వప్నమాయయుర్నిద్రాం క్షణాద్విద్రావితశ్రమామ్. 45

వారర్ధప్రహరము మాత్రమే సుఖస్వప్నముతోగూడిన నిద్రనుబొందిరి; దాన వారి శ్రమ దూరమయ్యెను.

ఇతి శుభమనసాం వివేకభాజా
మధిగతసారతయోదితాశయానామ్
అభజత విరతిం తదా త్రియామా
మలిననిశాకర వక్త్రతాం జగామ. 46

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే దివసవ్యవహారవర్ణనం నామ
ప్రథమః సర్గః ॥ 1 ॥

---

ఇట్లు, వారి కాత్మజ్ఞానోదయమవ, అంతఃకరణము విమలమయ్యెను. మనస్సు విస్తార మయ్యెను. వివేకము లభించెను. ఏ రాత్రి వారికి బ్రహ్మజ్ఞానము లభించెనో, ఆ రాత్రిగూడ విరతి నందెను; దాని సుందరముఖచంద్రుడు మలిన వక్త్రమును దోపింపజేసెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
ప్రథమ సర్గము ॥ 1 ॥

---

## ద్వితీయః సర్గః.

---

[ఇహ రామాదిభిః ప్రాతర్వసిష్ఠస్య సభానయనః
ఉక్తార్థస్మరణాత్తత్త్వే విశ్రామశ్చోపవర్ణ్యతే.
రామాదులచే శ్రీవసిష్ఠమునీంద్రులు సభకుగొనిరాబడుట; పూర్వోక్త అర్థమును స్మరించుట ద్వారా తత్త్వమందు విశ్రాంతి–యను నీవిషయములీ సర్గయందు వర్ణింపబడినవి.]

శ్రీ వాల్మీకి రువాచ :—

తతః క్లిన్నేన్దువదనా పర్యాకులతమఃపదా
క్షీయమాణా బభౌ శ్యామా వివేక ఇవ వాసనా. 1

శ్రీ వాల్మీకిః— వివేకోదయమైన వాసనలు క్షీణమగునట్లు, రాత్రిగూడ అరుణోదయమగు చుండ క్షీణదశ నందసాగెను. ముఖచంద్రుడు క్షీణింప, అంగములు అవశమై శక్తిరహితము లయ్యెను.

పూర్వే ధ్వస్తతయాలోకం దృశ్యమానే పరేఽచలే
శయాలీకావతంసాభం తాపకో నికరో దధౌ. 2

కరములజాపి సూర్యుడు పూర్వగిరిని నిలచెను. సహస్రకిరణుడౌ మహోన్నత పర్వతమును హస్తముల ధారణమొనర్చి నట్లుండెను. అతని కిరణకాంతి అస్తాచలమున గూడ ఒకింత ప్రసరించెను.

అవశ్యాయకణాకర్షీ పరామృష్టేన్దుమణ్డలః
జ్యోత్స్నాకవలనాలోకో బభౌ ప్రాభాతికోఽనిలః. 3

సూర్యకిరణము లరుదెంచి, ప్రాభాతవాయువుల మీద బడెను; మృదుల వాయువు అల్పతేజమునకు గూడ భయపడెను. సూర్యు డుత్తాపమును బోగొట్టుకొనగోరి సుశీతలహిమకణము శరీరమున నలముకొనసాగెను. క్షుత్పిపాసల శాంతిని గోరి, క్షీణచంద్రుని వెన్నెలను పిండి త్రా సాగును.

రామలక్ష్మణశత్రుఘ్నా ఉత్థాయానుచరైః సహ
యయుర్వన్దితసంధ్యాస్తే పుణ్యం వాసిష్ఠమాశ్రమమ్.

రామలక్ష్మణశత్రుఘ్నులును, వారి అనుచరులును శయ్యలను వీడి, స్నానమొనర్చి, సంధ్యా వందనాదికృత్యముల నాచరించి, వసిష్ఠాశ్రమమున కఱిగిరి.

తత్ర వన్దితసంధ్యస్య నిర్గతస్యాపి సద్మతః
మునేర్వవన్దిరే పాదౌ పదోర్దత్త్వార్ఘ్యసంతతిమ్.

అట, సంధ్యావందనాదికము నాచరించి, బయటకరుదెంచుచున్న మునిపాదముల అర్ఘ్య దానమొనర్చి, వందనముల నర్పించిరి.

క్షణాత్తత్సదనం మౌనం మునిబ్రాహ్మణరాజభిః
హస్త్యశ్వరథయానైశ్చ శనైర్నిరన్ధ్రితాం యయౌ.

ఒక్కనిముసములో, నిశ్చలముగనున్న ఋష్యాశ్రమము, రామచంద్రుని వెంట నరుదెంచి పరివారముతో క్రిక్కిరిసి పోయెను.

అథాసౌ మునిశార్దూలస్తయైవ సహ సేనయా
గృహం దాశరథం కాలే రామాద్యనుగతో యయౌ.

అనంతర మా మునిపుంగవుడు, రామాదులు వెంటనంటిరా, యథాసమయమున దశరథు గృహమున కేగెను.

తత్త్రైనం పూర్వసంబన్ధః కృతసంధ్యో మహీపతిః
దూరమార్గం వినిర్గమ్య పూజయామాస సాదరమ్.

సంధ్యాదికృత్యముల నిర్వర్తించి, దశరథుడు మునికభిముఖముగ నేగుదెంచి, అభ్యాగన నర్చి పూజించెను.

పుష్పముక్తామణివ్రాతైర్యా యోఽత్యధికభూషితామ్
సభాం ప్రవిశ్య తే సర్వే వివిశుర్విష్టరాలిషు.

పుష్పములతోడను, మణులతోడను, ముత్యములతోడను మిక్కుటముగ నలంకరింపబడిన సభాభవనమును బ్రవేశించి, వారు ఆసనముల నుపవిష్టులైరి.

అథ తస్మిన్నవసరే హ్యస్తనాః సర్వపవతే
శ్రోతారః సముపాజగ్ము ర్నభశ్చరమహీచరాః. 1

పూర్వదిన మరుదెంచిన నభశ్చర మహీచరజాతీయులగు శ్రోతలందఱును మరల నరుదెంచి

వివేశ సా సభా సౌమ్యా కృతాన్యోన్యాభివన్దనా
బభౌ రాజసమాభోగా శాన్తవాతేవ పద్మినీ. 1

సుందరమగు ఆ సభను ప్రవేశించి, పరస్పరాభివందనముల నొనర్చుకొని, నిర్వాతప్రశాంత మగు పద్మమువలె, దశరథు ననుసరించి కూర్చొనిరి.

యథాప్రదేశమేవాశు నివిష్టేషు యథాసుఖమ్
తేషు తద్దేశయోగేషు విప్రర్షిమునిరాజసు. 12
మృదుని స్వాగతరవే శనైః శమముపాగతే
సభాకోణోపవిష్టేషు శాన్తశబ్దేషు బన్దిషు. 13
తరసైవోదితేష్వాశు శ్రోతుమభ్యాగతేష్వివ
గవాక్షాదివ జాలేషు ప్రవిష్టేష్వర్కరశ్మిషు. 14
సత్వర ప్రవిశచ్ఛ్రోత్రృహస్తస్పర్శభయోద్భవే
ముక్తాజాలరుణత్కారే నిద్రాయామివ శామ్యతి. 15
కుమారః శంకరస్యేవ కచో దేవగురోరివ
ప్రహ్లాద ఇవ శుక్రస్య సుపర్ణ ఇవ శార్ఙ్గిణః. 16
వసిష్ఠస్యాననే రామః శనైర్దృష్టిం న్యవేశయత్
భ్రమన్తీమమ్బరోపాన్తే ఫుల్లపద్మ ఇవాలినీమ్. 17

విప్రులు, ఋషులు, మునులు, రాజులు వారివారి అర్హతల ననుసరించి తమతమ ఆసనముల గూర్చొనిరి. మృదు స్వాగతరవములు క్రమముగ కట్టువడిపోయెను. సభాకోణములనున్న వందిమాగధుల శబ్దములుగూడ ఆగిపోయెను. సూర్యకిరణములు మున్యుపదేశమును విన ద్వారబంధములగు గవాక్షములగుండ లోనప్రవేశింపదొడగెను. సత్వరప్రవేశకాముల శరీరాలంకార శబ్దములుపశమించెను. కుమారుడు శంకరుని, కచుడు బృహస్పతిని, ప్రహ్లాదుడు శుక్రుని, గరుడుడు విష్ణుని గాంచినట్లు, భ్రమరము ఆకాశమున తిరుగాడి పరిఫుల్లపద్మమున స్థిరముగగూర్చుండునట్లు, శ్రీరాముడు వసిష్ఠునిపై చూపుల నిగిడ్చెను.

మునిస్త్వనుజ్ఞితేనాథ తేనైవ రఘునన్దనమ్
క్రమేణోవాచ వాక్యజ్ఞో వాక్యం వాక్యార్థకోవిదమ్. 18

వాక్యజ్ఞుడగు మహర్షి తద్గ్రహణపటువగు శ్రీరామచంద్రునితో, వెనుకటి విషయమై ఇట్లు పల్కదొడగెను.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

కచ్చిత్స్మరసి యత్ప్రోక్తం వ్యాఖ్యా మయా రఘునన్దన
వాక్యమత్యన్తగుర్వర్థం పరమార్థావబోధనమ్. 19

శ్రీవసిష్ఠుడు:- రఘునందనా ! పరమార్థ బోధకములును, గంభీరములును, పూర్వోక్తములును నగు నా పల్కులు జ్ఞప్తియందున్నవా ?

ఇదానీమవబోధార్థ మన్యచ్చ రిపుమర్దన
ఉచ్యమానం మయేదం చ శృణు శాశ్వతసిద్ధయే. 20

రిపుమర్దనా ! ఇప్పుడు శాశ్వతసిద్ధిని లభింపజేయు ఈక్రొంగొత్త పల్కుల వినుము.

వైరాగ్యాభ్యాస వశత స్తథా తత్త్వావబోధనాత్
సంసార స్తీర్యతే తేన తేష్వేవాభ్యాసమాహర. 21

అభ్యాస వైరాగ్యములవలనను, తత్త్వచింతనవలనను సంసారము తరింపబడుచున్నది. అందు వలన వీటిని బలపరచుకొనుము.

సమ్యక్తత్త్వావబోధేన దుర్బోధే క్షయమాగతే
గలితే వాసనావేశే విశోకం ప్రాప్యతే పదమ్. 22

తత్త్వమును చక్కఁగ గ్రహించిన, దుర్బోధ్యమగు వాసనావేశము క్షయమంది, తొలగిపోవును. అప్పుడు, విశోకమగు పదము లభింపగలదు.

దిక్కాలాద్య నవచ్ఛిన్న మదృష్టోభయకోటికమ్
ఏకం బ్రహ్మైవ హి జగత్థ్సితం ద్విత్వముపాగతమ్. 23

దేశకాల నిమిత్త పరిచ్ఛేదశూన్యమగు బ్రహ్మమే ఈజగద్రూపమున వెలయుచు, ద్వైత భ్రాంతిని గలుగజేయుచున్నది.

సర్వభావానవచ్ఛిన్నం యత్ర బ్రహ్మైవ విద్యతే
శాన్తం సమసమాభాసం తత్రాన్యత్వం కథం భవేత్. 24

నిర్విశేషమును, సమమును, శాంతమును నగు బ్రహ్మమొక్కటియే వెలయుచున్నది; అన్యత్వమునకు తావెక్కడ ?

ఇతి మత్వాహమిత్యన్తర్ముక్త్వా ముక్తవపుర్మహాన్
ఏకరూపః ప్రశాన్తాత్మా సాక్షాత్స్వాత్మసుఖో భవ. 25

దీనిని గ్రహించి, అహంకారమును సంపూర్ణముగ పరిత్యజించి, అశరీరాఖ్యమును, ఏకరస స్వరూపమును, ప్రశాంతమును, అపరోక్షమునునగు ఆత్మసుఖమును అనుభవింపుము.

నాస్తి చిత్తం న చావిద్యా న మనో నచ జీవకః
ఏతాః స్వకలనా రామ కృతా బ్రహ్మణ ఏవ తాః. 26

వాస్తవమునకు చిత్తముగాని, అవిద్యగాని, మనస్సుగాని, జీవుడుగాని లేవు; ఇవన్నియును ఆ బ్రహ్మముయొక్క కల్పనలే.

యాః సంపదో యాశ్చ దృశో యాశ్చితో యాస్తదేషణాః
బ్రహ్మైవ తదనాద్యన్త మబ్ధివత్ప్రవిజృమ్భతే. 27

భోగములు, తద్వృత్తులు, తత్ప్రకాశము, తదాసక్తి – ఇవన్నియును బ్రహ్మమువలె అనాద్యనంతములు; సముద్రమువలె విజృంభించుచున్నవి.

పాతాలే భూతలే స్వర్గే తృణే ప్రాణ్యమ్బరేఽపి చ
దృశ్యతే తత్పరం బ్రహ్మ చిద్రూపం నాన్యదస్తి హి. 28

స్వర్గమర్త్యపాతాళాది దేశములయందును, ఆబ్రహ్మస్తంబపర్యంతమును, భూతభవిష్యద్వర్తమానకాలములయందును చిద్రూపమగు ఆ పరబ్రహ్మమొక్కటియే వెలయుచున్నది. తద్భిన్నమేమియును లేదు.

ఉపేక్ష్య హేయోపాదేయబన్ధవో విభవా వపుః
బ్రహ్మైవ విగతాద్యన్త మబ్ధివత్ప్రవిజృమ్భతే. 29

హేయ, ఉపాదేయములనక, బంధువులనక, విభవములనక, శరీరమనక — సర్వత్ర, ఆద్యంతరహితమగు సముద్రమువలె ఆ బ్రహ్మవస్తువు విజృంభించుచున్నది.

యావదజ్ఞానకలనా యావదబ్రహ్మభావనా
యావదాస్థా జగజ్జాలే తావచ్చిత్తాదికల్పనా. 30

అజ్ఞాన-కల్పన తొలగనంతవఱకు, ఆ బ్రహ్మభావన పోనంతదనుక, జగత్తున నమ్మకము నీగనంతవఱకు — చిత్తసర్పము ఈ తీరుగనే కల్పనల నొనర్చుచుండును.

దేహే యావదహంభావో దృశ్యేఽస్మిన్యావదాత్మతా
యావన్మమేదమిత్యాస్థా తావచ్చిత్తాదివిభ్రమః. 31

దేహాత్మబుద్ధియును, దృశ్యసత్యత్వభ్రాంతియును, అహంమమభావమును, తొలగనంతవఱకు ఈ చిత్తకల్పన ఇట్లేయుండును.

యావన్నోదిత ముచ్చైస్త్వం సజ్జనాసఙ్గసఙ్గతః
యావన్మౌర్ఖ్యం న సంక్షీణం తావచ్చిత్తాదినిమ్నతా. 32

సజ్జన సాంగత్యమొనర్చి పూర్ణత్వము నందనంతవఱకు, అజ్ఞానము క్షీణింప నంతవఱకు చిత్తమిట్లు నీచత్వమును బొందుచుండును.

యావచ్ఛిథిలతాం యాతం నేదం భువనభావనమ్
సమ్యగ్దర్శనశక్త్యాస్తస్తావచ్చిత్తాదయః స్ఫుటాః. 33

సమ్యగ్దర్శనమున ఈ విశ్వభ్రాంతి శిథిలీకృత మవనంతవఱకు, చిత్తమిట్లు స్ఫురించుచునే యుండును.

యావదజ్ఞత్వ మస్తత్వం వైవశ్యం విషయాశయా
మౌర్ఖ్యాన్మోహసముచ్ఛ్రాయస్తావచ్చిత్తాదికల్పనా. 34

అజ్ఞానమను గ్రుడ్డితనమునను, మౌర్ఖ్యమునను, మోహమువలనను గలుగు విషయ-ఆశల వైవశ్యము (కైపు) తగ్గనంతవఱకు, చిత్తము విజృంభించుచునేయుండును.

యావదాశావిషామోదః పరిస్ఫురతి హృద్వనే
ప్రవిచారచకోరోఽన్తర్న తావత్ప్రవిశత్యలమ్. 35

ఆశల విషగంధము హృద్వనమున విస్తరించుచున్నచో, ఆత్మవిచార — చకోరమందు ప్రవేశింపదు.

భోగేష్వనాస్థమనసః శీతలామలనిర్వృతేః
ఛిన్నాశాపాశజాలస్య క్షీయతే చిత్తవిభ్రమః. 36

భోగముల వాంఛింపక, ఆశాపాశముల భిన్నమొనర్చిన సమచిత్తుని భ్రమలు క్షీణించును.

తృష్ణామోహాపరిత్యాగాన్నిశీత్యతలసంవిదః
పుంసః ప్రశాన్తచిత్తస్య ప్రబుద్ధాత్యక్తచిత్తభూః. 37

తృష్ణామోహాపరిత్యాగమున నిత్యశీతలమనస్కుఁడైన పురుషునకే ప్రబోధము ;

అసంస్మృతమివానాస్థమవస్తు పరిపశ్యతః.
దూరస్థమివ దేహం స్వమసన్తం చిత్తభూః కుతః.

ఎదుటనున్న వస్తువులను లేనివానివలెను, దగ్గరనేయున్న శరీరమును దూరస్థమ
వారికి, చిత్తమెట్లు ఉత్పన్నమవఁగలదు ?

భావితానన్తచిత్తత్త్వరూపరూపాన్తరాత్మనః
స్వాన్తావలీనజగతః శాన్తో జీవాదివిభ్రమః.

శ్రవణమననిదిధ్యాసనా భావనల ఆత్మస్వరూపమును సాక్షాత్కరింపజేసుకొ
అంతరముననే శాంతించుచున్నది; జీవాది భ్రమ తొలఁగుచున్నది.

అసమ్యగ్దర్శనే శాన్తే మిథ్యాభ్రమకరాత్మని
ఉదితే పరమాదిత్యే పరమార్థైకదర్శనే.

అపునర్దర్శనాయైవ దగ్ధసంశుష్కపర్ణవత్
చిత్తం విగలితం విద్ధి వహ్నౌ ఘృతలవం యథా.

మిథ్యాభ్రమలను గల్పించు అజ్ఞానము శాంతించి, పరమార్థదర్శనమను సూ
ఎండుటాకు మండి మరల నగపడనట్లు, నిప్పుయందు నేతివలె, చిత్తము కఱఁగిపోవుచున
నగుపడదు.

జీవన్ముక్తా మహాత్మానో యే పరావరదర్శినః
తేషాం యా చిత్తపదవీ సా సత్త్వమితి కథ్యతే.

పరావరదర్శనులును, జీవన్ముక్తులును, మహాత్ములును నగువారికి శుద్ధసత్త్వమ
ముండును. అది, నీరెండిపోవ ఇసుకయందుండు నీటిజాడ వంటిది.

జీవన్ముక్తశరీరేషు వాసనా వ్యవహారిణీ
న చిత్తనామ్నీ భవతి సా హి సత్త్వపదం గతా.

సత్త్వనామమును బొంది జీవన్ముక్తుల శరీరమందుండు వాసన వ్యవహారమాత్ర
చిత్తమన జెల్లదు.

నిశ్చేతసో హి తత్త్వజ్ఞా నిత్యం సమపదే స్థితాః
లీలయా ప్రభ్రమన్తీహ సత్త్వసంస్థితిహేలయా.

సమపదవి నలంకరించిన తత్త్వజ్ఞులు అమనస్కులు ; చిత్తములేకున్నను ఉ
క్రీడించుచున్నారు.

శాన్తా వ్యవహరన్తోఽపి సత్త్వస్థాః సంయతేన్ద్రియాః
నిత్యం పశ్యన్తి తజ్జ్యోతిర్న ద్వైతైక్యేన వాసనా.

శుద్ధులును, సంయతేంద్రియులును, శాంతులును నగు మహాత్ములు లోకవ్య
సల్పుచున్నను, అద్వైత-జ్యోతిని నిత్యము దర్శించుచున్నారు. అందువలన, వారికి ద్వైత
వాసనలు కలుఁగజాలవు.

అన్తర్ముఖతయా సర్వం చిద్వహ్నౌ త్రిజగత్తృణమ్
జుహ్వతో ఽన్తర్నివర్తన్తే మునేశ్చిత్తాది విభ్రమాః 46

వీరు అంతర్ముఖులై చిదగ్నియందు జగత్తృణములను వ్రేల్చుచున్నారు; అందువలన, వీరి చిత్తభ్రమలు తొలగి పోవుచున్నవి.

వివేకవిశదం చేతః సత్త్వమిత్యభిధీయతే
భూయః ఫలతి నో మోహం దగ్ధబీజమివాఙ్కురమ్. 47

వివేకోదయమైన చిత్తము సత్త్వమనబడుచున్నది. దగ్ధబీజమున అంకురము జన్మింపజాలనట్లు, అందు మరల మోహముద్భవింపజాలదు.

యావత్సత్త్వం విమూఢాన్తః పునర్జననధర్మిణీ
చిత్తశబ్దాభిధానోక్తా విపర్యస్యతి బోధతః 48

చిత్తశబ్దమున వ్యవహృతమగునది మూఢులకు మరల జన్మమును గలుగజేయునదై యున్నది; జ్ఞానోన్మేషమున నియ్యది విపరీతధర్మిణియై జన్మరాహిత్యము నందించుచున్నది.

ప్రాప్తప్రాప్యో భవాన్నామ సత్త్వభావముపాగతమ్
చిత్తం జ్ఞానాగ్నినా దగ్ధం న భూయః పరిరోహతి. 49

జానాగ్నిదగ్ధమై, సత్త్వభావమునంది, కృతకృత్యత నందిన చిత్తము మరల నుద్భవింపదు.

సంరోహతీషణావిద్ధం యథా పరశునాగ్నినా
నతు జ్ఞానాగ్నినిర్దగ్ధం ప్రబోధవిశదం మనః. 50

ఏషణాత్రయవిద్ధమగు చిత్తము, బీజక్షయమవని పచ్చికవలె, మరల లేచుచున్నది; కాని, జ్ఞానాగ్నిదగ్ధమై, ప్రబోధమునందిన చిత్తము మరల నుద్భవింపదు.

బ్రహ్మబృంహైవ హి జగజ్జగచ్చ బ్రహ్మబృంహణమ్
విద్యతే నానయోర్భేదశ్చిద్ఘనబ్రహ్మణోరివ. 51

బ్రహ్మముయొక్క విస్ఫృతియే జగత్తు; జగత్తు బ్రహ్మముకంటె వేఱుకాదు. ఈ రెంటికిని, శుద్ధచిత్త బ్రహ్మములవలెనే అభేదము.

చిదన్తరస్తి త్రిజగన్మరిచే తీక్ష్ణతా యథా
నాతశ్చిజ్జగతీ భిన్నే తస్మాత్సదసతీ ముధా. 52

మిరియమున కారమున్నట్లు, త్రిజగత్తుల చిద్వస్తువున్నది; అవి బ్రహ్మముకంటె వేరుకావు. వాటి ఉత్పత్తిప్రళయములు కాల్పనికములు.

శబ్దశబ్దార్థసంకేతా వాసనేహ న సంవిదా
చిద్వ్యోమత్వాదుభే భాతస్త్వజాతః సదసన్మతీ. 53

సదసద్వ్యవహారము—ఉన్నది, లేదు, అను లౌకికవ్యవహారము మన ఖండజ్ఞానముయొక్క కల్పన.

అచిన్మయత్వాన్నాసి త్వం స్వాత్మా కిమివ రోదిషి
అచిన్మయత్వే జగతామభావే కల్పనం కుతః. 54

ఈ భ్రాంతికల్పన వలననే చైతన్యమున జడభ్రాంతి కలిగి దుఃఖించుచున్నాడవు. జడ జగత్తు వాస్తవము కానందువలన, కల్పనకు తావేలేదు.

చిన్మయం చేత్సదా సర్వం తచ్చిత్త్వం ప్రవిచారయ
శుద్ధం సత్త్వమనాద్యన్తం తత్రాజ్ఞ కల్పనా కుతః. 55

వత్సా! దీనినంతటిని చిన్మయముగ భావింపగలిగిన చిత్తము శుద్ధమైనదని గ్రహింపుము ఇక నట కల్పనలకు చోటులేదు.

చిదాత్మాసి నిరంశోఽసి పారావారవివర్జితః
రూపం స్మర నిజం స్ఫారం మాఽస్మృత్యా సంమితో భవ. 56

నీవు చిదాత్ముడవు; నీవు నిరంశుడవు; ఆద్యంత రహితుడవు. నీ స్వరూపమును స్మరించుకొనుము. విస్మరణమున అల్పత్వము నందకుము.

తాం స్వసత్తాం గతః సర్వమసర్వం భావయోదయా
తాదృగ్రూపోఽసి శాన్తోఽసి చిదసి బ్రహ్మరూప్యసి. 57

నీవు నీ పరిపూర్ణతాస్వరూపమును స్మరించుకొని శాంతుడవై అంతట సద్భావినే పరికింపుము.

విచ్ఛిలోదరమేవాసి నాసి నానాస్యథాప్యసి
యోసి సోసి న సోసీవ సదస్యసదసి స్వభాః. 58

నీవు స్ఫటికశిలవలె శుభ్రుడవు. నీవే ఈ సంసృతిరూపమున బరిలక్షింపబడుచున్నావు.

యః పదార్థవిశేషోఽన్తర్న త్వం నహ్యేవ సోఽస్తి తే
తదస్యతదసి స్వస్థశ్చిద్ఘనాత్మన్నమోస్తు తే. 59

ఈ పదార్థములు నీవుకావు. అవి నీయందున్నవి. అవ్యక్తస్వరూపా! చిద్ఘనాత్మా! నీకు నమస్కారము.

ఆద్యన్తవర్జిత విశాలశిలాన్తరాల
సంపీడ చిద్ఘనవపుర్గగనామలస్త్వమ్
స్వస్థో భవాజఠరపల్లవ కోశలేఖా
లీలాస్థితాఖిల జగజ్జయ తే నమస్తే. 60

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే విశ్రాన్తిసుదృఢీకరణం నామ
ద్వితీయః సర్గః ॥ 2 ॥

ఆద్యంతవివర్జితా! చిద్ఘనవపూ! సర్వవ్యాపీ! శుద్ధస్వరూపా! స్వాంతరస్థిత జగత్పల్లవా! జగదను ప్రవిష్టా! జయ! నమస్కారము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
విశ్రాంతి - సుదృఢీకరణమను
ద్వితీయ సర్గము ॥ 2 ॥

# తృతీయః సర్గః.

[బ్రహ్మజీవ మనోదేహ జగతామైక్యదర్శనాత్
సర్వద్వైతభ్రమే శాన్తే పుర్ణైకస్థితిరుచ్యతే.

(బ్రహ్మ, జీవ, మనో, దేహ, జగత్తుల యైక్యప్రదర్శనముచే సర్వద్వైతభ్రాన్త్యోపశమన మీ సర్గయందు వర్ణింపబడినది.]

(శ్రీ) వసిష్ఠ ఉవాచ :—

భావిభూరితరఙ్గాణాం పయోవృన్ద మివామ్బుధౌ
యో చిద్వహత్యనన్తాని జగన్త్యనఘ సో భవాన్. 1

శ్రీ వసిష్ఠుడు:–సముద్రమున అనంతములగు తరంగములు లేచుచున్నట్లు నీయందు ఈజగత్తులు కలుగుచున్నవి.

భవభావనయాముక్తో భావాభావవివర్జితః
చిదాత్మన్సంస్థితాః క్వేవ వద తే వాసనాదయః. 2

అద్వైతభావనవలన భావాభావవివర్జితుడవై ముక్తస్థితిని వెలసిన, వాసనలెట కలుగునో, ఎవరు చెప్పగలరు?

జీవోఽయం వాసనాదీదమితి చిత్కచతి స్వతః
ఇతరో త్వర్థయోరత్ర కః ప్రసఙ్గోఽఙ్గ కథ్యతామ్. 3

వత్సా! జీవుడు, జగత్తు – ఇవియే చిత్తకల్పనలన్న, ఇక మిగిలినవాటిమాట వేఱుగ చెప్ప వలయునా?

మహాతరఙ్గమిర్భ్వార భాసురాత్మచిదర్ణవః
రామాభిధోర్మి స్తిమితః సమ సౌమ్యోఽసి వ్యోమవత్. 4

ప్రకాశాత్మా! చిత్సముద్రా! శమాతరంగ గంభీరా! ఆత్మారామా! వాసనలు క్షీణమందిన నీవు ఆకాశమువలె సౌమ్యుడవవగలవు.

యథా న భిన్నమనలాద్దార్ణ్యం సౌగన్ధ్యమమ్బుజాత్
కార్ష్ణ్యం కజ్జలతః శౌక్ల్యం హిమాన్మాధుర్యమిక్షుతః. 5

ఆలోకశ్చ ప్రకాశాఙ్గా దనుభూతి స్తథా చితేః
జలాద్వీచిర్యథాఽభిన్నా చిత్స్వభావా త్తథా జగత్. 6

అగ్నినుండి తాపమును, పుష్పమునుండి సుగంధమును, కాటుకనుండి నలుపును, మంచునుండి తెలుపును, చెఱకునుండి తీపియు, తేజమునుండి వెలుతురును, జలమునుండి తరంగములును వేఱుగానట్లు, చిత్తమునుండి జగత్తుయు వేఱుకాదు.

చితో న భిన్నోఽనుభవో భిన్నో నానుభవాదహమ్
న మత్తో భిద్యతే జీవో న జీవాద్భిద్యతే మనః. 7

మనసో నేన్ద్రియం భిన్నం పృథగ్దేహశ్చ నేన్ద్రియాత్
న శరీరాజ్జగద్భిన్నం జగతో నాన్యదస్తి హి. 8

చిత్తమునుండి అనుభవము వేఱుకాదు; 'అహం' ప్రత్యయము అనుభవాత్మకము. 'మత్' ప్రత్యయముకంటె జీవుడు వేఱుకాదు. మనస్సు జీవునికంటె అన్యముకాదు. మనస్సునుండి ఇంద్రియములు వేఱుకావు; శరీరము ఇంద్రియభిన్నముకాదు. జగత్తు శరీరముకంటె నితరముకాదు; జగత్తు శరీరముకాక అన్యముకాదు.

ఏవం ప్రవర్తితమిదం మహచ్చక్రమిదం చిరమ్
నచ ప్రవర్తితం కించిన్న చ శీఘ్రం చ నో చిరమ్. 9

ఈ మహచ్చక్రము - ఈ పరంపర - ఇట్లు ప్రవర్తితమగుచున్నది. జ్ఞానదృష్టికియ్యది కల్పితము. ఇది తొందరగగాని, ఆలస్యముగగాని, అసలేగాని తిరుగుటలేదు.

స్వవేదన మనన్తం చ సర్వమేవమఖణ్డితమ్
విద్యతే వ్యోమని వ్యోమ న కస్మింశ్చిన్న కించన. 10

అఖండమగు ఆత్మజ్ఞానము లభించిన, ఆకాశ స్వరూపమగు పరబ్రహ్మమొక్కటియే తన యందు తాను వెలయుట కనబడగలదు. ఇతర మగపడదు.

శూన్యం శూన్యే సమూచ్ఛూనం బ్రహ్మ బ్రహ్మణి బృంహితమ్
సత్యం విజృమ్భతే సత్యే పూర్ణే పూర్ణమివ స్థితమ్. 11

అప్పుడు, శూన్యము శూన్యమునను, బ్రహ్మ బ్రహ్మమునను, సత్యము సత్యమునను, పూర్ణము పూర్ణమునను దోచును.

రూపాలోకమనస్కారానుర్వన్నపి న కించన
జ్ఞః కరోత్యనుపాదేయాన్న జ్ఞస్యైవ హి కర్తృతా. 12

జ్ఞాని లోకవ్యవహారముల నన్నిటిని ఆచరించుచున్నను, ఉపాదేయబుద్ధి అనగా ఆసక్తిలేదు. అందువలన నతనికి కర్తృత్వము లేదు, భోక్తృత్వముగూడ లేదు, అందుచే నతడొనర్చియు ఒనర్చుచుండుటలేదు.

యదుపాదేయ బుద్ధ్యా చ తద్దుఃఖాయ సుఖాయ తే
భావాభావేన నాదేయమకర్తృ సుఖదుఃఖయోః. 13

ఉపాదేయబుద్ధితో నొనర్చినదే, సుఖదుఃఖములకు గారణమగుచున్నది. అదిలేకున్న, కర్తృత్వములేదు. సుఖదుఃఖములులేవు.

యథా నానాప్యనానైవ ఖంఖే ఖానీతి వాగ్గణః
సార్థకోఽప్యతిశూన్యాత్మా తథాత్మజగతోః క్రమః. 14

అనంతాకాశమే వివిధవాక్యవ్యవహారమునకు లోనగుచున్నట్లు, బ్రహ్మమే జగత్పదవాచ్యమగుచున్నది.

అన్తర్వ్యోమామలో బాహ్యే సమ్యగాచారచఞ్చురః
హర్షామర్షవికారేషు కాష్ఠలోష్టసమస్థితిః. 15

య ఏవాతితరాం శత్రుః సత్వరం మారణోద్యతః
తమేవాకృత్రిమం మిత్రం యః పశ్యతి స పశ్యతి. 16

ఎవ్వని చిత్తము ఆకాశమువలె శుద్ధమైనదో, ఎవడు సదాచారపరాయణుడో, హర్షామర్షముల కొమ్మలోష్టములవలె అవిచలితుడో, తన్ను జంపవచ్చిన శత్రునిగూడ అకృత్రిమస్నేహముతో నాదరించునో, అతడే ఈ సత్యదర్శనమున కర్హుడు.

సమూలకాషం కషతి నదీతట ఇవ ద్రుమమ్
యః సౌహృదం మత్సరం చ స హర్షామర్షదోషహా. 17

తటద్రుమమును నదివలె, సౌహృదమును మాత్సర్యమును సమూలమున్మూలింపగలవాడే హర్షామర్షాతీతుడగును.

రాగద్వేషవిచారాణాం స్వరూపం చేన్న భావ్యతే
తతః సన్తో౽ప్యసద్రూపాః సేవితా అప్యసేవితాః. 18

రాగద్వేషములను, వాటి వికారములను విచారించి ఉన్మూలింపనివారు, 'సాధువు' లైనను 'అసాధువులు; సేవితులైనను అసేవితులే.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాఁల్లోకాన్న హన్తి న నిబధ్యతే. 19

ఎవ్వనికి కర్తృత్వాభిమానములేదో, ఎవ్వని బుద్ధి నిర్లిప్తమో, అతడు ఈలోకమును జంపియు జంపుచుండుటలేదు.

యన్నాస్తి తస్య సద్భావప్రతిపత్తిరుతాహృతా
మాయేతి సా పరిజ్ఞానాదేవ నశ్యత్యసంశయమ్. 20

లేనిదానికి సద్భావము కల్పింపబడుటయే మాయ; ఈ అహంకారము పరిజ్ఞానమున నశింపగలదు.

నిఃస్నేహదీపవచ్ఛాన్తో యస్యాన్తర్వాసనాభరః
తేన చిత్రకృతేనేవ జితం జ్ఞేనావికారిణా. 21

అవికారియును, జ్ఞానియునగు ఏ పురుషుని హృదయమున వాసనలు నిఃస్నేహదీపకళికవలె నగునో, అతడే నిత్యసిద్ధమగు ఆత్మవస్తువును, చిత్రపటమునందలి రాజు చిత్రమునందలి శత్రువును నశింపజేసి జయమును బొందునట్లు, పొందుచున్నాడు.

యస్యానుపాదేయమిదం సమస్తం
పదార్థజాతం సదసద్దశాసు
న దుఃఖదాహాయ సుఖాయ నైవ
విముక్త ఏవేహ సజీవ ఏవ. 22

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే బ్రహ్మైక్యప్రతిపాదనం నామ తృతీయః సర్గః ॥ 3 ॥

ఎవ్వనికి జగత్తనునన్న సదసద్పదార్థములన్నియును, సుఖదుఃఖముల కొఱకుగాక, అనుపాదేయములగుచున్నవో - అవిర్భావతిరోభావముల, వైభవదారిద్ర్యముల, ఆరోప అపవాద దశల అనుపాదేయములగుచున్నవో, వియోగ సంయోగములు సుఖదుఃఖముల నొసగజాలకుండునో -అతడు జీవన్ముక్తుడు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
బ్రహ్మైక్యప్రతిపాదనమను
తృతీయ సర్గము ॥ 3 ॥

---

## చతుర్థః సర్గః

---

[నిరస్యాన్యాః పరాగ్దృష్టీర్వసిష్ఠేనేహ రాఘవః
ప్రత్యగ్దృష్టౌ స్థిరీకృత్య పృష్టః సంశయ శాన్తయే.

ఇందు శ్రీవసిష్ఠులు అన్యబాహ్యాదృష్టుల నిరసించి అన్తర్ముఖదృష్టియందు శ్రీరాముని స్థిరమొనర్చి సంశయరాహిత్యమునకై ప్రశ్నించుట వర్ణింపబడినది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

మనో బుద్ధిరహంకార ఇన్ద్రియాది తథానఘ
అచేత్య చిన్మయం సర్వం క్వ తే జీవాదయః స్థితాః. 1

వసిష్ఠుడు:- అనఘా! మనోబుద్ధి అహంకారములు, ఇంద్రియసమూహము, జీవులు - ఇవి ఆ చిన్మయసత్తనతిక్రమించి ఎటునుండగలవు?

ఏకేనైవాత్మనా దత్తా నానాత్తేయం మహాత్మనా
యథైకేనైవ చన్ద్రేణ తిమిరాప్తాత్రదర్పణైః. 2

బృహత్స్వరూపమగు ఆ ఆత్మయే ఈ నానాత్వమును దోపింపజేయుచున్నది. నేత్ర రోగము దర్పణప్రతిఫలిత - విషయములనుగాని, చంద్రునిగాని నానావిధముల దోపింపజేయుచుండునుగదా?

భోగతృష్ణావిషావేశో యదైవోపశమం గతః
తదైవమస్తమజ్ఞానమాన్ధ్యం ధ్వాన్తక్షయాదివ. 3

అంధకారము తొలగిన, తత్కల్పితమగు అంధత్వము తొలగునట్లు, విషమువలె మూర్ఛను గల్పించు భోగవాసనలు ఉపశమించిన, అజ్ఞానముగూడ వినష్టమైపోవును.

అధ్యాత్మశాస్త్రమన్త్రేణ తృష్ణావిషవిషూచికా
క్షీయతే భావితేనాన్తః శరదా మిహికా యథా. 4

శరత్తున హిమము తొలగిపోవునట్లు, అంతరమున ఆధ్యాత్మశాస్త్ర మంత్రమును భావించిన తృష్ణా-విషవిషూచిక క్షీణింపగలదు.

మౌర్ఖ్యే క్షీణే క్షతం విద్ధి చిత్తం రామ సబాన్ధవమ్
విలీనామ్బుధరే వ్యోమ్ని జాడ్యం శామ్యత్యవిఘ్నతః.. 5

రామా! ఆకాశమునందలి మేఘములు తొలగిన, నిర్విఘ్నముగ చలి తొలగునట్లు, అజ్ఞానము తొలగిన, చిత్తము సబాంధవముగ అనగా, వాసనలతోగూడ క్షీణించును.

అచిత్తత్వం గతే చిత్తే క్షీయతే వాసనాభ్రమః
హారముక్తా సమావేశశ్ఛిన్నే తన్తావివానఘ. 6

అనఘా! దారము తునిగిన, దాన గ్రుచ్చబడిన ముత్యములు తునిగిపోవునట్లు, చిత్తము అచిత్తత్వము (అమనస్కత్వము) ను బొందిన, దానినంటియున్న వాసనలుగూడ చెదరిపోవును.

రఘునాథ విఘాతాయ శాస్త్రార్థం భావయన్తి యే
కృమికీటత్వయోగ్యాయ చేతసా సంమిలన్తి తే. 7

రఘునాథ! శాస్త్రముయొక్క ఈ ప్రకృతమర్మమును గ్రహింపక, అన్యవిధమున గ్రహించు శాస్త్రహంతలు క్రిమికీటకములను బోలు నీచమనస్సును బొందుచున్నారు.

నవతామరసాకార కాన్తలోచనలోలతా
శాన్తే మౌర్ఖ్యేఽక్షతా వాతే చలతా సరసో యథా.. 8

గాలితగ్గిన పద్మాకరము నిశ్చలమగునట్లు, అజ్ఞానము క్షీణించిన, పద్మపత్రసుందరములగు నేత్రములు గూడ (అనగా స్త్రీలుగూడ అనుట) చంచలత నొసగజాలవు.

స్థిరతాముపయాతోఽసి భావాభావవివర్జితః
పదే పరమవిస్తారే నభసీవ ప్రభఞ్జనః. 9

మహాకాశమున వాయువు స్థిరత్వమునందునట్లు, నీవు నావాక్యములను విని, హేయోపాదేయములను విసర్జించి, స్థిరత్వము నందినాడవు.

మన్యే మద్వచనైర్బోధ మాగతోఽసి రఘూద్వహ
విగతాజ్ఞాననిద్రోఽన్తర్నృపతిః పటహైరివ. 10

రఘుశ్రేష్ఠ! అంతఃపురమున నిద్రించు నృపతి భేర్యాది శబ్దములవిని నిద్రనుండి లేచునట్లు, నీవు నా ఉపదేశవాక్యములను విని అజ్ఞాననిద్రనుండి మేల్కాంటివని తలచుచున్నాడను.

సామాన్యే చ లగన్త్యేవ జనే కులగురోర్గిరః
అత్యుదారమతౌ రామ న లగన్తి కథం త్వయి. 11

రామా! సామాన్యుల హృదయమున గూడ కులగురుని వాక్యములు నాటుకొనిపోవును; అత్యుదారహృదయుడవగు నీపట్ల, నావాక్యములు వ్యర్థములగునా?

యత్రోపాదేయవాక్యత్వం భావితం స్వేన చేతసా
మద్వచోఽన్తర్విశత్యాశు సప్తే క్షేత్రే యథా పయః. 12

మిక్కుటముగ నెండిన నేల నీరింకునట్లు, ఆప్తబుద్ధి నంకించిన నీ హృదయమున నావాక్యములు జొచ్చినవి.

వయమిహ హి మహానుభావ నిత్యం
కులగురవో భవతాం రఘూద్వహానామ్
మదుదితమిదమాశు ధార్యమార్య
శుభవచనం హృది హారవత్త్వయేతి. 13

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే చిత్తాభావప్రతిపాదనం నామ
చతుర్థః సర్గః ॥ 4 ॥

మహానుభావా! ఇక్ష్వాకువంశీయులగు రఘుశ్రేష్ఠులకు మేమే కులగురువులము. అందువలన, నాశుభవచనములు విశేషముగ శిరోధార్యములగుచున్నవి. ఆర్యా! వీటిని హృదయమున ధరింపుము (అనగా చింతింపుము).

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చిత్తాభావప్రతిపాదనమను
చతుర్థ సర్గము ॥ 4 ॥

---

పఞ్చమః సర్గః.

---

[ఇహ ప్రబుద్ధః శ్రీరామో విశ్రాన్తః పరమే సుఖే
గురోః పురః స్వానుభవం వర్ణయామాస విస్తరాత్.

జ్ఞానయుక్తుడగు శ్రీరామచంద్రుడు పరమసుఖమున విశ్రాంతి నొంది గురుసమ్ముఖమున తన స్వానుభవమును విస్తారముగ వర్ణించుట.]

శ్రీ రామ ఉవాచ :—

అహో అహం గతశ్చిత్త్వం భవద్వాక్యార్థభావనాత్
శాన్తం జగజ్జాలమిదమగ్రస్థమపి నాథ మే. 1

రాముడు:- ప్రభూ! నేను మీ వాక్యార్థములను చింతించి చిత్స్వరూపమును బొందినాడను, జగత్తులు శాంతించి పోయినవి.

పరామన్తః ప్రయాతోఽస్మి పరమాత్మని నిర్వృతిమ్
దీర్ఘావగ్రహసంతప్తం వృష్ట్యేవ వసుధాతలమ్. 2

అనావృష్టిచే శుష్కమైన భూమి వర్షపాతమున ఆనందము నందునట్లు, మీవచోధారల నభిషిక్తమైన నామనస్సు పరమానందము నందుచున్నది.

శామ్యామి శీతలాకారః సుఖం తిష్ఠామి కేవలమ్
ప్రసాదమనుయాతోఽహం సరో నిర్వారణం యథా. 3

గజరహితమగు సరోవరమువలె, నేను నిశ్చలసుఖమును, శాంతిని అనుభవించుచున్నాడను

సమ్యక్ప్రసన్నమఖిలం దిఙ్మణ్డలమిదం మునే
యథాభూతం ప్రపశ్యామి నిర్నీహారమివాధునా. 4

మునీ! మంచుతొలగిన, అంతయు చక్కగ గనుపడునట్లు, నాదృష్టికి యథాభూతవస్తువగు బ్రహ్మమగపడుచున్నది. దిఙ్మండలము ప్రసన్నముగ దోచుచున్నది.

జాతోఽస్మి గతసందేహః శాన్తాశామృగతృష్ణికః
రాగనీరాగనిర్ముక్తో మృష్టజగ్జలశీతలః. 5
ఆత్మనైవాన్తరానన్దం తత్ప్రాప్తోఽస్మ్యన్తవర్జితమ్
రసాయనరసాస్వాదో యత్ర నాథ తృణాయతే. 6

ఆశలను మృగతృష్ణ లంతరించినవి. సందేహములు తొలగినవి. ఆసక్తియను మంచు విచ్చిపోయినది. శరద్వనమువలె తృప్తినందితిని. అమృతాస్వాదనముగూడ తృణీకృతమగు నిరవధికమగు ఆత్మానందమును బొందితిని.

అద్యాహం ప్రకృతిస్థోఽస్మి స్వస్థోఽస్మి ముదితోఽస్మి చ
లోకారామోఽస్మి రామోఽస్మి నమో మహ్యం నమోస్తు తే. 7

నేడు ప్రకృతిస్థుడనైతిని. స్వస్థతను గంటిని. ఆనందమును బొందితిని. లోకారాముడనైతిని. ఆత్మారాముడనైతిని; ఇట్టినాకు నమస్కారము. ఈ ఆనందమును బ్రసాదించిన మీకు నమస్కారము.

తే సంశయాస్తాః కలనాః సర్వమస్తం గతం మమ
రాత్రివేతాలసంసారః ప్రభాత ఇవ భాస్కరే. 8

ప్రభాతమున భాస్కరోదయమున భూతములు మాయమగునట్లు, (జ్ఞానోదయమున) నా సంశయములు, కల్పనలు శాంతించినవి.

నిర్మలే హృది విస్తీర్ణే సంపన్నే హిమశీతలే
మనో నిర్వృతిమాయాతం సరసీ శరదీవ మే. 9

శరత్కాల సరోవరమువలె నాహృదయము నిర్మలమును, అనంతమును, శాంతమునునగు ఆనందము నందినది.

కలఙ్క ఆత్మనః కస్మాత్కథం చేత్యాది సంశయః
నూనం నిర్మూలతాం యాతో మృగాఙ్కాగ్రే యథా తమః. 10

చంద్రోదయమున చీకట్లు నశించునట్లు, ఆత్మయందు కళంకము ఎటనుండి, ఎట్లువచ్చినది? మున్నగు సంశయములు తొలగిపోయినవి.

సర్వమాత్మైవ సర్వత్ర సర్వదా భావితాకృతిః
ఇదమన్యదిదం చాన్యదిత్యసత్కలనా కుతః. 11

సర్వము, సర్వదా, సర్వత్ర, ఆత్మయే, అగుచో, ఇది వేఱు, అది వేఱు, మిథ్యాకల్పనలవు తావెక్కడ?

కో ఽభవం ప్రాగహం తాదృక్తృష్ణానిగడయన్త్రితః
అన్తరాత్మానమేవేతి విహసామి వికాసవాన్. 12

తృష్ణాయంత్రకక్షితమగు నాపూర్వస్థితిని — అశనాయాద్యతీతమగు నా ప్రస్తుతపు టానందమును తలచుకొని జ్ఞానినగు నేను నవ్వుకొనుచున్నాడను.

ఆ ఇదానీం స్మృతం సమ్యగ్వ్యాత్మైవ సకలో౽స్మ్యసౌ
యస్త్వద్వాగమృతాపూరస్నాతేనాయనుమహాం స్థితః. 13

నీ వాగమృత ధారల స్నానమునర్చి, ఇప్పుడే నా సర్వాత్మభావమును సంపూర్ణముగ గ్రహించితిని.

అహో ను వితతాం భూమిమధిరూఢో౽స్మి పావనీమ్
ఇహాస్థ ఏవ యత్రార్కో న పాతాలమివ స్థితః. 14

నేడు బ్రహ్మభూమి నధిరోహించితిని, ఇట సూర్యప్రకాశమునకు తావులేదు, ఇటనుండి తన్మండలము పాతాళమువలె దూరస్థము.

మహ్యాం సత్తాముపేతాయ భావాభావభవార్ణవాత్
నమో నిత్యం నమస్యాయ జయామ్యాత్మాత్మని. 15

హేయోపాదేయ—సముద్రమునుండి లేచి, స్వస్వరూపప్రతిష్ఠుతుడనై స్వమహిమయందు సర్వోత్కృష్టరూపమున వర్తిలు నేను సర్వులకు నమస్యుడను; ఇట్టి నాకు నమస్కారము.

అనుభవవశతో హృదబ్జకోశే
స్ఫుటమలితాం సముపాగతేన నాథ
తవ వరవచసేహ వీతశోకాం
చిరముదితాం చ దశాముపాగతో౽స్మి. 16

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే రాఘవవిశ్రాన్తివర్ణనం నామ పఞ్చమః సర్గః ॥ 5 ॥

ప్రభూ! నీ వచనములు నా హృదయపద్మకోశమున ప్రవేశించి, అనుభవ జ్ఞానమునొసగినవి. దాన, శోకరహితమును, నిత్యానంద స్వరూపమునునగు జీవన్ముక్తిస్థితిని బొందితిని.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
రాఘవ విశ్రాంతివర్ణనమను
పంచమ సర్గము ॥ 5 ॥

---

## షష్ఠః సర్గః

---

[దేహాత్మప్రవివేకో౽త్ర దుఃఖం దేహాత్మదర్శనాత్
మూఢానామఙ్గనాసఙ్గో మోహవృద్ధిశ్చ వర్ణ్యతే.

దేహాత్మల వివేకము, దేహమందాత్మబుద్ధిచే దుఃఖము, స్త్రీసంగముచే యజ్ఞానులకు మోహవృద్ధి మున్నగు విషయము లీసర్గయందు వర్ణింపబడినవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తే ౾హం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. 1

వసిష్ఠుడు:— మహాబాహూ! నే చెప్పువాక్యముల నింకను వినుము; ఇవి నీప్రీతికిని, మంచికిని దోడ్పడగలవు.

భేదమభ్యుపగమ్యాపి శృణు బుద్ధివివృద్ధయే
భవేదల్పప్రబుద్ధానామపి నో దుఃఖితా యథా. 2

నీవు భేదబుద్ధి తొలగిపోయినను, జ్ఞానాభివృద్ధికై ఈ వాక్యముల నాలింపుము; తత్త్వమును చక్కగ గ్రహింపనివారి దుఃఖముగూడ తొలగిపోగలదు.

యస్యాజ్ఞానాత్మనో ౾జ్ఞస్య దేహ ఏవాత్మభావనా
ఉదితేతి రుషైవాక్షరిపవో ౾భిభవన్తి తమ్. 3

ఏ అజ్ఞాని దేహమునం దాత్మభావనను నిల్పుచున్నాడో, అతని ఇంద్రియము లీ అసదాత్మభావనకు రోషమునంది అతనిని పరాభవించుచున్నవి.

యస్య జ్ఞానాత్మనో జ్ఞస్య సత్యేవాత్మని సంస్థితిః
సంతుష్టైవాక్షసుహృదో న ఘ్నన్తి తమనిన్దితమ్. 4

ఆత్మజ్ఞానపరాయణుడై ఆత్మతృప్తుడైన వానిని ఇంద్రియములు మిత్రునిగ భావించి హింసించుచుండుటలేదు.

పదార్థే స్ఫురతో యస్య న స్తుతిర్నిన్దనాదృతే
స దేహం దేహదుఃఖార్థమాదత్తే కేన హేతునా. 5

ఎవ్వడీ పదార్థ-జాలముల హేయముగాక ఉపాదేయమును గాంచుచుండుట లేదో, అతనికి దేహాంతర ప్రాప్తియగుటకు తగుమైన కారణ మేమియును లేదు.

నాత్మా శరీరసంబన్ధీ శరీరమపి నాత్మని
మిథో విలక్షణావేతౌ ప్రకాశతమసీ యథా 6

ఆత్మకును శరీరమునకును సంబంధమే లేదు. శరీరమునకును ఆత్మకును గూడ సంబంధము లేదు. ఈ రెండును చీకటివెలుగులవలె పరస్పర విరుద్ధములు.

సర్వైర్భావవికారైస్తు నిత్యోన్ముక్తస్త్వలేపకః
నాత్మాస్తమేతి భగవన్న చోదేతి సదోదితః. 7

ఈ ఆత్మ వికారరహితము, నిర్లేపము, అనుచ్ఛిత్తిధర్మి; దీని కుదయాస్తమయములు లేవు. సర్వశక్తిమంతము.

జడస్యాజ్ఞస్య తుచ్ఛస్య కృతఘ్నస్య వినాశినః
శరీరకోపలస్యాస్య యద్భవత్యస్తు తత్తథా. 8

జడమును, అజ్ఞమును, తుచ్ఛమును, వినాశశీలమును, కృతఘ్నమును నగు ఈ శరీరశిలకేమి కానున్నదో అదియే కానిమ్ము.

ఆదత్తే తత్కథం నిత్యం చిన్మయత్వం సదోదితమ్
యయోరేకపరిజ్ఞానే జడతైవాఽపరస్థితా. 9

జడమగు ఈ శరీరము నిత్యోదితమగు చిన్మయత్వము నెట్లు పొందగలదు? చిన్మయత్వ మును భావించిన జడత్వము పారిపోవును.

తయోః కీదృగ్విధా భూతా సమానసుఖదుఃఖతా
యయోః సమాసమధర్మాణౌ న కదాచన తౌ కథమ్. 10

లోకవ్యవహారము పరస్పరాధ్యాసను లోనై జరుగుచున్నను, వాస్తవమునకు ఈ రెండును విరుద్ధవస్తువులు. వీటి ధర్మములు వేఱు.

యావప్యసక్తావన్యోన్యం మిథః సంనమితౌ కథమ్
కథం స్థూలోఽణురూపః స్యాదణుః స్థూలః కథం భవేత్. 11

అత్యంత సూక్ష్మమగు ఆత్మకును, అత్యంత స్థూలమగు శరీరమునకును సంయోగమే అసంభ వము; ఇక ఐక్యమెట్లు సిద్ధింపగలదు?

ఏకోదయే ద్వితీయస్య న సత్తా దివరాత్రయోః
జ్ఞానం నాజ్ఞానతామేతి చ్ఛాయా నాయాతి తాపతామ్. 12

రాత్రింబవళ్లు, జ్ఞానాజ్ఞానములు, ఛాయాతాపములు ఒకచోటనుండ జాలవు ఒకటి ఉండిన మఱొకటి ఉండజాలదు.

సద్బ్రహ్మ నాసద్భవతి విచిత్రాస్వపి దృష్టిషు
మనాగపి న సంశ్లేషః సర్వగస్యాపి దేహినః. 13

సద్వస్తువగు బ్రహ్మము జడమగు శరీరము కాజాలదు. అధ్యస్తదృష్టికి విరుద్ధముగ కనుపించి నను సర్వవ్యాపియగు ఆత్మకు శరీరముతో సంబంధము లేదు.

దేహేన దేహగస్యాపి కమలస్యేవ వారిణా
మనాగపి న సంశ్లేషో బ్రహ్మణో దేహసత్తయా. 14

నీటితో తామరపువ్వునకు సంబంధములేనట్లు దేహముతో దేహికి (ఆత్మకు) సంబంధము లేదు. దేహముండుటవలన బ్రహ్మమున కొకింతయు దోషమంటుటలేదు. (ఏలయన, అధిష్ఠానమును అధ్యస్తవస్తువుయొక్క గుణదోషములు స్పృశింపవు.)

తద్గతస్యాప్యసద్వృత్తేరమ్బరస్యేవ వాయుతః
జరామరణమాపచ్చ సుఖదుఃఖే భవాభవౌ. 15
మనాగపి న సన్తీహ తస్మాత్త్వం నిర్వృతో భవ
స్థితో దేహతయాప్యుచ్చైః పాతోత్పాతమయో భ్రమః. 16
దృశ్యతే కేవలం బ్రహ్మణ్యప్సు వీచిచయో యథా
ఆత్మసత్తోపజీవిత్వా దాత్మానుభవతీహ హి. 17

ఆకాశమున వాయుకల్పితములగు రజోకంపాదిదోషములు లేనట్లు శరీరముయొక్క గుణ ములగు జరామరణములు, సుఖదుఃఖములు, హేయోపాదేయములు ఆత్మయందు లేవు. శరీరమున్నను

జరామరణాదికము బ్రహ్మసముద్రమునందు లేచు అలలని భావించి, పరమానందమునందుము. ఆత్మసత్తయందే ఇవి పరికల్పితములగుచున్నవి.

దేహయన్త్రం పయఃసత్తామాత్రాదూర్మిమివ స్థితమ్
ఆధారస్పన్దనేనాఙ్గ యథా క్షోభో న నా భవః. 18
సూర్యాదేః ప్రతిబిమ్బస్య తథా దేహేన దేహినః
సమ్యగ్దృష్టే యథాభూతే వస్తున్యేవాభిజాయతే. 19

నీరు కదలినను సూర్యునకు కదలిక లేనట్లు ఈ శరీరము క్షోభించినను ఆత్మశక్తికి క్షోభయును లేదు; సమ్యగ్దృష్టికి భ్రమ నశించి సత్యవస్తుజ్ఞానము లభించును.

స్థితిర్దేహమయో జ్ఞానవిభ్రమో లయమేతి చ
దేహదేహవతోర్జ్ఞానాద్యథా భూతార్థయోః స్థితిః. 20

దేహాత్మలయొక్క వాస్తవికజ్ఞానమువలన, దేహమయమగు అజ్ఞానభ్రమ లయమందును

సత్తాసత్తాత్మికో దేతి దీపాద్దీపపదార్థయోః
అసమ్యగ్దర్శినో దేహస్యావర్తపరివర్తనైః. 21
అన్తఃశూన్యాః స్ఫురన్తీహ తే మోహాఙ్గనపాదపాః
అపర్యాలోచితాత్మార్థా అపరామృష్టసంవిదః. 22
స్పన్దన్తే చేతితోన్ముక్తాస్తృణవన్మూఢబుద్ధయః
అనాస్వాదితచిత్తత్వాజ్జడాః సర్వే ఖవాయుభిః. 23
యత్ర తత్రోదితాక్రాన్తా రటన్తి ప్రస్ఫురన్తి చ
తృణకాష్ఠాదికం సర్వమాహరన్తి త్యజన్తి చ. 24
సశబ్దస్పర్శరూపాద్యాస్తరఙ్గతరలాఙ్గకాః
జడాః సన్తః స్ఫురద్రూపా భృశం స్ఫారరసానవాః. 25

ప్రకాశాభావమే అంధకారమయినట్లు అజ్ఞానమే దేహపరికల్పన. దీనివలననే సారశూన్యమగు మోహమను బూరుగచెట్టు లేచుచున్నది. ఆత్మస్వభావమును, జ్ఞానముయొక్క రీతిని గ్రహింపని వారికే ఈ విపత్తు. బ్రహ్మస్వరూపము నాస్వాదింపని ఆ జడమతులు ఇటనటు సంచరించుట వారి గొప్పతనముగాదు. వనమునందలి వెదుళ్లమున్నగునవి గాలిచే కంపింపబడునట్లు ఇంద్రియద్వారముల నుండి వెలువడు ప్రాణవాయువువలన చాలితులై వారు గ్రహణ విసర్జన ఆలాపాదికృత్యముల నొనర్చుచున్నారు. శబ్దస్పర్శరూపాది తరంగాఘాతముల వారి అవయవశక్తి క్షీణించినది. వాటి రసాస్వాదనమున వారున్మత్తులైనారు.

సవిహారాగమాపాయా మహౌఘా ఇవ దుర్ధియః
సర్వేషామేవ చైతేషాం స్థితైవైషా చిదవ్యయా. 26

వీరిట్లు ఆగమాపాయప్రవాహమునబడి కొట్టుకొనుట అజ్ఞానమువలననే; నదీప్రవాహము చేతనవంతములగు వాటివలననే దాటబడునట్లు, చిద్వస్తుప్రభావముననే వీరిట్లొనర్చుచున్నారు.

కింత్వబోధవశాదస్యాః పరాం కృపణతాం గతా
శ్వాససంతతయో హ్యజ్ఞాల్లోహకారదృతేర్యథా. 27

కాని అజ్ఞానమువలన వీరు అత్యంతము నీచదశను బొందినారు; కమ్మరివాని తిత్తినుండి గాలి వెలువడునట్లు వీరియందుగూడ ప్రాణము సంచరించుచున్నది. (అనగా, వీరు జీవన్మృతులు అని భావము.)

స్పన్దమాత్రార్థమేవాశు దృశ్యన్తే నార్థకారిణః
తర్జనం గర్జనం మూఢాద్దనుర్ధణగుణాదివ. 28

వీరి చలనాదులు వ్యర్థములు. క్రూరమును, మూర్ఖమునునగు వింటినారినుండి తర్జనభర్జనములు వినబడుచుండుటలేదా!

శ్రూయతే మరణాయైవ చిద్బోధపరివర్జితమ్
ఫలభోగోఽపి యో మూఢాత్తదరణ్యాతరోరివ. 29

వనవ్యతరుఫలభక్షణము మృత్యుకారణమగునట్లు, ఆత్మజ్ఞానములేని ఫలభోగము మరణకారణమని వినవచ్చుచున్నది. (అనగా, వేదోక్తము.)

తస్మిన్విశ్రమణం యత్తచ్ఛిలాఫలహకే యథా
తేన యత్సంగమః సస్యాత్త్సాణునా భువి జఙ్గలే. 30

అజ్ఞానమున విశ్రమించుట (అనగా తృప్తినందుట) తప్తశిలయందు కూర్చొనుట; అజ్ఞానితో గూడుట, అరణ్యమున మోడువారిన చెట్టుకడకేగుట.

తదర్థం యత్కృతం కించిత్తద్వ్యోమ లకుటైర్హతమ్
తస్మిన్యదధమే దత్తం తత్యక్తం కిం న కర్దమే. 31

అజ్ఞానికి ఉపకరించుటయన్న, ఆకాశమును అట్టలతో మోదుట; అతనికి ఒసగుటయన్న, బురదలో పారవేయుట.

తేన సార్థం కథా యత్తత్కౌలేయమాహ్వనమమ్బరే
అజ్ఞానమాపదాం నిష్ఠా కా హి నాపదజానతః 32

అజ్ఞానితోటి సంభాషణ ఆకాశమున కుక్కలు మొఱగుట; అజ్ఞానమే ఆపదలకు పుట్టిల్లు. దీన కలుగని అనర్థమేమున్నది?

ఇయం సంసారసరణిర్వహత్యజ్ఞప్రమాదతః
అజ్ఞస్యోగ్రాణి దుఃఖాని సుఖాన్యపి దృఢాని చ 33
పునః పునర్నివర్తన్తే యుగం ప్రత్యచలా ఇవ
శరీరధనదారాదావాస్థాం సమనుబధ్నతః. 34

ఈ సంసారసరణి అజ్ఞుని ప్రమాదమువలననే కలుగుచున్నది. దుర్లంఘ్యనీయములగు సుఖదుఃఖములు నిష్ఠురత్వముతో దృఢముగ నతనిని బంధించుచు శరీర, ధన, దారాదులయందు నమ్మకమును గలిగించుచున్నది.

ఇదం దుర్దుఃఖమజ్ఞస్య న కదాచన శామ్యతి
అనాత్మని శఠే దేహే ఆత్మభావముపేయుషి. 35

అనాత్మయగు ఈ జడశరీరమున ఆత్మబుద్ధినుంచు మూఢునకు ఈ దుఃఖ మెన్నటికిని పోదు.

అసద్బోధమయీ మాయా కథం నామాపి నశ్యతి
దుర్భావస్యాచ్యుతధియో వస్తున్యన్ధస్య దుర్మతేః. 36

సద్భావము (ఆత్మభావము)ను వీడి, దుర్భావమున (అనాత్మబుద్ధిచే) నంధుడైన మూర్ఖుని మాయ ఎట్లు నశింపగలదు?

అవస్తుని సనేత్రస్య లుఠతశ్చ పదేపదే
విషముత్పద్యతే చన్ద్రాదామోదః కుసుమాదివ. 37

అనాత్మదర్శనమున పునఃపునః పదస్ఖలనమగు అంధుడు, పుష్పమునుండి గంధము వెలువడునట్లు చంద్రునినుండి విషమును వెలువరించుకొనుచున్నాడు.

శణ్టకశ్చ్యోతి పయసో దూర్వాఙ్కుర ఇవ స్థలాత్
దేహశాల్మలిభోగిన్యో మనోమాతఙ్గశృఙ్ఖలాః. 38
అజ్ఞస్యాశాః ప్రసూయన్తే సుకృష్టాదివ శాలయః
నరకశ్రీరిహాజ్ఞానం దుష్కృతవ్యాలవేష్టితమ్. 39
పరిపాలయతి ప్రీతా మయూరీ వారిదం యథా
నేత్రలోలాలినీలోలా స్ఫురితాధరపల్లవా. 40
మూర్ఖార్థమేవ వికసత్యఙ్గనా విషవల్లరీ
అజ్ఞస్య హృది సద్భ్యామావేవ పేలవపల్లవా. 41
విద్యతే పతగచ్ఛాయో రాగవిద్రుమదుర్ద్రుమః
తరుచ్ఛదలసద్ధూమః శస్త్రజాలరదోల్ముకః. 42
జ్వలతి ద్వేషదావాగ్నిర్హృన్మరౌ కాయతాపదః
అజ్ఞమాత్సర్యమనసి పరాపవదనచ్ఛదా. 43
ఈర్ష్యాకమలినీ చిన్తాషట్పదా విలసత్యలమ్
ప్రతిజన్మప్రమృష్టోగ్రదుఃఖకల్లోలవిభ్రమమ్. 44
జడమేవ సమభ్యేతి పునర్మరణవాడవః
జన్మ బాల్యం వ్రజత్యేతద్యౌవనం యువతా జరామ్. 45
జరామరణమభ్యేతి మూఢస్యైవ పునఃపునః
జగజ్జీర్ణారఘట్టేఽస్మిన్నజ్ఞో సంసృతిరూపయా. 46
మజ్జనోన్మజ్జనైరజ్ఞో యన్త్రే కలశతాం గతః
యదేవ గోష్పదాపూరం జ్ఞధియః పేలవం జగత్. 47
తదేవాపారపర్యన్తమగాధమమహాత్మనః
ధియో దృశ ఇవాజ్ఞస్య దీర్ఘం జఠరకోటరాత్ 48

చక్కటి నేలమీద దుర్వాంకురములు లేచునట్లు సుఖస్పర్శలనుండి అతనికి దుఃఖకంటకములు గలుగుచున్నవి. దేహమను శాల్మలీ (బూరుగు) వృక్షమునుండి వాసనలను పాములులేచి అతని మనస్సను మదగజమును బంధించుచున్నవి. చక్కగా దున్నిన పొలమున వరి లేచునట్లు, అజ్ఞుని హృదయమున ఆశలు లేచుచున్నవి. దుష్కృతములగు పాములచే సంరక్షితమగు నరక మాతనిని మయూరము మేఘమును ప్రతీక్షించునట్లు ప్రతీక్షించుచున్నవి. లోలనేత్ర-భ్రమరియును స్ఫురితాధర-పల్లవమును నగు అంగనాలిప-లత మూర్ఖునికొరకే పెంపొందుచున్నది. అజ్ఞుని హృదయమున అసక్తియను జీర్ణవృక్షమున్నది. అందు నిరంతరగము నిశ్వాసధూమములు లేచుచున్నవి. దంతములను శస్త్రములు ఖండించుచున్నవి. ఈ శరీరవృక్షమును ద్వేషాగ్ని దహించుచున్నది. అజ్ఞుని మత్సరపూర్ణ హృదయమున పరనిందయను ఈర్ష్యా-పద్మమున్నది. అందు చింతయను షట్పదము విలసిల్లుచున్నది. పూర్వపూర్వ జన్మలయందు సంపాదింపబడిన కేశములను తరంగములతో గూడిన మృత్యువను బడబాగ్ని శరీరమును దహించుచున్నది. మూఢుడు జగత్తు అను పాతిగిలకయందలి సంసృతి (సంచరణము) అను రజ్జువు నధిరోహించి మరల మరల జన్మించి బాల్యయౌవనజరామరణములను బొందుచున్నాడు. ఈ సంసారయంత్రమును బట్టుకొని మరల మరల మునుగుచు లేచుచు అజ్ఞుడు కలశమువలెనైనాడు. జ్ఞానులకీ సంసారము గోష్పదప్రాయము; అన్నపానాసక్తినిగొని కుక్షింభరుడగు అజ్ఞునకీ జగత్తు అంతములేనిది.

న ప్రయాన్త్యపరం పారం విహఙ్గాః పఞ్జరాదివ
భావమాత్రపరావృత్త వాసనాభారనాభయః 49
స్పష్టీకర్తుం న శక్యన్తే జన్మచక్రస్య నేమయః
అజ్ఞేనేన్ద్రియగృధ్రార్థ. రాగాన్మృగయుణా తనుః 50
సంసారారణ్య ఆస్తీర్ణా దూరాదామిషపిణ్డవత్
భూతశైలమయీ దృష్టిర్మృన్మారసలవమాత్రికా. 51
మోహాత్సంలక్ష్యతే చిత్రపదార్థాన నరఞ్జనః .
జయత్యనల్పసంకల్పకల్పనా కల్పపాదపః. 52

పంజరాబద్ధమగు పక్షివోలె, బాహ్యవస్తుపరివృత - చిత్తవృత్తులై, వాసనాభరమున క్రుంగిన అజ్ఞులు ఒకింతయు కదలజాలకున్నారు; జన్మచక్రముయొక్క నాభిని స్పృశింపజాలకున్నారు; వ్యాధుడు గృధ్రాదిపక్షులను బట్టుకొన మాంసపిండము నెరగ నుంచునట్లు, అజ్ఞులు ఇంద్రియముల కొఱకు శరీరమును అర్పించుచున్నారు. ఇంద్రియభోగోన్మత్తులైన వారు మోహమున గో, అశ్వ, పురుష, మాతా, భ్రాతా, హిమవంత, మలయపర్వతాది భేదకల్పనలకు లోనగుచున్నారు. అందువలన, కల్పనాప్రసువగు కల్పవృక్షము, విచిత్రపదార్థములను దోపింపజేయుచు అభీష్టసిద్ధి నొసగుచున్నది.

అజ్ఞానాత్ప్రసృతా యస్మాజ్జగత్పర్ణపరమ్పరాః
యస్మింస్తిష్ఠన్తి రాజన్తే విశన్తి విలసన్తి చ. 53

ఈ అజ్ఞాన - కల్పవృక్షమునుండియే జగత్తు నాచ్ఛాదించియుండు పల్లవములు జన్మించి, స్థితినంది, లీనములగుచున్నవి.

విచిత్ర రచనోపేతా భూరిభోగి విహఙ్గమాః
యత్ర జన్మాని పర్ణాని కర్మజాలం చ కోరకమ్. 54
ఫలాని పుణ్యపాపాని మఞ్జర్యో విభవశ్రియః
అజ్ఞానేన్దూదయే నైతా యోషిదోషధయః స్ఫుటమ్. 55
సంసారవనఖణ్డేఽస్మిన్పరాం శోభాముపాగతాః
జన్మజాలకలాపూర్ణ స్తమః కాలకృతోదయః. 56
శూన్యోదితాత్మా దోషేశో జయత్యజ్ఞానచన్ద్రమాః
అజ్ఞానేన్దోః ప్రసాదేన వాసనామృతశాలినా. 57
తర్పితాశాచకోరేణ చిత్తరత్నరసైషిణా
రాజహంసవిలాసిన్యః ప్రావేయశిశిరాఙ్గకాః. 58
భ్రాన్తికాన్తాకుముద్వత్యో లోలలోచనషట్పదాః
ధమ్మిల్లతిమిరోల్లాసా లసత్పాణ్డుపయోధరాః. 59
రామారజన్యో రాజన్తే తస్మాత్కృత్యేణ విజృమ్భితమ్. 60

ఈ విచిత్ర కల్ప - వనమున నానావిధములగు భోగాభిలాషలను పక్షులు నివసించుచున్నవి. ఉత్పత్తియే దీని పర్ణములు; కర్మసమూహములు దీని మొగ్గలు, పుణ్యపాపములే దీని ఫలములు. భోగములే దీని పూలగుత్తులు. అజ్ఞాన - చంద్రునివలన పరిపుష్టములై, ఇందు స్త్రీలను లతలు ఒప్పారుచున్నవి. అజ్ఞానకళాపరిపూర్ణుడగు చంద్రునకు జన్మలే పూర్ణాంగములు. సూర్యాస్తమయమై అంధకారమైన చంద్రోదయమగునట్లు, జ్ఞానములేక అవివేకమున్నప్పుడే అజ్ఞానమువచ్చి, చంద్రునివలెనే శూన్యమున మసలుచున్నది. చంద్రుడు దోషేశుడు (అనగా, నిశానాథుడు); అట్లే అజ్ఞానము గూడ దోషముల కాకరము. ఈ అజ్ఞాన - చంద్రుని వాసనా - సుధను ఆశా - చకోరకములు నిరంతరము పానమొనర్చుచున్నవి. చంద్రకాంతమణివలె మూర్ఖుని హృదయము సంపూర్ణముగ కరిగిపోవుచున్నది. ఇందు తిరుగాడు కామినులు రాజహంసలవలె (మూర్ఖులకు) అగుపించుచు, నలుదిక్కుల కుముదోదయమైనట్లు తోపింపజేయుచు, నేత్రముల చంచలభ్రమరములనిపింపజేయుచున్నారు; వారి స్పర్శ అత్యంతసుఖకరము! ధమ్మిల్లముల తిమిరమును వెదజల్లుచు, పాండుర పయోధరములతో జలించుచు, శుభ్రమేఘఖండములవలె వారు తేలిపోవుచున్నారు. ఇది అజ్ఞానాంధకారము యొక్క లీల!

ఆపాతమాత్రమధురత్వ మనర్థసత్త్వ
మాద్యన్తవత్త్వమఖిల స్థితిభఙ్గురత్వమ్
అజ్ఞానశాఖిన ఇతి ప్రసృతాని రామ
నానాకృతీని విపులాని ఫలాని తాని. 61

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే మోహమహాత్మ్యం నామ షష్ఠః సర్గః ॥ 6 ॥

---

స్త్రీ స్తనముల సుగంధమూ, రక్తపూతియుతము. ఇవి సువర్ణకలశ, పద్మకలికా, మాతులుంగములతో బోల్పఁబడుచున్నవి.

రసాయనేన్దునిస్యన్ద మధుబిమ్బాసవద్రవైః
ఓష్ఠాభిధో మాంసలవో లాలాక్త ఉపమీయతే. 6

ఓష్ఠముల భేదించు రక్తమయమాంసలవము, రసాయనముతోడను, అమృతముతోడను బింబఫలము (దొండపండు) తోడను, మధువుతోడను, ఆసవముతోడను బోల్పబడుచున్నది.

అల్పాల్పాష్ఠీవదాకారా భుజాక్రూరాస్థిశ్ఖజవః
మహాబాహులతాశబ్దైర్వర్ణ్యన్తే కవిభిః శుభైః. 7

చేతులు అల్పములగు కణుపులతో, కఠినములగు ఎముకలతో గూర్చబడినవి; కవులు వీటిని మహాబాహులతలని వర్ణించుచున్నారు.

కదలీస్తమ్భసమ్భారసున్దరీభిస్తథా భృతా
కుచశోభోచితానన్దా తోరణాలిర్విరాజతే. 8

కదళీస్తంభమును బోలు రమణి ఊరువులే మన్మథుని గృహస్తంభములు; ఈ మన్మథ గృహము చూపరుల కనులకు విందొనర్చు స్తనతోరణములతో నలంకరింపబడియున్నది.

ఆపాతమన్దమధురా మధ్యే ద్వన్ద్వానుబన్ధినీ
శీఘ్రావసానవిరలా లక్ష్మీరప్యభివాఞ్ఛ్యతే. 9

ఆరంభమున ఒకింత ఆనందము నొసగునదియును, వ్యయకాలమున రాగద్వేషాదుల గల్పించునదియును, శీఘ్రముగ వ్యయమందునదియును, అతిసామాన్యమునునగు లక్ష్మిగూడ కోఱబడుచున్నది!

సముపైతి మతిర్దుఃఖం సుఖం చ శతశాఖతామ్
దుఃఖశాఖాస్తు జాయన్తే నానాకర్మఫలాః శ్రియః. 10

మతి దుఃఖమును బొందుచున్నది. శతవిధములగు సుఖములు లభించుచున్నవి. నానాకర్మఫలములతో గూడిన దుఃఖశాఖ లుద్భవించుచున్నవి.

బద్ధజాలఘనాకారాః కారార్ఠమివ రజ్జవః
దచ్ఛదఃసదృశా వాచః ప్రతానగహనే స్థితాః. 11

కామ్యకర్మలు అర్థవాదవాక్యములను లతలనుబన్ని మాయారణ్యమున బంధింప, నిలబడియున్నవి.

సంతతా మోహమిహికా కార్యాసారవిసారిణీ
యమునా ప్రావృషీవైతి తిమిరశ్యామలా చిరమ్. 12

మోహమను మంచు, తిమిరశ్యామలయై వర్షకాలమున బ్రవహించు యమునానదివలె, నిరంతరము బ్రవృత్తిని గలుగజేయుచున్నది.

కటూకృతాన్తఃకరణో నానాసుఖవిశారదః
వర్ధతే హి గతస్నేహం జన్మప్రతివిషారసః. 13

ప్రతివిషయమును మొదట సుఖమును, పిదప రాగద్వేషములను గల్గించుచున్నది. అప్పుడు హృదయ మెండి, కటువగుచున్నది; ప్రతివిషయమును విషలతారసమువలె రోగకారణమగుచున్నది.

వ్యాధూతజర్జరాకీర్ణ జనతాపర్ణరాజయః
స్వకర్మపవనా వాన్తి నానాపకరరేణవః. 14

జరాజీర్ణులగు స్వజనులను జీర్ణపత్రములను బడవేయు స్వకర్మ-వాయువులు లేచి, వివేకాంధ్యమును గల్పించు ధూళికణముల లేవదీయుచున్నవి.

కాలః కవలితానన్తజగత్పక్వఫలోఽప్యయమ్
ఘస్మరాచారజఠరః కల్పైరపి న తృప్యతి. 15

జగత్తులను పక్వఫలముల కడుపార మెసవి, నిష్ఠురకార్యముల మొండివారిన కాలుడు కల్పములు దాటుచున్నను, తృప్తినందుట లేదు.

మోహమారుతమాపీయ త్వచా విషమచారిణః
స్ఫురన్తి హాహాయశ్చిత్రాః శీతలాచలదీప్తయః. 16

అజ్ఞ-సర్పములు మోహ-మారుతమును బీల్చి త్రివిధతాపశూన్యమగు బ్రహ్మముయొక్క-శీతలత్వము నొకింత దోపింపజేయుచు, శరీర-చర్మములను విడచుచు, పునర్జన్మలను వక్రగమనముల నొనర్చుచున్నవి.

చిన్తాపిశాచోపహతా వివేకేన్దూదయం వినా
తమసేవ నిరాలోకా యాతి యౌవనయామినీ. 17

యౌవన-రాత్రి, వివేకవైరాగ్యశ్రవణములను చంద్రోదయములేకుండ, చింతా-పిశాచాపహతమై అంధకారరాత్రివలె వ్యర్థముగ గతించుచున్నది.

జిహ్వా జర్జరతామేతి ప్రాకృతానునయజ్వరైః
పద్మకోటరకోణస్థమపి సూత్రం హిమైరివ 18

పద్మకోటరకోణముననున్న దారము మంచున త్రుసుగువారునట్లు, ప్రాకృతజనుల నను నయించుటతో జిహ్వ శిథిలమగుచున్నది.

దుఃఖశోకమహాష్ఠీలః కష్టకణ్టకసంకటః
సహస్రశాఖతాం యాతి దారిద్ర్యవృక్షశాల్మలిః. 19

దారిద్ర్యమను శాల్మలీవృక్షము, దుఃఖశోకములను కణుపులతోడను, కష్టములను కంటకములతోడను ఉవ్వెత్తుగ నెదిగిపోవుచున్నది.

అన్తఃశూన్యోఽన్నతిధ్వస్తచిత్తచైత్యకృతాలయః
మాయా బహులయామిన్యాం లోభోలూకో వివల్గతి. 20

కట్టుదిట్టములేని చిత్తప్రాసాదమున, మాయయను కాళరాత్రియందు లోభమను గ్రుడ్లగూబ సంచరించుచున్నది.

పూర్వం గృహీత్వా కర్ణాభ్యాం స్ఫురన్తీ పరినిశ్చయమ్
జరాజర్జరమార్జారీ యౌవనాఖుం నికృన్తతి. 21

జరయను మార్జాలము యౌవనమను మూషికమును 'చెవులు సాగదీసి' చంపుచున్నది.

నిఃసారాక్రమశః క్రాన్తధరాధరసమున్నతిః
డిణ్డీరపిణ్డికేవేయం సృష్టిరాయాతి పుష్టతామ్. 22

నీటినురుగువలె అంతస్సారశూన్యమగు సృష్టి పర్వతములవలె క్రమముగ మహోన్నతి నందుచున్నది.

ఆభాసపుష్పధవలా జగత్పల్లవశాలినీ
సత్తాలతా వికసితా ధర్మార్థఫలధారిణీ. 23

జగత్పల్లవధారిణియును, చిదాభాస - పుష్పధవళయును, ధర్మాధర్మఫలప్రదాయినియు నగు వ్యవహారికసత్తయను లత వికసించినది.

సురాచలమహాస్థూణం చన్ద్రసూర్యగవాక్షకమ్
గగనాచ్ఛాదనం చారు ధ్రియతే త్రిజగద్గృహమ్. 24

ఈజగద్గృహమును గగనమాచ్ఛాదించి యున్నది. మేరుపర్వతమను మహాస్తంభము దీనిని ధరించియున్నది. చంద్రసూర్యులను గవాక్షములు వెలుతురు నిచ్చుచున్నవి.

సంసారసరసి స్ఫారే చరన్తి ప్రాణషట్పదాః
శరీరపుష్కరేష్వన్తశ్చిద్భ్రమరసపాయినః. 25

విశాలమగు ఈ సంసారసముద్రమున వికసించిన శరీరపద్మముల చిన్మధువును, ప్రాణషట్పదములు క్రోలుచున్నవి.

నభోమార్గమహానీలకుట్టిమైకాన్తశాలినీ
భువనోదరరమ్యాన్తః స్ఫురత్యాదిత్యదీపికా. 26

నభోనీలిమమను కృత్రిమ-భూభాగమున ఆదిత్యదీపమొక్కటి, భూదేశము నలంకరించుచు ఒప్పారుచున్నది.

ఆశాతన్తునిబద్ధాఙ్గీ జాగతీ జీర్ణపక్షిణీ
స్వవాసనాశలాకేఽన్తర్నిబద్ధేన్ద్రియపఞ్జరే. 27

జగత్తు అను జీర్ణపక్షి ఆశాతంతువుల బద్ధమై, వాసనలను కమ్మిలతోగూడిన ఇంద్రియ - పంజరమున నున్నది.

అనారతపతజ్జాలభూతపర్ణపరమ్పరా
స్పన్దతే మరుతా స్పృష్టా సంసృతివ్రతతిశ్చిరమ్. 28

సంసారమున నిరంతరము పడుచున్న (జన్మించుచున్న) భూతపరంపర ప్రాణవాయువున చలించుచున్నది.

స్పృష్టేః కతిపయం కాలం ప్రహృష్టాః కులశాలినః
అధఃకృతోగ్రనరకపఙ్కాః శఙ్కోజ్ఝితాః క్షణమ్. 29

జనులు అధ్యాసవలన నాత్మస్వరూపమును విస్మరించి, మేము 'గొప్పవారలము' అను అభిమానముతో రక్తమాంసమలమూత్రాది దేహనరక - పంకమున బడుచున్నారు.

భుక్తేన్దుఖణ్డకణికా నీలనీరదశైవలే
స్వర్గమార్గసరస్యన్తః స్ఫురన్తి సురసారసాః. 30

స్వర్గమార్గమను సరస్సున, నభోనీలమను శైవాలమున, ఇందుఖండలవమును భక్షించిన దేవతలను సారసపక్షులు తోచుచున్నవి.

నానాఫలాలిమలినా వాసనాజాలమాలితా
స్వన్దామోదమయీ స్ఫీతా క్రియావికసితాబ్జినీ. 31

ప్రవృత్తి-పద్మము కామ్యఫలములను భ్రమరములతో మలినమై వాసనాసమూహములను దళములతో గూడి, పరలోక - గమనాగమనములను వాసనను వెదజల్లుచు వికసించుచున్నది.

వరాకీ సృష్టిశఫరీ స్ఫురన్తీ భవపల్వలే
కృతాన్తవృద్ధగృధ్రేణ శతేన వినిగృహ్యతే. 32

భవపంకముననున్న సృష్టియను క్షుద్రమత్స్యము కృతాంతుడను వృద్ధగృధ్రమువలన గ్రహింపబడుచున్నది.

తరఙ్గఫేనమాలేవ సైవాన్యేవ చ భఙ్గురా
శ్వఃశ్వో పరేన్దులేఖేవ సముదేతి విచిత్రతా. 33

ఈ విచిత్రసృష్టి తరంగఫేనమాలవలె భంగురము; చంద్రరేఖవలె దినదినాభివృద్ధిని గాంచుచున్నది.

భూరిభూతశరావాణి క్షణభఙ్గాని కుర్వతా
ఇదం కాలకులాలేన చక్రం సంపరివర్త్యతే. 34

కాలుడను కుమ్మరి క్షణభంగురములగు భూతములను కుండల నొనర్చుచు ఈ (సృష్టి) చక్రమును ద్రిప్పుచున్నాడు.

అసంఖ్యాతాని కల్పాని సంజాతాన్యచలే పదే
జగజ్జఙ్గలజలాని దగ్ధాని యుగవహ్నినా. 35

అచలపదమున కల్పాదిగ నుదయించిన అసంఖ్యజగత్తులను అరణ్యములు, యుగవహ్ని కాహుతులై పోయినవి.

భావాభావైరపర్యన్తైః సుఖదుఃఖదశాశతైః
వైపరీత్యం ప్రయాత్యేవమజస్రం జాగతీ స్థితిః. 36

ఈ జగత్తుయొక్క స్థితి, తరుగువడని హేయోపాదేయములతోడను, సుఖదుఃఖ సమూహములతోడను ఎడతెగక విపరిణామము నందుచునేయుండును.

క్షుబ్ధైర్యుగపరావర్తైర్వాసనాశృఙ్ఖలోమ్భితా
మహాశనినిపాతైశ్చ న భగ్నా బుద్ధీరతా. 37

యుగము లెడతెగకుండ క్షుబ్ధములై, వాసనావర్తముల గల్పించుచు తిరుగుచున్నవి. అయినను మూర్ఖుల బుద్ధి చలింపకున్నది.

శతశో విద్రుతారిర్భై ర్దనుపుత్రై రభిష్టుతామ్
భవభగ్నతయామైన్ద్రీం తనుం వహతి వాసనా. 38

శత్రువులను నలుదిక్కుల చిందరవందరజేసి, చించిచెండాడి, వీరులచే స్తుతింపబడు ఇంద్ర శరీరమును గూడ, ఈ వాసనయే ధరించుచున్నది. (వాసనాప్రేరితులై వేదోక్తములగు కర్మ, ఉపాసనల నాచరించిన ఇంద్రత్వ మబ్బునని భావము.

విశత్యవిరతం భూతసర్గపాంసుపరమ్పరా
నిత్యం నియతివాత్యేయం కాలవ్యాలగలాన్తరామ్. 39

సృష్టియను ధూళికణములను లేవదీసి, నియతియను వాయువు కాలమను సర్పముయొక్క నోట ప్రవేశించుచున్నది.

పదార్థామ్భసి సర్వాణి ఫలఫేనాని సర్వతః
పతన్త్యవిరతాపాతమభావవడవాముఖే. 40

వస్తుజాలమంతయు పదార్థ-సముద్రమందలి నురుగువలె తోచుచు, అభావము (వినాశనము) అను బడబాగ్నియందు పడుచున్నవి.

స్ఫురన్త్యాకస్మికోద్భూతా విచిత్రద్రవ్యశక్తయః
స్వభావమాత్రసంపన్నాః స్పన్దశ్రియ ఇవామ్భసః. 41

ఆకస్మికములును, విచిత్రములును, స్వభావమాత్రములును నగు ద్రవ్యశక్తులు సముద్రతరంగములవలె తోచుచున్నవి.

భూతమౌక్తికసంపూర్ణాన్బ్రహ్మాణ్డాన్ సుబహూనపి
జగత్కలభకానత్తి కృతాన్తోద్రిక్తకేసరీ. 42

కృతాంతుడను ఉన్మత్తసింహము భూతములను ముత్యములతో నిండిన జగత్తులను పిల్ల ఏనుగుగున్నలను భక్షించుచున్నాడు.

కులశైలఫలా మేఘపక్షపుఞ్జాః ఫలామ్బుజః
జాయన్తేచ మ్రియన్తేచ ధ్రియన్తేచ జగత్ఖగాః. 43

మేఘములను రెక్కలతోగూడిన జగత్తులను పక్షులు సప్తకులపర్వతములను ఉపభోగ్యఫలముల మెసవుచు వాసనాఫలముల నన్వేషించుచు జన్మించి, ఒకింతసేపుండి, మరణించుచున్నవి.

చిద్భిత్తౌ స్పన్దశుభ్రాయాం రఙ్గైః పఞ్చభిరిన్ద్రియైః
ఉన్మీలయతి సంసారచిత్రాణి విధిచిత్రకృత్. 44

విధియను చిత్రకారుడు జీవుల చిత్తమను పటమున పంచేంద్రియములను రంగులతో సంసారచిత్రములను సృష్టించుచున్నాడు.

అజస్రగత్వరీం సర్వపరివర్తవిధాయినీమ్
నిమేషశతభాగాగ్రేజీమసద్భుఃసాధితాఙ్కురామ్. 45
సూక్ష్మాం కాలస్య కలనాం స్వసముత్థానకారిణీమ్
ధ్యానేనైవాన్వవేక్ష్యేతాః స్థితాః స్థావరజాతయః. 46

తొందరగ పోవునదియును, అనేకములగు మార్పులను గలిగించునదియును, నిమేషము మున్నగు అంగములతో గూడినదియును అసత్తులనుండి సాధింపబడిన అంకురము గలదియును, సూక్ష్మము తన స్థూలరూపమునకు కారణమునునగు కాలముయొక్క రీతిని ధ్యానమున నన్వేషించుచు, స్థావరజాతులు వెలయుచున్నవి.

రాగద్వేషసముత్థేన భావాభావమయేన చ
జరామరణరోగేణ జీర్ణా జఙ్గమజాతయః. 47

రాగద్వేషజనితమును, భావాభావమయమును నగు జరామరణరోగమున జంగమజాతులు జీర్ణించినవి.

సుదుష్కృతోత్తమధ్యానచారిణ్యో ధరణీతలే
నియత్యా నియతం కాలం పీడ్యన్తే కీటపఙ్క్తయః. 48

క్రిమికీటకములుగూడ స్వాచరితములగు సుకృతదుష్కృతముల జింతించుచు, పీడింపబడుచున్నవి.

క్షణేనాదృశ్య ఏవేదం నిగిరత్యఖిలం సుఖీ
సునుర్గత్యబిలః కాలవ్యాలో విపులభోగవాన్. 49

అతిభోగియగు కాలవ్యాళుడు అదృశ్యబిలమునుండియే, స్థావరజంగమముల నన్నింటిని గూడ క్షణములో సుఖభక్షణమొనర్చుచున్నాడు.

కాలేన కించిదాలక్ష్య స్వశరీరాకులీకృతాః
శీతవాతాతపప్రౌఢాః ప్రోల్లసత్పుష్పదీప్తయః. 50
ఫలప్రదాశ్చరన్తీహ శీలినః శ్వభ్రవిగ్రహాః
పయఃపటలవిశ్రాన్తత్రిలోక్యామ్బుజకోటరే. 51
కరోతి ఘుంఘుమం భూరి భూతభ్రమరపేటికా
బ్రహ్మాణ్డభైక్ష్యభాణ్డేయం కాలీ భగవతీ క్రియా. 52
స్వయం దత్త్వైవ దత్త్వైవ భూతభిక్షాం జిఘృక్షతి
తిమిరాలీకకబరీ ఇన్ద్వర్కచపలేక్షణా. 53
బ్రహ్మోపేన్ద్రమహేన్ద్రాదిధరాగిరివరాదికా
బ్రహ్మాత్తైకపిటికా లమ్బమానపయోధరా. 54
చిచ్ఛక్తిమాతృకా స్థూలా తరలా ఘనచాపలా
తారకాజాలదశనా సంధ్యారుణతరా ధరా. 55
సమస్తపద్మినీహస్తా శతక్రతుపురాననా
సప్తాబ్ధిముక్తాలతికా నీలామ్బరపరీవృతా. 56
జమ్బూద్వీపమహానాభిర్వనశ్రీరోమరాజికా
భూత్వాభూత్వా వినశ్యన్తి త్రిలోకీవృద్ధకామినీ. 57
అసకృజ్జాయతే నష్టా భూరివిభ్రమకారిణీ

మగ్నమన్యైరథోన్మగ్నం భీమే కాలమహార్ణవే. 58
ప్రతికల్పక్షణం క్షీణైర్బ్రహ్మాణ్డస్ఫుటబుద్బుదైః

కాలుని కన్నొకింత మఱిగి, తమ శరీరముల నేలయను పుట్టలోదాచి, శీతవాతాతపముల సహించి, తపఃకృశ్యములై, స్థావరములు ఫలముల నొసంగుచున్నవి. త్రిలోక-పద్మపటలమున విశ్రమించిన జీవ-భ్రమరములు ఘుంఘుమధ్వనుల నొనర్చుచున్నవి. కాలుని భార్యయగు కాళి, ఈ బ్రహ్మాండమను భిక్షాపాత్రమును చేతగొని, అనేకమారులు భూతభిక్ష నొసగినను, మరల నొసగగోరుచున్నది. త్రిలోకములను ఈ వృద్ధ-వనిత, తిమిరమును కొప్పును, సూర్యచంద్రులను చంచలనేత్రములను, త్రిమూర్తులను చైతన్యమును, భూపర్వతవాహనమును, బ్రహ్మతత్త్వమును ఒడ్డాణమును, మేఘములను స్తనములను, చిచ్ఛక్తిని, స్థూలసూక్ష్మములను, తారకలను దంతములను, సంధ్యారుణమను అధరమును, పద్మములను హస్తములను, వైజయంతమను మోమును, సప్తాబ్ధులను ముత్యాలహారమును, నీల ఆకాశమను అంబరమును, జంబూద్వీపమను నాభిని, వనములను రోమములను ధరించి ఒప్పారుచు, మరల మరల పుట్టుచు, మరణించుచున్నది. ఇట్లు, మరల మరల కాలమహార్ణవమునబడి మాటిమాటికి మునిగి తేలుచున్నది.

కాలేఽగాధరసస్యన్దే స్థిత్వాస్థిత్వా పునఃపునః. 59
కల్పమాత్రనిమేషేణోడ్డీనాః కారణసారసాః

అగాధ-రసస్యందినియగు కాలసముద్రమున బ్రహ్మాండబుద్బుదము, కల్పమను క్షణములో లేచిపోవుచున్నది.

ఉత్పత్త్యోత్పత్త్య నాశిన్యః సంతప్తాః సృష్టివిద్యుతః. 60
కాలమేఘే స్ఫురన్త్యేతాశ్చిత్రప్రకాశవనోద్యమాః

సృష్టికి నిమిత్తభూతులగు హిరణ్యగర్భులు ఒక్క-క్షణములో లేచి, సారసపక్షులవలె ఎటకో పోవుచున్నారు.

ప్రపతద్భూతవిహగాః పతన్త్యవిరతభ్రమాః. 61
కాలతాలాత్క-లోత్తాలా ద్బ్రహ్మాణ్డఫలపాలయః
ఉన్మేషకృతవైరిఞ్చసృష్టయో దేవనాయకాః. 62
నిమేషకృతసంహారాః సన్తి కేచన కుత్రచిత్
నిమేషోన్మేషసంక్షీణ కల్పజాలాః సహస్రశః. 63
రుద్రాః కేచన విద్యన్తే తస్మింశ్చిత్పరమే పునః
తేఽపి యస్య నిమేషేణ భవన్తి న భవన్తి చ. 64
తాదృశోఽప్యస్తి దేవేశో హ్యనన్తేయం క్రియాస్థితిః
అనన్తసంకల్పమయే శూన్యే చ బ్రహ్మణః పదే. 65
న సంభవన్తి కా నామ శక్తయశ్చిత్రపూరకాః
ఏవమక్షీణసంకల్పలబ్ధార్థభరభాసురా
జాగతీ కల్పనా యేయం తదజ్ఞాన విజృమ్భితమ్. 66

కాల-మేఘముల చిత్రప్రకాశవములను వనములు శేదుచున్నవి. అందు, భ్రమాత్మకములగు, భూతవిహగములు వ్రాల బ్రహ్మాండ-కల్పనలను తాళఫలములు రాలిపోవుచున్నవి. ఒక్క-నిముషములో కల్పములు గడచిపోవుచున్నవి. త్రిమూర్తులుగూడ ఒక్క-నిముషములో అంతహితులగుచున్నారు. శూన్యమగు బ్రహ్మపదమున అసంభవమేమియునులేదు. జగత్సంబంధములగు ఈ నానావిధకల్పనలు అజ్ఞానమువలననే కలుగుచున్నవి.

యాః సంపదో యదుత సంతతమాపదశ్చ
యద్బాల్యయౌవనజరామరణోపతాపాః
యన్మజ్జనం చ సుఖదుఃఖపరమ్పరాభి
రజ్ఞానతీవ్రతిమిరస్య విభూతయస్తాః. 67

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అజ్ఞానమాహాత్మ్యం నామ సప్తమః సర్గః ॥ 7 ॥

సంపదలు, లేక ఆపదలు, బాల్యయౌవనజరామరణములు, ఉపతాపములు, సుఖదుఃఖనిమజ్జనము— ఇవన్నియును అజ్ఞానాంధకారముయొక్క విభూతులు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున అజ్ఞానమాహాత్మ్యమను సప్తమ-సర్గము ॥7॥

---

## అష్టమః సర్గః.

---

[వర్ణితా కారణావిద్యా జగద్యస్యా విభూతయః
కార్యావిద్యా భవారణ్యే లతాత్వే నేహ వర్ణ్యతే.

ఈ ప్రపంచ మెద్దాని విభూతియో, అట్టి కారణావిద్య వెనుకటి సర్గయందు వర్ణింపబడినది. సంసారారణ్యమున కార్యావిద్య లతారూపమున యిందు వర్ణింపబడినది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సంసారవనఖణ్డేఽస్మింశ్చిత్పర్వతతటే స్థితా
కీదృశీ స్ఫుటవిద్యాఖ్యా లతా వికసితా కదా. 1

శ్రీ వసిష్ఠుఁడు:— సంసారారణ్యభూమియందు చిత్పర్వతపార్శ్వమున కార్యావిద్య అను లత ఎప్పుడు ఎట్లు పెంపొందినది వర్ణించుచున్నాను వినుము.

బృహత్పర్వతపర్వాఢ్యా బ్రహ్మాణ్డత్వక్సమావృతా
దేహయష్టిరియం యస్యాస్త్రిలోకీలోకకాసినీ. 2

త్రిలోకములను దేహయష్టితోడను, పర్వతములను గొప్ప కణుపులతోడను, బ్రహ్మాండమును బెరడుతోడను, జనులను పత్రాంకురములతోడను వికసించి, ఇది విలసిల్లుచున్నది.

సుఖం దుఃఖం భవో భావో జ్ఞానమజ్ఞానమేవ చ
అత్రైతాన్యురువృత్తాని మూలాని చ ఫలాని చ. 3

సుఖదుఃఖములు, జననమరణములు, జ్ఞానాజ్ఞానములు ఇందు ప్రతిదినము పెంపొందు ఫల మూలములు.

సుఖాదవిద్యోదేత్యచ్చైస్తదేవాన్తే ప్రయచ్ఛతి
దుఃఖాదవిద్యోదేత్యచ్చైస్తదేవైషా ఫలత్యలమ్. 4

అనుభవింపబడు సంపదలవలన సుఖబుద్ధికలిగినను మరల అధికమగు ఆసక్తిని కలిగించుచు అవిద్య ఉదయించుచున్నది; అయ్యది యజ్ఞదానాదిధర్మక్రియలవలన సుఖమును ఫలింపజేయుచున్నది. అయ్యదియే దుఃఖరూపమైన అవిద్యయగుచో, దుష్ప్రతిగ్రహము చౌర్యములవలన అధర్మప్రవృత్తిని జనింపజేసి తతోధికమగు దుఃఖమును ఫలింపజేయుచున్నది. దారిద్ర్యదుఃఖమువలనగలుగు అవిద్య యొక్క మహిమ ఇట్టిది.

భవాదవిద్యోదేత్యేషా తమేవ ఫలతి స్ఫుటమ్
భావాత్సత్తామవాప్నోతి తమేవ ఫలతి క్షణమ్. 5

ఉన్నది (స్థితి) అనుకొనినందువలననే ఇది ఉదయించి, సృష్టిని కల్పించుచున్నది; ఈ భావనవలననే అయ్యది దృఢమంది పదార్థ - ఫలములఁ బ్రసాదించుచున్నది.

అజ్ఞానాద్వృద్ధిమాయాతి తదేవ స్యాత్ఫలం స్ఫుటమ్
జ్ఞానేనాయాతి సంవిత్తిస్తామేవాన్తే ప్రయచ్ఛతి. 6

అజ్ఞానమువలన వృద్ధినంది అజ్ఞానఫలములనే ఒసగుచున్నది. ప్రత్యక్ - తత్త్వవిమర్శనా జ్ఞానమువలన, ఉత్తరోత్తరమున్న భూమికల నధిరోహింపజేయు బుద్ధి ఉదయించి, అంతమున సప్తమ భూమికి గొనిపోవుచున్నది.

నానావిధోల్లాసవతీ వాసనా మోదశాలినీ
ఘనప్రవాలతరలా తనురస్యా విజృమ్భతే. 7

విభిన్నకల్పనలను నానావిధప్రకాశములతోడను, వాసనలను సుగంధముతోడను, దట్టములగు అనురాగపల్లవములతోడను ఇది పెరుగుచున్నది.

దివసవ్యూహకుసుమా యామినీలోలమట్పదా
అజస్రం స్పన్దమానైషా ప్రపతద్భూతపల్లవా. 8

దినసమూహములను పుష్పములతోడను, రాత్రులను భ్రమరములతోడను ఎడతెగక వాసనలతో తిరుగాడి పడుచున్న జీవులను అద్భుతపల్లవములతోడను నిది ఒప్పారుచున్నది.

ఆగత్యాగత్య పతతి వివేకకరిణీం క్వచిత్
విధూయతే ధూతరజాః ప్రసక్తిం పునరేతి చ. 9

అధికారియగు ఒకానొక పల్లవము మరలమరల తిరిగివచ్చిన, కర్మవాయువుచే శీఘ్రనెత్తబడి, వివేకమను ఏనుగపాలిట బడుచున్నది. అదియు, ఒకప్పుడు విచార - శుండాగ్రమున అలంబనమగు విషయతరువును విశ్లేషమొనర్చి కంపింపజేయుచున్నది, దుర్వాసనలను పరాగ - రజములు లేచిపోయి

వను, దురదృష్టమున నా జీవ - పల్లవము ఆ తొండమునుండి పడిపోయి, విషయతరువును మరల నాశ్రయమొనరించుకొనుచున్నది.

జాయమానప్రవాలాఢ్యా సంజాతాఙ్కురదన్తురా
సర్వర్తుకుసుమోపేతా సమగ్రరసశాలినీ. 10
జన్మపర్వాహినీరన్ధ్రా వినాశచ్ఛిద్రచఞ్చురా
భోగాభోగరసాపూర్ణా విచారైకఘుణక్షతా. 11

మిత్రపుత్రాదులను చిగుర్చుచున్న చివుళ్లతోడను, జన్మించిన పుత్రపౌత్రులను అంకురములతో హసించుచున్నదియును, సర్వఋతువులను కుసుమములతోడను, శోకమోహాదిరసములను రసముతోడను, జన్మములను పర్వముల దట్టముగా చుట్టుకొనియున్న దుఃఖరోగములను పాములుగలదియును, మరణమను శాఖా - సంధిభాగముల బలవంతముగ జీల్చబడుచు శోకించుచున్నదియును, భోగింపబడు రాగమకరందముతో నిండినదియును నగు ఈ లత ఒక్క విచారమను ఘుణమువలననే క్షయమందుచున్నది.

వికసన్త్యః ప్రతిదినం చన్ద్రార్కావలయోఽభితః
వ్యోమ్ని వాతవిలోలాని పుష్పాణ్యస్యాః కిల గ్రహాః. 12

ఇట్టి లతయందు ప్రతిదినము సూర్యచంద్రులను జ్యోతిర్వలయముతో గూడుకొనిన ఆకాశమను చోట గ్రహములను పుష్పములు, గాలిచే కదల్పబడినట్లు కదలుచున్నవి.

అస్యాః ప్రస్ఫురితాకారాః క్షోరకత్వముపాగతాః
పూరితాకాశకోశాయాస్తారకా రఘునన్దన. 13

రఘునందనా! ఆకాశకోశమున నిండి దాపిల్లుచున్న తారకలు దీని పూలగుత్తులు.

చన్ద్రార్కదహనాలోకా యస్యాస్తత్కుసుమం రజః
అనేనేయం హి గౌరాఙ్గీ స్త్రీవ చేతాంసి కర్షతి. 14

సూర్యచంద్రులప్రజ్వలత్ - ప్రకాశమే ఈ పువ్వుల పుప్పొడి; వీటితో గూడుకొనిన లత సుందరాంగివలె జనుల చిత్తము నాకర్షించుచున్నది.

మనోమాతఙ్గవిధుతా సంకల్పకలకోకిలా
ఇన్ద్రియవ్యాలసంబాధా తృష్ణాత్వగుపరఞ్జితా. 15

మనోమత్తగజ కంపితమగు ఈ లతాగ్రమున సంకల్పమను కోకిల హృదయము నూరించు కలధ్వనుల నొనర్చుచున్నది. నలువైపులు దీనిని ఇంద్రియములను సర్పము లావరించుకొనియున్నవి, తృష్ణయను త్వక్కు దీనిపైనుండి చక్కగ నగుపడుచున్నది.

నీలాకాశతమాలాఙ్గసంశ్రయేణోన్నతిం గతా
రోదసీజానుసుస్తంభా భువనోద్యానభూషితా. 16

నీలాకాశమను తమాలాంగము నాశ్రయించుకొనియే ఇది పెంపొందుచున్నది. ద్యావాపృథువులను జానుస్తంభముల నిది నిలబడియున్నది. ఇట్టిది భువనోద్యానమును అలంకరించుచున్నది.

అధోబ్రహ్మాణ్డఖణ్డేషు స్వాలవాలేన జాలితా
విధృతాశేషజలధిజలక్షీరాదిసేచనా. 17

సప్తసముద్ర అఖాతములే దీని ఆలవాలములు (బోదె.) సముద్రజలముల, క్షీరసముద్ర పయస్సుల సేచింపబడి దీని ఊడలు పాతాళలోకములకుఁగూడ దిగినవి.

త్రయీవిలోలభ్రమరా రమణీపుష్పపుఞ్జికా
చిత్స్పన్దవాతచలితా క్రియావిమలపత్త్రికా. 18

త్రయీప్రోక్తములగు కామ్యకర్మల నాచరించు జనులే దీని నాశ్రయించుకొనియున్న రమణులను పుష్పములఁజుట్టు తిరుగాడుచున్నారు. రాగిజనుల చిత్తస్పందనమను గాలికి కదలుచు, ప్రవృత్తియను పురువులచే నిది కొట్టబడుచున్నది.

కుకర్మాజగరవ్యాప్తా స్వర్గశ్రీపుష్పమణ్డపా
జీవజీవనసీరన్ధ్రా నానామోదమదప్రదా. 19

కుకర్మలను సర్పములతో గూడుకొనియున్నను ఇది స్వర్గసంపదయను పుష్పముల శోభిల్లుచున్నది! జీవులు జీవించు కృత్రిమోపాయములను రంధ్రములతో నిబిడమయ్యు, (మూర్ఖజనులకు) ఆమోద (వాసనా) మదమును గల్పించుచున్నది.

నానోపశమవైచిత్ర్యనానాకుసుమభాసినీ
నానాఫలావలీవ్యాప్తా నానావర్షవికాసినీ. 20

మరల నియ్యది వివేకుల దృష్టికి ఉపశమవైచిత్ర్యములను నానావిధకుసుమములతో శోభిల్లుచు నివృత్తిపరమై కనంబడుచున్నది. నానావిధములగు మోక్షఫలములను, బ్రహ్మానందవర్షమును గురిపించుచున్నది.

నానాలవాలవలయా నానావిహగధారిణీ
నానాపరాగపురుషా నానాభూధరజాలికా. 21

ఎట్లుజూచినను దీన నానావిధములగు ఆలవాలములు, విహగములు, పరాగములను యత్నములు, పర్వతములను చుట్టుకంచెలు కనంబడగలవు.

నానాకలాకుడ్మలినీ నానావనగణోత్థితా
నానాగిరితటారూఢా నానాదలనిరన్తరా. 22

నానావిధకళలను పత్త్రములలో నిది చెక్కబడియున్నది. నానావిధ (ద్వైత) దర్శనములను వనముల నిది ఆవరింపబడియున్నది. నానాత్వమను గిరితటము నధిరోహించి, భేదదర్శనమను దళముల నిత్యము విడుచుచున్నది.

జాతా చ జాయమానా చ మ్రియమాణా తథా మృతా
అర్ధచ్ఛిన్నా తథాఽచ్ఛిన్నా నిత్యమచ్ఛేదినీ తథా. 23

ఇది పుట్టియు, మరల నొకప్పుడు పుట్టుచున్నట్లగపడుచు, గిట్టునదై గిట్టుచున్నది. అర్ధచ్ఛిన్నమును భిన్నమునునైగూడ ప్రవాహరూపమున అభేద్యమై వెలయుచున్నది.

అతీతా వర్తమానా చ సత్యేవాసత్యేవత్సదా
నిత్యమత్యన్తతరుణీ నిత్యం శోషముపేయుషీ. 24

ఇది ఒకప్పుడు తొలగిపోయియు మరల నొకప్పుడు కంటబడుచున్నది; ఉండియు లేనట్లు నటించుచున్నది. ఇది నిత్యము చిగుర్చుచు, నిత్యము (జ్ఞానవిచారమున) ఎండుచున్నది.

మహావిషలతైషా హి సంసారవిషమూర్ఛనామ్
దదాతి రభసాశ్లిష్టా పరామృష్టా వినశ్యతి. 25

ఈ మహావిషలతను తొందరపడి 'ఎఱుఁగక' ముట్టుకొనిన, సంసారమను విషమూర్ఛను గలిగించుచున్నది. కాని, వివేచనాపూర్వకముగ ముట్టిన వినశించుచున్నది!

స్ఫీతేఽన్తర్గలితా తస్య అజ్ఞేఽన్తః సంస్థితాన్వితా
ఇతో జలమితః శైలా ఇతో నాగాః సురా ఇతః. 26

ఇతః పృథ్వీత్వమాయాతా తథేతో ద్యుతయా స్థితా
ఇతశ్చన్ద్రార్కతాం ప్రాప్తా తథేతస్తారకాకృతిః. 27

ఇతస్తమ ఇతస్తేజ ఇతః ఖమిత ఉర్వరా
ఇతః శాస్త్రమితో వేదా ఇతో ద్వయవివర్జితా. 28

క్వచిత్ఖగతయోడ్డీనా క్వచిద్దేవతయోత్థితా
క్వచిత్స్థాణుతయా రూఢా క్వచిత్పవనతాం గతా. 29

క్వచిన్నరకసంలీనా క్వచిత్స్వర్గవిలాసినీ
క్వచిత్సురపదం ప్రాప్తా క్వచిత్క్రిమితయా స్థితా. 30

క్వచిద్విష్ణుః క్వచిద్బ్రహ్మా క్వచిద్రుద్రః క్వచిద్రవిః
క్వచిదగ్నిః క్వచిద్వాయుః క్వచిచ్చన్ద్రః క్వచిద్యమః. 31

విచారపూర్వకముగు ప్రశస్తాంతఃకరణమున ముట్టిన, అది అందు మాటుమణగిపోవుచున్నది. కాని అజ్ఞానుల అంతఃకరణముననుండి, 'ఇట నీళ్లు, అట పర్వతములు, పాములు, దేవతలు, ఇట పృథివి, అట చంద్రతారకలు, సూర్యులు లేచుచున్నవి. ఇట చీకటి, అట వెలుఁగు, ఇచ్చట ఆకాశము, అచ్చట మట్టి, ఇది శాస్త్రము, అవి ప్రళయసుషుప్తులు, ఇది పక్షియైపుట్టినది, అది దేవతయైనది, అది స్థాణువైనది, అది గాలి, అది నరకానుభవము, ఇయ్యది స్వర్గానుభవము, అది దేవత, ఇది పురుగు, వారు త్రిమూర్తులు, అది సూర్యుడు, అది అగ్నివాయువులు, వీరు చంద్రుడు, యముడు, అని భేదదర్శనమును దోపింపజేయుచున్నది.

యత్కిఞ్చనాఙ్గ భువనేషు మహామహిమ్నా
వ్యాప్తం జరత్తృణలవత్త్వముపాగతం వా
దృశ్యం స్ఫురన్నను హరాద్యపి తామవిద్యాం
విద్ధి క్షయాయ తదతీతతయాత్మలాభః. 32

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అవిద్యాలతావిలాసోపదేశో నామాష్టమః సర్గః ॥ 8 ॥

తత్సా! ప్రభావోత్కర్షవలన జరత్తృణమునుండి అవ్యాకృతాంతమువఱకునున్న హరాదులలో స్ఫురించు దృశ్యప్రపంచమును అవిద్యయని గ్రహింపుము; దీనిని నశింపజేయవలసియున్నది; దీనిని దాటినచే ఆత్మలాభమను ముక్తి లభింపగలదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున అవిద్యాలతావిలాసోపదేశమను అష్టమ సర్గము ॥ 8 ॥

---

## నవమః సర్గః.

---

[గుణత్రయవిభాగోఽత్ర హరాదేః శుద్ధసత్వతా
విద్యావిద్యాస్వరూపం చ తదతీతం చ వర్ణ్యతే.

ఇందు గుణత్రయవిభాగము, ఈశ్వరాదుల శుద్ధరూపత్వము, విద్యావిద్యల స్వరూపము, వాటి యతీతత్వము వర్ణింపబడినవి.]

శ్రీరామ ఉవాచ :—

ఆకారజాతముదితం శుద్ధం హరిహరాద్యపి
అవిద్యైవేత్యహం శ్రుత్వా బ్రహ్మన్భ్రమమివాగతః. 1

శ్రీరాముడు:— బ్రహ్మజ్ఞా! శుద్ధసత్త్వములగు హరిహరాదుల ఆకారములుగూడ అవిద్య యని మీరు నుడువుట విని, విభ్రాంతుడనగుచున్నాను. ఈ విషయమును చక్కగ తెలియఁజెప్పుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సంవేద్యేనాపరామృష్టం శాన్తం సర్వాత్మకం చ యత్
తత్సచ్చిదాభాసమయమస్తీహ కలనోజ్ఝితమ్. 2
సముదేతి స్వతస్తస్మాత్కలా కలనరూపిణీ
జలాదావర్తలేఖేవ స్ఫురజ్జలతయోదితా. 3
సూక్ష్మా మధ్యా తథా స్థూలా చేతి సా కల్ప్యతే త్రిధా
పశ్చాన్మనస్తయా తేన జ్ఞాత్రైవ వపుషా పునః. 4
తిష్ఠత్యేతాస్వవస్థాసు భేదతః కల్ప్యతే త్రిధా
సత్వం రజస్తమ ఇతి ఏషైవ ప్రకృతిః స్మృతా. 5

శ్రీ వసిష్ఠుఁడు:— సంవేదనవలన స్పర్శింపబడనిదియును, శాంతమును, సర్వాత్మకమును, నగునదియే సచ్చిదానందవస్తువు; ఇది సృష్టికిఁ బూర్వ మిట్లున్నది. కాని, సృష్టికాలమున, సలిలరాశినుండి ఆవర్తములులేచునట్లు, దీనినుండి జగత్సంస్కారోద్బోధకములగు కళలు లేచి, ఈ మత్రప్రభేదయుక్తము

లగునట్లు తోచుచు గుణ - గుణోభేదవ్యవహారమునకు ఆస్పదములగుచున్నవి. ఆ కళలు, సూర్యుని తేజమే ముదురుఎండ, లేతఎండ, నీడలవలె భావింపబడునట్లు స్థూలసూక్ష్మ మధ్యమములుగ కల్పింపబడుచున్నవి. మనస్సే ప్రథమ అవస్థ; మధ్యస్థితి హిరణ్యగర్భుడని పేర్కొనఁబడుచున్నది. స్థూలస్థితి విరాట్ అని గ్రహింపబడుచున్నది. ఇట్లు వెలయు అవ్యాకృతోపాధియగు ప్రకృతియే సూక్ష్మాది అవస్థలనుబట్టి మూడువిధములుగ కల్పింపబడుచున్నది. ఈ ప్రకృతియే సత్వరజస్తమములుగ స్మరింపఁబడుచున్నది.

అవిద్యాం ప్రకృతిం విద్ధి గుణత్రితయధర్మిణీమ్
ఏషైవ సంసృతిర్జన్తోరస్యాః పారం పరం పదమ్. 6

గుణత్రయధర్మములతో గూడుకొనిన ప్రకృతియే అవిద్యయని గ్రహింపుము. ఇదియే జీవుల సంసృతి; దీని పారమననే పరమపదము వెలయుచున్నది.

అత్ర తే య్త్రయః ప్రోక్తా గుణాస్తేఽపి త్రిధా స్మృతాః
సత్వం రజస్తమ ఇతి ప్రత్యేకం భిద్యతే గుణః 7

కార్యకారణావిద్యల అసాధారణత్వమునుబట్టి, పైన జెప్పబడిన త్రిగుణముల మగల అవాంతర త్రైవిధ్యమున్నది; ఒక్కొక్కటి మరల సత్వరజస్తమోగుణములతో గూడుకొని వెలయుచున్నది.

నవధైవం విభక్తేయమవిద్యా గుణభేదతః
యావత్కించిదిదం దృశ్యమనయైవ తదాశ్రితమ్. 8

ఈ గుణభేదము ననుసరించి అవిద్య తొమ్మిదివిధముల విభజింపబడుచున్నది. ఈ దృశ్య ప్రపంచమంతయు దానినే ఆశ్రయించుకొనియున్నది.

ఋషయో మునయః సిద్ధా నాగా విద్యాధరాః సురాః
ఇతి భాగమవిద్యాయాః సాత్వికం విద్ధి రాఘవ. 9

సాత్వికస్యాస్య భాగస్య నాగవిద్యాధరాస్తమః
రజస్తు మునయః సిద్ధాః సత్వం దేవా హరాదయః. 10

రాఘవా! ఋషులు, మునులు, నలుగురు విద్యాధరులు, సురులు వీరలు - అవిద్యయొక్క సాత్వికభాగమని గ్రహింపుము. ఈ సాత్వికభాగమున మరల నలుగురు, విద్యాధరులు తమోగుణమునకును, మునులు, సిద్ధులు రజోగుణమునకును, హరాదులగు దేవతలు సత్వగుణమునకును జెందుచున్నారు.

సత్వజాతౌ దేవయోనావవిద్యా ప్రాకృతైర్గుణైః
నిర్మలం పదమాయాతాః సత్వం హరిహరాదయః. 11

దేవయోనుల సత్వముతో నుదయించినవారి అవిద్య ప్రాకృతగుణరహితము; అందువలన హరిహరాదులు నిర్మలసత్వపదమున వెలయుచున్నారు. *

---

* ఏతేన విధిహరయో రాజసతామ్ సశరీరత్వేన మూఢజనప్రసిద్ధిః నిరస్తా; ఇతి ఆనంద బోధః.

సాత్త్వికః ప్రాకృతో భాగో రామ తజ్జ్ఞో హి యో భవేత్
న సముత్పద్యతే భూయస్తేనాసౌ ముక్త ఉచ్యతే. 12

రామా! సాత్త్వికమగు ప్రకృతియొక్క అంశమును గ్రహించినవారలు అనగా శ్రీమూర్తులను ఉపాసించినవారలు మరల జన్మించరు; అందువలననే ముక్తులనంబడుచున్నారు.

తేన రుద్రాదయో హ్యేతే సత్త్వభాగా మహామతే
తిష్ఠన్తి ముక్తాః పురుషా యావద్దేహం జగత్స్థితౌ. 13

కాన సత్త్వాంశమునకు జెందిన రుద్రాది దేవతలు ముక్తపురుషులు; వీరు ప్రపంచమున్నంతవఱకు వెలయుచుందురు.

యావద్దేహం మహాత్మానో జీవన్ముక్తా వ్యవస్థితాః
విదేహముక్తాః దేహాన్తే తిష్ఠన్త్యన్తి పరమేశ్వరే. 14

వీరు శరీరమున్నంతవఱకు జీవన్ముక్తస్థితినుందురు; దేహాంతమున విదేహముక్తులై శుద్ధబ్రహ్మస్వభావులగుదురు.

భాగ ఏష త్వవిద్యాయా ఏవం విద్యాత్వమాగతః
బీజం ఫలత్వమాయాతి ఫలమాయాతి బీజతామ్ 15

ఈ భాగము అవిద్యయేయైనను విద్య కాధారమగుచున్నది ఫలభూతమగు కార్యావిద్య నశించి, బీజభూతమగు కారణావిద్య యగుచున్నది; బీజమే అనగా కారణావిద్యయే మరల ఫలము అనగా కార్యమగుచున్నది!

ఉదేత్యవిద్యా విద్యాయాః సలిలాదివ బుద్బుదః
విద్యాయాం లీయతే విద్యా పయసీవ హి బుద్బుదః. 16

కారణావిద్యాంతర్గమగు శుద్ధసత్త్వభాగమగు విద్యయను సలిలమునుండి, కార్యావిద్యయగు సృష్టియను బుద్బుదములేచి మరల నందే లీనమగుచున్నది.

పయస్తరఙ్గయోర్ద్విత్వభావనాదేవ భిన్నతా
విద్యావిద్యాదృశోర్భేదభావనాదేవ భిన్నతా. 17

ఈ విద్యావిద్యల భేదభావనగూడ, నీరు - అలలభేదమువలె కల్పితమేయని గ్రహింపుము; ద్విత్వభావన, భేదభావనలవలననే ఇట్లగుపడుచున్నవి.

పయస్తరఙ్గయోరైక్యం యథైవ పరమార్థతః
నావిద్యాత్వం న విద్యాత్వమిహ కించన విద్యతే. 18

వాస్తవమునకు నీటికిని అలలకును భేదములేనట్లు, పరమార్థదృష్టికి విద్యాత్వ, అవిద్యాత్వ భేదమేలేదు.

విద్యావిద్యాదృశౌ త్యక్త్వా యదస్తీహ తదస్తి హి
ప్రతియోగివ్యవచ్ఛేదవశాదేతద్రఘూద్వహ. 19

విద్యావిద్యాదృశౌ నస్తః శేషే బద్ధపదో భవ
నా విద్యాస్తి న విద్యాస్తి కృతం కల్పనయానయా. 20

రఘువరా! విద్యావిద్యల దాటిన మిగులనదేదియో, అదియే మిగిలియున్నది. అది జ్ఞానాజ్ఞానముల కతీతము. అయ్యది ప్రతియోగివ్యవచ్ఛేదక మగుటవలన ఇంతకెక్కుడు చెప్ప వీలుపడదు. దీనికి ప్రతిరూపమగు శబ్దముగాని, చిహ్నముగాని, సంకేతముగాని లేదు. జ్ఞానాజ్ఞానము లనునవే లేవు. విద్యావిద్యలే లేవు. తుదకు కల్పననుగూడ దాటి మిగిలిన దానియందే స్థిరుడవుకమ్ము.

కించిదస్తి న కించిద్యచ్చిత్సంవిదితి తత్స్థితమ్
తదేవావిదితాభాసం సదవిద్యేత్యుదాహృతమ్. 21

వాస్తవమున కేమియునులేదు; కాని ఉన్నట్లగపడునదంతయు ఆ చిద్వస్తువు నాశ్రయించుకొనియే యున్నది - ఉపాధిమయము; కాన మరల నయ్యది సామాన్యవస్తువులవలె తెలియఁబడుట లేదు; కాని, దాని ఆభాసవలననే వస్తువులన్నియును తెలియబడుచున్నవి. అందువలన నవిద్యను సత్ అని కూడ చెప్పుచున్నారు.

విదితం సత్తదే దమవిద్యాక్షయసంజ్ఞితమ్
విద్యాభావాదవిద్యాఖ్యా మిథ్యైవోదేతి కల్పనా. 22

సద్ వాచకమగు ఈ అవిద్య క్షయమందునదై యున్నది; విద్యవలన తొలగిపోవుచున్నది. అందువలన నియ్యది మిథ్యయే.

మిథః స్వాన్తే తయోరన్తశ్ఛాయాతపనయోరివ
అవిద్యాయాం విలీనాయాం క్షీణే ద్వే ఏవ కల్పనే. 23

అంతరమున, ఎండానీడలవలె నుండు ఈ విద్యావిద్యలలో అవిద్యాకల్పన క్షీణించిన, ద్విత్వకల్పనకూడ తొలగిపోవును.

ఏతే రాఘవ లీయేతే అవాప్యం పరిశిష్యతే
అవిద్యాసంక్షయాత్క్షీణో విద్యాపక్షోఽపి రాఘవ. 24

రాఘవా! అప్పుడు, అనగా అవిద్యాసంక్షయమవ, విద్యాపక్షముకూడ తొలగిపోయి, విద్యాఫలాభివ్యక్తమును, పూర్ణానందరూపమునునగు ఉపాధిశూన్యవస్తువు, అవాప్యమగునది మిగిలియుండును.

యచ్ఛిష్టం తన్న కించిద్వా కించిద్వాపీదమాతతమ్
తత్రైవం దృశ్యతే సర్వం న కించన చ దృశ్యతే. 25

అప్పుడు సర్వబాధకమగు పరమార్థ స్వరూప మొక్కటియే మిగిలియుండును; తద్దర్శనమే సర్వదర్శనము. ఇది తాత్త్వికస్థితి. మాయికస్థితిలోగూడ నేమియు మిగులదు.

వటశ్చ వటధానాయామివ పుష్పఫలాదిమాన్
సర్వశక్తిర్హి కించిత్త్వం సర్వశక్తిసముద్గకమ్. 26

స్థూలనామాత్మములగు వ్యాకృతావ్యాకృత అవస్థలుగూడ, వటబీజమున పుష్పఫల ప్రసవశక్తి అడగియుండునట్లు, అజ్ఞానమున నిమిడియున్నవి. అందువలన నియ్యది సర్వశక్తిసముద్గము. తత్త్వదర్శనమైన ఇదికూడ ఉండదు.

నభసోఽప్యధికం శూన్యం నచ శూన్యం చిదాత్మకమ్
సూర్యకాన్తే యథా వహ్నిర్యథా క్షీరే ఘృతం తథా. 27
తత్రేదం సంస్థితం సర్వం దేశకాలక్రమోదయే
యథాస్ఫులిఙ్గా అనలాద్యథా భాసో దివాకరాత్. 28
తస్మాత్తథేమా నిర్యాన్తి స్ఫురన్త్యః సంవిదశ్చితః
యథామ్భోధిస్తరఙ్గాణాం యథామలమణేస్త్విషామ్. 29
కోశో నిత్యమనన్తానాం తథా తత్సంవిదాం త్విషామ్
సబాహ్యాభ్యన్తరే సర్వం వస్తున్యస్త్యేవ వస్తు సత్. 30

ఇది ఆకాశముకంటె గహనము, శూన్యము; శూన్యమన సర్వశూన్య మనుకొనరాదు. చిదాత్మకము. చిదాత్మకమన మరల ఉపాధియుక్తమని భావింపఁగూడదు. శూన్యత్వనిరసనకై ఇట్లు చెప్పబడుచున్నది. సూర్యకాంత మణియందు అగ్ని, పాలలో నేతులవలె దేశకాలనిమిత్తములు, అగ్ని నుండి స్ఫులింగములు, సూర్యునినుండి ప్రకాశము వెలువడుచున్నట్లు వెలువడుచున్నవి. సముద్రమునుండి తరంగములు, మణినుండి శుభ్రకాంతులు వెలువడునట్లు దీనినుండియే సంవిత్కాంతులు వెలువడి నలువైపుల ప్రకాశమునందుచున్నది. కోశమున నానావిధవస్తువుల కాకరమగునట్లు, ఇయ్యది నానావిధభ్రమలకు కారణమగుచున్నది. కాని, జగత్తును బ్రహ్మముకంటె వేఱని తలపరాదు. లోపల వెలుపల బ్రహ్మముగాక వేరొండు వస్తువేలేదు.

సర్వదైవా వినాశాత్మ కుమ్భానాం గగనం యథా
యథా మణేరయఃస్పన్దే అయస్కాన్తస్య కర్తృతా. 31
అకర్తురేవ హి తథా కర్తృతా తస్య కథ్యతే
మణిసన్నిధిమాత్రేణ యథాయః స్పన్దతే జడమ్
తత్సత్తయా తథైవాయం దేహశ్చేతత్యచిద్వపుః. 32

అవినాశమగు ఈ ఆత్మవస్తువు త్రివిధపరిచ్ఛేదరహితము. ఘటాకాశము కదలిన, ఆకాశముయొక్క కదలిక ఔపచారికమైనట్లు, మణి స్పందించిన, అయస్కాంతమునకు కర్తృత్వమున్నదనుకొనునట్లు, అకర్తయగు ఈ ఆత్మవస్తువునకు కర్తృత్వము చెప్పబడుచున్నది అయస్కాంత సమీపమున నున్న లోహము కదలునట్లు, జడములగు ఈ దేహజాలములన్నియు దానికలననే స్పందించుచున్నవి.

తత్ర స్థితం జగదిదం జగదేకబీజే
చిన్నామ్ని సంవిదితకల్పితకల్పనేన
లోలోర్మిజాలమివ వారిణి చిత్రరూపం
ఖాదప్యరూపవతి యత్ర న కించిదస్తి. 33

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే విద్యానిరాకరణం నామ నవమః సర్గః ॥ 9 ॥

సంవిత్కల్పనల నుదయించిన ఈ జగత్తు ఏకమాత్రబీజమగు చిద్వస్తువునందే వెలయుచున్నది. లోలోర్మిసమూహములు జలముయొక్క విచిత్రరూపములుగాక అన్యములుగావు; వాస్తవమునకు ఆకాశముకంటె అరూపమగు ఆ మూర్తామూర్తరూపశూన్యవస్తువున, అన్యమేమియును లేదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
అవిద్యానిరాకరణమను నవమ సర్గము ॥ 9 ॥

---

## దశమః సర్గః.

---

[ అవిద్యాబన్ధవిభ్రాన్తిః స్థావరేషు మనఃస్థితిః
బుద్ధిపూర్వాద్విచారాచ్చ బన్ధమోక్షః ప్రపఞ్చ్యతే.
అవిద్యచే బంధభ్రమ, స్థావరములందలి మనఃస్థితి, బుద్ధిపూర్వకమగు విచారముచే బంధవిముక్తియను నీవిషయము లీసర్గయందు వర్ణింపబడినవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

తస్మాన్న కించిదేవేదం జగత్స్థావరజంగమమ్
నకించిద్భూతతాం ప్రాప్తం యత్కించిదితి విద్ధి హే. 1

శ్రీ వసిష్ఠుడు:— హేరామా! అందువలన నీ కగపడు స్థావరజంగమాత్మకమగు జగత్తుయొక్క, భూతముల రూపముదాల్చిన సమగ్రజగమును వాస్తవమునకు లేనివానిగా గ్రహింపుము.

యత్ర కాచిన్న కలనా భావాభావమయాత్మికా
తదిదం రామ జీవాది సర్వం వ్యర్థం కిమీహసే.

'పుట్టుట, పోవుట' అను జీవకల్పనమే వాస్తవమునకు లేదు. రామా! అందువలన జీవాది భావము వ్యర్థమైనది; దీని నీవేమి బడయగోరుచున్నావు? 2

సంబన్ధోఽయమసావన్తర్హృది యో వ్యపదిశ్యతే
న తం లభామహే సర్పం రజ్జుసర్పభ్రమాదివ.

దేహసంధమున కలుగు అహంభావమున దోచు బాహ్యభోగముల అహంకర్తయే, సరిగ విమర్శించిన, రజ్జువునందు సర్పమువలె నగపడకున్నాడు. 3

అపరిజ్ఞాత ఆత్మైవ భ్రమతాం సముపాగతః
జ్ఞాత ఆత్మత్వమాయాతి సీమాన్తః సర్వసంవిదామ్.

తెలియబడినచో ఇదంతయు ఆత్మయగుచున్నది; ఇదియే జ్ఞానములన్నిటి యొక్క పరాకాష్ఠ. 4

అవిద్యేత్యుచ్యతే లోకే చిచ్చేత్యమలమాశ్రితా
చేత్యాతీతాత్మతామేతి సర్వోపాధివివర్జితా.

చైతన్యము స్వసత్తారోపితమగు మలినతా - బీజము నాశ్రయించి, అవిద్యయని నుడువబడుచున్నది. ఈ అవిద్యను దాటిపోయిన, సర్వోపాధివర్జితమగు ఆత్మతత్వమే లభించుచున్నది. 5

చిత్తమాత్రం హి పురుష స్తస్మిన్నష్టే చ నశ్యతి
స్థితే తిష్ఠతి చాత్మాయం ఘటే సతి ఘటామ్బరమ్. 6

అవిద్యా - కార్యోపాధియగు చిత్తతాదాత్మ్య - అధ్యాసవలననే, అనగా చిత్తమువలన ఈ భ్రాంతియంతయును తటస్థించుచున్నది; అందువలన ఇది నశించిన, భ్రాంతియు నశించును. ఘటమున్న, ఘటాకాశముకూడ అనివార్యమైయుండునుగదా!

గచ్ఛన్పశ్యతి గచ్ఛన్తం స్థితం తిష్ఠచ్ఛిశుర్యథా
భ్రాన్తమేవమిదం చేతః పశ్యత్యాత్మానమాకులమ్. 7

శిశువు కొనిపోవబడుచు, తనతోబాటు అందఱును నడచుచున్నారనియు, కూర్చొన అందఱును కూర్చొనియుండిరనియు తలచునట్లు, భ్రాంతచిత్తమే ఆత్మయందే కల్పనల కల్పించి, వ్యాకులపడుచున్నది.

కోశకారవదాత్మానం వాసనాతనుతన్తుభిః
వేష్టయిత్వైవ చేతోఽన్తర్జ్వాలత్వాన్నావబుధ్యతే. 8

పట్టుపురుగుగూడువలె తన్నుతాను వాసనాతంతువుల నాబద్ధమొనర్చుకొని, చిత్తము అంతర్జ్వాలకత్వమును అనుభవించుచు ఈవిషయమును గ్రహింపజాలకున్నది.

శ్రీరామ ఉవాచ :—

మౌర్ఖ్యమత్యన్తఘనతామాగతం సమవస్థితమ్
స్థావరాది తను ప్రాప్తం కీదృశం భవతి ప్రభో. 9

శ్రీరాముడు:—ప్రభో! ఘనీభవించిన మూర్ఖత్వమనునట్లు, అవివేకపరమావధిని ప్రాప్తించి, వెలయు స్థావరాది - శరీరములను గురించి ఏమి చెప్పెదరు?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అమనస్త్వ మసంప్రాప్తం మనస్త్వాదపి చ చ్యుతమ్
తటస్థం రూపమాశ్రిత్య స్థితైషా స్థావరేషు చిత్. 10

శ్రీ వసిష్ఠుడు:—ఈ స్థావరముల జీవచైతన్యము, సుషుప్తియందువలె సుఖదుఃఖముల గ్రహించు యోగ్యతను గూడ కోలుపోయి, పూర్వాపరముల జింతించు మననశక్తినుండి విచ్యుతమై, ముగ్ధరూపము నాశ్రయించి వెలయుచున్నది.

తత్ర దూరస్థితా ముక్తిర్మన్యే వేద్యవిదాం వర
సుప్తపుర్యష్టకా యత్ర చిత్స్థితా దుఃఖదాయినీ
మూకాన్ధజడవత్తత్ర సత్తామాత్రేణ తిష్ఠతి. 11

బుధిమంతుడా! ఈ యోనులు ముక్తినుండి చాలదూరముగ నున్నవని ఎంచుచున్నాను. ఇంద్రియములన్నియు నిట నిద్రాణములు. ఇట దుఃఖమునకు ప్రతీకారమొనర్చు శక్తిలేకుండుటవలన, ఇది అత్యంత దుఃఖకరమగు స్థితి. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు శూన్యములగుటవలన, మూకాంధజడములవలె, నివి సత్తామాత్రములై యున్నవి.

ఇదం దుర్దుఃఖమజ్ఞస్య న కదాచన శామ్యతి
అనాత్మని శరీరే దేహే ఆత్మభావముపేయుషి. 35

అనాత్మయగు ఈ జడశరీరమున ఆత్మబుద్ధినుంచు మూర్ఖునకు ఈ దుఃఖ మెన్నటికిని పోదు.

అసద్బోధమయీ మాయా కథం నామాపి నశ్యతి
దుర్భావస్వఙ్చ్యుతధియో వస్తున్యస్తస్య దుర్మతేః. 36

సద్భావము (ఆత్మభావము)ను వీడి, దుర్భావమున (అనాత్మబుద్ధిచే) నంధుడైన మూర్ఖుని మాయ ఎట్లు నశింపగలదు?

అవస్తుని సనేత్రస్య లుఠతశ్చ పదేపదే
విషముత్పద్యతే చన్ద్రాదామోదః కుసుమాదివ. 37

అనాత్మదర్శనమున పునఃపునః పదస్ఖలనమగు అంధుడు, పుష్పమునుండి గంధము వెలువడునట్లు చంద్రునినుండి విషమును వెలువరించుకొనుచున్నాడు.

కణ్టకశ్చైతి పయసో దూర్వాఙ్కుర ఇవ స్థలాత్
దేహశాల్మలిభోగినో్య మనోమాతఙ్గశృఙ్ఖలాః. 38
అజ్ఞస్యాశాః ప్రసూయన్తే సుకృష్టాదివ శాలయః
నరకశ్రీరిహాజ్ఞానం దుష్కృతవ్యాలవేష్టితమ్. 39
పరిపాలయతి ప్రీతా మయూరీ వారిదం యథా
నేత్రలోలాలిసీలోలా స్ఫురితాధరపల్లవా. 40
మూర్ఖరార్థమేవ వికసత్యఙ్గనా విషవల్లరీ
అజ్ఞస్య హృది సద్భూమావేవ పేలవపల్లవా. 41
విద్యతే పతగచ్ఛాయో రాగవిద్రుమదుర్ద్రుమః
తరుచ్ఛదలసద్ధూమః శస్త్రజాలరదోల్ముకః. 42
జ్వలతి ద్వేషదావాగ్నిర్హృన్మరౌ కాయతాపదః
అజ్ఞమాత్సర్యమనసి పరాపవదనచ్ఛదా. 43
ఈర్ష్యాకమలినీ చిన్తామట్పదా విలసత్యలమ్
ప్రతిజన్మప్రమృష్టోగ్రదుఃఖకల్లోలవిభ్రమమ్. 44
జడమేవ సమభ్యేతి పునర్మరణవాడవః
జన్మ బాల్యం వ్రజత్యేతద్యౌవనం యువతా జరామ్. 45
జరామరణమభ్యేతి మూఢస్యైవ పునఃపునః
జగజ్జీర్ణారఘట్టేఽస్మిన్నజ్ఞో సంసృతిరూపయా. 46
మజ్జనోన్మజ్జనైరజ్ఞో యన్త్రే కలశతాం గతః
యదేవ గోష్పదాపూరం జ్ఞధియః పేలవం జగత్. 47
తదేవాపారపర్యన్తమగాధమమహాత్మనః
ధియో దృశ ఇవాజ్ఞస్య దీర్ఘం జఠరకోటరాత్ 48

శ్రీరామ ఉవాచ :—

సత్తాద్వైతతయా యత్ర సంస్థితా స్థావరేషు చిత్
తత్రాదూరస్థితా ముక్తిర్మన్యే వేద్యవిదాం వర. 12

శ్రీరాముడు:— జ్ఞానకర్మేంద్రియవ్యాపారశూన్యమై చైతన్యమట నున్నచో నయ్యది శీఘ్రముగ వాసనాక్షయ మనోనాశనముల బడయజేయు, యోగిలభ్యమగుస్థితి; అగుచో ముక్తిదూరమని నుడువు చున్నారేల ?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

బుద్ధిపూర్వం విచార్యేదం యథావత్స్వవలోకనాత్
సత్తసామాన్యబోధోయః స మోక్షశ్చేదనన్తకః. 13

శ్రీ వసిష్ఠుడు: శాస్త్రవిహితములగు కర్మానుష్ఠానమున చిత్తశుద్ధిని సంపాదించి, సాధనచతుష్టయ సంపత్తి నార్జించి, శ్రవణ మనన నిదిధ్యాసనముల బడసిన తత్వసాక్షాత్కారముననే, వాసనలు సమూలముగ నశింప, మనస్సు క్షయమగును; అప్పుడు లభించు సత్తాసామాన్యస్థితియే మోక్షమనంబడును. కాని స్థావరయోనియన్న అనంత దుష్కృతములవలనను, దుర్వాసనలవలనను లభించినది. దానికి శాస్త్రాధికారయోగ్యమగు జన్మ దుర్లభతరము. వీట, బుద్ధిపూర్వకమగు విచారమే లేదు.

పరిజ్ఞాయ పరిత్యాగో వాసనానాం య ఉత్తమః
సత్తాసామాన్యరూపత్వం తత్కైవల్యపదం విదుః. 14

ఆత్మతత్త్వమును జక్కగ గ్రహించి, ఒనర్పబడు వాసనాపరిత్యాగమే ఉత్తమము; అప్పుడు లభించు సత్తాసామాన్యరూపమే కైవల్యపద మనంబడుచున్నది.

విచార్యార్యైః సహాలోక్య శాస్త్రాణ్యధ్యాత్మభావనాత్
సత్తాసామాన్యనిష్ఠత్వం యత్తద్బ్రహ్మ పరం విదుః. 15

ఆర్యులతో విచారించి, సహాధ్యాయులతో పరామృశించి, అధ్యాత్మభావనతో శాస్త్రముల పరికింప, లభించు సత్తాసామాన్యనిష్ఠయే బ్రహ్మపదమనంబడుచున్నది.

అన్తః సుప్తా స్థితా మన్దా యత్ర బీజ ఇవాఙ్కురః
వాసనా తత్సుషుప్తత్వం విద్ధి జన్మప్రదం పునః. 16

బీజమున అంకురమువలె వాసనలు అంతఃసుప్తములైయుండు స్థితియే సుషుప్త ; ఇదియే మరల జన్మ (జాగ్రత్స్థితి) ప్రదము అగుచున్నది. అగుచో, స్థావరములకు పునర్జన్మ లేకుండుటెట్లు సంభవము ?

అన్తః సంలీనమననం పరితః సుప్తవాసనమ్
సుషుప్తం జడధర్మాపి జన్మ దుఃఖశతప్రదమ్. 17

సుప్తవాసనలతోగూడి, మనోధర్మరహితమై, జడధర్మము నాశ్రయించి వెలయు స్థావరాది యోనులుగూడ, సుషుప్తములవలె శతసంఖ్యాకములగు (అనేకములగు) జన్మదుఃఖముల నొసగుచున్నవి.

స్థావరాదయ ఏతే హి సమస్తా జడధర్మిణః
సుషుప్తపదమారూఢా జన్మయోగ్యాః పునఃపునః. 18

జడధర్మిణులగు ఈ స్థావరాదులన్నియు తప్పక మరల సుషుప్తిధర్మమును వహించి మోక్షప్రాప్తముల నుపించుచున్నను, జన్మింపవలసియున్నవి.

యథా బీజేషు పుష్పాది మృదో రాశౌ ఘటో యథా
తథాన్తః సంస్థితా సాధో స్థావరేషు స్వవాసనా. 19

బీజముల పుష్పములు, మృత్తికందు ఘటము, అంతస్థితములైయున్నట్లు, వీటియందు వాసనలు వెలయుచున్నవి, *

యత్రాస్తి వాసనాబీజం తత్సుషుప్తం న సిద్ధయే
నిర్బీజా వాసనా యత్ర తత్తుర్యం సిద్ధిదం స్మృతమ్. 20

వాసనాబీజము సుషుప్తమైనపట్ల, సిద్ధిప్రదము కాదు; వాసనలు నిర్బీజములై - సమూలముగ నశించినపట్ల తురీయమనియు, సిద్ధిప్రదమనియు వాకొనబడుచున్నది.

వాసనాయాస్తథా వహ్నే ఋణవ్యాధిద్విషామపి
స్నేహవైరవిషాణాం యః శేషః స్వల్పోఽపి బాధతే. 21

వాసన, అగ్ని, ఋణము, వ్యాధి, శత్రువు, అనురాగము, వైరములు ఒకింత మిగిలియున్నను, క్రమాభివృద్ధినిపొంది, మహానర్థకారణములగుచున్నవి. అందువలన, వాటిని నిశ్శేషముగ రహితమొనర్పవలెను.

నిర్దగ్ధవాసనాబీజసత్తాసామాన్యరూపవాన్
సదేహో వా విదేహో వా న భూయో దుఃఖభాగ్భవేత్. 22

నిర్దగ్ధవాసనాబీజుడై, సత్తాసామాన్యరూప స్థితినందినవాడుసశరీరుడైనను, అశరీరుడైనను మరల జన్మింపడు; దుఃఖముల బడయడు.

చిచ్ఛక్తిర్వాసనాబీజరూపిణీ స్వాపధర్మిణీ
స్థితా రసతయా నిత్యం స్థావరాదిషు వస్తుషు. 23

చిచ్ఛక్తి, మరల నుత్పత్తినందు రసముతో, నక్షయమవని వాసనాబీజములతో గూడుకొని, స్థావరాది వస్తువుల నిద్రించుచున్నది.

బీజేషూల్లాసరూపేణ జాడ్యేన జడరూపిషు
ద్రవ్యేషు ద్రవ్యభావేన కాఠిన్యేనేతరేషు చ. 24
భస్మన్యథానిత్యరూపా పాంసుష్వప్యణురూపిణీ
అసితేష్వసితస్థిత్యా సితధారతయాసిషు. 25
అత్మాశక్తిః పదార్థేషు తథా ఘటపటాదిషు
సర్వత్ర సత్తాసామాన్యరూపమాశ్రిత్య తిష్ఠతి. 26

---

* వ్యావహారిక వేదాంతము సద్వాదము నొకింత అవలంబించి, ఘటోత్పత్తికి పూర్వము ఘటము మృత్తునన్నదనియు, ఉత్పత్తి కేవలము ఆవరణభంగమనియు నిరూపించుచున్నది. చూ. బృ అ ఘటభాష్యము.

అవృతచిద్రూపమగు వాసనాబీజశక్తియే, బీజముల భూజలములు లభింప వికాసమునందు తీరున నిలచియున్నది. జడముల జడరూపమునను, ద్రవ్యముల స్పృహణీయములగు ధనరత్నభావమును కల్పించు తీరునను, ఇతరములకాఠిన్యమును వహించియు, భస్మపాంసువుల పూర్వ—ఆకారములగు కాష్ఠలోష్టధ్వంసరూపమునను, అసి (కత్తి) మొదలగు నల్లటి వుస్తువుల ప్రకాశవంతమగు పదునువలెను, ఘటపటాదుల జలాహరణ, శీతనివారణశక్తిరూపముగను, ఆత్మశక్తి వెలయుచున్నది.

ఇతీయమఖిలా దృశ్యదశామాపూర్య సంస్థితా
యథా ఘటాపటా ప్రావృడమ్బరాలమ్బినీ తథా. 27

ఆకాశము నవలంబించుకొనియుండు వర్షఋతువు (అనగా రూపహీనమైన వర్షఋతువు అనుట) మేఘములను ఆచ్ఛాదనతోగూడి కనంబడునట్లు, ఇట్లు ఈ ఆవృత—చైతన్యమే దృశ్యదశను పొంది కనుపించుచున్నది.

స్వరూపమస్యాశ్చైవైతత్కథితం ప్రవిచారితమ్
అసర్వం సర్వతో వ్యాపి సదివాసన్మయాత్మకమ్. 28

ఈ అజ్ఞానావృత చిచ్ఛక్తియొక్క స్వరూపము చక్కగ విచారించి చెప్పబడినది. అసన్మయమగు ఈ నిస్సారవస్తువు సర్వత్రవ్యాపించి, సద్వస్తువువలె, భ్రాంతబుద్ధికి తోచుచున్నది.

ఆత్మదృష్టిరదృష్టైషా సంసారభ్రమదాయినీ
దృష్టా సతీ సమగ్రాణాం దుఃఖానాం క్షయకారిణీ. 29

ఆత్మదృష్టితో దీనిని గాంచకపోయిన, నియ్యది సంసారభ్రమను కలిగించుచున్నది; ఆత్మదృష్టితో నరసిన సర్వదుఃఖములు నశించుచున్నవి.

అస్యాః స్వదర్శనం యత్తదవిద్యేత్యుచ్యతే బుధైః
అవిద్యా హి జగద్ధేతుస్తతః సర్వం ప్రవర్తతే. 30

ఈ ఆత్మదృష్టికి విరోధియగు ఆవరణమును గల్పించుటవలన దీని నవిద్యయని బుధులు నుడువుచున్నారు. ఈ (దృశ్య) జగత్తునకు అవిద్యయే కారణము. దానినుండియే అన్నియు కలుగుచున్నవి.

అవిద్యారూపరహితా యావదేవావలోక్యతే
తావదేవ గలత్యాశు తుహినాణుర్యథాతపే. 31

స్వరూపశూన్యమగు ఈ అవిద్య, ఎంతగ చూడబడిన (విచారింపబడిన), అంతగ, మంచు తుంపురులు ఎండకు కరుగునట్లు, కరిగిపోవుచున్నది.

యథా నరో గలన్నిద్రో యావత్కలనయా మనాక్
విమృశత్యాశయం తావన్నిద్రా తస్య విలీయతే. 32
యథా కీదృగవస్త్వేతదితి యావద్వికల్ప్యతే
అవిద్యా క్షీయతే తావదాలోకేనాన్ధతా యథా. 33

నిద్రనుండి తేరుకొనుచున్న మనుష్యుడు ఎంతగ తన చిత్తవృత్తులను లేవదీసిన అంతగ నిద్ర తేలిపోవునట్లు, ఇదెట్టివస్తువు, అని విమర్శింపబూనుకొనిన, వెలుతురువలన దర్శనశక్తి-ప్రతిబంధక మగు తమస్సు దూరమవునట్లు, అవిద్యకూడ క్షీణించిపోవుచున్నది.

దీపహస్తో యథాభ్యేతి తమోరూపదిదృక్షయా
తథా విలీయతే సర్వం తమస్తాపైర్ఘృతం యథా. 34
నచ సంలక్ష్యతే దీపే తమసో రూపనిశ్చయః
ఉదేతి కేవలం ధ్వాన్తధ్వంసో విమలమూర్తిమాన్. 35
ఏవమాలోక్యమానైషా క్వాపి యాతి పలాయతే
అసద్రూపా హ్యవస్తుత్వాద్దృశ్యతే హ్యవిచారణాత్. 36
ఆలోక ఆగతే యాదృక్తమస్తద్దృశ్యతే తథా
యా వస్తుత్వే త్వవిద్యాయాస్త్వవస్తుత్వం ప్రతీయతే. 37
యావన్నాలోక్యతే తావన్న కించిదపి దృశ్యతే
ఆలోకితే యథా విద్యా తత్తథా ప్రతిపద్యతే. 38

దీపమును చేబూని అంధకారమును వెదుకగోరి అరుదెంచిన, వేడికి నెయ్యి కరిగిపోవునట్లు, అదంతయు విలీనమైపోవుచున్నది. దీపసహాయ్యమున తమస్సుయొక్క రూపము నిశ్చయింపబడుట లేదు; కాని, ధ్వాంతధ్వంసమను విమలమూర్తి ఒక్కటియే ఉదయించుచున్నది. అట్లే, అవిద్య గూడ సంపూర్ణముగ విచారింప దొరకొనిన, ఎక్కడికో పారిపోవుచున్నది; ఒకింత విచారించిన ఒకింతయే తొలగుచున్నది. అసద్రూపయును, అవస్తువునగు ఇయ్యది విచారింపకున్న, కనంబడుచున్నది. దీప మరుదెంచిన తమస్సు అవస్తువని తెలియబడునట్లు, జ్ఞానాలోకమున అవిద్యయొక్క అవస్తుత్వము గ్రహింపబడుచున్నది. చక్కగా విచారించి చూడనంతవఱకు అది అతీతుగనే కనంబడుచున్నది; విచారించిచూచిన దాని తత్త్వము (అనగా అవస్తుత్వము) ఉన్నదున్నట్లు తెలియబడుచున్నది.

రక్తమాంసాస్థియన్త్రేఽస్మిన్కః స్యామహమితి స్వయమ్
యావద్విచార్యతే తావత్సర్వమాశు విలీయతే. 39

ఈ రక్తమాంసాస్థియంత్రము (శరీరము)న, నేనెవ్వడను? అని విచారింప దొరకొనిన కార్యమగు నదంతయు విలీనమగుచున్నది.

ఆద్యన్తయోరసద్రూపే నూనం పరిహృతే హృదా
సర్వస్మిన్నేవ యః శేష స్తమవిద్యాక్షయం విదుః. 40

ఇట్లు ఆద్యంతవంతములగు అసద్రూపముల చక్కగ విచారించి, హృదయపూర్వకముగ నన్నిటిని త్యజించిన, మిగులు చిదాత్మనే అవిద్యాక్షయమందురు. (అధ్యస్తవస్తువు బాధింపబడిన అధిష్ఠానవస్తువు బాధింపబడజాలదుకనుక ఆత్మమిగులును. సర్వశూన్యమగునని భావింపరాదు.)

తన్న కించిచ్చ కించిద్వా తత్సద్బ్రహ్మైవ శాశ్వతమ్
తద్వస్తు తదుపాదేయం యదవిద్యా నివర్తతే. 41

ఈ అవిద్యాక్షయశేషమునందు వస్తువు వేఱొకటేమియును కాదు; అది అంతయు శాశ్వతమును సద్రూపమును అగు బ్రహ్మవస్తువై యున్నది. ఈ వస్తువొక్కటే జగత్తున సుపాదేయమై యున్నది; దీనివలననే అవిద్య నివర్తించుచున్నది.

రూపం స్వనామ్న ఏవాస్యా జ్ఞాయతే నిఃస్వభావకమ్
నహి జిహ్వాగతస్వాద్యస్వాదోఽన్యస్మాత్ప్రతీయతే. 42

వర్ణించి చెప్పుటకు దీనికి రూపములేదు; నిఃస్వభావకమగు ఆ వస్తువు తనపేరిటనే తెలియబడుచున్నది. జిహ్వాగతమగు ఆస్వాదమును వేఱొకరీతిగ చెప్పజాలము.

నా విద్యా క్వచిదప్యస్తి బ్రహ్మైవేదమఖణ్డితమ్
సదసత్కలనాస్ఫారమశేషం యేన మణ్డితమ్. 43

అవిద్యయనునదే వాస్తవమునకు లేదు; ఇదంతయును ఆ అఖండితబ్రహ్మమే. సదసత్కల్పనలన్నియు దానిని జుట్టియే కలుగుచున్నవి.

ఏతావదేవావిద్యాయా నేదం బ్రహ్మేతి నిశ్చయః
ఏతదేవ క్షయో యస్యా బ్రహ్మేదమితి నిశ్చయః. 44

ఇది బ్రహ్మముకాదను నిశ్చయమే అవిద్య; ఇదంతయు బ్రహ్మమే అను నిశ్చయమే అవిద్యాక్షయము.

ఘటపటశకటావభాసజాలం
న విభురితీత్యుదితేహ సా త్వవిద్యా
ఘటపటశకటావభాసజాలం
విభురితి చేద్గలితైవ సా త్వవిద్యా. 45

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అవిద్యాచికిత్సానామ
దశమః సర్గః ॥ 10 ॥

ఘట, పట, శకటాదుల అవభాస బ్రహ్మము కాదని తోచుట అవిద్య; ఘట, పట, శకటాదుల అవభాస బ్రహ్మమని తోచిన, అవిద్య తొలగిపోయినదన్నమాటయే.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
అవిద్యావిచికిత్సయను
దశమ సర్గము ॥ 10 ॥

---

## ఏకాదశః సర్గః

---

[జీవన్ముక్తా యయా దృష్ట్యా స్థితా హరిహరాదయః
సర్వం బ్రహ్మేతి సా దృష్టీ రామాయాత్రోపదిశ్యతే.

జీవన్ముక్తులగు వారివారానులెట్టి దృష్టిగల్గియున్నారో అట్టి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' - ఇదంతయు బ్రహ్మమే యను దృష్టి యిందు శ్రీరామునకుపదేశింపబడినది.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

పునఃపునరిదం రామ ప్రబోధార్థం మయోచ్యతే
అభ్యాసేన వినా సాధో నాభ్యుదేత్యాత్మభావనా. 1

శ్రీ వసిష్ఠుఁడు:—రామా! నీ ప్రబోధముకొఱకు మరలమరల ఒకే విషయమును జెప్పుచున్నాను. సాధో! శ్రవణాది అభ్యాసము లేకున్న ఆత్మభావన ఉదయించదు.

అజ్ఞానమేతద్బలవదవిద్యేతరనామకమ్
జన్మాన్తరసహస్రోత్థం ఘనం స్థితిముపాగతమ్. 2

అవిద్యయనఁబడు ఈ అజ్ఞానము, అనంతకోటిజన్మముల నార్జింపబడిన ద్వైతవాసనలవలన బలమునుగూర్చుకొని, దట్టముగ పెనవేసుకొనినది. (ఒకేతడవ వినిన తొలగజాలదు.)

సబాహ్యాభ్యన్తరం సర్వైరిన్ద్రియైరనుభూయతే
భావాభావేషు దేహస్య తేనాతిఘనతాం గతమ్ 3

ఇయ్యది, చక్షురాది బాహ్యాభ్యంతరప్రమాణములవలనను, జీవిత, జాగ్రదాదిఅవస్థలలో ఇంద్రియములవలనను, మరణ, ప్రళయావస్థలయందు సాక్షిచైతన్యమువలనను అనుభవింపబడి, అత్యంత ప్రాబల్యము నందుచున్నది.

ఆత్మజ్ఞానం తు సర్వేషామిన్ద్రియాణామగోచరమ్
సత్తాం కేవలమాయాతి మనఃషష్ఠేన్ద్రియక్షయే. 4

ఇక, ఆత్మజ్ఞానమన్ననో సర్వేంద్రియముల కగోచరమై, షష్ఠేంద్రియమగు మనస్సు క్షయమందిన, కేవలము సత్తామాత్రమై వెలయుచున్నది.

ప్రోల్లఙ్ఘ్యేన్ద్రియజాం వృత్తిం యత్స్థితం తత్కథం కిల
యాతి ప్రత్యక్షతాం జన్తోః ప్రత్యక్షాతీతవృత్తిమత్. 5

ఇంద్రియజన్యములగు వృత్తులనన్నిటిని అతిక్రమించి, ప్రత్యక్షాతీతవృత్తి స్వభావమై (కేవల మనుభవాత్మకమనుట) వెలయునది నరునకెట్లు ప్రత్యక్షమవగలదు ?

త్వమవిద్యాలతామేతాం ప్రరూఢాం హృదయద్రుమే
జ్ఞానాభ్యాసవిలాసాసిహస్తైశ్ఛిన్ధి స్వసిద్ధయే. 6

హృదయ - వృక్షమున చక్కగ పెనవేసికొనిపోయిన ఈఅవిద్యాలతను, పునఃపునః జ్ఞానాభ్యాసమను కత్తివేటులతో త్రుంపివేసి, స్వస్వరూపమును సిద్ధింపజేసికొనుము.

యథా విహరతి జ్ఞాతజ్ఞేయో జనకభూపతిః
ఆత్మజ్ఞానాభ్యాసపర స్తథా విహర రాఘవ. 7

రాఘవా! జ్ఞానియగు జనకభూపతి ఆత్మ - జ్ఞానాభ్యాసపరుఁడై విహరించుతీరుగ, నీవును విహరింపుము.

నిశ్చయోఽయమభూత్తస్య కార్యాకార్యే విహారిణః
జాగ్రత స్తిష్ఠతో వాపి తజ్జ్ఞానాం తేన సత్యతా. 8

కర్మరతుడును, విరతుడునునగు ఆ జనకుడు జాగ్రదవస్థయందున్నను, ఇట్టి నిశ్చయమే (జ్ఞానమే) అభ్యాసఫలముగ లభించినది.

నిశ్చయేన హరిర్యేన వివిధాచారకారిణా
యోనిష్వవతరత్యుర్వ్యాం త త్తజ్జత్వముదాహృతమ్. 9

ఇట్టి జ్ఞాననిశ్చయముగల హరి, గర్భవాసాది దుఃఖములతో గూడుకొనిన వివిధయోనుల జన్మించుచు, వివిధములగు కృత్యముల నాచరించుచు, నిర్లిప్తుడైయున్నాడు.

నిశ్చయో య స్త్రినేత్రస్య కా న్తయా సహ తిష్ఠతః
బ్రహ్మణో వాప్యరాగస్య స తే భవతు రాఘవ. 10

సర్వదా సతితో గూడుకొనియున్న శివునకును, రాగహీనుడై సరస్వతితో వెలయుచున్న బ్రహ్మకును గల నిశ్చయమే నీకును కలుగుగాక !

యో నిశ్చయః సురగురోర్వాక్పతేర్భార్గవస్య చ
దివాకరస్య శశినః పవనస్యానలస్య చ. 11
నారదస్య పులస్త్యస్య మమ చాఙ్గిరస స్తథా
ప్రచేతసో భృగోశ్చైవ క్రతోరత్రేః శుకస్య చ. 12
అన్యేషామేవ విప్రేన్ద్ర రాజర్షీణాం చ రాఘవ
యో నిశ్చయో విముక్తానాం జీవతాం తే భవత్వసౌ. 13

సురగురువగు బృహస్పతికిని, అసురగురుడగు భార్గవునకును, సూర్యచంద్రులకును, అనిలానలులకును, నారద, పులస్త్య, అంగిరస, ప్రచేతస భృగు, క్రతు అత్రి, శుకాదులకును, నాకును, జీవన్ముక్తులై వెలయుచున్న బ్రహ్మఋషి, రాజర్షులకును గల నిశ్చయమే నీకును గలుగుగాక !

శ్రీ రామ ఉవాచ :—

యేనైతే భగవన్ధీరా నిశ్చయేన మహాధియః
విశోకాః సంస్థితా స్తన్మే బ్రహ్మన్బ్రూహి త త్త్వతః. 14

శ్రీరాముడు:—భగవంతుడా! బ్రహ్మజ్ఞా! ఏనిశ్చయము ననుసరించి, ఈ మహాజ్ఞానులందఱును విశోకమగు పదము నధిరోహించిరో, నాకు చక్కగ తెలియజెప్పుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

రాజపుత్ర మహాబాహో విదితాఖిలవేద్య హే
స్ఫుటం శృణు యథా పృష్టమయమేషాం హి నిశ్చయః. 15

శ్రీ వసిష్ఠుడు:— రాజపుత్రా! మహాబాహో! బుద్ధిమంతుడా! నీ వడిగినదానిని వివరించి చెప్పుచున్నాను, వినుము,

యదిదం కించిదాభోగి జగజ్జాలం ప్రదృశ్యతే
తత్సర్వమమలం బ్రహ్మ భవత్యేతద్వ్యవస్థితమ్. 16

ఈ కనబడు జగత్తులన్నియు, మాయికవ్యవస్థ ననుసరించియున్నవి. వీటిని త్యజించిన, పారమార్థికమగు పవిత్ర-బ్రహ్మస్వరూపమే వెలయగలదు.

బ్రహ్మ చిద్బ్రహ్మ భువనం బ్రహ్మ భూతపరమ్పరాః
బ్రహ్మాహం బ్రహ్మ మచ్ఛత్రుర్బ్రహ్మ సన్మిత్రబాన్ధవాః. 17

బ్రహ్మమే జీవచైతన్యము; బ్రహ్మమే చైతన్యావభాసకములగు భువనములు; బ్రహ్మమే వాటియందు నిండియున్న జీవులు బ్రహ్మమే నేను; నా శత్రువుగూడ బ్రహ్మమే; నాబంధుమిత్రులుగూడ బ్రహ్మమేయైయున్నారు.

బ్రహ్మ కాలత్రయం తచ్చ బ్రహ్మణ్యేవ వ్యవస్థితమ్
తరఙ్గమాలయామ్భోధిర్యథాత్మని వివర్ధతే. 18

భూతభవిష్యద్వర్తమానములను త్రికాలములుగూడ బ్రహ్మమే; ఇవి బ్రహ్మముననే వెలయుచున్నవి. తరంగములు సముద్రమున విజృంభించుచున్నట్లు, ఇవి బ్రహ్మమున విజృంభించుచున్నవి.

తథా పదార్థలక్ష్మ్యేత్థమిదం బ్రహ్మ వివర్ధతే
గృహ్యతే బ్రహ్మణా బ్రహ్మ భుజ్యతే బ్రహ్మ బ్రహ్మణా. 19

ఇట్లు పదార్థ-లక్ష్మిని దోపింపజేయుచు బ్రహ్మ విజృంభించుచున్నది. బ్రహ్మము బ్రహ్మమువలననే గ్రహింపబడుచున్నవి. బ్రహ్మము బ్రహ్మమువలననే భుజింపఁబడుచున్నది.

బ్రహ్మ బ్రహ్మణి బృంహాభిర్బ్రహ్మశక్త్యైవ బృంహతి
బ్రహ్మ మచ్ఛత్రురూపం మే బ్రహ్మణోఽప్రియకృద్వ్యథి. 20

బ్రహ్మ తనయందు తానే తన మాయాశక్తివలన, వివర్తనములను ఆవర్తము (సుళ్లు) లను లేవదీయుచు వర్ధిల్లుచున్నది. నాశత్రువుకూడ బ్రహ్మమే; బ్రహ్మమునకు నేనప్రియమొనరింపకుందునుగాక !

తద్బ్రహ్మణి బ్రహ్మనిష్ఠం కిమన్యత్కస్యచిత్కృతమ్
రాగాదీనామవస్థానం కల్పితానాం ఖవృక్షవత్. 21

బ్రహ్మమున (బ్రహ్మ) నిష్ఠుడైయుండువానికి ఎవరేమియొనర్తురు? అగుచో, రాగాదికల్పితావస్థలను ఆకాశ-వృక్షమునకువలె తావేలేదు.

అసంకల్పేన నష్టానాం కః ప్రసఙ్గోఽత్ర వర్ధతే
బ్రహ్మణ్యేవ హి సర్వస్మింశ్చరణస్పన్దనాదికమ్. 22

సంకల్పములన్నియు నశించినవారికి, మరల రాగాది సంకల్పము లుదయించు ప్రసంగమెట్లు? మన గమనాగమనములకు కారణములగు చరణస్పందనాదికముగూడ, సర్వత్ర పూర్ణమై వెలయుచున్న బ్రహ్మముననే; ఇక రాగాదు లెవ్వరితో ?

బరిత్యజించి, తద్వ్యతిరిక్తమగు తత్త్వభావమున పరమాత్మయందు, ఆభరణము సువర్ణమున, తరంగము జలముల వెలయుట జరుగుచున్నది. దీనికి వ్యతిరిక్తమైన భావమే, ప్రకృతి, మాయ అనంబడు చున్నది; ఇయ్యదియే జీవ, జడరూప భేదాదికల్పనల గలిగించుచున్నది.

ఇత్యజ్ఞానాత్మనో మోహోహా నచ జ్ఞానాత్మనః క్వచిత్
అజ్ఞస్య దుఃఖౌఘమయం జ్ఞస్యానన్దమయం జగత్. 32

ఇట్టి అజ్ఞానమునందుండువారలకే మోహము (దుఃఖము); కాని జ్ఞానులకుగాదు. అజ్ఞులకీ జగత్తు దుఃఖమయము; జ్ఞానులకియ్యది ఆనందరసైకపూర్ణము.

అన్ధం భువనమన్ధస్య ప్రకాశం తు సుచక్షుషః
జగదేకాత్మకం జ్ఞస్య మూర్ఖస్యాతీవ దుఃఖదమ్. 33

అంధున కీ జగమంతయు అంధకారమయము; సచక్షువునకు ప్రకాశమయము అట్లే అజ్ఞాని కిదంతయు దుఃఖప్రదమును, జగదేకాత్మజ్ఞానమున్నవానికి ఆనందప్రదముననై నెగడుచున్నది.

శిశోరివ స్ఫురద్యక్షా నిశా పుంసస్తు కేవలా
అస్మిన్బ్రహ్మఘటే నిత్యమేకస్మిన్సర్వతః స్థితే. 34

శిశువే రాత్రిభూతమును జూచి భయపడుచున్నాడు, ప్రాప్తవయస్కుడగు పురుషుడు కాదు; అట్లే బ్రహ్మమను పూర్ణామృతఘటస్థితుడైన ప్రాజ్ఞునికి భయదుఃఖములులేవు.

న కించిన్మ్రియతే నామ నచ కించన జీవతి
యథోల్లాసవిలాసేషు న నశ్యతి న జాయతే. 35

తరంగములు 'లేచుట, పోవుట' అనునది మిథ్యయగునట్లు, జననమరణములుగూడ మిథ్యలు; జీవించునదిలేక మరణించునది అనునదే లేదు. ఇయ్యది భ్రాంతకల్పన.

తరఙ్గాది మహామ్భోధౌ భూతవృన్దం తథాత్మని
ఇదం నాస్తీదమస్తీతి భ్రాన్తిర్నామాత్మనాత్మని. 36

సముద్రమున తరంగభ్రాంతివలెనే, ఆత్మయందు జీవభ్రాంతి; ఇదియున్నది, అదిలేదు, అను భ్రాంతిగూడ అట్లే ఆత్మయందు ఆత్మచే పరికల్పితము.

శక్తిర్నిర్హేతుకైవాన్తః స్ఫురతి స్ఫటికాంశువత్
జగచ్ఛక్త్యాత్మనాత్మైవ బ్రహ్మ స్వాత్మని సంస్థితమ్. 37

స్ఫటిక-మణికిరణములశక్తి నిర్హేతుకముగనే ప్రసరించి పదార్థముల ప్రతిబింబింపజేయునట్లు జగత్తు నుద్దీపింపజేయు మాయికశక్తి బ్రహ్మమునుండియే స్ఫురించుచున్నది. ఇట్లాత్మశక్తిని బ్రహ్మము స్ఫురింపజేయుచున్నను, అయ్యది తనయందు తానే వెలయుచున్నది.

తరఙ్గకణజాలేన పయసీవ పయోఘనమ్
శరీరనాశేన కథం బ్రహ్మణో మృతధీర్భవేత్. 38

తరంగకణ-సమూహముల ఘనీభవించిన నీరే ఫేనము. అది మరల తునిగిపోయినను నీరే యగును. అట్లే ఏదోకారణమువలన కల్పితమైన శరీరముపోగా బ్రహ్మమే మిగులును. శూన్యమగునని తలపరాదు,

బ్రహ్మణో వ్యతిరిక్తం హి న శరీరాది విద్యతే
పయసో వ్యతిరేకేణ తరఙ్గాది మహార్ణవే. 39

సముద్రమున నీరులేకున్న తరంగాదులుండజాలనట్లు, ఈ బ్రహ్మమే లేకున్న శరీరాదు లుండేరవికావు.

యః కణో యా చ కణికా యా వీచిర్యస్తరఙ్గకః
యః ఫేనో యా చ లహరీ తద్యథా వారి వారిణి. 40
యో దేహో యా చ కలనా యద్దృశ్యం యా క్షయాక్షయా
యా భావరచనా యోఽర్థస్తయా తద్బ్రహ్మ బ్రహ్మణి. 41

సముద్రము (పశాంతమైన) కణములు, కణికలు, వీచికలు, తరంగములు, ఫేనము, లహరులు, స్వాభావికముగ నీరేయగుటవలన నీట ప్రవేశించునట్లు శరీరము, ఇంద్రియవ్యాపారములు, భోగ్యవస్తువులు, విపత్సంపదలు, హర్షవిషాదభావముల యత్నము, ధర్మార్థకామములను పురుషార్థములు, బ్రహ్మముననే ప్రవేశించుచున్నవి.

సంస్థానరచనా చిత్రా బ్రహ్మణః కనకాదివ
నాన్యరూపా విమూఢానాం మృషైవ ద్విత్వభావనా. 42

బ్రహ్మమున జగత్తుయొక్క ఉనికి కనకమున ఆభరణాదులఁ గల్పించుటవంటిదే; ఈ చిత్రమింతకంటె వేఱొండుకాదు. ద్విత్వభావన మృషయే; ఇది మూఢులు కల్పించుకొనినది.

మనోబుద్ధిరహఙ్కారస్తన్మాత్రాణీన్ద్రియాణి చ
బ్రహ్మైవ సర్వం నానాత్మా సుఖం దుఃఖం న విద్యతే. 43

మనోబుద్ధ్యహంకారములు, తన్మాత్రలు, ఇంద్రియములు, సర్వము బ్రహ్మమే; బహు ఆత్మలుగాని, సుఖదుఃఖములుగాని లేవు.

అయం సోఽహమిదం చిత్తమిత్యాద్యర్థోత్థయా గిరా
శబ్దప్రతిశ్రవేణాద్రావివాత్మాత్మని జృమ్భతే. 44

కొండగుహాయందొసర్పబడిన ధ్వని ప్రతిధ్వనినీనుచు ద్విత్వభ్రాంతిని కలిగించునట్లు ఇది, నేను, ఆ చిత్తము మున్నగు వ్యర్థవాక్యములు (వాచారంభణము) ఆత్మయందు ద్వైత భ్రాంతిని గల్పించుచు లేచుచున్నవి.

బ్రహ్మైవాజ్ఞాతమజ్ఞత్వమభ్యాగత ఇవ స్థితమ్
తథా హి దృశ్యతే స్వప్నే చేతసాత్మాత్మనాత్మనః 45

ఎఱుంగబడని బ్రహ్మమే జీవజగద్భావము నందినట్లు కనంబడుచున్నది; ఇట్లు బహుత్వము నందుట అప్రసిద్ధముకాదు. స్వప్నమున ఒకే ఆత్మ తనంతట తానే బహురూపములదాల్చి, పరిభ్రమించుచు, కనంబడుచున్నది.

అభావితం బ్రహ్మతయా బ్రహ్మాజ్ఞానమలం భవేత్
అభావితం హేమతయా యథా హేమ చ మృద్భవేత్. 46

బ్రహ్మమని భావింపకున్న, బ్రహ్మమే (జ్ఞానమే) అజ్ఞానమగుచున్నది. (ప్రక్కనే బురదలో పడియున్న) సువర్ణమును సువర్ణమని భావింపకున్న, కర్దమమే యగుచున్నది.

స్వయం ప్రభుర్మహాత్మైవ బ్రహ్మ బ్రహ్మవిదో విదుః
అపరిజ్ఞాతమజ్ఞానమజ్ఞానమితి కథ్యతే. 47

ఉపర్యుక్తమగు భావన అజ్ఞులకే కలుగుచున్నది. కాని, తత్త్వజ్ఞులీ బ్రహ్మమును 'స్వయం ప్రభువు' (స్వయంజ్యోతిష్ట స్వభావము), 'మహాత్మ' అని ఎఱుగుదురు. అజ్ఞులే అజ్ఞాన మజ్ఞానమని వాకొనుచున్నారు.

జ్ఞాతం బ్రహ్మతయా బ్రహ్మ బ్రహ్మైవ భవతి క్షణాత్
జ్ఞాతం హేమతయా హేమ హేమైవ భవతి క్షణాత్. 48

బ్రహ్మమని ఎఱుగబడిన తక్షణమే, అయ్యది బ్రహ్మమగుచున్నది; స్వర్ణమని గ్రహింపబడిన వెంటనే అయ్యది స్వర్ణమేయగుచున్నది.

బ్రహ్మాత్మా సర్వశక్తిర్హి తద్యథా భావయత్యలమ్
నిర్హేతుకః స్వయం శక్త్యా తత్తథాశు ప్రపశ్యతి. 49

బ్రహ్మము సర్వశక్తిమంతమగుటవలన, అయ్యది తన్నుదానెట్లు భావించుకొనిన, అట్లే తనశక్తివలన తన్నుదా, అన్యకారణము లక్కఱలేకుండగ కాంచుచున్నది.

అకర్మకర్తృకరణ మకారణమనామయమ్
స్వయం ప్రభుం మహాత్మానం బ్రహ్మ బ్రహ్మవిదో విదుః. 50

కర్మ, కర్తృ, కరణ, కారణరహితమును, అనామయమును నగుటవలన, మహత్తమమగు ఈ బ్రహ్మమును బ్రహ్మవేత్తలు స్వయంప్రభువు (తనయంతటదానే ప్రభవించునది)గ గ్రహించుచున్నారు.

అపరిజ్ఞాతమజ్ఞానా మజ్ఞానమితి కథ్యతే
పరిజ్ఞాతం భవేజ్జ్ఞాన మజ్ఞానపరినాశనమ్. 51

అపరిజ్ఞాతమగు బ్రహ్మమే అజ్ఞానమనంబడుచున్నది; పరిజ్ఞాతమైన, జ్ఞానమనంబడుచున్నది. అజ్ఞానమును నాశనమొనర్చుచున్నది.

బన్ధురేవాపరిజ్ఞాతో హ్యబన్ధురితి కథ్యతే
పరిజ్ఞాతో భవేద్బన్ధురబన్ధుభ్రమనాశనాత్. 52

మిత్రునే మిత్రుడని గ్రహింపకున్న శత్రునివలె భావింపబడుచున్నాడు; గ్రహింపబడిన శత్రుభ్రమ (యను అజ్ఞానము) తొలగిపోయి మిత్రుడగుచున్నాడు.

ఇదం త్వయుక్తమిత్యన్తర్జ్ఞాతే సోదేతి భావనా
యస్మాదయుక్తాద్వైరస్యాద్యయా కిల విరజ్యతే. 53

కాని, సామాన్యముగ జీవజగత్తులులేని బ్రహ్మభావన విచారవైరాగ్యములు లేకుండుటవలన కలుగుచుండుటలేదు. జీవజగద్రూపము అయుక్తము, విచారాసహము (విచారించిన నిలబడదు), అని గ్రహించిన బ్రహ్మభావన ఉదయించును. శుక్తియందు రజతముండుట అసంభవమని

గ్రహించునట్లు జగత్తు బ్రహ్మమునందుండుట అసంగతమని గ్రహించిన, భోగ్యవస్తువులనుండి విరతి నందును.

ద్వైతం త్వసత్యమిత్యన్తర్జ్ఞాతే సోదేతి భావనా
తస్మాద్ద్వైతాచ్చ వైరస్యాద్వ్యయా కిల విరజ్యతే. 54

ద్వైత మసత్యమని గ్రహింపబడినయెడలనే, బ్రహ్మభావన ఉదయించును; పిదప ఇది సత్యము, అది మిథ్య అను ద్వైతభావనగూడ వీడి పరమవైరాగ్యము నాశ్రయించును.

అయం నాహమితి జ్ఞాతే స్ఫుటే సోదేతి భావనా
మిథ్యాహంకారతా తస్మాద్వ్యయా నూనం విరజ్యతే. 55

ఈ కార్యకరణసంఘాతమగు శరీరమును నేను కాను, అని గ్రహించిన బ్రహ్మభావన ఉదయించి, గ్రహణాగ్రహణకారణమగు అహంకారమును గూడ మిథ్యయని లోపింపజేయును. అప్పుడు, పురుషుడు పరమవైరాగ్యము నాశ్రయించును.

బ్రహ్మైవాహమితి జ్ఞానే సత్యే సోదేతి భావనా
తస్మిన్నతే నిజే రూపే యథాన్తః పరిలీయతే
సతి విస్తారజే తస్మిన్బ్రహ్మేదమితి వేద్మ్యహమ్. 56

'నేనే బ్రహ్మమును' అను జ్ఞానమున్న కలుగు భావనవలన మనుజుడు తనలో తాను విలీనమై పోవును.

త్వమహంత్వాదిబాధే తత్సదిత్యాది జగద్గతమ్
సత్యం సర్వప్రకారాఢ్యం బ్రహ్మేదమితి వేద్మ్యహమ్. 57
న మే దుఃఖం న కర్మాణి న మే మోహో న వాఞ్ఛితమ్

ఇదంతయు బ్రహ్మమేయను భావనయుండిన, నీవు, నేను అను బోధ బాధింపబడును. అప్పుడు, అస్తి, భాతి, ప్రియము, నామము, రూపము అని పంచవిధముల జెప్పబడు జగత్తును, తదంతర్గతములగు వస్తుజాలములును, ఏకరసమగు బ్రహ్మముగనే దోచును; పూర్వమువలె దుఃఖరూపముండదు. అప్పుడాతడు దుఃఖము, కర్మలు, మోహము తొలగిపోయినవానిగా గ్రహించును.

సమః స్వస్థో విశోకోఽస్మి బ్రహ్మాహమితి సత్యతా. 58
కలాకలఙ్కముక్తోఽస్మి సర్వమస్మి నిరామయః

సమత్వము నందితిని; స్వస్థుడను; శోకరహితుడను; వాస్తవమునకు నేనే బ్రహ్మమును; కల్పనలను కళంకమునుండి విముక్తుడై, నిరామయుడనై, సర్వాత్మభావమును బొందితిని.

న త్యజామి న వాఞ్ఛామి బ్రహ్మాహమితి సత్యతా. 59
అహం రక్తమహం మాంసమహమస్థ్న్యహం వపుః

నే నెద్దానినిత్యజించుటలేదు, గ్రహించుటలేదు. నేనే బ్రహ్మమనునదియే సత్యము! ఈ శరీముగూడ త్యాగార్హము కాదు. రక్తమాంసాస్థులు, శరీరమునుగూడ నేనే.

చిదహం చేతనం చాహం బ్రహ్మాహమితి సత్యతా. 60
ద్యౌరహం ఖమహం సార్కమహమాశా భువో౾ప్యహమ్

చిత్, చైతన్యములు నేనే బ్రహ్మము నేనే. అనునది నిజము. దివి, సూర్యయుతమగు ఆకాశము, భువిగూడ నేనే.

అహం ఘటపటాకారో బ్రహ్మాహమితి సత్యతా. 61
అహం తృణమహం చోర్వీ గుల్మో౾హం కాననాద్యహమ్
శైలసాగరసార్థో౾హం బ్రహ్మైకత్వం కిల స్థితమ్. 62
ఆదానదానసంకోచపూర్వికా భూతశక్తయః
సర్వమేవ చిదాత్మాస్మి బ్రహ్మణ్యాతతరూపధృక్ 63
లతాగుల్మాఙ్కురాదీనామహంసంభవనైషిణామ్.
చిదాత్మాన్తర్గతం శాన్తం పరం బ్రహ్మ రసాత్మకమ్. 64
యస్మిన్సర్వం యతః సర్వం యత్సర్వం సర్వతశ్చ యత్.
యో మతః సర్వ ఏకాత్మా పరం బ్రహ్మేతి నిశ్చయః. 65
చిదాత్మా బ్రహ్మ సత్సత్యమృతం జ్ఞ ఇతి నామభిః
ప్రోచ్యతే సర్వగం తత్త్వం చిన్మాత్ర చేత్యవర్జితమ్. 66
ఆభాసమాత్రమమలం సర్వభూతాత్మబోధకమ్
సర్వత్రావస్థితం శాన్తం చిద్బ్రహ్మేత్యనుభూయతే. 67
మనోబుద్ధీన్ద్రియవ్రాత సమస్తకలనాన్వితమ్
భేదం త్యక్త్వా స్వమాభాసం చిద్బ్రహ్మాహమనామయమ్. 68
శబ్దాదీనా మశేషాణాం కారణానాం జగత్స్థితేః
తత్త్వావకాశకం స్వచ్ఛం చిద్బ్రహ్మాస్మి న మే క్షయః. 69
అనారతగలత్స్వచ్ఛచిద్ధారాగహనాత్మకమ్

ఘటపటముల ఆకారముగూడ నేనే ; బ్రహ్మయే నేననుట సత్యము. భూమి, తృణములు, పొదలు, అడవులు, శైలములు, సాగరములు, ప్రాణులుగూడ నేనే, బ్రహ్మైకత్వమును బొందిన నేనే అట్లున్నాను. ఇచ్చుట, పుచ్చుకొనుట, ముడుచుకొనుట, నింపుట, అను ప్రాణిధర్మములుగూడ నేనే. బ్రహ్మైక్యమునంది చిదాత్మరూపమునందిన నేనే వివిధరూపముల ధరించి, లతాగుల్మాంకురముల చిగుర్ప నిచ్ఛించుచున్నాను. ఇవన్నియును చిదాత్మాంతర్గతములే. శాంతరసాత్మకమగు పరబ్రహ్మము నందే అన్నియును వెలయుచున్నవి. అదియే, అంతటను, అన్నిటను వెలయుచున్నది. సర్వమేకాత్మ, పరంబ్రహ్మ అను నిశ్చయజ్ఞానమును బడసినవాడు, చిదాత్మ, బ్రహ్మ, సత్, సత్యము అమృతము, జ్ఞాని అను నామముల పేర్కొనఁబడుచున్నాడు. సర్వగమును, చిన్మాత్రమును, చేత్యవర్జితమును, ఆభాసమాత్రమును, అమలమును, సర్వభూతాత్మ బోధకమును, సర్వత్ర వెలయునదియును, శాంతమును, వాస్తవతత్త్వమును నగు చిద్బ్రహ్మ అతనివలన అనుభవింపబడును. మఱియు నాతడు తన్ను, మనోబుద్ధ్యాది సమస్తేంద్రియ వ్యాపారముల అనుస్యూతమును, భేదరహితమును, సమప్రకాశమును, శబ్దా

దులగు (ఆకాశాది) అశేషజగత్కారణములకు మూలమును, అక్షయమును, ఇంద్రియద్వారముల నుండి వినిష్క్రమించు తెంపులేని చిద్ధారలకు ఆకరమును నగు అనామయ చిద్బ్రహ్మముగ భావించుకొనుము.

ఆలోకః సుమనోహరానాం చిద్బ్రహ్మాస్మ్యమృతం పరమ్. 70
అనారతగలద్రూపం నిత్యం చానుభవామృతమ్
అహం నిఃశేషచక్రాణి చిద్బ్రహ్మాహమలేపకమ్. 71
సుషుప్తసదృశం శాన్తమాలోక విమలాత్మకమ్
సంభోగోత్తమమాభాసం చిద్బ్రహ్మాస్మ్యపవాసనమ్. 72
ఖండాదిస్వాదుసంవిత్తిరీషన్మాత్ర తు తిష్ఠతి.
చిత్తాదిష్వవబుద్ధేషు తద్బ్రహ్మాహమచ్యుతః. 73
కాన్తాసంసక్తచిత్తస్య చన్ద్రే సముదితే సతి
చన్ద్రప్రత్యయసత్త్వాత్మ చిద్బ్రహ్మాహమనామయమ్. 74
భూమిష్ఠనరదృష్టీనాం లగ్నానాం ఖే నిశాకరే
యా ఖస్థా నను చిచ్ఛక్తిస్తచ్చిద్బ్రహ్మాస్మి నిర్మలమ్. 75
సుఖదుఃఖాదికలనావికలో నిర్మలస్తథా
సత్త్వానుభవరూపాత్మ చిద్బ్రహ్మాత్మాస్మి శాశ్వతః. 76
అసంస్తుతాధ్వగాలోకే మనస్యన్యత్ర సంస్థితే
యా ప్రతీతిరనాగస్కా తచ్చిద్బ్రహ్మాస్మి సర్వగః. 77
భూవార్యనిలబీజానాం సంబన్ధేఙ్కురకర్మసు
శక్తిరుద్గమనీయాన్తస్తచ్చిద్బ్రహ్మాహమాతతమ్. 78
ఖర్జూరనిమ్బలిమ్బానాం స్వయమాత్మని తిష్ఠతామ్
యా స్వాదసత్తా లీనాన్తస్తద్బ్రహ్మ చిదహం సమః. 79
ఖేదానన్దవిముక్తాన్తః సంవిత్తిర్మననోదయా
లాభాలాభవిధౌ తుల్యా చిద్బ్రహ్మాస్మి నిరామయమ్. 80

నేను యోగిపుంగవుల మౌనమువలననే ప్రకాశింపజేయఁబడు బ్రహ్మమును; నిత్యానుభవస్వరూపుడనగుటవలన, నా స్వరూపము నెవ్వరును తిరస్కరింపజాలరు. సమస్తకర్మచక్రములు నా వలననే ప్రవర్తింపఁబడుచున్నను, నేను నిర్లిప్తుడనగు చిద్బ్రహ్మమును. విమలమగు నా ప్రశాంతస్వరూపము, సుషుప్తిసదృశము. మనుష్యాదిగ హిరణ్యగర్భుని వఱకున్న భోగములన్నిటికంటె ఉత్తమమగుసంభోగ సుఖముగూడ ఈ ఆనందముయొక్క కణమాత్రమే. ఈ నా బ్రహ్మానందమునందలి అత్యంత తుచ్ఛాంశమే దేశకాలపరిచ్ఛిన్నములగు ఖండసుఖముల ఆస్వాదనలో నొకింత ప్రతిబింబించుచున్నది. చంద్రోదయమైన, కాముకికి ఆహ్లాదకరమగు కాంతాదర్శనము, చంద్రదర్శనముల మధ్యనుండు అవిచ్ఛిన్నసత్తాత్మకమగు నిర్విషయ చిద్రూప-ఆనందముగూడ నేనే రా(తి. ఆకాశమున చంద్రోదయమైన, దానిని నేల మీదనుండి జూచు నరుల వీక్షణము, చంద్రుడు వీటి నడుమ కలుగు

నిర్విషయ చిదానందమే నేను. ఆకాశశాంతరాళమున చిచ్ఛక్తి, చిద్బ్రహ్మము వెలయునట్లు, సుఖదుఃఖముల నుద్విగ్నమవని పట్ల, నిష్కలమగు ఆత్మస్వరూపము గోచరించుచున్నది. శాశ్వతమును, సత్యానుభవరూప చిద్బ్రహ్మమును నేనే. దూరముననున్న వస్తువును దర్శింపజేయు చిత్-శక్తిని నేనే. పంచభూతముల మేళవింపజేసి కార్యముల వెలువరింపజేయు చిత్-శక్తిగూడ నేనే. ఖర్జూరాది వృక్షముల అంతర్లీనమై వెలయు స్వాదు అను చిత్-శక్తిగూడ నేనే. ఏ చిత్-శక్తి సామాన్యముగ సుఖదుఃఖములననుభవించుచున్నదో అయ్యదియే శాస్త్రసంస్కృతమై సుఖదుఃఖవినిర్ముక్తమైన బ్రహ్మమనంబడుచున్నది.

యావద్భూమ్యర్కమేతావద్దృష్టిసూత్రం యదాతతమ్
తన్మధ్యసదృశం శాన్తం నిర్మలం చిదహం తతమ్. 81
జాగ్రత్యపి సుషుప్తేఽపి తత్స్వప్నేఽపి తథోదితమ్
తుర్యం రూపమనాద్యన్తం చిద్బ్రహ్మాహమనామయమ్. 82
పుంసాం క్షేత్రశతోత్థానామిక్షూణాం స్వాదువత్స్థితమ్
సర్వేషామేకరూపం తచ్చిద్బ్రహ్మాస్మి సమః స్థితః. 83
సర్వగా ప్రకృతా స్వచ్ఛరూపా భానోరివ ప్రభా
ఆలోకకారిణీ కాన్తా చిద్బ్రహ్మేదమహం తతమ్. 84
సంభోగానన్దలవవదమృతాస్వాదశక్తివత్
స్వానుభూత్యేకమాత్రం యచ్చిద్బ్రహ్మాస్మి తదవ్యయమ్. 85
ప్రోతాఙ్గమపి గుప్తాస్యం దేహే తన్తుర్బిసే యథా
ఛేదే భేదే స్ఫురద్రూపం చిద్బ్రహ్మాహమనామయమ్. 86
ఆక్రాన్తభువనాప్యభ్రభమా లేవ స్పన్దశాలినీ
దుర్లక్ష్యాణుమయాకారా చిచ్ఛక్తిరహమాతతా. 87
అనుభూతిమయా న్తస్థస్నేహమాత్రోపలక్షితా
క్షీరాద్ఘృతస్య సత్తేవ చిదహం క్షయవర్జితా. 88
కటకాఙ్గదకేయూరరచనా తదతన్మయీ
హేమ్నీవ సంస్థితా దేహే చిద్బ్రహ్మాత్మాస్మి సర్వగః. 89
పదార్థౌఘస్య శైలాదేర్బహిరన్తశ్చ సర్వదా
సత్తాసామాన్యరూపేణ యా చితోఽహమలేపకః. 90

లాభాలాభముల, సుఖదుఃఖముల నందక సమత్వమును వహించియుండు చిద్బ్రహ్మమును నేను. భూమిసూర్యులమధ్య (ఏదైన వస్తువును వీక్షింపగోరినప్పుడు) ఉండు దృష్టిసూత్రమున వెలయు నిర్మల శాంత చిత్స్వరూపముగూడ నేనే. జాగ్రత్స్వప్నసుషుప్తులను అవస్థాత్రయముల వెలయు అనాద్యంతతురీయరూపమగు అనామయ చిద్బ్రహ్మముగూడ నేనే; విభిన్న క్షేత్రముల (జీవపరమున శరీరమని ధ్వని) జనించు ఇక్షుఖండముల నొకే మాధుర్యమయసత్తయుండునట్లు, పురుషులందఱిలోను ఒకేమాదిరిగ సమస్థితిని వెలయు చిద్బ్రహ్మమే నేను. సూర్యకిరణముల కాంతివలె నేను స్వచ్ఛుడనై,

సర్వగతుడనై వెలయుచున్నాను. ప్రకాశమంతమగు నా చిద్రూప మత్యంతమనోహరము, సంభోగ సుఖలవము, అమృతాస్వాదనములవలె, అవ్యయమగు నా చిద్బ్రహ్మస్వరూపము, కేవలము ఏకమాత్ర స్వానుభూతిగోచరము. తామరతూడుల సన్ననిదారము కనబడకుండనుండి దానిని నిలుపునట్లు, శరీరము నందంతట వ్యాపించి గుప్తముగనుండి; మరల తామతూడును తుంపినదారము వెలువడునట్లు విచారించి శరీరభ్రాంతిని త్రుంపిన వెలువడు చిచ్ఛక్తిని నేనే. సమస్తభువనముల నాక్రమించుకొనియున్నను మేఘమాలను స్పందింపజేయు అత్యంతసూక్ష్మమును, దుర్లక్ష్యమును అగు చిత్-శక్తిని నేనే. అనుభూతియోగ్యమును అంతఃస్నేహమాత్రోపలక్షితమునునై క్షీరమునందలి ఘృతమువలె వెలయుచు మృదులమగు పరమప్రేమాస్పదత్వమున వెలయు చిచ్ఛక్తినిగూడ నేనే. క్షీరమున ఘృతము తెంపు లేకుండునట్లు, నా చిత్-సత్త క్షయవర్జితము; హేమవికారములగు ఆభరణములు తన్మయములే కదా! పర్వతాది పదార్థముల లోపల, బయట, సర్వదా సర్వగనై వెలయు చిత్-సత్తగూడ నేనే.

సర్వాసామనుభూతీనామాదర్శో యో హ్యకృత్రిమః
అగమ్యో మలలేఖానాం తచ్చిత్తత్త్వమహం మహత్. 91

సర్వసంకల్పఫలదం సర్వతేజఃప్రకాశకమ్
సర్వోపాదేయసీమాన్తం చిదాత్మానముపాస్మహే. 92

సర్వావయవవిశ్రాన్త సమస్తావయవాతిగమ్
అనారతకచద్రూపం చిదాత్మానముపాస్మహే. 93

ఘటే పటే తటే కూపే స్పన్దమానం సదా తనౌ
జాగ్రత్యపిసుషుప్తస్థం చిదాత్మాన ముపాస్మహే. 94

ఉష్ణమగ్నౌ హిమే శీతం మృష్టమన్నే శితం క్షురే
కృష్ణం ధ్వాన్తే సితం చన్ద్రే చిదాత్మాన ముపాస్మహే. 95

ఆలోకం బహిరన్తస్థం చితం చ స్వాత్మవస్తుని
అదూరమపి దూరస్థం చిదాత్మాన ముపాస్మహే. 96

మాధుర్యాదిషు మాధుర్యం తీక్ష్ణాదిషు చ తీక్ష్ణతామ్
గతం పదార్థజాతేషు చిదాత్మాన ముపాస్మహే. 97

జాగ్రత్స్వప్నసుషుప్తేషు తుర్యాతుర్యాతిగే పదే
సమం సదైవ సర్వత్ర చిదాత్మాన ముపాస్మహే. 98

ప్రశాన్తసర్వసంకల్పం విగతాఖిలకౌతుకమ్
విగతాశేషసంరమ్భం చిదాత్మాన ముపాస్మహే. 99

నిష్కౌతుకం నిరారమ్భం నిరీహం సర్వమేవ చ
నిరంశం నిరహంకారం చిదాత్మాన ముపాస్మహే. 100

సర్వస్యాన్తఃస్థితం సర్వమప్యపారైకరూపిణమ్
అపర్యన్తచిదారమ్భం చిదాత్మాన ముపాగతః. 101

సమానసత్తనుబొని, నిర్లేపమై, సర్వానుభూతులకు ఆకరమగు దర్పణమును నేను. మాలిన్యరేఖలకు తావులేని శుద్ధచిత్ - స్వరూపుడను నేను. సర్వసంకల్పములను (సత్యసంకల్పుడగుటవలన) ఫలింపజేయునట్టియు, సర్వతేజముల ప్రకాశింపజేయునట్టియు, సర్వలోభనీయవస్తువుల పరాకాష్ఠయునగు చిదాత్మ నుపాసించుచున్నాను. సర్వేంద్రియముల కాధారమును, సర్వేంద్రియముల కతీతమును, స్వరూపచ్యుతిరహితమును నగు చిదా నుపాసించుచున్నాము. ఘటపటతటకూపముల సద్రూపమున వెలయునదియును, అండజ, స్వేదజ, జరాయుజ, ఉద్భిజములను చతుర్విధప్రాణుల చలించునదియును, జాగ్రద్దశయందు గూడ నిద్రితమువలె, నిర్వికారముగ నుండునదియునగు చిదాత్మ నుపాసించుచున్నారము. అగ్నియందు ఉష్ణమును, హిమమున శైత్యమును, అన్నమున మధురిమయును, కత్తియందు వాడియును, చీకటియందు నలుపును, చంద్రునియందు తెలుపునునగు చిదాత్మ నుపాసించుచున్నారము. వెలుపల, లోపల వెలయు వెలుగును, తనయందే వెలయుచున్నదియును, దగ్గఱనే యున్నను అజ్ఞానమువలన దూరముగ తోచునదియును నగు చిదాత్మ నుపాసించుచున్నారము. మధురవస్తువులలో మాధుర్యమును, తీక్ష్ణ (కారపు) వస్తువులలో తైక్ష్ణ్యమునునై పదార్థసమూహముల నన్నిటి వెలయు చిదాత్మ నుపాసించుచున్నారము. జాగ్రత్స్వప్నసుషుప్తులయందు, తురీయతురీయాతీతముల సర్వత్ర సమభావమున వెలయు చిదాత్మ నుపాసించుచున్నాము. సంకల్పశూన్యమును, కామవిహీనమును, క్రోధరహితమును నగు చిదాత్మ నుపాసించుచున్నారము. భోగాకాంక్షారహితమును, యత్నరహితమును, చేష్టావిహీనమును, నిరంశమును, నిరహంకారమును, సర్వమయమును నగు చిదాత్మ నుపాసించుచున్నారము. అన్నిట వెలయునదియు, వెలయుచున్నను నిర్లిప్తమును, ఏకరసస్వరూపమును నగు చిదాత్మ నుపాసించుచున్నారము.

త్రైలోక్యదేహముక్తానాం తన్తుమున్నతమాతతమ్
ప్రచారసంకోచకరం చిదాత్మాన ముపాగతః. 102
లీనమన్తర్బహిః స్వాప్తాన్క్రోడీకృత్య జగత్ఖగాన్
చిత్రం బృహజ్జాలమివ చిదాత్మాన ముపాగతః. 103
సర్వం యత్రేదమస్త్యేవ నాస్త్యేవ చ మనాగపి
సదసద్రూపమేకం తం చిదాత్మాన ముపాగతః. 104

అన్నిట ప్రతిబింబించి చలింపజేయునదియును, ముక్తులై త్రిలోకముల వెలయు పురుషుల సమూహమను తంతువులతో గూడినదియును, జాగ్రత్స్వప్నముల సంచరించి, సుషుప్తియందు సంకోచమందునదియును, బహిరంతరముల తనచే వ్యాపింపబడిన జగత్తులను పక్షులను క్రోడమున (అంతరమున) నుంచుకొని ప్రచ్ఛన్నముగ విచిత్రరూపమున పెద్దదగువలను బన్నినవానివలె వెలయు చిదాత్మను నేను బొందితిని, ఇంతయు (మూఢదృష్టితో బరికించిన) దానియందున్నది; (జ్ఞానదృష్టితో బరికించిన) ఒకించుకయును లేదు.

పరమప్రత్యయం పూర్ణమాస్పదం సర్వసంపదామ్
సర్వాకారవిహారస్థం చిదాత్మాన ముపాగతః. 105
స్నేహాధారమథోఽశాన్తం జడవాతాహతిభ్రమైః
యుక్తం ముక్తం చ చిద్దీపం బహిరన్త ముపాస్మహే. 106

హృత్సరః పద్మినీకన్దం తన్తుం సర్వాఙ్గసున్దరమ్
జనతాజీవనోపాయం చిదాత్మాన ముపాగతః. 107
అక్షీరార్ణవసంభూతమశశాఙ్కముపస్థితమ్
అహార్యమమృతం సత్యం చిదాత్మాన ముపాస్మహే. 108
శబ్దరూపరసస్పర్శగన్ధైరాభాసమాగతమ్
తైరేవ రహితం శాన్తం చిదాత్మాన ముపాగతః. 109
ఆకాశకోశవిశదం సర్వలోకస్య రఞ్జనమ్
న రఞ్జనం న చాకాశం చిదాత్మాన ముపాగతః. 110
మహామహిమ్నా సహితం రహితం సర్వభూతిభిః
కర్తృత్వే వాప్యకర్తారం చిదాత్మాన ముపాగతః. 111

సృష్టికాలమున సర్వ సత్తల గల్పించు సద్రూపమున ప్రళయకాలమున అన్ని సత్తల విలోపింపజేయు అసద్రూపమున, పరమ విశ్వాసార్హ్యమగు చిదేకరసమును, సర్వసుఖలవముల కాధారమునునగు చిదాత్మత్వమును నేను పొందితిని. సర్వరూపముల విహరించునదియును స్నేహాధారమై అధోభాగమున చల్లగనుండి, జడములగు వాతాదులవలన కదలింపబడి చలించుచు, అవి లేనప్పుడు చలనరహితమైయుండు దీపకళికవలె నిరుపాధికప్రేమ కాధారమై జడదేహములనుండి ప్రాణముల అధ్యాసవలన గొట్టబడుచున్నట్లు అవివేకదృష్టి కగుపించుచు, జ్ఞానదృష్టి కవేమియులేక ముక్తస్వరూపమున గోచరించు చిద్దీపమును సర్వత్ర ఉపాసించుచున్నారము. హృత్సరోపద్మమున రహస్యముగ వెలయునదియును, ఆధారభూతములగు హస్తపాదాదులను తంతువుల సర్వాంగసుందరమును, జనులను పద్మములకు జీవన (నీరు) ప్రాయమైనదియునగు చిదాత్మ-తత్త్వమును బొందితిని ఈ చిదాత్మయను అమృతము, పురాణ ప్రసిద్ధమగు అమృతమువలె క్షీరసముద్రమున బుట్టలేదు; దీనిని తరచునప్పుడు చంద్రుడుదయింపలేదు; దీనిని గరుడాదులు హరింపజాలరు. ఇట్టి సత్యామృతమును ఉపాసించుచున్నారము. శబ్దస్పర్శరూపరస గంధములవలన కించిన్మాత్రముగ అభివ్యక్తీకరింపబడినదియును, తచ్ఛూన్యమున శాంతమునునగు చిదాత్మను బొందితిని. ఆకాశకోశమువలె విశదమును (బట్టబయలును), సర్వలోకముల రంజింపజేయునదియును (రంగువేయునది), రంజనము (రంగు) కాని, ఆకాశముగాని కానిదియును నగు చిదాత్మను బొందితిని, మహామహిమశాలియయ్యు (యోగసిద్ధులగు అష్టవిధ) ఐశ్వర్యరహితమును, కర్తయయ్యు అకర్తయునగు చిదాత్మను బొందితిని.

అఖిలమిదమహం మమైవ సర్వం
త్వహమపి నాహమథేతరచ్చ నాహమ్,
ఇతి విదితవతో జగత్కృతం మే
స్థిరమథవాస్తు గతజ్వరో భవామి. 112

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జీవన్ముక్తనిశ్చయ యోగోపదేశో నామ ఏకాదశః సర్గః ॥ 11 ॥

నేను నిఖిల ప్రపంచరూపుడనైనను ఇదంతయు నాదేయైనను అహంకారవిహీనుడనై నేను ఒప్పుచున్నాను; అందువలన నేనేమియును అగుటలేదు. (మొదటిది తాదాత్మ్య అధ్యారోపము, రెండవది సంసర్గాధ్యారోపము, మూడవది అపవాదము; ఈ మూడు విభిన్నదృష్టులు మూడు విధముల జెప్పబడినవి అని గ్రహింపవలెను.) ఇట్లు నేను చక్కగ తత్త్వమును గ్రహించి, విగతజ్వరుడనైతిని. ఈ జగత్తు కృత్రిమమగు మాయామయమే యగుగాక, లేక స్థిరమగు ఆత్మవస్తువే యగుగాక!

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
జీవన్ముక్తనిశ్చయ యోగోపదేశమను
ఏకాదశ సర్గము ॥ 11 ॥

---

## ద్వాదశః సర్గః.

---

[బహిర్నీరాగనిఃసఙ్గామన్తఃస్వచ్ఛాత్మభాస్వరామ్
జనకాదిస్థితిం రామో గురుప్రోక్తామిహాగ్రహీత్.

బాహ్యమున రాగ, సంగరహితమును, అంతఃకరణమున స్వచ్ఛమగు ఆత్మాకారముగ ప్రకాశించునదియునగు గురుప్రోక్తమైన జనకాదుల స్థితిని శ్రీరామచంద్రుడు గ్రహించుట యిందు వర్ణింపబడినది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతి నిశ్చయవన్తస్తే మహాన్తో విగతైనసః
సత్యాః సత్యే పదే శాన్తే సమే సుఖమవస్థితాః. 1

శ్రీ వసిష్ఠుడు:—ఇట్లు జనకాదులగు జీవన్ముక్త పురుషులు నిశ్చయమొనర్చుకొని, విగతజ్వరులై, శాంతమును సత్యమునునగు సమపదమున సుఖముగ వెలయుచున్నారు.

ఇతి పూర్ణధియో ధీరాః సమనీరాగచేతసః
న నిన్దన్తి న నన్దన్తి జీవితం మరణం తథా. 2

ఈ తీరుగ పరిపూర్ణాత్మతను బొందిన ఆ ధీరులు సమబుద్ధులై ఆసక్తిని త్యజించి, జీవిత మరణములను, నిందాప్రశంసలను నొనర్పకుండమన్నారు.

ఇత్యలక్ష్యచమత్కారా నారాయణభుజా ఇవ
ఋజవః స్ఖలితాకారా అపరా ఇవ మేరవః. 3

ఇట్లు వారు, సూక్ష్మలక్ష్యముల భేదించు నారాయణుని బాహుదండములవలెనున్నను (సూక్ష్మమగు మోక్షమును బొందుటవలన) మేరువువలె ధీరులైనను (దానియున్న ఔద్ధత్యమునుండి విడివడి) సమస్వభావులై వెలయుచున్నారు,

రేమిరే వనఖణ్డేషు ద్వీపేషు నగరేషు చ
దేవోపవనమాలాసు స్వర్గేషు చ సురా ఇవ. 4

ఇట్టి సమదృష్టిని అవలంబించియే వారు వనముల, ద్వీపముల, నగరముల, దేవోద్యానముల, స్వర్గమునందలి దేవతలవలె విహరించిరి.

శ్లో॥ కుసుమపూర్ణాసు దోలాన్దోలచలాసు చ
విచిత్రవనలేఖాసు మేరుశృఙ్గశిఖాసు చ. 5

పువ్వులతోఁగూడిన తూగుటుయ్యెలలలోను, విచిత్ర శోభితములగు వనములలోను, మేరుశిఖరముల, విహరించిరి.

చక్రుర్విజితశత్రూణి చామరచ్ఛత్రవన్తి చ
విచిత్రార్థాని రాజ్యాని చిత్రాచారమయాని చ. 6

శత్రురహితములును, చామరచ్ఛత్రాది శుభలక్షణయుతములును, ధర్మార్థకామములతో గూడినవియును, వివిధక్రీడలతో గూడుకొనినవియునునగు రాజ్యముల బాలించిరి.

అనుజగ్మురి మాన్సర్వాన్నానాచారవిచేష్టితాన్
శ్రుతిస్మృత్యుదితారమ్యాభిమితికర్తవ్యతామితి. 7

వేదప్రోక్తములును, స్మృత్యుపబృంహితములును, శిష్టాచారసమ్మతములునునగు వివిధ క్రియలను తాము ఆచరించుచు ఇతరుల నాచరింపజేసిరి.

ఈదృశీ రమణీయేషు లలనాహాస్యహారిషు
విహారాహారరమ్యేషు భోగాఽఽభోగేషు భూషితాః. 8

ఈ విధములగు స్త్ర్యాది భోగముల, తదితరములగు రమ్యభోగసమూహముల వారు విహరించిరి.

వివిశుశ్చారుచూతాసు మన్దారవలితాసు చ
అప్సరోగీతపూర్ణాసు నన్దనోద్యానభూమిషు. 9

వారు ఆమ్రవనములలోను, మందార - ఉద్యానవనములలోను, నందన - కాననమనను అప్సరోగీతముల వినుచు, మైమరచియుండిరి.

సచరాచరభూతేషు విశ్రాన్తాఖిలజన్తుషు
యజ్ఞక్రియాకలాపేషు గార్హస్థ్యేషు యథాక్రమమ్. 10

త్రిభువనములనున్న స్థావరజంగమాది భూతముల సుఖమునకు గారణమగు యజ్ఞయాగాదులకు గారణమగు గార్హస్థ్యమునుగూడ నిర్వహించిరి.

తేరుర్హతగజేన్ద్రాసు భ్రాన్తభూరిశివాసు చ
భేరీభాంకారభీమాసు సంగ్రామార్ణవవీథిషు. 11

మృతగజముల కాకరమై, సృగాలవిహరణమున కాస్పదమై, భేరీభాంకారములతో భయంకరములగు యుద్ధ - సముద్ర - వీథులగూడ విహరించిరి.

తస్థుః పరుషచిత్తాసు హృతవిత్తోద్ధతాసు చ
సంరమ్భక్షోభరౌద్రీషు సర్వాసు ద్వన్ద్వరీతిషు. 12

సామాన్యపురుషబుద్ధిని హరింపజేయు సంరంభముతో గూడిన ద్వంద్వయుద్ధములగూడ వారాచరించిరి.

మనస్తేషాంతు నీరాగమనుపాధి గతభ్రమమ్
అసక్తం ముక్తమాశాన్తం పరం సత్త్వపదం గతమ్. 13

ఇట్లు, వివిధ కార్యముల నొనర్చుచున్నను వారి మనస్సు ఆసక్తిరహితమై, ఉపాధి శూన్యమును, శాంతమునునగు సత్త్వపదముననే యుండెను.

న మమజ్జుః క్వచిదపి సంకటేషు మహాత్స్వపి
మహాదభ్యుపయాతేషు కులశైలాః సరస్స్వివ. 14

వారెన్నడును సంకటములగాని, మహదైశ్వర్యములగాని, కులపర్వతములు సముద్రమున మునుగనట్లు, అవి ఎంతగొప్పవైనను నిమజ్జితులు కాకుండిరి.

నోల్లలాస విలాసిన్యా శ్రియా పరమకాన్తయా
పరిపూర్ణేన్దులక్ష్మ్యేవ జలరాశీ రఘూద్వహ. 15

రఘూద్వహా ! పూర్ణచంద్రుడుదయించిన, జలరాశి ఉల్లసించునట్లు, రమణీయమును విలాసపూర్ణమునునగు రాజ్యలక్ష్మిని బొందియు వా రుల్లసింపకుండిరి.

న మమ్లా దుఃఖశోకేన గ్రీష్మేణేవ వనస్థలమ్
జహర్ష చ న భోగౌఘైరవశ్యాయైరివౌషధిః. 16

గ్రీష్మకాలమున వనస్థలి పరిమ్లానమగునట్లు, దుఃఖశోకముల వారు మ్లానదశనందలేదు, తుషారపాతమున వనలతలు వికసించునట్లు, విషయభోగసమూహముల వారానందింపలేదు.

తే హి కేవలమవ్యగ్రాః కుర్వన్తః కామమఞ్జరీః
ఇష్టానిష్టఫలం రామ నాభిలేషుర్న తత్యజుః. 17

రామా ! ఇట్లు వారు కర్తృత్వాభిమానమును త్యజించి, కామ - మంజరిని (=గెలను) వారు సంపూర్ణముగ అనుభవించిరి. ఇష్టానిష్టఫలముల త్యజింపలేదు; లేక గ్రహింపనులేదు.

నోదగుః కార్యసంపత్త్యా వాక్రాన్తా నాస్తమాయయుః
జహృషుర్న సుఖప్రాప్తౌ మమ్లుర్నైవ చ సంకటే. 18

(శత్రుజయాది) కార్యముల నాచరించుచు వారుత్సాహమునుబొందలేదు. లేక, శత్రువుల వలన నాక్రమింపబడి కొంకునుబొందలేదు. సుఖమునుబొంది హర్షించలేదు, విషాదమును బొంది దుఃఖించనులేదు.

ముముహుర్న విమోహేషు న మమజ్జుర్విపత్క్రమైః
న జహర్షుః శుభైః శోకై రురుదుర్న భవానివ. 19

విపత్తులబడి మోహము నందలేదు; విపత్తులబడసి అభిభూతులవలేదు. శుభములబొంది ఆనందింపలేదు. లేక, అశుభముల బొంది, నీవలె దుఃఖింపను లేదు.

ప్రాకృతాచారసంప్రాప్తే కుర్వన్తః కర్మ కేవలమ్
స్థితా విగతసంరమ్భమపరా ఇవ మేరవః. 20

తమతమ వర్ణాశ్రమములకు జెందిన కర్మల నాచరించు, నిష్క్రియమగు అపరమేరువువలె ధీరత్వమును వహించియుండిరి,

తాం త్వం దృష్టిమవష్టభ్య రాఘవాఽఘవినాశినీమ్
అనహంకృత్యహంకారో విహరస్వ యథాక్రమమ్. 21

రామా! నీవుగూడ పాపనాశనమగు ఆ దృష్టినే అవలంబించి, సామాన్య అహంభావమును వీడి, ఆత్మాహంకారమునుబూని, పైనజెప్పినతీరుగ విహరింపుము.

యథాభూతామిమామేవ పశ్యన్సర్గపరమ్పరామ్
మేరుస్థితోఽబ్ధిగమ్భీరః సమమాస్స్వ గతభ్రమః. 22

ఈ సర్గపరంపరను యథార్థదృష్టితో బరికించుచు, మేరువువలె స్థిరత్వమును, సముద్రమువలె గాంభీర్యమును వహించి భ్రమరహితుడవై వెలయుము.

చిన్మాత్రం సర్వమేవేదమిత్థమాభాసతాం గతమ్
నేహ సత్యమసత్యం వా క్వచిదస్తి న కించన. 23

ప్రకాశమునంది ఈ కనబడునదంతయు, చైతన్యమాత్రమే; ఇట సత్యాసత్యములుగాని లేక వేఱొండుగాని, మఱేమియునుగాని లేవు.

మహాత్మామలమాలమ్బ్య త్యక్త్వేదమవహేలయా
అసక్తబుద్ధిః సర్వత్ర భవ భవ్య భవక్షయీ. 24

బ్రహ్మాత్వము నవలంబించి, ఈ భ్రాంతి బుద్ధిని త్యజించి, అనాసక్తబుద్ధివై, సర్వత్ర పరిలక్షితమగు ఈ సంసారమును క్షయమొనర్పుము.

కిం రోదిషి ఘనోద్వేగం మూఢవచ్చానుశోచసి
భ్రమస్యుద్భ్రాన్తచిత్తస్య సౌమ్యావర్తే తృణం యథా. 25

సౌమ్యా! ఉద్విగ్నుడవై నీవేల మూఢునివలె రోదించుచున్నావు.? ఉద్భ్రాంతచిత్తమున, భ్రమావర్తముల తృణమువలె తిరుగాడుచుంటివేల?

శ్రీరామ ఉవాచ :—

అహో న భగవన్నూనం సమ్యగ్జాతమలక్షయః
త్వత్ప్రసాదాత్ప్రబుద్ధోఽస్మి సూర్యసఙ్గాదివామ్బుజమ్. 26

శ్రీరాముడు:—భగవంతుడా! తమ అనుగ్రహమువలన ఇప్పుడే నేను, సూర్యసంగమమును బడసిన పద్మమువలె, ప్రబోధితుడనైతిని. అహా! ఆశ్చర్యము! నా మోహమంతయు తొలగిపోయినది.

భ్రాన్తిరస్తంగతా నూనం మిహికా శరదీవ మే
సంశాన్తాఖిలసందేహః కరిష్యే వచనం తవ. 27

శరత్కాల - తుహినమువలె నా భ్రాంతి అంతయు నశించినది; నా సందేహములన్నియు తొలగినవి. ఇక నీవు చెప్పినట్లొనర్తును.

వ్యపగతమదమోహో మానమాత్సర్యముక్త
శ్చిరతరముదితాత్మా శాన శోకశిరేణ

పునరసుఖమగచ్ఛన్స్వచ్ఛమైకాన్తబుద్ధ్యా
యదిహ వదసి సాధో తత్కరిష్యేఽవిశఙ్కం. 28

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జీవన్ముక్తసంశయనిరూపణం నామ ద్వాదశః సర్గః ॥ 12 ॥

సాధో! ఇప్పుడు నా మదమోహమాత్సర్యములన్నియు తొలగినవి; నా శోక మిన్నాళ్లకు తీరినది; ఆత్మస్వరూపమును బొందితిని. ఇక నాకు 'బద్ధుడను' అను భ్రమ లేదు. ఏకాంతబుద్ధితో రాజ్యపాలనాదికమునుగాని, లేక, ఈ జ్ఞానమును పెంపొందింపజేసుకొనుటగాని - మీరేదానిని ఆజ్ఞాపించిన దాని నొనర్తును.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున జీవన్ముక్త - సంశయనిరూపణమను ద్వాదశసర్గము ॥ 12 ॥

---

## త్రయోదశః సర్గః.

---

[వర్ణితస్తత్త్వబోధేన వాసనావిలయక్రమః
ప్రాణరోధేన తం వక్తుం పీఠికాత్రోపరచ్యతే.

వాసనాక్షయము తత్త్వజ్ఞానముచే గల్గుట వెనుక చెప్పబడెను. ప్రాణనిరోధముచే వాసనాక్షయమును వచించుటకిందు భూమిక యొనర్పబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

సమ్యగ్జ్ఞానవిలాసేన వాసనావిలయోదయే
జీవన్ముక్తపదే బ్రహ్మన్నూనం విశ్రాన్తవానహమ్. 1

శ్రీరాముడు: వాసనాక్షయపూర్వకముగ సమ్యక్ - జ్ఞానఫలమగు జీవన్ముక్తపదమున నేను సంపూర్ణముగ విశ్రమించితిని.

ప్రాణస్పన్దనిరోధేన వాసనావిలయోదయే
జీవన్ముక్తపదే బ్రహ్మన్వద విశ్రమ్యతే కథమ్. 2

ప్రాణస్పందనమును నిరోధింపగలుగు వాసనాక్షయమునుబొంది, జీవన్ముక్తిని బొందు తీరును జెప్పుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సంసారోత్తరణే యుక్తిర్యోగశబ్దేన కథ్యతే
తాం విద్ధి ద్విప్రకారాం త్వం చిత్తోపశమధర్మిణీమ్. 3

శ్రీవసిష్ఠుడు: — సంసారోత్తరణోపాయమే 'యోగము' అనంబడుచున్నది. చిత్తము నుపశమింపజేయు ఆయోగము రెండువిధములు, (హఠ, రాజయోగములు.)

ఆత్మజ్ఞానం ప్రకారోఽస్యా ఏకః ప్రకటితో భువి
ద్వితీయః ప్రాణసంరోధః శృణు యోఽయం మయోచ్యతే. 4

జ్ఞానవిచారమను ఆత్మజ్ఞానోపాయము ఒకటి విశదముగ జెప్పఁబడినది రెండవదగు ప్రాణనిరోధమును వినుము.

శ్రీరామ ఉవాచ :—

సులభత్వాదదుఃఖత్వాత్కతరః శోభనోఽనయోః
యేనావగతమాత్రేణ భూయః క్షోభో న బాధతే. 5

శ్రీరాముడు :— ఈ రెండింటిలో (జ్ఞానవిచార, ప్రాణనిరోధములలో) నెయ్యది తేలిక? దేనియందు క్లేశములు తక్కువ? ఎయ్యది రమ్యము? దేనిని తెలిసికొనినమాత్రముననే దుఃఖము దూరమగునో? తెలియజెప్పుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ప్రకారౌ ద్వావపి ప్రోక్తౌ యోగశబ్దేన యద్యపి
తథాపి రూఢిమాయాతః ప్రాణయుక్తావసౌ భృశమ్. 6

శ్రీ వసిష్ఠుఁడు :—జ్ఞానవిచారము, ప్రాణనిరోధముల రెంటిని శబ్దయోగమున వ్యవహరించినను యోగశబ్దము ప్రాణనిరోధముననే రూఢము.

ఏకో యోగ స్తథా జ్ఞానం సంసారోత్తరణక్రమే
సమావుపాయౌ ద్వావేవ ప్రోక్తావేకఫలప్రదౌ. 7

సంసార – ఉత్తరణమునకు జ్ఞానము, యోగము, ఈ రెండును రెండు ఉపాయములుగ జెప్పబడినవి, ఈ రెంటిచే నొకే ఫలము చేకూరును.

అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాననిశ్చయః
మమ త్వభిమతః సాధో సుసాధ్యో జ్ఞాననిశ్చయః 8

కొందఱికి యోగ మసాధ్యము; కొందఱికి జ్ఞానవిచార మసాధ్యము. (అధికారినిబట్టి ఈ రెండును చెప్పబడినవి). కాని సాధో! జ్ఞానవిచారము సుసాధ్యమేయని నా తలంపు.

అజ్ఞానం పునరజ్ఞాతం స్వప్నేష్వపి న తద్భవేత్
జ్ఞానం సర్వాస్వవస్థాసు నిత్యమేవ ప్రవర్తతే. 9

వివేకవిచారమున అజ్ఞానమొక్కపరి దూరమొనర్పఁబడిన, స్వప్నమునగూడ మరలనుద్భవింపదు. జ్ఞానము సర్వావస్థల నిత్యమై వెలుగుచున్నది. కాన, దానికొఱకై ఎట్టి ఆర్భాటము నొనర్ప వలసిన అవసరములేదు.

ధారణాసనదేశాదిసాధ్యత్వేన సుసాధ్యతామ్
నాయాతి యోగో హ్యథవావికల్పో నైవ శోభనః. 10

ఇక యోగమన్ననో, దాన ధారణ, ఆసనము, ప్రదేశముయొక్క అనుకూల్యమమున్నగు నియమములబట్టి, సుసాధ్యముకాదు. 'తీవ్రసంవేగము' ఉన్నవారలకు ఈ రెండింటిలో నెయ్యది సుసాధ్యము, ఎయ్యది కష్టకరము అను ప్రశ్నయే ఉచితముకాదు.

ద్వావేవ కిల శాస్త్రోక్తౌ జ్ఞానయోగౌ రఘూద్వహ
తత్రోక్తం భవతే జ్ఞానమన్తస్థం జ్ఞేయనిర్మలమ్. 11

జ్ఞానవిచారము, యోగము — ఈ రెండును శాస్త్రములఁ జెప్పబడియున్నవి. నీకు అంతస్థమగు నిర్మలజ్ఞానమునుగుఱించి చెప్పియుంటిని.

ప్రాణాపానతయా రూఢో దృఢదేహగుహాశయః
అనన్తసిద్ధిదః సాధో యోగోఽయం బుద్ధిదః శృణు. 12

సాధూ! ప్రాణాపానముల సమత్వమును రూఢిని గాంచినదియును, ఖేచరత్వాది సిద్ధులనొసంగునదియు, జ్ఞానకాములకు సాక్షాత్కారహేతువునునగు, దేహము నాశ్రయించి ఒనర్పబడునదియునగు యోగమును గుఱించి చెప్పుచున్నాను, వినుము.

మఖానిలస్ఫురణనిరోధసంభవ
స్థితిం గతో నృపసుత చేతసా క్షయే,
సమాహితస్థితిరిహ యోగయుక్తితః
పరేపదే ప్రగలితగీర్నివత్స్యసి. 13

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే జ్ఞానవిచారయోగోపదేశో నామ
త్రయోదశః సర్గః ॥ 13 ॥

నృపసుతా! ప్రయత్నముతో ప్రాణవాయువును నిరోధించిన, వాసనాక్షయమై, యోగశాస్త్రమునఁ జెప్పబడినట్లు చిత్తవృత్తులు నిరుద్ధమై, వాగగోచరమగు పరమానందపదము నధిష్ఠింపఁగలవు.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
జ్ఞానవిచారయోగోపదేశమను
త్రయోదశ సర్గము ॥ 13 ॥

---

## చతుర్దశః సర్గః.

---

[సురసంప్రచ్యుతస్యాత్ర భుశుణ్డస్య దిదృక్షయా
వసిష్ఠగమనం మేరుస్తచ్ఛృఙ్గం చాత్ర వర్ణ్యతే.

వేదాంతాది యుత్తమకథలను వినునట్టి భుశుణ్డుని జూడ కోర్కెగల్గి వసిష్ఠుఁడు మేరుపర్వతముపైకి బోవుటయు, మేరుపర్వత, తచ్ఛిఖరవర్ణనమున్ను యిందుగలవు.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అస్తి తావదనన్తస్య తస్య క్వచిదయం కిల
జగద్రూపః పరిస్పన్దో మృగతృష్ణా మరావివ. 1

శ్రీ వసిష్ఠుఁడు :— ఈ వర్ణింపఁబడిన పరబ్రహ్మముయొక్క ఏకదేశమున, ఎండమావియందు పరిస్పందించు జలములవలె, జగత్తు వెలయుచున్నది.

తత్ర కారణతాం యాతో బ్రహ్మా కమలసంభవః
స్థితః పితామహత్వేన సృష్టభూతభరభ్రమః. 2

ఈ సృష్టికి పితామహుడును, పద్మయోనియును, సృష్టింపబడిన జీవులే భ్రమరమాలగా నొప్పువాడునునగు బ్రహ్మ వెలయుచున్నాడు.

తస్యాహం మానసః పుత్రో వసిష్ఠః శ్రేష్ఠచేష్టితః
ఋక్షచక్రే ధ్రువధృతే నివసామి యుగం ప్రతి. 3

అతనికి నేను మానసపుత్రుడను; శ్రేష్ఠచరిత్రుడ నగుటవలన, ధ్రువునిచే ధరింపబడిన సప్తర్షి మండలమున వైవస్వత మన్వంతరాంతము వెలయుదును.

సోఽహం కదాచిదాస్థానే స్వర్గే తిష్ఠఞ్ఛతక్రతోః
శ్రుతవాన్నారదాదిభ్యః కథాం సుచిరజీవినామ్. 4

ఒకనాడు నేను స్వర్గమునకున్న ఇంద్రసభకు వెళ్లితిని; అట నారదాదులు చిరజీవనమును గురించి చెప్పుపల్కుల వింటిని.

కథాప్రసఙ్గే కస్మింశ్చిదథ తత్రాభ్యువాచ హ
శాతాతపో నామ మునిర్మానీ మానీ మహామతిః. 5

ఈ ప్రసంగమును, ప్రమాణకుశలుడును, మాననీయుడును, అల్పభాషియును నగు శతతాపుడను ఒకానొకముని పల్కుచుండెను.

మేరోరీశానకోణస్థే పద్మరాగమయే దివి
అస్తి కల్పతరుః శ్రీమాఞ్ఛృఙ్గే చూత ఇతి శ్రుతః. 6

(అతడు చెప్పిన దేమన - మేరువుయొక్క ఈశానకోణము పద్మరాగమయము; అటువైపున శోభాయుతమగు చూతమను కల్పతరువున్నది.

తస్య కల్పతరోర్మూర్ధ్ని దక్షిణస్కన్ధకోటరే
కలధౌతలతాప్రోతే విద్యతే విహగాలయః. 7

ఆ కల్పతరువు మీద, దక్షిణదిశ నొక కోటరమున్నది; దానిని బంగారు లత లల్లుకొనియున్నవి; అట పక్షుల గూడొకటియున్నది.

తస్మిన్నివసతి శ్రీమాన్భుశుణ్డో నామ వాయసః
వీతరాగో బృహత్కోశే బ్రహ్మేవ నిజపఙ్కజే. 8

అట భుశుండుడను కాకియొకటి, రాగవిహీనుడై బ్రహ్మ తన పద్మకోశమున వసించుచున్నట్లు, వసించుచుండెను.

స యథా జగతాం కోశే జీవతీహ సురాశ్చిరమ్
చిరంజీవీ తథా స్వర్గే న భూతో న భవిష్యతి. 9

దేవతలారా! ఆ వాయసమును బోలు చిరజీవులీ ఇలలోలేరు; స్వర్గమునగూడలేరు; ఉండబోరు.

స దీర్ఘాయుః స నీరాగః స శ్రీమాన్స మహామతిః
స విశ్రాన్తమతిః శాన్తః స కాన్తః కాలకోవిదః. 10

అతడు శ్రీమంతుడును, మహామతియును, ఆసక్తి - రహితుడునునగు చిరంజీవి; అతడు పరమవిశ్రాంతి నందియుండుటవలన, శాంతుడును, మనోహరుడును, త్రికాలవేత్తయును నైయుండెను.

స యథా జీవతి ఖగస్తథేహ యది జీవ్యతే
తద్భవేజ్జీవితః పుణ్యం దీర్ఘం చోదయమేవ చ. 11

ఆ ఖగము జీవించుచున్నట్లు ఎవరైన జీవింపగలిగిన అతనిదే పుణ్యావహజీవనము, పరమ పురుషార్థము అని తలపనగును.

ఇతి తేన భుశుణ్డోఽసౌ భూయః పృష్టేన వర్ణితః
యథావదేవ దేవానాం సభాయాం సత్యముక్తవాన్. 12

ఇట్లు భుశుండుని విషయమై మరల ప్రశ్నింపబడి, అతడు దేవసభయందు, ఉన్నదున్నట్లు వర్ణించిచెప్పెను.

కథావసరసం శాన్తావథ యాతే సురవ్రజే
భుశుణ్డం విహగం ద్రష్టుమహం యాతః కుతూహలాత్. 13

కథముగియగనే దేవతలందఱు యథేచ్ఛ జనిరి; నేను కుతూహలముతో ఆ భుశుండుని జూడ నరిగితిని.

భుశుణ్డః సంస్థితో యత్ర మేరోః శృఙ్గం తదుత్తమమ్
సంప్రాప్తవాన్క్షణేనాహం పద్మరాగమయం బృహత్. 14

భుశుండుడు నివసించు మేరుశృంగము పద్మరాగమయమని వినియుండుటవలన, నేను తేలికగనే దానిని గుర్తించి చేరుకొనగలిగితిని.

రత్నగైరికకాన్తేన తేజసా వహ్నివర్చసా
మధ్వాసవరసేనేవ రఞ్జయత్కకుభాం గణమ్. 15
కల్పాన్తజ్వలనజ్వాలాపిణ్డాద్రిమివ సంచితమ్
ఇన్ద్రనీలశిఖాధూమమాలోకారుణితామ్బరమ్. 16
సర్వేషామేవ రాగాణాం రాశిముద్రావివ స్థితమ్
సర్వసంధ్యాభ్రజాలానాం ఘనమేకమివాకరమ్. 17
ఉత్క్రాన్తిం కుర్వతో మేరోర్బ్రహ్మనాడ్యేవ నిర్గతమ్
మూర్ధానమాగతం కాన్తం వాడవం జఠరానలమ్. 18
సుమేరువనదేవ్యేవ నవాలక్తకరఞ్జితమ్
లీలయాదాతుమిన్దుం ఖే నీతం హస్తశిఖాఙ్గులిమ్. 19
జ్వాలాభిరివ మాలాభిరరుణాభిః పయోముఖమ్
ఖం గన్తుమివ సస్పన్దం శైలస్థమివ వాడవమ్. 20

సంగీతమును, నలుదిక్కుల పుష్పగుచ్ఛములును నెలగుచు, వనలక్ష్మియొక్క నర్తన - శాలయా యని పించుచుండెను. అటునిటు తాళవృక్షముల పత్రములు విప్పారి, దంతములవలె నంటజేసి, అది ఇతర పర్వతశిఖరములగాంచి పరిహసించు చున్నట్లుండెను. అప్సరగణము ఊయ్యేలలు నూగుచుండెను. అట నందఱును కామోన్మత్తులు. శిలాతలముల దేవతలు విశ్రమించియుండిరి కందరముల కాముక కాముకీగణముండెను. ఆ పర్వతము, ఆకాశ - మృగాజనధారియై, శుభ్రగంగా - యజ్ఞోపవీత మును, పింగళవర్ణ - జటలను, వేణు - దండమును ధరించి, తాపసివలె నొప్పుచుండెను. ఆ పర్వత మున గాంగనిర్ఘోషము ధ్వని నొనర్చుచుండెను. దేవతలు లతాగృహములఁ బ్రవేశించుచుండిరి. గంధ ర్వులు గానమొనర్చుచుండిరి. వాయువు మధురగంధము నీనుచు ప్రవహించుచుండెను. హేమకమ లము లొప్పారుచుండెను. తారకలను రత్నములట శోభించుచుండెను. పింగళవర్ణమగు ఆ మేరుశిఖ రము గగనమును భేదించుకొనిపోయినట్లుండెను.

అమరయువతులకు క్రీడాపర్వతమగు ఆ మేరువు, శ్వేత, పీత, హారిత, పాటల వర్ణములగు వికసితపుష్పములతోఁగూడి, ఆకాశమండలమును విచిత్రముగ చిత్రించుచున్నట్లుండెను.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున మేరుశిఖరవర్ణనమను
చతుర్దశ సర్గము ॥ 14 ॥

---

## పఞ్చదశః సర్గః

---

[శృఙ్గే కల్పతరుశ్చూతః పుష్పపక్ష్యాదిసంపదః
స్కన్ధే కాకకులం తత్ర భుశుణ్డశ్చేహ వర్ణ్యతే.

ఆ పర్వతశిఖరముపై కల్పవృక్ష, చూతపుష్ప, పక్ష్యాది పదార్థముల సంపదయు, దాని కోటరమున కాకులసమూహమును గలవనుటయు, భుశుణ్డుని వర్ణనయు నిందు గలవు]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

కుసుమాపూర్ణకల్పాభ్రకున్తలే తస్య మూర్ధని
కల్పాఙ్ఘ్రిమహాను ద్రాక్షం శాఖాచక్రమివ స్థితమ్. 1
పుష్పరేణ్వభ్రవలితం రత్నస్తబకదన్తురమ్
ఉత్సేధనిర్జితాకాశం శృఙ్గే శృఙ్గమివార్పితమ్. 2
తారాద్విగుణపుష్పౌఘం మేఘద్విగుణపల్లవమ్
రశ్మిద్విగుణరేణ్వభ్రం తడిద్ద్విగుణమఞ్జరీమ్. 3
స్కన్ధేషు కిన్నరీగీతద్విగుణభ్రమరస్వనమ్
దోలాలోలాప్సరోలోకద్విగుణీకృతపల్లవమ్. 4
సిద్ధగన్ధర్వ సంఘాతద్విగుణోత్థ విహంగమమ్.
రత్నకాన్త్యచ్ఛనీహారద్విగుణ త్వగ్వృతాంశుకమ్. 5

చన్ద్రబిమ్బసమాశ్లేష ద్విగుణాఙ్గబృహత్ఫలమ్
మూలసంలీనకల్పాభ్రద్విగుణీకృతపర్వకమ్. 6
సురసంవలితస్కన్ధం పత్రవిశ్రాన్తకిన్నరమ్
నికుఞ్జకుఞ్జజీమూతం కచ్ఛసుప్తసురాదికమ్. 7
స్వాకారవిపులం భృఙ్గానుత్సార్య వలయస్వనైః
అప్సరోభ్రమరీభిశ్చ గృహీతకుసుమాన్తరమ్. 8
సురకిన్నరగన్ధర్వవిద్యాధరవరాన్వితమ్
జగజ్జాలమివానన్తం దశాశాకాశపూరకమ్. 9
నీరన్ధ్రకలికాజాలం నీరన్ధ్రమృదుపల్లవమ్
నీరన్ధ్రవికసత్పుష్పం నీరన్ధ్రవనమాలితమ్. 10
నీరన్ధ్రమఞ్జరీపుఞ్జం నీరన్ధ్రమణిగుచ్ఛకమ్
నీరన్ధ్రాంశుకరత్నాఢ్యం లతావిలసనాకులమ్. 11
సర్వత్ర కుసుమాపూర్ణైః సర్వత్ర ఫలపల్లవైః
సర్వామోదరజః పుఞ్జైః పరం వైచిత్ర్యమాగతమ్. 12

తస్య కక్షేషు కుఞ్జేషు లతాపత్రేషు పర్వసు
పుష్పేష్వాలయసంలీనాన్విహగాన్దృష్టవానహమ్. 13

శ్రీ వసిష్ఠుఁడు:— ఆ మేరుశిఖర శిరోభాగమును కుసుమపూర్ణములగు ప్రళయమేఘములు కుంతలములవలె నలంకరించియుండెను; అట్టి, పుష్పితములును, వ్యాప్తములునునగు శాఖలతోఁగూడి, అర్థిజన వాంఛితముల నీడేర్చు ఆ కల్పవృక్షమును నేను గాంచితిని. అది పుష్పరేణువులను మేఘములతో గప్పబడియుండెను; రత్నమయములగు పుష్పగుచ్ఛములు దాన దట్టముగనుండెను. ఔన్నత్యమున నది ఆకాశము నతిక్రమించుచుండెను. మేరుశృంగమున మఱొక శృంగామాయనునట్లావృక్ష మొప్పుచుండెను. దాన పుష్పములు ఆకాశమునందలి నక్షత్రములకంటె అసంఖ్యముగను, పల్లవములు వర్షకాల మేఘములకంటె నధికముగను, ఉజ్వలమగు పుష్పపరాగరాశి, చంద్ర సూర్యుల కిరణములకంటె ద్విగుణముగను, మంజరులు మెఱుపులకంటె నెక్కుడుగను ఉండెను. ఆ వృక్షముమీదనున్న భ్రమరముల గుంజనధ్వని, స్కంధవాసినులగు కిన్నరీగణముయొక్క గీతధ్వనులతోఁగలసి, ద్విగుణీకృతమగుచుండెను, ఆ వృక్షమున వ్రేలు ఉయ్యేలలనూగు అప్సరసల హస్తపదపల్లవముల దాని పల్లవసమూహము ద్విగుణమగుచుండెను. కామరూపులును, విహగవేషధరులునునగు సిద్ధ గంధర్వుల ఉనికివలన. ఆ వృక్షముననున్న పక్షుల సంఖ్య రెండింత లగుచుండెను. రత్నకాంతి, నిర్మల నీహారముల దట్టమైన ఆ వృక్షముయొక్క పట్ట, దాని కట్టువస్త్రమువలె నుండెను. చంద్రబింబసమాలింగమున, అందలి అమృతమునుగ్రోలి, దానినున్న ఫలములు మఱింతగ లావైనట్లుండెను; దాని మొదట కల్పమేఘములావరించుకొనియున్నందున, అదియును లావైనట్లు కనఁబడుచుండెను. దాని శాఖల దేవతలును, పత్రముల కిన్నరులును ఆక్రమించుకొని విశ్రమించుచుండిరి, నికుంజకుంజముల మేఘములును, దాని పేడల సురలును నిద్రించుచుండిరి. అప్సరసలను – మధుకరములు తమ కంకణ శబ్దముల భ్రమములను

తరిమి, ఆ బృహద్వృక్షమునుండి పుష్పచయన మొనర్చుచుండిరి. అది జగత్సమూహములవలె దశదిశల నాక్రమించుచు, సురకిన్నరగంధర్వవిద్యాధర శ్రేష్ఠులతో గూడియుండెను. ఆ వృక్షము మొగ్గలతోడను, లేతచిగుళ్లతోడను, విప్పారుచున్న పువ్వులతోడను, పువ్వుగుత్తులతోడను, మాలతీ, లతలతోడను, మణిస్తబకములతోడను, అర్థులకామమీడేర్చు దివ్యాంబరరత్నసమూహములతోడను దట్టమైయుండెను. లతలందు లాస్యనృత్యమొనర్చు (ఊగాడు) చుండెను, నలుదిక్కుల కుసుమ, ఫలపల్లవ, సుగంధ, పుష్పరేణువులతోగూడి, ఆ వృక్ష మత్యంత విచిత్రముగ శోభిల్లుచుండెను. దాని కక్షముల, కుంజముల, లతాపత్రముల, పర్వముల, పుష్పముల పక్షులు గూండ్లు కట్టుకొని నివసించుచుండుటను నేను గాంచితిని.

నిశానాథకలాఖణ్డమృణాలశకలైర్ధితాన్
అర్జునామ్భోజనీకన్దకవలాన్బ్రహ్మసారసాన్. 14
విరంచేరథ హంసానాం పోతకాన్నామగాయినః
ఓంకారవేదసుహృదో బ్రహ్మవిద్యానుశాసనాన్. 15
ఉద్గీర్ణమన్త్రనిచయాన్స్వాహాకారనిభస్వనాన్
అస్థినైకతడిత్పుఞ్జనీలమేఘసమోపమాన్. 16
దేవైర్నిరీక్షితాన్నిత్యం యజ్ఞవేదిలతాదలాన్
శుకానాకర్ణ్యానవాఞ్ఛ్య మాఞ్ఛశూఞ్ఛఖశిఖాశిఖాన్. 17
గౌరీరక్షితబర్హాఘాన్కుమారాన్వరబర్హిణః
సకన్దోపన్యస్తనిఃశేషశైవవిజ్ఞానకోవిదాన్. 18
వ్యోమ్న్యేవ జాతనష్టానాం మహతాం వ్యోమపక్షిణామ్
బన్ధానాబద్ధనిలయాఞ్ఛరదభ్రసమాకృతీన్. 19
విరించి హంసజానన్యానన్యానగ్నిశుకోద్భవాన్
కౌమారబర్హిజానన్యానన్యా నమ్బరపక్షిజాన్ 20
ద్వితుణ్డాంశ్చ భరద్వాజాన్బ్రహ్మచూడాన్విహంగమాన్
కలవిఙ్కబలాన్గృధ్రాన్కోకిలాన్క్రౌఞ్చకుక్కుటాన్. 21
భాసచాషబలాకాదీన్చ హయానన్యాంశ్చ రాఘవ
భూతౌఘం జగతీవాహం దృష్టవాంస్తత్ర పక్షిణః. 22
దక్షిణస్కన్ధశాఖాయాం స్థితాయాంవై దవీయసి
అథాహం దృష్టవాన్పుష్టపత్రాయామమ్బరస్థితః. 23
కాలేకాకోలవలయం మఞ్జరీజాలమాలితమ్
కోకాలోకాచలేఽరణ్యే కల్పాభ్రౌఘమివ స్థితమ్. 24

అందు, బ్రహ్మవాహనములగు హంసలు, చంద్రకళలను మృణాలనాళములను మఱియు తెలితామరతూండ్లను భక్షించుచు సుఖముగనుండెను. అవి, సర్వదా బ్రహ్మదగ్గఱనుండుటవలన, బ్రహ్మవిద్య నెఱిగి, వేదమంత్రమగు ప్రణవము నుచ్చరించుచు, అనవరతము వేదగాన మొనర్చుచుండెను.

అగ్నివాహనములగు శుకములు, యజ్ఞమంత్రముల నుచ్చరించుచుండెను. ఎల్లప్పుడు స్వాహాశబ్దము నుచ్చరించుటవలన, వాటిస్వరముగూడ స్వాహాకారమయ్యెను. యజ్ఞశాలకవి అగ్నినికొనిపోయి, ప్రాంతస్థితపగు వృక్షాగ్రముల నధివసించుచుండును; హవిప్రదాయియగు అగ్నిని కొనివచ్చినవని, యజ్ఞవేదిక నుపవిష్టులైన వా దేవతలు టినత్యంతప్రీతితో నిరీక్షించుచుందురు. అందువలన నవి నిరీక్షింప అత్యంతమనోహరములై యుండెను. కొన్ని, విద్యుత్పుంజములవలె పింగళవర్ణములును, కొన్ని జలభరిత మేఘములవలె నీలవర్ణములును నైయుండెను. కొన్ని, శుకపత్రములవలె హరిద్వర్ణములు; మస్తకశిఖలు అగ్నిశిఖలవలెనున్న శాబకము లనేకములుండెను. అట, కార్తికేయవాహనములగు మయూరములుగూడ నుండెను; స్కందమాతయగు గౌరీదేవి వాటిని పాలించుచుండెను. అవికుమారస్వామికడ శైవధర్మముల నెఱిగి, ప్రావీణ్యమును సంపాదించెను. అట, వ్యోమపక్షులను ఒక జాతికిచెందిన పక్షులుండెను. అవి ఆకాశముననే జన్మించి ఆకాశముననే మరణించును; అవి ఎప్పుడును భూమిమీదకు దిగవు; వాటితో స్నేహముగనున్న శరదభ్రశుభ్రహంసవాహానసంతతిగూడ అట నివసించుచుండెను. అట, అగ్నివాహానసంతానములగు శుకములు, కార్తికేయవాహాన సంతతియగు మయూరములు, ఆకాశపక్షి సంతతులు, ద్వితుండములగు భరద్వాజపక్షులు, హేమచూడ పక్షులు, కలవింకములు, గృధ్రములు, బకములు, కుక్కుటములు, కోకిలలు, భాసములు, చాషములు మొదలగు పక్షులట నివసించుచుండెను. రామా! అట నొక పక్షిజగత్తును గాంచితినాయన్నట్లు, పెక్కుపక్షుల జూచితిని. నేనాకాశముననుండియే, ఆవృక్షముయొక్క దక్షిణస్కంధమున, ఆకులతో దట్టమైయున్న ఒక కొమ్మమీద, కుంజరీజాలముల గూడు కట్టుకొని నివసించుచున్న ద్రోణకాకముల గుంపు నొకదానిని గాంచితిని; అది, చూచుటకు చక్రవాళపర్వతారణ్యముననున్న కల్పాంతమేఘసమూహమువలె నుండెను.

తత్ర పశ్యామ్యహం యావదేకాన్తే స్కన్ధకోటరే
విచిత్రకుసుమాస్తీర్ణే వివిధామోదశాలిని. 25

పుణ్యకృద్వ్యోషితాం స్వర్గే ప్రియస్తబకవాసితాః
అపరిక్షుభితాకారాః సభాయాం వాయసాః స్థితాః. 26

విభేద్య మేఘా వాతేన సమే నేవాపసారితాః
తేషాం మధ్యే స్థితః శ్రీమాన్భుశుణ్డః ప్రోన్నతాకృతిః. 27

మధ్యే చ కాచఖణ్డానామిన్ద్రనీల ఇవోన్నతః
పరిపూర్ణమనా మానీ సమః సర్వాఙ్గసున్దరః. 28

ప్రాణస్పన్దావధానేన నిత్యమన్తర్ముఖః సుఖీ
చిరంజీవీతి విఖ్యాతశ్చిర జీవితయా తయా. 29

జగద్విదితదీర్ఘాయుర్భుశుణ్డ ఇతి విశ్రుతః
యుగాగమాపాయదశా దర్శనప్రౌఢమానసః. 30

ప్రతికల్పం చ గణయన్భిన్నశ్చక్ర పరమ్పరామ్
జన్మనాం లోకపాలానాం శర్వశక్రమరుత్వతామ్. 31

సంకల్పమాత్రజనితములగు కరముల నాకు, నీలమేఘము తుషారమును వర్షించునట్లు, పుష్పాంజలి నొసగెను. తరువాత నాతడు తరుపల్లవాసనమును ఒసగి, గ్రహింపుమనెను. అప్పుడు వాయసము లన్నియు గౌరవార్థమై లేచి, వాటి పక్షకాంతులు ప్రసరింపజొచ్చెను; అవి నేను కూర్చుండుటను నిరీక్షించుచుండెను. అప్పుడు నేను, భుశుండుడును, తత్సహచరులును ఒకేతడవ పత్రలతాపుంజమయమగు ఆసనముల గ్రహించితిమి. అర్ఘ్యపాద్యముల ప్రీతినిగూర్చి, మహాతేజస్వియగు భుశుండు డిట్లు స్నేహమున మధురాక్షరముల బల్కదొడగెను.

భుశుణ్డ ఉవాచ :—

అహో భగవతాఽస్మాకం ప్రసాదో దర్శితశ్చిరాత్
దర్శనామృతసేకేన యత్సిక్తాః సద్ద్రుమా వయమ్. 10
మత్పుణ్యచిరసంభారప్రేరితేన త్వయాధునా
మునే మాన్యైకమాన్యేన కుతశ్చాగమనం కృతమ్. 11
కచ్చిదస్మిన్మహామోహే చిరం విహరతస్తవ
అఖణ్డితైవ సమతా స్థితా చేతసి పావనే. 12
కిమర్థమద్యాగమనక్లేశేనాత్మా కదర్థితః
వచనశ్రవణోత్కానామాజ్ఞాం నో వక్తుమర్హసి. 13
త్వత్పాదదర్శనాదేవ సర్వం జ్ఞాతం మయా మునే
త్వదాగమనపుణ్యేన వయమాయోజితాస్త్వయా. 14
చిరంజీవితచర్యాభిర్వయం వః స్మృతిమాగతాః
తేనేదమాస్పదం పాదైస్త్వం పవిత్రితవానయమ్. 15
జ్ఞాతత్వదాగమోఽప్యేవం త్వాం పృచ్ఛామీహ యన్మునే
భవద్వాక్యామృతాస్వాదవాఞ్ఛితం ప్రవిజృమ్భతే. 16
ఇత్యుక్తవానసౌ పక్షీ భుశుణ్డశ్చిరజీవితః
త్రికాలామలసంవేదీ తద్ప్రోక్తమిదం మయా. 17

భుశుండుడు:—భగవంతుడా! మీరు నేటికి మమ్ము మీ దర్శనామృత సేచనమున ధన్యుల నొనర్చితిరి. అత్యంతమాననీయులగు మీరు, నా జన్మజన్మార్జితపుణ్యఫలమై, ఎటనుండి అరుదెంచుచున్నారు? మహామోహమయమగు ఈ జగత్తున పరిభ్రమించుచున్నను మీ పవిత్రహృదయమున సమత్వ మఖండితభావమున వెలయుచున్నదికదా! మీరింత కష్టమును వహించి నేడిటకేల అరుదెంచితిరి ? మేము విన నుత్సహించుచున్నాము – చెప్పుడు. మునీ! మీ చరణసందర్శనముననే నేనంతయు గ్రహించితిని. మీ శుభాగమనమున నేడు మేము ధన్యులమైతిమి. చిరంజీవి – ప్రసంగమున మేము మీ స్మృతిపథమున బడితిమి; మీ పవిత్రపాద స్పర్శవలన మేము పుణ్యమును సంపాదించితిమి. గ్రహించియున్నను, మీ వాగమృతపానవాంఛను దీర్చుకొనుటకై ఇట్లడుగుచుంటిని. ఇట్లు త్రికాలవేదియును, చిరంజీవియును నగు భుశుండునిచే ప్రశ్నింపబడి, నే నప్పు డిట్లు నుడివితిని.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

విహంగమ మహారాజ సత్యమేతత్త్వయోచ్యతే
ద్రష్టుమభ్యాగతోఽస్మ్యద్య త్వామేవ చిరజీవితమ్. 18
శీతలాన్తఃకరణో దిష్ట్యా కుశలవానసి
పతితోఽసి న బుద్ధాత్మా భీషణాం భవవాగురామ్. 19
తదేతం సంశయం ఛిన్ధి భగవన్మమ సత్యతః
కస్మిన్కులే భవాఞ్జాతో జ్ఞాతజ్ఞేయః కథం భవాన్. 20
కియదాయుశ్చ తే సాధో వృత్తం స్మరసి కించ వా
కేనాయం వా నివాసస్తే నిర్దిష్టో దీర్ఘదర్శినః. 21

శ్రీవసిష్ఠుడు:— విహగేంద్రా! యథార్థముగానే వచించితివి. నేడు మేము నిన్నుజూడ అరుదెంచితిమి. నీ వాత్మతత్త్వమును గ్రహించి, శీతలాంతకరణమున కుశలతను బొంది, భయంకరములగు భవవాగురల జిక్కకొనకున్నావు. భగవంతుడవగు భుశుండుడా! నీ కులమెద్ది? నీవెట జన్మించితివి? ఆత్మజ్ఞానమును ఎట్లు బడసితివి? ఈ విషయముల వాస్తవముగ వర్ణించి, నా సంశయముల దూరీకరింపుము. మీ ఆయువెంత? సాధూ! జరిగిన విషయములన్నియు గుర్తున్నవా? ఇట వాసమొనర్ప ఎవరు చెప్పియుండిరి? నాకు దెలియజెప్పుము.

భుశుణ్డ ఉవాచ :—

యత్పృచ్ఛసి మునే సర్వం తదిదం వర్ణయామ్యహమ్
అనుద్వేగితయా యత్నాత్కథా శ్రావ్యా మహాత్మనా. 22

భుశుండుడు:— మునీ! నీ వడిగినదంతయు జెప్పుచున్నాను. మహాత్మా! ఉద్వేగమును వీడి యత్నముతో (సావధానుడవై) వినుము.

యుష్మద్విధాస్త్రిభువనప్రభుపూజ్యరూపా
ఆకర్ణయన్తి యముదారధియో మహాన్తః,
తేనాశుభం ప్రకథితేన వినాశమేతి
మేఘాస్పదేన విభవేన యథార్కతాపః. 23

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే వసిష్ఠభుశుణ్డసమాగమో నామ షోడశః సర్గః ॥ 16 ॥

మహాత్ములును త్రిలోకపూజ్యులును నగు మీ వంటివారు వినగోరుదానిని జెప్పిన, మేఘోదయమున సూర్యతాపము నశించునట్లు, అశుభములన్నియు వినష్టములై పోవును.

ఇది వాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున భుశుండోపాఖ్యానమున వసిష్ఠభుశుండసమాగమను
షోడశ సర్గము ॥ 16 ॥

## సప్తదశః సర్గః.

---

[ఉపవర్ణ్య భుశుణ్డోఽత్ర జీవన్ముక్తోచితైర్గుణైః
పృష్టార్థం విస్తరాద్వక్తుం ప్రవృత్త ఇతి కథ్యతే.
జీవన్ముక్తోచిత గుణములచే వర్ణింపబడిన భుశుండుడు, యడుగబడిన అర్థమును విస్తారముగ తెలుప నుద్యుక్తుఁడగుట.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథ రామ భుశుణ్డోఽసౌ న ప్రహృష్టో న వక్రధీః
సర్వాఙ్గసున్దరః శ్యామః ప్రావృషీవ పయోధరః. 1
స్నిగ్ధగమ్భీరవచనః స్మితపూర్వాభిభాషణః
కరస్థబిల్వఫలవత్ప్రతోలితజగత్త్రియః. 2
తృణవద్దృష్టసకలః ప్రమేయాకృతసంసృతిః
లోకాజవం జవీభావే దృష్టజ్ఞానపరావరః. 3
ధీరస్థిరమహాకాయో విశ్రాన్తిం గతసున్దరః
పరిపూర్ణమనాః శుద్ధః క్షీరార్ణవ ఇవాగతః. 4
పరివిశ్రాన్తధీః శాన్తః పరమానన్దఘూర్ణితః
ఆవిర్భావతిరోభావతజ్జ్ఞః సంసారజన్మనామ్. 5
సరభసవదనాభిరామరూపః
ప్రియమధురోచిత గానహృద్యవాక్యః
స్వయమివ నవమాశ్రితః శరీరం
సకల భయాపహారం ప్రహర్షయుక్తః. 6
ఇదమమలగిరా సమాహ శుద్ధ
మచ్చృతమనుజ్ఝిత సంభ్రమక్రమేణ
కథయితుమఖిలం నిజం స్వరూపం
మధుపమివ స్తనితేన ముగ్ధమేఘః. 7

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే భుశుణ్డోపాఖ్యానే భుశుణ్డస్వరూపవర్ణనం నామ సప్తదశః సర్గః ॥ 27 ॥

శ్రీవసిష్ఠుఁడు:—రామా! అనంతరము వర్ష మేఘశ్యాముడును, సర్వాంగసుందరుడును, సరళబుద్ధియును, నిర్హర్షుడును, స్నిగ్ధగంభీరవచస్కుఁడును, చిఱునవ్వుతోఁగూడి పల్కువాడును, జగత్తుల కరతలామలకమువలె గ్రహించినవాడును, భోగములనన్నిటిని తృణమువలె పరిత్యజించినవాడును, సంసారము, జన్మల యొక్క రహస్యమును గ్రహించినవాడును, పరావరదర్శియును, ధీరుడును, స్థిరు

డును, మహాకృతియును, పాలసముద్రమునుండి వచ్చి విశ్రమించుచున్న మందరపర్వతమును బోలు వాడును, పరిపూర్ణమనస్కుడును, శుద్ధుడును, విశ్రాంతబుద్ధియును, పరమానంద - ఉద్వేలితుడును, జన్మాది రహస్యవేత్తయును, మధురమగు వీణానిక్వణనమును బోలు వాక్కుగలవాడును, ఆత్మజ్ఞాన మునుబడసి అభయమయమగు నవశరీరధారియును నగు భుశుండుడు, శుద్ధములును, అమృతోపములును నగు వాక్యముల తొట్రుపాటులేకుండ, తన చరిత్రను, మంకరందపానరసికమగు భ్రమరమునకు సుందరమేఘము గర్జనమొనర్చి పల్కునట్లు, చెప్పమొదలిడెను.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున భుశుండస్వరూపవర్ణనమను,
సప్తదశ సర్గము ॥ 17 ॥

---

## అ ష్టా ద శః స ర్గః.

---

[స్వజన్మ వక్తుమ త్రాదౌ హర స్తద్గణమాతృకాః
తాసాం పానోత్సవోన్మాదా భుశుణ్డేనాత్ర వర్ణితాః.

భుశుండుడు తన జన్మవృత్తాంతము నెఱింగించుటకై మొట్టమొదట ఈశ్వరుని, వాని గణమును, మాతృకలను, వారి పానోత్సవాదులను వర్ణించుట.]

భుశుణ్డ ఉవాచ :—

అత్యస్మిఞ్జగతి శ్రేష్ఠః సర్వనాకనివాసినామ్
దేవదేవో హరో నామ దేవదేవాభివన్దితః. 1

భుశుండుడు :— దేవతాశ్రేష్ఠుడును, దేవాభివందితుడును, దేవదేవుడునునై హరుడు ఒప్పుచుండును.

షట్పదశ్రేణినయనా యస్యోచ్చస్తబకస్తనీ
విలాసినీ శరీరార్ధే లతా చూతతరోరివ. 2

అతని శరీరార్థము నాశ్రయించి, ఆమ్రతరువును మాధవీలత ఆశ్రయించియుండునట్లు, భ్రమరనయనయును, విలాసినియును, ఉచ్చస్తనస్తబకయునునగు పార్వతి, వెలయుచుండును.

హిమహారసితా యస్య లహరీస్తబకోమ్భితా
ఆవేష్టితజటాజూటా గఙ్గా కుసుమమాలికా. 3

అతని జటాజూటమును గంగయను కుసుమమాలిక, హిమకణములతోడను, లహరీస్తబకములతోడను ధవళమై అలంకరించియున్నది.

క్షీరసాగరసంభూతః ప్రసృతామృతనిర్ఝరః
ప్రతిబిమ్బకరః శ్రీమాన్యస్య చూడామణిః శశీ. 4

క్షీరసాగరసంభూతుడును, అమృతమును బ్రవహింపజేయువాడును, దర్పణభూతుడును నగు చంద్రుడాతని చూడామణి.

అనారతశిరశ్చన్ద్ర ప్రస్రవేణామృతీకృతః
యస్యేన్ద్ర నీలవత్కాలకూటః కణ్ఠే విభూషణమ్. 5

అనవరతము చంద్రునివలన ప్రసరింపజేయబడు అమృతముగ మారిన ఇంద్రనీలమాయని పించు, కాలకూటమాతని కంఠము నలంకరించియున్నది. (ఆయన నీలకంఠుడని భావార్థము.)

ధూలిలేఖామహావర్తం స్వచ్ఛపావకసంభవమ్
పరమాణుమయం భస్మ యస్య జ్ఞానజలం సితమ్. 6

ప్రళయకాలమున తృతీయనేత్రాగ్నినుండి లేవదీయబడిన (భూతముల విలోపమున) పరమాణుమయమైన ధూళిలేఖనుండి మాయాభస్మమునాతడు జ్ఞానజలముల నలముకొనుచున్నాడు.

నిర్మలాని జితేన్దూని మృష్టాని ఘట్టితాని చ
యస్యాస్థీన్యేవ రత్నాని దేహకాన్తమయాని చ. 7

చంద్రునికంటె ధవళములును, కించిత్ - రక్తరంజితములగుటవలన మణులవలె శోభిల్లునవియును, శరీరము నలంకరించునవియునగు అస్థులే అతని రత్నహారములు.

సుధాకరసుధాధౌతం నీలనీరదపల్లవమ్
తారకాబిన్దుశబలం యస్య చామ్బరమమ్బరమ్. 8

సుధాకరుని సుధవలన విధౌతమును, నీలమేఘములను అంచుగలదియును, తారకాబిందువులచే నలంకృతమునునగు ఆకాశమే అతని అంబరము.

భ్రమచ్ఛివాఙ్గనా పక్వమహామాంసౌదనాకులమ్
బహిర్ఘ్యాతం గృహం యస్య శ్మశానం హిమపాణ్డురమ్. 9

మహామాంస (నరమాంస) భోజనమొనర్చి తిరుగాడు సృగాలములతోగూడినదియును, హిమపాండురమును, బహిఃస్థితమునునగు శ్మశానమే అతని ఆవాసము.

కపాలమాలాభరణాః పీతరక్తవసాసవాః
ఆన్త్రస్రగ్దామవలితా బన్ధవో యస్యమాతరః. 10

కపాలమాలాభరణలును, పీతరక్తవసనధారిణులును, ఆంత్ర (ప్రేవులు) మాలాధారిణులును నగు మాతలాతని సఖులు.

ప్రస్ఫురన్మూర్ధమణయశ్చరన్తో మసృణాఙ్గకాః
భుజగా వలయా యస్య ప్రకచత్కనకత్విషః 11

తలమీదనున్న మణుల కాంతుల వెదజల్లుచు, మెత్తటి శరీరములతో కదలు భుజగములే ఆయనకు వలయములై, కనకదీప్తుల నీనుచున్నవి.

దృక్పాతదగ్ధశైలేన్ద్రం జగత్కవలలాలసమ్
భైరవాచరితం యస్య లీలాసంత్రాసితాసురమ్. 12

దృక్పాతమాత్రముననే శైలముల దహించుట, జగత్తును కబళమొనర్చుకొనగోరు ఆకాంక్ష, అసురులను వెరపొందింపజేయు భీషణకృత్యములు, అతని లీలలై యున్నవి.

సంస్థీకృతజగజ్జాతస్వవ్యాపారస్థచేతసః
యదృచ్ఛయా కరస్పన్దో యస్యాసురపురక్షయః. 13

సత్యసంకల్పుఁడగుటవలన అతఁడు చింతామాత్రముననే జగత్తులను కళ్యాణమొనగూర్చి, ధ్యానస్థుఁడైయుండును; విలాసముగ చెయ్యి ఊఁపినమాత్రముననే త్రిపురములు భస్మమొనరింపబడును.

ఏకాగ్రమూర్తయః స్నేహరాగద్వేషవివర్జితాః
స్వశనా యస్య తే శైలాః సరసా అపి నీరసాః. 14

స్నేహరాగద్వేషవివర్జితమై, అశనపిపాసాద్యతీమగు అతని ధ్యానమూర్తిని, మృత్పరిలయుక్తములగు పర్వతములు దోపింపజేయుచుండును.

శిరఃఖురాః ఖురకరాః కరదన్తముఖోదరాః
ఋక్షోష్ట్రాజాహివక్త్రాశ్చ ప్రథమా యస్య లాలకాః. 15

అతని పరివారమగు మాతృగణముల శిరములత్యంత నిశితములు; వారి హస్తములు విచిత్రశిల్పనిర్వాహణాసమర్థములు. వారి దంతముల కసాధారణ భక్షణ సామర్థ్యమున్నది. భల్లూక, ఉష్ట్ర, అజ, సర్పముఖములతో వారు శోభిల్లుచున్నారు.

తస్య నేత్రత్రయోద్భాసివదనస్యామలప్రభాః
యథాగణాస్తథైవాన్యాః పరివారో హి మాతరః 16

ఆ హరుని వదనము త్రినేత్రములతో నొప్పారుచు, శ్యామలప్రభల నీనుచున్నది. ప్రమథగణము, మాతృమండలము అతని పరివారము.

నృత్యన్తి మాతరస్తస్య పురో భూతగణానతాః
చతుర్దశవిధానన్తభూతజాతైకభోజనాః. 17

చతుర్దశభువనములందున్న అనంతప్రాణకోటిని భుజించుచు, పురోవర్తులగు భూతగణములచే వందితులై వారు నృత్యమొనర్చుచుందురు.

ఖరోష్ట్రాకారవదనా రక్తమేదోవసాసవాః
దిగన్తరవిహారిణ్యః శరీరావయవస్రజః. 18

ఖరోష్ట్రవదనలును, రక్తమేదోవసరూపమగు ఆసవపానరతలును, దిగంతవిహారిణులునునగు వారి శరీరముల శవహస్తపాదాదులే మాలలుగ వెలయుచున్నవి.

వసన్తగిరికూటేషు వ్యోమ్ని లోకాన్తరేషు చ
అవటేషు శ్మశానేషు శరీరేషు చ దేహినామ్. 19

గిరికూటముల, ఆకాశమున, లోకాంతరముల, గర్తముల, శ్మశానముల, ప్రాణిశరీరముల వారు వసించుచుందురు.

జయా చ విజయా చైవ జయన్తీ చాపరాజితా
సిద్ధా రక్తాలమ్బుసా చ ఉత్పలా చేతి దేవతాః. 20

ఆ హరుని ఆలయమున, జయ, విజయ, జయంతి, అపరాజిత, సిద్ధా, రక్త, అలబుంస, ఉత్పల అను అష్టమాతృకలు నివసించుచుందురు,

సర్వాసామేవ మాతౄణామష్టావేతాస్తు నాయికాః
ఆసామనుగతా స్త్వన్యాస్తాసామనుగతాః పరాః. 21

మాతృదేవతలందఱికిని వీరే నాయికలు; తక్కినవారందఱును వీరినే అనుసరించియున్నారు, వారి ననుసరించి మఱికొందఱున్నారు. వీరి సంఖ్య అసంఖ్యము.

తాసాం మధ్యే మహార్హాణాం మాతౄణాం మునినాయక
అలమ్బుసేతి విఖ్యాతా మాతా మానద విద్యతే. 22

మునీ! పరమపూజ్యులగు ఈ మాతృదేవులందఱిలోను అలంబుసయను మాననీయ ప్రసిద్ధయై యొప్పుచుండును.

వజ్రాస్థితుణ్డశ్చణ్డాఖ్య ఇన్ద్రనీలాచలోపమః
తస్యాస్తు వాహనం కాకో వైష్ణవ్యా గరుడో యథా. 23

ఆపెకు వజ్రమును బోలు తుండము (ముక్కు) గలదియు, ఇంద్రనీలమును బోలునదియును నగు వాయసమొకటి, వైష్ణవి (లక్ష్మి)కి గరుడునివలె వాహనమైయున్నది; దాని పేరు చండుడు.

ఇత్యష్టైశ్వర్యయుక్తాస్తా మాతరో రౌద్రచేష్టితాః
కదాచిన్మిలితా వ్యోమ్ని సర్వాః కేనాపి హేతునా. 24

ఒకానొకప్పుడు, రుద్రచేష్టితలును, అష్టైశ్వర్యయుతలునునగు ఆ మాతృదేవతలందఱును, ఏదోయొక కారణమున ఆకాశమునఁ గలసికొనిరి.

ఉత్సవం పరమం చక్రుః పరమార్థప్రకాశకమ్
వామస్రోతోగతా ఏతాస్తుమ్బురుం రుద్రమాశ్రితాః. 25

వారు వామభాగమునున్న తుంబురుడను రుద్రు నాశ్రయించి, పరమార్థప్రకాశకరమగు ఉత్సవమొకదానిని సల్పిరి.

పూజయిత్వా జగత్పూజ్యౌ దేవౌ తుమ్బురుభైరవౌ
విచిత్రార్థాః కథాశ్చక్రుర్మదిరామదతోషితాః. 26

వారు జగత్పూజ్యులగు తుంబురుభైరవుల పూజించి, మదిరామదతోషితలై, విచిత్రముగ ఇట్లు ప్రసంగింపబోడగిరి.

అథేయమాయయా తాసాం కథావసరతః కథా
అస్మానుమాపతిర్దేవః కిం పశ్యత్యవహేలయా. 27

సంభాషణలో, వారు ఉమాపతి తమ్ము చులకనగా చూచుచుండునా యను మాటవచ్చెను.

ప్రభావం దర్శయామోఽస్య పునర్నాస్మాం స్త్వసౌ యథా
దృష్టమాత్రమహాశక్తిః కరిష్యత్యవధీరణమ్. 28

అతనికి, మనమన శక్తుల జూపుదము; మన పరాక్రమమును గాంచి ఇక మెప్పుడును అతఁడు మనల నిరసింపఁడు.

ఇతి నిశ్చిత్య తా దేవ్యో వివర్ణవదనాఙ్గికామ్
ఉమామేవ వశీకృత్య ప్రోక్షయామాసురాదృతాః. 29

ఆ దేవు లిట్లు నిశ్చయించుకొని, వారు మంత్రబలమున రుద్రశక్తియగు ఉమయొక్క వదనమును ఇతరాంగములను వివర్ణ మొనర్చిరి.

మాయయాపహృతాం భర్తురఙ్గాద్రఙ్గముపాగతామ్
తామాలోలకచాం దేవ్యః శేపురోదనతాం గతామ్. 30

వారు, మాయాబలమున ఆలోలకుంతలయగు ఉమను శివుని అర్ధాంగమునుండి అపహరించి, తమమండలమునకు గొనివచ్చి, అవహేళనకొఱకుగాక, పరిహాసమునకాయనునట్లు తోపజేసి, అభిశాపబలమున వారామెను భక్ష్యముగ నొనర్చిరి.

పార్వతీప్రేక్షణదినే తస్మింస్తత్ర మహోత్సవః
బభూవ తాసాం సర్వాసాం నృత్యగేయమనోహరః. 31

ఇట్లాదినమున వారు పార్వతిని భక్ష్యముగ నొనర్చిన, నృత్యగీతమనోహరమైన ఉత్సవమును సల్పిరి.

అత్యానన్దమనుద్దామరవమేవామ్బరం బభౌ
దీర్ఘావయవవిక్షేపవికాసిజఘనోదరాః. 32

ప్రచండమగు ఆనందధ్వనులతో ఆకాశము నిండిపోయెను. వారు హస్తాది అవయవముల జాపుచు, జరచుచు ఆనందమును ప్రకటింపసాగిరి.

అన్యా జహాసురుద్దామతాలక్ష్వేడాఘనారవమ్
లసదఙ్గవికారం చ ధ్వనత్సగిరికాననాః. 33

వారు చప్పట్లు చరచుచు, సింహనాద మొనర్చుచు, మేఘములు గర్జించునట్లు నవ్వసాగిరి; వారి ఆనందధ్వనులకు కొండ గుహలు ప్రతి ధ్వనుల నీనసాగెను.

అన్యా జగుర్ధ్వనచ్ఛైలగృహమాపానతోషితాః
హారీవ రవవద్రజ్ఝజ్ఝగన్మణ్డలకోటరే. 34

కొందఱు సురాపానమొనర్చి, ఆనందధ్వనుల శైల - గృహముల ధ్వనింపజేయసాగిరి; ఆ ధ్వనులు చంద్రోదయమునందలి సాగర ఘోషవలెనుండెను.

అన్యాః పానం పపుః పృష్టచర్చితాఙ్గశిరఃఖురమ్
లీలాఘురఘురారావరణదాకాశకోటరే. 35

వారు చందనాదుల నలంకరించుకొని గుటకలు వేయుచు, సురాపాన మొనర్పసాగిరి. వారి లీలాధ్వనులతో ఆకాశము నిబిడమైపోయెను.

పపురుదగురథోచ్చైః సత్వరా జగ్మురాచు
ర్జహసురపురహాసాః పేతురుచ్చైర్వవల్గుః
ననృతురనిశమాద్యః స్వాదు మాంసంచ దేవ్య
స్త్రిభువనమపవృత్తం చక్రురున్మత్తవృత్తాః. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే మాతృవ్యవహారవర్ణనం నామాష్టాదశః సర్గః ॥ 18 ॥

ఉన్మత్తవృత్తలగు ఆ మాతృదేవతలు హాస్య, నృత్య, పాన, భోజనములనొనర్చుచు, ఒకరినోట మఱొకరు ఆహారము నిడికొనుచు, త్రోసికొనుచు, పట్టుకొనుచు, విచ్చలవిడిగ సంచరించుచు, లోకమునందలి శిష్టాచారమునే తారుమారొనర్చిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున మాతృవ్యవహారవర్ణనమను
అష్టాదశ సర్గము ॥ 18 ॥

---

## ఏకోనవింశః సర్గః

---

[బ్రాహ్మీహంస్యాం చణ్డయోగాత్స్వజన్మ భ్రాతృభిః సహ
బ్రాహ్మ్యాః ప్రసాదాజ్జ్ఞానాప్తిః పితుః స్థానాప్తిరుచ్యతే.

బ్రాహ్మీహంసయొక్కయు, చండయను కాకియొక్కయు సంయోగముచే సహోదరులతోకూడ భుశుండుని జన్మము, బ్రాహ్మియొక్క ప్రభావముచే జ్ఞానప్రాప్తి, పితృస్థానమున కరుదెంచుట.]

భుశుణ్డ ఉవాచ :—

ఇత్యుత్సవే వర్తమానే తాసాం వాహాస్త ఉత్తమాః
తత్రైవ మత్తా జహసుర్ననృతుః పపురప్యసృక్. 1

భుశుండుడు:— ఇట్లు, వారుత్సవోన్మత్తలైయుండ, ఉత్తమములగు వారి వాహనములుగూడ, రక్తపానమొనర్చి, నృత్యమొనర్పసాగెను.

తత్రైకత్రాసవోన్మత్తాః కాశ్చిన్ననృతురమ్బరే
రథహంస్యః స్థితా బ్రాహ్మ్యాః కాకశ్చాలమ్బుసారథః. 2

అట, బ్రహ్మవాహనమగు హంసియును, అలంబసావాహనమగు చండుడును, పానోన్మత్తములై నృత్యమొనర్పసాగెను.

నృత్యన్తీనాం చ హంసీనాం పిబన్తీనామథాసవమ్
తలే చాబ్ధితటానాం తు రతిః సమ్యగజాయత. 3

ఇట్లబ్ధితటమున పానమొనర్చి, నృత్యమొనర్చు ఆహంసలకు సురతేచ్ఛ కలిగెను.

సంజాతరతయో మత్తాః సర్వా హంస్యః క్రమేణ తాః
రేమిరే సహ కాకేనాప్యథ మత్తాస్తదా కిల. 4

కామోన్మత్తములగు ఆ హంసలు క్రమముగా నన్నియు అన్యయోనియగు వాయసముతో సురతమొనర్చెను.

సప్తానాం కులహంసీనాం దయితో వాయసస్త్వసౌ
క్రమేణారమతైకత్ర యావదన్యోన్యవాఞ్ఛితమ్. 5

ఆ వాయసము హంసల ఏడింటియొక్క భర్తయై, వారి ఇచ్ఛానుసారము క్రీడించెను.

అథ తా గర్భధారిణ్యో బభూవురతితోషితాః
దేవ్యశ్చ కృతనృత్యాస్తాః సుప్రశాన్తమథాయయుః. 6

అనంతరము రమణసుఖ - తోషితములగు ఆ హంసలన్నియును గర్భమును దాల్చెను; దేవులు నృత్యోత్సవముల ముగించి ప్రశాంతచిత్తలైరి.

దదురోదనతాం యాతామీశ్వరాయ ప్రియాముమామ్
భోజనాయ మహామాయాం దేవ్యస్తాః శూలపాణయే. 7

మహామాయారూపిణులగు ఆ దేవులు, ప్రియతమయగు ఉమ నాహారముగ శూలపాణి కర్పించిరి.

ప్రియా మే భోజనే దత్తేత్యేవం చ శశిశేఖరః
బుద్ధ్వా బభూవ రుషితో యదా మాతృగణం ప్రతి. 8
తదా తాస్తాం సముత్పాద్య స్వాఙ్గాదానేన వై పునః
దదుర్భూయో వివాహేన పార్వతీమిన్దుమౌలయే. 9

శశిశేఖరుడు ప్రియపత్నియే ఆహారముగ సర్పింపబడినదని గ్రహించి, క్రోధింప, మాతృగణము మరల తమ అంగములనుండి ఉమను సృష్టించి, ఇందుమౌళికి వివాహమొనర్చిరి.

తతో దేవ్యో హరశ్చైవ పరివారస్తథైతయోః
సర్వే సంతుష్టమనసః స్వాం స్వాముపయయుర్దిశమ్. 10

తరువాత శివుడు, పార్వతి, తక్కుగాగల పరివారమంతయు సంతోషింప, వారందఱును తమ తమ నెలవులకు జనిరి.

అన్తర్వత్న్యో బభూవుస్తా బ్రాహ్మ్యాశ్చ హంస్యో మునీశ్వర
వృత్తాన్తం కథయామాసుర్బ్రాహ్మ్యై దేవ్యా యథాస్థితమ్. 11

మునీశ్వరా! బ్రహ్మణిహంసలు గర్భితులై కడకటెగి జరిగిన బ్రహ్మణి వృత్తాంతము నంతటిని ఉన్నదున్నట్లు నివేదించెను,

బ్రాహ్మ్యువాచ :—

హే వత్స్యః సాంప్రతం వత్సవత్యో మే రథకర్మణి
న సమర్థా భవన్త్యో హి స్వైరం చరత సాంప్రతమ్. 12

బ్రాహ్మి:—వత్సలారా! మీరు గర్భవతులై, తొందరగ చనజాలకున్నారు. మీరిప్పుడు స్వచ్ఛందముగ విహరింపుడు. నా రథమును లాగనక్కరలేదు.

ఇతి గర్భాలసా హంసీరుక్త్వా దేవీ దయాపరా
నిర్వికల్పసమాధానే బ్రాహ్మీ తస్థౌ యథాసుఖమ్. 13

ఇట్లాపె గర్భాలసలగు హంసలతో దయాపరవతియై పల్కి నిర్వికల్పసమాధియందు ప్రవేశించి, యథాసుఖముగనుండెను.

అజనాభిసరోజాన్తవై రిఞ్చకమలాకరే
గర్భాలసా విచేరుస్తా రాజహంస్యో మునీశ్వర. 14

మునీశ్వరా! గర్భాలాలసలగు ఆ హంసలు, విష్ణుని నాభిదేశముననున్న, బ్రహ్మ - కమలాకరమున విహరింపసాగెను.

ఏవం విపక్వగర్భాస్తా నాభీకమలపల్లవే
సువతేస్మ మృదూన్యణ్డాన్యథ వల్ల్య ఇవాఙ్కురాన్. 15

ఇట్లుచన, వారిగర్భములు పూర్ణమవ, లత అంకురముల వెలువరించునట్లు, వారు విష్ణుని నాభికమల - పల్లవమున కోమలములగు అండముల బ్రసవించిరి.

తాని కాలం సమాసాద్య తతోఽణ్డాన్యేకవింశతిః
గర్భాక్రాన్త్యా ద్విధా జగ్ముర్బ్రహ్మాణ్డానీవ సారవత్. 16

ఆ యండములు ఇఱువదియొక్కటి యుండెను; అవి పరిపక్వదశనంది, బ్రహ్మాండమువలె, రెండుగా చిట్లిపోయెను.

అణ్డేభ్యస్తేభ్య ఏవం హి జాతా వయమిమే మునే
భ్రాతరశ్చణ్డతనయా వాయసా ఏకవింశతిః. 17

మునీ! చండతనయులమగు, ఇఱువదియొక్క వాయసములమైన, మేము ఆ యండముల నుద్భవించితిమి.

తే సంజాతా గతా వృద్ధిం తస్మిన్కమలపల్లవే
సంజాతపక్షాః సంపన్నా గగనోడ్డయనే క్షమాః. 18

మేమా నాభికమలముననే పెరుగజొచ్చితిమి; కొంతకాలమునకు రెక్కలురాగా మే మెగుర నేర్చుకొంటిమి.

మాతృభిః సహ హంసీభిర్బ్రాహ్మీ భగవతీ తతః
చిరమారాధితా సమ్యక్సమాధివిరతా సతీ. 19

భగవతియగు బ్రాహ్మి, మావలనను, తల్లులవలనను ఆరాధింపబడి, సమాధినుండి విరతమయ్యెను.

ప్రసాదపరయా కాలే భగవత్యా తతః స్వయమ్
తథాజ్ఞానుగృహీతా స్మో యేన ముక్తా వయం స్థితాః. 20

సమాధినుండి సద్యోవిరతయగు ఆపెవలన మేమనుగ్రహింపబడి, ముక్తినందితిమి.

సంశాన్తమనసః శాన్తా పరాన్తే ధ్యానసంస్థితౌ
తిష్ఠామ ఇతి నిశ్చిత్య పితుః పార్శ్వే వయం గతాః. 21

పిదప, మేము శాంతమనస్కులమై ధ్యానమొనర్ప నిశ్చయించుకొని, పితృసమీపమున కఱిగితిమి.

ఆలిఙ్గితాస్తతః పిత్రా పూజితాలమ్బుసా వయమ్
తథా దృష్టాః ప్రసాదేన సంస్థితాస్తత్ర సంయతాః. 22

మమ్ములఁగాంచి, పితృదేవుఁడు ఆలింగనమొనర్చుకొనెను; పిదప మేమలంబుస నర్చించితిమి. ఆపె మాపై ప్రసన్నవీక్షణముల నిగుడ్చ, మేము మట వినయముతో నిలఁబడితిమి.

చణ్డ ఉవాచ :—

పుత్రాః కచ్చిదపర్యన్తవాసనాతన్తుగుమ్ఫితాత్
భవన్తో నిర్గతా నూనమస్మాత్సంసారజాలకాత్. 23
నో చేద్వయం భగవతీం తదిమాం భృత్యవత్సలామ్
ప్రార్థయామో యథా యూయం భవథ జ్ఞానపారగాః. 24

చండుఁడు :—పుత్రులారా! అంతులేని వాసనలను తంతువులతో నిర్మితమైన సంసారమను వలమండి మీరు వెలువడితిరా? లేకున్న, భృత్యవత్సలయగు ఈ దేవిని, మీకు జ్ఞానమును ప్రసాదింప ప్రార్థింతును.

కాకా ఊచుః :—

తాత జ్ఞాతమలం జ్ఞేయం బ్రాహ్మ్యాదేవ్యాః ప్రసాదతః
కింత్వేకాన్తస్థితేః స్థానమభివాఞ్ఛామ ఉత్తమమ్. 25

వాయసములు :—తండ్రీ! తెలిసికొనవలసిన తత్త్వమును బ్రాహ్మీదేవికడనుండి, తెలిసికొంటిమి; కాని, ఏకాంతముననుండ తగు స్థానమును అభిలషించుచున్నాము.

చణ్డ ఉవాచ :—

సర్వరత్నగణాధారః సమస్తసురసంశ్రయః.
అస్తి హ్యేవ మహోత్సేధో మేరుర్నామ మహీధరః. 26

చండుఁడు :—సర్వరత్నములకు ఆకరమును, సమస్త దేవతలకు నెలవైనదియును, గొప్ప శిఖరములు గలదియునునగు మేరువను పర్వతమొకటి యున్నది.

లసచ్చన్ద్రార్కదీపస్య భూతవృన్దకలత్రిణః
బ్రహ్మాణ్డమణ్డపస్యాన్తస్తమ్భః కనకనిర్మితః. 27

సూర్యచంద్రులను దీపములు గల్గి, ప్రాణి సమూహములను పరివారముతో నొప్పు బ్రహ్మాండ మండపమునకయ్యది, రత్నస్తంభమన తనరారుచున్నది.

సౌవర్ణచన్ద్రపీఠాఢ్యో రత్నాఢ్యశిఖరాఙ్గులిః
ధ్వనద్ద్వీపాబ్ధివలయో భువోన్నమితో భుజః. 28

అయ్యది సువర్ణచంద్రునివలె తోచు పీఠముతోఁగూడి, వసుంధరయొక్క ఉన్నమిత (లేవనెత్తబడిన) బాహువా యనిపించుచుండును; దాని రత్నమయశిఖరములే అంగుళులవలె తోచుచు, చతుస్సముద్రవలయములును, వాటనున్న ద్వీపవలయములును, ఆ యంగుళుల కణపులోయన నొప్పుచుండును.

వృతః కులాద్రిసామన్తైర్జమ్బ్వాద్వీపాసనే స్థితః
రాజా చన్ద్రార్కనయనే భ్రమయఞ్ఛైలసంసది. 29

అయ్యది కుల - పర్వతములను సామంతరాజులచే పరివేష్టింపబడి, జంబూద్వీప - సింహాసనమును నధిష్ఠించియున్నది; అది చంద్రార్క-నయనముల ద్రిప్పుచు, రాజవ నొప్పారుచున్నది.

తారౌఘమాలతీమాల్యో దిగ్దశైకామ్బరామ్బరః
నాగజాతిద్వయస్థాత్మా నాకనాయకభూషణః 30

దశదిశలను అంబరములను ధరించి, తరుసమూహములను మాలతీమాలచే భూషితమై, గజములకును సర్పములకును గృహమై, దేవతలను శ్రేష్ఠభూషణముల ధరించి, అది యొప్పారుచున్నది.

దిగఙ్గనాభిరభితో రమ్యాభిః పురభూషణైః
ఏష నిష్యన్దిభిః శీతైర్ద్వీజితో ఘనచామరైః. 31

దాని ద్వారములను దిగంగనలు మనోహరనగరభూషణముల లలంకరించుకొని, మేఘములను గొప్ప చామరముల గైకొని, శీతలములగు నీటితుంపురుల జల్లుచు, వీచుచున్నారు.

షోడశాస్య సహస్రాణి యోజనానామధః క్షితౌ
స్థితాః పాదాః ప్రపూజ్యన్తే నాగాసురమహోరగైః 32

నాగ, అసుర, మహోరగములచే ప్రపూజితమగు దాని పాదములు, షోడశసహస్రయోజన దూరము పాతాళమున వ్యాపించియున్నవి.

అశీతిశ్చ సహస్రాణి దేహోఽస్యార్కేన్దులోచనః
పూజ్యతే నాకసదనే సురగన్ధర్వకిన్నరైః. 33

సుర, గంధర్వ, కిన్నర ప్రపూజితమును, సూర్యచంద్రనేత్రద్వయయుతమునునగు దాని శిరము యెనబదివేల యోజనములవఱకు స్వర్గమున వ్యాప్తమైయున్నది,

చతుర్దశవిధాన్యేనం గృహస్థమివ బాన్ధవాః
ఉపజీవన్తి భూతాని మిథో దృష్టపురాస్పదమ్. 34

బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులు, దేవతలు, పితరులు, గంధర్వులు, కిన్నరులు, అప్సరసలు, విద్యాధరులు, యక్షులు, రాక్షసులు, ప్రమథులు, గుహ్యులు, నాగులు, అను చతుర్దశవిధ ప్రాణులు, ఒకరి కొక రగుపించకుండ గృహస్థు నాశ్రయించుకొని బందుగులవలె నివసించుచున్నారు.

అస్య త్వీశానదిగ్భాగే పద్మరాగమయం బృహత్
విద్యతే శృఙ్గమపరో దివాకర ఇవోదితః. 35

దీని ఈశాన దిగ్భాగమున, బాలసూర్యునివలెదోచు పద్మరాగమయశృంగ మొకటి యున్నది.

అస్యాస్తి దృష్టే భూతౌఘవృతః కల్పతరుర్మహాన్
జగతః శిఖరాదర్శే ప్రతిబిమ్బమివ స్థితః. 36

దానిమీద, ప్రాణుల కాకరమగు కల్పతరువొకటి, శిఖరమను అద్దమున ప్రతిఫలించు జగత్తువలె నున్నది.

తస్యాస్తి దక్షిణస్కన్ధే శాఖా కనకపల్లవా
రత్నస్తబకనీనేరన్ధ్రా చన్ద్రబిమ్బాల్లసత్ఫలా. 37

దాని దక్షిణస్కంధమున కనకపల్లవములతోగూడిన శాఖయొకటియున్నది. అది రత్నగుచ్ఛములతో దట్టమై, చంద్రబింబములవలె రాజిల్లు ఫలముల గల్గియున్నది.

తత్ర పూర్వం మయా నీడం కృతమాసీత్స్ఫురన్మణి
దేవ్యాం ధ్యాననిషణ్ణాయాం యస్మిన్నిల రమే సుతాః. 38

సుతులారా! అట పూర్వము మణులతో ప్రజ్వరిల్లు గూటినొకదానిని నేను నిర్మించియుంటిని. దేవి ధ్యానమగ్నయైనప్పుడు నేనా గూటికఱిగి విశ్రమించుచుంటిని.

రత్నపుష్పదలచ్ఛన్నం రసాయనఫలాన్వితమ్
చిన్తామణిశిలాకాభిర్విహితాలిన్దసంస్థితి. 39

ఆ నిలాయము రత్న - పుష్పదళములతో గప్పబడియున్నది; దాని బహిర్ద్వారము చింతామణిశిలాకలతో నిర్మింపబడినది. అట, రసాయనఫలము లనేకములున్నవి.

బుద్ధిపూర్వసమాచారైః సంపూర్ణం కాకపుత్రకైః
శీతలాభ్యన్తరం హృద్యం పూరితం కుసుమోత్కరైః. 40

అట, విచారపూర్వకముగ విహరించు కాకపుత్రులనేకులు నివసించుచున్నారు. అది, శీతలపుష్పములతో గప్పబడి, హృద్యమైయున్నది,

తద్గచ్ఛత సుతా నీడం దుర్గం నాకవతామపి
భోగం మోక్షం చ తత్రస్థా నిర్విఘ్నమలమాప్స్యథ. 41

సుతులారా! మీ రా గూటికిఁ బొండు; అది దేవతలకుగూడ దుర్గమము. మీరట నివసించిన భోగమోక్షముల రెంటిని నిర్విఘ్నముగ బొందగలరు.

ఇత్యుక్త్వాస్మాన్పితా తత్ర చుచుమ్బాభ్యాలిలిఙ్గ చ
దదౌ దేవ్యా యదా నీతమస్మభ్యం చ తదామిషమ్. 42

ఇట్లు మాపిత పల్కి, ఆలింగనచుంబనముల నొనర్చి, దేవికొఱకు గొనివచ్చిన మాంసమును మాకొసఁగెను.

తద్భుక్త్వా చరణౌ దేవ్యాః పితుశ్చైవాభివాద్య చ
విన్ధ్యకచ్ఛాద్వయం తస్మాత్థానాదాలమ్బుసాత్ప్లుతాః. 43

దానిని భుజించి, దేవికిని, పితకును మ్రొక్కి, అలంబుసాదేవి వాసమగు వింధ్యకచ్ఛము నుండి వెలువడితిమి.

క్రమేణాకాశముల్లఙ్ఘ్య నిర్గత్యామ్బుదకోటరైః
పవనస్కన్ధమాసాద్య వన్దితవ్యోమచారిణః. 44

క్రమముగ ఆకాశపథము నధిగమించి, మేఘమండలమునుదాటి, వాయుమండలము నతిక్రమించి, అగపడిన దేవతలకు మ్రొక్కితిమి.

పరివృత్త్య దినాధీశం లోకాన్తరపురం గతాః
స్వర్గముల్లఙ్ఘ్య యాతాః స్మో బ్రహ్మలోకం మునీశ్వర. 45

మునీశ్వరా! సూర్యమండలమును దాటి స్వర్గమును, అమరావతిని వీడి బ్రహ్మలోకమున కతెగితిమి.

ప్రణామపూర్వం తత్రైతద్యథావత్తత్పితుర్వచః
మాత్రేచ భగవత్యైచ బ్రాహ్మ్యై చాశు నివేదితమ్. 46

మాతకును, బ్రాహ్మికిని మ్రొక్కి, తండ్రిపల్కులను అన్నిటిని నివేదించితిమి.

తాభ్యాం సస్నేహమాలిఙ్గ్య గచ్ఛతేత్యాజ్ఞయైధితాః
వయం కృతనమస్కారా బ్రహ్మలోకాద్వినిర్గతాః. 47

వారికడ స్నేహసమాలింగనమునుబడసి, 'వెళ్లుడు' అని ఆజ్ఞాపింపబడి, నమస్కారమొనర్చి, బ్రహ్మలోకమునుండి వెలువడితిమి.

ఉల్లఙ్ఘ్య లోకపాలానాం పురీస్తపనభాస్వరాః
ఆకాశగామినో లోలాః పవనస్కన్ధచారిణః. 48
ఇమం కల్పతరుం ప్రాప్య నిజం నీడం ప్రవిశ్య చ
దూరస్థబాధాస్తిష్ఠామో మునే మౌనమవస్థితాః. 49

మునీ! సూర్యునివలె ప్రకాశించు లోకపాలకుల పురములదాటి, వాతస్కంధము నధిరోహించి, ఆకాశపథమునంటి, ఈ కల్పతరువునుజేరి, గూటుప్రవేశించి, నిర్విఘ్నముగ మౌనము నాశ్రయించియుంటిమి.

జాతా యథా వయమిమే స్థితిమాగతాశ్చ
సంప్రాప్య బోధముపశాన్తధియో యథావత్
ఏతత్తదుక్తమవిమఖణ్డమలం మయా తే
శేషేణ మాం సమనుశాధి మహానుభావ. 50

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే అలయలాభో నామ
ఏకోనవింశతితమః సర్గః ॥ 19 ॥

మహానుభావా! మేమెట్లు పుట్టినది, పెరిగినది, జ్ఞానమును బొంది ఎట్లు ఉపశాంతమనస్కులమైనది, మీ కున్నదున్నట్లు జెప్పితిని; మిగిలినది కూడ జెప్ప నాజ్ఞాపించిన జెప్పెదను.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున అలయలాభమను
ఏకోనవింశతితమ సర్గము ॥ 19 ॥

## వింశః సర్గః.

[ప్రతికల్పం జగత్సామ్యం భ్రాతౄణాం నిధనం తథా
ప్రలయేఽపి భుశుణ్డోఽత్ర స్వచిత్తస్థైర్యముక్తవాన్.

ప్రతికల్పమునను జగత్తుయొక్క సామ్యము, సోదరుల మరణము, ప్రళయమందును తన చిత్తము స్థిరముగానుండు విషయము, భుశుండుడు వర్ణించుట.]

భుశుణ్డ ఉవాచ :—

ఆసీత్కించిత్పురా కల్పే జగద్యచ్చిరమాస్థితమ్
సంనివేశేన చైతద్వదద్యాపి చ న దూరగమ్. 1

తదేతద్వృత్తమభ్యాసాద్వర్తమానేన వర్ణితమ్
మయా మునీన్ద్ర బోధాయ ప్రాగ్జన్మసామ్యదర్శినా. 2

భుశుండుడు :—మునీంద్రా! పూర్వపూర్వకల్పములందున్నట్లే, ఇప్పుడుగూడ ఈ జగత్తు వెలయుచున్నది. అందువలన, నేను లెక్కలేనన్ని కల్పవృక్షముల మీద నివసించియున్నను, నా నిలాయమును, ఇప్పుడున్నట్లే వర్ణించుచున్నాను. ఈవర్తమానకల్పమును, పూర్వకల్పములవలెనే దర్శించుచున్నాను.

అద్య మే ఫలితం పుణ్యైశ్చిరకాలోపసంభృతైః
నిర్విఘ్నమేవ పశ్యామి యద్భవన్తం మునే తతః. 3

మునీ! మిమ్ములను నిర్విఘ్నముగ దర్శించుటగూడ, మత్పూర్వకృతపుణ్యపుంజముల ఫలమేయైయున్నది.

ఇదం నీడమిమాం శాఖామహం చాయమయం ద్రుమః
అద్య పావనతాం ప్రాప్తాన్యేతాని తవ దర్శనాత్. 4

మీ దర్శనఫలముగ, ఈ కల్పవృక్షము, దీని శాఖ, గూడు, నేనును పవిత్రులమైతిమి.

ఇదమర్ఘ్యమిదం పాద్యం గృహీత్వా విహగార్పితమ్
నూనం పావనతాం నీత్వా శేషేణాదిశ చాశు భోః. 5

మదర్పితములగు ఈ అర్ఘ్యపాద్యాదులను స్వీకరించి, మమ్ము ఇంతకెక్కుడుగ పవిత్రులనొనర్చి, మిగిలిన దానిని ఆజ్ఞాపింపుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇదమర్ఘ్యం చ పాద్యం చ భూయో దత్తవతి స్వయమ్
భుశుణ్డవిహగే తస్మిన్నిదం రామాహముక్తవాన్. 6

వసిష్ఠుఁడు :—రామా! భుశుండుడట్లు పల్కి, మరలనొసగిన అర్ఘ్యపాద్యాదులను గ్రహించి, నేనిట్లు ప్రశ్నించితిని.

భ్రాతరస్తే విహగేశ తాదృక్సత్వా మహాధియః
ఇహ కస్మాన్న దృశ్యన్తే త్వమేవైకో హి దృశ్యతే.

పక్షిరాజా! నిన్నుబోలిన శక్తిశాలులును, బుద్ధిమంతులునునగు నీ సోదరీలు అగపడకున్నా రేమి? నీ వొక్కఁడవే ఏలయున్నావు?

భుశుణ్డ ఉవాచ:—

తిష్ఠతామిహ నః కాలో మహానతిగతో మునే
యుగానాం పఙ్క్తయః క్షీణా దివసానామివానఘ. 8

భుశుండుడు :—ఒక దానినంటి మఱొకటిగా అరుగు దినముల సమూహములవలె, అనేకయుగములు గతించినవి; చాలకాలము గడచినది; మునీ! అప్పుడు మేమందరము కలసి ఇటనుంటిమి.

ఏతావతాథ కాలేన సర్వ ఏవ మమానుజాః
తనూ స్తృణమివ త్యక్త్వా శివే పరిణతాః పదే. 9

ఈలోపున నా అనుజులందఱు, శరీరమును తృణమువలె త్యజించి, శివపదమును బొందిరి.

దీర్ఘాయుషో మహాన్తోఽపి సన్తోఽపి బలినోఽపి చ
సర్వ ఏవ నిగీర్యన్తే కాలేనాకలితాత్మనా. 10

బలవంతులును, దీర్ఘాయువులునునగు మహాత్ములనేకులున్నను, వారి నందఱిని అలక్షితస్వరూపమగు కాలము మ్రింగివైచినది.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

స్కన్దవృష్ట్యర్కధారోష్ణశశిషు వహత్స్వవిరతం జవాత్
వాతస్కన్ధానిపాతేషు కచ్చిత్తాత న ఖిద్యసే. 11

శ్రీ వసిష్ఠుడు :—ద్వాదశాదిత్యులను చంద్రబింబములను కంఠహారముగ ధరించి చెలరేగు వాతస్కంధాది ప్రళయవాయువుల నీవు క్షీణింపక ఎట్లు వెలయుచున్నాడవు?

దగ్ధోదయాస్తశైలేన్ద్రవనవృన్దైర్హి రవేః కరైః
చిరమత్యన్తమాసన్నైః కచ్చిత్తాత న ఖిద్యసే. 12

ఉదయాస్తమయదేశముల నుదయించుచు భూమండలమును సమీపించి, వనములనన్నిటిని దహించు సూర్యకిరణములు నీకు కష్టమనిపింపలేదా?

ఇన్దోరథ కరైః శీతైః పాషాణీకృతవారిభిః
ఆసన్నకరకాపాతైః కచ్చిత్తాత న ఖిద్యసే. 13

అత్యంతశీతలములగు చంద్రుని రథ–కిరణములు నీటిని గడ్డకట్టించి, మంచుగడ్డల కురిపించునప్పుడు, నీ వెట్లు సహించియుండగలిగితివి?

అజస్రమిహ విశ్రాన్తైః కల్పజీమూతమణ్డలైః
పరశుచ్ఛేదనీహారైః కచ్చిత్తాత న ఖిద్యసే. 14

గొడ్డలి వేటులకుఁగూడ దెగని మంచుగడ్డలనదగు, ప్రళయమేఘ సమూహము లిట గుంపులుగ నివసించుచుండ, నీకు కష్టమనిపింపదా?

విషమైర్ఝాగతైః క్షోభైరుచ్చైస్తరపదస్థితః
కథం న క్షోభమాయాతి కల్పవృక్షోఽయమున్నతః. 15

జగత్తు విషమములగు క్షోబలచే దద్దరిల్లుచుండ, అత్యంత ఉన్నతమును, ఎత్తుననున్నదియునగు ఈ కల్పవృక్షమెట్లు నశింపకుండ నుండగలుగుచున్నది.?

భుశుణ్డ ఉవాచ:—

నిరాలమ్బాస్పదా బ్రహ్మన్సర్వలోకావహేలితా
తుచ్ఛేయం సర్వభూతానాం మధ్యే విహగజీవికా. 16

భుశుండుడు :—బ్రహ్మజ్ఞా! నిరాలంబమును (ఆకాశజీవి), సర్వజనదూషితమునునగు, ఈ విహగజీవనము అన్ని జీవనములకంటె తుచ్ఛమైనది.

ఈదృశేషు చ భూతేషు నిర్జరేషు వనేషు చ
కల్పితాస్థాస్థితిర్ధాత్రా శూన్యే వా వ్యోమవర్త్మని. 17

ఇట్టి తుచ్ఛజీవములకొఱకు, విధాత నిర్జనవనములను, శూన్యమగు ఆకాశమార్గమును జీవికగా కల్పించినాడు.

కథమస్యాం ప్రభో జాతౌ జాతస్య చిరజీవినః
ఆశాపాశనిబద్ధస్య విహగస్య విశోకితా. 18

ప్రభూ! ఇట్టి జాతియందు జన్మించి, ఆశాపాశనిబద్ధుడనై, చిరజీవినగు నా దుఃఖము నెట్లు వర్ణింతును?

వయం తు భగవన్నిత్యమాత్మసంతోషమాస్థితాః
న కదాచన నీరూపే ముహ్యామో జాతవిభ్రమైః. 19

భగవంతుడా! మేము నిత్యము ఆత్మతృప్తిని బొంది, నిర్విశేషవస్తువున గల్గు ఈ జన్మాదభ్రమలకు లోనుగాకున్నాము.

స్వభావమాత్రసంతుష్టాః కష్టైర్ముక్తా విచేష్టితైః
క్షిపామః కేవలం కాలమస్మిన్బ్రహ్మన్నిజాలయే. 20

బ్రహ్మజ్ఞా! మేము స్వాభావికమగు స్వస్వరూపముననే సంతుష్టులమై, నిజగృహమున కాలము గడుపుచున్నారము; కష్టదాయకములగు ప్రయత్నములనుండి విడివడితిమి.

న జీవితాన్న మరణాత్కర్మదేహస్య రోధనమ్
యథాస్థితేన తిష్ఠామ స్తథైవా స్తంగతేహితాః. 21

మేము జీవించి, ఐహికాముష్మికకర్మల నొనరింపగోరము; మృతించి శరీరమును త్యజింపగోరము. ఇప్పుడున్నట్లు, నిత్యసిద్ధనిరతిశయానందస్వరూపముననే, పూర్ణకాములమై, నివసించుచు కాలము గడుపుదుము.

ఆలోకితా లోకదశా దృష్టా దృష్టాన్తదృష్టయః
నూనం సంత్యక్తమస్మాకం మనసా చఞ్చలం వపుః. 22

మేము లోకముయొక్క జననమరణముల ననేకముగ గాంచితిమి; జగన్మిథ్యాత్వనిర్ణయములగు స్వప్నాద్యనేక దృష్టాంతముల నెఱిగితిమి; అందువలన మామనస్సు చంచలాకారమునువీడి, సామ్యమును బొందినది.

అనారతనిజాలోకే నిత్యం చాపరితాపిని
కల్పాగస్యోపరి సదా వేద్మి కాలకలాగతిమ్. 23

మే మీ కల్పవృక్షమున, త్రితాపవిహీనమగు ఆత్మలోకముననుండి, సూక్ష్మమగు కాలగతిని జూచుచున్నారము.

రత్నగుచ్ఛప్రకాశాఢ్యే బ్రహ్మన్కల్పలతాగృహే
ప్రాణాపానప్రవాహేణ వేద్మి తల్పమఖణ్డితమ్. 24

బ్రహ్మజ్ఞుడా! సర్వదా రత్నప్రభామండితమై, దినరాత్రివిభేదహీనమగు ఈ కల్పలతాభవనముననున్నను, ప్రాణాపానవాయువుల సంచారమును బట్టి, కాలగతిని గ్రహించుచున్నారము.

అవిజ్ఞాతదివారాత్రౌ హ్యస్మిన్నుచ్చైః శిలోచ్చయే
జానామి నిజయా బుద్ధ్యా లోకకాలక్రమస్థితిమ్. 25

వాస్తవమున కిట దినరాత్రిభేదమును గ్రహింపజాలము; అయినను, స్వబుద్ధిబలమున త్రికాలముల గ్రహింపగలుగుచున్నాను.

సారాసారాపరిచ్ఛేది బోధాద్విశ్రాన్తిమాగతమ్
నిరస్తచాపలం శాన్తం సుస్థిరం మే మునే మనః. 26

మునీ! మా మనస్సు, తత్త్వజ్ఞానబలమున, సారాసారవిభేదమును వీడి, విశ్రాంతినందుచున్నది; అందువలన, నామనస్సు శాంతము, సుస్థిరమును నైయున్నది. దుఃఖమునకు తావులేదు.

సంసారవ్యవహారోత్థైరాశాపాశైరసన్మయైః
ఉద్గారైరివ భూకాకో న వైవశ్యం వ్రజామ్యహమ్. 27

సంసారవ్యవహారముల జనించు తుచ్ఛములగు ఆశాపాశములంబడి, భూకాకములవలె ఎవరైన తుమ్మినమాత్రముననే భయపడను.

పరోపశమధర్మిణ్యా వయమాలోకశీతయా
పశ్యన్తో జాగతీం మాయాంధియా ధైర్యముపాగతాః. 28

పరమశాంతితోగూడుకొనిన దృక్కులబరపుచు, ఈ మాయిక జగత్తుల నిరీక్షించుచున్నాము; అవి, వినష్టములైనను ధైర్యమును కోలుపోకుండనున్నాము.

భీమాస్వపి మహాబుద్ధే దశాస్వచలబుద్ధయః
వినిర్మలోపలాకారాః సంప్రాప్తాసు యథాక్రమమ్. 29

మహామతీ! భయంకరములగు ఆపదలోనగూడినను, పాషాణమువలె స్థిరతనువహించి స్ఫటికమణివలె కేవలము సాక్షిభూతులముగ వెలయుచున్నారము.

ఇయమారమ్భసుభగా తరలా జాగతీ స్థితిః
భూయో భూయః పరామృష్టా నచ కించన బాధతే. 30

ఆరంభమున సుఖకరముగ నుండునదియును, చేలవమునునగు యీ జగత్తునందలి సుఖములు మాటిమాటికి వచ్చుచుపోవుచున్నను మమ్ము బాధింపకున్నవి.

సర్వాణ్యేవ ప్రయాన్త్యేవ సమాయాన్తి చ వా నవా
భగవన్భూతజాలాని భయమస్మాకమత్ర కిమ్. 31

భగవంతుడా! ఈభూతములు జన్మించినను, మరణించినను, మరణింపకున్నను మాకేమి?

భూతజాలతరఙ్గిణ్యో విశన్త్యః కాలసాగరే
వయం సంసారసరితస్తటస్థా అప్యనాదృతాః. 32

భూతజాలములను నదులు కాలమను సముద్రమున ప్రవేశించుచున్నవి; మేమిట తటస్థుల ముగనుండి, దానిని లెక్కగొనకున్నారము.

నోజ్ఝామో నచ గృహ్ణీమస్తిష్ఠామో నేహ చ స్థితాః
మృదుపాదా దృశా క్రూరా వయమస్మిన్ద్రుమే స్థితాః. 33

మేమిట నెద్దానిని గ్రహించుచుండుటలేదు. లేక, త్యజించుచుండుటలేదు. మా పదములు సంసారమున జాగ్రత్తగా మసలుచుండుటవలన మృదులములును, దానిని జింపుటవలన క్రూరములు నునై తనరుచున్నవి. ఈ తీరున, మేమీ కల్పవృక్షమున నివసించుచున్నారము.

హీతశోకభయాయాసైస్త్వాదృశైః పురుషోత్తమైః
తుష్టైరనుగృహీతాః స్మః సంస్థితా విగతామయాః. 34

శోకభయరహితులగు మీవంటి పురుషోత్తములవలన అనుగ్రహింపబడి, మాయారహితుల మై, వెలయుచున్నాము.

తతస్తతశ్చ పర్యస్తం లుఠితం నచ వృత్తిషు
నాపరామృష్టతత్త్వార్థమస్మాకం భగవన్మనః. 35

భగవంతుడా! మా మనస్సు, ఏవైన సంసారవ్యవహారముల సరిజూడ, ఇటునటు నటిగినను, తత్త్వము నటియుటవలన రాగాదులకు వశీభూతముకాకుండనున్నది.

నిర్వికారే గతక్షోభే చాత్మన్యుపశమం గతే
చిత్తరఙ్గాః ప్రబుద్ధాః స్మః పర్వణీవ మహాబ్ధయః. 36

మా మనస్సు, నిర్వికారమును, క్లేశరహితమునునగు ఆత్మయందు ఉపశమింప, చిత్-తరంగ ములు (సర్వత్ర బ్రహ్మాకారకవృత్తి జనియించుటవలన) పర్వదినమునందలి సముద్రకెరటములవలె, లేచుచున్నవి.

భవదాగమనాద్బ్రహన్నిదానీం ముదితాశయాః
మన్దరోద్ధూతసర్వాఙ్గః క్షీరోదో యేన తన్యతే. 37

బ్రహ్మజ్ఞా! అత్యంతకష్టమున మందరగిరితో పాలసముద్రమును దరచ, లభించెడు ఆనందము నే మీరాకవలన మేము పొందుచున్నాము.

నాతః పరతరం కించిన్మన్యే కుశలమాత్మనః
సన్తో యదనుగమ్యన్తే సంత్యక్తసకలైషణాః. 38

ఏషణాత్యాగులగు మహాత్ములరుదెంచుటకంటె, ఆత్మకళ్యాణమింకొకటి ఉండదని ఎంచుచున్నాము.

ఆపాతమాత్రరమ్యేభ్యో భోగేభ్యః కిము వాప్యతే
సత్సఙ్గచిన్తామణితః సర్వసారమవాప్యతే. 39

ఆపాతరమ్యములగు భోగములనుండి ఏమి లభింపగలదు? సత్సంగమను చింతామణినుండి సర్వసారమగు జ్ఞానము లభింపగలదు.

స్నిగ్ధగమ్భీరమసృణమధురోదారధీరవాక్
త్రైలోక్య పద్మకోశేఽస్మిన్ త్వమేకః షట్పదాయసే. 40

మీ వాక్యములు ధీరగంభీరములు, స్నిగ్ధకోమలములు, సరళమాధుర్యమయములునై తనరాయచున్నవి. మీరు, త్రైలోక్య - పద్మ - షట్పదములు. (అనగా, మీరొక్కరే సారమగు జ్ఞానమును గ్రహింపగలిగితిరి, అని భావము)

అధిగతపరమాత్మనోఽపి మన్యే
భవదవలోకన శాన్తదుష్కృతస్య
మమ సఫలమిహాద్య జన్మ సాధో
సకలభయాపహరో హి సాధుసఙ్గః. 41

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే భుశుణ్డస్వరూపనిరూపణం నామ వింశః సర్గః ॥ 20 ॥

సాధో! సాధుసంగము సకలభయాపహరము. మేమాత్మతత్త్వమును గ్రహించియున్నను, మీదర్శనమున మా దుష్కృతములన్నియు నశించి, జన్మ సఫలమైనదని తలచుచున్నాడను.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున భుశుండస్వరూపనిరూపణమను వింశతితమ సర్గము ॥ 20 ॥

---

## ఏకవింశః సర్గః

[కల్పవృక్షస్య మాహాత్మ్యం ప్రలయే ధారణాస్థితిః
నియతిర్యాభిరిచిత్రార్థస్మృతిశ్చాత్రోపవర్ణ్యతే.

కల్పవృక్షమాహాత్మ్యము, ప్రళయమందలి ధారణాస్థితి, నియతి, అనేక విచిత్రార్థముల స్మరించుటయను విషయములిందు గలవు.]

భుశుణ్డ ఉవాచ :—

యుగక్షోభేషు ఘోరేషు వాత్యాసు విషమాసు చ
సుస్థిరః కల్పవృక్షోఽయం న కదాచన కమ్పతే. 1

భుశుండుడు:- ఘోరములగు కల్పాంతవిక్షోభములరుదెంచినను, విషమములగు గాలులు వీచినను, ఈకల్పవృక్షము కంపింపదు, స్థిరముగనే యుండును.

అగమ్యోఽయం సమగ్రాణాం లోకాన్తరవిహారిణామ్
భూతానాం తేన తిష్ఠామ ఇహ సాధో సుఖేన వై. 2

సాధో! లోకాంతరముల చరించు జనులందఱికినిగూడ ఇది అగమ్యమైయున్నది; అందువలన, నే నెట్టిబాధయు లేకుండ నిట సుఖముగనున్నాను.

హిరణ్యాక్షో ధరాపీఠం ద్వీపసప్తకవేష్టితమ్
యదా జహార తరసా నాకమ్పత తదా తరుః. 3

సప్తద్వీపములతో గూడిన ధరాపీఠమును హిరణ్యాక్షుడు అపహరించినను, దివ్యప్రభావము వలన ఈకల్పవృక్షము కదలకుండ నున్నది.

యదా లోలాయితవపుర్బభూవామరపర్వతః
సర్వతో దత్తసామ్యాద్రిస్తదా నాకమ్పత ద్రుమః. 4

వరాహమూర్తి హిరణ్యాక్షవేష్టితయగు భూమండలమును మరల సరిచేసి పెట్టునప్పుడు అది కంపించినను, ఈకల్పవృక్షము కంపింపదు.

భుజావష్టమ్భవిషమస్మేరుర్నారాయణో యదా
మన్దరం ప్రోద్దధారాద్రిం తదా నాకమ్పత ద్రుమః. 5

కూర్మమూర్తి తన భుజముల ధరించి పాలసముద్రమును తరచునప్పుడుగూడ ఈకల్పము కంపింపకుండ నుండును.

యదా సురాసురక్షోభపతచ్చన్ద్రార్కమణ్డలమ్
ఆసీజ్జగదతిక్షుబ్ధం తదా నాకమ్పత ద్రుమః. 6

రాక్షసులకును, దేవతలకును యుద్ధము జరుగుచుండ, సూర్యచంద్రమండలములు పడిపోయి, జగత్తు అత్యంతక్షోభను చెందినను, ఈ కల్పవృక్షము చలింపదు.

ఉన్మీలితాద్రీన్ద్రశిలా యదోత్పాతానిలా వవుః
అధూతమేరుతరవస్తదా నాకమ్పత ద్రుమః. 7

ఉత్పాతముల గూర్చు ప్రళయవాయువులు శిలాఖండముల పెకలించి, ఇటనున్న ఇతర వృక్షముల నా శిలలతో బడగొట్టి వినాశమొనర్చినను, ఈకల్పవృక్షము కంపింపకుండెను.

యదా క్షీరోదలోలాద్రికన్దరానిలకమ్పితాః
కల్పాభ్రపఙ్క్తయశ్చేరు స్తదా నాకమ్పత ద్రుమః 8

క్షీరసముద్రమున కంపితమగు మందరగిరికందరవాతముల చలింపబడు ప్రళయమేఘోదయమునగూడ, ఈకల్పకము చలింపకుండెను.

యదా సమ న్తతో మేరుః కాలనేమిభుజా న్తరే
కించిదున్మూలితోఽతిష్ఠత్తదా నాకమ్పత ద్రుమః. 9

కాలనేమి భుజమధ్యమున జిక్కి మేరుపర్వతమొకింత చలించినప్పుడుగూడ, ఈకల్పకము చలింపకుండెను.

పక్షీశపక్షపవనా అమృతాక్రా న్తిసంగరే
యదావపుః పతత్సిద్ధా స్తదాయం నాపతద్ద్రుమః. 10

గరుడుడు అమృతమును గొనిరా యుద్ధమొనర్చినప్పుడు అతని రెక్కలగాలికి, సిద్ధులుకూడ పడిపోయిరి; కాని ఈకల్పవృక్షము చలింపకుండెను.

యదా శేషాకృతిం రుద్రో న సమా హైకచేష్టితామ్
యయౌ గరుత్మాన్బ్రహ్మాణ్డం తదా నాకమ్పత ద్రుమః. 11

గరుడుడు జన్మించి రథసమున ఈభూమండలమును జలమగ్నమొనర్పగోరినప్పుడు, సంకర్షణరుద్రుడు, సహస్రఫణముల భూమిని దాల్చెను; అప్పుడుకూడ ఈకల్పకము కంపింపలేదు.

యదా కల్పానలశిఖాః శైలాబ్ధిసకలోల్బణః
శేషః ఫణాభి స్తత్యాజ తదా నాకమ్పతద్రుమః. 12

శేషుడు సహస్రఫణముల సముద్రపర్వతములకుగూడదుస్సహమగు కల్పాగ్నికీలలను త్యజించినప్పుడుగూడ, ఈ కల్పద్రుమము కంపింపకుండెను.

ఏవంరూపే ద్రుమవరే తిష్ఠతామాపదః కుతః
అస్మాకం మునిశార్దూల దౌఃస్థిత్యేన కిలాపదః. 13

ఇట్లు అచలమైయుండు కల్పవృక్షమున వసించు మా కాపద ఎటనున్నది? మునిశార్దూలా! చెడుతావున నుండువారికే ఆపదలు వచ్చుచుండును.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

కల్పా న్తేషు మహాబుద్ధే వహత్సూత్పాతవాయుషు
ప్రప తత్స్వర్కేన్దుభాస్కరేషు కథం తిష్ఠసి విజ్వరః. 14

శ్రీ వసిష్ఠుడు :—మహామతీ! కల్పాంతమున ప్రళయవాయువులు వీచి, సూర్యచంద్రులుగూడ త్రుళ్లినప్పుడు, నీవెట్లు చలింపకుండ నుండగలుగుచున్నావు?

భుశుణ్డ ఉవాచ :—

యదా పపాత కల్పా న్తే వ్యవహారో జగత్స్థితౌ
కృతఘ్న ఇవ సన్మిత్రం తదా నీడం త్యజామ్యహమ్. 15

భుశుండుడు :—కల్పాంతమున వ్యవహారజగత్తు మాటుమణిగిపోవునప్పుడు, నేనీ నీడమును, సన్మిత్రుని కృతఘ్నుడు త్యజించునట్లు, త్యజించుదును.

ఆకాశే ఏవ తిష్ఠామి విగతాఖిలకల్పనః
స్తబ్ధప్రకృతిసర్వాఙ్గో మనో నిర్వాసనం యథా. 16

మనస్సు వాసనారహితమైన, శరీరాంగములు స్తబ్ధములగునట్లు, కల్పనలన్నిటినివీడి ఆకాశమున క్రియారహితుడనై వివసింతును.

ప్రపతన్తి యదాదిత్యాః శకలీకృతభూధరాః
వారుణీం ధారణాం బద్ధ్వా తదా తిష్ఠామి ధీరధీః. 17

ద్వాదశాదిత్యులు ఉదయించి భూధరముల ఖండములనొనర్చుచు తాపమొసగునప్పుడు నేను వారుణీధారణమునొనర్చి, (అత్యంతశీతలుడును, సకలదిఙ్మండలవ్యాపియును, అపరిచ్ఛేదాత్మయునునగు వరుణుడే నేను అని భావించి) ధీరుడనై చలింపకుందును.

యదా శకలితాద్రీన్ద్రా వాన్తి ప్రలయవాయవః
పార్వతీం ధారణాం బద్ధ్వా ఖే తిష్ఠామ్యచలం తదా. 18

గిరులను పెల్లగించుచు ప్రళయవాయువులు వీచునప్పుడు నేను పార్వతీధారణనుదాల్చి, ఆకాశమున నచలుడనై యుందును *

జగద్గలితమేర్వాది యాత్యేకార్ణవతాం యదా
వాయవీం ధారణాం బద్ధ్వా సంప్లవేఽచలధీస్తదా. 19

మేర్వాదిపర్వతములు కఱిగిపోయి, జగత్తు ఏకార్ణవమవ, నేను వాయవీయధారణబూని ఆకాశమున వాయువువలె ప్రవహించుచుందును.

బ్రహ్మాణ్డపారమాసాద్య తత్త్వాన్తే విమలే పదే
సుషుప్తావస్థయా తావత్తిష్ఠామ్యచలరూపయా. 20

స్థూలసూక్ష్మసమిష్టులు, తదితరతత్త్వములు విలీనమైపోయినప్పుడు, నేనీ పరమపదమున అచలుడనై, సుషుప్తునివలె వెలయుచుందును.

యావత్పునః కమలజః సృష్టికర్మణి తిష్ఠతి
తత్ర ప్రవిశ్య బ్రహ్మాణ్డం తిష్ఠామి విహగాలయే. 21

మరల బ్రహ్మ సృష్టిని దలపెట్టునంతదనుక, అట్లేయుండి, పిదప మరల బ్రహ్మాండమున ప్రవేశించి ఈ కల్పవృక్ష — కులాయమున ప్రవేశించుచున్నాను.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథా తిష్ఠసి పక్షీన్ద్ర ధారణాభిరఖణ్డితః
కల్పాన్తేషు తథా కస్మాన్నాన్యే తిష్ఠన్తి యోగినః. 22

* వారుణీధారణవలె తదాత్మబుద్ధియని, ఈ ధారణలన్నిటిపట్ల, గ్రాహ్యము — అను.

శ్రీ వసిష్ఠుఁడు :—పక్షీంద్రా ! నీవిట్లు అఖండితముగ కల్పకల్పాంతముల వెలయుచున్నట్లు, ఇతర యోగులుగూడ నుండక, ఆధికారికశరీరములను, లేక ముక్తిని ప్రాపించుచున్నారు.

భుశుణ్డ ఉవాచ :—

బ్రహ్మన్నియతిరేషా హి దుర్లఙ్ఘ్యా పారమేశ్వరీ
మయేదృశేన వై భావ్యం భావ్యమన్యైస్తు తాదృశైః. 23

భుశుండుడు :—పరమేశ్వరుని నియతి యిట్టిది; ఇది అనుల్లంఘనీయము. బ్రహ్మజ్ఞా ! నేనీ తీరుగను, ఇతరు లారీతిగను ఉండవలెనని ఆయనచే సంకల్పితము.

న శక్యతే తోలయితుమవశ్యం భవితవ్యతా
యద్యథా తత్తథైతద్ధి స్వభావస్యైష నిశ్చయః. 24

ఏది ఎట్లు జరుగునది నిర్ణయింప శక్యముగాదు; ఏది ఎట్లుండవలెనో, అది అట్లే వెలయు చున్నది, ఇదియే స్వభావముయొక్క నిశ్చయము.

మత్సంకల్పవశేనైవ కల్పే కల్పే పునః పునః
అస్మిన్నేవ గిరేః శృఙ్గే తరురిత్థం భవత్యయమ్. 25

నా సంకల్పమువలననే ప్రతియుగమున మరలమరల కల్పవృక్ష మీ గిరిశృంగమున జనించు చున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అత్యన్తమోక్షదీర్ఘాయుర్భవాన్నిర్ధేశనాయకః
జ్ఞానవిజ్ఞానవాన్ధీరో యోగయోగ్యమనోగతిః. 26

శ్రీ వసిష్ఠుఁడు :—మోక్షముతోగూడిన అత్యంతదీర్ఘమగు ఆయువుగల్గి, యోగియోగ్యమైన మనస్సును, జ్ఞానవిజ్ఞానములను బడసి నీవు ధీరుడవైయున్నావు; పురాతనవిషయములఁ జెప్ప సమర్థుడవు.

దృష్టానేకవిధానల్పసర్గసర్గమహాగమః
కిం కిం స్మరసి కల్యాణ చిత్రమస్మిఞ్జగత్త్రయే. 27

నీవు అనేకవిధములగు సృష్టులను, ప్రళయములను, అవాంతరప్రళయములను, మహాప్రళయ ములను గాంచియున్నావు. మంగళమయా! ఈ సృష్టులయందు నీకే చిత్రములు గుర్తునున్నవి.

భుశుణ్డ ఉవాచ :—

బృహత్తరశిలావృక్షామ జాతతృణవీరుధమ్
అశైలవనవృక్షౌఘాం స్మరామీమాం ధరామధః. 28

భుశుండుడు :—మహాత్మా ! సుమేరుపర్వతము క్రిందనున్న భూమి వృక్ష, శైల, తృణ శూన్యమై యుండుటను స్మరించుచున్నాను.

దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ
భస్మసారధరాపూర్ణాం సంస్మరామి ధరామధః. 29

ఈ భూమి పదునొకండువేల యేండ్లు భస్మరాశితో నిండియుండుట గుర్తుకువచ్చుచున్నది.

అనుత్పన్నదివాధీశామజ్ఞాతశశిమణ్డలామ్
అవిభక్తదివాలోకాం సంస్మరామి ధరామధః. 30

ఈ ధరయందు సూర్యుడులేకుండుట, చంద్రమండలము తెనరకుండుట, రాత్రిందినభేద ముండకుండుట స్మరించుచున్నాను.

మేరురత్నతలోద్యోతైరర్ధప్రకటకోటరమ్
లోకాలోకమివాద్యాద్రిభువనం సంస్మరామ్యహామ్. 31

(తరువాత) ఈ భువనము మేరుపర్వతరత్నప్రభల నర్ధప్రకాశితమై, చక్రవాళపర్వతమువలె సగము వెలుతురులోను, సగము చీకటిలోను నుండుట, మనస్సునఁబడుచున్నది.

ప్రవృద్ధాసురసంగ్రామే క్షీయమాణాన్తరామిహ
పలాయమానామభితః సంస్మరామి ధరామిమామ్. 32

దేవాసురసంగ్రామమవ, జనులు భయబడి పారిపోవ, శూన్యజనమగు ఈ ధరను సంస్మరించుచున్నాను.

చతుర్యుగాని చాక్రాన్తామసురైర్మత్తకాశిభిః
దైత్యాన్తఃపురతాం ప్రాప్తాం సంస్మరామి ధరామిమామ్. 33

ఒకప్పుడు చతుర్యుగకాల మీధర రాక్షసవనితలకంతఃపురమైయుండుట మనమున పొడముచున్నది.

అత్యన్తాన్తరితాం తాన్తసముస్తాపరమణ్డలామ్
అజదేవత్రయీశేషాం సంస్మరామి జగత్కుటీమ్. 34

సముద్రజలములు ఈ జగత్కుటీరమునందంతయు అనంతముగ వ్యాపింప, త్రిమూర్తులతో మేరుపర్వతము మిగులుపడియుండెను.

చతుర్యుగార్ధమపరం నీరన్ధ్రైం వనపాదపైః
అదృష్టేతరనిర్మాణాం సంస్మరామి ధరామిమామ్. 35

ఈ ధరామండల మొకప్పుడు యుగద్వయకాలము కేవలము వనవృక్షములతో నిబిడమైయుండెను; అందితరసృష్టేమియును లేకుండెను. ఈ విషయముకూడ గుర్తుననున్నది.

ఏవం చతుర్యుగం సాగ్రం నీరన్ధ్రైరచలైర్వృతామ్
అప్రవృత్తజనాచారాం సంస్మరామి ధరామిమామ్. 36

సంపూర్ణముగ నాల్గుయుగము లీయవనీమండలము పర్వతములతో నిండియుండెను; జనుల సస్యవ్యవసాయాది వృత్తులేమియు లేకుండెను.

దశవర్షసహస్రాణి మృతదైత్యాస్థిపర్వతైః
ఆకీర్ణాం హరితః పూర్ణాం సంస్మరామి ధరామిమామ్. 37

పదివేల యేండ్లు మృతదైత్యుల అస్థి - పర్వతముతో నంతటనిండుకొనియున్న ఈ భూమండలము మనస్సున నుదయించుచున్నది.

భయాదన్తర్హితాశేషవైమానికనభశ్చరామ్
ద్యాం చ నిర్వృక్షునిఃశేషాం సంస్మరామి తమోమయీమ్. 38

తమము నెలకొని, నక్షత్రము లాకాశమునుండి అంతర్హితమైపోవ, భయముతో విమానచారులగు నభశ్చరులు మాయమై పోవుటగూడ స్మృతిపథమునం బడుచున్నది.

అనగస్త్యామగస్త్యాశామేకపర్వతతాం గతామ్
మత్తే విన్ధ్యమహాశైలే సంస్మరామి జగత్కుటీమ్. 39

వింధ్యపర్వతము బలోన్మత్తమై గగనపథమును ఛేదించుచు, దక్షిణదిక్కును కేవలము పర్వతమయమొనర్చెను. అప్పుడు అగస్త్యముని అట లేకుండెను. ఇట్టి జగత్కుటీరముకూడ జ్ఞప్తియందున్నది.

ఏతాంశ్చాన్యాంశ్చ వృత్తాన్తాన్సంస్మరామి బహూనపి
కిం తేన బహునోక్తేన సారం సంక్షేపతః శృణు. 40

ఇట్టివేయగు విషయముల పెక్కింటిని గుర్తునకు గొని తేగల్గుచున్నాను. వాటి నన్నింటిని జెప్పనవసరములేదు. సంక్షేపముగ సారమును వినుము.

అసంఖ్యాతాన్మనూన్బ్రహ్మన్స్మరామి శతశో గతాన్
సర్వాన్సంరమ్భబహులాంశ్చతుర్యుగశతాని చ. 41

నానావిధప్రయత్నములతో గూడిన చతుర్యుగశతముల స్మరింపగలుగుచున్నాను. బ్రహ్మజ్ఞా! వందలెక్కకు మీరిన మనువులనేకుల గాంచితిని.

ఏకమేవ స్వయం శుద్ధం పురుషాసురవర్జితమ్
ఆలోకనిచయం చైకం కంచిత్సర్గం స్మరామ్యహమ్. 42

విరాట్ - బ్రహ్మాండ శరీరముత్పన్నమవ, స్వాత్మతత్త్వము నాలోచింప ఒకింత సమాహితచిత్తుండైనప్పుడు, ఇత్యాది ప్రకాశాత్మకములగు తేజోనిచయములతో గూడియుండెను. నరులు, సురలు లేకుండిరి. అప్పుడు, శుద్ధుడగు విరాట్పురుషుడొక్కడే విలసిల్లుచుండెను.

సురాపం బ్రాహ్మణం మత్తం నిషిద్ధసురశూద్రకమ్
బహునాథసతీకం చ కంచిత్సర్గం స్మరామ్యహమ్. 43

ఒక సృష్టియందు మద్యపానమొనర్చు బ్రాహ్మణులు, నింద్యకర్ములగు శూద్రులు, దేవతలు, పెక్కురుగ కులటలు నుండిరి.

వృక్షనీరన్ధ్రభూపీఠమకల్పితమహార్ణవమ్
స్వయం సంజాతపురుషం కంచిత్సర్గం స్మరామ్యహమ్. 44

ఒకానొకప్పుడు, భూమి (ప్రియవ్రతుడు లేనందువలన) సాగరవిహీనమై వృక్షములతో దట్టమైయుండెను; స్త్రీపుంసంయోగములేకుండగనే, మానసికముగ, నుద్భవించిన భృగ్వాదిపురుషులుండిరి.

అపర్వతమభూమిం చ వ్యోమస్థామరమానవమ్
అచన్ద్రార్కప్రకాశాఢ్యం కంచిత్సర్గం స్మరామ్యహమ్. 45

అవాంతరప్రళయము తటస్థింప భూపర్వతములు నిర్మూలము లయ్యెను; అప్పుడు దేవతలు, యోగసిద్ధి నందిన మానవులు ఆకాశమునాశ్రయించుకొని యుండిరి; ఇది గూడ గుర్తున నున్నది.

అనిన్ద్రమమహీపాలమమధ్యస్థాధమోత్తమమ్
సమమన్ధకకుప్చక్రం కంచిత్సర్గం స్మరామ్యహమ్. 46

ఇంద్రరహితమై, రాజశూన్యమై, ఉత్తమాధమమధ్యజనవిహీనమై ప్రళయ - సృష్టులనడుమ దిక్చక్రము అంధకారమై యుండుటగూడ గుర్తునకు వచ్చుచున్నది.

సర్గప్రారమ్భకలనావిభాగో భువనత్రయే
కులపర్వతసంస్థానం జమ్బూద్వీపం పృథక్స్థితమ్. 47

వర్ణధర్మధియాం సృష్టివిభాగో మణ్డలావనేః
ఋక్షచక్రకచసంస్థానం ధ్రువనిర్మాణమేవ చ. 48

జన్మేన్దుభాస్కరాదీనామిన్ద్రోపేన్ద్రవ్యవస్థితమ్
హిరణ్యాక్షాపహరణం వరాహోద్ధరణం క్షితేః. 49

కల్పనం పార్థివానాం చ వేదానయనమేవ చ
మన్దరోన్మూలనం చాబ్ధేరమృతార్థం చ మన్థనమ్. 50

అజాతపక్షో గరుడః సాగరాణాం చ సంభవః
ఇత్యాదికా యాః స్మృతయః స్వల్పాతీతజగత్క్రమాః
బాలైరపి హి తాస్తాత స్మర్యన్తే తాసు కో గ్రహః. 51

సృష్టిప్రయత్నము, భువనత్రయభేదీకరణము, కులపర్వతముల స్థితి, జంబూద్వీపనిర్మాణము, వర్ణాశ్రమధర్మబుద్ధి, భూమండలవిభాగము, నక్షత్రచక్రసంస్థాపన, ధ్రువోదయము, చంద్రసూర్యుల జన్మ, ఇంద్రోపేంద్రుల వృత్తాంతము, హిరణ్యాక్షుని చౌర్యము, వరాహమూర్తి భూమ్యుద్ధరణము, దేవదానవమనుష్యుల చక్రవర్తి నిర్దేశము, మత్స్యావతారమున వేదోద్ధరణము, మందరోన్మూలనము, సముద్రమంథనము, పక్షవిహీనుడగు గరుడుని యొక్కయు, సాగరముల యొక్కయు జన్మ మున్నగు నిన్న మొన్నటి సంగతులను, ఈకల్పమువారును నాకంటె చిన్నవారును నగు మీరుగూడ స్మరింపగలుగుచున్నారు; అందువలన వాటిని నుడువుటలేదు.

గరుడవాహనం విహంగవాహనం
విహంగవాహనం వృషభవాహనమ్
వృషభవాహనం గరుడవాహనం
కలితవానహం కలితజీవితః. 52

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే చిరజీవితవృత్తాన్తకథనం నామ ఏకవింశః సర్గః ॥ 21 ॥

చిరంజీవి నగుటవలన నేను ఒక కల్పము నందలి గరుడవాహనుడు, మఱొకకల్పమున హంసవాహనుడగుట, ఆ హంసవాహనుడు మరల వృషభవాహనుడగుట, ఆవృషభవాహనుడు మరల నింకొకకల్పమున విహగవాహనుడగుటను నేను నిరీక్షించితిని; ఇయ్యది అత్యంతాశ్చర్యకరమగు విషయము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున చిరంజీవితవృత్తాంతకథనమను
ఏకవింశతితమ సర్గము ॥ 21 ॥

---

## ద్వావింశః సర్గః

---

[వసిష్ఠస్యాష్టజన్మాది సమార్ధసమసర్గకాః
క్షీరోదమథనాద్యాశ్చ భూయో దృష్టా ఇహోదితాః.
వసిష్ఠుని అష్టమజన్మము, సమ, అర్ధసమసృష్టి, క్షీరసాగరమథనము మున్నగు విషయము లిందు వర్ణింపబడెను.]

భుశుణ్డ ఉవాచ :—

తతో జగతి జాతేషు భగవన్యుష్మదాదిషు
భరద్వాజపులస్త్యాత్రినారదేన్ద్రమరీచిషు. 1
పులహోద్దాలకాద్యేషు క్రతుభృగ్వఙ్గిరస్సు చ
సనత్కుమారభృఙ్గీశస్కన్దేభవదనాదిషు. 2
గౌరీసరస్వతీలక్ష్మీగాయత్ర్యాద్యాసు భూరిషు
మేరుమన్దరకైలాసహిమవద్దర్దురాదిషు. 3
హయగ్రీవహిరణ్యాక్షకాలనేమిబలాదిషు
హిరణ్యకశిపుక్రాథబలిప్రహ్లాదకాదిషు. 4
శిబిన్యఙ్కుపృథూలాఖ్యవైన్యనాభాగకేలిషు
నలమాన్ధాతృసగరదిలీపనహుషాదిషు. 5
ఆత్రేయవ్యాసవాల్మీకిశుకవాత్స్యాయనాదిషు
ఉపమన్యుమణీమఙ్కిభగీరథశుకాదిషు. 6
అల్పకాతీతకాలేషు కించిద్దూరేషు కేషుచిత్
తథాద్యతనసర్గేషు స్మరణే గణనైవ కా. 7

భుశుండుడు :—భగవంతుడా ! తరువాత మీరును, భరద్వాజుడు, పులస్త్యుడు, అత్రి, నారదుడు, ఇంద్రుడు, మరీచి, పులహుడు, ఉద్దాలకుడు, క్రతువు, భృగువు, అంగిరసుడు, సనత్కుమారుడు మున్నగు మహర్షులును శంకరుడు, భృంగి, కార్తికేయుడు, గణేశుడు మున్నగు దేవతలును, గౌరి, సరస్వతి, గాయత్రి మున్నగు దేవులును, మేరు, మందర, కైలాస, హిమాలయ, దర్దురాదికములగు

పర్వతములును, హయగ్రీవ, హిరణ్యాక్ష, కాలనేమి, బలి, హిరణ్యకశిపు, క్రాథ, బలి, ప్రహ్లాదాది దైత్యులును, శిబి, న్యంక, పృథు, వేణు, నాభాగ, కేళి, నల, మాంధాత, సగర, దిలీప, నహుషులను రాజులును, ఆత్రేయ, వ్యాస, వాల్మీకి, శుక, వ్యాత్స్యాయనాదిగాగల ఋషులును, ఉపమన్యు, మణి, మంకి, భగీరథ, శుకాదులును, వివిధములగు జీవులును జన్మించిరి. వర్తమానకల్పమునందలి ఈ విషయములన్నియు స్మరణయందుంచుకొనుటగూడ అనావశ్యకము; ఇవి లెక్కకు మీరినవగుట వలన మఱచుటకుగూడ అసంభవము కాదు.

మునే త్రే బ్రహ్మపుత్రస్య జన్మాష్టకమిదం కిల
సంస్మరామ్యష్టమే సర్గే తస్మిం స్త్వం మమ సంగతః. 8

మునీ! ఇట్టివేయగు జన్మ లెనిమిది గతించినవి. ఈ ఎనిమిదవ జన్మలో నీవు నాకడ కరు దెంచితివి.

కదాచిజ్జాయసే వ్యోమ్నః కదాచిజ్జాయసే జలాత్
కదాచిద్వాయుతః శైలాత్కదాచిజ్జాయసేఽనలాత్. 9

ఒకప్పుడు నీ వాకాశమునుండియు, మఱొకప్పుడు జలమునుండియు ఇంకొకప్పుడు, వాయువునుండియు, అన్యసమయమున పర్వతమునుండియు, తదితరసమయమున అగ్నినుండియు జన్మించితివి, (అన్ని జన్మలలో నీవు బ్రహ్మపుత్రుడవుగా నుండలేదు.)

యాదృశో యాదృశాచారో యాదృక్సంస్థానదిగ్గణః
సర్గోఽయం తాదృశానేవ త్రీన్సర్గాన్సంస్మరామ్యహమ్. 10

అచ్చముగ ఈ వర్తమానసర్గమును బోలిన మూడు సర్గలను గాంచితిని; ఆచారవ్యవహారములు, దిక్కుల నిర్మాణము వీటి సమానమైయుండెను. (అన్నికల్పముల ఆయా అధికారిక పురుషుల నామరూపములు విపర్యయము నందక సమానముగ నేయుండినను, అన్ని పదార్థములు, వాటి సన్నివేశము సమానముగ నుండవలెనను నియమములేదు. ఒకప్పుడు, కాకతాళీయముగ సమానమైయుండవచ్చును; మఱొకప్పుడు ఉండకపోవచ్చును.)

ఏకరూపాఖిలాచారసంనివేశధరామరాన్
సమకాలాన్స్థిరస్థైర్యాన్దశసర్గాన్సంస్మరామ్యహమ్. 11

పదిసర్గలు సమానకాలము నిలచియుండెను; మఱియు సమానములుగూడనైయుండెను. వాటియందు దేవతలను రాక్షసులు నిర్జింపలేదు. దేవతలయొక్కయు, తదితరులయొక్కయు ఆచార వ్యవహారములు సమానములైయుండెను.

అన్తర్ధానం గతా ధాత్రీ వారపఞ్చకముద్ధృతా
మునే పఞ్చసు వర్గేషు కూర్మేణైవ పయోనిధేః. 12

ఐదుసర్గలలో పృథివి ఐదుమారులు సముద్రమున మునుగ, ఐదుమారులు కూర్మమూర్తి వలననే యుద్ధరింపబడెను (కాని, వరాహమూర్తివలన నుద్ధరింపబడలేదు).

మన్దరాకర్షణావేగపర్యాకులసురాసురమ్
స్మరామి ద్వాదశం చేదమమృతామ్భోధిమన్థనమ్. 13

మందరపర్వతమున అమృతము నంద పాలసముద్రమును దేవతలు రాక్షసులు పది రెండు మారులు తరచి, దన్నియుండుటను స్మరించుచున్నాను.

సర్వౌషధిరసోపేతాం బలిగ్రాహా స్తదా దివః
వారత్రయహిరణ్యాక్షో నీతవాన్వసుధామధః. 14

దేవతలనుండి గూడ కప్పును గ్రహించు హిరణ్యాక్షు డీవసుంధరను సర్వౌషధిసమేత ముగ ముమ్మారులు పాతాళమునకుఁ గొనిపోయెను.

రేణుకాత్మజతాం గత్వా షష్ఠవారమిమం హరిః
బహుసర్గా న్తరేణాపి చకార క్షత్రియక్షయమ్ 15

హరి, రేణుకాపుత్రుడగు పరశురాముడై ఆఱుమారులు క్షత్రియక్షయ మొనర్చెను; పెక్కు-సర్గలలో ఈసంహారము జరుగలేదు.

శతం కలియుగానాం చ హరేర్బుద్ధదశాశతమ్
శౌకరాజతయైవాప్తం స్మరామి మునినాయక. 16

హరి, శౌకరాజతనయుడగు బుద్ధుడై, అనేకవందల కలియుగములు జన్మించియుండుట స్మరించుచున్నాను.

త్రింశత్త్రిపురవిక్షోభాన్ద్వౌ దక్షాధ్వరసంక్షయౌ
దశశక్రవిఘాతాంశ్చ చంద్రమౌలేః స్మరామ్యహమ్. 17

ముప్పది త్రిపురసంహారములను, రెండు దక్షయాగధ్వంసములను, పది ఇంద్రజయములను చంద్రమౌళి యొనర్చినాడు.

బాణార్థమష్టౌ సంగ్రామాఞ్జ్వరప్రమథమన్త్రికాన్
విక్షోభితసురాసీకాన్స్మరామి హరిశర్వయోః. 18

శివుడు బాణాసురుని కొఱకై ఎనిమిది మారులు యుద్ధమొనర్చియుండెను; హరిహరులు శైవ, వైష్ణవ జ్వర, ప్రమథ మంత్రముల ప్రయోగించి, దేవతలకు గూడ వెరపును బుట్టించిరి.

యుగంప్రతి ధియాం పుంసాం న్యూనాధికతయా మునే
క్రియాఙ్గపాఠవైచిత్ర్యయుక్తాన్వేదాన్స్మరామ్యహమ్. 19

మునీ! ప్రతియుగమున వేదమొక్క-తీరుగనుండలేదు; మనుష్యుల శక్తిసామర్థ్యముల ననుసరించి, బ్రహ్మచర్య గురుశుశ్రూష భూమిశయనాదికములగు క్రియలును, శిక్షాది అంగముల జెప్పబడిన సావధానోచ్చారణాదికమగు పఠనములును వేఱువేఱుగ నుండెను.

ఏకార్థాని సమగ్రాణి బహుపాఠాని మేఽనఘ
పురాణాని ప్రవర్తన్తే ప్రసృతాని యుగంప్రతి. 20

అనఘా! ప్రతియుగమున పురాణములుగూడ, ఒకే అర్థమును బోధించునవైనను, విభిన్న పాఠములతో గూడినవగుచున్నవి.

పునస్తానేవ తానేవమన్యానపి యుగేయుగే
వేదాదివిత్ప్రరచితానితిహాసాన్స్మరామ్యహమ్. 21

మరలమరల, వేదవేత్తలగు వ్యాసవాల్మీక్యాదులు విరచించిన భారతరామాయణాది ఇతిహాసముల జూచియుంటిని.

ఇతిహాసం మహాశ్చర్యమన్యం రామాయణాభిధమ్
గ్రన్థలక్షప్రమాణంచ జ్ఞానశాస్త్రం స్మరామ్యహమ్. 22

మహాశ్చర్యకరమగు రామాయణమను ఇంకొక ఇతిహాసమును జూచియుంటిని; అది లక్షశ్లోకములతో గూడుకొనియున్న జ్ఞానశాస్త్రము.

రామవద్వ్యవహర్తవ్యం న రావణవిలాసవత్
ఇతి యత్ర ధియాం జ్ఞానం హస్తే ఫలమివార్పితమ్. 23

అందు, రామునివలె వ్యవహరింపవలెను, రావణునివలె కాదు; అని జెప్పబడి జ్ఞానము కరతలామలక మొనర్పబడియున్నది.

కృతం వాల్మీకినా చైతదధునా యత్కరిష్యతి
అన్యచ్చ ప్రకటం లోకే స్థితం జ్ఞాస్యసి కాలతః. 24

ఇప్పుడు వాల్మీకి మున్పదిరెండువేల శ్లోకములతోగూడిన రామాయణమును యొనర్చుట గూడ, ఎఱుగుదును; అది లోకమున ప్రకటితమైయున్నది. దానిని నీవు కాలక్రమమున ఎఱుగగలవు.

వాల్మీకినామ్నా జీవేన తేనైవాన్యేన వా కృతమ్
ఏతచ్చ ద్వాదశం వారం క్రియతే విస్మృతిం గతమ్. 25

ఇంతవఱకి రామాయణము పదునొకండుమారులు వ్రాయబడినది; దానిని వాల్మీకియే వ్రాసినాడో లేక మఱొకరు వ్రాసిరో లోకమునకు గుర్తులేదు; సాంప్రదాయము విచ్ఛిన్నమైనది. మరల పండ్రెండవమారు వ్రాయబడినది.

ద్వితీయమేతస్య సమం భారతం నామ నామతః
స్మరామి ప్రాక్తనవ్యాసకృతం జగతి విస్మృతమ్ 26

దీనితో సమానమైన దింకొకటియున్నది; అది భారతము. పూర్వపు వ్యాసులు వ్రాసినది విస్మరింపబడినది; ఈ విషయమునుగూడ నేను స్మరింపగలుగుచున్నాను.

వ్యాసాభిధేన జీవేన తేనైవాన్యేన వా కృతమ్
ఏతత్తు సప్తమం వారం క్రియతే విస్మృతిం గతమ్. 27

ఇంతవఱకు అఱుమారులద్దానిని వ్యాసుడో లేక మఱొకరో వ్రాసియుండిరి; అది విలుప్తమై పోయినది. ఇప్పుడు మరల నేడవమారు వ్రాయబడుచున్నది.

ఆఖ్యానకాని శాస్త్రాణి నివృత్తాని యుగంప్రతి
విచిత్రసంనివేశాని సంస్మరామి మునీశ్వర 28

మునీశ్వరా! ఒక్కొక్కయుగమున ఒక్కొక్కవిధమగు కథలతోగూడిన పురాణముల గాంచి యుంటిని.

భూయస్తాన్యేవ తాన్యేవ తథాన్యాని యుగేయుగే
సాధో పదార్థజాలాని ప్రపశ్యామి స్మరామి వై. 29

సుమాన్యాన్యేవ మిత్రాణి అన్య ఏవ చ బన్ధవః
అన్యఏవ నవా భృత్యా అన్యఏవ సమాశ్రయాః. 38

నా బంధుమిత్రులు, భృత్యులు, ఆశ్రయము వేఱ్వేఱుగ నుండు చున్నవి.

కదాచిదహమేకాన్తే విన్ధ్యకచ్ఛకృతాలయః
కదాచిత్సహ్యానిలయః కదాచిద్దర్దురాలయః. 39
కదాచిద్ధిమవద్వాసీ కదాచిన్మలయాచలః
కదాచిత్ప్రాక్తనేనైవ సంనివేశేన భూధరమ్. 40
చూతవృక్షే చ శాఖాయాం ప్రాప్యనీడం తరోమ్యహమ్
అనాద్యన్తేషు యాతేషు యుగేషు మునినాయక. 41

నేనొకప్పుడు వింధ్యశృంగమునను, మఱొకప్పుడు సహ్యగిరియందును, ఇంకొకప్పుడు దర్దుర పర్వతమునను, ఇంకొకప్పుడు ఒంటరిగను ఉంటిని; బందుగులు మొదలైనవారులేరు. ఇంకొకప్పుడు హిమాలయమున, మఱొకప్పుడు మలయపర్వతమున, మఱొకప్పుడు పూర్వనివాసమేయగు మేరువు నందలి చూతవృక్షశాఖయందు నీడమును నిర్మింతును. మునినాయకా! ఇట్లు అసంఖ్యాకలముగు యుగములు గడచిపోవుచున్నవి.

ప్రాక్తనేనైవ జాతోఽయం సంనివేశేన పాదపః
దేహం త్యక్త్వా సుఖం సాధో నాతః పరిణతిం గతః. 42

సాధూ! ఈకల్పవృక్షము పూర్వ పూర్వ శరీరముల ద్యజించుచు, మునపటియట్లే మార్పును జెందక నిలచియున్నది.

తదీయేనైవ జాతోఽయం సంనివేశేన పాదపః
తాతే జీవతి మైవాభూచ్ఛోభాస్య సుతరోస్తథా. 43

మునపటియట్లే జన్మించి నిలచియున్న వృక్షము పూర్వపుశోభనే వహించి జీవించు చున్నది,

కృతప్రాక్సంనివేశోయమహం స్థితిమిహాగతః
నేహాభూదుత్తరా పూర్వం కకుబ్నాయం చ భూధరః. 44

ఈవృక్షమిట్లే నిలచియున్నను, దిక్కులు, పర్వతము పూర్వపుతీరున లేవు.

దిగుత్తరా భూదన్యోయం పూర్వమేవ మహీధరః
ఏకైకదేహసంస్థానవీతబ్రహ్మనిశాగమః. 45

పూర్వ మీ పర్వతముయొక్క ఉత్తరదిగ్భాగమింకొకతీరుననుండెను; ఆ కా ర ము ను బట్టి ఈమార్పు గుర్తింపవీలులేకున్నది. కాని, నేను కల్పకల్పాంతరముల ఒకేమాదిరిగ నున్నాను.

ధ్యానాన్తే తత్త్వ ఏవైనం సర్గమాలోక్య వేద్మ్యహమ్
అర్కాదేబుక్షసంచారాన్మేర్వాదిస్థానకా దిశః. 46

ధ్యానాంతమున యీ సృష్టినవలోకించి, సూర్యచంద్రతారాది గ్రహములసంచారమును, మేర్వాదిదిశల స్థానమును నవలోకించి గ్రహింపగల్గుచున్నాను.

సంస్థానమన్యథా తస్మిన్స్థితే యాన్తి దిశోఽన్యథా
న సన్నాసజ్జగన్మన్యే భ్రమయన్కేవలం ధియః. 47

దిశలు, వాటియందుండు వస్తువులు తారుమారగుచున్నను నేను ప్రత్యభిజ్ఞాబలమున వాటిని గుర్తింపగలుగుచున్నాను; నాలో ఎట్టిమార్పును లేదు. మఱియు, యీ జగత్తు సదసన్మయమనియు, ఆత్మయందు ఉద్భవించిన భ్రమయేయనియు గ్రహించుటవలనను, నాబుద్ధికెట్టి మోహమును కలుగుటలేదు.

ఆత్మస్పన్దచమత్కారవిభవోఽయం విజృమ్భతే
పుత్రః పితృత్వమాయాతి మిత్రం యాత్యరితాం తథా. 48

ఆత్మయొక్క మాయికశక్తివలననే, యీ పదార్థములన్నియు ఇట్లు విజృంభించుచున్నవి; దిక్కృతమగు వ్యవస్థయందు భేదముకలుగునట్లు, కాలకృతములగు వ్యవస్థవలనగూడ, పుత్రుడు తండ్రియగుచున్నాడు, మిత్రుడు శత్రువగుచున్నాడు. (కాలమహిమ ఇట్టిది.)

స్త్రీత్వం చ శతశో యాతాన్పుంసశ్చైవ స్మరామ్యహమ్
కలౌ కృతయుగాచారాన్కృతే కలియుగస్థితిమ్. 49

పురుషులు స్త్రీత్వమును బొందుచున్నారు; ఇట్టివి నూర్లకొలది గుర్తునున్నవి; కృతయుగమున కలియుగ ఆచారములను, అట్లే మరల కలియుగమున కృతయుగ వ్యవహారములను గాంచియుంటిని.

త్రేతాయాం ద్వాపరే చైవ సంస్మరామి మునీశ్వర
అదృష్టవేదవేదార్థాన్స్వసంకేతవిహారిణః. 50

మునీశ్వరా! త్రేత, ద్వాపరయుగముల గూడ, ఆచారవ్యవహారములు తారుమారైనవి; వేదములను, వేదవిధినిషేధములను ద్యజించి, ఎవరికి నచ్చినట్లు వారు ఒనర్చుచుండిరి.

సర్గాన్నిరర్గలాచారాన్క్వచిత్కాంశ్చిత్స్మరామ్యహమ్
ధ్యాతరి బ్రహ్మణో బ్రహ్మన్నసురాసురమానుషమ్. 51
చతుర్యుగసహస్రాన్తే జగచ్ఛూన్యం స్మరామ్యహమ్
మనో మననిర్మాణాన్పార్థివాకారవర్జితాన్
వ్యాప్తాన్వాయుమయైర్భూతైర్దశసర్గాన్స్మరామ్యహమ్. 52

కొన్ని కొన్ని సృష్టులలో, కృతయుగమునగూడ, నలపరాభవము మున్నగు విషయములు జరిగి, ఆచారము బెసిగిపోయెను. ఒకప్పుడు, బ్రహ్మ ధ్యాననిమగ్నుడై నాలుగువేల యుగముల గడపెను; బ్రహ్మజ్ఞా! అప్పుడు బ్రహ్మాండము సురాసురవిహీనమై వెలయుచుండెను. మఱియు, పది మానసికసృష్టులగాంచితిని; అందు పార్థివమయ శరీరములు లేకుండెను. అది వాయవీయ శరీరధారులతో నిండియుండెను.

విచిత్రసంస్థానవిశేషదేశా
న్విచిత్రకార్యాకులభూతికోశాన్
విచిత్రవిన్యాసవిలాసవేషా
న్స్మరామ్యహం బ్రహ్మదినేష్వశేషాన్. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే చిరజీవిత వర్ణనం నామ ద్వావింశః సర్గః ॥ 22 ॥

నేను కల్పాంతముల విచిత్రప్రదేశములతో గూడిన దేశములను విచిత్రకార్యముల నాచరించు జీవులతో నిండిన బ్రహ్మాండములను, విచిత్రవేషభాషల నొప్పారు దేశములను గాంచి యుంటిని; వీటి నన్నిటిని స్మరింపంలుగుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున భుశుండోపాఖ్యానమున చిరజీవితవర్ణనమను ద్వావింశ సర్గము ॥ 22 ॥

---

## త్రయోవింశః సర్గః

---

[త్యక్తేషు యేషు దోషేషు నరం మృత్యుర్న బాధ్యతే
యత్పరం చ మనఃకార్యం తత్సర్వమిహ కీర్త్యతే.

ఏ దోషములను త్యజించుటచే మృత్యువు మనుజులను బాధింపదో, దేనియందు మనస్సు లగ్నము కావలసియున్నదో, అదియంతయు నిందు వర్ణింపబడినది ]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అథాసౌ వాయసశ్రేష్ఠో జిజ్ఞాసార్థమిదం మయా
భూయః పృష్టో మహాబాహో కల్పవృక్షతలాగ్రకే. 1
చరతాం జగతః కోశే వ్యవహారవతామపి
కథం విహగరాజేన్ద్ర దేహం మృత్యుర్న బాధతే. 2

శ్రీవసిష్ఠుఁడు :—మహాబాహూ! తెలిసికొనగోరి కల్పశాఖావాసియగు ఆ వాయసశ్రేష్ఠుని నేను మరల ఇట్లు ప్రశ్నించితిని - విహగరాజా! ఈ బ్రహ్మాండమున విచరణమొనర్చుచున్నను మృత్యు వేల మిమ్ము బాధింపకున్నది ?

భుశుణ్డ ఉవాచ :—

జానన్నపి హి సర్వజ్ఞ బ్రహ్మన్జిజ్ఞాసయేవ మామ్
పృచ్ఛసి ప్రభవో నిత్యం భృత్యం వాచాలయన్తి హి. 3

భుశుండుడు :—సర్వజ్ఞా! బ్రహ్మవేత్తా! ఎఱిగియుండియు మరల నన్నడుగుచున్నావు; ప్రభువులు భృత్యులను వాగించి ఆనందింతురు.

తథాపి యత్పృచ్ఛసి మాం తత్తే ప్రకథయామ్యహమ్
ఆజ్ఞాచరణమేవాహుర్ముఖ్యమారాధనం సతామ్. 4

అయినను, మీరు నన్నడుగునది మరల చెప్పుచున్నాను. ఆజ్ఞాపాలనమే సత్పురుషుల ముఖ్యారాధన.

దోషముక్తాఫలప్రోతా వాసనాతన్తుసంతతిః
హృది న గ్రథితా యస్య మృత్యుస్తం న జిఘాంసతి 5

ఎవ్వని హృదయమున, వాసనా - తంతువుల దోషములను ముత్యములు గ్రుచ్చబడియుండవో, అతనిని మృత్యువు (ఆభరణహీనుని దొంగలు బాధింపనట్లు) హింసింపదు.

నిఃశ్వాసవృక్షక్రకచాః సర్వదేహలతాఘుణాః
ఆధయో యం న భిన్దన్తి మృత్యుస్తం న జిఘాంసతి. 6

దేహలతా - ఘుణములును, నిశ్వాస - వృక్షపరశువులునునగు మనోవ్యాధు లెవ్వని ఛేదింపజాలకున్నవో, అతనిని మృత్యువు హింసింపజాలదు. (మనస్సు చంచలమైన, శ్వాసప్రశ్వాస లెక్కుడుగ పడి వ్యయమగుట లోకప్రసిద్ధము. దాన ఆయుఃక్షయమగును. మఱియు, మనస్సు సరిగ లేకున్న వ్యాధులు కలుగును అను; నీ రెండువిషయములు ఇట సూచితములని గ్రహింపనగును).

శరీరతరుసర్వాఘూశ్చిన్తార్పితశిరఃఫణాః
ఆశా యం న దహత్యన్తర్మృత్యుస్తం న జిఘాంసతి. 7

శరీరతరు — కోటరముల నివసించునవియును, చింతలను పడగలతో గూడుకొనినవియును నగు ఆశా — సర్పము లెవ్వనిని తమ విషాగ్నివలన దహింపజాలకున్నవో, అతనిని మృత్యువు హింసింపదు,

రాగద్వేషవిషాపూరః స్వమనో బిలమన్దిరః
లోభవ్యాలో న భుఙ్క్తే యం మృత్యుస్తం న జిఘాంసతి. 8

రాగద్వేషములను విషముతో నిండినదియును, మనస్సను పుట్టలో నివసించునదియును, అగు లోభమను పాముచలన గఱువబడనివానిని, మృత్యువు హింసింపదు.

స్ఫీతాశేష వివేకామ్బుం శరీరామ్భోధివాడవః
న నిర్దహతి యం కోపస్తం మృత్యుర్న జిఘాంసతి. 9

వివేకమను జలముల సంపూర్ణముగ గ్రోలునదియును, శరీరసముద్ర — బాడబాగ్నియును నగు కోప మెవ్వని దహింపజాలకున్నదో, మృత్యువతనిని హింసింపదు.

యన్త్రం తిలానాం కఠినం రాశిముగ్రమివాకులమ్
యం పీడయతి నానఙ్గస్తం మృత్యుర్న జిఘాంసతి. 10

ఎండునువ్వులను గానుగ నలిపివేయునట్లు, కామ మెవ్వనిని నలుపజాలకున్నదో, అతనిని మృత్యువు హింసింపదు.

ఏకస్మిన్నిర్మలే యేన పదే పరమపావనే
సంశ్రితా చిత్తవిశ్రాన్తిస్తం మృత్యుర్న జిఘాంసతి. 11

అద్వితీయమును, నిర్మలమును, పవిత్రమునునగు ఆ పరమపదమును ఆశ్రయించి, ఎవ్వని చిత్తము విశ్రాంతినందినదో అతనిని మృత్యువు దహింపజాలదు.

వపుఃఖణ్డాభిపతితం శాఖామృగమివోదితమ్
న చఞ్చలం మనో యస్యతం మృత్యుర్న జిఘాంసతి. 12

శరీరమను పుష్పితోద్యానమున బడిన మనస్సను కోతి చంచలముగాకున్న, మృత్యువు హింపింపదు.

ఏతే బ్రహ్మన్మహాదోషాః సంసారవ్యాధిహేతవః
మనాగపి న లుమ్పన్తి చిత్తమేకం సమాహితమ్. 13

బ్రహ్మజ్ఞా! సమాహితచిత్తుని, సంసారవ్యాధికి గారణములగు ఈమహాదోషము లొకింతయు ఆక్రమింపజాలవు.

ఆధివ్యాధిసముత్థాని చలితాని మహాభ్రమైః
న విలుమ్పన్తి దుఃఖాని చిత్తమేకం సమాహితమ్. 14

సమాహితచిత్తుని, మోహజనితములగు శారీరక, మానసికములగు దుఃఖములు కలతబెట్టజాలవు,

నాస్తమేతి న చోదేతి న సంస్మృతిర్న విస్మృతిః
న సుప్తం న చ జాగ్రత్స్యాచ్చిత్తం యస్య సమాహితమ్. 15

సమాహితచిత్తునకు ఉదయాస్తమయములు లేవు; స్మృతివిస్మృతులు లేవు; జాగ్రత్సుషుప్తులు లేవు.

అన్ధీకృతహృదాకాశాః కామకోపవికారజాః
చిన్తా న పరిహింసన్తి చిత్తం యస్య సమాహితమ్. 16

హృదయాకాశమును అంధకారమయమొనర్చునవియును, కామక్రోధవికారముల జనించునవియునునగు చింతలెవ్వనిని హింసింప జాలకున్నవో, అతడే సమాహితచిత్తుడనంబడును.

న దదాతి న చాదత్తే న జహాతి న యాచతే
కుర్వదేవ చ కర్మాణి చిత్తం యస్య సమాహితమ్. 17

దానము, ప్రతిగ్రహణము, త్యాగము, యాచనలను కార్యములులేక, కర్మల నొనర్చుచుండువాడే సమాహితచిత్తుడు.

యే దురర్థా దురారమ్భా దుర్గుణా దురుదాహృతాః
దుష్క్రమాస్తే న కృన్తన్తి చిత్తం యస్యసమాహితమ్. 18

ఎవ్వని చిత్తమును, ఆర్జనీయములగు ధనాదులును, కృషిగృహనిర్మాణాది కార్యములును, రాగద్వేషాది గుణములును, హృదయభేదకరములగు పల్కులును, కఠినములగు నీతులును హింసింప జాలకున్నవో అతడే సమాహితచిత్తుడనంబడును,

ఆభాన్తి విపులార్థాని మహాన్తి గుణవన్తి చ
సర్వాణ్యేవానుధావన్తి చిత్తం యస్య సమాహితమ్. 19

సమాహితచిత్తునికడకు మహత్తమగుణములతో గూడుకొనిన లాభజనములగు సుఖము లన్నియును అరుదెంచును.

యదుదర్కహితం సత్యమనపాయి గతభ్రమమ్
చరీహితదృశోన్ముక్తం తత్పరం కారయేన్మనః. 20

మనస్సును, భ్రమరహితమును, సత్యమును, భోగాభిలాషారహితమును, పారమార్థికసుఖసుముఖమును నగునట్లు ఒనర్పవలెను.

యదదృష్టమశుద్ధేన చిత్తవైధుర్యదాయినా
అనేకత్వపిశాచేన తత్పరం కారయేన్మనః. 21

అపవిత్రదృష్టికి పరమపదము అగుపడదు; చిత్తమును పురుషార్థ - విధురమొనర్చి, నానాత్వపిశాచమును గల్పించు, ఈ అపవిత్రను నిర్మూలమొనర్చి, మనస్సును పరమపదమున నిల్పదగును.

ఆదౌ మధ్యే తథాన్తే చ చిరాయ పరమోచితమ్
యచ్చారు మధురం పథ్యం తత్పరం కారయేన్మనః 22

చారుసుఖారంభమును, అర్ధపరిపక్వదశయందుగూడ మధురమును, అంతమున హితకరమును, సర్వదుఃఖనివర్తకమును, నిత్యమునునగు జ్ఞానమును బొందునట్లు, మనస్సును ప్రయత్నింప జేయవలెను.

యదనన్తం మనఃపథ్యం తథ్యమాద్యన్తమధ్యగమ్
సమస్తసాధుభిర్జుష్టం తత్పరం కారయేన్మనః. 23

త్రిసత్యమును, అనంతమును, హితకరమును, సమస్తసాధుజనసేవితమునునగు పదోన్ముఖముగ మనస్సును ప్రవర్తిల్లజేయునది.

యద్బుద్ధేః పరమాలోకమాద్యం యదమృతం పరమ్
యదనుత్తమసౌభాగ్యం తత్పరం కారయేన్మనః 24

బుద్ధికి పరమప్రకాశమును (పరమజ్ఞానమును) అమృతసారమును, ఎనలేని సుఖమునునగు పరమపదమున మనస్సును సంలగ్నమొనర్పవలెను.

సామరాసురగన్ధర్వే సవిద్యాధరకిన్నరే
ససురస్త్రీగణే స్వర్గే న కించిత్సుస్థిరం శుభమ్. 25

అమరాసుర, గంధర్వ, విద్యాధర, కిన్నర, సురస్త్రీలతో గూడిన స్వర్గమునగూడ సుస్థిరమును, శుభమునునగు నిత్యసుఖము లేదు.

సతరౌ సనరాధీశే సపర్వతపురవ్రజే
సామ్బుధౌ భూతలే తాత న కించిచ్ఛోభనం స్థిరమ్. 26

పుర, పర్వత, రాజ్య, వన, సముద్రలతో గూడుకొనిన ఈ మహీతలము నందెచ్చటను, శోభనమును స్థిరమును నగు సుఖ మేమియును లేదు.

సనాగే సాసురవ్యూహే సాసురస్త్రీగణే తథా
సమస్త ఏవ పాతాలే న కించిచ్ఛోభనం స్థిరమ్. 27

నాగ, అసుర, అసురకన్యలతో గూడుకొనిన పాతాళమునగూడ శుభకరమును, నిత్యమునునగు సుఖములేదు.

సస్వర్గే ససురాలోకే సపాతాలే సదిక్తటే
జగత్యస్మింస్తు సర్వస్మిన్న కించిచ్ఛోభనం స్థిరమ్. 28

స్వర్గ, మర్త్య, పాతాళములతో గూడుకొనిన ఈ బ్రహ్మాండమునందెచ్చటను శాశ్వతమగు ఆనందములేదు.

ఆధివ్యాధివిలోలాసు దుఃఖౌఘవలితాసు చ
క్రియాసు నిత్యతుచ్ఛాసు న కించిత్సుస్థిరం శుభమ్. 29

ఆధివ్యాధులను తరంగములతో గదలుచు, దుఃఖములను సుడిగుండములనదగు క్రియలు, అత్యంతతుచ్ఛములు. వీటు, సుస్థిరమగు శుభమేమియును లేదు.

తరలీకృతచిత్తాసు హృదయానన్దనీషు చ
చిన్తాసు ధీవికారాసు కించిత్సుస్థిరం శుభమ్. 30

చిత్తమును తరళమొనర్చి, హృదయమున కొకింత ఆనందమును గూర్చు చిత్తవృత్తులగూడ, స్థిరమగున దేమియును లేదు.

హృత్క్షీరోదకసంస్పన్దమన్దరేషు చలేష్వపి
స్వసంకల్పవికల్పేషు న కించిత్సుస్థిరం శివమ్. 31

హృదయమను క్షీరసముద్రమును మందరపర్వతమువలె కలచు సంకల్పవికల్పములగూడ శాశ్వతశుభ మొసగున దెద్దియును లేదు.

అనారతాగమాపాయపరాస్వసిశిరాస్వపి
చిత్రాకారాసు చేష్టాసు న కించిత్సుస్థిరం శుభమ్. 32

ఆగమాపాయములును, కత్తిఅంచువలె పదునైనవియును, విచిత్రములునునగు ఇంద్రియభోగములగూడ నిత్యసుఖమేమియును లేదు.

న వరమేకమహీతలరాజతా
నచ వరం విబుధామరనాపతా
నచ వరం ధరణీతలనాగతా
స్థితిముపైతి హి యత్ర సతాం మనః. 33

సాధువుల మనస్సు విశ్రాంతి నందినచో, దాన ఏకచ్ఛత్రాధిపత్యము, దేవత్వము, పాతాళరాజ్యముగూడ తులతూగజాలవు.

న వరమాకులశాస్త్ర విచారణం
నచ వరం పరకార్యవివేచనమ్
న వరమగ్ర్యకథాక్రమవర్ణనం
స్థితిముపైతి హి యత్ర సతాం మనః. 34

సాధువుల మనస్సు విశ్రాంతినందిన శాస్త్రపాండిత్యము, పరకార్యవివేచనము వక్తృత్వాది గుణముల పరుల నలరించుట, మున్నగువానితో నవసరముండదు.

న వరమాధిమయం చిరజీవితం
నచ వరం మరణం దృఢమూఢతా

నచ వరం నరకో నచ విష్టపం
స్థితిముపైతి హి న క్వచిదాశయః. 35

వ్యాధిగ్రస్తమగు చిరజీవనము మంచిదికాదు; కాన మరణము మేలు అనియు తలపరాదు, దాన మూఢత్వమేయుండును. పాపఫలభోగ - స్థానమగు నరకము మంచిదికాదు; అది ఎప్పుడు ముగియునో తెలియజాలము. స్వర్గముకూడ మంచిదికాదు; భోగక్షయమైన పతనమనివార్యము, ఇట్టి కోర్కెలున్న శాంతి లభింపదు.

ఇతి వివిధజగత్క్రమాః సమస్తాః
ఖలు మతిమూఢతయా నరస్య రమ్యాః
చలతరకలనాహితే పదార్థే
కథముపయాన్తి చిరస్థితిం మహాన్తః. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే సమాధాన సంకల్పనిరాకరణం నామ త్రయోవింశః సర్గః ॥ 23 ॥

కాని, మూఢమతికి రమ్యములగు ఈ జగద్విషయములను మహాత్ములు అవలీలగా అవలకు నెట్టివైచి, ఒకింతయును ఆసక్తొనక, పరమపదమున సుఖవిశ్రాంతి నందుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున భుశుండోపాఖ్యానమున సమాధానసంకల్పనిరాకరణమను త్రయోవింశ సర్గము ॥ 23 ॥

---

## చతుర్వింశః సర్గః

---

[దేహనాడీక్రమోపేతా షట్చక్రహృదయాన్వితా
ప్రాణస్పన్దవిభాగాఢ్యా ప్రాణచిన్తేహ వర్ణ్యతే.

దేహనాడీ క్రమయుక్తమును, షట్చక్రహృదయసహితమును, ప్రాణస్పన్దవిభాగపూర్ణమును నగు ప్రాణముయొక్క చింతన యిందు గావింపబడినది.]

భుశుణ్డ ఉవాచ :—

ఏకైవ కేవలా దృష్టిర్నిరాపాయా గతభ్రమా
విద్యతే సర్వవిత్తేషు సర్వశ్రేష్ఠా సమున్నతా. 1

భుశుండుడు :—భ్రమరహితమును, నిరపాయమును, సర్వశ్రేష్ఠమును, మహోన్నతమును నగు అద్వైత - దృష్టియొక్కటియే జ్ఞానములన్నిటిలో శ్రేష్ఠమై నెగడుచున్నది.

ఆత్మచిన్తా సమస్తానాం దుఃఖానామన్తకారిణీ
చిరసంభృతదుఃస్వప్నసంసారభ్రమహారిణీ. 2

ఆత్మచింత యొక్కటియే దుఃఖముల నన్నిటిని అంతమొందించుచున్నది. అనాదికాలము నుండి అవిద్యాకామకర్మలతో కూడబెట్టబడిన దుఃస్వప్నమగు సంసారభ్రమను హరించుచున్నది.

నిర్మలజ్ఞమనోమార్గవిపులాఙ్గణచారిణీ
తథా సమస్తదుఃఖానాం చిన్తానర్థవినాశినీ. 3

ఈ ఆత్మచింత ప్రశస్తమును, పవిత్రమునునగు మనస్సుననే ఉదయించుచున్నది; సామాన్యుల కియ్యది అబ్బదు. ఇయ్యది దుశ్చింతలను, అనర్థములను, సమస్తదుఃఖములను వినాశమొనర్చుచున్నది.

జ్యోత్స్నయేవాన్ధకారాణామలమన్తః ప్రజాయతే
సా స్వాత్మచిన్తా భగవన్సర్వసంకల్పవర్జితా 4

భగవంతుడా! సర్వసంకల్పవర్జనాపూర్వకమగు ఈ ఆత్మచింత, వెన్నెల చీకటినిఁ బోగొట్టునట్లు, మనస్సునందలి మకిలిని బోగొట్టి మాయా - భ్రాంతిని అణచుచున్నది.

యుష్మదాదిషు సుప్రాపా దుష్ప్రాపైవాస్మదాదిషు
సమస్తకలనాతీతం పరాం కోటిముపాగతమ్. 5

ఈ యాత్మచింతయందెట్టి సంకల్పములును లేవు; ఇయ్యది అత్యంతశ్రేష్ఠము. మీవంటి మహాత్ములకు సులభ్యము, మమ్మబోలు మందమతులకు దుర్లభము.

పదమాసాదయన్త్యేతత్కథం సామాన్యబుద్ధయః
ఆత్మచిన్తావిలాసిన్యాస్తస్యాః సఖ్యో మహామునే. 6
కించిత్సామ్యముపాయాతా విజ్ఞానశశిశీతలాః
ఆత్మచిన్తాసమానానాం వివిదానాం మునీశ్వర 7
ఆత్మచిన్తావయస్యానాం మధ్యాదేకతమా మయా
సర్వదుఃఖక్షయకరీ సర్వసౌభాగ్యవర్ధనీ. 8
కారణం జీవితస్యేహ ప్రాణచిన్తా సమాశ్రితా

మహామునీ! సామాన్యబుద్ధులెట్లు దీనిని బొందగలరు? మునీశ్వరా! ఆత్మచింతయను విలాసినికి చాలమంది సఖులున్నారు; వారుకూడ దీనికిఁ దీసిపోరు, సమానులే; అవి జ్ఞానచంద్రుని తుషారమయ శీతల - కిరణములు. కాని, ఆత్మచింతకంటె ఒకించుక తేలిక. ఇట్టివియగు ఆత్మచింత యొక్క సఖులలో నొకదానిని నేను బడసితిని; దాని పేరు ప్రాణచింత. ఈ ప్రాణచింత సర్వదుఃఖముల క్షయమొనర్చునదియును, సౌభాగ్యవర్ధకమును, జీవితహేతువునునైయున్నది. ఈ ప్రాణచింతవలననే నేను చిరజీవినైతిని.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్తవన్తం విహగం భుశుణ్డం పునరప్యహమ్
జానన్నపీదమవ్యగ్రః పృష్టవాన్క్రీడయా మునిమ్. 9
సర్వసంశయవిచ్ఛేదిన్నత్యన్తచిరజీవిత
యథార్థం బ్రూహి మే సాధో ప్రాణచిన్తా కిముచ్యతే. 10

శ్రీవసిష్ఠుఁడు:— ఇట్లు వచించు భుశుండపక్షిని, ఎఱిఁగియున్నను నేను మరల కుతూహలముతో నిట్లు ప్రశ్నించితిని. సాధూ! సర్వసంశయవిచ్ఛేదీ! అత్యంతచిరజీవీ! ప్రాణచింతయన నేమో యథార్థముగ నాకు జెప్పుము.

భుశుణ్డ ఉవాచ:—

సర్వవేదాన్తవేత్తాసి సర్వసంశయనాశకః
మామేతత్పరిహాసార్థం మునే పృచ్ఛసి వాయసమ్. 11

భుశుండుడు:— మునీ! మీకు వేదాంత శాస్త్రమంతయు తెలిసియున్నది; మీరందఱి సంశయములను దూరమొనర్పగలరు. అయ్యు, ఈ కాకిని కేవలము పరిహాసార్థము ప్రశ్నించుచున్నారు.

అథవా భవతామేవ భగవన్పరిశిక్షితుమ్
పునః ప్రత్యుత్తరాణీదం కా మే క్షతిరుపస్థితా. 12

భగవంతుఁడా! కావున్న, మీకు ప్రత్యుత్తరముల నొసగినను దోషములేదు; నాకా విషయముల మరల చక్కఁగ నాలోచించు అవకాశ మొదవుచున్నది.

భుశుణ్డజీవితకరం భుశుణ్డస్వాత్మలాభదమ్
శృణు ప్రాణసమాధానం వక్ష్యమాణమిదం మయా. 13

భుశుండుడెట్లు ప్రాణసమాధినిఁబడసి చిరజీవియైనది, భుశుండుడెట్లు ఆత్మను బొందినది. వచించుచున్నాను; వినుము.

పశ్యేదం భగవన్సర్వం దేహగేహం మనోరమమ్
త్రిప్రకారమహాస్థూణం నవద్వారసమావృతమ్. 14
పుర్యష్టకకలత్రేణ తన్మాత్రస్వజనేన చ
అహంకారగృహస్థేన సర్వతః పరిపాలితమ్. 15

రమణీయమగు ఈ దేహగృహమునకు వాత, పిత్త, కఫములను మూఁడు మహాస్తంభములు, తొమ్మిది ద్వారములు, ఉన్నవి. అహంకారమను గృహ - స్వామి పుర్యష్టకమను భార్యతోడను, పంచతన్మాత్రలను స్వజనులతోడనుగూడి దీని బాగోగులను జూచుచున్నాడు. దీనిని వీక్షింపుము!

అన్తః పశ్యసి సత్కర్ణశష్కులీచన్ద్రశాలికమ్
శిరోరుహాచ్ఛాదనవద్విపులాక్షిగవాక్షకమ్. 16
ఆస్యప్రధానసుద్వారం భుజపార్శ్వోపమన్దిరమ్
దన్తాలికేసరస్రగ్భిర్భూషితద్వారకోటరమ్. 17
అనారతం రూపరసస్పర్శనద్వారపాలవత్
సంకులాలోకవలితం తారాలిన్దకృతస్థితి. 18
రక్తమాంసవసాదిగ్ధం స్నాయుసంతతివేష్టితమ్
స్థూలాస్థికాష్ఠసంబద్ధం సుకుడ్యం సుసమాహితమ్. 19
ఇడా చ పిఙ్గలా చాస్య దేహస్య మునినాయక
సుస్థితే కోమలే మధ్యే పార్శ్వకోష్ఠే నిమీలితే. 20

పద్మయుగ్మత్రయం యన్త్రిమసిమాంసమయం మృదు
ఊర్ధ్వాధోనాలమన్యోన్యమిలత్కోమలసద్దలమ్. 21
సేకేన వికసత్పత్రం సకలాకాశచారిణా
చలన్తి తస్యపత్రాణి మృదు వ్యాప్తాని వాయునా. 22
చలత్సు తేషు పత్రేషు స మరుత్పరివర్ధతే
వాతాహతే లతాపత్రజాలే బహిరివాభితః. 23
వృద్ధిం నీతః సనాడీషు కృత్వా స్థానమనేకధా
ఊర్ధ్వాధోవర్తమానాసు దేహేఽస్మిన్ప్రసరత్యథ. 24
ప్రాణాపానసమానాద్యైస్తతః స హృదయానిలః
సంకేతైః ప్రోచ్యతే తజ్జ్ఞైర్విచిత్రాచారచేష్టితైః. 25

ఈ శరీర - గృహము నీ మనో - నేత్రమునకు ప్రత్యక్షమగుచున్నది. చక్కిలములంబోలు చెవులే దీనిపై మిద్దెలు; కేశములను తృణముల నిది ఆచ్ఛాదితమైయున్నది. నేత్రములను విశాలగవాక్షములు, వదనమండలమను ప్రధానద్వారమును వెలయుచున్నవి; ఈప్రధానద్వారము దంతములను తోరణములతో నలంకృతము. భుజపార్శ్వములను ఉపమందిరమున్నది, రూపరసస్పర్శాదికములను బాహ్యవిషయవార్తలను గొనివచ్చు జ్ఞానేంద్రియములు దీని ద్వారపాలకులు. ఈ గృహము సర్వవ్యాపియగు ఆత్మయొక్క ప్రకాశమున ప్రకాశింపఁబడుచున్నది. గృహ - యజమాని జాగ్రదవస్థయందు నేత్రతారకయను అలిందప్రదేశమున (వరండాయందు) వెలయుచుండును. * ఈ గృహము రక్తమాంసవసారూపకమగు సలిలవృత్తికాగోమయముల నలకబడియున్నది. అస్థులను కాష్ఠములవలనను, నరములను రజ్జువులవలనను ఈ గృహము సుదృఢభావమున సంబద్ధమై వెలయుచున్నది. మునినాయకా! ఈదేహగృహమధ్యభాగమున, ఇడాపింగళలను కోమలసూక్ష్మనాడులు అప్రకాశితభాగమున వెలయుచున్నవి. వీటిమధ్య, పద్మత్రయమును బోలు అస్థిమాంసయమమును, కోమలమునునగు హృదయపద్మమున్నది. దీని నాళములు ఊర్ధ్వ - అధోభాగముల పరివ్యాప్తములైయున్నవి. దీని దళములు అంత్యతకోమలములు, పరస్పరము మిళితములునునైయున్నవి. నాసాగ్రమునుండి పాదముల వఱకు దేహాకాశమున వ్యాపించియున్న చంద్రనామకమగు అపానవాయువుయొక్క అమృతసేచనమున దీని దళములు వికసించియున్నవి. ఇవి, ప్రాణాపానవాయువుల సంచలనమునఁజేసి ఒకప్పుడు వికసించుచు, మఱొకప్పుడు ముకుళితములగుచునుండును. అరణ్యప్రదేశమునందలి ప్రబలవాయువు లతాపత్రజాలముల ప్రతిహతమై నలుదిక్కుల పరివ్యాప్తమగునట్లు, ప్రాణాపానవాయువులు, ఈహృదయయంత్రమను వాయుపూర్ణపత్రమున ప్రతిహతమై, నలుదిక్కుల వ్యాపించి, నాడీచ్ఛిద్రముల ప్రవేశించుచు వృద్ధినందుచున్నది. ఇట్లభివృద్ధినంది, దేహగృహమున భిన్నభిన్న స్థానముల గల్పించుకొని ప్రాణాపానాది పంచనామముల బొంది, ఊర్ధ్వాధోనాడీసమూహముల ప్రవేశించి, శరీరమున ప్రవహించుచు, వివిధకృత్యముల నొనర్చుచున్నది.

(* ఇంధోహవై నామైష యోఽయం దక్షిణేఽక్షన్ పురుషః-' నేత్రస్థం జాగ్రతం విద్యాత్' ఇతిచ శ్రుతిః.

హృత్పద్మయన్త్రిత్రితయే సమస్తాః ప్రాణశక్తయః
ఊర్ధ్వాధః ప్రసృతా దేహే చన్ద్రబిమ్బాదివాంశవః. 26
యాన్త్యాయాన్తి వికర్షన్తి హరన్తి విహరన్తి చ
ఉత్పతన్తి పతన్త్యాశు తా ఏతాః ప్రాణశక్తయః 28
స ఏష హృత్పద్మగతః ప్రాణ ఇత్యుచ్యతే బుధైః
అస్య కాచిన్మనే శక్తిః ప్రస్పన్దయతి లోచనే 28
కాచిత్స్పర్శముపాదత్తే కాచిద్వహతి నాసయా
కాచిదన్నం జరయతి కాచిద్వక్తి వచాంసి చ 29
బహునాత్ర కిముక్తేన సర్వమేవ శరీరకే
కరోతి భగవాన్వాయుర్యన్త్రేహామివ యాన్త్రికః. 30

చంద్రబింబమునుండి కిరణములు వెలువడునట్లు, ప్రాణశక్తియంతయు హృదయమునుండి వెలువడి దేహమధ్యమున ఊర్ధ్వాధోదేశముల వ్యాప్తమగుచున్నది. ఈ ప్రాణశక్తి నాడీసమూహముల ప్రవేశించి, గమన, ఆగమన, కర్షణ, హరణ, విహరణ, పతన, ఉత్థానాది వివిధక్రియల నొనర్ప జేయుచున్నది. విజ్ఞులు హృదయపద్మమునందలి వాయువునే ప్రాణమని చెప్పుదురు. ఈ ప్రాణవాయువుయొక్క ఒకానొకశక్తివలననే, కన్నులు కదలుచున్నవి. మఱొక శక్తివలన స్పర్శ గ్రహింపబడుచున్నది. ఇంకొకశక్తి నాసానాళమున ప్రవహించుచున్నది. ఇంకొక శక్తి తినిన అన్నమును జీర్ణమొనర్చుచున్నది. ఇంకొకశక్తివలన మాటలు వెలువడుచున్నవి. పెక్కేల, యంత్ర - నిర్మాత ఇచ్ఛానుసారము యంత్రమును జలింపజేయుచున్నట్లు, వాయుదేవుడు ఈ శరీరమున వివిధకార్యముల నొనర్చుచున్నాడు.

తత్రోర్ధ్వాధో ద్విసంకేతౌ ప్రసృతావనిలౌ మునే
ప్రాణాపానావితిఖ్యాతౌ ప్రకటౌ ద్వౌ వరానిలౌ 31
తయోరనుసరన్నిత్యం మునే గతిమహం స్థితః
శీతోష్ణవపుషోర్నిత్యం నిత్యమమ్బరపాన్థయోః. 32
కలేవరమహాయన్త్రవాహయోః శ్రమహీనయోః
హృదాకాశార్కశశినోస్త్వగ్నీషోమస్వరూపయోః. 33
శరీరపురపాలస్య మనసో రథచక్రయోః
అహంకారనృపస్యాస్య ప్రశస్యేష్టతురఙ్గయోః. 34
తయోర్మమానుసరతః ప్రాణాపానాభిధానయోః
గతిం శరీరమరుతోరాశరీరమరుద్ధయోః. 35
జాగ్రత్స్వప్నసుషుప్తేషు సదైవ సమరూపయోః
సుషుప్తసంస్థితస్యైవ బ్రహ్మన్ గచ్ఛన్తి వాసరాః. 36
సహస్రవినికృత్తాబ్జాద్బిసతన్తులవాదపి
దుర్లక్ష్యా విద్యమానాపి గతిః సూక్ష్మతరాఽనయోః. 37

మునీంద్రా! వీటి, ఊర్ధ్వగమనమొనర్చు ప్రాణవాయువును, అధోగమనమొనర్చు అపానవాయువును, ప్రకాశ్యభావమున వెలయుచున్నవి. నేను సర్వదా వీటి గతి ననుసరించుచున్నాను. + ఇవి శీతోష్ణములై సర్వదా ఆకాశమున దిరుగుచున్నవి శరీరయంత్రమును మోయుచున్నను వీటికి శ్రమలేదు. * ఈ వాయువులు రెండును హృదయాకాశమునకు సూర్యచంద్రులు; అగ్ని, సోమస్వరూపములగు ఇవి శరీర - పురీరక్షకుడగు మనస్సు అను రథమునకు చక్రములు. ఇవి, అహంకార - నృపతికి ప్రియకరములగు తురంగములు. బ్రహ్మజ్ఞా! నేను, జాగ్రత్స్వప్న - సుషుప్తులయందు సర్వదా సమభావమున వెలయు ఈ వాయుద్వయముల గతి ననుసరించి, సుషుప్తవ్యక్తివలె దినముల గడపుచున్నాను. యావజ్జీవమిట్లే వెలయుదును. వీటి గతి, సహస్రధా - ఖండితమగు మృణాలతంతువుయొక్క ఏకాంశముకంటెను దుర్లక్ష్యనీయము. ×

అవిరతగతయోర్గతిః విదిత్వా
హృది మరుతోరనుసృత్య చోదితాం తామ్
న పునరిహ హి జాయతే మహాత్మ
న్ముదితమనాః పురుషః ప్రణష్టపాశః. 38

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే ప్రాణవిచారణం నామ చతుర్వింశః సర్గః ॥ 24 ॥

మహాత్మా! హృదయమధ్యమున ఈ వాయుద్వయము సర్వదా సంచరించుచున్నది. వివిధశ్రుతుల నానావిధముల వర్ణింపబడిన వాయుగతుల ననుసరించు (ఉపాసించు) పురుషుడు మృత్యుపాశములనుండి వెలువడి, పరమానందలాభమును బొంది, మరల జన్మింపడు.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున ప్రాణవిచారమను చతుర్వింశ
తితమ సర్గము ॥ 24 ॥

---

## పఞ్చవింశః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

[ప్రాణాపానగతిస్త్వత్ర రేచకాదిప్రకల్పనమ్
ప్రాణాపానోదయలయస్థానం బ్రహ్మ చ వర్ణ్యతే.

---

+ ... తస్మాదేకమేవ వ్రతంచరేత్ ప్రాణ్యాచ్చైవాపాన్యాచ్చ నేత్ పాప్మామృత్యురాప్నువదితి యద్యుచరేత్ సమాపిపయిషేత్తేనో ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతీతి — బృ. అ.

* తాని మృత్యుః శ్రమోభూత్వోపయేమే అథేమమేవ నాప్నోత్ యోయం మధ్యమః ప్రాణ — శ్రుతి.

× యథా కేశః సహస్రధా భిన్నస్తావతాణిమ్నా తిష్ఠతీతి —

[ప్రాణాపానగతులందు రేచకాదుల కల్పన, ప్రాణాపానముల యుత్పత్తిలయములకు బ్రహ్మమే స్థానమనుటయు యిందు గనందగును.]

ఇత్థం స కథయన్పక్షీ పృష్టస్తత్ర పునర్మయా
కీదృశీ ప్రాణనాతస్య గతిరిత్యేవ రాఘవ. 1

శ్రీ వసిష్ఠుడు:— రాఘవా! ఇట్లు నుడువు ఆ పక్షిని నేను మరల, ప్రాణవాయువు గతి ఎట్టిది? అని ప్రశ్నించితిని.

భుశుణ్డ ఉవాచ :—

జానన్నపి మునే సర్వం కిం మాం పృచ్ఛసి లీలయా
యథాపృష్టమహం వచ్మి శృణు తత్రాపి మద్వచః. 2

భుశుండుడు:- మునీ! అంతయు దెలిసియుండియు మరల నన్నిట్లు విలాసారము ప్రశ్నించుచున్నావేమి? అయినను అడిగిన దానిని జెప్పుచున్నాను. వినుము.

ప్రాణోఽయమనిశం బ్రహ్మన్స్పన్దశక్తిః సదాగతిః
సబాహ్యాభ్యన్తరే దేహే ప్రాణోఽయముపరి స్థితః. 3

బ్రహ్మజ్ఞా! సదాగతియగు ప్రాణవాయువు సర్వదా స్పందశక్తిమంతము. వెనుక జెప్పినట్లు, శరీరము నందంతట లోపల, వెలుపల, పైన ప్రవహించుచున్నది.

అపానోఽప్యనిశం బ్రహ్మన్స్పన్దశక్తిః సదాగతిః
సబాహ్యాభ్యన్తరే దేహే త్వపానోఽయమవాక్స్థితః. 4

బ్రహ్మవేత్తా! ఇట్లే స్పందశక్తిమంతమగు అపానవాయువుగూడ శరీరమునందంతట, లోపల, వెలుపల, పైన బ్రవహించుచున్నది.

జాగ్రతః స్వప్నతశ్చైవ ప్రాణాయామోఽయముత్తమః
ప్రవర్తతే యత స్తజ్జ్ఞ తత్త్వావచ్ఛ్రేయసే శృణు. 5

జాగ్రత్స్వప్నావస్థలయందు రెండిటగూడ ఈ ఉత్తమప్రాణాయామము సంభవము; విజ్ఞుడా! దీనిని వినుము; ఇది శ్రేయోదాయకము.

బాహ్యోన్ముఖత్వం ప్రాణానాం యద్ధృదమ్బుజకోటరాత్
స్వరసేనా స్తయత్నానాం తం ధీరా రేచకం విదుః. 6

హృత్పద్మకోటరమునుండి, ప్రయత్నింపకుండగనే స్వాభావికముగ ప్రాణవాయువు వెలుపలకి వచ్చుటనే ధీరులు రేచక మందురు.

ద్వాదశాఙ్గులపర్యన్తం బాహ్యామాక్రమతామధః
ప్రాణానామఙ్గసంస్పర్శో యః స పూరక ఉచ్యతే. 7
బాహ్యాత్పరాపతత్యన్తరపానే యత్నవర్జితః
యోఽయం ప్రపూరణః స్పర్శో విదుస్తమపి పూరకమ్. 8

నాసాగ్రమునుండి మూర్ధప్రదేశమువఱకును, అటనుండి ద్వాదశాంగుళములవఱకునున్న అధోప్రదేశమునను ప్రాణవాయువు ప్రవహించుటను పూరక మందురు.

అపానేఽ స్తంగతే ప్రాణో యావన్నాభ్యుదితో హృది
తావత్సా కుమ్భకావస్థా యోగిభిర్యానుభూయతే. 9

పిదప, అపానవాయువు ఉపశమింప, హృదయమధ్యమున ప్రాణవాయువు లేనంతవఱకు కుంభకమని చెప్పబడుచున్నది. దీనిని యోగులు అనుభవించుచున్నారు.

రేచకః కుమ్భకశ్చైవ పూరకశ్చ త్రిధా స్థితః
అపానస్యోదయస్థానే ద్వాదశాన్తాదధో బహిః. 10
స్వభావాః సర్వకాలస్థాః సమ్యగ్యత్నవివర్జితాః
యే ప్రోక్తాః స్ఫారమతిభిస్తాఞ్ఛృణు త్వం మహామతే. 11

ప్రాణాయామమిట్లు కుంభక, రేచక, పూరక నామముల మూడువిధముల ఒప్పుచున్నది. అపాన - ద్వారమునుండి నాసికాగ్రమువఱకునున్న ద్వాదశాంగుళప్రదేశమున నిర్యత్నముగ నీప్రాణాయామము జరుగుచున్నది, మహామతీ! నిర్మలబుద్ధులగు యోగులు వచించు విషయముల జెప్పుచున్నాను; వినుము.

ద్వాదశాఙ్గులపర్యన్తాద్బాహ్యాదభ్యుదితః ప్రభో
యో వాతస్తస్య తత్రైవ స్వభావాత్పూరకాదయః. 12

ప్రభో! నాసాగ్ర - బాహ్యప్రదేశమున ద్వాదశాంగుళస్థానమధ్యమున వెలయు వాయువున, బాహ్యప్రదేశముననే పూరకాది త్రివిధప్రాణాయామము జరుగుచున్నది.

మృదన్తరస్థానిష్పన్నఘటవద్యా స్థితిర్బహిః
ద్వాదశాఙ్గులపర్యన్తే నాసాగ్రసమసంముఖే. 13
వ్యోమ్ని నిత్యమపానస్య తం విదుః కుమ్భకం బుధాః
బాహ్యోన్ముఖస్య వాయోర్యా నాసికాగ్రావధిర్గతిః. 14
తం బాహ్యపూరకం త్వాద్యం విదుర్యోగవిదో జనాః
నాసాగ్రాదపి నిర్గత్య ద్వాదశాన్తావధిర్గతిః. 15
యా వాయోస్తం విదుర్ధీరా అపరం బాహ్యపూరకమ్
బహిరస్తం గతే ప్రాణే యావన్నాపాన ఉద్గతః. 16
తావత్పూర్ణం సమావస్థం బహిష్ఠం కుమ్భకం విదుః
యత్తదన్తర్ముఖత్వం స్యాదపానస్యోదయం వినా. 17
తం బాహ్యరేచకం విద్యాచ్ఛిన్త్యమానం విముక్తిదమ్
ద్వాదశాన్తాద్యదుత్థాయ రూపప్రీవరతా పరా. 18
అపానస్య బహిష్ఠం తమపరం పూరకం విదుః
బాహ్యనాభ్యన్తరాంశ్చైతాన్కుమ్భకాదీననారతమ్. 19

ప్రాణాపానస్వభావాంస్తాన్బుద్ధ్వా భూయో న జాయతే
అష్టావేతే మహాబుద్ధే రాత్రిందివమనుస్మృతాః. 20

నాసాగ్రసమ్ముఖముననున్న ద్వాదశాంగుళప్రమాణస్థానమధ్యమున అపానవాయువు, వృత్తికయందు అనుత్పన్న ఘటమువలె, ఆకాశమున వెలయుటనే బాహ్యకుంభక మందురు. బాహ్యోన్ముఖమగు వాయువు నాసాగ్రపర్యంతము ప్రవహించుటనే యోగవేత్తలు, ప్రథమ బాహ్యపూరక మందురు. నాసాగ్రమునుండి వెలువడి, ద్వాదశాంగుళపరిమితప్రదేశప్రవాహమును గూడ, ధీరులు బాహ్యపూరకమని నుడువుచున్నారు. బయట ప్రాణవాయువు ప్రశమితమై, అపానవాయువు ఉదయయింపనంతవఱకు ఉండు పూర్ణ - సామ్యావస్థయే బాహ్య - కుంభక మనంబడుచున్నది; నిష్పందమగు అపానవాయువుయొక్క స్పందనప్రయత్నమే బాహ్యరేచక మనంబడుచున్నది; ఈ బాహ్యరేచకము ననుభవింపగలిగినవాడు ముక్తిని బడయును, ద్వాదశాంగుళనిర్దిష్ట - శేషస్థానము నుండి నాసాగ్రమువఱకు జరుగు అపానవాయువుయొక్క అభివ్యక్తిగూడ మఱియొక బాహ్యపూరకము. బాహ్యాభ్యంతరీణ కుంభకాదిరూపకమగు ప్రాణాపానముల అనావృతస్వభావమును గ్రహింపగలిగిన, మరల జన్మింప నవసరములేదు. మహామతీ! మత్ప్రోక్తములగు వాయవీయ - అష్టవిధావస్థల రాత్రిందినములు అభ్యసించుచురా, ముక్తిదొఱకును.

స్వభావా దేహవాయూనాం కథితా ముక్తిదా మయా
గచ్ఛతస్తిష్ఠతో వాపి జాగ్రతః స్వప్నతోఽపి వా. 21
ఏతే నిరోధమాయాన్తి ప్రకృత్యాఽతిచలానిలాః
యత్కరోతి యదశ్నాతి బుద్ధ్యైవాలమనుస్మరన్. 22
కుమ్భకాదీన్నరః స్వాన్తస్తత్ర కర్తా న కించన.
అవ్యగ్రమస్మిన్వ్యాపారే బాహ్యం పరిజహన్మనః. 23
దినైః కతిపయైరేవ పదమాప్నోతి కేవలమ్
ఏతదభ్యసతః పుంసో బాహ్యేవిషయవృత్తిషు. 24
న బధ్నాతి రతిం చేతః శ్వదృతౌ బ్రాహ్మణో యథా
ఏతాం దృష్టిమవష్టభ్య యే స్థితాః కృతబుద్ధయః. 25
ప్రాప్తప్రాప్తవ్యమఖిలం తైరఖిన్నాన్త ఏవ హి
తిష్ఠతా గచ్ఛతా నిత్యం స్వపతా జాగ్రతా తథా. 26
ఏషా చేత్ప్రేక్ష్యతే దృష్టిస్తన్న బన్ధనమాప్యతే
ప్రాణాపానానుసరణప్రాప్తబోధవతామలమ్. 27
సంశాన్తమలమోహేన స్వస్థేనాన్తరిహోహ్యతే
సర్వారమ్భాన్సదా స్వచ్ఛః కుర్వన్నాపి బుధో జనః. 28
ప్రాణాపానగతిం ప్రాప్య సుస్వస్థం సుఖమేధతే
ప్రాణస్యాభ్యుదయో బ్రహ్మన్హృత్పద్మపత్రాద్ధృతి స్థితాత్. 29

ద్వాదశాఙ్గులపర్యన్తే ప్రాణోఽస్తం యాత్యయం బహిః
అపానస్యోదయో బాహ్యద్ద్వాదశాన్తాన్మహామునే. 30
అస్తంగతిరథామ్భోజమధ్యే హృదయసంస్థితే
ప్రాణో యత్ర సమాయాతి ద్వాదశాన్తే నభఃపదే. 31
తదా తస్మాదపానోఽయం ఖాదేతి సమనన్తరమ్
బాహ్యాకాశోన్ముఖః ప్రాణో వహత్యగ్నిశిఖా యథా. 32

అభ్యాసవశమున, అతిచంచలములగు ఈ దేహవాయువులు జాగ్రత్స్వప్నసుషుప్తుల యందునను, గమనాగమనావస్థలలోను, మఱియు నితరములగు అన్నికాలములలోను నిరుద్ధములవ గలవు. బుద్ధిపూర్వకముగ ఈ కుంభకాదుల ననుష్ఠించు మనుష్యుడు, భోజనాది కార్యముల నాచరించినను, అతని మనస్సు కర్తృత్వశూన్యమై వెలయును. ఈ ప్రాణచింతారతుడగు మనుష్యుడు అల్ప సమయముననే బాహ్యవస్తువుల బరిత్యజించి, కైవల్యపదమునందును. ఈ ప్రాణచింత నభ్యసించు మనుజుని చిత్తము, శ్వానచర్మమును బ్రాహ్మణుడేవకొనునట్లు, బాహ్యవిషయముల నేవగొనును. మద్వర్ణితమగు ప్రాణచింత నభ్యసించు కృతబుద్ధులందఱును, పొందదగినదానినంతటిని బొంది, క్లేశవిహీనులైనారు. సర్వావస్థలయందు యీ దృష్టినవలంబింపగలిగిన, మరల బంధమున తగుల్కొన నవసరముండదు. ఇట్లు, ప్రాణాపానముల నిరుద్ధమొనర్చి, తత్త్వజ్ఞానమును బొందగల్గినవారి అంతఃకరణము సంపూర్ణముగ మోహమలపరిశూన్యమగును. ప్రాణాపానవాయువుల యీదృశ నిరోధమును బొందగలిగిన తత్త్వజ్ఞవ్యక్తి, సర్వదా సర్వవిధకార్యముల నాచరించుచున్నను, నిర్మల స్వస్వభావమున వెలయుచు, సుఖముగనుండును. బ్రహ్మజ్ఞా! హృత్పద్మదళమునుండి లేచి, బాహ్య - ద్వాదశాంగుళ భాగమువఱకు వెడలి, ప్రాణవాయువు నిశ్చలముగనుండుటే, ప్రాణముయొక్క అభ్యుదయ మనంబడుచున్నది. మునీంద్రా! హృత్పద్మముయొక్క బాహ్య - ద్వాదశాంగుళస్థానశేషప్రాంతమునుండి లేచి, హృదయపద్మమున నిశ్చలముగనుండుటయే అపానవాయువుయొక్క అభ్యుదయము. ప్రాణవాయువు ద్వాదశాంగుళపరిమితశూన్యస్థానమున ప్రవహించునప్పుడే, అపానవాయువు అదే మార్గము నవలంబించి లోనికి జొచ్చుచుండును. ప్రాణవాయువు బహిరాకాశమువైపున ఉన్ముఖమై, అగ్నిశిఖవలె బ్రవహించుచుండును.

హృదకాశోన్ముఖోఽపానే నిమ్నే వహతి వారివత్
అపానశ్చన్ద్రమా దేహమాప్యాయయతి బాహ్యతః. 33

అపానవాయువు హృదయాకాశోన్ముఖమై, నీటివలె క్రిందివైపుకు బ్రవహించుచుండును; అపానవాయువు చంద్రరూపమున బయటనుండియే దేహమును పెంపొందించుచుండును.

ప్రాణః సూర్యోఽగ్నిరథవా పచత్యన్తరిదం వపుః
ప్రాణో హి హృదయాకాశం తాపయిత్వా ప్రతిక్షణమ్. 34
ముఖాగ్రగగనం పశ్చాత్తాపయత్యుత్తమో రవిః
అపానేన్దుర్ముఖాగ్రం తు ప్లావయిత్వా హృదమ్బరమ్. 35

పశ్చాదాప్యాయయత్యేష నిమేషసమనన్తరమ్
అపానశశినోఽన్తస్థా కలా ప్రాణవివస్వతా. 36
యత్ర గ్రస్తా తదాసాద్యం పదం భూయో న శోచ్యతే
ప్రాణార్కస్య తథాన్తస్థా యత్రాపానసితాంశునా. 37
గ్రస్తా తత్పదమాసాద్య నభూయో జన్మభాఙ్నరః
ప్రాణ ఏవార్కతాం యాతి సబాహ్యాభ్యన్తరేఽమ్బరే. 38
ఆప్యాయనకరీం పశ్చాచ్ఛశితామధితిష్ఠతి
ప్రాణ ఏవేన్దుతాం త్యక్త్వా శరీరాప్యాయకారిణీమ్. 39
క్షణాదాయాతి సూర్యత్వం సంశోషణకరం పదమ్
అర్కతాం సంపరిత్యజ్య న యావచ్చన్ద్రితాం గతః. 40
ప్రాణస్తావద్విచార్యన్తేఽదేశకాలే న శోచ్యతే
హృది చన్ద్రార్కయోర్జ్ఞాత్వా నిత్యమస్తమయోదయమ్. 41
ఆత్మనో నిజమాధారం న భూయో జాయతే మనః
సోదయాస్తమయం సేన్దుం సరశ్మిం సగమాగమమ్. 42
హృదయే భాస్కరం దేవం యః పశ్యతి స పశ్యతి
న క్షీణం నాపరిక్షీణం బహిష్ఠం సిద్ధయే తమః 43
హార్దం తు క్షపయేద్ధ్వాన్తం యత్క్షయే సిద్ధిరుత్తమా
బాహ్యే తమసి సంక్షీణో లోకాలోకః ప్రజాయతే. 44

ప్రాణవాయువు సూర్యుడు లేక అగ్నిరూపమున లోపలనుండి యీ శరీరమును పరిపక్వమొనర్చుచున్నది. ప్రాణవాయువు తీక్ష్ణసూర్యస్వరూపమున హృదయాకాశమును తప్తమొనర్చి, పిదప ముఖాగ్రభాగమును తప్తమొనర్చుచున్నది. అపానవాయువు చంద్రరూపమున, నిమేషమధ్యకాలముననే, ముఖాగ్రమును పరితృప్తమొనర్చి, హృదయాకాశమును గూడ పరితృప్తమొనర్చుచున్నది. ప్రాణరూపుడగు సూర్యుడెట అపాన - చంద్రుని కళల గ్రసించునో, అట్టి బ్రహ్మపదమును బొందిన మరల శోకింప నవసరముండదు. అపాన - చంద్రుడెట ప్రాణసూర్యుని కళల గ్రసించునో, అట్టి పరమపదమునుబొందిన మరల జన్మింపవలసిన అవసరముండదు. ప్రాణవాయువే, బహిరంతరాకాశముల సూర్యరూపమున ప్రకాశించుచుండియు, మరల ఆహ్లాదకరమగు చంద్రస్వరూపమును ధరించుచున్నది. ఈ ప్రాణవాయువే మరల ఆహ్లాదకరమగు చంద్రస్వరూపమును బరిత్యజించి, తాపయుక్తమగు సూర్యపదమును బొందుచున్నది. ప్రాణవాయువు సూర్యత్వము (ఉష్ణత్వము)ను త్యజించి చంద్రత్వమునుబొందిన, అనగా ప్రాణాపానముల ఉత్పత్తి - పూర్వసంధిక్షణమున బాహ్యప్రాణవాయువు లయమై, ఆత్మయొక్క అశరీరత్వము, నిష్క్రియత్వము, నిర్మనస్కత్వము మున్నగు వాస్తవస్వభావలక్షణములు స్పష్టముగ గోచరములైన, యోగి దేశకాలాద్యపరిచ్ఛిన్నుడై ఆత్మయందు వెలుగొందుచు దుఃఖింపడు. అప్పుడు మనస్సు హృదయమధ్యముననగూడ సూర్యచంద్రుల ఉదయాస్తమయముల గ్రహించి, స్వాధిష్ఠానమగు పరమాత్మయొక్క సంధానమును బడసిన, మరల జన్మయుండదు.

ఎవఁడు హృన్మధ్యముననే, ఉదయాస్తమయ, గమనాగమనయుతుఁడును, రశ్మిమాలాశోభితుఁడును, సచంద్రుఁడును నగు సూర్యదేవుని గాంచునో, అతఁడే యథార్థ - ద్రష్ట. బాహ్యాంధకారము నశించినను, నశింపకున్నను లాభములేదు. హృదయాంధకారము నున్మూలింపఁగలిగినవాఁడే ప్రకృతమగు సిద్ధిని బడసినవాఁడు. బాహ్యాంధకారము క్షయమందిన, కేవలమీ జగత్తు పరిలక్షితమగును.

హార్దే తు తమసి క్షీణే స్వాలోకో జాయతే మునే
హార్దాన్ధకారక్షయదం పరిజ్ఞాతం విముక్తిదమ్. 45
సోదయాస్తమయం యత్నాత్ప్రాణార్కమవలోకయేత్
అపానేన్దుః ప్రయాత్యస్తం యత్ర హృత్పద్మకోటరే 46
పదాత్తస్మాదుదేత్యన్తః ప్రాణార్కో బహిరున్ముఖః
అపానేఽస్తంగతే ప్రాణః సముదేతి హృదమ్బుజాత్. 47
ఛాయాయాం గలితాఙ్గాయాం తత్రైవాశు యథాతపః
ప్రాణే త్వస్తంగతే బాహ్యాదపానః ప్రోదితః క్షణాత్. 48
ఆతపే పరితో నష్టే ఛాయేవానుపదం తథా
ప్రాణజన్మావనౌ నష్టమపానం విద్ధి సన్మతే. 49
అపానజన్మభూమౌ చ ప్రాణం నష్టమవేహి హి
అస్తం గతవతి ప్రాణే త్వపానేఽభ్యుదయోన్ముఖే. 50
బహిః కుమ్భకమాలమ్బ్య చిరం భూయో న శోచ్యతే
అపానేఽస్తం గతే ప్రాణే కించిదభ్యుదయోన్ముఖే. 51
అన్తఃకుమ్భకమాలమ్బ్య చిరం భూయో నశోచ్యతే
ప్రాణరేచకమాలమ్బ్య అపానాద్దూరకోటిగమ్. 52
స్వచ్ఛం కుమ్భకమభ్యస్య న భూయః పరితప్యతే
అపానే రేచకాధారం ప్రాణపూరాన్తరస్థితమ్. 53
స్వసంస్థం పూరకం దృష్ట్వా న భూయో జాయతే నరః
ప్రాణాపానావుభావన్తర్యత్రైతౌ విలయం గతౌ. 54
తదాలమ్బ్య పదం శాన్తమాత్మానం నానుతప్యతే
ప్రాణభక్షోన్ముఖేఽపానే దేశం కాలం చ నిష్కలమ్. 55
విచార్య బహిరన్తర్వా న భూయః పరిశోచ్యతే
అపానభక్షణపరే ప్రాణే హృది తథా బహిః. 56
దేశం కాలం చ సంప్రేక్ష్య న భూయో జాయతే మనః
యత్ర ప్రాణో హ్యపానేన ప్రాణేనాపాన ఏవచ. 57
నిగీర్ణౌ బహిరన్తశ్చ దేశకాలౌ చ పశ్యతౌ
క్షణమస్తం గతప్రాణమపానోదయవర్జితమ్. 58

అయత్నసిద్ధబాహ్యస్థం కుమ్భకం తత్పదం విదుః
అయత్నసిద్ధో హ్యాన్తస్థకుమ్భకః పరమం పదమ్. 59
ఏతత్తదాత్మనో రూపం శుద్ధైషా పరమైవ చిత్
ఏతత్తత్తత్సదాభాసమేతత్ప్రాప్య న శోచ్యతే. 60

మునీ! హృదయాంధకారము క్షీణించిన ఆత్మ ఆలోకితమగును. ఉదయాస్తమయయుతుడగు యీ ప్రాణసూర్యుడే, హృదయాంధకారమును విదూరింప సమర్థుడు. ఇతనిని జక్కగ గ్రహింపగలిగిన ముక్తిలభ్యమగును. అందువలన, ప్రయత్నించి యీ ప్రాణ - సూర్యుని దర్శనమును బడయవలయును. అపాన - శశి అస్తమించు హృత్పద్మకోటరముననే ప్రాణ - సూర్యుడుదయించి బహిరున్ముఖుడగును; అపానవాయు వస్తమించిన, హృత్కమలమునుండి ప్రాణవాయువు ఉదయించును. నీడతొలగినచోట ఎండవచ్చునట్లును, ఎండపోయిన నీడవచ్చునట్లును, ప్రాణవాయువు తొలగిన అపానవాయువు అరుదెంచుచున్నది. సన్మతీ! ప్రాణవాయువు తొలగిన అపానవాయువు ఉత్పన్నమైనచోట అపానవాయువు నశించుచున్నది. అపానవాయువు జన్మించినచోట ప్రాణవాయువు నశించుచున్నదని యీ యోగరహస్యమును గ్రహింపవలెను. ప్రాణవాయు వస్తమించి అపానవాయు వభ్యుదయమందు స్థితినే బాహ్యకుంభకమందురు; యీ బాహ్యకుంభకము నవలంబింపగలిగిన మరల శోకింప నవసరముండదు. అపానమస్తమించి, ప్రాణవాయు వొకించుక ఉదయించిన, అంతఃకుంభకమందురు. యీ అంతఃకుంభకము నవలంబింపగలిగిన మరల నింకెన్నడును శోకింపవలసిన అవసరముండదు. అపానవాయువు ఉదయించు ద్వాదశాంగుళదూరస్థితస్థానమునకు, షోడశాంగుళదూరమున బ్రసరించు ప్రాణమును అంతటిని రేచకమొనర్చి, స్వచ్ఛమగు కుంభకము నభ్యసింపగలిగిన నిక దుఃఖింపవలసిన అవసరముండదు. నాసాగ్రమునుండి అపానవాయుప్రవేశమును, బాహ్య - రేచకకారణమగు ప్రాణవాయువు లోపల బ్రవేశించుటను గాంచినవాడు మరల జన్మింపడు. ప్రాణాపానములు రెండును విలీనమందిన శాంత - ఆత్మపదమును బొందగలిగిన నిక శోకింపవలసిన అవసరముండదు. అపానము ప్రాణమును గ్రసింప నుద్యమించినప్పుడు - బాహ్యకుంభకమే గానిమ్ము, ఆంతరకుంభకమే గానిమ్ము - విచారమువలన దేశకాలముల నిష్కలములు అనగా, చిన్మాత్రములని గ్రహింపగలిగిన మరల దుఃఖింపవలసిన అవసరముండదు. ప్రాణమును మరల అపానము గ్రసింప నుద్యమించిన, హృదయమున లేక వెలుపల, దేశకాలముల అపరిచ్ఛిన్నతను గ్రహింపగలిగిన, మరల శోకింపవలసిన అవసరముండదు. ప్రాణాపానములు రెండును పరస్పరగ్రస్తములైన, దేశకాలములుగూడ విలీనతనందునని గ్రహింపవలెను. ప్రాణవాయు వస్తమించి, అపానవాయు వుదయింపకున్న స్థితిని యోగులు అయత్న - సిద్ధమగు బాహ్యకుంభకమందురు. నిర్యత్నలభ్యమగు అంతఃకుంభకమే పరమపదము. అయ్యదియే ఆత్మస్వరూపము, అదియే విశుద్ధమును, పరమమును నగు చైతన్యము.

పుష్పస్యాన్తరివామోదః ప్రాణస్యాన్తరవస్థితమ్
న స ప్రాణం న వాపానం చిదాత్మానముపాస్మహే. 61

పుష్పమున సుగంధమువలె ప్రాణమున ఈ చిదాత్మ వెలయుచున్నది; అది ప్రాణముకాదు, అపానమును గాదు. అట్టి చిదాత్మ నుపాసించుచున్నారము.

జలస్యాన్తరివాస్వాదమపానస్యాన్తరస్థితమ్
న స ప్రాణం న వాపానం చిదాత్మానముపాస్మహే. 62

జలముల వాస్వాదముకలె అపానమున వెలయుచదియును, సజీవ నిర్జీవములలో నేయొక్కటియును గానిదియును నగు చిదాత్మ నుపాసించుచున్నారము

ప్రాణక్షయస్యోపాన్తస్థమపానక్షయకోటిగమ్
అపానప్రాణయోర్మధ్యం చిదాత్మానముపాస్మహే. 63

ప్రాణలయమునకు సన్నిహితుడును, అపానలయమునకు దూరస్థుడును, ప్రాణాపానముల మధ్యస్థుడును నగు చిదాత్మ నుపాసించుచున్నారము.

ప్రాణస్య ప్రాణనం ప్రోచ్చైః పరం జీవస్య జీవనమ్
దేహస్య ధారణం ధుర్యం చిదాత్మానముపాస్మహే. 64

ప్రాణముయొక్క ప్రాణమును, జీవనముయొక్క పరమజీవనమును, దేహధారణమున నగ్రగణ్యమును నగు చిదాత్మ నుపాసించుచున్నారము.

మనసో మననం సత్యం బుద్ధేరేకావబోధనమ్
అహంకృతేరహంకారం చిదాత్మానముపాస్మహే. 65

మనస్సుయొక్క మననమును, బుద్ధియొక్క బోధకమును, అహంకారముయొక్క అహంకారోత్పాదనాకారణమునునగు చిదాత్మ నుపాసించుచున్నారము.

యస్మిన్సర్వం యతః సర్వం యత్సర్వం సర్వతశ్చ యత్
యచ్చ సర్వమయం నిత్యం తచ్చిత్వత్త్వముపాస్మహే. 66

ఎవ్వనియందంతయును వెలయుచున్నదో, ఎవ్వనినుండి అంతయును వెలువడుచున్నదో, ఎవ్వడిదంతయునై వెలుగుచున్నాడో, అట్టి చిదాత్మ నుపాసించుచున్నారము.

ఆలోకాలోకనం పుణ్యం సర్వపావనపావనమ్
నచ భావనమన్యానం తచ్చిత్తత్త్వముపాస్మహే. 67

పరంజ్యోతియును, పవిత్రమును, సర్వపావనపావనమును, మనోబుద్ధ్యాదిభావమునందియు స్వస్వభావచ్యుత మవనిదియునగు చిదాత్మ నుపాసించుచున్నారము,

[అపానోఽస్తం గతో యత్ర ప్రాణో నాభ్యుదితః క్షణమ్
కలాకలఙ్కరహితం తచ్చిత్తత్త్వముపాస్మహే. 1]

(అపానవాయు వస్తమింప ప్రాణవాయు వెవ్వనియందు ఉదయింపకుండునో, అట్టినిష్కలంక చిదాత్మమూర్తి నుపాసించుచున్నారము.) 1*

నాపానోఽభ్యుదితో యత్ర ప్రాణశ్చాస్తముపాగతః
నాసాగ్రగగనావర్తం తచ్చిత్తత్త్వముపాస్మహే. 68

అపానవాయువు ఉదయింపక, ప్రాణమస్తమింపకుండునప్పుడు నాసాగ్ర - ఆకాశపథమున వెలయు చిదాత్మ నుపాసించుచున్నారము.

---

* అధికపాఠము,

యత్ర ప్రాణోఽస్తమాయాతి యత్రాపానోఽస్తమేతి చ
యత్ర ద్వావప్యనుత్పన్నౌ తచ్చిత్తత్త్వముపాస్మహే. 69

ప్రాణాపానములు రెండును అస్తమించి, మఱి అవి ఉదయింపని తావగు చిదాత్మ నుపాసించుచున్నారము.

ప్రాణాపానోద్భవస్థానే బాహ్యాభ్యన్తరమాస్థితే
యే ద్వే యోగిపదాధారస్తచ్చిత్తత్త్వముపాస్మహే. 70

బాహ్యాభ్యంతరీణములగు ప్రాణాపానముల ఉద్భవస్థానమును, యోగిగమ్యమును, తదుద్భవస్థానాధారమునునగు చిదాత్మ నుపాసించుచున్నారము.

ప్రాణాపానరథారూఢం ప్రాణాపానమనాతతమ్
యచ్ఛక్తిరూపం శక్తీనాం తచ్చిత్తత్త్వముపాస్మహే. 71

ప్రాణాపాన-రథారూఢుడును, పరిచ్ఛిన్నుడై ప్రాణాపానముల శక్తివలె దోచువాడును, సర్వశక్తియునగు చిదాత్మ నుపాసించుచున్నారము.

హృత్ప్రాణకుమ్భకం దేవం బహిశ్చాపానకుమ్భకమ్
పూరకాంశవిసృష్టం యత్తచ్చిత్తత్త్వముపాస్మహే. 72

హృదయమున ప్రాణవాయు-కుంభకమును, బయట అపానవాయు కుంభకమును, మఱియు పూరకాదిభావమున వివర్తము నందునదియునునగు చిదాత్మ నుపాసించుచున్నారము.

ప్రాణాపానపరామర్శం సత్తాబోధం విరూపకమ్
యత్ప్రాప్యం ప్రాణమనసా తచ్చిత్తత్త్వముపాస్మహే. 73

ప్రాణాపానపరిచారకుడును, తదస్తిత్వబోధకుడును, ప్రాణోపాసనాలభ్యుడును, రూపవిహీనుడునునగు చిదాత్మ నుపాసించుచున్నారము.

యత్ప్రాణపవనస్పన్దో యత్స్పన్దానన్దకారకమ్
కారణం కారణానాం యత్తచ్చిత్తత్త్వముపాస్మహే. 74

ప్రాణస్పందనహేతువును, ఇంద్రియవిషయస్పర్శకారణమును, విషయానందకారణమును, కారణకారణమును నగు చిదాత్మ నుపాసించుచున్నారము.

యదఖిలకలనాకలఙ్కహీనం
పరివలితం చ సదా కలాగణేన,
స్వనుభవవిభవం పదం తదగ్ర్యం
సకలసురప్రణతం పరం ప్రపద్యే 75

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డోపాఖ్యానే సమాధివర్ణనం నామ పఞ్చవింశః సర్గః ॥ 25 ॥

వాస్తవమున కెవ్వనియందు ఈ భేదవిభాగమను కల్పనా-కళంకము లేదో, (నిష్కళుడు అనుట) మఱియు ఈ కల్పనాసమూహములు యెవ్వని ఆశ్రయించియున్నవో, స్వానుభవమే ఎవ్వని

వైభవమో, ఆ సకలదేవగణవందితుడును, సర్వశ్రేష్ఠుడును నగు పరమాత్మ నుపాసించుచున్నారము (లేక శరణు బొందుచున్నారము).

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున సమాధివర్ణనమను పంచ
వింశతితమ సర్గము ॥ 25 ॥

---

## షడ్వింశః సర్గః.

---

[ఇత్థం స్వస్యాత్మవిజ్ఞానం నిరూప్య ప్రాణచిన్తయా
భుశుణ్డేనాత్ర కథ్యన్తే చిరజీవితహేతవః.

ఇట్లు ప్రాణచింతనచే తన యాత్మజ్ఞానమును నిరూపించి భుశుండుడు చిరజీవనమునకు హేతువులను వచించుట.]

భుశుణ్డ ఉవాచ :—

ఏషా హి చిత్తవిశ్రాన్తిర్మయా ప్రాణసమాధినా
క్రమేణానేన సంప్రాప్తా స్వయమాత్మని నిర్మలే. 1

భుశుండుడు :— ఈ చిత్తవిశ్రాంతినే నేను ప్రాణసమాధానమువలనఁబడసితిని; మఱియు క్రమముగ నిర్మలాత్మస్వరూపమున విశ్రాంతినందితిని.

ఏతాం దృష్టిమవష్టభ్య సంస్థితోఽస్మి మహామునే
న చలామి నిమేషాంశమపి మేరువిచాలతః. 2

మహామునీ! ఈ ప్రాణసమాధినవలంబించి, అత్యంతధీరమగు మేరువు చలించినను, ఒక్క నిముషభాగమునగూడ చలింపకుండనున్నాను.

గచ్ఛతస్తిష్ఠతో వాపి జాగ్రతః స్వప్నతోఽపి వా
స్వప్నేఽపి న చలత్యేష సుసమాధిర్మమాత్మని. 3

కూర్చున్నను, నడచుచున్నను, మేల్కొనినను, నిద్రించుచున్నను, ఈ నా ఆత్మసమాధి చెదరకుండనున్నది; అయ్యది స్వప్నమునగూడ తాఱుమారగుటలేదు.

నిత్యానిత్యాసు లోలాసు జగత్స్థితిషు సుస్థితః
అన్తర్ముఖోఽస్మి తిష్ఠామి స్వకామేనాత్మనాత్మని. 4

నిత్యానిత్యములును, ఇష్టానిష్టములును, సుఖదుఃఖకరములును నగు విషయములరుదెంచినను అంతర్ముఖుడనై స్వచ్ఛందభావమున ఆత్మయందు వెలయుచున్నాడను.

అపి సంరుధ్యతే వాయురపి వా సలిలం గతే
నైతస్మాత్సుసమాధానాద్విరుద్ధం సంస్మరామ్యహమ్. 5

వాయువు నిరోధింపబడిన నిరోధింపబడుగాక, ప్రబల నదీస్రోతము నడ్డగింపబడిన నడ్డగింపబడుగాక; అయినను నా యీ ఆత్మసమాధిని ఎవ్వరును అడ్డజాలరు; యీ సమాధికి విరుద్ధమగు విషయమునుగూడ నేను స్మరింపజాలను.

ప్రాణాపానానుసరణాత్పరమాత్మావలోకనాత్
అశోకమనుజాతోఽస్మి పదమాద్యం మహాతపః. 6

మహాతపస్వీ! ప్రాణాపానగతుల ననుసరించి పరమాత్మను దర్శించి, అశోకమగు ఆద్య పదమును బొందితిని.

ఆమహాప్రలయాద్బ్రహ్మన్మజ్జనోన్మజ్జనమ్
అహమద్యాపి భూతానాం పశ్యన్జీవామి ధీరధీః. 7

బ్రహ్మజ్ఞా! మహాప్రళయాదిగ నేను ధీరభావమున జీవులు కాలస్రోతమున మునిగి తేలుచుండుటను, కాంచుచున్నాను; ధీరచిత్తమున చిరజీవినై వెలయుచున్నాను.

న భూతం న భవిష్యం చ చిన్తయామికదాచన
దృష్టిమాలమ్బ్య తిష్ఠామి వర్తమానమిహాత్మనా. 8

గడచినదానిని లేక రాబోవుదానిని గురించి నేనెన్నడును జింతింపను. వర్తమానదృష్టిని—నిత్యవర్తమానస్వభావమగు సాక్షిదృష్టిని— అవలంబించి, ఆత్మయందు వెలయుచున్నాడను.

యథా ప్రాప్తేషు కార్యేషు పరిత్యక్తఫలైషణః
సుషుప్తసమయా బుద్ధ్యా పరితిష్ఠామి కేవలమ్. 9

ఫలేచ్ఛను త్యజించి, సుషుప్తవ్యక్తివలె నిరభిమానపూర్వకముగా యథాప్రాప్తములగు కార్యముల నాచరించి, కేవలస్వభావమున వెలయుచున్నాడను.

భావాభావమయీం చిన్తామీహితానీహితాన్వితామ్
విమృశ్యాత్మని తిష్ఠామి చిరంజీవామ్యనామయః. 10

ఇష్టానిష్టములతో గూడిన గ్రహణత్యాగముల జింతను హేయమని త్యజించి ఆత్మయందు వెలయుచున్నాడను; అందువలన నేను, రోగరహితుడనగు చిరజీవినైతిని.

ప్రాణాపానసమాయోగసమయం సమనుస్మరన్
స్వయమాత్మని తుష్యామి చిరం జీవామ్యనామయః. 11

ప్రాణాపానముల సంధిక్షణమున గోచరించు పరబ్రహ్మము ననుసరించి, కేవల మాత్మయందే సంతుష్టుడనైయుండుటవలన అనామయమగు చిరంజీవత్వమును బొందితిని.

ఇదమద్య మయా లబ్ధమిదం ప్రాప్స్యామి సున్దరమ్
ఇతి చిన్తా న మే తేన చిరం జీవామ్యనామయః. 12

'దీనిని నేడు పొందితిని, ఆ సుందరవస్తువును రేపు పొందెదను' — ఇట్టివగు చింతలు నాకు లేవు. అందువలన అనామయమగు చిరజీవత్వమును బొందితిని.

న స్తౌమి నచ నిన్దామి కించిత్కించిత్కదాచన
ఆత్మనోఽన్యస్య వా సాధో తేనాహం శుభమాగతః. 13

నేనెద్దానిని ఎప్పుడును ఎన్నడును స్తుతించుటలేదు; నిందింపను. అయ్యది నావిషయమే గానిమ్ము పరులవిషయమే గానిమ్ము! అందువలననే నిట్టి మహత్—శుభమును బొందితిని.

న తుష్యతి శుభప్రాప్తౌ నాశుభేష్వపి ఖిద్యతే
మనో మమ సమం నిత్యం తేనాహం శుభమాగతః. 14

నా మనస్సు శుభమునుబొంది సంతోషింపదు; అశుభమును బొంది దుఃఖింపదు. అది సామ్యావస్థయందే ఎల్లప్పుడు నెగడుచుండును; కనుక నాకిట్టి శుభము లభించినది.

పరమం త్యాగమాలమ్బ్య సర్వమేవ సదైవ హి
జీవితాది మయా త్యక్తం తేనాహం శుభమాగతః. 15

పరమత్యాగమును అనగా సర్వద్వైత బాధాలక్షణమగు త్యాగము నవలంబించి, సర్వమును సదా నేను త్యజించితిని. జీవితాభినివేశమగు మరణభయమును గూడ త్యజించితిని. కాన, నేనిట్టి శుభమును బొందగలిగితిని.

ప్రశాన్తచాపలం వీతశోకం స్వస్థం సమాహితమ్
మనో మమ మునే శాన్తం తేన జీవామ్యనామయః. 16

చాపల్యరహితమును, శోకహీనమును, స్వస్థమును, సమాహితమునునగు స్థితిని నామనస్సు పొందినది; అందువలన నేనిట్టి అనామయజీవనమును బొందితిని.

కాష్ఠం విలాసినీం శైలం తృణమగ్నిం హిమం నభః
సమం సర్వత్ర పశ్యామి తేన జీవామ్యనామయః. 17

కాష్ఠము - సుందరి, శైలము - తృణము, అగ్ని - హిమములను ఆకాశమువలె సర్వత్ర సమానముగ గాంచుచున్నాను. అందువలన నేను అనామయమగు చిరజీవిత్వమును బొందగలిగితిని.

కిమద్య మమ సంపన్నం ప్రాతర్వా భవితా పునః
ఇతి చిన్తాజ్వరో నాస్తి తేన జీవామ్యనామయః. 18

'నేడేమొనర్చితిని ? రేపేమి కానున్నది' — అను చింతాజ్వరము లేకుండుటవలన నే ననామయమగు చిరజీవిత్వమును బొందగలితిని.

జరామరణదుఃఖేషు రాజ్యలాభసుఖేషు చ
న బిభేమి న హృష్యామి తేన జీవామ్యనామయః. 19

జరామరణాది దుఃఖములు, రాజ్యలాభాది సుఖములు సంభవించినను నాకు శోకదుఃఖములు కలుగవు. అందువలన నే ననామయుడనై జీవించుచున్నాడను.

అయం బన్ధుః పరశ్చాయం మమాయమయమన్యతః
ఇతి బ్రహ్మన్న జానామి తేన జీవామ్యనామయః. 20

బ్రహ్మజ్ఞా ! ఇతడు నా మిత్రుడు, అతడు శత్రుడు, వాడు నా కంటె అన్యుడు అనుటను నేనెఱుంగను; అందువలన నే ననామయమగు చిరజీవత్వమును బొందితిని.

సర్వం సర్వపదాభాసమనాద్యన్తమనామయమ్
అయం చిదితి జానామి తేన జీవామ్యనామయః. 21

నానాత్వభావమున దోచునదంతయును, మఱియు త్రైకాలికకారణమగు చైతన్యము నేనేను యని గ్రహించుటవలన అనామయుడనై జీవించుచున్నాడను.

ఆహరన్విహరం స్తిష్ఠన్నుత్తిష్ఠన్నుచ్ఛ్వసన్స్వపన్
దేహోఽహమితి నో వేద్మి తేనాస్మి చిరజీవితః. 22

భుజించుచు, విహరించుచు, లేచుచు, నిశ్వసించుచు, నిద్రించుచున్నను నాకు దేహాభిమానములేదు; అందువలన నేను చిరంజీవినైతిని.

ఇమం సాంసారమారమ్భం సుషుప్తపదవత్స్థితః
అసన్తమివ జానామి తేన జీవామ్యనామయః. 23

కర్మారంభమగు యీ సంసారమున సుషుప్తునివలెనుండి, దీనిని లేనిదానివలె గ్రహించుట వలన నేనిట్టి అనామయజీవితమును బొందితిని.

యథాకాలముపాయాతావర్థానర్థౌ సమౌ మమ
హస్తావివ శరీరస్థౌ తేన జీవామ్యనామయః. 24

యథాకాల మరుదెంచిన అర్థానర్థముల రెంటిని నేను శరీరముననున్న హస్తద్వయమువలె, సమానభావమున గాంచుచుంటిని; దాన నేను చిరజీవిని.

అపరిచలయా శక్త్యా సుదృశా స్నిగ్ధముగ్ధయా
ఋజు పశ్యామి సర్వత్ర తేన జీవామ్యనామయః. 25

స్వరూపప్రచ్యుతినందని స్థైర్యశక్తితోడను, సర్వభూతాత్మభావమగు స్నేహమయదృష్టి తోడను అంతటిని ఋజువుగ (అకుటిలముగ) గాంచుచున్నాడను; అందువలన నేను చిరజీవినైతిని*.

ఆపాదమస్తకాన్తేఽస్మిన్న దేహే మమతా మమ
త్యక్తాహంకారపఙ్కస్య తేన జీవామ్యనామయః. 26

ఈ శరీరము మీద తలనుండి కాళ్లవఱకు, నాకెచ్చటను ఒకింతయు అభిమానములేదు; ఇట్లు నేను అహంకారపంకమును కడిగివేసుకొనినందువలన అనామయుడనై జీవించుచున్నాడను.

యత్కరోమి యదశ్నామి తత్త్యక్త్వా తద్వతోఽపి మే
మనో నైష్కర్మ్యమాదత్తే తేన జీవామ్యనామయః. 27

నే నెద్దాని నొనర్చినను, అనుభవించినను, అభిమానశూన్యుడనై ఒనర్తును. అందువలన శారీరికముగ ఈ కార్యముల నన్నిటిని ఒనర్చినను, నామనస్సు నైష్కర్మ్యమును వహించియే యున్నది. అందువలన నేను అనామయ—చిరజీవినైతిని.

యదా యదా మునే కించిద్విజానామి తదా తదా
మతిరాయాతి నౌద్ధత్యం తేన జీవామ్యనామయః. 28

మునీ! ఏదైన నూతన విషయమును ఒకించుక గ్రహించినప్పుడు నామనస్సు గర్వింపదు; అందువలన నే ననామయ—చిరజీవత్వమును బడసితిని.

---

* సర్వం జిహ్మం మృత్యుపదమార్జవం బ్రహ్మణః పదమ్ ఏతావాన్ జ్ఞానవిషయః ప్రలాప కింకరిష్యతి — మహాభారతమ్.

కర్మోమీశోఽపి నాక్రాన్తిం పరితాపే న ఖేదవాన్
దరిద్రోఽపి న వాఞ్ఛామి తేన జీవామ్యనామయః. 29

నా కితరుల పరాభవింప సామర్థ్యమున్నను, పరాభవింపను. ఇతరులు నన్ను పరాభవించి నను, దుఃఖింపను, దరిద్రుడనైనను ఏ విషయమును వాంఛింపను. అందువలన నాకిట్టి అనామయ చిరజీవనము లభించినది.

పశ్యన్ద్రూపే శరీరేఽస్మిన్సర్వభూతస్థాత్మ చిదాస్పదః
భూతవృన్దమహం సామ్యాత్తేన జీవామ్యనామయః 30

చేతనప్రాయమై కనంబడు ఈ శరీరమున నేనున్నను సర్వభూతములనున్న చిదాత్మనై దర్శించుచుండుటవలన సమదర్శినైయున్నాను; అందువలన నేను నిరామయ చిరజీవిని.

ఆశాపాశవినున్నాయాశ్చిత్తవృత్తేః సమాహితః
సంస్పర్శం న దదామ్యన్తస్తేన జీవామ్యనామయః. 31

నేను సర్వదా సమాహితుడనై ఆశాపాశజటిలమగు చిత్తవృత్తులను హృదయమున చోటీ నివ్వనందువలన అనామయ చిరజీవత్వమును బొందితిని.

అసత్తాం జగతః సత్తామాత్మనః కరబిల్వవత్
సుప్తః ప్రబుద్ధః పశ్యామి తేనాస్మి చిరజీవితః. 32

బహిర్విషయముల యెడ సుప్తునివలెనుండి, వాటి అసత్తను గాంచుచున్నాను. ఆత్మవిషయమున ప్రబుద్ధునివలెనుండి, కరతలామలకముగ దాని సత్తను గాంచుచున్నాను; అందువలన నేన నామయ చిరజీవినైతిని.

జీర్ణం భిన్నం శ్లథం క్షీణం క్షుబ్ధం క్షుణ్ణం క్షయం గతమ్
పశ్యామి నవవత్సర్వం తేన జీవామ్యనామయః. 33

జీర్ణ, క్షీణ, శీర్ణ, క్షుబ్ధ, క్షయప్రాప్తమగు ఈ జగత్తును నేను సర్వదా నూతనమువలె ఆత్మదృష్టిలో గాంచుచున్నాను. అందువలన నేననామయుడనై జీవించుచున్నాడను.

సుఖితోఽస్మి సుఖాపన్నే దుఃఖితో దుఃఖితే జనే
సర్వస్య ప్రియమిత్రం చ తేన జీవామ్యనామయః. 34

పరుల కష్టసుఖముల అవి నాకబ్బినట్లు దుఃఖించుచు సుఖించుచున్నాను, నేనందరికిని ప్రియమిత్రుడను. అందువలన నేను అనామయ చిరజీవత్వమును బొందినాడను.

ఆపద్యచలధీరోఽస్మి జగన్మిత్రం చ సంపది
భావాభావేషు నైవాస్మి తేన జీవామ్యనామయః. 35

ఆపదల నేనచలమువలె ధీరుడనైయుందును; నేను జగన్మిత్రుడను, నేను సంపదల హెచ్చుతగ్గుల మమత్వమును బొందను. అందువలన నేననామయ చిరజీవత్వమును బొందితిని.

నాహమస్మి నచాన్యో మే నాహమన్యస్య కస్యచిత్
ఇతి మే భావితం చిత్తం తేన జీవామ్యనామయః. 36

'నేను నేను గాను, నాకు నాయను వారెవ్వరును లేరు' నే నితరులను జెందను' — అను చింతవలన నేననామయ చిరజీవత్వమును బొందితిని.

అహం జగదహం వ్యోమ దేశకాలక్రమావహమ్
అహం క్రియేతి మే బుద్ధిస్తేన జీవామ్యనామయః. 37

'నేను జగత్తును, నేనే దేశకాలముల విభజించు ఆకాశమును,' అను అహంకారము నాబుద్ధి యందుండుటవలన నే ననామయ చిరజీవత్వమును బొందితిని.

ఘటశ్చిచ్చిత్పటశ్చిత్త్యం చిద్వనం శకటం చ చిత్
చిత్సర్వమితి మే భావస్తేన జీవామ్యనామయః. 38

ఘటపటశకటాకాశారణ్యములు మున్నగాగలవన్నియు చిత్తని గ్రహించియుండుటవలన నే ననామయ చిరజీవత్వమును బొందితిని.

ఇత్యహం మునిశార్దూల త్రిలోకకమలాలికః
భుశుణ్డో నామ కాకోలః కథితశ్చిరజీవితః. 39

మునిశార్దూలా! నేనీ తీరుగ త్రిలోక - కమల - భ్రమరమును, చిరజీవియునగు భుశుండ వాయసముగ పేర్కొనబడుచున్నాను.

బ్రహ్మార్ణవే విలులితం త్రిజగత్తరఙ్గ
ముత్పాదనాద్యభిభవేన విభిన్నరూపం
ఆలీనమున్నమితమాకులదృశ్యదృశ్య
మాలోకయన్స్వకలయంశ్చ చిరం స్థితోఽస్మి. 40

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే భుశుణ్డోపాఖ్యానే చిరజీవితహేతుకథనం నామ షడ్వింశః సర్గః ॥ 26 ॥

నేను బ్రహ్మసాగరమునందలి తరంగమనదగు యీ త్రిలోకముల జన్మస్థిత్యాదులను గాంచుచున్నాడను; వాటి ఘాత ప్రతిఘాతములు విచిత్రభావమున, ఉత్పన్నములై విలీనములగుచున్నవి. యీ జగత్త్రయము సాక్షిదృశ్యమగు మనోబుద్ధుల దృశ్యరూపమున నుదయించుచున్నవి.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానమున చిరజీవితహేతుకథనమను
షడ్వింశ సర్గము ॥ 26 ॥

---

## సప్తవింశః సర్గః

---

[భుశుణ్డస్య ప్రశంసాత్ర యియాసోస్తేన పూజనమ్
వసిష్ఠస్య నభోగత్యా స్వలోకాప్తిశ్చ వర్ణ్యతే.

భుశుండుని ప్రశంస; పావనసెంచిన వసిష్ఠుని భుశుండుడు పూజించుట; ఆకాశమార్గము వసిష్ఠుని గమనము యిందు వర్ణింపబడినవి.]

భుశుణ్డ ఉవాచ :—

ఏతత్తేకథితం బ్రహ్మన్యథాస్మి యదిహాస్మి చ
త్వదాజ్ఞామాత్రసిద్ధ్యర్థం ధార్ష్ట్యేన జ్ఞానపారగ. 1

భుశుండుడు :— బ్రహ్మజ్ఞ ! నేనెట్లు ఎందువలన చిరజీవినైనది నీ ఆజ్ఞను నిర్వహింప, ఒకింత ఔద్ధత్యమును వహించి, జ్ఞాన పారగుడవగు నీకు జెప్పితిని.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అహో ను చిత్రం భగవన్భవతా భూషణం శ్రుతేః
ఆత్మోదన్తః ప్రకథితః పరం విస్మయకారణమ్. 2

వసిష్ఠుఁడు:— భగవంతుఁడా! శ్రుతిరంజకమును, అత్యంతవిచిత్రమును, ఆశ్చర్యకరమును నగు ఆత్మకథను జెప్పినాడవు.

ధన్యాస్తే యే మహాత్మానమత్యన్తచిరజీవనమ్
భవన్తం పరిపశ్యన్తి ద్వితీయమివ పద్మజమ్. 3

మహాత్ముడవును, అత్యంతచిరజీవియును, ద్వితీయబ్రహ్మవలె వెలుగువాడవునునగు నిన్ను దర్శించువారు ధన్యులు!

యావదద్యదృశో ధన్యాః స్వాత్మోదన్తమఖణ్డితమ్
యథావత్పావనం బుద్ధేః సర్వం కథితవానసి. 4

నిన్ను గాంచువారి కన్నులు ధన్యములు; మనస్సును పావనమొనర్చు ఆత్మకథనంతటిని సంపూర్ణముగ చెప్పితివి.

ప్రభ్రాన్తం దిక్షు సర్వాసు దృష్టా విబుధభూతయః
భవానివ జగత్యస్మిన్న మహానవలోకితః. 5

నేను యీ జగత్తునందంతటను పరిభ్రమించి జూచితిని; దేవతల ఐశ్వర్యమును, విద్వాంసుల జ్ఞానసంపదను గాంచితిని, కాని, మిమ్ముబోలు తత్వజ్ఞానసంపన్నుల నెచ్చటను గాంచియుండలేదు.

కథంచిత్ప్రాప్యతే కశ్చిద్భ్రాన్త్వేహ హి మహాజనః
న భవానివ భవ్యాత్మా సులభో జగతి క్వచిత్ 6

ఈ జగత్తునందంతటను పరిభ్రమించిన ఒకరిద్దఱు మహాత్ముల గాంచవచ్చును; కాని, మిమ్ముబోలు తత్త్వజ్ఞుల గాంచజాలము.

వంశఖణ్డే హి కస్మింశ్చిజ్జాయతే మౌక్తికం యథా
జగత్ఖణ్డే హి కస్మింశ్చిద్దృశ్యతే త్వాదృశస్తథా. 7

అన్ని వెదుళ్లలోగాక ఒకానొక వెదురునందే ముత్యములు లభించునట్లు, జగత్తునందు ఒకానొక ప్రదేశముననే మిమ్ముబోలు మహాత్ముల గాంచనగును,

మయా తు సుమహత్కార్యమద్య సంపాదితం శుభమ్
పుణ్యదేహా విముక్తాత్మా యద్భవానవలోకితః. 8

నేడు, నేనొక మహాత్కార్యమును సాధించితిని; పుణ్యాత్ముడవును, ముక్తపురుషుడవునునగు నిన్ను గాంచితిని.

తదస్తు తవ కల్యాణం ప్రవిశాత్మగుహాం శుభాత్
మధ్యాహ్నసమయో యస్మై వ్రజామి సురమన్దిరమ్. 9

నీకు శుభమగుగాక; శుభకరమగు నీ నీడమును బ్రవేశింపుము. మధ్యాహ్న - కృత్యముల నాచరింప స్వగృహమగు సప్తర్షిలోకమున కఱిగెదను.

ఇత్యాకర్ణ్య భుశుణ్డోఽసౌ జగ్రాహోత్థాయ పాదపాత్
సంకల్పితాభ్యాం హస్తాభ్యాముపాత్తం హేమపల్లవమ్. 10
కల్పవృక్షలతాపుష్పకేసరేణ హిమత్విషా
తత్పాత్రం మౌక్తికార్ఘ్యేణ పూరయామాస పూర్ణధీః. 11
తేనార్ఘ్యపాద్యపుష్పేణ త్రినేత్రమివ మామసౌ
ఆపాదమస్తకం భక్త్యా పూజయామాస పూర్వజః. 12
అనువ్రజ్యైకదర్ధేన ఖగేన్ద్రాలమితి బ్రువన్
విష్టరాదహముత్థాయ తతః ఖగవదాప్లుతః. 13
వ్యోమ్ని యోజనమాత్రం తు తదనువ్రజ్యయా గతః
కరం కరేణావష్టభ్య బలాత్సంరోధితః ఖగః. 14
మయి యాతే క్షణేనైవ గగనాధ్వన్యదృశ్యతామ్
నివృత్తోఽసౌ విహంగేన్ద్రో దుస్త్యజా సంగతిః సతామ్. 15
అన్యోన్యమపి కస్మింశ్చిత్తరఙ్గక ఇవామ్బుధౌ
వ్యోమన్యదృశ్యతాం యాతో ఖగస్స్మృత్వా మునీనహమ్. 16
సప్తర్షిమణ్డలం ప్రాప్య జాయయా పరిపూజితః
యాతే కృతయుగస్యాదౌ పురా వర్షశతద్వయే. 17
సంగతోఽహం భుశుణ్డేన మేరోః శృఙ్గద్రుమేఽభవమ్
అద్య రామ కృతే క్షీణే త్రేతా సంప్రతివర్తతే. 18
మధ్యే త్రేతాయుగస్యాస్య జాతస్త్వం రిపుమర్దన
పునరద్యాష్టమే వర్షే తత్రైవోపరి భూభృతః
మిలితోఽభూద్భుశుణ్డో మే తథైవాజరరూపవాన్. 19
ఇతి సంకథితం చిత్రం భుశుణ్డోదన్తముత్తమమ్
శ్రుత్వా విచార్య చైవాన్తర్యదుక్తం తత్సమాచర. 20

భుశుండు డీపలుక్కలవిని. వృక్షమునుండిలేచి, సంకల్పకల్పితమగు హస్తద్వయమున వృక్షమునందలి స్వర్ణ - పల్లవమును ద్రుంచెను; పిదప, పూర్ణబుద్ధియగు ఆ భుశుండుడు దాన పాత్ర నొకదాని నొనర్చి, దానిని తుషారధవళములగు కల్పతరుకుసుమ - కేసరములతోడను, ముత్యములతోడను నింపి అర్ఘ్యమును గల్పించెను. చిరజీవియగు భుశుండుడు భక్తిభావమున, ఆ యర్ఘ్య పాద్యపుష్పములతో, శివుని అర్చించునట్లు నన్నర్చించెను. పిదప నేను భుశుండునితో నన్ననుసరింప నవసరములేదని జెప్పి, పక్షివలె ఆకాశమున నెగిరితిని; అయినను, ఆ వాయసము యోజన పర్యంతము నన్ననుగమించెను; నేను భుశుండుని చేయిపట్టుకొని రావలదని అనునయించితిని. నేను క్షణములో ఆకాశపథమున అదృశ్యుడ నవ, భుశుండుడు చేయునదిలేక, తిరుగువచ్చెను; సాధుసంగము పరిత్యజింప కడుంగడు కష్టకరము. ఇట్లు మేమిరువురము ఆకాశపథమున సాగరతరంగములవలె నదృశ్యతను బొందితిమి. నేను భుశుండుని గురించి చింతించుచు, సప్తర్షిమండలమును జేరకొంటిని. చేరినంతనే పత్నియగు అరుంధతి నన్ను సాదరమున నర్చించెను. నేను భుశుండుని గాంచినది కృత యుగమున రెండువందల ఏండ్లు గడచిన పిమ్మట; రామా! ఇప్పుడు త్రేతాయుగము జరుగుచున్నది. రిపుసూదనా! నీవు జన్మించిన యీ యుగమధ్యభాగమున ఎనిమిది ఏండ్ల క్రిందట మరల ఆ కొండ మీదనే, భుశుండుని అజరరూపమున వెలయువానిని గాంచితిని. నీకు యీ విచిత్రమగు భుశుండోపాఖ్యానమును జెప్పితిని, నీవు వింటివి. ఇక, దీనిని చక్కగ విచారించి, ఏతదనుసారము ఆచరింపుము.

శ్రీ వాల్మీకి రువాచ :—

ఇతి సుమతిభుశుణ్డసత్కథాం యో
విమలమతిః ప్రవిచారయిష్యతీహ
భవభయబహులాకులాసితాం స
ప్రసభమసత్సరితం తరిష్యతీతి. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భుశుణ్డో
పాఖ్యానసమాప్తిర్నామ సప్తవింశః సర్గః ॥ 27 ॥

శ్రీ వాల్మీకి :—ఏ విపులమతి, సుమతియగు భుశుండుని కథను పర్యాలోచించునో అతడు జననమరణాది భయములతో సంకులమగు అసత్య - మాయానదిని సత్వరము దాటును.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భుశుండోపాఖ్యానసమాప్తియను సప్తవింశతితమ
సర్గము ॥ 27 ॥

---

## అష్టావింశః సర్గః.

---

[ఆఖ్యాయికాభిసంబన్ధో దేహానియతివర్ణనమ్
ఆపాతభ్రాన్తిమాత్రత్వం దేహాదేశ్చాత్ర వర్ణ్యతే.

ఆఖ్యాయికాసంబంధము, దేహముయొక్క అనియతి, దేహాదుల ఆపాతభ్రాంతిమాత్రత్వము యిందు వర్ణింపబడినవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏవం భుశుణ్డవృత్తాన్తః కథితస్తే మయానఘ
అనయా ప్రజ్ఞయా తీర్ణో భుశుణ్డో మోహసంకటాత్. 1

వసిష్ఠుఁడు:— అనఘా! నీకు భుశుండుని వృత్తాంతమును జెప్పితిని; భుశుండు డీతీరుగ మోహసంకటమునుండి వెలువడినాడు.

ఏతాం దృష్టిమవష్టభ్య స్వప్రాణాభ్యాసపూర్వికామ్
భుశుణ్డవన్మహాబాహో భవ తీర్ణమహార్ణవః. 2

మహాబాహో! నీవుకూడ, ప్రాణాభ్యాసపూర్వకమగు ఈ దృష్టిని అవలంబించి భుశుండుని వలె భవసముద్రమునుదాటుము.

యథా జ్ఞానేన యోగేన సంతతాభ్యాసజన్మనా
భుశుణ్డః ప్రాప్తవాన్ప్రాప్యం తథాసాదయ తత్పదమ్. 3

భుశుండు డేతీరున జ్ఞాన, యోగములచే నిరంతరాభ్యాసములవలన బ్రహ్మపదమును బొందినాడో, అదేతీరున నీవుగూడ, ఆ పరమపదమును బొందుము.

అస్తకబుద్ధయః సర్వే భుశుణ్డవదవస్థితమ్
ప్రాప్నువన్తి పరే తత్త్వే ప్రాణాపానావలోకినః. 4

నిర్లిప్తబుద్ధితో ప్రాణాపాననిరోధము నభ్యసించువారు, భుశుండుడు బడసిన స్థితిని బొందగలరు.

ఏతా విచిత్రా భవతా శ్రుతా విజ్ఞానదృష్టయః
ఇదానీం ధియమాలమ్బ్య యథేచ్ఛసి తథా కురు. 5

నీవు, జ్ఞానవిచారము, ప్రాణనిరోధములను విజ్ఞానదృష్టులను రెంటిని వింటివి; ఇప్పుడు, ఈరెండింటిలో నీకేదినచ్చిన దానినవలంబింపుము.

శ్రీరామ ఉవాచ :—

భగవన్భవతా భూమిభాస్వతా జ్ఞానరశ్మిభిః
హార్దముద్దామదౌరాత్మ్యం ప్రమృష్టమఖిలం తమః. 6

శ్రీరాముడు:— భగవంతుడా! భూలోకసూర్యుడవనదగు నీ జ్ఞాన - కిరణముల, ఆత్మస్వరూపమును గప్పిపుచ్చు నాహృదయాంధకారము తుడుచుకొనిపోయినది.

ప్రబుద్ధాః స్మః ప్రహృష్టాః స్మః ప్రవిష్టాః స్మః స్వమాస్పదమ్
స్థితాః స్మో జ్ఞాతవిజ్ఞేయా భవన్తో హ్యపరా ఇవ. 7

మేము ప్రబుద్ధులము, ప్రహృష్టులమునై, స్వస్వరూపమున బ్రవేశించి పరమార్థవస్తువును గ్రహించి, అపర - వసిష్ఠులవలె వెలయుచున్నారము.

అహో భుశుణ్డచరితం పరం విస్మయకారకమ్
భగవన్భవతా ప్రోక్తముత్తమార్థావబోధనమ్. 8

భగవంతుడా! బ్రహ్మజ్ఞుడవగు నీవు ఆత్మజ్ఞానమునుబోధించు భుశుండుని చరిత్రమును జెప్పినాడవు.

భుశుణ్డచరితే బ్రహ్మన్నేతస్మిన్కథితే త్వయా
యచ్ఛరీరగృహం ప్రోక్తం మాంసచర్మాస్థినిర్మితమ్. 9

భుశుండుని చరిత్రమును జెప్పునప్పుడు నీవు, మాంసాస్థిచర్మనిర్మితమగు శరీరగృహమును చేర్కొంటివి.

తత్కేన నామ రచితం కుతో వా తత్సముత్థితమ్
కథం వా స్థితిమాయాతం కో వా తత్రావతిష్ఠతే. 10

అది ఎవ్వనివలన నిర్మింపబడినది? లేక, ఎటనుండివచ్చినది? అది ఎట్లు స్థితినిగనుచున్నది? అందెవ్వరు నివసించుచున్నారు?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

పరమార్థావబోధాయ దోషాపాకరణాయచ
శృణు రాఘవ తత్త్వేన వక్ష్యమాణమిదం మయా. 11

వసిష్ఠుడు:— రాఘవా! పరమార్థతత్త్వమును జక్కగ గ్రహించుటకును, దోషముల దూరమొనర్చుటకును ఈ విషయముపయోగపడును; నేను జెప్పుదానిని వినుము.

అస్థిస్థూణం నవద్వారం రక్తమాంసావలేపనమ్
శరీరసదనం రామ న కేనచిదిదం కృతమ్. 12

రామా! అస్థి - స్తంభయుతమును, రక్తమాంసవిలేపితమును నగు ఈ శరీర - గృహమును ఎవ్వరును నిర్మించియుండలేదు

ఆభాసమాత్రమేవేదమిత్థమేవావభాసతే
ద్విచన్ద్రవిభ్రమాకారం సదసచ్చ వ్యవస్థితమ్. 13

(శ్రుతి, పురాణ కథలయందు ఈశ్వరుడు శరీరనిర్మాత; జీవుడు కర్మభోగార్థము నిర్మాపకతను బొందుచున్నాడను విషయము ముఖ్యముకాదు. పురుషుని శ్వాసమువలె ఈశ్వరసృష్టి జరుగుచున్నదను ఈ ఉపమానమువలన గౌణముగ గ్రహింపవలెను. అందువలన,) ఈ శరీరము జలమునందు ప్రతిబింబించు చంద్రునివలె ఆభాసమాత్రమే; జలముల చంద్రబింబము పడుటకు నిర్మాత అవసరములేదు. మిథ్యామయమగు ఈ శరీరము ప్రతిబింబిత చంద్రునివలె, సదసద్రూపమున వెలయుచున్నది.

ద్విచన్ద్రదర్శనవిధా చన్ద్రద్విత్వం సదైవ హి
వస్తుతశ్చైక ఏవేన్దుః స్థితో దేహస్తథైవ హి. 14

వస్తుతః ఒకే చంద్రుడున్నను, ద్విచంద్రదర్శనసమయమున మఱొక చంద్రుడున్నట్లు, భ్రాంతిసమయమున ఈశరీరమున్నట్లగపడుచున్నది.

దేహప్రత్యయకాలే హి దేహోఽయం సమవస్థితః
అసన్నేవ చ సత్తస్మాత్ప్రోక్తః సదసదాత్మకః. 15

ఇయ్యది లేకున్నను, దేహభ్రాంతి యున్నప్పుడు దగపడుచున్నందువలన, సదసదాత్మకమని చెప్పబడుచున్నది.

స్వప్నే స్వప్నావబోధః సంస్త్వన్యదాస ముధైవ హి
బుద్బుదో బుద్బుదవిధా సత్యో మిథ్యైవ చాన్యదా. 16

వాస్తవమునకు స్వప్నము మిథ్యయేయైనను, స్వప్నదర్శనకాలమున నయ్యది సత్యముగ తోచుచున్నది; బుద్బుదము నీటికంటె వేఱుగాదు. అది బుద్బుదరూపమున సత్యమేయైనను జలరూపమున మిథ్యయనంబడుచున్నది.

దేహో దేహవిధా సత్యో హ్యసత్య ఇతరద్విధా
ప్రతిభాసవిధా తావజ్జలం సదసదన్యదా. 17

దేహదృష్ట్యా దేహము సత్యమేయైనను ఆత్మదృష్ట్యా మిథ్యయని గ్రహింపవలెను. ప్రతిభాససమయమున మరుభూమియందు జలము తోచినను, వాస్తవమునకట నీరులేదు. అందువలన ఆనీరు సదసదాత్మకమనంబడుచున్నది.

ప్రతిభాసవిధా దేహః సన్నసంశ్చాన్యదా స్మృతః
ఆభాసమాత్రమేవేదమిత్థం సంప్రతి భాసతే. 18

ప్రతిభాససమయమున ఈ శరీరమున్నను, ఆత్మబోధ యున్నప్పుడియ్యది అసత్తగుచున్నది; ఆభాసమాత్రమగు ఈ శరీరమిట్లు తోచుచున్నది.

అయం నామాహమిత్యన్తర్గృహీతమననం స్థితమ్
మాంసాస్థిమయనిర్మాణదేహోఽహమితి విభ్రమమ్

'నేనే ఈ శరీరము' – అని భావించుటవలననే ఈ శరీరము కలిగినది; అందువలన, మాంసాస్థిమయనిర్మాణమని దోచు శరీరము కేవలము భ్రాంతి మాత్రమే.

త్యజ సంకల్పనిర్మాణదేహాః సన్తి సహస్రశః. 19
సుఖతల్పగతో యేన స్వప్నదేహేన దిక్తటాన్
పరిభ్రమసి హే రామ స దేహస్తే క్వ సంస్థితః. 20
జాగరాయాం మనోరాజ్యే యేన స్వర్గపురాన్తరమ్
పరిభ్రమసి మేరుం వా స దేహస్తే క్వ సంస్థితః. 21
స్వప్నేష్వపి చ యః స్వప్నస్తత్ర యేన మహీతటాన్
పరిభ్రమసి హే రామ సదేహస్తే క్వ సంస్థితః. 22
మనోరాజ్యం మనోరాజ్యే మహద్విభవభూమిషు
పరిభ్రమసి యేనేహ స దేహస్తే క్వ సంస్థితః. 23
గత్రైర్దేహైర్మనోరాజ్యే యా విచిత్రా జగత్క్రియాః
ప్రకరోషి మహాబాహో తే దేహాస్తే క్వ సంస్థితాః. 24

విలాసిన్యానురాగిణ్యా యేన సంకల్పకాన్తయా
నిర్వృతిం యాసి దేహేన స దేహస్తే క్వ సంస్థితః. 25
ఏతే రామ యథా దేహా మనసః సదసన్మయాః
తథైవ తాదృశాచారో దేహోఽయం మనసః స్మృతః. 26
ఇయం ధనమయం దేహో దేశోఽయమితి విభ్రమః
తత్సర్వం చిత్తవీర్యస్య సంకల్పస్య విజృమ్భితమ్. 27
దీర్ఘస్వప్నమిమం విద్ధి దీర్ఘం వా చిత్తవిభ్రమమ్
దీర్ఘం వాపి మనోరాజ్యం సంసారం రఘునన్దన. 28
ప్రబోధమేష్యసి యదా పరమాత్మేచ్ఛయా స్వయా
ద్రక్ష్యసి త్వం తదా సమ్యగిదమర్కోదయే యథా. 29
స్వప్నసంకల్పజాలేన యథాసైవ జగత్స్థితిః
తథైవేయం హి సంకల్పకలనా కాచిదేవ హి. 30
యథా పూర్వం మయోత్పత్తిః ప్రోక్తా కమలజన్మనః

నీవీ శరీరభ్రాంతిని విడువుము; కేవల మిట్టిసంకల్పమువలననే సహస్రములగు శరీరములు గలుగుచున్నవి. వీటిలో నీ పెద్దానిని గ్రహింతువు ? రామా! నీవు మృదుతల్పమున బరుండి, దిక్తటముల పరిభ్రమించు స్వప్నదేహము ఎచ్చట నున్నది? లేక జాగ్రద్దశయందే మనోరాజ్యమున, స్వర్గపురియందుగాని, మేరుపర్వతమునగాని విహరించు శరీరమెటనున్నది? కలలోగాంచు కలయందు ఏ శరీరమును గ్రహించి నీవు మహీమండలమున పరిభ్రమించితివో, ఆ శరీర మెచ్చట? మనోరాజ్యాంతర్గత మనోరాజ్యమున విభవముల భోగించిన శరీరమెచ్చట? నీవు మనోరాజ్యమున నుండియే విచిత్రకార్యముల నాచరింపజేసిన శరీరమెక్కడ? మనోరాజ్యమున, కల్పిత-ప్రియాంగనలతో భోగించి ఆనందించిన శరీర మెక్కడ? ఈ శరీరములన్నియును మనోకల్పితములు: అందువలన అసత్యములు; అట్లే ఈ మాంసాస్థిమయశరీరముగూడ మనోకల్పితమేయని గ్రహింపుము. సంపదలు, శరీరము, దేశము మున్నగునవన్నియు చిత్తవీర్యము అనగా శక్తియగు సంకల్పముయొక్క విలాసములే. రఘునందనా! నీవీ సంసారమును దీర్ఘస్వప్నముగనో,/దీర్ఘచిత్తభ్రాంతిగనో లేక దీర్ఘమగు మనోరాజ్యముగనో గ్రహింపుము. నా వాక్యముల వాస్తవత్వమును, నీవు జ్ఞానమును బొందినప్పుడు, సూర్యోదయమైన అంతయు చక్కగ కనంబడునట్లు, గ్రహింపగలవు. స్వప్నసమయమున ఈ జగత్తు మిథ్యయగునట్లు, బ్రహ్మలాభసమయమున నీకీ జగత్తు మిథ్యయై కనంబడును. పూర్వము నీకు కమల-జన్ముడగు బ్రహ్మయొక్క ఉత్పత్తిని చెప్పియుంటిని.

మనసః స్వయమేవాన్తఃసంకల్పకలనోద్భవా. 31
విచిత్రరచనోపేతం మనస్తత్రాత్తవిభ్రమమ్
సంకల్పకలనామాత్రం తథేదమవభాసనమ్. 32
యథా కల్పిత ఆభాసో మనసోఽబ్జజతాం గతః
దేహాద్విచిన్తితో దేహః స్థితోఽన్యస్తద్వదేవ హి. 33

ప్రాక్ప్రవాహచిరాభ్యస్తో వాసనాతిశయేన యః
తథైవ దృశ్యతే దేహస్తథాఽఽకృత్యుదయేన సః. 34
పౌరుషేణ ప్రయత్నేన సంకల్పో హ్యాయమేవ చిత్
అన్యథా భావ్యతే రామ భూయతే తదిహాన్యథా. 35
అయం సోఽయం మమాయం చ సంసార ఇతి భావితే
సత్యో యో భావ్యతే రామ భావనాదార్ఢ్యసంభవః. 36
భావితం తీవ్రవేగేన యదేవాశు తదేవ హి
సర్వత్ర దృశ్యతే రామ కాన్తేవాత్యన్తవల్లభా. 37
అహార్వ్యావృత్తిరభ్యస్తా యథా స్వప్నేషు దృశ్యతే
తథాయం భావనాభ్యస్తః సంసారోఽప్యవలోక్యతే. 38
యథా స్వప్నావనా క్షిప్రమహార్యదవభాసతే
తథేదమల్పకాలస్థమపి సంలక్ష్యతే స్థిరమ్. 39
వ్యోమన్యేవ యథా తాపతప్తే సందృశ్యతే సరిత్
ధరాప్యవిద్యమానాపి సంకల్పాద్దృశ్యతే తథా. 40

అప్పుడు. సంకల్పకల్పనామయమగు మనస్సే, ఆడంబరముతో ఈ విచిత్ర జగద్రచన నుపక్రమించినదని జెప్పియుంటిని: అట్లే, ఈశరీరముగూడ మనస్సుయొక్క ప్రతిభాసమాత్రమేయని గ్రహింపుము. మనస్సుయొక్క కల్పిత-ఆభాసమే బ్రహ్మమైనట్లును, పూర్వదేహానంతరము, మఱియొక దేహము కల్పింపబడునట్లును, తదితర దేహములుగూడ కల్పితములే, వాసనాధిక్యము ననుసరించి, ఈ శరీరము సంఘటితమైనది. భవిష్యత్తునగూడ ఇట్లే సంఘటితమగును. శరీరము, లేక జగద్రూపకమగు ఈ మహత్సంకల్పము, పురుషకారము వినియోగించి మనస్సును అంతర్ముఖమొనర్చి ఆత్మదర్శన మొనర్ప బూనుకొనిన, కేవల చిన్మాత్రముగ దోచగలదు. రామా! దీని నన్యథా భావించిన అన్యమేయగును. 'ఇది, ఆ నేను, నాది, సంసారము' – మున్నగు భావనల భావించిన, భావనాదార్ఢ్యమువలన అవి సత్యముగనే తోచును. ఏభావనను దృఢమొనర్చిన అయ్యదియే సత్యమైనట్లుగ తోచును. రామా! తీవ్రవేగమున నెద్దానిని భావించిన, కాముకునకు సర్వత్ర ప్రియపత్నియే యగుపడునట్లు, అదియే అగుపడును. రాత్రియందు గాంచబడు స్వప్నమున దినవ్యాపారములు అగుపడి, తద్భావనవలన నయ్యవి సత్యములగునట్లు, భావనాబలమున, సంసారముగూడ సత్యమగుచున్నది. స్వప్నమున శీఘ్రముగ దాటిపోవు నిముషము ఒకరోజువలె తోచునట్లు, సంకల్పితమును, క్షణికమునగు ఈ సంసారము దీర్ఘమైనట్లును, నిత్యముగను గూడ తోచుచున్నది, తాపతప్తమగు మరుభూమియందు నదియగుపడుటలేదా! అట్లే, అసత్యమగు ఈ భూమికూడ సంకల్పబలమున నగుపడుచున్నది.

దృశ్యతే దృష్టివైరూప్యాద్యథా వ్యోమని పిచ్ఛికా
తథైవేయం జగల్లక్ష్మీర్దుర్జ్ఞానాదవభాసతే. 41
దృశ్యతే సమయా దృష్ట్యా న యథా వ్యోమ్ని పిచ్ఛికా
సమ్యగ్దృష్ట్యా జగల్లక్ష్మీస్తథేయం నావభాసతే. 42

భీరురక్ష్యేతి న యథా స్వసంకల్పేషు సంభ్రమమ్
స్వసంకల్పే హి సంసారే న తథైతి భయం సుధీః. 43

స్వ ఏవ హి స్వభావోఽయమిత్థం సంప్రతి భాసతే
సంసారసరణిస్థిత్యాం కస్మాత్కోఽత్ర బిభేతి కిమ్. 44

స ఏవ కించిత్సంశోధ్యః శుద్ధ్యా విమలతాం గతే
తస్మిన్న దృశ్యతే రామ మోహోఽయం జగతః స్థితః. 45

సమ్యగాలోకమాత్రేణ స్వభావః శుద్ధిమృచ్ఛతి
న గృహ్ణాతి మలం భూయస్తామ్రతామివ కాఞ్చనమ్. 46

ఆభాసమాత్రమేవేదం న సన్నాసజ్జగత్త్రయమ్
ఇత్యన్తకలనాత్యాగః సమ్యగాలోకనం విదుః. 47

మరణం జీవితం స్వర్గో జ్ఞానమజ్ఞానమేవ చ
చిదాభాసాదృతే నాస్తీత్యేకతా సమ్యగీక్షణమ్. 48

త్వమహ్యన్యాదిసంసార ఇతి మే న దిశో దశ
సర్వం స్వాభాసమేవేతి సమ్యగాలోకనం విదుః. 49

సదసన్మయసంసారే యథా భూతార్థదర్శనాత్

దృష్టిదోషమున ఆకాశమున మయూరపింఛమువలె విచిత్రవర్ణము లగపడునట్లు, ఈ జగల్లక్ష్మి గూడ అజ్ఞానమువలనతోచుచున్నది. దృష్టిదోషరహితునకు ఆకాశమున మయూరపిచ్ఛ మగుపడనట్లు సమదృష్టికి ఈ జగత్తు తోచదు. భీరుపురుషుడు, స్వసంకల్పితమనోరాజ్యదర్శితములగు వాస్తివ్యాఘ్రాదులను గాంచి భయపడునట్లు, జ్ఞానియగువాడు సంకల్పమగు ఈ సంసారమునుగాంచి భయపడడు. ఆత్మ యొక్కటే ఇట్లు ప్రతిభాసించుచుండ, ఈ సంసారమున ఎవరెవ్వరి వలన భయము సందెదరు ? భయమునందు మూఢుని అజ్ఞానమును దూరమొనర్పవలెను; ఆ అజ్ఞవ్యక్తి నిర్మోహమునంది శుద్ధుడును, నిర్మలుడును నైన, ఈ జగన్మోహ మింక అగుపించదు. ఆత్మశోధనోపాయము సమ్యగ్దర్శనము. ఒక్కసారి ఈ జ్ఞానము లభించిన మరల, సువర్ణము తామ్రమువనట్లు, మలమంటదు. ఈ జగత్తంతయు ఆభాసమాత్రమే, ఇది సత్తును గాదు, అసత్తునుగాదు అనియెంచి, ఇతర కల్పనల త్యజించుటయే సమ్యగ్దర్శన మనంబడుచున్నది, జీవితము, మరణము, స్వర్గము, జ్ఞానము, అజ్ఞానములు చిదాభాస గాక వేరొండు కాదు అనునదియే సమ్యగ్దృష్టి. నీవు, నేను, సమస్త సంసారము, దిక్కులు ఇవన్నియును స్వాత్మాభాస గాక అన్యము కాదు, అనునదియే సమ్యగ్దృష్టి. ఈ సదసన్మయ సంసారమున మనస్సు యదార్థదర్శనమును బొందగలదు.

నాస్తమేతి న చోదేతి సమ్యగాలోకనాత్మనః. 50

నిర్ణీయ సర్వభావానామసత్త్వం సత్త్వమేవ చ
నిష్కామం శాన్తిమభ్యేతి సమ్యగాలోకనాత్మనః. 51

న నిన్దతి నచ స్తౌతి న హృష్యతి న శోచతి
శీతలాం సత్యతామేతి సమ్యగాలోకనాత్మనః. 52
అవశ్యమేవ మర్తవ్యం సర్వైరేవ హి బన్ధుభిః
ఇతి బన్ధువియోగేషు కిం వృథా పరితప్యసే. 53
అవశ్యమేవ చ మయా మర్తవ్యమితి నిశ్చయః
ఇత్యాత్మమరణప్రాప్తౌ కిం ముధా పరితప్యసే. 54
అవశ్యమేవ జాతేన కించిత్సుఖవిభవాదికమ్
ప్రాప్తవ్యం పురుషేణేతి హర్షస్యావసరో హి కః. 55
సర్వస్యైవ హి సంసారే నరస్య వ్యవహారిణః
అర్థాయాతా భవత్యాపచ్ఛోకస్యావసరో హి కః. 56
బృంహత్యుదేతి స్ఫురతి బుద్బుదౌఘ ఇవార్ణవే
ఇదం హి జగతాం జాలం కిమత్ర పరిదేవనా. 57
సత్సదేవ సదైవైతదసదేవాసదేవ హి
క్రియావైచిత్ర్యమాత్రే తు కిమన్యత్పరిదేవ్యతే. 58
నాహమస్మి న చాభూవం భవిష్యామి న సోఽధునా
దేహోఽయం చిత్రదోషోత్థః కిమన్యత్పరిదేవ్యతే. 59
దేహాచ్చేదన్య ఏవాహం చిదాభాసస్తదజ్ఞ హే

ఆ యథార్థదర్శనము లభించిన, ఇకమనస్సు ఆ సత్యవస్తువునుండి ప్రచ్యుతముకాదు. ఈ సమ్యగ్దర్శనమున మనస్సు, సమస్తవస్తువుల సదసద్విలక్షణత్వమును గ్రహించి, నిష్కామమై, శాంతిని బొందును. అప్పుడది ఎవ్వరిని నిందింపదు, స్తుతింపదు, సంతోషింపదు, దుఃఖింపదు; ఈ సమ్యగ్దర్శనమున తాపత్రయనివారణకరమగు శీతలసత్యవస్తువులభింపగలదు. సకలబంధువులకు మృత్యువనివార్యమైన, బంధువిచ్ఛేదమున నిక శోకింపనవసరమేమి ? 'నేను మరణింతును' ను విషయము సునిశ్చితమగుచో, మరణకాలమరుదెంచిననిక దుఃఖింపనేల? జన్మించిన ప్రతివాడును అంతగనో ఇంతగనో సుఖమనుభవించును; అగుచో దాన ఆనందింపవలసినదేమున్నది ? ఈ జగత్తున అందఱికిని ఆపదలరుదెంచుచున్నవి, పోవుచున్నవి — దీన శోకింపనేల ? ఈ జగత్తులు సముద్రతరంగములవలె లేచి, పెఱిగి, విప్పారి, విరిగి పోవుచున్నవి; దీన శోకింపవలసిన దేమియునులేదే ! సద్వస్తువెల్లప్పుడును సద్వస్తువే, అసత్తు అసత్తే, అది ఎన్నడును సత్తుకాజాలదు. ఈజగత్తు అసన్మయమగు మాయయొక్క వైచిత్ర్యము. ఇందు దుఃఖింపవలసినదేమియును లేదు. భూతభవిష్యద్వర్తమానముల 'నేను' అనునదిలేదు. ఈ శరీరము అవిద్యాకాయకర్మయను విచిత్రదోషమున నుదయించినది. దీన దుఃఖింపవలసినదేమున్నది ? వత్సా ! 'శరీరముకంటె నేను విభిన్నుడనగుచో, నేనెవ్వడను ? — నేనా చిదాత్మయేయైయున్నాడను.'

కౌ తౌ మే సదసద్భావౌ యన్నిష్టం పరితప్యతే. 60
ఇతి నిశ్చయవాన్సన్తం సమ్యగ్జ్ఞానాత్మనో మునేః
నాస్తమేతి న చోదేతి న చాన్తం పరితప్యతే. 61

పరతామేవ నాశాన్తామనుత్తమపదే స్థితః
ఆదత్తే తిత్తిరీ మృద్వీం తృణకోటిమివామలామ్. 62
ఏతదర్థమసత్యేఽస్మిన్నాస్థా కార్యా మనాగపి
సురజ్జ్వేవ బలీవర్దో బధ్యతే జన్తురాస్థయా. 63
అతస్త్వయా దృఢమిదమితి నిర్ణీయ బుద్ధితః
ఆస్థారహితయా బుద్ధ్యా విహర్తవ్యమివానఘ. 64
కర్తవ్యమేవ కర్తవ్యమకర్తవ్యముపేక్ష్యతే
ఆస్థానాస్థే పరిత్యజ్య లీలయైవ మహాధియా. 65
ఆభాసమాత్రమేవేదం యస్య చ ప్రతిభాసతే
సోఽన్తః శీతలతామేతి దినాన్తే భువనం యథా. 66
ప్రతిభాసం పరిత్యజ్య పదార్థపటలవ్రజే
ఆభాసమాత్రసామాన్యమిదమాలోకయానఘ. 67
ఆభాసమాత్రకం రామ చిత్తామ్బర్యకలఙ్కితమ్
తతస్తదపి సంత్యజ్య నిరాభాసో భవోత్తమ. 68
చిదాకాశమయో నిత్యం సర్వగః సర్వవర్జితః
ఆభాసస్య పరిత్యాగే భవస్యేకాన్త నిర్మలః. 69
నాహమస్మి న మే భోగాః సత్యా ఇత్యభిభావితే
నేదమాడమ్బరం వ్యర్థమనర్థాయావభాసతే. 70
అహమేవ హి వా సర్వం చిదిత్యేవం విభావితే
నేదమాడమ్బరం వ్యర్థమనర్థాయావభాసతే. 71
దర్శనద్వయమప్యేతత్సత్యమత్యన్తసిద్ధిదమ్

'నాకు మరల సదసద్భావమేమి? సత్త ఏమి? దేనికొఱకు నేను దుఃఖింతును?' తత్త్వదర్శియగు మునియొక్క మనస్సునుండి ఇట్టినిశ్చయము తొలఁగదు. ఈ సంసారమింక అతనిమనస్సున మరల నుదయింపదు. అది దుఃఖతాపమునందదు; కేవలముశాంతభావముననే వెలయును. సర్వోత్తమమగు బ్రహ్మభావము నధిరోహించిన ముని, బాహ్యవస్తువులయందలి భానము తొలఁగిపోఁగా, పరిశేషించిన కేవలబ్రహ్మభావమునే గైకొనును. తిత్తిరిపక్షిగూటిని నిర్మించుకొన కోమలములగు తృణకణములనే గ్రహించునట్లు, బ్రహ్మవేత్త, బాహ్యవస్తువుల సారమగు బ్రహ్మతత్త్వమును గ్రహింపఁగోఱియే సంసారమునందలి అసారతను త్యజించి, అందొకించుకయు నమ్మకమునులేక ఆసక్తిని వహించఁడు. ఏలయన, ఈ ఆసక్తియే వినాశకారణము; మంచిత్రాటివలన ఎద్దు కట్టఁబడునట్లు, యీ ఆసక్తివలననే మనుష్యుఁడు బంధింపఁబడుచున్నాఁడు. అందువలన నో రాఘవా! నీవు బుద్ధిబలమున యీ విషయమును గ్రహించి, ఆసక్తిరహితుఁడవై, చరింపుము. శుద్ధమగు బుద్ధిబలమున, ఆసక్తి అనాసక్తులను రెంటినిఁబరిత్యజించి, కర్తవ్యము నాచరింపుము; అకర్తవ్యమును త్యజింపుము, దాని నెన్నఁడును ఆచరింపవలదు. ఈ జగ

త్తును ఆభాసమాత్రమని గ్రహించినవానికిది సాంధ్యజగత్తువలె, శీతలమగును. అనఘా! యీ పదార్థములమీద భ్రాంతిని త్యజించి, వీనిని బ్రహ్మచైతన్యముయొక్క ఆభాసయని గ్రహింపుము. రామా! పిదప, చిత్తకల్పనాకళంకితమగు యీ అభాసనుగూడ త్యజించి, అభాసవిహీనుడవై వెలయుము. ఉత్తముడా! నీవు, ఆభాసపరిత్యాగమైన పిదప సర్వగామియును, సర్వవర్జితుడునునగు నిత్య చిదాకాశమయుడవై వెలుగొందుము. 'నేను అహముననుగాను, నా యీ భోగజాలములు సత్యములుగావు' — అని భావించిన వ్యర్థ - ఆడంబరమగు యీ జగత్తు, వ్యర్థమగు మోహ - అనర్థకమును కలిగింపజాలదు. 'నేను సర్వమయుడగు చిత్స్వరూపు'డనిని భావించినను భావింపవచ్చును. ఈ ద్వివిధ దృష్టులు సత్పురుషులకు సిద్ధికరములగుచున్నవి.

యదేకమేతయోర్వేత్సి రమ్యం తద్రామ సంశ్రయ. 72
ద్వాభ్యామేవాథ వై తాభ్యాం దర్శనాభ్యామిహానఘ
విహరన్కురు కల్యాణ రాగద్వేషపరిక్షయమ్. 73
యత్కించిదుదితం లోకే యన్నభస్యథ వా దివి
తత్సర్వం ప్రాప్యతే రామ రాగద్వేషపరిక్షయాత్. 74
రాగాదిహతయా బుద్ధ్యా యాద్యగ్రామ విచేష్టితమ్
తత్తదేవ ప్రయాత్యాశు మూఢానాం విపరీతతామ్. 75
ద్వేషదోషోర్మిరుద్ధాసు న గుణాశ్చిత్తవృత్తిషు
పదం కుర్వన్తి దగ్ధాసు స్థలీషు హరిణా ఇవ. 76
రాగో ద్వేషశ్చ సర్పో ద్వౌ న విలీనౌ మనోబిలే
యస్య కల్పతరోస్తస్మాత్కిం. నామాజ్ఞ న లభ్యతే. 77
యే హి ప్రాజ్ఞాః స్వనియతా విదగ్ధాః శాస్త్రశాలినః
రాగద్వేషమయాస్తే వై జమ్బుకాస్తే ధిగస్తు తాన్. 78
మద్ధనం భుక్తమన్యేన ధనం త్యక్తం మయాఽన్యతః
ఇతి సంవ్యవహారేహాః కే రాగద్వేషయోః క్రమాః. 79
ధనాని బన్ధవో మిత్రం పునరాయాన్తి యాన్తి చ

రామా! ఈ రెంటిలో నీకు రమ్యమని తోచినదానిని ఆశ్రయింపుము. అనఘా! శుభుడా! లేకున్న యీరెంటినిగూడ సమాశ్రయించి, యీ జగత్తున విహరించుచు, రాగద్వేషములను క్షయమొనర్పుము. రామా! స్వర్గమున, ద్యులోకమున లేక భూలోకముననున్న ఏవిషయమైన గానిమ్ము, రాగద్వేషక్షయమున బొందవచ్చును. రామా! రాగద్వేషహతమైన బుద్ధితో మూఢులాచరించునదంతయు విపరీతఫలముల నొసగుచున్నది. దగ్ధమగు వనస్థలమున హరిణములు అడుగుపెట్టనట్లు, రాగద్వేష - దూషితమగు చిత్తమున, మరెట్టి సుగుణము ఉండదు. ఎవ్వని మనో-బిలమున రాగద్వేష-సర్పము ప్రవేశింపకున్నదో, అతడు కల్పతరువు. అతనికడ లభింపనిదేమియు లేదు, బుద్ధిమంతులు, ధృతిమంతులు, సుచతురులు, శాస్త్రజ్ఞులునైగూడ, రాగద్వేషకలుషితులగువారికి ధిక్కారము; వారు సృగాలతుల్యులు. 'నా సంపదను ఇతరులు అనుభవించుచున్నారు, నేనితరులకడ పొందవల

పినదానిని రాబట్టుకొనజాలకపోయితిని,' అని వినష్టధనాదులగుఱించి కుందుచు, రాగద్వేషపరవశు లగుట అత్యంతతుచ్ఛము ధనము, బంధువులు, మిత్రులు వచ్చుచు బోవునవైయున్నవి.

కిమేతేషు నరః ప్రాజ్ఞో రజ్యతే వా విరజ్యతే. 80

భావాభావభవాభోగా మాయేయం పారమేశ్వరీ
సంసారరచనా సర్వా సంసక్తం పాతయత్యలమ్. 81

న ధనం న జనో నాత్మా సత్యం రాఘవ వస్తుతః
మిథ్యైవ మిథ్యావసితమితీదం పరిలక్ష్యతే. 82

ఆద్యన్తయోః సర్వమసన్మధ్యేఽప్యస్థిరమాధిమత్
క్వ బధ్నాతి రతిం ప్రాజ్ఞో హ్యన్యకల్పితఖద్రుమే. 83

ఏకేన కల్పితా ఖే స్త్రీ భుక్తా తాం దూరగోఽపరః
ఇతీయమజ్ఞ సంసారరచనా తేన మా భ్రమ. 84

భూతౌఘవం జవీభావమిమమాతతమాకులమ్
గన్ధర్వపురనిర్మాణ విలాసేన సమం విదుః. 85

స్వప్నసంకల్పపురవదసదేవేదముత్థితమ్
సర్వత్ర సంస్థమేవేదం సుషుప్తమివ విచ్యుతమ్. 86

పరిపశ్యతి సంసారదీర్ఘస్వప్నపురద్రుమమ్
అజ్ఞాననిద్రాలుఠనస్వభావాత్మకమచ్యుతమ్
సంసారస్వప్నసంభ్రాన్తో భవానయమిహ స్థితః. 87

తదేనాం వితతాం నిద్రాం ఘనాజ్ఞానమయాత్మికామ్
త్యజాలక్ష్మీమివావాప్తనిధానః పురుషోత్తమః. 88

ప్రబోధమేహి పశ్యస్వ మాత్మానముదితం సదా
నిర్వికల్పం చిదాభాసం ప్రాతఃపద్మం రవిం యథా. 89

ప్రియాప్రియములగు భావాభావముల గల్పించునది పరమేశ్వరుని మాయ! దీనియందు అను రాగమేమి లేక విరాగమేమి? ఉపేక్షయే మేలు. ఈమాయయే సంసారమును గల్పించి, భోగలోలు పుడగు వ్యక్తిని బడద్రోయుచున్నది. రాఘవా! ధనజనబలములన్నియును మిథ్యయే, వాస్తవముగావు. కేవల మాత్మయొక్కటియే సత్యము. ఆద్యంతముల సత్తలేనిది. మధ్యమటుకు సత్య మెట్లుకగలదు? త్రికాలాత్యంతతుచ్ఛమగునది, ఆసక్తినిగొన్న, కేవలము మనోవ్యథనే యొసగును. ఇతరకల్పితమగు ఆకాశ - వృక్షమున ఏబుద్ధిమంతుడు, ప్రీతిని వహించును? ఒకడు ఆకాశమున స్త్రీమూర్తిని గల్పించి నాడు; మఱొకడు దానితో భోగించినాడు-యీసంసార కల్పనగూడ ఇట్టిదే! నీవీ మహాభ్రమ యందు పడకుము. ప్రాణివర్గముతో నిండిన యీ సంసారము మూఢులను కలవరపెట్టుచున్నది. తత్త్వజ్ఞు లిద్దానిని గంధర్వనగరతుల్యముగ పరికింతురు దీని ఉదయము, స్వప్న - పురివలె అలీకమే! నీవుజూచు యీ సంసారము, దీర్ఘస్వప్నదృష్టమగు పురి లేక వృక్షము. అజ్ఞాననిద్రాక్రాంతుడవైన,

యీస్వప్నమగుపడగలదు. ఇత్యాది, సర్వత్ర అనుస్యూతమగుచు స్థితినిగన్న దీర్ఘస్వప్నము. నీవు గాఢమగు అజ్ఞాననిద్రయందుండి, యీ సంసార - సంభ్రమమును గాంచుచున్నాడవు. ధన, రత్న - నిధిని బొందిన పురుషుడు అలక్ష్మిని బరిత్యజించునట్లు, నీవీ దీర్ఘ - అజ్ఞాననిద్రను బరిత్యజింపుము. నీవు ప్రభాతపద్మమువలె ప్రబుద్ధుడవు కమ్ము! ప్రబుద్ధుడవై, సూర్యునివలె చిరోదితమును, నిర్వికల్పమును, చైతన్యమాత్రమునునగు ఆత్మను దర్శింపుము.

ప్రబుధ్యస్వ ప్రబుధ్యస్వ పునఃపునరయం మయా
ప్రబోధ్యసే మహాబాహో పశ్యాత్మార్కమనామయమ్. 90
మయైతేనాభివృష్టేన శీతేన జ్ఞానవారిణా
సుశబ్దశాలినా రామ హ్యనేనైవాసి బోధితః. 91
బోధమాసాదయ పరం ప్రబోధోఽద్యైవ రాఘవ
సత్యమాలోకయాలీకం త్యక్త్వేమం జాగతం భ్రమమ్. 92
న తే జన్మ న తే దుఃఖం న దోషాస్తే న తే భ్రమాః
సర్వం సంకల్పముత్సృజ్య తిష్ఠాత్మని సుసంస్థితః. 93

మహాబాహో! ప్రబుద్ధుడవు కమ్ము! లెమ్ము! నేను నిన్ను మాటిమాటికి ప్రబుద్ధు నొనర్చుచున్నాడను. ప్రబుద్ధుడవై, అనామయుడగు ఆత్మార్కుని గాంచుము రామా! నేను సుశీతలమగు జ్ఞానవారిని సుశబ్దముల వర్షించి, నిను ప్రబోధమును గలుగజేయుచున్నాడను. రాఘవా! ప్రబుద్ధుడవు కమ్ము. పరమజ్ఞానమును బొందుము; సత్యస్వరూపమును దర్శింపుము. అలీకమగు జగద్భ్రమను త్యజింపుము. వాస్తవమునకు నీకు జన్మ, దుఃఖ, దోష, భ్రాంతులు లేవు. నీవు భ్రాంతుల నన్నిటిని త్యజించి, సుస్థిరభావమున ఆత్మయందు వెలయుము.

పరిగలితవికల్పదోషజాల
స్త్వమసి సుసారసుషుప్తసౌమ్యదృష్టిః
అతివితతమిదం సుశుద్ధయే త్వం
సముపశమాత్మని తిష్ఠ హే మహాత్మన్. 94

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పరమార్థయోగోపదేశో నామాష్టావింశః సర్గః ॥ 28 ॥

మహాత్మా! నీ వికల్పదోషములన్నియును విగళితములైనవి; నీవు, సుషుప్తునివలె, సారవంతమును, విక్షేపరహితమునునగు దృష్టినిబొందితివి. నీవు పరమవిశుద్ధినిబొంది, పరబ్రహ్మమున వెలయుము.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్యప్రకాశమున నిర్వాణప్రకరణమున పరమార్థయోగోపదేశమను వింశతితమ సర్గము ॥ 28 ॥

## ఏకోనత్రింశః సర్గః.

[రామస్య బోధాద్విశ్రాన్తిః పునరుక్తార్థవిస్తరః
కైలాసే ప్రాక్ శివేనేత్థం స్వోపదేశశ్చ కీర్త్యతే.

బోధచే శ్రీరాముని విశ్రాంతి, కథితార్థమును మఱల విస్తరించుట, పూర్వము కైలాస పర్వతముపై శివుఁడిట్టి యుపదేశమునే యొనర్చెననుటయు యిందు గానందగును.

శ్రీవాల్మీకి రువాచ :—

ఇత్యాకర్ణయతి స్వస్థసమచేతసి రాఘవే
విశ్రాన్తే స్వాత్మని స్వైరం పరమానన్దమాగతే. 1
తత్రస్థేషు చ సర్వేషు తేషూపశమశాలిషు
రాఘవస్యాత్మవిశ్రాన్తేః స్థిత్యర్థం వచనామృతమ్. 2
విరరామ మునేర్వారి సస్యేష్వమ్బుధరాదివ
అథ యాతే ముహూర్తార్ధే రాఘవే ప్రతిబోధితే. 3
పునరాహ తమేవార్థం వసిష్ఠో వదతాం వరః

శ్రీవాల్మీకి:— ఇట్లు, స్వస్థ సమచిత్తుడై రాఘవుడు ఆకర్ణించుచు, ఆత్మయందు విశ్రమించి పరమానందమునుబొందెను; అటనున్నవారందఱునుగూడ ఉపశమమును నందిరి. జలపూర్ణములైన సస్యక్షేత్రముల మేఘము వర్షమునాపునట్లు, ముని రాఘవుని విశ్రాంతి నిలచుటకుగాను, తన వచనామృతమునునిల్పెను. రాఘవుడు ప్రతిబోధితుడై ముహూర్తార్థముగడువ, వాగ్మిప్రవరుడగు వసిష్ఠుఁడు మరల నద్దానినే దృఢమొనర్ప నిట్లుపల్కెను.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

రామ సమ్యక్ప్రబుద్ధోఽసి స్వాత్మానమసి లబ్ధవాన్. 4
ఏవమేవావలమ్బ్యార్థం తిష్ఠ నేహ పదం కృథాః
ఇదం సంసారచక్రం హి నాభౌ సంకల్పమాత్రకే. 5
సంరోధితాయాం వహనాద్రఘునన్దన రుధ్యతే
క్షోభితాయాం మనోనాభ్యామిదం సంసారచక్రకమ్. 6
ప్రయత్నాద్రోధితమపి ప్రవహత్యేవ వేగతః
పరం పౌరుషమాస్థాయ బలం ప్రజ్ఞాం చ యుక్తితః. 7
నాభిం సంసారచక్రస్య చిత్తమేవ నిరోధయేత్
ప్రజ్ఞాసౌజన్యయుక్తేన శాస్త్రసంవలితేన చ. 8
పౌరుషేణ న యత్ప్రాప్తం న తత్క్వచన లభ్యతే
దైవైకపరతాం త్యక్త్వా బాలబోధోపకల్పితమ్. 9
నిజం ప్రయత్నమాశ్రిత్య చిత్తమాదౌ నిరోధయేత్
ఆవిరిఞ్చాత్ప్రవృత్తేన భ్రమేణాజ్ఞానరూపిణా. 10

అసదేవ సదాభాసమిదమాలక్ష్యతేఽనఘ
అజ్ఞాన భ్రమవిస్తారమాత్రకాకృతయోఽనఘ. 11
ఇమే దేహా భ్రమస్త్వీహా సర్వధర్మాత్సముత్థితాః
సంకల్పః పునరస్త్యేవ దేహస్యార్థే కదాచన. 12
సుఖదుఃఖవిచారిత్వం న కార్యం రామ ధీమతా
దుఃఖమ్లానముఖః క్లేదీ ప్రసన్నాత్క్లేదవర్జితాత్. 13
అపి చిత్రనరాద్దేహనరస్తుచ్ఛతరః స్మృతః
ఆధివ్యాధిపరిమ్లానే స్వయం క్లేదిని నాశిని. 14
న తథా స్థిరతా దేహే చిత్రపుంసో యథా కిల
వినాశితో హి చిత్రస్థో దేహో నశ్యతి నాన్యథా. 15
అవశ్యనాశో మాంసాత్మా స్వయం దేహో వినశ్యతి
పాలితః సుస్థిరాం శోభామాదత్తే చిత్రమానవః. 16

శ్రీవసిష్ఠుఁడు:— రామా! నీవు చక్కఁగ ప్రబోధము నందితివి; ఆత్మతత్త్వమును బొందితివి. దీనినే ఆశ్రయించుకొని స్థిరముగనుండుము; దీనినుండి చలించి, సంసారమున నడుగిడకుము. రఘునందనా! సంకల్పమాత్రమగు యీ సంసారచక్రమును సంకల్పమను నాభి - ప్రదేశమున నిరోధించిన, నిరుద్ధమవగలదు. రాగద్వేషముల యీ నాభి సంక్షుభితమైయున్న, దీనిని బలమంతయు వినియోగించి, అడ్డినను ఆగదు; వేగముగ తిరుగుచునేయుండును. విశేషమగు పురుష - ప్రయత్నమునుబూని, బలమును సేకరించుకొని, శాస్త్రయుక్తుల విచారించి, సంసారచక్ర - నాభియగు చిత్తమును నిరోధింపనగును. ప్రజ్ఞాసౌజన్య, శాస్త్రసంవలితమగు పౌరుషమునకు దొరకనిది, మఱిదేనివలనను లభింపదు. మూర్ఖపరికల్పితమగు దైవమును ద్యజించి, పురుషప్రయత్నము నాశ్రయించి, చిత్తమును ముందుగ నిరోధింపవలెను. అనఘా! అజ్ఞానరూపమగు యీ చక్రభ్రమణమువలననే, వెనువెంటనే అసదాత్మకమగు యీ జగత్తు సత్తువలె నగపడుచున్నది. అజ్ఞానభ్రమ - విస్తారకారణములగు యీ జగత్ - శరీరములు, సంకల్పమునుండియే లేచి తిరుగాడుచున్నవి. ఈ సంకల్పమే, విషయవాసనల గల్పించి, పునర్జన్మకు గారణములగుచున్నవి. రామా! అందువలన, బుద్ధిమంతుడగువాడు సుఖదుఃఖవిచారమొనర్పగూడదు. చిత్రలిఖితమగు మనుష్యశరీరముకంటె, ఈ శరీరము తుచ్ఛము. చిత్రితమానవునకు సంకల్పములేదు. జీవితునకున్నది. జీవితుని ముఖము దుఃఖమున వాడును; కన్నీట ఆర్ద్రమగును. చిత్రమునందలి మనుష్యరూపము శాశ్వతము; కాని, జీవితుని శరీరము శాశ్వతముకాదు. దాని మృత్యువు నెవ్వరును అడ్డజాలరు; ఆధివ్యాధుల నది జీర్ణమైపోవును. కన్నీట మకిలిబారిపోవును; చిత్ర - శరీరము నెవ్వరైన పాడుచేసిన పాడగును. లేకున్న పాడవదు. జీవితునిశరీరమన్ననో, దానియంతటనదే వినష్టమైపోవును. జాగ్రత్తవహించిన, చిత్రిత - మానవుని శోభ తఱుగదు.

దేహస్తు పాలితోఽప్యుచ్చైర్నశ్యత్యేవ న వర్ధతే
తేన శ్రేష్ఠశ్చిత్రదేహో నాయం సంకల్పదేహకః. 17
యే గుణాశ్చిత్రదేహే హి న తే సంకల్పదేహకే

చిత్రదేహాదపి జడాద్యోఽయం తుచ్ఛతరః కిల. 18
తస్మిన్మాంసమయే దేహే కైవాస్థా భవతోఽనఘ
దీర్ఘసంకల్పదేహోఽయం తస్మిన్నాస్థా మహామతే. 19
స్వప్నసంకల్పజాద్దేహాదపి తుచ్ఛతరో హ్యయమ్
అల్పసంకల్పజో దీర్ఘైః సుఖదుఃఖైర్న గృహ్యతే 20
దీర్ఘసంకల్పజశ్చాయం దీర్ఘదుఃఖేన దుఃఖితః
దేహో హి సంకల్పమయో నాయమస్తి న వాస్తి నః. 21
కిం వ్యర్థమేతదర్థం హి మూఢోఽయం క్లేశభాజనమ్
యథా చిత్రమయే పుంసి క్షతే క్షీణే న తత్క్షతిః. 22
తథా సంకల్పపురుషే క్షతే క్షీణే న తత్క్షతిః
యథా మనోరాజ్యమయే క్షతే క్షీణే న తత్క్షతిః. 23
యథా ద్వితీయే శశిని క్షతే క్షీణే న తత్క్షతిః
యథా స్వప్నసమారమ్భే క్షతే క్షీణే న తత్క్షతిః. 24
యథా నద్యాతపజలే క్షతే క్షీణే న తత్క్షతిః
సంకల్పమాత్రరచితే ప్రకృత్యైవ చ నాశిని. 25
తథా శరీరయన్త్రేఽస్మిన్నష్టే క్షీణే న తత్క్షతిః
దీర్ఘస్వప్నమయే హ్యస్మింశ్చిత్తసంకల్పకల్పితే. 26

కాని, మాంసమయశరీరమును ప్రయత్నముతో రక్షింప దొడఁగొనినను, నష్టమైపోవుచున్నది. వృద్ధిని బొందుటలేదు. అందువలన, నేను చిత్ర - దేహమునే మాంసమయదేహముకంటె శ్రేష్ఠమని నుడువుచున్నాను. చిత్రదేహమునకున్న గుణములు, మాంసమయదేహమున లేవు. అందువలననయ్యది చిత్ర-దేహముకంటెగూడ తుచ్ఛము. అనఘా! దీని మరల విశ్వాసమేమి? అనురాగమేమి? మహామతీ! మాంసమయ దీర్ఘసంకల్పదేహమున నమ్మకమేమి? ఇయ్యది స్వప్నకల్పితదేహముకంటెగూడ తుచ్ఛము. స్వప్నదేహము క్షణికమగుటవలన నయ్యది యీ జాగ్రద్దేహమువలె దీర్ఘములగు సుఖ - దుఃఖముల నవియదు; ఇయ్యది దీర్ఘదుఃఖముల నవియుచున్నది. సంకల్పమయశరీరము 'ఇదిగో ఉన్నదన, అదిగో లేదు' అగుచున్నది; దీని ఉనికిమనుకులు పరిలక్షింపబడుటలేదు. ఇయ్యది వాస్తవమునకు మిథ్య; మూఢులే దానినిగుఱించి వ్యర్థముగ దుఃఖమును బొందుచున్నారు. చిత్రిత - శరీరమునందలి అవయవమునకు గాయముతగిలినను, లేక కొంతచోటు చినిగినను, కీడేమియు లేనట్లు, యీ సంకల్పమయ - మానవుడు క్షీణించినను, లేక వినాశమునందినను హానిలేదు. మనఃకల్పితరాజ్యము భంగమైనను, భ్రమదృష్టుడగు ద్వితీయచంద్రుడు అస్తమించినను, స్వప్నదృష్టమగు పని పాడైనను, మరుమరీచికయందలి నీరు పాడైనను, హానిలేనట్లు, సంకల్పమాత్రమును, స్వభావనశ్వరమునగు యీ మాంసమయశరీరయంత్రము నశించినను కీడులేదు.

భూషితే దూషితే దేహే న హి కించిచ్చితః క్షతమ్
న చిదస్తముపాయాతి నాత్మా చలతి రాఘవ. 27

న బ్రహ్మ విక్రుతిం యాతి కింవా దేహక్షయే క్షతమ్
భ్రమచ్చక్రోపరిష్ఠో హి పూర్వచక్రోపచక్రవత్. 28
యథా పశ్యతి దిక్చక్రం భ్రమదత్యన్తమోహితః
అకస్మాదేవ రూఢేన మిథ్యాజ్ఞానేన వల్గతా. 29
తత్రస్థేన తథైవేదం దృశ్యతే దేహచక్రకమ్
భ్రమిదం చ భ్రమద్రూపం పతద్రూపం ప్రపాతితమ్. 30
హతం చ హన్యమానం చ దృశ్యతే దేహచక్రకమ్
ధీరతామలమాలమ్బ్య ఘనభ్రమమిమం త్యజేత్. 31

రాఘవా! యీ శరీరము దూషింపబడినను, భూషింపబడినను చైతన్యమున కెట్టి కీడును లేదు. ఈ సంకల్పమయశరీరమునకెమైన కీడువాటిల్లిన, ఆత్మ విచలితమవదు. చైతన్యము నష్టమవదు. బ్రహ్మ వికృతినందదు. ఈ దేహము క్షీణించిన, క్షతి ఎవ్వతికి? తిరుగాడుచక్రము నెక్కినవాడు, నలుదిక్కులు తిరుగుచున్నట్లు గాంచును. దీనికి గారణము ఆచక్ర - భ్రమణమే, అట్లే, మిథ్యాజ్ఞానము మితిమీరిన, మిథ్యాజ్ఞానచక్రము నధిరోహించినవాడు, అంతట దేహచక్రముల గాంచును. అప్పుడా తడు ఈ దేహ - చక్రమును ద్రిప్పిన తిరుగుననియు, పైనుండి పడవైచిన పడుననియు, వినష్టమొనర్చిన నష్టమగుననియు, తలచును. కనుక, ధీరబుద్ధితో ఈభ్రమ నపనయింపనగును.

సంకల్పేన కృతో దేహో మిథ్యాజ్ఞానేన సన్నసన్
అసత్యేన కృతం యస్మాన్న తత్సత్యం కదాచన. 32
అసదభ్యుదితో దేహో రజ్జ్వామివ భుజంగధీః
అసత్యామేవ సత్యాం చ కరోత్యపి జగత్క్రియామ్. 33
జడేన రామ క్రియతే యన్న తత్కృతముచ్యతే
కుర్వన్నపి తదా దేహో న కర్తా క్వచిదేవ హి. 34
నిరీహో హి జడో దేహో నాత్మనోఽస్యాభివాఞ్ఛితమ్
కర్తా న కశ్చిదేవాతో ద్రష్టా కేవలమస్య సః. 35
యథా దీపో నివాతస్థః స్వాత్మన్యేవావతిష్ఠతే
సాక్షివత్సర్వభావేషు తథా తిష్ఠేజ్జగత్స్థితౌ. 36
యథా దివసకర్మాణి భాస్కరః స్వస్థ ఏవ సన్
కరోత్యేవమిమాం రామ కురు పార్థివసంస్థితిమ్. 37
అస్మిన్నసన్మయే దేహగృహే శూన్యే సముత్థితే
సత్తాముపగతే మిథ్యాబాలకల్పితయక్షవత్. 38
కుతోఽప్యాగత్య నిఃసారః సర్వసజ్జనవర్జితః
అహంకారః కువేతాలః ప్రవిష్టశ్చిత్తనామకః. 39
అస్య మా భృత్యతాం గచ్ఛ త్వమహంకారదుర్మతేః
అస్య భృత్యతయా రామ నిరయః ప్రాప్యతే ఫలమ్. 40

సంకల్పమే ఈదేహము యొక్క నిర్మాత. ఇయ్యది వాస్తవమున కసత్తయైనను మిథ్యాజ్ఞానమున సద్వస్తువువలె తోఁచుచున్నది. కర్తయే అసత్యమైన, కార్యమెట్లు సత్యమవగలదు ? రజ్జు-సర్పము యొక్క ఉత్పత్తివలె, దీని ఉత్పత్తి గూడ మిథ్యయే. ఈ శరీరమసత్యమయ్యు ఈ జగత్క్రియల సత్యములనిపింపజేయుచున్నది. రామా ! జడదేహము ఒనర్చు కార్యములు సత్యములన జెల్లదు. భ్రాంతిసమయమున దేహమెకించుక ఒనర్చుచున్నట్లు అగపడినను దానిని కర్తయనరాదు. ఇచ్ఛయే కర్తృత్వకారణము; జడదేహమునకు ఇచ్ఛకలుగుట అసంభవము; నిర్వికారమగు ఆత్మకు ఇచ్ఛకలుగుటకు గూడ వీలులేదు. అందువలన జగత్తునకు కర్త ఎవ్వరును లేరు. ఆత్మ కేవలమాత్రము ద్రష్ట. నిర్వాత ప్రకంపితమగు దీపము కేవలము సాక్షిమాత్రమై వెలయునట్లు ఆత్మగూడ వెలయుచున్నది. ఆకాశమున సూర్యుడుండి దినకృత్యముల నిర్వహింపజేయునట్లు, రామా ! నీవుగూడ నిర్లిప్తుడవై, నిమిత్తమాత్రుడవై రాజ్యకార్యముల నిర్వహింపుము. అసత్యమును, శూన్యమును నగు దేహగృహము, బాలకల్పితమగు యక్షునివలె సత్యమవ, సాధుజనపరిత్యక్తమును, అపారమునునగు అహంకార చిత్త-భూతమెటనుండి అరుదెంచి, దీనప్రవేశించినది చెప్పజాలము. నీవీ అహంకార-భూతమునకు దాసుడవు కావలదు. రామా ! దీనికి భృత్యులగువారు నరకమున కఁటిగెదరు.

స్వసంకల్పవిలాసేన దేహగేహే దురాకృతిః
ఉన్మత్తచిత్తవేతాలః పరివల్గతి లీలయా. 41
శూన్యం దేహగృహం ప్రాప్య చిత్తయక్షేణ తత్కృతమ్
భీతా యేన మహాన్తోఽపి సమాధి నియతాః స్థితాః. 42
చిత్తవేతాలముద్వాస్య స్వశరీరకమన్దిరాత్
సంసారశూన్యనగరే న బిభేతి కదాచన. 43
చిత్తభూతాభిభూతేఽస్మిన్యే శరీరగృహే రతాః
చిత్రమద్యాపి తే కస్మాద్ఘటితా ఆత్మపక్షిణా. 44
గ్రస్తే చిత్తపిశాచేన దేహసద్మని యే మృతాః
పిశాచస్యైవ యా బుద్ధిర్నాపిశాచస్య రాఘవ. 45
అహంకార బృహద్యక్షగృహే దగ్ధశరీరకే
విహరన్నాస్థయా సాధో నతు వై తత్కాల స్థిరమ్. 46
అహంకారానుచరతాం త్యక్త్వా వితతయా ధియా
అహంకారాస్మృతిం ప్రాప్య స్వాత్మైవాశ్వవలమ్బ్యతామ్. 47
అహంకారపిశాచేన గ్రస్తా యే నిరయైషిణః
తేషాం మోహమదాన్ధానాం న మిత్రాణి న బాన్ధవాః. 48
అహంకారోపహతయా బుద్ధ్యా యా క్రియతే క్రియా
విషవల్ల్యా ఇవ ఫలం తస్యాః స్యాన్మరణాత్మకమ్. 49
వివేకధైర్యహీనేన స్వాహంకారమహాత్మవః
మూర్ఖేణాలమ్బితో యేన నష్టమేవాశు విద్ధి తమ్. 50

చిత్తమను బేతాళుడు శూన్యమగు దేహమును ప్రవేశింప, మహాపురుషులుగూడ భయముతో సమాధి నాశ్రయించిరి. శరీరగృహమునుండి చిత్త - బేతాళుని పారదోలగలిగినవాడు, సంసారమను శూన్యనగరమునమండినను, భీతినిబొందడు. చిత్త - బేతాళావేష్టితమగు ఈ శరీరగృహమున చిరకాలము వాసమొనర్చి, అనంతకోటిదేహముల వినాశమొనర్చియు, కొందఱిద్దాన ఆత్మబుద్ధిని వీడక అందేల నివసించుచున్నారో, ఆశ్చర్యము! తెలియజాలము. రామా! చిత్తబేతాళ - గ్రస్తమగు ఈ దేహగృహముననుండి, మరణించువారి బుద్ధిగూడ పిశాచ - బుద్ధియే! సాధో! అహంకారయుక్తుని నివాసమగు ఈ పాడు - ఇంట విశ్వాసముంచి నివసించువాడుగూడ, పిశాచమే; ఈ దేహగృహ మశాశ్వతము. నీవు అహంకారముయొక్క ఈ ప్రవాహమును విడచి, సంపూర్ణముగ దీనిని విస్మరించి, ఆత్మవస్తువు ననుసరింపుము. అహంకారపిశాచ - గ్రస్తులై, నరకమున కఱుగగోరువారికి బంధుమిత్రులెవ్వరునులేరు. అహంకారబుద్ధితో నాచరించునది, విషవల్లివలె, మృత్యుఫలమునొసంగును. ఏ మూర్ఖుడు వివేక, వైరాగ్యముల ద్యజించి, అహంకార - మహోత్సవమును నొనర్చునో ఆమూర్ఖుని వినష్టునిగ గ్రహింపుము.

అహంకారపిశాచేన వరాకా యే వశీకృతాః
త ఏతే నరకాగ్నీనాం రాఘవేన్ధనతాం గతాః. 51

రాఘవా! అహంకారపిశాచమునకు వశీభూతులగు శోచనీయపురుషులు నరకానలమునకు ఇంధనములగుచున్నారు; వారికి పరలోకమునగూడ సుఖములేదు.

అహంకారోరగో యస్య పరిస్ఫూర్జతి కోటరే
స్వదేహపాదపోఽధీరైరచిరేణ నిపాత్యతే. 52

ఏ దేహ - కోటరమున అహంకార - సర్పము బుసలుకొట్టుచుండునో, అయ్యది శీఘ్రముగనే కూలిపోవును.

అహంకారపిశాచోఽస్మిన్దేహే తిష్ఠతు యాతు వా
త్వమేనమాలోకయ మా మనసా మహతాం వర. 53

అహంకారపిశాచము ఈ శరీరమున ఉండిన ఉండుగాక, లేకుండిన లేకుండుగాక! మహాత్మా! దానిని నీవు మనస్సుతోగూడ గాంచకుము.

అవధూతో హ్యవజ్ఞాతశ్చేతసైవ తిరస్కృతః
అహంకారపిశాచస్తే నేహ కించిత్కరిష్యతి. 54

ఈ అహంకారపిశాచమును లోలోన తిరస్కరించి, సరకుగొనకున్న, మరేమియు నొనర్పజాలదు.

దేహాలయే స్ఫురత్యస్మిన్ రామ చిత్తపిశాచకే
అస్యానన్త విలాసస్య కిమివాగతమాత్మనః. 55

రామా! ఈ శరీర - గృహమున చిత్తపిశాచమున్నను, అనంతవిలాసుడగు ఆత్మకు గలిగెడు హాని ఏమున్నది.?

చిత్తయక్షాభిభూతానాం యాః పుంసాం వితతాపదః
శక్యన్తే పరిసంఖ్యాతుం న తా వర్షశతైరపి. 56

చిత్తయక్షాభిభూతులకు అనవరతము సంభవించు ఆపదల లెక్కిడ నూరేండ్లు గూడ, చాలవు.

హాహా మృతోఽస్మి దగ్ధోఽస్మీత్యేతా వై దుఃఖవృత్తయః
అహంకారపిశాచస్య శక్తయోఽన్యస్య నానఘ. 57

రాఘవా! 'హా! మరణించితిని, దగ్ధుడనైతిని' యనునట్టి దుఃఖములు అహంకారపిశాచము యొక్క శక్తులే. అన్యులవి కావు.

సర్వగోఽపి యథాకాశః సంబన్ధో నేహ కేనచిత్
సర్వగోఽపి తథైవాత్మా నాహంకారేణ సంగతః. 58

ఆకాశము సర్వగామియైనను దేనితోడను సంబంధములేకయున్నట్లు, ఆత్మకహంకారముతో సంబంధము లేదు.

యత్కరోతి యదాదత్తే దేహయన్త్రమిదం చలమ్
వాతరజ్జుయుతం రామ తదహంకారచేష్టితమ్. 59

రామా! జడమును, వాత-రజ్జుయుతమునునగు ఈ శరీరము గ్రహించునది, ఒనర్చునది అహంకారముయొక్క ప్రయత్నమని యెఱుగుము.

వృక్షోత్పత్తౌ యథా హేతురకర్త్రపి కిలామ్బరమ్
ఆత్మసంస్థస్తథేహాత్మా చిత్తచేష్టాసు కారణమ్. 60

ఆత్మ నిష్క్రియము; ఎద్దానిని ఒనర్పదు. అది చిత్తముయొక్క చేష్టలకు గారణమని చెప్పబడిన, అయ్యది వృక్షోత్పత్తికి ఆకాశము కారణమైనట్లని గ్రహింపనగును.

ఆత్మసంనిధిమాత్రేణ స్ఫురత్యాత్తవపుర్మనః
దీపసంనిధిమాత్రేణ కుడ్యరూపమివామలమ్. 61

దీపసన్నిధానమున గృహ-కుడ్యము ప్రకాశించునట్లు, మనస్సు ఆకృతిని దాల్చి ఆత్మకడ స్ఫురించుచున్నది.

అపి విశ్లిష్టయో రామ నిత్యమేవాత్మచిత్తయోః
ద్యావాపృథివ్యోరివ కః సంబన్ధః ప్రకటాన్ధయోః. 62

అంతేగాని, ద్యావాపృథివులవలె భేదయుతములును, చిజ్జడస్వరూపములునునగు ఆత్మచిత్తములకు సంబంధమేమున్నది?

చపలస్పన్దనేరాభిరాత్మశక్తిభిరావృతమ్
చిత్తమాత్మేతి మౌర్ఖ్యేణ దృశ్యతే రఘునన్దన. 63

రఘునందనా! చంచలమగు స్పందశక్తినిబ్రయోగించు ఆత్మయొక్కశక్తివలన నావృతమగు టకలనే చిత్తమును మూర్ఖులు ఆత్మయని భ్రమించుచున్నారు,

ఆత్మా ప్రకాశరూపో హి నిత్యః సర్వగతో విభుః
చిత్తం శఠమహంకారం విద్ధి హార్దం బృహత్తమః. 64
ఆత్మాసి వస్తుతస్త్వం హి సర్వజ్ఞో న మనో భృశమ్
దూరే కురు మనోమోహం కిమేతేనాభిసంగతః 65

వాస్తవమునకు నీవు సర్వజ్ఞుడవగు ఆత్మవు. నీవీ మనోమోహమును దూరమొనర్పుము. నీవేల యీ మోహమున బడినాడవు?

పిశాచోఽపి మనో రామ శూన్యదేహగృహే స్థితః
భావయత్యేష దుష్టాత్మా మానముత్తమ సంస్పృశన్. 66

రామా! శూన్యమగు యీ దేహగృహముననున్న మనఃపిశాచము ఆత్మను స్పృశింపజాలకున్నను, 'ఆత్మను స్పర్శించితిని' అని మనమున భావించుచుండును.

భవప్రదమకల్యాణం ధైర్యసర్వస్వహారిణమ్.
మనః పిశాచముత్సృజ్య యోఽసి స త్వం స్థిరో భవ. 67

సంసారకారణమును, ధైర్యహారియును, అమంగళమయమునునగు యీ చిత్తపిశాచమును విడచి మిగిలినదేదో అదినీవై వెలయుము.

చిత్తయక్షదృఢాక్రాన్తం న శాస్త్రాణి న బాన్ధవాః
శక్నువన్తి పరిత్రాతుం గురవో నచ మానవమ్. 68

చిత్తపిశాచాక్రాంతుని, శాస్త్రవిచారము, గురూపదేశము, బంధుజనులు, లేక మరెవ్వరును గూడ రక్షింపజాలరు.

సంశాన్తచిత్తవేతాలం గురుశాస్త్రార్థబాన్ధవాః
శక్నువన్తి సముద్ధర్తుం స్వల్పపఙ్కాన్మృగం యథా. 69

చిత్తబేతాళుడు క్షీణించిన, కొద్దిలోతుగనున్న బురదనుండి లేడిని లేవదీయగలుగునట్లు, గురూపదేశ, శాస్త్రవిచార, బంధుజనసాహాయ్యములతో అనాయాసముగ నుద్ధరింపగలము.

అస్మిఞ్జగచ్ఛూన్యపురే సర్వమేవ ప్రదూషితమ్
దేహగేహం ప్రమత్తేన చిత్తయక్షేణ వల్గతా. 70

జగత్తను శూన్యపురినంతటిని కలచి, చిత్తయక్షుడు దేహగృహమును సంపూర్ణముగ పాడుచేసినాడు.

చిత్తవేతాలవలితా సమస్తా దేహఖణ్డజా
ఇయం జగదరణ్యానీ శూన్యా కస్య న భీతయే. 71

శరీరేకదేశమగు శూన్యజగదరణ్యము చిత్తబేతాళుని నివాసభూమికాగా, భయపడని వారెవ్వరున్నారు?

జగన్నగర్యామస్యాం తు శాన్తచిత్తపిశాచకమ్
దేహగేహం కతిపయైః సేవ్యతే సద్భిరేవ యత్. 72

ఈ జగన్నగరమున చిత్తపిశాచముయొక్క ఉపద్రవములేని కొన్ని గృహములు మాత్రమే సాధునిషేవ్యములగుచున్నవి.

ఇహ సంశ్రూయతే యాయా దిక్తస్యైవ రఘునన్దన
ప్రమత్తమోహవేతాలైః పూర్ణా దేహశ్మశానకైః. 73

రఘునందనా! నీవు పరికించు దెసలందంతటను, దేహశ్మశానవాసులగు, ఉన్మత్తబేతాళురు నిండియున్నారు.

అస్యాం జగదరణ్యాన్యాం ముహ్యన్తం ముగ్ధబాలవత్
స్వమాత్మానమారాధ్య ధైర్యాంశమాత్మనాత్మానముద్ధరేత్. 74

ఈ జగదారణ్యమున ఆత్మ మూర్ఖుడగు బాలునివలె మోహమగ్నమైయున్నది. కేవలము ధృతిపూర్వకమగు పురుషయత్నముచేతనే దీని నుద్ధరింపనగును.

జగజ్జరదరణ్యేఽస్మింశ్చరద్భూతమృగవ్రజే
ధృతిం తృణరసై రామ మా గచ్ఛ మృగపోతవత్. 75

రామా! జగత్తులను జీర్ణారణ్యమున చిత్తభూతములను హరిణములు సంచరించుచున్నవి; నీవు మృగశాబకమువలె విషయతృణలోభమున మత్తుడవకుము.

అస్మిన్మహీతలారణ్యే చరన్తి మృగపోతకాః
త్వమజ్ఞానగజం భుక్త్వా సైంహీం వృత్తిముపాశ్రయ. 76

ఈ భూతలమను అరణ్యమున అనేకములగు హరిణశాబకములు సంచరించుచున్నవి వాటిని సంచరింపనిమ్ము! కాని, నీవు అజ్ఞానహస్తిని భుజించి సింహమువలె విహరింపుము.

అన్యే నరమృగా ముగ్ధా జమ్బూద్వీపే స్వజఙ్గలే
విహరన్తి యథా రామ తథా మా విహరానఘ. 77

రామా ! జంబూద్వీపారణ్యమున సంచరించు ఇతర నరమృగములవలె నీవవకుందువుగాక !

అత్యల్పకాలశిశిరే కర్దమాలేపదాయిని
న మజ్జితవ్యం బన్ధురూపే మహిషేణేవ పల్వలే. 78

రామా! నీవు బంధుజనులను బురదనేలయందు, దున్నవలె కూరుకొనిపోకుము; దీన లభించు ఆనందము క్షణికము; పరిణామము కర్దమలేపనమువలె దుఃఖప్రదము.

భోగాభోగా బహిష్కార్యా ఆర్యస్యానుసరేత్పదమ్
ప్రవిచార్య మహార్థం స్వమేకమాత్మానమాశ్రయేత్. 79

విశాలములగు ఈ విషయములను త్యజింపుము. సాధుజనుల పద్ధతి ననుసరింపుము. మహార్థమును విచారించి, ఆత్మ నొక్కదానినే ఆశ్రయింపుము.

అపవిత్రస్య తుచ్ఛస్య దుర్భగస్య దురాకృతేః
దేహస్యార్థే న మజ్జితవ్యం చిన్తాచణ్డీ సుదారుణా. 80

అపవిత్రమును, తుచ్ఛమును, దుర్భగమును, దురాకృతియైనునగు శరీరముకొఱకై, విషయసుఖముల మునుగవలదు; అట, చింతయను అత్యంతకోపనయగు రాక్షసి మ్రింగ వేచియున్నది.

అన్యేన రచితో దేహో యక్షేణాన్యేన సంశ్రితః
దుఃఖమన్యస్య భోక్తాన్యశ్చిత్రేయం మౌర్ఖ్యచక్రికా. 81

ఈ శరీరము నొకడు (సంకల్పము) నిర్మించిరి, ఇంకొకడగు యక్షుడు (అహంకారము) అరుదెంచి దీని నాశ్రయించెను, మఱియొకరికి (మనస్సునకు) దుఃఖముకల్గెను, ఇంకొకడు (మనస్సు) భోగించుచున్నాడు, — ఇట్లే మూర్ఖచక్రము విచిత్రముగ ప్రవర్తిల్లుచున్నది.

శివపూజోపాఖ్యానము.

యథైకరూపా ఘనతా దృషదోఽస్త్యాత్మన స్తథా
సత్తామాత్రైకసామాన్యాదితరస్యాప్యసంభవాత్. 82

యథోపలస్య ఘనతా మానసాది తథాత్మనః
సత్తామాత్రాదభిన్నత్వాదభావాదస్య సంస్థితేః. 83
యథోపలస్యోపలతా ఘటస్య ఘటతా యథా
సత్తామాత్రాదభిన్నైవ మానసాది తథాత్మనః. 84
అత్రేమామపరాం దృష్టిం మహామోహవినాశినీమ్
శృణు యా కథితా పూర్వం మమ కైలాసకన్దరే
సంసారదుఃఖశాన్త్యర్థం దేవేనార్ధేన్దుమాలినా. 85
అస్తీన్దుకరసంభారభాసురః పారగో దివః
కైలాసో నామ శైలేన్ద్రో గౌరీరమణమన్దిరమ్. 86
తత్రాస్తే భగవాన్దేవో హరశ్చన్ద్రకలాధరః
తం పూజయన్మహాదేవం తస్మిన్నేవ గిరౌ పురా. 87
కదాచిదవసం గఙ్గాతటే విరచితాశ్రమః
తపోర్థం తాపసాచారే చిరాయ రచితస్థితిః. 88
సిద్ధసంఘాతవలితః కృతశాస్త్రార్థసంగ్రహః
పుష్పార్థం స్యూతపుటికః పుస్తకవ్యూహసంగ్రహీ. 89
ఏవంగుణవిశిష్టస్య కైలాసవనకుఞ్జకే
తపః ప్రచరతో రామ మమ కాలోఽత్యవర్తత. 90
అథైకదా కదాచిత్తు బహులస్యాష్టమే దినే
గతే శ్రావణపక్షస్య రాత్ర్యగ్రే క్షయమాగతే. 91
దిక్షు సంశాన్తరూపాసు కాష్ఠమౌనస్థితాస్వివ
ఖడ్గచ్ఛేద్యాన్ధకారేషు కుఞ్జేషు గహనేషు చ. 92
ఏతస్మిన్నన్తరే తత్ర యామార్ధే ప్రథమే గతే

శిలకు ఘనత్వముగాక వేఱొక స్వరూపము లేనట్లు ఆత్మకుఁగూడ సత్తాసామాన్యస్థితిగాక వేఱొండు స్వరూపము లేదు; సుఖదుఃఖభోగము ఆత్మకవజాలదు. పాషాణముయొక్క పాషాణత్వము, ఘటముయొక్క ఘటత్వము, వాటి సత్తనుండి అభిన్నము. అట్లే మనస్సుగూడ ఆత్మకంటె అభిన్నము. భగవంతుడగు అర్ధేందుశేఖరుడు పూర్వము కైలాసకందరమున గూర్చుండి, నిఖిలసంసారదుఃఖమును దూరమొనర్ప, ఈ విషయమున నాకు జెప్పిన మఱియొక తత్త్వదర్శనోపాయమును, నీకు జెప్పుచున్నాను, వినుము. స్వర్గమునకుఁ బైన కైలాసమను పర్వతమొకటియున్నది. ఈ పర్వతము ఏకత్రితములగు చంద్రకిరణసమూహమువలె ఉజ్జ్వలము, భగవతియగు గౌరీదేవి విహారమందిరము. అందు, అర్ధేందుశేఖరుడగు మహాదేవుడు నివాసముండును. నేనొకప్పుడు ఆయనను బూజింప, ఆపర్వతము కడకేగి, గంగాతటమున ఆశ్రమమును నిర్మించుకొని ఆయనను పూజింప నారంభించితిని. నే నచ్చట తపస్వినవగోరి, తపోనియమముల నవలంబించి చాలకాలముంటిని. అప్పుడు సిద్ధులరుదెంచి నన్ను పరివేష్టించి యుండెడివారు; వారి కడనుండి నేను శాస్త్రార్థముల సంగ్రహించెడువాడను. పుష్పముల

సంగ్రహింప పాత్రనొక్కదానిని సేకరించితిని. రామా! ఇట్లు తపమొనర్చుచు ఆ కైలాస వనపుంజముల దినముల గడుపసాగితిని. అది శ్రావణమాస కృష్ణపక్షాష్టమీ రాత్రిభాగము; కేవలము ప్రదోషకాలము గడచెను. దిక్కులు నిశ్శబ్దముగ నుండెను. జంతువుల అలజడి లేదు. అంతయు కాష్ఠమువలె నిష్పంద ముగ నుండెను. వనాంధకారము ఖడ్గచ్ఛేద్యమనిపించుచుండెను. అప్పుడు, రాత్రి ప్రథమయామార్ధ భాగము గడచెను.

సమాధిం తనుతాం నీత్వా స్థితోఽహం బాహ్యమగ్నదృక్. 93
అపశ్యం కాననే తేజో ఝటిత్యేవ సముత్థితమ్
శుభ్రాభ్రశతసంకాశం చన్ద్రబిమ్బగణోపమమ్. 94
ప్రకటీకృతదిక్కుఞ్జం తదాలోక్య మయా స్మయాత్
అన్తఃప్రకాశశాలిన్యా బహిర్దృష్ట్యావలోకితమ్. 95
యావత్పశ్యామి తం సానుం ప్రాప్తశ్చన్ద్రకలాధరః
గౌరీకరార్పితకరో నన్దిప్రోత్సారితాగ్రగః. 96
శిష్యాన్సంబోధ్య తత్రస్థాన్గృహీత్వార్ఘ్యం సుసంయతః
అగమం సుమనాస్తస్య దృష్టిపూతమహం పురః. 97
తత్ర పుష్పాఞ్జలిం దత్త్వా దూరాదేవ త్రిలోచనః
దత్తార్ఘ్యేణ మయా దేవః సంప్రణమ్యాభివన్దితః. 98
తతశ్చన్ద్రప్రభాసఖ్యా ఋజ్వ్యా శీతలయా తయా
దృశా సర్వార్తిహారిణ్యా చిరమస్మ్యస్పదీకృతః. 99
పుష్పసానూపవిష్టాయ తస్మై త్రైలోక్యసాక్షిణే
అర్ఘ్యం పుష్పం తథా పాద్యమభ్యుపేత్యార్పితం మయా. 100
మన్దారపుష్పాఞ్జలయో వికీర్ణా బహవః పురః

అప్పుడు నేను సమాధిని భంగమొనర్చి, దృష్టిని బాహ్యవిషయములవైపు మరల్చునప్పుడు గాంచిన దేమన: వనమంతయు హఠాత్తుగ తేజః పుంజముల నిండుకొనెను. ఆ తేజః పుంజము శ్వేత మేఘమువలెను, చంద్రమండలమువలెను దిక్చక్రము ప్రకాశింపజేసెను. గాఢతిమిరాచ్ఛన్నమగు ఆ యరణ్యము ప్రకాశితమయ్యెను. అప్పుడు నేను విస్మయమున, జ్ఞానదృష్టి నవలంబించి నలువైపుల గాంచితిని. భగవంతుడును, చంద్రకళాధరుడును నగు మహాదేవుడు పార్వతీదేవి హస్తముల బట్టుకొని, పర్వతసానువువైపునకు అరుదెంచుచుండెను. నంది మార్గమును జూపుచుండెను. నేను జాగ్రత్తలో లేచి, శిష్యుల సంబోధించి, అర్ఘ్యపాత్రను గైకొని, సంతుష్టచిత్తమున ఆయన దృష్టివలన పవిత్రమైన పురోభాగమున నిలచితిని. నేను దూరముననుండియే, త్రిలోచనునకు పుష్పాంజలి నర్పించి, అర్ఘ్య మొసగి, ప్రణామమొనర్చి, పదవందనము జేసితిని. ఆయన చంద్రప్రభాసదృశమగు శీతలదృష్టివలన నన్ను కృతార్థునొనర్చెను. పిదప, త్రిలోకసాక్షియగు మహాదేవుడు పుష్పసానువున నుపవిసింప, నేను అర్ఘ్యపాద్యాదుల నొసగి, పాదమూలమును మందారపుష్పములతో నభిషేకించితిని.

నానావిధైర్నమస్కారైః స్తోత్రైశ్చాభ్యర్చితః శివః. 101
తతో భగవతీ గౌరీ తాదృశ్యైవ సపర్యయా

సంపూజితా సఖీయుక్తా గణమణ్డలికా తథా. 102
పూజాన్తే పూర్ణశీతాంశురశ్మిశీతలయా గిరా
తత్రోపవిష్టం ప్రోవాచ మామర్ధేన్దుకలాధరః. 103
బ్రహ్మన్ప్రశమశాలిన్యః ప్రాప్తవిశ్రాన్తయః పరే
కచ్చిత్కల్యాణకారిణ్యః సంవిదస్తే స్థితాః పదే. 104
కచ్చిత్తపస్తే నిర్విఘ్నం కల్యాణమనువర్తతే
కచ్చిత్ప్రాప్యమనుప్రాప్తం కచ్చిచ్ఛామ్యన్తి భీతయః. 105
ఏవంవాదిని దేవేశే సర్వలోకైకకారిణి
గిరానునయశాలిన్యా మయోక్తం రఘునన్దన. 106
త్ర్యక్షానుస్మృతికల్యాణవతామిహ మహేశ్వర
న కించిదపి దుష్ప్రాపం నచ కాశ్చన భీతయః. 107
త్వదనుస్మరణానన్దపరిఘూర్ణితచేతసామ్
న తే సన్తి జగత్కోశే ప్రణమన్తి న యే పునః. 108
తే దేశాస్తే జనపదాస్తా దిశస్తే చ పర్వతాః
త్వదనుస్మరణైకాన్తధియో యత్ర స్థితా జనాః. 109
ఫలం భూతస్య పుణ్యస్య వర్తమానస్య సేచనమ్
తనోతి చైష్యతో బీజం త్వదనుస్మరణం ప్రభో. 110
జ్ఞానామృతైకకలశో ధృతిజ్యోత్స్నా నిశాకరః
అపవర్గపురద్వారం త్వదనుస్మరణం ప్రభో. 111
త్వదనుస్మరణోదారచిన్తామణిమతా మయా
సర్వాసామాపదాం మూర్ధ్ని దత్తం భూతపతే పదమ్. 112
ఇత్యుక్త్వా సుప్రసన్నం తం భగవన్తం మహేశ్వరమ్
అవోచం ప్రణతో భూత్వా యద్రామ తదిదం శృణు. 113
భగవంస్త్వత్ప్రసాదేన పూర్ణా మే సకలా దిశః
కిన్తు పృచ్ఛామి దేవేశ సందేహే తత్ర నిర్ణయమ్. 114
బ్రూహి ప్రసన్నయా బుద్ధ్యా త్యక్తోద్వేగమనాయమమ్
సర్వపాపక్షయకరం సర్వకల్యాణవర్ధనమ్. 115
దేవార్చనవిధానం తత్కీదృశం భవతి ప్రభో. 116

బహువిధములగు స్తోత్రపాఠములతోడను, నమస్కారములతోడను, యథాశాస్త్రము నే నాయనను బూజించితిని. అనంతరము, మాతృకామండలసమన్వితయును, సఖీసహితయునునగు గౌరీదేవినిగూడ అట్లే అర్చించితిని. ఇట్లు, వారినర్చింప, నా యంతఃకరణము పూర్ణచంద్రునివలె సుశీతల మయ్యెను. వారి ముందరగూర్చుండ, చంద్రశేఖరుడు సుశీతలవచనముల నన్నిట్లు ప్రశ్నించెను -

"బ్రహ్మజ్ఞా! నీ చిత్తవృత్తి ప్రశాంతినంది పరమపదమున విశ్రాంతినంది మంగళమయమైనదా? నీ తపస్సు నిర్విఘ్నముగ శుభమునుగూర్చుచున్నదా? నీ భీతి తొలగినదా?" రఘునందనా! సర్వలోకాధీశ్వరుడును, దేవేశ్వరుడుననగు భవానీపతి నన్నిట్లు ప్రశ్నింప, నేను వినయముతో నిట్లు నుడివితిని:—" "మహేశ్వరా! త్రిలోచనా! నీ స్మరణమను మంగళకృత్యమున నిరతులైనవారికి, దుష్ప్రాప్యమగునదేమియునులేదు; వారికెచ్చటను భీతిలేదు. నీ యనుస్మరణానందమున విలోలమగు చిత్తమున వెలయువారికి ప్రణమిల్లని ప్రాణి, ఈ జగత్త్రయమునలేదు. ఎచ్చట మానవులు నీ స్మరణయందు నిరతులో, అదియే దేశము, అదియే జనపదము, అదియే పర్వతము. ప్రభో! నీ స్మరణ పూర్వపుణ్య – ఫలము, వర్తమానపుణ్యకర్మల – అభివర్ధకము, భవిష్యత్ – సుఖవృక్షబీజము. నీ యనుస్మరణ జ్ఞానసుధాకలశము, ధైర్యచంద్రికకాధారమగు చంద్రమ, మోక్షపురీ – ద్వారపాలకుడు. భూతపతీ! నీ యనుస్మరణ – చింతామణీబలమున నే నాపదలనన్నింటిని అణగద్రొక్కితిని." అని నుడివి సుప్రసన్నుడగు మహేశ్వరునకు ప్రణమిల్లి, మరల వచించినదానిని వినుము. "భగవంతుడా! మీ దయవలన నాకు దిక్కులన్నియును పూర్ణములు (అనగా, వాట బొందవలసిన దేమియునులేదు). కాని, దేవేశా! సంశయమొకటియున్నది. దాని నడుగుచున్నాను. మీరు ప్రసన్నులై దానిని దీర్చుడు. ప్రభూ! ఉద్విగ్నరహితమును, పాపక్షయకరమును, సర్వకల్యాణవర్ధనముననగు దేవార్చనావిధానముయొక్క స్వరూపమెట్టిది? – ఉపదేశింపుడు.

ఈశ్వర ఉవాచ :—

శృణు బ్రహ్మవిదాం శ్రేష్ఠ దేవార్చనముత్తమమ్
వదామి ముచ్యతే యేన కృతేన సకృదేవ హి. 117

కచ్చిద్వేత్సి మహాబాహో దేవః కః స్యాదితి ద్విజ
న దేవః పుణ్డరీకాక్షో నచ దేవస్త్రిలోచనః. 118

న దేవః కమలోద్భూతో న దేవస్త్రిదశేశ్వరః
న దేవః పవనో నార్కో నానలో న నిశాకరః. 119

న బ్రాహ్మణో నా౽వనిపో నాహం న త్వం ద్విజోత్తమ
న దేవో దేహరూపో హి న దేవశ్చిత్తరూపధృక్. 120

న దేవః కమలారూపీ నాపి దేవో భవేన్మతిః
అకృత్రిమమనాద్యన్తం దేవనం దేవ ఉచ్యతే. 121

ఈశ్వరుడు:— బ్రహ్మజ్ఞశ్రేష్ఠా! ఏ దేవార్చనమును ఒక్కమారు ఆచరించిన మనుష్యుడు ముక్తినందునో, దానిని జెప్పుచున్నాను, వినుము. మహాబాహో! ద్విజా! నీవే దేవతయొక్క అర్చనను అడుగుచున్నావో, ఆ దేవత ఎవరు? అతనిని నీవెఱుగుదువా? అతడు పుండరీకాక్షుడుగాడు, త్రిలోచనుడుగాడు, కమలయోనిగాడు, వాయువుగాడు, సూర్యచంద్రులుగారు, అనలానిలులుగారు, బ్రహ్మక్షత్రియులుగారు, ద్విజోత్తమా! మనమిర్వురమును గాము, దేహచిత్తరూపముల నొప్పువారెవ్వరునుగారు, దేవతలుగారు, లక్ష్మి, మేధలుకూడగారు. అకృత్రిమమును, అనాద్యమును, నిరతిశయానందమునునగు సంవిత్స్వరూపమే దేవతయని చెప్పఁబడుచున్నది.

ఆకారాదిపరిచ్ఛిన్నే మితే వస్తుని తత్కుతః
అకృత్రిమమనాద్యన్తం దేవనం చిచ్ఛివం విదుః. 122
తదేవ దేవశబ్దేన కథ్యతే తత్ప్రపూజయేత్
తదేవాస్తి యతః సర్వం సత్తాసత్తాత్మరూపధృక్. 123
అజ్ఞాతశివతత్త్వానామాకారాద్యర్చనం కృతమ్
యోజనాధ్వన్యశక్తస్య క్రోశాధ్వా పరికల్ప్యతే. 124
ఇయత్తాదిపరిచ్ఛిన్నం రుద్రాదేః ప్రాప్యతే ఫలమ్
అకృత్రిమమనాద్యన్తం ఫలమానన్ద ఆత్మనః. 125

ఆకారాది పరిచ్ఛిన్నమగు పరిమితవస్తువున దేవభావమెట్లు సంభవింపగలదు? దేవతయన, క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న, కాంతి, గతులను దశవిధకార్యముల నొనర్పగలవాడు; ఇవన్నియును మాయవలన నొక్క బ్రహ్మమునందే సంభవించుచున్నవి. నేను పేర్కొనినవానియందు ఇవన్నియును సంసంభవించుటలేదు. వారు దేవతలెట్లు అవగలరు? అకృత్రిమమును, అనాద్యనంతమును నగు చైతన్యమునే బుధులు దేవుడని ఎఱుంగుదురు. ఆ చైతన్యమే దేవశబ్దవాచ్యమై లోకపూజార్హమగుచున్నది. అతడొక్కడే వాస్తవమగు సత్తతో నొప్పారుచున్నాడు; తదితరములన్నియును, ఆత్మస్వరూపమున విరాజిల్లుచున్నవి. ఈ మంగళమయతత్త్వమును గ్రహింపజాలనివారికొఱకే, పరిచ్ఛిన్నమగు కల్పితదేవతయొక్క అర్చన విధింపబడినది. యోజనము దూరమరుగజాలనివానికొఱకే, క్రోశమని విభజించి చెప్పబడుచున్నది. రుద్రాది దేవతల ఉపాసనవలన లభించు ఫలము పరిచ్ఛిన్నము, పరిగణింప శక్యము. కాని, అపరిచ్ఛిన్నాత్మదేవోపాసనవలన లభించు ఆనందఫలము అకృత్రిమము, అనాది, అనంతము, శాశ్వతము.

అకృత్రిమఫలం త్యక్త్వా యః కృత్రిమఫలం వ్రజేత్
త్యక్త్వా మన్దారవనం కారఞ్జం యాతి కాననమ్. 126

అకృత్రిమఫలమును బరిత్యజించి, కృత్రిమఫలమును బొందగోరువాడు, మందారకాననమును బరిత్యజించి కరంజకాననమును బ్రవేశించుచున్నాడు.

బోధః సామ్యం శమ ఇతి పుష్పాణ్యగ్రాణి తత్ర చ
శివం చిన్మాత్రమమలం పూజ్యం పూజ్యవిదో విదుః. 127

పూజ్యవిషయమును జక్కగ గ్రహించినవారు, నిర్మలుడును, మంగళమయుడును, చిన్మాత్రస్వరూపునే అర్చించుచున్నారు. బోధ, సమత్వము, శాంతి అనునవియే వారి ప్రధానపూజా పుష్పములు.

శమబోధాదిభిః పుష్పైర్దేవ ఆత్మా యదర్చ్యతే
తత్తు దేవార్చనం విద్ధి నాకారార్చనమర్చనమ్. 128

ఈ పుష్పత్రయమున నాత్మదేవుని అర్చించుటయే దేవార్చన; ఆకారార్చనము అర్చనముకాదు.

ఆత్మసంవిత్తిరూపం తు త్యక్త్వా దేవార్చనం జనాః
కృత్రిమార్చాసు యే సక్తాశ్చిరం క్లేశం భజన్తి తే. 129

ఆత్మచైతన్యోపాసనారూపమగు దేవార్చనమును బరిత్యజించి, కృత్రిమదేవార్చనమునరతులగువారు చిరకాలము క్లేశముల ననుభవింతురు.

జ్ఞాతజ్ఞేయా హి యే సన్తో బాలక్రీడోపమం చ తే
ఆత్మధ్యానాదృతే బ్రహ్మానుకుర్వన్తో దేవపూజనమ్. 130

బ్రహ్మజ్ఞ! తత్త్వమును గ్రహించి, సమాధినుండి లేచి సాకారము నర్చించువారు, కృత్రిమ భోగముల నాశింపరు. వారి పూజ బాలుని క్రీడవంటిది.

ఆత్మైవ దేవో భగవాఞ్ఛివః పరమకారణమ్
జ్ఞానార్చనేనావిరతం పూజనీయః స సర్వదా. 131

మంగళమయుడును, పరమకారణుడును నగు ఆత్మయే దేవత. ఇతనిని అనవరతము జ్ఞానార్చనమువలన పూజింపనగును.

త్వమేతచ్చేతనాకాశమాత్మానం జీవమవ్యయమ్
స్వభావం విద్ధి న త్వన్యః పూజ్యః పూజాత్మపూజనమ్. 132

నీవు, జీవభావమునందిన ఈ అవ్యయచిదాకాశమునే బ్రహ్మమని గ్రహింపుము; ఈయన గాక మఱి పూజ్యులెవ్వరును లేరు. ఈ ఆత్మపూజయే ముఖ్యపూజ.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

చేతనాకాశమాత్రాత్మ యథా జగదిదం ప్రభో
యథా తచ్చేతనస్యైవ జీవాదిత్వం తదుచ్యతామ్ 133

శ్రీవసిష్ఠుడు:- ప్రభూ! చిదాకాశరూపియగు ఆత్మ జగద్భావమునందిన రీతిని, జీవభావమునందిన క్రమమును నాకు దెలియజెప్పుము.

ఈశ్వర ఉవాచ :—

చిద్వ్యోమైవ కిలాస్తీహ పారావారవివర్జితమ్
సర్వత్రాసంభవచ్చేత్యం యత్కల్పాన్తేఽవశిష్యతే. 134

ఈశ్వరుడు:- పారావారవర్జితమగు చిదాకాశమొకటి వెలయుచున్నది. దాని పుట్టుక, లేక పరిణామము అసంభవము. అదియే కల్పాంతమునగూడ మిగులుచున్నది.

యద్వత్స్వయం ప్రకచతి తస్య స్వకచనస్య తు
స్వయం యత్స్పన్దితం నామ తేనేదం జగదిత్యలమ్. 135

సూర్యచంద్రుల ప్రకాశము స్వయముగనే బహుళమై, నలుదిక్కులపడి స్పందించిన, నయ్యది యే నీలపీతాదిరూపప్రసిద్ధిని జెందునట్లు, అపరిచ్ఛిన్నచిదాకాశము మాయికమార్గమున స్పందింప, జగద్రూపమున బ్రసిద్ధిని బొందుచున్నది.

ఇత్యేవం స్వప్నపురవజ్జగద్భాతి చిదాత్మకమ్
ఏవం చిద్వ్యోమమాత్రాత్మ జగదచ్ఛం న భిత్తిమత్. 136

ఇట్లు స్వప్నపురివలె నవభాసించు ఈ జగత్తు భ్రాంతివశమున చిద్రూపమున ప్రభాతితమగుచున్నది. విచారించిచూచిన, ఇది అమూలకము అని తెలియగలము. కేవలము నిర్మలమగు ఆత్మ యొక్కటియే అగుపడును.

అత్యన్తాసంభవాచ్చేత్యం దృశ్యం చిద్వ్యోమమాత్రకమ్
చిత్త్వాత్కచతి సర్గాదౌ యత్తజ్జగదితి స్మృతమ్. 137

చైతన్యమే జీవరూపమును ధరించి, మరల తన స్వరూపమును గాంచుచున్నదనిగూడ తలంపవీలులేదు. అపరిణామియు, అద్వయమునునగు వస్తువు స్వభావమును వీడి, అస్వభావమును బొందజాలదు. మాయావరణవలననే నయ్యది జగత్తువలె తోచుచున్నది

తస్మాత్స్వప్నపురాకారం యదిదం భాసతే జగత్
తత్ర చిద్వ్యోమమాత్రాత్మన్యన్యతా నామ కా కుతః. 138

అందువలన స్వప్నపురివలె తోచు ఈ జగత్తు వాస్తవమునను, అపరిణామియగు చిదాకాశమే! ఇందన్యభావమెట్లు రాగలదు ?

చిన్మాత్రమేవ గిరయశ్చిన్మాత్రం జగదమ్బరమ్
చిన్మాత్రమాత్మా జీవశ్చ చిన్మాత్రం భూతసంతతిః. 139

పర్వతములు, జగత్తులు, ఆత్మ, జీవుడు, పంచభూతములు మున్నగు భేదవికారమంతయు చిన్మాత్రమేయని గ్రహింపుము.

చిద్వ్యోమమాత్రాదితరత్సర్గాదా సర్వవేదనే
భిన్నం స్వర్గే పురే వాపి కిం సంభవతి కథ్యతామ్. 140

సృష్ట్యాదియందు నీవు స్వర్గమర్త్యపాతాళముల గావించి, చైతన్యముగాక మరేమైనయున్నదేమో, వెతకి చెప్పుము.

ఆకాశం పరమాకాశం బ్రహ్మాకాశం జగచ్చితిః
ఇతి పర్యాయనామాని తత్ర పాదపవృక్షవత్. 141

ఆకాశము, పరమాకాశము, బ్రహ్మాకాశము, జగత్తు, చిత్తు అనునవి, వృక్షము - పాదపముల వలె పర్యాయశబ్దములు.

ఏవం ద్వా స్వప్నసంకల్పమాయాభిః స్వానుభూయతే
తదా కిల చిదాకాశమేవ భాతి జగత్తయా. 142

స్వప్నమున, లేక మాయవలన ననుభవింపబడు ద్వైతజగత్తును తత్త్వదృష్టితో బరికించిన, చిదాకాశమే ద్వైతజగద్రూపమున ప్రతిభాతమగుచున్నదని తెలియగలము.

యథైతత్సంవిదాకాశం స్వప్నే భాతి జగద్వపుః
తదేదం జాగ్రదాఖ్యేఽపి స్వప్నే భాతి తదేవ నః. 143

ఈ చిదాకాశము, స్వప్నమున జగదాకారమున గోచరించునట్లు, ఈ జాగ్రత్ - స్వప్నమున గూడ, గోచరించుచున్నది.

యథా స్వప్నపురే చిత్తం వర్జయిత్వేతరత్క్వచిత్
న కించిత్సంభవత్యేవం జాగ్రత్యేవం మహాచితః. 144

స్వప్న - పురియందు చిదాకాశమును దీసివైచిన మరేమియును మిగులనట్లు, జాగ్రదవస్థయందుగూడ చిదాకాశమును దొలగించిన మరేమియును మిగులదు,

యతో న సంభవత్యన్యచ్చేత్సం కించిత్తతోఽఖిలమ్
చిత్తం సంచేత్యమప్యేతదచేత్యం సజ్జగత్స్థితమ్. 145

కనుక, చిదాకాశములేనిదే మరేమియు జరుగదని గ్రహింపవలెను. అందువలన, ఈ గజత్తంతయు చిన్మాత్ర - బ్రహ్మమే.

పరమాకాశకలనం త్రిజగత్స్వయముత్థితమ్
స్వప్నవద్విద్ధి చిద్వ్యోమ్ని న ద్వైతద్వైతవత్స్థితమ్. 146

పరమాకాశమునుండియే సంకల్పమువలన ఈ జగత్తులులేచి, ఆబ్రహ్మమును ద్వైతతరూపమున గోచరింపజేయుచున్నవి. అందువలన, నీవీ జగద్రూపమును చిదాకాశమున నుదయించిన అలీక - స్వప్నమని గ్రహింపుము.

యథా చిద్వ్యోమమాత్రాత్మ స్వప్నే ఘటపటాదికమ్
సర్గాదావేవ సర్గోఽయం తథా చిద్వ్యోమమాత్రకమ్. 147

స్వప్నదృష్టములగు ఘటపటాదులు చిదాకాశరూపమగు ఆత్మయైనట్లే, ఈ సృష్టి, ఘటపటాదులుగూడ చైతన్య - మాత్రములగుట తథ్యమని గ్రహింపుము.

శుద్ధసంవిత్తిమాత్రత్వాదృతేఽన్యత్స్వప్నపత్తనే
యథా న విద్యతే కించిత్తథాస్మిన్భువనత్రయే. 148

స్వప్నపట్టణమున శుద్ధజ్ఞానముగాక మఱొండు లేనట్లు, ఈ జగత్త్రయమునగూడ శుద్ధ - చైతన్యముగాక మఱొండు లేదు.

యాః కాశ్చన దృశో యే యే భావాభావాస్త్రికాలగాః
సదేశకాలచిత్తాస్తత్సర్వం చిద్వ్యోమమాత్రకమ్. 149

ప్రతి సృష్టివిశేషము, త్రికాలగతమగు భావాభావ పదార్థములు, దేశకాలములు, చిత్తము మున్నగునవన్నియును చైతన్య - మాత్రములే.

స ఏష దేవః కథితో యః పరః పరమార్థతః
య స్త్వం సోఽహమశేషం వా జగదేవ చ యోఽఖిలః. 150

పరమార్థసత్యముగ నిర్దేశింపబడిన వస్తువే, 'త్వం' రూపియును, 'అహం' రూపియును, జగద్రూపియును నైయున్నాడు. ఇతడే పరమ - పూజ్యమగు దేవత.

సర్వస్య వస్తుజాతస్య జగతోఽన్యస్య తే మమ
దేహో హి చేతనాకాశం పరమాత్మైవ నేతరత్. 151

ఈ చిదాకాశరూపియగు పరమాత్మయే నీయొక్కయు, నాయొక్కయు, ఇతరులయొక్కయు, జగత్తుయొక్కయు, నిఖిలవస్తువులయొక్కయు దేహ (పరమార్థ) స్వరూపము; అతనిని విడచిన, వీటికి స్వరూపమేయుండదు.

సంకల్పనే స్వప్నపురే శరీరం
చిద్వ్యోమతోఽన్యన్న యథాస్తి కించిత్
తథేహ సర్గే ప్రథమైకసర్గా
న్మనే ప్రభృత్యస్తి న రూపమన్యత్. 152

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జగతః పరమాత్మమయత్వవర్ణనం నామ ఏకోనత్రింశః సర్గః ॥ 29 ॥

మునీ! సంకల్పితమగు స్వప్నపురికి చిదాకాశముగాక వేఱొండు స్వరూపములేనట్లు, సృష్టాదినుండి ఇంతవఱకు వచ్చిన వస్తుజాలములకు చిదాకాశముగాక వేఱొండురూపములేదు.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున జగత్పరమాత్మమయత్వవర్ణనమను ఏకోనత్రింశత్తమ సర్గము ॥ 29 ॥

---

## త్రింశః సర్గః.

[చిత్తః సర్వాత్మతా సర్వభోక్తృభావేన సంస్థితిః
యథా జీవదశాం ప్రాప్తా చిత్తచ్చాప్యత్ర వర్ణ్యతే.

చిత్తుయొక్క సర్వరూపత్వ, సర్వభోక్తృభావముల స్థితి, ఆ చిత్తు జీవదశ నెట్లు బొందినదియు నిందు వర్ణింపబడినది.]

ఈశ్వర ఉవాచ:—

ఏవం సర్వమిదం విశ్వం పరమాత్మైవ కేవలమ్
బ్రహ్మైవ పరమాకాశమేష దేవః పరః స్మృతః. 1

ఈశ్వరుడు:— ఇట్టీ విశ్వమంతయును కేవలపరమాత్మస్వరూపమై వెలయుచున్నది. మఱియు, పరమాకాశరూపియగు బ్రహ్మమే పరమదైవమని చెప్పబడుచున్నాడు.

తదేతత్పూజనం శ్రేయస్తస్మాత్సర్వమవాప్యతే
తదేవ సర్గభూః సర్వమిదం తస్మిన్వ్యవస్థితమ్. 2

ఈ దేవతయొక్క పూజయొక్కటియే మంగళకరము; దీనివలననే అన్నియును లభింపగలవు. ఈ దేవతయే అన్నిటికిని ఆధారభూతమై వెలుగుచున్నది.

అకృత్రిమమనాద్యన్తమద్వితీయమఖణ్డితమ్
అబహిః సాధనాసాధ్యం సుఖం తస్మాదవాప్యతే. 3

ఈ దేవతాపూజవలన కలుగు సుఖము, బహిఃసాధనానిరపేక్షము. ఈ సుఖమునుబోలు సుఖము మఱియొక్కటిలేదు. ఈ సుఖమునకు దెంపులేదు.

ప్రబుద్ధస్త్వం మునిశ్రేష్ఠ తేనేదం తవ కథ్యతే
నాతిదేవార్చనే యోగ్యః పుష్పధూపచయో మహాన్. 4

మునిశ్రేష్ఠా! నీవు ప్రబుద్ధుడవై తత్త్వజ్ఞానమును బొందితివి; అందువలననే నేను నీకీ విషయమును జెప్పుచున్నాడను. ఈ పరదేవతను బూజించుటకు పుష్పధూపముల ప్రయోజనము లేదు.

అవ్యుత్పన్నధియో యే హి బాలపేలవచేతసః
కృత్రిమార్చామయం తేషాం దేవార్చనముదాహృతమ్. 5

అవ్యుత్పన్నబుద్ధులును, బాలునివలె కోమలచిత్తులును, అతత్త్వజ్ఞులును నగు వారికొఱకే కృత్రిమ - దేవార్చన విధింపబడినది.

శమబోధాద్యభావే హి పుష్పాద్యైరార్చయన్తి హి
మిథ్యైవ కల్పితైరేవమాకారే కల్పితాత్మకే. 6

తత్త్వజ్ఞానము, శమదమాది గుణసంపత్తి లేకున్ననే జనులు మిథ్యాకల్పితములగు పుష్పధూపముల సేకరించి, మూర్తికల్పన నొనరించి, దేవతార్చన నొనర్చుచున్నారు.

స్వసంకల్పకృతైః కృత్వా క్రమైరర్చనమాదృతాః
బాలాః సంతోషమాయాన్తి పుష్పధూపలవార్చనైః. 7

స్వకల్పితములగు పుష్పధూపాది ఉపాయములతో నాదరపూర్వకముగ పూజనుసల్పి, మూఢులే సంతోషము నందుచున్నారు.

ససంకల్పకృతైరర్థైః కృత్వా దేవార్చనం ముధా
యతఃకుతశ్చిన్మిథ్యాత్మ ఫలమాత్రం నియన్తి తే. 8

వారు నిజకల్పితములగు వస్తువుల వ్యర్థమగు దేవార్చనను సల్పి, స్వప్నప్రాయములగు మిథ్యాస్వర్గాది ఫలముల బొందుచున్నారు.

పుష్పధూపార్చనం బ్రహ్మన్కల్పితం బాలబుద్ధిషు
యత్స్వాద్భవాదృశాం యోగ్యమర్చనం తద్వదామ్యహమ్. 9

బ్రహ్మజ్ఞా! ఈ పుష్పధూపాదిపూజ, బాలకల్పితమగుపూజ; మిమ్ముబోలినవారికిఁదగిన పూజను జెప్పుచున్నాడను. వినుము.

అస్మదాదిస్త్వసా కశ్చిద్దేవో మతిమతాంవర
దేవస్త్రిభువనాధారః పరమాత్మైవ నేతరత్. 10

జ్ఞానిశ్రేష్ఠ! ఏ దేవుని కథను జెప్పఁచున్నాడనో, అతడు మాకుగూడ అది; ఆయన త్రిభువనముల కాధారమగు పరమాత్మకంటె అన్యుడుకాడు. (పరమాత్మయే!)

శివః సర్వపదాతీతః సర్వసంకల్పనాతిగః
సర్వసంకల్పవలితో న సర్వో న చ సర్వకః. 11

ఆయన బ్రహ్మవిష్ణురుద్రాది పదములకంటెగూడ నతీతుడు; సర్వసంకల్పాతీతుడు; సర్వసంకల్పాధారుడు; మంగళమయుడు. ఆయన సర్వమునునై, సర్వమును గాకున్నాడు

దిక్కాలాద్యనవచ్ఛిన్నః సర్వారమ్భప్రకాశకృత్
చిన్మాత్రమూర్తిరమలో దేవ ఇత్యుచ్యతే మునే. 12

ఆయన దిక్కాలాద్యనవచ్ఛిన్నుడు; సర్వకార్యముల ప్రకాశింపజేయుచున్నాడు; మునీ! ఈ నిర్మల - చిన్మాత్రమూర్తియే దేవశబ్దమునఁ జెప్పఁబడుచున్నాడు.

సంవిత్సర్వకలాతీతా సర్వభావాన్తరస్థితా
సర్వసత్తాప్రదా దేవీ సర్వసత్తాపహారిణీ. 13

ఈ చైతన్యము, సర్వఫలాతీతము, మఱియు నన్నిటవెలయుచున్నది. అన్నిటికిని సత్తనొసంగుచు, హరించుచున్నది.

బ్రహ్మ బ్రహ్మన్సదసతోర్మధ్యం తద్దేవ ఉచ్యతే
పరమాత్మపరాభిఖ్యం తత్సదోమిత్యుదాహృతమ్. 14

బ్రహ్మజ్ఞా! భావాభావముల మధ్యవెలయు బ్రహ్మమే దేవుడని చెప్పబడుచున్నాడు. పరమాత్మాభిధేయమగు ఈ వస్తువే 'ఓంతత్సత్' అని గూడచెప్పబడుచున్నది. *

* ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణః — గీతా. 17-23.

మహాసత్తాస్వభావేన సర్వత్ర సమతాం గతమ్
మహాచిదితి సంప్రోక్తం పరమార్థ ఇతి శ్రుతమ్. 15

ఈ ఆత్మ మహాసత్తాస్వభావమున సర్వత్ర సముడై వెలయుచున్నాడు; మఱియు, మహాచిత్, పరమార్థశబ్దములగూడ జెప్పబడుచున్నాడు.

స్థితం సర్వత్ర సర్వం తు లతాస్వన్తర్యథా రసః
సత్తాసామాన్యరూపేణ మహాసత్తాత్మనాపి చ. 16

లతయందు రసము వెలయునట్లు, ఈ చిత్తత్వము సత్తాసామాన్యరూపమునను, మహాసత్తారూపమునను సర్వత్ర అనుస్యూతమై వెలయుచున్నది.

యచ్చిత్తత్త్వమరున్ధత్యాం యచ్చిత్తత్త్వం తవానఘ
యచ్చిత్తత్త్వం చ పార్వత్యాం యచ్చిత్తత్త్వం గణేషు చ. 17
చిత్తత్త్వం యన్మమేదం చ చిత్తత్త్వం యజ్జగత్రయే
తద్దేవ ఇతి తత్త్వజ్ఞా విదురుత్తమబుద్ధయః. 18

అనఘా ! నీయందున, అరుంధతియందు, పార్వతియందు, నా గణములయందు, నాయందు, ఈ జగత్తునందంతటను వెలయు చిత్తత్వమునే, ఉత్తమబుద్ధులగు తత్త్వవేత్తలు దేవుడని నిర్దేశించుచున్నారు.

పాదపాణ్యాదిమానన్యో యో వా దేవః ప్రకల్ప్యతే
సంవిన్మాత్రాదృతే బ్రహ్మన్కిం సారః కిల కథ్యతామ్. 19

బ్రహ్మజ్ఞా ! హస్తపాదాదులతోగూడిన జీవుని దేవుడని కల్పించుచున్నారు. అందు, చిత్తత్వముగాక సారమేమున్నదో వచింపుము.

చిన్మాత్రమేవ సంసారసారః సకలసారతామ్
గతః స దేవః సర్వోఽహం తస్మాత్సర్వమవాప్యతే. 20

ఈ చిత్తత్వమే సంసారముయొక్క సారము, అన్నిటియొక్కయును సారమైయున్నది. ఈ చిత్తత్వమే సర్వమయుడగు దేవత; 'అహం' రూపియగు ఈ చితత్త్వమునుండియే అన్నియును లభింపగలవు.

న స దూరే స్థితో బ్రహ్మన్న దుష్ప్రాపః స కస్యచిత్
సంస్థితః స సదా దేహే సర్వత్రైవ చ ఖే తథా. 21

బ్రహ్మజ్ఞా ! ఈ చిత్తత్వము దూరమునలేదు. దుష్ప్రాప్య - వస్తువుగాదు. సర్వదా దేహమునందే విరాజిల్లుచున్నది; ఆకాశమునగూడ వెలయుచున్నది.

స కరోతి స చాశ్నాతి స బిభర్తి ప్రయాతి చ
స నిఃశ్వసతి సంవేత్తా సోఽఙ్గాన్యఙ్గాని వేత్తి చ. 22

ఈ చిత్తత్వమే ఈ కార్యముల నన్నిటిని ఒనర్చుచున్నది; భోజన, పాలన, గమన, నిశ్వసన, జ్ఞానాది కృత్యముల నొనరించుచున్నది.

సోఽస్యాం విచిత్రచేష్టాయాం ప్రకాశిన్యాం చ తద్వశామ్
తత్స్వరూపనిబద్ధాయాం పుర్యామాస్తే మునీశ్వర. 23

మునీశ్వరా! విచిత్రచేష్టాయుక్తమును, ప్రకాశమంతమును నగు ఈ దేహపురి, అతని స్వరూపమువలన నిలబడియున్నది; అతడిందు నివసించుచున్నాడు.

శరీరావసథాయాం చ చలాయాం తత్ప్రసాదతః
సోఽస్యాం గహనకోశాయాం హృద్గుహాయాం గుహేశ్వరః 24

ఆయన, శరీరగుహాగహనమును, పంచకోశసమన్వితమును నగు బుద్ధిగుహయందు గుహేశ్వరుడై వెలయుచున్నాడు.

మనఃషష్ఠేన్ద్రియాచారసత్తాతీతామలాత్మనః
తస్య సంవ్యవహారార్థం సంజ్ఞా చిదితి కల్పితా. 25

శిష్యోపదేశార్థమై, అతనికి షష్ఠేంద్రియమగు మనస్సునకుఁగూడ అతీతమగు నిర్మల - చిత్ అను సంజ్ఞయొసఁగబడినది.

స ఏష చిన్మయః సూక్ష్మః సర్వవ్యాపీ నిరఞ్జనః
ఇమం భాస్వరమాభాసం కరోతి న కరోతి చ. 26

అతడు చిన్మయుడు, సూక్ష్ముడు, సర్వవ్యాపి, నిర్లేపుడు. అతడే ఈ రూపములనన్నిటిని ప్రకాశింపజేయుచున్నాడు; మరయు, ప్రకాశింపజేయకున్నాడు.

సా చిదత్యన్తవిమలా జగదర్థం జగత్క్రియామ్
ఇమాం రఞ్జయతి ప్రాజ్ఞ రసేనేవ మధుర్లతామ్. 27

ప్రాజ్ఞుడా! అత్యంతనిర్మలస్వరూపమగు ఆ చిద్వస్తువే, వసంతము రసమునొసగి తరువుల రంజింపఁజేయునట్లు, జగత్సిద్ధికై ఈ జగత్క్రియలనన్నిటిని ఒనర్చుచున్నది.

చారవో యే చమత్కారాశ్చితశ్చితి యథాస్థితమ్
చమత్కుర్వన్తి కిల తే తేన కేచిన్నభోభిధాః. 28

దీనియందున్న చైతన్యస్ఫూర్తియను సుందరమగు శక్తి బయటకు వెలువడి, నానావిధ నామరూపభేదముల నొనర్చుచున్నది.

కేచిజ్జీవాభిధానాశ్చ కేచిచ్చిత్తాభిధానకాః
కేచిత్కలాభిధానాశ్చ కేచిద్దేశాభిధానకాః. 29

కేచిత్క్రియాభిధానాశ్చ కేచిద్ద్రవ్యాభిధానకాః
కేచిద్భావవికారాదిజాత్యోచిత్యాభిధానకాః. 30

ప్రకాశాభిధానాః కేచిత్కేచిచ్ఛైలతమోభిధాః
అర్కేన్ద్రాద్యభిధాః కేచిత్కేచిద్యత్వాభిధానకాః. 31

ఈ నామ - రూపభేదములలో నొకదానిపేరు ఆకాశము, మఱియొకదానిపేరు జీవుడు ఇంకొకదానిపేరు చిత్తు; ఇట్లే దానికి మఱి కలా, చిత్తము, క్రియ, ద్రవ్యము, అను పేర్లున్నవి.

యోగ్యతావైచిత్ర్యముల ననుసరించి, భావము, వికారము, ప్రకాశము, శైలము, తమస్సు, చంద్రుడు, ఇంద్రుడు, యక్షుడు, మున్నగు పేర్లు కలుగుచున్నవి.

నిరిచ్ఛస్వస్వభావేన వసన్తేన యథాఙ్కురః.
తన్యతే తద్వదేవేయం జగలక్ష్మీశ్చిదాత్మనా. 32

వసంతఋతువు నిరిచ్ఛాస్వభావకమైనను, అంకురోత్పాదనమొనర్చునట్లు, ఈ చిదాత్మ గూడ జగల్లక్ష్మిని విస్తరింపజేయుచున్నాడు,

చిదేవాసు సమగ్రాసు సర్వదై వైకికైవ హి
త్రైలోక్యామ్భోధిసంస్థాసు శరీరజలజాలికా. 33

త్రిలోక - సాగరముల యథార్థస్థితి నన్వేషించిచూడ, ఒక చిత్ - జలములు మాత్రమే యగుపడగలవు; ఇవియే దాని శరీరము.

శరీరపఙ్కజభ్రాన్తమనోభ్రమరసంభృతామ్
ఆస్వాదయతి సంకల్పమధుసత్తాం చిదీశ్వరీ. 34

చిద్రూపిణియగు ఈశ్వరి శరీర - పంకజవనమున పరిభ్రమించు చిత్తభ్రమరసంచితమగు సంకల్ప - మధువు నాస్వాదించుచున్నది.

ససురాసురగన్ధర్వం సశైలార్ణవకం జగత్
చితి స్థితం ప్రవహతి జలావర్తే జలం యథా. 35

సురాసుర గంధర్వ శైలసాగర సమన్వితమగు ఈ జగత్తు, సుడిగుండమునందలి నీటివలె, చిత్సత్తయందుండియే ప్రవహించుచున్నది.

బన్ధచిత్తమయాచారచారుచఞ్చురచక్రికమ్
సంసారచక్రం చిచ్చక్రే భ్రామ్యతి భ్రమభాజనమ్. 36

భ్రమనుగూర్చు ఈ సంసారచక్రము చిచ్చక్రమునబడి తిరుగుచున్నది బంధహేతువులును, చిత్తమయములునగు కర్తృత్వభోక్తృత్వ వ్యవహారములే ఈ సంసారచక్రముయొక్క సంచలనములు.

చిచ్చతుర్భుజరూపేణ జఘానాసురమణ్డలమ్
కాలే జలదఖణ్డేన సాయుధేన యథాఽఽతపమ్. 37

వర్షఋతువు ఇంద్రధనుస్సు, వజ్రయుక్తమగు మేఘశకలమునుబూని సూర్యాతపమును బోనడచునట్లు, ఈ చైతన్యమే చతుర్భుజ - విష్ణురూపమును ధరించి శార్ఙ్గగదాద్యాయుధముల ధరించి అసురుల వధించుచున్నది.

చిత్త్రినేత్రతయా బ్రహ్మన్వృషశీతాంశుచిహ్నయా
గౌరీకమలినీవక్త్రపద్మషట్పదతాం గతా. 38

బ్రహ్మజ్ఞా! ఈ చైతన్యమే, వృషభవాహనుడును, త్రినేత్రుడును, చంద్రశేఖరుడును నగు రుద్రరూపమున, గౌరీ ముఖ - కమల - భృంగమగుచున్నది.

విష్ణోః పద్మాలితామేత్య చిద్ధ్యానాధీనమానసా
త్రయీనలిన్యాః సరసీం ధత్తే పైతామహీం స్థితిమ్. 39

ఈ చైతన్యమే చిద్ధ్యానమొనర్చుచు, విష్ణు - నాభీకమల - భ్రమరమై, వేదపద్మముల కాకరమగు మహాసరోవరరూపమగు బ్రహ్మ - శరీరమును దాల్చుచున్నది.

చితో బ్రహ్మన్విచిత్రాణీ శరీరాణిహ భూరిశః
పత్రాణీవ తరో ర్హేమ్ని కేయూరాదిక్రియేవ చ. 40.

బ్రహ్మజ్ఞా! ఈ చిత్తునకు, వృక్షమున కనేక పర్ణములును, హేమమునకు కేయూరాది వికారములును ఉన్నట్లు, పెక్కు శరీరములున్నవి.

చిత్సమస్తసురానీకపరివన్దితపాదయా
త్రైలోక్యచూడామణితాం ధత్తే వాసవలీలయా. 41

ఈ చిత్తే, సమస్తదేవతావందితపాదుడును, త్రైలోక్యచూడామణియును నగు ఇంద్ర రూపమును ధరించుచున్నది.

చిత్ప్రభాసురతామేత్య త్రైలోక్యోదరడమ్బరే
పతత్యుదేతి సంయాతి స్వాత్మన్యేవాబ్ధివారివత్. 42

ఈ చిత్తే, త్రిలోకమధ్యమున సముద్రజలములవలె లేచిపడు సూర్యరూపమున ప్రకాశించుచు ఉదయాస్తమయములనందుచున్నది.

చిచ్చన్ద్రికా చతుర్దిక్షు అవభాసం వితన్వతీ
వికాసయతి నిఃశేషభూతసత్తాకుముద్వతీమ్. 43

ఈ చిత్ - చంద్రికయే నలుదిక్కుల ప్రకాశమును వెదజల్లుచు, జీవ - చైతన్యమను కలువలను వికసింపజేయుచున్నది.

చిద్దర్పణమహాలక్ష్మీ స్త్రిజగత్ప్రతిబిమ్బితమ్
గృహ్ణాత్యనుగ్రహేణాన్తః స్వగర్భమివ గర్భిణీ. 44

గర్భిణి గర్భమును ధరించునట్లు, ఈ చిత్తే దర్పణ - సంపదను గైకొని, జగత్ప్రతిబింబమును గ్రహించుచున్నది.

చిచ్చతుర్దశభూతానాం మణ్డలాని మహాన్తి చ
భూతీకరోతి వారిశ్రీః సముద్రస్వమివామ్బుధిః. 45

జలశక్తియే జలరూపమున సముద్రమై దానికి స్వరూపమును గల్పించునట్లు, ఈ చైతన్యమే చతుర్దశభువనములకు అస్తిత్వమును గల్పించుచున్నది.

విచిత్రాలోకకుసుమా ఘనసంకల్పపల్లవా
వ్యోమకేదారికారూఢా సత్తౌఘఫలశాలినీ. 46
జీవజాలరజఃపుఞ్జవాసనారసరఞ్జితా
సంవేదనత్వగ్వలితా చిత్తేహాకలికాకులా. 47
అతీతాసంఖ్యత్రిజగత్కే-సరోజ్జ్వలరూపిణీ
అనాగతస్పన్దమహావిలాసోల్లాసహాసినీ. 48

సర్వర్తుపర్వపరుషా జడశైలాదిగుల్మకా
విగ్రహాగ్రనివలితా మూలాగ్రపరివర్తితా. 49
చిల్లతేయం వికసితా పేలవం సదసద్వపుః
విచిత్రం దృశ్యకుసుమం పరామర్శాసహం బహు. 50
అనయేహ హి సర్వత్ర చ్ఛాయాచ్ఛమివ జన్యతి
మన్యతే తన్యతే వస్తు గీయతే క్రియతేఽపి చ. 51

ఈ చిత్తే ఆకాశ - క్షేత్రమున, విచిత్ర తేజఃపుంజములను కుసుమములను, సంకల్పములను ఘనపల్లవములను, సత్తలను ఫలములను, సదసత్తులను దృశ్యకుసుమములను గల్పించు లతయగుచున్నది; ఈ దృశ్యకుసుమములు విచారాపహములు, అనగా విచారమునంబడి నలిగిపోవుచున్నవి. జీవులీ చిల్లతా పరాగములు. వాసనారసమున ఈ లత రంజితమైనది. సవికల్ప - జ్ఞానవల్కలముల నిది కప్పబడియున్నది చిత్త - యత్నములను మొగ్గలతో నిది నిండియున్నది. దిన, గతములును, అసంఖ్యాకములును నగు త్రిజగత్కింజల్కములున్నవి. ఇయ్యది, అనవరతము స్పందవిలాసముతో శోభిల్లుచున్నది. ఋతు - పర్వములతో నిది కళకళలాడుచున్నది. జడములగు శైలాది పదార్థములు దీని మూలములు. దీని యందటునిటు, చతుర్విధప్రాణులను గ్రంథులున్నవి. దీని సర్వాంగములు ప్రవృత్తియను ఆవరణతో గప్పబడియున్నవి. ఈ చిల్లతయే నలువైపుల చంద్ర సూర్యప్రభవలె, దృశ్యకుసుమముల వికసింపజేయుచున్నది. ఈ మహా - చిత్తే సర్వత్ర వస్తువుల గల్పించి, తదభిమానమునుగూర్చి తత్త్వసిద్ధిని గలిగించుచున్నది.

మహాచితానయా నిత్యం భాసన్తే భాస్కరాదయః
దేహాః స్వదన్తే చ మిథస్తత్సచ్చిజ్జడవిభ్రమైః. 52

ఈ మహాచైతన్యమువలననే భాస్కరాదులు ప్రకాశించుచున్నారు. జడములగు దేహములీ చైతన్యమహిమవలననే లోకులకు ప్రియకరములగుచున్నవి.

చితా చావర్తవర్తిన్యా సిద్ధాన్యేవ ప్రనృత్యతి
జగజ్జాలరజోలేఖా తత్సత్తా దృశ్యదేహినీ. 53

జగత్సమూహములను ధూళిరేఖ చైతన్యసత్తవలననే దృశ్యదేహమును ధరించి, తన్ను చైతన్యమునుండి వేఱుగ భావించుకొని నృత్యమొనర్చుచున్నది.

చిత్సర్వం జగదారమ్భమిమం ప్రకటయత్యలమ్
త్రైలోక్యదీపకశిఖాదీపో వర్ణాశ్రయం యథా. 54

ప్రదీపము గృహమునందలి వస్తువులనన్నిటిని ప్రకాశింపజేయునట్లు, త్రైలోక్యదీపశిఖయగు చైతన్యమే ఈ జగత్తునందలి కార్యములనన్నిటినిఁ ప్రకాశింపజేయుచున్నది.

చిచ్చన్ద్రబిమ్బే విమలే శశవత్ప్రాప్య సంగమమ్
సర్వత్ర లక్ష్యతామేతి పదార్థశ్రీర్జగద్గతా. 55

చైతన్యమే జాగతికపదార్థముల ఆకారమునువహించి, చంద్రమండలమునందలి కళంకము వలె సర్వత్ర పరిలక్షితమగుచున్నది.

చిద్రసాయనసేకేన పదార్థపటలావలీ
రూపమేతి ఫలంచైవ ప్రావృట్సిక్తేవ సల్లతా. 56

పదార్థపటలము చిద్రసాయనసేకమున, వర్షసలిల - సిక్తములగు సుందరలతలవలె, పెంపొంది నామరూపముల ధరించుచున్నది.

చిచ్ఛాయయైవ సర్వస్య జాడ్యం సమ్యగుదేతి చ
సర్వస్యాస్య శరీరస్య గృహస్యేవ తమఃస్విహ. 57

ఈ చిత్ - ఛాయయే, గలహామధ్యమునందలి అంధకారమువలె, సకలపదార్థముల జడతనుగూడ కల్పించుచున్నది.

చిచ్చమత్కృతయో దేహే న భవేయురిమా యది
త్రైలోక్యగేహాస్త్వక్త్వేతే న స్పృశేయుః కిలాకృతిమ్. 58

త్రిలోకస్థితములగు శరీరజాలముల చిచ్ఛాయయే తొలగినయెడల, అవి తమ స్పర్శయోగ్యత్వమునుగూడ కోలుకొనిపోవుచున్నది.

చిదాకాశప్రకాశేఽస్మిన్సంకల్ప శిశుధారిణీ
క్రియాకులవధూర్దేహగృహే స్ఫురతి చఞ్చలా. 59

చైతన్యసహాయ్యమున ప్రకాశితమగు ఈ దేహగృహమున, క్రియయను కులవధువు సంకల్ప-శిశువును ఒడిలో నిడికొని, ఒప్పారుచున్నది.

చిదాలోకం వినా కస్య రసనాగ్రే స్ఫురన్నపి
కథం కదా ప్రకటతామేతి దృష్టః క్వవా రసః. 60

చైతన్యసంపర్కములేకున్న, జిహ్వాగతమైనను వస్తువుయొక్క ఆస్వాదమును అనుభవింపజాలము. ఏతద్వ్యతిరిక్తముగ - నెవ్వరును గాంచియుండలేదు,

శృణ్వఙ్గ స్వాఙ్గశాఖోఽపి కున్తలాలిలతోఽప్యలమ్
చిన్మజ్జనం వినా దేహవృక్షః క ఇవ రాజతే. 61

వత్సా! వినుము. హస్తపాదాది - శాఖాసమన్వితమును, కేశజాల - లతాసమన్వితమునునగు ఈ దేహ - తరువు అంతరమున చైతన్యమే లేకున్న ప్రకాశింపజాలదు.

వర్తతే విలుఠత్యత్తి చిచ్చరాచరకారిణీ
చిదేవాస్తీతరన్నాస్తి చిన్మాత్రమిదముత్థితమ్. 62

జన్మస్థితిలయములనందుచు చరాచరముల శోభిల్లునదంతయు చైతన్యమే; అదిగాక వేఱొండు లేదు. అందుండియే అన్నియును కలుగుచున్నవి.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్తవాంస్తథా త్ర్యక్షః సుధాంశుస్వచ్ఛయా గిరా
పునః పృష్టో మయా రామ సుధాంశుస్వచ్ఛయా గిరా. 63

శ్రీ వసిష్ఠుఁడు:— రామా! భగవంతుడగు త్రిలోచనుడు చంద్ర - సుధామయ నిర్మలవచనముల ఇట్లు నుడువ, నేనాయనను చంద్రసుధామధురవచనముల, మరల నిట్లు ప్రశ్నించితిని.

యది సర్వగతా దేవ చిదస్త్యేకా తదాత్మకః
తదయం చావనిస్థారమయూర్ధ్నేవ న చేతతి. 64

దేవా ! ఇదంతయును చిద్వ్యాప్తమైన, యీ శరీరము మరణమూర్ఛాసమయముల, నేత్రవిహీనమగు మృణ్మయప్రతిమవలె చేష్టావిహీనమగుచున్న దేమి ?

అయం చిత్వాత్పురా భూత్వా చిద్ధీనః సంప్రతి స్థితః
ఇతీయం కల్పనా లోకే ప్రత్యక్షానుభవా కథమ్. 65

'ఇయ్యది పూర్వము చైతన్యవంతమై, తరువాత తద్రహితమగుచున్నది' — అను కల్పన లోకమున నేల ప్రత్యక్షమగుచున్నది ?

ఈశ్వర ఉవాచ:—

శృణ్వేతదఖిలం బ్రహ్మన్యదా పృష్టం వదామి తే
మహానయం త్వయా ప్రశ్నః కృతో బ్రహ్మవిదాంవర. 66

ఈశ్వరుడు:— బ్రహ్మజ్ఞా ! నీవడిగినదానిని జెప్పుచున్నాడను, వినుము. బ్రహ్మవిచ్ఛ్రేష్ఠా ! నీవు అడిగినది చాల దొడ్డప్రశ్న.

చిదస్తి హి శరీరేహ సర్వభూతమయాత్మికా
చలోన్ముఖాత్మికైకా తు నిర్వికల్పా పరా స్మృతా. 67

ఈ శరీరమున ఏ సర్వభూతమయమగు చిత్తు విరాజిల్లుచున్నదో, అయ్యది ద్వివిధము. ఇందొకటి, విజ్ఞానమయశబ్దవాచ్యమగు కర్తృభోక్తృస్వభావయుతము; రెండవది కూటస్థమగు నిర్వికల్పచైతన్యము.

సంకల్పబుద్ధా సైవాన్తః స్వయమన్యేవ సంస్థితా
సంకల్పితేతరవరా ద్యౌఃశీల్యం స్త్రీ యథా గతా. 68

ఈ చైతన్యమే సంకల్పబలమున తన్ను జీవునిగ భావించుకొని, పతివ్రతయగు స్త్రీ స్వప్నమున నుపపతిని గల్పించుకొని దుశ్శీలయగు అన్యయుపతియగునట్లు, అన్యవిధమును బొందుచున్నది.

స ఏవ హి పుమాన్క్రోధాద్యథేహాన్య ఇవ క్షణాత్
భవత్యేవం వికల్పాజ్ఞా చిత్స్వరూపాన్యతాం గతా 69

శాంతుడును, సుశీలుడునునగు పురుషుడు, క్రోధకాలుష్యమున రాక్షసుడగునట్లు: ఈ చైతన్యమే సంకల్పకళంకమున జీవభావమునందుచున్నది.

వికల్పకల్పితా బ్రహ్మంశ్చిత్స్వరూపపరిచ్యుతా
జాడ్యం క్రమాద్భావయన్తీ ప్రయాతి కలనాపదమ్. 70

బ్రహ్మజ్ఞా ! వికల్పకలుషితమగు చిత్తే నిజస్వరూపభ్రష్టతనంది, క్రమముగ తన్ను జడమని భావించుకొనుచు, స్వకల్పనాబలముననే, సవికల్పకబుద్ధికి విషయమగుచున్నది.

చిత్స్వయం చేత్యతామేతి సాకాశపరమాణుతామ్
శబ్దబీజాత్మికాం పశ్చాద్వాతతన్మాత్రగామినీ. 71

దేశకాలవిభాగాన్తా తన్మాత్రవలితాక్రమాత్
జీవో భూత్వా భవత్యాశు బుద్ధిః పశ్చాదహం మనః. 72

మన స్త్వం సముపాయాతా సంసారమవలమ్బతే
చణ్డాలోఽస్మీతి మననాచ్చణ్డాలత్వమివ ద్విజః. 73

సంకల్పితాప్రబోధేన జాడ్యా విశ్వప్రబోధినీ
శబలం రూపమాసాద్య సంకల్పాద్యాత్యనారతమ్. 74

అనన్తసంకల్పమయీ జాడ్యసంకల్పపీవరా
చిజ్జాడ్యాన్మోదమాయాతి పయః పాషాణతామివ. 75

ఈ చిత్తే ఆకాశయుతమగు పరమాణురూపమును, శబ్దస్పర్శాది భోగ్యరూపమును బొంది, మాయోపలక్షిత చైత్యమునకు విషయమగుచున్నది. పిదప, సమిష్టి - ప్రాణమగు హిరణ్యగర్భరూపమును బొందుచున్నది. తరువాత, పంచీకృత - సూక్ష్మభూతములతోగూడి సప్తద్వీపాది దేశవిభాగమును, నిమేషాది కాలవిభాగమును బొందుచున్నది. అనంతర మయ్యదియే ప్రాణమునుధరించి, జీవత్వమును బొంది, మనోబుద్ధుల బొందుచున్నది. మనోభావమునందిన చిత్తే, బ్రాహ్మణుడు చండాలభావనవలన చండాలత్వమును బొందునట్లు, యీ సంసారభావమును బొందుచున్నది. ఈ బ్రహ్మచైతన్యమే అజ్ఞానశబలితమగు రూపమును ధరించి, శరీర, జీవరూపముల సంకల్పించుకొని, తత్సంపర్కమున సర్వజ్ఞత్వమునుగోలుపోయి, భోగసంకల్పముల మాటిమాటికి సంసారియగుచున్నది. అనంత సంకల్పమయమగు యీ చిత్తే, జడ - సంకల్పమున స్థూలభావమును ధరించి, అతిశీతలత్వమున నీరు పాషాణమగునట్లు, మోహమును (శరీరమును) బొందుచున్నది.

తతశ్చిత్తం మనోమోహా మాయేతి విహితాభిధా
జాడ్యం నిపుణమాశ్రిత్య సంసారే జాయతే మునే. 76

మునీ! అప్పుడీ చిత్తే, చిత్తము, మనస్సు, మోహము, మాయ మున్నగు నామముల బొందుచున్నది. ఇట్లీతీరుగ నియ్యది సంసారమున జన్మించుచున్నది.

మోహమాన్ద్యముపాయాతా తృష్ణా నిగడపీడితా
కామక్రోధభయోపేతా భావాభావాతిపాతినీ. 77

త్యక్త్వానన్తనిజాభోగా వ్యవచ్ఛేదవికారిణీ
దుఃఖదావానలాతప్తా శోకాశివకృశాశయా. 78

ఇయమస్మీతి భావేన శూన్యేన వికలీకృతా
దేహమాత్రగృహీతాస్థా పరం దైన్యముపాగతా. 79

మగ్నా మోహమహాపఙ్కే జీర్ణేవ వనదన్తినీ
భావాభావలతాదోలా పరిలోలశరీరకా. 80

అసారాపారసంసారవికారవ్యవహారిణీ
తాపోపతప్తహృదయా రాగతేజోనురఞ్జితా. 81

నిజయూథపరిభ్రష్టా మృగీవావశతాం గతా
ఆవిర్భావోదితాకారా తిరోభావేఽస్తమాగతా. 82
స్వసంకల్పోపయాతాసు భీతా సంభ్రమదృష్టిషు
పలాయతే వాప్యన్యాసు వేతాలేష్వివ బాలికా. 83
ఉష్ట్రీవ మధురం బిన్దుం వాఞ్ఛతే భావితం సుఖమ్
అవాన్తరపరిభ్రష్టా దోషాద్దోషం పతత్యధః. 84

ఇట్లు, మోహగ్రస్తమగు చిత్తే, తృష్ణా-శృంఖలానిపీడితమై, కామక్రోధాదిభయభీతమై, భావాభావగ్రస్తమగుచున్నది. అప్పుడది తన అనంతత్వమును గోలుపోయి పరిచ్ఛిన్నమగుచున్నది; దుఃఖదావానలదగ్ధమును, శోకాశుభవ్యాకులమును నై 'నేనీ ప్రత్యక్షదుఃఖమోహాది స్వభావుడను' అని భావించుకొనును. అప్పుడయ్యది శరీరమును నమ్మి, ఎనలేని దీనతను బొందును, దాని శరీరము భావాభావముల దోళాయమానమగును. జరాజీర్ణమగు వనహస్తివలె, మోహపంకమున గూరుకొనిపోయి, లేవ నసమర్థమగును. అపారసంసారవికారమున నద్దాని హృదయ ముత్తప్తమగును; రాగద్వేషములకు వశమగును. యూథభ్రష్టమగు హరిణమువలె దీనత్వమును బొందును. ఆగమాపాయముల సుఖదుఃఖముల బొందును. బాలిక స్వసంకల్పితుడగు బేతాళునిగాంచి పరుగిడునట్లు, స్వసంకల్పితమగు ఆపదలగాంచి భయపడి, పరుగిడును కంటకలోలుపమగు ఉష్ట్రి, నింబాది తిక్తఫలముల మధురములని భావించి వాంఛించునట్లు, తుచ్ఛములును విషయములునునగు సంసారవిషయముల నయ్యది అప్పుడు వాంఛించును. చిత్తు ఇట్లు దోషజాలముల జిక్కుకొని, అధఃపతనము నందుచున్నది.

పరం వైషమ్యమాయాతి సంకటాత్సంకటం గతా
దుఃఖాద్దుఃఖం నిపతితా విపదో విపది స్థితా. 85
నానానర్థగణోపేతా చేష్టాపరవశాశయా
కష్టాత్కష్టమనుప్రాప్తా పరితాపానుతాపినీ. 86
క్రమాదాబద్ధవైదగ్ధ్యాద్వైదగ్ధ్యజముపాగతా
విచిత్రబన్ధనిర్మాణపరాక్రమపదం గతా. 87
సర్వతః శఙ్కతే భీతా ప్రాణాత్యయముపాగతా
క్షీణతోయేవ శఫరీ వివర్తనపరాయణా. 88
బాల్యే వివశసర్వార్థా యౌవనే చిన్తయా వృతా
వార్ధకేఽప్యతిదుఃఖార్తా మృతా కర్మవశీకృతా. 89
జాయతే స్వర్గనగరే నాగీ పాతాలకోటరే
ఆసురీ దైత్యవివరే నరస్త్రీ వసుధాతలే. 90
రాక్షసీ రాక్షసాధారే వానరీ వనకోటరే
సింహీ గిరీన్ద్రశిఖరే కిన్నరీ కులపర్వతే. 91
విద్యాధరీ దేవగిరౌ వ్యాలీ చ వనగర్తకే
లతా తరౌ ఖగీ నీడే వీరుత్సానౌ వనే మృగీ. 92

ఇట్లు సంకటములబడి విపన్నత నందును, ఒకటితరువాత మఱియొకటిగా దుఃఖ విపత్తులబడి, బహుళమగు అనర్థకమున జిక్కుకొనును. ఇట్లు జడావస్థను జిక్కుకొని, నరకాది ముల కఱిగి, విశేషకష్టముల ననుభవించును. మనుష్యజన్మను బొందియు, చిన్నప్పటినుండి వ్యాక కాళలమును సంపాదించి, చాతుర్యముతో బంధహేతువులగు ధనపుత్రాదుల గూర్చుకొన ప బడును. మోక్షోపయోగమగు వివేకము దుర్లభమగును. విపత్పరంపరల జిక్కుకొని, అందఱి సం మునకు గారణమగును. పిదప, మృత్యుసమయమురా, అల్పజలముల జిక్కుకొనిన చేపవలె, వి తన్నుకొని మరణించును. బాల్యమసమగ్రతలోను, యౌవనము చింతలలోను, వార్ధక్యము దుఃఖముల గడువ, దుఃఖార్తుడై మరణించును; అతడు ముక్తిని బడయజాలడు. కర్మవైచిత్ర్యము ననుసరి స్వర్గమున అప్సరస, పాతాళమున నాగకన్య, దైత్యభవనమున అసురి, భూతలమున మానవి, రాక్షస యమున రాక్షసి, వనమధ్యమున వానరి, గిరిశిఖరమున సింహి, కులపర్వతమున కిన్నరి, సుమేరుపర మున విద్యాధరి, అరణ్యమున క్రూరజంతవు, వృక్షమున లత, నీడమున విహంగము, పర్వతసాను లత, అరణ్యమున మృగమై జన్మించును.

శేతే నారాయణోఽమ్భోధౌ ధ్యాసీ బ్రహ్మాపురేఽబ్జజః
కాన్తాగతో హరః శైలే స్వర్గే సురవరో హరిః. 9
దినం కరోతి తీక్ష్ణాంశుర్వర్షత్యమ్బుధరో జలమ్
కరోతి శ్వసనం సంవిత్సపర్వతమహాదధిమ్ 9
ఋతుచక్రం ప్రవహతి సహసా కాలమణ్డలమ్
దినరాత్రితయోపైతి తేజస్తిమిరతాం క్రమాత్. 9
క్వచిద్బిజరసోల్లాసాత్క్వచిత్పాషాణమానినీ
క్వచిన్నదీ రసవతీ క్వచిత్కుముదవిస్తృతిః. 9
క్వచిత్ఫలావలీహాకైః క్వచిత్కాష్ఠానలాదిభిః
క్వచిచ్ఛైత్యహిమదాఽరి క్వచిత్ఖాది న కించన. 97
క్వచిదుజ్జ్వలితాకారా క్వచిత్కష్టా శిలా క్వచిత్
క్వచిన్నీలాభ హరితా క్వచిదగ్నిః క్వచిన్మహీ. 98
సర్వాత్మత్వాత్సర్వగత్వాత్సర్వశక్తిత్వయోగతః
సర్వాత్వాదేవంరూపైవ ఖాదవ్యచ్ఛైవ సా పరా. 99
చిచ్ఛినోతి యథాత్మానం యేన యత్ర యదా యదా
తత్తథానుభవత్యమ్బుస్వప్నాదీచ్చాదితాం యథా. 100

ఈ చైతన్యమే నారాయణుడై సాగరమున శయనించుచున్నాడు. బ్రహ్మపురమున కమల యోని బ్రహ్మయై ధ్యాననిరతుడైయున్నాడు. కైలాసమున త్రిలోచనుడై అర్ధనారీశ్వరరూపమున వెలయుచున్నాడు. స్వర్గమున సురరాజగు ఇంద్రుడైయున్నాడు ఈ చైతన్యమే సూర్యుడై, దినమును గల్పించుచున్నాడు. మేఘమై వర్షమును గురిపించుచున్నాడు. వాయురూపమున వస్తువుల నన్నిటిని గదిలించుచున్నాడు. ఈ చైతన్యమే సంవత్సర - చక్రము, యుగములు, మన్వంతరములై

ప్రవహించుచున్నది. ఈ చైతన్యమే తేజోతిమిరరూపములగు దివరాత్రుల గల్పించుచున్నాడు. ఒకచోట వృక్షాదుల బీజరూపముగను, రసస్వరూపముగను విలసిల్లుచున్నాడు. మఱియొకచోట పాషాణస్వరూపమున వెలయుచున్నాడు. ఇతరత్ర రసవతులగు నదీ స్వరూపమునను, వికసిత కుముదరూపమునను, పక్వఫలసమూహరూపమునను, కాష్ఠ - వహ్ని స్వరూపమునను, శీతలమగు జలస్వరూపమునను, ఆకాశాదిరూపమునను, శూన్యరూపమునను, ఉజ్వల - ఆకృతిని వహించియు, కఠిన శిలారూపమును దాల్చియు, నీలహారితవర్ణములదాల్చియు, అగ్నిరూపమునను, భూమిరూపమునను ఈ చైతన్యమే ప్రకాశించుచున్నది. ఈ చైతన్యము సర్వమయము, సర్వగామి, సర్వశక్తిమంతమునగుటవలన నిన్ని విధముల ప్రకాశించుచున్నది; అయ్యది ఆకాశముకంటెగూడ నిర్లిప్తము, పైవస్తువులనుండి భిన్నము నీరు స్పందించి, తరంగాదిరూపముల ధరించునట్లు, యీ చైతన్యమెచ్చట ఏరూపమున వివర్తమునంది, తన్నేరూపమున భావించుకొనుచున్నదో, అయ్యది అతీరుగనే అనుభవగోచరమగుచున్నది.

హంసీ క్రౌఞ్చీ బకీ కాకీ సారసీ తురగీ వృకీ
బకీ బలాకా హారిణీ వానరీ కిన్నరీ శునీ. 101

వటికా పిఙ్గలీ శాలీ మక్షికా భ్రమరీ శుకీ
ధీః శ్రీర్హ్రీః ప్రీతీ రతిశ్చ శమ్బరీ శర్వరీ శశీ. 102
ఏతాస్వన్యాసు చాన్యాసు పరిభ్రమతి యోనిషు
వివర్తమానసంసారే జలావర్తే తృణం యథా. 103
బిభేత్యథ స్వసంకల్పాత్స్వశబ్దాదివ గర్దభీ
నానయా సదృగన్యాస్తి ముగ్ధా బాలా చలాఽబలా. 104
ఏషా సా కథితా తుభ్యం జీవశక్తిర్మహామునే
ప్రాకృతాచారవివశా వరాకే పశుధర్మిణీ. 105
కర్మాత్మేత్యభిధాం ప్రాప్తా శోచ్యాస్య పరమాత్మనః
అనన్తం దుఃఖబహులం స్వయం విభ్రమమాశ్రితా. 106
అసదేవానయా క్రాన్తం వినాశి సహజం మలమ్
తణ్డులే నేవ కఞ్చుకమనన్యయాఽవ్యవస్థితమ్. 107
అనన్తవిభవభ్రష్టా దౌర్భాగ్యపరితాపినీ
శోచన్తీ ప్రాప్య జీవత్వం భర్తృహీనేవ నాయికా. 108

ఈ చైతన్యమే హంసీ, బకీ, కాకీ, వృకీ, తురగీ, హారిణీ, బలాకా, వానరీ, కిన్నరీ, కుక్కురీ, ఒటీకా, పింగళా, శాలీ, భ్రమరీ, మక్షికా, శుకీ, ధీ, శ్రీ, హ్రీ, ప్రీతి, రతి, మాయా, శర్వరీ, శశ్యాది యోనుల బరిభ్రమించుచున్నది. సుడిగుండమున పడ్డ గడ్డిపరకవలె, యీ చైతన్యమే వివర్తము నందుచున్నది. గర్దభము తనకూతకు దానే భయబడునట్లు, తన సంకల్పములకు దానే భయపడుచున్నది. దీనినిబోలు, అబలయును, ముగ్ధయును, చంచలయును నగు బాలికలేదు. (అనగా, ఇది బాలికకంటెగూడ ముగ్ధ, చంచల, అబలయని గ్రాహ్యము). మునీంద్రా! ఇంతవఱకు నీకడ వర్ణింపబడిన చైతన్యమే జీవశక్తి. శోచనీయమగు నీచవ్యవహారమునబడి, అవశయై పశుధర్మమునుబొంది

నది. కర్మానుసారము దీనికిట్టి దురవస్థకలుగుచున్నది; దుఃఖసంకులములగు భ్రాంతులబొందుచున్నది. ధాన్యము నశ్వరమగు ఊకనుదాల్చునట్లు, ఇదిగూడ మలమును ధరించుచు చున్నది; ఇదియే అవిద్యారూపమున అల్పకాలము వెలయుచున్నది. ఈ చైతన్యమే జీవభావమునంది, భర్తృహీనయగు నాయికవలె, దురదృష్టసంతప్తమును, వైభవవంచితమునునై శోకించుచున్నది.

జడగతేరవలోకయ శక్తతాం
నిజపదస్మరణేన వినేహ చిత్
వ్రజతి కష్టమధఃపతనా యయా
యదరఘట్టఘటీఘనపీఠవత్. 109

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే శివపూజోపాఖ్యానే పూర్వార్ధే చేతోన్ముఖచిద్విచారో నామ త్రింశః సర్గః ॥ 30 ॥

జడరూపిణియగు అవిద్యయొక్క సామర్థ్యమెంతయో నీ వొకసారి పరికించిజూడుము. పూర్ణబ్రహ్మస్వభావమగు చైతన్యముగూడ, యీ అవిద్యావశమున నిజస్వరూపమును విస్మరించి, ఘటీయంత్రఘట - ఆకాశమువలె కేవలము అధఃపతనార్థము అరుగుచున్నది. హా! ఎంత కష్టము.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున శివపూజోపాఖ్యానమున చేతోన్ముఖచిద్విచారమను త్రింశ సర్గము ॥ 30 ॥

---

## ఏ క త్రిం శః స ర్గః.

---

[జీవతాదినిషేధేన సా శుద్ధా చిత్ప్రదర్శ్యతే
మనఃప్రాణేన్ద్రియద్వారా బహిరన్తఃప్రథా యయా.

ఈ ప్రకరణమున జీవితాదులు నిషేధింపబడి, మిగిలిన చిన్మాత్రశుద్ధచిద్వస్తువు ప్రదర్శింపఁబడుచున్నది.]

ఈశ్వర ఉవాచ:—

చిన్నోత్యలీకమేవైవం సదుఃఖాస్మీతి భావనాత్
చిత్స్వప్నక్షీబతామోహాపతితా సంభ్రమే యథా. 1

శ్రీ ఈశ్వరుడు:— స్వప్నమున 'నేను ఉన్మత్తుడను' అని మోహావశమున భావించి, దుఃఖమును అనుభవించుతీరుగ, యీ చైతన్యమే తన్ను దుఃఖయుక్తముగ భావించుకొని, అజ్ఞానవశమున అలీకమగు జీవజగద్భావమును బొందుచున్నది.

అమృతాపి మృతాస్మీతి విపర్యస్తమతిర్వధూః
యథా రోదిత్యనష్టైవ నష్టాస్మీతి తథైవ చిత్. 2

ఒకానొక యువతి, మరణింపకున్నను దుఃఖవశమున మరణించితినని భావించుకొని వ్యాకులపడు నట్లు, యీ చైతన్యముగూడ, వినష్టముగాకున్నను వినష్టమైనట్లు భావించుకొని, దుఃఖించుచున్నది.

అకారణం విపర్యస్తా మతిర్భ్రాన్తమపి స్థిరమ్
యథా జగత్పశ్యతీదం తథాహన్తా భ్రమాచ్చితి. 3

భ్రాంతబుద్ధికి తిరుగుచున్న కుమర్మసారెగూడ తిరుగనట్లుగపడునట్లు, అహంప్రత్యయవశమున చైతన్య మీ జగత్తును స్థిరముగ గాంచుచున్నది.

చిత్తం హి కారణం త్వస్యాః సంసారానుభవే చితేః
న చ తత్కారణం కించిచ్చిత్వాన్యత్వాత్వసంభవాత్. 4

చిత్తమే చైతన్యముయొక్క సంసారానుభవమునకుఁగారణము; ఇది యెన్నడును మిథ్యయవజాలదు. ఏలయన, చిద్వ్యతిరిక్తమగు వస్తువేలేదు.

ఏవం హి కారణాభావాచ్చైత్యస్యాసంభవాదితి
నాసౌ చిత్తం తతశ్చైత్యం యత్నతశ్చైత్యతే యయా. 5

ఇట్లు కారణమేలేకుండుటవలన, దృశ్యమగు యీ జగత్తుకూడ లేనిదగుచున్నది. చిత్తము, చిత్తపరికల్పన, తత్ఫలమగు జగత్తుగూడ అసత్యమేయగుచున్నది.

న దృశ్యదర్శనద్రష్టృరూపం తైలమివోపలే
న కర్తృకర్మకరణం దృశీన్దావివ కృష్ణతా. 6

పాషాణమున తైలముండనట్లు, యీ చైతన్యమునగూడ, దృశ్యదర్శనములులేవు, చంద్రుని యందు కృష్ణవర్ణములేనట్లు, యీ చైతన్యమున కర్త, కర్మ, కరణములు లేవు.

న మాతృమేయమానాని నభసీవ నవాఙ్కురః
న చిచ్చేతనచేత్యాది నన్దనే ఖదిరో యథా. 7

ఆకాశమున నవాంకురములు లేవనట్లు, యీ చైతన్యమున ప్రమాతా, ప్రమేయ, ప్రమాణములులేవు. నందన - కాననమున ఖదిరవృక్షములేనట్లు, యీ చైతన్యమున చిత్తవృత్తి, చేతము, చేత్యము (జగత్తు) మున్నగునవి లేవు.

నాహన్త్వత్వన్త్వతత్త్వాది పర్వతత్వమివామ్బరే
నదేహత్వాన్యదేహత్వే శఙ్ఖత్వమివ కజ్జలే. 8

ఆకాశమున పర్వతత్వము లేనట్లు, ఈ చైతన్యమున అహంత్వ, త్వంత్వ, తత్త్వాది భేదములు (నీవు, నేను, అది మున్నగు భేదములు లేవు. కాటుకయందు శంఖత్వము అనగా తెల్లదనము లేనట్లు, చైతన్యమున స్వపరదేహములు లేవు.

నానానానా న చాప్యన్తరణావివ సుమేరవః
నచ శబ్దార్థ శబ్దశ్రీర్మహామరలతా యథా. 9

పరమాణువున సుమేరు పర్వత ముంచుటు అసంభవమైనట్లు, ఈ చైతన్యమునగూడ 'నానాత్వ' అనానాత్వ'ము లుండుటగూడ అసంభవము. ఊషరప్రదేశమున, లతయుండనట్లు ఇటు నామరూపముల ఉనికియే లేదు.

నేతి నేతి న చైవార్కమణ్డలే రజనీ యథా
న వస్తుతావస్తుతే చ తుషారే తు యథోష్ణతా. 10

సూర్యమండలమున రాత్రిలేనట్లు, ఈ చైతన్యమున దృశ్యవస్తునిషేధముకూడలేదు. తుషారము (పొగమంచు)న వేడియుండనట్లు, దీనియందు వస్తుత్వ, అవస్తుత్వము లేమియును లేవు.

న శూన్యతాశూన్యతే వా శిలాకోశ ఇవ ద్రుమః
శూన్యతాశూన్యతా నామ మహాతీ ఖ ఇవాఖతా. 11

శిలాగర్భమున వృక్షము జన్మింపనట్లు, ఈ చైతన్యమున శూన్యతా, శూన్యతాభావములు గూడలేవు. ఆకాశముయొక్క విశాలత, శూన్యాశూన్యములుగ పర్యవసింపక, స్వచ్ఛభావముననే పర్యవసించుచున్నది.

కేవలం కేవలీభావస్వచ్ఛత్వైవావశిష్యతే
న చిత్తాత్కస్యచిద్దోషాజ్జాతమేతదవాప్యతే. 12

అట్లే చైతన్యముయొక్క శూన్యత్వవిశేషణముగూడ నిర్మలభావముననే పర్యవసించుచున్నది. ఈ సంసారరూపకమగు అనర్థము ఒకానొక చిత్తముయొక్క దోషమున సంభవించుచుండుట లేదు.

తత్సర్వభావనామాత్రేణానర్థః ప్రకృతః స్థితః
తజ్జ్ఞేఽప్యభావనామాత్రేణానర్థ ఉపశామ్యతి. 13

కాని, ఆ చిత్త (= హిరణ్యగర్భ) సృష్టయగు దేహేంద్రియాదుల అహంభావకల్పనవలననే, ఈ అనర్థము దాపురిల్లినది. ఈ భావము నశించిన, ఈ అనర్థముగూడ తొలగిపోవును. ఇంకేమియును మిగులదు.

తజ్జ్ఞేఽప్యభావనామాత్రాదృతేఽన్యతోఽపయుజ్యతే
న తృణం న చ త్రైలోక్యమితి స్వాయత్తతాత్ర యా. 14

తత్త్వజ్ఞుడుగూడ ఈ భావనను తొలగింపకున్న ఇందు చిక్కుపడిపోవును ముల్లోకముల నిది తృణమువలె నిస్సారము అని గ్రహించిన, తేలికగ దూరమైపోగలను.

స్వాయత్త ఏవ చైషోఽర్థో దుఃసాధ్యో భావనాస్థితః
యద్యన్న సాధ్యతే పుంసా తత్కథం క్వేవ లభ్యతే. 15

ఈ భావనా - త్యాగము దానియంతట అదేయగునని తలపోయరాదు. ఈ భావనను త్యజించుటకు పురుషకారము అత్యంతప్రయోజనము; ఇయ్యదిలేకున్న దీని నెవ్వరును సాధింపజాలరు.

నిర్వికల్పాద్వితీయా చిద్యాసౌ సకలగా సతీ
పరమైకా పరా సాచ్ఛా దీపికా తేజసామపి. 16

అహంభావనను త్యజించి సంసారానర్థమును దూరమొనర్పగలిగిన, సర్వవ్యాపియగు ఆ చైతన్యము 'నిర్వికల్పకము 'అద్వయము' అని గ్రహింపవచ్చును. అద్దియే, తేజోపదార్థముల నన్నిటిని గూడ ప్రకాశింపజేయు నిర్మలవస్తువు.

సైషావభాసనకరీ సర్వగా నిత్యనిర్మలా
నిత్యోదితా నిర్మనస్కా నిర్వికారా నిరఞ్జనా. 17

నిత్యనిర్మలమగు యీ చైతన్యమే వస్తువులనన్నింటిని ప్రకాశింపజేయుచున్నది. ఇది నిత్యోదితము, నిర్మనస్కము, నిర్వికారము, నిరంజనము.

ఘటే పటే వటే కుడ్యే శకటే వానరే ఖరే
అసురే సాగరే భూతే నరే నాగే చ సంస్థితా. 18

ఈ చైతన్యమే ఘటపటముల, గర్తముల, కుడ్యముల, శకటముల, సురాసుర నాగముల, ఖరవానరముల, సాగరముల వెలయుచున్నది.

సాక్షివత్తిష్ఠతి సతీ స్పందతే నచ కుత్రచిత్
దీపః ప్రకాశనాయేవ కరోతి న పునః క్రియామ్. 19

ఈచైతన్యమే సర్వత్ర సాక్షివలె వెలయుచున్నది, స్పందింపకున్నది. దీపమునకు ప్రకాశింపజేయుటకన్న వేఱొండు కార్యములేనట్లు, ఈ చైతన్యమునకు ప్రకాశింపజేయుటకంటె వేఱొండు క్రియలేదు.

మలినాప్యమునైషా సా వికల్పాఢ్యా వికల్పినీ
జడేవాప్యజడాభాసా న సర్వా సర్వగైవ చ. 20

చైతన్యముయొక్క వాస్తవస్వరూప మిట్టిదైనను, దేహాదిభావములవలన మలినమై, వికల్పమయమగుచున్నది. అజడమయ్యు జడమగుచున్నది. సర్వగామినియయ్యు, సంకుచితమగుచున్నది.

నిర్వికల్పా పరా సూక్ష్మా చిచ్ఛినోతి స్వసంవిదమ్
వాతావాతాఙ్గమర్మాది యథా యన్త్రాదివేష్టనే. 21

ఈ చైతన్యమే నిర్వికల్పమగు సూక్ష్మావస్థయందుండియు, ప్రాణమయమగు లింగశరీరమున ప్రతిబింబితయై, సూక్ష్మమగు తంతువులు యంత్రమునబడి పెద్దబట్టలుగ మారునట్లు, హస్తపాదాది అవయవములుగ మారుచున్నది.

రూపాలోకమనస్కారావలితా చిదబోధతః
బోధతశ్చైవ భవతి నిద్రాం సదసతీ యతః. 22
సా పరైవ చిదత్యచ్ఛా చిన్తామాయాతి చేతనాత్
సాధురేవ యథా సాధుర్భావితే దుర్జనేషణాః. 23

స్వప్నమున పురుషుని వాసనామయచిత్తము బయట విషయరూపమునను, అంతరమున బోధరూపమునను వెలయునట్లు ఈ చైతన్యమే జాగ్రద్దశయందుగూడ విషయాకృతిని, అంతరమున మనోరూపమునను వెలయుచు, జ్ఞానాఽజ్ఞానాత్మకమగుచున్నది. దుర్జనసాంగత్యమున సాధుపురుషుడు అసాధువగునట్లు, అతినిర్మలమగు ఈ చైతన్యమే దేహాద్యాకారముల చేతితమై తదనుకూలమగు చింతను బొందుచున్నది.

మలేన స్వర్ణమాయాతి తామ్రతాం మలమార్జనాత్
పునః కనకతామేతి యథా చిత్పరమా తథా. 24

సువర్ణము మాలిన్య - సంయోగమున తామ్రభావమును దాల్చునట్లును, మరల మాలిన్యమును శుభ్రపఱచిన సువర్ణమగునట్లును, ఈ చైతన్యముగూడ సంయోగవియోగములవలన శుద్ధము, అశుద్ధము నగుచున్నది.

స్వారోపశాన్త్యా స్వాదర్శో యథైతి ప్రతిమాస్థితిమ్
తథా స్వర్గమివాగమ్య బోధాత్స్వం యాతి తత్పదమ్. 25

అద్దమును శుభ్రపఱచిన అయ్యది ప్రతిబింబమును ప్రతిఫలింపజేసికొను స్వచ్ఛభావమును దాల్చునట్లు, అజ్ఞానమున జీవజడభావమును దాల్చిన ఈ చైతన్యముగూడ తత్త్వబోధవలన మఱల స్వకీయమగు తత్త్వభావము నందుచున్నది.

అభావవేదనాదస్యాః సంసారః సంప్రవర్తతే
స్వభావవేదనాదేష త్వసదేవోపశామ్యతి. 26

ఈ చైతన్యముయొక్క అజ్ఞానమువలననే సంసార ముదయించుచున్నది, ఈ చైతన్యముయొక్క స్వరూపమును గ్రహించిన, సంసారము తుచ్ఛమై లయమగుచున్నది.

యదా చిత్త్వాచ్చినోత్యన్తరన్యతామసతీం తదా
అహన్తామివ సంప్రాప్య నశ్యతీవాప్యనాశినీ. 27

ఈ చైతన్యము అసద్భావమును గ్రహించినప్పుడు, నిత్యస్వభావయుతమయ్యు వినాశగ్రస్తమువలె దోచును.

ఈషత్స్పన్దాదధోయాతి భృగుప్రాన్తాత్తరోః ఫలమ్
యథా తథైవ సంవిత్తేరధఃపాతో మహానివ. 28

తొడిమ తొలగిన మాత్రముననే - ఇంతటి అల్పస్పందనముననే, పర్వతతటమునుండి వృక్షఫలము అధఃపతనమును బొందునట్లు, సూక్ష్మమగు చిత్పదార్థమునుండియే ఈ విశాలజీవభావమును గ్రహింపుము.

రూపాదీనాంతు సత్తైషా చిత ఏవామలైవ చిత్
ద్విత్వైకత్వే త్వబోధోత్థే బోధేన విలయం గతే. 29

అందువలన బాహ్యములగు రూపరసాదుల సత్తగూడ ఈ అద్వితీయచైతన్యమే యగుచున్నది. అధ్యస్తములగు భేదాభేదములుగూడ అజ్ఞానసంభూతములు. జ్ఞానబలమున నియ్యవి లయమును బొందగలవు.

సత్తామాత్రేణ చిత్తస్య బోధశ్చిత్తేన్ద్రియాదిషు
ఆలోకసత్తామాత్రేణ వ్యవహారః క్రియాస్వివ. 30

చిత్తేంద్రియాది కరణముల అనుభూతమగు సాక్షి - చైతన్యముయొక్క బోధగూడ, ఈ చైతన్యసత్తవలననే సంభవించుచున్నది; దీనియొక్క కార్యవ్యవహారముగూడ, ఈ చైతన్యముయొక్క ప్రకాశమువలననే కలుగుచున్నది.

వాతాత్కనీనికాస్పన్దస్సద్భిర్దృష్టిరుచ్యతే
తద్బాహ్యావతి తద్రూపరూపబోధస్తు చిత్పరా. 31

ఈ చైతన్యముయొక్క శక్తివలననే వ్యానవాయువు నేత్రగోళకములను చలింపజేయుచున్నది. ఈ చలనమువలన నెయ్యది ప్రకాశింపజేయబడుచున్నదో, అయ్యదియే చక్షువనంబడు

చున్నది. ఈ ఇంద్రియ ద్వారమున అంతఃకరణవృత్తి బహిర్గతమై, ఘటపటాదుల ఆకృతినిదాల్చి, వాటి సత్తను గ్రహింపజేయుచున్నది. ఇదికూడ, ఆ చైతన్యమే.

త్వఙ్మారుతౌ జడౌ తుచ్ఛౌ తత్సఙ్గః స్పర్శ ఉచ్యతే
మనసం స్పర్శసంవిత్తి స్తత్సంవిత్తిస్తు చిత్పరా. 32

త్వక్ (స్పర్శేంద్రియము), వాయువు – ఈ రెండునుగూడ తుచ్ఛములు అనగా జడములు; ఈ రెండిటి సంయోగమువలనగలుగు స్పర్శ ఈ చైతన్యశక్తివలననే సంభవించుచున్నది.

గన్ధతన్మాత్రపవనసంబన్ధో గన్ధసంవిదః
ఆసాం తు మనసా హీనం వేదనం పరమైవ చిత్. 33

గంధతన్మాత్ర, తద్గ్రాహకమగు ప్రాణవాయువుల సంబంధము గంధజ్ఞాన మనంబడుచున్నది. ఈ గంధజ్ఞానముకూడ చిత్తవృత్తికి సంబంధించినదగుటవలన గంధసంవిత్తనంబడుచున్నది. ఇయ్యది అంతఃకరణమను పరిచ్ఛిన్నప్రదేశమునుండి వేఱొనర్పబడిన, పరమ – చైతన్యముగాక వేఱొండుకాదు.

శబ్దతన్మాత్రశ్రవణవాతసజ్ఞాన్మనోవినా
సుషుప్తసదృశీ సంవిత్పరమా చిదుదాహృతా. 34

ఇట్లే శబ్దతన్మాత్రతో శ్రవణేంద్రియ – వాయువు కూడిన నయ్యది శబ్దసంవిత్తు అనంబడుచున్నది. అంతఃకరణ – వృత్తిరహితమును, నిర్వికల్పమును, సుషుప్తిసదృశమునునగు ఈ చైతన్యమే పరమచైతన్యమనంబడుచున్నది,

క్రియోన్ముఖత్వం సంకల్పాత్సంకల్పో మననక్రమః
మననం చిత్తకాలుష్యమాత్మా చిన్నిర్మలా భవేత్. 35

కర్మేంద్రియముల ప్రవృత్తివలనకలుగు సంకల్పమే చిత్తకాలుష్యమగు మననము (చింత) అనంబడుచున్నది. ఈ మనోవృత్తులకు సాక్షియగు చైతన్యమే, నిర్మలమగు ఆత్మచైతన్యమని గ్రహింపుము.

చిత్ప్రకాశాత్మికా నిత్యా స్వాత్మన్యేవాత్ర సంస్థితా
ఇదమన్తర్జగద్ధత్తే సన్నివేశం యథా శిలా. 36

ప్రకాశాత్మకమగు ఈ చైతన్యమే తనయందు తాను వెలయుచు, స్ఫటికమణివలె, తనయందే జగత్తులను ధరించుచున్నది.

అద్వితీయా దధానేదం వికారాదివివర్జితమ్
నాస్తమేతి న చోదేతి స్పన్దతే నో న వర్ధతే. 37

అద్వితీయమగు ఈ చైతన్యము నిర్వికారభావమున ఈ జగద్రూపమును ధరించినను, దీనికి ఉదయాస్తమయములుగాని, చలనముగాని, వృద్ధిగాని లేవు.

సంకల్పాజ్జీవతామేత్య నిఃసంకల్పాత్మనాత్మనా
చిజ్జడం నో జడం భావం భావయన్తీ స్వసంస్థితా. 38

సంకల్పబలమున ఈ చైతన్యము జీవభావమును దాల్చినను, సంకల్పరహితమై తనయందు తానే వెలయుచు, ఈ జడజగత్తునుగూడ వాస్తవమునకు చైతన్యమయమని గ్రహించి స్వస్వరూపమున వెలయుచున్నది.

రథస్త్వస్యాశ్చితేర్జీవో జీవస్యాహంకృతీ రథః
అహంకృతే రథో బుద్ధిస్తతో బుద్ధేర్మనో రథః. 39
మనసస్తు రథః ప్రాణః ప్రాణస్యాక్షగణో రథః
అక్షౌఘస్య రథో దేహో దేహస్య స్పన్దనో రథః. 40

జీవుడే చైతన్యముయొక్క రథము, జీవుని రథము అహంకారము, అహంకారముయొక్క రథము బుద్ధి, బుద్ధియొక్క రథము మనస్సు, మనస్సుయొక్క రథము ప్రాణము, ప్రాణముయొక్క రథము ఇంద్రియములు, ఇంద్రియములయొక్క రథము శరీరము, శరీరముయొక్క రథము కర్మేంద్రియములు. ఈ రథములన్నిటియొక్క కార్యము స్పందనము.

స్పన్దనం కర్మ సంసారే జరామరణపఞ్జరమ్.
ఏవం ప్రవర్తితం చక్రమిదమాది విభూతిజమ్. 41

జరామృత్యుమయమగు దేహపంజరమునసున్న జీవ - విహాగముల ఈ చక్రము మూలకారణమగు పరమేశ్వరుని విభూతివలన సంభవించినది.

ప్రతిభాసత ఏవాత్మన్యసత్స్వప్న ఇవాతతిః
మనాగపి న సత్యాత్మ మృగతృష్ణామ్బువత్స్థితమ్. 42

ఈ ప్రపంచమంతయు, ఆత్మయందు తుచ్ఛమగు స్వప్నమువలె ప్రతిభాసించుచున్నది. ఇందు ఒకింతయు సత్యములేదు; మరుమరీచికవలె, తుచ్ఛము.

రథస్త్వత్ర స్మృతః ప్రాణః కల్పనాయా మునీశ్వర
యత్ర ప్రాణమరుత్తత్ర మననం పరితిష్ఠతి. 43

మునీశ్వరా! పండితులు ప్రాణరథమును కల్పనారథము అనిగూడ అందురు. ఏలయన, ప్రాణమెటువైపున కలుగునో, మనస్సుగూడ అచ్చటకే యరుగును.

ఆలోకశ్రీః స్థితా యత్ర రూపం తత్రైవ రాజతే
ప్రాణో బలీ స్థితో యత్ర తదేవ పరివేపతి. 44

ప్రకాశమున్నచోటనే రూపముండును. బలవంతుడగు ప్రాణవాయువున్నచోటనే, చలనమున్నది.

యత్రప్రయాతి వనం వాత్యా తదేవ పరిఘూర్ణతే
మనస్యాకాశసంలీనే న ప్రాణః పరివేపతి. 45

ఏ యరణ్యమున వాయువు ప్రవేశించుచున్నదో, అటనే కదలిక కలుగుచున్నది. మనస్సు ఆకాశమున లీనమైన మతి కదలికయుండదు.

తేజస్య సత్తామాయాతే న రూపమివ రాజతే
ప్రాణే ప్రశాన్తే మరుతి మనో నర్శ్న మనాగపి. 46

ప్రకాశములేకున్న రూపముండనట్లు, ప్రాణవాయువు ఉపశమించిన, మనస్సనునది బొత్తిగ ఉండదు.

వాత్యాయాముపశాన్తాయాం రజో న పరికమ్పతే
యత్ర ప్రాణో మరుద్యాతి మనస్తత్రైవ తిష్ఠతి 47

గాలి ఆగిపోయిన దుమారములేవదు. ప్రాణవాయువతిగినచోటకే మనస్సుగూడ అరుగుచున్నది.

యత్ర యత్రానుసరతి రథస్తత్రైవ సారథిః
ప్రాణసంప్రేరితం చిత్తం యాతి దేశాన్తరే క్షణాత్. 48

రథ మెచ్చటెచ్చటికి అరుగునో, సారథిగూడ అచ్చటచ్చటికి పోవలసియుండును. ప్రాణవాయు వెటకటిగిన, చిత్తముగూడ క్షణములో అటకఱుగును.

క్షేపణోన్ముక్తపాషాణ ఇవ తత్రాన్యథా క్షయి
యత్ర పుష్పం తత్ర గన్ధో యత్రాగ్నిస్తత్ర సోష్ణతా. 49

క్షేపిణీయంత్రమున విడువబడిన రాయివలె, మనస్సుగూడ ప్రాణమును అనుసరించుచున్నది. పుష్పమున్నచోట సుగంధమును, అగ్నియున్నచోట ఉష్ణత్వమును ఉండునట్లు, ప్రాణవాయువున్నచోట మనస్సు వెలయుచున్నది.

యత్ర ప్రాణో మరుద్యాతి యత్రేన్దుస్తత్ర తచ్ఛవిః
సంవిత్తిః పవనస్పన్దాన్నాడీసంస్పర్శనశ్చ సః. 50

చంద్రుడున్నచోట వెన్నెల ఉండునట్లు ప్రాణవాయువున్నచోట మనస్సు వెలయుచున్నది. ఈ వాయుచలనమువలననే చాక్షుషాది జ్ఞానము కలుగుచున్నది; ఈ వాయువే శరీరమందంతటను అన్నరసమును వ్యాపింపజేయు, నాడులనన్నిటిని స్పర్శించుచున్నది.

సంవిత్తిస్ఫారతా చిత్తం మనస్తత్ప్రాణకోటరే
సర్వత్ర విద్యతే సంవిద్వ్యోమస్వచ్ఛా జడాజడే. 51

చిత్తము, మనస్సులచే నిర్మింపబడినదియును, లింగశరీరాత్మకమును, ప్రాణ – కోటరమున ప్రతిబింబించి ద్విగుణీకృతమగునదియునగు చైతన్యముయొక్క వ్యాపకత్వము ప్రాణవాయువుయొక్క కార్యముగాక అన్యమెట్లువగలదు ? ఆకాశమువలె స్వచ్ఛమగు ఈ చైతన్యము జడాజడ పదార్థముల నన్నిటయు నిండియున్నది.

క్షుభ్యతీవ తు సా ప్రాణస్పన్దాదిత్యనుభూయతే
సత్తామాత్రస్వరూపేణ జడేషు సమవస్థితా. 52

ప్రాణవాయువుయొక్క స్పందనమున స్పష్టముగ అభివ్యక్తమై సంచలితమైనప్పుడే ఇయ్యది అనుభవగోచరమగును. ఈ చైతన్యము జడదేహముల ప్రాణవాయువు వలనఉద్బోధితమై, అధ్యస్తమైన చైతన్యముతో అభిన్నతను అనుభవించుచున్నది. జీవద్దశయందీ ప్రాణముండుటవలననే జడమగు దేహము నానావిధయత్నముల నొనర్చుచున్నది.

ప్రాణసంబోధితా వేత్తి వేదనాత్మతయా జడే
నానాస్ఫారసముల్లాసైర్యః పూర్వం పరివల్గతి
ప్రాణేఽతీతే త్వమనసః స ఏవాశు న వేపతి. 53

ఇట్టిదగు శరీరము ప్రాణవాయువులేకున్న మననశూన్యము, నిశ్చలమును నగుచున్నది. మునీ! పరమ – చైతన్యము పుర్యష్టకమునసే ప్రతిబింబించుచున్నది.

పుర్యష్టకే చిత్పరమా స్వే మునే ప్రతిబిమ్బతి
ఆదర్శ ఏవ ప్రతిమా దృశ్యతే నోపలాదిషు. 54
మనః పుర్యష్టకం విద్ధి సర్వకార్యైకకారణమ్
తదైవ భేదైః కథితమన్యైః స్వాశయకల్పితైః. 55

అద్దమునసే ప్రతిబింబమగుపడుచున్నది; రాతియందగపడుటలేదే! ఋషీ! కార్యములన్నిటికిని కారణమగు మనస్సునే నీవు పుర్యష్టకమని గ్రహింపుము. ఇతరులగు ఆచార్యులందఱు దీనినే శిష్యబోధార్థము విభిన్ననామముల వ్యవహరించిరి.

యస్మాదుదేతి కలనాకులదృశ్యజాలం
యత్రత్ర చ స్థితవదిత్యనుభూతముచ్చైః
యస్మాన్మనో విపరివర్తతి దేహదృష్ట్యా
సర్వం తు తత్పరమవస్త్వితి విద్ధి విశ్వమ్. 56

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే మనః ప్రతిపాదనం నామైకత్రింశః సర్గః ॥31॥

సంకల్పమయములగు ఈ దృశ్యజాలము లెద్దాననుండి ఉదయించుచున్నవో, ఎందు వెలయుచు అనుభూతములగుచున్నవో, దేనినుండి మనస్సే దేహాకారమున భ్రమింపబడుచున్నదో, ఆ పరమవస్తువే ఈ విశ్వముగూడయని గ్రహింపుము.

ఇది శ్రీవాసిష్ఠ – తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ – పూర్వభాగమున మనఃప్రాణైక్య ప్రతిపాదనమను ముప్పదియొకటవ సర్గము ॥ 31 ॥

---

## ద్వాత్రింశః సర్గః.

---

[విచేష్టయతి దేహాది యథా పుర్యష్టకం గతా
యథా దేహాన్తరం యాతి తత్సర్వమిహా వర్ణ్యతే.

పరమచైతన్యము పుర్యష్టకమును ప్రవేశించువిధమును, అయ్యది దేహాంతరముల బొందు తీరును ఈ ప్రకరణమున వర్ణింపబడుచున్నవి.]

ఈశ్వర ఉవాచ:—

మునే శృణు కథం కార్యకారిణీ స్పన్దశాలినీ
చరన్తీ చ తనుం పుంసాముపైతి పరమాభిధామ్. 1

ఈశ్వరుడు:—మునీ! ఈ పరమచైతన్యము జీవుల శరీరమును ప్రవేశించి కార్యముల నాచరింపజేయు విధిని, దేహముల ప్రవేశించి చలనయుక్తమై స్నాత, భోక్త, బ్రాహ్మణుడు, క్షత్రియుడు మున్నగు సంజ్ఞలను బడయు విధానమును జెప్పుచున్నాడను, వినుము.

ప్రాక్తనైస్తైర్నిహన్త్యేవ స్వమనోమననేహితైః
కర్మప్రవాహైర్వివిత్రైర్హి పరిక్షీవరతాం గతైః. 2
మనస్తయా గతా శక్తిః సజ్జడేవాగతా చితేః
సా స్ఫురత్యనయా బ్రహ్మన్నుచితా శక్తిభూతయా. 3

ఈ చైతన్యమునకొక శక్తియున్నది – అయ్యది ఆవరణశక్తి. అయ్యది తన కాశ్రయమగు బ్రహ్మమును మరుగుపడజేసి, లేదనిపించును, పూర్వార్జితములగు సంస్కారజనితములగు యత్నములను, వివిధములును, విధినిషేధరూపములునునగు, కాయిక వాచికకర్మలవలన మనోభావమునుబొంది, చైతన్యమునుండి యుద్భవించినదయ్యు జడమువలెనగుచున్నది. బ్రహ్మజ్ఞా! ఇట్లు వ్యవహారదశను బొందిన బ్రహ్మశక్తి జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములవలన ద్రష్ట, దృశ్య, దర్శనముల నను భేదముల బొందుచున్నది.

అస్యాః ప్రసాదాదిహ సా చిత్కలఙ్కవతీ మునే
జగద్గన్ధర్వనగరం కరోతి న కరోతి చ. 4

మునీ! పరమచైతన్యము ఈ మాయాశక్తియొక్క ప్రసాదమువలననే కళంకితమై, జగద్రూప - గంధర్వ నగరమును సృష్టించుచున్నది. (పరమార్థభావమున) సృష్టించుచుండుటయూలేదు.

చిత్త్వాద్యసత్తయా దేహో మూక స్తిష్ఠతి కుడ్యవత్
తత్సత్తయా హి స్ఫురతి నభః సంప్రేరితాశ్మవత్. 5

జడమగు ఈ శరీరము చిత్తాదులు లేకున్న కాష్ఠ, కుడ్యములవలె చేష్టారహితమగుచున్నది. అవియున్న, ఆకాశమున కెగురవేయబడిన పాషాణఖండమువలె చలించు (స్ఫురించు) చున్నది.

యథా స్ఫురత్యతిజడమయోఽయస్కాన్తసంనిధౌ
తథా స్ఫురతి జీవోఽయం సతి సర్వగతే పరే. 6

అత్యంతజడమగు లోహమున్న అయస్కాంతమణికడ చలించునట్లు, ఈ జీవుడుగూడ సర్వగామియగు పరబ్రహ్మముయొక్క సాన్నిధ్యమువలననే చలించుచున్నాడు - క్రియల నాచరించుచున్నాడు.

సర్వస్థయాత్మశక్త్యైవ జీవ ఏష స్ఫురత్యలమ్
ముకురో బిమ్బమాదత్తే ద్రవ్యాత్మన్యస్థితాదపి. 7

సర్వవ్యాపియగు ఈ చిత్ - శక్తిబలముననే ఈ జీవులందఱును వికాసము నందుచున్నారు; ఈ జీవులు చైతన్యముయొక్క ప్రతిబింబమాత్రులు. (పంచభూత) ద్రవ్యస్వభావులగు జీవులు అద్రవ్య (నిర్ధర్మక) స్వభావమగు చైతన్యముయొక్క ప్రతిబింబమని నుడువ వీలుపడదందువా? — ద్రవ్యముయొక్క ప్రతిబింబమే పడవలెనను నియమములేదు. అద్దమున గుణము, క్రియలు మున్నగువాటి ప్రతిబింబముకూడ పడుచున్నది. ఇటగూడ నట్లే గ్రహింపవలయును,

ప్రవిస్మృతస్వభావత్వాజ్జీవోఽయం జడతాం గతః
మోహాద్విస్మృతభావత్వాచ్ఛూద్రతామివ సద్ద్విజః. 8

ఈ జీవుడు బ్రహ్మముయొక్క ప్రతిబింబమైనను నిజస్వరూపమును విస్మరించినందువలన జడభావమును బొందినాడు. సత్ - బ్రాహ్మణుడు మోహావశమునను, దుష్కర్మల నాచరించుటవలనను శూద్రత్వమును బొందుచుండుటలేదా?

ప్రవిస్మృతస్వభావా హి చిచ్చిత్తత్వముపాగతా
మోహోపహతచిత్తత్వాత్సుమహానివ దీనతామ్. 9

ఈ చైతన్యము స్వస్వరూపమును విస్మరించుటవలననే, చిత్తభావమును బొందినది. మహాత్ములుగూడ మోహావశమున వికలత్వమునుబొంది దీనభావమును బొందుచున్నారు గదా.

జడయాఽవశయా దేహో వాతశక్తిసమానయా
సంచాల్యతే తదనయా వారీవ వీచిమాలయా. 10

తరంగములవలన నీరు సంచలించునట్లు, ఈ చైతన్యముగూడ ప్రాణవాయువుతో వద్యస్తమై శరీరమును సంచలింపజేయుచున్నది.

కర్మాత్మనా వరాకేణ జీవేన మనసాఽమునా
చాల్యన్తే దేహయన్త్రాణి పాషాణా ఇవ వాయునా. 11

(నౌకయందున్న) పాషాణఖండములు వాయువువలన చాలితములగునట్లు, దేహయంత్రములన్నియును జీవభావమునుబొంది మననము, క్రియాస్వభావముల బడసిన చైతన్యమువలననే చాలితములగుచున్నవి,

శరీరశకటానాం హి కర్షణే పరమాత్మనా
మనఃప్రాణోదయౌ బ్రహ్మన్కృతౌ కర్మకృతౌ దృఢౌ. 12

బ్రహ్మజ్ఞా! పరమాత్మ శరీరశకటమును నడిపింపగోరి, మనస్సు, ప్రాణములను దృఢవాహనముల రెంటిని సృష్టించినాడు.

చిజ్జడం తూరరీకృత్య రూపం జీవత్వమేత్య చ
మనోరథముపారుహ్య వహత్ప్రాణతురంగమమ్. 13
క్వచిజ్జాతపదార్థత్వం క్వచిన్నష్టపదార్థతామ్
క్వచిద్బహుపదార్థత్వం క్వచిదేకపదార్థతామ్. 14
గతేవ భిన్నేవాస్త్యేవమత్యజన్తీ నిజం పదమ్
జలతేవ తరఙ్గత్వం సైవాసదసదోదితా. 15

ఈ చైతన్యము జడరూపమును గ్రహించి, జీవభావమునంది, ప్రాణమను గుఱ్ఱము కట్టబడిన మనస్సను రథమునెక్కి, తన స్వస్వరూపమును త్యజింపకున్నను, జాగ్రద్దశయందు, జన్మించుచున్నవని తోచు పదార్థములుగను, స్వప్నావస్థయందు (మేల్కొనిన) నష్టమగు పదార్థములుగను, కనుబడుచున్నది; కాని, ఈ పదార్థములుగ మారుటలేదు. అందువలన, తరంగత్వము జలమునుండి వేఱుగానట్లు, ఈ చైతన్యముగూడ జగత్తునుండి భిన్నముకాదు.

ఉజ్జీవవ్యాత్మనో రూపం పరం స్ఫురతి వృత్తిషు
ఆలోకముపజీవ్యేమం రూపశ్రీర్దృశ్యగా యథా. 16

చిత్తవృత్తుల ప్రతిఫలించిన ఆత్మచైతన్యము నాశ్రయించుకొనియే జీవజగత్తులు స్ఫురించుచున్నవి. ఇవి కేవలము ఆత్మయొక్క ప్రకాశమువలననే ప్రకాశించుచున్నవి. వెలుతురు లేకున్న రూపము ప్రకాశింపదుకదా!

పరమాత్మని చిత్తత్త్వే స్థితే సతి నిరామయే
జీవో జీవతి సాలోకం దీపే సతి గృహం యథా. 17

దీపమున్న ఇల్లే ప్రకాశించునట్లు, నిరామయమగు పరమాత్మ - చైతన్యము ఉండుటవలనే జీవుడు జీవించుచున్నాడు.

ఆధయో వ్యాధయశ్చైవ ప్రయాన్త్యస్య ప్రపీనతామ్
అపామివ తరఙ్గత్వం వీచిత్వస్యేవ ఫేనతా 18

ఒక్కనీటినుండియే అలలు, అలలనుండి నురుగు ఉత్పన్నమగునట్లు, ఆధివ్యాధులు మున్నగు దుఃఖములు ఈ జీవునినుండియే పుట్టి, పెరుగుచున్నవి.

ఆధివ్యాధిభిరాకీర్ణ శరీరామ్భోజషట్పదః
జీవో వైషమ్యమాయాతి తరఙ్గత్వే యథా పయః. 19

శరీర - కమల - షట్పదమగు జీవుడు ఆధివ్యాధుల జీర్ణుడై, తరంగరూపప్రాప్తమును వాయుతాడితమునునగు నీటివలె దుఃఖదైన్యముల చివురుచున్నాడు.

చిచ్ఛక్తిః సర్వశక్తిత్వాన్నాహం చిదితి భావనాత్
అత్ర నైవైతి వైవశ్యం సూర్యో దీప్తైరివామ్బుదైః. 20

సూర్యుడు తాను (నీటి నావిరిగమార్చి) సృష్టించి ప్రకాశింపజేయు మేఘమండలమువలననే గప్పబడి తిరోధాన, మ్లాన, ఖండభావముల బొందునట్లు, చైతన్యముగూడ అన్నిటికిని ఆధారమయ్యు ఈ శరీరమున వైవశ్యమునందుచున్నది.

వైవశ్యాచ్చ్యవతే మోహాన్న విన్దత్యాత్మసంవిదమ్
ఘనజాడ్యపరాభూతః స్వాఙ్గావదలనం యథా. 21

ఎక్కుడుగ కల్లుద్రావి మత్తుగొన్న మనుజుడు తన అవయవము ఖండింపబడినను దానిని గ్రహింపజాలనట్లు, చైతన్యముగూడ వైవశ్యమునంది ఆత్మ - స్వరూపమును గ్రహింపజాలకున్నది.

ప్రాప్య చాప్యనుసంధానమస్యా మోహో వినశ్యతి
ఘనమోహరతో జన్తుః స్వకార్యస్మరణం యథా. 22

మద - మత్తుడు కైపు తగ్గిన తానా సమయమున యొనర్చిన చేయిదముల గుర్తుకు దెచ్చుకొనగలిగినట్లు, చైతన్యముగూడ మోహము వినష్టమవ స్వస్వరూపమును గ్రహింపగలదు.

యదాఙ్గసంవిదాం వాతస్పన్దశక్తిః ప్రమోషతః
న కరోత్యనుసంధానం కుష్ఠి స్పన్దైషణం యథా. 23

అసంవిత్స్పన్దతో దేహే పద్మపత్రం హృది స్థితమ్
న స్ఫురత్యపరామృష్టం దారుపాత్రం యథా బహిః. 24

కుష్ఠరోగి హస్తపాదములవలె కొంచెము కొంచెముగ సర్వశరీరవ్యాపియగు జీవచైతన్యము విలుప్తమన ప్రాణవాయువుయొక్క శక్తిగూడ. హస్తపాదాది శరీరాంగములుగూడ వైకల్యమునందును. అప్పుడు, చైతన్యము హృదయకమలమున చలనరహితమై, యజ్ఞమున నుపయోగింబడని కాష్ఠపాత్ర వలె నుండును.

నిఃస్పన్దే పద్మపత్రేఽన్తః ప్రాణాః శాన్తిం ప్రయాన్త్యమీ
తాలవృన్తే యథాఽస్పన్దే బహిః పవనశక్తయః. 25

హృదయకమల - దళములు చలనరహితమవ, విసన - కఱ్ఱను వీవనిచోగాలి కట్టువడునట్లు, అంతరముననున్న ప్రాణవాయువులన్నియు వాగిపోవును.

ప్రాణే శాన్తేతరస్సర్వే జీవో నిష్పూర్ణమాకతామ్
యాతి శాన్తే నభోవాయా న దృశ్యత్వం యథా రజః 26

గాలి ఆగిపోవ కట్టుపడు దుమారమువలె, ప్రాణవాయువు లోనడగిన, జీవుడు నామరూపో పాధిరహితుడై కారణ - స్వరూపుడై వెలయును.

విరజం విగతాధారం మనో హి శివ్యతే మునే
తిష్ఠత్యాత్మపదం లబ్ధ్వా జలాదితరుబీజవత్. 27

మునీ ! అప్పుడు అతని మనస్సుగూడ రజోగుణహీనము, నిరాధారమునై, ప్రాణవాయువు తో లీనమై కారణాత్మతనందును. మఱల, వృక్ష - బీజమువలె దేహరూపమున ప్రకాశించుచుండును.

ఇతి వైకల్యమాయాతైః కారణౌఘైః సమన్తతః
పుర్యష్టకే శమం యాతే దేహః పతతి నిశ్చలః. 28

ఇట్లు వైకల్యమునందిన మూలకారణముతో పుర్యష్టకము ప్రశాంతమైన, దేహము నిశ్చల మై పడిపోవును.

చిచ్చేత్యచేతనాన్మోహాత్స్పన్దమాయాన్తి వాసనాః
తదీరితా స్మరత్యన్తరన్యద్విస్మరతి స్వయమ్. 29

స్వస్వరూపాజ్ఞానమను మోహమువలన చైతన్యముచేత్యాకారమును బొందుచున్నది; దాని యందే వాసనాసమూహములన్నియుగూడ స్పందించుచున్నవి.

హృత్పద్మపత్రస్ఫురణాత్స్ఫుటం పుర్యష్టకం భవేత్
హృత్పద్మయన్త్రే వహనాద్రుద్ధే పుర్యష్టకం క్షయి. 30

ఈ వాసనలవలన పరిచాలితమై చైతన్యము స్వస్వరూపమును విస్మరించి, అళీకములగు కల్పనల నొనర్చుకొనుచుండును. క్రమముగ హృదయ - కమల - దళములు వికసింప, పుర్యష్టకము గూడ పరిస్ఫుటమగును. ఈ హృదయ - కమల - యంత్రమును నిశ్చలమొనర్చిన పుర్యష్టకము గూడ వినష్టమైపోవును.

దేహే పుర్యష్టకం యావదస్తి తావత్స జీవతి
శాన్తే పుర్యష్టకే దేహో మృత ఇత్యుచ్యతే ద్విజ. 31

ద్విజా! శరీరమధ్యమున పుర్యష్టక మున్నంతవఱకు అయ్యది జీవద్దశనందియుండును. పుర్యష్టకము క్షీణించిన, శరీరము మృతమైనదిగ జెప్పబడును.

విరుద్ధమలసంబోధాచ్ఛేదభేదదశావశాత్
న ప్రస్ఫురతి హృత్పద్మయన్త్రమభ్యన్తరే యదా. 32
తదా పుర్యష్టకం శాన్తిముపైతి గగనే శనైః
సంరోధితే వాతయన్త్రే యథా పవనసంతతిః. 33

కఫవాతపిత్తములును, రాగద్వేషములునునను మలరాశియొక్క ప్రకోపమువలను, అస్త్రశస్త్రాదులవలనను, శరీరము ఛేదింపబడి భంగమవ, హృత్ - పద్మ - యంత్రము స్ఫురింపదు; అప్పుడు పుర్యష్టకము వాయు - యంత్రమున నిరోధింపబడిన గాలివలె, నెమ్మదిగా ఆకాశమున గలసిపోవును.

స్వసంవిత్తివశాజ్జీవో వైవశ్యముపగచ్ఛతి
పద్మయన్త్రం శరీరస్థం ప్రవాహం యాతి నిత్యదా. 34

తన సంకల్పలవలననే జీవుడు మరణాది దుఃఖసమూహము ననుభవించుచున్నాడు. మఱియు, శరీరమునందలి పద్మ - యంత్రముగూడ ఎడతెగక చలించుచున్నది.

వాసనా విమలా యేషాం హృదయాన్నాపసర్పతి
స్థిరైకరూపజీవాస్తే జీవన్ముక్తాశ్చిరాయుషః. 35

ఎవ్వరి హృదయమున సర్వదా పవిత్రమగు వాసన యుండునో, అట్టి జీవులు శాశ్వతులును, ఏకరూపులును, చిరజీవులును, జీవన్ముక్తులునై వెలయుదురు.

సంరుద్ధే పద్మయన్త్రే హి ప్రాణే శాన్తిముపాగతే
దేహః పతత్యధైర్యోఽయం కాష్ఠలోష్టసమః క్షితౌ. 36

హృత్పద్మయంత్రము నిరుద్ధమవ, ప్రాణవాయువు శాంతింప, ఈ శరీరము ధృతి శక్తినివీడి, కాష్ఠలోష్ఠసమమై భూమిమీద గూలును.

యత్రైవ వ్యోమ్ని మరుతి లీనం పుర్యష్టకం భవేత్
తత్రైవ తత్రైవ తదా లయమేతి మనో మునే. 37

మునీ! ఈ పుర్యష్టకము ఆకాశ - వాయువుతో లీనమైనప్పుడే, మనస్సుగూడ ఆకాశమున లీనమగును.

సుచిరాభ్యస్తభావం తు వాసనాఖచితం మనః
యత్ర యత్ర భ్రమత్స్వర్గనరకాది ప్రపశ్యతి. 38

అనాదికాలమునుండి అభ్యస్తములగు వాసనల గూర్చుకొని మనస్సెచ్చటెచ్చట పరిభ్రమించుచుండునో, అచ్చటచ్చట స్వర్గనరకముల గాంచుచుండును.

శరీరం శవతామేతి మనోమారుతవర్జితమ్
గతే గృహజనే దూరం గృహం సంశూన్యతామివ. 39

గృహస్థుడు దూరమవ పాడుపడు ఇంటువలె, మనస్సు ప్రాణవాయువులు లేచిపోయిన శరీరము శవరూపమునందును.

సర్వగా చిచ్చేతనతో జీవీభూయ మనఃస్థితా
పుర్యష్టకవపుర్భూత్వా సాఽఽతివాహికదేహినీ. 40

సర్వగామియగు బ్రహ్మచైతన్యమే చేత్యభావమును, అందుండి చేతనభావమును, దానినుండి జీవభావమును, దానినుండి మనోభావమును, అందుండి పుర్యష్టక రూపమునుదాల్చి సూక్ష్మశరీరమును, దాల్చుచున్నది.

తన్మాత్రపఞ్చకం చిత్తం క్రోడీకృత్య వ్యవస్థితా
స్వప్నభ్రమవదాకారం భావాత్స్థూలం ప్రపశ్యతి. 41

సూక్ష్మభూతముల సమిష్టియగు ఈ అతివాహిక (సూక్ష్మ) శరీరము చిత్తమును తనయొడిలో వైచుకొని భావనాబలమున స్వప్నభ్రమవలె స్థూలశరీరమును గాంచుచున్నది.

దృఢభావనయా పశ్చాత్తత్రైవ రసశాలినీ
ఆతివాహికదేహత్వం విస్మరత్యఖిలం క్షణాత్. 42

ఈ భావన దృఢమవ, దీనినే సత్యమనిదలచి, దీనియందు ఆసక్తినిగొని తన అతివాహిక భావమును మఱచును.

అసత్యేవ శరీరేఽస్మిన్కృతే కృత్రిమభావనా
నయత్యసత్యం సత్యత్వం సత్యం చాసత్యతామపి. 43

ఇట్లు కృత్రిమమగు భావనవలన అసత్య - శరీరమున సత్యబుద్ధినిగొని, అసత్యమును సత్యముగను, సత్యము నసత్యముగను యొనర్చుచున్నది.

సర్వగా హి చిదంశేన జీవీభూయాభవన్మనః
మనః పుర్యష్టకరథమాక్రామతి తతో జగత్. 44

సర్వగామియగు ఈ చైతన్యముయొక్క ఒక అంశమాత్రము (అనగా చైతన్యము తనయందు అంశమును గల్పించుకొని,) మనస్సుగమారి, పుర్యష్టక-రథము నారోహించి జగత్తు నాక్రమించుచున్నది.

పుర్యష్టకం వాతమయం దేహముత్థాపయత్యలమ్
హృత్స్పన్దివేతాల ఇవ జీవతీత్యుచ్యతే తదా. 45

ఈ చైతన్యము సూక్ష్మభూతాత్మకమును, ప్రాణమయమునునగు పుర్యష్టకరూప - శరీరమును లేవదీయ, జనులు దానిని జీవించియున్నదానిగ పేర్కొనుచున్నారు. ఈ జీవించియుండుట, శవమధ్యమున బేతాళుడు ప్రవేశింప అది కదలిన, జీవించియున్నదని తలచుటతో బోలుచున్నది.

క్షీణే పుర్యష్టకే చిత్తం యదా వ్యోమని లీయతే
తదా స్ఫురతి దేహోఽయం మృత ఇత్యుచ్యతేఽపి చ. 46

పుర్యష్టకము నశించి, చిత్త మాకాశమున లీనమవ శరీరము కాష్ఠపాషాణములవలె అచేతనమగును. ఈ స్థితినే శరీరము మృత మనబడును,

స్వభావవశతో జీవో విస్మృత్యా శక్తిమృచ్ఛతి
వైవశ్యాత్కాలవశతః పర్ణం జర్జరతామివ. 47

క్రొత్తదగు చివురుటాకు కాలక్రమమున ఎండిపోవునట్లు, జీవభావమునందిన ఈ చైతన్యము అజ్ఞానమున తన అజరామర బ్రహ్మస్వరూపమును మఱచి, కాలక్రమమున వైవశ్యమునంది శక్తిరహితమగును.

జీవశక్త్యా పరామృష్టే నిరుద్ధే పద్మయన్త్రకే
ప్రాణే సంరోధమాయాతే మ్రియతే మానవో మునే. 48

మునీ! పిదప హృత్పద్మయంత్రము జీవ - స్మృతిని గోల్పోయి నిశ్చలమవ, ప్రాణవాయువు నిరుద్ధమగును. అప్పుడే, మనుష్యుని మృతుడందురు.

యథా జాతాని జాతాని చాన్యాన్యన్యాని కాలతః
వృక్షాత్పర్ణాని శీర్యన్తే శరీరాణి తథా నృణామ్. 49

వృక్షపత్రములు యథాసమయమున పుట్టి, ఎండి రాలిపోవునట్లు మనుష్యుల శరీరములుగూడయని గ్రహించునది.

జాయన్తే చ మ్రియన్తే చ శరీరాణి శరీరిణామ్
పాదపానాం చ పర్ణాని కా తత్ర పరిదేవనా. 50

వృక్షపత్రములవలె మనుష్యశరీరములుగూడ, పుట్టి గిట్టుచున్నవి, జననమరణములు వీటికి స్వాభావికములు. అగుచో దుఃఖింపనేల ?

చిదమ్బుధౌ స్ఫురన్త్యేతా దేహబుద్బుదపఙ్క్తయః
ఇతశ్చాన్యా ఇతశ్చాన్యా ఏతాస్వాస్థా న ధీమతః. 51

చిత్సముద్రమున, ఏ యే వైపుల, ఎన్ని, శరీములను బుద్బుద - పంక్తులు లేచుచున్నవో చెప్పజాలను. బుద్ధిమంతులకు వీటియందు శాశ్వత - బుద్ధిలేదు.

సర్వగాపి చిదేతస్మింశ్చేతసి ప్రతిబిమ్బతి
పదార్థమన్తరాదత్తే నాన్యో హి ముకురాదృతే 52

బ్రహ్మచైతన్యము సర్వగామినియయ్యు, యీ చిత్త - దర్పణమున ప్రతిబింబించుచున్నది. అద్దముగాక మఱెయ్యది వస్తువుల తనయందు ప్రతిబింబింపజేసికొనగలదు ?

చిదమలనభసి ప్రయత్నరూపాః
పరివిత తే తదతన్మయాః స్ఫురన్తి
కలకలముఖరాః స్ఫుటాభిరామా
వివిధశరీరవిమోహతాపనాయ. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే శివపూజోపాఖ్యానే పూర్వార్ధే దేహపాతవిచారో
నామ ద్వాత్రింశః సర్గః ॥ 32 ॥

పరిపూర్ణనిర్మలమగు యీ చిదాకాశమున, ప్రాక్తనశుభాశుభకర్మల పరిణతియగు సుఖదుఃఖఫలభోగములను కోలాహలధ్వనులను చిజ్జడరూపములగు కల్పనాపుంజములు, అపాతరమణీయములును, వివిధరూపములునునగు జననమరణాదుల పరంపరతో ఆత్మను విముగ్ధమొనర్చి, తపింపజేయుటకే స్ఫురించుచున్నవి.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణ - పూర్వభాగమున దేహపాతవిచారమను ముప్పదిరెండవ సర్గము ॥ 32 ॥

---

## త్రయస్త్రింశః సర్గః

---

[యథా జీవజగద్భేదా మోహసంకల్పకల్పితాః
విచారేణైవ సంభావ్యాస్తథా తత్రైరిహోచ్యతే.

జీవ, జగద్భేదములు మోహమువలన గల్పింపబడినవనియు, వాటిని విచారము, తర్కము వలన విమర్శింపవలయుననియు యీ సర్గమున చెప్పబడుచున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

చన్ద్రార్ధశేఖరధర చిత్తత్త్వస్య మహాత్మనః
అనన్తస్యైకరూపస్య ద్విత్వం కథముపాగతమ్. 1

శ్రీ వసిష్ఠుడు:— చంద్రార్ధశేఖరధరా! గొప్పదియును, అనంతమును, ఏకరసమునునగు చిత్తత్త్వమున ద్వైతభావ మెట్లు ఆరుదెంచెను ?

కథం చ తన్మహాదేవ రూఢం పర్యాయసంకులమ్
భవేద్దుఃఖోపఘాతాయ ప్రజ్ఞయా వినివారితమ్. 2

మహాదేవా! ఈ ద్వైతభావమెట్లు ఆత్మయందు నిరూఢమై అద్దానిని దుఃఖమునంద జేయుచున్నది ? మఱియు, ఎట్లు జ్ఞానమువలన యీ దుఃఖము వినివృత్తమగుచున్నది — వచింపుము.

ఈశ్వర ఉవాచ:—

సర్వశక్తి హి తద్బ్రహ్మ సదేకం విద్యతే యదా
తదా నిర్మాల ఏవాయం ద్విత్వైకత్వకలోదయః. 3

శ్రీ ఈశ్వరుడు:— సర్వశక్తియును, సన్మాత్రమును అగు ఈ బ్రహ్మమొక్కటియే వెలయునప్పుడు (పరమార్థికస్థితియందు) ద్వైతాద్వైతవిభాగములెవ్వియు లేవు.

సతి ద్విత్వే కిలైకం స్యాత్సత్యేకత్వే ద్విరూపతా
కలే ద్వే అపి చిద్రూపే చిద్రూపత్వాత్తదప్యసత్. 4

ద్వైతభావము (ద్విత్వము) ఉన్న ఏకత్వమున్నది; ఏకత్వమున్న ద్వైతమున్నది. ఈ రెండునుగూడ చిన్మాత్రమగు బ్రహ్మముపట్ల అసత్యములు.

ఏకాభావాదభావోఽత్ర ఏకత్వద్విత్వయోర్ద్వయోః
ఏకం వినా న ద్వితీయం న ద్వితీయం వినైకతా. 5

ఏకత్వమే లేకున్న ద్వైతాద్వైతములు రెండును అసిద్ధము లగును. 'ఒకటి' లేకున్న 'రెండు' అను గణనయే యుండజాలదు. 'రెండు' అను భావముగూడ 'ఒకటి' అను భావమునుండియే కలుగుచున్నది. (వాస్తవమునకు బ్రహ్మతత్త్వము - అద్వైతమనిగాని లేక ద్వైతమనిగాని అభివర్ణింపబడజాలదు, ఈ ద్వైతాద్వైతభావములు వ్యావహారిక, పారమార్థిక దృష్టులననుసరించియే యగును; (బ్రహ్మము ద్వైతాద్వైత వివర్జితమని భావము.)

కార్యకారణయోరేకసారత్వాదేకరూపతా
ఫలాన్తస్యాపి బీజాదేర్వికారాదిహ కల్పనా. 6

లోక - వ్యవహారసిద్ధికై ఇట్లు ద్వివిధభేదమొనర్పబడినను, పరమార్థవస్తువున, ఈ ద్వైతజగత్తు ఉండుట అసంభవముకాదు. బీజమొక్క టేయైనను అయ్యదియే వృక్ష, శాఖా, పత్ర, పుష్ప, ఫల, పల్లవాది భావముల వ్యవహరింపబడుటలేదా?)

చిత్త్వం చేత్యవికల్పేన స్వయం స్ఫురతి తన్మయమ్
వికారాది తదేవాన్తస్తత్సారత్వాన్న భిద్యతే. 7

ఇట్లు వ్యవహారికసత్తనంగీకరింప ఇష్టములేకున్నను కలుగు కీడేమియునులేదు. చిత్తత్త్వమే చేత్యాది రూపమున స్ఫురించుచున్నది. దాని సారమే అన్నిట నిండియున్నది.

వికారాది వికల్పోఽయం తత్ర ఉత్థాయ వస్తుషు
యాతి సార్థకతాం నానాకార్యకారణతాదిభిః. 8

ఈ నామరూపాది వికారజాతమంతయు ఆ చిద్వస్తువునుండియే లేచి, కార్యకారణాది భేదములతో వస్తురూపమున సార్థకతనందుచున్నది. (వ్యవహరింపబడుచున్నది.)

తరఙ్గాః సలిలే యేఽపి తోయే శైలస్య తే సమాః
శశశృఙ్గసమః సోఽపి యస్య సత్యః శశాఙ్కురః. 9

పారమార్థిక, వ్యావహారిక, ప్రాతిభాసికములగు పదార్థజాతమంతయు, బ్రహ్మసత్తవలననే ఆవరింపబడియున్నవి. సముద్ర - తరంగములు, పర్వత - (మున ప్రాతిభాసికముగ కల్పింపబడిన) తరంగములు, అలీకమగు శశశృంగము (= కుందేటి కొమ్ము), శశాదుల (శశము నదోస) నుండి ఉద్భవించు వ్యావహారికములగు అంకురములు మున్నగు నవన్నియును, బ్రహ్మసత్తయుండుటవలన, సత్యములుగనే పరిగ్రహింపఁబడనగును.

వస్తుబోధోఽత్ర సంపత్తే తత్రాలం వాగ్వికల్పనైః
వ్యవచ్ఛేదాది దుశ్ఛేద్యం వచో వాచ్యాత్మికల ద్విజ. 10

ద్విజా ! అజ్ఞానము తొలగనంతవఱకు, వెయ్యియుక్తుల జూపినను, ప్రత్యక్షమగు ఈ జగద్భ్రాంతి తొలగదు. వస్తుసాక్షాత్కారమొక్కటియే దీనిని బోగొట్టజాలును.

బ్రహ్మణః సర్వశక్తిత్వం తత్త్వతో న విభిద్యతే
తరఙ్గకణకల్లోలజలౌఘు ఇవ వారిణః. 11

జలకణములు, తరంగములు, బుద్బుదములు మున్నగునవి నీటినుండి వేఱుగానట్లు, సర్వశక్తిత్వముగూడ బ్రహ్మమునుండి వేఱుగాదు. తత్త్వదృష్టికి బ్రహ్మము, శక్తుల కభేదమే గలదు.

పుష్పపల్లవపత్రాది లతాయా నేతరద్యథా
ద్విత్వైకత్వజగత్త్వాది త్వన్త్వాహన్త్వం తథా చితేః. 12

పుష్ప, పత్ర, పల్లవ, లతాదులు బ్రహ్మమునుండి వేఱుగానట్లు, ద్విత్వ, ఏకత్వ, జగత్వ, అహం, త్వమాది భావములుగూడ చిద్వస్తువునుండి వేఱుగావు.

దేశకాలవికారాదిః కృతో భేదశ్చితస్తు యః
తచ్చిదేదస్త్రోక్తం న ప్రశ్నోఽత్ర తవోచితః. 13

చిద్వస్తువున గల్పింపబడిన దేశకాలాది భేదములుగూడ చిద్వస్తువునుండి వేఱుగావు; ద్వైత మెట్లు ఆరుదెంచినది; అను ప్రశ్నవలన నీవు చిద్వస్తువుకంటె అన్యమగు విషయమును గుఱించి అశంకించితివి. చిద్వస్తువుగాక వేఱొండు లేనందువలన, ఈ నీ ప్రశ్నయే అనుచితము.

దేశకాలక్రియాసత్తానియత్యాద్యాశ్చ శక్తయః
చిదాత్మికా ఏవ చితః సత్త్వాత్సంపతితాః స్వతః. 14

ఈ దేశ, కాల, క్రియా, సత్త, నియత్యాదిశక్తులు అన్నియు చిదాత్మకము; దాని సత్తవలననే వాటియునికి.

చిత్తత్త్వం చిత్తచేత్యాహం చిద్బ్రహ్మేద్యభిధా స్మృతా
యథా వీచ్యాద్యభిధార్థం స్థితమమ్బుతరఙ్గకమ్. 15

జల - తరంగమొక్కటియే ఊర్మి, వీచి మున్నగు వెవ్వేఱు పేర్ల పేర్కొనబడునట్లు, ఈ చిత్తత్త్వమొక్కటియే బ్రహ్మ, చిత్తము, చేత్యము అహంకారము మున్నగు పేర్ల పేర్కొనబడుచున్నది.

అసంభవత్తరఙ్గస్య చిద్విలాసమహామ్బుధేః
తరఙ్గితత్వమివ యత్తత్తావచ్చేత్యసఙ్గితా. 16

ఈ చిద్విలాస - మహాసముద్రమున. (వికారరహితమగుటవలన) తరంగోదయమగుట సంభవముకాకున్నను, తరంగమువలె దోచునదెయ్యదియున్నదో, అద్దానినే చేత్యమనుచున్నారు.

తదేతత్పరమం బ్రహ్మ సత్యేశ్వరశివాదిభిః
శూన్యైకపరమాత్మాది నామభిః పరిగీయతే. 17

ఈ పరబ్రహ్మమే సత్య. ఈశ్వర, శివ, శూన్య, (= అవ్యాకృత) పరమాత్మాది విభిన్న నామముల (విభిన్నవాదులవలన) పేర్కొనంబడుచున్నది.

ఏవం రూపపదాతీతం యద్రూపం పరమాత్మనః
యత్తు నామాహమమలం విషయో న గిరాం చ తత్. 18

'అహం' అని పేర్కొనబడునదియును, పరతత్త్వమునగు ఈ పరమాత్మ నామరూపముల కతీతమైన, వాక్కున కగోచరమగుచున్నది.

యదిదం దృశ్యతే తస్యాస్తల్లతాయా మహాచితేః
ఫలపల్లవపుష్పాది న భిన్నం తన్మయం యతః. 19

పరిదృశ్యమానమగు ఈ జగత్తు, ఆ చిల్లతయొక్క ఫలపుష్పము అనదగును. ఇది ఆ చైతన్యమునుండి వేఱుగాదు; ఇయ్యది చిన్మయము.

మహావిద్యోపనయనాచ్చిద్భవత్యభిధా సతీ
సా జీవత్వేన బాహ్యత్వం తదా ద్వీన్ద్విమివ పశ్యతి. 20

ఈ చైతన్యము అవిద్యయను ఉపనేత్రమును ధరించి, జీవనామమున పేర్కొనబడి, ద్వితీయ చంద్రదర్శనమువలె, అలీకమగు ఈ బాహ్య - జగత్తును దర్శించుచున్నది.

స్వయమన్యైవమస్మీతి భావయిత్వా స్వభావతః
అన్యతామివ సంయాతి స్వవికల్పాత్మికాం స్వతః. 21

ఈ చైతన్యమే, తనయంతటతానే తన్ను జడముగను, బ్రహ్మభిన్నముగను భావించుకొని, వికల్పమయములగు విభిన్నభావముల దాల్చుచున్నది.

అకలఙ్కేన రూపేణ రూపం యత్సకలఙ్కవత్
సంసారసరితం ప్రాప్య చేతనేనైవ చేతతి. 22

ఈ చైతన్యము నిష్కళంకరూపమున వెలయుచుండియు, కల్పితమగు కళంకరూపమున సంసారనదియందు మునిగి, ఔపాధిక - చైతన్యముతో నిట చరించుచున్నది.

చిద్వపుః స్వయమేతేన హ్యేకతామేతి జీవతామ్
చిత్తత్త్వస్యావభాసేన జీవో జీవతి తన్మయః. 23

ఈ చైతన్యమే పుర్యష్టకముతో నైక్యమునంది జీవరూపమును బొందుచున్నది. ఈ జీవుడు చిత్స్వరూపముయొక్క ప్రకాశమువలననే చిన్మయుడై జీవించుచున్నాడు.

ఆతివాహికదేహోఽపి జీవతాం సముపాగతః
భావనాపఙ్కకం భూత్వా ద్రవ్యమస్తీతి వేత్త్యలమ్ 24
తద్ద్రవ్యం ప్రాణినా భుక్తమాశు గచ్ఛతి వీర్యతామ్
తతోఽహం ప్రాణవానాజ్ఞాతో వేత్తీత్యనుభవాత్మకమ్. 25

సూక్ష్మశరీరధారియగు ఈ జీవుడు 'నేను పంచభూతాత్మకమగు స్థూలదేహమును' అని భావించి, అట్టి ద్రవ్యమై, ప్రాణుల ఖాద్యములతో గలసి, వారి ఉదరమునజేరి, వీర్యముగ మారుచున్నాడు. పిదప, ఈ జీవుడు (స్త్రీల గర్భమునుజేరి) 'నేను పుట్టితిని ; నాకు ప్రాణములున్నవి' అని తలచును.

అహన్త్వాదిక్రమేణాశు పఞ్చకానుభవభ్రమాత్
స్థావరం జంగమం సర్వం వేత్తి తత్తద్భవత్యలమ్. 26

బ్రహ్మమై యిట్లు పైనజెప్పబడినతీరుగ భావించుకొని, స్థూలదేహమును అనుభవించుచు, స్థావర - జంగమాది పదార్థముల గాంచుచున్నది. మఱియు, ఆయా వాసనలవలన ఆయావస్తువులుగ మారుచున్నది.

కాకతాలీయయోగేన దృఢాభ్యాసవశేన చ
వాసనాన్తరసంశ్లేషాత్సూక్ష్మా కారముజ్ఝతి. 27

సూక్ష్మ - శరీరమందున్న చైతన్యము, స్థూల - శరీరవాసనలు ప్రబలము లగుటవలనను, సూక్ష్మ - శరీరభావనయొక్క దార్ఢ్యము తగ్గుట వలనను కాకతాళీయముగ అనగా అకస్మాత్తుగ సూక్ష్మశరీరమును పరిత్యజించుచున్నది.

ద్విత్వస్వసంవిదా ద్విత్వమేకస్యైవ ప్రవర్తతే
పుంసో వేతాలసంకల్పాద్వేతాల ఇవ భాసురః. 28

మనుష్యుడు కల్పనాబలమున తన ఎట్టయెదుట వేతాళమూర్తిని గాంచునట్లు, ఈ చైతన్య మద్వితీయమయ్యు, ద్విత్వసంకల్పమున ద్వైతమును గాంచుచున్నది.

అద్విత్వవేదనాద్ద్విత్వమాత్మనోఽపి నివర్తతే
న కరోమీతి సంకల్పాత్పురుషస్యేవ కర్తృతా. 29

'నేనేమియు ఒనర్చుచుండుటలేదు' అని భావించుటవలన పురుషుని కర్తృత్వము తొలగు నట్లు, మరల అద్వైతభావనవలన ద్వైతభావన ఉపశమింపగలదు.

ద్విత్వసంకల్పతో ద్విత్వమేకస్యైవ ప్రవర్తతే
అద్విత్వసంవిదా ద్విత్వమనేకస్యాపి నశ్యతి. 30

ద్విత్వసంకల్పమువలన అద్వితీయవస్తువు ద్వైతభావమును బొందుచున్నది. అద్వైతసం కల్పమువలన ఈ నానాత్వము (జగత్తు) నశించుచున్నది.

పరమాత్మతయా ద్విత్వం న కిలాత్మని విద్యతే
అవికారాదిమత్త్వేన సర్వగత్వేన సర్వదా. 31

అవికారియు, సర్వగమును, నిత్యమును నగుటవలన ఈ పరమాత్మయందు ద్విత్వము లేదు - ఉండజాలదు.

యత్స్వసంకల్పరచితమసంకల్పక్షయం హి తత్
యథా మునే మనోరాజ్యం గన్ధర్వనగరం యథా. 32

మునీ! సంకల్ప - రచితములగునవి సంకల్పము క్షయమైన, క్షీణించుచున్నవి. మనో రాజ్యము, గంధర్వనగరములు ఇట్టివి.

తథా సంకల్పనే క్లేశో న సంకల్పవినాశనే
సంకల్పయక్షో గన్ధర్వపుర్యాః స్రష్టా నతు క్షయే. 33

సంకల్ప మొనర్చుటయే కష్టము; సంకల్పములేకున్న ఎట్టికష్టమును లేదు. సంకల్పము యక్షుని గంధర్వనగరమును సృష్టించుచున్నది. నశింపజేయుటలేదు.

పుష్టసంకల్పమాత్రేణ యదిదం దుఃఖమాగతమ్
తదసంకల్పమాత్రేణ క్షయి క్వాత్ర కదర్థనా. 34

ప్రబలమగు సంకల్పబలమున అరుదెంచిన ఈ దుఃఖము, అసంకల్పమువలననే క్షీణింప గలదు. దీన కష్టమేమి?

యత్కించిదపి సంకల్ప్య నరో దుఃఖే నిమజ్జతి
న కించిదపి సంకల్ప్య సుఖమవ్యయమశ్నుతే. 35

ఎంత కొద్దిగ సంకల్పించుకొనినను, మనుష్యుడు దుఃఖమున బడుచున్నాడు. అద్దానిని సంకల్పింపకున్న మనుష్యుడు అక్షయమగు సుఖమును బొందుచున్నాడు.

సంకల్పవ్యాలనిర్ముక్తా న యదా తవ చేతనా
న తదా నన్దనోద్యానే త్వముచ్చైః పరిరాజసే. 36

నీ చేతనము సంకల్ప - సర్పమునుండి విడివడనంతవఱకు, రమణీయమగు నందనవనమున గూడనీకు సుఖము లభింపదు.

స్వవివేకానిలైః కృత్వా సంకల్పజలదక్షయమ్
పరాం నిర్మలతామేతి శరదీవ నభోऽన్తరమ్. 37

అందువలన నీవు స్వకీయమగు వివేక - మారుతమున సంకల్ప - మేఘముల చెదరగొట్టి, శరదాకాశమువలె పరమనిర్మలతను బొందుము.

సంకల్పసరితం మత్తాం మణిమన్త్రేణ శోషయ
తత్రోహ్యమానమాత్మానం సమాశ్వాస్య భవామనాః. 38

నీవు ఉన్మత్తయగు ఈ సంకల్పనదిని, మణిమంత్రముల విశుష్కమొనర్చి, ఇందు తేలిపోయెడి ఆత్మ నోదార్చి, నిర్మనస్కుడవు కమ్ము.

సంకల్పానిలనిర్ధూతం భ్రాన్తం పర్ణతృణాంశవత్
భూతాకాశే చిదాత్మానమవలమ్బ్య విలోకయ. 39

నీ చిదాత్మ సంకల్ప - మారుతమున నెగురగొట్టబడి, తృణ, పర్ణఖండములవలె భూతాకాశమున భ్రమించుచున్నది. నీవద్దాని యథార్థరూపమును నిరీక్షింపుము.

స్వసంకల్పనకాలుష్యం వినివార్యాత్మనాత్మనః
పరం ప్రసాదమాసాద్య పరమానన్దవాన్భవ. 40

స్వయముగ నీవు సంకల్పజనితమగు ఆత్మకాలుష్యమును దూరమొనర్చి, పరమనిర్మలభావమును బొంది, పరమానందయుక్తుడవు కమ్ము!

సర్వశక్తిమయో హ్యాత్మా యద్యథా భావయత్యలమ్
తత్తథా పశ్యతి తదా స్వసంకల్పవిజృమ్భితమ్. 41

పరమశక్తిమయమగు ఈ ఆత్మ, దేనినెట్లు భావించుచున్నదో, దానినట్లే తన సంకల్పబలమున గాంచుచున్నది.

సంకల్పమాత్రమేవేదం జగన్మిథ్యాత్వముత్థితమ్
అసంకల్పనమాత్రేణ బ్రహ్మన్నాక్వాపి విలీయతే. 42

ఈ జగత్తు సంకల్పమునుండియే కలుగుచున్నది; అందువలన నియ్యది మిథ్య బ్రహ్మజ్ఞా! సంకల్పము క్షీణించిన, ఇది యెచ్చటనో విలీనమగును.

సంకల్పవాతవలితం జన్మజాలకదమ్బకమ్
అసంకల్పానిలస్పర్శాద్విప్రశామ్యతి పరేపదే. 43

సంకల్ప - వాయువున గుమిగూర్చబడిన జన్మపరంపరలను మేఘములు, అసంకల్ప - అనిలము దాకినవెంటనే పరమపదమున విలీనమగుచున్నవి.

తృష్ణాకరఞ్జలతికామిమాం రూఢిముపాగతామ్
సంకల్పమూలోద్ధరణాత్పరిశోషవతీం కురు. 44

దృఢముగ పాతుకొనిపోయిన తృష్ణయను యీ కరంజలతను, సంకల్పమను వ్రేళ్లను పెకలించి ఎండువారునట్లొనర్పుము.

ప్రతిభాససముత్థానం ప్రతిభాసపరిక్షయమ్
యథా గన్ధర్వనగరం తథా సంసృతివిభ్రమః. 45

సంకల్పముతొలగినను జగత్తుయొక్క ఆభాసముండిన, అద్దానిని ప్రతిభాసయని గ్రహింపుము. ఇయ్యది తొలగనంతవఱకు జీవన్ముక్తులు జగత్తును గంధర్వనగరమువలె అలీక - బుద్ధితో గాంచుచుందురు.

ప్రభురస్మీతి విస్మృత్య తావచ్ఛోచతి భూమిపః
భూమిపోఽస్మీతి సంజాతా యావన్నాస్య హృది స్మృతిః. 46

రాజు, తాను రాజునను విషయమును మఱచి, మఱల మనస్సున దాను రాజునను స్మృతి ఉదయించువఱకు శోకించుచుండును.

నాస్య తజ్జాతయా బ్రహ్మన్ప్రాక్స్మృతిర్వర్తమానయా
శరదేవోపగతయా ప్రావృడ్జాడ్యాపవారిణీ. 47

బ్రహ్మజ్ఞా! మఱల ఆప్తులవలన ప్రాక్తనస్మృతి ఉదయింపజేయబడినప్పుడు, శరత్ - కాలమరుదెంచలోకముల కప్పువడజేయు వర్షఋతువు తొలగునట్లు, రాజసంబంధమగు అజ్ఞానము బాధింపబడును. (ఇట్లే ముక్తులపట్లయనియు గ్రహించునది.)

ఘనప్రవాహయాఽకస్మాచ్చిత్తేహా సైవ వర్ధతే
య ఏవోచ్చైఃస్వరస్తన్త్ర్యాః స ఏవాక్రామతి శ్రుతిమ్. 48

ప్రాక్తన, వర్తమాన స్మృతులు (సంస్కారము) లలో నెయ్యది ప్రబలముగనుండునో, అయ్యదియే వర్ధిల్లును. (ఈ స్మృతిని నిరాకరించుటకై, శ్రవణమనన నిదిధ్యాసనముల ఆవశ్యకత). వీణా - తంత్రుల, ఎద్దానిధ్వని పెద్దగనుండునో, అయ్యదియే శ్రుతికి దగులునుగదా!

అహమేకోఽహమాత్మాస్మీత్యేకాం భావయ భావనామ్
తయా భావనయా యుక్తః స ఏవ త్వం భవస్యలమ్. 49

నీవు, 'నే నద్వితీయ ఆత్మను' అని ఏకత్వభావన నొనర్పుము. ఈ భావనతో యుక్తుడవై యున్న నీవు ఆ బ్రహ్మమే కాగలవు.

ఏవం హ్యసంభవదిదం త్వవిరాగభాస్వ
త్తత్స్త్వముత్తమపదం పరమేకదేవః
పూజానుపూజకసుపూజనపూజ్యరూపం
కించిన్న కించిదివ చిత్తపదైకమూర్తిః. 50

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ద్వైతైక్యప్రతిపాదనం నామ త్రయస్త్రింశః సర్గః ॥ 33 ॥

అందువలన, బాహ్య - పూజ నినుబోలువారికి తగదు. తుచ్ఛఫలముల గోరువారే ఇద్దాని నొనర్తురు; ఇది వారిపట్లనే చెల్లును. నీవు పూజనీయమగు దేవత ఆ పరమార్థ - సత్ ఒక్కటియే. ఇదిగాక తక్కిన అర్చనా యత్నములు (అనగా ప్రతిమా నిర్మాణము, పూజాద్రవ్యసంగ్రహము, పూజారి మున్నగునవి) నీకు లేవు. ఈ సామగ్రి అంతయు అలీకమగు మనస్సుయొక్క కల్పన మాత్రమే యైయున్నది. దీన వాస్తవమగు దేవుని పూజ వీలుపడదు.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ - పూర్వభాగమున ద్వైతైక్యప్రతిపాదనమను ముప్పది మూడవ సర్గము ॥ 33 ॥

---

## చతుస్త్రింశః సర్గః.

---

[సౌషుప్తమిహ తుర్యం చ తుర్యాతీతపదం తథా
ఉపదిశ్యేశ్వరోఽత్రైవ విశ్రాన్త ఇతి వర్ణ్యతే

సుషుప్తి, తురీయము, తురీయాతీత పదముల నుపదేశించి, ఈశ్వరుడు విశ్రమించుట వర్ణింపబడుచున్నది.]

ఈశ్వర ఉవాచ :—

ఇత్థం స్థితమిదం విశ్వం సదసద్దేవరూపి చ
ద్వైతైక్యపదనిర్ముక్తం యుక్తం ద్వైతైక్యమప్యతః. 1

ఈశ్వరుడు:— ఈ దేవపూజవలన సదసద్రూపమగు విశ్వమే పూజింపబడుచున్నది. విశ్వము బాధిత - దృష్టికి అసత్తు అయినను, అధిష్ఠానదృష్టికి సత్తు; వ్యావహారికదృష్టికి దీనియందు ఏకత్వద్విత్వములున్నవి, పారమార్థికదృష్టియందివి ఏమియును లేవు. ఈ విషయములన్నియును యుక్తియుక్తములు.

చితేః కలఙ్కవైరూప్యమితి సంసారతాం గతమ్
అకలఙ్కమసంసారి తచ్చాభిన్నాద్వయాత్మకమ్. 2

చైతన్యముయొక్క మోహవైకల్యమే సంసారము; తత్త్వదృష్టికి చైతన్యము నిష్కళంకము, అసంసారి, అద్వయము, భేదరహితము.

ఇయమస్మీతి సంప్రాప్తకలఙ్కా చిన్నిబధ్యతే
ఏతామేవ కలాం బుద్ధ్వా స్వకాభిన్నాం విముచ్యతే. 3

'ఈ దేహాదులు నేను' అని భావించుకొని, ఆ కళంకమున చైతన్యము బంధింపఁబడుచున్నది; ఈ కల్పనయొక్క కర్త తననుండి వేఱుగాదని గ్రహించి విడివడుచున్నది.

చిదగ్రాకారతాభావాద్విత్వాత్సత్త్వం సముజ్ఝతి
సుఖాదిమిలితాం ధత్తే న సత్యాం సదితి క్షణాత్. 4

ఈ చైతన్యమే బాహ్యపదార్థముల భావించి, ద్విత్వమునుబొంది, తన అఖండసత్తను పరిత్యజించుచున్నది; శారీరకములగు సుఖదుఃఖములతోగూడిన ఈ కల్పిత – అసత్యపదార్థములను సత్యములుగ గ్రహించుచున్నది.

శుద్ధా నిరంశా సత్యా వాఽసత్యా వేత్యేవమాదిభిః
విముక్తా నామశబ్దార్థైః సర్వైః సర్వాత్మికాపి ఖమ్. 5

వ్యావహారికదృష్టికి ఇయ్యది నామరూపాత్మకముగ దోచుచున్నను, ఇందెట్టి ధర్మమును లేదు. ఇందు సత్య – అసత్యాది విధములగు వికల్పములు, నామరూపములు లేవు. ఇయ్యది వాస్తవమునకు నిరవయవము, విశుద్ధము.

సర్వం నిరుపమం శాన్తం మనసైతత్త్రిమార్గగమ్
బ్రహ్మేదం బృంహితం బ్రహ్మ శక్త్యాఽఽకాశవికాసయా. 6

పూర్ణమును, నిరుపమమునగు బ్రహ్మమే మొదట ఆకాశమువలె వికాసమునంది జాగ్రత్స్వప్నసుషుప్తులతోగూడిన సంసారమును, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికమార్గములు గల జగత్తును, తన శక్తివలన వికసింపజేయుచున్నది.

మనసా మనసి చ్ఛిన్నే స్వేన్ద్రియావయవాత్మని
సత్యాలోకాజ్జగజ్జాలే పరిచ్ఛిన్నే విలయం గతే. 7

తన ఇంద్రియములలో నొక్కటియగు మనస్సువలన మనస్సును ఖండింప, సత్యము ప్రకాశించి, జగజ్జాలముల విలోపమొనర్చును.

ఛిద్యతే శీర్ణసంసారకలనా కల్పనాత్మికా
భృష్టబీజోపమా సత్తా జీవస్య ఇతినామికా 8

అప్పుడు కల్పనయగు ఈ క్షుద్రసంసారము భంగింపబడుచున్నది; ఇట్టి స్థితినిబడసిన జీవుని ఉనికి, 'ఇతి' అను శబ్దమున (ఉపనిషత్తుల జెప్పబడియున్నట్లు) నిర్దేశింపబడును. ఈ జీవుడు మరల జన్మనుబొందకపోవుటవలన ఇతని సత్త, వేయింపబడి అంకురోత్పాదనశక్తిని గోలుపోయిన బీజముతో బోల్పబడుచున్నది.

పశ్యన్తీ నామ కలితోత్సృజన్తీ చేత్యచర్వణామ్
మనోమోహాభ్రనిర్ముక్తా శరదాకాశకోశవత్. 9

దృశ్యపదార్థములన్నియును బాధింపబడుటవలన, ఈ సత్త అప్పుడు కేవలము దృక్ – స్వరూపముగ మారుచున్నది. అందువలన నియ్యది 'పశ్యంతీ' (ద్రష్ట) అను పేరిటగూడ పేర్కొనబడును. ఆ జీవుడు చేత్యవిషయముల (చిత్తవిషయముల) స్మరించుటగూడ మాని, మనో – మోహమను మేఘములనుండి విడివడి, శరత్కాల ఆకాశమువలె నిర్మలమై విరాజిల్లును.

శుద్ధాచిద్భావమాత్రస్థా చేత్యచిచ్చావలం గతా
సమస్తసామాన్యవతీ భవతీర్ణభవార్ణవా. 10

ఇంతకుమునుపు ఈతడు విషయవస్తువుల గుఱించి చిత్తచాపల్యమును బొందుచున్నను, ఈ జీవన్ముక్తస్థితియందు, అది తొలగిపోవుచున్నది; అతడు సంసారసాగరమునందుండి, జీవద్దశయందే ఉత్తీర్ణుడై, నిఖిలపదార్థముల సత్తయగు కేవలచైతన్యరూపమును బొందును.

అపునర్భవసౌషుప్తపదపాణ్డిత్యపీవరీ
పరమాసాద్య విశ్రాన్తా విశ్రాన్తా వితతే పదే. 11

అప్పుడాతడు పునర్జన్మ - బీజ - రహితమగు సౌషుప్తపద (నిరతిశయానంద స్వరూప) - పాండిత్యము నపరిమితముగబొంది, గొప్పదగు బ్రహ్మపదమున విశ్రమించును.

ఏతత్తే మనసి క్షీణే ప్రథమం కథితం పదమ్
ద్వితీయం శృణు విప్రేన్ద్ర శక్తేరస్యాః సుపావనమ్. 12

విప్రేంద్రా! నీ కింతవఱకు మనోక్షయమగు చైతన్యముబొందు స్థితిని జెప్పితిని; ఇప్పుడు పవిత్రమగు ద్వితీయావస్థను జెప్పుచున్నాడను. వినుము.

ఏషైవ మనసోన్ముక్తా చిచ్ఛక్తిః శాన్తిశాలినీ
సర్వజ్యోతిస్తమోముక్తా వితతాకాశసున్దరీ. 13

మనోదశనుండి విడివడిన ఈ చైతన్యమే, సూర్యచంద్రాది జ్యోతిష్పదార్థములనుండియు, అజ్ఞానాది అంధకారములనుండియు విడివడిన శాంతిమయమమై విశాలమగు ఆకాశమువలె స్వచ్ఛభావమున వెలయును.

ఘనసౌషుప్తలేఖావచ్ఛిలాన్తఃసన్నివేశవత్
సైన్ధవాన్తస్థరసవద్వాతాన్తఃస్పన్దశక్తివత్. 14
కాలేన యత్ర తత్రైవ పరాం పరిణతిం యదా
శూన్యశక్తిరివాకాశే పరమాకాశగా తదా. 15
చేత్యాంశోన్ముఖతాం నూనం త్యజత్యబ్ధివ చాపలమ్
వాతలేఖేవ చలనం పుష్పలేఖేవ సౌరభమ్. 16
కాలతాకాశతే త్యక్త్వా సకలే సకలాకలా
న జడా నా జడా స్ఫారా ధత్తే సత్తామనామికామ్. 17
దిక్కాలాద్యనవచ్ఛిన్నమహాసత్తాపదం గతామ్
తుర్యతుర్యాంశకలితామకలఙ్కామనామయామ్. 18
కాంచిదేవ విశాలాక్ష సాక్షివత్సమవస్థితామ్
సర్వతః సర్వదా సర్వప్రకాశస్వాదుతత్పరామ్. 19

అనంతర మయ్యది కాలక్రమమున గాఢసుషుప్త్యనుభవమువలెను, పాషాణకాఠిన్యమువలెను, సైంధవమునందలి రసమువలెను, వాయువునందలి స్పందశక్తివలెను, ఎప్పుడెచ్చట కేవల చిన్మాత్రరూపముగ పర్యవసించునో, అప్పుడు ఆకాశమునందలి శూన్యతవలె పరమాకాశముతో గలసి, బాహ్యవిషయ - ఔత్సుక్యమును విడచి, వాయువువలన గదల్పబడని నీటివలె నిశ్చలభావమున వెలయును, అప్పుడు ఇయ్యది వాతలేఖ (వాయుకణము) స్పందమును త్యజించునట్లును, పుష్పము సౌరభ

మును వీడునట్లును, దేశ, కాలముల త్యజించి, సమస్త - దృశ్యవస్తువుల అనుభవమునుండి విడివడును. అనంతరము జడాజడభావములనుండి విముక్తినంది, అపరిచ్ఛిన్నత్వమునుబొంది, ఒకానొక అనిర్వచనీయసత్తను బొందును. ఈ మహాసత్త దిక్కాలాద్యనవచ్ఛిన్నము. ఆ స్థితి తురీయము, అకలంకము అనామయము, ఆ స్థితియందలి ఆనందము అన్నివస్తువులనుండి, అన్నికాలముల లభించు ఆనందముకంటె మహత్తరమైనది. ఈ ఆనందమునుగాంచుచు, విశాలాక్షునివలె జీవన్ముక్తపురుషుడు వెలయుచుండును.

ఏషా ద్వితీయా పదతా కథితా తవ సువ్రత
తృతీయం శృణు వక్ష్యామి పదం పదవిదాం వర. 20

సువ్రతా ! నీ కిప్పుడు ఈ చైతన్యముయొక్క ద్వితీయస్థితిని జెప్పితిని. తత్వవిచ్ఛ్రేష్ఠా ! ఇక, తృతీయ అవస్థను జెప్పుచున్నాడను. వినుము.

ఏషా దృక్చేత్యవలనాదనామార్థాపదం గతా
బ్రహ్మాత్మేత్యాదిశబ్దార్థాదతీతోదేతి కేవలా. 21

ఈ చైతన్యము బ్రహ్మాకార - అఖండ చిత్తవృత్తిని దాని, ననుసరించియుండు బ్రహ్మైక్యభావమును బొందుటవలన నామరూపాతీతమగు బ్రహ్మము, ఆత్మ మున్నగు సంజ్ఞల నతిక్రమించి, కేవల స్వరూపమున వెలయును.

స్థైర్యేణ కాలతః స్వస్థా నిష్కలఙ్కా పరాత్మనా
తుర్యాతీతాది నామత్వాదపి యాతి పరం పదమ్. 22

అప్పుడయ్యది షడ్విధభావవికారములనుండి విడివడి, కాలముకంటెగూడ శాశ్వతమై, తమస్సునకు పరముననున్న స్వస్వరూపమున నిష్కలంకమై, తురీయాతీతాది నామములకుగూడ అతీతమై, పరమపురుషార్థరూపమును బొందును.

సా పరా పరమా కాష్ఠా ప్రధానం శివభావతః
చిత్యైకా నిరవచ్ఛేదా తృతీయా పావనీ స్థితిః. 23

ఇదియే సుఖములన్నిటియొక్క పరమావధి; శుభములన్నిటిలోను ప్రధానము. వినాశనములేని ఈ పవిత్రస్థితియే, చైతన్యముయొక్క తృతీయ అవస్థ.

చిరమస్యాం ప్రతిష్ఠాయాం సర్వాధ్వాధ్వగదూరగా
సా మమాప్యఙ్గ వచసాం న సమాయాతి గోచరమ్. 24

వత్సా! ఈ భూమికయందు వసించుట చాల కష్టము. ఇది అన్నిమార్గములకును, అందలి పథికులకును దూరమై వెలయుచున్నది. నా వాక్కులకుగూడ అతీతమై అభివర్ణింప శక్యముగాకయున్నది.

త్రిమార్గకలనాతీతమితి తే కథితం మునే
తిష్ఠ తస్మిన్పదే నిత్యమితి దేవః సనాతనః. 25

మునీ ! ఈ చెప్పబడిన చైతన్యము జాగ్రత్స్వప్నసుషుప్తుల కతీతము; ఇందు నీవు నిత్యమధివసింపుము. ఇదియే సనాతనమగు పరమదైవము.

ఏతన్మయమిదం విశ్వం మునే తన్మయవేదనాత్
సత్యసంవేదానాన్నేదం నచ నేదం మునీశ్వర. 26

మునీ! ఈ విశ్వముయొక్క ఉపాదానకారణము చైతన్యము అని భావించిన, విశ్వమంతయు చిన్మయమే యగుచున్నది. మునీశ్వరా! దీనిని ఉపాదానముకంటె అద్వితీయ సత్యముగ భావించిన, ఈ విశ్వము తన్మయము కాదు. కాని, చైతన్యమ్రము ఈ రెండువికల్పములకంటె అతీతమైయున్నది.

నేదం ప్రవర్తతే కించిన్నేదం కించిన్నివర్తతే
శాన్తం సమసమాభాసం ప్రథతే స్వస్య కోశవత్. 27

వాస్తవమునకీ విశ్వమేమియును గాదు. ఇది ఉత్పన్నమగుచుండుట లేదు, లేక వినష్టమగుచుండుటయునులేదు. కనుక, విశ్వ (బ్రహ్మాండమంతయు ఏకాకారమగు ఆకాశ-కోశమువలె) శూన్యము.

అద్వైతైక్యాదసంక్షోభాద్ఘనచేతనయా తయా
అవికారాదిమత్త్వాచ్చ నిత్యానిత్యతయా చిరమ్. 28

ఏలయన, కేవలము చైతన్య మొక్కటియే, అద్వైతఘన-చేతనరూపమున వెలయుచున్నది. నిర్వికారమగు దీనికడ (ఆపేక్షిక) నిత్యములగు ఆకాశ, కాలాదులు గూడ అనిత్యములు.

చిద్ఘనత్వాచ్ఛిఖశిలాకోశానాం జగతామపి
మనాగపి న భేదోఽస్తి సతామప్యసతామపి. 29

శిఖకల్పితములగు ఆకాశ - శిలాకోశములకును, జగత్తులకును భేదములేదు. ఇవి చైతన్యసత్తవలననే అసత్యములయ్యు సత్యములుగను, సత్యములయ్యు అసత్యములుగను దోచుచున్నవి.

సమస్తం సుశివం శాన్తమతీతం వాగ్విలాసతః
ఓమిత్యస్య చ తన్మాత్రా తుర్యా సా పరమా గతిః. 30

ఇదంతయును వాక్కునకతీతమగు శాంత, శివస్వరూపము. ప్రణవముయొక్క తురీయమాత్రయగు బ్రహ్మయే పరమగతి.

శ్రీవాల్మీకి రువాచ:—

ఇత్యుక్తవానమలదృక్పరిణామతోఽస్మిన్
పారే పదే సముపశాన్తరవాభిధానే
తూష్ణీమతిష్ఠదమునా మునినా చ సార్ధం
విశ్రాన్తవృత్తిరథ తత్ర ముహూర్తమీశః. 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పరమేశ్వరోపదేశో నామ చతుస్త్రింశః సర్గః ॥ 34 ॥

శ్రీవాల్మీకి:— భగవంతుడగు ఈశ్వరుడిట్లు ఉపదేశము నొసంగి, మునిశ్రేష్ఠుడగు వసిష్ఠునితోడను, స్కందనంద్యాది పరిజనులతోడను గూడి సర్వసంసారోపశమగు తురీయపదమున విశ్రాంతి

నంది, ముహూర్తకాలము నిశ్చేష్టాభావమున వెలయసాగెను; అప్పుడాతని చిత్తవృత్తి పరమానంద చిదేక రసరూపముగ పరిణతి నందెను. అందువలన, తదితర ఇంద్రియములుగూడ చేష్టారహితములవ, అతడు నిశ్చలత్వము నందెను.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ - పూర్వభాగమున
పరమేశ్వరోపదేశమను ముప్పదినాల్గవ సర్గము ॥ 34 ॥

---

## పఞ్చత్రింశః సర్గః.

---

[ బ్రహ్మవిష్ణుహరాదీనామత్ర యః పరమః పితా
మహాదేవః పరాత్మాసౌ పూజ్యసీమాత్ర ఈర్యతే.

బ్రహ్మవిష్ణుహరాదులకు గూడ పరమపితయును, పరమాత్మయునునగు మహాదేవుని పరమపూజ్యత్వము ఈప్రకరణమున వర్ణింపబడుచున్నది. ]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

తతో ముహూర్తేన హరో గౌరీకమలినీసరః
మద్వికాసోన్ముఖం స్వైరం వికాసం బహిరాదదే. 1

శ్రీవసిష్ఠుడు:—అంత ముహూర్త కాలము జరుగ, గౌరీదేవియను పద్మమున కాశ్రయమైన సరోవర మనదగు హరుడు నన్ను ప్రబోధితు నొనర్ప (భక్తవాత్సల్యాతిశయమున) కన్నుల దెఱచెను.

దృక్త్రయో ద్యోతయామాస ముఖాకాశతలోదితః
బోధం సముద్గకాదర్క అంశురాశిరివోద్గతః. 2

సూర్యచంద్రాదులను నేత్రత్రయము ముఖాకాశమున ప్రకాశించి, సూర్యుడు దివాభాగమును సూచించునట్లు, ఆయన సమాధినుండి లేచుటను దెల్పెను.

ఈశ్వర ఉవాచ:—

మునే మననమాహూయ స్వసత్తైవాశు నీయతామ్
త్వమర్థం మాహరానర్థం పవనః స్పన్దతామివ. 3

ఈశ్వరుడు:— మునీ! నీవు మొట్టమొదట విచారమువలన వెంటనే స్వస్వరూపమును గ్రహింపుము. వాయువు వీవమొదలిడి ఆకాశమును ధూళిమయమొనర్చునట్లు నిష్ప్రయోజనముగ అర్థజాలముల జిక్కుబడ జేసికొనకుము.

దృష్టవ్యాపిహ యత్కించిత్తద్దృష్టం కిం సమం భ్రమైః
నహి హేయముపాదేయం చేహ పశ్యామి తద్విదః. 4

చూడదగు బాహ్యవిషయముల నన్నిటిని జాచితివి; ఇంకను భ్రాంతియందు పడియుండ నేల? తత్త్వవేత్తలీ భ్రాంతిమయ సంసారమున హేయోపాదేయములలో నేయొక్కటియును గాంచ జాలకున్నారు.

శాన్త్యశాన్తిమయానేతాన్వికల్పాన్దలయన్నసిః
ధీరోసి నాన్యథా స్థిత్వా త్వమేవ భవ చాత్మదృక్. 5

నీవు కత్తివలె, శాంతివిషయములను అశాంతివిషయములనునగు ఈ వికల్పముల నన్నిటిని ఖండించి ధీరుడవైతివి. ఇట్లు ఖండింపకున్న నీవు ధీరుడవన జాలెడువాడవుకావు. ఇప్పుడు నీవు ఆత్మ దర్శనము నొనరింపుము.

ఇమాం దృశ్యదశామాశు బాహ్యాబోధాయ వా పునః
సమాశ్రిత్య మదుక్తం త్వం శృణు తూష్ణీం స్థితేన కిమ్. 6

నీవిప్పుడు సమస్తప్రపంచమునకు వెలుపల వెలయు ఆత్మను గ్రహింప, ప్రస్తుతము దృశ్యదశయందే యుండి, నా యుపదేశమును వినుము. ఆత్మలాభార్థము ప్రయత్నింపుము; ప్రయత్నింపకున్న ఏమియును లభింపదు.

ఇత్యుక్త్వా బాహ్యబోధ స్త్వం మాభవేతి త్రిశూలధృక్
ప్రాణేనేదం దేహగేహం పరిస్ఫురతి యన్త్రవత్. 7

ఇట్లుపల్కి త్రిశూల ధరుండు 'బాహ్యదేహాదుల ఆత్మబుద్ధిని పరిత్యజింపుము' అని ఉపదేశించి, దేహాత్మబుద్ధిని త్యజించు ఉపాయమును జెప్పదొడగెను. ఈ శరీరగృహము ప్రాణవాయువువలననే యంత్రమువలె చలించుచున్నది.

ప్రాణహీనం పరిస్పన్దం త్యక్త్వా తిష్ఠతి మూకవత్
చాలనీ పావనీ శక్తిః శక్తిః సంవేదనీ చితిః. 8

ప్రాణవాయువులేకున్న ఈ శరీరము నిష్పందమై మూగవానివలె నుండెడిది. శరీరమునందలి చలన శక్తి వాయువునకును, జ్ఞానశక్తి చైతన్యమునకును జెందియున్నది.

సా మూర్తా ఖాదపి స్వచ్ఛా సత్సత్తైవాత్ర కారణమ్
వినశ్యతః ప్రాణదేహౌ వియోగాన్మారుదేవ చ. 9

ఈ జ్ఞానశక్తి రూపహీనము; ఆకాశముకంటెను నిర్మలము. సద్వస్తువుల ఉనికియే దీని అస్తిత్వమునకు కారణము. స్పందశక్తికి కారణమగు యీ ప్రాణము శరీరములేకున్న సామాన్య - వాయు రూపముననే యుండెడిది.

చిదాత్మా ఖాదపి స్వచ్ఛో న వినశ్యతి కిం భ్రమైః
మనఃప్రాణమయే దేహే చిత్తత్త్వం పరిజాయతే. 10

ఇక చిదాత్మయన్ననో, ఆకాశముకంటె నిర్మలుడును, వినాశరహితుడునునైయున్నాడు. నీవేల వ్యర్థముగ జననమరణములను భ్రమయందు పడుచున్నావు ? మనోప్రాణమయమగు యీ శరీరమున చైతన్యము అభివ్యక్తినందుచున్నది.

ముకురే హ్యమలాభాసే ప్రతిబిమ్బం ప్రవర్తతే
సదప్యగ్రగతం వస్తు ప్రతిబిమ్బక్రియాం వినా. 11

నిర్మలదర్పణమున ప్రతిబింబము పడుటలేదా ? వస్తువున్నను (కొన్నితావుల) ప్రతిబింబముండదు.

యథా నాస్తి మలోపేతే ముకురే మునినాయక
తథా నాస్తి గతప్రాణో విద్యమానేఽపి దేహకే. 12

మునినాయకా! మలిన - దర్పణమున వస్తువున్నను ప్రతిబింబము పడనట్లు, ప్రాణములేని శరీరమున చిత్తు ఉండదు.

సర్వగాపి చిదుచ్ఛూనబోధాత్స్పన్దాదికం ప్రతి
బోధాత్కలఙ్కవిమలా చిదేవ పరమం శివమ్. 13

సర్వవ్యాపియగు యీ చైతన్యము, బాహ్యవస్తు - ఆకారితమగు చిత్తవృత్తుల శరీరమును స్పందింపజేయుచున్నది — యీ చైతన్యమే బ్రహ్మకారిత చిత్తవృత్తివలన తత్త్వబోధనంది, పరమ కల్యాణమయమగు కైవల్యరూపమున విరాజిల్లును.

విదుర్దేవం తదాభాసం సర్వసత్తార్థదం తథా
స హరిః స శివః సోఽజః స బ్రహ్మా స సురేశ్వరః. 14

ఈ చైతన్యమే వస్తువుల ప్రకాశింపజేసి, వాటికి సత్తను అనుగ్రహించుటవలన దేవశబ్ద వాచ్యమగుచున్నది. హరి, హర, బ్రహ్మ, ఇంద్రులుగూడ యీ చైతన్యమే.

అనిలానలచన్ద్రార్కవపుః స పరమేశ్వరః
స ఏవ సర్వగో హ్యాత్మా చిత్తనిశ్చేతనః స్మృతః. 15

నిఖిలచైతన్యాకృతియును, సర్వగామియును, చైతన్యస్వరూపమునునగు యీ చైతన్యమే అనిలానల చంద్రసూర్యరూపముల దాల్చుచున్నది.

దేవేశో దేవభృద్ధాతా దేవదేవో దివః పతిః
మహాచితః సముల్లాసం ముహ్యన్తీవ న కేచన. 16

ఈ ఆత్మయే దేవతల బాలించు దేవదేవుడగు స్వర్గపతి. దీనిని ఎఱింగినవారు శోక రహితులగుచున్నారు.

యే నామ తే జగత్యేతే బ్రహ్మవిష్ణుహరాదయః
పరస్మాత్పరినిర్యాతా బ్రహ్మవిష్ణుహరాదయః. 17
కణాస్తప్తాయస ఇవ వారిధేరివ బిన్దవః
తేష్వేవ భ్రమభూతేషు జాతేష్వేవ పరాత్పదాత్. 18
స్థితేషు భ్రమబీజేషు కల్పనాజాలకర్తృషు
సహస్రశతశాఖేయమవిద్యోదేతి పీవరీ 19
వేదవేదార్థవేదాదిజీవజాలజటావలీ
తతస్తస్యా అనన్తాయాః ప్రసృతాయాః పునఃపునః. 20

అట్టివారే బ్రహ్మవిష్ణుమహేశ్వరులగుచున్నారు; వారందఱును ఆ పరతత్త్వమునుండియే, కాల్చిన లోహశకలమునుండి అగ్నికణములు వెలువడునట్లును, సముద్రమునుండి జలబిందువులు అటనిట బడునట్లును, వెలువడినారు; కాని, ఆ పరమపదమునుండి వెలువడిన ఈ బ్రహ్మాదులందఱును భ్రాంతిమయులు; వీరు కల్పనాజాలముల విస్తరింప చేయుచున్నారు. అవిద్య యొక్కటియే బ్రహ్మాది ప్రపంచరూపమైన శాఖోపశాఖల వ్యాప్తమై విస్తృతమగుచున్నది. వేదములు, వేదార్థములు, క్రియాకలాపములు జీవులు మున్నగున వన్నియును అవిద్యాలతయందే చిక్కువడియున్నవి.

సంపన్న దేశకాలాద్యాః క్రమః స్వాద్యర్ణనాసు కః
బ్రహ్మవిష్ణుహరాదీనామతోఽయం పరమః పితా. 21

దేశకాలముల గల్పించునదియును, అనంతమునునగు ఈ అవిద్య మఱల మఱల ఎన్నివిధములుగ ప్రసరించుచున్నదో వర్ణించుట అసాధ్యము. పైనజెప్పబడిన చైతన్యమే బ్రహ్మవిష్ణుశివాదులకు గూడ పరమపిత.

మూలబీజం మహాదేవః పల్లవానామివ ద్రుమః
సర్వసత్తాభిధః సర్వః సర్వసంవేదనైకకృత్. 22

ఈ మహాదేవుడే, చెట్టు పల్లవములకు గారణమైనట్లు అందఱికిని మూలమగుచున్నాడు. సర్వస్వరూపమగు చిదాత్మయే అన్నిటియొక్క సత్తయైయున్నది; అతడే వివిధములగు జ్ఞానములను కలుగ జేయుచున్నాడు.

సర్వసత్తాప్రదో భాస్వానన్యోఽభ్యర్చ్యశ్చ తద్విదః
ప్రత్యక్షవస్తువిషయః సర్వత్రైవ సదోదితః. 23

ఇయ్యది ప్రతివస్తువుయందునను, అన్ని ఇంద్రియములను అభివ్యక్తపఱచుచున్నది; సదా సర్వత్ర తేజోవంతమై ఉదయించుచు, తత్త్వవేత్తల వందనార్చనముల కాకరమగుచున్నది.

సంవేదనాత్మకతయా గతయా సర్వగోచరమ్
న తస్యాహ్వానమన్త్రాది కించిదేవోపయుజ్యతే. 24

ఈ చైతన్యము సర్వత్ర వెలయుచుండుటవలన సామాన్యపూజలయందవసరమగు ఆవాహనాది మంత్రములతో నవసరములేదు; ఆత్మ చైతన్యరూపమున సర్వత్ర లభ్యము.

నిత్యాహూతః స సర్వస్థో లభ్యతే సర్వతః స్వచిత్
యాం యాం వస్తుదశాం యాతి తత ఏవ మునే శివమ్. 25

స్వరూపం సమవాప్నోతి రూపాలోకమనోదృశామ్
ఆద్యం పూజ్యం నమస్కార్యం స్తుత్యమర్ఘ్యం సురేశ్వరమ్. 26

ఏనం తం విద్ధి వేద్యానాం సీమాన్తం మహతామపి
ఏతమాత్మానమాలోక్య జరాశోకభయాపహమ్
సంభృష్టబీజవజ్జన్మ భూయః పరిరోహతి. 27

ఈయన నిత్య - ఆహ్వానమును గొని, జ్ఞానస్వరూపమున అన్నియెడల, అన్ని వేళల లభ్యుడగుచున్నాడు. మునీ! ఈయన ఏయే వస్తురూపమును గైకొనునో ఆయావస్తువుల స్వరూపమును, మననకారణమగు మనస్సును, సాక్షీ, దృష్టులరూపమును తానే గ్రహించుచున్నాడు. నీవు సురేశ్వరుడగు ఈ చిదాత్మనే అన్నిటికిని ఆద్యునిగను, పూజ్యునిగను, నమస్యునిగను, స్తుతింపబడదగువానిగను దెలిసికొనుము. మఱియు ఈయన మహద్వస్తువుల పరాకాష్ఠమనిగూడ గ్రహించునది, జరాశోకభయవినాశకరమగు ఈ ఆత్మతత్త్వమును గ్రహించిన, జీవునకు సంభృష్టబీజమువలె, మఱి జన్మలేదు!

సకలజన్తుషు య_త్త్వభయప్రదం
విదితమాద్యముపాస్యమయత్నతః
త్వమజమాత్మగతం పరమంపదం
భవసి కిం పరిముహ్యసి దృష్టిషు. 28

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే మహాదేవస్య పూజ్యాసీమా_న్తత్వకథనం నామ పఞ్చత్రింశః సర్గ ॥ 35 ॥

అందఱియొక్క జ్ఞానస్వరూపమై వెలయుచు అభయమునొసగు ఈ ఆదిదేవుని ఉపాసన అత్యంతసులభము; అజమగు ఆ యాత్మతత్త్వము నీవే యగుచున్నాడవు. వ్యర్థముగ బాహ్యదృష్టుల ముగ్ధుడవగుచుంటి వెందులకు ?

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ - పూర్వార్ధమున మహాదేవుని పూజ్యాసీమంతవర్ణనమను ముప్పది యైదవ సర్గము ॥ 35 ॥

---

## షట్ త్రింశః సర్గః

---

[సర్వవిశ్వోద్భవా త్తస్య సర్వకారేణ చ స్థితేః
సర్వాసపూర్ణాద్విశుద్ధేశ్చ సర్వైశ్వర్యం ప్రపఞ్చ్యతే.

ఉద్భవ, స్థితి కారణమునగు సర్వేశ్వరుని నిర్లేపత్వ మీసర్గముయొక్క విషయము.]

ఈశ్వర ఉవాచ:—

తతశ్చిద్రూపమేవైకం సర్వసత్తా_న్తరాసితమ్
స్వానుభూతిమయం శుద్ధం దేవం రుద్రేశ్వరం విదుః. 1

ఈశ్వరుడు:— చిద్రూపమగు ఈ ఆత్మను సాక్షాత్కారమొనర్చుకొనుటవలన పునర్జన్మ తొలగును. కనుక బ్రహ్మవేత్తలు, నిఖిలవస్తువుల సత్తారూపమున వెలయుచున్నదియును, స్వానుభూతిమయమును, విశుద్ధమునునగు ఈ ఆత్మను సంసారరోగవినాశియగు సర్వేశ్వరుడని నిర్దేశించుచున్నారు.

బీజం సమ_స్తబీజానాం సారం సంసారసంసృతేః
కర్మణాం పరమం కర్మ చిద్ధాతుం విద్ధి నిర్మలమ్. 2

నిర్మల చిత్స్వరమగు ఈ ఆత్మను నీవు, నిఖిలబీజములకు బీజముగను, (కారణకారణము) సంసారసారముగను, కర్మలనన్నిటిలోను ఉత్తమముగను గ్రహింపుము.

కారణం కారణౌఘానామకారణమనావిలమ్
భావనం భావనౌఘానామ భావ్యమభవాత్మకమ్. 3

ఈయన సర్వకారణకారణమయ్యు, పారమార్థికముగ ఎద్దానికిని కారణముగాడు – నిష్కళంకుడు. భావింపబడు పదార్థసమూహముల భావనా - స్వరూపుడయ్యు తన అభావనీయ అభవ (జన్మరహిత) స్వరూపమున ఈయన వెలయుచున్నాడు.

చేతనం చేతనౌఘానాం చేతనాత్మని చేతనమ్
స్వం చేత్యచేతనం చేత్యపరమం భూరిభావనమ్. 4

ఈయన బుద్ధివృత్తుల నన్నిటిని ప్రకాశమొనర్చుచున్నాడు; చైతన్యాత్మకులగు జీవుల అంతరమున చిత్సారరూపమున వెలయుచున్నాడు. ఈయన తన ప్రత్యక్ - స్వరూపమున వెలయుచుండియు, బుద్ధివృత్తుల వ్యాప్తివలన, వేద్యములగు బాహ్యవస్తువుల నన్నిటిని ప్రకాశింపజేయుచున్నాడు. మఱియు, వేద్యవస్తుజాతమునుయొక్క అధిష్ఠానతత్త్వస్వరూపమున నొప్పుచున్నాడు. ఏకరూపుడయ్యు మాయవలన బహురూపముల భావింపబడుచున్నాడు.

ఆలోకాలోక మమలమనాలోక్యమలోకజమ్
ఆలోకం బీజబీజౌఘం చిద్ఘనం విమలం విదుః. 5

ఈ ఆత్మ సకలజ్యోతులయొక్క జ్యోతిస్స్వరూపము, అలౌకికమును, నిర్మలమునునగు ఈ ఆత్మను ప్రకాశింప జేయునదెద్దియును లేదు. ఇది యొక్కటియే ప్రకాశమయమగు బీజము (మూలవస్తువు); అయ్యు, ఇయ్యది నానావిధ-బీజరూపమున, వెలయుచున్నది. ఈ విషయమును బ్రహ్మజ్ఞు లెఱుంగుదురు.

అసత్యం సన్మయం శాన్తః సత్యాసత్యవివర్జితమ్
మహాసత్తాదిసత్తాన్తే చిన్మాత్రం విద్ధి నేతరత్. 6

పృథ్వ్యాదులగు భూతములీ ఆత్మయందు వెలయుటలేదు. వ్యావహారిక సత్యము ప్రాతిభాసిక అసత్యము మున్నగున వెవ్వియు ఇందులేవు. జగత్సత్తయు, అవ్యాకృత – కారణసత్తయు బాధితమవ శేషించు చిన్మాత్రసాక్షియే ఈయన యని గ్రహింపుము.

స్వయం భవతి రాగాత్మా రఞ్జకో రఞ్జనం రజః
స్వయమాకాశమప్యాశు కుడ్యం భవతి మణ్డితమ్. 7

(ఇట్టి నిర్విశేషస్వరూపుడయ్యు) ఈయనయే చిత్తవికృతులను రంజనమునకు అవ్యాకృత కారణమును, కారణమును, రజోరూపమును నగుచున్నాడు. ఈయన ఆకాశస్వరూపుడయ్యు (రూపవిహీనుడయ్యు) వెనువెంటనే సుశోభితమగు కుడ్యమగుచున్నాడు (– రూపమును, కర్తృత్వమును గ్రహించుచున్నాడు.)

అస్మింశ్చిచ్చేతసి స్ఫారే జగన్మరుమరీచయః
స్ఫురితాః ప్రస్ఫురిష్యన్తి ప్రస్ఫురన్తి చ కోటయః. 8

చిత్తరూపమున వికాసమునందిన ఈ మహాచైతన్యమున అసంఖ్యాకములగు జగత్తులను మరు మరీచికలు దోచుచున్నవి, తోపగలవు, తోచియున్నవి.

స్వసత్తామాత్రసంపన్నం పదమస్మిన్స్వతేజసి
న కించన చ సంపన్నమన్యద్దార్ష్ట్యాదివాసలే. 9

స్వయంప్రకాశమగు ఈ చిదాత్మయందు జగత్తు తన సత్తను స్థిరపఱచుకొన్నను, స్థిరపఱచుకొనుటలేదనవలసివచ్చుచున్నది. అగ్నియందు, అంగారము, విస్ఫులింగము, ప్రభాదివైచిత్ర్యము లున్నను ఉష్ణస్వభావముండుటచేసి, వీటిని నిప్పుకంటె వేఱుగ పేర్కొనుటలేదుకదా.

గర్భీకృతమహామేరుం పరమాణుసమం విదుః
ఆచ్ఛాదితమహామేరుం పరమాణుసమం విదుః. 10

ఈ ఆత్మయందు సర్వవిరుద్ధ ధర్మముల సమావేశమున్నది. ఈయన మహామేరువును గర్భమున ధరించి, ఆచ్ఛాదనమొనర్చినను అణుస్వరూపుడని తత్త్వవేత్త లెఱుంగుదురు. *

గర్భీకృతమహాకల్పో నిమేషోఽసావుదాహృతః
అక్రాన్తకల్పేనానేన న సంత్యక్తా నిమేషతా. 11

ఈయన మహాకల్పమును గర్భమున ధరించినను నిమేషస్వరూపుడని చెప్పబడుచున్నాడు. ఈయన కల్పమునంతటిని ఆక్రమించుకొని వెలయుచున్నను ఈ నిమేష – పరిమిత – కాలత్వమును పరిత్యజించుచుండుటలేదు.

వాలాగ్రకాదప్యణునా వ్యాప్తానేనాఖిలా మహీ
సప్తాబ్ధివసనాప్యుర్వీ నాస్యాన్తమధిగచ్ఛతి. 12

ఈయన కేశాగ్రమువలె అత్యంతసూక్ష్ముడయ్యు మహీమండలము నంతటిని వ్యాపించియున్నాడు. సప్తసాగర – వసనపరిహితయగు పృథివి ఈయన పరాకాష్ఠను జేరజాలకున్నది.

అకుర్వన్నేవ సంసారరచనాం కర్తృతాం గతః
కుర్వన్నేవ మహాకర్మ న కరోత్యేవ కించన. 13

ఈయన సంసారము రచింపకున్నను (సృష్టింపకున్నను), కర్తృత్వమును బొందినాడు. మహాత్కార్యముల నాచరించుచున్నను, ఈయనకు కర్తృత్వములేదు.

ద్రవ్యమప్యేష నిర్ద్రవ్యో నిర్ద్రవ్యోఽపి హి ద్రవ్యవాన్
అకాయోఽపి మహాకాయో మహాకాయోఽప్యకాయవాన్. 14

ఈయన ద్రవ్యమయ్యు ద్రవ్యముకాదు. ఈయనయందెట్టి ద్రవ్యములేకున్నను ఈయన ద్రవ్యవంతుడు. ఈయన శరీరరహితుడయ్యును, మహాశరీరి – బ్రహ్మాండ శరీరి. మహాశరీరుడయ్యును శరీర శూన్యుడు.

అద్యాప్యేష సదా ప్రాతః ప్రాతరప్యద్యతాం గతః
న వాద్యమద్య న ప్రాతస్త్వద్య ప్రాతశ్చ వా సదా. 15

ఈయన ఉషస్స్వరూపుడయ్యు, ప్రాతఃకాలము, ప్రాతఃకాలమైనను ఈయన ఉషస్స్వరూపమునకెట్టి ఆటంకములేదు. ఈయన ఉషయునుకాదు, ప్రాతఃకాలమునుకాదు; అయ్యు ఈరెండునుగూడ ఈయనయేయైయున్నాడు.

---

* అణోరణీయాన్ మహతో మహీయాన్ ఇతి శ్రుతిః

భిండిం భిండిం ఖలేమత్తా పురుపిచ్ఛిలిసాలఘమ్
వివిచ్చలిత్సదాలోకాలాసో గులుగులుః శిలీ. 16

భిండి, భిండి, ఖిలేమత్త, పురుపిచ్ఛలి, సాలఘ, వివిత్, చలిత్, సదాలో, కాలాసో, గులుగులు, శిలీ —

ఇత్యాద్యనర్థకం వాక్యం తథా సత్యం స ఏవ చ
న తదస్తి న యత్సత్యం న తదస్తి న యత్త్వసౌ. 17

ఇత్యాదులగు అర్థవిహీనశబ్దములుగూడ ఈయనకడ సత్యములు గావచ్చును — వేదముల చెప్పబడిన శబ్దములవలె సత్యమేగావచ్చును. ఈయనయందు సత్యముగానిదియును, ఈయనగానిదియు నగు వస్తువేలేదు. (అనగా, అలీకములగు ఆకాశకుసుమాదులుగూడ ఈయనయందు సత్యములు; ఈయనకంటె వేఱుకావు.)

యస్మిన్సర్వం యతః సర్వం యః సర్వం సర్వతశ్చ యః
యశ్చ సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః. 18

ఎవ్వనియందు అంతయును, ఎవ్వనినుండి అంతయును, ఎవ్వడు సర్వమును; సర్వమునుండి ఎవ్వడును, ఎవ్వడు సర్వమయుడునునగు చున్నాడో, సర్వరూపుడగు ఆదేవునకు నమస్కారము.

యత్రాన్తరాలగమనేన విలాసవత్యా
హేలా విలోలఘనసర్జితయామలేన,
మల్లేన పల్లవదలామలమాలితానాం
లక్ష్మీర్లతావిరలతా వలితేవ ముష్టిః. 19

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పరమేశ్వరవర్ణనం నామ షట్త్రింశః సర్గః ॥ 36 ॥

పత్రపల్లవపరిశోభితమును, లతాజాలపరివృతమును, నిబిడాంగతరుయుక్తమును, నిబిడఘన సౌదామినీ కమనీయమును నగు విలాసిని తన ఫలపుష్పశోభవలన ఇతరవనముల శోభను పిడికిటివలె తనయందు ఇముడ్చుకొనుచున్నది.*

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ పూర్వార్ధమున శివోపాఖ్యానమున పరమేశ్వరవర్ణనమను ముప్పదియాఱవ సర్గము ॥ 36 ॥

---

* ఆరోపమువలన అసత్తుగూడ సత్తగుచున్నదను విషయమును దెల్పుట కీశ్లోకము చెప్పబడినది. ఈ శ్లోకము వ్యర్థపదములతో గూర్పబడి, పైనజూపిన భావమును మొమ్మొదట తోపింపజేయుచున్నను, పలువిధముల వ్యాఖ్యానమొనర్పవచ్చును. అందొకటి - అమలదళపల్లవశోభితమగు వనమాలను ధరించినవాడును, పురుషప్రధానుడును, విశ్వంభరుడును నగు విష్ణువు, జగన్మోహనమును, నవనీరదనిందియునగు తనశరీరకాంతితో ప్రణయినియగు లక్ష్మీదేవిని ముష్టివలె ఏకీభూత మొనర్చుకొనినాడు.

## సప్తత్రింశః సర్గః

[సద్యోగాదసతాం సత్తా శివస్యానన్తశక్తయః
ప్రధానశక్తేర్నియతేర్నృత్యం చాత్రోపవర్ణ్యతే.

సద్వస్తు సంయోగమున అసద్వస్తువు సత్తనుబొందురీతి, శివునియొక్క అనంతశక్తులు, ప్రధానశక్తియగు నియతియొక్క నాట్యము యీ సర్గమున ఉపవర్ణింపబడును.]

ఈశ్వర ఉవాచః—

ఇత్యాదికానాం శబ్దానామర్థశ్రీః సత్యరూపిణీ
తస్మిన్సర్వేశ్వరే సర్వసత్తామణిసముద్గకే. 1

ఈశ్వరుడు:—ఈ సర్వేశ్వరునియందు పూర్వోక్తములును, అన్యములును నగు అర్థవిహీన వాక్యములుగూడ సత్యములగుచున్నవి. ఈయన జగత్సత్తయను మణికి పేటిక.

కా నామ విమలాభాసా స్తస్మిన్పరమచిన్మణౌ
న కచన్తి విచన్వన్తి విచిత్రాణి జగన్తి యా॥. 2

మాయాయుక్తుడగు యీ బ్రహ్మమున ఏశక్తి వికసింపకుండ నుండగలదు ? ఈ చిత్-మణియందున్న బీజశక్తి, ఆరోపింపబడు విచిత్రజగత్తులు స్పష్టముగనే ప్రకాశించుచున్నవి.

ఏషా బీజకణాన్తస్థా చిత్సత్తా స్వవపుర్మయమ్
లబ్ధ్వా మృత్కాలవార్యాది కరోత్యఙ్కురమోదనమ్ 3

ఈశ్వరసంబంధమగు యీ చిత్సత్త, ధాన్యాదిబీజములయందుండి, క్షేత్రమున పరిష్కృతమగు మృత్తిక, జలము, సమయము, మున్నగు సహకారికారణముల సహాయ్యమున అంకురోత్పాదన మొనర్చి, క్రమముగ తండులభావమునంది అన్నమగుచున్నది.

ఫేనావర్తవివర్తాన్తర్వర్తిని రసరూపిణీ
కఠినేన్ద్రియసంబన్ధే కరోతి స్పన్దమమ్భసామ్. 4

ఈ యీశ్వరశక్తియే రసరూపమున నీటియొక్క నురుగు అగుచున్నది. మఱియు, సుడిగుండమున వెలయుచు 'రాళ్లు రప్పలు' మున్నగు వానితోగూడి, నిమ్నోన్నతగతుల బొందుచున్నది. జిహ్వేంద్రియ సంయోగమున, యీ యీశ్వరశక్తియే సలిలరూపమున ప్రవేశించి, ఉదరమధ్యమున కదలికను గలిగించుచున్నది.

ఏషా కుసుమగుచ్ఛేషు రసరూపేణ సంస్థితా
కచతి ఘ్రాణరన్ధ్రేషు కరోతి పరిఫుల్లతామ్. 5

ఈ చిత్-సత్తయే కుసుమగుచ్ఛముల మకరందరసగంధరూపమున వెలయుచు, ఘ్రాణేంద్రియమున వికాసమునంది, నాసాపుటముల ఉల్లాసమును గలిగించుచున్నది.

శిలాజస్థా శిలాజ్ఞాభామసతీం సత్యతాపదమ్
నగాధారదశాం ధత్తే గిరీన్ద్రః స్థితిలీలయా 6

శూన్యమగు పర్వతము, తృణవృక్షాదులతో పూర్ణమై జననివాసమును గల్పించునట్లు, యీ చిత్సత్తగూడ శిలయందు ప్రవేశించి, దాని శూన్యభావమును బోగొట్టి, దానికి వ్యవహారికసత్తను గల్పించుచున్నది. పర్వతము తన స్వరూపమును వీడకయే వృక్షాదుల గల్పించునట్లు, చిత్సత్తలేకున్న, 'శిల' యను బోధయే లోకమున నుండెడిదికాదు.

పవనస్పన్దకోశాత్మరూపిణీ త్వగిన్ద్రియమ్
సంసాధయత్యాత్మసుతం పితేవాత్మతయా తయా. 7

పిత ఆతనసుతుని స్వకార్య నిర్వహణార్థము వినియోగించునట్లు, ఈ చిత్సత్త సమస్త చలనములకును ఆకర (కోశ) మనదగు వాయురూపమును గ్రహించి, ఆరూపమునుండి ఉత్పన్నమైన త్వగింద్రియమును స్పర్శజ్ఞానార్థము వినియోగించుచున్నది.

అశేషసారసంపిణ్డమథ్యాత్మానం స్వసిద్ధయే
భావయిత్వా న కించిత్త్వమివ ఖత్వం కరోత్యలమ్. 8

ఈ చిత్సత్తయే మఱల తన వాస్తవస్వరూపసిద్ధికొఱకు — మోక్షార్థము — తన్ను నిఖిలజగత్తుయొక్క సమ్మిళితసత్తాత్మకమగు ఏకరూపమున భావించుకొని, జగత్తంతటిని ఆకాశమువలె శూన్యమొనర్చుచున్నది.

స్వసత్తాప్రతిబిమ్బాభమాకాశముకురోదరే
ధత్తే కల్పనిమేషాఙ్కం కాలాఖ్యమమలం వపుః. 9

ఈయనయే ఆకాశ - దర్పణమున, తనసత్తవలె తోచు కల్పనిమేషాదులతో గూడుకొనిన కాలమని రూపమున ప్రతిబింబించుచున్నది.

ఆమహాపఞ్చమేశానం పరిణామమయా ఇమే
ఇదమిత్థమిదం నేతి నియతిర్భవతి స్వయమ్. 10

బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివ ఈశాన తత్త్వములతో నారంభమైన ఈ జగత్తంతయు పరివర్తన శీలము. కార్యములనన్నిటిని సరిజూచు నియతియే మూలశక్తి; 'ఇది ఇట్టిది, లేక ఇట్టిది కాదు' అని చెప్పవీలులేదు. ఇది స్వయముగ నుత్పన్నమగుచున్నది.

సాక్షిణి స్ఫార ఆభాసే గృహే దీప ఇవ క్రియాః
సత్యే తస్మిన్ప్రకాశన్తే జగచ్చిత్రపరమ్పరాః. 11

అంధకారావృతమగు రాత్రియందు, గృహమధ్యమున దీపమున్ననే అచ్చటి వస్తువులు ప్రకాశించునట్లు, అపరిచ్ఛిన్నమగు ఈ చిజ్జ్యోతివలననే జగత్తులను చిత్రపరంపరలు ప్రకాశమునందుచున్నవి.

పరమాకాశనగరనాట్యమణ్డపభూమిషు
స్వశక్తివృత్తం సంసారం పశ్యన్తీ సాక్షివత్స్థితా. 12

ఈ నియతి పరమాకాశ - నగర - నాట్యశాలలో స్వశక్తిసంపాదితమగు సంసారనాటకమును దర్శించుచు సాక్షిభావమున వెలయుచున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

శివస్యాస్య జగన్నాథ శక్తయః కాః కథం స్థితాః
సాక్షితా కా చ కిం తాసాం వృత్తం స్యాత్క్రియదేవ తత్. 13

శ్రీవసిష్ఠుడు:–జగన్నాథా! చిదాత్మయగు యీ శివుని శక్తులెట్టివి? అవి ఎట్లు వెలయుచున్నవి? సాక్షిభావమననేమి? ఆ శక్తిసమూహముల కార్యమేమి? అవి యెన్ని — నాకు తెలియజెప్పుడు.

ఈశ్వర ఉవాచ :—

అప్రమేయస్య శాన్తస్య శివస్య పరమాత్మనః
సౌమ్య చిన్మాత్రరూపస్య సర్వస్యానాకృతేరపి. 14
ఇచ్ఛాసత్తా వ్యోమసత్తా కాలసత్తా తథైవ చ
తథా నియతిసత్తా చ మహాసత్తా చ సువ్రత. 15
జ్ఞానశక్తిః క్రియాశక్తిః కర్తృతాఽకర్తృతాపి చ
ఇత్యాదికానాం శక్తీనామన్తో నాస్తి శివాత్మనః. 16

ఈశ్వరుడు:– సౌమ్య! మంగళమయుడును, చిన్మాత్రరూపియును, శాంతుడును, సర్వమయుడును, నిరాకారుడును, అప్రమేయుడును నగు పరమాత్మకు ఇచ్ఛాసత్త, ఆకాశసత్త, కాలసత్త, నియతిసత్త, మహాసత్త, జ్ఞానశక్తి, క్రియాశక్తి, కర్తృత్వశక్తి, అకర్తృత్వశక్తి మున్నగు శక్తులు పెక్కులున్నవి. వాటి కంతములేదు.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

శక్తయః కుత ఏవైతా బహుత్వం కథమాసు చ
ఉదయశ్చ కథం దేవ భేదాభేదశ్చ కీదృశః. 17

శ్రీవసిష్ఠుడు:–దేవా! యీ శక్తులు పరమాత్మ యందెట్లు ఆవిర్భవించినవి? ఈ శక్తులకు బహుత్వమెట్లబ్బినది? పరమాత్మకును యీ శక్తులకును భేదమున్నదా? లేక అభేదము గలదా? –వచింపుడు.

ఈశ్వర ఉవాచ :—

శివస్యానన్తరూపస్య సైషా చిన్మాత్రతాత్మనః
ఏషా హి శక్తిరిత్యుక్తా తస్మాద్భిన్నా మనాగపి. 18

ఈశ్వరుడు:– అనంతరూపుడును, మంగళమయుడును నగు చిదాత్మయందు కల్పింపబడిన మాయావికల్పములే శక్తులనంబడుచున్నవి. అందువలన, వాటికిని పరమాత్మకును ఒకింతయు భేదములేదు.

జ్ఞాతృత్వకర్తృత్వభోక్తృత్వసాక్షిత్వాదివిభావనాత్
శక్తయో వివిధం రూపం ధారయన్తి బృహాదకమ్. 19

ఈశక్తి, జ్ఞాతృత్వ, కర్తృత్వ, భోక్తృత్వ, సాక్షిత్వాది భావనలవలన, నీరు తరంగబుద్బుదాది బహురూపముల ధరించునట్లు, విభిన్న ఆకృతుల బొందుచున్నది.

ఏవం జగతి నృత్యన్తి బ్రహ్మాణ్డే నృత్యమణ్డపే
కాలేన నర్తకేనేవ క్రమేణ పరిశిక్షితాః. 20

ఈశక్తిసమూహములు, కాలునికడ క్రమముగ శిక్షణమునంది, బ్రహ్మాండ – నృత్యమండపమున నృత్యమొనర్చుచున్నవి.

యైషా పరపరాభాసా సైషా నియతిరుచ్యతే
క్రియాథ కృతిరిచ్ఛా వా కాలేత్యాదికృతాభిధా. 21

పరాపరములను సంజ్ఞలతో నొప్పు కాలమే నియతి యనంబడుచున్నది. (క్రియ, కృతి, ఇచ్ఛ, కాలము, మున్నగునవి దీనికి పర్యాయశబ్దములు.

ఆమహారుద్రపర్యన్తమిదమిత్థమితి స్థితేః
ఆతృణాపద్మజస్పన్దం నియమాన్నియతిః స్మృతా. 22

మహారుద్రుని స్థితివఱకు ఇయ్యది, ఇయ్యది అని ఆయావస్తువులను సూచించుటవలనను, ఆబ్రహ్మస్తంబపర్యంతముగల వస్తువుల గల్పించుటవలనను, పరమేశ్వరుని ఈశక్తికి నియతియను అన్వర్థనామము లభించినది.

నియతిర్నిత్యముద్వేగవర్జితా పరిమార్జితా
ఏషా నృత్యతి వై నృత్యం జగజ్జాలకనాటకమ్. 23

తత్త్వబోధవలన పరిశుద్ధమొనర్పబడనంతవఱకు, ఈ నియతి ఉద్వేగరహితమై నృత్యమును, జగన్నాటకాభినయమును ఒనర్చుచుండును.

నానారసవిలాసాఢ్యం వివర్తాభినయాన్వితమ్
కల్పక్షణహతానేకపుష్కరావర్తఘుర్ఘురమ్. 24

ఈ నృత్యము వివిధరసములతో పరిపూర్ణమును, వివర్తమను ఆంగిక - అభినయముతో చిత్తాకర్షకమును నైయున్నది. ఈ అభినయాంతమను ప్రళయసమయమున పుష్కరావర్త - మేఘములను వాద్యయంత్రములు వాయింపబడును.

సర్వర్తుకుసుమాకీర్ణం ధారాగోలకమన్దిరమ్
భూయోభూయః పతద్వర్షభూరిస్వేదజలోత్కరమ్. 25

ఈ నియతియొక్క నాట్యశాల బ్రహ్మాండము; ఇయ్యది గోళాకృతిని వెలయుచున్నది. దీనియందు, అన్ని ఋతువుల పుష్పములు మొప్పారుచున్నవి. అభినయదర్శకుల శరీర - ఘర్మమో (చెమటయో) యనునట్లు మాటిమాటికి గురియు వర్షధారలు పరిలక్షితములగుచున్నవి.

పయోదపల్లవాలోలనీలామ్బరకృతభ్రమమ్
పూర్ణసంశుద్ధసప్తాబ్ధిరత్నౌఘవలయాకులమ్. 26

మేఘమాలయను అంచుతో శోభిల్లు నీలాంబరమే (ఆకాశము, వస్త్రము) ఈ నాట్యాభినేత్రియొక్క పరిధేయవసనము. వివిధరత్నశోభితములగు సప్తసాగరములే ఈ రమణియొక్క హస్తవలయములు,

యామపక్షదినప్రేక్షాకటాక్షోద్భాసితామ్బరమ్
మజ్జనోన్మజ్జనవ్యగ్రకులాద్రికులశేఖరమ్. 27

ఈ అభినేత్రి ప్రహర, దివసాది రూపకములగు కటాక్షములతో అంబరతలమును ఉద్భాసింపజేయుచున్నది. కులపర్వతములు ఈ శిరోభూషణములు; ఇవి ఒకప్పుడు అంతర్హితములగుచు మఱొకప్పుడు దృష్టికి గోచరములగుచున్నవి.

భ్రమచ్ఛశిమణిప్రోతగఙ్గాముక్తాఫలత్రియమ్
సన్దృష్టాదృష్టసన్ధ్యాభ్రవిలోలకరపల్లవమ్. 28

త్రిపథగామినియగు గంగ, ఈమె కంఠమున దాల్చు ముత్తెపుటల ముత్యాలమాల; అందు ప్రతిబింబించు చంద్రుడు ఈ హారమునందలి చంద్రకాంతమణి, సాంధ్యమేఘములు ఈమె కరపల్లవములు. అవి ఒకప్పుడు అగపడుచు, మఱియొకప్పు డగపడకుండనున్నవి.

అనారతరణల్లోలలోకాలంకారకోమలమ్
భూరిభూతలపాతాలనభస్తలపదక్రమమ్. 29

లోకముల వసించు జనులు ఈమెకు అంగభూషణములు; ఇవి నిరంతరము 'ఝణం ఝణం' శబ్దము నొనర్చుటవలన మనోహరములై యొప్పుచున్నవి. భూతల, పాతాళ, నభస్తలములు ఈమె పాదవిన్యాసమునకు పీఠములు.

మగ్నోన్మగ్నమహానేకతారాఘర్మకణోత్కరమ్
చన్ద్రార్కకుణ్డలస్పన్దస్మితస్ఫుటనభోముఖమ్. 30

తారకాసమూహములను ఘర్మబిందువులు యీమె శరీరమున ఒకప్పుడు అగుపించుచు, మఱొకప్పుడు విలీనములగుచున్నవి. గగనమండలమే ఈ నటియొక్క ముఖమండలము; దీనియందు చంద్రసూర్యులను కుండలములు రెండు వ్రేలాడుచున్నవి. సూర్యచంద్రుల ప్రకాశమను స్మితముతో నీ వదన మొప్పారుచున్నది.

కల్పితానేకబ్రహ్మాణ్డకపాటకవితానకమ్
లుఠల్లోకాన్తరవ్యూహధ్వనన్మత్తాఙ్కపల్లవమ్
సుఖదుఃఖదశాదోషభావాభావరసాన్తరమ్. 31

బ్రహ్మాండకవాటములే నాట్యమందిర వితానములు. అసురపీడితులై పరువిడు త్రిలోకవాసులే, ఈమె ధరించిన చంచలవసనాంచలములు సుఖదుఃఖదశలు ఈనర్తకి ప్రకటించు హావభావములు.

అస్మిన్వికారవలితే నియతేర్విలాసే
సంసారనామ్ని చిరనాటకనాట్యసారే
సాక్షీ సదోదితవపుః పరమేశ్వరోఽయ
మేకః స్థితో న చ తయా నచ తేన భిన్నః. 32

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే నియతినృత్యం నామ సప్తత్రింశః సర్గః ॥ 37 ।

ఈ సంసారనాటకాభినయము వివిధవికారభంగులతో నిండియుండి, నియతియొక్క విలాస మనబడదగియున్నది. కాని, పరమేశ్వరుడు సర్వదా ఏకరసస్వరూపమున వెలయుచు సాక్షియై యొప్పారుచున్నాడు. అందువలన, ఈయన సంపూర్ణముగ యీ నాట్య - నాటకముల నుండి విభిన్నుడయ్యు, (వ్యావహారికముగ) అభిన్నుడైయున్నాడు.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణ పూర్వ భాగమున నియతినృత్యమను ముప్పదియేడవ సర్గము ॥ 37 ॥

## అష్టత్రింశః సర్గః

[శివస్యానన్తచిన్మాత్రేర్బహిర్ధ్యానేన పూజనమ్
జ్ఞానేన చ మహాపుణ్యం విముక్తిఫలమీర్యతే.
అనంతచిన్మూర్తియగు శివుని ధ్యానముచే నర్చించుట, జ్ఞానమువలన కలుగు పుణ్యము, ముక్తిఫలము ఈ సర్గయం దభివర్ణింపబడుచున్నవి.]

ఈశ్వర ఉవాచ:—

ఏష దేవః స పరమః పూజ్య ఏష సదా సతామ్
చిన్మాత్రమనుభూత్యాత్మా సర్వగః సర్వసంశ్రయః. 1

ఈశ్వరుడు:— చిన్మాత్రుడును, అనుభూతిస్వరూపుడును, సర్వాంతర్యామియును, సర్వమునకు ఆశ్రయమునునగు యీదేవుడే సాధుపురుషులకు పూజ్యుడగుచున్నాడు.

ఘటే పటే వటే కుడ్యే శకటే వానరే స్థితః
శివో హరో హరిర్బ్రహ్మా శక్రో వైశ్రవణో యమః. 2
బహిరన్తశ్చ సర్వాత్మా సదా స్వాత్మసు బుద్ధిభిః
వివిధేన క్రమేణైష భగవాన్పరిపూజతే. 3

ఈయన ఘట, పట, శకట, వట, కుడ్యములయందును, మనుష్యులలోను వెలయుచున్నాడు. యీదేవుడే శివ, హరి, హర, బ్రహ్మ, ఇంద్ర, కుబేర, యమాది నానారూపముల పూజింపబడు చున్నాడు. బహిరంతరముల వ్యాపించి, సర్వాత్మకుడై స్వస్వరూపమున వెలయు యీ దేవునే జ్ఞాను లర్చించుచున్నారు

బహిస్తావన్మహాబుద్ధే క్రమేణ పరిపూజ్యతే
యేన తచ్ఛృణు తత్త్వజ్ఞ శ్రోష్యస్యన్తఃక్రమం తతః. 4

మహామతీ! మొదట, యీదేవుని బాహ్యపూజావిధానమును వినుము. తత్వజ్ఞా! పిదప, అంతర – పూజను జెప్పెదను.

పూజాక్రమేషు సర్వేషు దేహగేహం పవిత్రకమ్
త్యాజ్యం దేహావబోధాత్మ పరం యత్నాత్పవిత్రకమ్. 5

ఈశరీర – గృహము శాస్త్రోక్తములగు స్నాన అచమనాది సంస్కారముల పవిత్రమైనను, దీనిని (దేహాత్మబుద్ధిని) త్యజింపనగును దీనికి సాక్షిభూతమగు చిద్రూపుని జ్ఞానమే పరమపవిత్రము – దీనినే ప్రయత్నపూర్వకముగ గ్రహింపవలెను.

పూజనం ధ్యానమేవాన్తర్నాన్యదస్త్యస్య పూజనమ్
తస్మాత్త్రిభువనాధారం నిత్యం ధ్యానేన పూజయేత్. 6

అంతరమున ధ్యానించుటయే యీదేవుని పూజ; ఇదిగాక యీపూజ కింకొక క్రమము లేదు. అందువలన, త్రిభువనాధారుడగు యీదేవుని ధ్యానమువలన సర్వదా పూజింపుము.

చిద్రూపం సూర్యలక్షాభం సమస్తాభాసభాసనమ్
అన్తస్థ చిత్ప్రకాశం స్వమహన్తాసారమాశ్రయేత్. 7

ఈదేవుని చిద్రూపము లక్షసూర్యుల కాంతితో దేదీప్యమానమై వెలయుచున్నది. ప్రకాశములనన్నిటిని ఇది ప్రకాశింపజేయుచున్నది. పరిశుద్ధమొనర్పబడిన చిత్ప్రకాశమే అహంభావము యొక్క సారభాగమని గ్రహింపుము. అందువలన దీనినే ఆశ్రయింపుము.

అపారపరమాకాశవిపులాభోగకన్ధరమ్
అనన్తాధస్తనాకాశకోశపాదసరోరుహమ్. 8

అపారమగు పరమాకాశముయొక్క విపుల వైశాల్యమే యీదేవుని కంఠభాగము; అనంతమును, నిమ్నస్థితమునగు ఆకాశకోశమే యీదేవుని పాదపద్మము.

అనన్తదిక్తటాభోగభుజమణ్డలమణ్డితమ్
నానావిధమహాలోకగృహీత పరమాయుధమ్. 9

విశాలమగు అనంత దిఙ్మండల మీదేవుని భుజమండలము; నాలుగుదిక్కుల వెలయు లోకము లీయన చేతనున్న అస్త్రసమూహములు.

హృల్లోకైకకోణవిశ్రాన్తబ్రహ్మాణ్డౌఘపరమ్పరమ్
ప్రకాశపరమాకాశపారగాపారవిగ్రహమ్. 10

బ్రహ్మాండసమూహపరంపర లీదేవుని హృదయకోశమునందలి ఒకమూల అణగియున్నవి. అపారమును, ప్రకాశస్వరూపమునగు యీదేవుని శరీరము, పరమాకాశమునకావల వెలయుచున్నది.

అధ ఊర్ధ్వం చతుర్దిక్షు విదిక్షు చ నిరన్తరమ్
బ్రహ్మేన్ద్రహరిరుద్రేశప్రముఖామరమణ్డితమ్. 11

ఈ శరీరముయొక్క నాలుగువైపుల, మీద, క్రింద, మధ్య, బ్రహ్మేంద్రరుద్ర హరిహరాదులను దేవతలు వెలయుచు శోభను గలిగించుచున్నారు.

ఇమాం భూతశ్రియం తస్య రోమాలిం ప్రవిచిన్తయేత్
వివిధారమ్భకారిణ్యస్త్రిజగద్యన్త్రరజ్జవః. 12
ఇచ్ఛాద్యాః శక్తయస్తస్య చిన్తనీయాః శరీరగాః
ఏష దేవః స పరమః పూజ్య ఏష సదా ఽసతామ్. 13

చతుర్విధములగు జీవరాసు లీయన రోమసమూహములని భావింపుము. వివిధకార్యములతో గూడుకొనిన త్రిజగత్తులను యంత్రరజ్జువులనదగు ఇచ్ఛాది శక్తు లీయన శరీరమున వెలయు నాడీ సమూహములు. ఈ దేవుడే సాధుజనులకు పరమపూజ్యుడై వెలయుచున్నాడు.

చిన్మాత్రమనుభూత్యాత్మా సర్వగః సర్వసంశ్రయః
ఘటే పటే వటే కుడ్యే శకటే వానరే స్థితః 14

చిన్మాత్రుడును, అనుభూతిస్వరూపుడును, సర్వవ్యాపియును, సర్వాశ్రయుడును నగు ఈ దేవుడు ఘట, పట, వట, శకట, కుడ్యములలోను, మనుష్యులయందునను వెలయుచున్నాడు.

శివో హరో హరిర్బ్రహ్మా శక్రో వైశ్రవణో యమః
అనన్తైకపదాధారసత్తామాత్రైకవిగ్రహః. 15

శివ, హరి, హర, బ్రహ్మ, ఇంద్ర, కుబేరులుగూడ ఈయనయే; వివిధరూపముల ధరించుట వలన ఈయన అనంతుడనబడుచున్నాడు. భేదరహితమగు అద్వితీయసత్తయే ఈయన శరీరము. ఇదిగాక ఈయనకు వేఱొక శరీరములేదు.

వివర్తితజగజ్జాలః కాలోఽస్య ద్వారపాలకః
సశైలభువనాభోగమిదం బ్రహ్మాణ్డమణ్డలమ్. 16
దేహకోణోఽస్య కస్మింశ్చిత్స్వాఙ్గావయవతాం గతమ్
విచిన్తయేన్మహాదేవం సహస్రశ్రవణేక్షణమ్. 17
సహస్రశిరసం శాన్తం సహస్రభుజభూషణమ్
సర్వత్రేక్షణశక్త్యాఢ్యం సర్వతో ఘ్రాణశక్తికమ్. 18
సర్వతః స్పర్శనమయం సర్వతో రసనాన్వితమ్
సర్వత్ర శ్రవణాకీర్ణం సర్వత్ర మననాన్వితమ్. 19
సర్వతో మననాతీతం సర్వతః పరమం శివమ్
సర్వదా సర్వకర్తారం సర్వసంకల్పితార్థదమ్. 20
సర్వభూతాన్తరావస్థం సర్వం సర్వైకసాధనమ్
ఇతి సంచిన్త్య దేవేశమర్చయేద్విధివత్తతః. 21

జగత్తులను వివర్తమందజేసిన కాలుడే ఈతని ద్వారపాలకుడు; పర్వతసమన్వితమగు విశాల లోకములతో గూడుకొనిన బ్రహ్మాండ మీయన శరీరమునందలి ఒకానొక క్షుద్రభాగము. సహస్రచక్షుడును, సహస్రకర్ణుడును, సహస్రశిరుడును, సహస్రహస్తుడును, శాంతుడునునగు ఈ మహాదేవుని చింతింపవలెను. ఈయనయొక్క దర్శనశక్తి సర్వవ్యాపిని; ఇట్లే ఈతని ఘ్రాణ, స్పర్శ, రసన, శ్రవణ, మననశక్తులుగూడ సర్వత్ర వ్యాప్తములై వెలయుచున్నవి. కాని, ఈయన మననమున కతీతుడు. ఈ దేవుడు పరమమంగళమయుడు. సర్వకాలముల, సర్వమునకు కర్తయగు ఈయన సంకల్పిత విషయముల ననుగ్రహించుచున్నాడు. సర్వమయుడగు ఈ దేవుడు నిఖిలభూతములమధ్య వెలయుచున్నాడు. అన్నిటిని గ్రహించుట కీయనయొక్కడే సాధనభూతుడు — ఇట్లు చింతించి, యథావిధిగ ఈయనను పూజింపవలెను.

విధానమర్చనస్యేదం శృణు బ్రహ్మవిదాం వర
స్వసంవిదాత్మా దేవోఽయం నోపహారేణ పూజ్యతే. 22

బ్రహ్మవిత్ - శ్రేష్ఠా! యీదేవుని అర్చావిధానమును వినుము. స్వసంవిద్రూపుడగు ఈ యాత్మదేవుడు గంధ పుష్పాది ఉపహారములవలన పూజింపబడజాలడు.

న దీపేన న ధూపేన న పుష్పవిభవార్పణైః
నాన్నదానాదిదానేన న చన్దనవిలేపనైః. 23

న చ కుఙ్కుమకర్పూరభోగైశ్చిత్రైర్న చేతరైః
నిత్యమక్లేశలభ్యేన శీతలేనాఽవినాశినా. 24
ఏకేనైవాఽమృతేనైష బోధేన స్వేన పూజ్యతే
ఏతదేవ పరం ధ్యానం పూజైషైవ పరా స్మృతా. 25

దీప, ధూప, పుష్ప, చందన, కుంకుమ, కర్పూర, అన్నదానాది వైభోగముల నీదేవు డర్చింపబడజాలడు. అనాయాసలభ్యమును (సులభమును), శాంతిమయమును, అవినాశియునగు ఆత్మబోధసుధవలననే ఈయన పూజింపబడగలడు. ఇదియే పరమధ్యానము, పరాపూజయని చెప్పబడుచున్నది.

యదనారతమన్తస్థశుద్ధచిన్మాత్రవేదనమ్
పశ్యఞ్ఛృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్. 26
ప్రలపన్విసృజన్గృహ్ణన్నుద్ధసంవిన్మయో భవేత్
ధ్యానామృతేన సంపూజ్య స్వయమాత్మానమీశ్వరమ్. 27
పరమాస్వాదయుక్తేన ముక్తేన కుసుమేహితైః
ధ్యానోపహార ఏవాత్మా ధ్యానం హ్యస్య సమీహితమ్. 28
ధ్యానమర్ఘ్యం చ పాద్యం చ శుద్ధసంవేదనాత్మకమ్
ధ్యానసంవేదనం పుష్పం సర్వం ధ్యానపరం విదుః. 29
వినా తేనేతరేణాయమాత్మా లభ్యత ఏవ నో
ధ్యానాత్ప్రసాదమాయాతి సర్వభోగసుఖశ్రియః

అంతరమున విశుద్ధచిన్మాత్రస్వరూపమున వెలయునదైన నగు వస్తురూపమున దర్శన, శ్రవణ, స్పర్శన, ఘ్రాణ, భోజన, శయన, స్వప్న, నిశ్వాస, సంభాషణ, త్యాగాది సర్వసమయముల వెలయవలెను. పరమాస్వాదయుక్తమగు విశుద్ధధ్యానసుధతోడనే యీ ఆత్మేశ్వరుని అర్చింపనగును. అన్యవిషయపరిహారపూర్వకమగు ధ్యానైకాగ్రతాయత్నమే, ఈ దేవుని పూజాపుష్పము. ధ్యానమే ఈయనయొక్క పూజోపహారము, ధ్యానమే పూజావిధి, ధ్యానమే అర్ఘ్యము, ధ్యానమే పాద్యము; విశుద్ధ సంవిత్ - చైతన్యమే ధ్యానకుసుమము. ధ్యానమొక్కటియే పూజోపకరణమని గ్రహింపుము. ధ్యానములేకున్న ఈ ఆత్మదేవుని బొందజాలము. ధ్యానబలముననే ఆత్మస్వరూపప్రకాశమను అనుగ్రహమును బొందగలము.

అయమాత్మా మునే భుఙ్క్తే దేహరూపో గృహే యథా. 30
ధ్యానేనానేన సుమతే నిమేషాంస్త్రయోదశ
మూఢోఽపి పూజయిత్వేశం గోప్రదానఫలం లభేత్. 31
పూజయిత్వా నిమేషాణాం శతమేకమితి ప్రభుమ్
అశ్వమేధస్య యజ్ఞస్య ఫలం ప్రాప్నోతి మానవః. 32
పూజయిత్వా స్వమాత్మానం ఘటికార్ధమితి ప్రభుమ్
అశ్వమేధసహస్రస్య ఫలం ప్రాప్నోతి మానవః. 33

ధ్యానబల్యుపహారేణ స్వయమాత్మానమాత్మనా
ఘటికాం పూజయేద్యస్తు రాజసూయం లభేత సః. 34
మధ్యాహ్నపూజనాదిత్థం రాజసూయైకలక్షభాక్
దివసం పూజయిత్వైవం పరే ధామ్ని వసేన్నరః. 35
ఏషోఽసౌ పరమో యోగ ఏషా సా పరమా క్రియా
బాహ్యసంపూజనం ప్రోక్తమేతదుత్తమమాత్మనః. 36

సుమతీ! ధ్యానబలమునసే యీ ఆత్మదేవుడు ప్రసన్నుడై, దేహాభిమానమునుబూని భోగములనందుచున్నాడు. మునీ! మాధవ్యక్తిగూడ పదమూడు నిముషములు (అత్యంత అల్పకాలము) ఈ దేవుని అర్చింప, గోదానఫలమును బొందుచున్నాడు. నూరునిముషములీ దేవుని అర్చించిన మనుజుడు అశ్వమేధయజ్ఞ - ఫలమును బొందుచున్నాడు. అర్థఘటికాకాల మీదేవుని పూజించిన సహస్రాశ్వమేధఫలము లభించుచున్నది. ఘటికాకాల మీదేవుని ధ్యానించి, ఆత్మసమర్పణమను ఉపహారము సర్పించిన మనుష్యుడు, రాజసూయయాగఫలమును బొందుచున్నాడు. దినార్ధకాలము పూజించిన ఒక లక్షరాజసూయయాగముల ఫలము లభించుచున్నది. దినమంతయు పూజించిన పరమ కైవల్యము లభించును. ఈవిధమగు పరమదేవుని ధ్యానమే పరమయోగ మనంబడుచున్నది. ఇదియే సర్వోత్తమమగు క్రియ. ఇట్లు ఆత్మదేవుని బాహ్యపూజను నీకు జెప్పితిని.

ఏతత్పవిత్రమఖిలాఘవిఘాతహేతుం
యస్త్వాచరిష్యతి నరః క్షణమప్యఖిన్నః,
తం వన్దయిష్యతి సురాసురలోకపూగః
ప్రాప్తాస్పదం జగతి మామివ ముక్తమాత్మన్. 37

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే బాహ్యపూజనం నామాష్టత్రింశః సర్గః ॥ 38 ॥

ఏ మనుష్యుడు నిఖిలపాపహరమును, పవిత్రియుమునగు ఈ పూజను క్షణకాలమైన శాంతమనస్కుడై ఆచరించునో, అతడు నావలె ముక్తుడై ఆత్మపదమును బొందును. స్వాత్మస్వరూపా! సురాసురులందఱును అతనిని బూజింతురు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ పూర్వార్ధమున బాహ్యపూజనమను ముప్పదియెనిమిదవ సర్గము ॥ 38 ॥

---

## ఏకోనచత్వారింశః సర్గః

---

[శబ్దాదివిషయైః ప్రాప్తైరఙ్గప్రత్యఙ్గభాసితుః
ప్రత్యగాత్మశివస్యాత్ర హ్యాన్తః పూజోపవర్ణ్యతే.

ఈ ప్రకరణమున ప్రాప్త శబ్దాదివిషయములచే, అంగప్రత్యంగముల బ్రకాశింపజేయు సాక్షియగు పరమశివుని ఆంతరపూజ వర్ణింపఁబడుచున్నది.]

ఈశ్వర ఉవాచ.—

పావనం పావనానాం యద్యత్సర్వతమసాం క్షయః
తదిదానీం ప్రవక్ష్యేఽహమన్తఃపూజనమాత్మనః.

ఈశ్వరుడు:— పవిత్రవిషయములలో నత్యంతపవిత్రమైనదియును, సర్వవిధములగు అజ్ఞానముల నశింపజేయునదియును నగు శివుని అభ్యంతరపూజను జెప్పుచున్నాడను.

గచ్ఛతస్తిష్ఠతశ్చైవ జాగ్రతః స్వపతోఽపి చ
సర్వాచారగతా పూజా నిత్యం ధ్యానాత్మికా త్వియమ్. 2

ఈ పూజను శయన, స్వప్న, గమన, స్థిత్యాది సర్వావస్థలలోను ఆచరింపవచ్చును. ఈ పూజగూడ ధ్యానాత్మికము.

నిత్యమేవ శరీరస్థమిమం ధ్యాయేత్పరం శివమ్
సర్వప్రత్యయకర్తారం స్వయమాత్మానమాత్మనా. 3

ఈ పూజయందు నిత్యము శరీరస్థితుడగు పరమశివుని ధ్యానింపవలెను. ఆయన బోధల నన్నిటిని తన సాన్నిధ్యమాత్రముననే గలిగించుచున్నాడు. ఆయనను ఆత్మస్థితునిగ గ్రహింపుము.

శయానముత్థితం చైవ వ్రజన్తమథవా స్థితమ్
స్పృశన్తమభితః స్పృశ్యం త్యజన్తమథవాఽభితః. 4
భుఞ్జానం సంత్యజన్తం చ భోగానాభోగపీవరాన్
బాహ్యార్థపరికర్తారం సర్వకార్యస్వరూపదమ్. 5
దేహలిఙ్గేషు శాన్తస్థం త్యక్తలిఙ్గాన్తరాదికమ్
యథాప్రాప్తార్థసంవిత్త్యా బోధలిఙ్గం ప్రపూజయేత్. 6

ఈ యాత్మదేవుడు శయనించియే యుండుగాక, లేక లేచియే యుండునుగాక అథవా, అరుగుచుండునుగాక; యీయన అన్ని అవస్థలలోను పరిచింతనీయుడు. విపులములగు భోగసమూహముల భోగించువాడును, త్యజించువాడును, బాహ్యములగు జాగ్రదాదివిషయముల ననుభవించువాడును, కార్యముల నన్నిటికిని స్వరూపమును గల్పించు దేహ - లింగమున నిర్వికల్పమగు శాంతరూపమున వెలయువాడును నగు ఈ ఆత్మదేవుని, మృదాది పరికల్పితములగు ప్రతిమూర్తులను త్యజించి యథాప్రాప్తమగు స్వరూపజ్ఞానమున పూజింపనగును.

ప్రవాహపతితార్థస్థః స్వబోధస్నానశుద్ధిమాన్
నిత్యావబోధార్ఘ్యాణాయా బోధలిఙ్గం ప్రపూజయేత్. 7

ఈ ఆత్మ ప్రారబ్ధకర్మభోగములను ప్రవాహమునబడి మాలిన్యమునందినను, విశుద్ధ - ఆత్మబోధరూపమను స్నానమున పరిశుద్ధి నందగలదు. ఈ బోధోపచారమువలన ఆ బోధలింగమును బూజింపవలెను,

ఆదిత్యభావనాభోగభావితామ్బరభాస్వరమ్
శశాఙ్కభావనాభోగభావితేన్దుతయోదితమ్ 8

(ఇట్లు భావింప శక్యముగానిచో), ఆకాశమండలమును ప్రకాశింపజేయు సూర్యునివలె భావించునది. (ఇదియు విసుగును కల్పించిన) చంద్రుడని భావించి, ఆరూపమున ఉదయించినట్లు తలచునది.

ప్రతిభాసపదార్థౌఘనిత్యావగతసంవిదమ్
ద్వారైర్వహన్తం శారీరైర్ముఖే ప్రాణస్వరూపిణమ్. 9

ఈయన ప్రాతిభాసిక పదార్థములయందు సంవిత్ - రూపమున వెలయుచున్నాడు. శరీర - ద్వారములను ముఖముల ప్రాణరూపమున ప్రవహించుచున్నాడు.

రసీకృత్య రసం ప్రాణస్వాన్తోదాత్తతురఙ్గమమ్
ప్రాణాపానరథారూఢం గూఢమన్తర్గుహాశయమ్. 10

ఈయన శబ్దాదివిషయరసములను తన ఆనందరసముతో గలిపి, మధురమొనరించి ఆస్వాదించుచున్నాడు. ఈయన ప్రాణాపానములను రథము నధిరోహించియున్నాడు. గూఢుడై హృదయగుహాయందు విశ్రమించుచున్నాడు.

జ్ఞాతారం జ్ఞేయదృష్టీనాం కర్తారం సర్వకర్మణామ్
భోక్తారం సర్వభోజ్యానాం స్మర్తారం సర్వసంవిదామ్. 11

ఈయన జ్ఞానములనన్నిటిని గ్రహించుచున్నాడు. మఱియు, కర్మల కన్నిటికిని కర్త. భోగములనన్నిటిని భోగించు భోక్త. స్మృతుల నన్నిటిని స్మరించు స్మర్తగూడ ఈయనయే.

సమ్యక్సంవిదితాఙ్గాఘం భావాభావనభావితమ్
ఆభాసభాస్వరం భూరి సర్వగం చిన్తయేచ్ఛివమ్. 12

శరీరముల నన్నిటిని ఈయనయే ప్రకాశింపజేయుచున్నాడు. భావాభావములవలన ఈయనయే భావింపబడుచున్నాడు. (అనగా, విషయముల భావించునప్పుడు, ఆయాభావనలకు కర్తగను, ఎట్టి చింతయు లేనప్పుడు పరిశేషించిన నిర్వికల్పస్వరూపముగను గ్రహింపబడుచున్నాడు.) ప్రకాశము లన్నిటికంటెను అధికముగ ప్రకాశించు స్వరూపముగలవాడును, సర్వవ్యాపియును నగు ఈ మంగళమయుని చింతింపవలెను.

నిష్కలం సకలం చైవ దేహస్థం వ్యోమచారిణమ్
అరఞ్జితం రఞ్జితం చ నిత్యమఙ్గాఙ్గసంవిదమ్. 13

ఈయన కళారహితుడయ్యు (ఉపాధివశమున) కళాయుక్తుడు, శరీరవర్తియయ్యును ఆకాశవిహారి, అరంజితుడయ్యు రంజితుడునునై యున్నాడు. ఈయన, శరీరము నందంతటను వ్యాపించియున్న బోధస్వరూపుడు.

మనోమననశక్తిస్థం ప్రాణాపానాన్తరోదితమ్
హృత్కంఠతాలుమధ్యస్థం భ్రూనాసాపుటపీఠగమ్. 14

ఈయన మనస్సుయొక్క మననశక్తియందు వెలయుచున్నాడు. ప్రాణాపానముల ఉదయించుచున్నాడు. హృదయము, కంఠము, తాలువుల మధ్యప్రదేశమున ఒప్పారుచున్నాడు. (భ్రూనాసాపుటముల చరించుచున్నాడు.)

షట్త్రింశత్పదకోటిస్థసముస్న్యస్తదశాతిగమ్
కుర్వన్తమన్తఃశబ్దాదీంశ్చోదయన్తం మనఃఖగమ్. 15

ఈయన శైవశాస్త్రప్రోక్తములగు ముప్పదియాఱు తత్త్వముల కావల వెలయుచున్నాడు. 'కలవికరణీ' మొదలుగాగల కళలను, 'ఉన్మనీ' 'మనోన్మనీ' మున్నగు స్థితులను ( = నవికల్పసమాధిని) దాటుచున్నాడు. శబ్దాదివిషయములను సృష్టించుచున్నాడు. మనస్సను పక్షిని పరిచాలిత మొనర్చుచున్నాడు.

వికల్పిన్యవికల్పే చ ద్వివిధే వాక్పథే స్థితమ్
తిలే తైలమివాఙ్గేషు సర్వేష్వేవాన్తరం స్థితమ్. 16

ఈయన వాచ్య, లక్ష్యములను వాక్పథముల రెండిటియందును చరించుచున్నాడు. నువ్వు లన్నిటియందు నూనెయున్నట్లు, ఈయన సర్వశరీరముల వెలయుచున్నాడు.

కలాకలఙ్కరహితం కఠినం చ కలాగణైః
ఏకదేశే సుహృత్పద్మే సర్వదేహే చ సంస్థితమ్. 17

ఈయనకు కళలను కళంకము లేకున్నను, పంచభూతసమ్మిళితమగు స్థూలరూపమునదాల్చి, కాఠిన్యమును అనగా మూర్తిని పరిగ్రహించుచున్నాడు. ఈయన సర్వదేహముల వెలయుచున్నను, హృత్పద్మమున నొకమూల వెలయుచున్నాడు.

చిన్మాత్రమమలాభాసం కలాకలనకల్పనమ్
పవిత్ర్యక్షదృశ్యం సర్వత్ర స్వానుభూతిమయాత్మకమ్. 18

ఈయన పవిత్రమగు ప్రకాశస్వరూపుడయ్యు కళలను కల్పించుచున్నాడు, అనుభూతి స్వరూపమున సర్వత్ర ప్రత్యక్షమగుచున్నాడు.

ప్రత్యక్చేతనమాత్మీయమర్థిత్వేన పునః స్థితమ్
పదార్థానాముపేత్యాశు క్షణాద్ద్విత్వమివాగతమ్. 19

ఈయనయే మఱల స్వస్వరూపమును మఱచి, జీవభావమునంది, భోగముల గోరుచున్నాడు; స్వాతిరిక్తములగు పదార్థముల రూపమును ధరించి క్షణములో ద్వైతభావము నందినట్లగపడుచున్నాడు.

సహస్తపాదావయవః సకేశనఖదన్తకః
స్వదేహసంవిదాభాసో దేవోఽయమితి భావయేత్. 20

తరువాత, హస్తపాదాదులతోడను, కేశనఖదంతములతోడను గూడుకొనిన దేవునివలె తన్ను భావించుకొనవలెను.

విచిత్రాః శక్తయో బాహ్యాశ్చ నానాచారా మనోదృశామ్
ఉపాసతే మామనిశం పత్న్యః కాన్తమివోత్తమమ్. 21
మనో మే ద్వారపాలోఽయం నివేదితజగత్త్రయః
చిన్తేయం మే ప్రతీహారీ ద్వారస్థా శుద్ధరూపిణీ. 22
శక్తిర్జ్ఞమాత్మికా బుద్ధిః క్రియా చైవ వరాఙ్గనా
జ్ఞానాని చ విచిత్రాణి భూషణాన్యఙ్గగాని మే 23

కర్మేన్ద్రియాణి ద్వారాణి బుద్ధీన్ద్రియగణైః సహ
అయం సోఽహమనన్తాత్మా వ్యవచ్ఛేదోజ్ఝితాకృతిః 24
తిష్ఠామి భరితైకాత్మా పూర్ణః సర్వావపూరకః
ఇతి దైవీముపాశ్రిత్య స్వచ్ఛామాత్మచమత్కృతిమ్. 25

మఱియు, పత్నీగణము ఉత్తముడగు పతిని సర్వదా సేవించునట్లు, వివిధములగు ఆచరణముల నల్పునవియు, విచిత్రములును, బహువిధములును నగు మనశ్శక్తులు సర్వదా నన్ను ఉపాసించుచున్నవి. మనస్సు నా ద్వారపాలకుడు; అతడు జగత్త్రయముయొక్క వివరణను నాకు దెల్పుచున్నాడు. శుద్ధరూపమగుచింత నా ద్వారమున మెలగు ప్రతిహారి. దీని స్వభావము విశుద్ధము. బుద్ధి నాయొక్క శక్తి, క్రియ మనోహరమగు నా రమణి జ్ఞానములన్నియు నా శరీరమున నొప్పు ఆభరణములు, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు నాద్వారములు. నేను అనంతుడనగు ఆయాత్మను. నా ఆకృతికి పరిమితి లేదు. నేను పూర్ణమును, ఏకమును, అద్వయమునునగు ఆత్మస్వరూపమున వెలయుచు వస్తువుల నన్నిటిని పూరించుచున్నాడను' అని దేవభావమును జింతింపనగును.

దేవత్వపరిపూర్ణోఽన్తరదీనాత్మావతిష్ఠతే
నాస్తమేతి న చోదేతి న తుష్యతి న కుప్యతి. 26
న తృప్తిం న క్షుధం యాతి నాభివాఞ్ఛతి నోజ్ఝతి
సమః సమసమాచారః సమాభాసః సమాకృతిః. 27
సౌమ్యతామలమాయాతః సమన్తాత్సున్దరాశయః
ఆదేహమేక ఏవాసావవ్యవచ్ఛిన్నమహామతిః. 28
దేవార్చనం కరోత్యేవ దీర్ఘదీర్ఘమహర్నిశమ్
చిత్తత్త్వచలితో దేహో దేవోఽస్య సముదాహృతః 29

అప్పుడు హృదయము దేవత్వపూర్ణమవ పూజకుడు అదీనభావమ్మున వెలయును. అప్పుడాతనికి ఉదయాస్తమయములు (జననమరణములు), సంతోషవిరాగములు, వాంఛాతృప్తులు, గ్రహణత్యాగములు ఉండవు. అతని హృదయము సమభావాపన్నమగును. అతని ఆకృతి, ఆచరణ లీవస్తువని బోలియుండును; అతడు సమదర్శియగును.. ఆ మహామతి సంపూర్ణముగ సౌమ్యభావము నొంది, సర్వతోభావమగు సుందరమతినిబొంది, శరీరముండునంతవఱకు అపరిచ్ఛిన్నమగు ఏకాత్మభావమున వెలయుచుండును. ఇట్లాతడు రాత్రిందివములు దేవపూజ నధికముగ నొనర్చుచుండును. చిన్మయమగు ఆత్మయే ఈ పూజకుని దేవత.

యథాప్రాప్తేన సర్వేణ తమర్చయతి వస్తునా
సమయా సర్వయా బుద్ధ్యా చిన్మాత్రం దేవచిత్పరమ్. 30

ఈ పూజకుడు సమత్వమునందిన తన బుద్ధియంతటితోడను, అనాయాసలభ్యములగు సర్వవస్తువులతోడను ఈ చిన్మయదేవు నుపాసించుచుండును.

యథాప్రాప్తక్రమోత్థేన సర్వార్థేన సమర్చయేత్
మనాగపి న కర్తవ్యో యత్నోఽత్రాపూర్వవస్తుని. 31

ఈ ఆత్మదేవుని పూజింప, గంధపుష్పాది విశేషవస్తువులను సమకూర్చవలసిన అవసరము ఒకింతయులేదు. యెట్టి ఎదుట లభించు వస్తువులన్నిటి తోడను ఈ దేవుని పూజింపవచ్చును.

ప్రాప్తదేహతయా నిత్యం తథార్థక్రియయాఽనయా
కామసంసేవనేనాఽథ పూజయేచ్ఛోభనం విభుమ్. 32

ఏయే జాతివారికి శాస్త్రమున ఎట్టివిధానము శాస్త్రముల చెప్పబడినదో, ఆ రీతి ననుసరించి తన కిష్టములగు వస్తువులతో ఈ దేవుని పూజించునది.

భక్ష్యభోజ్యాన్నపానేన నానావిభవశాలినా
శయనాసనయానేన యథాప్తేనార్చయేచ్ఛివమ్. 33

తమ తమ ఐశ్వర్యానుసారము, భక్ష్యభోజ్యాదుల సమర్పించి, శయన, ఆసన, గమనాది సర్వావస్థలయందు ఈ శుభస్వరూపుని అర్చింపవలెను.

కాన్తాన్నపానసంభోగసంభారాదివిలాసినా
సుఖేన సర్వరూపేణ సంబుద్ధ్యాఽఽత్మానమర్చయేత్. 34

కాంతాసంగమ, అన్నపానాది సర్వవిధవైభోగముల నీ ఆత్మదేవున కర్పించి, ఆయన తత్త్వమును సంపూర్ణముగ గ్రహించి, ఆయనను పూజింపనగును. (అనగా, ఆత్మజ్ఞానము లభించు నిమిత్తము ఈ విషయభోగముల నన్నిటిని త్యజింపవలెనని భావము.)

ఆధివ్యాధిపరీతేన మోహసంరమ్భశాలినా
సర్వోపద్రవదుఃఖేన ప్రాప్తేనాత్మానమర్చయేత్. 35

అనుభవింపవలసివచ్చిన ఆధివ్యాధులను, తజ్జనితములగు మోహములను, తదితరములగు సర్వ ఉపద్రవములను, దుఃఖములను, ఈ ఆత్మదేవున కర్పించి, పూజింపనగును, వాటియందు పూజాబుద్ధి నుంచవలసియుండునేకాని, మోహపారవశ్యమున క్రుంగిపోరాదు.

సమస్తైశ్చ సమస్తానాం చేష్టానాం జగతః స్థితేః
మృతిజీవితస్వప్నాద్యైః ప్రాప్తైరాత్మానమర్చయేత్. 36

జగత్తుననున్న సమస్తప్రయత్నములను, తత్ఫలములను, జీవితమరణములను, స్వప్నాదులను ప్రాప్తములగు తీరుననుసరించి యర్పించుచు ఈ ఆత్మదేవుని అర్చింపవలెను. ఇందెట్టి దోషమునులేదు.

దారిద్ర్యేణాథ రాజ్యేన ప్రవాహపతితాత్మనా
విచిత్రచేష్టాపుష్పేణ శుద్ధాత్మానం సమర్చయేత్. 37

సంసారప్రవాహమున బడిన జీవుడు తాను దరిద్రుడైన తన దారిద్ర్యము నర్పించియు, తాను రాజైన రాజ్యము నర్పించియు, మఱియు విచిత్ర - ప్రయత్నములను పుష్పములతోడను, శుద్ధుడగు పరమాత్మను బూజింపవలెను.

నానాకలహకల్లోలలలనోల్లాసశాలినా
రాగద్వేషవిలాసేన సౌమ్యమాత్మానమర్చయేత్. 38

నానావిధములగు కలహ - కల్లోలములతోడను, సంతోషముయొక్క చాంచల్యములతోడను, రాగద్వేషాదుల విలాసముతోడను, సౌమ్యమగు ఈ ఆత్మనర్చింపనగును.

సతాం హృదయగామిన్యా రూఢయా శశిశీతయా
మైత్ర్యా మాధుర్యధర్మిణ్యా హృత్స్థమాత్మానమర్చయేత్. 39

సత్పురుషుల హృదయమున మెలగునదియు, చంద్రునివలె చల్లనిదియును, మాధుర్యధర్మిణియునునగు మైత్రితో, సర్వహృదయముల వెలయు ఈ ఆత్మ నర్చింపవలెను.

ఉపేక్షయా కరుణయా సదా ముదితయా హృది
శుద్ధయా శక్తిపద్ధత్యా బోధేనాత్మానమర్చయేత్. 40

మైత్రి, కరుణ, ఉపేక్ష, ముదిత (హర్షము), క్రోధనిగ్రహసామర్థ్యము మున్నగు విశుద్ధ భావములతో ఈ ఆత్మదేవుని అర్చింపవలెను.

ఆకస్మికోపయాతేన స్థితేనానియతేన చ
భోగాభోగైకభోగేన ప్రాప్తేనాత్మానమర్చయేత్. 41

ఆకస్మికముగ లభించునవియు, అనుభవింపబడుచున్నవియును, క్షణికములును నగు భోగములన్నిటితోడను లేక ఒక్కదానితోడనైనను ఈ ఆత్మదేవు నర్చింపవలెను.

భోగానామనిషిద్ధానాం నిషిద్ధానాం చ సర్వదా
త్యాగేన వాతిరాగేణ స్వాత్మానం శుద్ధమర్చయేత్. 42

విహితములును నిషిద్ధములును అగు భోగముల త్యాగము లేక అనురాగములతో ఈ ఆత్మదేవుని (వాటిని సమర్పించి) సర్వదా పూజింపవలెను.

ఈహితానీహితౌఘేన యుక్తాయుక్తమయాత్మనా
త్యక్తేనాత్తేనచార్థేన హ్యర్థానామీశమర్చయేత్. 43

కోరబడినవియును, కోరబడనివియును, యుక్తములును, అయుక్తములును, త్యజింపబడినవియును, త్యజింపబడనివియును (భోగింపబడుచున్నవియును) అగు భోగములతో భోక్తయగు ఈ ఆత్మదేవుని అర్చింపవలెను.

నష్టం నష్టముపేక్షేత ప్రాప్తం ప్రాప్తముపాహరేత్
నిర్వికారతయైతద్ధి పరమార్చనమాత్మనః. 44

సంపూర్ణముగ వినష్టమైపోవు విషయముల నుపేక్షించునది; లభ్యములగువాటిని సంగ్రహించునది. ఇట్లు నిర్వికారభావమును అనగా సమత్వమును బడయుటయే పరమార్చనము.

సర్వదైవ సమగ్రాసు చేష్టానిష్టాసు దృష్టిషు
పరమం సామ్యమాధాయ నిత్యాత్మార్చావ్రతం చరేత్. 45

ఇష్టానిష్టాదికములగు విషయములన్నిటియందున, సంపూర్ణమగు సమత్వమును బడసి సర్వదా ఈ ఆత్మార్చనావ్రతమును నొనర్చుచుండవలెను.

సర్వం విన్దేత సుశుభం సర్వం విద్యాచ్ఛుభాశుభమ్
సర్వమాత్మమయం కుర్యాన్నిత్యాత్మార్చావ్రతం చరేత్. 46

సర్వము బ్రహ్మమేయను దృష్టివలన శుభమును బడయుదువని గ్రహింపుము. బ్రహ్మము మాయ కలసియున్నదను దృష్టివలన శుభాశుభములు రెండును సంభవించునని గ్రహించునది కాని, ఆత్మార్చనా - వ్రతపరుడు సర్వము ఆత్మమయమని యెంచవలెను. (దీనివలన సర్వసమత్వమేర్పడి వైషమ్యదర్శనము తొలగగలదు.)

ఆపాతరమణీయం యద్యచ్చాపాతసుదుఃసహమ్
తత్సర్వం సుసమం బుద్ధ్వా నిత్యాత్మార్చావ్రతం చరేత్. 47

ఆపాతరమణీయములును, ఆపాతదుస్సహములునునగు విషయములన్నిటియందును సమత్వ బుద్ధిని నిల్పి, ఈ ఆత్మార్చనావ్రతమును సల్పవలెను.

అయం సోఽహమయం నాహం విభాగమితి సంత్యజేత్
సర్వం బ్రహ్మేతి నిశ్చిత్య నిత్యాత్మార్చావ్రతం చరేత్. 48

'అదియే నేను" 'ఇది నేను కాదు' మున్నగు భేదవిభాగసంబంధములగు కల్పనలను పరిత్యజించవలెను. 'సర్వము బ్రహ్మము' అను (అభేద) దృష్టి నవలంబించి, నిత్యమాత్మార్చనా వ్రతమును సల్పవలెను.

సర్వదా సర్వరూపేణ సర్వాకారవికారిణా
సర్వం సర్వప్రకారేణ ప్రాప్తేనాత్మానమర్చయేత్. 49

నానావిధరూపములను, నానావిధములగు వికారములను ఆశ్రయించి సర్వప్రకారముల, సర్వత్ర ఉపలభ్యమానమగు ఈ ఆత్మ నర్చింపవలెను.

అనీహితం పరిత్యజ్య పరిత్యజ్య తథేహితమ్
ఉభయాశ్రయణేనాపి నిత్యమాత్మానమర్చయేత్. 50

ఇష్టానిష్టములను, మిథ్యాత్మబుద్ధిని పరిత్యజించి, ఇవన్నియును స్వాత్మమాత్రములని గ్రహించి ఈ ఆత్మదేవుని అర్చించుచునది.

న వాఞ్ఛతా న త్యజతా దైవప్రాప్తాః స్వభావతః
సరితః సాగరేణేవ భోక్తవ్యా భోగభూమయః. 51

సముద్రుడు నదీసమూహములను వాంఛింపక, త్యజింపక, అదృష్టవశమున అరుదెంచినవాటిని గ్రహించునట్లు, సుఖదుఃఖహేతువులగు భోగవిషయములను భోగింపవలెను.

ఉద్వేగో నానుగన్తవ్యస్తుచ్ఛాతుచ్ఛాసు దృష్టిషు
వ్యోమ్నా చిత్రపదార్థేషు పతితో హ్యేతతేష్వివ. 52

అవమానాది తుచ్ఛస్థితులయందునను, ప్రాణాపాయాది ఘోరసంకటములగు అతుచ్ఛ స్థితులయందునను బడి ఉద్వేగము నందరాదు; ఆకాశమున అప్పుడప్పుడు తోచు (గంధర్వనగరాది) విచిత్రవిషయములవలె వీటిని గ్రహింపవలెను.

దేశకాలక్రియాయోగాద్యదుపైతి శుభాశుభమ్
అవికారం గృహీతేన తేనైవాత్మానమర్చయేత్. 53

దేశ, కాల, క్రియలవలన సంభవించు శుభాశుభములను నిర్వికారబుద్ధితో గ్రహించి ఈ ఆత్మదేవుని అర్చింపవలెను.

ఆత్మార్చనవిధానేఽస్మిన్ప్రోక్తా ద్రవ్యశ్రియస్తు యాః
ఏకేనైవ సమేనైతా రసేన పరిభావితాః. 54

ఈ ఆత్మార్చనావిధానమున జెప్పబడిన ద్రవ్యములన్నియును సమత్వపూర్ణమగు ఏకరసమున ఆప్లుతములు.

నామ్లానకటవో నో తిక్తా న కషాయాశ్చ కాశ్చన
చిత్రైరపి రసైర్దిగ్ధా మధురా ఏవ తాః కిల. 55

ఇవేవియును కట్వామ్లతిక్తకషాయములుగావు; నానావిధరసదిగ్ధములైనను మధురమగు ఏకరసయుక్తములుగనే భావింపవలెను!

సమతా మధురా రస్యా రసశక్తిరతీన్ద్రియా
తయా యద్భావితం చేత్యమమృతం తత్క్షణాద్భవేత్. 56

సమతారసము అత్యంతమధురము, ఇంద్రియాతీతమును నైయున్నది. దీనివలన భావింపబడు పదార్థములన్నియును క్షణములో మధురములగును.

సమతామృతరూపేణ యద్యన్నామ విభావ్యతే
తత్తదాయాతి మాధుర్యం పరమిన్దోరివ చ్యుతమ్. 57

ఎయ్యదెయ్యది ఈ సమతామృతమున భావింపబడుచున్నదో, అయ్యదయ్యది చంద్రచ్యుతమైనదానివలె మాదుర్యమును బడయుచున్నది.

సమతాకాశవద్భాత్వా యత్తు స్యాల్లీనమానసమ్
అవికారమనాయాసం తదేవార్చనముచ్యతే. 58

బ్రహ్మైక్యదర్శనమను సమత్వమునంది, ఆకాశమువలె నిర్వికారత్వమును బొంది, మనస్సు లీనమగుటయే అనాయాసకరమగు దేవార్చన మనంబడుచున్నది.

పూర్ణేన్దునేవ పూర్ణేన భావ్యం సమసమత్విషా
స్వచ్ఛేన చిద్ఘనైకేన జ్ఞేనాప్యుపలరూపిణా. 59

స్ఫటికశిలవలె చిద్ఘనత్వము నంది, చంద్రునివలె పూర్ణత్వమును, సమత్వకాంతిని బడసి, వెలయుచుండునది.

అన్తరాకాశవిశదో బహిఃప్రకృతకార్యకృత్
రఞ్జనామిహికాముక్తః సంపూర్ణో జ్ఞ ఉపాసకః. 60

బహిఃప్రకృతిసంబంధములగు సంసారకార్యముల నాచరించుచున్నను, ఆకాశము రంజనవినిర్ముక్తమై వెలయునట్లు, అంతరమున విషయానురక్తిలేక ఉపాసకుడు పరిపూర్ణుడై వెలయవలెను.

స్వప్నేఽప్యదృష్టహృల్లేఖమజ్ఞానాభ్రపరిక్షయే
శాన్తాహన్తాదిమిహికం జ్ఞః శరద్వ్యోమ రాజతే. 61

అజ్ఞానపరిభ్రమము క్షీణింప, స్వప్నమునగూడ కామ - రేఖ తోచదు; అప్పుడు అహంకారాదిరూపకమగు పొగమంచు తొలగిపోవ తత్త్వజ్ఞుడు శరత్కాల - ఆకాశమువలె విరాజిల్లును.

సోమార్కమస్తమితమానసమాతృమేయం
సద్యః ప్రసూతశిశువేదనవద్వితానమ్
పశ్యన్ప్రశాన్తమతిచేతనచిత్తబీజం
జీవన్ముక్తపదస్థిత ఏవ తిష్ఠ. 62

నీవు జీవద్దశయందే సర్వోత్తమమగు బ్రహ్మపదమున వెలయుము, అప్పుడే పుట్టిన శిశువువలె ప్రపంచవికల్పనల గాంచక, చిదాభాసమునను చిత్తమునను మూలకారణమగు ఆ మంగళమయాత్మను గాంచుచుండుము. సూర్యుడు, ఆనందసుధాపూర్ణుడగుటవలన నిష్కళంకుడగు చంద్రునివలె నీవుగాక! ప్రపంచప్రకాశముచే సూర్యరూపమగునట్టి మనోవృత్తి నీకశమించుగాక! నీమనస్సున ప్రమాతృప్రమేయాది భేదభావములు అస్తమించునుగాక!

దేశకాలకరణక్రమోద్గతైః
సర్వవస్తుసుఖదుఃఖవిభ్రమైః,
నిత్యమర్చయ శరీరనాయకం
తిష్ఠ శాన్తసకలేహయా ధియా. 63

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే దేవార్చనవిధిర్నామ
ఏకోనచత్వారింశః సర్గః ॥ 39 ॥

నీవు, ఈ శరీరనాయకుడగు ఆత్మదేవుని దేశ, కాల, క్రియా వైచిత్ర్యముల సంభవించు సర్వవస్తువులను, సర్వవిధములగు సుఖదుఃఖములను అర్పించి అర్చింపుము; మఱియు వాంఛారహితమగు బుద్ధితో వెలయుము.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ -
పూర్వభాగమున దేవార్చనావిధియను ముప్పది
తొమ్మిదవ సర్గము ॥ 39 ॥

---

## చ త్వా రిం శః స ర్గః.

---

[పూజ్యపూజకపూజాదివికల్పరహితః శివః
పరిశుద్ధచిదాత్మైవ దేవతాత్త్వమిర్యతే.

ఈ సర్గమున పూజ్య, పూజక, పూజాది త్రిపుటీవికల్పరహితుడును, పరిశుద్ధుడును నగు చిదాత్మయొక్క దేవతాత్వము వర్ణింపబడుచున్నది.]

ఈశ్వర ఉవాచ :—

యథాకాలం యథారబ్ధం న కరోషి కరోషి యత్
చిన్మాత్రస్య శివస్యాన్తర్దేవార్చనమాత్మనః. 1

ఈశ్వరుడు:— యథాసమయమున, యథాశక్తికముగ నీవలన ఆచరింపబడునవియును, ఆచరింపబడనివియును (కృతాకృతములు) నగు కర్మలన్నియును ఈ చిన్మాత్రశివుని అంతరపూజ లేయని గ్రహింపుము.

తేనైవాహ్లాదమాయాతి యాతి ప్రకటతాం తథా
తథా స్థితేన రూపేణ స్వేనైవ స్వయమీశ్వరః. 2

ఈ ఆత్మదేవుడిట్టి పూజవలననే సంతుష్టుడై, సాక్షాత్కరించును; దీనివలననే ఆయన పారమార్థికమగు ఆనందమును, మాయయొక్క ఆవరణభంగమును యొనర్చును.

రాగద్వేషాదిశబ్దార్థా నాత్మన్యన్యతయామతే
సంభవన్తి పృథగ్రూపా వహ్నౌ వహ్నికణా ఇవ. 3

(సర్వానర్థకారణములగు రాగద్వేషాదులవలన పరమశివుని పూజించుట అసంభవమేయన-) అవి వాస్తవమునకు ఆత్మనుండి వేఱుకావు. నిప్పునుండి నిప్పురవ్వలు వేఱుకాకున్నను వేఱైనట్లుగ కనుపడునట్లు, అవి ఆత్మనుండి వేఱుగాకున్నను వేఱైనట్లు తోచుచున్నవి.

యద్యద్రాజత్వదీనత్వసుఖదుఃఖాదివేదనమ్
ఆత్మీయం పరకీయం చ తత్తదర్చనమాత్మనః. 4

తనయొక్కయు, పరులయొక్కయు రాజత్వాది సుఖభోగములును, దారిద్ర్యాది దీనత్వకారణములగు దుఃఖములను గ్రహించుటయే ఆత్మార్చనము.

విశ్వసంవిత్తిరేవార్చా నిత్యస్యాత్మన ఏవ చ
ఘటాద్యాత్మతయా బ్రహ్మ స్వయమాత్మా తథైవచ. 5

నిత్యమగు యీ ఆత్మను యీ జగద్రూపమున నెఱుగుటయే ఆయనయొక్క పూజ; ఈ ఆత్మయే ఆకాశము మొదలుగాని ఘటములవఱకునుగల జాగ్రత్స్వప్నసుషుప్త్యాది అవస్థలనన్నిటిని అలంకరించుచున్నది.

శివం శాన్తమనాభాసమేకం భాస్వరమాగతమ్
జగత్ప్రిత్యయవత్సర్వమాత్మరూపమిదం స్థితమ్. 6

ఈ జగత్తు, ఆ శివుని ఆత్మస్వరూపమై, వాని ప్రకాశమువలననే ప్రకాశించుచున్నది. ఆత్మయొక్క సత్తలేకున్న ఇది ప్రకాశింపజాలదు. ఇదంతయు ఆత్మరూపమై వెలయుచున్నది.

అహో ను చిత్రమాత్మైవ ఘటాద్యన్యద్వ్యవస్థితమ్
జీవాది స్వస్వభావోఽన్తర్యానం విస్మృతిమానివ. 7

ఆశ్చర్యము! ఈ ఆత్మ ఘటపటాది పదార్థములుగ మారి, స్వభావమును వీడుచున్నది! జీవాదిపదార్థములుగ వివర్తితమై స్వస్వరూపమును సంపూర్ణముగ విస్మరించుచున్నది.

సర్వాత్మకస్యావన్తస్య శివస్యాన్తః కిలాత్మనః
పూజ్యపూజకపూజాఖ్యో విభ్రమః ప్రోదితః కుతః. 8

సర్వాత్మకుడును, అనంతుడును, మంగళమయుడును నగు ఆత్మదేవునియందు పూజ్య, పూజక, పూజాది విభ్రమమెటనుండి అరుదెంచినది ?

నియతాకారతాశాన్తే న చ సంభవతీశ్వరే
యత్ర సంకల్ప్యతే బ్రహ్మన్పూజ్యపూజామయః క్రమః. 9

బ్రహ్మజ్ఞా! పూజ్య పూజకాది వ్యవహారములన్నియు పరిచ్ఛిన్నాకారముననే సంకల్పితములగుచున్నవి. శాంతుడగు ఈశ్వరునియందు పరిచ్ఛిన్నములగు ఈ వికల్పములు సంభవింపజాలవు.

పూజ్యపూజాద్యవచ్ఛిన్నో దేవో నిత్యామలాత్మనః
సర్వశక్తేరనన్తస్య నేశ్వరత్వస్య భాజనమ్. 10

పూజ్యపూజకాది భావముల పరిచ్ఛిన్నుడగు దేవుడెన్నటికిని, నిత్యమును, నిర్మలమును, సర్వశక్తిమయమును, అనంతమును నగు ఈశ్వరభావమునకు పాత్రుడవజాలడు.

త్రిజగత్ప్రసృతాచ్ఛాచ్ఛసంవిద్రూపస్య చాత్మనః
నేశ్వరస్యాకృతేర్బ్రహ్మన్వ్యపదేశో హి యుజ్యతే. 11

బ్రహ్మజ్ఞా! అత్యంతనిర్మలమగు ఏ చిద్రూపమునుండి త్రిజకత్తులు ప్రసరించుచున్నవో, ఆ యాత్మరూపియగు ఈశ్వరునియందు ఆకృతికల్పన నొనర్చుట అనుచితము.

దేశకాలపరిచ్ఛిన్నో యేషాం స్యాత్పరమేశ్వరః
అస్మాకముపదేశ్యాస్తే న విపశ్చిద్విపశ్చితామ్. 12

ఈ తత్త్వమును గ్రహించిన తత్త్వజ్ఞుల కింక ఉపదేశింపబడవలసిన దేమియును లేదు. పండితుడా! పరమేశ్వరుని దేశకాలపరిచ్ఛిన్నునిగా తలచువారికే మా యుపదేశము.

తదీయాం దృష్టిముత్సృజ్య తథేమామవలమ్బ్య చ
సమః స్వచ్ఛమనాః శాన్తో వీతరాగో నిరామయః. 13
కామోపహారైరభితో యథాప్రాప్తైరఖిన్నధీః
ఆత్మానమర్చయంస్తిష్ఠ సుఖదుఃఖశుభాశుభైః. 14

అందువలన నీవీ పరిచ్ఛిన్నదృష్టిని పరిత్యజించి, నేను తుదకు జెప్పిన తత్త్వదృష్టి నవలంబించి, సముడవును, శాంతుడవును, విషయాసక్తిశూన్యుడవును, నిరామయుడవునునై, యథాప్రాప్తములగు విషయముల భోగించుచు, అభిన్నబుద్ధితో సుఖదుఃఖ, శుభాశుభముల నన్నిటిని ఉపహారముగ సమర్పించి, ఆ యాత్మదేవుని సమర్చింపుము.

అధిగతవతి సాధో చైకమేవానురూపం
త్వయి తరలితజీవే జన్మదుఃఖాది కించిత్
న లగతి పరిశూన్యే సర్వతః స్ఫాటికాఙ్గే
నవసదన ఇవాఙ్కే నిష్కలఙ్కే కలఙ్కః. 15

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే దేవాతత్త్వవిచారో నామ చత్వారింశః సర్గః ॥ 40 ॥

నీ విప్పుడు తత్త్వవిచారమువలన శరీరమునుండి జీవుని వేఱుపఱచితివి; వాస్తవముగ సాధుపురుషులగువారి గుణముల బొందితివి, మఱియు, వాస్తవమగు తత్త్వమును బడయవలసిన కొఱఁదగాఢ

లేదు. నీ మాయాకళంకము సంపూర్ణముగ తొలగిపోయినది. ఈ బాహ్య - జగతు యిక నీయందు సంలగ్నమవజాలదు. అందువలన, నూతనమగు స్ఫటికభవనమున ఏ వస్తువుయొక్క డాగు అంటనట్లు, జన్మదుఃఖాదులు నీ యందంటజాలకున్నవి.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
దేవతాతత్త్వవిచారమను నలుబదవ సర్గము ‖ 40 ‖

---

## ఏకచత్వారింశః సర్గః.

---

[శాస్త్రాచార్యాదిసాఫల్యం నామభేదప్రకల్పనమ్
అధ్యారోపక్రమః పశ్చాదపవాదః ప్రదర్శ్యతే.

ఈ ప్రకరణమున, శాస్త్రము ఆచార్యులయొక్క ప్రయోజనము, నామరూపమనబడు భేదములకల్పన, అధ్యారోప, అపవాదములు ప్రదర్శింపబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

శివః కిముచ్యతే దేవ పరం బ్రహ్మ కిముచ్యతే
ఆత్మా కిముచ్యతే నాథ పరమాత్మా కిముచ్యతే. 1

శ్రీ వసిష్ఠుఁడు:— దేవా! ఆ పరబ్రహ్మము నెట్టి ధర్మమును స్పృశింపజాలకున్న, దానిని శివుడు (మంగళమయము) అని చెప్పనేల? లేక, పరమాత్మయని వచించుటెందులకు? మఱియు, దేవా! ఆత్మపరమాత్మ శబ్దముల వ్యవహార మెందులకు?

తత్సత్కించిన్న కించిచ్చ శూన్యం విజ్ఞానమేవ చ
ఇత్యాదిభేదో భగవంస్త్రిలోకేశ కిముచ్యతే. 2

భగవంతుఁడా! త్రిలోకేశా! ఆయన సత్త అయ్యు ఏమియునుకాదు; ఆయన శూన్యుడు, విజ్ఞానము అను విభేదముల చెప్పబడుచున్నాడే? — ఇదేమి? వచింపుము.

ఈశ్వర ఉవాచ:—

అనాద్యన్తమనాభాసం సత్కించిదిహ విద్యతే
ఇన్ద్రియాణామగమ్యత్వాద్యన్న కించిదివ స్థితమ్. 3

ఈశ్వరుడు:— ఇట, ఆద్యంతరహితమును, స్వయంజ్యోతియును నగు సద్వస్తువొక్కటియే వెలయుచున్నది; అది ఇంద్రియముల కగమ్యమగుటవలన శూన్యమువలె తోచుచున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ :—.

యదిన్ద్రియాణాం బుద్ధ్యాదియుక్తానామప్యదృశ్యతామ్
గతం తత్కథమీశాన త్వశజ్ఞేనోపగమ్యతే. 4

శ్రీవసిష్ఠుఁడు:— ఈశానుఁడా! అది ఇంద్రియములకును బుద్ధికిని అగోచరమైన, దానిని పొందగలమను నిశ్చయమేమి? — దానిని ఏ యుపాయమువలన పొందగలము?

ఈశ్వర ఉవాచ:—

యో ముముక్షురవిద్యాంశః కేవలో నామ సాత్వికః
సాత్వికై రేవ సోఽవిద్యాభాగైః శాస్త్రాదినామభిః. 5
అవిద్యాం శ్రేష్ఠయా శ్రేష్ఠాం క్షాలయన్నిహ తిష్ఠతి
మలం మలేనావహరన్వ్యక్తిజ్ఞో రజకో యథా. 6

ఈశ్వరుడు:— ఈ ఆత్మవస్తువును ప్రకాశింపజేయ నెట్టి బుద్ధివృత్తియొక్క ప్రయోజనమునులేదు. సాత్త్వికమును, బ్రహ్మాకారాకారితమును నగు బుద్ధివృత్తివలన కేవలము అవిద్యయొక్క ఆవరణము భాగింపబడుచున్నది. ఈ అవిద్యావరణము తొలగిన, బ్రహ్మము తనయంతటదానే ప్రకాశించుచున్నది — ఇదియే ఆత్మసాక్షాత్కార మనంబడుచున్నది. ఇంద్రియవృత్తుల ప్రయోజన మెచ్చట ? (ఈ సాక్షాత్కారముయొక్క క్రమమియ్యది-) మొదట, ముముక్షువు శమదమాదుల సహాయ్యమున, సాత్త్విక - అవిద్యాంశముగ పరిణతుడగుచున్నాడు. తరుతవా, సత్సంగ, సద్గురువులను సాత్విక - అవిద్యాంశాసహాయ్యమున, సాత్త్విక అవిద్యాంశలగు బ్రహ్మకారిత చిత్తవృత్తులతో — రజకుడు మలము (చవుడు) తో మలమును శుభ్రపఱచునట్లు — తన అవిద్యాంశను క్షాళనమొనర్చుకొని పూర్ణబ్రహ్మస్వరూపమున వెలయును. (బ్రహ్మముతప్ప, తక్కినవన్నియును అవిద్యాంతర్గతములు; కనుక, బ్రహ్మసాక్షాత్కారమునకు గారణములగు, సత్సంగ, తదనుకూల చిత్తవృత్త్యాదులు సాత్త్విక అవిద్యాంతర్గములని చెప్పబడినవి.

కాకతాలీయవత్పశ్చాదవిద్యాక్షయ ఆగతే
ప్రపశ్యత్యాత్మనైవాత్మా స్వభావస్త్యేష నిశ్చయః. 7

చిరాభ్యాసఫలముగ, కాకతాలీయన్యాయమున, సౌభాగ్యవశమున పూర్ణబ్రహ్మకారమగు వృత్తివలన అవిద్య నశింప, ఆత్మ తన్నుదానే అవలోకించుకొనును — ఇది దాని నిశ్చితస్వభావము.

యథాకథంచిదఙ్గారే నిఘృష్య క్షాలయఞ్ఛిశుః
కరనైర్మల్యమాప్నోతి కార్ష్ణ్యాఙ్గారక్షయే యథా. 8
యథాకథంచిచ్ఛాస్త్రాద్యైర్భాగైర్భాగం విచారయేత్
సాత్వికస్తామసో భాగో ద్వయోరాత్మోదయస్తథా. 9

బాలుడు హస్తమును అంగారకణము (బొగ్గు) తో తోముకొని కడిగివైచికొనిన, అయ్యది తనయంతటదానే శుభ్రమగునట్లు, శాస్త్రసత్సంగాది అవిద్యాంశలవలన తదితరమగు అవిద్యాంశను విచారించిన సాత్త్విక, తామసికరూపమగు అవిద్యయంతయు వినష్టమగును. కేవలము, స్వప్రకాశమగు ఆత్మ యొక్కటియే నిర్మలమై ప్రకాశించును.

పశ్యత్యాత్మానమాత్మైవ విచారయతి చాత్మనా
ఆత్మైవేహాస్తి నావిద్యా ఇత్యవిద్యాక్షయం విదుః. 10

ఆత్మయే ఆత్మవలన ఆత్మవిచార మొనర్చుచున్నది; దర్శనమొనర్చుచున్నది; తుదకు ఆత్మగయే శేషించుచుచున్నది. కనుక, ఈ విషయమున అవిద్యయొక్క (బుద్ధివృత్తుల) ప్రయోజనములేదు. అవిద్యాక్షయమో ఆత్మరూపావస్థానమని విద్వాంసులు దెలుంగుదురు.

యావత్కించిదిదం వస్తు నానా నాత్మావగమ్యతామ్
క్రమా గురూపదేశాద్యా నాత్మజ్ఞానస్య కారణమ్. 11

(గురూపదేశాది) నానాత్వబుద్ధి యుండునంతవఱకు ఆత్మ గ్రహింపబడవాలదు; గురూపదేశాది క్రమములు ఆత్మజ్ఞాన కారణములు గావు.

గురుర్వాద్రీన్ద్రియవృత్త్యాత్మా బ్రహ్మ సర్వేన్ద్రియక్షయాత్
యద్వస్తు యత్క్షయే ప్రాప్తం తత్తస్మిన్సతి నాప్యతే. 12

గురూపదేశమున ఆత్మజ్ఞానమును బొందగోఱునది, ఇంద్రియసమిష్టికదా! కాని, పరబ్రహ్మము అతీంద్రియము; ఇంద్రియాదులు క్షయమైనయెడలనే ప్రకాశించును. అగుచో, గురూపదేశమెట్లు ఆత్మజ్ఞానమునకు కారణము కాగలదు ? ఎయ్యది లేకున్న వస్తువు లభించునో, అయ్యది ఉండిన ఆ వస్తువెట్లు లభింపగలదు ?

అకారణాన్యపి ప్రాప్తా భృశం కారణతాం ద్విజ
క్రమా గురూపదేశాద్యా ఆత్మజ్ఞానస్య సిద్ధయే. 13

ద్విజా ! గురూపదేశాదికములు ఆత్మజ్ఞానమునకు కారణములు గాకున్నను, (విస్మృత కంఠ చామీకరాదుల ప్రాప్తివలె) కారణములుగ గైకొనబడుచున్నవి.

క్రమే గురూపదేశానాం ప్రవృత్తే శిష్యబోధతః
అనిర్దేశ్యోప్యదృశ్యోఽపి స్వయమాత్మా ప్రసీదతి. 14

శిష్యుని అజ్ఞానవినాశమునకే గురూపదేశాదులు అవసరములగుచున్నవి; అజ్ఞానము నశించిన, ఆత్మ అనిర్దేశ్యమును, అదృశ్యమును నయ్యుగూడ, ప్రసన్నమగుచున్నది.

శాస్త్రైర్నబుధ్యతే నాత్మా గురోర్వచనతో నచ
బుధ్యతే స్వయమేవైష స్వబోధవశతస్తతః. 15

శాస్త్రములవలన ఆత్మ గ్రహింపబడుటలేదు; గురువచనముల గ్రహింపబడుటలేదు; స్వయముగ స్వబోధవలననే అది గ్రహింపబడుచున్నది.

గురూపదేశశాస్త్రైర్వినా చాత్మా న బుధ్యతే
ఏతత్సంయోగసత్తైవ స్వాత్మజ్ఞానప్రకాశినీ. 16

అయినను, గురూపదేశము, శాస్త్రార్థవిచారములు లేకున్న ఆత్మబోధయగుటలేదు; వీటి సంయోగమువలననే ఆత్మజ్ఞానము ప్రకాశింపజేయబడుచున్నది.

గురుశాస్త్రార్థశిష్యాణాం చిరసంయోగసత్తయా
అహనీవ జనాచార ఆత్మజ్ఞానం ప్రవర్తతే. 17

గురువు, శాస్త్రార్థములతో శిష్యునకు ఎడతెగని సంయోగమున గూడిన, పగటియందు జనుల వ్యవహారమువలె ఆత్మజ్ఞానము ప్రవర్తిల్లును.

కర్మబుద్ధీన్ద్రియాద్యన్తసుఖదుఃఖాదిసంక్షయే
శివ ఆత్మేతి కథితస్తత్సదిత్యాదినామభిః. 18

జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, సుఖదుఃఖములు క్షయమవ పరిశేషించునదే శివుడు, ఆత్మ, తత్, సత్ మున్నగు నామముల పేర్కొనబడుచున్నది.

యత్రేదమఖిలం నాస్తి తద్రూపేణైవ చాస్తి వా
తదాకాశాదచ్ఛతరమనన్తం సదివాస్తి హి. 19

ఎట బాధకాలమున జగత్తుయొక్క అసత్త, ఆరోపసమయమున జగత్తుయొక్క సత్త అంగీకరింపబడుచున్నవో, ఎయ్యది ఆకాశముకంటెను నిర్మలమో ఆ అధిష్ఠానతత్త్వమే అనంత, సచ్ఛబ్దముల నిర్దేశింపబడుచున్నది,

అవిశ్రాన్తతయా యత్ర తనువిద్యైర్ముముక్షుభిః
విచిత్రశుద్ధమననకలఙ్కకలితాత్మభిః. 20
అదూర ఏవ తిష్ఠద్భిర్జీవన్ముక్తస్య దృక్పథే
మోక్షోపాసకబోధాయ శాస్త్రార్థరచనాయ చ. 21
బ్రహ్మేన్ద్రరుద్రప్రముఖైర్లోకపాలైః సుపణ్డితైః
పురాణవేదసిద్ధాన్తసిద్ధయే భావితాత్మభిః. 22
చిద్బ్రహ్మ శివ ఆత్మేశపరమాత్మేశ్వరాదికా
ఏతస్మిన్కల్పితా సంజ్ఞా నిఃసంజ్ఞే పృథగీశ్వరే. 23
ఏవమేతజ్జగత్తత్త్వం స్వం తత్త్వం శివనామకమ్
సర్వదా సర్వదా సర్వ సర్వం యత్సుఖమాస్వభో. 24
శివ ఆత్మా పరం బ్రహ్మేత్యాదిశబ్దైస్తు భిన్నతా
పురాతనైర్విరచితా తస్య భేదో న వస్తుతః. 25
ఏవం దేవార్చనం నిత్యం జ్ఞః కుర్వన్మునినాయక
యత్రాస్మదాదయో భృత్యాస్తత్ప్రియాన్తి పరం పదమ్. 26

ఏ బ్రహ్మరుద్రేంద్రాది లోకపాలకులు విచిత్రమగు జగత్తును, విశుద్ధతత్త్వమును కల్పి యొనర్చి చింతించుచు ఆత్మస్వరూపమున వెలయుచున్నారో, మఱియు ఏ పండితులు పరమార్థమునకు కడుదగ్గఱగ జీవన్ముక్తికి గోచరులగుచు వెలయుచున్నారో, మఱియు ఎవరు సంపూర్ణముగ విశ్రాంతినందక విశుద్ధమగు క్షుద్ర – అవిద్యాంశమున నున్నారో వారు అధికారుల కొఱకు, ఉపాసకుల తత్త్వజ్ఞానార్థము వేదపురాణాదులను విచారించి నామరూపవిహీనుడగు ఈ పరమాత్మకు బ్రహ్మము, శివుడు, ఆత్మ, ఈశ్వరుడు, పరమాత్మ, ఈశుడు, చిత్తు మున్నగు నామములను కల్పించినారు. వసిష్ఠా! ఈ ఆత్మతత్త్వమే జగత్తత్త్వము, శివుడనంబడు స్వతత్త్వమునగుచు సర్వదా, అన్నివిధముల అన్నిటికిని మూలమగుచున్నదని గ్రహించి చింతారహితుడవు కమ్ము! మునినాయకా! తత్త్వవేత్తలిట్లు దేవార్చన యొనర్చ, ఎచ్చోట మావంటివారున్ను సేవకులై యుందురో అట్టి పరమపదమున ప్రతిష్ఠితులగుదురు,

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అవిద్యమానమేవేదం విద్యమానమివ స్థితమ్
యథా తస్మై సమాసేన భగవన్వక్తుమర్హసి. 27

శ్రీవసిష్ఠుడు:—భగవంతుడా! ఈ జగత్తు (ఆత్మయందు, లేకున్నను ఉన్నట్లు తోచు చున్నది; ఈవిషయమును సంపూర్ణముగ వచింపుము.

ఈశ్వర ఉవాచ:—

యోఽసౌ బ్రహ్మాదిశబ్దార్థః సంవిదం విద్ధి కేవలమ్
స్వచ్ఛమాకాశమప్యస్య స్థూలం మేరురణోరివ. 28

ఈశ్వరుడు:—ఈ బ్రహ్మాది శబ్దముల యర్థమగు వస్తు వొక్కటియే చిత్తు అని గ్రహింపుము; నిర్మలమగు ఆకాశముగూడ దీనికడ మేరువువలె స్థూలము.

సవేద్యమిహ గచ్ఛన్తీ యాతి చిన్నామయోగ్యతామ్
అప్యవేద్యవతీ నూనమున్మన్యన్తపదస్థితా. 29

ఈ చిత్తు చేత్యభావమునంది నామకరణయోగ్యమగుచున్నది; మఱల నిర్వికల్పావస్థయందు ఈ చేత్యభావము తొలగిపోవుచున్నది.

క్షణాద్భావితవేద్యత్వాదహన్తామనుగచ్ఛతి
పురుషత్వాత్పుమాన్స్వప్నే వనవారణతామివ. 30

స్వప్నమున పురుషుడు వనగజముగ మారునట్లు, ఈ చైతన్యము వేద్యభావమున, అహంభావమును అనుసరించుచున్నది.

అస్యాహన్తాదిరూపాయా దేశతాం కాలతాం గతాః
సంపద్యన్తే తతః శూన్యరూపిణ్యః సఖ్య ఏవ తాః. 31

దీని ఈ అహంకల్పననుండి, క్రమముగ దేశకాలకల్పనలు ఉదయించుచున్నవి. శూన్యరూపములగు ఈ కల్పనలన్నియు, అహంభావముయొక్క సహచారిణు లగుచున్నవి.

తాభిః సంవలితా సైవ సత్తా జీవాభిధానికా
భవతి స్పన్దవిజ్ఞానా పవనస్యేవ లేఖికా. 32

దేశకాలకల్పనలతో గూడుకొనిన ఈ అహంభావకల్పన స్పందవిజ్ఞానమును సంపాదించుకొని, వాతకణమువలె ప్రాణస్పందమునుబొంది, జీవశక్తియను పేరునుబొందుచున్నది.

జీవశక్తిస్తథాభూతా నిశ్చయైకవిలాసినీ
బుద్ధితామనుయాతా సా భవత్యజ్ఞపదే స్థితా. 33

అప్పుడీ జీవశక్తి 'నేను' అను నిశ్చయమొనర్చుకొని, బుద్ధిరూపమున అజ్ఞానమార్గమున నిలబడుచున్నది.

శబ్దశక్త్యా క్రియాశక్త్యా జ్ఞానశక్త్యానుగమ్యతే
ప్రత్యేకం ప్రస్ఫురత్యన్తరప్రదర్శితరూపయా. 34

అనంతరమిందు శబ్దశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులుదయించి, తమతమ రూపముల విస్తరించుకొని, స్ఫూర్తినందుచుండును.

మిలితైర్వివిధగణైః క్షిప్రం స్మృతిం సమనుకూలయన్
మనో భవతి భూతాత్మబీజం సంకల్పశాఖినః. 35

ఈ శక్తులన్నియును గలసి వెంటనే స్మృత్యనుకూలమగు సంకల్పవృక్షమునకు బీజమును, పంచభూతమయమును నగు మనస్సను సంజ్ఞను బొందుచున్నవి.

ఆతివాహికదేహాఖ్యా క్రిభాజనం తద్విదుర్బుధాః.
అన్తస్థయా బ్రహ్మశక్త్యా జ్ఞరూపం స్వాత్మనా త్తదృక్. 36

పండితులు ఈ మనస్సును ఆతివాహిక మందురు. ఈ మనస్సే అంతస్థమగు బ్రహ్మశక్తితో గూడుకొని, జ్ఞాతయనంబడుచున్నది. ఆత్మయొక్క- స్వప్రకాశశక్తివలననే ఈజ్ఞాతృత్వము కలుగుచున్నది.

సంపద్యమానా ఏవాస్మింశ్చేతసీమా హి శక్తయః
పశ్చాదిహ బహిష్ఠాస్తా ఉద్యన్త్యనుదితా అపి. 37

ఈ స్థితియందీ చైతన్యమున కొన్ని శక్తులు ఉత్పన్నములగును. ఈ శక్తులు బయట వెలయుచున్నట్లగపడుచు, ప్రకాశించుచున్నట్లు తోచుచున్నవి. ఇట్లంతస్థమగు కల్పన బయటు గూడ దృఢమగుచున్నది.

వాతసత్తా స్పన్దసత్తా స్పర్శసత్తా తథైవ చ
త్వక్సత్తా తేజసాం సత్తా తథా సత్తా ప్రకాశినీ. 38
రూపసత్తా జలసత్తా స్వాదుసత్తా తథైవ చ
తథైవ సరసత్తా చ గన్ధసత్తా తథైవ చ. 39
భూసత్తా హేమసత్తా చ పిణ్డసత్తా చ పీవరీ
దేశసత్తా కాలసత్తా సర్వాధ్యాకారవర్జితా. 40
సర్వసత్తాగణం చైతత్కోడీకృత్య స్వరూపవత్
స్ఫురత్యాశ్రిత్య పత్రాది బీజం బీజాదితాం గతమ్. 41

ఆ శక్తులు యివి - వాయుసత్త, స్పందసత్త, స్పర్శసత్త, త్వక్ - సత్త, తేజస్సత్త (ఇది రూపమును ప్రకాశింపజేయుచున్నది) రూపసత్త, జలసత్త, స్వాదుసత్త, రససత్త, గంధసత్త, భూమిసత్త, హేమసత్త, జగత్ - సత్త, దేశసత్త, కాలసత్తలు. మనస్సు ఆకారవర్జితములగు ఈ సత్తలనన్నిటిని తనతో నభిన్నముగ కల్పించుకొని, వృక్షబీజము తనతో నభిన్నములగు అంకురపత్రాదుల నిముడ్చుకొని తద్భావమున వెలయునట్లు, వెలయుచుండును.

ఏతత్పుర్యష్టకం విద్ధి దేహాఖ్యాయం చాతివాహికః
అపారబోధమేతత్తు స్ఫురత్యఙ్గ విభాగవత్. 42

ఈ సమిష్టి అంతయు పుర్యష్టకమని గ్రహింపుము. వత్సా! అపరిచ్ఛిన్న బోధస్వరూపమగు బ్రహ్మమే ఈ సమస్తవిభాగములనంది స్ఫురించుచున్నది.

ఏవమాదృగ్జగత్సంపన్నం సంపన్నం న చ కించన
న జ్ఞానం న చ తద్రూపం న విదాచితచేతనమ్. 43

వత్సా! ఇట్టివిధమున ఇవన్నియును అజ్ఞదృష్టియందు సంపన్నములైనట్లు తోచుచు, తత్త్వదృష్టియందు అసంపన్నములేయగుచున్నవి. ఇవి జ్ఞానరూపములుగావున, లేక జ్ఞేయరూపములును గావు. చిదాభాసతోగూడుకొనిన చేతనములునుగావు.

పరం పరే ప్రస్ఫురితం కేవలం కేవలాత్మ సత్
జలపీఠస్య జఠరే జలద్రవవిలాసవత్. 44

జలాధారమగు సముద్రమున, నీటియొక్క వివిధవిలాసములు తోచునట్లు, ఈ పుర్యష్టకము పరబ్రహ్మమున సత్స్వరూపమున స్ఫురించుచున్నది.

సంవిత్సంవేదనైకాత్మ పృథగేతదచేతనమ్
సంపద్యతే పరిజ్ఞాతం సంకల్పనగరోపమమ్. 45

ఈ దృశ్యప్రపంచమును ఆత్మచైతన్యదృష్టితో పరికించిన సంవిదాత్మస్వరూపమును, దానినుండి వేఱుగ భావించిన అచేతనముగను అగుచున్నది. పరిజ్ఞాతమై యది సంకల్పనగరమువలె అలీకమగుచున్నది.

సంవేదనాత్పరిజ్ఞానాచ్ఛివతామేవ గచ్ఛతి
అజ్ఞాతమేవ వా యత్తత్కథం గచ్ఛతి వస్తుతామ్. 46

ఈ దృశ్యము గ్రహింపబడినచో, శివభావమునందుచున్నది; గ్రహింపబడకున్న ఏమియును అవదు. అజ్ఞాతమగునది వస్తువెట్లువగలదు ?

అథైతద్విన్దతే స్వాన్తఃసంకల్పాదంశతాం స్వతః
తన్మాత్రసత్తా తస్యాణోరేతాం పశ్యతి దేహకే. 47
సర్వం స్థూలత్వమాపన్నం తదేవాశు ప్రపశ్యతి
తస్య తన్మాత్రరన్ధ్రాణి యథాదేశం ప్రపశ్యతి. 48
తతః పురుషరూపైకభావనాత్పురుషాకృతిమ్
కాకతాలీయవద్దృష్ట్వా తుష్టం పుష్టం భవత్యలమ్. 49
జీవదేతదవస్థాకం స్థితం పశ్యతి దేహకమ్
అసన్తమేవ గన్ధర్వపురం స్వప్ననరం యథా. 50

చిన్మాత్రస్వభావమగు ఆత్మవస్తువు తనయంతటదానే, తనయందు దృశ్యభావమునందు ననుకొన్నను, పరమసూక్ష్మమును అణుప్రమాణమునునగు ఈ ఆత్మయొక్క తన్మాత్రసత్త మొదట కల్పింపబడిన సూక్ష్మశరీరమునే స్థూలభావమున గాంచుచున్నదని చెప్పవలసియుండును; సంకల్ప కల్పితములగునవన్నియు మిథ్యలే, అందువలన బ్రహ్మమే తనయందు స్థూలభావమునందిన జగత్తును దర్శించుచున్నది. తన్మాత్రరూపములగు చక్షురాది ఇంద్రియములాయా కల్పితవిషయముల గాంచుచున్నవి. తరువాత, తన్ను పురుషునిగ కల్పించుకొని కాకతాళీయముగ, పురుషరూపమును ధరించి, సంతుష్టుడును, పుష్టుడును అగుచుండును. క్రమముగ, గంధర్వనగరమువలెను, స్వప్నదృష్టయగు మనుష్యునివలెను, అలీక జీవభావమునందిన ఈ స్థూలదేహమును గాంచును.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

గన్ధర్వనగరాకారమపి స్వప్ననగోపమమ్
జగద్దుఃఖాయ దుఃఖస్య కాత్రియుక్తిః పరిక్షయే. 51

శ్రీవసిష్ఠుడు:— ఈ జగత్తు గంధర్వనగరమువలెను స్వప్నదృష్టుడగు మనుష్యునివలెను అలీకమేయైనను దుఃఖమును గలిగించుచున్నదిగదా— ఈ దుఃఖక్షయమగుటకుపాయమేమి ?

ఈశ్వర ఉవాచ :—

వాసనావశతో దుఃఖం విద్యమానే చ సా భవేత్
అవిద్యమానం చ జగన్మృగతృష్ణామ్బుభఙ్గవత్. 52
అతః కిం వాస్యతే కేన కస్య వా వాసనా కుతః
కథం స్వప్ననరేణాఙ్గ మృగతృష్ణామ్బు పీయతే. 53

ఈశ్వరుడు:—వాసనయే దుఃఖకారణము; జగత్తుండిన వాసన కూడియుండును, జగత్తుయొక్క ఉనికిపోయి ఎండమావివలె సంపూర్ణముగ అలీకమనితోచునెడ, ఎవరెద్దానిని కోరెదరు? వాసన ఎటునుండిరాగలదు? వత్సా! స్వప్ననరుడు ఎండమావియందలి నీటిని త్రాగగలడా?

స ద్రష్టరి తు సాహన్తే సమనోమననాదికే
అవిద్యమానే జగతి యత్సత్తత్పరిదృశ్యతే. 54

ద్రష్ట, మనస్సు, మననధర్మము, అహంభావసమన్వితమగు జగత్తు నశింప, సన్మాత్రవస్తువగు బ్రహ్మమొక్కటియే పరిదృష్టమగును.

యత్ర నో వాసనా నైవ వాసకో నైవ వాస్యతా
కేవలం కేవలీభావః సంశాన్తకలనభ్రమః. 55

ఎందు వాసనలు లేవో, కోరుకొనబడదగినది లేదో కోరువాడు లేడో, అయ్యదియే కేవలీభావమనంబడు కైవల్యము. అట సంకల్పభ్రమలు విదూరితములైనవి.

యస్య సతోఽప్యసతో వా శూన్య ఏవ హి యక్షకః
విలీనస్తస్య కైవల్యాత్కిమన్యదవశిష్యతే. 56

ఈ జగత్తు సత్యమేయగుగాక లేక అసత్యమేయగుగాక! యక్ష – కల్పన నశింప శూన్యమే మిగులునట్లు, ఈ జగత్తు విలీనమవ కైవల్యముగాక వేఱొండు యేమి మిగులగలదు?

శూన్య ఏవ హి వేతాల ఇవేత్థం చిత్తవాసనా
ఉదితేయం జగన్నామ్నీ తచ్ఛాన్తౌ శాన్తిరక్షతా. 57

శూన్యస్థానమున అలీకమగు బేతాళకల్పనవలె జగత్తను చిత్తవాసనగూడ ఉత్పన్నమైనది ఇది నశింప అక్షతమగు శాంతి లభించును.

అహన్తాయాం జగతి చ మృగతృష్ణాజలే చ యః
సాస్థస్తం ధిగ్కృతనరం నోపదేశ్యస్త్వసావితి. 58

ఏవ్యక్తి అహంభావమునను, జగత్తునను, మరీచికాజలములయందునను సత్యబుద్ధినుంచుచున్నాడో, అతనికి ధిక్కారము!; అతడు ఉపదేశానర్హుడు!

జీవం వివేకినమిహోపదిశన్తి తజ్జ్ఞా
నో బాలముద్భ్రమమసన్మయమార్యముక్తమ్
అజ్ఞం ప్రశాస్తి కిల యః కనకావదాతాం
స స్వప్నదృష్టపురుషాయ సుతాం దదాతి. 59

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జగన్మిథ్యాత్వప్రతిపాదనం నామైకచత్వారింశః సర్గః ॥ 41 ॥

తత్త్వవేత్తలు వివేకవంతులగు జీవులకే ఉపదేశమొనర్తురు. బహువిధభ్రమలబడియు మిథ్యయగు దేహమున అభిమానముగొని, మిథ్యామయ మూర్ఖున కార్యములుపదేశమొసంగరు. ఇట్టివాని కుపదేశమొసగువారు స్వప్నదృష్టుడగు పురుషునకు సువర్ణము నీసడించు తమ కన్యకనొసంగుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ - తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ పూర్వార్ధమున జగన్మిథ్యాత్వప్రతిపాదనమను నలుబదియొకటవ సర్గము ॥ 41 ॥

---

## ద్వి చ త్వా రిం శః స ర్గః.

---

[సమష్టివ్యష్టిసంసారజ్ఞప్తిరీశాదిపూర్వికా
మాయైవేత్యుపదిశ్యాత్ర శంభుః స్వనిలయం యయౌ.

సమష్టి, వ్యష్ట్యాత్మకమగు జగత్తునకు మూలమగు మాయను గురించి ఉపదేశించి ఈశ్వరుడు స్వనిలయమునకు అరుగుచున్నాడు.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

తతః స జీవో భగవన్నుద్భటం దేహసంభ్రమమ్
ఆదిసర్గే నభఃసంస్థం కామవస్థాముపైతి హి. 1

శ్రీవసిష్ఠుడు:—భగవంతుడా ! తరువాత, ఆ జీవుడు దేహభ్రమను గాంచుచున్నాడు - అని చెప్పియుంటిరి. సృష్ట్యాదియందు జీవుడాకాశముననుండి ఏ స్థితిని బొందుచున్నాడు ?

ఈశ్వర ఉవాచ :—

పరస్మాత్పరమే వ్యోమ్ని పూర్వోక్తక్రమతో వపుః
జీవః పశ్యతి సంపన్నం స చ స్వప్ననరో యథా. 2

ఈశ్వరుడు:— ఆ జీవుడు పూర్వోక్తక్రమమున పరమాకాశముననే, స్వప్నదృష్టుడగు నరునివలె, పరబ్రహ్మమునుండి ఉత్పన్నమైన శరీరమును గాంచుచుండును.

సర్వగత్వాచ్చిద్ఘనస్య కార్యం స్వప్ననరోఽపి హి
యథా కరోత్యాశు తథా జీవోఽద్యాపి శరీరధృక్. 3

చిన్మయబ్రహ్మము సర్వవ్యాపియగుటవలన, ఆ జీవుడు శరీరధారియయ్యు స్వప్నదృష్టమనుష్యునివలె, కార్యముల నాచరించుచుండును.

సనాతనోఽహమవ్యక్తః పుమానిత్యభిధాం తతః
కరోత్యాత్మని తేనాసు ప్రథమః ప్రథితః పుమాన్. 4

పిదప, ఆ జీవుడు 'నేను అవ్యక్తసనాతన పురుషుడను' అని తన్ను నిర్దేశించుకొనుటవలన పురుషనామమున ప్రసిద్ధుడగుచున్నాడు.

ఏవం స సర్గే కస్మింశ్చిత్ప్రథమో౽థ సదాశివః
కస్మింశ్చిద్విష్ణురిత్యుక్తో నాభ్యుత్పన్నః పితామహః. 5

ఇట్లు, ఆ ప్రథమపురుషుడు ఒక కల్పమున సదాశివుడుగను, మఱియొక కల్పమున విష్ణువుగను పేర్కొనబడుచున్నాడు; అతని నాభికమలమునుండి జన్మించిన జీవుడు పితామహుడనంబడును.

పితామహః స కస్మింశ్చిత్కస్మింశ్చిదపి చేతరః
స చ సంకల్పపురుషః సంకల్పానుమ్మూర్తిమాస్థితః. 6

కొన్నికల్పముల ఈతడు పితామహుడుగను, మఱికొన్నికల్పముల అన్యముగను పేర్కొనబడును. ఈ సంకల్పమయ పురుషుడు, సంకల్పమువలననే రూపమును బొందుచున్నాడు.

పుష్టః ప్రథమసంకల్పస్తాం మనోమూర్తిమాస్థితః
యద్యథా కల్పయత్యాశు తత్తథానుభవత్యలమ్. 7

ఈ ప్రథమసంకల్పమే మనో - రూపమును (హిరణ్యగర్భుని) దాల్చి, కల్పననొనర్చునదంతయు వ్యవహారాస్పదమగుచున్నది.

తత్త్వసద్రూపమఖిలం శూన్యవేతాలకో యథా
భ్రమదృష్ట్యా తు సద్రూపమిత్యహన్తా జగద్గతిః. 8

కాని, ఈ సంకల్పమయ పదార్థములన్నియు శూన్యుడగు బేతాళునివలె మిథ్యలు. అవి అజ్ఞదృష్టికి సత్యములవలె దోచుచున్నవి. ఇట్లు అహంభావమే జగద్రూపమున విస్తరిల్లుచున్నది.

ద్రష్టాధిపురుషస్త్వేవం స్వయం సంపద్యతే హి యః
స నిమేషం ప్రతి వ్యోమ సముదేత్యథ నీయతే 9

ఇట్లు, ప్రథమ - జీవుడు తన సృష్టికి దానే ద్రష్టయగుచు మఱల, తన స్వరూపపరిచయమైనంతనే నిముషములో చిదాకాశముగ మారుచున్నాడు. మఱల, స్వరూపవిస్మృతి సంభవించిన, నిముషములో అనంతసంసారముగ మారగలడు.

నిమేష ఏవ కల్పో యో మహాకల్పపరమ్పరామ్
ప్రతిభాసవిపర్యాసతూర్ణేనానుభవత్యలమ్. 10

కల్పనాపటువగు ఈయన నిముషమాత్రకాలమున ప్రతిభాసయొక్క విపర్యయము ననుసరించి మహాకల్పపరంపరల ననుభవించుచున్నాడు.

పరమాణౌ పరమాణౌ వ్యోమ్ని వ్యోమ్ని క్షణే క్షణే
సర్గకల్పమహాకల్పభావాభావా భవన్తి తే. 11

ప్రతి పరమాణువున, ప్రతి ఆకాశమున, ప్రతిక్షణమున సృష్టి, కల్ప, మహాకల్ప, భావ, అభావము లుదయించుచున్నవి.

దృశ్యన్తే కేచిదన్యోన్యం సాధర్మ్యాద్వాసనాగతేః
మిథః కేచిన్న దృశ్యన్తే దృష్టేనాథ సదాత్మనా. 12

ఈసృష్టులు వాసనాసామాన్యము ననుసరించి, కొందఱు జీవులకు సమానరూపములుగ కనంబడుచున్నవి. సదాత్మదృష్టులగువారికి ఇవి యగుపడుచుండుటలేదు.

సర్గాః సర్గేణ సర్వత్ర సంభవన్తి న తే శివే
భవన్తి పరమే వ్యోమ్ని వ్యోమరూపా ఇతి స్వయమ్. 13

ఈ సృష్టియం దంతర్గతులగువారికే సృష్టి యగుపడుచున్నది. పరమవ్యోమమగు శివుని యందివి వాస్తవమునను లేవు. ఆయనయందివి ఆకాశరూపమునే (శూన్యత్వమునే) బొందుచున్నవి.

స్వయం చ సదసద్రూపా లీయన్తే స్వప్నశైలవత్
సర్గైర్న దేశ ఆక్రాన్తో న చ కాలో న కర్తృతా. 14

సదసద్రూపములగు ఈ సృష్టులు, స్వప్నదృష్టమగు పర్వతము మేల్కొనిన నశించునట్లు, అజ్ఞానము తొలగిన నశించుచున్నవి. ఈ సృష్టు లెట్టిదేశకాలములను ఆక్రమించుకొనియుండుటలేదు.

న చైతే సత్స్వరూపా వా న కల్ప్యం నాపి చ క్షణః
న చేదం జాయతే కించిన్న చ కించన నశ్యతి. 15

ఈ సృష్టిపరంపరలు సత్స్వరూపములుగాన, కాల్పనికసత్తగూడ వీటికిలేదు. క్షణికసత్తయులేదు. ఇవి జన్మించుచుండుటలేదు, నశించుటయునులేదు.

సర్వం సంకల్పరూపేణ చిచ్ఛమత్కురుతే చితి
స్వప్నపత్తననిర్మాణపాతోత్పాతనవజ్జగత్. 16

చైతన్యమే తనయందు సంకల్పరూపమున ఈ ప్రపంచవైచిత్ర్యమునంతటిని విస్తరింపజేయుచున్నది; స్వప్నదృష్టనగరమువలె ఈ జగత్తు పుట్టుచు, గిట్టుచున్నది.

న దేశకాలక్రమణం కరోతి చ మనాగపి
యథా సంకల్పశైలేన దేశకాలాద్యనన్తకమ్. 17

సంకల్పితమగు పర్వతము దేశకాలముల నతిక్రమింపనట్లు, ఈ సృష్టిగూడ దేశకాలముల నతిక్రమింపజాలకున్నది.

ఆక్రాన్తమపి నాక్రాన్తం తథైవ జగతా సతా
అథ నాక్రాన్తమక్రాన్తమివ సంకల్పమేరుణా. 18

సంకల్పితమగు మేరువు దేశకాలముల నతిక్రమించినట్లు తోచునట్లు, ఈ జగత్తుకూడ దేశకాలముల నతిక్రమించినట్లు తోచుచున్నది.

యథోచ్చైర్దేశకాలాది తథైవ జగతా సతా
సంపద్యతే యథా యోఽసౌ పురుషః సర్వకారకః. 19

దేశకాలాదులు సత్యములనిపించుతీరుగ ఈ జగత్తు సత్తను దాల్చుచున్నది. ఈ ఆదిమజీవుడు కార్యముల నొనర్చుచున్నది సంకల్పముల ననుసరించియే.

అనేనైవ క్రమేణేహ కీటః సంపద్యతే క్షణాత్
తస్యుషామేవమేవేహ జాతయో హి చతుర్విధా. 20

ఇట్లే, సంకల్పవశమున కీటాదిక్షుద్రజీవులుకూడ జన్మించుచున్నవి; చతుర్విధములగు అండజ, స్వేదజ, జరాయుజ, ఉద్భిజములను ప్రాణులుకూడ ఇట్లే జన్మించుచున్నవి.

రుద్రాద్యాస్తృణపర్యన్తాః సంపద్యన్తే క్షణం ప్రతి
పరమాణూపమాః సన్తి తథా కేచిదణూపమాః. 21

ఆరుద్రతృణపర్యంతము ఈ సంకల్పక్షణముననే జన్మించుచున్నది; ఈ సృష్టియందలి విషయములుకొన్ని పరమాణుసమానములు, మఱికొన్ని అణుప్రమాణములు.

ఏష ఏవ క్రమస్తేషాం సతి వాఽసతి సర్గకే
అస్యాః సంసారమాయాయా ఏవం భూతార్థభావనాత్. 22

గతించిన సృష్టులయందు స్థావరాది జీవజాతముల సృష్టి ఇట్లేయైనది; భవిష్యత్తునగూడ ఇట్లేయవగలదు. పరమార్థతత్త్వసాక్షాత్కారమువలన ఈ సంసారవైచిత్ర్యము నశింపగలదు.

భేదోపశాన్తావభ్యాసాద్భవత్యుపగతః శివః
నిమేషశతభాగార్ధమాత్రమేవ పరా చితిః. 23
స్వరూపతశ్చ్యుతా సైషోదేత్యనవస్థితిః
సా జ్ఞరూపా శిలాకాశ ఇవ చిత్స్వాత్మని స్థితా. 24

సర్వవిధభేదము లుపశాంతమైన, అభ్యాసవశమున శాంతిమయమగు బ్రహ్మమున ప్రతిష్ఠ నందవచ్చును, నిముషమునందలి నూఱవభాగములో సగమగునంత స్వల్పసమయమునగూడ, బ్రహ్మము నుండి విచ్యుతినందిన, సంసారముదయించును, చిద్ఘనరూపమున ప్రతిష్ఠితమగుటయే బ్రహ్మమని జ్ఞాను లెఱుంగుదురు.

తదనాద్యవభాసాత్మ బ్రహ్మశబ్దేన గీయతే
అస్మిన్స్పష్టిం గతే సర్గే మహాచిద్ద్యోతనం నచ. 25

ఈ చిత్స్వరూపమే బ్రహ్మశబ్దమున వ్యవహరింపబడుచున్నది. ఈ సృష్టి దృఢభావము నందిన, చిద్వస్తువు వికసింపజాలదు.

సంగతాసత్యదిగ్దేశకాలాంశపరమాణుతా
జీవతామాగతా భూతతన్మాత్రపలనాక్రమాత్. 26

అసత్యములగు దిక్, దేశ, కాల పరిచ్ఛేదముల ఆత్మ క్షుద్రత్వము నందుచున్నది; తన్మాత్రల సాయమున జీవభావము నందుచున్నది.

భవత్యజ్ఞ మృగీవీరుత్కీటదేవాసురాధికమ్
యస్మిన్నిత్యే తతేఽనన్తే దృఢే స్రగివ తిష్ఠతి. 27

వత్సా! తరువాత, దేవ, దానవ, వృక్ష, లతా, ప్రాణ్యాది రూపముల దాల్చుచున్నది; ఇవన్నియును అనంతమును, నిత్యమునునగు ఆ బ్రహ్మమున పుష్పమాలవలె వెలయుచున్నవి.

సదసద్గ్రథితం విశ్వం విశ్వగే విశ్వకర్మణి
న తద్దూరే న నికటే నోర్ధ్వే నాధో న తేన మే
న పూర్వం నాద్య న ప్రాతర్న సన్నాసన్న మధ్యమమ్. 28

సదసద్గ్రథితమగు ఈ విశ్వము, విశ్వగామియగు విశ్వకర్మయందు నిలచియున్నది; ఆయన దూరముకాదు, దగ్గఱయునుగాదు, ఊర్ధ్వమునలేదు, క్రిందయునులేదు. ఆయన నావాడునుకాదు, లేక

నీవాడునుగాదు, ఆయన పూర్వము కాదు లేక అద్యమునుగాదు; ప్రాతఃకాలము కాదు, సదసత్తులును గాదు, లేక ఈ రెండిటి అంతరాళమును గాదు.

అనుభవకలనాప్ముతేఽస్య మాతా
భవతి న సర్వవికల్పనేష్వసత్సు
ఫలదురువిభవా ప్రమాణమాలా
స్థితిముపయాతి న వారిణీవ వహ్నిః. 29

ఈ మిథ్యావికల్పపరంపరలన్నిటికిని, ప్రమాత ఈ బ్రహ్మచైతన్యముగాక వేఱొండు కాదు. ఎవరిసాయమున ఈ బహిర్వ్యవహారములన్నియును ఫలకరము లగుచున్నవో, ఆయనయందు, జలమున అగ్నివలె, ప్రమాణములన్నియు అసమర్థములగుచున్నవి; ఆయన ప్రమాణ ప్రమాతాదుల కతీతుడు.

యథా పృష్టం మునే ప్రోక్తం త్వయి కల్యాణమస్తు తే
దిశం ప్రయామోఽభిమతామాగచ్ఛ త్తిష్ఠ పార్వతి. 30

మునీ! నీవడిగిన దానిని జెప్పితిని; నీకు శుభమగుగాక! అభిమతస్థానమున కరుగుచున్నారము; పార్వతీ లెమ్ము!

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా నీలకణ్ఠోఽసౌ త్యక్తపుష్పాఞ్జలౌ మయి
తతార పరివారేణ సమమమ్బరకోటరమ్. 31

శ్రీవసిష్ఠుడు:— నీలకంఠుడిట్లు నుడువ, నేను ఆయనకు పుష్పాంజలి సర్పించితిని. తరువాత, ఆయన పరిచరులతో ఆకాశమును దాటెను.

తస్మిన్గతే త్రిభువనాధిపతావుమేశే
స్థిత్వా క్షణం తదను సంస్మృతిపూర్వమేవ
అఙ్గీకృతం నవపవిత్రధియా మయాత్మ
దేవార్చనం శమవశైన జహోసితం తత్. 32

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పరమాత్మాభిధానం నామ ద్విచత్వారింశః సర్గః ॥ 42 ॥

త్రైలోక్యాధిపతియగు ఉమావల్లభుడు నిష్క్రమింప నేను ఆయన ఉపదేశమును చింతింపసాగితిని; పిదప నేను నూతనముగ విశుద్ధినందిన పవిత్రబుద్ధియందు ఆత్మదేవుని పూజింపసాగితిని. దీనివలనే శాంతినంది జడదేవోపాసనమును త్యజించితిని.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున పరమాత్మాభిధానమను నలుబదిరెండవ సర్గము ॥ 42 ॥

---

## త్రిచత్వారింశః సర్గః

[ఇహ శ్రుత్వా సవైరాగ్యం రామః స్వాత్మశివార్చనమ్
ప్రబుద్ధః కృతకృత్యం స్వం తత్ప్రీత్యష్టమవర్ణయత్.
శివార్చనావిధానమును వినిన వసిష్ఠుడు, రామునియందద్దానిని దృఢమొనర్ప, మరల తాను స్వయముగ యద్దానిని ప్రశంసించుచున్నాడు.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏతదుక్తం పరం తేన స్వయమేవ చ వేద్మ్యహమ్
రామ త్వమపి జానీషే యథేదం సమవస్థితమ్. 1

శ్రీవసిష్ఠుడు:— ఈశ్వరుడు నాకు జగత్తత్త్వమును గుఱించి యిట్లు చెప్పియున్నాడు; నేను అట్లే దర్శించుచున్నాడను. రామా! నీవుగూడ దానిని ఈ తీరుగనే గ్రహించుచున్నాడవని తలతును.

యత్రాలీకమలీకేన కిలాలీకే విలోక్యతే
తస్యాం సంసారమాయాయాం కిం సత్యం కిమసన్మయమ్. 2

ఏ సంసృతిమాయయందు అలీకమగు భ్రాంతితో అలీకమగు జీవుడు అలీకమగు జగత్తును గాంచుచున్నాడో, ఆ సంసృతిమాయ సత్యమైన నేమి, అసత్యమైన నేమి ?

యథా యేన వికల్పేన యద్వికల్పేన కథ్యతే
తథా తేనాత్మకల్పేన నగతాప్యనుభూయతే. 3

లోకమునగూడ ఇట్టి కల్పన సత్యముగనే భావింపబడుచున్నది; కవి రాజును గుఱించి మేరుపర్వతము లేక కల్పవృక్షమోయని అభివర్ణింప, రాజుగూడ తన్నట్లే భావించుకొని ధనాదుల నొసగుచున్నాడు. ఈ కల్పనను తనయందు సత్యముగ తలంపకున్న, అర్థప్రదాన మొనర్చుట అసంభవముకదా!

యథా ద్రవత్వం పయసి యథా స్పన్దో నభస్వతి
యథా నభసి శూన్యత్వం తథా సర్గత్వమాత్మని. 4

జలమున ద్రవత్వము, వాయువున స్పందము, ఆకాశమున శూన్యత్వము సహజములైనట్లు, ఆత్మయందు సృష్ట్యాదికల్పనలుగూడ సహజములే.

తతః ప్రభృతి తేనైవ క్రమేణార్చనమాత్మనః
అద్య యావద్గతవ్యగ్రః కుర్వన్నహమవస్థితః. 5

అప్పటినుండి నేటివఱకు నేను ఈశ్వరోపదేశము ననుసరించి శివార్చనము సల్పుచు దుఃఖరహితుడనై యున్నాను.

అనేనార్చావిధానేన మయేమే రామ వాసరాః
అఖిన్నేనాతివాహ్యన్తే వ్యవహారపరా అపి. 6

రామా! నేనిట్లు ఆత్మదేవార్చనమున నిరతుడనై యుండుటవలన, బాహ్యములగు కార్యము లాచరించుచున్నను, వ్యథారహితుడనై దినముల గడుపగలుగుచున్నాడను.

యథాప్రాప్తైః క్రియాచార కుసుమైరాత్మనోఽర్చనమ్
వ్యచ్ఛిన్నమపి వ్యచ్ఛిన్నం న కదాచిదహర్నిశమ్. 7

యథాప్రాప్తములగు క్రియాచారములను పుష్పములతో, నే నవిచ్ఛిన్నముగ పరమశివుని పూజించుచున్నాడను. ఈ పూజ సుషుప్తికాలమున ఆగినను, ఆగుట లేదు. (అప్పుడుగూడ జరుగుచున్నదేయని చెప్పనగును. ఏలయన, 'నేను సుఖముగ నిద్రించితిని' అను అనుభవ - పుష్పమువలన గూడ పూజ జరుగుచున్నది.)

గ్రాహ్యగ్రాహకసంబన్ధే సామాన్యే సర్వదేహినామ్
యోగినః సావధానత్వం యత్తదర్చనమాత్మనః. 8

ఇట్టి పూజ శరీరధారు లందఱకును సామాన్యమే యైనను, యోగులే దీనిపట్ల సావధానులై యున్నారు. (యోగులకే సర్వవ్యాపారముల పూజాబుద్ధి యున్నది. తదితరులు కర్మరతులైనను వారికి పూజాభావము లేదు.)

దృష్ట్యానయా రఘుపతే సఙ్గముక్తేన చేతసా
సంసారవిరలారణ్యే విహరాస్మిన్న ఖిద్యసే. 9

రఘుపతీ ! ఈ దృష్టి నవలంబించి, నిస్సంగమగు చిత్తముతో, సంసారమను విశాలారణ్యమున విహరింపుము; నీవు దుఃఖమును బొందవు.

దుఃఖే మహతి సంప్రాప్తే ధనబన్ధు వియోగజే
ఏతాం దృష్టిమవష్టభ్య విచారం కురు సువ్రత. 10

సువ్రతా ! ధనజనవియోగాదులవలన గొప్పదగు దుఃఖము ప్రాప్తమైన, ఈ దృష్టి నవలంబించి, విచార మొనర్పుము.

సుఖదుఃఖే న కర్తవ్యే ధనబన్ధ్వాదయక్షయే
ఏవంప్రాయా ఏవ సర్వా నిత్యం సంసారదృష్టయః. 11

ధనము, బంధువులు మున్నగునవి లభించిన సంతోషించుట, పోయిన వగచుట కూడదు; ఏలయన, సంసారముయొక్క తీరు ఇదియే, సంసారము నశ్వరము.

జానాస్యేవ గతిం చిత్రాం విషయాణాం ప్రమాథినీమ్
యథాయాన్తి యథా యాన్తి యథా పరిభవన్తి చ. 12

ఈ జగత్తునందలి వ్యవహారములన్నియు ఇట్లరుదెంచి, ఇట్లే పోవుచున్నవి, ఇట్లే జనులను పరిభవించుచున్నవి.

ఏవమేవ ప్రవర్తన్తే ప్రేమాణి చ ధనాని చ
ఏవమేవావహీయన్తే నిమిత్తైరవిచారితైః. 13

ఇట్లే, ధనము, ప్రేమ మున్నగునవి అతర్కితభావమున అరుదెంచి, పోవుచున్నవి.

న తాస్తవ న తాసాం త్వం నిర్మలాన్తర్జగత్క్రియాః
ఇదమిత్థం జగత్కించిత్కిం ముధా పరితప్యసే. 14

నిర్మలమతీ! ఈ జగత్తు నీది కాదు. నీ విందులేవు; మఱియు ఈ జగత్తేమియును కాదు, వ్యర్థముగ పరితపించు టేల ?

త్వమిహాసి జగద్రూపం చిన్మాత్రవితతాకృతే
నిజావయవకావృత్తౌ కః క్రమో హర్ష శోకయోః. 15

జగత్తు తుచ్ఛమను దృష్టి నీకు నచ్చకపోయిన, ఈ జగత్తును ఆత్మదృష్టితో - నీవే ఈ జగత్తు అని - పరిలక్షింపుము. నిజ శరీరాంగములు పరివర్తనమంద, దుఃఖశోకము లేల ?

తాత చిన్మాత్రరూపోఽసి న తే భిన్నమిదం జగత్
అత స్తవ కథం కుత్ర హేయోపాదేయకల్పనా. 16

వత్సా! నీవు చిన్మాత్రస్వరూపుడవు; ఈ జగత్తు నీకంటె భిన్నము కాదు. అగుచో, హేయోపాదేయ కల్పనలెచ్చట ?

ఇతి చిచ్చక్రచాఞ్చల్యే చిన్మయే జగదమ్బుధౌ
తరఙ్గజాలే చామ్భోధౌ కః క్రమో హర్ష శోకయోః. 17

ఇట్లు, జగత్స్పందము చిద్రూపమే యగుచున్నది; జగత్తుగూడ చిద్రూపమే యగుచున్నది. తరంగములుగూడ సముద్రమేయైన హర్ష శోకముల కాస్కార మెచ్చట ?

చిదేకతానతామేత్య సౌషుప్తేమాగతః స్థితిమ్
అద్యప్రభృతి రామ త్వం తుర్యావస్థాత్మకో భవ. 18

రామా! నీవు చిదేకత్వమును బొంది, సుషుప్తిస్థితిని జేరి, నేటినుండి తురీయావస్థయందు వెలయుము.

సమః సమసమాభాసో భాస్వద్వపురుదారధీః
తిష్ఠాత్మార్చారతో నిత్యం పరిపూర్ణ ఇవార్ణవః. 19

నీవు జగత్ - వైచిత్ర్యమను వైషమ్యమునుండి విడివడి, జగత్ప్రకాశమగు బ్రహ్మముతో నైక్యమును స్థాపించుకొని, ప్రకాశమయమగు శరీరమున, నిత్యము ఉదారబుద్ధితో ఆత్మదేవార్చన మొనర్చుచు, పరిపూర్ణమగు సముద్రమువలె వెలయుము.

ఏత త్త్వం శ్రుతవాన్సర్వం స్థిత స్త్వం పరిపూర్ణధీః
యదిచ్ఛసీతరత్ప్రష్టుం తత్పృచ్ఛ రఘునన్దన

రఘునందనా! నీ వీ జగత్తత్త్వమును విని ఇప్పుడు పరిపూర్ణబుద్ధివై తివి. ఇంకేమైన నడుగవలసినదియున్న ప్రశ్నింపుము.

శ్రీరామ ఉవాచ :—

యత్పృష్టం ప్రథమే కల్పే తదద్య పరిచోదయ. 20
ఇదానీం సంశయో బ్రహ్మన్నివిన్నివృత్తో విశేషతః

నీవు వైరాగ్య ప్రకరణమునప్రశ్నించినదానిలో ఏమైన మిగిలిన మరల నిప్పుడు ప్రశ్నింపుము.

శ్రీరాముడు :— బ్రహ్మర్షీ ! ఇప్పుడు నా సంశయములన్నియును సంపూర్ణముగ తొలగినవి.

జ్ఞాతం జ్ఞాతవ్యమఖిలం జాతా తృప్తిరకృత్రిమా. 21
న మునేఽస్తి మలం ద్విత్వం న చేత్యం న చ కల్పనమ్

తెలిసికొనవలసినదానినంతటిని దెలిసికొంటిని; అకృత్రిమమగు ఆనందము లభించినది. మునీ ! ఇప్పుడు నాకు జీవ-బ్రహ్మరూపకమగు అజ్ఞానము లేదు, మనస్సు, పదార్థములుగూడలేవు.

తదా మమాభూదజ్ఞానం ప్రశాన్తమధునా తు తత్. 22
కలఙ్క ఆత్మనోఽస్తీతి తదజ్ఞానవశేన యా

అప్పుడు నాకు కలిగిన అజ్ఞానము ఇప్పుడు తొలగినది; అపు డజ్ఞానవశమున ఆత్మయందు కళంక మగుపించినది.

భ్రాన్తిరాసీదిదానీం సా నివృత్తా త్వత్ప్రసాదతః. 23
న జాయతే న మ్రియతే న చైవాత్మా కలఙ్కితః

ఆ భ్రాంతి ఇప్పుడు నీ యనుగ్రహమున తొలగినది. ఈ అత్మ పుట్టుటయు లేదు. గిట్టుటయును లేదు, కళంకితముగూడ అగుచుండుట లేదు.

సర్వం చ ఖల్విదం బ్రహ్మమయమిత్యుదితోఽస్మ్యలమ్. 24
ప్రశ్నేభ్యః సంశయేభ్యశ్చ వాఞ్ఛితేభ్యశ్చ సర్వతః

సర్వము బ్రహ్మమయము (లేక బ్రహ్మయొక్క వివర్తము) అను జ్ఞానము లభించినది. నాకిక ఎట్టి సంశయములు, ప్రశ్నలు, వాంఛలు లేవు.

శుద్ధం మే నిర్మలం చేతస్త్వష్ట్రా యన్త్రభ్రమాదివ. 25
సర్వాచారోపదేశేషు ప్రాప్తప్రోక్తేషు సాధుభిః

నా చిత్తము, విశ్వకర్మయొక్క యంత్రమున త్రిప్పబడిన సూర్యమండలమువలె విశుద్ధమును, నిర్మలమును నైనది, సాధుపురుషులు శిష్యులకై విధించు ఆచారములు, ఉపదేశములతో నాకు బనిలేదు.

నిరాకాఙ్క్షః స్థితోఽస్మ్యన్తః సుమేరుః కనకేష్వివ. 26
న తదస్త్యస్తి యత్రాశా న తదస్తి యదీప్సితమ్

సుమేరుపర్వతము సువర్ణమును గోరనట్లు, నేను ఆశారహితుడనై వెలయుచున్నాడను. నాకెట్టి ఆశలును, వాంఛితములును లేవు:

న తదస్తి యదాదేయం హేయం మధ్యం చరాచరే. 27
ఇదం హేయముపాదేయమిదం సదిదమప్యసత్
ఇతి చిన్తాభ్రమః శాన్తో నిపుణం పరమో మునే. 28
న స్వర్గమభివాఞ్ఛామి ద్వేష్మి వాపి న రౌరవమ్

ఈ చరాచర వస్తుసమూహములు నాకు హేయోపాదేయము లగునవెవ్వియును లేవు. మునీ ! ఇది హేయము, ఇది ఉపాదేయము, ఇది సత్త, ఇది అసత్త అను భ్రమలు నశించినవి, నేను స్వర్గమును వాంఛింపను లేక రౌరవ నరకము ను ద్వేషింపను.

ఆత్మన్యేవ హి తిష్ఠామి మన్దరాద్రిరివాభ్రమః. 29
కణశః కీర్ణత్రిజగతీ రసాగరసంసృతిః

నేను మందరనగముకలె ధీరుడనై, ఆత్మయందు వెలయుచున్నాడను; సంసారమను క్షీర సముద్రమునుండి, జగత్తులను పాలబొట్లు ఇటనట చిందిపడ, అశూన్యమైనవి. (నా జగద్భ్రమ తొలగినది).

విశ్రాన్తశ్చిరసంభ్రాన్తో నిర్భ్రమో రామ మన్దరః. 30
అవస్త్విదమిదం వస్తు పశ్యేతి కలనాస్త్యలమ్
హృది తస్య కుసందేహజాలేన జ్వలితాధికమ్. 31
ఇదమిత్థం జగదితి జ్ఞాతం యేన మునీశ్వర
స యత్ర యాతి కార్పణ్యం జగత స్తన్న లభ్యతే. 32

మునీశ్వరా ! రామ - మందరము భ్రమరహితమై (తిరుగుటమాని) చిరవిశ్రాంతిని బొందినది; 'ఇది వస్తువు, ఇది అవస్తువు' అను కల్పనల నొవర్చుకొను వారి హృదయమున, వారిని గాల్చు సందేహ పరంపరలు లేచుచున్నవి - చూడుము.

విచిత్రాకులకల్లోలాజ్జడాద్వృత్తివివర్జితాత్
త్వత్ప్రసాదేన భగవంస్తీర్ణాః స్మో భవసాగరాత్. 33
సంపదామవధిర్జ్ఞాతో దృష్టః సీమాన్త ఆపదామ్
సర్వసారేఽప్యదీనాః స్మః పూర్ణాః స్మః పరమేశ్వర. 34

ఇట్టి మూఢపురుషుడు గోరు ధనాదివిషయములను మేము గాంచజాలకున్నారము. భగవంతుడా ! నీ ప్రసాదమువలననే నేను, పదూర్మలను తరంగములతో సంకులమైనదియును, చిదాకారవృత్తిరహితమగుటవలన జడమునునగు భవసాగరమును దాటితిని, సంపదలకు తుదికొనయగు దానిని గ్రహించితిని. ఆపదలకుగూడ తుదియగుదానిని గ్రహించితిని.

యయావభేద్యామపరైర్దలితాశామతఙ్గజమ్
సంసారసాగరే సమ్యగ్ధీరతామాగతం మనః. 35

పరమేశ్వరా ! భూమానందమును బొందితిని, పూర్ణుడనైతిని. సంసారసాగరమున నా మనస్సు ధీరత్వమును బొందినది; ఇది అన్యుల కభేద్యము; దీనివలన ఆశామాతంగమును విదళిత మొనర్పవచ్చును.

పరిగలితవికల్పతాముపేతం
ప్రగలితవాఞ్ఛమదీనసారసత్త్వమ్
త్రిజగతి యదతిప్రసన్నరూపం
ప్రముదితమన్తరనుత్తమం మనో మే. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే విశ్రాన్తివర్ణనం నామ త్రిచత్వారింశః సర్గః ॥43॥

నా మనస్సున ఇకెట్టి వికల్పములును లేవు; ఎట్టి వాంఛయును లేదు. నా మనస్సు సుదృఢమగు స్థిరత్వమును బొందినది, ఈ జగత్తుననున్న ప్రసిద్ధ నిర్మలములగు వస్తువుల నన్నిటిని

అతిక్రమించి, నిరతిశయమగు ఆనందమును బొంది, నా మనస్సు, సర్వోత్తమమగు పదమున వెలయుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున విశ్రాంతి వర్ణనమను నలుబదిమూడవ సర్గము ॥ 43 ॥

---

## చతుశ్చత్వారింశః సర్గః.

[ఇహాసఙ్గక్షయోపాయా వాఞ్ఛాత్యాగాదయః పునః
మనఃక్షయాన్తా గురుణా జ్ఞానదార్ఢ్యార్థమీరితాః.

ఈ ప్రకరణమున సంగక్షయోపాయము, వాంఛాత్యాగము మొదల్కొని మనోక్షయము వఱకు మరల జ్ఞానమును దృఢమొనర్ప, చెప్పబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

కేవలేన్ద్రియైః సార్ధం వర్తమానార్థవర్తినా
అసంగమేన మనసా యత్కరోషి న తత్కృతమ్ 1

శ్రీవసిష్ఠుఁడు:— ఇంద్రియములు తమ విషయముల వర్తిల్లుచున్నను, రాగవిరహితమును, అసంగమును, కర్తృత్వాది అభిమానరహితమును నగు మనస్సుతో నాచరింపబడునది బంధహేతువు కాజాలదు.

యథా ప్రాప్తిక్షణే వస్తు ప్రథమే తుష్టయే తథా
న ప్రాప్త్యేకక్షణాదూర్ధ్వమితి కో నానుభూతవాన్. 2

విషయములు ప్రాప్తిక్షణముననే తుష్టిని గలిగించుచున్నవి; తరువాత ఒకక్షణమైనను ఆనందము నొసగజాలవను సంగతి ఎవనికి తెలియదు ?

వాఞ్ఛాకాలే యథావస్తు తుష్టయే నాన్యదా తథా
తస్మాత్క్షణసుఖే సక్తిం బాలో బధ్నాతి నేతరః. 3

లభించిన నిముషముననే విషయములు సంతోషమును గలిగించుచున్నవి. ఇట్టి క్షణికసుఖమును బొంద బాలురే యత్నింతురు; మూర్ఖులు తప్ప జ్ఞానులు వీటియందాశను గొనరు.

వాఞ్ఛాకాలే తుష్టయే యత్తత్ర వాఞ్ఛైవ కారణమ్
తుష్టిస్త్వతుష్టిపర్యన్తా తస్మాద్వాఞ్ఛాం పరిత్యజ. 4

క్షణికసుఖమునకు మూలము వాంఛ; ఈ సుఖము నిరానందముననే పర్యవసించుచున్నది. అందువలన, (అఖండానందమునుబొంద) దీనిని పరిత్యజింపుము.

యది తత్పదమాప్తోఽసి కదాచిత్కాలపర్యయాత్
తదహంభావనారూపే న మజ్జ్యం త్వయా పునః. 5

ఒకపరి ఆ బ్రహ్మపదమునునీవు బొందియుంటివేని కాలవిపర్యయమున,మరల అహంభావ పంకమున జిక్కుకొనకుందువుగాక !

ఆత్మజ్ఞానాచలస్యాగ్రే రామ విశ్రాన్తవానసి
అహంభావమహాశ్వభ్రే న పునః పాతమర్హసి. 6

రామా ! నీవు ఆత్మజ్ఞాన - శైలశిఖరమున విశ్రమించుచున్నాడవు. మరల, అహంభావ - గర్తమున పడకుందువుగాక !

యత్స్వభ్రూతాన న్తసద్బ్రహ్మదృష్టైర్జ్ఞత్వమేరుశిరస్థితైః
పునర్గర్భానుకారాన్తఃపాతాలే పతనం కుతః. 7

ఎవరి మనస్సున అనంతమగు బ్రహ్మదృష్టి ఉదయించినదో, జ్ఞాన - మేరు - శిఖరమున ఎవరు వెలయుచున్నారో, వారిపట్ల అహంభావమను పాతాళమునబడుట అసంభవము.

దృశ్యతే తే స్వభావోఽయం సమతా సత్యతామయః
మన్యే క్షీణవికల్పోఽసి జాతోఽసి హతకాలికః. 8

నీ స్వభావము సమత్వము, సత్యముల కాకరమైయుండుటను గాంచుచున్నాడను నీ సంసార వికల్పము క్షీణమైనది. నీ అవిద్య వశించినది.

స్వభావే సంస్థితే రామ ఇత్యావేదయతీవ మే
సౌమ్య పూర్ణార్ణవప్రఖ్యా సమతా నిర్మలా తవ. 9

రామా ! నిండుసముద్రమును బోలు నీ నిర్మలత్వ, సమత్వములు, సౌమ్యా!, నీవాత్మయందు ప్రతిష్ఠితుడ వగుటను నాకు దెల్పుచున్నవి.

ఆశా యాతు నిరాశత్వమభావం యాతు భావనమ్
అమనస్త్వం మనో యాతు తవాసఙ్గేన జీవతః. 10

అసంగభావమున జీవించు నీ ఆశ నైరాశ్యమును, భావన అభావమును, మనస్సు అమనస్త్వమును బొందుగాక !

యాంయాం వస్తుదృశం యాసి తస్యాం తస్యామవస్థితమ్
సత్తాసామాన్యరూపేణ బ్రహ్మ బృంహితచిద్ఘనమ్. 11

ఏయే వస్తువును నీవు బడయుచున్నాడవో, ఆయావస్తువుల పరిపూర్ణచిన్మయమగు బ్రహ్మసత్త వెలయుచున్నది.

అజ్ఞాతాత్మా నిబద్ధోసి విజ్ఞాతాత్మా న బధ్యసే
రామ త్వం స్వాత్మనాత్మానం బోధయస్వ బలాదతః. 12

ఆత్మజ్ఞానము లేకున్న బద్ధుడవును, ఆత్మజ్ఞానమున్న ముక్తుడవును అగుచున్నాడవు. రామా! అందువలన నీవు మననాదుల శక్తితో స్వయముగ ఆత్మబోధను బడయ యత్నింపుము.

యత్ర న స్వదతే వస్తు స్వదతే చ యథాగతమ్
అవాసనత్వం తద్విద్ధి సామ్యమాకాశకోమలమ్. 13

ఏ స్థితియందు భోగసుఖముల ఆశయుండదో, యథాప్రాప్తములగు విషయముల ననుభవించుచుండునో, ఆ స్థితినే అవాసనత్వమందురు; ఇయ్యది ఆకాశమువలె నిర్మలము.

వాసనారహితైర న్తరిన్ద్రియైరాహార క్రియాః
న విక్రియామవాప్నోషి ఖవత్క్షోభశతైరపి. 14

వాసనారహితమగు చిత్తముతో కర్మల నాచరింపుము. వందలకొలది కష్టము లరుదెంచినను ఆకాశమువలె నిర్వికారుడవై యుండుము.

జ్ఞాతా జ్ఞానం తథా జ్ఞేయం త్రయ మేకతయాత్మని
శాన్తాత్మానుభవాఽభవ్యం న భూయో భవభాగసి. 15

జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను త్రిపుటిని ఆత్మయందొక్కటిగ నొనర్చి, దుఃఖాదులగూడ నొక్కటిగ జేసినయెడల, మరల సంసారమును బొందవలసిన అవసరముండదు.

చిత్తోన్మేషనిమేషాభ్యాం సంసారప్రలయోదయౌ
వాసనాప్రాణసంరోధాదనిమేషం మనః కురు. 16

మనస్సుయొక్క వికాస, విలీనముల వలననే జగత్తు ఉదయము, లయమును బొందుచున్నది. ప్రాణాయామ, వాసనానిరోధములవలన మనస్సును విషయశూన్యముగ నొనర్పుము.

ప్రాణోన్మేషనిమేషాభ్యాం సంసృతేః ప్రలయోదయౌ
తమభ్యాసప్రయోగాభ్యామున్మేషరహితం కురు. 17

అభ్యాస, సంయమములవలన ప్రాణమును ఉన్మేషరహితముగ నొనర్పుము; ప్రాణముయొక్క ఉదయ, లయములవలననే సంసారము ఉదయించి విలీనమగుచున్నది.

మౌర్ఖ్యోన్మేషనిమేషాభ్యాం కర్మణాం ప్రలయోదయౌ
తద్విలీనం కురు బలాద్గురుశాస్త్రార్థసంయమైః. 18

అజ్ఞానముయొక్క ఉదయాస్తమయములవలననే కర్మలుదయించి నశించుచున్నవి. ఈ అజ్ఞానమును గురు, శాస్త్ర, వైరాగ్యముల సాయమున విలీనమొనర్పుము.

యథా వాతరజఃసఙ్గస్పన్దాత్తం భావవేదనమ్
తథా చితశ్చేత్యతయా స్పన్దాదిదనుపస్థితమ్. 19

ఆకాశము గాలికి లేవదీయబడిన ధూళివలన మలినమైనట్లును, కదలుచున్నట్లును దోచునట్లు, చిత్తస్పందనమువలన ఈ సంసారానర్థము సంభవించినది.

దృశ్యదర్శనసంబన్ధస్పన్దేనేయం జగద్గతిః
స్ఫురత్యాలోకకుడ్యాదిసంగజా వర్ణధీరివ. 20

సూర్యునికాంతిపడిన గోడయొక్క రంగు తెలియబడునట్లు, దృశ్య, దర్శనముల సంబంధముననే (అనగా ఆత్మవలననే) ఈ జగత్తు గోచరించుచున్నది.

దృశ్యదర్శనసంబన్ధస్పన్దాభావే న జాయతే
వేదనా భవదాభాసా చిత్రపుంసామివాశయే. 21

దృశ్య, దర్శనముల సంబంధమగు స్పందము లేకున్న, జగత్తును ప్రకాశింపజేయు ఈ సంవిత్తు, చిత్రమునందలి పురుషుని హృదయమున ఎట్టి భావనయు ఉదయింపనట్లు, ఉత్పన్నమవజాలదు.

చిత్తస్పన్దోత్థితా మాయా తదభావే విలీయతే
పయస్స్పన్దోత్థితా వీచి స్తదభావే వినశ్యతి. 22

చిత్తస్పందమునుండియే మాయ ఉదయించుచున్నది. అది లేకున్న మాయ లయమగును నీటియొక్క కదలికవలననే అలలు కదలుచున్నవి; కదలిక లేకున్న తరంగములు లేవవు.

త్యాగేన వాసనాంశస్య బోధాద్వా ప్రాణరోధనాత్
చిత్తే నిస్పన్దతాం యాతే కుతః స్పన్దస్య సంభవః. 22

తత్త్వమును బొంది వాసనలను పరిత్యజించినను, లేక, ప్రాణవాయువును నిరోధించినను చిత్తము నిస్పందమగును. అప్పుడు స్పంద మెటునుండి రాగలదు?

అసంవిత్స్పన్దమాత్రేణ యాతి చిత్తమచిత్తతామ్
ప్రాణానాం వా నిరోధేన తదేవ చ పరం పదమ్. 24

సంవిత్ - స్పందము నిరుద్ధమైన చిత్త మచిత్తమగును; ప్రాణవాయువు నిరోధింపబడినను చిత్త మచిత్త మగును; ఇదియే పరమపదము.

దృశ్యదర్శనసంబన్ధే యత్సుఖం పారమార్థికమ్
తదన్తైకాన్తసంవిత్త్యా బ్రహ్మదృష్ట్యా మనఃక్షయః. 25

విషయేంద్రియసంబంధమున లభించు సుఖము బ్రహ్మానందముయొక్క అంశమే; దీని పరమావధియగు బ్రహ్మదృష్టి పూర్ణజ్ఞానము. ఇది మనోక్షయమువలననే లభించును.

యత్ర నాభ్యుదితం చిత్తం తత్తత్సుఖమకృత్రిమమ్
న స్వర్గాదౌ సంభవతి మరౌ హిమగృహం యథా. 26

చిత్త మెచ్చట లేకుండునో, అయ్యదియే అకృత్రిమమగు సుఖము - బ్రహ్మానందము. ఇయ్యది, సృష్టియందు, సుమేరు పర్వతమున హిమగృహమువలె దుర్లభము.

చిత్తోపశమజం స్ఫారమవాచ్యం వచసా సుఖమ్
క్షయాతిశయనిర్ముక్తం నోదేతి న చ శామ్యతి. 27

చిత్తక్షయమువలన లభించు సుఖము అనంతము; ఆ సుఖమును వాక్యములవలన ప్రకాశింప జేయజాలము ఇది తఱుగదు, పుట్టుటలేదు, నశించుటలేదు.

బోధాద్భవతి చిత్తాన్తో దుర్బోధాచ్చిత్తవేదితా
బాలవేతాలవత్తేన మోహశ్రీర్ఘనతాం గతా. 28

తత్త్వబోధవలననే చిత్తము వినాశమునందును, భ్రాంతివలనే చిత్తముయొక్క అస్తిత్వ ముపలభ్యమగుచున్నది. బాలకుని బేతాళకల్పనవలె ఈ మోహశ్రీయును ఘనమగుచున్నది.

విద్యమానమపి హ్యేతచ్చిత్తం బోధాద్విలీయతే
సదప్యసదివాభాతి తామ్రం హేమీకృతం యథా 29

ఉన్నట్లగుపడుచున్నను, ఈ చిత్తము తత్త్వబోధవలన విలీనమగును. బంగార మొనర్పబడిన రాగి, రాగిగ కనుపడదు గదా; ఇట్లే సత్తగతోచు చిత్తము జ్ఞానముచే అసత్తయగును,

జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం జ్ఞచిత్తం సత్త్వముచ్యతే
నామార్థాన్యత్వభాక్చిత్తం బోధాత్తామ్రసువర్ణవత్. 30

జ్ఞానియొక్క చిత్తము చిత్తమనబడదు, సత్త్వమనబడును చిత్తమే నామార్థముల భేదభాగియగును. ఆచిత్తము బోధచే సత్త్వమగును.

న సంభవతి చిత్తత్వం తేన తత్ప్రవిలీయతే
భ్రమః శామ్యతి బోధేన నాఽభావో విద్యతే సతః. 31

భ్రాంతిబీజమగు చిత్తము తత్త్వబోధవలన తన చిత్తత్వమును విలీనమొనర్చుకొనుచున్నది. తత్త్వబోధవలన భ్రమయే తొలగిపోవును. సత్తున కెన్నడును అభావము లేదు.

అవస్త్వేవ వికల్పాత్మ చిత్తాది శశశృఙ్గవత్
సర్వం తదాత్మనస్తస్మాత్తద్ధి బోధాద్విలీయతే. 32

వికల్పమయములగు చిత్తాది పదార్థములన్నియును శశశృంగాది పదార్థములవలె అవస్తువులు. ఆత్మబోధవలన ఇవి లయమందును.

చిత్తం సత్త్వం సమాయాతం కించిత్కాలం జగత్స్థితౌ
విహృత్య తుర్యావస్థాయాం తుర్యాతీతం భవత్యతః. 33

ఈ చిత్తము జగదంతర్గతమగుటవలన, కొంతకాలము (ప్రారబ్ధము క్షయమగువఱకు) సత్త్వరూపమున తురీయావస్థయందు విహరించి, తరువాత తురీయాతీతపదమును బొందును.

బ్రహ్మైవ భూరిభువనభ్రమవిభ్రమాఖ్యై
రిత్థం స్థితం సమమనేకతయైకమేవ
సర్వాత్మ సంభవతి నేతరదఙ్గ కించి
చ్చిత్తాదికం చ న హృదీవ హి సంనివేశః. 34

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చిత్తసత్తాసూచనం నామ చతుశ్చత్వారింశః సర్గః ॥ 44 ॥

బ్రహ్మమొక్కటియే విశాలమగు జగద్భ్రమయను విలాసముగ పర్యవసించుచున్నది. బ్రహ్మమొక్కటియే నానావిధరూపముల ప్రతిపన్నమగుచున్నది. అందువలన అద్దానిని సర్వమయమనుట సముచితము. వత్సా! హృదయమున మనోరథకల్పితములగు ప్రాసాదవాపీతటాదు లెవ్వియును లేనట్లు, వాస్తవమునకు బ్రహ్మముగాక వే రేమియును లేదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చిత్తసత్తాసూచనమను నలుబదినాల్గవ సర్గము ॥ 44 ॥

## పఞ్చచత్వారింశః సర్గః.

[స్వానన్దరససంపూర్ణం త్రిజగత్కల్పనాస్పదమ్
ఇహ బిల్వఫలత్వేన పరంబ్రహ్మోపవర్ణ్యతే.

స్వానందరసపూర్ణమును, త్రిగజత్కల్పవతు మూలమునను వగు పరబ్రహ్మము ఈ ప్రకరణ మున బిల్వఫలముగ ఉపవర్ణింపబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అత్రేమామవబోధాయ విస్మయోల్లాసకారిణీమ్
అపూర్వాం చైవ సంక్షేపాద్రామ రమ్యాం కథాం శృణు. 1

శ్రీవసిష్ఠుడు:— రామా! రమణీయమును, అపూర్వమున్ను, సంక్షిప్తమునునగు ఈ విషయ మును వినుము; విస్మయోల్లాసకరమగు ఈ వృత్తాంతము నీకు జ్ఞానప్రదము కాగలదు.

యోజనానాం సహస్రాణి విపులం విమలం స్ఫుటమ్
యుగైరప్యజరద్రూపమస్తి బిల్వఫలం మహత్. 2

విమలమును, విపులమును, పరిస్ఫుటమునునగు (పెద్దదియు, చక్కనిదియునను) ఒక బిల్వ ఫలమున్నది. దాని పరిమాణ మనేకయోజనములు. యుగములు గడచినను అది క్షయమువదు.

అవినాశరసాధారం సుధామధురసారవత్
పురాణమపి బాలేన్దుదలమార్దవసున్దరమ్. 3

దాని రస మక్షయము. దాని సారభాగము (గుజ్జు) సుధామధురము. అది బహుపురాతన మైనను బాలచంద్రుని కళవలె కోమలసుందరము.

వ్యూహమధ్యమహామేరుం మన్దరాద్రిరివాచలమ్
మహాకల్పాన్తవాత్యాయా అపి వేగైరచాలితమ్. 4

అది భువనవ్యూహమధ్యమునన్న మహామేరువువలె శోభించుచున్నది; మందరాద్రి వలె అచలము, దృఢము. మహాప్రళయవాయువులుగూడ అది కదలకున్నది.

యోజనాయుతకోటీనాం కోటిలక్షశతైరపి
వైపుల్యేనాపరిచ్ఛేద్యం మూలమాద్యం జగత్స్థితేః. 5

దాని వైశాల్యమును ఇన్నికోట్ల అయుత యోజనములనికూడ లెక్కించి చెప్పజాలము. జగత్ - స్థితికి గారణమగు దానిమూలమునుగూడ ఎవ్వరును తెలియజాలరు.

యస్య బిల్వఫలస్యోచ్చైర్బ్రహ్మాణ్డాని సమీపతః
హరన్తి లీలాం శైలాగ్రో రాజికాకణపద్ధతేః. 6

బ్రహ్మాండసమూహములన్నియును ఈ బిల్వఫలముపైనున్నవి; అవి పర్వతముమీద వెద జల్లబడిన చిన్న ఆవగింజలవలె తోచుచున్నవి.

స్యన్దమానరసాపూరాం స్వాద్వీం రసచమత్కృతిమ్
యస్యాతిశేతే నో కశ్చిదపి రాఘవ షడ్రసః. 7
న కదాచన పాకేన పాతం తేన సమేతి యత్
సదైవ పక్వమప్యజ్ఞ జరసా యన్న బాధ్యతే. 8

రాఘవా! షడింద్రియభోగ్యములగు రసములెవ్వియును దాని రసము నతిక్రమింపజాలవు. ఇట్టి సరసత్వమున్నను, పక్వమైనను రాలకున్నది. జర దాని నాక్రమింపజాలదు.

బ్రహ్మవిష్ణ్విన్ద్రరుద్రాద్యా జరఠాః కేచిదేవ న
యస్యోత్పత్తిం విజానన్తి మూలం వా వృన్తమేవ చ. 9

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్రాదులును, లేక తదితర చిరజీవులలోనే యొక్కరును ఈ బిల్వఫలముయొక్క మూలమును లేక వృంతమును (తొడిమ లేక ఉత్పత్తిని) కనుగొనజాలకున్నారు.

అదృష్టాఙ్కురవృక్షస్య త్వదృష్టకుసుమాకృతేః
అస్తమ్భమూలశాఖస్య ఫలస్యాస్య మహాకృతేః. 10

స్తంబ, మూల, శాఖాది రహితమగు (మొదలు, ప్రాను, కొమ్మలులేని) ఈ మహాఫలము యొక్క అంకుర, వృక్ష, కుసుమాదు లెవ్వియును కనబడుటలేదు.

ఏకపిణ్డఘనాకారవితతస్థౌల్యశాలినః
యస్యోత్పత్తివికారాదిపరిణామో న దృశ్యతే. 11

ఏకపిండఘనాకారమును (ఏకరసమును), మిక్కిలి పెద్దదియునగు ఈ బిల్వఫలముయొక్క ఉత్పత్తి, వికృతి (పెరుగుట) మున్నగు పరిణామము లగుపడకున్నవి.

సమస్తఫలసారస్య ఫలస్యాస్య మహాకృతేః
న మజ్జా నాస్థి వితతో నిర్వికారో నిరఞ్జనః. 12

సమస్తఫలముల సారమును, మహాకృతియునునగు ఈ ఫలము గుజ్జు, గింజలులేక నిర్వికారముగను నిరంజనముగనునున్నది.

శిలాన్తరివ నీరన్ధ్రః స్యన్దమానేన్దుబిమ్బవత్
రసం స్వసంవిదాస్వాద్యం స్యన్దమాన ఇవామృతమ్. 13

శిలవలె ఇది నీరంధ్రము (విజ్ఞానఘనము) అయియున్నది. ఇది చంద్రబింబమువలె అమృతమును స్రవింపజేయుచున్నది. ఈ అమృతము స్వసంవేద్యమగు నిరతిశయానందరసము.

కోశః సకలసౌఖ్యానాం శీతలాలోకకారకః
శైలాభోఽమృతపిణ్డాభో మజ్జా ఆత్మఫలస్థితేః. 14

ఇది సకలసౌఖ్యములకును కోశము (ఆగారము) ఇది శీతలమగు ప్రకాశము నొసగుచున్నది. చూచుటకు పర్వతమువలెను, అమృతపిండమువలెను దోచుచున్నది. ఆనందములన్నిటియొక్క సారము.

తస్మాత్పరమమజ్జా తు యాసౌ స్వాత్మచమత్కృతిః
అనన్తరక్షితో నిత్యమనన్యః శ్రీఫలం గతః. 15

అగోచరములగు ఆనందము లన్నిటికినిగూడ ఇయ్యది సారస్వరూపము. అనంతమును, త్రివిధపరిచ్ఛేదరహితమును, నిత్యమునునగు ఇయ్యది స్వాత్మచమత్కృతివలన శ్రీఫలము (బిల్వఫలము) అయినది.

స్వసంనివేశవైచిత్ర్యమన్యత్వఫలతాం గతామ్
అత్యజన్త్యా తయా తన్వ్యా స్థూలయాప్యతిబాలయా. 16
ఇయమస్మీతి కలనాదసదప్యన్యతామలమ్
భేదాద్యసమ్భవదిదం స్వయముత్పాద్య భావితమ్. 17

అహంకలాసముదయసమనన్తరమేవ సా
వలితాకాశశక్త్యాజత్రైలోక్యపరమాణుభిః. 18
ఇత్యనుక్రమతో యాతా సంవిచ్ఛక్తిస్స్వరూపతామ్
మజ్జా ప్రాక్ సంనివేశం స్వం తమేవాప్య సముజ్ఝతి. 19
సంవిచ్ఛక్త్యా తయా తత్ర తతస్తరలరూపయా
నిజ ఏవ సమే రూపే దృగిత్థం సంప్రసారితా. 20

ఆత్మచమత్కృతియొక్క అధ్యాసయే భేదబుద్ధి చిన్మయరసమజ్జయే భేదబుద్ధివలన కలిగిన సన్నివేశమై చిత్రత్వమునకు కారణము, స్థూలమును, అణువును నగు ఇయ్యది తన స్వరూపమును త్యజింపకయే ఇట్లొనర్చుచున్నది. ఇది సనాతనమగుటవలన, దీనికి వార్ధక్యాది దశలులేవు. బాలికవలె సర్వదా ఒప్పారుచున్నది. ఈశక్తియే 'నేను స్త్రీని', 'నేను నపుంసకుడను' అను కల్పనలకు గారణము. 'ఇది అన్యము, ఇది భిన్నము' అను భేదములకు మూల మవిద్య. ఇది వాస్తవమున కేమియు నుగాదు. స్వప్రకాశుడగు చిన్మయునికడ ఇది అలీకము. అవిద్యాదులహేతువగు ఈఆత్మచమత్కృతియొక్క స్వరూపమిది యగుచో, ద్వైతమునకు తావెచ్చట ?

ఇదం వ్యోమ మహానన్తమియం కాలమయీ కలా
ఇయం నియతిరిత్యుక్తా క్రియేయం స్పన్దరూపిణీ 21

ఈశక్తియే (అహంకారసృష్ట్యనంతరము) ఆకాశమును, కాలమయమునగు కళను కలిగించి స్పందరూపమగు నియతి యనంబడుచున్నది.

అయం సంకల్పవిస్తారస్త్వయమాశాన్తరభ్రమః
రాగద్వేష స్థితిరియం హేయోపాదేయధీరియమ్. 22

ఇయ్యది సంకల్పమును విస్తరించి, ఆశలను రాగద్వేషములను, హేయోపదేయములను కల్పించుచున్నది.

ఇయం త్వత్తా త్వియం మత్తా తత్తేయం సంస్థితా స్వయమ్
బ్రహ్మాణ్డో ఘోఽయమూర్ధ్వస్థః స్వయమజ్గోర్ధ్వమప్యధః. 23

ఇదియే, అది, ఇది, నాది, వానిది అను కల్పనలకు కారణమగుచున్నది. బ్రహ్మాండములు ఊర్ధ్వ, అధోభాగములు, అందుండునవి అను విషయములుగూడ దీని కల్పనలే

అయం పురః పార్శ్వతోఽయం పశ్చాదారాద్దవీయసీ
ఇదం భూతం వర్తమానం భవిష్యత్త్వదమిత్యపి. 24

ఇయ్యది, ఎదుట, వెనుక, దూరము, దగ్గఱ, భూతవర్తమాన భవిష్యత్తులను కల్పనలగూడ కలిగించుచున్నది,

ఇదమన్తఃస్థితానల్పకల్పనామ్భోరుహాలయమ్
బ్రహ్మాణ్డమణ్డపాపీడక్రీడామణ్డపమణ్డలమ్. 25
అనన్తకలనా తత్త్వపరిపల్లవితా హరేః
హృదబ్జకర్ణికా చేయం లోకపద్మాత్తషమాలికా. 26

కల్పనల కాటపట్టగు ఈ కమలము జీవులతోఁగూడిన బ్రహ్మాండమండలమను మంటపము (క్రీడామండలము). విష్ణుని రహస్యరచనమను పల్లవములతోఁగూడిన హృత్కమలము - దీనికర్ణిక జనుల అక్షమాలికవలె తోఁచుచున్నది. (ఇవన్నియును ఆశక్తియొక్క చమత్కృతులే.)

ఇయం కీర్ణమహారుద్రగణాపూరితకోటరా
దీర్ఘాభ్రసరణిర్బ్రాహ్మ్యా నిధ్వంసనేభ్యః ప్రభావినీ. 27

ఇయ్యది రుద్రగణములతోఁనిండిన ఆకాశము. ఇది సృష్టియందాసగొను విషయలంపటులను (ప్రళయసమయమున) వినాశ మొనర్చువారికి ఆకరమైయున్నది.

ఇయం మేరుః కకుభ్యత్ర జగత్పఙ్కజకర్ణికా
స్ఫురదిన్దుమధూల్లాసలమ్పటామరషట్పదా. 28

ఇదిగో! ఉత్తరదిక్కున జగత్తను పద్మమునకు కర్ణికయగు మేరువు, ప్రకాశించు చంద్రుని మధువును గ్రోలు దేవతలను తుమ్మెదలతోఁ గూడియున్నది.

ఇయముద్దామసౌగన్ధ్యస్వర్గశ్రీపుష్పమఞ్జరీ
జగజ్జరత్వృక్షస్య రజోనరకమూలినః. 29

ఇవి ఘాటగు వాసనలతోఁ గూడిన స్వర్గవైభవ మనంబడు పూలగుత్తులు. ఇవి జగత్తను పాతమాను నాశ్రయించుకొనియున్నవి; వీటి మూలము నరకము.

ఇయం చ తారాకిఞ్జల్కా బ్రహ్మార్ణవతటస్థితా
అపారాపారపర్యన్తా వ్యోమలీలాసరోజినీ. 30

ఇవి తారకలను కింజల్కములు; ఇవి బ్రహ్మమను సముద్రపుగట్టున అంతులేకుండ వెలయుచున్నవి, ఆకాశమే వీటి కాశ్రయమగు పద్మము.

ఇయం క్రియాపరిగ్రాహా తరఙ్గతరలావలీ
సర్గావర్తవిధానస్థభూరిభూతపరమ్పరా. 31

క్రియాసమూహములను తరగంముల గొట్టుగొను జీవులను తారకలు సృష్టులను! సుడిగుండముల బడుచున్నవి.

ఇయత్తయా ప్రసరిణీ క్షణకల్పాదిపల్లవా
తేజఃకేసరిణీ కాలనలినీ వ్యోమపఙ్కజా. 32

ఇదిగో, ఇయ్యది ఆకాశమను సరోవరమునకు పద్మమనదగు, కాల - నళిని. చంద్రాదిత్యాది జ్యోతిష్పదార్థములే దీని కేసరములు. ఇది (ఆయుర్దాయముయొక్క) పరిమితిని, క్షణ, కల్పములను దళములను గలిగియున్నది.

ఇమా భావవికారాఢ్యా జరామృతివిషూచికాః
విద్యావిద్యావిలాసాఢ్యా ఇమాః శాస్త్రార్థదృష్టయః. 33

ఇవిగో, ఇవి షడ్విధభావవికారములనబడు జరామృత్యురూపకములగు విషూచికలు; విద్యావిద్యల విలాసములతోఁ గూడుకొనిన శాస్త్రరీతులు.

ఇతి సా తస్య బిల్వస్య నిజమజ్జాచమత్కృతిః
సంకల్పసంనివేశాన్తర్దైవ కృతసంస్థితిః. 34

ఇవన్నియును ఆ బిల్వఫలముయొక్క మజ్జాచమత్కృతులే - శక్తులే. సంకల్పమాత్రము వనే ఆ బిల్వఫలము ఇన్నిరీతుల వెలయుచున్నది.

శాన్తా స్వస్థా నిరాబాధా సౌమ్యా భావనయోజ్ఝితా
కర్తృత్వమప్యకర్తృత్వం కృత్వాకృత్వైవ సంస్థితా. 35
ఏషైకికైవ వివిధేవ విభావ్యమానా
నైకాత్మికా న వివిధా నను సైవ సైవ
సత్వాస్థితా సకలశాన్తిసమైకరూపా
సర్వాత్మికాతిమహతీ చితిరూపశక్తిః. 36.

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే బిల్వోపాఖ్యానే పఞ్చచత్వారింశః సర్గః ॥ 45 ॥

ఇది ఏకమయ్యు ద్వైతభావమును బొందుటవలన, ఏకాత్మికకాదు. కాని మరల, వివిధాత్మికయును గాదు, ఏకత్వమే దానికున్నది. దానియందు, సజాతీయ విజాతీయ భేదములు లేవు. సకల ద్వైతవికల్పములకు ఉపశాంతియగు సమ - ఏకరూపము అగుటవలన, దీనియందు స్వగత భేదముకూడలేదు. సర్వాత్మకమగు ఈ మహద్బ్రహ్మమే చిచ్ఛక్తియొక్క జనయిత; ఇదియే ఆ శక్తి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున బిల్వోపాఖ్యానమున నలుబదిఐదవ సర్గము ॥ 45 ॥

---

## షట్చత్వారింశః సర్గః.

---

[ఇహ శిల్పిమనోదృష్టపద్మినీఖణ్డమణ్డితమ్
శిలోదరమివ బ్రహ్మ ప్రపఞ్చాభాసమీర్యతే.

ఈ ప్రకరణమున ప్రపంచముయొక్క ప్రకాశమునకు కారణమగు బ్రహ్మము, శిల్పిచే శిలయందు చెక్కబడిన పద్మములతో బోల్పబడి, వర్ణింపబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ :—

భగవన్సర్వసారజ్ఞ త్వయైషా బిల్వరూపిణీ
మహాచిద్ఘనసత్తేహ కథితేతి మతిర్మమ. 1
చిన్మజ్జారూపమఖిలమహన్త్వాదీదమాతతమ్
న మనాగపి భేదోఽస్తి ద్వైతైక్యకలనాత్మకః. 2

శ్రీరాముడు:—భగవంతుడా! సర్వసారజ్ఞా! మీరు నుడివినదానిని విని, మీరు నాకు బిల్వరూపిణియగు మహాచిద్ఘనబ్రహ్మముయొక్క సత్తను గుఱించియే ఉపదేశ - మొసంగినారని తోచుచున్నది. 'నీవు, నేను' మున్నగు అహంకారములు చిన్మజ్జయొక్క రూపములు, ఇందు ద్వైతము, ఐక్యము మున్నగు కలపనలుగాని, భేదములుగాని లేవు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథా బ్రహ్మాండకూశ్మాండమజ్జా మేర్వాదిసంస్థితిః
తథా చిద్బిల్వమజ్జేయం బ్రహ్మాండాదిజగత్స్థితిః. 3

శ్రీవసిష్ఠుండు:— మేరువు మున్నగునవి బ్రహ్మాండకూష్మాండమజ్జ (గుమ్మడికాయ గుజ్జు) లైనట్లు, ఈ జగత్తుగూడ చిత్ - బిల్వముయొక్క గుజ్జు.

సృష్టిచిద్బిల్వమజ్జా స్యాత్సా వృథా రాన్యత్వసంభవే
వినాశః సర్వగస్యాస్య న చైతత్సంభవత్యలమ్. 4

సృష్టియను గుజ్జు నాశనమైన, దాని కాధారమగు ఈ బిల్వముకూడ నాశనమగునను దోషము, తత్ఫలముగ బ్రహ్మము పరిణామి, లేక వికారి యను దోషములు గూడ సంభవింపగలవు. కనుక, ఇట మజ్జాశబ్దమును మామూలు అర్థమున గ్రహింపకూడదు.

చితేర్మరీచబీజస్య జగదాఖ్యా చమత్కృతిః
స్థితా సౌషుప్తసౌమ్యాన్తః శిలాన్తఃసంనివేశవత్. 5

ఈ జగత్ - చమత్కృతి మరీచి బీజము (మిఱియపు గింజ) యొక్క వివర్తనమని గ్రహింపుము శిల్పియొక్క మనో కల్పితమగు పద్మవనము రాతియందుండునట్లు, సౌమ్యనిద్రాభావమును బొందిన చిత్తుయొక్క అంతరమున ఈ సృష్టి యున్నది.

అత్రేమామిన్దువదన చిత్రాం విస్మయకారిణీమ్
వర్ణ్యమానాం మయా రమ్యామన్యామాఖ్యాయికాం శృణు. 6

ఇందువదనుడా! ఈ విషయమును దెల్ప, విస్మయకరమును, రమణీయమును, విచిత్రమును నగు యొక కథను జెప్పుచున్నాను; వినుము.

స్నిగ్ధా స్పష్టా మృదుస్పర్శా మహావిస్తారశాలినీ
నిబిడా నిత్యమక్షుబ్ధా క్వచిదస్తి మహాశిలా. 7

స్నిగ్ధమును (నునుపైనది), ప్రకాశవంతమును, మృదుస్పర్శగలదియును, విశాలమును, ఘనమైనదియును, అక్షుబ్ధమును నగు శిలయొక్కటి యున్నది.

తస్యామన్తః ప్రఫుల్లాని పద్మాని సుబహూన్యపి
సరస్యామివ రమ్యాణి తాన్యనన్తాని సన్తి వై. 8

దానియందు, చక్కగా బాయలు తీర్చి, సరోవరమందున్నవానివలె రమ్యములగు వికసితములగు పద్మములున్నవి; వాటిని లెక్కింపజాలము.

అన్యోన్యప్రోతపత్రాణి మిథో విఘటితాని చ
మిథశ్చోపనిగూఢాని గూఢాని ప్రకటాని చ. 9

వాటి దళములు పరస్పరము గలిసియుండుటవలన ఒకదానితో మఱియొకటి కొట్టుకొనుచున్నవి. అన్నియును కలసియున్నవి కొన్ని వికసించియు, మఱికొన్ని ముకుళించుకొనియు నున్నవి.

అధోముఖాన్యూర్ధ్వముఖాన్యపి తిర్యఙ్ముఖాని చ
మిథో మిలితమూలాని మిథః ప్రోతముఖాన్యపి. 10

కొన్ని క్రిందికి వ్రేలుచున్నవి. కొన్ని పైకి లేచియున్నవి, కొన్ని పడియున్నవి. అన్నిటి యొక్క మొదళ్లు కలసియున్నవి, అన్నిటియొక్క ముఖములుగూడ పరస్పరసంలగ్నములు.

కర్ణికాజాలమూలాని మూలాన్తః కర్ణికాని చ
ఊర్ధ్వమూలాన్యధోమూలాన్యమూలానీతరాణి చ. 11

కొన్ని ఊర్ధ్వమూలములును, మఱికొన్ని అధోమూలములును నైయున్నవి; మఱికొన్నిటికి మూలము లేదు, కొన్నిటి మూలముల కర్ణికలున్నవి.

తేషాం చ నికటే సన్తి శఙ్ఖాః శతసహస్రశః
చక్రౌఘాశ్చ మహాకారాః పద్మవత్సంవివేశినః. 12

వీటికడ శతసహస్రములగు శంఖములు ముకుళించుకొని యున్న పద్మములవలె తోచుచు నున్నవి; పెద్దవియగు చక్రములు వికసించిన పద్మములవలె తోచుచు, వెలయుచున్నవి.

శ్రీరామ ఉవాచ :—

సత్యమేతన్మయా దృష్టా తాదృశీ సా మహాశిలా
శాలగ్రామే హరేర్ధామ్ని విద్యతే పరివారిణీ. 13

శ్రీరాముడు:—పద్మవనలాంఛితమగు ఇట్టి మహాశిల నొకదానిని నేను సాలిగ్రామ క్షేత్రమున (విష్ణుక్షేత్రమున) గాంచియుంటిని. వాస్తవముగ, అది మీరు వర్ణించి నట్లేయున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏవమేతద్విజానాసి దృష్టవానసి తాం శిలామ్
యో యశ్చ తత్ర వై ప్రాణః సమస్తాదృగసన్తరః. 14

శ్రీవసిష్ఠుడు:—నీవు ఈ దృష్టాంతభూతమగు శిలను గాంచియుంటివి దార్ష్టాంతికమగు బ్రహ్మముయొక్క రీతినిగూడ నీ వెఱుగుదువు. ఇయ్యది ప్రాణమునకుగూడ ప్రాణమగు చిద్ఘన - ఆనందము.

మయా ద్వియమపూర్వైవ శిలేహ కథితా తవ
యస్యామన్తర్మహాకుక్షౌ సర్వమస్తి చ నాస్తి చ. 15

నేను నీకొక అపూర్వమగు శిలను (బ్రహ్మమును) గుఱించి చెప్పియుంటిని. విశాలమగు దీని ఉదరమున అన్నియును ఉన్నవి, మఱియు ఏమియును లేదు.

చిచ్ఛిలైషా మయోక్తా తే యస్యామన్తర్జగన్తి వై.
ఘనత్వైకాత్మకత్వాదివశాదేషా శిలైవ చిత్. 16

నేను నీకు జెప్పినది చిత్ - శిలయే; ఇది (ఆనంద) ఘనత్వ, ఏకాత్మకత్వాదులతో గూడి యుండుటవలన శిలయని చెప్పబడినది.

అప్యత్యన్తఘనాజ్జాయాః సునీరన్ధ్రాకృతేరపి
విద్యతేఽన్తర్జగద్వృన్దం వ్యోమ్నీవ విపులానిలః. 17

అత్యంతఘనమును, నీరంధ్రము నైనను, ఆకాశమున వాయువున్నట్లు మాయవల్ల దీని యందు జగత్సమూహములు వెలయుచున్నవి.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
సన్తి తస్యాం శిలాయాం చ సుషిరం న మనాగపి. 18

ఈ శిలయందు ద్యులోకము, భూమి, వాయువు, ఆకాశము, పర్వతములు, దిక్కులు, పెక్కులుగ వెలయుచున్నవి; దీనియందు రంధ్ర మొక్కటియును లేదు.

అస్యామేవ ఘనాఙ్గాత్మ జగత్పద్మం విజృమ్భతే
ఏతస్మాద్వస్తుతో నాన్యదన్యచ్ఛుద్ధాత్మకం చ వా. 19

ఈ శిలయందే నిబిడమగు జగత్ - పద్మవనము విస్తరించుచున్నది. జగత్తు అన్యవస్తువుగ తోచుచున్నను, వాస్తవమున కది అన్యము కాదు శుద్ధచిదాత్మకమును గాదు; మాయామాత్రమే.

శఙ్ఖపద్మాదికం లోకం పాషాణే లిఖ్యతే యథా
భూతం భవద్భవిష్యచ్చ శిలాయాం శాలభఞ్జికా. 20
తథాస్తి తత్ర తత్సర్వం సంస్థానం వస్తుతో యథా
ఉపలాన్తః సంనివేశో నానాత్మాప్యేకపిణ్డతామ్. 21
యథాదత్తే తథైషా చిత్పిణ్డాకారైకికాం ఘనామ్
యథాపద్మః శిలాకోశాదభిన్నస్తద్వపుర్మయః. 22
తథా సర్గశ్చితో రూపాదభిన్నోఽపి వపుర్మయః
సుషుప్తావస్థయా చక్రపద్మలేఖాః శిలోదరే. 23
యథా స్థితాశ్చితేరన్తస్తథేయం జగదావలీ
శిలాన్తః పద్మలేఖాలీ మరిచాన్తశ్చమత్కృతిః. 24
నోదేతి నాస్తమాయాతి యథా సర్గస్తథా చితౌ
యథా పురన్ధ్రాం మర్త్యోన్తర్మజ్జా వా బిల్వగా యథా. 25
తథాఽనన్తవికారాఢ్యా చితౌ బ్రహ్మాణ్డమణ్డలీ
వికారాది తదేవేతి ముధైవోక్తిరనర్థికా. 26
తత్తాం సముపయాత్యాశు జలబిన్దురివామ్భసి
అనన్తత్వాచ్చితేరేత్వకారాది చితేరితి. 27
ఉక్త్యాసంపద్యతే యచ్చ తల్లయేన విలీయతే
బ్రహ్మైవేదం వికారాది వికారాద్యర్థవర్జితమ్. 28
వర్జనావర్జనేఽర్థస్య బ్రహ్మైవానన్తతావశాత్
బ్రహ్మస్థితం వికారాది బ్రహ్మైవోత్పాదితం క్రమాత్. 29

శిలయందు శంఖపద్మాది చిత్రములు చిత్రింపబడునట్లు, శిల్పియొక్క మనస్సు ఈ శిలయందు భూతభవిష్యద్వర్తమానచిత్రముల చిత్రించియుంచినది, ఇకముందుగూడ చిత్రింపగలదు. శిలాచిత్రములగు శాలభంజికలు వాస్తములుగ తోచునట్లు, ఇవిగూడ వాస్తవములుగ తోచుచున్నను వాస్తవములు గావు. రాతియందు చెక్కబడిన ఆకృతులన్నియును చూడ వేఱుగ తోచుచున్నను,

రాయి ఒక్కటియే యైనట్లు, ఈ బ్రహ్మశిలయందు తోచునవన్నియు విభిన్నములుగ అగుబడుచున్నను, ఏకమగు ఘనపిండమే. రాతియందు చెక్కబడిన పద్మము, దానినుండి వేఱుగాకున్నను వేఱుగ తోచు నట్లు, ఈ సృష్టియంతయు చిత్ - శిలనుండి వేఱుగాకున్నను వేఱుగతోచుచున్నవి. సుషిప్తిదశయందు, అనగా, శిల చెక్కబడకమునుపు చక్రము, పద్మము మున్నగు ఆకృతులందే ఇమిడియున్నట్లు, ఈ బ్రహ్మశిలయందుగూడ జగత్తులో ఇమిడియుండెను, ఇమిడియుండగలవు. శిలయందలి పద్మరేఖల కును, మరీచిబీజమునందలి చమత్కృతికిని ఉత్పత్తివినాశములులేనట్లు, ఈ చిత్ మశిలాపద్మములకు, మరీచి - చమత్కృతికిని ఉభయాస్తమయములు లేవు. రామా! సాధ్వియగు యువతిహృదయమున ఆపె పతియొక్క మూర్తియును, బిల్వఫలమున మజ్జయు ఓతప్రోతభావమున నుండునట్లు, అనంత వికారములతోగూడిన ఈ బ్రహ్మాండములుగూడ చిత్ - శిల, చిత్ - బిల్వముల నున్నవి. వికార మగు బ్రహ్మాండము చిన్మాత్రమైన, ఈ భేదముగూడ చిన్మాత్రమే అను యుక్తి అర్థవిహీనమగుట వలన నిష్ఫలము. నీటియందు నీటిబొట్లవలె, జగత్తున్నగు వికారములు చిన్మాత్రదర్శనముననే విలీన ములగుచున్నవి. చిత్తు అనంతమగుటవలన, తద్వికారములుగూడ అనంతములు. నామమువలన ఎఱుగ బడునది నామము లయమైన లయమునందుచున్నది. కవివర్ణితమగు గంధర్వనగరము నామమాత్ర మైనట్లు, ఈ జగత్సృష్టులుగూడ నామమాత్రములే. కవివర్ణితములగు వికారములను గ్రహించు చైతన్యముననే, మరల ఆ వికారములు లీనమగునట్లు, ఈ వికారములు, అర్థశూన్యములగు వస్తువులు మరల ప్రతిభాసకమగు చైతన్యముననే విలీనములగుచున్నవి. ఏలయన, వికారాదులకు స్వతంత్రమగు ఉనికి లేదు. బ్రహ్మము అనంతము. కాన, నిరర్థకసార్థకములు, వర్జనగ్రహణములు మున్నగునవన్నియు బ్రహ్మమే. వికారాదులన్నియు బ్రహ్మముననే వెలయుచు, మరల అందుండియే ఉద్భవించు చున్నవి.

అత్రాన్యార్థమిదం విద్ధి మృగతృష్ణామ్బుసాసమమ్
బీజం పుష్పఫలాన్తస్థం బీజాన్తర్నాన్యదాత్మకమ్. 30
యాదృశీ బీజసత్తా సా భవన్తీ యాత్యథోత్తరమ్
చిద్ఘనే చిద్ఘనత్వం యత్స ఏవ త్రిజగత్క్రమః 31
ఏకత్వమేతయోర్ద్విత్వమేకాభావే ద్వయోః క్షతిః
జగదన్యభవోద్భూతిర్న కదాచిత్తదీదృశమ్. 32

ఇంకొక ఉపమానమును వినుము; ఈ సృష్టి మృగతృష్ణికవంటిది. పుష్పఫలాదులు బీజ సత్తయొక్క అనువృత్తులైనట్లు, ఈ సృష్టిగూడ చిత్ - సత్తయొక్క అనువృత్తియే. అందువలన, సమస్తమును చిదాత్మకము. బీజసత్త, అంకుర, శాఖా, పల్లవాది రూపముల క్రమముగ వికృతి నంది, వాటికి కారణమగునట్లు, చిద్ఘనముయొక్క ఘనత్వముగూడ ఈ త్రిజగత్తులను వికారముగ పరిణతి నంది, దానికి కారణమై వెలయుచున్నది. బీజమను కారణము, వృక్షపత్రపుష్పములను కార్యమును, ఒకటియే యైయ్యును ద్వైతభావమును దోపింపజేయుచున్నవి, ఈ ద్వైతభావమే ఏకత్వము. వీటిలో నొక్కటి లోపించిన, ద్వైతము తొలగిపోవును. ఈ జగత్తు జాడ్య కల్పనమునుండియే కలిగినది; చిత్తు జడముగ మారజాలదు.

చిదచిన్న కదాచిచ్చ ద్వయమస్త్రిమిథోఽద్వయమ్
మహాశిలాన్తరే భేదో లేఖాత్మాస్తి యథా బహు
తదన్యాన్యమజ్జాది చిద్ఘనే త్రిజగత్తథా. 33
రేఖోపరేఖావలితా యథైకా పీవరీ శిలా
తథా త్రైలోక్యవలితం బ్రహ్మైకమితి దృశ్యతే. 34
ఏతచ్ఛిలాన్తరబ్జాది యథా నిత్యం సుషుప్తకమ్
నాస్తమేతి న చోదేతి తథాఽహన్తా జగద్గతిః. 35
యథా శిలాన్తర్లేఖాది భిద్యతే న శిలాన్తరాత్
తత్సాత్వాజ్జగత్కర్తృకర్తృత్వాదిజగచ్ఛితిః. 36
యథా శిలాన్తరబ్జానాం స్పన్దాస్పన్దభవాభవాః
విషయత్వం న గచ్ఛన్తి కర్తారో జగతస్తథా. 37
నేదం కదాచిత్క్రియతే న కదాచన నశ్యతి
అద్రివత్ప్రభవోల్లాసవిలాసావేదనాత్మకమ్. 38
యథా యత్ర యదాకారం తథా తత్ర తదేవ హి
బ్రహ్మసత్తాత్మకం సర్వం సుషుప్తస్థమివ స్థితమ్. 39
భూరిభావవికారాఢ్యో యోఽయం జగదురుభ్రమః
సుషుప్తమేవ తద్విద్ధి శిలాన్తః పఙ్కజాదివత్. 40

చిత్తు అగునది, దానికంటె వేఱవజాలదు. చిత్, అచిత్ అను రెండువస్తువుల (ద్వైతము) ఉనికియే లేదు. ద్వైతముగ జెప్పబడుదానియందేకత్వము అంతర్గతమైయున్నది. మహాశిలయందు చెక్కబడిన రేఖాదిభేదములు పెక్కులైనను, వాస్తవమునకు శిల ఒక్కటియే యైనట్లు, ఈ జగత్తుగూడ చిద్ఘనమగు (బ్రహ్మ) బిల్వమున వేఱగు యజ్జవలె తోచుచున్నను, వాస్తవమునకు వేఱుకాదు. రేఖలు, ఉపరేఖలతోగూడిన మహాశిలవలె బ్రహ్మమొక్కటియే త్రిలోకదృశ్యముల కాకరమై యొప్పుచున్నది. శిల్పియొక్క వాసనలు (కల్పనలు) అనదగు పద్మాది చిహ్నములు క్షయోదయరహితములై తోచునట్లు, 'నీవు నేను' అను అహంభావములోగూడిన జగత్తుగూడ క్షయోదయరహితమైన వస్తువుగ తోచుచున్నది; అజ్ఞులు దానిని నిత్యమని భావించుచున్నారు. శిలయందున్న రేఖాదులు, వాటి తత్త్వము, సారము, శిలయేయగుటవలన, అవి శిలనుండి వేఱుగానట్లు, మనకుదోచుచున్న జగత్కర్తన, ఆయన కర్తృత్వము, వాని కార్యమగుజగత్తు మున్నగునవన్నియు చిత్స్వరూపములేయని గ్రహింపుము. వాస్తవదృష్టితో గాంచిన శిలయందున్న పద్మాదులు, వాటి స్పందాస్పందములు, ఆవిర్భావతిరోభావములు లెక్కకురానట్లు, ఆత్మతత్త్వదర్శనమైన, జగత్కర్త మున్నగు విషయములుగూడ గణనకురావు. ఈ జగత్తునుగాని బ్రహ్మమునుగాని ఎవరును సృష్టింపజాలరు, వినాశమొనర్పజాలరు; ఈ జగత్తు, బ్రహ్మములు సృష్టింపబడుటలేదు, వినాశమొనర్పబడుటలేదు. పర్వతశిఖరము పర్వతముకంటె వేఱుకాదు, లేక దాని వికారమును గాదు. అట్లే బ్రహ్మము, సృష్టి కేవలము ఉల్లాసవిలాసముల (లీల)ను సూచించుచున్నవి. చాలమంది శిల్పులయొక్క వివిధములును, విరుద్ధములునునగు మనోకల్పనాభేదముల

వలన శిల విచ్ఛిన్నరూపముల గోచరించుచున్నను, అది అభిన్నమును, ఏకమాత్రమునునగు శిలారూపము ననే వెలయునట్లు, నానావిధులగు జీవుల విరుద్ధ - కల్పనా - భేదములతో గూడియున్నను బ్రహ్మము స్వస్వరూపముననే వెలయుచున్నది. ఎచ్చట ఏ యాకృతిగ కల్పింపబడుచున్నదో, అచ్చట యాకృతి వెలయుచున్నది - వస్తుగతమగు భేదమేమియును లేదు. దృశ్యమానములగు వస్తువులన్నిట బ్రహ్మ సత్త వెలయుచున్నది. బ్రహ్మసత్తయే, పదార్థముల సత్త. నిద్రించువాడు కలయందుగాంచు పదార్థములను, తత్కల్పనను భేదమును గాంచక సహించునట్లు, ఈ జాగ్రద్వస్తు జాతమంతయుగూడ, అలీకమయ్యు, అనుభూతమగుచున్నది. ఈ అన్నిటియందు బ్రహ్మసత్త వెలయుచున్నది. వివిధవికారములతో గూడిన ఈ జగద్భ్రమ, శిలయందు వెలయు పద్మరేఖలవలె, వికసించిన వాసనమాత్రమే యని గ్రహింపుము.

నిత్యం సుషుప్తపదమేవ జగద్విలాసః
సమ్యక్ప్రశాన్తమచిద్ఘనఖాత్మకత్వాత్
పద్మాః శిలాన్తరివ సర్గదశాస్త్వసారా
దృష్టా న దేహముపయాన్తి కదాచిదేవ. 41

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే శిలాకోశోపదేశో నామ షట్చత్వారింశః సర్గః ॥ 46 ॥

ఈ జగత్తు వికసితవాసనయే యైనను, చిద్ఘనప్రకాశమయమగుటవలన, నిత్యప్రశాంతము. శిలా - పద్మాదులవలె ఈ సృష్టి బ్రహ్మయందు తోచుచున్నను, ఇది యెన్నడును సత్తను, స్వరూపస్థితిని జేకూర్చుకొనజాలదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున శిలాకోశోపదేశమను నలుబదియాఱవ సర్గము ॥ 46 ॥

---

## స ప్త చ త్వా రిం శః స ర్గః .

---

[ఇహ బిల్వశిలాఖ్యానతాత్పర్యముపవర్ణ్యతే
మయూరాణ్డరసే బర్హవర్ణసంస్థానభేదవత్.

ఈ ప్రకరణమున బిల్వశిలోపాఖ్యానముల తాత్పర్యము చెప్పబడుచున్నది. మయూర - అండ (నెమలిగ్రుడ్డు) రసమున పింఛమునందలి రంగులు ఇమిడియుండు తీరుగ, బ్రహ్మమున సృష్టి ఇమిడియుండుటయు, బ్రహ్మముయొక్క చిద్ఘనత్వమునున్ను నిరూపింపబడుచున్నవి ]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

చిత్తత్త్వస్య ఫలస్యేవ చితః స్వాపాపరక్రమాత్
స్వసత్తాసంనివేశేన యః స సర్గ ఇతి స్థితః. 1

శ్రీవసిష్ఠుఁడు:—చిత్తత్త్వమును అచేతనమగు ఫలముతో బోల్చియుంటిని; ఈ ఫలము వలెనే చిత్తత్త్వము తన స్వరూపమును గుఱించి విచారింపనప్పుడే సృష్టి సంభవించుచున్నది.

దేశకాలక్రియాదీనామపి తన్మయరూపతః
ఇదమన్యదిదం చాన్యదితి నాత్రోపపద్యతే. 2

యుగములు వత్సరములు అనబడు స్వప్నమున స్వసత్తను ప్రవేశింపజేయు ప్రవృత్తియే సృష్టి. ఇందు స్వగతభేదమునకు తావులేదు. దేశకాలాదులన్నియును చిన్మయములే. కనుక, ఇది చిత్, ఇది చిత్తుగాదు. అను విభేదమే యొనర్పజాలము.

సమస్తశబ్దశబ్దార్థవాసనాకలనావిదః
ఏకాత్మత్వాదసచ్ఛేదమితి సంకథ్యతే కథమ్. 3

శబ్దములు, శబ్దార్థములు, వాసనలు, వాటివలన కలుగు సంకల్పవికల్పముల గ్రహించు జ్ఞాత మున్నగునవన్నియును ఏకాత్మకములే. అందువలన అసత్తులని ఎట్లు చెప్పగలము ?

ఫలస్యాన్తః సంనివేశో నామానుక్రమతో యథా
చితః స్వసత్తాఘనతాఽనానా నానా స్థితా తథా. 4

ఫలమునందుండు గుజ్జు మున్నగునవి ఒకే వస్తువైనను, బీజము, సారము మున్నగు విభిన్న నామముల వ్యవహరింపబడునట్లు, చిత్తు ఒకేవిధమగు సద్ఘనమైనను, విభిన్ననామములతో వ్యవహరింపబడుచు వెలయుచున్నది.

అనానేవాపి నానైవ క్షుబ్ధేవాక్షుభితైవ చ
యథా ఫలాన్తః స్వాసక్తా చిదన్తః సిద్ధయస్తథా. 5

ఫలముననున్న గుజ్జువలె, ఈ చిత్ - సత్తయును, దానియందున్న సృష్టివైచిత్ర్యమును పెక్కుగాకున్నను పెక్కులుగను, అవికృతముగాకున్నను వికృతముగ కనుపించుచున్నది.

జగన్నగరమాదర్శే చితః స్వం ప్రతిబిమ్బితమ్
కచతీవాఽకచదపి శిలాన్తః సంనివేశవత్. 6

శిలయందలి పద్మమునుబోలుచు జగత్తనబడునది, అద్దమునందు ప్రతిఫలించు నగరమువలె ఈ చిత్ - దర్పణమున ప్రతిఫలించుచున్నది. ఇది బయటకు ప్రకాశించుచున్నట్లు తోచుచున్నను వాస్తవమునకు ప్రకాశించుచుండుటలేదు.

పరమే చిన్మణౌ సన్తి జగత్కోటిశతాన్యపి
చిన్తామణావనన్తాని ఫలానీవార్పితాన్యలమ్. 7

అనంతమగు మాయాశక్తితో గూడుకొనిన చింతామణికడ గోరునవన్నియును దొరకు నట్లు, పరమమగు చిత్ - మణి యందుగూడ లెక్కకు మించిన జగత్తులున్నవి.

చిత్సముద్గక ఏవేదం తదగ్రోత్కీర్ణమాతతమ్
జగన్మౌక్తికమాభాతి తదంశమయమన్యవత్. 8

ముత్యపుచిప్పయందు ముత్యములుండునట్లు, చిత్ శక్తియను పెట్టెయందు జగత్తులను ముత్యములు వెలయుచున్నవి; చిన్మయములేయైయ్యును, చిన్మయములుగానట్లు అగుపించుచున్నవి.

అహోరాత్రం వికరయన్వేదనావేదనాన్యలమ్
చిదాదిత్యః స్థితో భాస్వాఞ్జగద్ద్రవ్యాణి దర్శయన్. 9

సూర్యుడు తన ఉదయాస్తమయములవలన దినములను, రాత్రులను కలుగజేయుచు, వస్తువుల కనబడజేయుచు మరల కనబడజేయకుండునట్లు, చిత్ - సూర్యుడుగూడ తన అంగములగు జగత్తుల దోపింపజేయుచు, మరల విలీనమొనర్చుచున్నాడు.

సముద్రకోటరావర్తపయస్స్పన్దవిలాసవత్
అనానైవ చ నానా చిచ్ఛిలాన్తః సంనివేశవత్. 10

సముద్రగర్భమునందలి తరంగములు విలాసముగ తమ కాధారమగు నీటిని కదల్చుచున్నను, అవి నీటినుండి వేఱుగావు; అట్లే బ్రహ్మశిలయందున్న ఈ జగత్తులు వేఱుగ తోచుచున్నను వేఱుకావు.

యదస్తి తచ్చితి శిలాశరీరే శాలభఞ్జికా
యన్నాస్తి తచ్చితి శిలాశరీరే శాలభఞ్జికా. 11

ఇప్పుడున్నవియును, లేనివియును, భూత, భవిష్యద్వర్తమానకాలములందుండునవన్నియును, అచిత్ - శిలయందు చెక్కబడిన బొమ్మలే.

భావాభావేషు యత్సత్యం చిన్మజ్జాకల్పమేవ తత్
మజ్జాసారా పరార్థశ్రీస్తన్మయం స్యాత్తదేవ హి. 12

భావపదార్థములయొక్కయు, అభావపదార్థములయొక్కయు సత్యాంశమే, ఈ చిద్వస్తువుయొక్క మజ్జ. ఈ మజ్జతోడనే ఆ బిల్వఫలము నిండియున్నది. ఇట్టిదే ఆ బిల్వఫలము.

పద్మనానాదిశబ్దార్థస్యక్త్వా యద్వచ్ఛిలోదరమ్
నానా తద్వదిదం నానా తదేతన్మయమద్వయమ్. 13

ఇట్లు పదార్థములన్నియును ఆ చిత్ - బిల్వముయొక్క సారములగుచున్నవి. అవి అన్నియును చిన్మయములు, వాటి తత్త్వము చిత్తే. శిలను విడచి అందు చెక్కబడిన పద్మాదులు వేఱ్వేఱనుట కేవలము మాటవరుసకే యగునట్లు, వాస్తవమున కీవిధమున నుండనట్లు, చిత్తత్త్వమునుండి వేఱుపఱుప జగత్తు అసత్యయగును. కనుక, నానాత్వము, వైచిత్ర్యములు, భేదములుగూడ చిన్మయములే అగుచున్నవి; ద్వితీయమగునదియే లేదు.

నానాప్యేకతయాఽనానా పద్మబిమ్బం శిలోదరమ్
యథా తదవిభాగాత్మ తథేదం చిద్ఘనాన్తరమ్. 14

పద్మాదులను శిలనుండి వేఱుగాయెంచకపోయిన, అవి వేఱు అను జ్ఞానముకలుగక, శిలయొక్క జ్ఞానమొక్కటియే లభించు రీతిగ, ఈ జగత్తును బ్రహ్మమునుండి వేఱుగ యెంచకున్న అవిభక్తమగు చిద్ఘన - జ్ఞానమే లభించును.

యథాఽమలపయఃకోశః స్థలధియాం తు భానుభాః
సన్నేవాసన్నివైవం చిన్నైవ త్వం సదసద్వపుః. 15

భ్రిమగొన్న జీవు లెండమావిని గాంచి నీరని తలంచుచున్నారు. కానిస్థలము అను జ్ఞానముగల వ్యక్తులటు నీటినిగాక, స్థలమునే గాంచుచున్నారు. జ్ఞానులు దానిని సూర్యుని ప్రకాశమని గ్రహించుచున్నారు. అటు, వాస్తవమునకు, సూర్యుని ప్రకాశముగాక మఱేమియును లేదు. ఇట్లే

సదసన్మయమగు శరీరముగ నిన్ను నీవు తలచుకొనుచున్నాడవు; కాని వాస్తవముగ నీవు చిన్మాత్రుడవు.

యథా సమ్యక్ పయోరాశిః కోటరే కలనోన్ముఖమ్
ద్రవత్వాత్స్పన్దతేఽస్పన్దం తథేదం చిద్ఘనాన్తరమ్. 16

నీరు ద్రవ మగుటవలన, దానికి వాస్తవముగ స్పందనము లేకున్నను, గుహ యున్నగు పల్లపు ప్రదేశములబడి కదలుచున్నట్లు తోచురీతిగ, చిద్ఘనముయొక్క అంతరము స్పందరహితమయ్యు స్పందించుచున్నట్లు అగపడుచున్నది.

చిచ్ఛిలాశఙ్ఖపద్మాద్యాస్తన్మయత్వేఽప్యతన్మయః
జగద్వ్యద్ధి సపద్మాదిపదార్థం చిచ్ఛిలాన్తరమ్
మహీశిలాఘనోఽప్యేష చిద్ఘనస్థం శిలోదరమ్. 17

శిలయందు చెక్కబడిన శంఖ, పద్మాదులు శిలామయములే యగునట్లు, చిత్ - శిలయందున్న జగత్తనబడు పద్మాదులుగూడ చిన్మయములే. కాని, సాధారణబుద్ధి కియ్యవి చిన్మయములు కానట్లు తోచుచున్నవి. నీవు దీనిని చిన్మయమనియే గ్రహింపుము.

అరన్ధ్రో నిర్దయోఽచ్ఛోఽజః సంశాన్తః సంనివేశవత్
తపతీదం జగద్బ్రహ్మ శరత్కాల ఇవామలమ్. 18

ఈ శిల చిత్ - శిలయే. దీనియందు రంధ్రములు, భేదవికారములు, లేవు. ఇది అజము, శాంతము. మిథ్యలగు సృష్టుల కూర్పులో నియ్యది ప్రకాశించుచున్నది.

స్ఫురతీదం జగద్బ్రహ్మ సౌమ్యః సోమ ఇవ ద్రుమః
బ్రహ్మణీదం సుషుప్తాభం నాస్త్యనాశం శిలాబ్జవత్. 19

శరత్కాలమువలె బ్రహ్మము తాను ప్రకాశించుచు, జగత్తును బ్రకాశింపజేయుచున్నది. అమృతమును ద్రవించు చంద్రునివలె బ్రహ్మము, తాను ప్రకాశించుచు జగత్తునుగూడ ప్రకాశింపజేయుచున్నది.

బ్రహ్మత్వం బ్రహ్మణి యథా తథైవేదం జగత్స్థితమ్
నానయోర్విద్యతే భేదస్తరుపాదపయోరివ. 20

వాసనామాత్ర మగుటవలన అనిత్యమును, బ్రహ్మమున యున్నందువలన నిత్యమునునై ఈ జగత్తు వెలయుచున్నదని గ్రహింపుము. శిలయందున్న పద్మము పద్మరూపమున అనిత్యము; శిలారూపమున నిత్యము. బ్రహ్మమున బ్రహ్మత్వమున్నట్లు, జగత్తుగూడ యున్నది.

యానీమాని జగన్తీహ నాన్యత్త్వాని చిదాకృతేః
భావాభావాది నాస్త్యేషాం తస్యా ఇవ కదాచన. 21

తరువు, పాదపము విభిన్నశబ్దములైనట్లు వస్తువు (చెట్టు) ఒక్కటియేయగునట్లు, జగత్తును బ్రహ్మమును రెండుగాక ఒకటియే యగుచున్నవి. ఈ రెండును చిన్మయములే.

బ్రహ్మైవ జగదాభాసం మరుతాపో యథా జలమ్
బ్రహ్మైవాలోకనాచ్ఛుద్ధం భవత్యమ్బు యథాతప. 22

చిత్తునకువలె జగత్తునకుగూడ ఉత్పత్తివినాశములు లేవు. ఎండమావిని ప్రకాశింప ఎండ కారణమగునట్లు, బ్రహ్మమే జగత్ప్రకాశమునకు గారణ మగుచున్నది.

మేర్వాదే స్తృణగుల్మాదేశ్చిత్తాదేర్జగతోఽపి చ
పరమాణ్వవిభాగేన యద్రూపం తత్పరం విదుః. 23
తత్సమూహ స్తదేవోచ్చైశ్చిత్తం మేరుతృణాదికమ్
యతోఽన్యేష్వప్యపి హి సారాత్మ స్థాల్యే సారతరం హి తత్. 24

నీరు ఒకటియే ఎండవలన ఆవిరి, మేఘము వడగళ్లుగ మారునని బుద్ధిమంతులు యెఱుగు నట్లు, తత్త్వజ్ఞులుగూడ మేఘాది పదార్థముల కన్నిటికిని మూలము బ్రహ్మమే యని యెఱుంగుదురు. మేరుపర్వతమునుండి తృణమువఱకుగల వస్తుసముదాయమునంతటిని వారు బ్రహ్మమనియే గ్రహింతురు.

యథా రసాత్మికా శక్తిః పరమాణుతయాఽనఘ
స్థితా జగత్పదార్థేషు పాయసీ బ్రహ్మతా తథా. 25

జలపరమాణువునందలి రసశక్తి, స్థూలమగు నీటియందుగూడ గోచరమగునట్లు, సారతర మగు చిత్-శక్తియే స్థూల, సూక్ష్మములందు అనగా పంచీకృతములును, అపంచీకృతములునగు భూత ములయందుగూడ నిండియున్నది.

రసశక్తిర్యథా నానాతృణగుల్మలతాప్సు సా
తథా నానాతయోదేతి సైవాసైవేన బ్రహ్మతా. 26
యైషా రూపవిలాసా నామాలోకపరమాణుతా
గుణగుణ్యర్థసత్తాత్మరూపిణ్యాసాం పరాత్మతా. 27
చితిచిత్తేఽస్తి మేర్వాది తదభివ్యఞ్జనాత్మని
పిఞ్ఛపక్షౌఘకాఠిన్యం మయూరాణ్డరసే యథా. 28
చితిత త్త్వేఽస్తి నానాతా తదభివ్యఞ్జనాత్మని
విచిత్రపిఞ్ఛికాపుఞ్జే మయూరాణ్డరసే యథా. 29
యథా నానాత్మికే హ్యేవ బర్హ్యాణ్డరసబర్హితే
వివేకదృష్ట్యా దృష్టే తే తథా బ్రహ్మ జగత్స్థితమ్. 30
సనానాతోఽప్యనానాతో యథాఽణ్డరసబర్హిణః
అద్వైతద్వైతసత్తాత్మా తథా బ్రహ్మజగద్భ్రమః. 31

ఒకేవిధమగు రసశక్తి తృణ, గుల్మ, లతాదులనబడు నానావిధ పదార్థముల వ్యాపించి యున్నట్లు, బ్రహ్మమే నానావిధములుగ దోచు వస్తువులన్నిటియందు పరివ్యాప్తమైయున్నది. నానావిధములగు నీలపీతాది వర్ణములను దోపింపజేయు శక్తి తేజోపరమాణువున యున్నట్లు, ఇది గుణము, ఇయ్యది గుణమున కాధారమగు గుణియని వస్తువుల ఆవిర్భావ, వినాశముల దోపింపజేయు శక్తి బ్రహ్మమున, కొంచెముగ చిత్తమున, నెమలి గ్రుడ్డుయొక్క రసమున నెమలి పించము, దాని కాఠిన్యము వెలయునట్లు, వెలయుచున్నవి. మయూరాండరసమున నెమలిపింఛము, దానియొక్క విచిత్రవర్ణములు వెలయుచున్నను, రసమొక్కటియే యైనట్లు, వివేకదృష్టితో గాంచిన ఈ నానాత్వ మునకు గారణమైన బ్రహ్మము అద్వయమని తెలియగలము.

యథా సదసతోః సత్తా సమతాయామవస్థితిః
యతః సదసతో రూపం భావస్థం విద్ధి తంపరమ్. 32

కాని, బ్రహ్మము ద్వైతాద్వైతాత్మికము అని తలపరాదు. సదసత్తుల (సత్యము, మిథ్యల) సత్త (ఉనికి) సమత్వముననే (పరమార్థసత్యముననే) వెలయుచున్నది.

నానాఽనానాత్మకమిదం త్వనుభూతం న సంభవమ్
చిజ్జగద్వలనం పశ్య బర్హాణ్డే రసబర్హిణామ్. 33

సదసత్తులు భావవస్తువగు బ్రహ్మముననే ప్రతిష్ఠింపబడియున్నవి; ఈ నానాత్వము, ఏకత్వముల అనుభూతి బ్రహ్మములేకున్న సంభవించెడిదికాదు.

యథాజగతి చిత్తత్త్వం చిత్తత్త్వే యజ్జగత్తథా
నానాఽనానాత్మకైకం చ మయూరాణ్డరసో యథా. 34

నెమలియొక్క అండరసమున దాని పింఛవైచిత్ర్య మణిగియున్నట్లు, దానినుండియే ఈ వైచిత్ర్యమంతయు ప్రసూతమైనట్లు, జగత్తుగూడ చిద్రసముతో నిండి, దానినుండియే తనయునికిని గల్పించుకొనినదని గ్రహింపుము.

నానాపదార్థభ్రమపిచ్ఛపూర్ణా
జగన్మయూరాణ్డరసశ్చిదాద్యా
మయూరరూపం త్వమయూరమన్తః
సత్తాపదం విద్ధి కుతోఽస్తి భేదః. 35

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చిద్ఘనోపదేశో నామ సప్తచత్వారింశః సర్గః ॥ 47 ॥

నానావిధ పదార్థములను భ్రమయనదగు పింఛములతో గూడుకొనిన బ్రహ్మచిత్తే, జగత్తనబడు మయూర - అండ రసముయొక్క రసము. అందే జగత్తనబడు మయూరము (నెమలి) ప్రకాశించుచున్నది. కనుక, (దానికంటె వేఱగు) మయూరము (జగత్తు) ఎక్కడది? ఇక భేదమెటున్నది?

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చిద్ఘనోపదేశమను నలుబదియేడవ సర్గము ॥ 47 ॥

---

## అష్టచత్వారింశః సర్గః.

---

[యత్సత్తాస్ఫూర్తిసౌఖ్యాని ప్రతిబిమ్బన్తి కల్పితే
తత్సచ్చిదానన్దఘనం బ్రహ్మ నిష్కృష్య వర్ణ్యతే.

ఎద్దాని సత్త్వవలన సత్తాస్ఫురణ సౌఖ్యముల ప్రతిబింబములు కల్పింపబడుచున్నవో, అట్టి సచ్చిదానందఘనమగు బ్రహ్మమిటు వివరింపబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

యత్రానుదితరూపాత్మ సర్వమస్తీదమాతతమ్
మయూర ఇవ బీజేఽన్తస్తదహన్తాదిగాది చ. 1
యత్రనాభ్యుదితం కించిత్తత్ర సర్వం చ విద్యతే
తదత్రాప్యఙ్గిరాః స్వర్గసుఖసారేణ బిమ్బతి. 2

శ్రీవసిష్ఠుడు:-అండ మధ్యమున మయూరము, దాని రూపము మున్నగునవి పరిణామము నందకయే వెలయుచున్నట్లు, విశుద్ధమగు చిదండమున అహంతాదులతో గూడిన అంతర్ - జగత్తు, దిక్కులు, ఆకాశము మున్నగువానితో గూడిన జగత్తులు అనభ్యుదితములయ్యు వెలయుచున్నవి ఈ చిద్ఘనానందమే శరీరావయవములకు రసమగు ప్రాణమై, విషయసుఖసారములగు చిత్తవృత్తి భేదములుగను, భోగ్యభోగాదివస్తువులుగను, అద్దమున నీడ పడునట్లు, ప్రతిబింబించుచు వెలయు చున్నది. ప్రతిబింబితమగు విషయానందమును జూచి, మూలమగు చిద్ఘనరూపమున నిరతిశయమగు ఆనందమున్నదని అనుమానించవలెను.

తథా చ మునయో దేవా గణాః సిద్ధా మహర్షయః
ఆస్వాదయన్తః స్వం రూపం సదా తుర్యపదే స్థితాః. 3

స్వాత్మానుభవరూపమగు ఈ నిరతిశయానందమును, తురీయపదమున వెలయు మునులు దేవతలు, గణములు, సిద్ధులు, మహర్షులు సర్వదా అనుభవించుచున్నారు.

ఏతే యే స్తబ్ధనయనదృష్టయో నిర్నిమేషిణః
తే దృశ్యదర్శనాసఙ్గస్పన్దత్యాగే వ్యవస్థితాః. 4

నిమీలితదృష్టులును, నిమేష (రెప్పపాటు) రహితులును, దృశ్యదర్శనరహితులునునై ఈ మహర్షులందఱును వెలయుచున్నారు. (ఇట్టివారికే ఈ భూమానందము లభ్యముకాని, దృశ్య దర్శన మొనర్చు, ప్రాణము చలింప, చిత్తవిక్షేపమునందువారి కియ్యది లభ్యముకాదు.)

నాస్తితా భావనా యేషాం స్థితానామపి కర్మసు
సంవిత్సంవేద్యసంబన్ధస్పన్దత్యాగే చ యే స్థితాః. 5
ప్రాణో న స్పన్దతే యేషాం చిత్రస్థవపుషామివ
మనో న స్పన్దతే యేషాం చిత్రస్థవపుషామివ. 6
చిత్తచేత్యసమాసఙ్గత్యాగే తే స్వపదే స్థితాః
స్పన్దాత్సంసాధయన్త్యర్థం తేనాంశేనేశ్వరో యథా. 7
తథైవ చిత్తచేత్యాదిస్పన్దాత్కుర్వన్తి సంస్థితిమ్
యథాహ్లాదయతి స్వచ్ఛః పల్లవం రశ్మిరైన్దవః. 8
తథాత్మాహ్లాదయత్యన్తర్దృశ్యదర్శనసంగమే
బిమ్బాద్దూరం ప్రయాతస్య భిత్తావపతితస్య చ. 9
యదిన్దోస్తేజసో రూపం తద్రూపం శుద్ధసంవిదః

న దృశ్యం నోపదేశార్హం నాత్యాసన్నం న దూరగమ్. 10
కేవలానుభవప్రాప్యం చిద్రూపం శుద్ధమాత్మనః
న దేహో నేన్ద్రియప్రాణౌ న చిత్తం న చ వాసనా 11
న జీవో నాపి చ స్పన్దో న సంవిత్తిర్న వై జగత్
న సన్నాసన్న మధ్యం చ శూన్యాశూన్యం న చైవ హి. 12

కర్మపథమున వెలయుచున్నను షష్ఠ, సప్తమభూమికల నారోహించిన మహాత్ములు బాహ్యవస్తువుల చింతయందు నియుక్తమైన నిమగ్నులు కారు; వీరు జ్ఞాన, జ్ఞేయములను త్యజించి సమాధియందు వెలయుచున్నారు; వీరి మనోప్రాణములు చిత్రమునందలి దేహములవలె నిష్పందములు. ఇట్టివారే చిత్తమును, చిత్తమున కాశ్రయములగు విషయములను విడచి భూమానంద మనబడు సమభావమున వెలయుచున్నారు. పరమేశ్వరుడు అంతరమున స్వరూపానందమయుఁడయ్యు, బయటను మాయయగు జగత్తుయొక్క వ్యవస్థను ప్రతిష్ఠించుచున్నట్లు, అంతరమున నిరతిశయానంద స్వరూపమగు పరమపురుషార్థమును సాధించునట్లు, బయట చిత్, చేత్య స్పందనములగు బాహ్యవ్యవహారములకు ఆకరములగు వ్యవహారములను సల్పుచున్నారు. చంద్రకిరణములు నిర్మలమగు వృక్ష - పల్లవముల (చిగుళ్లు, ఆకుల) బ్రవేశించి, వాటిని బ్రకాశింపజేయునట్లు, ఈ భూముల నధిరోహించిన మహాత్ముల బుద్ధివృత్తి బాహ్యవిషయములతో గూడినను, నిరతిశయానందమునే అభివ్యక్తమొనర్చుచు, ఆహ్లాదమును బ్రసాదించుచుండును. కనుక, వారి యత్నములన్నియును సుఖమయములు. చంద్రమండలమునుండి వెలువడు వెన్నెల ఆకాశమున సులభ్యమగు తీరుగ, శుద్ధసంవిత్స్వరూపమును, విశ్వపరహితమును, ఆహ్లాదకరమునునగు స్వరూపము, వీరికి అనుభవగమ్యము, చంద్రుని వెన్నెలనుబోలు ఈ శుద్ధసంవిత్తున కెట్టి రూపమునులేదు; చూడబడజాలదు, ఉపదేశింపబడజాలదు; దగ్గరకాదు, దూరముకాదు; కేవల మనుభవగమ్యము. దీనికి దేహేంద్రియప్రాణమనోవాసనలు లేవు. ఇది జీవుడు కాదు, స్పందము కాదు, సంవిత్తు కాదు, జగత్తును గాదు, ఇది అత్యంత సన్నిహితము కాదు, దూరమును కాదు, మధ్యను లేదు; శూన్యము, అశూన్యము, శూన్యాశూన్యమునుగాదు.

న దేశకాలవస్త్వాది తదేవాస్తి న చేతరత్
ఏతైః సర్వైర్వినిర్ముక్తం హృది కోశశతేన చ. 13

ఇది దేశకాలాదులగు వస్తువులు గాదు. దేశకాలములవలన ఇది నిర్ణయింపబడజాలదు. మరల నియ్యదియే దేశకాలాదులు, వాటివలన పరిచ్ఛిన్నమునుయగుచున్నది. ఇది విషయముల నన్నిటినుండి వేఱయ్యు మరల, అనంతములగు వాసనలతో గూడిన హృదయకోశమును గలిగియున్నది.

యత్రైతత్స్పన్దతే దృశ్యం తత్తదాత్మపదం భవేత్
యచ్చ నాద్యం న కల్పాన్తం న వస్త్వాద్యనిలాదిభిః. 14

దీనివలననే దృశ్యవస్తువు లావిర్భవించి లయమందుచున్నవి; దీని సత్తయే ఆత్మ యనంబడుచున్నది. ఇది అవ్యాకృతకారణము కాదు, వాయువు మున్నగునవి దీని రూపమును మార్చజాలవు.

ఇహ చాముత్ర సద్రూపాదన్యథా భవతి క్వచిత్
జాయన్తే చ మ్రియన్తే చ దేహకుమ్భాః సహస్రశః. 15

## ఏకోనపఞ్చాశః సర్గః.

---

[వికారేభ్యో వివర్తస్య వైలక్షణ్యమిహోచ్యతే
అప్రబోధాదవిద్యాస్తి ప్రబోధే నాస్తి సేతి చ.

వికారము, వివర్తములకుగల భేదము, అజ్ఞానమువలన అవిద్యయుండుట, జ్ఞానోదయమున అది తొలగుట అను నీ విషయములీ సర్గయందు చెప్పబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

యది నాస్తి వికారాది బ్రహ్మణ్యబ్రహ్మణి బృంహితే
తదిదం కథమాభాతి భావాభావమయం జగత్. 1

శ్రీరాముడు:—బ్రహ్మజ్ఞా! దేశకాలనిమిత్తములనబడు త్రివిధ పరిచ్ఛేద శూన్యమును, నిరతిశయమును, మహత్తమమునునగు బ్రహ్మవస్తువున వికారాదు లెవ్వియును లేకున్న నయ్యది యెట్లు భావాభావరూపముల బ్రకాశించుచున్నది?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అపునః ప్రాగవస్థానం యత్స్వరూపవిపర్యయః
తద్వికారాదికం తాత యత్క్షీరాదిషు వర్తతే. 2

శ్రీవసిష్ఠుడు:—వత్సా! పాలు పెరుగుగ మారునప్పుడు కలుగు స్వరూపపరివర్తనయే, వికారము పరిణామము మున్నగు పదముల వ్యవహరింపబడుచున్నది.

పయస్తాం పునరభ్యేతి దధిత్వాచ్చ పునః పయః
బుద్ధమాద్యన్తమధ్యేషు బ్రహ్మ బ్రహ్మైవ నిర్మలమ్. 3

ఈ పెరుగు మరల తన పూర్వస్వరూపమగు పాలుగ మారజాలదు. కాని, ఈ జగత్తున ఆదిమధ్యాంతముల బ్రహ్మమే వెలయుచున్నది; ఇయ్యది కేవలము నిర్మలమగు బ్రహ్మమే.

క్షీరాదేరివ తేనాస్తి బ్రహ్మణో న వికారితా
అనాద్యన్తవిభాగస్య న చైషోఽవయవిక్రమః. 4

కనుక, పాలకుండు వికృతి బ్రహ్మమున లేదు. (వైశేషికులు చెప్పు) అవయవసంయోగము, ద్రవ్యగుణములకుండు అన్యద్రవ్యగుణసంబంధము బ్రహ్మమున లేవు. ఏలయన, బ్రహ్మము అనాదియగు వస్తువు.

సమస్యాద్యన్తయోర్యోయం దృశ్యతే వికృతిః క్షణాత్
సంవిదః సంభ్రమం విద్ధి నావికారేఽస్తి విక్రియా. 5

సమత్వమగు ఈ బ్రహ్మవస్తువున గనుపించు ఈ జగత్తు, భ్రమయగు వివర్తమేయని గ్రహింపుము. బ్రహ్మమున పరిణామ మసంభవము.

న సంవేద్యం న సంవిత్తిస్తత్ర బ్రహ్మణి విద్యతే
తద్బ్రహ్మశబ్దకథితం నిఃసంబన్ధచిదాత్మవత్. 6

జ్ఞాన, జ్ఞేయములు బ్రహ్మమున లేవు; బ్రహ్మశబ్దమున చెప్పబడునది సంస్పర్శరహితమగు చిదాత్మ వంటిది.

యాదృగాద్యన్తయోర్వస్తు తాదృగేవ తదుచ్యతే
మధ్యే యస్య తదన్యత్వం తదబోధాద్విజృమ్భితమ్. 7

సృష్టికి పూర్వమునను పరమునను ఉండు తీరుగ, అనగా జగదాదిభ్రమరహితముగ బ్రహ్మము గ్రహింపవలెను. మధ్యకాలమున ఇంకొకమాదిరిగ తోచుట భ్రమవలననే.

ఆత్మా త్వాద్యన్తమధ్యేషు సమః సర్వత్ర సర్వదా
స్వమప్యన్యత్వమాయాతి నాత్మతత్త్వం కదాచన. 8

ఆద్యంతమధ్యములందును, సర్వత్రయును ఈ ఆత్మ సమస్వరూపముననే వెలయుచున్నది; ఈ వివర్తము ఆత్మసంబంధియమే యైనను, ఆత్మత్వము వికారము నందుట లేదు.

అరూపత్వాత్తథైకత్వాన్నిత్యత్వాదయమీశ్వరః
వశం భావవికారాణాం న కదాచన గచ్ఛతి. 9

ఈ సర్వశక్తిమంతమగు బ్రహ్మము, రూపరహితమును, ఏకమును, నిత్యమును అగుటవలన భావవికారముల కెన్నడును వశమగుచుండుటలేదు.

శ్రీరామ ఉవాచ:—

విద్యమానే సదైకస్మిన్బ్రహ్మణ్యేకాన్తనిర్మలే
సంవిద్భ్రమస్వరూపాయా అవిద్యాయాః క ఆగమః. 10

శ్రీరాముడు:—పరిపూర్ణ నిర్మలమును, సద్రూపమును, ఏకమును నగు బ్రహ్మమున బుద్ధిజాడ్యమనదగు ఈ అవిద్య ఎటనుండి అరుదెంచినది.?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

బ్రహ్మతత్త్వమిదం సర్వమాసీదస్తి భవిష్యతి
నిర్వికారమనాద్యన్తం నావిద్యాస్తీతి నిశ్చయః. 11

శ్రీవసిష్ఠుడు:—బ్రహ్మతత్త్వమొక్కటియే భూతభవిష్యద్వర్తమానకాలముల వెలయుచున్నది; ఇయ్యది అనాది, అనంతము, అవిద్యయనునదిలేదు. ఇది నిశ్చయమగు సత్యము.

యస్తు బ్రహ్మేతి శబ్దేన వాచ్యవాచకయోః క్రమః
తత్రాపి నాన్యతాభావముపదేష్టుం క్రమో హ్యసౌ. 12

'ఇయ్యది బ్రహ్మము' అని ఉపదేశించునప్పుడు చెప్పబడు వాచ్య-వాచకములగూడ వికారము మున్నగువాని ఉనికి లేదు. బ్రహ్మముయొక్క సద్భావము అన్యముగ చెప్పబడుట ఉపదేశసౌలభ్యముకొఱకే.

త్వమహం జగదాశాశ్చ ద్యౌర్భూశ్చాప్యనలాది వా
బ్రహ్మమాత్రమనాద్యన్తం నావిద్యాస్తి మనాగపి. 13

నీవు, నేను, జగత్తు మున్నగునవియును, ద్యులోక భూలోకములును, లేక వాయువు మున్నగునవన్నియునుగూడ ఆద్యంతరహితమగు బ్రహ్మమే. అవిద్యయనునది ఒకించుకయునులేదు.

నామ్నైవేదమవిద్యేతి భ్రమమాత్రమసద్విదుః
న విద్యతే యా సా సత్యా కీదృగ్రామ భవేత్కిల. 14

అవిద్య కేవలము నామమాత్రమే. ఇది సత్తారహితమను భ్రమయని (పండితులు) ఎఱుంగుదురు. రామా! లేనిదగు అవిద్య ఎట్లు సత్యమవగలదు, అది ఎట్లు ఉదయించును?

శ్రీరామ ఉవాచ:—

ఉపశమప్రకరణే హ్యాస్తనే తు త్వయేరితమ్
అవిద్యేయం తథ్థం చ విచార్యత ఇతి ప్రభో. 15

శ్రీరాముడు:—ప్రభూ! మీరు ఉపశమప్రకరణమున 'అవిద్యను ఎట్లు విచారింపవలెను' అని నుడివియుంటిరి. ఆ విషయమును జెప్పుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతావన్తమబుద్ధస్త్వమభూః కాలం రఘూద్వహ
కల్పితాభిః క్లైతాభిర్బోధితోఽసి స్వయుక్తిభిః. 16

శ్రీవసిష్ఠుండు:—రఘూద్వహా! నీ వప్పుడు అజ్ఞానదశయందుండుట వలన, నీ కట్లు కల్పించి చెప్పవలసివచ్చినది. ఇప్పుడు నీవు ప్రబోధము నందితివి కాన, అట్టి విచారముతో పనిలేదు.

అవిద్యేయమయం జీవ ఇత్యాదికలనాక్రమః
అప్రబుద్ధప్రబోధాయ కల్పితో వాగ్విదాం వరైః. 17

అవిద్య, జీవుడు మున్నగు కల్పనలను, అజ్ఞులను ప్రబోధింప, పండితులు కల్పించినారు.

అప్రబుద్ధం మనో యావత్తావదేవ భ్రమం వినా
న ప్రబోధముపాయాతి తదాక్రోశశతైరపి. 18

మనస్సు అజ్ఞానదశయందుండిన, శాస్త్రోక్తమగు ఈ అవిద్యోపదేశమువలనగాక, శతవిధముల తిరస్కరింపబడినను ప్రబోధము నందదు.

యుక్త్యైవ బోధయిత్వైష జీవ ఆత్మని యోజ్యతే
యద్యుక్త్యాసాద్యతే కార్యం న తద్యత్నశతైరపి. 19

ఈ జీవుడు యుక్తులవలన బోధింపబడి, ఆత్మకడకు గొనిపోబడి, కలుపబడుచున్నాడు. యుక్తివలన సాధింపబడని కార్యము, శతవిధప్రయత్నములవలనను సాధింపబడదు.

సర్వం బ్రహ్మేతి యో బ్రూయాదప్రబుద్ధస్య దుర్మతేః
స కరోతి సుహృద్వృత్త్యా స్థాణోర్దుఃఖనివేదనమ్. 20

అజ్ఞాన-దోషము తొలగనివానికి సర్వము బ్రహ్మమని చెప్పుట, శిలను మిత్రుడని భావించి దుఃఖమును నివేదించుటయే యగును.

యుక్త్యా ప్రబోధ్యతే మూఢః ప్రాజ్ఞస్తత్త్వేన బోధ్యతే
మూఢః ప్రాజ్ఞత్వమాయాతి న యుక్త్యా బోధనం వినా. 21

మూఢుడు యుక్తివలనను, ప్రాజ్ఞుడు తత్త్వమువలనను ప్రబోధము నందుచున్నారు. యుక్తి వలన బోధింపబడకున్న మూఢుడు ప్రాజ్ఞుడవజాలడు.

ఏతావన్తమబుద్ధస్త్వం కాలం యుక్త్యా ప్రబోధితః
ఇదానీం సంప్రబుద్ధస్త్వం మయా యేనావబోధ్యసే. 22

నీవు ప్రబోధము నందనంతవఱకు యుక్తిని గైకొని బోధించితిని. ఇప్పుడు ప్రబుద్ధుడ వగుటవలన తత్త్వమును జెప్పుచున్నాడను. వినుము.

బ్రహ్మాహం త్రిజగద్బ్రహ్మ త్వం బ్రహ్మ ఖలు దృశ్యభూః
ద్వితీయా కలనా నాస్తి యథేచ్ఛసి తథా కురు. 23

నీవు, నేను, త్రిజగత్తులు, దృశ్యములు మున్నగునవన్నియును నిశ్చయముగ బ్రహ్మమే. ఇంకొక వస్తువే లేదు. నీవు నీయిష్టము ననుసరించి వ్యవహరింపుము. ఇట్లాచరించినను బ్రహ్మముయొక్క వాస్తవత్వమున కెట్టి హానియు కలుగజాలదు.

అసంవేద్యమహాసంవిత్కోటిమాత్రం జగత్త్రయమ్
ఏకప్రత్యయవాన్తః కుర్వన్నపి న లిప్యతే. 24

జ్ఞేయము కాజాలని చైతన్యమును, సర్వవిధభ్రాంతులకు బాధకమును నగు బ్రహ్మవస్తువొక్కటియే ముల్లోకముల అనుస్యూతమైయున్నదని నీవు గ్రహించి, కార్యముల నాచరించిన లిప్తుడవు కావు.

భారూపశ్చేతనో వ్యాపీ పరమాత్మాహమిత్యయమ్
రాఘవానుభవాన్తస్త్వం తిష్ఠన్గచ్ఛఞ్ఛ్వసన్స్వపన్. 25

రాఘవా! నీవు కూర్చొనునప్పుడును, ఊపిరి దీసుకొనునప్పుడును, నిద్రించునప్పుడునుగూడ ప్రకాశరూపుడును, చేతనమును, సర్వవ్యాపియునగు పరమాత్మవని భావింపుము.

నిర్మమో నిరహంకారో బుద్ధిమానసి సాధు చేత్
తద్బ్రహ్మవేదనం శాన్తం సర్వభూతస్థితం భవ. 26

నీవు సరిగ నిర్మముడవును, నిరహంకారుడవును, ప్రాజ్ఞుడవును నైనచో, సర్వజీవుల వెలయు చిదేకరసమును, శాంతమునగు బ్రహ్మమే యగుదువు.

తదనాద్యన్తమాభాసం సత్త్వమేవ పరం పదమ్
స్థితోఽసి సర్వగైకాత్మశుద్ధసంవిన్మయాత్మకః. 27

ఆద్యంతరహితమును ప్రకాశమయమునునగు ఆ పరమపదమే నీవు; సర్వవ్యాపివియును, ఏకాత్మకుడవును శుద్ధచైతన్యస్వరూపుడవునునై నీవు వెలయుచున్నాడవు.

యద్బ్రహ్మాత్మాపి తుర్యశ్చ యా విద్యా ప్రకృతిశ్చ యా
తదభిన్నసదైకాత్మ యథా కుమ్భశతేషు మృత్. 28

కుండల యన్నిటియందు మన్ను అభిన్నమై వెలయునట్లు, బ్రహ్మ, ఆత్మ, తురీయ, అవిద్య, ప్రకృతి, జగత్తులందుగూడ సదాత్మ యొక్కటియే వెలయుచున్నది.

నాత్మనః ప్రకృతిర్భిన్నా ఘటాన్మృన్మయతా యథా
సన్మృన్మాత్రం యథా చాన్తరాత్మైవం ప్రకృతిః స్థితా. 29

ప్రకృతి ఆత్మకంటె వేఱు కాదు; మృణ్మయత ఘటమునుండి వేఱు కాదు. మృణ్మయత్వమే ఘటమున వెలయుచున్నట్లు, ఆత్మయే ప్రకృతియందు వెలయుచున్నది.

ఆవర్తః సలిలస్యేవ యః స్పన్దస్త్వయమాత్మనః
ప్రోక్తః ప్రకృతిశబ్దేన తేనైవేహ స ఏవ హి. 30

నీటియందలి ఆవర్తము (సుడిగుండము)ను బోలు ఈ ఆత్మయొక్క వివర్తమే ప్రకృతియనం బడుచున్నది. ఆత్మ - స్పందనమువలననే ప్రకృతి కలుగుచుండుటవలన, ఆత్మయే ప్రకృతియని గ్రహింపవలెను.

యథైకః స్పన్దపవనౌ నామ్నా భిన్నౌ న సత్తయా
తథైకమాత్మప్రకృతీ నామ్నా భిన్నే న సత్తయా. 31

వాయువు, దాని స్పందమును పేరుమాత్రము వేఱైనను, వస్తువొకటియే యైనట్లు, ఆత్మ ప్రకృతులు పేరు వేఱగుచున్నను వాస్తవమునకు వేఱుగావు.

అబోధాదేతయోర్భేదో బోధేనైవ విలీయతే
అబోధాత్సన్మయో యాతి రజ్జ్వాం సర్పభ్రమో యథా. 32

అజ్ఞానమువలన కలుగు ఈ భేదము, రజ్జుసర్పభ్రాంతివలె, జ్ఞానోదయమున తొలగి పోవుచున్నది.

చిత్క్షేత్రే కలనాబీజం యదేతత్పతతి స్ఫురన్
చిత్తాఙ్కురం తదేతస్మాద్భావి సంసారఖణ్డకః. 33

చిత్-క్షేత్రమున (పొలమున) కల్పనయను బీజము పడి, చిత్తమను అంకురమును దోపజేయుం చున్నది. అదియే సంసారమను భవిష్యత్-వనమును కలిగించుచున్నది.

ఏతదేవాత్మవిజ్ఞానాద్దగ్ధం సద్వాసనాజలైః
సంసిక్తమపి యత్నేన న భవత్యఙ్కురక్షమమ్. 34

ఈ కల్పనాబీజము ఆత్మవిజ్ఞానమున దగ్ధమొనర్పబడినయెడల, వాసనలను నీరు చల్లబడినను అంకురింపదు.

నో చేత్పతతి చిత్క్షేత్రే కలనాబీజకం తతః
చిత్తాఙ్కురా న జాయన్తే సుఖదుఃఖలవద్రుమాః. 35

చిత్తక్షేత్రమున ఈ కల్పనాబీజము పడకున్న సుఖదుఃఖఫలములతో గూడిన, శరీర-వృక్ష మునకు గారణమగు చిత్తాంకురములు లేవజాలవు.

ద్విత్వం జగత్యసదుపాత్తమబోధజాతం
బోధక్షయం జహిహి బోధముపాగతోఽసి

ఆత్మైకభావవిభవేన భవాభయాత్మా
నాస్త్యేవ దుఃఖమితి నః పరమార్థసారం. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే సంసృతివిచారయోగో నామ ఏకోనపఞ్చాశః సర్గః ॥ 49 ॥

---

ఓరామా! నీవు ఆత్మబోధము నందితివి; ఇప్పుడు తత్ఫలితముగ, అజ్ఞానప్రసూతమును, అభావపూర్ణమును, భ్రమయుక్తమునునగు ద్వైతబుద్ధిని పరిత్యజింపుము. ఆత్మైక భావరూపమగు నిరతిశయానందవైభవమున పరిపూర్ణుడవై, అభయాత్ముడవు కమ్ము. త్రికాలముల దుఃఖములేదు—ఇదియే మేము చెప్పు పరమార్థసారము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున సంసృతి విచారయోగమను నలుబదితొమ్మిదవ సర్గము ॥ 49 ॥

---

## పఞ్చాశః సర్గః.

---

[ఇహ కల్పనయా జీవే లిఙ్గపుర్యష్టకోద్భవః
వర్ణితో౽త్రైస్తథా తస్య బాహ్యార్థగ్రహణక్రమః.

ఈ ప్రకరణమున, పుర్యష్టకముతోగూడిన లింగశరీరముయొక్క ఉత్పత్తి, ఇంద్రియములు బాహ్యవిషయములను గ్రహించుట అను విషయములు వర్ణింపబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

జ్ఞాతం జ్ఞాతవ్యమఖిలం దృష్టం ద్రష్టవ్యమక్షతమ్
పరేణ పరిపూర్ణాః స్మో బ్రహ్మజ్ఞానామృతేన తే. 1

శ్రీరాముడు:—తెలిసికొనవలసినదానినంతటిని తెలిసికొంటిమి; చూడదగినదానినంతటిని తెప్పరచూచితిమి; బ్రహ్మమున పూర్ణులమైతిమి; మీరు ప్రసాదించిన బ్రహ్మజ్ఞానామృతమున పరిపూర్ణులమైతిమి.

పూర్ణాత్పూర్ణమిదం పూర్ణం పూర్ణాత్పూర్ణం ప్రసూయతే
పూర్ణేనాపూరితం పూర్ణం స్థితా పూర్ణే చ పూర్ణతా. 2

పూర్ణమునుండి పూర్ణము, పూర్ణస్వరూపమున వెలయుచు వెలువడుచున్నది. ఇదంతయు పూర్ణమున పూర్ణముతో నిండి, పూర్ణముననే వెలయుచున్నది.

లీలయేదం తు పృచ్ఛామి భూయో బోధాభివృద్ధయే
బాలస్యేవ పితా బ్రహ్మన్న కోపం కర్తుమర్హసి 3

బ్రహ్మజ్ఞా! బాలుడు తండ్రిని వేడుకకొఱకు ప్రశ్నించునట్లు, మరల మిమ్ములను ప్రశ్నించుచున్నాడను. కోపగింపకుము, దీనివలన నాజ్ఞానము, (ఇతరులయొక్క జ్ఞానమును) పెంపొందును,

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ
విద్యమానమపి బ్రహ్మన్దృశ్యమానమపి స్ఫుటమ్. 4
కథం మృతస్య వై జన్తోర్విషయం స్వం న పశ్యతి
జీవతశ్చ కథం సర్వం విషయం స్వం ప్రపశ్యతి. 5

బ్రహ్మజ్ఞా! చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణ, త్వగింద్రియములు కనబడుచున్నను, మృతుని ఇంద్రియములేల విషయములను గ్రహింపజాలకున్నవి? జీవితుని ఇంద్రియములేల గ్రహించుచున్నవి?

కథం ఘటాదిబాహ్యార్థమిన్ద్రియాణి జడాన్యపి
శరీరేఽనుభవన్త్యన్తః పునర్నానుభవన్త్యపి. 6

ఇంద్రియములు వెలుపలికి అరుదెంచి, ఘటాది జడవిషయముల ననుభవమును హృదయమున ఎట్లు కలిగింపగలుగుచున్నవి?

అయఃశలాకోపమయోర్ఘటాదీన్ద్రియయోః కిల
అశ్లిష్టయోరన్తరసా కథం తన్నోదితా మిథః. 7

ఇనుపకమ్మలవలె వేర్వేరుగనుండు ఘటము, ఇంద్రియములు పరస్పరము ఆకర్షింపబడి, జ్ఞానమును గలిగించుచున్నవని తలతుమన్నను, ఇయ్యది సంభవముకాదే?

జానన్నపి యదేతాన్వై విశేషాఞ్ఛ్రుతథా పునః
పృచ్ఛామి తదశేషేణ కథయస్వానుకమ్పయా. 8

ఈ విశేషముల నన్నిటిని విశేషముగ ఎఱిగియున్నను మరల ప్రశ్నించుచున్నాడను. దయతో, ఈ విషయమును సంపూర్ణముగ వచింపుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇన్ద్రియాద్యపి చిత్తాది ఘటాద్యపి న కించన
పృథక్సంభవతీహాఙ్గ నిర్మలాచ్చేతనాదృతే. 9

శ్రీ వసిష్ఠుండు:—ప్రత్యక్ష ప్రమాణమునకు కరణములగు ఇంద్రియములును, విషయములగు, ఘటాదులును, గ్రహణద్వారమగు చిత్తమును చైతన్యముకంటె వేఱుకావని లెస్సగ విచారింప తెలియగలదు.

గగనాదపి యాఽచ్ఛా చిత్తయా రూపం స్వమాత్మనా
చిత్త్వాత్పుర్యష్టకత్వేన భావవృత్త్యైవ భావితమ్. 10

ఆకాశమువలె శుద్ధమగు చైతన్యమే, మాయతోగూడి, పూర్వవాసనలవలన భావింపబడి పుర్యష్టకముగ భావింపబడుచున్నది.

తదేవ చ ప్రకృతితాం గతం జగదవస్థితేః
తస్యా అవయవాజ్జాతమిన్ద్రియాది ఘటాది చ. 11

ఆ బ్రహ్మమే జగత్ - స్థితికి కారణమగు ప్రకృతియైనది; ఈ ప్రకృతినుండియే ఇంద్రియములు మున్నగు కరణములు, ఘటములు మున్నగు వస్తువులు కలుగుచున్నవి.

పుర్యష్టకత్వమాయాతం యచ్చిత్తం స్వస్వభావతః
స్వ ఏవావయవస్తస్మిన్ఘటాది ప్రతిబిమ్బతి. 12

పుర్యష్టముగ మారిన చిత్తత్త్వమే తన స్వరూపమగు చిత్తాదులతో గూడిన పుర్యష్టకము యొక్క స్వభావము ననుసరించి, చిత్తవృత్తులను దాల్చుచున్నది; ఇవియే బయటనున్న ఘటాదుల రూపమును ధరించుచున్నవి. అందువలన, మృత్యుసమయమున స్థూలశరీరమునుండి పుర్యష్టకసమన్విత మగు సూక్ష్మశరీరము వెలువడుటజేసి, ఇంద్రియములకు దర్శనసామర్థ్యముండదు.

శ్రీరామ ఉవాచ:—

జగత్సహస్రనిర్మాణమహిమ్నో దర్పణస్య చ
పుర్యష్టకస్య భగవన్రూపం కథయ కీదృశమ్. 13

శ్రీరాముడు:—భగవంతుడా! వేలకొలది జగత్తుల ప్రతిఫలింపజేయు శక్తిగల దర్పణము (అద్దము) అనదగు పుర్యష్టకమును గూర్చి వచింపుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అనాద్యన్తం జగద్బీజం యద్బ్రహ్మాస్తి నిరామయమ్
భారూపం శుద్ధచిన్మాత్రం కలాకలనవర్జితమ్. 14
కలనోన్ముఖతాం యాతమన్తర్జీవ ఇతి స్మృతః
స జీవః ఖలు దేహేఽస్మింశ్చినోతి స్పన్దతే స్ఫుటమ్. 15

శ్రీవసిష్ఠుడు:—అనాద్యనంతమును, నిరామయమును, తేజోమయమును నగు బ్రహ్మమే ఆకాశాది సూక్ష్మభూతముల సృష్టి తరువాత, కల్పనావివర్జితమయ్యును, జగద్బీజమై, అపంచీకృత భూతపంచకముతో గూడిన బ్రహ్మాండమును సృష్టించి, ప్రతిబింబమై, సూత్రప్రాణము అనగా హిరణ్యగర్భుడై, శరీరమధ్యమున జీవరూపమున ప్రవేశించుచున్నది. ఆ జీవుడు వాసనలవలన, అవయవముల గల్పించుకొని పుష్టినంది, బాహ్యాభ్యంతరవ్యాపారములవలన స్పందితుడగుచున్నాడు.

అహంభావాదహంకారో మననాన్మన ఉచ్యతే
బోధనిశ్చయతో బుద్ధిరిన్ద్రియం ప్రేక్షితేన్ద్రియమ్. 16
దేహభావనయా దేహో ఘటభావనయా ఘటః
ఏవ ఏవ స్వభావాత్మా జనైః పుర్యష్టకం స్మృతః. 17

అతడహంభావమువలన అహంకారమును, మననము వలన మనస్సును, నిశ్చయమువలన బుద్ధియు, పదార్థముల గాంచుటవలన ఇంద్రియములును అగుచున్నాడు. అతడు దేహభావమువలన దేహమును, ఘటభావనవలన ఘటమును, ఇట్లే తక్కిన విషయములునునై, పుర్యష్టకమనంబడును.

జ్ఞాతృత్వకర్తృత్వభోక్తృత్వసాక్షిత్వాద్యభిపాతిని
యా సంవిజ్జీవ ఇత్యుక్తా తద్ధి పుర్యష్టకం విదుః. 18

జ్ఞానేంద్రియవ్యాపారముల ప్రవర్తితమై జ్ఞాతృత్వమునను, కర్మేంద్రియవ్యాపారముల ప్రవర్తితమై కర్తృత్వమునను, వాటి ఫలముల బొంది భోక్తృత్వమునను, ఈ అన్ని విషయముల ద్రష్టా

సీన్యమును బూని సాక్షిత్వమునను వెలయునదియు మఱియు తదితమురలగు భోగ్యభోగసమూహముల యందధ్యస్తమగునదియునగు సంవిత్తే చిత్ప్రధానముగ పర్యాలోచింపబడిన జీవుడనియును, జడప్రధానముగ నాలోచింపబడిన పుర్యష్టకమనియు చెప్పబడుచున్నది.

కాలేకాలే తతో జీవ స్త్వన్యోన్యో భవతి స్వతః
భావితాకారయాన స్తద్వాసనాకణికోదయమ్. 19

పుర్యష్టకస్వభావేన కాలేనాకారమృచ్ఛతి
యథా వాసనతః సేకాద్బీజం పల్లవతామివ. 20

ఆకారోఽహం శరీరాది స్థావరాది చరాది చ
నాహమాద్యశ్చిదాత్మేతి మిథ్యా జ్ఞానేన చేతతి. 21

ఇట్లు శరీరమును ప్రవేశించిన జీవుకు కాలక్రమమున తాదాత్మ్యబుద్ధినంది. తత్కాల సంభవములగు సుఖదుఃఖముల బొందుచున్నాడు; పుర్యష్టకముయొక్క స్వభావము ననుసరించి, అనంత వాసనాకల్పితములగు రూపముల ధరించుచున్నాడు. నీరు జల్లిన, బీజము అంకురించి, చిగురుచ్చునట్లు, ఈ జీవుడుగూడ వాసనా-సేచితుడై జగద్రూపమును ధరించుచున్నాడు. ఇట్లు, మిథ్యాజ్ఞానమువలన తన ఆద్యరూపమును మఱచి, శరీరాదులుగ తన్ను భావించుకొనుచున్నాడు.

భ్రమత్యేవ జగజ్జీవో వాసనావలితశ్చిరమ్
ఊర్ధ్వాధోగమనైరబ్ధౌ కాష్ఠం వీచిహతం యథా. 22

సముద్రతరంగముల కొట్టబడిన కాష్ఠము పైకిలేచుచు క్రిందకు పడుచుండునట్లు, వాసనాక్రాంతుడగు ఈ జీవుడుగూడ సంసార సముద్రమున ఉత్కృష్ట నికృష్టజన్మల బడయుచు కొట్టుకొనుచున్నాడు.

కశ్చిద్విశుద్ధజాతిత్వాద్భవబన్ధాదనన్తరమ్
బుద్ధ్వాత్మానం సమభ్యేతి పదమాద్య స్తవర్జితమ్. 23

సనకాదిమహర్షులబోలు ఒకానొక శుద్ధజీవుడు, తన పూర్వకల్పీయ సాధనాఫలముగ ప్రథమజన్మముననే ఆత్మబోధమును బడసి, భవబంధనముక్తుడై పరమపదమున వెలయుచున్నాడు.

కశ్చిత్కాలేన బహునా భుక్తయోనిగణాతురః
ఆత్మజ్ఞానవశాదేతి పరమం పదమాత్మనః. 24

మఱియొక జీవుడు చాల జన్మలనెత్తి, చాలకాలము శ్రమించి, ఆత్మజ్ఞానమువలన పరమపదమును బడయుచున్నాడు.

ఏవంరూపశ్చ సుమతే జీవో యాతః శరీరతామ్
నేత్రాదినా ఘటాద్య స్తర్యథా వేత్తి తథా శృణు. 25

ఇయ్యది జీవుడు శరీరమును దాల్చువిధము; ఇక, ఇంద్రియముల సహాయ్యమున జడములగు ఘటాదుల గ్రహించు రీతిని వినుము.

చిత్త్వస్య కలనా స్తస్య సంప్రయాతస్య జీవతామ్
మనఃషష్ఠేన్ద్రియగ్రామో దేహాఽయమవతిష్ఠతే. 26

చిత్తకల్పనవలన శరీరముగ మారిన చైతన్యము పంచేంద్రియములతోడను, మనస్సుతోడను గూడి వెలయుచున్నది.

యదాన్యః సర్వదేహేభ్యః ఖే పతత్యక్షురూపిణా
తదా తజ్జీవసంస్పర్శాజ్జీవాత్మైకత్వమృచ్ఛతి. 27

తఱువాత, ఘటాదులగు బాహ్యపదార్థములు దృశ్యములుగ తనకడకు అరుదెంచ, చక్షురాది ఇంద్రియద్వారముల వెలువడి, ఆ ఘటాదుల నావరించిన ఆకాశమునబడ, చైతన్యముతో నేకమగుచున్నాడు — అనగా చైతన్యసంస్పర్శయను అధ్యాసతో ఆత్మైకత్వమును బొందుచున్నాడు! ఆయావిషయముల జ్ఞానము లభించుచున్నది.

బాహ్యార్థవేదనే నిత్యం సంబన్ధోఽక్షుస్య కారకః
సమన్వితస్య చిత్తేన న ముక్తస్య కదాచన. 28

జీవచైతన్యముతోగూడిన శరీరమునందలి ఇంద్రియములతోడనే బాహ్యవిషయములతో సంబంధ మొనగూడుచున్నది; మృతునకుగాదు.

యద్యదచ్ఛతరం తస్మిన్నభఃస్థ ప్రతిబిమ్బతి
జీవేన భవతి శ్లిష్టో బహిర్జీవోఽప్యజీవతి. 29

స్వచ్ఛతరములగు నేత్రరశ్మి, అంతఃకరణవృత్తులయందుననే బాహ్యములగు ఘటాది వస్తువులు ప్రతిబింబించుచున్నవి. ఆ ప్రతిబింబము మరల లోనున్న జీవునితో గలసినయెడలనే అనుభవయోగ్య మగుచున్నది. జీవున కిట్టి యనుభవమే లభించుచున్నది. కాని, కేవలము బహిరంగ మగు అనుభవము లేదు.

నిఘృష్టనవరత్నాభే యదా నయనతారకే
తదా తయోర్బాహ్యగతః పదార్థః ప్రతిబిమ్బతి. 30

నేత్రగోళములు రెండును, పొరలు మున్నగు దోషములులేక, సానపెట్టబడిన ఇంద్రనీలములవలె మెఱయుచున్నప్పుడు, బాహ్యములగు ఘటాదులతోగూడిన చిత్తవృత్తులు అందు ప్రవేశించుచున్నవి,

జీవేన భవతి శ్లిష్టః ప్రతిబిమ్బతయా తతః
జీవజ్ఞేయత్వమాయాతి బాహ్యం వస్త్వితి రాఘవ. 31

రాఘవా! ఇట్లు ప్రతిబింబముతో జీవుడు కూడినప్పుడే, అతడు బాహ్యపదార్థముల గ్రహించుచున్నాడని చెప్పబడుచున్నది.

యత్సంశ్లేషముపాయాతి తద్బాలోఽపి హి విన్దతి
పశుర్వా స్థావరో వాపి జీవః కస్మాన్న వేత్స్యతి. 32

ఇట్లు సంయోగము నందినదానిని బాలుడుగూడ గ్రహింపగలుగుచున్నాడు. ఇది పశువులకు, గుల్మలతాదులకుగూడ సంభవించుచున్నది. ఇక జీవుడేల దానిని యెఱుంగజాలడు?

అచ్ఛస్య నయనస్యాథో రశ్మయో జీవవేష్టితాః
క్రోడీకుర్వన్త్యలం దృశ్యం జీవస్త్వేన విన్దతి. 33

నేత్ర-అధోభాగమునందు నిర్మల కిరణములు, దూరమునకున్న విషయములనుగూడ ఆలింగనమొనర్చి, తద్విషయకమగు జ్ఞానమును గలిగించుచున్నవి.

ఏష ఏవ క్రమ స్స్పర్శే సంబన్ధః ప్రత్యయోద్భవః
రసే గన్ధే చ కథితో జీవసంస్పర్శ సంభవః. 34

ఈవిధము ననుసరించియే స్పర్శ, రస, గంధముల విషయమునగూడ జీవునకు జ్ఞానము కలుగుచున్నది.

శబ్దస్త్వాకాశనిష్ఠత్వాత్కర్ణాకాశగతః క్షణాత్
జీవాకాశం విశత్యన్తరితమిన్ద్రియసంవిదః. 35

శబ్దము ఆకాశమునకున్నను కర్ణమునందలి ఆకాశమును ప్రవేశించుటవలనను, గంధము వాయువుతోగూడి నాసాపుటముల ద్వారమున జీవునియందు జొచ్చుటవలనను వీటి జ్ఞానము కలుగుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

దృశ్యతే మానసాదర్శే యన్త్రదార్వాదరేషు తత్
ప్రతిబిమ్బితమేతన్మే బ్రూహి బ్రహ్మన్కిమాత్మకమ్. 36

శ్రీరాముడు:—బ్రహ్మజ్ఞా! మనస్సున, అద్దమున, మణియందున, నీటియందున, లేత చిగుళ్లలోను ప్రతిబింబమువలె కనిపించున దేమిటి? నాకు దెలియజెప్పుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అత్యన్తజడయోరేవ జీవయోరివ తన్మిథః
ప్రతిబిమ్బం దృశో భ్రాన్తిం విద్ధి వేద్యవిదాం వర. 37

శ్రీవసిష్ఠుండు:—జ్ఞానిశ్రేష్ఠా! అత్యంతజడములగు అద్దము-ప్రతిబింబము, చిత్తవృత్తులు-ఘటములవలె జీవుడుగూడ భ్రాంతియేయని గ్రహింపుము.

తావన్మాత్రం జగత్త్వేతద్విశ్వాసో మా తవాస్త్విహ
అహమిత్యాదిస్తరఙ్గో వర్తమానం సదా జలమ్. 38

కేవలమివియే కావు, జగత్తుగూడ భ్రాంతియే యని గ్రహింపుము. ఈ జగత్తున నీకు విశ్వాసము కలుగకుండునుగాక! అహంకారాదులు చిత్సముద్రతరంగములుగ తోచుచున్నవి. వాస్తవము నకున్నది చిత్సముద్ర మొక్కటియే.

పరామ్బోధౌ తు నాస్త్యేవ దేశకాలక్రియాదికమ్
తన్మయైకతయా నిత్యమాత్మా సర్వత్ర సర్వగః. 39

ఈ పరాంబుధియందు దేశకాలాదులు లేవు; వీట స్వరూపమగు ఆత్మయొక్కటియే నిత్యమై, సర్వత్ర సర్వవ్యాపియై వెలయుచున్నది.

నిత్యమసక్తమతిర్ముదితాత్మా
శాన్తమృషా సుఖదుఃఖవిదన్తః

త్విష్ నివిష్టమతిః సమతాయా
మస్తసమస్తభవామయమాయః. 40

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణ ప్రకరణే పూర్వార్ధే అక్షసంవేదనవిచారయోగోపదేశో నామ పఞ్చాశః సర్గః॥ 50 ॥

నీవు యెల్లవేళల అనాసక్తచిత్తుడవై వెలయును, నీ బుద్ధి సుఖదుఃఖములను మిథ్యయని గ్రహించి శాంతిమయమగుగాత! భవమాయయను వ్యాధినుండి విముక్తుడవై ఏకాగ్రచిత్తమున ఆనందమయభావమును, సామ్యభావమును అవలంబించి, వెలయును. బ్రహ్మభావమున నివిష్టుడవు కమ్ము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున అక్షసంవేద విచారయోగోపదేశమను యేబదవ సర్గము ॥ 50 ॥

---

## ఏకపఞ్చాశః సర్గః

---

[జీవః భాని మనో దేహః పుర్యష్టకమితి భ్రమః
అబోధాదేవ బోధే తు బ్రహ్మైవైకమితీర్యతే.

జీవుడు, మనస్సు, శరీరము, ఇంద్రియములు పుర్యష్టకము అను భ్రమ అజ్ఞానమువలననే కలుగుచున్నదనియు, జ్ఞానదృష్టికి బ్రహ్మమొక్కటియే వెలయుచున్నదనియు, సర్గయందు ఈ వర్ణింపబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—.

న పునర్భవతః పూర్ణం సంపన్నాశ్చక్షురాదయః
యథా కమలజస్యైతత్సర్వమేవ త్వయా శ్రుతమ్. 1

శ్రీవసిష్ఠుడు:—శుద్ధమగు బ్రహ్మమునకు కల్పనకు పూర్వము చక్షురాది ఇంద్రియములు లేవనియు, సమష్టిజీవుడగు పద్మజుని (హిరణ్యగర్భుని) యందే అవి కలిగి, తదితర వ్యష్టిజీవులయందు గూడ అనుభూతములగుచున్నవనియు నీవు వినియుంటివి.

బ్రహ్మపుర్యష్టకస్యాదావర్థసంవిద్యథోదితా
పుర్యష్టకస్య సర్వస్య తథైవోదేతి సర్వదా. 2

హిరణ్యగర్భునియందు పుర్యష్టకము, విషయములను గ్రహించు శక్తి ఉదయించునట్లే, వ్యష్టిజీవులయందుగూడ ఉదయించుచున్నవి.

విద్ధి పుర్యష్టకం జీవో యో గర్భస్థేన్ద్రియోదయః
యద్యథా భావయత్యాశు తత్తథా పరిపశ్యతి. 3

మాతృగర్భముననున్న వ్యష్టిజీవునకు ఆఱవమాసమున చక్షురాది ఇంద్రియములు, పుర్యష్టకము గలుగుచున్నవి, అటునుండి అతడు తన వ్యవహారమునకు తగిన విషయములను వాసనలవలన భావించుకొని, అట్లే గాంచుచుండును.

ఇన్ద్రియాణీన్ద్రియార్థాఖ్యం విద్ధి సంవేదనం స్వకమ్
సంపన్నం చ యథా తత్తే ప్రోక్తమాద్యమనఃస్థితౌ. 4

సర్వప్రథమమగు హిరణ్యగర్భుని మనస్సున ఏవిధముగ సంవేదన, ఇంద్రియములు, ఇంద్రియవిషయములు సంపన్నములగుచున్నవో, అట్లే వ్యష్టిజీవునియందుగూడ సంపన్నములగుచున్నవని నీకు చెప్పియుంటిని.

శుద్ధా సంవిత్సంభవన్తి సంవేదనమనిన్దితమ్
తతోఽహంవేదనానన్తజీవపుర్యష్టకాన్వితా. 5

సృష్టికిపూర్వము వెలయు శుద్ధసంవిత్తు, వ్యష్టిసమష్టిజీవులందఱియందు ఒకేరూపమున ఉత్పన్నమయ్యెను. తఱువాత ఇయ్యది 'అహం' అను అభిమానముతో గూడుకొనిన పుర్యష్టకమును బొందుచున్నది. అయినను, ఈ సంవిత్తు విశుద్ధమేయని గ్రహింపుము.

న త్వేకత్వాదనన్తత్వాదవేద్యత్వాదనామయే
అభావత్వాదనేకత్వాదశూన్యత్వాత్పరా స్థితా. 6

సంవిత్తే ఏకమాత్రమగు వస్తువు. ఇయ్యది అనంతము. ఇట్టిదని తెలియబడజాలదు. అందువలన నిర్దోషమును, నిర్మలమునునగు ఈ సంవిత్తున ఇంకొకదానియొక్క ఉనికి అసంభవము; దీన గుణదోషములు, మనస్సు మున్నగునవేమియును లేవు. సత్యమగు ఈ సంవిత్తుకడ ఇతరము లసత్యములు. ఇదిగాక, మిగిలినవన్నియు దేశ, కాల, వస్తు పరిచ్ఛిన్నములును, స్థూలములునునై యున్నవి.

చేత్యాదిబుద్ధ్యా తత్కించిన్న మనస్తాం చ గచ్ఛతి
న చ జీవత్వమాయాతి న చ పుర్యష్టకాత్మికా. 7

ఈ సంవిత్తే మనస్సనబడుచున్నది; ఇది మననమునకు గోచరమగు బుద్ధివృత్తియొక్క అధ్యాసయే. వాస్తవమున కియ్యది మనస్సుకాదు, జీవుడుకాదు, పుర్యష్టకమునుగాదు.

న విద్యాదివిలాసోఽస్తి సోఽస్తి నాస్తీవ యః సదా
పరమాత్మేతి కథితో మనఃషష్ఠేన్ద్రియాతిగః. 8

విద్యావిలాసము అనగా జ్ఞానప్రకాశమే ఈ సంవిత్తత్త్వముయొక్క స్వరూపమని గ్రహింపుము; కాని ఇది మూఢులు లేదని వచించుచున్నను మనస్సు, ఇంద్రియముల కతీతమై వెలయుచు, పరమాత్మ యనంబడుచున్నది.

తస్మాత్సంపద్యతే జీవశ్చిన్మూర్తిర్మననాత్మకః
భ్రమః కేవలమిత్యాద్య ఉపదేశాయ గీయతే. 9

ఈ బ్రహ్మమునుండి చిన్మూర్తియును, మననాత్మకుడునునగు జీవుడుద్భవించినాడు అనునదిగూడ భ్రమయే; ఉపదేశసౌకర్యార్థమే ఇట్లు చెప్పబడుచున్నది.

యతః కుతశ్చిత్సంపన్నే త్వవిద్యామయ ఆమయే
ఉపదేశోపదేశేన ప్రవిలీనే విచారణాత్. 10
ప్రశాన్తసకలాకారం జ్ఞానం తత్రావశిష్యతే
యత్రాకాశమపి స్థూలమణావివ మహాచలః. 11

యత్రోద్యదాచారమపి సదప్యసదివ స్థితమ్
జగజ్జాన్విషయాం స్త్యక్త్వా కాయే త్వం తిష్ఠ నిర్మలే. 12

వ్యాధి అరుదెంచిన, దానిమూలమును కనుగొన సమయమును వెచ్చపెట్టక చికిత్సజేయుటయే కర్తవ్యమైనట్లు, అవిద్యావాధివిషయమునగూడ మూలము ననుసంధాన మొనర్పక, ఉపదేశాదులవలన అవిద్యను దూరమొనర్చుకొనవలెను. అప్పుడు విచారమువలన స్వరూపజ్ఞానమే పరిశేషించును. ఈ జ్ఞానము ప్రశాంతము; నిఖిలవస్తువుల నిండియున్నది. మణియందు పెద్దదగు పర్వతము ప్రతిబింబించునట్లు ఈ జ్ఞానమే ఆకాశాదులుగ ప్రతిభాసించుచున్నది. ఎద్దానియందు వ్యవహారదశయందు సత్యములుగ తోచు పదార్థములన్నియు అసత్స్వరూపమున వెలయుచున్నవో, ఆ జ్ఞానమున నీవు జగత్సంబంధములగు విషయముల సమర్పించి, జీవన్ముక్తస్థితియందు వెలయుచు, నిర్మలుడవై ప్రకాశింపుము.

అసన్మయమవిద్యాయా రూపమేవ తదేవ హి
యద్వీక్షితాసతీ నూనం నశ్యత్యేవ న దృశ్యతే. 13

ఇవన్నియును అవిద్యవలన కలుగుచున్నవే, వీటి రూప మవిద్య. అవిద్య నొకసారి పరికించిన (గ్రహించిన), నశించిపోవుచున్నది; మరల కనబడదు.

ఆలోకితం నామ కథమవస్తు కిల లభ్యతే
ప్రయత్నేనాపి సంప్రాప్తం మృగతృష్ణామ్బుకైరివ 14

కన్నుల కగపడుదాని అసత్తె నెట్లంగీకరింతును అని తలపవలదు; ఈ వస్తువులన్నియును ఎండమావులవలె భ్రమాత్మకములు.

అసదేవ సదేవాసదజ్ఞానాదస్య సత్యతా
జ్ఞానాద్యథాస్థితం వస్తు దృశ్యతే నశ్యతి భ్రమః. 15

ఇది అసత్తయినను సత్స్వరూపముగ ప్రతిభాతమగుచున్నది. అజ్ఞానమువలననే సత్ - వస్తువుగ తోచుచున్నది. జ్ఞానోదయమైన, దీని వాస్తవస్వరూపము గోచరించును; భ్రమ తొలగును.

అవిద్యాయా విచారోఽయం జీవపుర్యష్టకాదికా
అప్యత్యన్తమసత్యాయాః కల్పనాకల్పితాత్మనః. 16

జీవుడు, పుర్యష్టకము మున్నగునవి అవిద్యాభ్రమలు. మిథ్యయగు ఈ అవిద్యయొక్క కల్పన లేక అసత్యత్వము మున్నగునవన్నియు, ఆ సత్యాత్మని సాన్నిధ్యమువలననే కలుగుచున్నవి.

తస్యాస్త ఉపదేశాయ సేయం జీవాదికల్పనా
కృతా శాస్త్రైః ప్రబోధాయ తాం త్వమేకమనాః శృణు. 17

'అవిద్యవలననే జీవాది కల్పనలు' అని శాస్త్రము వచించుచున్నది. ఇప్పుడు నీప్రబోధము కొఱకు, అవిద్యయన నేమియో వచించుచున్నాడను. ఏకాగ్రచిత్తముతో వినుము.

జీవత్వమివ సంప్రాప్తా పుర్యష్టకపదస్థితా
కలా కలఙ్కకలితా చితిరాబోధనోన్ముఖీ. 18

యద్యథా భావయత్యాశు తత్తథానుభవత్యలమ్
సత్యో భవత్యసత్యో వా బాలేన నిశి యక్షకః. 19
పఞ్చతన్మాత్రకలనాం సంభావయతి సత్తయా
తత్రాత్మని తథా రన్ధ్రాన్ప్రపశ్యతి తథోదితాన్. 20

చిత్తత్వము బాహ్యవస్తువుల జూడ నుత్సహించునప్పుడు, కళయను కళంకమున గప్పబడి పురుష్టకాదులుగ మారుచున్నది. అప్పుడేవస్తువును యేరూపమున భావించునో, ఆభావమునే గాంచుచున్నది. బాలుడు రాత్రియందు యక్షుని (భూతమును) గల్పించుకొని భయపడునట్లు, జీవ-చైతన్యముగూడ పంచతన్మాత్రకల్పనను సత్యముగ నొనర్చుకొని, తాను జీవరూపమును బొందుచున్నది. తరువాత, తనయందు ఇంద్రియ - రంధ్రము లుదయించుటగుడ గాంచుచున్నది.

ఏభ్య ఏవ సముత్పన్నం బహిఃస్థం భూతపఞ్చకమ్
పశ్యత్యనన్యదన్యాభం శాఖాశతమివాఙ్కురః. 21

ఈ పంచతన్మాత్రలనుండియే బయట వెలయుచున్న స్థూలభూతపంచకము ఉత్పన్నమగుచున్నది, అంకురమునుండియే అసంఖ్యములగు (వృక్ష) శాఖ లుత్పన్నములై అంకురమునుండి వేఱుగ తోచునట్లు, ఇవిగూడ బ్రహ్మముకంటె వేఱుగ తోచుచున్నవి.

ఇదమన్తరిదం బాహ్యమితి నిశ్చయవాంస్తతః
జీవో భావం యథాదత్తే తత్తథా దృఢయత్యథ 22

అటు జీవుడు, మనస్సు ప్రాణము మున్నగు అంతర్వస్తువులను, ఘటాది బాహ్యవస్తువులను సత్యములని భావించి, తన వాసనల ననుసరించి దృఢతను బొందుచున్నాడు.

రశ్మిజాలమివేన్దోర్యదాత్మనః ప్రతిభాసనమ్
బాహ్యస్పర్శతయా తేన తదేవాశూరరీకృతమ్. 23

చంద్రుని కిరణములని యెంచబడునవి, చంద్రుని ప్రకాశమేయైనట్లు, విషయేంద్రియసంబంధమున కలుగు విషయసుఖములు ఆ చైతన్యముయొక్క ఆత్మానందమే.

మరిచస్యేవ యత్తైక్ష్ణ్యం శూన్యత్వమివ ఖస్య యత్
ఆత్మనో వేదనం యచ్చ తదేవాన్యదివ స్థితమ్. 24

మిరియమునందలి కారము, ఆకాశముయొక్క శూన్యత్వము-మిరియము, ఆకాశమునుండి వేఱుకాకున్నను వేఱుగ తోచునట్లు, ఈ విషయజ్ఞానములన్నియును ఆత్మకంటె వేఱుగాకున్నను వేఱుగ తోచుచున్నవి.

అత్రైవ నిశ్చయం బద్ధ్వా నియమః సుదృఢీకృతః
అనేనేత్థమనేనేత్థం భావ్యమిత్యవఖణ్డితమ్. 25

సంసారవిషయముల భోగించిన పిమ్మట పురుషార్థమే తుదకు చేకూరగలదని నిశ్చయించి, లౌకిక, పారలౌకిక కర్మలు నిర్దేశింపబడినవి.

స్వభావేతరనామాసౌ స్వసంకల్పమయాత్మకః
కశ్చిత్కదాచిద్భవతి స్వభావేనైవ నాన్యథా. 26

ఈ రెండింటిలో నొకటి ప్రవృత్తివలనను, మఱియొకటి శాస్త్రమువలనను గలుగుచున్నవి; ఒకటి మఱియొకదానిని ప్రయత్నదార్ఢ్యమువలన జయించి ఒకనియందు, ఒకప్పుడు కలుగుచున్నది.

ఆత్మనైవేదమఖిలం సంపన్నం ద్వైతమద్వయమ్
ఖణ్డో మధురసేనేవ మృదేవ చ మహాఘటః. 27

పానకమే పటికబెల్లముగను, మన్నే కుండగను మారునట్లు, ఆత్మయే ప్రవృత్తి లేక శాస్త్రము ననుసరించి, ఆయా ఫలములుగ మారుచున్నది.

సంనివేశవికారాదిదేశకాలాదిసంభవాత్
సంభవత్యత్ర నత్వీశే దేశకాలాద్యసంభవాత్. 28

కాని, ఈ ఆత్మ వృత్తిక లేక పానకమువలె పరివర్తనము నందుట లేదు. దేశకాలాది పరిచ్ఛిన్నములును, సంయోగము, వికారము మున్నగునవి ఉన్నచోటే పరివర్తన సంభవించుచున్నది. కనుక, ఇవి ఆత్మయందు లేకుండుటవలన పరివర్తనము అసంభవము.

ఇతః పుష్పమితః పత్రమహమిత్యాదితో యథా
ఖణ్డే స్వాత్మని నః సత్తారసోఽద్విత్వే ద్వితాం వహన్. 29
ఇతః పట ఇతః కుడ్యమహమిత్యాదిత స్తథా
సర్వాత్మనాత్మని బ్రహ్మ విద్ధి త్వం ద్విత్వమాహరత్. 30

వసంతకాలరసము వనప్రదేశమును ఒకచోట పుష్పముగను మఱియొకచోట పద్మముగను మారుచున్నది; రసమొక్కటియేయైనను ఈ ద్వైతభావమును బడయుచున్నది. అట్లే, ఈ ఆత్మ తన యందే 'ఇది ఘటము, ఇది పటము' అనబడు ద్వైతభావమును బొందుచున్నది. వాస్తవమునకు దాని సత్త అద్వితీయము.

అద్యాబ్ధ్యర్కరోఽహమద్యార్కరుగహం త్వద్య వారిదః
యథేతి తిష్ఠత్యమ్భోద స్తథాత్మా సదసద్వపుః. 31

మేఘము మొట్టమొదట సూర్యకిరణరూపముననుండి, తరువాత వర్షకాలమున మేఘమై వర్షజలముగ మారుచున్నది; మరల ఆ వర్షజలమే తరువాత గుజియు వానయును మేఘమునకును బీజ మగుచున్నది. అట్లే, సదసద్రూపమగు ఆత్మకూడ జడత్వముగ మారి, తరువాత వచ్చు సృష్టులకు బీజ మగుచున్నది.

ఇతి భావ్యమనేనేదమిత్థం సర్వేశ్వరే తతమ్
క్రమం ఖణ్డయితుం లోకే కస్య నామాస్తి శక్తతా. 32

'ఇది ఇట్లగును, అది అట్లగును, అది అవదు' అను భావనలన్నియును సర్వేశ్వరుడగు ఆత్మయందు విస్తరించుచున్నవి. ఈ క్రమమును ఖండింప శక్తి యెవరికున్నది?

ఆదర్శ స్వచ్ఛ ఆకాశే నైవ స్వః ప్రతిబిమ్బతి
వ్యతిరేకాసంభవతః కచతేవ్య హి కేవలమ్. 33

అద్దమువలె స్వచ్ఛమగు ఆకాశమున దాని స్వరూపముగాని, కార్యముగాని ప్రతిబింబింప జాలదు; అవి దానికంటె వేఱుకావు. కేవలమయ్యదియే ప్రకాశించుచున్నది.

బ్రహ్మణి త్వాత్మనాత్మైవ స్థితః కచతి బిమ్బతి
ద్వైతీభవత్యదేహోఽపి చిన్మయత్వాత్స్వభావతః. 34

కాని, స్వాభావికముగ చిన్మయస్వరూపమగు ఈ బ్రహ్మము ద్వైతభావము నందినప్పుడు వస్తువుల శక్తిగను, జీవుడుగను ప్రతిబింబించుచున్నది.

యద్యథైవాత్మకచనం వేత్తి తం భవతాత్మనా
అసత్యమపి తన్నేహ వ్యభిచారీ కదాచన. 35

హేమత్వకటకత్వే ద్వే సత్యాసత్యస్వరూపిణి
హేమ్ని భాణ్డగతే యద్వచ్చిత్త్వాచిత్త్వే తథాత్మని. 36

బంగారముతో చేయబడిన కుండ లేక ఆభరణముల వాస్తవమగు బంగారమే (ఆయారూపముల) వెలుగొందునట్లు, మనస్సున సత్యానృతములగు చైతన్యము, జడములు రెండును కలసియున్నవి; ఈ ఆత్మనెవరెట్లు గ్రహింతురో, అసత్యమైనను అట్లే యగుచున్నది. దానికి తిరుగులేదు.

సర్వగత్వాచ్చితేశ్చిత్తం నిత్యం మనసి విద్యతే
హేమత్వం కటకస్యేవ జడభావః స్థితోఽన్యదా. 37

చిత్తు సర్వవ్యాపకమగుటవలన దాని చైతన్యము మనస్సునగూడ నున్నది. బంగారము జడభావమునందిన అన్య ఆభరణములగూడ వెలయుచున్నదే!

చిత్త్వజాడ్యాత్మకం చిత్తం దృఢం భావయతి స్వయమ్
యథా యదైవ యద్భావం తథా భవతి తత్తథా. 38

చిత్తమునకును, శరీరమునకును కారణమగు ఈ చైతన్యము ఎప్పుడు, ఎటు, తన్నెటిరీగ భావించుకొనుచున్నదో, అప్పు డాయా దేవ, నర, స్థావరాది భావముల పొందుచున్నది.

కాలే కాలే చితా జీవస్త్వన్యోన్యో భవతి స్వయమ్
భావితాకారవానస్తర్వాసనాకలికోదయాత్. 39

ఈ చిత్తత్త్వము తనయందలి వాసనా - కలిక (మొగ్గ) యొక్క వికాసవైచిత్ర్యము ననుసరించి, నానావిధములగు ఆకారముల భావించినప్పుడు ఆయా రూపములను కాలక్రమమున బొందుచున్నది.

స్వప్నే దృష్టో యథా గ్రామో యాతి సత్తాన్యతేక్షణాత్
దేహాద్దేహం తథా యాతి దేహోఽయం ప్రతిభాత్మకః. 40

ఇది అంతయు స్వప్నమువలెనే ప్రతిభాసించుచున్నది. స్వప్నమున మొదట గాంచబడిన గ్రామము తరువాత గాంచబడ వనము మున్నగునవిగ మారునట్లు — వనాదిభావమును బొందునట్లు, జీవుడుకూడ ఒక శరీరమునుండి మఱియొక శరీరమును బొందుచున్నాడు.

ప్రతిభాసో యథా స్వప్నే నరః కుడ్యం పటో భవేత్
భవత్యసత్యమేవేదం దేహాన్తరమిదం స్వతః. 41

స్వప్నమున ప్రతిభాసించు మనుష్యుడు వెనువెంటనే గోడగను, బట్టగను మారునట్లు, (మరణమూర్ఛానంతరము) అసత్యమగు దేహాంతరప్రవేశముకూడ మరణమూర్ఛాసమయమున జరుగుచున్నది.

అసత్యమేవ మ్రియతే త్వసత్యం జాయతే పునః
జీవః స్వప్రతిభాసేన స్వప్నవత్స్వాన్యరూపవత్. 42

ఈ మరణించుట, జన్మించుటగూడ అసత్యములే; జీవుడు అవిద్యవలన ఈ ప్రతిభాసను గాంచుచున్నాడు.

కాలేనైతాదృశం రూపమిదం నాన్యత్త్వమేతి వై
ప్రకృతం నిశ్చయారూఢం భ్రమన్త్యేతే భవః స్వతః. 43

ఈ ప్రతిభాస బాల్య, యౌవన, వార్ధక్యములను బోలునదికాదు; ఇట ఒకే శరీరమునకు ఈ మార్పులు గలుగుచున్నవని గ్రహింప శక్యమగుచున్నది. మఱియు, ఈ మార్పులు కాలము ననుసరించి కలుగుచున్నవి. ఇక, శరీరాంతరగ్రహణమన్ననో, కేవలము వాసనలవలననే కలుగుచున్నది. ఈమార్పు కాలమువలనగూడ కలుగుటలేదు.

వస్తు దృష్టమదృష్టం చ స్వప్నే సమనుభూయతే
జీవస్వప్నే జగద్రూపం విద్ధి వేద్యవిదాంవర. 44

జ్ఞానిశ్రేష్ఠా! స్వప్నమున చూడబడినవియు, చూడబడనివియునగు వస్తువులుగూడ అనుభవింపబడుచున్నవి. జగత్తు జీవుని స్వప్నము ఇటగూడ అనంతకాలమున అనుభవింపబడిన వాసనలలో నెయ్యది మరణసమయమున గోచరమగునో, అయ్యదియే భావిశరీరమునకు గారణమగుచున్నది.

అజాగ్రద్దృష్టిదృష్టో యః స్వాభిధానాదినేరితః
న స్వాప్నో విద్యతే తస్మాదచ్ఛాత్మా చితిమాత్రకమ్. 45

మహావాక్యమువలన కలుగు బ్రహ్మసాక్షాత్కారము, బ్రహ్మభావములు వాసనామయములగు స్వప్నములుకావు. ఏలయన, ఈ చిద్‌-బ్రహ్మము శివము, అద్వైతము, చతుర్థము మున్నగు స్వాభిధానవాక్యములవలన ప్రబోధింపబడుచున్నది. ఆయన అజాగ్రద్దృష్టి అనగా తురీయదృష్టివలన గాంచబడుచున్నాడు. జాగత్స్వప్నసుషుప్తులాయనకు లేవు; జాగ్రదవస్థయందాయన అనుభవగమ్యుడు కాడు. కనుక, ఆయన వాసనారహితుడగుటవలన, వాసనామయస్వరూపుడు కాజాలడు. ఆయన నిర్మలమును నిరంజనమును నగు చైతన్యము.

అద్యాపూర్వాభిధం స్వప్నే యథా పశ్యతి నాన్యథా
అగ్రదృష్టం తథైవార్థం చేతనం చిత్ప్రపశ్యతి. 46

ఈ చిదాత్మయే జీవుడై తన చిత్స్వభావమువలననే నేడు స్వప్నమున అపూర్వములగు నూతనవస్తువులను, పూర్వదృష్టములగు వస్తువులనుగూడ గాంచుచున్నాడు.

ప్రాక్తనీ వాసనాద్యాపి పౌరుషేణావజీయతే
హ్యః కుకర్మాద్య యత్నేన ప్రయాతి హి సుకర్మతామ్. 47

అదృష్టవిషయములనుగూడ నిరంతము భావించుటవలన, పూర్వదృష్టవిషయ-వాసనలుగూడ విలుప్తమై, అవియే పరికాశించును. పురుషప్రయత్నము వాసనలనుగూడ జయింపకలుగుచున్నది. నిన్న యొనర్పబడిన కార్యము నేడాచరింపబడు సుకర్మయొక్క పరిభావమున సుకర్మగ మారుచున్నది.

మోక్షాదృతే న శామ్యన్తి జీవతాం చక్షురాదయః
ఉన్మజ్జన్తి నిమజ్జన్తి కేవలం దేశకాలతః. 48

వాసనాపరిణామములగు జీవుని శరీరము మున్నగునవి మోక్షమువలనగాక అన్యోపాయమున ఉపశమింపవు. మోక్షము లభించునంతవఱకు చక్షురాది ఇంద్రియములు దేశకాలముల ననుసరించి వికసించుచు విలీనమగుచున్నవి.

చిత్తః స్వకలనాత్తస్య దేహోఽగ్ర ఇవ తిష్ఠతి
పశ్చాత్తాత్మభావితో సత్యో మహాయక్షః శిశోరివ. 49

మోక్షపర్యంతము శరీరముగ కల్పింపబడిన వాసన యుండును. బాలునికడ భూతము వెలయుచుండునట్లు, ఈ వాసనయే పంచభూతకల్పితమగు శరీరమును దోపింపజేయుచున్నది.

మనోబుద్ధిరహఙ్కార స్తథా తన్మాత్రపఞ్చకమ్
ఇతి పుర్యష్టకం ప్రోక్తం దేహోఽసావాతివాహికః. 50

మనస్సు, బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు అనువాటితో గూడిన ఆతివాహిక (సూక్ష్మ) దేహమే పుర్యష్టక మనంబడుచున్నది.

అమూర్త ఏవ చిత్తాత్మా ఖత్వమస్యాతిపీనతా
వాతతాస్య మహాగుల్మో దేహతాస్య సుమేరుతా. 51

ఈ చిదాత్మయొక్క లింగశరీరము అమూర్తము; అపంచీకృతము. స్థూలమగు ఆకాశమే పంచీకృతము. దీనియొక్క వాయుత్వము మహావృక్షము. దీని శరీరము సుమేరువు. అనగా ఇయ్యవి ఈ లింగశరీరమున లేవు.

విరజస్త్వక్రమేణైవ నిరవస్థస్తు ముక్తి భాక్
సుషుప్తత్రైకావస్థాస్య జడాః క్రోడీకృతా యయా. 52

ఈ స్థూలత్వము వాస్తవమయిన ముక్తియే సంభవింపదు. వైరాగ్యాదుల నభ్యసించుటవలన కల్పన లన్నియు తొలగిపోయి, వీటికి మూలముననున్న వస్తువు గోచరించును. అప్పుడు జడకల్పనల నన్నిటిని తనలో విలీనమొనర్చుకొను సుషుప్తినిబోలు ముక్తి లభించును.

స్వప్ననామ్నా తథావస్థా దేహప్రత్యయశాలినీ
ఆమోక్షం భ్రమతీహాయమితి స్థావరజంగమైః. 53

స్వప్నమునుబోలు సూక్ష్మశరీరమే మోక్షము లభించునంతవఱకు స్థావరజంగమాది యోనుల యందు పరిభ్రమించుచున్నది.

కదాచిద్ధి సుషుప్తస్థః కదాచిత్స్వప్నవత్తి నతః
ఆతివాహికదేహోఽయం సర్వస్యైవావతిష్ఠతే. 54

ఈ ఆతివాహికదేహమే ఒకప్పుడు స్వప్నమును మఱియొకప్పుడు సుషుప్తిని బొందుచు, వెలయుచున్నది. ఈ విషయ మందఱికిని అనుభవనీయమే.

యదా సుషుప్తభావస్థో భావిమః స్వప్నవేదితః
తదా కాలానలసమ స్తిష్ఠత్యనుదితాకృతిః. 55

సుషుప్తియందు భవిష్యత్తున కలుగబోవు దుఃస్వప్నమును తనలో విలీన మొనర్చుకొని, చిత్స్వరూపుడగుటవలన ప్రళయాగ్నివలె బీజభావమున దీపిల్లుచుండును.

స్థావరాద్యాస్వవస్థాసు కల్పవృక్ష దశాసు చ
భవత్యేవ సుషుప్తస్థో ఘనమోహశిలాఘనః. 56

స్థావరాది యోనులయందు ఈ సుషుప్తి అత్యంత ఘనమై యున్నది; కల్పవృక్షాది యోనులు ఒకించుక పుణ్యమువలన కలిగినను, మనుష్యులకుండు ప్రబోధమువాటికి లేదు.

సుషుప్తతాస్య జడతా స్వప్నో స్థైయం హి సంసృతిః
యః ప్రబోధోఽస్య సా ముక్తిస్సజ్జాగ్రద్యాతుతు తుర్యతా. 57

చిత్తముయొక్క జాడ్యప్రకర్షయే సుషుప్తియనియు, చిత్తభ్రమణమే సంసృతియనియు, తత్త్వబోధయే బంధముక్తియనియు, తురీయావస్థయే జాగ్రదవస్థయనియు (సుషుప్తిదృష్టిననుసరించి) చెప్పబడుచున్నవి.

జీవప్రబోధాన్ముక్తిర్హి ప్రబోధాత్పరమాత్మతామ్
సోఽభ్యేతి క్షాలితమలం తామ్రం కనకతామివ. 58

జీవుని ప్రబోధమే ముక్తియనంబడుచున్నది. ఈ ప్రబోధమువలన జీవుడు నిర్మలుడై, విశుద్ధమొనర్పబడిన రాగి బంగారమగునట్లు, పరమాత్మయగుచున్నాడు.

జీవప్రబోధాన్ముక్తిర్యా సా చేహ ద్వివిధోచ్యతే
ఏకా జీవన్ముక్తతేతి ద్వితీయా దేహముక్తతా. 59

జీవుని ప్రబోధమగు ముక్తి రెండువిధములుగ చెప్పబడుచున్నది. ఒకటి జీవన్ముక్తి. రెండవది విదేహముక్తి.

జీవన్ముక్తిర్హి తుర్యత్వం తుర్యాతీతం పదం తతః
బోధో జీవః ప్రబోధోఽయం సచ బుద్ధిప్రయత్నతః. 60

తురీయావస్థయే జీవన్ముక్తి. దీనినుండి తురీయాతీతపదము లభించుచున్నది. దీనినే బోధ యందురు. తరువాత జీవుడు ఉత్కృష్టమగు చిన్మాత్రబ్రహ్మస్వరూపమును బొందుచున్నాడు ఈ బోధ బుద్ధియొక్క ప్రయత్నమువలననే (పురుషకారము వలననే) లభించును.

జ్ఞాతప్రమాణో జీవో న్తర్యో జానాతీహ తన్మయః
పశ్యతీమం భయం చైవ సుదీర్ఘస్వప్నవిభ్రమమ్. 61
మిథ్యోదితః స్వహృదయే స్వస్థపవ శిలీకృతే
జీవానామన్తరే త్వన్యన్న కించిచ్చిత్కలాం వినా. 62

అప్పుడీ శరీరముననే తత్త్వజ్ఞానమువలన పరమాత్మను గుఱించిన ప్రమాణములనన్నిటిని అంతరమున గ్రహించి తన్మయుడగును. అజ్ఞాతుడగు జీవుడుగూడ వాస్తవమునకు స్వస్వరూపమున వెలయుచున్నను, శాతివలె హృదయమున గట్టిగ పేర్కొనిన భయము గూడ ఇంతవఱకు కనంబడు చున్నను, దానిని దీర్ఘమగు స్వప్నవిభ్రమేమయని గ్రహించును, ఏలయన. జీవుని యంతరమున చిత్కళ గాక వేఱొండులేదు.

తామేవాన్యతయా పశ్యన్మృథైవ పరిశోచతి
జీవాణోరన్తరే త్వన్యన్న కించిత్పరమాదృతే. 63

దానినే అన్యభావముగ గాంచి జీవుడు వ్యర్థముగ శోకించుచున్నాడు. జీవునియందు ఆ పరమాత్మగాక వేఱొండేమియును లేదు.

యత్ర యత్ర జగద్దృష్టమహో మాయావిజృమ్భితమ్
స్థాల్యన్తః క్వథదమ్బూనాం యథా నానా భ్రమోదయః 64
జీవాణూనాం తథైవాన్తర్మిథ్యాసంసరణోదయః
బన్ధోఽస్య వాసనాబన్ధో మోక్షస్స్యాద్వాసనాలయః. 65

ఇటనట కనంబడు జగత్తు మాయావిజృంభితమే. మూకుడులో మరుగుచున్న నీరు వేర్వేరు రూపముల దాల్చుచు భ్రమగల్పించునట్లు, జీవులయందుగూడ అలీకమగు ఈ సంసారభ్రమ తోచుచున్నది. జీవునకు వాసనాబంధనమే బంధనము, వాసనాలయమే ముక్తి.

వాసనాన్తోఽస్య సౌషుప్తీ స్వప్నే విస్ఫురతి స్థితిః
ఘనవాసనమోహాత్మాఽయం జీవః స్థావరతాదిభాక్. 66

జీవునియొక్క సుషుప్తియే వాసనలయొక్క పరమావధి. తురీయ, తురీయాతీతములు వాసనారహితములు. ఈ వాసనలు స్వప్నమున విచిత్రభావముల స్ఫురించుచున్నవి; అప్పుడే జీవుడు స్థావరాది భావములను పరిగ్రహించుచున్నాడు.

మధ్యస్థవాసనస్తిర్యక్ పురుషస్తనువాసనః
యదాన్తర్జీవితేనాన్తో బహిర్జాతా ఘటాదయః. 67

జీవుని వాసనలు మధ్యరకమున నున్న, తిర్యక్-యోనులు బొందుచున్నాడు. వాసనలు కొంచముగనున్న, మనుష్యగంధర్వాది రూపముల బొందును. సుషుప్తితొలగి, ఆపాదమస్తకము ప్రాణాహంకారములు వ్యాపించియున్న, నేను ఇట్టి శరీరముతోగూడుకొని, యున్నాడను అని తలచును, అప్పుడే, ఘటాదికములగు వస్తువులు బాహ్యవస్తువులని తోచును.

జీవైక్యాదుభయోః సత్తా గ్రాహ్యగ్రాహకయోస్తదా
ఆత్మానాత్మసమాలీఢో బహిరన్తర్యదా చితా. 68
తదా గ్రాహ్యగ్రహణధీర్మృగతృష్ణేవ సోదయా.
నేహ సంత్యజ్యతే కించిన్నేహ కించిన్న గృహ్యతే. 69

అప్పుడు చక్షురాది ద్వారముల నిర్గతమైన అంతఃకరణమునుండి వృత్త్యవిచ్ఛిన్నుడైన జీవుని వలన ఘటాదులు వ్యాప్తమై, నేను ఘటమును ఎఱుంగుచున్నాడను అను గ్రాహ్యగ్రాహకరూపమగు వాసనయొక్క సత్త విచిత్రముగ స్ఫురించుచున్నది ఇట్లు అంతఃస్థితమగు ఆత్మచైతన్యమే బాహ్యములగు అనాత్మవస్తువులతోగూడ గ్రాహ్యగ్రాహక-వాసనారూపమున, మృగతృష్ణవలె ప్రకాశించుచున్నది. కనుక, గ్రాహ్యగ్రాహకాది సంబంధములన్నియును వాసనాధ్యస్తములగు భ్రమలే; వాస్తవములుకావు, ఇట, ఆత్మ గ్రహించున దేదియునులేదు, లేక త్యజించున దేదియునులేదు.

బాహ్యాన్తరకలాకారశ్చిదాత్మైకః ప్రకాశతే
త్రిజగచ్చిచ్చమత్కారస్త్వలం భేదవికల్పనైః
శోభితాః స్మశ్చితి చిరాత్సబాహ్యద్వయం న విద్యతే. 70

ఈ చిదాత్మయొక్కటియే బాహ్యాభ్యంతరములగు కళలవలె ప్రకాశించుచున్నది. కనుక, త్రిజగత్తులను చిత్-చమత్కృతియనియే గ్రహింపుము. భేదకల్పనల వలన ప్రయోజనములేదు. (తత్త్వదృష్టి ననుసరించి,) మనమందఱము ఆ చిత్స్వరూపముననే విరాజిల్లుచున్నాము. కాలత్రయముల, చిద్వ్యతిరిక్తమగు బాహ్యాభ్యంతర-జగత్తులేదు.

అబ్ధిర్యథా జలమపాస్తసమస్తభేదః
ఖాదచ్ఛమేవ సకలం ద్రవమేకశుద్ధమ్
సర్వం తథేదమపహాస్తిత భేదజాత
మాద్యం పరం పదమనామయమేవ బుద్ధమ్. 71

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ఇన్ద్రియార్థోపలమ్భవిచారో నామైకపఞ్చాశః సర్గః ॥ 51 ॥

నిజమున కాలోచించినయెడల సముద్రమున తరంగబుద్బుదాదు లెవ్వియును లేవు, ఆకాశముకంటెను నిర్మలమగు నీరు ఒక్కటియే యున్నట్లు తెలియగలము. అట్లే జగత్తును గురించి ఆలోచించిన ఇందు వాసనలు, అవస్థలు మున్నగు భేదము లెవ్వియును లేవు, అనామయమును, ఆద్యమును, నగు పరమపదమేయని గ్రహింపగలము.

ఇది శ్రీవాసిష్ఠ-తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఇంద్రియార్థోపలంభవిచారమను ఏబదియొకటవ సర్గము ॥ 51 ॥

## ద్విపఞ్చాశః సర్గః

శ్రీవసిష్ఠఉవాచ:—

[జీవస్వప్నో జగత్తత్రాసంసక్త్యా తత్పరిక్షయః
తదర్థమర్జునాఖ్యానం వసిష్ఠేనావతార్యతే.

ఈ సర్గమున జీవుని స్వప్నమగు జగత్తు అనాసక్తివలన నశించునని చెప్పబడుచున్నది. ఈ విషయమును వివరింప అర్జునోపాఖ్యానము ఆరంభింపబడుచున్నది.]

యో జీవస్యాదితః స్వప్నో నానాకలనకోమలః
తమిమం విద్ధి సంసారం న సత్యం నాప్యసన్మయమ్. 1

శ్రీ వసిష్ఠుడు:—ప్రతిజీవుని స్వప్నప్రపంచము వేర్వేఱుగను, జాగ్రత్ప్రపంచము ఒకేవిధముగను ఉన్నది. అందఱికిని ఒకేవిధముగ కనంబడు జాగ్రదవస్థ స్వప్నమెట్లగును అని తలపకుము. ప్రథమజీవుడును, సర్వజీవసమష్టియునునగు హిరణ్యగర్భుని స్వప్నమే మన జాగ్రదవస్థ-ఇదియే కల్పితసంసారము. ఇది సత్యముగాదు లేక అసత్యమునుగాదు.

నపుంస ఇవ జీవస్య స్వప్నః సంభవతి క్వచిత్
తేనైతే జాగ్రతో భావా జాగ్రత్స్వప్నకృతోఽత్ర హి 2

సమష్టిజీవుని స్వప్నము వ్యష్టిజీవుని స్వప్నమువంటిది కాదు. మన జాగ్రత్-భావములన్నియును, అతని జాగ్రత్స్వప్నములు, కనుక, వీటికిని స్వప్నపదార్థములకును భేదములేదు.

జీవస్వప్నమిమం దీర్ఘం క్షిప్రతాప్రతిభాసతః
అసత్యమప్యవస్తుత్వాద్విద్ధి వేద్యవిదాం వర. 3

జ్ఞానిశ్రేష్ఠా! అసత్యమును, అవస్తువును నగు ఈ సమిష్టిజీవుని స్వప్నము దీర్ఘమై వెలయుచున్నది; మన స్వప్నమువలె క్షణములో నశించుటలేదు. (అందువలన ఒకింత సత్యముగ తోచుట ఆశ్చర్యముకాదు.)

స్వప్నాత్స్వప్నాన్తరమివ గచ్ఛన్తో జీవజీవకాః
అసత్యమేవ పశ్యన్తి ఘనసత్యతయానఘ. 4

అనఘా! ఒక స్వప్నమునుగాంచి మఱియొక స్వప్నమును గాంచునట్లు, హిరణ్యగర్భుని కల్పనవలన జీవించి ఈ జీవులందఱును, జాగ్రత్త అనంబడు అసత్యమునే కాంచుచున్నారు. హిరణ్యగర్భుని కల్పనామహిమ ఇట్టిది.

అజడో జడతా తాత జడే చాజడతోదితా
అసత్యే సత్యతా జీవజీవానుభవమోహతః. 5

వత్సా! అజడమగు (చైతన్యమగు) బ్రహ్మవస్తువును, సమిష్టిజీవుని అంశమగు వ్యష్టిజీవుని మోహమునకు వశమై జడముగ గాంచబడుచున్నది.

భానోరప్యన్తరఖిలం పశ్యన్త్రిజగద్భ్రమమ్
భ్రమన్తి స్వప్నసంభ్రాన్తా ఇవ జీవా భిదాలిభిః. 6

స్వయంజ్యోతియగు ఆత్మయొక్క ప్రకాశమువలన జీవులు స్వప్నమున భ్రమించునట్లే, సూర్యునివలన ప్రకాశింపబడు త్రిజగత్తులనున్న జీవులు పరస్పరము భేదకల్పనల నొనర్చుకొనుచు భ్రమించుచున్నారు.

సర్వగత్వాదనన్తత్వాత్సర్వస్య జీవస్య జీవతః
యద్భావయన్తి చేతన్తి తదేవాశ్వితి సత్యవత్. 7

ఈ భ్రమకు మూలకారణుడగు సమిష్టిజీవుడు సర్వవ్యాపియును, అనంతుడును నగుటవలన, వ్యష్టిజీవులేయే కల్పనల నొనర్చుచున్నారో అయ్యవి సత్యములుగనే తోచుచున్నవి.

పుణ్డరీకాక్షనిర్దిష్టామసంసక్తగతిం శుభామ్
యామాలిఙ్గ్య మహాబాహో జీవన్ముక్తో మహామునిః. 8
పాణ్డోః పుత్రోఽర్జునో నామ సుఖం జీవితమాత్మనః
క్షపయిష్యతి నిర్దుఃఖం తథా క్షేపయ జీవితమ్ 9

మహాబాహూ! పుండరీకాక్షుడు నిర్దేశించునదియును, శుభకరమును, పాండుపుత్రుడగు అర్జునుడను మహర్షి సమాశ్రయించి దుఃఖరహితుడై సుఖముగ జీవితమును గడపునదియును, అనాసక్తియోగమునగు అర్జునోపాఖ్యానమును వినుము.

శ్రీరామ ఉవాచ:—

భవిష్యతి కదా బ్రహ్మన్సోఽర్జునః పాణ్డునన్దనః
కీదృశీం చ హరిస్తస్య కథయిష్యత్యసక్తతామ్. 10

శ్రీరాముడు: బ్రహ్మజ్ఞా! పాండునందనుడగు అర్జునుడు ఎప్పుడు అవతరించును? వారి ఆయనకు అసంగమును గుఱించి ఎట్లు ఉపదేశించును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అస్తి సన్మాత్రమాత్మేతి పరికల్పితనామకమ్
స్థితమాత్మన్యనాద్యన్తే నభసీవ మహానభః. 11

శ్రీవసిష్ఠుడు:-ఆకాశము నాశ్రయించుకొని ఆకాశము వెలయునట్లు, కేవలము ఆత్మనాశ్రయించుకొనియే సన్మాత్రము, అస్తిమాత్రము అని పరికల్పింపబడు ఆద్యంతవిహీనమగు ఆత్మవస్తువు వెలయుచున్నది.

దృశ్యతే విమలే తస్మిన్నయం సంసారవిభ్రమః
కటకాది యథా హేమ్ని తరఙ్గాది యథామ్భసి. 12

బంగారమున కటక, కేయూరాది ఆభరణములును, నీటియందు తరంగములును గాంచబడునట్లు విమలము అనగా నిర్వికారమగు ఆత్మయందు ఈ సంసారవిభ్రమము గాంచబడుచున్నది.

చతుర్దశవిధా భూతజాతయః ప్రస్ఫురన్త్యలమ్
తస్మిన్సంసారజాలేఽస్మిఞ్జాలే శకునయో యథా. 13

వలలో పక్షులు చిక్కుకొనునట్లు, ఈ భ్రమజాలమున చతుర్దశవిధములగు భూతసమూహములు చిక్కువడుచున్నవి.

తత్రైతే యమచన్ద్రార్కశక్రాద్యాః శంసితక్రమాః
భూతపఞ్చకసంసారలోకపాలత్వమాగతాః. 14

అటు, భూతపంచకములతో గూడుకొనిన సంసారమునకును, లోకములకును, శ్రుతిస్మృతులయందు ప్రశంసింపబడిన లోకపాలకులగు యమ, చంద్ర, సూర్య, ఇంద్రాదులు నాయకత్వమును వహించుచున్నారు.

ఇదం పుణ్యముపాదేయం హేయం పాపమిదం త్వితి
తైః స్వసంకల్పఘటితాద్వేదనాత్స్థాపితా స్థితిః. 15

ఇది పుణ్యము, గ్రహణీయము-ఇది పాపము, త్యాజ్యము అను స్వసంకల్పమువలననే కలుగు జ్ఞానమువలన, వారు స్వాధికారరూపమగు మర్యాదను స్థాపించుచున్నారు.

తస్యాద్య యావదనఘ ప్రవాహపతితే నిజే
కర్మణ్యచలసంకాశస్థిరం చిత్తమవస్థితమ్. 16

అనఘా! అప్పటినుండి ఇంతవఱకు యముడు స్వకర్మప్రవాహమునబడియు కొండవలె స్థిరమగు చిత్తముతోడనే యుండెను.

భగవాన్స యమః కించిద్గతే ప్రతిచతుర్యుగే
తపః ప్రకురుతే భూతదలనాత్పాపశఙ్కయా. 17

భగవంతుడగు యముడు ప్రతి ద్వాపరయుగాంతమున ప్రాణులను హింసించుటవలన కల్గు పాపమునకు భయపడి తప మొనర్చుచుండును.

కదాచిదష్టౌ వర్షాణి దశ ద్వాదశ వాపి చ
కదాచిత్పఞ్చసప్తాది కదాచిత్షోడశాపి చ. 18

ఒకప్పుడు ఎనిమిదేండ్లును, మఱొకప్పుడు పది లేక పదిరెండేండ్లును, మఱొకప్పుడు ఐదు లేక ఏడేండ్లును, మఱొకప్పుడు పదునాఱు ఏండ్లును తపమాచరించును. ఇట్లు తపోనియతుడై యముడు ఔదాస్యమును వహింప, మృత్యు నీ జగత్తు నందలి ఏ ప్రాణిని హింసింపదు.

ఉదాసీనవదాశీనే తస్మిన్నియమసంస్థితే
న హినస్తి జగజ్జాలే మృత్యుర్భూతాని కానిచిత్. 19

ఇట్లు తపోనియతుడై యముడు ఔదాస్యమును వహింప, మృత్యువీ జగత్తునందలి ఏ ప్రాణిని హింసింపదు.

తేన నీరన్ధ్రభూతౌఘ నిఃసంచారం మహీతలమ్
భవతి ప్రావృషి స్వేదీ కుఞ్జరో మశకైరివ. 20

అందువలన, భూమండలము, వర్షకాలమున స్వేదయుక్తమగు మదగజమును మశకము లాశ్రయించునట్లు, బహువిధములగు జీవులతో నిండియుండును,

అథ తాని విచిత్రాణి భూతాని బహుయుక్తిభిః
క్షిపయన్తి సురా రామ భువో భారనివృత్తయే. 21

రామా! అనంతరము దేవతలీ విచిత్ర జీవులను భూభారమును తగ్గింప నానావిధోపాయముల సంహారమొనర్తురు.

ఏవం యుగసహస్రాణి వ్యవహారశతాని చ
సమతీతాన్యనన్తాని భూతాని చ జగన్తి చ. 22

ఈరీతిగ భూభారమును తగ్గించుట కొన్నివేల మార్లు జరిగినది; అనంతములగు జగత్తులు, భూతములు సంహరింపబడినవి.

వైవస్వతోఽద్య తు యమో య ఏష పితృనాయకః
అనేన త్వధునా సాధో పరిక్షీణేషు కేషుచిత్. 23

యుగేష్వఘవిఘాతాయ వర్షాణి ద్వాదశాత్మనా
వ్రతచర్యేహ కర్తవ్యా దూరాస్త జనకర్షణా. 24

ఇప్పుడున్న పితృనాయకుడగు యముడు సూర్యపుత్రుడు. సాధూ! ఇప్పుడు కొన్నియుగములు గడవ, ప్రాణిహింసవలన గలిగిన పాపమును బోగొట్టుకొన, ప్రాణిపీడనమునువదలి ద్వాదశ వర్షకాలమాతడు తప మాచరించును.

తేనేయముర్వీ నీరన్ధ్రా భూతైర్మర్త్యైరమృత్యుభిః
దీనా ప్రపన్నా గుల్మైవ భారభూతైర్భవిష్యతి. 25

అందువలన ఈ లోకము భూమృత్యురహితులగు మానవులతోడను, వనగుల్మములతోడను నిండి, భారవంత మగుగలదు.

భూభారపరిభూతాఙ్గీ హరిం శరణమేష్యతి
కాన్తా దస్యునరాభూతా దీనా పతిమివ ప్రియా. 26

దస్యు పరాభూతమును, దీనయైనగు రమణి పతి నాశ్రయించునట్లు, భారమును సహింప జాలక పృథివి శ్రీహరిని శరణుబొందును.

హరిర్దేహద్వయేనాథ మహీమవతరిష్యతి
దేవాంశైరఖిలైః సార్థం నరనారాయణం గతైః. 27

అప్పుడు శ్రీహరి దేవాంశనునంతటిని బరిగ్రహించి, నరనారాయణులను రెండు రూపములతో భూమిపై అవతరించును.

వసుదేవసుతస్త్వేకో వాసుదేవ ఇతి శ్రుతః
దేహో భవిష్యతి హరేర్ద్వితీయః పాణ్డవోఽర్జునః. 28

అందొక రూపము దేవసుతుడగు వాసుదేవుడనియు, మఱి రెండవది పాండు పుత్రుడగు అర్జునుడనియు, ప్రసిద్ధికెక్కును.

యుధిష్ఠిర ఇతి ఖ్యాతో ధర్మపుత్రో భవిష్యతి
అమ్భోధిమేఖలాభూపః పాణ్డోః పుత్రం స ధర్మవిత్. 29

ధర్మనందనుడు యుధిష్ఠిరుడను నామమున పాండుని జ్యేష్ఠపుత్రుడగును; సముద్రమేఖల యగు భూమికంతటకిని రాజై, ధర్మవేత్తయగును.

దుర్యోధన ఇతి ఖ్యాతస్తస్య భ్రాతా పితృవ్యజః
భవిష్యతి దృఢద్వన్ద్వో భీమో బభ్రురహేరివ. 30

దుర్యోధనుడను నాతడు ఆయన పితృవ్యపుత్రుడగును. అతనికిని భీమునకును సర్పనకుల ములవలె విరోధము కలుగును.

అన్యోన్యం హరతోరుర్వీం తయోః సంగ్రామలోలయోః
అష్టాదశాత్ర తాక్షౌహిణ్యో ఘటిష్యన్త్యత్ర భీషణాః. 31

వారు పరస్పరము ఓడించుకొని, భూమండలమును బొంద, పదునెనిమిది అక్షౌహిణుల సైన్యమును సమకూర్తురు.

తత్క్షయేణ విభారత్వం భువో విష్ణుః కరిష్యతి
రాఘవాఽర్జునదేహేన బృహద్గాణ్డీవధన్వనా. 32

రాఘవా! విష్ణువే స్వయముగ, గాండీవధారియగు అర్జునరూపముతో, ఆ సైన్యమును సంహరించి, భూభారమును తగ్గించును.

విష్ణోరర్జుననామాదా ప్రాకృతం భావమాస్థితః
హర్షామర్షాన్వితో దేహో నరధర్మా భవిష్యతి. 33

అనంతరము, విష్ణుని ఆ యర్జున శరీరము పాకృత భావమును బొంద, హర్షామర్షాన్వితమును, అజ్ఞానయుక్తమును అగును.

సేనాద్వయగతాన్దృష్ట్వా స్వజనాన్మరణోన్ముఖాన్
విషాదమేష్యత్యుద్యోగం యుద్ధాయ న కరిష్యతి. 34

ఇరువాగులయందున్న తన బంధుగులను గాంచి అర్జునుడు విషాదమును బొందును; యుద్ధప్రయత్నమును ఒనర్పడు,

తమర్జునాభిధం దేహం ప్రాప్తకార్యైకసిద్ధయే
హరిర్బుద్దేన దేహేన బోధయిష్యతి రాఘవ. 35

రాఘవా! అర్జుననామమును బొందిన ఆ శరీరమును, స్వతఃసిద్ధ ఆత్మబోధయుక్తమగు కృష్ణ దేహమున ఆ హరి ప్రబోధమొనర్చును.

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 36

ఈ ఆత్మకు జననమరణములు లేవు, దీనికి షడ్విధ భావవికారములు లేవు, ఇది జన్మించి యుండలేదు, ఇక ముందు జన్మను బొందదు, నిజము, నిత్యము, శాశ్వతము, పురాతనము, శరీరము వినష్ట మొనర్పబడినను దీనికి వినాశనములేదు.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే 37

ఈ ఆత్మను చంపుచున్నాను అనియు, హతమైనదనియు తలచు వారిర్వురును ఆత్మతత్త్వము నెఱుంగనివారు; ఇది ఎవ్వరిని చంపుటలేదు, ఎవ్వరిచేతను చంపబడదు.

అనన్తస్యైకరూపస్య సతః సూక్ష్మస్య ఖాదపి
ఆత్మనః పరమేశస్య కిం కథం కేన నశ్యతి. 38

అనంతమును, ఏకరూపమును, సత్స్వరూపమును, ఆకాశముకంటెను సూక్ష్మమును, పరమేశ్వరుడునగు ఈ ఆత్మను ఎవరు ఎట్లు నాశన మొనర్పగలడు?

అనన్తమవ్యక్తమనాదిమధ్య
మాత్మానమాలోకయ సంవిదాత్మన్
సంవిద్వపుః స్ఫారమలబ్ధదోష
మజోఽసి నిత్యోఽసి నిరామయోఽసి. 39

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అర్జునోపాఖ్యానే నరనారాయణావతారకథనంనామ ద్విపఞ్చాశః సర్గః ॥ 52 ॥

జ్ఞానమయా! నీవు ఆత్మ నిట్లు అనంతము, అవ్యక్తము ఆదిమధ్యాంతరహితము, అని గ్రహింపుము. నీవు చైతన్యస్వరూపమునుబొంది, అపరిచ్ఛిన్నుడవును, దోషరహితుడవును అయితివి. నీవు అజుడవు, నిత్యుడవు, నిరామయుడవు. అందువలన బంధుసంయోగ వియోగ జనితములగు సుఖదుఃఖములు నిన్ను స్పర్శింపజాలవు.)

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నరనారాయణావతారకథనమను ఏబదిరెండవ సర్గము ॥ 52 ॥

## త్రిపఞ్చాశః సర్గః.

[వర్ణ్యతేఽహంకృతేస్త్యాగః సఙ్గత్యాగాదిలక్షణమ్
ఉపాస్యజ్ఞేయరూపే చదశాభేదవ్యవస్థితే.

ఈ సర్గమున అహంకారత్యాగము, సంగత్యాగముయొక్క లక్షణము, ఉపాస్యజ్ఞేయరూపముల స్థితులు వర్ణింపబడుచున్నవి.]

శ్రీభగవానువాచ:—

అర్జున త్వం నహన్తా త్వమభిమానమలం త్యజ
జరామరణనిర్ముక్తః స్వయమాత్మాసి శాశ్వతః. 1

శ్రీభగవంతుడు:—అర్జునా ! నీవు హంతనను అభిమానమలమును బరిత్యజింపుము; శాశ్వతమును, జరామరణనిర్ముక్తమును అగు ఆత్మయే నీవు.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాంల్లోకాన్న హన్తి న నిబధ్యతే. 2

ఎవ్వని కహంకారములేదో, ఎవ్వని బుద్ధి లిప్తముగాకుండనుండునో, అతడే జగత్తుననున్న ప్రాణులను జంపియు జంపుచుండుటలేదు. అతని నెవ్వరును జంపజాలరు.

యైవ సంజాయతే సంవిదన్తః సైవానుభూయతే
అయం సోఽహమిదం తన్మ ఇత్యన్తః సంవిదం త్యజ. 3

అంతరమున ఎట్టి జ్ఞానము కలుగుచున్నదో, బయటకూడ అట్టి అనుభవమే తోచుచున్నది. అందువలన 'నేను ఇట్టి వాడను' అను అభిమానమును త్యజింపుము,

అనయైవ చ యుక్తోఽస్మి నష్టోఽస్మీతి చ భారత
అభితః సుఖదుఃఖాభ్యామవశః పరితప్యసే. 4

భారతా ! ఈతీరుగ హంతృత్వాది అభిమానముతోగూడి, వాటివలన కలుగు పాపాదులవలన వినష్టమగుచున్నాడనని తలచి, సుఖదుఃఖములకు వశీభూతుడవై పరితపించుచున్నాడవు.

స్వాత్మాంశైః క్రియమాణాని గుణైః కర్మాణి భాగశః
అహంకారవిమూఢాత్మా కర్తాహమితి మన్యతే. 5

ఆత్మను ఆవరించి, దానియొక్క అంశములనితోచు గుణములే కర్మల నాచరించుచున్నవి; కాని అంహకారవిమూఢుడగు మనుష్యుడు తన్ను కర్తయని భావించుకొనుచున్నాడు.

చక్షుః పశ్యతు కర్ణశ్చ శృణోతు త్వక్స్పృశత్వశదమ్
రసనా చ రసం యాతు కాత్ర కోఽహమితి స్థితిః. 6

కన్నులు జూచుగాక, చెవులు వినుగాక, త్వగింద్రియము స్పర్శించునుగాక, జిహ్వరుచి చూచుగాక-వీటితో నాకు సంపర్కమేమి?

కలనాకర్మణి రతే మనస్యపి మహాత్మనః
న కశ్చిదత్రాహమితి క్లేశభాగేక ఏవ తే. 7

మహాత్ముల అంతఃకరణమే కార్యముల నాచరించుచున్నది. ఆత్మకట్టి సంబంధమును వీటితోలేదు. అగుచో కష్టము బొందుదురని నీవు భావించువారితో ఆత్మకేమి సంబంధము?

బహుభిః సమవాయేన యత్కృతం తత్ర భారత
ఏకోఽభిమానదుఃఖేన హాస్యాయైవ హి గృహ్యతే. 8

భారత! పెక్కుమందితో కలసి యొనరించిన పనికి 'నేనొక్కడనే కర్తన'ని అభిమానమును బూనుట హాస్యాస్పదము,

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే. 9

ఆరురుక్షువులను యోగిపురుషులు మనోవాక్కాయములను త్రికరణములతోడను, ఇంద్రియములతోడను, చిత్తశుద్ధికొఱకు నిస్సంగభావమున కర్మ నాచరించుచున్నారు.

అహన్త్వవిమచూర్ణేన యేషాం కాయో న మారితః
కుర్వన్తోఽపి హరన్తోఽపి నచ తే నిర్విషూచికాః. 10

అహంకారవిమచూర్ణ మెవ్వరు శరీరమున అలముకొనియుండలేదో, ఎవ్వరు రాగద్వేషాదులను త్యజించియున్నారో, వారు లోకవ్యవహారముల నాచరించుచున్నను ఆచరింపనివారే యగుచున్నారు. భోగించుచున్నను భోగింపనివారే యగుచున్నారు.

న క్వచిద్రాజతే కాయో మమతామేధ్యదూషితః
ప్రాజ్ఞోఽప్యతిబహుజ్ఞోఽపి దుఃశీల ఇవ మానవః. 11

శీలరహితుడగువాతడు ప్రాజ్ఞుడైనను, పండితుడైనను శోభించనట్లు మమత్వమను అమేధ్యదూషితమగుచో ఈ శరీరము శోభింప జాలదు.

నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ
యః స కార్యమకార్యం వా కుర్వన్నపి న లిప్యతే. 12

మమత్వహీనుడును, అంహంకారవిహీనుడును, సుఖదుఃఖముల సమానముగ జూచువాడును, క్షమాశీలుడును నగువాడు కార్యాకార్యముల నాచరించుచున్నను, లిప్తుడవడు.

ఇదం చ తే పాణ్డుసుత స్వకర్మ క్షాత్రముత్తమమ్
అపి క్రూరమతి శ్రేయః సుఖాయైవోదయాయ చ. 13

పాండుసుతా! ఈ క్షాత్రకర్మయే నీపట్లు ఉత్తమము. క్రూరమేయైనను శ్రేయమునకును, సుఖోదయమునకును ఇది కారణమవగలదు.

అపి కుత్సితమప్యన్యదప్యధర్మమయక్రమమ్
క్షేమం తే స్వం యథా కర్మ తథేహామృతవాన్భవ. 14

కుత్సితమును, పూజార్హులగువారిని వధించుటతో గూడినదే యయ్యును స్వధర్మమగు ఈ యుద్ధము నాచరించి అమరణధర్మమగు విజయమును బొందుము; అమృతుడ వగుము.

మూర్ఖస్యాపి స్వకర్మైవ శ్రేయసే కిము సన్మతేః
మతిర్గలదహంకారా పతితాపి న లిప్యతే. 15

మూర్ఖునకుగూడ స్వకర్మయే శ్రేయోదాయక మగుచుండ, బుద్ధిమంతుని సంగతి వేఱుగ చెప్పవలయునా? అహంకార విహీనులైనచో, మహాపాత కాదుల బడియు లిప్తులవరు.

యోగస్థ కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ
నిఃసఙ్గస్త్వం యథాప్రాప్తకర్మవాన్న నిబధ్యతే. 16

ధనంజయా! నీవు బ్రహ్మపూర్ణమగు బుద్ధితో ఆసక్తిని త్యజించి కర్మల నాచరింపుము, ఇట్లు నిస్సంగివై యథాప్రాప్తములగు కర్మల నాచరించుచున్న బద్ధుడవు కాజాలవు.

శాన్త బ్రహ్మ వపుర్భూత్వా కర్మ బ్రహ్మమయం కురు
బ్రహ్మార్పణసమాచారో బ్రహ్మైవ భవతి క్షణాత్. 17

శాంతమగు బ్రహ్మతనువుతో బ్రహ్మమయములగు కర్మల నాచరింపుము. బ్రహ్మపూర్ణ మగు ఆచరణము గలవాడు క్షణములో బ్రహ్మమేయగును.

ఈశ్వరార్పితసర్వార్థ ఈశ్వరాత్మా నిరామయః
ఈశ్వరః సర్వభూతాత్మా భవ భూషితభూతలః. 18

లేక ఈశ్వరునకు సర్వకర్మలను సమర్పించి. ఈశ్వరాత్ముడవును నిరామయుడవును కమ్ము! ఈశ్వరుడే సర్వభూతముల వెలయుచున్నాడని గ్రహించుచో నీవు భూమండలమును అలంకరించు వాడవే యగుదువు.

సంన్యస్తసర్వసంకల్పః సమః శాన్తమనా మునః
సంన్యాసయోగయుక్తాత్మా కుర్వన్ముక్తమతిర్భని. 19

కావున్న, సంకల్పముల నన్నిటిని సంపూర్ణముగ త్యజించి, శాంతచిత్తుడవును, మననశీలుడవును, సమదర్శివియును కమ్ము. దీనివలనగూడ నీవు ముక్తినిబొందగలవు.

అర్జున ఉవాచ:—

సఙ్గత్యాగస్య భగవంస్తథా బ్రహ్మార్పణస్య చ
ఈశ్వరార్పణరూపస్య సంన్యాసస్య చ సర్వశః. 20
తథా జ్ఞానస్య యోగస్య విభాగః కీదృశః ప్రభో
క్రమేణ కథయైతన్మే మహామోహానివృత్తయే. 21

అర్జునుడు:—భగవంతుడా! సంగత్యాగము, బ్రహ్మార్పణము, ఈశ్వరార్పణము, సన్యాసము, జ్ఞానము, యోగముల విభాగమెట్టిది? ప్రభూ! నా యజ్ఞానమోహము తీరుటకు ఈ విషయములను వివరించిచెప్పుము.

శ్రీభగవానువాచ:—

సర్వసంకల్పసంశాన్తా ప్రశాన్తఘనవాసనమ్
న కించిద్భావనాకారం యత్తద్బ్రహ్మ పరం విదుః. 22

భగవంతుడు:—సంకల్పములన్నియును సంశాంతించిపోవ లభించు నిర్వికల్పకస్వరూపమే బ్రహ్మపదమని చెప్పబడుచున్నది.

తదుద్యోగం విదుర్జ్ఞానం యోగం చ కృతబుద్ధయః

బ్రహ్మ సర్వం జగదహం చేతి బ్రహ్మార్పణం విదుః. 23

కృతబుద్ధులగు జ్ఞానులు పైనచెప్పబడిన స్థితిని బొందజేయు యత్నమే జ్ఞానము, యోగము అని చెప్పబడుచున్నది. నేను, జగత్తు మున్నగువాటియందుండు అహంభావమును బ్రహ్మమున అర్పించుటయే — అధ్యాసను అధిష్ఠానమున పర్యవసింపజేయుటయే — బ్రహ్మార్పణమనంబడుచున్నది.

అన్తశ్శూన్యం బహిశ్శూన్యం పాషాణహృదయోపమమ్

శాన్తమాకాశకోశాచ్ఛం న దృశ్యం న దృశః పరమ్. 24

అంతశ్శూన్యమును, బహిశ్శూన్యమును, పాషాణమువలె చిద్ఘనమును, శాంతమును, ఆకాశకోశమువలె స్వచ్ఛమును, దృశ్యముగానిదియునునై ఆ పరమ దృక్ - వస్తువు వెలయుచున్నది.

తత ఏవద్యదుత్థానమివదన్యతయోదితమ్

న జగత్ప్రతిభాసోఽయమాకాశమివ శూన్యతా. 25

దానినుండియే ఈ జగత్తు ఉదయించి, దానినుండి వేఱైనట్లు తోచుచున్నది. కాని, ఈ ప్రతిభాసగంధర్వనగరమువలె అలీకమే.

భావోఽహమితి కోప్యేష ప్రత్యేకముదితశ్చితేః

కోటికోట్యంశకలితః క ఇవైనం ప్రతిగ్రహః. 26

బ్రహ్మమున జగత్తు ఆరోపింపబడినట్లే, కోట్యంశమునందలి కోట్యంశములగు జీవులను భ్రమగూడ ఏర్పడినది. ఈ భ్రమయందు చిక్కుకొనగూడదు.

అపృథగ్భూత ఏవైష పృథగ్భూత ఇవ స్థితః

పృథక్త్వం హి న పర్యన్తో నాహమిత్యవగచ్ఛతి. 27

పరిచ్ఛేదరహితమగు బ్రహ్మవస్తువే పరిచ్ఛేదయుక్తమైనట్లు చూపట్టుచున్నది. బ్రహ్మమున పరిచ్ఛిన్నత, మఱిల అపరిచ్ఛిన్నతయందు అహంభావమున్న యుక్తియుక్తములు గావు. ఉపపత్తిరహితమగు ఈ పృథక్త్వము హేయము.

యథేహాహం తథేహాస్తి ఘటాదీహాపి మర్కటః

స్వమిహైవ తథామ్భోధిః కిమహన్తాం ప్రతి గ్రహః. 28

ఈ అహంకార - మర్కటము బ్రహ్మమునుండి వేఱుగానట్లు, హస్తిఘటాదులుగూడ వేరు కావు. మమత్వము, సముద్రము మున్నగునవన్నియును బ్రహ్మముగాక వేఱొండుగావు. అగుచో వీటియందు అభినివేశమేల?

వికల్పభేదే స్ఫురితే సంవిత్సారమయాత్మని

వైచిత్ర్యేణ విచిత్రేపి కిమేకత్వేఽపి నోగ్రహః. 29

విచిత్రములగు వైచిత్ర్యములు (విభిన్నభావములు) జ్ఞానమయమగు ఆత్మయందు సంస్ఫురించుచున్నవి. అగుచో, దీనికంటె వేఱుగాని ఏకత్వమునందే అభినివేశమునేల యుంపరాదు?.

ఇతి జ్ఞాతవిభాగస్య బుద్ధౌ తస్య పరిక్షయః

కర్మణాం యః ఫలత్యాగస్తం సంన్యాసం విదుర్బుధాః. 30

ఈరీతిగ విమర్శించి సారాసారములను గ్రహించిన పురుషుని బుద్ధియందు అహంమమతా భావము ఉపశమించిపోవును. అప్పుడాతనికి కర్మల ఫలత్యాగము సిద్ధించును. దీనికే సన్న్యాస మందురు.

త్యాగః సంకల్పజాలానామసంసక్తః స కథ్యతే
సమ స్తకలనాజాలస్యేశ్వరత్వైకభావనా. 31

గలితద్వైతనిర్భాసమేతదేవేశ్వరార్పణమ్
అబోధవశతో భేదో నాస్మిన్నైషాం చిదాత్మని 32

దీనివలన సంకల్ప – త్యాగమను అసంగస్థితి చేకూరును. కల్పనల నన్నిటిని ఈశ్వరుని యందు ఏకీభూతమొనర్చి, ద్వైతబుద్ధిని విలీనమొనర్చుటయే ఈశ్వరార్పణ మనంబడుచున్నది. అజ్ఞానమువలననే ఈ భేదములు చిదాత్మయందు కల్పింపబడుచున్నవి.

బోధాత్మా కిల శబ్దార్థో జగదేకం న సంశయః
అహమాశా జగదహం స్వమహం కర్మచాప్యహమ్. 33

కాలోఽహమహమద్వైతం ద్వైతం చాహమహం జగత్
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః. 34

జ్ఞానికి బ్రహ్మము, జగత్తుయు నొక్కటే. దిక్కులు, జగత్తు, కర్మ, తదాశ్రయము, కాలము, అద్వైతము, తద్భ్రాంతియగు జగత్తు మున్నగునవన్నియును నేనే. నాయందు మనస్సునుంచుము; నాభక్తుడవు కమ్ము, నన్ను యజింపుము, నమస్కరింపుము; ఇట్లు నాయందు చిత్తమును నిల్పి, నాభావముతో గూడిన, నన్నే పొందెదవు.

అర్జున ఉవాచ:—

ద్వే రూపే తవ దేవేశ పరం చాపరమేవ చ
కీదృశం తత్కదా రూపం తిష్ఠామ్యాశ్రిత్య సిద్ధయే. 35

అర్జునుడు:— దేవేశా! నీకు పరము, అపరములను రెండు రూపములున్నవి కదా. అవి ఎట్టివి? వీనిలో నెద్దాని నాశ్రయింప సిద్ధిని బొందగలను.

శ్రీభగవానువాచ:—

సామాన్యం పరమం చైవ ద్వే రూపే విద్ధి మేఽనఘ
పాణ్యాదియుక్తం సామాన్యం శఙ్ఖచక్రగదాధరమ్. 36

శ్రీభగవంతుడు: అనఘా! నాకు సామాన్యము, పరము అను రెండురూపము లున్నవని గ్రహింపుము. అందు హస్తపాదాది అవయవములతోడను, శంఖచక్రగదాది ఆయుధములతోడను గూడినది సామాన్యరూపము.

పరం రూపమనాద్యన్తం యన్మమైకమనామయమ్
బ్రహ్మాత్మపరమాత్మాదిశబ్దైనైతదుదీర్యతే. 37

పరరూపము ఆద్యంతవిహీనము, అనామయము; అయ్యది బ్రహ్మ ఆత్మ, పరమాత్మ మున్నగు శబ్దముల పేర్కొనంబడు చున్నది.

యావదప్రతిబుద్ధ స్త్వమనాత్మజ్ఞతయా స్థితః
తావచ్చతుర్భుజాకారదేవపూజాపరో భవ. 38

నీవు ప్రబోధము నందక ఆత్మజ్ఞానవిహీనుడవుగ నున్నంతవఱకు చతుర్భుజాకారమును వేదవిధిననుసరించి పూజింపుము.

తత్క్రమాత్సంప్రబుద్ధ స్త్వం తతో జ్ఞాస్యసి తత్పరమ్
మమ రూపమనాద్యన్తం యేన భూయో న జాయతే. 39

పిదప చిత్తశుద్ధిని బొంది ప్రబుద్ధుడవైన నీవు పరమరూపమును గ్రహింపగలవు. అనాద్యంతమగు ఆ రూపమును గ్రహింప నీవు మరల జన్మింపవు.

యది వా వేద్యవిజ్ఞాతో భావ స్తదరిమర్దన
తన్మమాత్మానమాత్మానమాత్మానశ్చాశు సంశ్రయ. 40

అరిమర్దనా! నీవు చిత్తశుద్ధిని బడసి గ్రహింపతగినదానిని గ్రహించియున్న, విజ్ఞానైకస్వభావమగు బ్రహ్మము శుద్ధమని తలచుచో, జీవేశ్వరులనబడు త్వం, తత్ పదార్థముల శోధించి, ఏకరసమగు అఖండ పరిపూర్ణాత్మను గ్రహించి, దాని నాశ్రయింపుము.

ఇదం చాహమిదం చాహమితి యత్ప్రవదామ్యహమ్
తదేతదాత్మతత్త్వం తు తుభ్యం హ్యుపదిశామ్యహమ్. 41

'ఇది నేను, నేనియ్యది' అని విభూతులను ఉపదేశించుట, నీకు ఆత్మతత్త్వమును దెలియపరచుటకే, (ఇట్లు నుడువునప్పుడు నేను ఆయావస్తువుల అధిష్ఠానమగు ఆత్మతత్త్వమునే సూచించియుంటిని.)

మన్యే సాధువిబుద్ధోసి పదే విశ్రాన్తవానసి
సంకల్పైరవముక్తోఽసి సత్యైకాత్మమయో భవ. 42

ఈ ఉపదేశప్రభావమున నీవు ప్రబుద్ధుడవై పరమపదమున సంపూర్ణముగ విశ్రాంతుడవైతివని తలచుచో, నీ శంకలన్నియును తొలగినచో, సత్యమగు ఏకాత్మయందే వెలయుము.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
పశ్య త్వం యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 43

నీవు యోగయుక్తుడవును, సర్వత్ర సమదర్శివియునునై, సర్వభూతములయందున్న ఆత్మను, ఆత్మయందు సర్వభూతములను గాంచుము.

సర్వభూతస్థమాత్మానం భజత్యేకత్వమాత్మనః
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. 44

ఆత్మ - ఏకత్వదృష్టితో సర్వభూతముల వెలయు ఆత్మను గాంచుచున్నయెడల నీవు సర్వవిధ కార్యముల నాచరించుచున్నను, మరల జన్మింపవు.

ఏకత్వం సర్వశబ్దార్థ ఏకశబ్దార్థ ఆత్మనః
ఆత్మాపి చ న సన్నాసద్గతో యస్యాశు తస్య తత్. 45

అసద్వస్తువులగు ఈ సుఖదుఃఖములన్నియును ఆత్మయందే పరికల్పితములై తెలియు చున్నట్లు తోచుచున్నవి; ఇవి అసహనీయములు కావు.

మనాగపి న విద్యన్తే సుఖదుఃఖే తు సర్వశః
సర్వత్వాదాత్మతత్త్వస్య సత్తా కథమనాత్మనః 6

వాస్తవమునకు ఆత్మయందు సుఖదుఃఖములు లేశమైనను లేవు. ఆత్మతత్త్వ మొక్కటియే సర్వత్ర, సర్వమై వెలయుచుండ, అనాత్మ ఇక నెట నుండగలదు?

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
నాస్త్యేవ సుఖదుఃఖాది పరమాత్మాస్తి సర్వగః. 7

అసత్తకు ఉనికి లేదు, సత్తకు వినాశము లేదు. అందువలన, అసత్యములగు సుఖదుఃఖములు లేవు. సర్వవ్యాపియగు పరమాత్మ యొక్కటియే వెలయుచున్నది.?

సత్వాసత్వమతీ త్యక్త్వా చైతయోర్జగదాత్మనోః
త్యక్త్వా న కించిన్మధ్యే చ శేషే బద్ధపదో భవ. 8

జగత్తు ఉన్నదను తలపును, నిరతిశయానందస్వభావమగు ఆత్మలేదను తలపును, జగత్తును ఆత్మను కలపు మనస్సుయొక్క తమస్సును విడచి, మిగులు చిదాత్మ - పదమున ప్రతిష్ఠితుడవు కమ్ము!

న హృష్యతి సుఖై రాత్మా దుఃఖై ర్గ్లాయతి నోఽర్జున
దృశ్యదృక్చేతనాత్మాపి శరీరాన్తర్గతోఽపి సన్. 9

అర్జునా! ఈ ఆత్మ చేతనమయ్యు, ద్రష్టయయ్యు, శరీరమునందే వెలయునదయ్యును, సుఖము లభించిన హర్షింపదు, దుఃఖముల గ్లాని నందదు.

జడం చిత్తాదిదుఃఖస్య భాజనం దేహతాం గతమ్
న చైతస్మిన్క్షతే క్షీణే కించిదేవాత్మనః క్షతమ్. 10

దేహరూపమును బొందినవియును, జడములునునగు చిత్తాదులే సుఖదుఃఖముల ననుభవించుచున్నవి. ఈ శరీరము క్షీణించినను, వినాశనము బొందినను ఆత్మకెట్టి క్షతియును కలుగదు.

జడం దేహాది దుఃఖాదేర్యదిదం భోక్తృ సంస్థితమ్
తన్మాయాభ్రమమేవాఙ్గ విద్ధ్యబోధవశోత్థితమ్. 11

జడమగు దేహము, సుఖదుఃఖముల ననుభవించు జీవుడు మున్నగు భ్రమలన్నియును, వత్సా! మాయనాశ్రయించి అజ్ఞానమువలన కలిగినవని గ్రహింపుము.

న కించిదేవ దేహాది న చ దుఃఖాది విద్యతే
ఆత్మనో యత్పృథగ్భూతం కిం కేనాత్రోఽనుభూయతే. 12

శరీరము, ఇంద్రియములు, సుఖదుఃఖములు మున్నగున వేమియును లేవు. ఆత్మకంటె వేఱగు దానిని ఎవరు, ఎట్లు గ్రహింపగలరు?

యదిదం కథయామ్యత్ర తేనైవాతో వినశ్యతి
భ్రాన్తిర్దుఃఖమబోధోత్థా సమ్యగ్బోధేన భారత. 13

భారతా! ఈ దుఃఖభ్రాంతి అజ్ఞానమువలన కలిగినది; సంపూర్ణమగు జ్ఞానమువలన ఇది నశించును. ఈ విషయమును నీకు వివరించి చెప్పుచున్నాడను.

యథా రజ్జ్వామహిభయం బోధాన్నశ్యత్యబోధజమ్
తథా దేహాదిదుఃఖాది బోధాన్నశ్యత్యబోధజమ్. 14

త్రాటియందు పామను భయము అజ్ఞానమున కలిగి, జ్ఞానమున నశించునట్లు అజ్ఞానజములగు శరీరదుఃఖాదులగు భ్రాంతులు జ్ఞానమువలననే నశింపగలవు.

విష్వగ్విశ్వమజం బ్రహ్మ న నశ్యతి న జాయతే
ఇతి సత్యం పరం విద్ధి బోధః పరమ ఏష సః. 15

విశ్వమంతయు పూర్ణబ్రహ్మమే; బ్రహ్మ నశించుటలేదు, లేక జన్మించుచుండుటలేదు, ఇదియే పరమసత్యమని గ్రహింపుము. ఇదియే పరమజ్ఞానము.

బ్రహ్మాంబుధౌ తరఙ్గత్వం కించిదుత్థాయ త్వా విలీయతే
బ్రహ్మావర్తే స్ఫురస్యద్య బ్రహ్మైవాసి నిరామయమ్. 16

బ్రహ్మసముద్రమున తరంగములు కొన్ని లేచి మరల బ్రహ్మమను సుడిగుండముననే విలీనము లగుచున్నవి. నేడు, మరల జ్ఞానోదయ కాలమున నీవు బ్రహ్మమే యగుచున్నాడవు.

యావత్కాలక్రియాదేశాస్త్వమహంసైనికా ఇవ
బ్రహ్మణీవ పరిస్పన్దా నాత్రస్తః సదసద్భ్రమాః. 17

దేశకాలక్రియలు, నీవు నేను మున్నగు భావాభావవికారము లన్నియును కేవలము బ్రహ్మమున దోచుచున్న భ్రమలు; వాస్తవమున కయ్యవి బ్రహ్మమున లేవు.

జహి మానం మదం శోకం భయమీహాం సుఖాసుఖే
ద్వైతమేతదసద్రూపమేకః సద్రూపవాన్భవ. 18

భయశోకములను, మదమానములను, సుఖదుఃఖములను, కోర్కెలను బరిత్యజింపుము. అసద్రూపమగు ఈ ద్వైతమునుగూడ పరిత్యజించి, సద్రూపుడవు కమ్ము.

పురుషాక్షౌహిణీనాం చ క్షయేణానుభవాత్మనా
బ్రహ్మణా బృంహితం శుద్ధం బ్రహ్మ బ్రహ్మమయం కురు. 19

అక్షౌహిణీసంఖ్యాసైన్యక్షయమను కార్యము నాచరించుచున్నను, అంతటిని శుద్ధమగు బ్రహ్మముతోడనే నింపివేయుము.

అసంవిదన్సుఖం దుఃఖం లాభాలాభౌ జయాజయౌ
శుద్ధం బ్రహ్మైకతాం గచ్ఛ బ్రహ్మాబ్ధిస్త్వం హి భారత. 20

భారతా! అజ్ఞానము, సుఖదుఃఖము, లాభాలాభము, జయపరాజయములను శుద్ధబ్రహ్మముతో నైక్య మొనర్చుము; నీవు బ్రహ్మసముద్రమైయున్నాడవు.

లాభాలాభసమో భూత్వా భూత్వా మూనం న కించన
ఖణ్డవాత ఇవాస్పన్ది ప్రకృతం కార్యమాచర. 21

లాభాలాభముల సమబుద్ధి నుంచుము. తత్త్వనిశ్చయ మొనర్చుకొని, న్యూనములగు శీవాది భావములను బొందకుము. గుహాది పరిచ్ఛిన్నప్రదేశము నుంపబడిన వాయువువలె నిశ్చలత్వమును వహించి, ప్రకృతకార్యమగు యుద్ధము నాచరింపుము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్కరిష్యసి కౌన్తేయ తదాత్మేతి స్థిరో భవ. 22

నీవు ఆచరించు కార్యములు, భుజించునవి, వేల్చునవి, ఒసగునవి, చేయునవి ఆత్మయే యని, కౌంతేయా! స్థిరనిశ్చయ మొనర్చుకొనుము.

యన్మయో యో భవత్యన్తః స తదాప్నోత్యసంశయమ్
బ్రహ్మసత్యమవాప్తుం త్వం బ్రహ్మసత్యమయో భవ. 23

ఎవ డంతరమున ఏ భావము నాశ్రయించునో, నిస్సంశయముగ నాతడు దానినే పొందును. అందువలన నీవు సత్యమగు బ్రహ్మమును బొంద తన్మయుడవు (తదాకారాకారితచిత్తుడవు) కమ్ము.

అనపేక్షం ఫలం బ్రహ్మ భూత్వా బ్రహ్మేతి భావితమ్
క్రియతే కేవలం కర్మ బ్రహ్మజ్ఞేన యథాగతమ్. 24

బ్రహ్మజ్ఞుడు కర్మఫలముల నాశింపక, బ్రహ్మమై, బ్రహ్మమేయను భావనతో యథాప్రాప్తమగు కర్మల నాచరించుచుండును.

కర్మణ్యకర్మ యః పశ్యేత్యకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్మనుష్యేషు స చోక్తః కృత్స్నకర్మకృత్. 25

ఏ మనుష్యుడు కర్మయందు నిష్క్రియమగు బ్రహ్మమును, బ్రహ్మమున కర్మను గాంచుచుండునో, అతడే మనుష్యులందఱిలోను బుద్ధిమంతుడు. అతడే పరిపూర్ణకర్మియని చెప్పబడును.

మా కర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గో స్త్వకర్మణి
యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ. 26

ధనంజయా! నీవు లోభాదులకు వశీభూతుడ వవకుందువుగాక! ప్రాప్తకర్మల నవహేళన మొనర్పకుందువుగాక! ఆసక్తిని త్యజించి, యోగస్థుడవై కర్మల నాచరింపుము.

కర్మాసక్తిమనాశ్రిత్య తథా నాశ్రిత్య మూఢతామ్
నైష్కర్మ్యమప్యనాశ్రిత్య సమస్తిష్ఠ యథాస్థితమ్. 27

కర్మల యందాసక్తిని గొనక, అజ్ఞానము నాశ్రయింపక, కర్మరహితత్వమునుగూడ పొందక, సముడవై వెలయుము-యథాప్రాప్తములగు కర్మల నాచరించుచుండుము.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. 28

కర్మఫలాసక్తిని విడచి, నిత్యతృప్తుడును, నిరాశ్రయుడునునై కర్మల నాచరించినను, ఏమియు నాచరింపనివాడే యగుచున్నాడు.

ఆసక్తిమాహుః కర్తృత్వమకర్తురపి తద్భవేత్
మౌర్ఖ్యే స్థితే హి మనసి తస్మాన్మౌర్ఖ్యం పరిత్యజేత్. 29

కర్తృత్వబుద్ధియే ఆసక్తి, అకర్తృత్వబుద్ధియే అనాసక్తి. మనస్సు అజ్ఞానావృతమైన దానిని పరిత్యజింపనగును.

పరం తత్త్వజ్ఞమాశ్రిత్య నిరాసక్తైర్మహాత్మనః
సర్వకర్మరతస్యాపి కర్తృతోదేతి న క్వచిత్. 30

పరతత్త్వము నెఱింగినదాని నాశ్రయించి, అనాసక్తితో కర్మల నన్నిటిని యొనర్చు మహాత్మున కెన్నడును కర్తృత్వబుద్ధి కలుగదు.

అకర్తృత్వాదభోక్తృత్వమభోక్తృత్వాత్సమైకతా
సమైకత్వాదనన్తత్వం తతో బ్రహ్మత్వమాతతమ్. 31

అకర్తృత్వమువలన అభోక్తృత్వమును, అభోక్తృత్వమువలన సమత్వమున్ను, సమత్వమువలన అనంతత్వమును, అనంతత్వమువలన బ్రహ్మత్వమును సిద్ధింపగలవు.

నానాతామలముత్సృజ్య పరమాత్మైకతాం గతః
కుర్వన్కార్యమకార్యం చ నైవ కర్తా త్వమర్జున. 32

అర్జునా! నీవు నానాత్వబుద్ధిని పరిత్యజించి పరమాత్మతో నైక్యమును బొందితివి. ఇట్టిపట్ల నీవు విధ్యుక్తములును, నిషిద్ధములునునగు కార్యముల నాచరించినను కర్తవుగావు.

యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః. 33

ఎవ్వని కార్యములన్నియును కామసంకల్పవర్జితములో, ఎవ్వని కర్మలను జ్ఞానాగ్ని దగ్ధమొనర్చివైచినదో, అట్టివానిని పండితుడని జ్ఞాను లందురు.

సమః సౌమ్యః స్థిరః స్వస్థః శాన్తః సర్వార్థనిస్పృహః
యస్తిష్ఠతి స సవ్యగ్రోఽప్యలమవ్యగ్రతాం గతః. 34

సముడును, సౌమ్యుడును, స్థిరుడును, స్వస్థుడును, శాంతుడును, విషయనిస్పృహుడును నగువాడు కర్మల నాచరించుచున్నను నైష్కర్మ్యయే.

నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్
యథాప్రాప్తానువర్తీ త్వం భవ భూషితభూతలః. 35

నీవు ద్వంద్వరహితుడవును, ఆత్మవంతుడవునునై యథాప్రాప్తములగు కర్మల నాచరించుచు భూమండలము నలంకరింపుము.

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే. 36

కర్మేంద్రియములను నిరోధించి ఏ మూఢుడు విషయములను మనస్సున స్మరించుచున్నాడో, అతడు మిథ్యాచారి యనంబడును.

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే. 37

అర్జునా! మొదట మనస్సుతో ఇంద్రియములను నియమించి, కర్మేంద్రియముల సాయమున ఒనర్పబడు కర్మయోగమే ప్రశంసార్హము.

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ. 38

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అర్జునోపాఖ్యానే ఆత్మజ్ఞానోపదేశో నామ చతుష్పఞ్చాశః సర్గః ॥54॥

ఎవ్వనియందు కామములన్నియును, సముద్రమున నదులు ప్రవేశించుచున్నట్లు, ఉపశమించి పోవుచున్నవో, మఱియు ఎవడీ సముద్రునివలె అచలముగ నున్నాడో, అనగా నిర్వికారమగు బ్రహ్మమునే సమాశ్రయించుకొని యుండునో - అట్టి పురుషుడే శాంతిని బొందును; కోర్కెలను కోరువాడు శాంతిని బడయజాలడు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఆత్మజ్ఞానోపదేశమను ఏబదినాల్గవ సర్గము ॥ 54 ॥

## పఞ్చపఞ్చాశః సర్గః

[దేహనాశేఽప్యనాశాత్మా మూఢతత్త్వజ్ఞయోః సమః
మూఢో జన్మాదిభాక్ భ్రాన్త్యా జ్ఞస్తు నేత్యత్ర వర్ణ్యతే.

దేహము నశించినను ఆత్మ నశింపదనియు, జ్ఞాని అజ్ఞానులయందు ఇయ్యది సమముగనే యున్నదనియు, అజ్ఞాని జనన మరణముల బొందుచున్నాడు, జ్ఞాని కిట్టివి లేవనియును ఈ ప్రకరణమున చెప్పబడుచున్నవి.]

శ్రీ భగవానువాచ:—

న కుర్యాద్భోగసంత్యాగం న కుర్యాద్భోగభావనమ్
స్థాతవ్యం సుసమేనైవ యథాప్రాప్తానువర్తినా. 1

శ్రీభగవంతుడు:— భోగముల నాస్వాదింపకలదు; భోగములనుగుఱించి చింతింపకలదు. సమత్వబుద్ధిని వహించి, యథాప్రాప్తములగు కర్మల ననుసరించుచు వెలయుచుండదగును.

అనాత్మన్యాత్మతాం దేహే మా భావయ భవాత్మని
ఆత్మన్యేవాత్మతాం సత్యే భావయాభవరూపిణి. 2

అనాత్మయును, జన్మాది విక్రియాస్వభావయుక్తమునునగు శరీరమున ఆత్మబుద్ధి నుంపకలదు. వికార రహితమగు సత్యాత్మయందు ఆత్మనే చింతింపుము,

దేహనాశే మహాబాహో న కించిదపి నశ్యతి
ఆత్మనాశో హి నాశస్స్యాన్న చాత్మా నశ్యతి ధ్రువః. 3

మహాబాహో! శరీరము నశించిన ఏమియును నశింపదు. ఆత్మ నశించిన సర్వనాశమగును కాని, ఆత్మ నశింపదు. ఈ విషయము సత్యము.

నహి శీర్యత్యచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. 4

ఈ ఆత్మ చిత్తముకంటె వేఱు; ఇది శీర్ణ మొనరింపబడజాలదు. దీనిని చిత్తమునుండి వేఱొనర్చి కర్మల నాచరించిన, ఏమియును ఒనర్పనివాడే యగుచున్నాడు.

ఆసక్తిమాహుః కర్తృత్వమకర్తురపి తద్భవేత్
మౌర్ఖ్యస్థితే హి మనసి తస్మాన్మౌర్ఖ్యం పరిత్యజేత్. 5

ఆసక్తియే కర్తృత్వ మనబడుచున్నది. అనాసక్తియే అకర్తృత్వము. మనస్సు అజ్ఞానావృతమైన, అజ్ఞానమును పరిత్యజింపనగును.

పరం తత్త్వజ్ఞమాశ్రిత్య నిరాసక్తేర్మహాత్మనః
సర్వకర్మరతస్యాపి కర్తృతోదేతి న క్వచిత్. 6

పరమతత్త్వజ్ఞు నాశ్రయించి, అనాసక్తమతియైన మహాత్మునకు, కర్మల నన్నిటిని ఆచరించుచుండినను, అతని కెన్నడును కర్తృత్వబుద్ధి (అహంకారము) కలుగదు.

అవినాశమనాద్యన్తమాత్మానమజరం వినా
నశ్యత్యాత్మేతి దుర్బోధో మా తవాస్త్వనఘ దుఃఖదః. 7

అవినాశియును, ఆద్యంతరహితమునునగు ఆత్మ మృత్యురహితమని విజ్ఞులెఱుంగుదురు. ఆత్మ నశించునను భ్రమ నీకు కలుగకుండునుగాక; ఇది దుఃఖదాయకము.

న తథా పరిపశ్యన్తి విదితాత్మాన ఉత్తమాః
పశ్యన్త్యనాత్మనాత్మానం స్వమాత్మన్యాత్మమానినః. 8

ఆత్మజ్ఞులగువారు అద్దానిని నశించునట్టిదానిగా గాంచరు. తమయందే ఆత్మను ప్రత్యక్ష మొనర్చుకొనిన ఉత్తమపురుషులు అనాత్మయగు శరీరాదులయందు ఆత్మబుద్ధి నుంచరు.

అర్జున ఉవాచ:—

ఏవం చేత్త్రిజగన్నాథ మూఢానామపి మానద
దేహనాశే సముత్పన్నే ఇష్టం నష్టం న కించన. 9

అర్జునుడు:—త్రిజగన్నాథా! మానదా! అగుచో అజ్ఞుల శరీరము నశించినను వారికి దాని వలన కలుగు నష్టమేమియును లేదుగదా!

శ్రీభగవానువాచ:—

ఏవమేతన్మహాబాహో న కించిన్నశ్యతి క్వచిత్
ఆత్మైవాస్త్యవినాశాత్మా కిం తస్య క్వ వినశ్యతి. 10

శ్రీ భగవంతుడు :—అవును, అట్లే ఎన్నడును ఏమియును నశించుచుండుటలేదు, అవినాశియగు ఆత్మయొక్కటియే వెలయుచుండ వానికేనష్టము ఎట్లు కలుగగలదు?

ఇదం నష్టమిదం యుక్తమితి మోహాద్భ్రమాద్వృతే
అన్యత్తథా న పశ్యామి వన్ధ్యాస్త్రీతనయం యథా. 11

మోహాద్భ్రమవలననే - ఇది వినష్టమైనది, ఇది లభించినది అని తోచుచున్నది. ఈ భ్రమలేకున్న, వంధ్యాపుత్రుడు అగుపించనట్లు ఇవేమియును కనుపింపవు.

నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః. 12

అసత్తునకు ఉనికిలేదు, సత్తునకు వినాశములేదు. ఈ రెంటియొక్క నిర్ణయమును జ్ఞానులు తెలిసికొనియున్నారు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి. 13

సర్వవ్యాపియగు ఈ ఆత్మ అవినాశియని తెలిసికొనుము. అవ్యయమగు ఈ ఆత్మ కెవ్వరును వినాశము చేకూర్పజాలరు.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత. 14

ఈ శరీరము లన్నిటికిని వినాశమున్నది, కాని ఆత్మ అవినాశి, నిత్యము; కనుక, భారతా! యుద్ధ మొనర్పుము.

ఆత్మా హ్యేకోఽస్తి న ద్విత్వమసతః సంభవః కుతః
అవినాశ స్త్వనన్తోఽసౌ సతో నాశో న విద్యతే 15

ఆత్మ యొక్కటియే వెలయుచున్నది. అసత్తయగు ద్వైత మెట్లు పొడమగలదు? అవినాశి, అనంతము, సత్తు అగు ఆ ఆత్మకు వినాశములేదు.

ద్విత్వైకత్వపరిత్యాగే శేషం యత్పరిశిష్యతే
శాన్తం సదసతోర్మధ్యం తదస్తీహ పరంపదమ్. 16

కారణమును, సచ్ఛబ్దవాచ్యమును నగు ఏకత్వమును, కార్యమును అనృతమునునగు ద్విత్వమును పరిత్యజింప, అధిష్ఠాన సన్మాత్రమై ఈ రెండిట మధ్య వెలయు శాంత - పరమపదమొక్కటియే వాస్తవమున కున్నది. (తక్కినదంతయు భ్రమయే.)

అర్జున ఉవాచ:—

తన్మృతోఽస్మీతి భగవన్కింకృతా తు నృణాం స్థితిః
కథం స్థితౌ చ లోకానాం తౌ స్వర్గనరకౌ ప్రభో. 17

అర్జునుడు:—భగవంతుడా! అమరణ ధర్మియగు ఆత్మ మృతించుచున్నదని తలంపబడుటకు గారణమేమి? ప్రభూ! మనుష్యులయొక్కయు, లోకములయొక్కయు, స్వర్గనరకములయొక్కయు స్థితికి గారణమేమి?

కౌంతేయా! జీవుడు వెలువడ శరీరము చలనరహితమగుచున్నది. గాలి ఆగిపోవ చెట్టు యొక్క కదలికగూడ ఆగిపోవునట్లు తోచు ఈ స్థితియే మరణమనంబడుచున్నది.

అచేష్టం ఛేదభేదాది దోషైరాయాత్యదృశ్యతామ్
మృత ఇత్యుచ్యతే తేన దేహో విగతజీవితః. 26

అప్పుడు శరీరము కదలికలేనిదై, సంధులన్నియు విడివడి క్రుళ్లుచుండుట గాంచనగును. జీవుడు శరీరమునుండి వెడలిపోవ సంభవించు ఈ స్థితినే మృత్యువందురు.

స జీవః ప్రాణమూర్తిః ఖే యత్ర యత్రావతిష్ఠతే
తం తం స్వవాసనాభ్యాసాత్పశ్యత్యాకారమాతతమ్. 27

శరీరనిర్గతుడగు ఈ జీవుడు, అటనున్న ఆకాశమున తన వాసనాబలమున, వాసనలన్నియును రూపుదాల్చినట్లు కనుగొనును.

అయం దేహో హి జీవేన త్వసన్నేవావలోకితః
అస్య నాశే త్వమప్యేవం పశ్య మా వా సుషుప్తవత్. 28

ఈ శరీరనాశముగూడ అలీకమేయైయుయ్యు జీవునివలన పరికింపబడుచున్నది. నిద్రించువానివలె దీనిని నీవు కనుగొనకుము.

యథైవ పశ్యత్యాకారాంస్తేషాం నాశాంస్తథైవ సః
ఆదిసర్గే భావనయా కిలైష్వేవం విభావతః. 29

ఏ వస్తువు సత్త ఏరీతిగనుండునో, దాని వినాశముకూడ అట్లే, సర్గాదియందు హిరణ్యగర్భుడు పూర్వకల్పవాసనల ననుసరించి, గవాశ్వాది జీవజాతమును కేవలము కల్పనాసహాయ్యమునసే సృష్టించుచున్నాడు. ఇది కేవలము కల్పనయే. కుమ్మరివానికి సారెమున్నగు సహాయ్యము లున్నట్లు, ఇట యెట్టి సాయమును లేదని స్మృతిపురాణముల ప్రసిద్ధమై యున్నది.

ఝటిత్యుద్భవకాలే హి యద్యథా దృశ్యతే పురః
ఆనిపాతం తదేవాస్యా అవినాభావిసంవిదః. 30

ఈ జగత్తు ఆద్యంతముల అసత్తయైయుయ్యు వ్యావహారికసత్తను గలిగియుండుటవలన సత్యమని తలపరాదు. ఏలయన, ఏవస్తువు ఉత్పత్తిక్షణమున ఏస్వభావమును గలిగియుండునో వినాశమవు నంతవఱకు అట్లే యుండును. ఏ జ్ఞానశక్తివలన పదార్థముల సత్త ఉపలభ్యమగుచున్నదో, అది లేకున్న వాటి ఉనికియే యుండదు.

ప్రాక్తనం వాసనామూలం పురుషార్థేన జీయతే
యత్నేనాద్యతనేనాశు హ్యస్తనాయతనం యథా. 31

కాని, ప్రాక్తనములగు ఈ వాసనలన్నియును పురుషకారమువలన, పూర్వపాపము ప్రాయశ్చిత్తాది కర్మలవలన నశించునట్లును, నిన్న నున్న గృహము నేడంటింపబడిన నిప్పువలన నశించునట్లును, నశింపబడుచున్నవి.

య ఏవ పురుషార్థేన దృష్టో బలవతా క్షణాత్
పూర్వోత్తరవిశేషాంశః స ఏవ జయతి స్ఫుటమ్. 32

ధర్మార్థకామమోక్షములను పురుషార్థములలో నెద్ది గ్రహింపబడి విశేషముగ ప్రయత్నింపబడుచున్నదో, అయ్యదియే ప్రయత్నప్రాబల్యమువలన సిద్ధించుచున్నది.

అపి స్ఫుటతి విన్ధ్యాద్రౌ వాతి వా ప్రలయానిలే
పౌరుషం హి యథా శాస్త్రమతస్త్యాజ్యం న ధీమతా. 33

వింధ్యపర్వతము పెట్లినను, ప్రళయవాయువులు వీచినను బుద్ధిమంతులు శాస్త్రవిహితమగు పురుషకారమును త్యజింపకుందురుగాక!

నరకస్వర్గసర్గాది వాసనావశతోఽభితః
ప్రపశ్యతి చిరాభ్యస్తం జీవో జరఠమోహాన్ధీః. 34

అనాద్యజ్ఞానావృతుడగు జీవుడు చిరాభ్యస్తములగు వాసనవలన, దగ్గరనే స్వర్గనరకములఁ గాంచుచున్నాడు.

అర్జున ఉవాచ:—

నరకస్వర్గసర్గాదిసంభ్రమేషు జగత్పతే
కిమత్ర కారణం బ్రూహి జీవస్య జగతః స్థితేః. 35

అర్జునుడు:— జగత్పతీ! స్వర్గనరకములు, సృష్టిమున్నగు కల్పనలకును, జగత్-స్థితికిని కారణమేమియో వచింపుము?

శ్రీభగవానువాచ:—

స్వప్నోపమానా తేనేహ శ్రేయసీ వాసనాక్షయః
చిరాభ్యాసవశాత్త్వేషా సంసారభ్రమకారిణీ. 36

శ్రీభగవంతుడు:— వాసనలే స్వప్నసమమగు ఈ సంసారభ్రమకు కారణమగుచున్నవి; వాసనాక్షయమువలననే శ్రేయస్సు సమకూరును.

అర్జున ఉవాచ:—

కిముత్థా దేవదేవేశ క్షీయతే వాసనా కథమ్

శ్రీభగవానువాచ:—

మౌర్ఖ్యమోహసముత్థానా త్వనాత్మన్యాత్మభావనా
ఆత్మజ్ఞానాన్మహాబోధాద్విలయం యాతి వాసనా. 37

అర్జునుడు:— దేవదేవేశా! వాసనలు దేనివలన కలుగుచున్నవి? అవి ఎట్లు నశింపగలవు?
శ్రీభగవంతుడు:—అజ్ఞాన-భ్రమనుండియే ఈ వాసనలు లేచి, అనాత్మయం దాత్మభావనను కలిగించుచున్నవి. ఆత్మజ్ఞానమువలన అజ్ఞానము నశింప వాసనలు విలీనమగును.

భావితాత్మాసి కౌన్తేయ సత్యంవిజ్ఞాతవాసని
అయం సోఽహం జనా ఏతే మమేతి త్యజ వాసనామ్. 38

కౌంతేయా! నీవు ఆత్మనుగురించి విచారించితివి, గ్రహించితివి. ఇది, నేను, వారు, నాది మున్నగువాసనలను త్యజింపుము.

అర్జున ఉవాచ.—

వాసనావిలయే జీవో విలీనో భవతి స్వయమ్
యో హి యత్సత్త్వయోద్భూతస్తన్నాశాత్స విలీయతే. 39

అర్జునుడు:— వాసనలు లయమందిన జీవుడుగూడ లయమందును. ఏది ఎద్దాని వాశ్రియించుకొని యుండునో, అది నశించిన ఆ వస్తువుకూడ వినాశము నందుచున్నది.

జీవేవిలయమాయాతే దేశకాలాన్యథాకృతౌ
కోసౌభాజనతామేతి జన్మనోమరణస్య చ. 40

జీవు డిట్లు విలయమును బొంద దేశకాలాదులుగూడ వినాశనమును బొందుచున్నవి. ఇక, ఆత్యంతిక అనర్థనాశనమను మరణమును, పరమానందావిర్భావమను జన్మను అనుభవించువారెవరు ?

శ్రీభగవానువాచ:—

స్వయం కల్పితసంకల్పమాత్మరూపం యదావిలమ్
తదేవ వాసనాకారం జీవం విద్ధి మహామతే 41

శ్రీభగవంతుడు:— మహామతీ! ఆత్మయే స్వసంకల్పమువలన వాసనామయుడగు జీవుడగుచున్నది.

అనాయత్తమసంకల్పమాత్మరూపం యదవ్యయమ్
ప్రబోధాద్వాసనాముక్తం తన్మోక్షం విద్ధి భారత. 42

భారతా! ఆ ఆత్మయే జ్ఞానమును బడసి, వాసనలనుండి విడివడుటయే మోక్షమనంబడుచున్నదని గ్రహింపుము.

జీవన్నేవ మహాబాహో తత్త్వం ప్రేక్ష యథాస్థితమ్
వాసనావాగురోన్ముక్తో ముక్త ఇత్యభిధీయతే. 43

మహాబాహో! నీవు జీవన్ముక్తుడవై యథార్థమగు ఈ తత్త్వమును దర్శింపుము. వాసనాజాలమునుండి ముక్తినందినవాడే ముక్తుడనంబడు చున్నాడు.

యో న నిర్వాసనో నూనం సర్వధర్మపరోఽపి సః
సర్వజ్ఞోఽప్యభితో బద్ధః పఞ్జరస్థో యథా ఖగః. 44

వాసనాక్షయమవకున్న, సర్వజ్ఞుడును సర్వధర్మపరాయణుడును నగు మనుజుడుకూడ పంజరమునందున్న పక్షివంటివాడే యగుచున్నాడు.

దుర్దర్శనస్య గగనే శిఖిపిచ్ఛికేవ
సూక్ష్మాపరిస్ఫురతి యస్య తు వాసనాన్తః
ముక్తః స ఏవ భవతీహ హి వాసనైవ
బన్ధో న యస్య ననుతత్క్షయ ఏవ మోక్షః. 45

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే అర్జునోపాఖ్యానే జీవతత్త్వనిర్ణయోనామ పఞ్చపఞ్చాశః సర్గః ॥ 55 ॥

మాయయందున్నవారల కీయాత్మ దుర్దర్శము. ఇంద్రజాలమున ఆకాశమున దోచు శిశిపింఛ మువలె, ఎవ్వనియందు వాసనలున్నవో, అతడు ఆత్మను బడయజాలడు. శాస్త్రోపదేశము ననుసరించి, వాసనల నశింపజేసికొనిన, ముక్తుడవగలడు. ఏలయన, వాసనాక్షయమే మోక్షము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున జీవతత్త్వ నిర్ణయమను ఏబదియైదవ సర్గము ॥ 55 ॥

---

## షట్పఞ్చాశః సర్గః.

---

[జీవన్ముక్తిప్రతిష్ఠాఽస్మిన్నర్జునాయోపదిశ్యతే
చిత్తతత్త్వం జగద్రూపం మనశ్చిత్రం చ విస్తరాత్.

భగవంతుడీ సర్గమున అర్జునునకు జీవన్ముక్తస్థితిని, చిత్తము జగత్తుల తీరును, మనస్సుయొక్క కల్పనలనుగురించి చెప్పుచున్నాడు.]

శ్రీభగవానువాచ:—

ఇతి నిర్వాసనత్వేన జీవన్ముక్తతయార్జున
అన్తఃశీతలతామేత్య బన్ధుదుఃఖమలం త్యజ. 1

శ్రీభగవంతుడు:— అర్జునా! వాసనాశూన్యతయొక్క ఫలమగు జీవన్ముక్తిని, మనశ్శాంతిని బడసి, బంధువుల వధవలన కలుగు దుఃఖమను మాలిన్యమును త్యజింపుము.

జరామరణనిఃశఙ్కః ఆకాశవిశదాశయః
త్యక్తేష్టానిష్టసంకల్పో వీతరాగో భవానఘ. 2

అనఘా! జరామరణముల శంకను వీడుము, ఆకాశమువలె విశాలమగు హృదయమును గలిగి, ఇష్టానిష్ట సంకల్పములను పరిత్యజింపుము. కామమును వదలుము.

ప్రవాహపతితం కార్యమిదం కించిద్యథాగతమ్
కురు కార్యాణి కర్మాణి న కించిదిహ నశ్యతి. 3

శిష్టవ్యవహారపరంపరగ అరుదెంచు కర్తవ్య-కర్మలగు యుద్ధము, యాగదానాదులను నొనర్పుము. దీనివలన తత్త్వబోధ కంతరాయమేమియు కలుగదు.

ప్రవాహపతితం కర్మ స్వమేవ క్రియతే తు యత్
జీవన్ముక్తస్వభావోఽయం సా జీవన్ముక్తతా తథా. 4

పారంపర్యముగ వచ్చు కర్మల నాచరించుటయే జీవన్ముక్తుల స్వభావము. ఇట్లు కర్మల నాచరించుచుండుటయే జీవన్ముక్తిగాని, కర్మలను త్యజించుటెన్నటికిని జీవన్ముక్తి కానేరదు.

ఇదం కర్మ త్యజామీదమాశ్రయామీతి నిర్ణయః
మూఢస్య మనసో రూపం జ్ఞానినస్తు సమా స్థితిః. 5

'ఈ కర్మను త్యజింపవలెను, ఈ కర్మను నొనర్పవలెను' అను నిర్ణయము అజ్ఞానుల మానసిక వికారము. జ్ఞాని యెల్లప్పుడును సమత్వస్థితియందే వెలయుచుండును.

ప్రవాహాపతితం కర్మ కుర్వన్తః శాన్తచేతసః
జీవన్ముక్తాః సుషుప్తస్థాః స్ఫురన్త్యత్ర సుషుప్తవత్. 6

తమకడ కరుదెంచు కర్మల నాచరించుచు, శాంతచిత్తులై జీవన్ముక్తులు నిద్రించువారివలె సంకల్పరహితులై, నిద్రయందుండు ఆత్మవలె స్వయంజ్యోతిస్స్వభావులై సెగడుచుందురు.

స్థిరాం సంస్థితిమాయాన్తి కూర్మాఙ్గానీవ సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యో హృది యస్య స్వభావతః. 7

ఇంద్రియములు స్వాభావికముగనే విషయములనుండి మరలి, కూర్మాంగములవలె హృదయముననేకీకృతమవ, అట్టి జీవన్ముక్తులు పరమాత్మయందు స్థైర్యమును బొందుచున్నారు.

విశ్వాత్మని తథా విశ్వం కాలత్రయమయోదితమ్
అభిత్తి త్రిజగచ్చిత్రం కురుతే చిత్తచిత్రకృత్. 8

చిత్తమను శిల్పి, అధిష్ఠానమగు పరమాత్మయందు మూలరహితమగు త్రిజగత్తులను చిత్రమును గల్పించుచున్నాడు. అందువలన ఈ విశ్వము పరమాత్మయందు సర్వకాలముల నున్నట్లే తోచుచున్నది.

వ్యోమ్ని వ్యోమాత్మకమపి ప్రస్ఫుటం వృత్తివర్తిభిః
చిత్తచిత్రకరేణాదౌ చిత్రం చిత్రం వితానితమ్. 9

అజ్ఞానస్వరూపమగుటవలన చూడ వీలుకానిదియైనను, అజ్ఞానాకాశమున అంతఃకరణవృత్తులచే ప్రకాశింపబడుచు అద్భుతమగు ఈ చిత్రము విస్తరింపబడుచున్నది.

పశ్చాద్భిత్తిః కృతా వ్యోమరూపా చాసావహో భ్రమః
అపూర్వైవాతిమాయేయం తృణకుడ్యమయీ శుభా. 10

సత్యసంకల్పుడగు హిరణ్యగర్భుడు (సమిష్టి-మనస్సు) ఈ జగత్-చిత్రమును గల్పించి, తర్వాత దాని కాధారమగు సూక్ష్మాకాశమును బరికల్పించెను. ఈ సృష్టిభ్రమ అనాది. అత్యంత మాయామయమును, గడ్డిచే నొనర్పబడిన గోడవలె సారశూన్యమునునగు ఈ సృష్టి మూఢులకు నిజమైనట్లుగనే కనబడుచున్నది.

న మనాగపి భేదోఽస్తి స్ఫుటమప్యుపలబ్ధయోః
ఇమా యా ఉపలభ్యన్తే భిత్తయశ్చిత్తచిత్రజాః. 11

మామూలుగ చిత్రింపబడు పటములకు అవి చిత్రింపబడు భిత్తులకును ఉండు భేదము జగత్తు, మనస్సుల విషయమునగూడ దోచుచున్నను, వాస్తవమున కెట్టి భేదమునులేదు.

వ్యోమ్నః శూన్యతమా విద్ధి తాస్తామరసలోచన
క్షణేన చేతసి యథా భ్రాన్తా లోకత్రయోదయాః. 12

ఆత్మా జగత్త్రథా వేదం భాసహ్యాభ్యన్తరం నభః
చిరంతనమనోరాజ్యం యత్తస్మాత్కాల సత్యతా. 13

తామరసలోచనా! మనస్సుయొక్క ఈ చిత్రరచన ఆకాశమువలె అత్యంతశూన్యము. క్షణములో త్రిజగత్తుల - ననుభవింపజేయు స్వప్నమువలె మనస్సు, దానియొక్క సృష్టులుగూడ అసత్తులై

యున్నవి. చిరాభ్యాసమువలననే జను లద్దానిని సత్యమని తలచుచున్నారు. కాని ఈ విషయము యథార్థముకాదు.

కింత్వనాలోకితేఽపి స్యాత్సత్యం నాస్త్యేవ విభ్రమే
క్రమేణాలోకతః సత్యమాలోకేన విలీయతే. 14

దృశ్యమానమపి హైమం శరదీవాభ్రమణ్డలమ్
చిత్తచిత్రకృతశ్చిత్తే సంస్థితాశ్చిత్రపుత్రికాః. 15

భిత్త్యభావాదనాకారా బహిస్త్రిభువనాదికాః
న తాః సన్తి న వాసి త్వం కిం కేన పరిరోధ్యతే. 16

ఈ భ్రమయందు సత్య మొకించుకయులేదు; ఈ విషయము తత్త్వజ్ఞానమును గ్రహింపకున్న బోధపడదు. తత్త్వజ్ఞానము కలిగిన సత్యమువలె దోచు ఈ జగత్తు, సూర్యునిచే బ్రకాశింపబడు శరత్కాల - మేఘ - మండలము సూర్యప్రకాశమువలననే విలీనమగునట్లు, విలీనమై పోవును. అప్పుడు, చిత్త - శిల్పి వినిర్మితములగు త్రిజగత్తులు భిత్తిహీనము లగుటవలన రూపరహితములై పోవును. అవి నీయందు లేవు; నీవును వాటికిని సంబంధములేదు. అగుచో, ఎవరు ఎవరివలన జంపబడుచున్నారు ?

రోధ్యరోధకసంమోహం త్యక్త్వా ఖే విమలో భవ
ప్రవృత్తిరేవ న వ్యోమ్నః ప్రవృత్తిశ్చైవ ఖాత్మికా. 17

వధ్య, ఘాతక భావములను బరిత్యజించి, బ్రహ్మాకాశమున పవిత్రభావమున మెలగుము. బ్రహ్మమున కెట్టి ప్రవృత్తియునులేదు, ప్రవృత్తివలె దోచునదికూడ బ్రహ్మమే.

అతః కాలక్రియాకుడ్యకలాదివిమలం నభః
చిత్తసంస్థం యథా చిత్రం సరూపమఖిలాత్మకమ్. 18

వ్యోమ్నః శూన్యత్వమం విద్ధి తథేదమఖిలం జగత్
చిత్తభిత్తౌ కృతం చిత్రం యచ్చిచ్చిత్రకరేణ తత్. 19

సర్వశూన్యతయా వ్యోమ్నో మనాగపి న భిద్యతే
యథా ప్రకచతశ్చిత్తే జగన్నిర్మాణసంక్షయా. 20

క్షణేనైవ తథైవేమా భువిస్థావితి విద్ధి హే
అద్య క్షీణా మనోరాజ్యే నానానుభవనాత్మని. 21

క్షణభావితమోహేన కల్పనా పరికల్పితా
అసదేవ మనోరాజ్యం కర్తుం శక్తం యథా మనః. 22

క్షణస్య కల్పీకరణే తథైవ బలవన్మనః
క్షణం కల్పీకరోత్యేతచ్చిచ్చాపల్యం కురుతే బహు. 23

అసత్సత్కురుతే క్షిప్రమితీయం భ్రాన్తిరుత్థితా
క్షణేనైవ మనోరాజ్యం ప్రతిభాతం స్వభావతః. 24

యద్విచిత్రాత్మ తదిదం జగజ్జాలమితి స్థితమ్
సర్గే నిర్వాణనిష్ఠత్వాన్నిమేషమయముత్థితమ్. 25
ప్రతిభామాత్రతోఽన్యత్రైవ కల్పితా వజ్రసారతా
ప్రతిభాసవిపర్యాసమాత్రం హ్యావిదితాకృతేః. 26
ప్రవృత్తౌ వా నివృత్తౌ వా క్వైవ సా వజ్రసారతా
చిత్తచిత్రకృతశ్చిత్తస్థం జగచ్చిత్రం కదా స్థితమ్. 27
అకుడ్యమప్యరఙ్గార్ఘ్యమిదం స్ఫారమివాగ్రతం
అహోహో ను చిత్రం నిర్భిత్తి చిత్రమిజ్జ్వలముత్థితమ్. 28

అందువలన కాల క్రియ మున్నగువాని నాధారపరచుకొను ఈ చిత్రరచన, దాని భేదములు బ్రహ్మకాశమేయని గ్రహింపుము. చిత్తకల్పితమగు మనోరాజ్యము ప్రపంచమువలె దోచుచున్నను ఏమియును గానట్లు, ఈ జగత్తుకూడ శూన్యముకంటె శూన్యతమమని గ్రహింపుము. చిత్తమను చిత్రకారుడు చిత్తమున నిర్మించిన విచిత్రజగత్తు, సర్వశూన్యమగు ఆకాశముకంటె సత్యముకాదు. అర్జునా! చిత్తముననే జగత్తుయొక్క ఉదయము, లయములు జరుగుచున్నట్లు, ఇహలోకమునగూడ నిర్మాణము, క్షయము, జన్మ, మృత్యువు మున్నగు క్షణికవిషయములు ప్రకాశించుచున్నవి. ఒకింత భావించి మోహాగ్రస్తుడవై మనోరాజ్యమున వధ్యఘాతక భావమును గాంచుచున్నాడవు; అయ్యది నా ఉపదేశమువలన క్షీణించినది. మనస్సు మిథ్యయగు విశాల మనోరాజ్యకల్పనయందు నిపుణమైనట్లే, క్షణమును కల్ప మొనరింపగలదు. అందువలన, మిథ్యయగు ఈ సంసారము అనాది, అనంత కల్పకాలములనుండి యున్నదనిపించును. మనస్సు క్షణమును కల్పముగను, సత్యమును అసత్యముగను ఒనరించుచున్నది. అందువలననే ఈ భ్రాంతి కలిగినది. క్షణములో ఈ మనోరాజ్యము ఉదయించి, విచిత్రములగు జగత్సమూహములని తలంపజేయుచున్నది. నిత్యముక్తస్వభావమగు ఆత్మయందు అధ్యస్తమగుట వలన తుచ్ఛమును, క్షణికోత్పత్తి గలదియునగు ఈ జగత్తును, అజ్ఞానులు సృష్టియందు నమ్మకయుంచి దురుచ్ఛేద్యమని తలంచుచున్నారు. అజ్ఞానతత్త్వమగు ఆత్మయందు కల్పింపబడిన ఈ ప్రతిభాసయొక్క ప్రవృత్తి లేక నివృత్తి వాస్తవము ఎన్నిటికిని కాజాలదు. చిత్త – శిల్పి చిత్తమున ఈ జగత్తు ఎన్నడును లేదు (అలీకము). కుడ్యము లేకున్నను ఇయ్యది రంజితమై వెలయుచున్నది! ఆశ్చర్యము! ఆధారమే లేని చిత్రము ఉజ్జ్వలమై వెలయుచున్నది!

సురఞ్జనం జగదితి స్ఫుటం దృష్టివిలోభనమ్
నానాతమోమషీలేఖం నానా తేజోంశురఞ్జనమ్. 29

ఇది చక్కగా చిత్రింపబడినదానివలె దృష్టిని, చిత్తమును, ఆకర్షించుచున్నది. ఇది తమస్సులను నానావిధమషీపంకముల బులుముబడి, చంద్రాదిత్య నక్షత్రాది తేజోపదార్థముల ప్రకాశితమగుచున్నది.

నానాకల్పాఙ్గావయవం నానారాగానురఞ్జితమ్
నానాదృష్టివిలాసాఢ్యం నానానుభవలోచనమ్. 30

వివిధములగు కల్పములే దీని అవయవములు, వివిధములగు కోర్కెలవలననే ఇది యొప్పారు చున్నది. విభిన్నములగు భేద (ద్వైత) దృష్టులను విలాసములతోగూడిన నానాత్వ అనుభవమను నేత్రములు దీనికున్నవి.

నానాగ్రహోగ్రకచనం నానాకారాగ్రపశ్చిమమ్
వ్యోమనీలసరః ఫుల్లతారాచన్ద్రార్కపఙ్కజమ్. 31

సూర్యాదిగ్రహముల చలనము ననుసరించి ఇది విభిన్నవర్ణముల దాల్చుచున్నది. ఇందు ఆకాశమను నీల - సరస్సు ఒకటి సూర్యచంద్రనక్షత్రములను పద్మములతోగూడి వెలయుచున్నది.

విచిత్రరచనోద్యుక్తమేఘాలీపత్రమఞ్జరి
ప్రకోష్ఠకాభిలిఖితసురాసురనృపుత్రికమ్
పరమాలోకమజ్జోలయువతాకాశకుడ్యకమ్. 32

ఆకాశమను ఈ జగత్ - కుడ్యమున వివిధాకృతుల దాల్చు, మేఘములను పత్రములు, పూల గుత్తులును ఉన్నవి. వేర్వేరు భాగముల సురాసురులను చిత్రములు చిత్రింపబడియున్నవి. సూర్యచంద్రుల కాంతియను అమృతము నలముకొనిన యువతివలె నిది తోచుచున్నది.

ఆకాశ ఏవ రచితా ప్రతిభైకరఙ్గా
ముగ్ధా జగత్త్రయమనోహరపుత్రికేయమ్
చిన్మాత్రచక్రపరిరక్షితసర్వలోకా
లీలాకులా చపలచిత్తకచిత్రకర్త్రా. 33

జగత్త్రయములనబడు దేవనటి బ్రహ్మాకాశమున పరికల్పితమైనది. బుద్ధియే దీని నాట్యశాల. ఈ నాట్యశాలాప్రదీపమగు సాక్షిచైతన్యమునుండి వెలువడు తేజశ్చక్రములనదగు బుద్ధివృత్తులవలన నియ్యది గ్రహింపబడుచున్నది. నృత్యసంబంధములగు హావభావవిలాసములతో నీమె చపలమై యున్నది. చిత్తమను కాముడే దీనిని నిర్మించినాడు.

హేమాచలాఙ్గలతికా ఘనకేశపాశా
చన్ద్రార్కలోచనవిచాలనదృష్టలోకా
ధర్మార్థకామవినియన్త్రితశాస్త్రవస్త్రా
పాతాలజాలచరణోన్నతభూనితమ్బా. 34

బ్రహ్మాండమే ఈమె శరీరలత; మేఘములే ఈమెకు కేశములై వెలయుచున్నవి. ఈమె సూర్యచంద్రులను నేత్రములతో జనులను బరికించుచున్నది. ధర్మార్థకామములను నియమించు ప్రవృత్తి నివృత్తులను రెండు వస్త్రములీమె కున్నవి. పాతాళమే ఈమె చరణము, భూమి ఈమె పిరుదులు.

బ్రహ్మేన్ద్రరుద్రహరిబాహుచతుష్టయోగ్రా
సత్త్వావృతోన్నతకుచస్ఫురదఙ్గయష్టిః
సువ్యాలవేష్టితమహీతలపద్మపీఠా
పత్రీకృతాచలమహాభువనోదరీ చ. 35

బ్రహ్మ, ఇంద్ర, రుద్ర, హరిరూపములగు నాల్గుహస్తములతో నీమె యొప్పుచున్నది సత్వగుణమను రవికెతో నొప్పారు వివేకవైరాగ్యములను స్తనములతో గూడిన శరీరము నీమె దాల్చిన యున్నది. శేషాదులచే ధరింపబడు మహీతలమే ఈమెయొక్క పాదపీఠము. మనుష్యలోక మీయమెయొక్క ఉదరము; అందున్న మేర్వాది పర్వతములు పత్రిరచనవలె నొప్పుచున్నవి.

రాత్ర్యన్ధకారచపలత్వహరాక్షి చేష్టా
తారాకరాలపులకా పవిదన్తపఙ్క్తిః
చఞ్చచ్చతుర్దశవిధాతులభూతజాత
రోమాఞ్చనా ప్రలయవాదకదమ్బపుష్పా. 36

రాత్రికాలమునందలి చీకటిని, ఈమె కన్నులు గదల్చి సూర్యచంద్రులను దోపింపజేసి పోగొట్టుచున్నది. నక్షత్రములు, విద్యుత్తులు అను తెల్లటి పలువరస నీమె కలిగియున్నది. ప్రళయ - భయమున నలువైపులకు బరుగిడు చతుర్దశలోకముల వసించు చతుర్విధ జీవులే, ఈమె శరీరమున లేచు రోమాంచములు, ప్రళయధ్వనులను కడిమి పూలమాలను ఈమె ధరించియున్నది.

జీవాన్వితా గగన ఏవ కృతా విచిత్రా
వ్యోమాత్మికా చరవిలక్షణచిత్రకర్త్రా
చిత్తేన చిత్రపరికర్మవిదా త్రిలోకీ
నానావిలాసవలితా వరపుత్రికేతి. 37

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అర్జునోపాఖ్యానే చిత్తవర్ణనం నామ షట్పఞ్చాశః సర్గః ॥56॥

నానావిధవిలాసములతోగూడిన త్రిలోక - చిత్రము, కల్పనాచతురమగు మనస్సను చిత్రకారునిచే బ్రహ్మకాశముననే నిర్మింపబడి, వ్యష్టిజీవులతోడను, వారి కర్మలవలనను చిత్రింపబడి వెలయుచున్నది. ఇది శూన్యరూపమని గ్రహింపుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చిత్తవర్ణనమను ఏబదియాఱవ సర్గము ॥ 56 ॥

---

## సప్తపఞ్చాశః సర్గః

---

[జాయతేఽత్ర యయా దృష్ట్యా సద్యో నిర్వాసనం మనః
సుఖాద్వయాత్మకేవశ్చ సా దృష్టిరుపదిశ్యతే.

ఏ దృష్టి నవలంబించిన మనస్సు వెంటనే వాసనాశూన్యమై, అద్వయమగుసుఖము లభింప గలదో, ఆ దృష్టి ఈ సర్గమున ఉపదేశింపబడుచున్నది.]

శ్రీ భగవానువాచ:—

ఇదం విద్ధి మహాశ్చర్యమర్జునేహ హి యత్కిల
పూర్వం సంజాయతే చిత్రం పశ్చాద్భిత్తిరుదేతి హి.

శ్రీ భగవంతుడు:— అర్జునా! ఈ మహాశ్చర్యమును గమనింపుము! మొదటి చిత్రము, తరువాత ఆధారము కల్పింపబడుచున్నవి. (మొదట మనస్సు ఈ జగచ్చిత్రమును కల్పించి, పిదప ఆధారమగు సమిష్టిజీవుని నిర్మించుచున్నది.)

అభిత్తావుత్థితే చిత్రే దృశ్యతే భిత్తిరాతతా
అహో విచిత్రా మాయేయం మగ్నం తుమ్బం శిలాప్లుతా. 2

నిరాధారమున చిత్రము కనబడ, తరువాత ఆధారము తోచుచున్నది. ఆహా! మాయ ఎంత విచిత్రమైనది! (అఘటనఘటనాపటీయసి.) సొరకాయ మునిగిపోయినది, రాయి తేలుచున్నది!

చిత్తస్థచిత్రసదృశే వ్యోమాత్మని జగత్త్రయే
వ్యోమాత్మనస్తే కిమియమహన్తావ్యోమతోదితా. 3

నీవు బ్రహ్మజ్ఞానమును బొందితివి, మనోరాజ్యమునుబోలు ఈ శూన్యపదార్థములతో నీకు ప్రసక్తి ఏమి? — శూన్యములగు ఈ జగత్తులయందు నీకు మమత్వమేల?

సర్వం వ్యోమకృతం వ్యోమ్నా వ్యోమ్ని వ్యోమ విలీయతే
భుజ్యతే వ్యోమని వ్యోమ వ్యోమ వ్యోమని చాతతమ్. 4

అంతయు ఆకాశమున, ఆకాశమువలననే కలుగుచున్నది. ఆకాశముననే విలీనమగుచున్నది. ఆకాశమున ఆకాశమే భోగింపబడుచున్నది; ఆకాశము ఆకాశమువలన ఆవరింపబడియున్నది.

వేష్టితం వాసనారజ్జ్వా దీర్ఘసంసృతిదామవత్
వాసనోద్వేష్టనేనైవ తదిహోద్వేష్ట్యతేఽర్జున. 5

అర్జునా! అనంతవిస్తృతమగు వాసనయే రజ్జువువలె జగత్తును జుట్టియున్నది. ఈ వాసనా రజ్జువువలన చిదాకాశముగూడ జుట్టబడుచున్నది.

ప్రతిబిమ్బం యథాదర్శే తథేదం బ్రహ్మణి స్వయమ్
అగమ్యం ఛేదభేదాదేరాధారానన్యతావశాత్. 6

అద్దమున ప్రతిబింబము పడునట్లు ఈ జగత్తు బ్రహ్మముననే ప్రతిబింబించుచున్నది. బ్రహ్మజ్ఞానమువలనగాక అన్యోపాయమున ఖండింపబడకుండుటకు కారణము బ్రహ్మము దీనికధిష్ఠాన మగుటయే.

అనన్యచ్ఛేదభేదాది బ్రహ్మణి బ్రహ్మణామ్బరమ్
కిం కథం కస్య కేనైవ చ్ఛిద్యతే నా క్వ భిద్యతే 7

సంహార, సంహారకాది భేదవ్యవహారముల కాస్పదమగు ఈ జగత్తు బ్రహ్మాకాశముననే, బ్రహ్మము కంటె అనన్యమై ప్రకాశించుచున్నది. (బ్రహ్మమొక్కటియే వెలయుచున్నందువలన, ఎవరు ఎవరి వలన ఎట్లు వినాశమొనర్పబడగలరు?

తేనేహ వాసనాభావో బోధాత్సంపన్న ఏవ తే
యో న నిర్వాసనో నూనం సర్వధర్మపరోఽపి సన్. 8
సర్వజ్ఞోఽప్యతిబద్ధాత్మా పఞ్జరస్థో యథా హరిః
యస్యాస్తి వాసనాబీజమత్యల్పం చితిభూమిగమ్. 9

బృహత్సంజాయతే తస్య పునః సంసృతికాననమ్
అభ్యాసాద్ధృది రూఢేన సత్యసంబోధవహ్నినా
నిర్దగ్ధం వాసనాబీజం న భూయః పరిరోహతి. 10
దగ్ధం తు వాసనాబీజం న నిమజ్జతి వస్తుషు
సుఖదుఃఖాదిషు స్వచ్ఛం పద్మపత్రమివామ్భసి. 11

ఈ యుపదేశమువలన నీవు వాసనారహితమగు స్థితిని బొందితివి. వాసనారాహిత్యమును బొందనివాడు సర్వధర్మముల నాచరించుచున్నను, సర్వశాస్త్రవేత్తయైనను, పంజరమునందలి చిలుకవలె నత్యంతము బద్ధుడేయగుచున్నాడు. చిత్తభూమియందు అత్యంతక్షుద్రమగు వాసనాబీజము మిగిలియున్నను, దానివలన సంసారవనము విశాలమై, విస్తృతినందును. సత్య-జ్ఞానము అను అగ్నిని హృదయమున అభ్యాసమువలన నిలిపి, వాసనాబీజమును సంపూర్ణముగ దగ్ధమొనరించిన, మరల నంకురించుటకు అవకాశముండదు. స్వచ్ఛమగు పద్మపత్రము నీట మునుగనట్లు, దగ్ధమైన వాసనాబీజము (గల మనస్సు) మరల సుఖదుఃఖముల నొసగు వస్తువుల జిక్కుకొనదు.

శాన్తాత్మా విగతభయోజ్ఝితామితాశో
నిర్వాణో గలితమహామనోవిమోహః
సమ్యక్త్వం శ్రుతమవగమ్య పావనం త
త్తిష్ఠాత్మన్యపహతిరేకశాన్తిరూపః. 12

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అర్జునోపాఖ్యానే అర్జునవిశ్రాన్తివర్ణనం నామ సప్తపఞ్చాశః సర్గః ॥ 57 ॥

నీవు ఆశల నన్నిటిని విడచి, శాంతాత్ముడవై నాయుపదేశమును సంపూర్ణముగ గ్రహించి, మోహశూన్యుడవై, బంధువధాది శోకభయములు లేక, ఆత్మయందు నిర్వికల్పుడవై వెలయుము.

ఇది శ్రీవాసిష్ఠ-తాత్పర్యప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున అర్జున విశ్రాంతి వర్ణనమును ఏబదియేడవ సర్గము. ॥ 57 ॥

---

## అష్టపఞ్చాశః సర్గః.

---

[తత్త్వబోధేన సావిద్యవాసనాక్షయసంభవః
ఇహోపపాద్యతే తేనాప్యర్జునస్య కృతార్థతా.

ఈ సర్గమున తత్త్వబోధవలన అవిద్యయు, వాసనలును సమూలముగ నశించునని ఉపపాదింపబడుచున్నది; దీనివలన అర్జునుడు కృతార్థుడగుచున్నాడు.]

అర్జున ఉవాచ :—

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ, 1

అర్జునుడు:— అచ్యుతా ! నీ అనుగ్రహమువలన నా మోహము నశించినది; స్వతఃసిద్ధమగు ఆత్మతత్త్వముయొక్క స్మృతియనదగు సాక్షాత్కారము లభించినది. బంధువధాది కర్తృతాసందేహములు పోయినవి. నీ యుపదేశము ననుసరించి, యథాప్రాప్తకర్మలను ఆచరించెదను.

శ్రీభగవానువాచ :—

వృత్తయో యది బోధేన సంశాన్తా హృదయే స్ఫుటమ్
తచ్చిత్తం శాన్తమేవాన్తర్విద్ధి సత్త్వముపాగతమ్. 2

శ్రీ భగవంతుడు:— ఈ యుపదేశమున కామాదివృత్తులన్నియు నశించి, హృదయమున మరల లేకున్న, చిత్తముపశమించి వాసనాశూన్యమైనదని గ్రహింపుము.

అత్ర తచ్చేత్యరహితం ప్రత్యక్చేతననామకమ్
యత్త్వశేషవినిర్ముక్తం యత్సర్వం సర్వతశ్చ యత్. 3

వ్యవహారికదశయందు ప్రత్యక్-చేతనమనంబడు వస్తువు అప్పుడు ఉపాధివినిర్ముక్తమగు బ్రహ్మమేయగుచున్నది. అదియొక్కటియే సర్వమును, సర్వత్రవ్యాప్తమును అగుచున్నది

న కేచన విదన్త్యేతే తత్పదం జాగతాదయః
భూతలాద్గగనోడ్డీనం విహంగమివోన్నతమ్. 4

జాగతికములగు ఇంద్రియము లెవ్వియును ఆపదమును, ఆకాశమున మిక్కిలి ఎత్తుగలేచిన పక్షిని జూడజాలనట్లు, చూడజాలవు.

ప్రత్యక్చేతనమాభాసం శుద్ధం సంకల్పవర్జితమ్
అగమ్యమేనమాత్మానం విద్ధి దూరం దృశామివ. 5

శుద్ధమును, సంకల్పవర్జితమును అగు ఈ ఆత్మ ప్రత్యక్-చేతనమై వివిధవిషయముల ప్రకాశింపజేయునదియేయైనను, దూరముననున్న వస్తువువలె అదర్శనీయమైయున్నది.

సర్వాతీతం యదత్యచ్ఛం వినా శుద్ధం స్వవాసనా
న శక్నోతి పదం ద్రష్టుం జనదృష్టిరణూనివ. 6

సర్వాతీతమును, పరమపవిత్రమునునగు ఈ పరమపదము శ్రవణమననాది శుద్ధవాసనలు లేకున్న, అణువువలె దుర్నిరీక్ష్యమగును.

యత్ప్రాప్తా సర్వ ఏవేమే క్షీణా ఘటపటాదయః
వరాకీ వాసనా తత్ర కిం కరోతు పరే పదే. 7

ఈ ఆత్మనుబొందిన, స్థూలములగు ఘటపటాదుల ఆభాసకూడ నశించుచున్నది; అగుచో నత్యంతసూక్ష్మమగు వాసన ఏమి చేయగలదు ?

యథాఽనలగిరిం ప్రాప్య హిమలేశో విలీయతే
శుద్ధమాసాద్య చిత్తత్త్వమవిద్యా లీయతే తథా 8

హిమబిందువు అగ్నిపర్వతమునుజేరి విలీనమగునట్లు, శుద్ధమగు ఆత్మతత్త్వమునుబొంది అవిద్యగూడ విలీనమగును,

క్వ వరాకే రజస్తుచ్ఛా వాసనా భోగబన్ధనమ్
క్వ పూరితజగజ్జాలశ్చిత్తత్వవిపులానిలః. 9

భోగబంధనకారియును, క్షుద్రమగు ధూళికణమువలె అత్యంతతుచ్ఛమునునగు వాసన యెచట! జగత్తులనన్నిటిని వ్యాపించియున్న చైతన్యవాయువు యెచట!

తావత్స్ఫురత్యవిద్యేయం నానాకారవికారిణీ
యావన్న సంపరిజ్ఞాతః శుద్ధః స్వాత్మాఽయమాత్మనా. 10

ఆత్మవలన శుద్ధమగు ఆత్మ సంపూర్ణముగ గ్రహింపబడనంతవఱకే, నానావిధవికారముల దోపించి అవిద్య సనుపడుచున్నది.

సర్వా దృశ్యదృశః క్షీణాః స్వచ్ఛాత్తేవోదితా తథా
నభసీవ పదే తస్మిన్స్వాత్మన్యఖిలపూరణే. 11

దృశ్యములన్నియు నశించి, స్వచ్ఛతకలుగ, తనయందన్నిటిని నింపుకొనునదియును, ఆకాశమువలె పూర్ణమునునగు ఆ పరమాత్మయొక్క రూపము ఉదయించును.

సమగ్రాకారరూపం తత్సమగ్రాకారవర్జితమ్
వాగతీతం పరం వస్తు కేన నామోపమీయతే. 12

పూర్ణమును, జగద్వర్జితమును, వాగతీతమునగు ఆ పరమవస్తువు దేనితో పోల్పబడగలదు?

విషయవిషవిషూచికామతస్త్వం
నిపుణమహాంస్థితివాసనామపాస్య
అభిమతపరిహారమన్త్రయుక్త్యా
భవ విభవో భగవాన్భియామభూమిః. 13

నీవు హృదయమునమున్న వాసనలను విషూచికను నివృత్తిమంత్రమున నేర్పుతో పారదోలి, సంసార-భయరహితుడగు భగవంతుడవై వెలయుము.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇతి గదితవతి త్రిలోకనాథే
క్షణమివ మౌనముపస్థితే పురస్తాత్
అథ మధుప ఇవాఽసితాబ్జఖణ్డే
వచనముపైష్యతి తత్ర పాణ్డుపుత్రః. 14

శ్రీ వసిష్ఠుఁడు:—త్రిలోకనాథుడగు హరి ఇట్లునుడివి, అర్జునుని యెదుట మౌనమును వహించి ఒకింతతడవుండును. అప్పుడర్జునుడు తుమ్మెద తెల్దామరతో బల్కునట్లు, హరితో నిట్లనును.

అర్జున ఉవాచ :—

పరిగలితసమస్తశోకభారా
స్ఫురదుదయం భగవన్మతిర్గతేయమ్

మమ తవ వచనేన లోకభర్తు
ర్దినపతినా పరిబోధితాబ్జినీవ. 15

అర్జునుడు:—భగవంతుడా! నీయొక్క వచనబలమున, లోకపతియగు సూర్యునిచే కమలిని ప్రబోధితమగునట్లు, నా మతిగూడ పరమజ్ఞానమును బడసినది; శోకరభామంతయు దూరమైపోయినది.

ఇత్యుక్త్వోత్థాయ గాణ్డీవధన్వా స హరిసారథిః
అర్జునో గతసందేహో రణలీలాం కరిష్యతి. 16

కృష్ణసారథియును, గాండీవధన్వియునునగు అర్జునుడు ఇట్లుపల్కి, లేచి, సందేహశూన్యుడై రణలీల నొనర్చును.

కరిష్యతి క్షతగజవాజిసారథి
ద్రుతక్షరద్రుధిరమహానదీం భువమ్
శరోత్కరప్రసరమహారజఃస్థలీ
తిరోహితద్యుమణివిలోచనాం దివమ్. 17

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే అర్జునోపాఖ్యానే అర్జునకృతార్థతా నామాష్టపఞ్చాశః సర్గః ॥ 58 ॥

---

అర్జునోపాఖ్యానం సమాప్తమ్.

ఆ అర్జునుడు హస్తి, అశ్వ, సారథుల గాయపఱచి, వేగముగా పరువిడు రక్తనదులతో భూమిని నింపివేయును. ఆకాశముయొక్క సూర్యుడను నేత్రము, తత్ - బాణపరంపరోద్ధితమగు ధూళితో గప్పివేయబడును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున అర్జునోపాఖ్యానమున అర్జునకృతార్థతయను ఏబదియెనిమిదవ సర్గము ॥58॥
ఇది అర్జునోపాఖ్యానము.

---

## ఏకోనషష్టితమః సర్గః.

---

[జీవన్ముక్తపదేఽస్పన్దా చేత్యముక్తా చితః స్థితిః
సుస్థిరా స్యాద్యయా దృష్ట్యా సా దృష్టిరిహ వర్ణ్యతే.

ఏ దృష్టినవలంబింప జీవన్ముక్తస్థితిచ్యుతిరహితమై నిరుపాధికబ్రహ్మసమమై వెలయగలదో ఆదృష్టి యిటవర్ణింపబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతాం దృష్టిమవష్టభ్య రాఘవాఽఘవినాశినీమ్
తిష్ఠ నిఃసఙ్గసంన్యాసబ్రహ్మార్పణమయాత్మకః.

శ్రీవసిష్ఠుడు:— రాఘవా! పాపనాశనమగు ఈ దృష్టినవలంబించి, నిస్సంగమగు సన్న్యాసమున అనగా నామరూపాత్మకమగు జగత్తునంతటిని బ్రహ్మముతో నైక్యమొనరించి వెలయుము.

యస్మిన్సర్వం యతః సర్వం యః సర్వం సర్వతశ్చ యః
యశ్చ సర్వమయో నిత్యమాత్మానం విద్ధి తం పరమ్. 2

సృష్టిస్థితిలయముల నొనర్చుచు, త్రికాలసత్యమై, నిత్యముగ నెగడువానినిగా ఈ పరమాత్మను గ్రహింపుము.

దూరస్థమప్యదూరస్థం సర్వగం తత్స్థమేవ చ
తత్స్థః సత్తామవాప్నోషి తదేవాస్య స్త్వసంశయః. 3

ఈ పరమవస్తువు ప్రపంచశూన్యమగుటవలన దూరముగనున్నదియేయైనను, సర్వవ్యాపియగుటవలన దగ్గఱనున్నదేయగుచున్నది. నీవు దానియందు ప్రతిష్ఠితుడవైన, అపరిచ్ఛిన్నమగు ఆ వస్తువే యగుదువు — నీకు దానినుండి భిన్నమగు ఉనికి సంభవింపదు.

యత్సంవేద్యవినిర్ముక్తం సంవేదనమనిర్మితమ్
చేత్యముక్తం చిదాభాసం తద్విద్ధి పరమం పదమ్. 4

చిత్తవృత్తుల ప్రతిబింబించునదియును, సాక్షియును అగు వస్తువే జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము లను త్రిపుటిభేదములేనిదైన, నయ్యదియే పరమపదమని గ్రహింపుము.

సా పరా పరమా కాష్ఠా సా దృశాం దృగనుత్తమా
సా మహిమ్నాం చ మహిమా గురూణాం సా తథా గురుః. 5

అది ఆనందములన్నిటికిని తుదికొన. దృక్కుల కన్నిటికిని పరమదృక్. మహత్త్వవిషయములన్నింటిలోను పరమ శ్రేష్ఠము. గౌరవనీయములన్నింటికిఁగూడ గౌరవనీయము.

స ఆత్మా తచ్చ విజ్ఞానం స శూన్యం బ్రహ్మ తత్పరమ్
తచ్ఛ్రేయః స శివః శాన్తః సా విద్యా సా పరాస్థితిః. 6

పరమవస్తువగు ఈ యాత్మ సంవిత్స్వరూపము, శూన్యవస్తువుకాదు. పరమగతియును, జ్ఞానమయమునునగు ఈ శాంతవస్తువు మంగళదాయకమగు శ్రేయవస్తువు.

యోఽయమన్తశ్చితేరాత్మా సర్వానుభవరూపకః
యత్ర స్వదన్తే సర్వాణి స్వాత్మద్రవ్యాణి సత్తయా. 7
స జగత్తిలతైలాత్మా స జగద్గృహదీపకః
స జగత్పాదపరసః స జగత్పశుపాలకః. 8

ఈ దేహమునందు అనుభవములన్నిటికిని ఆత్మయని చెప్పబడునదియును, ఎద్దాని యునికి వలన పదార్థములన్నియును సత్స్వరూపములుగ దోచుచున్నవో, ఆ బ్రహ్మవస్తువే జగత్తను తిలలకు తైలము, జగత్తను గృహమునకు దీపము, జగత్తను వృక్షమునకు రసము, జగత్తను పశువులకు పాలకము నైయున్నది.

స తన్తుర్భూతముక్తానాం పరిప్రోతహృదమ్బరః
స భూతమరిచౌఘానాం పరమా తీక్ష్ణతా తథా. 9

ఇదియే ప్రాణులను మత్యములయందున్న ఆకాశమును వ్యాపించియున్న సూక్ష్మ — సూత్రము. ఇదియే భూతములను మరిచి (మిరియము) సమూహములనున్న, తైక్ష్ణ్యము.

స పదార్థే పదార్థత్వం స తత్త్వం యదనుత్తమమ్
స సతో వస్తునః సత్త్వమసత్త్వం వా సతః స్వతః. 10

ఇదియే పదార్థముల పదార్థత్వము, పరమతత్త్వము, సద్వస్తువుల సత్త, అసద్వస్తువుల మిథ్యాత్వము నైయున్నది.

యః స్వవిత్తివిచిత్రేణ స్వయమాత్మైవ లభ్యతే
సర్వ ఏవ జగద్భావా అవిచారేణ చారవః. 11

జ్ఞానదార్ఢ్యమువలన లభ్యమగు ఏకమాత్రవస్తువే యాత్మయే. ఈ జగద్భావములన్నియును అజ్ఞానమువలననే ప్రకాశించుచున్నవి.

అవిద్యమానాః సద్భావా విచారవిశరారవః
అహమాదౌ జగజ్జాలే మిథ్యాభ్రమభరాత్మని. 12

ఈ పదార్థసమూహములన్నియును విచారమువలన నశించును; అహంకారము మొదల్గాని జగత్సమూహములన్నియును ఆత్మయందు కల్పింపబడిన భ్రమలే.

కోను భూత్వాఽనుబధ్నామి వృత్తిం కథమవాప ధీః
ఆద్యమధ్యాన్తమానాని సంకల్పకలనాన్యహమ్. 13
బ్రహ్మాకాశమనాద్యన్తం త్వేవేయత్తా మమాత్మనః
ఇతి నిశ్చయవానన్తః సమ్యగ్వ్యవహృతిర్బహిః. 14

ఈ పదార్థముల విశ్వాసముంచువారందఱును బద్ధులగుచున్నారు. ఇవి అన్నియును మొదటు తుదనుగూడ అహంకారమే; ఆద్యంతరహితమగు నా బ్రహ్మాకాశమును ఎవరు ఇట్టిదనిచెప్పగలరు? ఇట్టినిశ్చయమునుబొందినవారు కర్మలనన్నిటిని చక్కగ నాచరించువారే యగుచున్నారు.

ఉదయాస్తమయోన్ముక్తస్థితిరన్తః స సర్వదా
నాస్తమేతి న చోదేతి మనః సమసమస్థితమ్. 15

ఈవిధమగు సమస్థితిని బొందినవారి మనస్సు ఎన్నడును ఉదయమును లేక అస్తమయమును బొందదు.

యస్య స్వస్యైవ శూన్యత్వం స మహాత్మా తద్వపుః
భావాద్వైతపదారూఢః సుషుప్తపరయా ధియా. 16
వ్యవహార్యపి సంక్షోభం నైత్యాదర్శనరో యథా
ఆదర్శపురుషస్యేవ వ్యవహారవతోఽపి చ. 17
న యస్య హృదయోల్లేఖో మనాగపి స ముక్తిభాక్
అవిభాగమివాదర్శే చిన్మణౌ ప్రతిబిమ్బతి. 18
చితేః పరమనైర్మల్యాద్వ్యవహారో యథా గతేః
చిచ్చమత్కృతిరేవేయం జగదిత్యవభాసతే. 19

జగచ్ఛూన్యమగు బ్రహ్మమయశరీరమును బొందినవాడు అద్వైతభావము నధిరోహించి నిద్రయందుండు మనస్సువలె నిర్వికారుడై, వ్యవహారముల నన్నిటిని సల్పుచున్నను క్షోభను బొందడు. అద్దమునందు పడు పురుషునకు మానావమానముల క్షోభలేనందురీతి, ఏ ఆదర్శపురుషునకు, వ్యవహారముల సల్పుచున్నను హృదయము ఒకించుకయు చలింపకుండునో, అతడే ముక్తిని బొందగలుగును. అద్దమున ప్రతిబింబము పడినను అయ్యది తన స్వరూపమును కోల్పోవనట్లు, ఈచిన్మణియందు జగత్తులు పడినను అయ్యది తన స్వరూపమును గోల్పోవుటలేదు. పరమనిర్మలమగు చిత్తున ఈ వ్యవహారములన్నియు ప్రతిబింబించుచున్నవి; మఱియు, చిత్ - చమత్కృతియగు ఈ జగత్తుగూడ ప్రకాశించుచున్నది.

నేహాస్త్యైక్యం న చ ద్విత్వం మమాదేశోఽపి తన్మయః
వాచ్యవాచకశిష్యేహగురువాక్యైశ్చమత్కృతైః. 20

వాస్తవమునకు ఆ చిత్తుగాక, ఐక్యము, ద్విత్వము, నా ఉపదేశము, గురుశిష్యుల ఉపదేశ, తద్గ్రహణములు, వేఱుగావు.

ఆత్మనాత్మని శాన్తైవ చిచ్చమత్కురుతే చితి
చిత్స్పన్దో హి సంసార స్తదస్పన్దః పరం పదమ్. 21

శాంతమగు ఆత్మ తనయందు తానే వివర్తమునందుచున్నది. చిత్ యొక్క వివర్తమే ఈ జగత్తు, వివర్తమందకుండుటయే పరమపదము.

చిత్స్పన్దశమనేనేయం పరిశామ్యతి సంసృతి
మహాచిత్తే న తేఽర్థాంశభావా యో భావనాక్షయః. 22

వివర్త ముపశమించిననే సంసార ముపశమించును, మహా - చిత్తు అగు అపరిచ్ఛిన్న బ్రహ్మమున ఈ జగత్కల్పనలన్నియు ఉపశమింపజేయబడిన, ఆ పరమపదము లభించును; అదియే వాసనాక్షయము,

అసన్నపి స్వభావం తత్సంవిత్స్పన్ద ఉదాహృతమ్
శూన్యత్వమజడం యత్తత్పరమాహుశ్చితేర్వపుః. 23

ఈ సంవిత్ - స్పందము కాల్పనికమగుటవలన అనుభవనిష్ఠులగువారు, అజడమగు స్పందశూన్యత్వమే బ్రహ్మస్వభావమని చెప్పుచున్నారు.

తత్త్వేన భావనాయత్తా సంసృతిః సానుభూయతే
అభావనామాత్రలయాత్సా చ నిఃసారరూపిణీ. 24

ఆ-నాత్మదర్శనరూపమును, జడజగదాకృతియునునగు ఈ జగత్-కల్పనను సత్యమని నమ్మిన, అట్లే తోచుచున్నది. ఈ భావనను లయమొనర్ప, అది సారశూన్యమగుచున్నది.

కేవలం కేవలీభావాత్తద్రూపా సైవ శిష్యతే
చిత్స్పన్దమేవ సంసారచక్రప్రవహణం విదుః. 25

ఈ భావనను చైతన్యముతో నైక్యమొనరింప చైతన్యమొక్కటియే మిగులును. చైతన్యము యొక్క వివర్తమే సంసారచక్రభ్రమణమని జ్ఞానులెఱుంగుదురు.

మాతృమానప్రమేయాది కటకాదీవ హేమని
పృథగస్తి న చ స్పన్దశ్చితేర్యా సంసృతిర్భవేత్. 26

ప్రమాతృప్రమేయాదిభావములన్నియును, కటకాది ఆభరణములు సువర్ణమునుండి వేఱుగానట్లు, బ్రహ్మమునుండివేరుగావు. చిత్స్పందమే సంసృతి.

చిత్తమేవ చితిస్పన్దస్తదబోధో హి సంసృతిః
అబోధమాత్రే చిత్స్పన్దః కటకత్వమివోత్థితమ్. 27

చిత్తమే చితిస్పందము. దీనిని దెలియకుండుటయే అజ్ఞానము. అజ్ఞానమువలన, కటకాదులు బంగారమునుండి వేఱుగదోచునట్లు, బ్రహ్మముకంటె వేఱుగ జగత్తు తోచుచున్నది.

బోధమాత్రవిలీనేఽస్మిఞ్ఛుద్ధా చిద్రామ శిష్యతే
స్వభావబోధమాత్రేణ క్షీయతే భోగవాసనా. 28

రామా! ఇయ్యది జ్ఞానముకలిగినంతనే విలీనమగుచున్నది. అప్పుడు శుద్ధమగు చిత్తుమాత్రమే మిగులును; ఆత్మతత్త్వమును గ్రహించినంతనే భోగవాసన క్షీణించును.

భోగాభావనమేవేహ పరమం జ్ఞత్వలక్షణమ్
ఇతో నాభిమతాః సర్వే జ్ఞస్య భోగాః స్వభావతః. 29
భవన్తి కోఽతితృప్తో హి మరన్నం కిల వాఞ్ఛతి
ఏతదేవ పరం విద్ధి జ్ఞత్వస్యాపరలక్షణమ్. 30

భోగముల జింతింపకుండుటయే జీవన్ముక్తుని లక్షణము. జీవన్ముక్తుడు స్వాభావికముగ భోగముల జింతింపకుండుటకు గలకారణము, ఆత్మతత్త్వముకంటె నియ్యవి ప్రియకరములు గాకుండుటయే! తృప్తిగ భుజించినవాడు అఖాద్యమును గోరునా? జీవన్ముక్తుని పరమలక్షణము ఇంకొకటియున్నది. (దానిని జెప్పుచున్నాడను, వినుము.)

స్వభావేనైవ భోగానాం యత్కిలానభివాఞ్ఛనమ్
చిత్తత్స్వన్దైన సర్వాత్మరూపిణ్యాస్తీతి నిశ్చయః. 31

అతడు భోగములను స్వాభావికముగనే వాంఛింపకుండును; ఆత్మయొక్కటియే భోగ్యభోక్తృత్వాది నానావిధరూపములనున్నదను నిశ్చయజ్ఞానమాతనికుండును.

యోఽన్తఃప్రరూఢః స్వభ్యాసో జ్ఞత్వశబ్దేన స స్మృతః
యో న భుఙ్క్తే భుజ్యమానానపి భోగాన్స బుద్ధిమాన్. 32

ఈ నిశ్చయము అభ్యాసమువలన హృదయమున నాటుకొనిపోవునట్లు ఒనర్చుకొనినవాడే జీవన్ముక్తశబ్దవాచ్యుడు. ఆ బుద్ధిమంతుడు భోగముల ననుభవించుచున్నను, అనుభవింపనివాడే యగును.

లోకానురోధసిద్ధ్యర్థం స హన్తి లగుడైర్న భిః
వినాకృత్రిమయా బుద్ధ్యా న సిద్ధిరవగమ్యతే. 33

లోకానురోధముచే వాని క్రియలు ఆకాశమును గొట్టుటవంటివే యగును. కృత్రిమ వ్యావహారికబుద్ధిని భ్రాన్తిరూపమని దలంపనిచో నిరతిశయానందరూపమగు ఆత్మశక్యప్రాప్తియను సిద్ధి లభింపదు.

క్వచిదాత్మావలోకే చ స్వాజ్ఞావదలనైరపి
చిచ్చేత్యం చేత్యకోటిస్థా తావత్పశ్యతి విభ్రమమ్. 34

ఈ పదార్థసమూహములనన్నిటిని ఆత్మయందు విలీనమొనర్పకుండ, తన శరీరమును ఖండించుకొనుటను బోలు సాహసకార్యము నాచరించినను, ఈ భ్రమ తొలుగదు.

ఇదం యావదబోధాత్మా స్పన్దతే స్పన్దరూపిణీ
సమ్యగ్బోధోదయోऽన్తః స్యాత్స్పన్దాస్పన్దదశాక్రమః. 35
క్వాపి యాతి చ సంశాన్తదీపవత్సాభిధానకః
చితః ప్రశాన్తరూపాయా దీపికాయాః స్వభావతః. 36
స్పన్దాస్పన్దమయీ నేహ కథైవాస్తి మనాగపి
యదస్పన్దస్య మరుతో న సన్నాసన్న మధ్యగమ్. 37
రూపం తదేవాసంవిత్తిస్పన్దాయాః ప్రశమం చితేః
అభిన్నః స్యాచ్చితః స్పన్దః శుద్ధచిత్స్ఫురరూపధృక్. 38
న బన్ధాయ న మోక్షాయ స్థితి ఆత్మని కేవలమ్
చిచ్చేన్నిరర్థసంవిత్తినిర్వాణేన చ విన్దతే. 39
తద్బన్ధమోక్షపక్షాదేర్నామాపీహ న విద్యతే
మోక్షోऽస్త్విత్యేవ బోధోऽన్తః పూర్ణతా క్షయకారణమ్ 40

అంతవఱకు అజ్ఞానరూపమగు ఈ స్పందనము కలుగుచునేయుండును. పరిపూర్ణజ్ఞానము కలిగిన, వివర్తము దాని వికారము లన్నిటితోడను గలసి నశించును, ఇది దీపము ఆరిపోయి, తన పేరునుగూడ పోగొట్టుకొనుటవంటిది. ప్రశాంత-దీపికనుబోలు ఈ చిత్తున స్పందాస్పందము లెవ్వియునులేవు ప్రాణవాయువు, చలనరహితమగుటను సత్తనిగాని అసత్తనిగాని లేక అనిర్వచనీయమనిగాని చెప్పజాలము. అజ్ఞానస్పందరహితమును, చిత్తత్వమును, అగుమోక్షముగూడ ఇట్టిదే. చిత్తము స్పందశూన్యమై, శుద్ధచిత్తుగమారిన, అది కేవల మాత్మస్వరూపమేయై బంధమోక్షములకు గారణము కాకుండును. ఈచిత్తు వ్యర్థమగు చిత్తాకృతిని గ్రహించుట, త్యజించుట నొనర్పకున్న, బంధమోక్షములే దీనికుండవికావు 'మోక్షము లభించుగాక' అను భావముకూడ అంతఃపూర్ణతకు హానిని కలిగించుచున్నది.

సమాస్త్విత్యపి బన్ధస్తే శ్రేయోऽసంవేదనం పరమ్
యదనాభాసమజడం తద్విద్ధి పరమం పదమ్. 41
చితః స్వరూపం సంస్థానమచేత్యోన్ముఖతాత్మకమ్
యః సంకల్పనశబ్దార్థరూపః స్పన్దో మహాచితః. 42
బన్ధమోక్షాదికార్యోऽసౌ ప్రేక్ష్యమాణః ప్రణశ్యతి
ప్రేక్షణాదేవ సంశాన్తే త్వహంభావే నిరాస్పదే. 43

న విద్మః కేన కిం కస్య బధ్యతే వాథ ముచ్యతే

ఓ రామచంద్రా! 'ఆ మోక్షము నాకు వలద'ను జ్ఞానముచేతను నీకు బంధనమగును గాన బంధమోక్షముల స్మరింపకుండుటయే నీకు శ్రేయోదాయకమగును. స్వయంప్రకాశమై, చైతన్య స్వరూపమై, సర్వాశ్రయమై, విషయవర్జితమైనట్టి చైతన్యము నే నీవు పరమపదమని యెఱుంగుము. సంకల్పముయొక్క శబ్దార్థరూపమగు మహాచైతన్యముయొక్క, స్పందమేదిగలదో, అదియే బంధమోక్షముల కధికారి. ఆ స్పందమును చూచినంత (ఎఱింగినంత) మాత్రముననే అయ్యది నశించుచున్నది. ఇట్లు ప్రేక్షణమాత్రముచేతనే అహంకారము శమించి, ఆశ్రయరహితముకాగా, ఇక ఎవనికి ఏది దేనిచేత బంధింపబడుచున్నది? దేనిచేత విడువబడుచున్నది?

సంకల్ప ఏవ రచితే బుధశ్ఛేదవిభాగవాన్. 44
తదసంకల్పమస్పన్దం సర్వం జాతమవారితమ్
స్పన్దే స్పన్దమయే వాతే తన్మయత్వాత్సదా జితా. 45

వివేకియగువాడు తనచే రచితమగు సంకల్పముననే 'దీనిని నేను సంకల్పించితిని, దీనిని సంకల్పించలేద'ను నీప్రకారమగు పూర్వాపరవిమర్శచే తద్విభాగమును త్యజించి, అట్టి స్వనిర్మిత సంకల్పమును మిథ్యగా గాంచుచున్నాడు. కాన, సంకల్పింపబడినదైనను అయ్యది స్పందరహితమై, లేనిదానివలె నేయుండును. ఇవ్విధమున ప్రబుద్ధచైతన్యముచే స్పందము, స్పందమయవాయువు క్షయింప, దృశ్య ప్రపంచమున్ను క్షయించుచున్నది.

సంక్షీణేన చ సంసారో నిష్పన్దే చిద్ఘనే స్థితే
చిత్తేజ ఏవ చిత్స్పన్ద ఇతి బుద్ధే నిరన్తరమ్. 46

చిద్ఘనమాత్రమగు ఆత్మ స్పందరహితముగ స్థితినొందియుండ నద్దానితేజమే చిత్-స్పందరూపమగుచున్నదని నిరంతరము బోధకలుగఁగా, ఆ చిత్-స్పందముచే నుత్పన్నమగు జగత్తున్ను తనంతట నదియే నశించుచున్నది.

వ్యతిరిక్తశ్చితః స్పన్దో న కించిదవశిష్యతే
అస్మిన్దృశ్యమయే దీర్ఘస్వప్నే స్వప్నాన్తరం వ్రజన్
న జ్ఞో మోహాముపాదత్తే సర్వగత్వాత్స్వసంవిదః. 47

ఓ రామచంద్రా! చైతన్యముయొక్క ప్రకాశమే చిత్-స్పందమును, జ్ఞానము నిరంతరము కలుగగా, ఆ చైతన్యప్రకాశముకంటె భిన్నముగ ఏ చిత్-స్పందమున్ను నిక మిగిలియుండదు. జ్ఞాని, ఈదృశ్యమయమగు దీర్ఘస్వప్నమున స్వప్నాంతరమును పొందుచున్నట్లున్నను తన జలనాదులగూర్చిన భ్రమను గలిగియుండడు. ఏలయనిన, ఆతడు తన ఆత్మను సర్వవ్యాపిగ నెఱుగుచున్నాడు.

యత్రోదేతి ప్రసభమనిశం సర్వసంవిత్తిసత్తా
యస్మిన్నేతే సకలకలనాకారపఙ్కా గలన్తి
ఉద్యన్త్యేతే స్వదనసుభగం యత్ర సర్వోపలమ్భా
ధ్యానేనైవం తమవగమయ ప్రత్యగాత్మానమన్తః. 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ప్రత్యగాత్మావబోధో నామైకోనషష్టితమః సర్గః ॥ 59 ॥

**ఓ రాఘవా !** ఏ పరమాత్మయందు నిరంతరము బలాత్కారముగ సమస్త జగదాకారప్రాప్తియు, అద్దానినుండి ప్రీతిపూర్వకమగు (విషయ) ఆనందాస్వాదనానుభవమున్ను గలుగుచున్నవో ఏవనియందు సమస్తసృష్టిసమూహముల సత్తాస్థితి జనించుచున్నదో, ఆ నీసాక్షిరూపమగు పరమాత్మను ధ్యానముచే అంతఃకరణమున నీవు వీక్షింపుము.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ప్రత్యగాత్మావబోధమను ఏబది తొమ్మిదవ సర్గము ॥ 59 ॥

---

## షష్టితమః సర్గః.

అద్వితీయస్య శుద్ధస్య పరస్య నిజమాయయా
సర్వాకారైః స్థితిరిహ విభూతిరుపదిశ్యతే.

[నిజమాయచే విభూతులద్వారా సర్వాకారములతోటి అద్వితీయ శుద్ధపరమాత్మయొక్క స్థితి యిట వర్ణింపబడుచున్నది. ]

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

ఏవమాద్యం పరం తత్త్వం చిద్ఘనం పరమం పదమ్
తత్స్థా ఏతే మహారూపా బ్రహ్మవిష్ణుహరాదయః. 1
విభూతిభిః స్ఫురన్త్యన్యే చైత్రజ్ఞనాస్తుష్టా నృపా ఇవ
ఆకాశగమనాద్యాభిః క్రీడాభిః క్రీడ్యతే చిరమ్. 2
తత్స్థేనైవ జనేనేహ స్వర్గే స్వర్గౌకసో యథా
తత్రాప్యాజ్ఞ న మ్రియతే తత్రాప్యాజ్ఞ న శోచ్యతే. 3

వసిష్ఠుడు:— ఓరామచంద్రా! ఈప్రకారముగ సమస్తమునకు ఆది, ఆ చిన్మాత్రమైన, పరతత్త్వరూపమగు ఆత్మపదమై యున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వరాది మహత్స్వరూపులున్ను ఆపరమ పదమున నెలకొన్నవారలై, పరమానంద పూరితులై, భూపాలురవలె, మహాశోభను బొందుచున్నారు. ఆ బ్రహ్మమునన్న న్యూనాధిక ఆనందయుక్తులగు మనుష్య గంధర్వాదిజనులు ఆకాశగమనాది క్రీడలచే, స్వర్గవాసులు స్వర్గమునందు క్రీడించునట్లు చిరకాలము క్రీడించుచున్నారు. మనుష్యానందము మొదలుకొని బ్రహ్మ విష్ణు మహేశ్వరాదుల ఆనందము వఱకు గల ఆనందముల పరాకాష్ఠస్వరూపమగు అట్టియాబ్రహ్మమును బొందిన జీవుడిక మరణింపడు, దుఃఖము నొందడు.

తత్రాప్య జీవ్యతే నాజ్ఞ తత్రాప్యాజ్ఞ న రుధ్యతే
అపారపరమాకాశరూపిణః పరమాత్మనః 4

సత్తాసామాన్యరూపం చేన్మనాగపి విభావ్యతే
తత్త్వం నిమేషమాత్రేణ జన్తుర్ముక్తమనా మునిః
కుర్వన్సంసారకర్మాణి న భూయః పరితప్యసే. 5

ఆబ్రహ్మమును బొందిన జీవుడిక ప్రాణధారణ నిమిత్తములకు ఆకలిదప్పులచే బీడింపబడఁడు; భిత్తియున్నను వానిచే నిరోధింపబడఁడు, ఆపరమాత్మయొక్క సత్తాసామాన్యరూపమును (సర్వవ్యాపియగు చిన్మాత్రమును) జీవుడు కొంచమైన నెఱింగినచో ముక్తచిత్తుఁడగును. మఱియు ప్రపంచమున కార్యములొనర్చుచున్నను నట్టివాఁడు సంతాపమును బొందడు.

శ్రీరామ ఉవాచ:—

మనో బుద్ధి రహంకారశ్చిత్తం యత్ర క్షయం గతమ్,
సత్తా సామాన్యమాభాతం మనస్వి స కిముచ్యతే. 6

శ్రీరాముడు:—ఓమునీంద్రా! ఆ చిన్మాత్రమగు 'సత్తాసామాన్యమును' మనోబుద్ధ్యహంకారాది సమస్తము లీనమైనట్టి నిర్విశేషరూపముగా వచించుచున్నారా, లేక, మనోబుద్ధ్యహంకారాది సమస్తము గలిగియున్నట్టి సవిశేషరూపముగా వచించుచున్నారా? [నిర్విశేషమైనచో, అద్దాని విభూతి వర్ణనము యుక్తము కాజాలదు; సవిశేషమైనచో దుఃఖముయొక్క అభావము సంభవింపదను భావముచే శ్రీరాముఁడిట్లు ప్రశ్నించెను.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యద్బ్రహ్మ సర్వదేహస్థం భుఙ్క్తే పిబతి వల్గతి,
ఆదత్తే వినిహన్త్యన్తః సంవిత్సంవేద్యవర్జితమ్. 7
తత్సర్వగతమాద్యన్తరహితం స్థితమర్జితమ్,
సత్తాసామాన్యమఖిలం వస్తుతత్త్వమిహోచ్యతే. 8

శ్రీవసిష్ఠుడు:—శ్రీరామచంద్రా! ఇట సవిశేష, నిర్విశేషములచే నేమియు తాత్పర్యములేదు. ఏబ్రహ్మము సమస్తజీవరూపములందును, ఈశ్వరభావమునందును, ముక్తియందును గూడ అనుగతమై వ్యాపించియున్నదో, తినుట, త్రాగుట, గ్రహించుట మొదలగు సమస్తవ్యవహారములు గావించుచున్నదో, సుషుప్తి, ప్రళయములందు సమస్తమును లయింపఁజేయుచున్నదో, తురీయమందు విషయవర్జితమై యొప్పుచున్నదో, అట్టి సర్వవ్యాపియు, ఆద్యంతరహితమును, విస్మృతకంఠమణివలె జ్ఞానముచే ప్రాప్తమును, సత్తాసామాన్యమును, సర్వరూపమును నగు బ్రహ్మతత్త్వమునుగూర్చిన యుపదేశమే యిట గావింపఁబడినది.

తత్స్థితం ఖతయా వ్యోమ్ని శబ్దే శబ్దతయా స్థితమ్,
స్పర్శే స్థితం స్పర్శతయా త్వచి తత్త్వాకయా స్థితమ్. 9
రసే లీనం రసతయా రసనాయాం తు తత్తయా
రూపే రూపతయా దృష్టం నేత్రే లీనం చ దృక్తయా. 10
ఘ్రాణే ఘ్రాణతయా దృష్టం గన్ధే గన్ధతయోదితమ్,

పుష్టం కాయతయా కాయే భూమావపి చ భూతయా. 11
పయస్తయా చ పయసి వాయౌ వాయుతయా స్థితమ్,
తేజస్తయా తేజసి చ బుద్ధౌ బుద్ధితయా గతమ్. 12
మనస్తయా మనస్యన్తరహంకృత్యామహంకృతౌ
రూఢం సంవిది సంవిత్త్యా చిత్తే చిత్తతయోత్థితమ్. 13
వృక్షే వృక్షతయా లగ్నం పటే పటతయోదితమ్,
ఘటే ఘటతయా రూఢం వటే వటతయోత్థితమ్. 14
స్థావరే స్థావరత్వేన జంగమత్వేన జంగమే,
పాషాణత్వేన పాషాణే చేతనత్వేన చేతనే. 15
అమరేష్వమరత్వేన నరత్వేన నరేషు చ,
తిర్యక్త్వేన చ తిర్యక్షు క్రిమిత్వేన క్రిమిష్ఠితౌ. 16
కాలక్రమే కాలతయా ఋతావృతుతయా తథా,
త్రుటిక్షణనిమేషాదౌ సంస్థితస్తత్తయా విభుః. 17
శుక్లే శుక్లతయా జాతం కృష్ణే కృష్ణతయా స్థితమ్,
క్రియాసు స్పన్దరూపేణ నియతౌ నియమేన చ. 18
సంస్థితః సంస్థితౌ స్థిత్యా నాశే నాశతయా స్థితః,
ఉత్పత్తిరూపేణోత్పత్తావాస్థితః పరమేశ్వరః. 19
బాల్యేన బాల్యే విశ్రాన్తో యౌవనే యౌవనేన చ,
జరసా చ జరారూపే మరణే మరణేన చ. 20

ఆ ఆత్మయగు బ్రహ్మమే ఆకాశమున ఆకాశము రూపముగను, శబ్దమందు శబ్దరూపముగను, స్పర్శమందు స్పర్శరూపముగను, త్వగింద్రియమున త్వగ్రూపముగను నున్నది. అట్లే ఘ్రాణమందు ఘ్రాణరూపముగను, గంధమందు గంధరూపముగను నయ్యది ప్రకటమగుచున్నది. ఆ యాత్మయే శరీరమున శరీరత్వ (పుష్టి) రూపముగను, పృథ్వియందు పృథ్వీరూపముగను, జలమందు జలరూపముగను, వాయువునందు వాయురూపముగను, తేజమందు తేజోరూపముగను, బుద్ధియందు బుద్ధిరూపముగను, మనమున మనోరూపముగను, అహంకారమున అహంకారరూపముగను, సంవిత్తున సంవిద్రూపముగను, చిత్తమున చిత్తరూపముగను, వర్తించుచున్నది. ఆ విధముగనే వృక్షములందు వృక్షరూపముగను, వస్త్రమందు వస్త్రరూపముగను, ఘటమందు ఘటరూపముగను, వటమున వట రూపముగను, స్థావరమున స్థావరరూపముగను, జంగమమున జంగమరూపముగను, శిలయందు శిలా రూపముగను, చతుర్విధ ప్రాణులందు చేతనారూపముగను, ఆ పరమాత్మయే వెలయుచున్నాడు. అదేరీతిగా దేవతలందు దేవతారూపముగను, మనుష్యులందు మనుష్యరూపముగను, తిర్యగ్జీవులందు తిర్యగ్రూపముగను, (కృమి) కీటాదులందు కీటరూపముగను ఆ యాత్మ నెలకొనియున్నది. అట్లే యుగ, సంవత్సరాదులందు కాలరూపముగను, వసంతాది ఋతుభేదముగను, క్షణ నిమేషాదులందు క్షణ నిమేషాది రూపముగను, శుక్లపదార్థములందు శుక్లరూపముగను, కృష్ణపదార్థములందు కృష్ణ

రూపముగను, క్రియలందు క్రియారూపముగను, నియతియందు నియమరూపముగను, స్థితియందు స్థితి రూపముగను, నాశమున నాశరూపముగను, ఉత్పత్తియందు ఉత్పత్తిరూపముగను ఆ పరమేశ్వరుడే వర్తించుచున్నాడు. ఆ విధముగనే ఓ రామచంద్రా! బాల్యమందు బాలరూపముగను, యౌవనమున యౌవనరూపముగను, వార్ధక్యమున వృద్ధత్వరూపముగను, మరణమున మృత్యురూపముగను ఆ పరమాత్మయే స్థితిగల్గియున్నాఁడు.

ఇతి సర్వపదార్థానామభిన్నః పరమేశ్వరః,
కల్లోలసీకరోర్మీణామబ్ధావివ పయోధరః. 21

సముద్రమందు తరంగాదులకంటె జలము భిన్నముకానట్లు, సమస్త పదార్థములకంటెను పరమేశ్వరుడు భిన్నుడు కాకయే యున్నాఁడు.

నానాత్వైషాం త్వసత్యైవ సత్యేనానేన చైవ హి,
కల్పితా చిత్స్వభావేన వేతాలః శిశునా యథా. 22

మఱియు ఈ పదార్థములందే యనేకత్వము గోచరించుచున్నదో, అది అసత్యము. బాలుడు బేతాళమును గల్పించునట్లు, సత్యమగు చిత్స్వభావము ఈ జగత్తుయొక్క కల్పనగావించినది.

సర్వత్ర సంస్థితిమతా విగతామయేన
వ్యాప్తం మయేదమఖిలం వివిధైర్విలాసైః,
చిద్రూపిణైవ కలనాకలితాత్మనేతి
మత్వోపశాన్తమతిరాస్వ సుఖం మహాత్మన్. 23

మహాత్ముఁడవగు నో రామచంద్రా! 'అంతట వ్యాపించియున్న చిద్రూపుఁడనగు నేనే స్వయముగ జగత్తును కల్పించితిని! ఈ బ్రహ్మాండ మంతటిని, నేనే నా యనేక లీలలచే వ్యాప్తము గావించియున్నాను. ఇదంతయు నా విభూతియే (ఐశ్వర్యమే); నాకంటే వేఱుగ నెద్దియులేదు' అని యిట్లు నిశ్చయించి శాంతచిత్తుడవై స్వమహిమయందే నీవు వర్తింపుము.

శ్రీ వాల్మీకి రువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ,
స్నాతుం సభా కృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహాజగామ. 24

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే విభూతియోగోపదేశోనామ షష్టితమః సర్గః ॥ 60 ॥

షోడశో దివసః 16

శ్రీ వాల్మీకి:—ఓ అరిష్టనేమి రాజా! వసిష్ఠమునీంద్రుడిట్లు పల్కు, అపుడు సాయంసమయ మయ్యెను. సూర్యభగవానుడున్ను సాయంకాలవిధి నెరవేర్చుటకై అస్తమించెను. సభాసదులందఱు

పరస్పర మొకరికొకరు నమస్కరించుకొని, స్నాన, సంధ్యాది కృత్యముల నొనర్చుటకై వెడలిరి. ఆ రాత్రి గడచినపిమ్మట, మరల సూర్యోదయము కాఁగానే వారందఱును తిరిగి యా సభాస్థలమునకు విచ్చేసిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
విభూతియోగోపదేశమను అఱువదవ సర్గము ॥ 60 ॥
పదునాఱవరోజు ॥16॥

---

## ఏకషష్టితమః సర్గః

ఇహ ప్రసాధ్యతే యుక్త్యా స్వప్నమాయాసమం జగత్
సర్వత్ర చావిరోధేన భ్రాన్త్యా సర్వస్య సంభవః.

[యుక్తిననుసరించి ఈజగత్తు స్వప్నమాయాసమమని ఈసర్గమున సాధింపఁబడుచున్నది. భ్రాంతివలన ఇట్టి విపరీతము సంభవమనికూడ నిరూపింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

యథాస్మాకం మునే స్వప్నపురపత్తనమణ్డలమ్
తథైవ పద్మజాదీనాం యది దేహపరిగ్రహః. 1
తథా వేదం చ సంజాతం యది సర్వమసన్మయమ్
తదస్మాకం దృఢతరః ప్రత్యయః కథముత్థితః 2

శ్రీరాముడు :— మునీంద్రా ! హిరణ్యగర్భుఁడు మున్నగువారు శరీరమును దాల్చుట, మనము కలలో పురములను, పట్టణములను, గాంచుట వంటిదియేకదా ! అట్లే, ఈజగత్తుకూడ స్వప్నసమమైన, మనకియ్యది దృఢమను విశ్వాసమెట్లు కలిగినది?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అస్మత్సర్గవదాభాతి పూర్వసర్గః ప్రజాపతేః
ఆజీవప్రతిభాసాత్మా విద్యతే నతు వాస్తవః. 3

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా ! పూర్వకల్పమున హిరణ్యగర్భుఁడు జ్ఞానహీనుడుగనున్నప్పుడు అతఁడు కల్పించుకొనిన వాసనలే ఈజగత్తువలె దోచుచున్నవి. ఇప్పుడాతఁడు ముక్తినందియుండుటజేసి, ఆతనియొక్క అజ్ఞానము తత్త్వజ్ఞానమువలన బాధితమైనది. అందువలన వాస్తవముగ ఈ జగత్తు లేదు.

సర్వగత్వాచ్చితేః సర్వం జీవః సర్వత్ర సంసృతిః
సా చాసమ్యగ్దర్శనోత్థా సమ్యగ్దర్శననాశినీ. 4

చైతన్యము సర్వవ్యాపకమగుటవలన అజ్ఞానము తొలఁగనంతవఱకయ్యది జీవదశను బొంది అంతటను సంసారమును అనుభవించుచున్నది. ఈ సంసారము అసమ్యగ్ దర్శనమువలన అనఁగా అజ్ఞానమువలన కలిగినదగుటచే సమ్యగ్ దర్శనము, అనఁగా జ్ఞానప్రాప్తియైన నశించును.

సుదీర్ఘస్వప్నఖణ్డోఽయం యథోదేతి ప్రజాపతేః. 12
సర్గాఖ్యః సర్వభూతానాం ప్రత్యేకముదితస్తథా,
చిత్తత్వస్యైవ భావేన సర్గవర్గపరమ్పరా. 13
స్ఫురత్యమ్భో ద్రవత్వేన యథావర్తవివర్తనైః,
యథా స్వప్నాత్మికైవేయం సర్గలక్ష్మీర్న వాస్తవీ. 14

ఓ రామచంద్రా ! మనము స్వప్నమును జూచునప్పుడుకూడ అత్యాది సత్యమను తలంపే యుండును. అట్లే ప్రజాపతి కేవల మొక్క నిముషమునగాంచు ఈ జగత్స్వప్నము అత్యంతదీర్ఘముగ తోచుచున్నది. ప్రజాపతి ఈదీర్ఘస్వప్నమును జూచుట ఒక్క నిముషముననే. అదియే కల్పమని ఎంచఁ బడుచున్నది, సృష్టియనఁబడు ఈస్వప్నమును జీవులందఱును జూచుచున్నారు, మఱియు నపుడు చిత్తత్వముయొక్క కల్పనలగు ఈసృష్టిసమూహములు ద్రవపదార్థమగు నీటియందలలు లేచునట్లులేచు చున్నవి. స్వప్నసమములగు ఈసర్గవైభవములు సత్యములుకావు. ఇవి దృశ్యములగుటవలన మిథ్యయేయని గ్రహింపుము.

తదా సంభవతీదం వై తత్పదం ప్రలయం గతమ్,
యద్యథా యాదృశం దృష్టం తత్తాదృగ్విద్యతే తథా. 15
నహి పర్యనుయోక్తవ్యాః స్వప్నవిభ్రమరీతయః,
న తదస్తి జగత్యస్మిన్యన్న సంభవతి భ్రమే. 16

ప్రజాపతి సృష్టితోగూడ ప్రళయమునందిన వెంటనే అపరమవస్తు వొక్కటి మాత్రమే మిగిలియుండును. స్వప్నమున ఇట్టిభ్రమ అది - అసత్యమేయైనను - వ్యవహారయోగ్యమగుట సంభవమా? అని శంకింపవలదు. ఏదిఎట్లు గాంచబడుచున్నదో అది అట్లేయుండును. భ్రమవలన సంభముగానిది ఈజగత్తున ఏమియులేదు. భ్రమవలన అన్నియును సంభవింపగలవు.

విచిత్రాస్త్రిషు లోకేషు దృశ్యన్తే వస్తుదృష్టయః,
జలమధ్యే జ్వలత్యగ్నిర్యథాబ్ధౌ వడవానలః. 17

అజ్ఞానమువలన త్రిలోకములందు నానావిధములగు విచిత్రములు తోఁచుచున్నవి. నీటియందు నిప్పు ఉండుట అసంభవము కదా అదియును తోఁచుచున్నది. దృష్టాంతము సముద్రమునందలిబడబాగ్ని.

నగరాణ్యమ్బరే సన్తి యథా వైమానికాశ్రయాః,
శిలాస్వబ్జాని జాయన్తే హేమాద్రావివ పాదపాః. 18

శూన్యమగు ఆకాశమున నగరములు తోచుచున్నవి. విమానవిహారుల కాశ్రయమగు స్వర్గము మున్నగు లోకములటనే యున్నవికదా! శిలలయందు పద్మములు పుట్టుచున్నవి. మృత్తికారహితములగు హిమాలయాది పర్వతములందు వృక్షములు జన్మించుచున్నవి.

ఏకాన్తే సర్వపుణ్యాని సన్తి కల్పతరౌ యథా,
శిలాః ఫలన్తి ఫలివద్యథా రత్నగులుచ్ఛకాః. 19

దృష్టాః శమ్బరగన్ధర్వ విలాసైరప్యసంభవాః
దేశకాలక్రియాద్రవ్య రత్న సంచరణీయజాః. 26

ఇంద్రజాల, గంధర్వ విద్యలవలనను భ్రమకలుగుచున్నది. దూరముననున్న చంద్రబింబము చిన్నదిగా తోఁచుచున్నది. కల్పితమగు ఆకాశమున శవ మగపడుచున్నది. మంత్రప్రయోగము వలనను ఔషధప్రయోగమువలనను ఆశ్చర్యకరములగు ఫలితములు కలుగుచున్నవి. రత్నములు విచిత్రములుగ ప్రకాశించుచున్నవి. పిశాచావేశమున మదమకలుగుచున్నది. ఇవన్నియును భ్రమలే.

అర్థా గన్ధర్వజనితా అనన్తాః సత్యసంభవాః
అసంభవః సంభవోఽయమపి భావ్యుపపద్యతే. 27

అనంతములగు ఈవిషయములు అన్నియు గంధర్వవిద్యవలన సంభవ మగుచుండుట లేదా అట్లే ఈజగత్తు భ్రమయనుట అసంభవమే యనిపించుచున్నను, సంభవమేయని గ్రహింపుము. ఈరీతిగనే భవిష్యత్కాలమున ఇది లీనమగుననుు విషయముకూడ ఉత్పన్నమగుచున్నది.

సంభవోఽసంభవః సమ్యక్ సిద్ధయే స్వప్నవిభ్రమః
న తదస్తి న యత్సత్యం న తదస్తి న యన్మృషా. 28

అసంభవము సంభవించుచున్నది. ఈ జగత్తు నాశనమగుట అసంభవమనిపించుచున్నను, జ్ఞానములభింప వినాశమగుచున్నది. అప్పుడు కేవలము స్వరూప విశ్రాంతియే లభించుచున్నది. బ్రహ్మస్వరూపమున వీక్షించిన అసత్యమగునదేమియును లేదు. జగత్స్వరూపమున వీక్షించిన, సత్యమగునదేమియును లేదు.

సర్వం సర్వేణ సర్వత్ర స్వప్నే సర్గాభిధానకే
స్వప్నే నిమగ్నధీర్జన్తుః పశ్యతి స్థిరతాం యథా. 29

సర్గస్వప్నే మగ్నబుద్ధిః పశ్యతి స్థిరతాం తథా
భ్రమాద్భ్రమాన్తరం గచ్ఛన్స్వప్నాత్స్వప్నాన్తరం వ్రజన్
అతిస్థిరప్రత్యయభాగిహ జీవో విముహ్యతి. 30

అందువలన ఈ సృష్టిస్వప్నమున అన్నియును అంతటను సంభవములగుచు, అందఱిచే చూడఁబడుచున్నవి. స్వప్నముగ్ధుఁడగు మనుష్యుఁడు స్వప్నమున తోఁచు వస్తువులన్నింటిని సత్యములని భావించునట్లు. ఈ సృష్టి స్వప్నమున ముగ్ధులగువారుకూడ దీనినంతటిని యథార్థమనియే భావించుచున్నారు. జీవుఁడు ఒకదానితరువాత మఱియొకటిగ భ్రమలను చూచుచున్నాడు. వానియందే స్థిరబుద్ధినుంచుచున్నాడు. ఇట్లేసృష్టియందుకూడ 'అత్యంతస్థిరము' అని తలపునుంచి జీవుడు మోహము నందుచున్నాడు. జీవునిస్థితి యిట్టిది:

శ్వభ్రాన్తరం శ్వభ్రనిపాతదోషాత్
సంప్రాప్య వస్తుగ్ధమృగః ప్రయాతి
మోహం యథా పాతమయైకరూపం

జీవ స్తథా సంసృతిపాతమూఢః. 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జగత్స్వప్నకథనం నామ ఏకషష్టితమః సర్గః ॥61॥

లేడి ఉచ్చికబయలు అను ఆశచే ఒకగోతినుండి ఇంకొక గోతియందుఁబడునట్లు, సంసారహేతువులగు రాగాదిదోషములచే మూఢుండగు జీవుడు ఒక సంసారమునుండి ఇంకొక సంసారమున బడుచున్నాడు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున జగత్స్వప్న కథనమను అఱువదియొకటవ సర్గము ॥61॥

---

## ద్విషష్టితమః సర్గః

విచిత్ర వాసనాయోగాన్నానాదేహాప్తి విభ్రమమ్
వర్ణ్యతే జీవటాఖ్యానే భిక్షుమానసచేష్టితమ్.

[ఈ సర్గమున విచిత్రములగు వాసనలవలననే వివిధదేహములను బొందుట అను భ్రమకలుగుచున్నదని ప్రతిపాదింపఁబడుచున్నది. ఈవిషయమును వివరించుటకై జీవటోపాఖ్యాన మారంభింపఁబడుచున్నది. అందు భిక్షుకునిమనోకల్పన లిట వర్ణింపఁబడుచున్నవి.

### జీవటోపాఖ్యానము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:-

అత్ర రాఘవ వక్ష్యేఽహమితిహాసమిమం శృణు
యద్వృత్తం కస్యచిద్భిక్షోః కిం చిన్మననశీలినః. 1

శ్రీ వసిష్ఠుఁడు :— ఓ రాఘువా ! జీవుఁడు ఒకదాని తరువాత మఱియొకటిగ భ్రమలను జూచుచున్నాడని చెప్పియుంటిని. ఈవిషయమున కుదాహరణముగ ఇతిహాసము నొకదానిని వచించుచున్నాఁడను, వినుము. అది కల్పనాపరుఁడగు ఒకభిక్షుకుని వృత్తాంతము.

ఆసీత్కశ్చిన్మహాభిక్షుః సమాధ్యభ్యాసతత్పరః
నిత్యం స్వవ్యవహారేణ క్షపయత్యఖిలం దినమ్. 2

శాంతి, దాంతి, వైరాగ్యము మున్నగు గుణములతో నొప్పు మహాత్ముఁడగు పరివ్రాజకుఁడొకఁడుండెను. ఆతఁడెల్లప్పుడును సమాధి నభ్యసించుచుండెడివాడు. మఱియు తన సన్న్యాసాశ్రమమునకు దగిన శ్రవణ, మనన, నిదిధ్యాసముల నాచరించుచు ఆతఁడు రోజంతటిని వెళ్ల బుచ్చెడువాఁడు.

సమాధ్యభ్యాసశుద్ధం తత్తస్య చిత్తం క్షణేన యత్
చిన్తయత్యాశు తద్భావం గచ్ఛత్యబ్ధివ వీచితామ్. 3

సమాధి * అభ్యాసఫలితముగ ఆతని పూర్వవాసనలన్నియు తొలగిపోయి చిత్తము శుద్ధమయ్యెను. నీరు అలలుగమారునట్లు, ఆతఁడెద్దానిని చింతించునో, ఆభావమునాతఁ డొందుచుండెను.

కదాచిత్స సమాధాన విరతోఽతిష్ఠదేకధీః
కిం చిత్సం చిన్తయామాస స్వాసనస్థః క్రియాక్రమమ్. 4

ఒకప్పుడాతడు సమాధినిరతుఁడై ఆసనముననే కూర్చుండి ఏకాగ్రచిత్తముతో తన కార్యములతీరును జింతింపసాగెను.

తస్య చిన్తయతో జాతా ప్రతిభేయమితి స్వతః
భావయామ్యాశు లీలార్థం సామాన్యజనవృత్తితామ్. 5

అట్లు చింతించుచుండ నేను కేవలము వినోదార్థమే శాస్త్రజ్ఞానవిహీనులగు సామాన్యజనుల వృత్తిని భావించుచున్నాను అను తలంపు ఆతనికి కలిగెను.

ఇతి సంచిన్త్య చేతోఽస్య స్థితం కించిన్నరాన్తరమ్
స్పన్దసంస్థాన సంత్యాగమాత్రేణా వర్తనేఽమ్బ్వివ 6

ఇట్లు చింతింప ఆతని చిత్తము నీరుకదల, అంతకుమునుపు పారుచున్న నీరు తన స్థిరత్వమును వదలి సుడిగుండముగమారునట్లు యతిధర్మరహితుడగు మఱియొక పామరజనుని స్వరూపమునుదాల్చెను.

తేన చిత్తసరేణాథ కృతం నామాత్మవాఞ్ఛయా
జీవటోఽస్మీతి సహసా కాకతాలీయవత్థితమ్. 7

ఆ సంకల్పితపురుషుడు తనవాసన ననుసరించి జీవటుఁడను పేరుపెట్టుకొన కాకతాళీయముగ ఆతని చిత్తమట్లే వెలయఁ జొచ్చెను.

జీవటో విజహారాథ సస్వప్న పురుషశ్చిరమ్
స్వప్ననిర్మాణనగరే కస్మింశ్చిత్పురవీథిషు. 8

అనంతరము స్వప్న పురుషునిబోలు ఆజీవటుఁడు తన స్వప్నకల్పితమగు ఒకానొక నగరమంచలి వీథులలో తిరుగఁజొచ్చెను.

తత్ర పానం పపౌ మత్తో భృఙ్గః పద్మరసం యథా,
లీలయైవ దృఢం హృష్టః సుష్వాప ఘననిద్రయా. 9

అట, మత్తభృంగము పద్మమధువును ద్రాగునట్లు, అతఁడు మద్యమును పానమొనర్చి మత్తెక్కి, గాఢమగు నిద్రనొందెను.

స్వప్నే దదర్శ విప్రత్వం పాఠానుష్ఠానతుష్టిమత్,
ప్రతిభామాత్రసంపన్నం చిత్తే దేశాన్తరాదివత్. 10

ఆ నిద్రయందాతడొక కలగాంచెను. అందు తన్ను పాఠ, అధ్యయనాది సత్కర్మపరుఁడగు బ్రాహ్మణునిగ గాంచెను. స్వప్నమున మఱియొక దేశమున కరుగుట కల్పనవలననే సంభవించునట్లు ఆ విప్రత్వముకూడ జీవటుని కల్పనయే.

---

* తదేవ అర్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః — అనుసూత్రమున పతంజలి సమాధిలక్షణమును నిర్వచించియున్నాఁడు. (యో॥ సూ॥ 3-3)

కదాచిత్స ద్విజశ్రేష్ఠ స్స్వాహార్వ్యాపారనిష్ఠయా,
సుష్వాపాన్తర్వ్యవహృతిర్బీజతాయామివ ద్రుమః. 11

ఒకరోజున ఆవిప్రుఁడు నిత్యకర్మల నాచరించి శ్రమగొనియుండుటచే సంస్కారములన్నింటిని తనలో విలీనమొనర్చుకొని చెట్టు విత్తగునట్లు నిద్రించెను.

ద్విజోఽపశ్యత్స్వయం స్వప్నే సామన్తత్వమథాత్మని,
స సామన్తః కృతాహారః కదాచిద్ఘననిద్రయా. 12

ఆ విప్రుఁడు కలలో తానొక సామంతరాజైనట్లు కాంచెను. ఆసామంతరాజు ఒకదినమున భుజించి గాఢమగు నిద్రనందెను.

అపశ్యద్రాజతాం స్వప్నే కకుబ్వలయపాలినీమ్,
లాలితాం భోగపూగేన పుష్పౌఘేణ లతామివ. 13

ఆనిద్రయందాతఁడు తాను భూమండలమంతటికిని రాజైనట్లు కలగాంచెను. లతను పుష్పము లాశ్రయించునట్లు నానావిధభోగములాతనిని నాశ్రయించెను.

స కదాచిన్నృపః స్వస్థః సుష్వాపాస్తమితేహితః,
పురోభావినిజాచారః స్వకార్యమివ కారణే. 14

ఆ సార్వభౌముఁడొక రోజున సూర్యాస్తమయానంతరము కారణము భవిష్యత్తున ఫలించు కార్యము నంతర్భుక్త మొనర్చుకొనునట్లు సంస్కారములన్నింటిని తనలో విలీనమొనర్చుకొని నిద్రించెను.

అపశ్యత్స్వాత్మని స్వప్నే సురస్త్రీత్వమనిన్దితమ్,
వృక్షకోశరసోల్లాసే మఞ్జరీత్వమివోదితమ్. 15

అతఁడప్పుడొక కలగాంచెను. ఆ కలయందాతఁడు వృక్షరసమే పూలగుత్తి యగునట్లు తన సంస్కారములే రూపుగొన తన్ను మనోహరముగ అప్సరసగ గాంచదొడఁగెను.

సా సురస్త్రీ రతిశ్రాన్తా నిద్రాం గాఢాముపాగతా,
మృగీత్వమాత్మని స్వైరమావర్తత్వమివామ్బుతా. 16

ఆ అప్సరసరతివలనడస్సి గాఢనిద్రనుబొందెను. అప్పుడాపె నీరు తరంగముగ మారునట్లు లేడిగమారెను.

సా మృగీ లోలనయనా కదాచిన్నిద్రయా హృతా,
స్వప్నే దదర్శ వల్లీత్వం స్వాభ్యాసాద్దృఢమాత్మని. 17

చంచలనేత్రయగు ఆహరిణమొకప్పుడు నిద్రించుచు తానెల్లప్పుడును మిక్కుటముగ భయమునందు తీగగ మారెను.*

---

* లేళ్లు తమ్మ చిక్కువడఁజేసి తమ మృత్యువునకు కారణమగునేమోయని తలంచితీగెలను డొంకలను గాంచి భయపడుట లోకప్రసిద్ధము. అందువలన ఈభావనయే వారికి మిక్కుటముగనుండును. ఈభావనాఫలముగ ఇచ్చటలేడి ఈ కలను గాంచినది.

తిర్యఞ్చోఽపి ప్రపశ్యన్తి స్వప్నం చిత్తస్వభావతః,
దృష్టానాం చ శ్రుతానాం చ చేతః స్మరణమక్షతమ్. 18

తిర్యగ్జంతువులుకూడ చిత్తస్వభావముననుసరించి స్వప్నములు జూచుచున్నవి. అవి కను విను విషయములే వాని స్మృతిసంస్కారములకు కారణములై స్వప్నమును గాంచఁజేయుచున్నవి.

సా బభూవ లతాపుష్ప ఫలపల్లవశాలినీ,
వనదేవీ వినోద్యానలతాగృహవిలాసినీ. 19

ఆ లత ఫలపుష్పపల్లవముల దాల్చెను. దాల్చి, వనదేవియొక్క లతా గృహమువలె నొప్పుచుండెను.

బీజాన్తస్థాఙ్కురాకారరూపయోహాధిరూఢయా,
సాపశ్యదన్తః సంవిత్త్యా స్ఫుటం లవనమాత్మనః. 20
కంచిత్కాలం సుషుప్తస్థం కలయా జడతాం ఘనామ్,
అనుభూయ దదర్శాథ స్వాత్మానం భ్రమరం స్థిరమ్. 21

ఆ లత తనయందున్న సాక్షీ చైతన్య ప్రభావమున కొంతకాలము గాఢనిద్రనుబొంది, పిదప బీజమునందుండు భావికాల అంకురరూపమగు బుద్ధి యొక్కరూపమువంటి స్వరూపముగల స్వాప్నొన్ముఖమైన బుద్ధిచే సంస్కారానుగుణముగ తాను భ్రమరమైనట్లు కలగాంచెను.

షట్పదో విజహారాథ వనే వనలతాస్వసౌ,
పద్మినీషు చ ఫుల్లాసు తరుణీష్వివ వల్లభః. 22

పిదప, ఆ తుమ్మెద ప్రియుండు ప్రియురాండ్రతో విహరించునట్లు - వనలతలందును. వికసిత పద్మములందును విహరింపసాగెను.

ప్రియాబిమ్బాధరస్వాదురసవత్కుసుమం మధు,
భ్రమత్కుసుమసంఘాసు ముక్తావల్లీవిలాసిషు. 23

అట్లాభ్రమరము ముత్యములఁబోలు వనలతల, కుసుమసంఘముల విహరించుచు, - ప్రియుండు ప్రియురాలియొక్క అధరమధువును గ్రోలునట్లు - పుష్పమధువును గ్రోలెను.

స బభూవ సరోజిన్యాం వ్యసనీ బిసనాలగః,
క్వచిదేవ రతిం హ్యేతి చేతో జడమతేరపి. 24

ఒకదినమున నయ్యది అత్యంతమగు మోహమును గొని ఒక తామర తూడునందు చిక్కుకొనెను. జడమగు మనస్సుకూడ ఒక్కొక్కప్పుడు ఒకదానియందు ప్రీతినిదాల్చును.

తామాజగామ నలినీం పరిలోలయితుం గజః,
రమ్యవస్తుక్షయాయైవ మూఢానాం జృమ్భతే పదమ్. 25

ఒక రోజున ఆ పద్మము నూడపెరుక ఏనుగొకటి అచ్చటి కతెగెను. మూఢుల పాదములు రమ్యవస్తువులను పాడుచేయుటకే లేచుచుండును.

నలినీ మర్దితా సైవ సమం తేన స షట్పదః,
గతో దన్తాన్తం వ్రీహిరివ చూర్ణత్వమాయయౌ. 26

అపుడా తుమ్మెద ఆ పద్మముతోఁ బాటు ఏనుఁగు దంతమునఁ జిక్కుకొని, దంపఁబడు ధాన్యమువలె, నలిగిపోయెను.

భ్రమరో వారణాలోకాద్వారణాలోకభావనాత్,
దదర్శాత్మానమామోదమత్తహస్తితయోదితమ్. 27

ఏనుఁగును జూచుటవలనను, ఏనుగును భావించుటవలనను ఆ తుమ్మెద మదించిన ఏనుఁగుయొక్క రూపమును ధరించెను.

శుష్కసాగరగమ్భీరే గజః ఖాతే పపాతహ,
తమోఘనఘనే శూన్యే సంసార ఇవ జీవకః. 28

సంకెళ్లచే బంధింపఁబడుట మున్నగు కష్టములకంటెఁగూడ కఠినమగు సంసారమున జీవుఁడు పడి పారవశ్యతనంది దుఃఖించునట్లు, ఆగజము ఎండిన సముద్రముకంటె లోతగునొక గోతిలో పడెను.

బభూవ వల్లభో రాజ్ఞో మహాపరబలాన్తకః,
సదా మదబలక్షీబో ఘూర్ణో౽తీవ నిశాచరః. 29

అపుడా యేనుఁగు (రాజపురుషులచేఁ దీసికొనిపోఁబడి) రాజుయొక్క ప్రబల శత్రువుఁల జంపి రాజునకు ప్రియకరమయ్యెను. అధిమదమత్తయై గర్వముతో అటు నిటు సంచరించుచుండెను.

కదాచిదసినిస్త్రింశచ్ఛిన్నః సో౽స్తముపాయయౌ,
వివేకానిలనిర్లూనరూపో జీవ ఇవాత్మని 30

వివేకవాయువుచే జీవోపాధి ఎగురగొట్టఁబడునట్లు, ఒకానొక రాత్రి యుద్ధమున నయ్యది ఖడ్గాద్యాయుధములచే ఛిన్నమొనర్పఁబడి మరణించెను.

పశ్యన్గజఘటాకుమ్భస్థలాగ్రోచ్చలితావలీన్,
గణ్డస్థభ్రమరాభ్యాసాద్గజో భూయో౽ప్యభూదలిః. 31

నిరంతరము తనగండస్థలమున భ్రమరముల గాంచుచుండుటవలనను, మృత్యుసమయమున గూడ గండప్రదేశమునఁ దిరుగు భ్రమరములను జూచుటవలనను దాని మనస్సున పాతుకొనిపోయిన భ్రమరసంస్కారము మరల ఉద్బోధితముకాఁగా నయ్యది తుమ్మెదగ జన్మించెను.

సేవమానో వనలతాం పునరాయాత్స పద్మినీమ్,
దుస్త్యజో హి దురభ్యాసో వాసనానామబోధినః. 32

ఆ తుమ్మెద వనలతల సేవించుచు మరల పద్మసరోవరము కడకేగెను. అజ్ఞులకు తమ పూర్వ వాసనాభ్యాసమును త్యజించుట కడుంగడు కష్టకరము.

తత్ర హస్తిఖురాక్రాన్తః పునః సంచూర్ణతాం యయౌ;
పార్శ్వస్థహంససంవిత్త్యా బభూవ కలహంసకః. 33

అచట మరల అది ఏనుగుపాదములచే నలుగఁగొట్టఁబడెను. అత్తతి ప్రక్కనున్న హంసన జూచుచున్నందువలన నది కలహంసగ మాఱెను.

కలహంసస్థిరతరం యోనిష్వన్యాసు సంభ్రమన్,
కదాచిద్బహుభిర్హంసైః సంగతో విజహార హ. 34

ఆ కలహంస చాలకాలము విభిన్నయోనుల పరిభ్రమించుచు ఏనుబదియైదు జన్మముల గడపెను. పిదప మరల హంసయై, కోటిహంసలతో విహరింపసాగెను.

బ్రాహ్మహంసాత్మికా సంవిత్స్వశ్రద్ధార్థవతీ మనాక్,
తత్ర పుష్టాస్య తస్యాసః ప్రాగణ్డరసబర్హివత్. 35

బ్రహ్మదేవునియొక్క వాహనమగు హంసయొక్క గుణములనువిని, దానికట్లవ కోరికగలుగ ఆ వాంఛ యద్దానికి మయూర అండరసమున పింఛమువలె పరిపుష్టమగుచు వెలయసాగెను.

స తచ్చిన్తాం చిరస్మృతో దృఢం వ్యాధిఘుణాహతః,
తత్సంవిత్త్యనుసంధానాజ్జాతః పద్మజసారసః. 36

ఇట్లా విషయమునే చింతించుచు వ్యాధియను పురుగుచే కొట్టబడి ఆహంస మరణించెను. పూర్వవాసనా సంస్కారప్రభావమువలన నయ్యది బ్రహ్మదేవుని వాహనమగు హంసగజన్మించెను.

తత్రాతిసంతతవివేకవతో విలాసైః
సంబోధితో విగతలౌకికవస్తుదృష్టిః.
ముక్తః స్థితో నను యుగాన్తవిధౌ విదేహ
ముక్తేన తేన కిము భావి విభావ్యమేతత్. 37

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జీవటోపాఖ్యానే స్వప్నశతరుద్రీయే భిక్షుసంసారోదాహరణం నామ ద్విషష్టితమః సర్గః ॥62॥

బ్రహ్మలోకమున నయ్యది నిరంతరము బ్రహ్మోపదిష్టములగు వివేకవైరాగ్యాది విషయములఁ గూర్చి వినుటవలనను, తత్త్వజ్ఞానసాహాయ్యమున ప్రబోధము నందుటచేతను లౌకికభోగ సమూహముల, సారశూన్యతను గ్రహించి జీవన్ముక్తిని బొందెను. ద్విపదార్ధముయొక్క అంతమున బ్రహ్మదేవునితోఁ గూడ నయ్యది విదేహముక్తినిబొందును. ఇకనట్టి స్థితికంటెను త్తమమైన స్థితి ఆ హంస కేదియుండఁగలదో బుద్ధిమంతులు విచారించెదరుగాక ! (కృతకృత్యమయ్యెనని భావము)

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున జీవటోపాఖ్యానమున స్వప్నశత రుద్రీయమున భిక్షుసంసారోదాహరణమను అఱువది రెండవ సర్గము ॥62॥

## త్రిషష్టితమః సర్గః.

రుద్రీభూతేన తేనాత్ర పూర్వదేహ ప్రబోధనమ్
తేషాం చ శతరుద్రత్వే మైకాత్మ్యం చేహ వర్ణ్యతే.

[ఆ హంస రుద్రత్వమును బొందుట, తనపూర్వ వృత్తాంతమును స్మరించుట, ఆత్మయొక్క ఏకత్వము, అనువిషయము లీసర్గయందుఁ జెప్పఁబడు చున్నవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

స కదాచిద్దదర్శాథ రుద్రం రుద్రపురే ఖగః
వైరిఞ్చ నలినీ నాలలీలాలాభేన లీలయా. 1

శ్రీవసిష్ఠుడు:— బ్రహ్మదేవుని వాహనమగు ఆ హంసకు బ్రహ్మదేవునితో బాటు ఎల్లెడల తిరుగువీలు లభించెను. ఒకప్పుడయ్యది బ్రహ్మదేవునితోఁగూడ రుద్రపురికేగి రుద్రుని దర్శించెను.

తత్ర బుద్ధిర భూత్తస్య రుద్రోఽహమితి నిశ్చితా
ప్రతిబిమ్బవదాదర్శే ద్రాగిత్యేవ హి బిమ్బితా. 2

'నేను రుద్రుఁడను' అను భావమపుడు దానికికలిగెను. అద్దమున ప్రతిబింబము పడునట్లు, యోగ, జ్ఞానాది ఐశ్వర్యయుక్తమగు రుద్రరూపము దానియందు ప్రతిఫలించెను. అది జన్మాంతర గ్రహణముకాదు. జీవన్ముక్తులకు జన్మలేనందున సారూప్యముక్తి పదవియేయగును.

రుద్రభూతవపుస్తత్ర తనుం తత్యాజ తామసీం
గన్ధః పవనతాం గచ్ఛన్కుసుమస్తబకం యథా. 3

గంధము వాయువు ననుసరించునట్లును, పుష్పములుగుత్తిగ మారునట్లును, ఆహంసతనపూర్వ శరీరమునుద్యజించి రుద్రశరీరమునుదాల్చెను. (యోగులు ప్రారబ్ధశేషమును గడుపుటకై, పూర్వ శరీరమునువిడిచి నిర్మాణ దేహము లనబడు మానసిక శరీరముల దాల్తురు. హంస రుద్రత్వమును బొందుట గూడ ఇట్టిదే.)

స రుద్రో రుద్రభవనే విజహార యథేచ్ఛయా
తైస్తైః శివపురాచారైర్గణ కోటిగరిష్ఠయా. 4

ఆ హంస రుద్రగణములలో ప్రధానమగు గాణపత్య పదవినిబొంది శివపురోచితములును, ప్రసిద్ధములునగు ఆచారముల నవలంబించి రుద్రపురియందు యథేచ్ఛగ విహరింపసాగెను.

రుద్రస్త్వనుత్తమజ్ఞానవిలాసైకతయా తయా
స్వమశేషం చ వృత్తాన్తమపశ్యత్ప్రాక్తనం ధియా. 5

జ్ఞానైశ్వర్య ప్రభావములచే రుద్రసామ్యమును బొందిన ఆ హంస రుద్రబుద్ధి ప్రభావమున తన పూర్వజన్మ లన్నిటిని అవలోకింపసాగెను.

నిరావరణ విజ్ఞానవపుః స భగవాంస్తథా
ఉవాచ స్వయమేకాన్తే స్వస్వప్న శతవిస్మితః. 6

ఆవరణశూన్యమగు జ్ఞానశరీరమున వెలయు ఆభగవంతుడు (హంస) ఒకరోజున ఏకాంతముననుండ తాను గాంచిన స్వప్నశతము మతికిరాగా నిట్లుతలపోయఁ దొడఁగెను.

అహో ను చిత్రా మాయేయం తతా విశ్వవిమోహినీ
అసత్యైవాపి సద్రూపా మరుభూమిషు వారివత్. 7

ఆహా! ఈ మాయ ఎంత విచిత్రమైనది! లేనిదేయైనను ఉన్నట్లగపడుచు, మరుభూమియందలి నీటివలె విశ్వము నంతటిని మోహమునందఁజేయు చున్నది!

ఇతి ప్రథమమాజ్ఞాతం చిద్యోఽహం చిత్తతాం గతః
సర్వసంపన్న సర్వజ్ఞ గగనాది విభావనాత్. 8

నేను మొమ్మొదట పారమార్థికముగ చిత్స్వరూపుఁడ నేనైనను, మాయవలన పెక్కుగ యూహ సంకల్పముదయింప, ఇవియన్నియును కలిగినవి, సర్వశక్తిమంతుఁడనగు నాచిదంశమున సర్వజ్ఞత్వము, జడాంశమున ఆకాశాదివిభాగములును ఒనర్పఁబడినవి.

యదృచ్ఛయా స్థితో జీవో భూతతన్మాత్రరఞ్జితః
కస్మింశ్చిదభవత్సర్గే భిక్షురక్షుభితోఽభితః 9

పిదప స్వేచ్ఛాక్రమముగనే సూక్ష్మ, స్థూలదేహములందు సమష్టి, వ్యష్టిరూపములచే చిదాభాసుఁడనై ప్రవేశించి స్థూలసూక్ష్మములగు భూతతన్మాత్రములుగ మారి ఆ యా దేహముల వాసనావైచిత్ర్యము ననుసరించి చిత్రపటమువలె రంజితుఁడనై జీవరూపమున వెలసితిని. ఆ జీవుఁడు అనాదికాలమునుండి జన్మపరంపరల ననుభవించుచు ఒకానొకసృష్టియందు వైరాగ్య, శమదమాది సాధనల నాశ్రయించి ఇఁక విషయములచే క్షోభింపఁబడకుండెను.

తేనావయవబద్ధేన బహిః స్వైరవిహారిణీ
లీలా విలులితాకారా యదా రమ్యేతి భావతః. 10

సర్వభావోపమర్దేన తదభ్యాసవశాత్తదా
తామేవ సోఽన్వభూద్భిక్షుస్త్యక్త్వాన్యం మననోదయమ్. 11

ఆభిక్షుకుఁడు (పరివ్రాజకుఁడు) బద్ధపద్మాసనుఁడై, స్థైర్యముతో స్థూలదేహావయవములగు హస్తపాదాదులను, సూక్ష్మ శరీరావయవములగు ప్రాణాదులను నిరోధించి, బహిరంగములగు దేవతాది విషయములందు అవి రమ్యములనియెంచి మనస్సును నిలుప, సర్వాత్మభావమును త్యజించి ఆ యా భావములనే పొందెను. తక్కిన భావములు, అనఁగా పూర్వసంస్కారములు లోపించెను.

చమత్కృతిశ్చేతసి యా రూఢా సైవ విజృమ్భతే
వల్లీ త్యజతి నైదాఘీ శీతమప్యమ్బు మాధవమ్. 12

చిత్తమెపుడే విచిత్రములను దృఢముగ సంకల్పించునో, అపుడయ్యది తన పూర్వసంస్కారముల విలోపమొందించుకొని, ఆ నూతన భావముగనే పరిణతి నొందును. వసంతకాలమున లత నీటిని గొనియున్నను, తత్ఫలితమగు పచ్చదనమును గ్రీష్మకాలమున నది పరిత్యజించి శుష్కించుచున్నది.

స భిక్షుర్జీవటో భూత్వా జన్మజర్జరవాసనః
తేషు దేహేషు బభ్రామ రన్ధ్రేష్వివ పిపీలికా. 13

ఆత్మ సిద్ధిని బొందియున్నను ఆ భిక్షుకుడు శాస్త్రవిరుద్ధములగు లౌకికవాసనలందు క్రీడించుచున్నందువలన, మరల అనాదియగు మాయ యుదయింప చీమ వేర్వేఱు రంధ్రములందు తిరుగాడునట్లు ఆ యా దేహములందు పరిభ్రమించెను.

ఆత్మని ద్విజభక్తత్వాత్సో ఽపశ్యద్ద్విజతామథ
భావాభావ విపర్యాసే బలవానేవ వర్ధతే. 14

ఆతనికి బ్రాహ్మణభక్తి యుండుటచేసి తాను బ్రాహ్మణుడైనట్లే గాంచెను. పరస్పరవిరుద్ధములగు భావాభావములందెయ్యది మిక్కుటముగ చింతింపబడునో, అదియే ఆవిర్భవించును.

సామన్తతామవాపాసౌ విప్రః సంతతచిన్తితామ్
సాతత్యేన రసః పీతః ఫలతామేతి పాదపే. 15

ఆ విప్రుడు తాను నిరంతరము చింతించు సామంతత్వమునే పొందెను. వృక్షమేరసమును నిరంతరము గ్రహించుచుండునో, అట్టిఫలమే ఫలించును.

రాజ్యార్థం ధర్మకార్యాణాం కర్తృత్వాత్సో ఽభవన్నృపః
స కాముకతయా రాజా సురస్త్రీత్వమవాప హ. 16

ఆ విప్రుడు సకామబుద్ధితో ధర్మకార్యముల నాచరించియుండుటచేసి రాజయ్యెను. ఆ రాజా కాముకుడగుటవలన అప్సరస యయ్యెను.

లోలాలోచనలోభేన సా మృగీ రసశాలినీ
బభూవ వాసనామోహాశ్చ్యహో దుఃఖాయ జన్తుషు. 17

సుందరములగు మృగనేత్రములబొందు కోరికయుండుటచేసి ఆ యప్సరస లేడియయ్యెను. మరియు, అట్టి చంచలనేత్రములనే పొందెను. ఆహా! వాసనామోహము ప్రాణుల కెట్టిదుఃఖమును గలిగించుచున్నది!

మృగీ సా బత చిత్తస్థా బభూవ విపినే లతా
అవశ్యంభావి లవనం లతికాఽనుబభూవ హ. 18

లతయేసదా చిత్తము నావరించుకొని యుండుటచేసి, ఆ లేడి లతయయ్యెను. లతలకు సామాన్యముగ జరుగుచుండు ఛేదనమునే ఆ లతగూడ బొందెను. (ఛేదింపబడెనని భావము.)

అన్తః సంజ్ఞాచిరాభ్యస్తం భ్రమరత్వమథాత్మని
సాపశ్యత్స్వవమర్దేన సదా తద్భావభావితా. 19

లతలకు అంతఃసంజ్ఞ యుండును. కనుక నయ్యది సర్వదా (తనమీదవ్రాలు) తుమ్మెదనే చింతించుచు, ఛేదనాసమయమున అట్టిభావముచేతనే ఆవరింపబడి, తాను భ్రమరమైనట్లు తలపోసికొనెను.

సవారణఖురక్షోదమనుభూయాథ భావితమ్
భూయోభూయః ప్రబభ్రామ మహాసంస్మృతి సంభ్రమాన్. 20

ఆభ్రమరము ఏనుఁగుపాదములచే మర్దింపఁబడెను. పిమ్మట నయ్యది తనసంకల్పానుసారము ఏనుఁగు, హంస మొదలుగాఁగల తొంబది జన్మల గ్రహించి సంసారభ్రమయందు తిరుగాడెను,

సంసార శతపర్యన్తే రుద్రః సో ఽహమహం స్థితః
అస్మిన్సంసార సంరమ్భే స్వమనో మాత్రసంభ్రమే. 21

నిజకల్పనయగు ఈసంసారభ్రమయందు నూఱవదియగు రుద్రదేహమును దాల్చినేనిపుడు వెలయుచున్నాఁడను.

ఏవమత్యన్త చిత్రాసు సంసారారణ్య భూమిషు
బహ్వీష్వహమతి భ్రాన్తస్స్వశూన్యాస్వివ భూరిశః 22

ఇట్లు నేను సత్యములవలె భాసించుసంసారారణ్య ప్రదేశములందు అత్యంత విచిత్రములగు నానావిధ యోనులందుఁ దిరుగాడితిని.

కస్మింశ్చిదభవం సర్గే త్వహం జీవటనామకః
కస్మింశ్చిద్బ్రాహ్మణశ్రేష్ఠః కస్మింశ్చిద్వసుధాధిపః. 23

ఒక మానసికసృష్టియందు నేను జీవటనామధారి నైతిని. మఱియొక దానియందు బ్రాహ్మణ శ్రేష్ఠుఁడ నైతిని; ఇంకొకదానియందు భూపతి నైతిని.

హంసః పద్మవనే భూత్వా విన్ధ్య కచ్ఛే చ వారణః
హరిణో దేహయన్త్రాదౌ దశామహమిమాం గతః. 24

వింధ్యాటవియందు గజము నైతిని; పద్మవనమున హంస నైతిని; లేడి నైతిని; ఈ శరీరయంత్రమున నేనీదశలన్నిటిని పొందియుంటిని.

అత్ర వర్షసహస్రాణి చతుర్యుగశతాని చ
సమతీతాన్యనన్తాని దినర్తు చరితాని చ. 25
మమ ప్రథమమేవ ప్రాక్చలితస్య పరాత్పదాత్
తత్త్వజ్ఞానితయా రూఢో భిక్షుత్వే యోగ్యతాక్రమః. 26
భూయో భూయో ఽ ప్యతిక్రమ్య గతశ్చ బ్రహ్మహంసతామ్
స ఏవ ప్రాక్తనో ఽ భ్యాసః ఫలితః సంగమాదయాత్. 27

ఇట్లు వత్సరసహస్రములు, చతుర్యుగసహస్రములు, లెక్కకుమించిన దినములు, ఋతువులు, ప్రయత్నములు నేను బ్రహ్మస్వరూపమునుండి విచ్యుతుఁడనై నప్పటినుండి గడచినవి. భిక్షుక జీవితమున తత్త్వజ్ఞానమున కొంతయర్హతను సంపాదించియుంటిని. అట ప్రమాదమువలన జన్మపరంపరల ననుసరించి బ్రహ్మదేవుని హంసనైతిని. బ్రహ్మదేవుని సంగమున పూర్వాభ్యాసము ఫలింప, రుద్రత్వము నొందితిని.

దృఢాభ్యాసో య ఏవాస్య జీవస్యో దేత్య విఘ్నతః
సో ఽత్యన్తమరసేనాపి తమేవాశ్వను ధావతి. 28

అత్యంతదృఢమగు శాస్త్రీయసాధనాభ్యాసముండిన, ఒకప్పుడొకింత విచ్యుతిఘటిల్లి, ఇట్లు అత్యంతవిరసములగు బహువిషయోనులందు పరిభ్రమింపవలసి వచ్చినను తుదకు శాస్త్రవాసనయే జీవుని యందు జయమును పొందును.

కాకతాలీయయోగేన కదాచిత్సాధు సంగమాత్
అశుభో భావనాభ్యాసో జీవస్య వినివర్తతే. 29

కాకతాళీయ న్యాయమున జీవునకు సాధు సంగమము లభింప, అశుభవాసనా భ్యాసము తొలఁగిపోవును.

సంగత్యధిగతం చైష కేవలం స్వోదయం ప్రతి
ప్రాక్తనో వాసనాభ్యాసో హేతురుద్యమమిాఙ్క్షే. 30

ఈ అశుభవాసనలు, కేవలము ప్రాక్తనఫలముగ శుభవాసనలుదయింప తొలఁగు నవికావు. ఇవి పురుషప్రయత్నమువలననే క్షీణించును. కనుక ఈ విషయమ్మున పురుషప్రయత్నము అత్యంతప్రయోజనము.

యచ్చేహాభ్యస్యతే ఽజస్రం యచ్చ దేహాన్తరేఽపి చ
జాగ్రత్స్వప్నేష్వసదపి తత్సదిత్యనుభూయతే. 31

పూర్వ పూర్వజన్మలయందెద్ది నిరంతర మభ్యసింపఁబడుచున్నదో, అయ్యదియే సత్యముగ తోచును. ఇట్టిశుభచింతాభ్యాసమువలననే అశుభచింతలు తొలఁగును. మనజాగ్రత్స్వప్నములందు మనము దృఢముగ భావించువిషయములే సత్యములుగ అనుభూతములగుచున్నవి. దేవార్చన, పూజమున్నగుకాల్పనికవిషయములే ఫలప్రదములగుచుండ, వాస్తవముగ తత్త్వచింతవలన శుభమేల లభింపకుండును?

తత్తదర్థక్రియాకారి దుఃఖాయ చ సుఖాయ చ
ఉదేతి భావనం తస్మాద్భావనాభావనం జయః. 32

అనాత్మవిషయములగు శాస్త్రీయవిషయముల భావనకూడ దుఃఖమిశ్రిత సుఖమునే కలిగించుచున్నది. నిరవచ్ఛిన్నమగు సుఖముదానిచే లభింపదు. ఎట్టి భావనను చింతింపనియెడలనే ఆత్యంతికమగు అనర్థజయము లభించును. అంతరాళికమగు దేవత్వాదిప్రాప్తివలన నియ్యది సంభవింపదు.

భావనైవ స్వమాత్మానం దేహోఽయమితి పశ్యతి
అసత్తామాత్రవిస్తారం గుల్మకత్వమివాఙ్కురః 33

అనాత్మ భావనవలననే జీవుఁడుతన్ను శరీరముగా జూచుకొనుట సంభవించుచున్నది. ఈ అసత్య భావనబీజము అంకురమును విస్తరింపఁజేసి లతగా మారునట్లు క్రమముగ తన్ను వ్యాపింపజేసికొనుచున్నది.

భావనా ప్రేక్ష్యమాణైషా న కించిదిహ శిష్యతే
నచ విద్యత ఏవేతి తద్భ్రమేణాలమసునః. 34

తత్త్వదృష్టిచే ఈ భావనను వీక్షింపనిది, ఒకింతయుఁ మిగులదు. త్రైకాలిక మిథ్యాత్వ దోషదుష్టమగు ఇయ్యది వాస్తవముగ లేకయేయున్నది. ఇట్టి తుచ్ఛభ్రమతో మాకెట్టి సంపర్కమున్ను లేదు.

భ్రమస్య జాగతస్యాస్య జాతస్యాకాశవర్ణవత్
అసంవేదనమాత్రైకం మార్జనాయాలమస్తు నః 35

ఈ జగద్భ్రమ ఆకాశమునందలి నీలవర్ణమువలె అజ్ఞానమువలననే కలిగినది. ఆకాశమునందు నీలవర్ణమెన్నడును లేనట్లు, ఈ జగత్తుకూడ ఎన్నడును లేదు. మఱియు నియ్యది అధిష్ఠాన మాత్రమగు బ్రహ్మమే అయియున్నది. అందువలన ఈభ్రమను పోగొట్టుకొన, ఎట్టి సాధనతోను మాకు పనిలేదు.

అసన్మయీస్వరూపైషా పరం సత్త్వైవ లాలసీ
వర్తతే చేద్వినోదాయ కించిత్సా న కరిష్యతి. 36

అసన్మయమగు ఈ జగత్తుయొక్క సత్తపరబ్రహ్మముననే వెలయుచున్నది. మేము ఈకల్పనల నన్నిటిని వినోదార్థమే కల్పించుకొంటిమి. కనుక దీనికి భయపడవలసిన అవసరమేమియును లేదు. ఇది మమ్మేమియు ను ఒనర్పఁజాలదు.

తత్త్వాన్సర్వాన్స్వ సంసారానుత్థాయాలోకయా మ్యహమ్
సమ్యగాలోకదానేన తేభ్య ఏకీకరోమ్యహమ్. 37

ఈ శరీరసమూహముల నన్నిటిని వినోదార్థమే గాంచుచుంటిని. సమ్యగ్ జ్ఞానప్రకాశమున ఈ ఉపాధులనన్నిటిని ఆత్మయందు ఏకీకృత మొనర్తును.

ఇతి సంచిన్త్య రుద్రోఽసౌ తం సర్గం ప్రజగామ హ
యత్ర భిక్షుర్విహారస్థః సుప్తః శవ ఇవస్థితః. 38

ఇట్లు చింతించి ఆ రుద్రదేవుఁడు, భిక్షుకుఁడు కల్పనారాజ్యమున విహరించుచుండ, అతని శరీరము క్రియారహితమై శవమువలె పడియున్న తావున కేగెను

బోధయిత్వాథ తం భిక్షుం చేతసా చేతనేన చ
యోజయామాస సస్మార భిక్షురప్యాత్మనో భ్రమమ్. 39

ఏగి తనచిత్తమును, జ్ఞానమయమగు చైతన్యమును ఆభిక్షుకశరీరమున బ్రవేశింపఁజేసెను. దాన ఆభిక్షుకుఁడు చైతన్యమునొంది తనభ్రమను తెలిసికొనెను.

రుద్రమాత్మానమాలోక్య జీవటాదిమయం తథా
బోధాద విస్మయార్హోఽపి స భిక్షుర్విస్మయం యయౌ. 40

రుద్రాంశమే యట ప్రవేశించుటవలనను, రుద్రదేవుఁడు సత్యసంకల్పుఁ డగుటవలనను_మన స్వప్నము జాగ్రదవస్థయందు చెదరిపోవునట్లు చెదరిపోక ఆస్వప్నము అనువృత్తమైయుండెను. ఆభిక్షుకుఁడు జ్ఞానలాభమును పొందియున్నందున తనరుద్రత్వమును, జీవటాది శరీరపరంపరలను ఒకే సమయమున వీక్షింపఁగలిగెను. తత్త్వదర్శనమువలన ఆశ్చర్యమునకయోగ్యుఁడైనను అపుడాతడత్యంత ఆశ్చర్యమును బొందెను.

అథ రుద్రస్తథా భిక్షుర్ద్వావేవోత్థాయ జగ్మతుః
క్వాపి జీవటసంసారం చిదాకాశైకకోణగమ్. 41

అంత, రుద్రుడును, భిక్షుకుడునుకలిసి చిదాకాశమున మతియొకభాగమనదగు మతియొక బ్రహ్మాండమున కరిగిరి. అట జీవటుని ప్రపంచము వ్యాపించియుండెను.

తత్ర తద్భువనం గత్వా తద్ద్వీపం తచ్చ మణ్డలమ్
విషయం తత్పురం తచ్చ తం చ ప్రాణావసిగ్రహమ్. 42

(లీలోపాఖ్యానమున వర్ణింపఁబడినట్లు) జీవటుఁడున్న లోక, ద్వీపమండల, దేశ, గృహ ములఁ జేరి వారాగృహవాసియగు జీవటుని గాంచిరి.

సుప్తం దదృశతుర్నష్టసంజ్ఞం జీవటకం శవమ్
స్థాపయిత్వా వపుర్భావం ప్రభాన్తం భవభూమిషు 43

అట, వారు నిద్రించువానివలె సంజ్ఞావిహీనుడై పడియున్న జీవటుని కళేబరమును గాంచిరి. వారచ్చోట తమ రుద్రసంబంధియగు తేజమునుగోపన మొనర్చి తమ్ముయితరులు వీక్షింపకుండ చేసికొనిరి.

తం ప్రబోధ్య నియోజ్యాశు చేతసా చేతనేన చ
ఏకరూపాస్త్రిరూపాస్తే రుద్రజీవట భిక్షుకాః. 44

ఏకరూపులగు వారు తమ చిత్తమును, చేతనములను నియోజించి జీవటుని ప్రబోధ మొంద జేసి, రుద్ర, జీవట భిక్షుకులను మూఁడు మూర్తులైరి.

బోధవన్తోఽప్యబుద్ధాభా విస్మితా అప్యవిస్మితాః
బభుస్తూష్ణీంస్థితాశ్చిత్రకృతాకారా ఇవ క్షణమ్. 45

వారాభ్యంతరమున బోధయుక్తులైనను, అజ్ఞులవలెను, విస్మయములేకున్నను బయటకొకింత ఆశ్చర్యము నగుపఱచుచును చిత్రపటములవలె నొకక్షణముండిరి.

అథ జగ్ముశ్చ తే సర్వే క్వచిద్వ్యోమని సంస్థితమ్
విప్రసంసారమారబ్ధం పరిభూతసఘుంఘుమమ్. 46

పిదప, వారు ముగ్గురును గలిసి చిదాకాశమున మతియొకభాగమున వెలయుచున్న (అధ్యస్తమైన) విప్రుని ప్రపంచమున కరిగిరి. అది జీవటుని చిత్తపరిణామమే! అది ప్రాణుల శబ్దముతో నిండి యుండెను.

తే తత్ర భువనం గత్వా తద్ద్వీపం తచ్చ మణ్డలమ్
విషయం తచ్చ తం గ్రామం ప్రాప్తుస్తం బ్రాహ్మణాలయమ్. 47

వారు ఆబ్రహ్మాండాంతర్గతమగు లోకమును, ద్వీపమును, మండలమును, దేశమును, జేరు కొని బ్రాహ్మణుని గృహమున కరిగిరి.

విప్రం తే దదృశుః సుప్తం కలత్రవలితం గృహే
కణ్ఠే గృహీతం బ్రాహ్మణ్యా బహిర్జీవమివ స్థితమ్. 48

అట వారు-ఆబ్రాహ్మణుడు భార్యతో గలిసి నిద్రించుచుండుటను-గాంచిరి. బయటకు వెలువడిన తనప్రాణమా యనునట్లు బ్రాహ్మణి ఆతని కంఠము నాలింగన మొనర్చుకొనియుండెను.

తం ప్రబోధ్య నియోజ్యాశు చేతసా చేతనేన చ
తత్థాస్తే బహవోఽప్యన్యే సవిస్మయవివిస్మయాః. 49

వారు తమచిత్తమును చైతన్యమును నియోజించి ప్రబోధింప నాతఁడు ప్రబుద్ధుడయ్యెను. అప్పుడా నలువురును విస్మయపరవశులైనట్లు తోఁచిరి.

అథ జగ్ముశ్చిదాకాశకచితం చేతితం చితేః
సామన్తం నృపసంసారం భ్రమణాభోగసున్దరమ్. 50

అనంతరము వారు చిత్తవికృతియును, చిదాకాశమున వెలయునదియునునగు సామంత రాజప్రపంచమున కరిగిరి. సామంతుని భ్రమయగు ఆప్రపంచము అత్యంత సుందరమై యుండెను.

తతస్తే భువనం ప్రాప్తా స్తద్ద్వీపం తచ్చ మణ్డలమ్
సామన్తం దదృశుర్మత్తం సుప్తం పర్యఙ్కపఙ్కజే. 51

వారు క్రమముగ ఆబ్రహ్మాండమును, ద్వీపమును, మండలమును, అతిక్రమించి, పర్యంకమను పద్మమున మత్తిలి నిద్ర పోవుచున్న సామంతుని గాంచిరి.

హేమావదాతం హేమాఙ్గ్యా నిహితం కుచకోటరే
భ్రమర్యేవాన్వితం పద్మకోశసుప్తం మధువ్రతమ్. 52

ఆతని శరీరకాంతి సువర్ణమువలె ఉజ్జ్వలమైయుండెను. హేమాంగినియను తనభార్య యొక్క కుచకోటరము నాశ్రయించి ఆతని శరీరముండెను. వారు పద్మకోశమున నిద్రించుతుమ్మెదల జంటవలె నుండిరి

కాన్తాభిరభ్యావలితం మఞ్జరీభిరివద్రుమమ్
దీపజాలకమధ్యస్థం రత్నౌఘ ఇవ కాఞ్చనమ్. 53

యువతులతోఁగూడిన ఆసామంతుఁడు మంజరీవృతమగు వృక్షమువలెను, రత్నఖచితమును, దీపసమూహమధ్యస్థితమునునగు కాంచనమువలెను తోఁచుచుండెను.

తం ప్రబోధ్య నియోజ్యాశు చేతసా చేతనేన చ
తత్థాస్తే బహవోఽప్యేకే సవిస్మయవివిస్మయాః. 54

అంత, వారు తమచిత్తమును చైతన్యమును నియోజించి ఆసామంతుని ప్రబుద్ధమొనర్చిరి. వారు పెక్కుమంది అయ్యు ఏకభావమున వెలియుచుండిరి, మఱియు వారు విస్మయాపన్నులయ్యు విస్మయరహితులవలెఁదోఁచుచుండిరి.

అథ తే రాజసంసారం జగ్ముస్తత్ర విబోధ్యతమ్
చేతసైవమథాన్యాసు భ్రేముః సంసార భూమిషు. 55

పిదప వారు ఆ తివాహికశరీరమున సమ్రాట్టుయొక్క రాజ్యసంసారమున, ప్రవేశించి రాజును ప్రబుద్ధునిగ జేసిరి. అట్లే వారు సూక్ష్మశరీరమున నిక్కిన ప్రపంచములందు గూడ తిరుగుచు నిద్రించువారిని ప్రబుద్ధుల నొనర్చిరి; మృతులైన వారిని మేలుకొలిపిరి.

ప్రాప్యతాం బ్రహ్మహంసేహాం రుద్రతాం సర్వ ఏవ తే
సమాజగ్ముర్విరేజుశ్చ రుద్రాణాముత్తమం శతమ్. 56

వారందఱును బ్రహ్మహంసయను చిత్తపరిణామమొంది తుదకు రుద్రభావము నొందిరి. రుద్రచిత్త, చేతనాంశములు వారి చిత్తమును చేతనమొనర్చుటవలనను; జ్ఞానైశ్వర్యశక్తులు వారి దేహముల నన్నింటిని ఆశ్రయించుటవలనను వారు శతసంఖ్యాకులగు రుద్రులై విరాజిల్లుచుండిరి.

ఏకసంవిద్విభిన్నతను చిత్రచేష్టితవేష్టితమ్,
ఏకరూపమనేకాభం రూపం తత్పారమేశ్వరమ్. 57

పరమేశ్వరుని ఐశ్వర్యము యిట్టిదే. ఆతఁడు జ్ఞానమొక్కటియేయైనను వివిధ శరీరములందు నానావిధకార్యముల నొనర్చుచున్నాఁడు; అతనిరూప మొక్కటియేయైనను, నానారూపములుగ ప్రతిభాసించుచున్నాఁడు.

రుద్రాణాం తచ్ఛతమథ నిరావరణచిన్మయమ్
సర్వసంసార సంబద్ధ స్థితం సర్వజగత్స్థితమ్. 58

ఆవరణశూన్యమగు చిన్మయస్వరూపమున ఆ శతరుద్రమూర్తి విరాజిల్లుచుండెను. ఈ ప్రాతిభాసిక జగత్తున కాధారుఁడై, ఆతఁడు సర్వజగదంతర్యామియై వెలయసాగెను.

శతరుద్రశతానీహ సన్తి రామ మహాన్తి హి
ఏకదేశాదశం విద్ధి సంసారం ప్రతిసంస్థితమ్. 59

ఓ రామచంద్రా! ఈ రీతిగ వందలకొలఁదిగ శతరుద్రమూర్తులు వెలయుచున్నారు. నీవును, నేనును అనుభూతమగు ఈ వర్తమాన జగత్తు భిక్షురుద్ర కల్పితమగు జగత్-శతకములలో పదునొకండవ భ్రమయని గ్రహింపుము.

దేహే దేహేఽభితః స జీవస్య సంసారః సముదేతి హి
తత్రాప్రబుద్ధా జీవౌఘాః పశ్యన్తి న పరస్పరమ్. 60

సంసారభ్రాంతి బద్ధుఁడగు జీవుఁడు తానున్న సంసారమున భిక్షుకునివలె తదితర జీవులతో కలిసికొనఁజాలకున్నాఁడు; లేక, వారు పరస్పరము చూచుకొనఁజాలకున్నారు. కారణము; వారు అప్రబుద్ధులగుటయే.

మిలన్తి హి మనోబుద్ధాస్తరఙ్గా ఇవ వారిధౌ
అప్రబుద్ధాస్తు తన్మాత్రనిష్ఠా లోష్ఠవదాస్థితాః. 61

ఎవరి మనస్సులందు తత్త్వజ్ఞాన ముదయించునో, వారు సముద్ర తరంగములవలె ఏకాకారమగు సర్వజీవ-ఏకాకారతను వీక్షింపగలుగుచున్నారు. అప్రబుద్ధులు స్థూలవిషయములనే గ్రహించుచు, లోష్టఖండము (మట్టిగడ్డ) లవలె జడులైయున్నారు.

యథా ద్రవత్వాద్వీచ్యమ్బు త్వన్యోన్యం సంమిలత్యలమ్
తథా ప్రబుద్ధా జీవౌఘా మిథశ్చిత్త్వాన్మిలన్త్యలమ్. 62

స్థూలబుద్ధి తొలఁగుటచే పరస్పర మేళనము సంభవించుచున్నది. ద్రవ శీలమగుటచే తరంగముల జలము పరస్పరము పూర్ణముగ కలిసికొనునట్లు, ప్రబుద్ధజీవులు చిన్మాత్రులగుటచే చైతన్యశక్తియందు పరస్పరము పూర్ణముగ కలిసికొనుచున్నారు.

ప్రత్యేకముదితే చైతే సంసారే జీవరాశయః
చిద్ధాతోః సర్వగత్వేన త్వసత్యాః సత్యవత్స్థితాః. 63

ఈ సంసృతియందగుపడు నానావిధ జీవజాతమంతయు వాస్తవమున కసత్యమైనను, సర్వవ్యాపినియగు చిత్-శక్తియందుండుటవలన సత్యముగనే తోఁచుచున్నవి. జీవులు. సర్వజీవుల తత్త్వమగు ఆ పరబ్రహ్మముతో నైక్యమొంది, బ్రహ్మముతప్ప వేఱేమియు లేదనియు, అంతయు స్వకల్పితమేయనియు గ్రహింప, పరస్పరమేళనము సంభవించును.

యద్యదాఖన్యతే భూమేస్తత్తన్నామ యథా నభః
సర్వగాయాశ్చితేర్యద్యదుహ్యతే తత్తథైవ చిత్. 64

భూమిని ఏయే తావులందు త్రవ్వినను, ఆయాతావులందు సర్వవ్యాపకమగు ఆకాశమే ప్రకాశించునట్లు, సర్వవ్యాపకమై, సత్యమైనట్టి చైతన్యమునుండి తత్త్వవర్శనముచే నేదేది తొలఁగింపఁబడుచున్నదో, అదియది కేవలము చిన్మాత్రముగనే శేషించుచున్నది.

సర్వప్రపఞ్చభూతాని యథానుభవసీహ హి
తథేహ సర్వభూతాత్మ చిత్త్వం సర్వత్ర విద్యతే. 65

ఓ రామచంద్రా! నీవు సమస్త ప్రపంచములను, తద్యుక్తములగు పంచభూతములను సర్వత్ర అనుభవించుచున్నట్లే సర్వభూతముల ఆత్మసత్తయగు చైతన్యతత్త్వముకూడ సర్వత్ర వెలయుచున్నదని అనుభవ మొనర్చుకొనుము.

యచ్ఛాలభఞ్జికా వృక్షే శైలే శ్వభ్రే గతేఽన్తరమ్
ప్రేక్ష్యతే తద్వదేకాత్మా తథా చితి జగత్స్థితమ్. 66

వృక్ష. శైలములందు (కాష్ఠశిలాసమూహములను) శిల్పి చిత్రముల కనుకూలములగు ఛిత్రముల నొనర్చి వానిలో గజ, తురంగ, పురుషరూపములుగ మార్చ, మనమట్లే చూచుచున్నాము. ఈ రీతిగనే ఏకాత్మకమగు సద్రూపమే సర్వాకారములుగ వీక్షింపఁబడుచున్నది. ఆ చిద్రూపముననే జగత్తు వెలయుచున్నది.

అవేదనే పరే శుద్ధే వేదనం యజ్జగత్స్థితమ్
అకారణమ చైతన్యం శూన్యత్వేన యథానభః. 67

శుద్ధమై, చిదేకరసమై ఇంద్రియాదులకు విషయము కానిదైనట్టి పరబ్రహ్మమునఁ దోఁచు విషయరూపమగు అన్యథాజ్ఞానమే యీజగత్తై యున్నది. ఇట్టి జగదాకారమగు జడత్వము అకారణమే యగుచు ఆకాశమువలె శూన్యమై వర్తించుచున్నది. అనఁగా మిథ్యాజ్ఞానముగాక దీనికి వేఱొండు కారణము లేదు.

విద్యతే వేదనం దృశ్యబన్ధో మోక్షస్త్వవేదనమ్
యదేవ రుచిరం తే స్యాత్తదేవాశు దృఢీకురు. 68

ఓ రామచంద్రా ! దృశ్యమునుగూర్చిన జ్ఞానమే బంధము. దృశ్యజ్ఞాన నివృత్తియే మోక్షము. వీనిలో నీకు నచ్చిన దృష్టినే శీఘ్రముగ దృఢ మొనర్చుకొనుము.

సర్గాసర్గౌ బన్ధమోక్షౌ వేదనా వేదనాత్మకౌ
అభిన్నౌ బోధనాచ్ఛోభౌ యథేచ్ఛసి తథా కురు. 69

సృష్టి, అసృష్టి, బంధము, మోక్షము, జ్ఞానము, జ్ఞానముయొక్క అభావము మున్నగునవి వాని సాక్షియొక్క జ్ఞానమువలన అభిన్నరూపములై యున్నవి. అవి ద్రష్టకంటె వేఱుకావు. ఇంక నిప్పుడు నీయిచ్ఛ ననుసరించి ప్రవర్తింపుము.

అసంవిత్తేషు యన్నాస్తి తన్నాశే కా కదర్థనా
తూష్ణీంభావేన యత్ప్రాప్యం ప్రాప్తమేవాశు విద్ధి తత్. 70

వీక్షింపకున్న వినాశమగుదానియొక్క నాశనమునుగుఱించి యిక ప్రయాస ఏల ? ఏది (ఏసుఖము) తూష్ణీంభావముచే లభించునో, అదియు శీఘ్రముగ (నిరాయాసముగ) లభించియే యున్నదని గ్రహింపుము.

యద్వై వేదనమాత్రాత్మ తదజ్ఞావేదన క్షయమ్
తద్వేదనం వేదనాయా యదిష్టం తత్సమాచరేత్. 71

ఈ జగత్తు వేదన (జ్ఞానము) వలననే కనఁబడుచు, అవేదనవలన క్షయమొందుచున్నది. ఈ జగద్వేదనకు సాక్షియగునది లభించియేయున్నది ఇఁకనిపుడు నీ కిష్టమగు దానినే యాశ్రయింపుము.

వీచిర్యథామ్బునః స్పన్దో జగచ్చైవ తథా చితౌ
ఏతావన్మాత్ర ఏవాత్ర భేదో యద్రఘునన్దన. 72

రఘునందనా ! తరంగము నీటియొక్క స్పందనమైనట్లు, ఈ జగత్తుకూడ చిత్తుయొక్క స్పందనమైయున్నది. జల, తరంగములకున్న భేదమే బ్రహ్మ జగత్తులకును గలదని గ్రహింపుము.

దేశకాలస్వరూపేషు సత్సు వీచ్యాదితామ్బుని
జగదాదౌ తు దేశాద్యా అసన్తో జగతిస్థితాః. 73

నీటియందు అలలవలెనే జగత్తు మున్నగునవి వివర్తోపాదానమగు బ్రహ్మమున మొదట లేకున్నను తరువాత ఆరోపింపఁబడి కార్యభూతమగు జగత్తుగ పరిగణింపఁబడుచున్నది.

ఆభాస్వరం త్రిజగదిత్యతి భాతి భాస్వ
త్స్వం వేదనం విదనమేవ చితేః స్వరూపమ్
వాచి స్థితం భవతి చైత దుహోహభేద
క్లిష్టం ప్రశాన్తవచనస్తు శివః పరాత్మా. 74

స్వప్రకాశ - ఆత్మరూపమును, చైతన్యమాత్రమునగు బ్రహ్మమే అవిద్యావరణవలన కొంచెము ప్రకాశించుదానివలె తోఁచుచు జగత్స్వరూపమును ధరించి స్వస్వరూపము నతిక్రమించినట్లు తోఁచుచున్నది. చిద్రూపమగు పరమాత్మయొక్క పారమార్థికస్వరూపము జ్ఞానమయమే, జడము కాదు. ఈ జగత్తులు భేదకల్పితములు. వీనిని శ్రుతిప్రదర్శిత - ఉపాయముచే ఉపసంహరింపుము. అప్పుడీ జగత్తు కేవలము నామమాత్రమని గ్రహింపఁగలవు. ఈ నామమాత్రత్వముకూడ బ్రహ్మమున లేదు. అయ్యది ప్రశాంత రూపమును, శివస్వరూపమునగు పరమాత్మయే.

సంవేదనం సర్వ ఇతీహ శబ్దా
దర్థాదభిన్నా న కదాచిదేతౌ,
వీచ్యమ్బునీ ద్వే ఇతి నోచితోక్తి
ర్యస్యాజ్ఞతాయాం త్విదమేవ యుక్తమ్. 75

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే జీవటోపాఖ్యానే స్వప్నశతరుద్రీయకథనం నామ త్రిషష్టితమః సర్గః ॥63॥

ఈ జగత్తంతయును ఆత్మచైతన్యమే అయియున్నది. వాస్తవముగ జగత్తుయొక్క శబ్ద, అర్థములు బ్రహ్మముకంటె భిన్నములుకావు. ఈ జగత్, బ్రహ్మము లెన్నఁడును రెండుగలేవు. తరంగ, జలములను రెండువస్తువులని చెప్పఁజాలనట్లు జగత్, చైతన్యములనుగూడ రెండువస్తువులని చెప్పజాలము. ఇవి భిన్నవస్తువులుకావు. వీనికి భిన్నత్వ మెన్నఁడును లేదు. అజ్ఞానమువలననే ద్వైతభేదము కలుగుచున్నది. అజ్ఞానావస్థకు తగిన ద్వైతభేద వ్యవహారము జ్ఞానకాలమున నెట్లు సంగతముకాఁగలదు ?

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున స్వప్నశతరుద్రీయకథనమను అఱువదిమూఁడవ సర్గము ॥ 63 ॥

---

## చతుఃషష్టితమః సర్గః

తైస్తైర్దేహైః పునస్తేషాం శేషభోగోఽత్ర వర్ణ్యతే
తతో రుద్రగణత్వాప్తిః సంకల్పస్థిరతాక్రమః.

[ఈ సర్గమున శతరుద్రమూర్తుల తదనంతర వృత్తాంతమగు గణత్వప్రాప్తి, సంకల్పముయొక్క స్థిరత్వము, అను విషయములు వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

జీవట బ్రాహ్మణాదీనాం హంసాదీనాం మునీశ్వర
భిక్షు స్వప్నశరీరాణాం సంపన్నం కిమతః పరమ్. 1

శ్రీరాముఁడు :—మునీశ్వరా ! భిక్షుకుని స్వప్నశరీరములగు జీవట, బ్రాహ్మణాది శరీరములకును, హంసాది శరీరములకును ఆ పిదప ఏమి సంభవించెను ?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

రుద్రేణ సహ సంభూయ ప్రబుద్ధాః సర్వ ఏవ తే
మిథశ్చ దృష్టసంసారా రుద్రాంశాః సుఖినః స్థితాః. 2

శ్రీ వసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా! రుద్రాంశసంభూతులగు జీవటాదులు రుద్రునితో జన్మించి పరస్పరము భూత, భవిష్యద్వర్తమాన సంసారవ్యాపారముల వీక్షించుచు కృతకృత్యులై సుఖముగనుండిరి.

తేన రుద్రేణ తాం మాయామవలోక్య యథోదితామ్
స్వాంశాంస్తామేవ సంసారస్థితిం తే ప్రేషితాః పునః 3

వినోదరతుఁడు కాఁగోరి రుద్రుఁడు అప్పుడుదయించిన మాయను గాంచి స్వాంశసంభూతులగు జీవటాదులను మరల సంసారమునఁ బ్రవేశింప నాజ్ఞాపించెను.

శ్రీరుద్ర ఉవాచ:—

గచ్ఛతాశు నిజం స్థానం తత్ర భుక్త్వా కలత్రకైః
కంచిత్కాలం సమం భోగాన్మత్సకాశము పైష్యథ 4

రుద్రుఁడు :— మీరు మీమీతావుల కరిగి అట భార్యాపుత్రాదులతో కొంతకాలముండి భోగవాసనలను తృప్తిఁబొందించుకొని మరల నాకడకు రండు.

భవిష్యథ మదంశా యే గణా మత్పురభూషణాః
తతో మహాక్షపలయతో యాస్యామ స్తత్పరం పదమ్ 5

అప్పుడు మరల మీరు నా అంశమున నాపురభూషణములగు గణముల రూపమును ధరింతురుగాక! మహాప్రళయసమయమున ఈ జగత్తు క్షయము కాఁగా మనమందఱము కలిసి పరమపదమును ప్రవేశింతము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా భగవాన్ రుద్రస్తేషాం సోఽన్తర్ధీయత
అన్త్యసంసారసంఖ్యానం రుద్రాణాం మధ్యమాయయా 6
ప్రయయుః స్వాస్పదం తేఽపి జీవటబ్రాహ్మణాదయః
స్వైకలత్రైః సమం దేహం క్షపయిత్వాథ కాలతః. 7
రుద్రలోకం సమాసాద్య భవిష్యన్తి గణోత్తమాః
కదాచిద్వ్యోమ్ని దృశ్యన్తే తారకాకారకారిణః. 8

శ్రీ వసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా! ఇట్లు పలికి భగవంతుఁడగు రుద్రుఁడంతర్ధానము నందెను. వారందఱును రుద్రగణములుగ అభ్యంతరమున వెలయుచు, సంసారదర్శన మొనర్చు సాక్షి చైతన్యస్వరూపమును ధరించి జీవటాది సంసారములఁ బ్రవేశించిరి. అట తమతమ భార్యలతోఁగూడ సంసారము ననుభవింపసాగిరి. ఇట్లు వారు కొంతకాలము భోగముల ననుభవించి శరీరాంతమునఁ రుద్ర

లోకమునుబొంది ఉత్తమగణములు కాఁగలరు. ఒక్కొక్కప్పుడు వారు నక్షత్రములవలె నగుపించుచుందురు.

శ్రీరామ ఉవాచ;—

భిక్షుసంకల్పరూపాస్తే జీవటబ్రాహ్మణాదయః
కథం సత్యత్వమాయాతాః స్వసంకల్పార్థే క్వ సత్యతా 9

శ్రీరాముఁడు :— మునీంద్రా ! భిక్షుకుని సంకల్పరూపములగు జీవట, బ్రాహ్మణాదులెట్లు సత్యభావమునొందిరి ? సంకల్పపదార్థముల కెట్లు సత్యత్వము చేకూఱును ?

శ్రీవసిష్ఠ ఉవాచ ;—

సంకల్పసత్యతాం త్వంశే త్యజ సంకల్పసత్యతామ్
తత్ర యన్నాస్తి తన్నాస్తి యతః సర్వాత్మ తత్పదమ్ 10

శ్రీవసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా ! అధిష్ఠానమగు చిదంశమున అభ్యస్తమగుదానియందు చేరు సాంకల్పిక సత్యత్వమును వివేకసాహాయ్యమున నీవు పరిత్యజింపుము. సదసద్యుక్తములగు సంకల్పవిషయములగు సదతిరిక్తమగు అస్తిత్వములేదు. వానికి అస్తిత్వమున్నట్లగుపడుటకు కారణము బ్రహ్మపదము. సర్వాత్మమయమగుటయే జీవుల భోగాదృష్టము ననుసరించి ఈ సంకల్పితవిషయములకు క్రియాసామర్థ్యము (కార్యకారిత్వము) అగుపడుచున్నది.

యత్స్వప్నే దృశ్యతే యచ్చ సంకల్పైరవలోక్యతే
తత్తథా విద్యతే తత్ర సర్వకాలం తదాత్మకమ్ 11
తద్దేశకాలాత్మతయా గత్వా దేశాన్తరం యథా
దేశాద్దేశాన్తరం యద్వన్న గత్యాత్మాదికం వినా 12
న లభ్యతే తథా స్వప్నో వినా తత్ర న లభ్యతే
సర్వమస్తి చితః కోశే యద్యథాలోకయత్యసౌ 13
చిత్తథా తదవాప్నోతి సర్వాత్మత్వాదవిక్షతమ్
సంకల్పః స్వప్నకస్త్వజ్ఞ యయా చ దశయాప్యతే 14
పరమభ్యాసయోగాభ్యాం వినా త్వేతన్న లభ్యతే
యేషాం తు యోగవిజ్ఞానదృష్టయః ఫలితాః స్థితాః 15
సర్వం సర్వత్ర పశ్యన్తి తే యతః శంకరాదయః
ఇదమగ్రగతం వస్తు తథా సంకల్పితం మయా 16
నాప్యం యతోభయభ్రంశం స ప్రాప్నోత్యుభయాశ్రయాత్
సర్వం హ్యాభిమతం కార్యమేకనిష్ఠస్య సిద్ధ్యతి 17
దక్షిణాం కకుభం గచ్ఛన్కః ప్రాప్నోత్యుత్తరాం దిశమ్

స్వప్నము, లేక, మానససంకల్పములందు తోఁచునవిఅన్నియును సర్వకాలముల అధిష్ఠానభూతమగు సచ్చిత్స్వరూపమయ్యు దేశకాలములుగమూర్తి, దేశాంతరగమనాది క్రియలఁ జోపింపఁజేయు

నవై, అధిష్ఠానముననే వెలయుచున్నవి. దేశాంతరగమనమనునది ఇంద్రియపాటవము, కాలము మార్గదర్శిమున్నగునవి లేకున్న సంభవింపఁజాలనట్లు, స్వప్న, జాగ్రత్, సుషుప్తులందుఁగూడ చిద్వస్తువు లేకున్న ఇయ్యవి సంభవింపఁజాలవు. అనుభవించువాని అదృష్టముననుసరించి జాగరితములైన వాసనల వలన చిత్తమున ఎయ్యవి పర్యాలోచితములగునో, అయ్యవి, బ్రహ్మము సర్వాత్మకమగుటవలన తద్విషయిక-దృశ్యస్వరూపమును బొందుచున్నవి. ఓ రామచంద్రా! ఏ స్థితిచే సంకల్ప స్వప్న పదార్థములు పొందఁబడునో, చెప్పుచున్నాను, వినుము-అభ్యాసయోగము లేకున్న పరమపదలాభము, (పైనజెప్పిన) స్వప్న, సంకల్పాది పదార్థప్రాప్తి సంభవింపవు. శంకరాదులు యోగవిజ్ఞానదృష్టిని బొందినవారగుటవలన అభ్యాసము లేకున్నను సిద్ధిఫలముగ సర్వత్ర సర్వమునుగాంచుచున్నారు. ఏకాగ్రతలేనిచో నేను అగ్రతములైన, సంకల్పిత వస్తువుల సిద్ధినిబొందఁజాలను. నాచిత్తమపుడు సంకల్పితవస్తువును, మరల అన్యమును ఆశ్రయించుటవలన ఉభయభ్రష్టత్వమునందును. ఏకనిష్ఠుఁడగువాని అభిమతకార్యములే సిద్ధించును.

సంకల్పార్థపరై రేవ సంకల్పార్థోఽవగమ్యతే 18
అగ్రస్థార్థపరై రగ్రే సంస్థితోఽర్థోఽవగమ్యతే
అగ్రస్థే బుద్ధిసంస్థే యః సంకల్పం ప్రాప్తు మిచ్ఛతి 19
తదాసావేకనిష్ఠత్వాభావాత్తన్నాశయేద్ద్వయమ్
తస్మాదేకార్థనిష్ఠత్వాద్భిక్షు జీవేన రుద్రతామ్. 20
ప్రాప్య సర్వాత్మనా లబ్ధం తథా సర్వం తథాస్థితేః
భిక్షు సంకల్పజీవాస్తే ప్రత్యేకం తజ్జగత్పృథక్. 21
పశ్యన్తి చైతేనాన్యోన్యం రుద్రజ్ఞానాదృతే తతః
అప్రబుద్ధాః ప్రజాయన్తే జీవా జీవాన్తబోధినః. 22
తదిచ్ఛయాశు తద్రూపా బహురూపాశ్చ తే ఇహ
ఇహ విద్యాధరోఽయం స్యామహంస్యామిహ పణ్డితః 23
ఇత్యేకధ్యానసాఫల్యం దృష్టాన్తోఽస్యాం క్రియాస్థితౌ
ఏకత్వం చ బహుత్వం చ మౌర్ఖ్యం పాణ్డిత్యమేవ వా. 24
దేవత్వం మానుషత్వం చ దేశకాలక్రియాక్రమైః
తుల్యకాలమలంకర్తుం ధారణాధ్యానయత్నతః. 25
సర్వశక్త్యః స్వరూపత్వా జ్జీవస్యాస్త్యేకశక్తితా
అనన్తశ్చాన్త పృక్తశ్చ స్వభావోఽస్య స్వభావతః. 26

దక్షిణదిక్కునకు ప్రయాణమొనర్చి ఎవరైనను ఉత్తరదిక్కును బొందఁగలరా? సంకల్పాగ్రనిష్ఠులే సంకల్పితవిషయములను బొందఁగలరు. ఎట్లు ఎదుటి విషయములందు బుద్ధిని నిల్పినవారు వానినే గ్రహించుచున్నారు. వారు సంకల్పిత విషయములను బొందఁగోరినను ఏకనిష్ఠులు కాకపోవుట వలన రెంటిని పోగొట్టుకొనుచున్నారు. ఆ భిక్షుకుడు ఏకనిష్ఠుఁడగుటవలన రుద్రత్వమును, సర్వాత్మత్వమును,

రుద్రసంబంధమై ప్రసిద్ధమైనట్టి సర్వజ్ఞత్వమును బడసి, సర్వమును బడసెను. అతనికట్టి ఏకాగ్రత యున్నందువలననే ఆస్థితి కలిగెను; లేకున్న కలిగెడిదికాదు. అంతరాళవాసులగు జీవటాదులు భిక్షుక సంకల్ప-ఫలములగు జీవులైనను, వారు వేఱ్వేఱు లోకములందు వెలయునప్పుడు రుద్రచైతన్య సాహాయ్యములేమిచే పరస్పరము వీక్షించుకొనఁజాలకపోయిరి. ఆరుద్రుని సంకల్పమువలననే జీవసృష్టి యందు భేదజ్ఞానయుతులును, అప్రబుద్ధులునగు జీవులు ఉత్పన్నులైరి. మఱియు అతని ఇచ్ఛవలననే రుద్రరూపమును బహువిధరూపములను ధరించియుండిరి. జగత్తున 'నేను విద్యాధరుఁడను, నేను పండితుఁడను' అనునీమున్నగు భావములు జీవుని సంకల్పము, నిష్ఠ, ధ్యానముల ననుసరించియే ఫలించుచున్నవి. తదితర జీవుల సాఫల్యమునకుఁగూడ భిక్షుకుని సృష్టియే దృష్టాంతము. జీవుఁడు తన ధ్యాన చింతా బలము ననుసరించియే ఏకత్వ, బహుత్వ, మూర్ఖత్వ, పాండిత్య, దేవత్వ, నరత్వాదులను దేశ కాలక్రమము ననుసరించియో, లేక ఒకే తడవగనే పొందఁగలుగుచున్నాఁడు. జీవుఁడు పారమార్థికముగ బ్రహ్మస్వరూపుఁడగుటయే ఇట్లగుటకు కారణము. మఱియు, బ్రహ్మస్వరూపుఁడగు జీవుఁడు అనంతుఁడును, సర్వశక్తిమంతుఁడును గూడనై యున్నాఁడు. అతఁడు, ఒకేశరీరమున అభిమానము వహించి పరిచ్ఛిన్నుఁడైనప్పుడు ఒకే కార్యము నాచరించు శక్తియుండును. శక్తిస్వభావము ననుసరించియే జీవుని కార్యములున్ను నిర్వహింపఁబడును.

సవికాసః ససంకోచోఽహింస్రస్తేన చిదాత్మనః
యదిచ్ఛతి తదస్యాఙ్గ జన్తుః సంపద్యతే స్వయమ్. 27
స్వయం సంపాదితైరేభిర్దేశకాలక్రియాక్రమైః
యోగినో యోగినశ్చేహ తిష్ఠన్త్యన్యత్ర యత్ర చ. 28
ఇహ వాముత్ర భోగేన దృష్టమేతదనేకశః
కార్తవీర్యో గృహే తిష్ఠన్సర్వేషాం భయదోఽభవత్. 29

ప్రాణుల కర్మ ననుసరించియే స్వర్గ నరకాది అనర్థములు జగదీశ్వరునియందు వికసించి సృష్టియనఁబడుచున్నవి, మఱియునవి ఫలభోగానంతరము సర్వప్రాణి సంహారమను ప్రళయమను సంకోచమును బొందుచున్నవి. కనుక పరమేశ్వరునకు హింసాజనిత వైషమ్యాదులు లేవు. జీవులు కోరునవే చిదాత్మయందు స్పందించి స్వయముగ సంపన్నములగుచున్నవి. స్వయముగ ఉపార్జింపబడిన దేశకాలక్రియాక్రమములచే యోగినీ యోగి జనులు, తమ గృహమందుగాని అన్యత్రగాని ఒకదేహము గాని, లేక అనేక దేహములుగాని, ధరించియుందురు. ధ్యాన, ధారణల ఫలితముగనే యోగులు నిగ్రహానుగ్రహసమర్థమగు అధికారిక దేహము ధరించుచున్నారు. యోగులు ఒకానొక సమయమున ఇహపరలోకములందు విభిన్న శరీరముల ధరించి ప్రారబ్ధము ననుభవించుట ప్రసిద్ధము. కార్తవీర్యార్జునుడు గృహమున నుండియే సర్వులను శాసించుచుండెను.

విష్ణుః క్షీరోదధౌ తిష్ఠన్జాయతే పురుషో భువి
పశ్వర్థం యాన్తి తిష్ఠన్త్యో యోగిన్యో యోగినీగణే. 30

విష్ణువు క్షీరసముద్రమున నుండియే పృథివిపై జన్మించుచున్నాఁడు. యోగినులు స్వర్లోకమున యోగినీగణమధ్యమున నుండియే భూలోకమున తమకర్పింపఁబడిన బలులగ్రహింప నరుగుచున్నారు

శక్రః స్వర్గాసనే తిష్ఠన్యాతి యజ్ఞార్థముర్వికామ్
సహస్రమేకం భవతి తథా చాస్మిజ్ఞనార్దనః. 31

ఇంద్రుడు స్వర్గమున సింహాసనముపై నుండియే భూలోకమున జరుగు యజ్ఞముల శాలల కరుగుచున్నాడు. భగవంతుఁడగు జనార్దనుఁడీయుగముననే (రామావతారమున జనస్థానమున పదునాల్గువేల రాక్షసుల వధించునప్పుడు) ఒక్కఁడేఅయ్యు వేలకొలఁది రూపముల ధరించి మరల ఒకేరూపమును గ్రహించుచున్నాడు.

నృణాం శతాని భక్తానాం మానుష్యం యాతి తన్నతైః
ఏకః సహస్రం భవతి తథా చైష జనార్దనః. 32

మరల ఆతడు వందలకొలఁది భక్తులర్పించు ప్రణతుల గ్రహించి అనుగ్రహింప మనుష్యరూపమును ధరింపగలఁడు. మఱియు కురుసభయందు దుర్యోధనాదులను విమోహితులజేయ సహస్రరూపధారియగును.

అంశావతారలీలాభిః కురుతే జాగతీం స్థితిమ్
ఏకః కాన్తాసహస్రాణి తుల్యకాలం నిమేషవత్. 33

ఆభగవంతుఁడొక్కఁడయ్యు విష్ణ్వంశావతారమును దాల్చి జగత్స్థితిని గరింప రాజర్షియగు నిమి విదేహదశను బొంది సమస్తప్రాణులయొక్క నేత్రములందు వసించుచు, ఒకేపర్యాయము నిమేషణముల (సంచలనముల) గావించునట్లు ఆతడుగలడు. మఱియు పదునారువేలరూపముల ధరించి తత్సంఖ్యాకమగు నారీగణముతో క్రీడించును.

ఏవం తే భిక్షుసంకల్పా జీవటబ్రాహ్మణాదయః
రుద్రవిజ్ఞానవశతః స్వసంకల్పపురీం గతాః 34

ఇట్లే భిక్షు సంకల్పితులగు జీవటబ్రాహ్మణాదులుకూడ రుద్రునిఆజ్ఞ ననుసరించి స్వసంకల్పితస్థానముల కరిగిరి.

తత్ర భుక్త్వా చిరం భోగాన్ప్రాప్య రుద్రపురం తతః
గణతామావపన్నస్తే స్థాస్యన్తి సపరిచ్ఛదాః. 35

అటు చాలకాలము భోగముల ననుభవించి రుద్రపురికి రాగలరు. గణరూపముల ధరించి తదుచిత వేషభూషణముల దాల్చి వెలయుగలరు.

నిత్యం ప్రఫుల్లనవకల్పలతాలయేషు రుద్రేణ సాకమురురత్నగులుచ్ఛకేషు
నానాజగత్సు చ తదా శివపత్తనేషు విద్యాధరీష్వమరసూావిధరాశ్చ రేజుః. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధేగణత్వ ప్రాప్తిర్నామ
చతుఃషష్టితమః సర్గః ॥ 64 ॥
స్వప్నశతరుద్రీయం సమాప్తమ్.

వాయు(ఆ రుద్రగణము) భద్రునితోఁగూడి రత్నస్తబక-విరాజితములగు ప్రఫుల్ల-నవకల్ప-లతాగృహములలోను కైలాస, వైకుంఠ, బ్రహ్మలోకములలోను విహారమొనర్చుచు, వివిధగీత, వాద్య నాట్యకళలులగు విద్యాధర స్త్రీలచే, జుట్టబడినవారై, దేవగణముల నమస్కారముల నందుకొనుచు, చంద్రకళాధరులై వెలయగలరు.

ఇది శ్రీవాసిష్ఠ - తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
గణత్వప్రాప్తియను అఱువదినాల్గవ సర్గము ॥ 64 ॥

---

## పఞ్చషష్టితమః సర్గః

భిక్షున్యాయోఽత్ర సర్వేషు జీవేషు సమ ఉచ్యతే.
రాత్రావన్వేష్యతా భిక్షోః సభోత్థానం చ వర్ణ్యతే.

[సర్వజీవులందు భిక్షున్యాయముయొక్క సమానత్వము, రాత్రియందు భిక్షుకుని అన్వేషించుటను గూర్చిన వసిష్ఠమునీంద్రుని విచారము, సభయొక్క ఉత్థానము మున్నగువిషయములిచట వర్ణింపబడుచున్నవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:-

ఈషద్దృష్టో యథా తేన భిక్షుణా చేతసి భ్రమః
భూతం ప్రయత్నమేవైష పృథక్కృత్వా సుపశ్యతి. 1

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! భిక్షుకుఁడు తనచిత్తమున నొకింత చింతించి తనయుందే పూర్వప్రారబ్ధమును వేఱుగ జూచియుండెను. వాస్తవమున కయ్యది ఆత్మకంటె వేఱు కాదు.

సర్వస్యాభాస జీవస్య మృతిజన్మమయీ స్థితిః
భవత్యేవ చిదాకాశరూపిణ్యేవాకృతిం గతా. 2

అట్లే జీవులందఱి విషయముగూడను; మరణకాలమున ఉద్బుద్ధమైన స్వకర్మయే స్వప్నమువలె మోక్షకాలమువఱకును భాసించుచున్నది. యథార్థముగ నయ్యది చిదాకాశముకంటె వేఱు కాదు.

పృథక్కృత్యైక్యమభ్యేతి స్వాత్మా సంసారఖణ్డకమ్
సర్వఏవ మృతో జన్తుః పృథక్స్వప్న నిభాత్మకమ్. 3

ఆత్మయే ఈ సంసార విభాగముల నన్నిటిని వేఱుచేసి వానిని బొందుచున్నట్లు అగుపడుచున్నది. వీనినన్నిటిని మృతించిన జీవుని స్వప్నములనఁదగును.

ఏవం తతస్వరూపోఽపి దేహీ చామోక్షమాకులః
జీవయార్థం మయా తుభ్యం కథితం కథయాఽనయా. 4

ఓ రామచంద్రా! ఈ రీతిగ, అపరిచ్ఛిన్న స్వరూపుఁడయ్యు జీవుఁడు పరిచ్ఛిన్నుఁడై శరీర సమూహములను బొందుటేతిని నేను నీకు ఈ భిక్షుకోపాఖ్యానము ద్వారా చెప్పితిని.

పరాత్స్పన్దితాత్మేతి న భిక్షూ రామ కేవలమ్
మోహాన్మోహాన్తరం యాతి జీవోఽహరహరేవ నః. 5

ఓ రామచంద్రా! భిక్షుకుడొక్కడేకాదు పూర్ణస్వరూపమగు ఆత్మనుండి విచ్యుతులైన జీవులందఱునుగూడ పైనదెల్పినరీతిగ ఒక మోహమునుండి మఱియొక మోహమును బొందుచున్నారు. ఈ విషయము మనకు ప్రతిదినము సంభవించు స్వప్నావస్థయందు అనుభవసిద్ధమై యున్నది.

పర్వతాగ్రపరిభ్రష్టోహ్యధోఽధ ఉపలో యథా
పరమాత్మ పరిభ్రష్టో జీవః స్వప్నమిమం దృఢమ్. 6

పర్వత శిఖరమునుండి పడిన శిలాఖండము అధఃపతనము ననుభవించునట్లు పరమాత్మనుండి చ్యుతుడైన జీవుడుకూడ ఈ సృష్టి-స్వప్నమును దృఢపతనమును అనుభవించుచున్నాడు.

పశ్యత్యస్మాదపి స్వప్నాద్యాతి స్వప్నాన్తరం పునః
స్వప్నాత్స్వప్నే వినిపతన్మ్లైవేదం దృఢం కిల. 7
పరిపశ్యతి జీవోఽన్తర్మాయయా జర్జరీకృతః
క్వచిత్కేనచిదేవేహ కదాచిదపి వా స్వయమ్. 8
దేహనామ్నోఽహమిత్యన్తో ముచ్యతే స్వం ప్రపద్యతే

మఱియు, ఈ స్వప్నమున మఱియొక స్వప్నమును గాంచుచున్నాడు. ఇట్లు అభ్యంతరముననున్న మాయవలన శైథిల్యమునందుచు ఒక స్వప్నమునుండి మఱియొకస్వప్నముం బడుచున్నను, ఒకప్పుడెట్లో ఏచ్చటనో యథార్థమును తెలిసికొనగలుగును. అప్పుడీశరీర బంధమునుండి విడివడి ఆత్మను బొందును.

శ్రీరామ ఉవాచ:—

అహోను విషమో మోహో జీవస్యాస్యోపజాయతే. 9
యథా సుప్తస్య శోకేన నానాకారవికారయా
మిథ్యాజ్ఞానోగ్రయామిన్యా మాయయా నిపతత్యలమ్. 10
అహోను ఖలు వైషమ్యం భీమం నిజవదుచ్యతే
భగవన్సర్వదా సర్వం సర్వదైవ జగత్స్థితౌ. 11
త్వయా సంభవతీత్యుక్తం యథా తచ్చానుభూయతే
ఏవం గుణవిశిష్టాత్మా తన్మోహాత్మా స భిక్షుకః 12
క్వచిదస్తి న వాస్త్యన్తరా లోక్య కథయాశు మే

శ్రీరాముడు:—మునీంద్రా! ఆహా! విషయమగు మోహము జీవునకు గలుగుచున్నది. ఏమియు నెఱుంగక నిద్రించుచున్నవాడు. మిథ్యాజ్ఞానమను రాత్రియందు నానావిధ వికారములతో గూడిన మనస్సుచే భయంకరములైన భేదదృష్టులను తనందే చూచుచు (పానిని తనకంటె అన్యములని తలంచుచు) ఉండునట్లు, ఈ జగత్తునందంతటగూడ అన్నియును ఎల్లప్పుడు సంభవించుచున్నవని

తాము సెలవిచ్చియుంటిరి. మహాత్మా! దానిని నేను గ్రహింపఁగలిగితిని. తాము సంభవయోగ్యమని నుడువునది అనుభవసిద్ధమే. కాని మహాత్ముఁడగు ఆభిక్షుకుడు వాస్తవముగ నున్నాఁడా! లేక తాము కల్పించి చెప్పితిరా? యథార్థమును వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అద్య రాత్రౌ సమాధిస్థస్త్రిలోకేమతికామిమామ్. 13
భిక్షురేకోఽస్తి నాస్తీతి ప్రేక్ష్య ప్రాతర్వదామ్యహమ్

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఇది కల్పితమేయైనను నా అంతర్దృష్టి కల్పితమగుట వలన అయథార్థముకాఁజాలదు. అయినను నేటిరాత్రి సమాధి నవలంబించి ముల్లోకములఁ జూచి భిక్షుకుఁడున్నదియు, లేనిదియు రేపు ఉదయమున నీకుఁ జెప్పెదను.

శ్రీవాల్మీకిరువాచ:—

మునౌ చైవం కథయతి బహిర్మధ్యాహ్నడిణ్డిమః. 14
ఉదభూత్ప్రలయక్షుబ్ధఘనగర్జితమాంసలః
తత్యజుః పాదయోస్తస్య పుష్పాఞ్జలిపరమ్పరాః 15
నృపాః పౌరా విటపినః పుష్పం వాతధుతా ఇవ
పూజయిత్వా మునిశ్రేష్ఠానుదతిష్ఠన్స్వవిష్టరాత్ 16
సభా తదను సోత్థసౌ స్రప్రణామపరమ్పరా
క్రమేణ వ్యస్తనేనైవ జగ్ముః ఖేచరభూచరాః 17
స్వాన్స్వదేశు యథాశ్రేష్ఠమహార్హాః పారమాదృతాః
సర్వే సంపాదయామాసుర్నిజధర్మం క్రమోచితమ్ 18
చిన్తయన్తో మునిప్రోక్తం మహీచరనభశ్చరాః
జ్ఞానం క్షపాం క్షణమివ నిన్యుః కల్పమివాపి చ 19

శ్రీవాల్మీకి: ఓ భరద్వాజా! వసిష్ఠమునీంద్రుఁడిట్లు పలుకుచుండ నపుడు మధ్యాహ్నకాలమును సూచించు డిండిమధ్వనులు బయట వినఁబడెను. అవి ప్రళయకాల మేఘధ్వనులవలె గంభీరముగ నుండెను. రాజులును, పౌరులును వసిష్ఠమునీంద్రుని పాదములపై పుష్పాంజలుల నర్పించిరి; ఆ సమయమున వారు గాలికిఁ గదల్పఁబడుచు పువ్వులరాల్చు వృక్షములవలెనుండిరి. అందఱును అటనున్న మునిశ్రేష్ఠుఁ బూజించి తమతమ ఆసనములపైనుండి లేచిరి. ప్రణామపరంపరల నర్పించుటతో సభ ముగిసెను. పూర్వదినమందువలె ఖేచర, భూచరులు స్వస్థానముల కరుగుటకై బయలుదేఱిరి. మఱియువారు స్వగృహములందు దైనికకృత్యములను యథాక్రమముగ ఆదరముతో నొనర్పసాగిరి. వారికి ఆరాత్రి క్షణమువలెను, కల్పమువలెనుగూడ తోఁచసాగెను. ఉపదేశ-అర్థసంధాన సుఖమువలన క్షణముగను, మరల రాముఁడేమి ప్రశ్నించునో, వసిష్ఠుఁడేమి వచించునో అను ఉత్కంఠవలన కల్పముగను దోచెను.

ప్రాతః పునః ప్రసృతకార్యపరమ్పరేఽస్మి
జ్ఞాతే జనే ఖచర భూచరభూతసఙ్ఘః

ఆఖ్యానలోకరచనేన తథైవ తత్రా
వన్యోన్యసంవదన పూజితపూజ్యలోకః 20

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే విద్యోత్తరవిస్మయం నామ పఞ్చషష్టితమః సర్గః ॥ 65 ॥

ఓ భరద్వాజా! సభలోని సమస్తజనులు స్వకార్యార్థ మిటనట తిరుగఁ జొచ్చిరి. ఖేచర, భూచర సమూహము సభలో పరస్పరము సత్కరించి పూర్వదినమందువలె వ్యాఖ్యానప్రసంగించినతరువాత సభ విడిచి పోయిరి.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున విద్యోత్తర విస్మయ వర్ణనమను అఱువదియైదవ సర్గము ॥ 65 ॥

## షట్షష్టితమః సర్గః

[అవిద్యాప్తిర్యాత్ర భక్తిః ... ర్శనముచ్యతే
తాత్పర్యేణాం కథా ప్రేష్ఠాం మునీనాం భూతిభావినామ్.

ప్రయాణముతో వసిష్ఠాదులు ... ఇతరులగు మహర్షుల దర్శనమునందు లభ్యమగునని తెలుపఁబడుట యిందుఁ గాననగును.]

శ్రీవాల్మీకి రువాచ:-

వసిష్ఠమునిసంయుక్తా విశ్వామిత్రాదిసంయుతాః
స్థితాః ఖేచరసిద్ధౌఘా విప్రాస్తే నృపనాయకాః 1
సరామలక్ష్మణా సైవ తథైవాథ సభా బభౌ
సౌమ్యా సమసమాభోగా శాన్తవాతేవ పద్మినీ 2
అనవేక్ష్య వచః ప్రశ్నమువాచాథ మునీశ్వరః
బోధయన్తి బలాదేవ సానుకమ్పా హి సాధవః 3

శ్రీవాల్మీకి :— ఓ భరద్వాజా! వసిష్ఠ, విశ్వామిత్రాదిమునులు, ఖేచర, సిద్ధసమూహము సభకలంకరించి ఆసీనులుకాఁగా, ఆవెనువాత నృపతులు, సామంతులు, రామలక్ష్మణులు అలంకరించి కూర్చుండిరి. అప్పుడా సభవాయురహితమగు సరోవరమువలె దోఁచుచు సౌమ్య, నిస్తబ్ధభావమును గాంచెను. వసిష్ఠమునీంద్రుఁడప్పుడు ఎవ్వరియొక్కయు ప్రశ్ననపేక్షింపకయే చెప్పఁదొడఁగెను. దయాపరవశులగు సాధుపురుషులు బలాత్కారముగనైనను బోధింతురు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

రాజన్ రఘుకులాకాశశశాఙ్క రఘునన్దన
హార్ద్యం మయా జ్ఞాననేత్రేణ న భిక్షుః ప్రేక్షితశ్చిరమ్ 4

శ్రీవసిష్ఠుడు :—రాజా! రఘుకులాకాశచంద్రా! రఘునందనా ! నిన్న నేను అభిక్షుకుని కొఱకు జ్ఞాననేత్రముచే చాలగ నన్వేషించితిని.

ధ్యానేనాహం చిరం భ్రాన్తస్తాదృగ్భిక్షుదిదృక్షయా
ద్వీపాని సప్త విపులాం కులశైలసపర్వతామ్ 5

ధ్యానమార్గమున నే నాభిక్షుకునికొఱకు వెదకుచు సప్తద్వీప, సప్తకులపర్వత సమన్వితమగు ఈ పృథివియందంతటను పరిభ్రమించితిని.

యావత్కశ్చిదప్యేవం భిక్షుర్లబ్ధో న తాదృశః
కథం కిల మనోరాజ్యం బహిరప్యుపలభ్యతే 6

ఆ భిక్షుకుఁడు కనఁబడనంతవఱకు నేనట్లు తిరుగుచునేయుంటిని. ఏలయనిన, మనో రాజ్యము బయట ఎట్లు దొరకగలదు ?

తతస్త్రిభాగశేషాయాం రాత్ర్యాం పునరహం ధియా
ఉత్తరాశాన్తరం యాతో వేలావాత ఇవార్ణవమ్ 7

పిదప రాత్రి మూఁడవజామున వాతోహతమగు సముద్రమువలె నేను సమాధియోగముచే నుత్తరదిక్కున కరిగితిని.

జిననామైష తత్రాస్తి శ్రీమాన్ జనపదో మహాన్
వల్మీకోపరి తత్రాస్తి విహారో జనసంశ్రయః. 8

అట వల్మీకమను జనపదమును దాటి, జినయను జనపదమొండు గలదు. అచ్చట విహార మను స్థానమొకటి గలదు. అచ్చోట పెక్కుమంది జనులు వసించుచుండిరి.

తస్మిన్విహారే స్వకుటీకోణే కపిలమూర్ధజః
భిక్షుర్దీర్ఘదృశో నామ స్థిత ఏవ సమాధయే. 9

ఆ విహారమున దీర్ఘదృశుఁడను భిక్షుకుఁడొకఁడు సమాధియందుండెను. ఆతఁడున్నది తన కుటీరమున నే. ఆతని శిరోజములు కపిలవర్ణమును దాల్చియుండెను. (జడయుండెను.)

ఏకవింశతిరాత్రం చ తస్యైవం స్థితిశాలినః
దృఢార్గలం గృహం ధ్యానభఙ్గభీతా విశన్తి నో. 10
భృత్యాః ప్రియాః కిల తథా సంతిష్ఠతి స భిక్షుకః
అద్యైవ తస్య సంవేత్తుం నియతేరీదృశీ స్థితిః. 11

ఆతఁడు ఇరువదియొక్క రాత్రులనుండి అట్లే యుండెను. ఆతనిగృహము గడియవేయబడి యుండెను. ధ్యానము భంగమగునేమో యను భయముచే ఆతని ప్రియభృత్యులుకూడ అందు ప్రవేశిం పరు. నేఁడే యాతఁడు శరీరమును పరిత్యజించి విదేహకైవల్యము నొందును. అట్లగుట విధి. విధానమ్మె యున్నది.

రాత్రయో ధ్యాననిష్ఠస్య గతాస్తస్యైకవింశతిః

స తు వర్షసహస్రాణి తథాచిత్తేన భూతవాన్, 12

ఇట్లాతనికి ధ్యాననిష్ఠయందు ఇరువదియొక్కదినములు గడచినవి. కాని యాతఁడు తనచిత్తమందు వేలకొలఁది వత్సరముల ననుభవించెను.

కస్మింశ్చిత్ప్రాక్తనే కల్పే భిక్షురేవం పురాఽభవత్
అద్య త్విహ ద్వితీయోఽస్మింస్తృతీయో నోపలభ్యతే. 13

ఇట్టి భిక్షుకుఁడు పూర్వకల్పమునఁగూడ జన్మించియుండెను. నేను చెప్పినది రెండవ భిక్షుకుని గుఱించి. ఇంకొకఁడు ఉన్నది లేనిది నాకిప్పుడు తెలియలేదు.

మయా తు పునరన్విష్య చేతసా చతురాత్మనా
తాదృగ్ భిక్షుస్తృతీయోఽన్యో జగత్పద్మోదరావినా. 14

చాతుర్యయుక్తమగు నామనస్సు ఈ జగత్-పద్మమున భ్రమరమువలె పరిభ్రమించియు తృతీయభిక్షుకుని కనుగొనఁజాలకపోయెను.

అస్మాత్సర్గాత్తతో లబ్ధస్తృతీయస్తాదృశాశయః
అథాన్యే లీలయా సర్గా మయా సంప్రేక్షితాస్తతః 15

అప్పుడు నేనులీలగ ఈ సృష్టినుండి మఱియొకసృష్టి కరిగితిని. అట నన్వేషించి తృతీయభిక్షుకుని వీక్షింపఁగల్గితిని.

యావత్తస్మింశ్చిదాకాశకోశశాయిని సర్గకే
తృతీయో విద్యతే భిక్షుర్బ్రాహ్మాశ్చ సదృశక్రమః. 16

చిదాకాశమున వెలయు ఆ సృష్టియందు తృతీయ భిక్షుకుఁడుండుటను గాంచితిని. బ్రహ్మనిర్మితమగు ఆసృష్టియందు మనసృష్టియందున్నరీతిగనే జగత్తులుకలవు.

ఏవం తేనైవ తేనైవ సంనివేశేన భూరిశః
భవిష్యన్త్యభవన్సర్వే పదార్థాః సర్గసంతతౌ. 17
అస్యాం సభాయామపి యే మునయో బ్రాహ్మణాస్తథా
భావ్యమేవం సమాచారైస్తైస్తైరప్యనేకశః. 18

మఱియు, ఆ జగత్తులందంతటను ఇట్టిదేయగు ఆకారమును, ఇచ్చటి పదార్థములఁబోలు పదార్థములను గాంచితిని. ఈ సృష్టియందు ముని, బ్రాహ్మణుఁడు, వారివ్యవహారము ఎట్లుగలవో, భవిష్యత్-సృష్టియందుకూడ అట్లేయుండఁగలవు. భిక్షుకునకు సంభవించినట్లే నాకును నీకును, ఈ సభయందలి తదితరమునులకును, బ్రాహ్మణాదులకును, అట్టివియు, తద్భిన్నములునగు వృత్తాంతములు లనేకపర్యాయములు సంభవింపఁగలవు.

నాథేనామునా భావ్యం పునరన్యేన చామునా
ఏవం కలనకర్మభ్యాం యుక్తేనాన్యేన భూరిశః. 19

ఆ సృష్టియందు ఈ నారదుఁడుకూడ ఇట్లేయుండును. ఆ భిక్షుకుఁడును, తదితరులును గూడ ఈ తీరుగనేయుందురు. వారి జ్ఞానము, చరిత్రగూడ ఇట్లేయుండును.

ఏవం జన్మాదినా భావ్యం వ్యాసేనాపి శుకేన చ
శౌనకేన పునర్భావ్యం క్రతునా పులహేన చ 20
అగస్త్యేన పులస్త్యేన భృగుణాఽఙ్గిరసాపి చ
ఏత ఏవ తథాన్యే చ ఏవంరూపక్రియాస్పదమ్. 21
చిరాచ్చిరాద్భవిష్యన్తి మాయేయం వితతా యతః
సదృశాచారజన్మానస్తథాన్యే చ భూరిశః. 22
భూయో భూయో వివర్తన్తే సర్గేష్వప్స్వివ వీచయః
అత్యన్తసదృశాః కేచిత్కేచిదర్థసమక్రమాః 23
కేచదీషత్సమాః కేచిన్న కదాచిత్పునస్తథా
ఏవమేషాతివితతా మహతామపి మోహినీ. 24

వ్యాస, శుక, శౌనక, క్రతు, పులహ, అగస్త్య, భృగు, అంగిరసులుగూడ ఇట్లే జన్మింతురు. తదితరులుకూడ ఇట్టిదేయగు ఆచరణమును గ్రహించి జన్మింతురు. ఈ మాయయుండునంతవఱకు ఇట్లే సంభవించుచుండును. ఇట్లొకసారిగాదు. పెక్కుపర్యాయములు సంభవించును. ఈ రీతిగనే పూర్వము సంభవించియున్నది, భవిష్యత్తునఁగూడ సంభవింపఁగలదు. సముద్ర తరంగములవలె సృష్టిపరంపరలు మాటిమాటికి వివర్తితములగుచున్నవి, వివర్తితములైనవి, వివర్తితములుం గాఁగలవు. కొన్ని సృష్టులకు మిక్కుటమగు సాదృశ్యముండును; కొన్నిటికి సగము పోలికయుండును; కొన్నిటికి కొంచెము పోలికయుండును; కొన్నిటికి పోలికయేయుండదు, మాయయిట్లు విస్తరించుచు, మహాత్ములకుకూడ మోహమును గలుగఁజేయుచున్నది.

క్షణేనేహాసి నో కర్మ ప్రతిభత్త్వారి జృమ్భతే
త్వేకవింశత్యహోరాత్రా అనన్తాకృతయోఽనఘ 25
క్వతాసాముపలమ్భోఽలమహో భీమా మనోగతిః
ప్రతిభామాత్రమేవేదమిత్థం వికసితం స్థితమ్ 26
నానాకలహకల్లోలం జలే ప్రాతరివామ్బుజమ్
జాతం సంవేదనాదేవ శుద్ధాదిదమశుద్ధిమత్
సంసారజాలమఖిలం సార్చిర్వహ్నికణాదివ 27

మానసికచింత, శారీరకయత్నము లేకున్నను కేవలము ప్రతిభాసవలననే ఈ మాయ విజృంభించుచున్నది. పాపరహితుఁడవగు రామచంద్రా! ఇరువది రాత్రుల నియ్యది అత్యంత దీర్ఘకాలముగ నొనర్చినది! ఆ సమయమున ఆయాకారముల అనుభవమేమి! మనస్సుయొక్కగతి ఎంత భయంకరమైనది! ప్రతిభాసయే యిట్లు వికసించి వెలయుచున్నది. నానావిధములైన తుమ్మెదల కలహములు, -ల్లోలసహితమగు కమలము ప్రాతఃకాలమున జలమునందు వికసించునట్లును, అగ్నియొక్క కణమాత్ర

మునుండి జ్వాలావిశిష్టమగు మహాగ్ని వెలువడునట్లును, విశుద్ధమగు చైతన్యమునుండియే అశుద్ధమగు ఈ సంసారము జన్మించుచున్నది.

ప్రత్యేకమేవముదితః ప్రతిభాసఖణ్డః
ఖణ్డాన్తరేష్వపి చ తస్య విచిత్రఖణ్డః
సర్వే స్వయం నను చ తేఽపి మిథో న మిథ్యా
సర్వాత్మని స్ఫురతి కారణకారణేఽస్మిన్. 28

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే జీవటోపాఖ్యానే భిక్షుసంసృతికథనం నామ షట్షష్టితమః సర్గః ॥ 66 ॥

ఆ భిక్షుకుని మనస్సున ఉదయించినట్లే ప్రతిజీవుని అంతఃకరణమునగూడ ప్రతిభాస ఖండము లుదయించుచున్నవి. ఆప్రతిభాసఖండములు, తదంతర్గతులగు జీవులు వారి సృష్టులు మాయయొక్క కార్యములైయున్నవి. కాని వీనికి వ్యవహారసత్తయున్నది. కారణమేమనఁగా, సర్వవ్యాపకమై, సర్వాత్మయై కారణకారణమై చిదేకరసమైనట్టి బ్రహ్మమే వీని సత్త, తత్త్వబోధవలన మాయతోలఁగిపోయిన, ఈ సృష్ట్యాదులన్నియును సత్యములను భ్రమయుండదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున భిక్షు సంసృతికథనమను అఱువదియాఱవ సర్గము ॥66॥

---

## సప్తషష్టితమః సర్గః.

[భిక్షోః సమాధౌ ముక్తస్య దేహనాశోఽత్ర వర్ణ్యతే
భిక్షుభ్రాన్తి వదన్యేషాం బన్ధో మోక్షశ్చ బోధతః

సమాధియోగము నాశ్రయించి బిక్షుకుఁడు మోక్షమునంద, అతని శరీరము వినాశమగుట, భిక్షుకునకువలె తదితర జీవులకుగూడ భ్రాంతివలన బంధనము, జ్ఞానమువలన ముక్తియుం సంభవించునని వచింపఁబడుట, యిచట కాననగును.]

దశరథ ఉవాచ:—

మునినాయక తం భిక్షుం గత్వా సంబోధయన్త్వమీ
నరా మత్ప్రహితాః శీఘ్రం చానయన్తు కుటీగతమ్. 1

దశరథుడు:– మునినాయకా! తమరా భిక్షుకుఁడున్న తావున కరిగి యాతనిని సమాధినుండి లేపుఁడు. నేను పంపు మంత్రులు, భటులు, మున్నగువారు తమ ఆజ్ఞ ననుసరించి కుటీరమునుండి యాతని నిటకు, గొనివత్తురుగాక!

శ్రీవసిష్ఠ ఉవాచ:—

రాజంస్తస్య మహాభిక్షోః స దేహః ప్రాణవర్జితః

క్లేదో వైవర్ణ్యమాయాతో నాసౌ జీవితభాజనమ్. 2

శ్రీవసిష్ఠుఁడు:- ఓరాజా! ఆమహాభిక్షుకుని శరీరము ప్రాణరహితమైయున్నది (నేఁడే యాతఁడు మరణింపవలసియుండుట దైవవిధానము (నియతి) అయియున్నదని నేను చెప్పియుంటినిగదా!) ప్రాణధారణమునకు సాయపడు అన్నరసము అతని శరీరమున నిపుడు శుష్కించిపోయినది. అతడిపుడు జీవితుఁడుగ లేడు.

తస్య భిక్షోస్తు జీవోఽసౌ భూత్వా పద్మజ సారసః
జీవన్ముక్తః స్థితో భూయో నాసౌ సంసృతిభాజనమ్ 3

ఈశరీరమున ననుభవింపవలసిన ప్రారబ్ధమొకించుకయును నాతనికిపుడు లేదు. ఉన్నచో నా సత్యసంకల్పబలముచే నేనాతనిని పునర్జీవితునిగ నొనర్పగలిగియుండెడివాఁడను. ఆ శరీరమునందలి జీవుడు బ్రహ్మహంసయై జీవన్ముక్తస్థితియందు వెలయుచున్నాడు. ఆ తఁడీ సంసారమునందు మరల చిక్కుకొనడు.

తద్గృహే మాసపర్యన్తే బలాన్నిష్కాసితార్గలాః
అన్తరాలే తు తిష్ఠన్తి భృత్యా భిక్షుదిదృక్షవః 4

ఆ భిక్షుకుఁడు ఒకమాసమువఱకు తన గృహముయొక్క గడియ తీయవలదని ఆజ్ఞాపించియుండుటవలన ఆతని భృత్యులు మరల ఆతని దర్శనమును బడయుకోరికతో గూర్చొనియున్నారు. మీరు భటులను పంపినను వారిని వారులోపలికి ప్రవేశింపనీయరు.

తతో నష్టాఙ్గసంధానం కాయం నిష్కాల్యతే జలే
త్యక్ష్యన్త్యన్యం కరిష్యన్తి భిక్షుమక్షుణ్ణమానసమ్ 5

మాసానంతరము వారు భిక్షుకుని శరీరము విడిపోయియుండుటగాంచి దానిని శుభ్రమొనర్చి నీటముంచి వైతురు. *అతని ప్రతిమ నొకదానిని నిర్మించి పూజాభక్తివ్యవహారార్థమై యట నుంతురు, అది ఆతని భక్తులదృఢమనః కల్పితమగు దేవతారూపమేయగును.

అన్యైనైవం స దేహేన భిక్షుర్ముక్తో వ్యవస్థితః
కథం ప్రబోధ్యతే నష్టం తద్విహారే శరీరకమ్. 6

ఇట్లు ఆ భిక్షుకుఁడు ఆశరీరముననే ముక్తుడై వెలయుచున్నాడు. అతని దేహము వినష్టమైపోయెను. కావున అది మరల ప్రాణస్పందన ప్రయత్నాది విషయముల నెట్లొనర్పగలదు?

ఏషా గుణమయీ మాయా దుర్బోధేన దురత్యయా
నిత్యం సత్యావబోధేన సుఖేనైవాతివాహ్యతే. 7

త్రిగుణమయమగు ఈమాయ అజ్ఞానమువలన విక్షేపశక్తిచే భ్రాంతిపరంపరలను విస్తరింపఁజేయుచున్నది. జ్ఞానమువలన ఇది సులభముగనే నిరాకృతమగును.

---

* సాధువుల మృతకళేబరము నిట్లు నీట ముంచివేయుటను జలసమాధి, లేక, సలిలసమాధి అందురు. వర్తమానకాలమునకూడ స్థలవిశేషము ననుసరించి ఈ ఆచారమున్నది,

అసత్యేవ కృతారంమ్భా హేమ్నః కటకతా యథా.
ప్రతిభాస విపర్యాసమాత్ర కారణకోదయా. 8

ఈమాయ అసత్యమైయు జగత్తుల నారంభించుచున్నది. సువర్ణమున కటక (ఆభరణ)త్వము తోఁచునట్లే యివి సత్యవస్తువును అన్య విధముగ కనుబడఁజేయుచున్నది. మఱియు అట్టి ప్రతిభాసను సత్యమనిపింపఁజేయుచున్నది.

పరమాత్మని వాచేయమిత్థం మాయాను మీయతే.
తరఙ్గాలీవ పయసి ప్రేక్షామాత్రవినాశినీ. 9

జలముల తరంగములవలె పరమాత్మయందు తోఁచు ఈమాయకూడ అసత్యమని శ్రుతి అనుమానమొనర్చుచున్నది. ఈమాయ నొక్కతడవ వీక్షింపనశ్యది నశింపగలదు.

జ్ఞో హి దృశ్యతయా దీర్ఘస్వప్నాత్స్వప్నాన్తరం వ్రజేత్
ఏవం జీవత్వమాయాతి వివేకాత్సర్వమాత్మదృక్. 10

పరమాత్మయే అవివేకమువలన జీవత్వమును బొంది స్వప్నస్వప్నాంతరములను అనగా జన్మజన్మాంతరములను బొందుచున్నాఁడు. సర్వము ఆత్మయే యని అవలోకించినప్పుడు చిన్మాత్రవస్తువే మిగులును.

యో యస్య ప్రతిభాసః స్యాదాత్మైవ స స్వబోధతః
స ఏవోదేతి సంసారః కరఞ్జవనగుల్మదృక్. 11

బోధవలన అంతయు ఆత్మయై యుండునదే అజ్ఞానమువలన కరంజ (కంటకవృక్ష) వనమును బోలు సంసారముగ మారుచున్నది.

ప్రత్యేకం భూతముదితం కృతం సంసారమణ్డలమ్
భిక్షోః స్వప్నాన్తర ఇవ పరాం భఙ్గిమివామ్భసః. 2

అప్పుడు ప్రతిజీవునకు వాని భ్రాంతివలన ఒక్కొక్క సంసారమండల ముదయించుచున్నది. ఇవి భిక్షుకుఁడు గాంచినవియును నీటియొక్క తరంగాది భేదములను బోలునవియునగు స్వప్నసమూహముల వంటివి.

ప్రస్తుతః పద్మజాదేవ జగత్స్వప్నో యతోదితః
తథైవాస్వచ్ఛచిత్తోత్థో రూఢః సర్వజనం ప్రతి. 13

సమష్టిజీవుఁడగు హిరణ్యగర్భుని మనోమాత్ర నిర్మాణమగు ఈసృష్టి స్వప్నమే అయియున్నది. కావున వ్యష్టిజీవునకు గూడనిది స్వప్నమే యగుచున్నది. ఇది అశుద్ధచిత్తమున నుదయించి అందఱికిని సత్యమైన దానివలె వెలయుచున్నది.

పితామహాపదాభాతి సర్గః స్వప్నవిలాసవత్
ప్రత్యేకముదితస్తేన బ్రహ్మాణ్డానీవ కోటిశః. 14

చిత్తశుద్ధిని బడయు, హిరణ్యగర్భునకు (బ్రహ్మదేవునకు) తోచు నట్లే ఇవన్నియును స్వప్న విలాసములు, అసత్యములు అని బోధపడును. మఱియు ప్రత్యేకజీవుడే కోటాను కోట్లుగా వెలయు బ్రహ్మాండము లైనట్లుకూడ తెలిసికొనఁబడును

స్ఫురన్యథా తథావాస్మిఞ్జీవః పశ్యతి విభ్రమమ్
హృదయేఽయం సమర్థం చ స్వప్నవద్దీర్ఘమాన్తరమ్. 15

ఈ జీవుడు వ్యష్టి లేక, సమష్టి, సాధారణ లేక అసాధారణ ప్రపంచరూపముగ స్ఫురించు చున్నాడు. వానిలో నెట్టిది స్ఫురించినను స్ఫురించుగాక, అయినను ఆ తఁడు తనహృదయమున ఆ ప్రతిభాసకు అనురూపములగు విషయములను దీర్ఘభ్రమను గాంచుచున్నాడు. అది స్వప్నమువలె మిథ్య యేయగును.

చిత్సత్తామాత్రమాసాద్య ప్రతీతిచ్యుతమాత్రతః
జరామరణదుఃఖానాం క్వచిద్భాజనతాం గతః. 16

జీవుఁడు తత్త్వచ్యుతుఁడై చిత్సత్తను సమాశ్రయించి దేవ, నర, తిర్యగాది యోనులలో నొకదానియందుఁబడి జరామరణదుఃఖముల ననుభవించుచున్నాఁడు.

పాతాలం బ్రహ్మలోకం వా చిత్తత్సుకృతశాలినీ
చిత్తాంశస్పన్దమాత్రేణ కృత్వా కృత్వేవ సంస్థితా. 17

దేహములను సమాశ్రయించుకొనియున్న చైతన్యము చిత్తస్పందనమువలననే తానుగాంచు ఆ యాస్వప్నములందు పాతాళమునో లేక బ్రహ్మలోకమునో కల్పించుకొని భోగములననుభవించుచు వెలయుచున్నది.

చిత్స్పన్దరూపిణీ జీవనామరూపం గతాత్మని
అన్యత్రి చ విలుఠతి గత్వా సంభ్రమహారిణీ. 18

బ్రహ్మ-చైతన్యమే ప్రాణకల్పన నొనర్చుకొని దాని వశమునుండు స్పంద రూపమును గ్రహించి ఫలితముగ జీవుఁడను పేరును బడయుచున్నది. దీనివలన తన్ను దేహమను భ్రమకు వశమొనర్చుకొనుచున్నది. మఱియు శరీరమునుండి బయటకువెడలి విషయాకారరూపమును బొంది విషయ-జ్ఞానమును బడయుచున్నది. ఇట్లు పరమచైతన్యము సంభ్రమములందు పొరలుచున్నది.

చిత్తేతి పరమాత్మా న పరమాత్మా న వా న కిమ్
జీవదేహాదినామ్నాఽస్య ప్రతిబిమ్బాదివార్హతా. 19

ప్రత్యగాత్మ చిత్తోపాధియను భ్రాంతిగొనిన అపరాధముననే దాని బ్రహ్మరూపము తొలఁగునా? (తొలఁగదు) ఆపరబ్రహ్మము ప్రత్యగాత్మకంటె వేఱగునా? దర్పణమున ప్రతిబింబము పడిన ముఖము ముఖముగాక వేఱగునా? ప్రతిబింబముకంటె అది వేఱు కాఁజాలదు. అట్లే ఔపాధికములగు దేవదత్తాది శరీరనామములను లేక ప్రాణము, వాక్కు, చక్షువు మున్నగు ఇంద్రియముల పేరును దాల్చినయ్యది బ్రహ్మముయొక్క యోగ్యతను పోగొట్టుకొనదు. అది బ్రహ్మమే. బ్రహ్మమున ఉపాధియోగముననే ఇవన్నియును సంభవించుచున్నవి. ఉపాధియున్నను అది పరమాత్మయే వేఱుకొలఁదిగ అధ్యాస

లనన్నను, అధిష్ఠానము స్వస్వరూపమును విడువఁజాలదు. అందువలన జీవబ్రహ్మముల కైక్యముచేకూరుట కెట్టి ఆటంకమున్ను లేదు. ఇదియే పరమపురుషార్థము.*

బ్రహ్మణ్యేవ పరం బ్రహ్మ జగద్ద్రష్ట్ర్యేవ సంస్థితమ్
శుద్ధాకాశమివాకాశే జలే జలమివామలమ్. 20

ఇట్లు వ్యావహారికదృష్టితోఁ గాంచినను జగత్తు బ్రహ్మముననే శుద్ధాకాశమున ఆకాశము, జలమున జలము వెలయునట్లు— వెలయుచున్నదని గ్రహింపగలము. (పరమార్థదృష్టితో పరికింప సమూలముగ ఉపాధిబాధితమగునని వేఱుగ చెప్పవలెనా?

లోకో బ్రహ్మణ ఏవాయం జగద్రూపేషు తిష్ఠతి
బిభేత్యన్యతయా బోధాత్ప్రతిబిమ్బాదివార్భకః. 21

(దర్పణ-ప్రతిబింబితమగు ముఖమనిన ఒకింత అన్యథాభావము-అనఁగా ముఖముకంటె ప్రతిబింబితముఖము వేఱని-తోఁచవచ్చును.) కాని ఈజీవలోకమంతయు స్వాత్మస్వరూపమున్ను, మూర్తామూర్తము (ఆకారయుక్తము, ఆకారరహితమున్ను,) అభయమున్ను నగు బ్రహ్మముననే ప్రతిష్ఠితమైయున్నది. అందువలన దర్పణపక్షమున తోఁచుఅన్యథాత్వమున కిట తావులేదు. అయినను, బాలుఁడు అద్దమున తననీడను గాంచి భయపడునట్లు అభయబ్రహ్మమున వెలయు తమ్ము జూచుకొని జీవులు భయపడుచున్నారు. ఆశ్చర్యము!

స్పన్దే స్పన్దీకృతే చేహ స్వతః సఞ్జ్ఞా విలీయతే
సాప్యలం పరిణామేన లీలయేఽగ్నౌ ఘృతం యథా. 22

ఈ ద్వైతభావమునకు ఈఅన్యథాబోధకు కారణము బుద్ధి-స్పందము. బుద్ధిస్పందనమును- సమాధి-అభ్యాసమున నిలిపిన భేదబుద్ధియనఁబడు సంజ్ఞకు అస్పదమగునది. బుద్ధియందే విలీనమైపోవును. చరమ సాక్షాత్కారమనఁబడు పూర్ణబ్రహ్మమను అగ్నియందు నేతివలె వ్రేల్చఁబడినచో బుద్ధికూడ విలీనమైపోవును.

చిత్స్పన్ద ఏవ చిత్స్పన్దే సర్వాత్మని విజృమ్భితః
స్పన్దాస్పన్దౌ జృమ్భణాది కల్పితం నాత్ర వాస్తవమ్. 23

చిత్-స్పందస్వరూపమగు పరమాత్మయందే చిత్-స్పందము (జగత్తు) ప్రకాశించుచున్నది. కాని, వాస్తవముగ స్పందము, అస్పందము, జృంభణము, మున్నగునవన్నియు కల్పితములేయగును. కావున వాస్తవమునకీ జగత్తు యేమియునుగాదు, కల్పనయే (కనుక, ఈ జగత్తు వెయ్యి గొడ్డలివ్రేటులకైనను తెగునదికాదనిపించుచున్నను కల్పనామాత్రమగుటవలన కల్పనాత్యాగమువలననే నశింపఁగలదు.)

న స్పన్దోఽస్తీహ నాస్పన్దో నైకతా వాపి న ద్వితా
శుద్ధం చిన్మాత్రసర్వస్వం యథైవాస్తి తథా స్థితమ్. 24

---

*సఏష ఇహప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః ప్రాణన్ ఏవ ప్రాణోనామ భవతి, వదన్ వాక్, పశ్యన్ చక్షుః, శృణ్వన్ శ్రోత్రం, మన్వానో మనఇతి తాన్యేతస్య కర్మనామాన్యేవ-శ్రుతి.

ఓ రామచంద్రా ! తత్త్వదృష్టితో పరికింప స్పందము, అస్పందము, ఏకత్వము, ద్వైతము మున్నగునవేమియును లేవు. శుద్ధచిన్మాత్ర-సర్వస్వమగు బ్రహ్మమొక్కటియే ఒకేతీరున వెలయుచున్నది. (అందువలన జగత్తు కల్పితమేయని గ్రహింపుము.)

సారేణ తు విచారేణ సర్వశబ్దార్థయోః సమే
చిన్మాత్రమేవ జ్ఞాతేఽయం నాస్తీత్యపి న విద్యతే. 25

సర్వశబ్దములయొక్కయు, దాని అర్థముయొక్కయు. ఏకస్వభావము విచారణచే తెలియఁబడ చిన్మాత్రవస్తువు ఒక్కటియే సత్యమని గ్రహింపఁగలము. అభావరూపమైనను ఈ ప్రపంచము లేకయేయున్నది. ఇఁక భావరూపమునుగూర్చి వేఱు చెప్పవలెనా. (ఈ ప్రపంచమెన్నఁడును లేనేలేదని భావము.)

భేదవేదనయోదేతి భేదః ప్రకృతిలాఞ్ఛనమ్
అభేదబోధాదఖిలే గలితే శిష్యతే పరమ్. 26

భేదజ్ఞానము వలననే ప్రకృతిచిహ్నమగు భేదముదయించును. అభేదజ్ఞానమువలన భేదబుద్ధికి గోచరించు విషయములన్నియు లీనములైపోవ పరమవస్తువొక్కటియే మిగులును.

నానాత్వే వాస్య బోధేన న బోధస్స్వనవేక్షణాత్
పృచ్ఛకం చైవమస్త్యేవ తస్మాన్నిశ్శఙ్కతా పరా. 27

ఓ రామచంద్రా! ఇదియే యథార్థస్థితి. దీనినెవరును మఱియొకవిధముగ నొనర్పఁజాలరు. అజ్ఞానము, లేక, అబోధవలననే నానాత్వదర్శనము కలుగుచున్నది. జ్ఞానమువలన నానాత్వదర్శనము తొలఁగిపోవ నీవు పూర్ణచిద్రూపుఁడవే యగుచున్నాఁడవు. ఈ విషయమున నీవు అడుగదలంచినది ఏమైనయున్నచో ప్రశ్నింపుము. పరమార్థమిదియే. అందువలన నీవును, నేనును, తదితరులునుగూడ పరమ-నిశ్శంకస్థితియందు అనఁగా అభయమున ప్రతిష్ఠితులమై యున్నారము.

తతః స్వప్నోనజాగ్రద్విర్న సుషుప్తిర్న తుర్యతా
న బన్ధోస్తి న మోక్షోస్తి నాన్యథాకల్పనాత్మకమ్. 28

ఈ సందేహరాహిత్యస్థితి (నిశ్శంకత్వ) వలన కలుగు బలమువలననే జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయావస్థలు, బంధమోక్షములు మున్నగు కల్పనలేమియునుండవు. ద్వైతభ్రాంతి సంపూర్ణముగ తొలఁగిపోవును.

శాన్తిరేకా జగన్నామ్నా శాన్తిరేవమవస్థితా
అబోధోఽసత్య ఏవతః క్వ ద్రష్టృదృశ్యదర్శనమ్. 29

అజ్ఞానమువలననే ద్రష్టృ, దర్శన, దృశ్యములను త్రిపుటీజ్ఞానముతోఁగూడుకొనిన జగత్తు ఉపలభ్యమగుచున్నది. అజ్ఞానమే అసత్యము. అందువలన, దాని, శమనము, లేక నివృత్తియనఁదగు బ్రహ్మమే సత్యము. అట్టి శుద్ధాత్మస్వరూపమగు శాంతియే (బ్రహ్మమే) సర్వత్ర వ్యాప్తమైయున్నది. అద్దానియందిఁక ద్రష్టృదృశ్యదర్శనములను త్రిపుటియొక్క సత్త యెచట ?

స్పన్దోఽప్యస్పన్ద ఏవ స్యాన్నిఃసంకల్పతయా చ తే
న స్పన్దాస్పన్దయోర్భిన్నా సంకల్పరహితైవ చిత్. 30

సంకల్పమువలననే చిత్తము, ప్రాణము మున్నగునవి స్పందించు (చలించు) చున్నవి. జ్ఞానోదయమున సంకల్పములన్నియు తొలఁగిపోవ, స్పందమే అస్పందమగును. చైతన్యము సంకల్పములవీడ, స్పందాస్పందభేదము తొలఁగిపోవును.

ద్వైతైక్యవికలా రూపసంకల్పశ్చిదభావనాత్
న చ భావనమాత్రేణ గతో బ్రహ్మావశిష్యతే. 31

చిద్బ్రహ్మమును గాంచకుండుట వలననే ద్వైతము ఐక్యము మున్నగు సంకల్పము లుదయించుచున్నవి-చిద్బ్రహ్మ-దర్శనమైనతోడనే ద్వైతము ఐక్యము మున్నగు కల్పనలు లేని చిద్బ్రహ్మమే మిగులును.

చిచ్చన్ద్రబిమ్బే సంకల్పకలఙ్కః స్ఫురతీవ యః
నాసౌ కలఙ్కస్తద్విద్ధి చిద్ఘనస్య ఘనం వపుః. 32

చిత్-చంద్ర బింబమున దర్శనసమయమున సంకల్ప-కళంకము (మచ్చ)వలె తోఁచునది కూడ వాస్తవముగ కళంకముకాదు. అది చిద్బ్రహ్మముయొక్క ఘనశరీరము. ఇదియే చిద్దర్శనము.

చిద్ఘనస్య న సన్నాసన్నిర్మయతాం యత్ర తే పదే
ఇత్యదోష మహాబోధసారసంగ్రహణం కృతమ్ 33

ఓ రామచంద్రా! నీవు విశాలమగు చిద్ఘన-బ్రహ్మపదమున నధిష్ఠింపుము. ఆపూర్ణభావమున వెలయఁగలిగిన సంకల్పములన్నియును చిద్ఘన బ్రహ్మముతో ఏకరసస్వరూపమును బొంది పృథక్, సత్తను (ఇవి వేఱు అని తోఁచు భావమును) గోల్పోయి, నీ ఆత్మసత్తను బడయును. ఈ ముక్తి వలన నీవు సమస్తవస్తువుల ఆత్మైక రసత్వమును సంపాదించి నిర్దోషమగు బోధసారమును గ్రహింపుము.

చిచ్చన్ద్రబిమ్బాసంకల్పకలఙ్కామృతవిగ్రహః
త్వయా భవ్యేన సంస్పృష్టో భావాభావక్షయాత్మనా. 34

నీవు చిద్ఘన బ్రహ్మపదమును బొందినయెడల సంకల్పకళంక శూన్యమగు చిత్ చంద్ర బింబము అగుదువు. అపుడు నీయందు భావాభావ పదార్థములన్నియును లయమగును. నీవు పరమ పవిత్రుఁడ వగుదువు. నీవు స్పర్శించిన పదార్థము లన్నియు అమృతమయములగును. నీమహిమ యెట్టిది!

భావాభావాదికలనాం నీత్వా చిన్మయతాం చితః
సమోల్లా సవిలాసాన్తః సమాశ్వస యథాసుఖమ్. 35

నీవు భావాభావ కల్పనలకు కారణమగు చైతన్యమును గ్రహించి, అనగా భావాభావములను, పరిత్యజించి చిన్మయస్వరూపమును బొంది చిద్బ్రహ్మమందున్న ఉల్లాస, విలాసముల వలన కలుగు విశ్రాంతిసుఖమును అభ్యంతరమున అనుభవించు చుండుము.

స్పన్దాస్పన్దౌ కల్పనాకల్పనా వా
చిత్తామ్నాయో విద్ధి నామాభినామ్నా,
సర్వాకారా నిర్వృతిః శాన్తిసత్తా
పూర్ణాపూర్ణే హ్యేకమేవాస్థితేతి. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే బ్రహ్మైక్యప్రతిపాదనం నామ సప్తషష్టితమః సర్గః ॥ 67 ॥

ఓ రామచంద్రా! నీవు ఆనందసముద్రమను స్వస్వరూపమున వెలయుచు, స్పందాస్పందములు సంకల్ప వికల్పములు మున్నగు చిత్తభ్రాంతి భేదములన్నియును సుఖైకరస స్వరూపమగు శాంతి (బ్రహ్మసత్త)యందే వెలయుచున్నవని గ్రహింపుము. పూర్ణాపూర్ణ దశలు ఏకీకృతమగు నదియే స్వస్వరూపమని గ్రహింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున బ్రహ్మైక్యప్రతిపాదనమను అఱువది ఏడవ సర్గము ॥ 67 ॥

---

## అష్టషష్టితమః సర్గః

[మౌనం చతుర్విధం త్వత్ర లక్షణైరుపవర్ణ్యతే
సుషుప్తమౌనం తత్రాపి తుర్యాతీత ప్రతిష్ఠితమ్

నాల్గువిధములగు మౌనములు లక్షణములతో సహా వర్ణింపఁబడుట, తురీయాతీతస్థితియందు ప్రతిష్ఠితమైన సుషుప్తమౌనము ఉపదేశింపబడుట, ఇచట కాననగును.]

శ్రీ వసిష్ఠ ఉవాచః—

సుషుప్తమౌనవాన్భూత్వా త్యక్త్వా చిత్తవిలాసితామ్
కలనామలనిర్ముక్తస్తిష్ఠావష్టబ్ధతత్పదః. 1

శ్రీవసిష్ఠుఁడు:– ఓ రామచంద్రా ! చిత్తముయొక్క స్వాభావిక ప్రవృత్తుల ననుసరించుటను వదలి సుషుప్తమౌనము నాశ్రయించి కల్పనామాలిన్యముల నన్నిటినుండి విడివడి ఆ పరమపదమునే ఆవలంబించి, దానినుండి తొలఁగకుండ నీవు వెలయుచుండుము.

శ్రీరామ ఉవాచః—

వాఙ్మౌనమక్షమౌనం చ కాష్ఠమౌనం చ వేద్మ్యహమ్
సుషుప్తమౌనం మౌనీశ బ్రహ్మన్బ్రూహి కిముచ్యతే. 2

శ్రీరాముఁడు:— మౌనీశా ! వాఙ్మౌనము, ఇంద్రియమౌనము (ఇంద్రియ సంయమము), కాష్ఠమౌనములను నేనెఱుఁగుదును. బ్రహ్మజ్ఞా ! సుషుప్తమౌనమనఁగా నేమియో వచింపవేఁడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ద్వివిధః ప్రోచ్యతే రామ మునిర్మునివరైరిహ
ఏకః కాష్ఠతపస్వీ స్యాజ్జీవన్ముక్తస్తథేతరః. 3

శ్రీవసిష్ఠుఁడు: — ఓ రామచంద్రా! మునిశ్రేష్ఠులు, మునులను కాష్ఠతపస్వి, జీవన్ముక్తుఁడు అని రెండువిధములుగ చెప్పుచున్నారు (నీవుచెప్పిన త్రివిధమౌనము నవలంబించువారందఱును గూడ అజ్ఞానులే అగుటవలన వారందఱును ఒకశ్రేణికి చెందుచున్నారు. రెండవతరగతివారు జీవన్ముక్తులని భావము.

అభావితాయాం శుష్కాయాం క్రియాయాం బద్ధనిశ్చయః
హఠాజ్జితేన్ద్రియగ్రామో మునిః స్యాత్కాష్ఠతాపసః 4

బ్రహ్మమును భావింపక శుష్కక్రియలగు కృచ్ఛ్రచాంద్రాయణాదుల నాచరించుచు హఠమొనర్చి ఇంద్రియముల బంధించు ముని కాష్ఠతపస్వియనఁబడును.

యథాభూతమిదం బుద్ధ్వా భావితాత్మాత్మని స్థితః
లోకోపమోఽపి తృప్తోఽన్తర్యః స ముక్తమునిః స్మృతః 5

యథాభూతవస్తువగు బ్రహ్మమును వహించి ఆత్మను ఆత్మయందే భావించుచు ఇతరతపస్సులవలె వ్యవహరించుచున్నను నిరతిశయానందమును గ్రోలుటవలన ఆభ్యంతరమున తృప్తుఁడగు మునియే జీవన్ముక్తుఁడనఁబడును.

ఏతయోర్యో భవేద్భావః శాన్తయోర్మునినాథయోః
చిత్తనిశ్చయరూపాత్మా మౌనశబ్దేన సంస్మృతః 6

ఇట్లు శాంతిభావమును బొందిన మునులిర్వురి చిత్తనిశ్చయమే మౌనశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నది.

చతుష్ప్రకారమాహుస్తం మౌనం మౌనవిదో జనాః
వాఙ్మౌనమక్షమౌనం చ కాష్ఠం సౌషుప్తమేవ చ 7

మౌనవిదులగువారు ప్రథమమౌనమును నాల్గువిధములుగ విభజించుచున్నారు. అవి వాఙ్మౌనము, అక్షమౌనము (ఇంద్రియమౌనము), కాష్ఠమౌనము, సౌషుప్తమౌనము అనునవి.

వాఙ్మౌనం వచసాం రోధో బలాదిన్ద్రియనిగ్రహః
అక్షమౌనం పరిత్యాగశ్చేష్టానాం కాష్ఠసంజ్ఞకమ్. 8

అందు వాఙ్నిరోధమే వాఙ్మౌనము; ప్రయత్నముతో ఇంద్రియములను నిగ్రహించుటయే అక్షమౌనము; ప్రయత్నములనన్నిటిని విడుచుటయే కాష్ఠమౌనము.

మనోమౌనం పఞ్చమం చ తన్మృతౌ కాష్ఠతాపసే
భావే సుషుప్తమౌనాఖ్యం జీవన్ముక్తోఽనుజీవతి. 9

ఐదవదని తోఁచు మనోమౌనము మూర్ఛా, సుషుప్తి సమయములందు గాక, అన్యసమయము లందు గలుగక పోవుటవలనను, అది కేవలము కాష్ఠతపస్వికే సంభవమగుటవలనను, దానిని కాష్ఠమౌనముగనే పరిగణింపవలెను. దానిని వేఱుగా లెక్కిడఁజాలము. జీవన్ముక్తులు ఆత్మతత్త్వము ననుభవించునప్పుడు సుషుప్తమౌనము నవలంబించియుందురు. (అనఁగా ఆత్మతత్త్వ అనుభవకాలమున నాశ్రయింపఁబడునదియే సుషుప్తమౌనమని భావము.)

త్రిషుమౌనవిశేషేషు విషయః కాష్ఠతాపసః
సుషుప్తమౌనావస్థాయాం సా తుర్యా సైవ ముక్తధీః. 10

మనోమౌన, ఇంద్రియమౌన కాష్ఠమౌనములను త్రివిధమౌనములను కాష్ఠతపస్వియే అవలంబించుచున్నాఁడు. సుషుప్తమౌనస్థితియందు తురీయావస్థ అంతర్గతమైయున్నది. జీవన్ముక్త పురుషుఁడే దీనిని అవలంబింపఁగలఁడు.

వాఙ్మౌనం మౌనమిత్యేతత్సిద్ధం తచ్చ మనః కిల
మలినం జీవబన్ధాయ తత్రస్థః కాష్ఠతాపసః. 11

ఈమూఁడు విధములగు (వాక్, అక్ష. కాష్ఠ) మౌనములు మౌనములే అయినను, ఇవి అశుద్ధచిత్తముయొక్క దృఢనిశ్చయములగుచు జీవునకు బంధమునే గలిగించుచున్నవి. కాష్ఠతపస్వియే వీని నవలంబించుచున్నాఁడు.

అస్తత్సం స్మరణం వాపి దృశ్యం వా జయమస్పృశన్
అపశ్యన్నేహ పశ్యన్సి కాష్ఠమౌనీ తు తిష్ఠతి. 12

కాష్ఠమౌని బలపూర్వకముగ ఇంద్రియములను నిగ్రహించి లోన అహంభావముయొక్క స్మృతిని, వెలుపల దృశ్యప్రపంచము, వాఙ్మయప్రపంచములయొక్క (నామరూపముల) సంపర్కమును త్యజించును. మఱియు, అజ్ఞానావృతమగు ఆత్మనుగూడ సుషుప్తునివలె వీక్షింపకుండును. కాని ఆత్మదృష్టి నిత్యమును, విలోపరహితమును అగుటవలన నివురుగప్పిన నిప్పువలె వెలయు సాక్షి-చైతన్యముయొక్క ప్రకాశ ప్రభావమున నంతటిని గాంచునుంచేయుండును.

ప్రస్ఫురచ్చిత్తకలనమేతన్మౌనత్రయం స్మృతమ్
భవన్తి మౌనినస్తత్ర న తజ్జాస్తత్స్థలీలయా. 13

త్రివిధములగు ఈ మౌనములను ఆశ్రయించినవారు సమాధినుండి లేచినపుడు మరల వారి చిత్తము చంచలత్వమును బొందుచున్నది. కాని తత్త్వజ్ఞుఁడై సుషుప్తమౌనము నాశ్రయించినవాని చిత్తము వధింపఁబడినందువలన, అది ఇట్టి చంచలత్వమున వసింపుట పొసగదు.

నాత్రోపాదేయతాజ్ఞాన మేతన్మౌనత్రయే కిల
లీలయా కథితం తేన తజ్జ్ఞాః కుర్వన్తు వా న వా. 14

సుషుప్తమౌనులు పూర్ణాత్మయందు వెలయుచు, అట్టి ఆత్మస్థితిలీలచే త్రివిధమౌనములు బంధరూపములగుట వలన 'ఇవి పరిత్యాజ్యములని కుపితులే కావచ్చును. లేక అవి సచ్చిదానందము

యొక్క విలాసమని గ్రహించి కుపితులు కాకపోవచ్చును—ఎట్లైనను వారికిత్రిగుణమానముల ఉపా దేయబుద్ధి (మంచిది లేక గొప్పది అను తలంపు) లేదు.

ఇదం సుషుప్తమానం తు జీవన్ముక్తమితి స్థితమ్
అపునర్జన్మనో జన్తోః శృణు శ్రవణభూషణమ్. 15

ఇట్టి అనుభవమే సుషుప్త-మౌనమున నుండును. ఇదియే జీవన్ముక్తస్థితి. జీవన్ముక్తియను ఈ సుషుప్తమానము పునర్జన్మరహితుండగు జీవునకే గలుగును, శ్రవణభూషణమగు ఆ సుషుప్తమానమును (గుఱించి చెప్పుచున్నాడను) వినుము.

నాత్ర సంయమ్యతే ప్రాణస్త్రివిధో నాపి యోజ్యతే
నోల్లసన్తే న గ్లాయన్తే సమస్తేన్ద్రియసంవిదః. 16

ఆత్మతత్త్వదర్శనమైనవో ఇయ్యది సహజముగనే సిద్ధించును. వెనుక చెప్పఁబడిన మౌనములవలె దీనిని సాధించుటకు కష్టపడనక్కఱలేదు. ప్రాణనిరోధముతోగాని, పూరక, రేచక, కుంభకములతోగాని, పనిలేదు. ఇయ్యది సిద్ధించిన, విషయలాభమున గలుగు హర్షముచే ఉప్పొంగవలసిన అవసరములేదు. లేక విషయములు లభింపకపోయిన, దుఃఖమునందవలసిన అక్కఱయుండదు.

నానాత్వాకలనేయం చ న వల్గతి న శామ్యతి
చేతో న చేతో నాచేతో న సన్నాసన్న చేతరత్. 17

ఆస్థితియందు నానాత్వకల్పన ఉదయింపదు, లేక శాంతింపదు. అనఁగా ఈ విచిత్రకల్పనలు అన్నియును వెలయుచున్నను సుషుప్తమౌని వాని నన్నిటిని భ్రమయనియే గ్రహించును. అతని చిత్తము చిత్తముగనుండదు. అది చిత్తత్వమును గోల్పోవును. అతని మనస్సు సంపూర్ణముగ లోపించినదనియు తలంపరాదు. దానియందు కర్తృత్వాభిమానముండదు. మఱియు, ఆస్థితియందు సత్తుగాని, అసత్తుగాని, తదితరముగాని యేదియును నుండదు.

అవిభాగమనభ్యాసం యదనాద్యన్తమాస్థితమ్
ధ్యాయతోఽధ్యాయతశ్చైతత్సుషుప్తం మౌనముచ్యతే. 18

విభాజ్య, విభాగసంబంధరహితమును, ప్రయత్నవిహీనమును, ఆద్యంతశూన్యమును, ధ్యానక్రియయున్నను ధ్యానములేనట్టిదనదగు త్రిపుటీశూన్యస్థితియును అనునదియే సుషుప్తమౌనమనఁబడుచున్నది.

యథాభూతమిదం బుద్ధ్వా జగన్నానాత్వవిభ్రమమ్
యథాస్థితమసందేహం సౌషుప్తం మౌనమేవ తత్. 19

నానాత్వభ్రమపూర్ణమగు ఈజగత్తు ఆత్మతత్త్వముననే వెలయుచున్నది. ఇట ఆత్మతత్త్వముగాక మఱియెట్టి భేదములులేవు. అను విషయముయెడల వర్తిల్లు నిస్సందేహస్థితియే సుషుప్తమౌనము.

అనేకసంవిద్రూపాత్మ శివేనైవేదమాతతమ్
ఇత్యాస్థితమనన్తం యత్సౌషుప్తం మౌనముచ్యతే. 20

నానాత్వజ్ఞానమున కాశ్రయమగు శివునిచే నిదియంతయును నిండి వెలయుచున్నది. అని గ్రహించుటయే సుషుప్తమౌనము.

ఆకాశం నైవ చాకాశం సర్వమస్తి న చాస్తి చ
ఇతి చిత్తం సమం శాన్తం యత్తన్మౌనం సుషుప్తవత్. 21

సర్వవ్యాపి యగుటవలన ఆకాశమును, శూన్యవస్తువు కానందువలన ఆకాశము కానిదియును, సర్వస్వరూపియును, మిథ్యకానిదియును, అని పరతత్త్వమును గ్రహించి చిత్తము సమత్వమును, శాంతభావమును బొందుటయే సుషుప్తమౌనమనఁబడును.

సర్వశూన్యం నిరాలమ్బం శాన్తివిజ్ఞప్తిమాత్రకమ్
న సన్నాసదితి యస్యామాసితం మౌనముత్తమమ్. 22

సర్వవికల్పశూన్యమును, బహిర్విషయజ్ఞాన ఆలంబనములేనిదియును, సర్వోపశమ జ్ఞానయుక్తమును, సదసదతిరిక్తమును అగు జీవన్ముక్తిస్థితియందు వెలయుటయే ఉత్తమమౌనమనంబడు సుషుప్తమౌనము.

భావాభావదశాదేశ విశేషైర్వ్రతతోత్థితైః
సంవిదో యదనాభాసస్తన్మౌనం పరమం విదుః. 23

భావాభావ స్వరూపములగు దశలు నిరంతర ముదయించుచున్నది. ఈ దశలజ్ఞానము లేకుండుట అనఁగా వివర్తములేకుండుటయే పరమసుషుప్తమౌన మనంబడును.

అత్యన్తసమతైవాన్తశ్చేతసాఽవృత్తిరూపిణా
యదనావర్తనం సంవిద్వృత్తేస్తన్మౌనమక్షయమ్. 24

చిత్తవృత్తులులేకున్న, వాని వ్యాపారముకూడ ఉపశమించును. అప్పుడుచిత్తము సమత్వమును బొందును. చిత్తవృత్తి.వ్యాపారరహితమగు ఈ స్థితియే అక్షయమగు సుషుప్తమౌనము.

నాహమస్మి న చాన్యోఽస్తి న మనో న చ మానసమ్.
ఇతి సంవిదసంవిత్తిరవిచ్ఛిన్నాతి మౌనితా. 25

'ఈ జగత్తున నేనుగాని, ఇతరులుగాని, మనస్సుగాని, మానసికకల్పనలు గానిలేవు. అను జ్ఞానము వృత్తికూడ నిరుద్ధమైన మిగులు అవిచ్ఛిన్న మౌనస్థితియే అతిమౌనమునంబడు సుషుప్తమౌనము.

అహమస్మి జగత్యస్మిన్స్వస్తి శబ్దార్థమాత్రకమ్
సత్తాసామాన్యమేవేతి సౌషుప్తం మౌనముచ్యతే. 26

'ఈ జగత్తునందంతటను నేనే వ్యాపించియున్నాను, శబ్దార్థమాత్రమంతయు నిర్వికారమైన సత్తాసామాన్యమే (ఆత్మయే)' అని గ్రహించుటయే సుషుప్తమౌన మనంబడుచున్నది.

యస్మాత్సం విదమేవ స్యాత్స్వాన్యాదికలనా కుతః
అనన్తమేవ సౌషుప్తం సర్వం మౌనమతస్తతమ్. 27

ఈ సుషుప్తమౌన స్థితియందు ఏ విధమైన విషయ జ్ఞానమున్నుండదు. అందు వలననే ఇయ్యది, అనంతమగుచున్నది. దీనినుండియే తక్కిన మౌనములు కలుగుచున్నవి.

సుషుప్తమౌనమేవేదమనన్తత్వాత్ప్రబోధవత్

తుర్యమేవామలం విద్ధి తుర్యాతీతమథాపి చ. 28

అనంతమగు ఈ సుషుప్తమౌనమున ప్రబోధమున్నది. ఇదియే అవిద్యను బాధితమొనర్చు నిర్మలతురీయస్థితి. అవిద్యను బాధితమొనర్చు వృత్తులనుగూడ బాధితమొనర్చుటవలన తురీయాతీతమని కూడ నిది చెప్పఁబడుచున్నది.

సౌషుప్తైకసమాధాన స్తథా తుర్యసమాధికః
తుర్యాతీతసమాధిర్వా జాగ్రత్యపి భవన్తి వై. 29

(పూర్వోక్తములగు సప్తభూమికలందలి తుదిమూఁడును సమాధిభేదములు (అనగా) సుషుప్తి రూపసమాధి, తురీయసమాధి, తురీయాతీతసమాధి యనునవి జాగ్రత్తునందును, స్వప్నమందునుగూడ జ్ఞానికి సంభవింపగలవు.

తుర్యస్థ ఏవ సకలామల శాన్తివృత్తి
ర్జాగ్రత్యపి వ్యవహరన్నిపుణం సమన్తాత్
నిత్యం సదేహ ఉత వాపి విదేహ ఏవ
బ్రహ్మాన్నభో భవత ఏవ కిలాస్తి సాధో. 30

సాధూ! రామచంద్రా! నీవు బ్రహ్మభూతుఁడవైతివి. ఇఁక ఈ శరీరము నాశ్రయించి సర్వత్ర నైపుణ్యముతో వ్యవహారపథమునే అనుసరింపుము. నీవిపుడు జీవన్ముక్తస్థితినొంది ఆకాశము వలె నిర్మలుఁడవై శాంత్యాదివృత్తులచే అలంకృతుఁడవై, తురీయమను విదేహస్థితిని బడసితివి. స్థూల సూక్ష్మముల పరిత్యజించి ఆకాశమువలె శూన్యుఁడు కాఁగలవానికే ఇట్టి స్థితికలుగును. నీయందే యిట్టి లక్షణము కనుపట్టుచున్నది. (ఇది సామాన్యముగ ఇతరులయందు అగుపించదు.)

ఓ మిత్యుదస్త భవవాసనమేకమాస్స్వ
న త్వం న చాహమపి నాన్యదిహాస్తి సత్యమ్
సర్వం చ విద్యత ఇతీహ కిలాన్తరాభమ్
జ్ఞస్తిష్ఠ చిద్గగనకోశకలైకనిష్ఠః. 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్థే మహామౌన యత్నోపదేశో
నామాష్టషష్టితమః సర్గః ॥ 68 ॥

ఓ రామచంద్రా! (మాండూక్యోక్తమగు) ఓంకార ప్రవిలాపక్రమము ననుసరించి, సంసార వాసనాశూన్యుఁడవై నీవు తురీయపదము నధిష్ఠింపుము. 'అంతయు (దృశ్యము) ఉన్నది' అను ప్రసిద్ధి నాడీ అంతరానుభూతమగు స్వప్నమువంటిది. ఈ సత్యమును గ్రహించి జీవన్ముక్తుఁడవై చిదాకాశ కళయందు చ్యుతిరహితుఁడవై వెలయుము

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున మహా
మౌన యత్నోపదేశమను అఱువది యెనిమిదవ సర్గము ॥ 68 ॥

## ఏకోనసప్తతితమః సర్గః

[గణానామపి రుద్రత్వం ముక్తానామైచ్ఛికీ స్థితిః
యోగాత్ప్రాణస్య విలయో మృతేస్తూద్భూతిరుచ్యతే.

గణముల రుద్రత్వము, ముక్తుల స్వేచ్ఛాస్థితి, యోగమున ప్రాణ లయమగుట మృతించిన అభ్యుది లయమొందకుండ వెలయు చుండుట అను విషయము లీసర్గమున వర్ణింపఁ బడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

శతః శతత్వమాయాతం రుద్రాణాం మునినాయక
యే గణాస్తే తు యే రుద్రా ఉత నేతి వదాశు మే. 1

శ్రీరాముడు:—మునీశ్వరా! శతరుద్రులని తాము చెప్పియుంటిరి. గణములతో, గలిపి లెక్కించ నూఱవవాఁడు రుద్రుడగుచున్నాడా? లేక గణములకంటె వేఱగు రుద్రుఁడొకడున్నాడా? ఈ విషయమును నాకు వివరించి చెప్పుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

స్వప్నానాం భిక్షుణా దృష్టం శతం శతశరీరకమ్
సర్వముద్దేశతో జ్ఞాతం తత ఉక్తం న తన్మయా. 2
య ఆకారాశ్చ తే స్వప్నే తత్తద్గణశతం స్మృతమ్
తదేతద్రుద్రశతకం రుద్రా అపి గణా విధా 3

శ్రీవసిష్ఠుడు:— ఓరామచంద్రా! భిక్షుకుఁడు గాంచిన స్వప్నశతమే నూఱు విధములగు శరీరముల గ్రహించెనని నేను చెప్పియుంటిని. ఆ స్వప్నశతమూర్తులే గణశతమయ్యెను. గణములకును, రుద్రులకును భోగైశ్వర్య విషయమున సామ్యముండుటవలన వారే రుద్రులని చెప్పఁబడినారు. ముఖ్య రుద్రుని పరిచారకులగు ఈ గణములు ఈశ్వరుని అనుచరులని యెంచఁబడినప్పుడు గణములనియు, ఐశ్వర్యసామ్యము పరిగణించఁబడిన రుద్రులనియు చెప్ప బడుచున్నారు. నీవీవిషయమున గ్రహించియే యుంటివను ఉద్దేశ్యముతో నేను ఇద్దానిని వివరించి చెప్పలేదు.

శ్రీరామ ఉవాచ;—

ఏకస్మాద్భగవంశ్చిత్తాత్కథం చిత్తశతం కృతమ్
తత్స్వప్నకృతరుద్రేణ దీపాద్దీపశతం యథా 4

శ్రీరాముడు:— మహాత్మా! ఒకదీపము నుండి మఱి నూఱుదీపములు వెలిగింపఁబడునట్లు స్వప్నమునందలి రుద్రుఁడు ఒకేచిత్తమునుండి చిత్తశతము నెట్లు కల్పింపగలిగెను?

శ్రీవసిష్ఠ ఉవాచ;—

నిరావరణసద్భావా యద్యథా కల్పయన్తి హి
తత్తథానుభవన్త్యేవ రసావరణ సంవిదః 5
సర్వాత్మనః సర్వగత్వాద్యద్యథా యత్ర భావ్యతే

తథానుభూయతే తత్ర తత్తథా జ్ఞతయా ధియా. 6

శ్రీవసిష్ఠుడు:— ఓరామచంద్రా! మాయా - ఆవరణములేని జ్ఞానైశ్వర్య ప్రభావముగల సత్య సంకల్పులగు మహాత్ములెద్దానిని కల్పనజేయుదురో అయ్యది మాయయందు ప్రతిబింబితమై వారికను భూతమగును. సర్వాత్ములును సర్వవ్యాపులునునగు ఆబ్రహ్మస్వరూపు లెద్దానిని భావింతురో, అయ్యది సర్వజ్ఞమగువారి బుద్ధికి ఆతీరుగనే తోఁచును.

శ్రీరామ ఉవాచ:—

కపాలమాలాభరణో భస్మశాలీ దిగమ్బరః
శ్మశాననిలయో బ్రహ్మన్కాముకశ్చ కిమీశ్వరః 7

శ్రీరాముడు:— బ్రహ్మజ్ఞా! ఇట్టి ఐశ్వర్యముగల ఈశ్వరుఁడేల కపాలమాలను, భస్మమును ధరించి దిగంబరుఁడై శ్మశానవాసియై కాముకుఁడై యున్నాడు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

మహేశ్వరాణాం సిద్ధానాం జీవన్ముక్తశరీరిణామ్.
న క్రియానియమోఽస్తీహ సహ్యాజ్ఞస్యేవ కల్పితః 8

శ్రీవసిష్ఠుడు.— ఓరామచంద్రా! సిద్ధిని బడసి, జీవన్ముక్తులై పరమైశ్వర్యమును బొందినవారికి శుభకరములును, సుఖభోగకారణములునగు శాస్త్రీయక్రియలనే ఆచరింపవలెనను నియమములేదు. వారు వేదవిధికి దాసులు గారు. అజ్ఞులకు శుభకరములుగ తోఁచు కామ్యకర్మదులు వారికి అశుభములుగనే తోఁచును. మఱియు వారికి అశుభప్రారబ్ధము లేనందువలన సామాన్యులకు దుఃఖమును గలిగించు విషయములు వారికి దుఃఖకరములుగాక సుఖకరములేయగును. ఈ క్రియానియమములన్నియును అజ్ఞులచే కల్పింపఁబడినవి.

అజ్ఞస్తుదిత చిత్తత్వాత్క్రియానియమనం వినా,
గచ్ఛన్మాత్స్యేన మాత్స్యేన పరం దుఃఖం ప్రయాతి హి. 9

అజ్ఞుని చిత్తము రాగద్వేషాది దోషసహస్రమువలన ఖండితమైయున్నది. అతడు మత్స్యన్యాయము ననుసరించి ఈ సంసారమున సంచరించుచున్నాడు * అతనికి విధినిషేధరూపకమగు క్రియానియమము లేకున్న మిక్కుటమగు దుఃఖమును పొందునని శాస్త్రములందు చెప్పఁబడియున్నది.

సుజ్ఞాస్విష్టేష్వనిష్టేషు న నిమజ్జతి వస్తుషు
యతేన్ద్రియత్వాద్బుద్ధత్వాన్నిర్వాసనతయా తథా. 10

జీవన్ముక్తులగు ప్రాజ్ఞులు ఇష్టానిష్ట విషయములందు చిక్కువడకుండ వెలయుచున్నారు. ఏలయనగా వారు జితేంద్రియులై వాసనాపథము నతిక్రమించినారు! పరమాత్మతత్త్వమును గ్రహించి వాసనారాహిత్యమును బడసినారు.

---

* పెద్దచేపలు చిన్నచేపలనుదిని తమప్రాణములను నిలుపుకొనును. అట్లే జగత్తున బలవంతులు బలహీనులను హింసించి తమ్ము నిలఁబెట్టుకొనుచున్నారు. ఇదియే మత్స్యన్యాయ మనఁబడుచున్నది.

కాకతాలీయవద్రూఢాం క్రియాం కుర్వన్తి తే సదా
న కుర్వన్త్యపి వై కించిన్నైషాం క్వచిదపి గ్రహః. 11

వారు కాకతాళీయన్యాయము ననుసరించి ఆకస్మికముగ లభించిన కార్యముల నాచరించుచున్నారు. వారు క్రియల నాచరించుచున్నను; లేక ఆచరింపకపోయినను, వారి కిసుమంతేని అందు ఆసక్తిలేదు.

కాకతాలీయతో విష్ణురేవంకర్మోదితః పురా,
ఏవంకర్మా త్రినయన ఏవంకర్మామ్బుజోద్భవః. 12

బ్రహ్మవిష్ణుమహేశ్వరులను త్రిమూర్తులుగూడ ఇట్లే కాకతాళీయముగ మనుష్యజన్మను గ్రహించి కార్యముల నాచరించుచున్నారు.

న నిన్ద్యమస్తి నానిన్ద్యం నోపాదేయం న హేయతా
న చాత్మీయం న చ పరం కర్మ జ్ఞవిషయం క్వచిత్. 13

జీవన్ముక్తులగు ఈసిద్ధపురుషులందఱికిని నింద్యానింద్యములు, లేక గ్రహణత్యాజ్యములగు విషయములెవ్వియును లేవు. స్వపరభేదముకూడ వారికి లేదు మఱియు వారిని బంధింపఁగలిగినట్టి కర్మయు నెద్దియును లేదు.

అగ్న్యాదీనాం యథౌష్ణ్యాది సర్గాదౌ రూఢిమాగతమ్.
హారాదీనాం తథా కర్మ ద్విజాతీనాం చ జాతయః. 14

సృష్ట్యాదియందు అగ్న్యాదిపదార్థముల ఔష్ణ్యాదులు రూఢికెక్కినట్లు, అనగా అగ్న్యాది పదార్థములు ఉష్ణత్వాదిగుణములతో గూడినవై వెలయును. అను నియమము విధింపఁబడినట్లు ముక్త్యేశ్వరుని యిచ్ఛ ననుసరించియే హరిహరాదుల విచిత్రవేష క్రియలును, బ్రాహ్మణాది వర్ణముల కర్మలును ప్రసిద్ధికెక్కినవి.

సర్గే ప్రరూఢిమాయాతే సంకేతవశతః పృథక్,
అనుభూతిఫలాశ్చర్యాః కల్పితాః కల్పితాః స్వయమ్. 15

కాని అజ్ఞుల ఆచరణము అగ్న్యాదులవలె నియమబద్ధముకాదు, లేక సృష్ట్యాదియందు అభివ్యక్తమునుగాదు, సృష్టి అయినపిదప వర్ణవిభాగసంకేతము ననుసరించి విభిన్నములగు ఐహిక పారలౌకిక సుఖదుఃఖములఁగలిగించు శాస్త్రీయవ్యావహారికచర్యలను వారు రాగవశమున తమకుతామే కల్పించుకొనుచున్నారు. ఇదియే అజ్ఞులకును, విజ్ఞులకును గల భేదము.

విదేహముక్తవిషయం తుర్యమౌనమతో మయా,
నోక్తం తవ పరం మౌనం సదేహస్య రఘూద్వహ. 16

రఘుకులోత్తమా! శరీరియగు జీవునియందు ప్రసిద్ధములగు చతుర్విధమౌనములను గుఱించి నీకు జెప్పియుంటిని. కాని విదేహముక్తుని మౌనమునుగుఱించి నీకు జెప్పియుండలేదు. (అద్దానిని జెప్పుచున్నాడను వినుము.)

ఖాదప్యతితరామచ్ఛమాత్మాకాశం చిదాత్మకమ్,
తత్ప్రాప్తిః పరం శ్రేయః సా కథం ప్రాప్యతే శృణు. 17

అది ఆకాశముకంటెను కడుంగడు నిర్మలమగు చిన్మయ ఆత్మాకాశము, తద్ధ్యాన ప్రాప్తియే నిశ్శ్రేయసము. అనగా పరమమోక్షము. దానిని బడయురీతిని చెప్పుచున్నాడను వినుము.

సమ్యగ్జ్ఞానావబోధేన నిత్యమేకసమాధినా,
సంఖ్యైరేవావబుద్ధా యే తే స్మృతాః సాంఖ్యయోగినః. 18

సంపూర్ణమగు జ్ఞానమును నిరవచ్ఛిన్నమగు సమాధివలనను, వివేకవిచారములతో గూడిన రాజయోగమువలనను బొందినవారు సాంఖ్యయోగులనంబడు చున్నారు.

ప్రాణాద్యనిలసంశాన్త్యా యుక్త్యా యే పదమాగతాః
అనామయమనాద్యన్తం తే స్మృతా యోగయోగినః. 19

పూర్వ వర్ణితమగు హఠయోగము ననుసరించి ప్రాణాదుల నిరోధించి అనామయమును, ఆద్యంతరహితమును నగు పదము నధిరోహించినవారు యోగయోగులనంబడు చున్నారు.

ఉపాదేయం తు సర్వేషాం శాన్తం పదమకృత్రిమమ్
తత్కేచిత్సాంఖ్యయా ప్రాప్తాః కేచిద్యోగేన దేహతః. 20

యోగమువలన ఈ ద్వివిధయోగులును పొంద నభిలషించునది శాంతమును, అకృత్రిమమును నగు పరమపదమే. కొందఱు సాంఖ్యము (వివేకవిచారయుక్తమగు రాజయోగము) వలనను, మఱికొందఱు యోగము కర్మయోగము వలనను ఈ జన్మయందే యద్దానిని బడయుచున్నారు.

ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి
యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం పరం యోగైస్తదేవ హి. 21

ఏవ్యక్తి సాంఖ్యమును యోగమును నొకటిగ గాంచునో (ఈ రెండును ఒకే సత్యమునకు జేర్చు రెండు మార్గములనిగాని లేక రెండు మెట్లు అనిగాని యెంచునో) అతడే తత్త్వమును బడయగలుగుచున్నాడు. సాంఖ్యులు బడయు పరమ పదమునే యోగులుకూడ బడయుచున్నారు.

యత్ర ప్రాణమనోవృత్తిరత్యన్తం నోపలభ్యతే
వాసనావాగురోత్క్రాన్తా తద్విద్ధి పరమంపదమ్. 22

ఎచట ప్రాణముయొక్కయు, మనస్సుయొక్కయు వృత్తులు విలయమునొంది పొత్తిగ అనుభవింపబడకుండునో, ఎయ్యది వాసనలను జాలమునకు (వలకు) వెలుపలనున్నది అగుచున్నదో, అట్టి స్థితియే పరమపదమని గ్రహింపుము.

వాసనాం చిత్తమేవాహుః కారణం తద్ధి సంసృతేః,
తదకారణతామేతి విలీనోభయకర్మసు. 23

వాసనలనే చిత్తమందురు. అదియే సంసారమునకు కారణమగుచున్నది. ఈ యోగముల కెండిట నయ్యది విలోపమొందింపఁబడి తత్త్వజ్ఞానాత్మకముగ మార్పఁబడి కారణత్వమును బోఁగొట్టుకొనుచున్నది.

మనఃపశ్యతి వై దేహం బాలో బేతాలకం యథా
స్వాత్మానం విలయం నీత్వా న భూయస్తం ప్రపశ్యతి. 24

బాలుఁడు బేతాళమును గాంచునట్లు మనస్సే శరీరమును (ఆత్మగ) గాంచుచున్నది. అట్లు గాంచుటయే సంసారము. దీనికి కారణము మనస్సు. ఆ మనస్సు తత్త్వజ్ఞానముచే విలోపమొనరింపఁబడిన, ఇఁకనది ఈ శరీరమును వీక్షింపఁజాలదు. మనస్సు శాంతించిన, సంసారముకూడ ఉపశమించును.

మనో ముగ్ధైవాభ్యుదితమసదేవానవేక్షణాత్
స్వప్నే స్వమరణాకారం ప్రేక్ష్యమాణం న విద్యతే. 25

ఆత్మతత్త్వ దర్శనమువలననే మనస్సు శాంతించుచున్నది. ఆత్మదర్శనమొనర్పకున్న స్వప్నమున అళీకమగు (మిథ్యయగు) స్వమరణము కలుగునట్లు-మనస్సుకూడ ఉత్పన్నమగుచున్నది. మఱియు జాగ్రద్దశయందు ఆస్వప్న వీక్షితమగు స్వమరణము ఉండనట్లు, ఆత్మదర్శనమొనర్చిన, మనస్సుకూడ లేకుండును.

మనోభవస్తు సంసారః క్వ మమాహం క్వ సంతతిః
ఉపదేశ్యోపదేశాదిబన్ధమోక్షౌ చ తత్కృతః. 26

ఈ మనస్సువలననే సంసార-సృష్టి యుదయించుచున్నది. జ్ఞానమువలన నియ్యది బాధితము కాఁగా 'మమ, అహం' భావములు ఉపదేశ్య, ఉపదేశాదులు, బంధమోక్షములు మున్నగు కల్పనా సమూహములన్నియును ఎటనుండి కలుగఁగలవు ?

ఏకతత్త్వఘనాభ్యాసః ప్రాణానాం విలయస్తథా
మనోవినిగ్రహశ్చేతి మోక్షశబ్దార్థసంగ్రహః. 27

అందువలన దృఢమగు ఏకతత్త్వాభ్యాసము, ప్రాణనిరోధము, మనోనిగ్రహములనఁబడునవే మోక్షకారణమగు సాధనత్రయమైయున్నది. ఇదియే సర్వశాస్త్రార్థ-తాత్పర్య సంగ్రహము.

శ్రీరామ ఉవాచ:—

యది హి ప్రాణవిలయో మునే మోక్షస్య కారణమ్
మృతా ఏవ విముచ్యన్తే తన్మన్యే సర్వజన్తవః. 28

శ్రీరాముఁడు:—మునీంద్రా ! మధ్యమాధికారి అవలంబించు ప్రాణవిలయమే మోక్షమునకు కారణమైన, అప్పుడు (మరణసమయమున ఈ ప్రాణనిరోధము కలుగుచున్నందువలన) మృతులందఱును మోక్షార్హులగుచున్నారని యెంతును.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

త్రిష్వేతేషు ప్రయోగేషు మనః ప్రశమనం వరమ్

సాధ్యంవిద్ధి తదేవాశు యథా భవతి తచ్ఛివం. 29

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఈ త్రివిధోపాయములలో మనోనిరోధమే శ్రేష్ఠము. అదియే సాధ్యము. అది దేనిచే ఎంత తొందరగ లభించిన అది అంతగ మంచిది.

యదా నిర్వాణనం ప్రాణాస్త్యజన్తీదం శరీరకమ్
తదానుభూయ తన్మాత్రైర్యాన్తి వ్యోమని సంగమమ్. 30

మరణించినతోడనే మనఃప్రాణములు వినాశమునొందవు. మూర్ఛాసమయమున సంభవించునట్లు అవి కరఁగిన ఉప్పువలె వాసనారూపమున వెలయుచు, మరల మనుజుఁడు జన్మించినప్పుడు ఆవిర్భవించుచున్నవి. ప్రాణము శరీరమునుండి వెలువడునప్పుడు గురకపుట్టును గదా. అది ఆగినతోడనే ప్రాణము శరీరమును ద్యజించి వాసనా, కామ, కర్మలచే ఉపస్థాపితమైన భవిష్యద్దేహాకారము ననుభూతమొనర్చుకొని బాహ్యాకాశమున తాదృశదేహారంభమున కనుకూలములగు భూతతన్మాత్రలతోఁ గూడుకొనును.

వాసనాసాత్మకాన్యేవ విద్ధి తన్మాత్రకాణి వై
తదాత్మకైర్మనోవద్భిః ప్రాణైః శ్లిష్యన్తి నేతరైః. 31

ఈ భూతతన్మాత్రలు వాసనాత్మకములని గ్రహింపుము. ఇవి తదనుకూలములగు వాసనలతోనున్న మనఃప్రాణములతోడనే కూడుకొనును. ఇతరములగు ప్రాణములతోఁ గూడుకొనవు. ఈ విషయము శ్రుతిప్రసిద్ధమును యుక్తిసిద్ధమునునై యున్నది.

సవాసనాస్తూత్పద్యతే ప్రాణా ముఞ్చన్తి దేహకమ్
తద్వ్యోమవాయుసంశ్లేషం యాన్తి దుఃఖాయ గన్ధవత్. 32

ప్రాణము భవిష్యద్దేహవాసనలతోఁగూడి పూర్వదేహమును పరిత్యజించుటవలన దేహాంతరము వాసనలతోఁగూడియే ఉత్పన్నమగుచున్నది. పుష్పముయొక్క సుగంధము నువ్వులలో ప్రవేశించి, (అందున్న నూనెతోఁగూడి గానుగయందు నలుపబడుట మున్నగు గాఁగల) కష్టముల ననుభవించునట్లు ప్రాణములుకూడ శరీరమునందున్న హృదయాకాశముతోడను తదంతర్గతమగు వాయువులతోడను గలిసి క్లేశములఁ బొందుచున్నవి.

మనః సామ్బురివామ్భోధౌ న శామ్యతి సవాసనమ్
నామనస్కాః సంభవన్తి ప్రాణాః సూర్య ఇవ త్విషః. 33

అందువలన మృతించినతోడనే ప్రాణనిరోధమగును, అరియెంచుట యుక్తియుక్తము కాదు. జలపూర్ణమగు ఘటమును సముద్రమున ముంచియుంచిన, అది కనుపడకుండును గాని వినష్టమగుచుండుట లేదు. అట్లే వాసనాసమన్వితమగు ఈ మనస్సుకూడ మరణానంతరము అదృశ్యమైయుండును. వినాశమును బొందదు. ప్రభారహితుఁడై దివాకరుఁడు ఉండజాలనట్లు ప్రాణములుకూడ మనోరహితములై యుండఁజాలవు.

న జహాతి మనః ప్రాణాన్వినా జ్ఞానేన కర్హిచిత్
తృణాన్తరేణైవ వినా తృణాజ్జమివ తిత్తిరిః 34

తిత్తిరపక్షి, మఱిరేమైకగడ్డిపరక దొఱకనిచో నోటంగరచినదానిని విడువనట్లు మనస్సుకూడ జ్ఞానోదయముకానిచో ప్రాణములం బరిత్యజింపదు.

జ్ఞానాదవాసనీభావం స్వనాశం ప్రాప్నుయాన్మనః
ప్రాణాత్స్పన్దం చ నాదత్తే తతః శాన్తిర్హి శిష్యతే. 35

జ్ఞానోదయమైనయెడలనే మనస్సు వాసనాశూన్యమై విలయమునందును, అప్పుడు మనస్సు ప్రాణమునుండి స్పందభావమునందకుండును. ఇట్లుమనస్సు నిష్పందస్థితినొంద కేవలముశాంతియేమిగులును.

జ్ఞానాత్సర్వపదార్థానామసత్వం సముదేత్యలమ్.
తతోఽజ్ఞ వాసనానాశాద్వియోగః ప్రాణచేతసోః 36

వత్సా! జ్ఞానోదయమే వాసనా నాశనమునకు కారణము. జ్ఞానమువలననే పదార్థముల అస్తిత్వము తొలంగిపోవుచున్నది. ఇట్లు ద్వైతము బాధితముకాగా వాసనలుకూడ వినాశమునందు చున్నవి. అపుడు ప్రాణము, చిత్తముకూడ విలోపించుచున్నవి.

తతో న పశ్యతి మనః ప్రశాన్తం దేహతాం పునః
స్వనాశేన పదం ప్రాప్తం వాసనైవ మనో విదుః 37

అప్పుడు, ప్రశాంతినొందిన మనస్సు దేహభావమునుదర్శింపదు. ఏ వాసనలు నాశనముకాగా పరమపదము లభించునో ఆ వాసనలే మనస్సు అనంబడుచున్నవి.

చేతో హి వాసనామాత్రం తదభావే పరం పదమ్.
తత్త్వం సంపద్యతే జ్ఞానం జ్ఞానమాహుర్విచారణమ్. 38

ఏలయనిన, వాసనయేచిత్తము. వాసనలేకుండుటయే పరమపదము. జ్ఞానము వాసనాసమన్విత ములగువానినన్నిటిని నిరాకరించి ఆత్మతత్త్వముగ పరిణతమగును. తుదకాతత్త్వము అచలమగు జ్ఞాన స్వరూపముగనే వెలయును. ఇదియే అనుభవనిష్ఠులగువారు చెప్పునది.

ఇత్యస్యాః సంసృతే రామ పర్యన్తః సంప్రవర్తతే.
స్వయం వివేకమాత్రేణ రజ్జుసర్పభ్రమాకృతేః 39

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ రజ్జుసర్పభ్రమమునుబోలి వర్తించు ఈ సంసారము వివేక మాత్రముచే స్వయముగ నశించుచున్నది.

ఏకార్థాభ్యాసప్రాణరోధచేతః పరిక్షయాః
ఏకస్మిన్నేవ సంసిద్ధే సంసిద్ధ్యన్తి పరస్పరమ్. 40

ఏకతత్త్వాభ్యాసము (బ్రహ్మభావన), ప్రాణనిరోధము, మనోలయము అనువానిలో ఏ యొక్కటి సిద్ధించినను తక్కినవన్నియు సిద్ధించుచున్నవి.

తాలవృన్తస్య సంస్పన్దే శాన్తే శాన్తో యథానిలః
ప్రాణానిలపరిస్పన్దే శాన్తే శాన్తం తథా మనః 41

విసనకఱ్ఱను వీచుటమానిన, గాలికూడ ఆగిపోవునట్లు, ప్రాణవాయుస్పందనము నివృత్తము కాఁగా మనస్సుకూడ శాంతించుచున్నది.

ప్రాణః శరీరవిలసమే ప్రయాతి వ్యోమ వాయుతామ్
యథా వాసితమేవేదం సర్వం పశ్యతి తత్ర వా. 42

సామాన్యముగ మనుజుఁడు మరణించునపుడు జరుగువిధము పైన చెప్పఁబడినది. ఇక శాపమునుబడసియో, లేక, ఛేదించబడియో, శరీరముకూలినప్పుడు ప్రాణవాయువు బాహ్యాకాశమునందలి వాయువుతోఁగూడి తద్రూపమును బొందుచున్నది. అప్పుడచట తన వాసన ననుసరించి సమస్తప్రపంచమును గాంచును.

యథా విదేహాః పశ్యన్తి ప్రాణా వ్యోమని దేహకమ్
సమనస్కా స్తథాచారం సర్వం చానుభవన్తి తే. 43

జీవుల ప్రాణవాయువులు శరీరమును విడిచి ఆకాశమున కర్మోద్భాసితములును, వాసనామయములునునగు సుర, నర, పశ్వాది దేహములనెట్లు గాంచునో, అట్లే తదనుయోగ్యములగు ఆచార, వ్యవహారములనుగూడ నవి పరిలక్షించుచుందురు.

శాన్తే వాతపరిస్పన్దే యథా గన్ధః ప్రశామ్యతి
తథా శాన్తే మనః స్పన్దే శామ్యన్తి ప్రాణవాయవః. 44

గాలి వీచుట ఆగిపోయిన (పుష్పాదుల) సుగంధముకూడ కట్టుపడునట్లు, మనస్సుయొక్క స్పందము శాంతింప, ప్రాణవాయువుయొక్క చలనముకూడ కట్టుపడిపోవును.

అవినాభావినీ నిత్యం జన్తూనాం ప్రాణచేతసీ.
కుసుమామోదవన్మిశ్రే తిలతైలే ఇవ స్థితే. 45

జీవుని ప్రాణము, చిత్తము (మనస్సు) వేర్వేఱుగ నుండవు. తిలతైలములవలెను, పుష్ప, సౌరభములవలెను ఆరెండును సదాకలిసియే యుండును.

మనసః స్పన్దనం ప్రాణః ప్రాణస్య స్పన్దనం మనః.
ఏతౌ విహరతో నిత్యమన్యోన్యం రథసారథీ. 46

మనస్సుయొక్క స్పందనమే ప్రాణమున్ను, ప్రాణముయొక్క స్పందనమే మనస్సును అగుచున్నవి. ఇవి పరస్పరము రథసారథులై విహరించుచున్నవి.

ఆధారాధేయవచ్చైతావేకాభావే వినశ్యతః
కురుతశ్చ స్వనాశేన కార్యం మోక్షాఖ్యముత్తమమ్. 47

అగ్ని, ఔష్ణ్యములకు పరస్పరము ఆధార, ఆధేయ భావమున్నట్లు, మనస్సు, ప్రాణములుకూడ ఒకదానికి మఱియొకటి ఆధారమై వెలయుచున్నవి. ఇవి పరస్పరము లయమునుబొంది మోక్షమను ఉత్తమకార్యమును సంపాదించుచున్నవి.

ఏకతత్త్వఘనాభ్యాసాచ్ఛాన్తం శామ్యత్యలం మనః

తల్లీనత్వాత్స్వభావస్య తేన ప్రాణోఽపి శామ్యతి. 48

ఏకతత్త్వము (ఆత్మ) యొక్క దృఢాభ్యాసముచే ద్వైతవాసన బాధితమగుటచే మనస్సు పూర్ణముగ శమించును. అప్పుడు మనోంతర్గతమగు ప్రాణముకూడ శమించుచున్నది.

విచార్య యదనన్తాత్మతత్త్వం తన్మయతాం నయ
మనస్తత స్తల్లయేన తదేవ భవతి స్థిరమ్. 49

ఓ రామచంద్రా ! నీవు (తత్త్వ) విచారణ నాశ్రయించి, అనంతమగు ఆత్మతత్త్వమున మనస్సును తన్మయమగునట్లు ఒనర్చుము. మనస్సు ఆ ఆత్మతత్త్వమున లయమొంది ఆత్మయే అయి స్థిరత్వమును బొందును.

యదేవాతితరాం శ్రేయోఽనుపలమ్భోపలమ్భయోః
ద్వయోరప్యసతో స్తత్ర శేషే వాపి స్థిరో భవ. 50

లేక, అత్యంత శ్రేయోదాయకమును, అజ్ఞానమున్న అజ్ఞానబాధకమగు బ్రహ్మాకారవృత్తియున్న (అను ఈ రెండును) కూడ నివృత్తముకాఁగా శేషించునదియునగు చిన్మాత్రమందు ప్రాణధారణ యొనర్చి స్థిరుఁడవు కమ్ము.

ఏకస్మిన్నుదృఢే తత్త్వే తావద్భావం విభావయేత్
భావో భావత్వమాయాతి స్వభ్యాసాద్యావదాతతమ్. 51

ఇట్లెంతవఱకు ఏకతత్త్వభావనావృత్తి ధారయు చవఃరసాక్షాత్కారమువలన వినష్టమై, అభావత్వము పొందకుండునో, అంతవఱకు ఏక (ఆత్మ) తత్త్వాభ్యాసము నొనర్చుచుండుము.

ప్రత్యాహారవతాం చేతః స్వయం భోగ్యక్షయాదివ
విలీయతే సహ ప్రాణైః పరమేవావ శిష్యతే. 52

ఆహారమును గైకొనకున్న శరీరము క్షీణించునట్లు ప్రత్యాహారపరాయణులగు వారికిగూడ నిర్వికల్ప సమాధియందు మనఃప్రాణముల విలయము సంభవించును. అప్పుడు పరమవస్తువొక్కటియే శేషించును.

యదేకతానం భవతి చేతస్తద్భవతి క్షణాత్
శాన్తాశేషవిశేషౌఘం చిరాభ్యాసస్య భావతః 53

ధారణాదులవలన మనస్సును ఏకాగ్రమొనర్ప అయ్యది బాహ్యవికారములను వీడి ధ్యానలక్ష్యమగు ఏకతత్త్వముగనే నిర్వికల్పసమాధియందు పరిణమించును. ఇది దీర్ఘకాల మభ్యసించినగాని సంభవింపదు.

అవిద్యేయం తు నాస్తీతి బుద్ధ్వా యుక్తియుతం ధియా
జ్ఞానాదేవ పరావాప్తి స్తదభ్యాస స్తతః పరమ్. 54

ఈ ద్వైతము అవిద్యారూపమైయున్నది. ఆ అవిద్యయో లేనిదేయగును. పరతత్త్వము (ఆత్మ) జ్ఞానముచేతనే సంప్రాప్తించును. అని యిట్లు శాస్త్రీయయుక్తియుక్తబుద్ధిచే నెఱిఁగి ధారణాధ్యానాదులద్వారా జ్ఞానము నభ్యసింపవలయును.

చిత్తే శాన్తే శామ్యతీయం సంసారమృగతృష్ణికా
జరాముపగతే మేఘే మిహికా తన్మయీ యథా. 55

శరత్కాలమున మేఘములు తొలఁగిపోవ, దానినుండి కలుగు మంచుకూడ తొలఁగి పోవునట్లు, మనస్సు శాంతించిన (తద్వికల్పమగు) సంసారమృగతృష్ణికకూడ ఉపశమించును.

చిత్తమాత్రమవిద్యేతి కురుతే నైవ తత్క్షయమ్
తద్రూపం రామ చిత్తాత్మా నాభావో హి పరం పదమ్. 56

ఓ రామచంద్రా! చిత్తమే అవిద్య; అందువలన (తత్త్వ) విచారణ నాశ్రయించి మనస్సును బ్రహ్మాకారముగ పరిణతమొనర్చి ఆమనస్సువలననే చిత్తమును లయమొనర్పుము.

ముహూర్తమేవ నిర్వాణం యది చేతః పరే పదే
తత్తత్పరిణతం విద్ధి తత్త్రైవాస్వాదమాగతమ్. 57

మనస్సు పరమపదమున ముహూర్తకాలము విశ్రాంతినొందినను బ్రహ్మాకారముగ పరిణతమగును. దానిచే మనస్సు నిరతిశయమగు ఆనందాస్వాదమును బొంది మరల లేవనిచ్ఛగొనదు.

యది సాంఖ్యేన విశ్రాన్తం చేతో యోగేన వాపి తే
క్షణం తత్సత్వతాం యాతం న భూయ ఇహ జాయతే. 58

నీ మనస్సు సాంఖ్యము ననుసరించిగాని లేక యోగమునను సరించిగాని విశ్రాంతినొంది క్షణమైనను ఆత్మతత్త్వముతో ఐక్యమును బొందియుండిన, మరల ఉత్పన్నముకాదని గ్రహింపుము.

చేతోవిగలితావిద్యం సత్వశబ్దేన కథ్యతే
దగ్ధసంసారబీజం తన్న తదాత్యన్తరం పునః. 59

అవిద్య తొలగిన చిత్తమే సత్త్వమని చెప్పఁబడుచున్నది. అది సంసారబీజమును దగ్ధమొనర్చి అంకురోత్పాదనాశక్తిని వినష్టమొనర్చుచున్నది. అది ఉదయించిన నిఁక బ్రహ్మవిస్మృతి ఘటిల్లదు.

కశ్చిద్విగలితావిద్యః సత్వస్థః శాన్తవాసనః
పరం శూన్యోపమం సద్యో జ్యోతిః పశ్యతి శామ్యతి. 60

అట్టి సత్త్వముదయించిన వారరుదు. ఏమహాత్ముఁడు సత్త్వభావమును బొందునో, అతని అవిద్యతొలఁగి వాసనాబీజములు విచ్ఛిన్నములగుచున్నవి. అతఁడు, అజ్ఞులచే అసంభవమని యెంచఁబడి శూన్యముగా తలఁపఁబడునదియు, ప్రాజ్ఞులచే పరమజ్యోతియని ఎంచఁబడునదియునగు దానిని (ఆత్మను) వెంటనేగాంచి శాంతిని బొందును.

విగలితాత్మపదం విగలన్మనః సుభగ సత్వమితీహ హి కథ్యతే
న పునరేతి కలామలినం పదం కనకతామివ తామ్రముపాగతమ్. 61

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ప్రాణమనః సంయోగవిచారణం నామైకోనసప్తతి తమః సర్గః ॥69॥

సౌభాగ్యశీలుఁడవగు రామచంద్రా! నేను చెప్పిన త్రివిధోపాయముల నాశ్రయించి పొందఁబడు జీవన్ముక్తస్థితియందు జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థలును, భ్రాంతియును, దాని బీజములును, మనస్సునుగూడ నశింప దగ్ధపటముఁబోలు సత్త్వమాత్రమే మిగులును. వాసనాబీజములు లేకుండుటవలన నయ్యది రాగద్వేషాదులకు లోనై సంసారకారణముకాఁజాలదు. స్పర్శవేధివలన బంగారముగ మార్చఁబడిన రాగివలె ఈ సత్త్వము మరల కళంకమును బొందదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
జీవటోపాఖ్యానమున ప్రాణమనస్సంయోగ విచారమను
అఱువది తొమ్మిదవ సర్గము ॥ 69 ॥
జీవటోపాఖ్యానము సమాప్తము.

---

## బేతాళోపాఖ్యానము.

### సప్తతితమః సర్గః

[మాయాభ్రాన్త్యవసాదే చిదాత్మపరిశుద్ధయే
వేతాలరాజ సంవాద కథోదాహ్రియతే శుభా.

మాయాభ్రాంతి తొలఁగుటకును, చిదాత్మ పరిశుద్ధికొఱకును శుభకరమైనట్టి బేతాళరాజ సంవాదమను కథ యిచట నుదహరింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

జీవోఽజీవో భవత్యాశు యాతి చిత్తమచిత్తతామ్
విచారాదిత్యవిద్యాన్తో మోక్ష ఇత్యభిధీయతే. 1

శ్రీ వసిష్ఠుఁడు:– ఓరామచంద్రా! తత్త్వవిచారణచే జ్ఞానోదయముకాఁగా జీవభ్రాంతియును, చిత్తకల్పనలును శాంతించును. అప్పుడు జీవుఁడుగాని, చిత్తమనునదిగాని మిగులవు, విచారణ యొక్క ఆదియే అవిద్యోపశమనము కార్యమునకు కారణమగుచున్నది ఇదియే మోక్షమనికూడ చెప్పఁబడుచున్నది. విచారణ యొక్క ఆదియే జ్ఞానోదయపర్యంత మాశ్రయింపఁదగిన ఉపాయమని భావము.

మృగతృష్ణాజలమివ మనోఽహన్త్వాది దృశ్యతే
అసదేవ మనాగేవ తద్విచారాత్ప్రలీయతే. 2

మనస్సు అహంకారము మున్నగునవి ఎండమావులందలి నీటివలె ఉనికి లేనివి. ఇవి భ్రమవలన తోఁచుచున్నవి. ఒకింత విచారణ మొనర్చిన అవి లయమును బొందునవై యున్నవి.

సంసృతిస్వప్నవిభ్రాన్తా వేతాలోదాహృతానిమాన్
ప్రశ్నానాకర్ణయ శుభాన్ప్రసఙ్గాత్స్మృతిమాగతాన్. 3

ఈ సంసార - స్వప్న - విభ్రమమును గుఱించి బేతాళుఁడొకడు కొన్ని ప్రశ్నలను అడిగి యున్నాడు. అవి ప్రసంగక్రమమున నాకు జ్ఞప్తికి వచ్చినవి. ఆ శుభకరములగు ప్రశ్నలను వినుము.

అస్తి విన్ధ్యమహాటవ్యాం వేతాలో విపులాకృతిః
స కించిన్మణ్డలం గర్వాదాజగామ జిఘాంసయా. 4

విన్ధ్యపర్వతమందలి మహారణ్యమున విశాలకాయుఁడగు బేతాళుఁడొకడుండెను. అతనికి అజ్ఞులయెడల అనాదరయుండుటఁజేసి వారిని చంప నిశ్చయించి ఒకపుడొక నగరమున కరిగెను.

స వేతాలోఽవసత్పూర్వం కస్మింశ్చిత్సజ్జనాస్పదే
బహుబల్యుపహారేణ నిత్యతృప్తతయా సుఖీ. 5

ఆ బేతాళుఁడు సజ్జనుఁడగు ఒకరాజుచే పాలింపఁబడు దేశమున కరిగెను. ఆ దేశమందలి కిరాతరాజ్యము నాతడు తననివాసముగ నొనర్చుకొనెను. ఆ కిరాతరాజొసగు బలులచే నిత్యతృప్తుఁడై చలనములేని సమాధిసుఖమున నాతడు కాలముగడపసాగెను.

నిర్నిమిత్తం నిరాగస్కం పురోఽప్యభ్యాగతం న సః
క్షుధితోఽపి నరం హన్తి సన్తో హి న్యాయదర్శకాః. 6

ఆ బేతాళుఁడు క్షుధార్తుఁడైనను నిష్కారణముగ నిరపరాధులగువారి నెవ్వరిని వారెదుటఁ బడినను చంపకుండును. సజ్జనులు న్యాయదర్శనులై యుందురుగదా!

స కాలేనాటవీగేహో జగామ నగరాన్తరమ్
న్యాయయుక్త్యా జనం భోక్తుం క్షుధా సమభిచోదితః. 7

కాలక్రమమున అతని కచట వధార్హులగువారు దొరకకుండుటచే మఱియొక నగరమును చేరుకొనెను. క్షుత్ప్రేరితుఁడై అతఁడు న్యాయమును యుక్తియుక్తమునునగు ఆహారము నన్వేషించి భుజింపగోరెను.

తత్ర ప్రాప స భూపాలం రాత్రిచర్యావినిర్గతమ్
తమాహ ఘనఘోరేణ శబ్దేనోగ్రనిశాచరః. 8

అచ్చటి రాజు దుష్టులను చోరులను బట్టుకొన నిశాకాలమున పరిభ్రమించుచుండెను, ఉగ్రనిశాచరుఁడగు బేతాళుఁడతనిని గాంచి మేఘమువలె గర్జించుచు నిట్లు పలికెను.

వేతాల ఉవాచ:—

రాజన్ లబ్ధోఽసి భీమేన వేతాలేన మయాధునా
క్వ గచ్ఛసి వినష్టోఽసి భవ భోజనమద్య మే. 9

బేతాళుఁడు;—రాజా! భయంకర స్వభావుఁడనగు బేతాళుఁడనూ నేను. నేఁడు నీవు నాకు దొఱకితివి. ఇక నెచటికి అరుగగలవు? నీకు వినాశము తప్పదు. నాకు భోజనము కమ్ము.

రాజోవాచ:—

హే రాత్రిచర నిర్న్యాయ్యం మాం చేదత్సి బలాదిహ

కస్యానవయవస్యైవ పరమాణుమహాగిరేః
శిలాన్తర్నిబిడైకాన్తరూపమజ్జా జగత్త్రయీ. 17

ఏ నిరవయవ పురుషుని అత్యంతక్షుద్రాంశము కూడ-శిలలు పర్వతమునుగూడి దానికి అస్తిత్వము కల్పించునట్లు జగత్త్రయమునకు సారభూతమై అస్తిత్వమును కల్పించుచున్నదో, అతఁడెవఁడు.

ఇతి కథయసి చేన్న మే దురాత్మం స్తదిహా నిగీర్య భవన్తమాత్మఘాతిన్
ఫలమివ తవ మణ్డలం గ్రసేయం ప్రసభముపేత్య జగత్యథా కృతాన్తః. 18

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే వేతాలప్రశ్నో నామ
సప్తతితమః సర్గః ॥ 70 ॥

ఈ ఆఱుప్రశ్నలకును ప్రత్యుత్తర మొసఁగనిచో, ఆత్మఘాతివియును, దేహాత్మ బుద్ధివియును నగుదువుగనుక అట్టి నిన్ను, నీ రాజ్యమందలి ప్రజల నంచటిని. యముడు జగత్తులను మ్రింగుసట్లు-మ్రింగివైచెదను.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున బేతాళోపాఖ్యానమున బేతాళప్రశ్నమను డెబ్బదవ సర్గము ॥ 70 ॥

---

## ఏకసప్తతితమః సర్గః

[ఆద్యప్రశ్న సమాధానం విస్తరేణాత్ర వర్ణ్యతే
అనన్తకోటి బ్రహ్మణ్డ ఫలవృక్షాది కల్పనైః

అనంతకోటి బ్రహ్మాండములను ఫలవృక్షముతోఁబోల్చి ప్రథమప్రశ్న యొక్క ప్రత్యుత్తర మీసర్గమున విశదముగ వివరింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్తవతి వేతాలే వక్తుం ప్రశ్నాన్విహస్య సః
ఉవాచ వచనం రాజా దన్తాంశుధవలామ్బరః. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! బేతాళుఁడిట్లు పలుక రాజు నవ్వి ఆ ప్రశ్నలకు సమాధానమీయఁదొడఁగెను. ఆతఁడు నవ్వునపు డాతని దంతకిరణముల దీప్తిచే ఆకాశమున్ను, ఆతఁడు ధరించిన వస్త్రములున్ను సముజ్జ్వలములయ్యెను.

రాజోవాచ!—

అస్తే కదాచిచ్ఛేదం హి బ్రహ్మాణ్డమజరం ఫలమ్
ఉత్తరోత్తరం దశగుణభూతత్వక్పరివేష్టితమ్. 2

రాజు.— బేతాళా! నీకును, నాకును ఆశ్రయభూతమగు బ్రహ్మాండమను ఫలమొకటి గలదు. అజ్ఞదృష్టి కయ్యది అజరము (స్థిరము) అది ఉత్తరోత్తరము పదిరెట్లుగ పెరుగు జలాది ఆవరణములతోఁ గూడియున్నది.*

తాదృశానాం సహస్రాణి ఫలాని యత్ర సన్తి హి
అత్యుచ్చైస్తాదృశీ శాఖా విపులా చలపల్లవా. 3

అట్టివేయగు వేలకొలఁది ఫలములతోఁ గూడినదియును, కదలుచున్న (కల్పనలను) చిగుళ్లతో నిండినదియు, మిగుల ఎత్తున నున్నదియునగు కొమ్మ యొకటి గలదు.

తాదృశానాం సహస్రాణి శాఖానాం యత్ర సంత్యథ
తాదృశోఽస్తి మహావృక్షో దుర్లక్ష్యో విపులాకృతిః. 4

అట్టి శాఖలు వేలకొలఁదిగగల మహావృక్షమొకటి గలదు. అది విశాలముగ వ్యాపించి దుర్నిరీక్ష్యమై యొప్పుచున్నది.

తాదృశానాం సహస్రాణి యత్ర సన్తి మహీరుహామ్
తాదృశం వనమత్యుచ్చైరనన్తతరుగుల్మకమ్. 5

అట్టివేయగు వృక్షములు వేలకొలఁదిగనున్న అరణ్యమొకటి గలదు. అది యెత్తగు పొదలచే మిక్కుటముగ వ్యాపింపఁబడియున్నది.

తాదృశానాం సహస్రాణి వనానాం యత్ర సన్త్యథ
తాదృగస్తి బృహచ్ఛృఙ్గమత్యుచ్చైర్భరితాకృతి. 6

అట్టివేయగు అరణ్య సమూహములతో నిండినదియును, మహోన్నతమునునగు పర్వతమొకటి గలదు.

తాదృశానాం సహస్రాణి శృఙ్గాణాం యత్ర సన్త్యథ
తాదృశోఽస్త్యతి విస్తీర్ణో దేశో విపులకోటరః. 7

అట్టి పర్వతపంక్తికి ఆకరమగు విశాల దేశమొకటిగలదు. అయ్యది విశాలకోటరము

తాదృశానాం సహస్రాణి దేశానాం యత్ర సన్త్యథ
తాదృగస్తి బృహద్ద్వీపం మహాహ్రదనదీయుతమ్. 8

అట్టివేయగు పెక్కుదేశములకు తావగు మహాద్వీప మొకటిగలదు. అందు విచిత్రములగు

* (1) ఇట్టివేయగు బ్రహ్మాండ సహస్రములనున్న పంచీకృతమహాభూతములు (2) తదంతర్గతమగు గంధతన్మాత్ర (3) అట్టివేయగు రూపరసశబ్దస్పర్శతన్మాత్రలు (7) హిరణ్యగర్భుని మనస్సు (8) భూతభవిష్యద్వర్తమానకాలముల వెలయు తన్మాత్రసమూహములు (9) కల్పసంజ్ఞచే వ్యవహరింపబడు కాలము (10) బ్రహ్మవిష్ణురుద్రుల ఆయుష్కాలము (13) కాలాత్మకులగు ఆ ముగ్గురు (14) అనంతకోటి సంఖ్యాకులగు త్రిమూర్తుల వ్యవహారప్రవర్తనా కారణమగు మాయాశబలితబ్రహ్మము అను నీ పదునాలుగు పదార్థములు ఫలశాఖాదిరూపములచే వర్ణింపఁబడుచున్నవని గ్రహింపనగును.

నామరూపములతో నొప్పుచు, ఆవిర్భూతములును, అనావిర్భూతములునునగు ప్రవాహ పరంపరలతో నొప్పు గొప్ప నదులున్ను, సరస్సులున్ను గలవు.

తాదృశానాం సహస్రాణి ద్వీపానాం యత్ర సన్త్యథ
తాదృగస్తి మహాపీఠం విచిత్రరచనాన్వితమ్. 9

అట్టివేయగు పెక్కుద్వీపములకు నెలవగు మహాపీఠమొకటిగలదు. అది విచిత్రరచనాసమన్వితము.

తాదృశానాం సహస్రాణి పృథ్వీనాం యత్ర సన్త్యథ
తాదృగస్తి మహాస్ఫారం మహాభువనడమ్బరమ్. 10

అట్టివేయగు పెక్కుపీఠములతోఁగూడిన పృథివితో అనంతముగ విస్తరించిన మహాలోక మొకటి గలదు.

తాదృశానాం సహస్రాణి జగతాం యత్ర సన్త్యథ
తాదృగస్తి మహాచ్చాణ్డం చణ్డమమ్బరపీఠవత్. 11

అట్టివేయగు పెక్కు మహాలోకములతోఁగూడి ఆకాశపీఠమువలె భయంకరమగు మహాండ మొకటి గలదు.

తాదృశానాం సహస్రాణి యత్రాణ్డాని కరణ్డకాః
తాదృశోఽస్తి గతస్పన్దో విపులాబ్ధిశ్చ సాగరః 12

అట్టివేయగు మహాండసహస్రములకు ఆధారమనఁదగు సాగరమొకటి గలదు. అది స్పంద రహితముగ, విపులజలరాశికి నిలయమునై యున్నది.

తాదృక్సాగరలక్షాణి తరఙ్గో యత్ర పేలవః
తాదృశః స్వవిలాసాత్మా నిర్మలోఽస్తి మహార్ణవః. 13

ఆత్మవిలాసమయమగు మహార్ణవమొకటి గలదు. పైనజెప్పఁబడిన సాగరముల సమూహము దానియందు చిఱుతరంగములవలె నొప్పుచున్నవి.

తాదృగబ్ధిసహస్రాణి యస్యోదరజలాన్యథ
తాదృశోఽస్తి పుమాన్కశ్చిదత్యుచ్చైర్భూరితాకృతిః. 14

అట్టి మహార్ణవములే ఉదర-జలము (పొట్టయందలి నీరు)గ గల మహాపురుషుఁడొకఁడు కలఁడు. అతఁడు సర్వవ్యాపియు, మహోన్నతుఁడునై వెలయుచున్నాఁడు. (అతఁడే విష్ణువు.)

తాదృశానాం నృణాం లక్షైర్యస్య మాలోరసి స్థితా
ప్రధానం సర్వసత్త్వానాం తాదృశోఽస్తి పరః పుమాన్. 15

అట్టి వేలకొలఁది మహాపురుషులు మాలయై వక్షఃస్థలమున నొప్పారు పరమపురుషుఁడొకఁడు కలఁడు. (అతఁడే రుద్రుఁడు.)

తాదృశానాం సహస్రాణి పురుషాణాం మహాత్మనామ్

స్ఫురన్తి మణ్డలే యస్య స్వతనూరుహజాలవత్. 16
తాదృశోఽస్తి మహాదిత్యః శతమన్యాసు దృష్టిషు
యా ఏతాః కలనాః సర్వాస్తా ఏతాస్తస్య దీప్తయః 17

అట్టి వేలకొలఁది పరమపురుషులు ఏమండలమునుండి రోమములవలె అనాయాసముగ వెలువడుచున్నారో, అట్టి మహాసూర్యుఁడొకఁడు కలఁడు. సర్వప్రాణులకు ప్రత్యక్షములగు బ్రహ్మాండ రుద్రాది కల్పనలన్నియును ఆతని దీప్తులై యున్నవి.

అస్యాదిత్యస్య దీప్తీనాం బ్రహ్మాణ్డాస్త్రసరేణవః
మయా చిత్సూర్య ఇత్యుక్తః సర్వమేతత్తపత్యసౌ. 18

దృశ్యమానమగు ఈ బ్రహ్మాండమంతయు ఆ సూర్యుని కాంతియందలి త్రసరేణువుమాత్రమే అయియున్నది. చిదాత్మయే ఆసూర్యుఁడు-ఈ ప్రకారముగ నీ వడిగిన ప్రశ్నకు నేను ప్రత్యుత్తర మొసగితిని. ఆ సూర్యుఁడే జగత్తంతటికిని వెలుగును, వేడిని ఒసంగుచున్నాఁడు.

విజ్ఞానాత్మైవ పరమో భాస్కరో భావితాశయః
ఇమే యే భువనాభోగాస్తస్యైవ త్రసరేణవః. 19

విజ్ఞానమే ఆ సూర్యుని ఆత్మ. జగత్తును ప్రకాశింపఁజేయుటయే ఆతని పవిత్రకర్తవ్యము. విశాలములగు బ్రహ్మాండము లాతని తేజస్సునందలి త్రసరేణువులు మాత్రమే అయియున్నవి.

విజ్ఞానపరమార్కస్య భాసా భాన్తి భవన్తి చ
ఇమా జగదహర్లక్ష్మ్యః క్వచిల్లక్ష్మ్యో రవేరివ. 20

సూర్యకిరణములచే ఈజగత్తు శోభించునట్లు ఆ విజ్ఞానసూర్యుని కాంతివలన జగత్తులనఁబడు దినలక్ష్ములు శోభించుచు, ప్రకాశమునందుచు, సత్తను బడయుచు నున్నవి.

విజ్ఞానమాత్రకచితాత్మని జన్తుజాతే త్రైలోక్యమణ్డపమణేరవికాసభాజి.
చిజ్జన్మరోర్భ్వనసంభ్రమతావలేఖాఃసన్తి హా రే నహి మనాగపి శాన్తమాస్స్వ.21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే వేతాలప్రథమప్రశ్నోత్తరవర్ణనం
నామైకసప్తతితమః సర్గః ॥ 71 ॥

**ఓయీ వేతాళుఁడా!** ఆ బ్రహ్మమే త్రిలోకములను మండపములందు వెలయు మణి. ఈమహాసూర్యుని పారమార్థిక తత్త్వమగు ఆత్మ ఉత్తమాధికారులకు అఖండాకార రూపమున ప్రత్యక్షముగు చున్నది. అనధికారులకు అస్ఫుటమగు అప్రత్యగాత్మయందు అగ్నియందు స్ఫులింగములవలె జీవ, జగత్తులు వేఱుగ తోఁచుచు కర్తృత్వ భోక్తృత్వాది అనంత విభ్రమములకు లోనగుచున్నవి. కాని పరమార్థ దృష్టియందు ఇవేమియును ఒకింతైనను లేవు అందువలన నీవు ప్రశ్నాడంబరమును వీడి శాంతుఁడవై వెలయుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున బేతాళప్రథమ ప్రశ్నఉత్తర వర్ణనమను డెబ్బదియొకటవ సర్గము ॥71॥

---

## ద్విసప్తతితమః సర్గః

[ఇహావశిష్ట ప్రశ్నానాం పఞ్చానాముత్తరం క్రమాత్
వేతాలాయాప్రమత్తాయ రాజా సమ్యగుదీర్యతే.

మిగిలిన ఐదుప్రశ్నలకు రాజు ప్రత్యుత్తర మొసగుటయు, బేతాళుడు సావధాన చిత్తుండై వినుటయు నిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరాజోవాచ:—

కాలసత్తా నభఃసత్తా స్పన్దసత్తా చ చిన్మయీ
శుద్ధచేతనసత్తా చ సర్వమిత్యాది పావనమ్ 1
పరమాత్మమహావాయూకారజః స్ఫురతి చఞ్చలమ్
కుసుమాఙ్గ ఇవామోదస్తదత్రరూపకం స్వతః. 2

రాజు:— ఓ బేతాళుఁడా! కాలసత్త అనగా మహాకాలుఁడనబడు చైతన్య సహితమాయాకాశసత్త, స్పందసత్త అనగా క్రియాశక్తిప్రధానమగు సూత్రాత్మక ఆకాశసత్త, చిన్మయసత్త, దానికంటె నికృష్టమగు చిదాభాససత్త మున్నగు నవన్నియు ను అత్యంతసూక్ష్మ పదార్థములగుటవలన రజము(ధూళి) అని చెప్పబడుచున్నవి. ఈ రేణువులే పరమాత్మయను వాయువున లేచుచు వివిధములగు వికారములను గల్పించుచున్నవి. పరమాత్మయే అన్నిట వెలయు సత్తయైయుండ అందు కాలాది సత్తలు స్ఫురించుచున్నవి. అను ఆధార-ఆధేయ వ్యపదేశ మెటునుండి వచ్చినది అని సందేహింపవలదు. ఏలయనగా, పుష్పమే స్వశరీరము, సౌరభము అను భేదముల గల్పించుకొని తనయందే కల్పితమగు గంధమునకు ఆధేయమై వెలయుచుండు నట్లు పరమార్థసత్తయే కాలాది సత్తల భేదములను తనయందు కల్పించుకొని వానికాధారమై వెలయుచున్నది. (ఇది రెండవప్రశ్న కుత్తరము)

జగదాఖ్యే మహాస్వప్నే స్వప్నాత్స్వప్నాన్తరం వ్రజత్
రూపం త్యజతి నోవాన్తం బ్రహ్మశాన్తత్వ బృంహణమ్. 3

ఈజగత్తు అను మహాస్వప్నమున బ్రహ్మమే ఒకస్వప్నము నుండి మఱియొక స్వప్నమున కరుగుచుండియు వికారమును బొందకున్నది. అది స్వప్నమను దోషమున కళంకితముకాక నిస్సంగమగు జ్యోతిరూపమున నానావిధముగ ప్రకాశించుచున్నది. మఱియు శాంతినే వెలువరించుచు వెలయుచున్నది. (ఇది మూఁడవ ప్రశ్నకు సమాధానము,)

రమ్భాస్తమ్భో యథాపత్రమాత్రమేవాన్తరాన్తరమ్
అన్తరన్తస్తథేదం హి విశ్వం బ్రహ్మ వివర్త్యపి. 4

అరఁటిబోదె లోలోపల ఆకులతోఁ గూడుకొనియే స్తంభాకృతిని వహించునట్లు ఈ విశ్వమునందలి అంతరాంతర ప్రదేశములందు బ్రహ్మమే వివర్తితమై యున్నది. దాని అణువులే ఎల్లెడల వెలయుచున్నవి.

సద్బ్రహ్మాత్మాదిభిః శబ్దైర్యదేతాభిర్విగీయతే
శూన్యమవ్యపదేశం తేన తత్కించిచ్చ కించన. 5

వివర్తితమగు ఈ జగత్స్థితికి సత్తయగుట వలననే బ్రహ్మవస్తువు సద్బ్రహ్మ, ఆత్మ మున్నగు నామములచే పేర్కొనఁబడుచున్నది. కాని వాస్తవముగ దానికెట్టి వ్యపదేశము (నామము) లేదు. అది ఇట్టిదని చెప్పఁజాలము. సర్వధర్మశూన్యమగుటవలన నయ్యది (పదార్థ) శూన్య వస్తువు. (బుద్ధిగ్రాహ్యవస్తువులందు) అది యేదియునుకాదు. మఱియు, దానియందేవియును లేవు

యా యా విభావ్యతే సత్తా సా సానుభవనిర్మితాన్
రమ్భాస్తంభవదేతా వచ్చిన్మాత్రమమలం తతమ్. 6

పటము (వస్త్రము) నందుండు పటసత్త తంతుసత్తయందును, తంతుసత్త కార్పాస (దూది) సత్తయందును, కార్పాససత్త ఫలసత్తయందును, ఫలసత్త వృక్షసత్తయందును, వృక్షసత్త బీజసత్తయందును, బీజసత్త మృజ్జలాది సత్తయందును, పర్యవసించుచున్నది. ఇట్టిక్రమముచే, ఏయేసత్త భావింపఁబడుచున్నదో, ఆయాసత్త తత్తదనుభవ కల్పితములగు ఆకృతులను వీడి కదళీ-స్తంభమువలె తత్తదనుభవ రూపమగు చిన్మాత్రముగ పర్యవసించుచున్నది. అట్టి నిర్మలమగు చిద్వస్తువే ఈ జగద్రూపముగ వ్యాపించియున్నదని గ్రహింపుము.

సూక్ష్మత్వాదప్యలక్ష్యత్వాత్పరమాత్మా పరోఽణుకః
అనన్తత్వాదసావేవ ప్రాప్తో మేర్వాదిమూలతామ్. 7

ఈ పరమాత్మయే సూక్ష్మమును, అలక్ష్యము నగుటవలన పరమాణువనియు, అనంతగుణ విశిష్టమగుటచే మేర్వాదులకుగూడ ఆధారమనియు చెప్పఁబడుచున్నది. (ఇది నాల్గవప్రశ్నకు ప్రత్యుత్తరము.)

అణోరప్యత్యనన్తస్య పుంసోఽస్య జగదాద్యపి
పరమాణువదాభాతి ప్రతీతత్వాదరూపవత్. 8

బ్రహ్మాండాదులతోఁగూడిన జగత్తంతయు అణువగు ఆ అనంతపురుషుని అంశాణువు. ఈ బ్రహ్మాండాదులు తమకంటె సూక్ష్మతరములగు చిత్కణములందు పరిచ్ఛిన్నములై యుండుటవలన స్వప్నదృష్టములగు బ్రహ్మాండాదులవలె స్వరూపవిహీనములు. (పరిచ్ఛిన్నములగునవన్నియు మిథ్యయే). స్వప్నమున సూక్ష్మనాడులందు తోఁచు కల్పిత-పదార్థ పరమాణువులవంటివే ఇవి. (ఇది ఐదవ ప్రశ్నకు సమాధానము.)

పరోఽణు రేషోఽలభ్యత్వా త్పూరకత్వాన్మహాగిరిః
సర్వావయవరూపోఽపి నిరస్తావయవః పుమాన్. 9

ఈ బ్రహ్మమే నేత్రాదీంద్రియములకు అగోచరమగుటవలన పరమాణువనియు, సర్వవ్యాపియగుటవలన మహాపర్వతమనియు చెప్పఁబడుచున్నది. అధ్యారోపదృష్టి కియ్యది మూర్తామూర్త పదార్థ

ముల కన్నిటికి అవయవియు, అపవాదదృష్టికి నిరవయవమున్ను అగుచు సర్వవ్యాపకమై నెగడు చున్నది.

అస్య వై జ్ఞప్తిమాత్రస్య మజ్జామాత్రం జగత్త్రయీ
విజ్ఞానమాత్ర మధ్యం హి సాధో విద్ధి జగత్త్రయమ్. 10

సాధూ! జగత్త్రయము ఆవిజ్ఞానస్వరూపుని సారమై, ఆతనియందే వెలయుచున్నది. ఈ విషయము శ్రుతి ప్రసిద్ధమైయున్నదని గ్రహింపుము. (ఇది ఆఱవప్రశ్నకు సమాధానము.)

విజ్ఞానమాత్ర కలనాకలితం జగద్ధి
శాన్తస్వభావ సుకుమారమనస్తరూపమ్
వేతాల బాలక పదం తదలఙ్ఘనీయ
మేవం స్వయం సమనుభావయ శాన్తమాస్స్వ 11

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే వేతాలప్రశ్నభేదో నామ ద్విసప్తతితమః సర్గః ॥ 72 ॥

బేతాళా! బాలకా! జగత్త్రయము ఆవిజ్ఞానమాత్రుని ప్రకాశ కాలములగు ఆత్మవిజ్ఞాన స్వరూపమని గ్రహింపుము. నిన్నుబోలు వ్యర్థ సిద్ధాన్తిని వినిష్టమొనర్పఁజాలను. కనుక నీవు నాయుపదేశము ననుసరించి, అనుభవపథమున నధిరోహించి గర్వమునువీడి శాంతింపుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున బేతాళ ప్రశ్నభేదమను డెబ్బది రెండవ సర్గము ॥ 72 ॥

## త్రిసప్తతితమః సర్గః

[ఉపదిశ్యాత్ర వేతాలప్రశ్న నిర్ణయ సంస్థితమ్
భగీరథస్య వృత్తాన్తస్త్రాతో్యఽప్యత్ర పఠ్యతే.

ఇట బేతాళోపాఖ్యానము ముగింపఁబడి భగీరథోపాఖ్యానము ఆరంభింపఁబడు చున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇతిరాజముఖాచ్ఛ్రుత్వా వేతాలః శాన్తిమాయయౌ
భావితాత్మతయా తత్ర విచారోచితయా ధియా. 1

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! బేతాళుఁడు, ఇట్లు రాజొసఁగిన ప్రత్యుత్తరముల నాకర్ణించి ఆతనిని తత్త్వజ్ఞునిగ నెఱిఁగి శాంతించెను.

ఉపశాన్తమనా భూత్వా మత్వైకాన్తమనిస్థితమ్
బభూవావిచలధ్యానీ విస్మృత్య విషమాం క్షుధామ్. 2

అపుడా వేతాళుఁడు శాంతచిత్తుఁడై, ఆనందదాయకమగు ఆపరమవస్తువును గ్రహించి మిక్కుటమగు ఆకలినిగూడ మఱచి సమాధిని బొందెను.

ఏతద్రామ మయోక్తం తే వేతాల ప్రశ్నజాలకమ్
ఏవంక్రమేణ చిదణౌ తేనేదం సంస్థితం జగత్. 3

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ నీకు వేతాళప్రశ్నలను జెప్పితిని. రాజు నుడివినట్లు ఈ జగత్తంతయు చిద్రూప పరమాణువునందున్నదని నీవు గ్రహింపుము.

చిదణోః కోశగం విశ్వం విచారేణ విలీయతే
కాయో వేతాలకస్యేవ శిష్యతే యత్పదం తు తత్. 4

చిదణు-కోశమున విలసిల్లు ఈవిశ్వము బాల భ్రాంతికల్పితమగు వేతాళ శరీరమువలె జ్ఞాన విచారముచే విలీనమగును. తుదకు పరమపదమే శేషించును.

సంహృత్య సర్వతశ్చిత్తం స్తిమితేనాన్తరాత్మనా
స్వభావాపతితం కుర్వన్నిరిచ్ఛం తిష్ఠ శాన్తధీః. 5

ఇఁక నీవు విషయములనన్నిటినుండియు, దృశ్యసమూహములనుండియు మనస్సును ప్రత్యాహరించి నిశ్చలాత్మకమగు శాంతబుద్ధి నాశ్రయింపుము. మఱియు స్వాభావికముగ నుదయించు కర్మలను నిర్లిప్తుఁడవై ఆచరించుచుండుము.

ఆకాశవిశదం కృత్వా మనస్సైవ మనో మునే
తిష్ఠైకశమశాన్తాత్మా సర్వత్ర సమదర్శనః. 6

మననశీలా ! మనస్సుచే మనస్సును ఆకాశమువలె నిర్మలమొనర్పుము. ఏకవస్తువగు ఆత్మయందు వృత్తులనన్నిటిని లయమొనర్చి చిత్తనివృత్తిని సాధింపుము. దానిచే నీవు సర్వత్ర బ్రహ్మభావమును దర్శించి సమదర్శివి కాఁగలవు.

స్థిరబుద్ధిరసంమూఢో యథాప్రాప్తానువర్తినః
రాజ్ఞో భగీరథస్యేవ దుఃసాధ్యమపి సిధ్యతి. 7

ఈరీతిగ నీవు స్థిరబుద్ధివై మోహశూన్యుఁడవగుము. ఇట్లు యథాప్రాప్తములగు విషయముల ననుసరించువారు భగీరథునివలె ఇతరుల కసాధ్యములగు వానినిగూడ సాధింపగలరు.

సంపూర్ణశాన్తమననః పరితృప్తవృత్తి
ర్నిత్యం సమే సుఖమయాత్మని తిష్ఠతోఽన్తః
సిధ్యన్తి దుర్లభతరా అపి వాఞ్ఛితార్థా
గఙ్గావతార ఇవ సాగరఖాతవస్తు. 8

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే వేతాలాఖ్యానం నామ త్రిసప్తతితమః సర్గః ॥ 73 ॥

సగరుఁడు, అంశుమంతుఁడు, దిలీపుఁడు మున్నగు రాజులకు అతిదుర్లభమైనట్టి గంగావతారణము ఆవంశమున నే జన్మించిన భగీరథుఁడు తన శాంతి, తృప్తి, సమదర్శిత్వాది గుణములచే [గంగను అవతీర్ణమొనర్చి (క్రిందకు రప్పించి)] సాధించినాఁడు. ఆగంగయే సగరపుత్రులకును, సముద్రమునకును సంజీవన మణివంటిదైనది. అట్లే ఎవఁడు పూర్ణముగ శాంతచిత్తుఁడై, పరితృప్తాంతఃకరణుఁడై ఆత్మయందు నిత్యతృప్తుఁడై వెలయుచుండునో, ఆతనికి అత్యంతదుర్లభములగు అభీష్టములుకూడ సిద్ధించుచుండును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
బేతాళాఖ్యానమను డెబ్బది మూఁడవ సర్గము ॥ 73 ॥
బేతాళోపాఖ్యానము సంపూర్ణము.

---

## చతుః సప్తతితమః సర్గః

## భగీరథోపాఖ్యానము.

[భగీరథస్యాత్ర గుణాశ్చిన్తా చాథ విచారజా
త్రితలేన చ సంవాదో జిహాసాతో౽త్ర వర్ణ్యతే.

భగీరథుని గుణములు, విచారమున జనించిన ఆతని చింత, త్రితలునితోటి ఆతని సంవాదము, త్యాగమునుగూర్చిన కోర్కె మున్నగు విషయము లిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచః—

యథా చిత్త చమత్కృత్యా రాజ్ఞో గఙ్గావతారణమ్
భగీరథస్య స పన్నం తన్మే కథయ భో ప్రభో. 1

శ్రీరాముడు:— ప్రభూ! మహాత్మా! చిత్తపరిపక్వత నొందిన భగీరథుడు గంగ నెట్లు గొని వచ్చినది నచింప ప్రార్థన.

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఆసీద్భగీరథో నామ రాజా పరమధార్మికః
భువః సముద్రయుక్తాయా మణ్డలీతిలకోపమః. 2

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! కోసలవంశతిలకుఁడగు భగీరథుఁడను రాజొకఁడుండెను. ఆతఁడు పరమధార్మికుఁడును, సముద్రయుక్తమగు పృథివికంతటికిని రాజునునైయుండెను.

సంకల్పానన్తరం ప్రాప్తా యథాభిమతమర్థినః
చన్ద్రప్రసన్న వదనాదస్మాచ్చిన్తామణేరివ. 3

చింతామణివద్ద సంకల్పితార్థములను జనులు బడయునట్లు అర్థులాతని కడకేగినంత నే ప్రార్థనాపరిశ్రమ లేకుండగనే అభీప్సితముల బడయుచుండిరి. ఆతని ముఖమండలము సర్వదా చంద్రమండలమువలె ప్రసన్నమైయుండెడిది. (వ్యయమునుగూర్చిన దుఃఖముచే మ్లానమై యుండెడిది కాదని భావము.)

సాధూనాం యో వ్యవస్థార్థం ధనాన్యవిరతం దదౌ
తృణమాత్రముపాదత్తే క్వచిచ్చిన్తామణిర్యథా. 4

ఆతఁడు అపాత్రులకుగాక సజ్జనులకే ఎడతెగక ధనరాసుల నొసఁగుచుండెడి వాఁడు. (అట్లు వ్యయమొనర్చుచుండ నాతనికి ఆదాయమెట్లు సమకూరెడిది? అనఁగా-) న్యాయప్రాప్తమగు తృణమునైనను- స్వర్గవాసులకు చింతామణియనఁదగు కామధేనువువలె-వదలక గ్రహించుచుండెడివాఁడు.

వజ్రసారమివ ప్రోతముజ్జ్వలన్నేమి యోఽభినత్
అధోమణిరయో యన్త్రం సర్వదుర్జన చేష్టితమ్. 5

వజ్ర వేధనమణి (వజ్రములకు దారమును గ్రుచ్చు వీలగు ఛిద్రములను గల్పింప నుపయోగింపఁబడు మణి) అత్యంతదృఢములగు మణిఖండములయొక్క ఛిద్రముల గూర్చి సూత్రము (దారము) ప్రవేశింపయోగ్యమగు నట్లు ఒనర్చుచున్నది. అవి ఏయంత్ర చక్రమున నుంచఁబడి త్రిప్పఁబడునో, ఆ చక్రము. ఆ మణుల కాంతికి ఆ సమయమున సముజ్జ్వలమై తోఁచును. అట్లే భగీరథుఁడు బలవంతులగు దుర్జనులను అస్త్రశస్త్రములచే క్షతవిక్షతులుగ జేసి వారిచరణములను శృంఖలాబద్ధములుగ నొనర్చి వారిని (వజ్రవేధనమణి మణిని భేదించునట్లు) భేదించువాఁడు. మఱియు (పైనఁజెప్పఁబడిన మణి సానబెట్టి మణిని ఉజ్జ్వలమొనర్చునట్లు) ఆతఁడు వారిని గుణయుతులుగ నొనర్చి సచ్చరిత్రులుగ మార్చెడివాఁడు. ఆతఁడు దుష్టశిక్షణార్థము వెలువడినప్పుడు (పైన,జెప్పబడిన) యంత్ర చక్రమువలె జాజ్వల్యమానములగు రథ చక్రములయొక్క రేఖలు వారిదేశము నంకిత మొనర్చుచుండెను.

అధూమవహ్నిదేహశ్రీః శ్రాన్తోఽపి దైన్యమప్యలమ్
తమో హరన్నృణాం నైశం ద్యుమణిర్వేశ్మనామివ. 6

ధూమరహితమైన అగ్నియొక్క కాంతితోఁగూడిన ద్యుమణియనఁదగు దివాకరుఁడుదయించి గృహాభ్యంతరమున వెలయు రాత్రిసంబంధతమమును, వ్యవహారదైన్యమును (చీకటియుండ పనిపాటలొనర్ప వీలుండదుకదా!) తొలగించునట్లు, ధూమశూన్యమగు అగ్నివలె దేదీప్యమానమగు దేహశోభగల ఆ భగీరథుఁడు ప్రజాపాలనార్థము సతతము సర్వత్ర (సూర్యునివలె) పరిభ్రమించి పరిశ్రాంతుఁడైనను ప్రజల అధర్మప్రవృత్తియను గృహాంధకారమును, కార్యవిరతిని కలుగఁజేయు దైన్యమనఁదగు దారిద్ర్యమును తొలగించుచుండెడివాఁడు.

కిరన్నగ్నికణాసారమభితః స్వప్రతాపజమ్
మధ్యాహ్నసూర్యకాన్తాగ్నిరివ జ్వలతి యోఽరిషు. 7

ఆనృపశ్రేష్ఠుఁడు పరాక్రమాగ్నికణములను నలువైపుల వెదచల్లుచు తృణాదుల అగ్నికాంతుల వెలువరించు మధ్యాహ్నకాల సూర్యకాంతమణివలె, శత్రువులకు దోఁచుచుండెడివాఁడు.

మృదుశీతలసంస్పర్శో యః సమాహ్లాదయన్మనః
సుజ్ఞానాం ద్రవతి స్నిగ్ధస్యేన్దోరిన్దుమణిర్యథా. 8

మృదు, శీతల స్వభావయుతుఁడై, బ్రహ్మతత్త్వవేత్తలగు సజ్జనులకడ - చంద్రోదయమున చంద్రకాంతమణి ద్రవభావమును దాల్చునట్లు - స్నేహభావమును దాల్చుచు ఆర్ద్రాంతఃకరణుఁడయ్యెడివాఁడు.

జగద్యజ్ఞోపవీతస్య స్వర్గపాతాలవాహినః
గఙ్గావాహస్య యేనాస్యాం తృతీయః పూరితో గుణః. 9

ఇట్టి గుణములతోఁగూడిన భగీరథుఁడే గంగా ప్రవాహమను జగత్తుయొక్క యజ్ఞోపవీతము నందలి మూఁడువదారమును మర్త్యలోకమునకు తీసికొనివచ్చి దానిని పూర్ణమొనర్చినాఁడు. (గంగ యజ్ఞోపవీతమువలె పరమపవిత్రము. యజ్ఞోపవీతమున మూఁడు సూత్రములున్నట్లు) దానికిని మూఁడు ప్రవాహములేర్పడినవి. భగీరథునకు పూర్వము సూత్రద్వయమనఁదగు ప్రవాహముల రెంటిలో నొకటి స్వర్గమున మందాకినీ అను నామముతోడను, పాతాళమున భోగవతియను పేరును దాల్చియును ప్రవహించుచుండెను. తృతీయసూత్రసమమగు ఈ మూఁడవ ధారను భగీరథుఁడు భూలోకమున తన ప్రయత్నబలముచే ప్రవహింపఁజేయ నది గంగ, భాగీరథీ మున్నగు నామములచే ప్రసిద్ధినిగాంచెను. అని, (భావము.)

అగస్త్యశోషితోఽమ్భోధిర్గఙ్గా పూరేణ పూరితః
యేన దుష్పూరభూతోఽపి మహాస్వార్థోఽర్థినామివ. 10

ఆ భగీరథుఁడు యాచకులు కోరు గొప్పకోరికలను పెద్దవగు ఘనపు మొత్తములచే పూర్ణ మొనరించినట్లు, అగస్త్యునిచే పానమొనరింపఁబడి ఎండింపఁబడిన సముద్రమును దుష్పూరమయినను, గంగాజలములచే పూర్ణమొనరించెను.

గఙ్గాసోపాన పద్ధత్యా యేన పాతాలవాసినః
యోజితా బ్రహ్మణో లోకే బాన్ధవా లోకబన్ధునా. 11

లోకబాంధవుఁడగు ఆభగీరథుఁడు బ్రాహ్మణ (కపిల) శాపమున పాతాళగర్భమున బడిన బంధువులగు సగరపుత్రులకు గంగయను సోపానపంక్తిని కల్పించి బ్రహ్మలోకమును పొందించెను.

బ్రహ్మాణం శంకరం జహ్నుం తపసారాధయంశ్చ యః
భూయోభూయో యయౌ ఖేదమశూన్యాధ్యవసాయినః. 12

ఆతఁడు మాటిమాటికి ఎడతెగకుండ తపఃక్లేశమును సహించి తెంపులేని ప్రయత్నదుఃఖ మును బూని బ్రహ్మదేవుని, శంకరుని, జహ్నుమునిని తపస్సుచే నారాధించెను.

యౌవనే వర్తమానస్య తస్య భూమిపతేరపి
ప్రవిచారయతో లోకయాత్రాం పర్యాకులామిమామ్. 13
సువిరాగ చమత్కారవిచాకణి కోదభూత్
వయస్యపి చ తారుణ్యే దైవాద్వల్లీ మరావివ. 14

దుఃఖకరమగు ఈ సంసారయాత్రను గురించి విచారించుచుండ ఆతనికి నీవలెనే యౌవన మున నే మరుభూమియందులతవలె విచారణతోఁగూడిన చమత్కారమగు బుద్ధికలిగెను. యౌవనమున నిట్టి సుబుద్ధి కలుగుట దుర్లభము.

ఏకాన్తే చిన్తయామాస మహీపతిరసావితి
జగద్యాత్రామిమాం నిత్యమసమఞ్జసమాకులమ్, 15

ఆతఁడొకప్పుడు ఏకాంతముననుండి ఇట్లు చింతింపసాగను— ఈ జగద్యాత్ర ఎంత అసమంజసమైనది, ఎంత ఉద్వేగముతోఁ గూడియున్నది.

పునర్దినం పునః శ్యామా దానాదానశతం పునః
తదేవ భుక్తివిరసం లక్ష్యతే కర్మ కుర్వతామ్. 16

పగలు గతించుచున్నది. రాత్రి అరుదెంచుచున్నది. మరల దినము గతించి రాత్రి అరుదెంచుచున్నది. అట్లే దాన గ్రహణాది వ్యవహారములున్ను ఒకేతీరుగ జరుగుచున్నవి. ఒకేవిధమగు ఫలమును ఒసఁగు కర్మలు విసుకును గొల్పుచు మాటిమాటికి జీవుని పాలిట బడుచున్నవి. (కాని అపూర్వమగు పరమపురుషార్థఫలము [మోక్షము] లభించుటలేదు.)

యేన ప్రాప్తేన లోకేఽస్మిన్న ప్రాప్య మవశిష్యతే
తత్కృతం సుకృతం మన్యే శేషం కర్మ విషూచికా. 17

ఈ లోకమున నెద్దానిని బడసిన, మిగిలినవన్నియును లభించినవగుచున్నవో, అట్టి (ఫలమును గలిగించు) కార్యమొనర్పఁబడిన సుకృతమనియు, తక్కినవన్నియును విషూచికవలె అశుద్ధములును దుఃఖకరములును అనియు నెంతును.

పునః పునః పర్యుషితం కర్మ కుర్వన్న లజ్జతే
మూఢబుద్ధిరబుద్ధిస్తు కః కుర్యాత్కిల బాలవత్. 18

ఏకార్యము మరలమరల ఒనర్పఁబడి పర్యుషితము (ఎంగిలి) అగుచున్నదో, అట్టి పర్యుషిత కర్మ నాచరించి మూఢబుద్ధియే లజ్జను బొందఁడు. అట్టి మూఢుఁడుగాక ఏ బుద్ధిమంతుఁడు బాలునివలె వ్యవహరించును ?

అథైకదోద్విగ్నమనాః కదాచిత్త్రితలం గురుమ్
ఏకాన్తం సంసృతేర్భీతః సమపృచ్ఛద్భగీరథః 19

అనంతర మొకదినమున నరపతియగు ఆ భగీరథుడు సంసార భీతిచే అత్యంత భీతుఁడును, ఉద్విగ్నుఁడునునై త్రితలుఁడను స్వగురు నిట్లు ప్రశ్నించెను.

భగీరథ ఉవాచ:—

అన్తఃశూన్యాసు సుచిరం భ్రమత్సంసారవృత్తిషు
అరణ్యానీషు చైత్రాసు భృశం ఖిన్నా వయం విభో. 20

భగీరథుఁడు:— ప్రభూ! మేము సారశూన్యములగు సంసారవ్యవహారములను అరణ్యములందు లెస్సగ తిరుగులాడి మిక్కుటమగు దుఃఖమును బొందినారము - రాగద్వేషాది వృత్తులకు లోనై తత్ఫలములగు స్వర్గ, నరక మనుష్యలోకములను అరణ్యములందు తిరుగాడితిమి.

జరామరణ మోహాదిరూపాణాం భవకారిణామ్
భగవన్సర్వ దుఃఖానాం కథమన్తః ప్రజాయతే. 21

మహాత్మా! సంసార హేతువులును, జరామరణ మోహముల ఆకృతితో, దోపట్టునవియునగు దుఃఖము లెట్లు ఉపశమింపఁగలవో నాకుఁ దెలియఁజెప్పుడు.

త్రితల ఉవాచ:—

చిరసామ్యాత్మనో త్థేన నిర్విభాగవిలాసినా
రాజన్ జ్ఞేయావబోధేన పూర్ణేన భరితాత్మనా. 22

త్రితలుఁడు:— రాజా ! సాధనచతుష్టయసంపత్తిని గూర్చుకొని శ్రవణమననాది ఉపాయములను లెస్సగ నవలంబించి వైషమ్య; విక్షేపరహితమగు సామ్యస్థితియగు సమాధియందు అనాదిసిద్ధమగు బ్రహ్మరూపమున నావిర్భవించిన జ్ఞేయమగు ప్రత్యక్-తత్త్వమును గ్రహింప, తత్త్వజ్ఞానమున పరిపూర్ణత నొందఁగలవు.

క్షీయన్తే సర్వదుఃఖాని త్రుట్యన్తి గ్రన్థయోఽభితః
సంశయాః సమతాం యాన్తి సర్వకర్మాణి చానఘ. 23

పాపరహితుఁడా ! (అప్పుడు) దుఃఖములన్నియు తొలఁగిపోవును. సంసారగ్రంథులు విడిపోవును. సంశయములన్నియు ఛిన్నములగును. కర్మలన్నిటి యెడల సమత్వబుద్ధి కలుగును.

జ్ఞేయం విమలగాత్మానం సంశుద్ధం జ్ఞప్తిరూపిణమ్
స చ సర్వగతో నిత్యం నాస్తమేతి న చోదయమ్. 24

పరమపవిత్రమును. జ్ఞప్తిరూపమును, సర్వగతమును, జననమరణములను ఉదయాస్తమయములు లేనిదియును, నిత్యమునునగు ఆత్మనే జ్ఞేయమందురు.

భగీరథ ఉవాచ:—

చిన్మాత్రం నిర్గుణం శాన్తమస్తి నిర్మలమచ్యుతమ్
దేహాది నేతరత్కించిదితి వేద్మి మునీశ్వర. 25

భగీరథుఁడు.— మునీశ్వరా ! నిర్గుణమును, నిర్మలమును, శాంతమును, చ్యుతిరహితమును నగు ఆత్మ యొకటియే వెలయుచున్నది దేహాదులకు వాస్తవమగు అస్తిత్వము లేదు. అవి ఆత్మ కావు'-అను విషయమును నేనెఱుఁగుదును-దానిని తమ యుపదేశమువలన గ్రహించితిని.

కిం తత్ర ప్రతిపత్తిర్మే స్ఫుటతామేతి నేతరా
ఏతావన్మాత్రసంవిత్తిః స్యామహం భగవన్కథమ్. 26

మహాత్మా ! కాని సదసద్వివేక బోధయందలి ప్రథమాంశమగు సదాత్మబోధ కరతలామలకమువలె నాకు విస్పష్టమగుచున్నట్లులేదు. నేను ఏయుపాయము నవలంబించి విక్షేపరహితమగు శాంతిని బడసి ఈ ఆత్మసంవిత్తిని బొందగలనో నాకుఁ దెలియఁజెప్పుడు.

త్రితల ఉవాచ:—

జ్ఞానేన జ్ఞేయనిష్ఠత్వమేతి చేతో హృదమ్బరే
తతః సర్వవపుర్భూత్వా భూయో జీవో న జాయతే. 27

త్రితలుఁడు:— ఓరాజా ! నీవు రాజ్యాభిమానమందును, తత్సంపర్కిత విషయములందును చిత్తము తగులుకొనియుండుటవలన ఆత్మ స్పష్టముగ అనుభూతమగుట లేదు. హృదయాకాశమున

అమానిత్వజ్ఞాన ముదయించిన, అభిమానము తొలఁగిపోయిన, చిత్తము జ్ఞేయపదార్థమును గ్రహించి దానియందు నెలకొనగలదు. అప్పుడు నీవు పూర్ణస్వభావమును బడయఁగలవు. ఆ తదుపరి నీకు తత్స్వభావప్రచ్యుతిగాని, పునర్జన్మగాని కలుగవు.

అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు. 28
ఆత్మనోఽనన్యయోగేన తద్భావన మనారతమ్
వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది. 29
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం తదతోఽన్యథా. 30

భార్యా, పుత్ర, గృహాదులందు ఆసక్తి, మమత్వములు లేకుండుట, ఇష్టానిష్టములు లభించ నిత్యము సమచిత్తమును బూనియుండుట, అనన్యమగు ఏకాగ్రచిత్తమున ఆత్మవస్తువును గూర్చి భావించుట, జనసంగమమున రుచిగొనక ఏకాంతస్థానమును సేవించుట, శ్రవణమననాదుల అభ్యాసము, పరమాత్మదర్శనము అనునవే జ్ఞానము. మిగిలినవి అజ్ఞానము.

రాగద్వేషక్షయాకారం సంసారవ్యాధిభేషజమ్
అహంభావోపశాన్తౌ తు రాజన్ జ్ఞానమవాప్యతే. 31

ఓరాజా! అహంభావ ముపశమించినచో రాగద్వేషములఁబోనడఁచి సంసారవ్యాధి కౌషధమగు జ్ఞానము లభింపఁగలదు. సర్వసాధనల ఫలమే అనహంకారము అహంకారమున్నచో, అమానిత్వాదిగుణములు పట్టుపడవు.

భగీరథ ఉవాచ:—

శరీరేఽస్మింశ్చిరారూఢో గిరౌ తరురివ స్వకే
అహంభావో మహాభాగ వద మే త్యజ్యతే కథమ్. 32

భగీరథుఁడు:— మహాభాగా! పర్వతమున వృక్షము అధిరోహించియున్నట్లు, అహంభావము నాయీశరీరమున దృఢముగ పాతుకొనిపోయియున్నది. అది ఎట్లు తొలగునో వచింపవేడెద.

త్రితల ఉవాచ:—

పౌరుషేణ ప్రయత్నేన త్యక్త్వా భోగౌఘభావనామ్
గత్వా వికసితాం సత్తామహంకారో విలీయతే. 33

త్రితలుఁడు:— ఓ రాజా! విషయభోగముల వాసనలు అభ్యంతరమున విస్తరించి శుద్ధమగు ఆత్మయొక్క ఆకృతిని వహించుచున్నవి. పురుషప్రయత్నము నాశ్రయించి, ఆభోగవాసనలఁ బరిత్యజించి వానిఁగూర్చి చింతించుట మానిన, అహంకారము వినాశము కాఁగలదు.

యత్నేనాపజ్జరం యావద్భగ్నం లజ్జాదినాఖిలమ్
అకించనత్వశేషేణ స్ఫూటా తావదహంకృతిః. 34

('నా రాజ్యము పోయినది; నన్నిఁక ఇతరులు గౌరవింపరు; యాచకులందఱి అభీష్టములఁ దీర్చి నేనెట్లు భిక్షమును యాచింపఁగలను? శత్రువు లుపహసింతురు; దుష్టాన్నపానాదులచే నేనెట్లు జీవింపఁగలను? — మన్నగు) చింతలవలన, గలుగు లజ్జాభిమానములచే మున్ను రచింపఁబడిన గృహాసక్తిరూపమగు పంజరము సంపూర్ణముగ భగ్నము కానంతవఱకు అహంకారము స్పష్టముగ ప్రకాశించుచు నృత్యమొనర్చుచునే యుండును.

సర్వమేతద్ధియా త్యక్త్వా యది తిష్ఠసి నిశ్చలః.
తదహంకారవిలయే త్వమేవ పరమం పదమ్ 35

ఓ రాజా! నీవు వివేకబుద్ధియొక్క సాయమును గొని ఈలజ్జాదుల నన్నిటిని పరిత్యజించి; నిశ్చలముగ నుండఁగలిగిన, పరమపదమును బొంది, దానితో ఐక్యమునందఁగలవు,

శాన్తాశేషవిశేషణో విగతభీః సంత్యక్తసర్వైషణో
గత్వా నూనమకించనత్వమరిషు త్యక్త్వా సమగ్రాం శ్రియమ్
శాన్తాహంకృతిరస్తదేహకలనస్తేష్వేవ భిక్షామట
న్నామప్యూర్జితవానలం యది భవస్యుచ్చైస్త్వముచ్చైరసి. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే భగీరథోపదేశో నామ
చతుఃసప్తతితమః సర్గః ॥ 74 ॥

నీవు రాజోపయుక్తములగు ఛత్రచామరాది చిహ్నముల నన్నిటిని పరిత్యజించి, దీనాతిదీనుఁడవై, శత్రువులకు రాజ్యలక్ష్మి నర్పించి, శరీరాభిమానమును పారద్రోలి వారికడనే భిక్షమెత్త గలిగి, ఇచ్ఛాయత్నముల వీడి, 'నాకింక ప్రశ్నింపవలసినది ఏమియును లేదని నన్ను (గురుని) గూడ త్యజించి (అనఁగా, గురువునుండి సంశయనిరాసమును అపేక్షింపక కేవలము సేవ యొనర్చుచుండఁ గలిగినచో) ముముక్షువుల కుండవలసిన ఉత్తమగుణముల నన్నిటిని బడసి సర్వోత్కృష్టమగు బ్రహ్మభావమును బొందఁగలవు. అప్పుడు నీకిఁక సంసారభ్రాంతి పొడముట కించుకైనను అవకాశముండదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
భగీరథోపాఖ్యానమున భగీరథోపదేశమను
డెబ్బది నాల్గవ సర్గము ॥ 74 ॥

---

## పఞ్చసప్తతితమః సర్గః

[మిషవ్యాజేన సర్వస్వత్యాగో రాజ్ఞోఽత్ర వర్ణ్యతే
భైక్షచర్యా క్వచిచ్ఛైలే త్రితలేన సమం స్థితిః.

భగీరథుఁడు యజ్ఞమను నెపమును జూపి సర్వస్వము త్యజించి భిక్షనొనర్చుచు త్రితలునితో నొకపర్వతమున వాసమొనర్చుచుండుట ఈ సర్గమున చెప్పఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:-

అథ తస్య గురోర్వాక్యా దిత్యాకర్ణ్య భగీరథః
మనస్యాహితకర్తవ్యః స్వవ్యాపారపరోఽభవత్. 1

శ్రీవసిష్ఠుఁడు.—ఓ రామచంద్రా! భగీరథుఁడు గురువునుండి యిట్లు విని అనంతరము తన కర్తవ్యమును నిశ్చయించుకొని దానిని సాధింప స్థిర సంకల్పమును గావించుకొనెను.

తతః కతిపయేష్వేవ వాసరేషు గతేషు సః
అగ్నిష్టోమమఖం చక్రే సర్వత్యాగైకసిద్ధయే. 2

కొన్నిరోజులు గడచినపిదప, ఆతఁడు తన సర్వత్యాగసంకల్పము సిద్ధించుటకై అగ్నిష్టోమము (సోమయాగము) నుండి విశ్వజిత్-యాగమువఱకుగల యజ్ఞముల నన్నిటిని ఒనర్చెను.

గోభూమ్యశ్వహిరణ్యాది దదౌ ధనమశేషతః
ద్విజేభ్యో నిజబన్ధుభ్యో గుణ్యాగుణ్యావిచారయన్. 3

యజ్ఞము ముగియ, ఆతఁడు పాత్రాపాత్రవిచారము (ఆలస్యమగునను భయమున) నొనర్ప కయే బ్రాహ్మణులకు, బంధువులకు గోవులను, అశ్వములను, భూమిని, సువర్ణమును అమితముగ నొసంగెను.

దివసత్రయమాత్రేణ సర్వమేవ పరిత్యజన్
అసు మాత్రావశేషోఽసావాసీద్రాజా భగీరథః. 4

భగీరథుఁడు మూఁడు రోజులలో తనకున్న దానినంతటిని దానమొనర్చి కేవలము తన ప్రాణముతో మిగిలెను.

అథ సర్వార్థరిక్తం తత్స్విన్నప్రకృతిపౌరకమ్
సీమాన్తినే తృణమివ రాజ్యం స్వమరయే దదౌ, 5

ఇట్లు రాజు ధనశూన్యుఁడు కాఁగా, అంతఃపురవాసులు, పౌరులు దుఃఖింపసాగిరి. (భగీరథుఁ డంతటితో నాగక) తన రాజ్యమునుగూడ సరిహద్దుల నున్న శత్రురాజునకు తృణమువలె నొసఁగివైచెను.

ఆక్రాన్తే ద్విషతా రాజ్యే మునిః సద్మని మణ్డలే
అధోవాసోవశేషోఽసౌ నిర్జగామ స్వమణ్డలాత్. 6

ఆ శత్రురాజు అరుదెంచి రాజ్యమునంతటిని ఆక్రమించెను. భగీరథుఁడు కౌపీనమును మాత్రమే వెంటగొని తనరాజ్యమునుండి వెలువడెను!

యత్ర న జ్ఞాయతే నామ్నా యత్ర న జ్ఞాయతే ముఖాత్
తత్ర గ్రామేష్వరణ్యేషు దూరేషూవాస ధైర్యవాన్. 7

చూచి 'ఇతఁడు భగీరథుఁడు' అని గుర్తింపగలవారును, పేరును విని 'ఇతఁడు ఆ దేశపు రాజు' అని కనుగొనగలవారును లేని దూరగ్రామములందును, అరణ్యములందును నాతఁడు ఓపికతో వసింపసాగెను.

ఇత్యల్పేనైవ కాలేన ప్రశాన్తసకలైషణః
పరమేన శమేనాసావాప విశ్రాన్తిమాత్మని. 8

ఇట్లు జీవితమును గడపుచుండ ఆతనికి అచిరకాలముననే వాసనలన్నియు తొలఁగిపోయెను. పరమమగు శాంతి లభింప ఆతఁడు ఆత్మవిశ్రాంతిని బడసెను.

భ్రమన్ద్వీపాని భూపీఠే కదాచిత్కాలయోగతః
అవశః శత్రుణాక్రాన్తం స్వమేవ ప్రాప తత్పురమ్. 9

పిదప ఆతఁడు భూమండలమునగల ద్వీపముల నన్నిటిని గాంచి నిజపురమునుగాంచు కోరిక గలుగ అట కరుదెంచెను.

నానాగారాంశ్చ తత్రాసౌ ప్రవాహపతితాంశ్చ తాన్
పౌరాంశ్చ మన్త్రిణశ్చైవ శమీ భిక్షామయాచత. 10

శ్రమయుక్తుఁడగు భగీరథుఁడు శ్రేణీబద్ధములగు వివిధభవనముల నతిక్రమించి పౌరులకడను, మంత్రులయొద్దను భిక్షను యాచించెను.

వివిదుస్తే నృపం పౌరా మన్త్రిణశ్చ భగీరథమ్
పూజయామాసురథ తం సవిషాదాః సపర్యయా. 11

ఆతనిని గాంచి పురజనులును, మంత్రులును గుర్తింపగలిగిరి. వారాతనిని ఖేదచిత్తముతో సపర్యలచే పూజించిరి.

ప్రభో రాజ్యం గృహాణేతి ప్రార్థితోఽప్యరిణా మునిః
నాదత్తేఽనాదృతాశేషస్తృణమప్యశనాదృతే. 12

శత్రురాజు:— 'ప్రభూ! మీ రాజ్యమును మీరు గైకొనుఁడు' అని ప్రార్థించినను, ఆతఁడు భోజనమునుదప్ప తృణమునైనను గ్రహింపలేదు.

కతిచిద్దివసాంస్తత్ర నీత్వాఽన్యత్ర జగామ సః
భగీరథోఽయం హా కష్టమితి లోకేన శోచితః. 13

ఆతఁడచట కొన్నిదినములుండి మఱియొకతావునకు వెడలెను. 'అహా! ఈతఁడు భగీరథుఁడా? ఎంత కష్టము!' అని జనులు శోకింపసాగిరి.

అథాన్యత్రోపశాన్తాత్మా పరివిశ్రాన్తధీః సుఖీ
ఆత్మారామం కదాచిత్తు స ప్రాప త్రితలం గురుమ్. 14

పిమ్మట నాతఁడు మఱియొకచోట శాంతమనస్కుఁడై కొంతకాలము గడపెను. ఆ పిదప ఒకప్పుడు ఆత్మారాముఁడును, గురుఁడునునగు త్రితలునికడ కరిగెను.

స్వమేవ స్వాగతం కృత్వా తేన సార్ధం భగీరథః
కంచిత్కాలమువాసాద్రౌ వనే గ్రామే పురే జనే, 15

గురువును అభ్యర్చించి అతనితోఁగూడి కొంతకాలము పర్వతములందును, వనములందును గ్రామములందును, నగరములందును, జనపదములందును నివసించెను.

సమతాముపయాతౌ తౌ గురుశిష్యౌ సమస్థితౌ
కలయామాసతుః స్వస్థౌ వినోదం దేహధారణమ్. 16

గురుశిష్యులిరువురు నిట్లు సామ్యభావమును బొంది సమానులై ఆత్మ - విశ్రాంతి - సుఖము ననుభవింపసాగిరి. ఒకదినమున కుతూహలభూతమగు శరీర - ధారణను గుఱించి వారిట్లు చింతించిరి.

కిమయం ధార్యతే దేహః కింవానేనోఝ్ఝితేన నః
యథాక్రమం యథాచారం తిష్ఠత్వేష యథాస్థితమ్. 17

ఈశరీరముండిన ప్రయోజనమేమి? శరీరములేకున్న మనకుగలిగెడి నష్టమేమి? — ఇది పెద్దల ఆచారము ననుసరించి యిచ్చవచ్చినట్లు మెలఁగునుగాక!

ఇతి నిశ్చిత్య తిష్ఠన్తౌ తౌ వనాద్వనగామినౌ
అనానన్దం పరానన్దం నాసుఖం నచ మధ్యమమ్. 18

ఇట్లు వారు నిశ్చయించుకొని వన, వనాంతరములందు పరిభ్రమింపసాగిరి. ఎద్దానికడ విషయానంతము అత్యంతసామాన్యముగ తోఁచునో, ఏది దుఃఖస్థితి కాదో, ఏది సుఖదుఃఖరహితమగు మధ్యావస్థయును గాదో, అట్టి పరమానందము ననుభవింపసాగిరి.

ధనాని వాజిభవాద్యైశ్వర్యం చాష్టధోదితమ్
సిద్ధైరప్యర్పితం తుష్టైస్తేనాతే జర్జరం తృణమ్. 19

వారు ధన, జన, అర్థ వైభవములను, బ్రహ్మాదులచే నొసఁగబడు అణిమాది అష్టసిద్ధులను, ఎండిన గడ్డిపోచవలె చూడసాగిరి. ఇట్లు వారికి మానుషభోగముల యెడలనేగాక దివ్యభోగముల యెడలకూడ దృఢమగు వైరాగ్యము కలిగెను.

స్వకర్మణైవ దేహోఽయం యావత్సత్వమనిచ్ఛయా
ధారణీయ ఇతి స్వేన కర్మణైవాథ తస్థతుః. 20

ప్రారబ్ధకర్మవలన నే ఈ శరీరము లభించినది. అది క్షీణించువఱకు ఈ శరీరమ్ముండుగాక! అని వారు నిశ్చయించుకొని మెలయఁదొడఁగిరి.

అభినన్దతురాగతముత్తమౌ నిజసమాచరణక్రమజం మునీ
సుఖమసౌఖ్యమభీప్సితవర్జితౌ సమనస్మేతి సమౌ శమినౌ స్వతః. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే భగీరథనిర్వాణం నామ పఞ్చసప్తతితమః సర్గః ॥ 75 ॥

ఆ మునిద్వయము పూర్వకర్మవశమున లభించిన సుఖదుఃఖముల యెంతియెడల ఆనందమునే చూపసాగిరి. వారు ఇచ్ఛను సంపూర్ణముగ వదలివైచి అత్యంతసమత్వపూర్ణమగు బ్రహ్మమున ఏకరసీభూతులై వెలయసాగిరి. అందువలన వారికి స్వాభావికముగనే పరమమగు శాంతి లభించెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భగీరథోపాఖ్యానమున భగీరథనిర్వాణమను
డెబ్బది యైదవ సర్గము ॥ 75 ॥

---

## షట్సప్తతితమః సర్గః

[పునర్భగీరథస్యేహ రాజ్యప్రాప్తిరుదీర్యతే
ఆరాధ్య బ్రహ్మరుద్రాదీన్ గంగాయాశ్చావతారణమ్.

భగీరథుఁడు మరల రాజ్యమును బొందుట, బ్రహ్మరుద్రాదుల నారాధించి గంగను గొనివచ్చుట అను విషయము ఇచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అథైకదా పురే శ్రేష్ఠే కస్మింశ్చిన్మణ్డలాన్తరే
అనపత్యం నృపం మృత్యురహాన్మత్స్య ఇవామిషమ్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! భగీరథుఁడు సంచరించుచు ఒకానొక రాజ్యమును చేరుకొనెను. అచ్చటిరాజును మృత్యువు-మహామత్స్యము అల్పమత్స్యములను మ్రింగునట్లు,-కబళించివైచెను. ఆరాజునకు సంతానములేకుండెను.

తత్ర ప్రకృతయః ఖిన్నా నష్టదేశక్రమా నృపమ్
అన్విష్యన్తి స్మ సంయుక్తం గుణలక్ష్మ్యా విశాలయా. 2

అచ్చటి ప్రజలు ఖిన్నులై, అరాజకమును బోగొట్టుటకై గుణైశ్వర్యయుతుఁడగు రాజు నన్వేషించుచుండిరి.

తం భగీరథమాసాద్య స్థిరం భిక్షాచరం మునిమ్
పరిజ్ఞాయ సమానీయ సైన్యే చక్రుర్మహీపతిమ్ 3

వారు, మునివేషమున బిచ్చమెత్తు భగీరథుని జూచి ఆతఁడు సర్వగుణసమన్వితుఁడని గ్రహించిరి. పిమ్మట సైన్యమాతనిని గొనివచ్చి అభిషేకమొనర్చెను.

భగీరథః క్షణేనైవ ప్రావృషీవామ్బునా సరః
వలితః సేనయా పూర్ణో ఝటిత్యాశ్రియే గజః. 4

భగీరథుఁడు వెంటనే—వర్షాకాలమున సరోవరము నీటిచేఁ బూర్ణమగునట్లు, సైనికులచే బూర్ణుడై గజము నధిరోహించెను.

భగీరథో జగన్నాథో జయతీతి జనార్ణవైః
నీరన్ధ్రితాముపాజగ్ముర్గిరీన్ద్రాణాం మహాగుహాః. 5

'జగన్నాథుఁడగు భగీరథునకు జయము' అను ధ్వనులు లేచి పర్వతగుహలనుగూడ పూర్ణమొనర్చెను.

తత్ర తం పాలయన్తం తద్రాజ్యం రాజానమాదృతాః
ఆజగ్ముః ప్రాక్ప్రకృతయః ప్రావూరిత్థమ్ నృపాధిపమ్. 6

(అ త్తతి కోసలరాజ్యమును పాలించు శత్రురాజు మరణించెను.) అప్పుడు అయోధ్యయందుండు భగీరథుని పూర్వపు ప్రజలు తమరాజిచట రాజ్యమును పాలించుచుండుటను దెలిసికొని, అరుదెంచి, ఇట్లు పలుకసాగిరి.

ప్రకృతయ ఊచుః:—

రాజన్నస్మాకమధిపో యస్త్వయా స పురస్కృతః
మృత్యునా వినిగీర్ణోఽసౌ మత్స్యేనేవామిషం మృదు. 7

ప్రజలు:— 'రాజా! తాము మా ప్రభువులు. తాము రాజ్యమొసఁగియున్న శత్రురాజు అల్పమత్స్యము మహామత్స్యముచే కబళింపఁబడునట్లు-మృత్యువుచే కబళింపఁబడెను.

తత్త్వత్పాలయితుం రాజ్యం ప్రసాదః కర్తుమర్హసి
అప్రార్థితోపయాతానాం త్యాగోఽర్థానాం చ నోచితః 8

దయచేసి తామారాజ్యమును పాలింతురుగాక! కోరకుండగనే అరుదెంచు విషయములను పరిత్యజించుట ఉచితముకాదు.'

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇతి సంప్రార్థితో రాజా తదఙ్గీకృత్య తద్వచః
సప్తసాగర చిహ్నాయాః స బభూవ భువః పతిః 9

శ్రీవసిష్ఠుఁడు.- ఓరామచంద్రా! ఇట్లు ప్రార్థితుఁడై భగీరథుడు వారికోరిక నంగీకరించి సప్తసాగర-చిహ్నితమగు భూమండలమునకు రాజయ్యెను.

సమః శాన్తమనా మానీ వీతరాగో విమత్సరః
ప్రాప్త కార్యైకకరణః స తిరోహితవిస్మయః. 10

బ్రహ్మజ్ఞానమును బొందియుండుటవలన ఆతఁడు సామాన్యరాజులవలె గాక సమదర్శియును, శాంతమనస్కుఁడును, మానియును, వీతరాగుఁడును, మాత్సర్యహీనుఁడును, విస్మయరహితుఁడును యథాప్రాప్తకార్యనిరతుఁడును నైయుండెను.

పాతాలతలనష్టానాం సాగరాకారకారిణామ్
పితామహానాం గఙ్గామ్బు శుశ్రువే తారణక్షమమ్. 11

ప్రపితామహగణము (ముత్తాతలు) యజ్ఞాశ్వమును వెదకుచు భూమిని త్రవ్వి సముద్రముగఁ జేసియుండిరి. వారు పాతాళము కంగి, కపిలుని శాపముచే భస్మీభూతులైరి. గంగాజలమే వారిని తరింపఁజేయు కారణము అని గరుడుఁడు పల్కియుండెను — ఈ మున్నగు విషయముల నాతఁడు జనుల వలన వినెను.

తదా కిల స్వర్గనదీ వహతి స్మ న భూతలే
పితౄణాం భూతవిఖ్యోఽభూత్తేన గఙ్గా జలాఞ్జలిః. 12

అప్పుడు స్వర్గనదియగు గంగ భూతలమున లేకుండెను. ఆ భగీరథుఁడే గంగను భూతలమునకు, దీసికొనివచ్చెను. అప్పటినుండియే పితరులకు గంగా జలాంజలి (తర్పణము) ఒసఁగుట ప్రసిద్ధికెక్కెను.

భగీరథేన చ మహీమవతారయితుం దివః
గఙ్గాం గృహీతో నియమస్తతః ప్రభృతి భూభృతా. 13

అది (పితరులకు గంగాజలమువలననే సద్గతి కలుగునని) వినినప్పటినుండియు భగీరథుఁడు గంగనెట్లైన భూలోకమునకు తీసికొనిరావలెనని సంకల్పించుకొనెను.

తతో రాజ్యం పరిత్యజ్య మన్త్రిణాం భూపతిః శమీ
తపసే కార్యకార్యేహో జగామ విజనం వనమ్. 14

శాంతగుణ సమన్వితుఁడగు ఆ భగీరథనృపతి గంగను దీసికొనివచ్చు కోర్కెతో తపమొనరింపఁ దలఁచి మంత్రులకు రాజ్యభారము నర్పించి తాను జనశూన్యమగు అరణ్యమున కరిగెను.

తత్ర వర్షసహస్రైశ్చ సమారాధ్య పునః పునః
బ్రహ్మాణం శంకరం జహ్నుం భువి గఙ్గామయోజయత్. 15

అచ్చట వెయ్యివేండ్లు బ్రహ్మదేవుని, శంకరుని, జహ్నుమునిని బాగుగ నారాధించి తుదకు గంగను భూమికిఁగొనివచ్చెను.

తతః ప్రభృత్యమలతరఙ్గ భఙ్గినీ జగత్పతేః శశి బిభృదఙ్గ సఙ్గినీ
నభస్తలాన్నిపతితి గాం త్రిమార్గగా మహాత్మనామివ బహు
పుణ్యసంతతిః. 16

అప్పటినుండి జగత్పతియగు చంద్రశేఖరుని శిరమందుండునదియును నిర్మలతరంగ భంగముల శోభతో నొప్పారునదియును, త్రిపథగామినియునగు గంగ ఆకాశమునుండి-స్వర్గవాసుల పుణ్యసమూహమోయను నట్లు భూమిపై పడుచునున్నది.

స్ఫురత్తరఙ్గభఙ్గినీ స్వఫేనపుఞ్జహాసినీ
ప్రసన్నపుణ్యమఞ్జరీ యుతేవ ధర్మసంతతిః
భగీరథే మహీపతౌ యశః ప్రచారవీథికా
తదా హి సా త్రిమార్గగా మహీతలే బభూవ హ. 17

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్థే గఙ్గావతరణం నామ
షట్ సప్తతితమః సర్గః ॥ 76 ॥

విరుగుచున్న అలలతోఁ బ్రకాశించునదియు, నురుఁగులను హాస్యముతోఁ గూడినదియు, ప్రసన్నత్వసహితయు వికసించిన పుణ్యలత వంటిదియు, ధర్మసమూహరూపమును త్రిపథగామినియునగు గంగ భగీరథుని కీర్తిని సముద్రమువఱకు ప్రకాశింపఁజేయు మార్గమోయను నట్లు వెలుగొందుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
భగీరథోపాఖ్యానమున గంగావతరణమను డెబ్బదియాఱవ సర్గము ॥ 76 ॥
భగీరథోపాఖ్యానము సమాప్తము.

---

## సప్తసప్తతితమః సర్గః

## చూడాలోపాఖ్యానము

[చూడాలాఖ్యానము క్తార్థదృఢిమ్నే ప్రాక్తతార్యతే
శిఖిధ్వజస్య మాహాత్మ్యం వివాహక్రీడనక్రమః.

పూర్వోక్తమగు విషయమును దృఢమొనర్చుటకై చూడాలోపాఖ్యానము (శిఖిధ్వజోపాఖ్యానము) ఇచట ఆరంభింపఁబడుచున్నది. అందు మొదట శిఖిధ్వజుని మాహాత్మ్యము, వివాహము, విలాసక్రీడ మున్నగు విషయములు వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతామవష్టభ్య దృశం భగీరథధియా ధృతామ్
సమః స్వస్థో యథాప్రాప్తం కార్యమాహర శాన్తధీః 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నీవు భగీరథుఁడు రెండవమారు రాజ్యమును బాలించునప్పుడు ఏ బుద్ధి నాశ్రయించి దృష్టిని స్థిరమొనర్చుకొనగలిగెనో, ఆబుద్ధి నాశ్రయించి దృష్టిని స్థిరమొనర్చుకొని, సమత్వమును, స్వస్థభావమును బడయుము. మఱియు యథాప్రాప్తములగు కార్యములను శాంతచిత్తుఁడవై ఆచరింపుము.

ఇదం పూర్వం పరిత్యజ్య క్రోడీకృత్య మనఃఖగమ్
శాన్తమాత్మని తిష్ఠ త్వం శిఖిధ్వజ ఇవాచలః 2

ఓ రాఘవా! ఈ వైభవముల నన్నిటిని పరిత్యజించి మనో విహంగమును (పక్షిని) హృదయమున నిరుద్ధమొనర్చి. శాంతింపఁజేసి శిఖిధ్వజునివలె ఆత్మయందు నిశ్చలముగ వెలయుము.

శ్రీరామ ఉవాచ:—

కోఽసౌ శిఖిధ్వజో నామ కథం వా లబ్ధవాన్పదమ్

ఏతస్మై కథయ బ్రహ్మన్మ్యాయో బోధవివృద్ధయే. 3

శ్రీరాముఁడు:— మునీంద్రా! ఆ శిఖిధ్వజుఁ డెవఁడు? ఆతఁడు మోక్షము నెట్లు బడయఁగలిగెను? బ్రహ్మజ్ఞా! జ్ఞానాభివృద్ధికై నాకీవిషయములను వివరించి చెప్పుఁడు?

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

ద్వాపరే భవతాం పూర్వమిదానీం చ భవిష్యతః
తేనైవ సంనివేశేన దంపతీ స్నిగ్ధతాం గతౌ. 4

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! పూర్వకల్పమునందలి ద్వాపరయుగమున శిఖిధ్వజుఁడును, ఆతని భార్యయు జనించియుండిరి. ఈకల్పమునగూడ ఆ దంపతులు జన్మించి వివాహమొనర్చుకొందురు.

**శ్రీరామ ఉవాచ:—**

యత్పూర్వ మాసీద్భగవం స్తదిదానీం తథైవ హి
భవిష్యతి కిమర్థం వై వద మే వదతాం వర. 5

శ్రీరాముఁడు:— వాగ్మివర్యా! 'పూర్వము జరిగినదే ఇప్పుడు జరుగుచున్నది, ఇఁకముందుగూడ జరుగఁగలదు' అని తాము వచించితిరిగదా,- ఈభూత, భవిష్యత్కాలముల సాదృశ్యమునకు కారణమేమియో తెలుపప్రార్థన.

**శ్రీవసిష్ఠ ఉవాచ: —**

జగన్నిర్మాణ నియతేరస్యా బ్రహ్మాదిసంవిదః
ఈదృశ్యవస్థితిర్నిత్యమనివార్య స్వభావజా. 6

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! జగత్సృష్టి విషయమున నియతియనఁదగు బ్రహ్మాదుల సత్యసంకల్పమయజ్ఞానముయొక్క అనివార్యస్వభావమే దానికి కారణము. దానినెవఁడును నివారింపఁజాలఁడు.

యదస్యద్భవహుశో భూత్వా పునర్భవతి భూరిశః
అభూత్వైవ భవత్యన్యః పునశ్చ న భవత్యలమ్. 7

ఒక ఆమ్ర (మామిడి) వృక్షమున ఫలములు పెక్కుమార్లు మిక్కుటముగ ఫలించియున్నను, మరల అట్టివేయగు ఫలము లనేకములు దానినుండి కలుగుచున్నవి. కాని, ఆ వృక్షమును ఛిన్న మొనర్చ అవి తొలఁగి పోవుచున్నవి. అట్లే ఈజగత్తునందును పూర్వ సన్నివేశము (ఆకారము) ననుసరించి సాదృశ్యము తోఁచుచున్నది. అజ్ఞానము తొలఁగ, ఈ సాదృశ్యమున్ను, జగదాకారమున్ను తొలఁగి పోవుచున్నవి.

అన్యత్ప్రాక్సంనివేశాఢ్యం సాదృశ్యేన విపల్గతి
సదృశా విషమాశ్చైవ యథా సరసి వీచయః. 8
తా ఏవాన్యాశ్చ దృశ్యన్తే వ్యవస్థాః సంసృతౌ తథా

తస్మాద్రాజేవ భూయోఽపి వక్ష్యమాణక థేశ్వరః. 9
భవిష్యతి మహాతేజా స్తద్వృత్తాన్తమిమం శృణు
ద్వాపరే పూర్వమభవదతీతో సప్తమే మనౌ. 10
చతుర్యుగే చతుర్థే తు సర్గేఽస్మిన్కురూణాం కులే
జమ్బుద్వీపే ప్రసిద్ధస్య విన్ధ్యస్యాదూరసంస్థితే. 11

సాదృశ్యముతో నొప్పునవియు, ఒప్పునవియునగు తరంగములు సరోవరమున లేచుచుండు నట్లు, ఈ సంసారమునగూడ పూర్వము తోఁచిన విషయములే మరలమరల తోఁచుచున్నవి. ఒకొక్కప్పుడు విరుద్ధములైనవియు తోఁచుచున్నవి. కాఁబట్టి శిఖిధ్వజుని విషయమునగూడ ఇట్లే జరిగినది. వెనుకటి శిఖిధ్వజునివలె నేఁజెప్పఁబోవు కథకు నాయకుఁడైన శిఖిధ్వజుఁడు కూడ మిగుల పరాక్రమముతో నొప్పగలఁడు—అతని వృత్తాంతమునే చెప్పుచున్నాఁడను వినుము—7-వ మనువు గతించి ఎనిమిదవ మనువుఅధికారమొనర్చునపుడు నాలుగు యుగములు ముగిసి చతుర్థసృష్టి ఆరంభమైనపుడు ద్వాపరయుగ మరుదెంచెను. అప్పుడు కురుకులమున ఈ (శిఖిధ్వజ) రాజు వింధ్యపర్వతమువద్దనున్న జంబూద్వీపమున జన్మించెను.

మాలవానాం పురే శ్రీమాఞ్శిఖిధ్వజ ఇతీశ్వరః.
ధైర్యౌదార్య దయాయుక్తః క్షమాశమదమాన్వితః. 12

ఆ శిఖిధ్వజుఁడు జన్మించినది మాళవదేశ_రాజధానియగు ఉజ్జయినీ పట్టణమున. ఆతఁడు ధైర్య, ఔదార్య. క్షమా, శమ, దమాదిగుణములతో నొప్పుచుండెను.

శూరః శుభసమాచారో మానీ గుణగణాకరః
ఆహర్తా సర్వయజ్ఞానాం జేతా సర్వధనుష్మతాం. 13

శూరుఁడగు ఆరాజు సదాచార, మానములు గల్గి గుణసమూహముల కాటపట్టై వెలయుచుండెను. ఆతఁడు యజ్ఞములనన్నిటిని ఒనర్చియుండెను; వీరుల నందఱిని జయించెను.

కర్తా సకలకార్యాణాం భర్తా పూర్వవపుర్భువః
పేశల స్నిగ్ధమధురో విదగ్ధః ప్రీతిసాగరః. 14

మఱియు నాతఁడు వాపీ, కూప, తటాకప్రతిష్ఠాది కార్యముల నన్నిటిని గావించెను, పృథివికంతటికిని ఆతఁడు రాజై యొప్పుచుండెను. అపూర్వమగు శరీరముతో నతఁడు వెలయుచుండెను. ఆతని స్వభావము కోమలము, మృదుమధురము నైయుండెను ఆతఁడు లౌకికశాస్త్రవేత్తయు, ప్రేమసాగరుఁడునునై చెన్నొందు చుండెను.

సున్దరః శాన్తసుభగః ప్రతాపీ ధర్మవత్సలః
వదితా వినయార్థానాం దాతా సకలసంపదామ్. 15

సుందరుఁడగు ఆరాజు శాంతుఁడును, శుభలక్షణయుక్తుఁడును, ప్రతాపవంతుఁడును, ధర్మనిరతుఁడును నైయుండెను. పరులకు వినయశిక్షణ నొసఁగు వాక్యములనే యాతఁడు పల్కుచుండెడివాఁడు. వివిధములగు సంపదల నాతఁడు దానమొనర్చుచుండెను.

భోక్తా సత్సఙ్గసహితః సుశ్రోతా సకలశ్రుతేః
వేదాసౌ మాననాశూన్యః స్త్రైణం తృణవదస్పృశత్. 16

వివిధసంపదల నాతఁడనుభవించుచుండెను. సత్సంగమొనర్చుచు ఆయన శ్రుతులనన్నిటిని వినుచుండెను. సర్వజ్ఞుఁడైనను జ్ఞాని నను అభిమానము (గర్వము) ఆతనికి లేకుండెను. స్త్రీవ్యసనాదులున్ను ఆతనికి లేవు. అట్టి విషయములను తృణసమముగ నెంచి ఆతఁడు వానిని ముట్టకుండెడువాఁడు.

పితరి స్వర్గమాపన్నే బాల ఏవోత్తమౌజసా
కృత్వా షోడశవర్షాణి స్వయం దిగ్విజయం వశీ. 17

బాల్యముననే తండ్రి మృతినొందఁ, శిఖిధ్వజుఁడు స్వశక్తివలన పదునాఱవయేటనే దిగ్విజయమొనర్చెను.

నూనం సామ్రాజ్యసంపత్త్యా భూమణ్డలమయోజయత్
అతిష్ఠద్విగతాశఙ్కం పాలయన్ధర్మతః ప్రజాః 18

తన సామ్రాజ్య సంపదతో భూమండలము నాతఁడు నింపివైచెను. (తండ్రి మండలాధీశ్వరుడైయుండ శిఖిధ్వజుఁడు సామ్రాట్టయ్యెనని తాత్పర్యము) పిదప, ఉద్వేగరహితుఁడై ప్రజల నాతఁడు న్యాయానుసారము పాలింపఁదొడఁగెను.

స ధీమాన్మన్త్రిభిః సార్ధం యశసా శుక్లయన్దిశః
అథ గచ్ఛత్సు వర్షేషు వసన్తే ప్రోల్లసత్యలమ్. 19

మంత్రులతోఁగూడి యాతఁడు రాజ్యపాలనాదికృత్యముల నొనర్చుచుండెను. దిక్కులన్నియు నాతనికీర్తితో తెల్లపడిపోయెను. ఇట్లు కొన్ని ఏండ్లు గడవ, ఆతఁడు పూర్ణయౌవనమును బొందెను. వసంతకాల మరుదెంచెను,

పుష్పేషు జృమ్భమాణేషు స్ఫురత్సు శశిరశ్మిషు
మఞ్జరీజాలదోలాసు విటపాన్తః పురాన్తరే. 20
రజః కర్పూరధవలే వబద్ధలకపాటకే
ఆమోదవిలసత్పుష్పగుఛ్ఛకవితానకే. 21
గాయత్సు గహనేష్వాచ్చైర్మధునేష్వలినాం మిథః
ఆవాతి మధురే వాయౌ శశిశీకరశీతలే. 22
కదలీకన్దలీకచ్ఛతలపల్లవలాసిని
కాన్తాం ప్రతి బభూవాస్య వసచ్చేతః సముత్సుకమ్. 23

పుష్పములు విరివిగ వికసింపఁదొడఁగెను. చంద్రకిరణములు ప్రకాశించుచుండెను. వృక్షశాఖలను అంతఃపురమున పూలగుత్తులను ఊయెలలో తుమ్మెద జంటలుచేరి ఆనందసూచకమగు సంగీతము నొనర్పసాగెను. పరాగధవళితములును, మిళితదళకవాటములును, సౌరభశోభాయమానములును నగు పుష్పస్తబకములవితానము (ఆకసముగ) ఒప్పుచుండెను. కదళీ కందళీ తలపల్లవముల లాస్యవిహారము

నిల్పుననియును, చంద్రకిరణ శీతలములగు మధురవాయువు వీవఁదొడఁగెను, (ఇట్టి వసంతాగమనసమయమున) పూర్వమే చూడాలయొక్క గుణసౌందర్యాదులనుగుఱించి, విని, ఆకర్షింపఁబడియున్న శిఖిధ్వజుని చిత్తము ఆపెయెడల మఱింత ఉత్సాహితమయ్యెను.

క్షీబం కుసుమసంభారసౌగన్ధ్యమధురాసవైః
మనో నాన్యాస్పదం చక్రే స వసన్తమివోదితమ్. 24

కుసుమసౌగంధ మధురాసవమున మత్తిల్లిన వసంతవనమువలె అనురాగపల్లవితమైన అతని మనస్సుకూడ మత్తిల్లి చూడాలంకంటె నితరములగు విషయములను భావింపఁజాలకుండెను.

ఉద్యానవనదోలాసు లీలాకమలినీషు చ
కదా ప్రణయినీం ముగ్ధాం హేమాబ్జముకులస్తనీమ్. 25
కరిష్యే కామినీమఙ్కే పర్యఙ్కే కుఙ్కుమాఙ్కితామ్
కదా కమలవల్లీనాం దోలాస్వలిరివాలినీమ్. 26
ఆలోలాం తాం నివేక్ష్యామి బాలాం భుజలతానుగామ్
మృణాలహారకున్దేన్దువృన్దవల్యభిలాషిణీ. 27
మత్కృతే మదనాతప్తా కదా స్యాదిన్దుసున్దరీ
ఇతి చిన్తాపరో భూత్వా కుసుమావచయోన్ముఖః. 28
విజహార వనాన్తేషు కుసుమోపవనేషు చ
వనోపవనలేఖాసు లీలాకమలినీషు చ. 29
వల్లీవలయగేహేషు వివిధోద్యానభూమిషు
వనోపవనవిన్యాసవర్ణనావలితాసు చ. 30
శృఙ్గారరసగర్భాసు కథాస్వరమతోన్మనాః
హృది హారలసత్కాయ విలోలాలకవల్లరీః. 31
కుమారీః పూజయామాస సువర్ణకలశస్తనీః
ఏతన్మన్యే విదుర్భవ్యా మన్త్రిణో నృపనిశ్చయమ్. 32
ఇఙ్గితాకారవేదిత్వమేవ మన్త్రిపదం పరమ్
అథ తస్య వివాహాయ మన్త్రివర్గో విచారయన్. 33
సురాష్ట్రాధిపతేః కన్యాం యయాచే యౌవనాన్వితామ్
నవయౌవనసంపన్నాం భార్యాత్వే విధినోత్తమామ్. 34
ఉపయేమే స తామాత్మసదృశీం ప్రతిమామివ
చూడాలేతి భువి ఖ్యాతా నామ్నా నృపతిసున్దరీ 35
సా తం భర్తారమాసాద్య రేజే ఫుల్లేవ పద్మినీ
నీలనీరజనేత్రాం తాం చూడాలాం స శిఖిధ్వజః 36

స్నేహోద్వికాసయామాస సూర్యోఽథో యథాబ్జినీమ్
అవర్ధత తయోః ప్రీతిరన్యోన్యార్పితచేతసోః. 37
హావభావవిలాసాఢ్యైరఙ్గైర్నవలతేవ సా

సుమన్త్ర్యర్పితసర్వార్థః స సుఖీ సుస్థితప్రజః. 38

'నే నెన్నఁడు ఉద్యానవనములందలి తూఁగుటుయ్యేలలోను, లీలాకమలములందును, హేమాబ్జ-ముకుళ-స్తనియు, మనోహారిణియునగు ప్రణయిని (చూడాల)తోఁగూడి విహరింతును?—ఎపుడామె శరీరమును కుంకుమలిప్తమొనర్చి అంక-పర్యంకమున (ఒడియందు) నుంచుకొనఁగలను? కమలవల్లీ-డోలలందు భ్రమరము భ్రమరిని గ్రహించునట్లు, నావలె విరహాతిశయమున నాపై మనస్సు నిలిపి యుండు. ఆబాలను నా భుజలతా-బంధమున నెప్పుడు గాంచఁగల్గుదునో! (ఎన్నఁడు ఆమెను వివాహమొనర్చుకొనగలను?) ఆ చంద్రముఖసుందరి ఎప్పుడు నాపై వలపుగొని మదనజ్వర పీడితయై (తదుపశమన కారణములగు) మృణాలహార, కుందకుసుమ, చంద్రబింబ, లతాగృహాదుల ప్రాపును బొందగోరును?'—అని శిఖిధ్వజుఁడు చింతించుచు కుసుమసంగ్రహార్థము వనాంతములందును, పుష్పోద్యానములందును విహరింపసాగెను. మఱియు, అన్యమనస్కుఁడై వనములందును, ఉపవనములందును, లతాగృహములందును, వివిధోద్యానవనములందును, కమలసరోవర సమీపమునను తిరుగాడఁజొచ్చెను. ఒక్కొక్కప్పుడు వనోపవన వర్ణనములను శృంగారగర్భితములగు వాక్యములను విన నువ్విళ్లూరెడువాఁడు. మఱియొకసమయమున చంచల కేశలతాహార విరాజితలును, సువర్ణకలశపయోధరలునునగు కమరీకలను మనస్సున కల్పించుకొని, వారిని ప్రశంసించుచు ఆదరసత్కారముల నొనర్చుచుండెను. మఱియు. ఆ సంకల్పిత-రమణులను కల్పనయందే వేషభూషణములచే అలంకృతమొనర్చుచుండెడువాఁడు.

చతురులగు మంత్రులు రాజుయొక్క ఆస్థితినిగాంచి ఆతని మనోభావమును, నిశ్చయమును గ్రహించిరి. ఆకార, ఇంగితములచే మంత్రివర్యులు రాజుయొక్క వివాహసంకల్పము నెఱుఁగఁగల్గిరి. వారు తమలోఁదాము ఆలోచించుకొని రాజుయొక్క అనురాగమెటులున్నది. వధువుయొక్క గుణశీలము లెట్టివి. మున్నగు విషయములను విచారించి సురాష్ట్రపతిని, యువతియు, చేటికాజన (పనికత్తెలచే) పరివృతయునగు ఆతని కన్యక (చూడాల)ను తమరాజునకిచ్చి వివాహమొనర్ప ప్రార్థించిరి. అతఁడు సమ్మతింప, అటుపిమ్మట శిఖిధ్వజుఁడు కేవలము తనప్రతిమ యనఁదగి, ఆత్మానురూపయై యున్న సురాష్ట్రరాజకన్యకను వివాహము చేసికొనెను.

చూడాలయను ఆసతి మిగుల సౌందర్యము గల్గియుండెను. ఆమె శిఖిధ్వజుని భర్తగ బడసి వికసించిన పద్మసరస్సువలె శోభింపసాగెను. సూర్యుఁడు పద్మినిని వికసింపఁజేయునట్లు శిఖిధ్వజుఁడు చూడాలయెడల అనురాగమును జూపి ప్రీతిచే నామెను వికసితమొనర్చెను. అంత, అన్యోన్యార్పిత చిత్తులగు వారిప్రీతి క్రమముగ వర్ధిల్లసాగెను. హావభావవిలాసాది శృంగారచేష్టలతోఁగూడి చూడాల శోభిల్లఁదొడఁగెను. రాజచిత్తానువర్తులగు మంత్రులు వారికి భోగోపకరణములను సమకూర్చసాగిరి. రాజ్యభారమును మంత్రులు వహించి అర్థులను సంతోషపెట్టసాగిరి. ధర్మబుద్ధులగు ఆమంత్రివర్యుల పాలనయందు ప్రజలు శాంతులై వెలయఁదొడఁగిరి.

రాజహంస ఇవాబ్జిన్యాం రేమే దయితయా తయా

అన్తఃపురేషు దోలాసు లీలాకమలినీషు చ. 39
ఉద్యానేషు విహారేషు లతాపుష్పగృహేషు చ
కదమ్బవనలేఖాసు చన్దనాగురు వీథిషు. 40
మన్దారదామలోలాసు కదలీకన్దలీషు చ
పురాన్తేషు వనాన్తేషు దిగన్తేషు సరస్సు చ. 41
జఙ్గలేషు జనాన్తేషు జమ్బూజమ్బీరజాతిషు
బభూవాహ్లాదకం సర్వం తయోరన్యోన్య చేష్టితమ్. 42
సద్వర్షయోర్ధురవర్తైర్ద్యుభూమ్యోరివ కాన్తయోః
నిత్యమేవ వియుక్తత్వాత్ప్రియత్వాచ్చేష్టితస్య చ. 43
మిథః కలాకలాపస్య కోవిదౌ తౌ బభూవతుః
స్వరూపమేకమేవైతౌ దధతుర్మిత్రతాం గతౌ. 44
అన్యోన్యహృదయస్థత్వాదివ సంక్రాన్తమక్షతమ్
సర్వశాస్త్రార్థవైదగ్ధ్యం చిత్రాద్యపి ముఖాత్ప్రభోః. 45
బాలా కాలాదివాగృహ్య సాఽసీత్సర్వార్థపణ్డితా,
నృత్యవాద్యాది యావచ్చ చూడాలావదనాదసౌ. 46
అశిక్షత బభూవాథ కలానామతికోవిదః
అమావాస్యామివేన్ద్వర్కావన్యోన్యవిలసత్కలౌ. 47
మిథో హృదయసంస్థౌ తౌ ద్వావప్యైక్యముపాగతౌ
తౌ సంస్థితావేకరసావన్యోన్యం దయితావుభౌ. 48
పుష్పామోదావివాభిన్నౌ భూతలస్థౌ శివావివ,
వైదగ్ధ్యసున్దరమతీ సర్వశాస్త్రార్థపణ్డితౌ. 49
కార్యార్థం చ భువం ప్రాప్తౌ కమలాకమలాధవౌ
స్నేహాత్ప్రసన్నమధురౌ సమవిజ్ఞాతవాదినౌ. 50
అనువృత్తిపరావాస్తాం లోకవృత్తాన్తతద్విదౌ
కలాకలాపసంపన్నౌ లసద్రసరసాయనౌ
శీతలస్నిగ్ధముగ్ధాఙ్గౌ శశాఙ్కావివోదితౌ. 51

ఆ శిఖిధ్వజుఁడంత, హంస కమలినితో క్రీడించునట్లు, తనభార్యతోఁగూడి అంతఃపురముల తూఁగుటుయ్యెలలందును లీలాకమలములందును, ఉద్యానవనములందును, విహారప్రదేశములందును, లతాపుష్పగృహములందును, కదంబవన సమూహములందును, చందనాగురు వృక్షసుగంధితములగు వీథులందును, మందారదామ చంచలములును, కదళీకందళీవృక్ష విరాజితములునునగు స్థలములందును, పురాంతప్రదేశములందును, వనాంతములందును, దిగంతములందును, సరోవరములందును, అరణ్యములందును, జనస్థానములందును, జంబూజంబీరజాతివృక్షశోభితములగు అరణ్యములందును, విహరించుచు క్రీడింపఁదొడఁగెను.

ఎద్దులచే దున్నఁబడిన పొలమున చక్కఁగ వాన కురిసి పైరు మొలకెత్త, మబ్బుతోఁగూడిన ఆకసము, పైరుచే పచ్చనైన నేల, రమణీయమగు శోభను దాల్చినట్లు, సుందరులగు ఆదంపతులిర్వురి కార్యములున్ను అత్యంతానందజనకములై యుండెను. వారెప్పుడును ఒకరిని విడిచి మఱియొకరుండెడు వారుకారు. ఒకరొనర్చినది మఱియొకరికి ప్రీతికరముగ నేయుండెడిది. ఒకరికితెలిసిన కళలను మఱియొకరు నేర్చుకొనినందున, వారిర్వురును సర్వకళావేత్తలైరి. ఇట్లు గుణసామ్యమును బడసి, మైత్రినంది వారు అభిన్నస్వరూపులైరి. ఒకరిహృదయము మఱియొకరికి నివాసమైనందువలన ఒకేజీవి రెండు శరీరములను దాల్చి విహరించుచున్నదా యనునట్లుండెను.

బ్రాహ్మణ-వటువు (బ్రహ్మచారి) శాస్త్రనియమితమగు పండ్రెండు వత్సరముల పరిమితిగల కాలమున వేదవిద్యను గ్రహించునట్లు, చూడాల సర్వశాస్త్రార్థపాండిత్యమును, చిత్రాదిశిల్పములందలి ప్రావీణ్యతను, ఆయావిషయములందు నేర్పరులగు వారికడ నేర్చియుండెను. శిఖిధ్వజుఁడామె వద్దనే నృత్యవాద్యాది కళావిద్యల నన్నిఁటిని గ్రహించెను. అట్లు గ్రహించియే కళావిశారదుఁడయ్యెను. అమావాస్యయందు సూర్యచంద్రు లిర్వురునుగూడి, వారివారి కళలు కలియ, వెలుగొందునట్లు, ఆదంపతులు పరస్పరము కళావిద్యల గ్రహించి అభిన్నహృదయులై, ఐక్యమును బొందిరి. పరస్పరానురాగ శోభితులగు ఆసతీపతులు, పాలును, నీరును కలియునట్లు కలిసి, ఏకరసస్వరూపులై, పుష్ప సౌరభము లవలెను, పృథివిపై అవతరించిన పార్వతీపరమేశ్వరులవలెను అభిన్నులై వెలయఁదొడఁగిరి. ఇట్లు వైదగ్ధ్య (నేర్పుసుందరమగు బుద్ధి)తోడను, సర్వశాస్త్రార్థ పాండిత్యముతోడను వెలయు ఆదంపతులు ధర్మరక్షణార్థము అవతరించిన లక్ష్మీనారాయణులవలె నుండిరి. పరస్పరానురాగవశమున వారుప్రసన్నులై, మధురభాషులైయుండిరి. సందిగ్ధవిషయములను, లౌకికశాస్త్ర విషయములను ప్రశ్నింప ఒకేకాలమున వారిర్వురును ప్రశ్నలన్నిటికిని సమాధాన మీయఁగలిగియుండిరి. వారిరువురును గురు, ద్విజుల యెడల వినయమును, హితవాక్యముల, బల్కుటమున్ను గాఁగల సద్వ్యవహారమును జూపుచుండిరి. వారు లోకవృత్తాంతమును, ధర్మరహస్యమును గ్రహించియుండిరి. కళాకలాపసంపన్నులగు వారియందు నవరస-అమృతము స్ఫురింప, శీతల స్నిగ్ధముగ్ధ చంద్రబింబములవలె వారు ప్రకాశించుచుండిరి.

రేజే లసచ్ఛ రతిభోగవిలాసకాన్త
మన్తఃపురేషు మిథునం తదనుత్తమశ్రి
బ్రహ్మాణ్డఖణ్డకుహరేష్వివ రాజహంస
యుగ్మం వికాసిమదమన్థమన్దచారి. 52

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థేచూడాలోపాఖ్యానే శిఖిధ్వజ విలాసకథనంనామ సప్తసప్తతితమః సర్గః ॥ 77 ॥

సత్యలోకమునందలి గంభీరసరోవరములందు మదనమదోన్మత్తములును, మృదుమంద గతియుక్తములునునగు హంసమిథునము విరాజిల్లునట్లు, సర్వోత్కృష్టమగు సౌందర్యముతో నొప్పారు ఆదంపతులిర్వురును అంతఃపురమధ్యమున రతిభోగ విలాసములతో విహరించుచు వెలయఁబొల్చిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజవిలాసకథనమను డెబ్బదియేడవ సర్గము ॥ 77 ॥

---

## అష్టసప్తతితమః సర్గః॥

[తయోః క్రమేణ వైరాగ్యం సచ్ఛాస్త్రాభ్యాసనిష్ఠతా
చూడాలాయా వివేకోఽత్ర జ్ఞానలాభశ్చ వర్ణ్యతే.

క్రమముగ ఆచూడాలా శిఖిధ్వజులకు వైరాగ్యము కలుగుట, సచ్ఛాస్త్రముల నభ్యసించుట, చూడాలయొక్క వివేకము, జ్ఞానప్రాప్తి, అనువిషయము లీసర్గమున వర్ణింపఁబడుచున్నవి ]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

ఏవం బహూని వర్షాణి మిథునం నిర్భరస్పృహమ్
రేమే యౌవనలీలాభిరమన్దాభిర్దినే దినే. 1

**శ్రీవసిష్ఠుఁడు:—** ఓ రామచంద్రా! ఈప్రకారముగ ప్రగాఢప్రేమబద్ధులగు ఆ దంపతులు ఏండ్లతరబడిగ ఎడతెంపులేని యౌవనలీలలందు క్రీడించుచుండిరి.

అథ యాతేషు బహుషు వర్షేష్వావృత్తిశాలిషు
శనైర్గలితతారుణ్యే భిన్నకుమ్భాదివామ్భసి. 2

అనంతరము చాలఏండ్లు గడవ, ఛిద్రయుక్త ఘటమునుండి నీరు మెల్లగ కారిపోవునట్లు, వారి యౌవనముకూడ దిగజారిపోవఁదొడఁగెను. అప్పుడు వారిట్లు విచారణయొనర్పఁదొడఁగిరి.

తరఙ్గనికరాకారభఙ్గురవ్యవహారిణి
పాతః పక్వఫలస్యేవ మరణం దుర్నివారణమ్. 3

'ఈ జీవుఁడు తరంగసమూహమువలె భంగుర (క్షణిక) మగు శరీరమును గైకొని వ్యవహారపథమున పరిభ్రమించుచున్నాఁడు. ఫలము పక్వమైన, రాలిపోవుట అనివార్యమైనట్లు శరీరమునకు వినాశనముకూడ తప్పనిసరి.

హిమాశనిరివామ్భోజే జరా నిపతనోన్ముఖీ
ఆయుర్గలత్యవిరతం జలం కరతలాదివ. 4

ఏలయనిన, పద్మముపై మంచు అను పిడుగు పడునట్లు ఈశరీరముపై వార్ధక్యము పడనుంకించుచున్నది. కరతలజలమువలె ఆయువు అనవరతము క్షయమునొందుచున్నది.

ప్రావృషీవ లతాతుమ్బీ తృష్ణైకా దీర్ఘతాం గతా
శైలనద్యా రయ ఇవ సంప్రయాత్యేవ యౌవనమ్. 5

భోగతృష్ణ యొక్కటియే వర్షాకాలమునందలి సొరతీగవలె పెరుగుచున్నది. వర్షాకాలమునందలి కొండయేటి వడితో యౌవనము పరుగిడుచున్నది.

ఇన్ద్రజాలమివాసత్యం జీవనం జీర్ణసంస్థితిః
సుఖాని ప్రపలాయన్తే శరా ఇవ ధనుశ్చ్యుతాః. 6

శుష్కమగు ఈశరీరము ఇంద్రజాలమువలె అసత్యము. ధనుస్సున సంధింపఁబడి విడువఁబడిన బాణములవలె సుఖములన్నియును పారిపోవుచున్నవి.

పతన్తి చేతో దుఃఖాని తృష్ణా గృధ్ర ఇవామిషమ్
బుద్బుదః ప్రావృషీవాప్సు శరీరం క్షణభఙ్గురమ్ 7

మాంసముమీఁద గ్రద్ద వాలునట్లు, త్రివిధతాపములు, తృష్ణ హృదయమున నావిర్భవించి వ్యథను గలిగించుచున్నవి. వర్షాకాలమునందు నీట కలుగు బుద్బుదములవలె ఈశరీరము క్షణభంగురమైనది.

రమ్భాగర్భ ఇవాసారో వ్యవహారో విచారగః
సత్వరం యువతా యాతి కాన్తేవాప్రియకామినః 8

విచారించి చూచినచో ఈ ప్రపంచమున మనుజుఁడు చేయు కార్యములన్నియును అరఁటిపట్టలవలె సారశూన్యములైయున్నవి. సవతియెడల ప్రేమను జూపు భర్తను గాంచి మానవతియగు యువతి తొలఁగి పోవునట్లు యౌవనముకూడ తొలఁగి పోవుచున్నది.

బలాదరతిరాయాతా వైరస్యమివ పాదపమ్
తదిహ స్యాచ్ఛుభాకారం స్థిరం కిమతిశోభనమ్ 9

గ్రీష్మకాలమున వృక్షరసము ఎండిపోవునట్లు, తాను గోరు విషయములు లభింపకున్న, మనస్సు విరసభావమును బొంది కుందుచున్నది. ఇది సంసారముయొక్క తీరు. ఈ ప్రపంచమున స్థిరమై, సుందరమైనట్టి వస్తువేమి గలదు? అత్యంతశోభాప్రదమగు విషయ మీ ప్రపంచమునలేదు.'—

యదాసాద్య పునశ్చేతో దశాసు న విదూయతే
ఇతి నిర్ణీయ యుగ్మం తత్సంసారవ్యాధిభేషజమ్. 10
చిరం విచారయామాస శాస్త్రమధ్యాత్మసంమతమ్
ఆత్మజ్ఞానైకమాత్రేణ సంసృత్యాఖ్యా విషూచికా 11
సంశామ్యతీతి నిశ్చిత్య తావాస్తాం తత్పరాయణౌ
తచ్చిత్తౌ తద్గతప్రాణౌ తన్నిష్ఠౌ తద్వ్యపాశ్రయౌ. 12
తదా తదర్చనపరౌ తదీహౌ తౌ విరేజతుః
తత్రైవాతిఘనాభ్యాసౌ బోధయన్తౌ పరస్పరమ్. 13
తత్ప్రీతౌ తత్సమారమ్భావన్యోన్యం తౌ బభూవతుః
అథ సావిరతం రామ రమణీయ పదక్రమాన్. 14
శ్రుత్వాధ్యాత్మవిదాం వక్త్రాచ్ఛాస్త్రార్థాంస్తారణక్షమాన్
ఇత్థం విచారయామాస స్వమాత్మానమహర్నిశమ్, 15

బుద్ధీంద్రియములుకూడ ఇట్లే శరీరావయవములై నందువలన జడములేయని తెలుచున్నది. *

ప్రేర్యతే మనసా యస్మాద్దృష్టత్వేవ భువి లోష్టకః
మనస్త్వైవం జడం మన్యే సంకల్పాత్మక శక్తియత్. 20

భూమిపై కఱ్ఱచే రాతివలె, మనస్సుచే జడమగు శరీరము చలించుచున్నది. కావున మనస్సు కఱ్ఱవలె సంయోగ-యోగ్యమగు ద్రవ్య (పదార్థ) మని తెలుచున్నది. కాని దీనికి సంకల్పాత్మకమగు శక్తి యొకటియున్నది. ఈశక్తి 'జడము' యొక్క గుణమగుటవలన దీనినిగూడ జడమే యనవలసియున్నది.

క్షేపక్షైరివ పాషాణః ప్రేర్యతే బుద్ధినిశ్చయైః
బుద్ధినిశ్చయరూపైవం జడా సత్త్రైవ నిశ్చయః. 21

కఱ్ఱచే రాతివలె, నిశ్చయాత్మికమగు బుద్ధిచే ఈశరీరాదులు ప్రేరేపింపఁబడుచున్నవి. అందువలన కఱ్ఱను బోలు ఈబుద్ధికూడ జడమగుచున్నది. ఈవిషయమున సందేహము లేదు.

ఖాతేనేవ సరిస్నానం సాహంకారేణ వాహ్యతే
అహంకారోఽపి నిఃసారో జడ ఏవ శవాత్మకః 22

పల్లపుతావు నదియందలి నీటిని ప్రవహింపఁజేయునట్లు అహంకారము బుద్ధిని ప్రేరేపించుచున్నది. ఈ అహంకారము సారశూన్యమును, శవమువలె జడమునుగూడనై యున్నది.

జీవేన జన్యతే యక్షో బాలేనేవ భ్రమాత్మకః
జీవశ్చ చేతనాకాశో వాతాత్మా హృదయే స్థితః. 23

బాలుఁడు యక్ష (బేతాళ) భ్రమను గల్పించుకొనునట్లు ప్రాణోపాధితోఁగూడిన చిదాకాశమగు జీవుఁడు జీవత్వమును తనయందు కల్పించుకొనుచున్నాఁడు. వాస్తవమున జీవుఁడు ప్రాణోపాధికమగు చిదాకాశముమాత్రమే యైయున్నాఁడు. కల్పిత జీవుఁడుకూడ జడమే యని గ్రహింపవలెను.

సుకుమారోఽన్తరన్యేన కేనాపి పరిజీవతి
అహో ను జ్ఞాతమేతేన చేతో్యల్లేఖకలఙ్కినా. 24

సుకుమారుఁడగు ఈ జీవుఁడు తన ఆభ్యంతరమునసున్న బింబచైతన్యముచే మాత్రమే జీవించుచున్నాఁడు. ఆహా! విషయప్రకాశనమను కళంకముచే దూషితప్రాయమైయున్న సాక్షిచైతన్య మీతని నెఱిఁగినది!

జీవో జీవతి జీర్ణేన చిద్రూపేణాత్మరూపిణా
చేత్యభ్రమవతా జీవశ్చిద్రూపేణైవ జీవతి. 25

నిత్యమై ఆత్మరూపమైనట్టి చిత్స్వరూపమువలననే జీవుఁడు జీవించుచున్నాఁడు. ... రూపమున విషయములఁ బ్రకాశింపఁజేయు ఆ చిద్రూపునివలననే జీవుఁడు జీవించుచున్నాఁడు.

---

* బాదరాయణుఁడు 'అణవశ్చ' (బ్రహ్మ॥సూ॥) అను సూత్రమున ఇంద్రియములు, ప్రాణములు మున్నగువానిని 'స్థూలదేహావయవములు కావు, లింగదేహావయవములు' అని సిద్ధాంతీకరించెను.

ఆమోదః పవనేనేవ ఖాతేనేవ సరిద్రయః
అసత్యజడ చేత్యాంశచయనాచ్చిద్వపుర్జడమ్. 26

వాయువువలన సౌరభము జీవించుచున్నది; పల్లపుతావే నదీప్రవాహమునకు ఉజ్జీవనము. ఆశ్లేష్ఠ (దృశ్య) విషయముల భ్రమనుగూను చిద్రూపమే జీవునకు జీవనమైయున్నది. అనఁగా తాదాత్మ్య-అధ్యాసమే చైతన్యమును జడముగ మార్చి జీవభ్రాంతిని కల్పించుచున్నది.

మహాజలగతో హ్యగ్నిరివ రూపం స్వముజ్ఝతి
సద్వాసద్వా యదాభాతి చిత్సమాధావపతి స్వతః. 27
స్వరూపమలముత్సృజ్య తదేవ భవతి క్షణాత్
ఏవం చిద్రూపమప్యేతచ్చేత్యోన్ముఖతయా స్వయమ్. 28
జడం శూన్యమసత్కల్పం చైతన్యేన ప్రబోధ్యతే
ఇతి సంచిత్య చూడాలా కైనైషా చిత్ప్రచేతనీ. 29
ఇతి సంచిన్తయామాస చిరాయేత్థం వ్యబుధ్యత
అహో ను చిరకాలేన జ్ఞాతం జ్ఞేయమనామయమ్. 30

సముద్రజలములఁ బడిన అగ్ని తనప్రకాశస్వరూపమును విడచునట్లు, చైతన్యముకూడ ఉపాధిసంపర్కమువలన స్వస్వరూపమును పరిత్యజించుచున్నది. ఎట్లనిన, సత్తాంశము, చిత్స్వభావమునుండి వేఱుపడి ఘటపటాదులసత్తతో ఏకీభావమును బొందినట్లగుపడుచున్నది. చిత్సత్తయే ఘటము మున్నగువాని సత్త. ఘటాదులు ధ్వంసమైంది మృత్తికతో, గలిసిపోవ మరల ఈచిదాకాశమే ఘటపటాదుల శూన్యసత్తగ (అవిశేషు అనుభావముగ) మారి అభావస్వరూపమగుచున్నది. కాని, సమాధిదశ లభించిన వాసనలవలన అరుదెంచునవియును, ఆసక్తివలన సదసద్రూపములను ధరించునవియునునగు విషయముల నన్నిటిని పరిత్యజించి వెనువెంటనే ఈచైతన్యము చిదాకారమునే దాల్చుచున్నది. ఈరీతిగ, చైతన్యమే విషయముల వైపునకు మరలి అవిద్యావరణమువలన అధ్యాస సమూహములచే స్వయముగ జడమును, శూన్యమును నగు అసద్రూపమగుచున్నది. మరల అదియే జ్ఞానముచే మూలావిద్యను వినాశమొనర్చి ప్రబుద్ధమగుచున్నది. ఇట్లు విచారించి ఏ యుపాయము నవలంబించిన, అవిద్యావరణము తొలఁగి దృశ్యస్వప్నము నశించి చైతన్యమునకు ప్రబోధము లభింపఁగలదు! అనియామె చింతింపఁదొడఁగెను. పిదప చిరకాలమునకు ఆమె ఆత్మతత్త్వమును ఈ వర్ణింపఁబోవు విధమున గ్రహించి, ఇట్లను కొనఁదొడఁగెను-ఆహా! ఎట్టి అదృష్టము! నిర్మలమగు జ్ఞానమును చాలకాలమునకు పిదప నేనిపుడు గ్రహింపఁగలిగితిని!

యద్వైవ విజ్ఞేయతాం కృత్వా న కశ్చిద్ధీయతే పునః
ఏతే హి చిద్విలాసాన్తా మనోబుద్ధీన్ద్రియాదయః. 31

---

యున్నను పండిత, పామరులకవి స్థూలదేహావయవములుగనే తోఁచుచున్నందువలనను, అవయవముల వలె శరీరమున సంయుక్తములై యున్నందువలనను, అవయవములవలె వీని జడత్వముకూడ సిద్ధించుచున్నది.—ఆనందసరస్వతీ టీక.

ఈ ఆత్మతత్త్వమును గ్రహింపఁగలిగిన, మరల ప్రచ్యుతి యనునది యుండదు. (దీని స్వరూపము సర్వకామ నాప్రాప్తియగుటవలన నెట్టి కామనయు కొంచెమవడదు.) మనస్సు బుద్ధి, ఇంద్రియములు మున్నగునవి చిద్విలాసముయొక్క పరిచ్ఛేదమునకు హేతువులైయున్నవి.

అసన్నః సర్వ ఏవాహో ద్వితీయేన్దువదస్థితా
మహాచిదేకైవాస్తీహ మహాసత్తేతి యోచ్యతే. 32

అసత్తగు ఈ ప్రపంచమంతయు ద్వి-చంద్రభ్రాంతివలె కేవలము కల్పితమాత్రమే యగుచున్నది. వాస్తవముగ నిట మహాసత్తయనఁబడు మహాచైతన్య మొక్కటి మాత్రమే వెలయుచున్నది.

నిష్కలఙ్కా సమా శుద్ధా నిరహంకారరూపిణీ
శుద్ధసంవేదనాకారా శివం సన్మాత్రమచ్యుతమ్. 33

అయ్యది కళంకరహితము, సమస్వరూపము. శుద్ధము, అహంకారవివర్జితము; శుద్ధసంవేదనమే దానిస్వరూపము. అయ్యది భూమానంద స్వరూపమగుటవలన పరమ మంగళమయము సన్మాత్రము, అది స్వస్వరూపమగు భూమానంద-మంగళ స్వభావమునుండి విచ్యుతిగానందువలన అచ్యుతమనఁబడుచున్నది.

సకృద్విభాతా విమలా నిత్యోదయవతీ సదా
సా బ్రహ్మపరమాత్మాదినామభిః పరిగీయతే. 34

ఒక్కసత్యాయము అవిద్యావరణము తొలఁగ, ప్రకాశించునదియు, పవిత్రమును, నిత్యోదయసహితమై వెలయుచుండు నదియునగు ఆచిద్వస్తువే బ్రహ్మ, పరమాత్మయున్నగు నామములచే వేదాంతాది అధ్యాత్మశాస్త్రములందు లక్షణద్వారా పేర్కొనఁబడుచున్నది.

చేత్య చేతన చిత్తాది నాస్య భిన్నం నమానతః
తయైషా చేత్యతే చిచ్ఛ్రీః సైషాద్యా చిదితి స్మృతా. 35

చిత్తము, చేత్యము (దృశ్యము), చేతనము, అను త్రిపుటి ఈమహా చైతన్యముకంటె వేఱుకాదు. సాక్షిభూతమగు ఈమహా చైతన్యమే ఈత్రిపుటికి చైతన్యమును ప్రసాదించుచున్నది, ఈచైతన్యమువలననే నియ్యది (త్రిపుటి) చేతితమై, అనుభూతిని బొందుచు, కర్తృత్వమును బడయుచున్నది. మహాచైతన్యములేకున్న త్రిపుటి స్వతంత్రముగ నేమియు నొనర్పఁ జాలదు, అనుభవింపఁజాలదు. ఈ సాక్షి-చైతన్యము త్రిపుటియొక్క ఆవిర్భావమునకు పూర్వమే యుండుటవలన, (స్వతఃసిద్ధమగుటవలన)—'ఆద్య-చిత్' అనఁబడుచున్నది. దీనియునికి తత్త్రిపుటీ జనితములగు ప్రమాణములపై ఆధారపడదు.

అచేత్యం యదిదం చిత్త్వం తత్తస్య రూపమక్షతమ్
మనోబుద్ధీన్ద్రియాద్యర్థరూపైః సైవ విజృమ్భతే. 36

విషయరహితమగు చిత్త్వమే (చిద్రూపమే) సాక్షియగు ఈమహా చైతన్యముయొక్క శుద్ధ, అక్షయ స్వరూపము. ఈమహాచైతన్యమే మనోబుద్ధీంద్రియములుగను, ఇంద్రియగోచరములగు విషయములుగను వివర్తితమగుచున్నది.

తరఙ్గకణకల్లోలకలనేయం చిదాత్మని
జగద్రూపపదార్థానాం సత్తా స్ఫురతి మాతరి. 37

వివర్తితమగు చిదాత్మ మనోబుద్ధ్యాదులుగ మారి ప్రమాతృభావమును బొందినతోడనే జగత్తనఁబడు భూతభౌతికపదార్థములను కల్పనా-తరంగముల సత్తస్ఫురించుచున్నది.

యదిదం తత్పరం రూపం తస్యాః ఖలు మహాచితేః
శుద్ధచిన్మణివత్సా హి సేయం సమసమోదితా. 38

ఈ జగత్-సత్తగ ప్రసిద్ధినందిన పదార్థము, అధిష్ఠానభూతమగు మహాచైతన్యముయొక్క రూపాంతరమమాత్రమే అయియున్నది. ఈ చిత్-బ్రహ్మమునకు మూర్తము. అమూర్తము అను ద్వివిధరూపములున్నవి. ఈచైతన్యమే స్ఫటికమణివలె, సంయుక్తము కాకుండఁగనే, నిర్లిప్తముగ నుండియే ప్రతిబింబమును గ్రహించుచున్నది. కనుక నియ్యదియే జగత్సత్తగను, ప్రాతిభాసిక, వ్యావహారిక సత్తలుగను స్ఫురించుచున్నది.

అనన్యయైవ యా శక్త్యా జగజ్జృమ్భికయా స్థితా
సత్తా మాయాతిరేకేణ నాన్యా సంభవతీహ హి. 39

జగత్సత్త అధిష్ఠానమగు ఈమహాచైతన్యముయొక్క వివర్తశక్తి వలన నేనిలఁబడియున్నది. కావున మాయకంటె వేఱుగ ఈజగత్తుయొక్క సత్త సంభవింపఁజాలదు.

విచిత్రతేవ భాణ్డానాం నను హేమతయా యథా
సా తథోదేతి తద్రూపమాత్మానం చేతతి స్వయమ్. 40

స్వర్ణనిర్మితములగు అలంకారముల వైచిత్ర్యము అయ్యవి వినష్టములైనతోడనే నశించి స్వర్ణముగనే ఎట్లు పరిణమించుచున్నదో, అట్లే ఈజగత్సత్తకూడ ప్రళయమున నామరూపములు నిర్మూలమైన మాయాశబలితె-బ్రహ్మసత్త-సత్తగ శేషించుచున్నది. మాయ బాధితమైన, అది ఆనందైకరసస్వరూపముగు ఆత్మసత్తగనే తన్ను స్వయముగ ననుభవించుచున్నది.

స్వచిత్తేన ద్రవత్వేన తరఙ్గాదిత్వమమ్బుపు
మహాచితౌ జగచ్చిత్తాదుదేతీవానుదేత్యపి. 41

స్వప్నము, ఇంద్రజాలము మున్నగు స్థితులయందున్న మనస్సే సముద్రమగుచున్నది. మఱియు, ఆసముద్రము తరంగహీనమే అయినను, అందు తరంగములు లేచుచున్నవి. అట్లే మహాచైతన్యమున సమష్టి-చిత్తము (హిరణ్యగర్భుని) నుండి ఈజగత్తు ఉదయింపకున్నను ఉదయించినట్లే తోఁచుచున్నది.

తదాత్మైవ యథా యాతో రూపవాన్ జలధౌ ద్రవాత్
ఏవం చిన్మాత్రమేవాహమనహంభావమాత్రతమ్. 42

స్వప్నేంద్రజాలములందు చిద్రూపమగు ఆత్మయే చిత్తకల్పితమగు జలమై, తరంగాది రూపములను దాల్చినను, అందు ఆత్మకంటె వేఱేమియును లేనట్లు, ఈ జగద్భానమునఁగూడ పూర్ణచిదాత్మనగు నాకంటె వ్యతిరిక్తముగ ఏమియునులేదు. కావున అనహంభావరూపమగు చిన్మాత్రమే సర్వత్ర వ్యాప్తమైయున్నదగును.

న తస్య జన్మమరణే న తస్య సదసద్గతీ
న నాశః సంభవత్యస్య చిన్మాత్రనభసః క్వచిత్. 43

ఈ చిన్మాత్ర స్వరూపమునకు జననమరణములు లేవు. స్వర్గనరకాది రూపములగు ఉత్తమాధమగతులున్ను లేవు. అపరిచ్ఛిన్నమగు ఈచిన్మాత్రాకాశమునకు ధ్వంస మెన్నటికిని గలుగదు. ధ్వంసమే అట అసంభవము.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయం చిదాదిత్యోఽతినిర్మలః
అహో ను చిరకాలేన శాన్తాస్మి పరినిర్వృతా. 44

ఈ చిత్-సూర్యుడు అత్యంత నిర్మలుడు. ఇతనికి ఛేదన, దహనములు లేవు, నేడెట్టి అదృష్టము! శాంతిని నిర్వృతిని నేను బడసితిని.

నిర్వామి భ్రమనిర్ముక్తమాసే నిర్మన్దరాబ్ధివత్
అసదాభాసమత్యచ్ఛమనన్తమజమచ్యుతమ్. 45

నేడు భ్రమరహితమగు నిర్వాణమును బొందుచున్నాను. మందరపర్వతము లేని సముద్రము వలె నేనిపుడు నిశ్చలభావమున వెలయుచున్నాను. ఈ ఆత్మాకాశమున దృశ్యాభాస అనునదేమియును లేదు. ఇది అత్యంత నిర్మలము, అజము (జన్మరహితము) అచ్యుతము.

ఆత్మాకాశమనాబాధమమలం పరమం చిరమ్
అనన్తమిదమాకాశం ఫలౌఘాశ్చ ఫలాదికాః 46

ఇయ్యది బాధారహితమును, నిర్మలమును, పరమమును, దేశ కాలవస్తుపరిచ్ఛేదశూన్యము నైయున్నది. ఇది అనంతము; బ్రహ్మాది స్తంబపర్యంతముగ వెలయు ప్రాణులున్ను వాని కర్మఫలములున్ను తత్సాధన వ్యాపారములున్ను నిష్ఫలచేష్టాదులున్ను ఆత్మాకాశరూపములే అయియున్నవి. ఏలయనిన, ఇదంతయును ఆత్మాకాశముతప్ప వేఱేమియును గాదు

సురాసురయుతం విశ్వమేతన్మయమకృత్రిమమ్
పుంస్త్వకర్మమయీ సేనా సర్వాం మృన్మాత్రకం యథా. 47

సురాసురయుక్తమగు ఈ విశ్వమంతయు ఆత్మాకాశమయమే. అందువలన ఇయ్యది (జగత్తు) అకృత్రిమమగు మహాచైతన్యమే యగుచున్నది. కుమ్మరివానిచే నిర్మింపబడిన సైన్యపు బొమ్మలున్ను, వాని చలనములున్ను మృణ్మయములే యగుచున్నవిగదా!

ద్రష్టృదృశ్యమయీ సత్తా చిన్మాత్రైక్యమయీ తథా
ఇదమైక్యమిదం ద్విత్వమహం నాహమితీతి చ. 48
క ఇవ భ్రమసంమోహాః కథం కస్య కుతః క్వ వా
స్వమనన్తమనాయాస ముపశాన్తాస్మి సంస్థితా. 49

అట్లే ద్రష్టృదృశ్యమయమగు ఈ జగత్తుయొక్క సత్తకూడ చిన్మాత్రమయమేయగుచున్నది. ఏకత్వము, ద్విత్వము, అహంకారము, తదితరములు మున్నగు భ్రమసమూహము లేమి? ఇవి యెవరికున్నవి?

ఎందువలన ఎచటనుండి ఇవి అరుదెంచుచున్నవి (అనఁగా ఇవి అత్యంతతుచ్ఛములు! ఆత్మయే సత్యము అని భావము) ఇప్పుడు నేను అనంతమగు పారమార్థికస్వరూపమును బడసి శాంతిని బొంది వెలయు చున్నాను.

నిర్వాణపరినిర్వాణా గతమానే గతజ్వరమ్
అచేతనం చేతనం వా యో౽యమాభాతి చేతతి. 50
భాసమానాత్మ తద్రూపం ఖం మహాచితి సంస్థితమ్
నేదం నాహం న చాన్యచ్చ న భావాభావసంభవః
శాన్తం సర్వం నిరాలమ్బం కేవలం సంస్థితం పరమ్. 51

నేనిప్పుడు మోక్షసుఖమును బొంది భవజ్వర విరహితనై స్వస్వరూపముననే వెలయుచు న్నాను. ద్యోతకములగు చేతనాచేతనములును, తద్భోక్తయును, ఆత్మాభిన్నములై ఆత్మాకాశముననే వెలయుచున్నవి. ఇదంత్వ, అహంత్వ, అన్యత్వములు బ్రహ్మముకావు. బ్రహ్మవస్తువు శాంతమును, నిరా లంబమును, కేవలము (శుద్ధము)ను, పరస్వరూపమును, సర్వమునునై వెలయుచున్నది.

ఇత్థం విచారణపరాపరమప్రబోధా
ద్బుద్ధ్వా యథాస్థితమిదం పరమాత్మతత్త్వమ్
సంశాన్తరాగ భయమోహతమోవిలాసా
శాన్తా బభూవ శరదమ్బరలేఖికేవ. 52

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే చూడాలోపాఖ్యానే చూడాలప్రబోధో నామ అష్టసప్తతితమః సర్గః ॥ 78 ॥

చూడాల యిట్లు విచారణయొనర్చి ఆత్యంతిక మోహనివృత్తియగుటవలన యథాస్థితమగు పరమాత్మతత్త్వమును గ్రహింపఁగలిగెను. అప్పుడా చూడాలయొక్క రాగ, భయ, మోహ, తమోవిలా సములు అనఁగా అవస్థాత్రయస్వప్నము నివృత్తమయ్యెను. అప్పుడామె శరత్కాలాకాశమండలము వలె నిర్మలశాంతస్వరూపమున విరాజిల్లఁదొడఁగెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున చూడాలాప్రబోధమను డెబ్బదియెనిమిదవ సర్గము ॥78॥

---

## ఏకోనాశీతితమః సర్గః

[అపూర్వశ్రీమతీ దృష్ట్వా పృష్టయా ధరణీభృతా
చూడాలయా స్వశోభాయా హేతురాత్మేతితో౽త్ర వర్ణ్యతే.

మిగుల శోభావతియై చెన్నొందుచుండిన చూడాలను గాంచి, ఆపె శోభకు కారణమేమి యని రాజడుగుటయు, అందుల కాత్మజ్ఞానమే కారణమని యామె వచించుటయు నిటఁ గానఁగును.

శ్రీవసిష్ఠ ఉవాచ:-

దినానుదినమిత్యేషా స్వాత్మారామతయా తయా
నిత్యమన్తర్ముఖతయా బభూవప్రకృతిస్థితా. 1

శ్రీవసిష్ఠుడు :— ఓ రామచంద్రా ! ప్రతిదిన మాచూడాల తన ప్రసిద్ధమగు స్వాత్మారామత్వముచేతను, అంతర్ముఖవృత్తిచేతను తన స్వాభావికమైన ఆత్మప్రకృతియందు స్థితిగల్గియుండెను.

నీరాగా నిరుపాసఙ్గా నిర్ద్వన్ద్వా నిఃసమీహితా
న జహాతి న చాదత్తే ప్రకృతాచారచారిణీ. 2

రాగ, ద్వేష, సంగవర్జితయై, నిర్ద్వంద్వయై, ఇచ్ఛారహితయై, యథాప్రాప్తములగు కార్యముల నొనర్చుచు, ఏమియు త్యజింపకయు, గ్రహింపకయు నుండెను.

పరితీర్ణభవామ్భోధిః శాన్తసందేహజాలికా
పరమాత్మమహాలాభ పరిపూర్ణాన్తరాత్మనా. 3
విశ్రాన్తా సుచిరం శాన్తా ఘనలబ్ధపదాన్తరే
సర్వోపమాతీతతయా జగామావ్యపదేశ్యతామ్. 4

సంసారసముద్రమును దాటినదై, సందేహజాలవర్జితయై, పరమాత్మజ్ఞానలాభముచేతను, పరిపూర్ణచిత్తముచేతను, జ్ఞానప్రాప్తమగు పరమపదమున ఆ చూడాల చిరకాలము విశ్రమించెను. మఱియు నుపమానములన్నిఁటికి పరమైయుండుటచే నామె అనిర్వచనీయయై యొప్పెను.

ఇతి సా భామినీ తస్య చూడాలా వరవర్ణినీ
స్వల్పేనైవ హి కాలేన యయౌ విదితవేద్యతామ్. 5

ఇవ్విధమున శ్రేష్ఠవర్ణముగల ఆరాజపత్నియగు చూడాల అత్యల్పకాలముననే ఆత్మజ్ఞానసంయుక్త యయ్యెను.

యథాయమాగతః కశ్చిజ్జాగతః స్వప్నవిభ్రమః
తథా విలీయతే సర్వం తత్త్వజ్ఞానవతి స్వయమ్. 6

అజ్ఞానియందు అకస్మాత్తుగ ఈ సంసారభ్రమ యెట్లు ప్రవేశించుచున్నదో అట్లే జ్ఞానియందది యంతయు శీఘ్రముగ వినాశ మొందుచున్నది.

అదృష్టసకలే శాన్తే పదే విశ్రాన్తిమేత్య సా
రరాజ శరదచ్ఛాభ్రమాలేవ గతసంభ్రమా. 7

సర్వదా ద్వైతరహితమై, శాంతమైనట్టి ఆత్మపదమున విశ్రాంతినొంది, భ్రమరహితయైన చూడాల శరత్కాలస్వచ్ఛమేఘపంక్తివలె శోభిల్లెను.

అనాకులా సమాలోకమసంబన్ధాత్మనాత్మని
జరద్గవీవ శైలాగ్రం సతృణం ప్రాప్య సంస్థితా. 8

పచ్చనిగడ్డి, ఉదకములతోఁగూడిన యెత్తైనపర్వతమును బొందిన వృద్ధగోవు వ్యాకులత్వములేక యుండునట్లు, జాగ్రదాద్యవస్థలం దేకమై, ప్రకాశరూపమై, సాక్షివంతమైనట్టి ఆత్మతత్త్వమును, జాగ్రదాద్యవస్థలచే నసంబద్ధమగు ఆత్మస్వభావముద్వారా ప్రాప్తినొంది, ఆ యాత్మతత్త్వమున చూడాల వ్యాకులత్వరహితయై యుండెను.

స్వవివేకఘనాభ్యాసవశాదాత్మోదయేన సా
శుశుభే శోభనా పుష్పలతేవాభినవోద్గతా. 9

స్వవివేకముయొక్క దృఢాభ్యాసముద్వారా పూర్ణానందస్వరూప మావిర్భవింప చూడాల నూతన పుష్పలతవలె చెన్నొందెను.

అథ తామనవద్యాఙ్గీం కదాచిత్స శిఖిధ్వజః
అపూర్వశోభామాలోక్య స్మయమాన ఉవాచ హ. 10

తదుపరి ఒకసమయమున, అట్టి భవ్యశరీరధారిణియు, అపూర్వశోభాయుక్తయు నగు తన ప్రియురాలిని గాంచి చిఱునగవుతో నా శిఖిధ్వజభూపాలుం డిట్లనియె.

భూయో యౌవనయుక్తేవ మణ్డితేవ పునః పునః
అధికం రాజసే తన్వి జగద్రాజవతీ యథా. 11

ఓ కృశాంగీ! మఱల యౌవనముతోఁగూడిన దానివలెను, మఱలమఱల యలంకరింపఁబడినదానివలెను, పూర్ణచంద్రునితో గూడిన పృథివివలె నీవు అధికశోభాయుక్తమైయున్నావు.

ప్రపీతామృతసారేవ లబ్ధాలభ్యపదేవ చ
ఆనన్దాపూరపూర్ణేవ రాజసే నితరాం ప్రియే. 12

ప్రియా! అమృతము, త్రాగినవానివలెను, లభింపనట్టి ఉత్తమపదమును పొందిన వానివలెను, ఆనందప్రవాహముచే పరిపూర్ణుడైన వానివలెను నీవు మిగుల శోభిల్లుచున్నావు.

ఉపశాన్తం చ కాన్తం చ దధానా సున్దరం వపుః
అభిభూయేన్దుమాయాసి శ్రియం కామపి కామిని. 13

కాంతా! శాంతమై, ప్రియమై, సుందరమైనట్టి శరీరమును ధరించినదానవై, నీవు చంద్రుని శోభను గూడ జయించి భాసిల్లుచున్నావు.

అభోగకృపణం శాన్తమూర్జితం సమతాం గతమ్
గమ్భీరంచ ప్రశాన్తం చ చేతః పశ్యామి తే ప్రియే. 14

ప్రియా! నీచిత్తము భోగాశావర్జితమై, శాంతమై, వివేకముచే బలయుతమై, సమత్వమును బొందినదై, గంభీరమై, ప్రశాంతముగానున్నట్లు నేను పరికించుచున్నాను.

తృణీకృత్య త్రిభువనం పీతాఖిలజగద్రసమ్
అనన్తోడ్డామరం సౌమ్యం మనః పశ్యామి తే ప్రియే. 15

ఓ ప్రియా! నీమనస్సుముల్లోకములఁ దృణముగా నొనర్చి అఖిలజగత్తుయొక్క అమృతమును పానముచేయుచు అనంతమగు యానన్దత్వముతోఁగూడి సౌమ్యముగా వెలయుచున్నట్లు నేను గాంచుచున్నాను.

న కేనచిన్మహాభాగే విభవానన్దవస్తునా
చేతస్తవ తులామేతి మరుక్షీరాబ్ధిసున్దరమ్.　　16

ఓ మహాభాగా! నిర్జలత్వముచే మరుభూమివలెను, పూర్ణత్వముచే క్షీరసాగరమువలెను సుందరమైనట్టి నీచిత్తము ఏవిభవముతోడను, ఆనందదాయకమగు వస్తువుతోడను పోల్పబడజాలదు.

త్రైరేవ బాలకదలీమృణాలాఙ్కురకోమలైః
అఙ్గైః స్థితిమనుప్రాప్తైర్వృద్ధిం యాతేవ లక్ష్యసే.　　17

నూతన కదళీవృక్షముయొక్కయు, కమలముయొక్కయు అంకురములవంటి ఆ నీపూర్వపు అవయవములతోఁ గూడియున్నను అధిక తేజస్సుచే యింకను వృద్ధినిపొందినట్లుగ నీవుకన్పట్టుచున్నావు.

తథా తేనైవ తేనైవ సంనివేశేన సంస్థితా
అన్యతాముపయాతాసి లతేవ ఋతుపర్యయే.　　18

ఆ పూర్వకాలపు అవయవముల రచనతోఁ గూడియున్నను, శిశిరఋతువు గడచిన పిమ్మట లతవలె నీవు అన్యముగానే తోఁచుచున్నావు.

కిం త్వయా పీతమమృతం ప్రాప్తం సామ్రాజ్యమేవ వా
అమృత్యుమేవ సంప్రాప్తా ప్రయోగాద్యోగయుక్తితః.　　19

ఓ ప్రియా! నీ వమృతమేమైన ద్రాగితివా? లేక సామ్రాజ్యమును బొందితివా? లేక రసాయన మంత్రాదుల ప్రయోగముచేతగాని, హఠయోగాది యుక్తులచేగాని మృత్యురహితపదవిని బొందితివా?

రాజ్యాచ్చిన్తామణేర్వాపి త్రైలోక్యాద్వా త్వయాధికమ్
అప్రాప్తం కిమనుప్రాప్తం నీలోత్పలవిలోచనే.　　20

నీలకమలములవంటి నేత్రములుగల ఓ ప్రియా! రాజ్యముకంటెను చింతామణికంటెను, త్రైలోక్యముకంటెను నధికమైన ఏయప్రాప్తవస్తువును నీవు పొందితివి?

**చూడాలోవాచః—**

నా కించిత్కించిదాకారమిదం త్యక్త్వాహమాగతా
న కించిత్కించిదాకారం తేనాస్మి శ్రీమతీ స్థితా.　　21

చూడాల:— ప్రియుడవగు ఓరాజా! మూఢజనప్రసిద్ధమగు దేహాత్మభావమును త్యజించి, సంపూర్ణమై, నిరాకారమైనట్టి బ్రహ్మాత్మభావమును జ్ఞానముచే నేను బొందితిని గాన శోభాయుక్తనై వెలయుచున్నాను.

ఇదం సర్వం పరిత్యజ్య సర్వమన్యన్మయాశ్రితమ్
యత్తత్సత్యమసత్యం చ తేనాస్మి శ్రీమతీ స్థితా.　　22

ఈ పరిచ్ఛిన్న పదార్థమంతయును త్యజించి, త్రికాలాబాధితమై మూర్తామూర్త ప్రపంచరహితమై, అపరిచ్ఛిన్నమైనట్టి బ్రహ్మమును బొందితినిగాన శోభాయుతనై యొప్పుచున్నాను.

యత్కించిద్యన్న కించిచ్చ తజ్జానామి యథాస్థితమ్
యథోదయం యథానాశం తేనాస్మి శ్రీమతీ స్థితా. 23

ఏ ఆత్మ వస్తువు ద్రష్టయొక్క దృష్టిననుసరించి సృష్టికాలమున యొకింత పరిచ్ఛిన్నముగాను లయకాలమున తద్రహితముగాను గన్పట్టునో, కాని యథార్థముగ నిరాకారమైనదో, అట్టి ఆత్మను యథాస్థితరూపముచే అనగా నిరాకార, కూటస్థభూమానంద స్వభావయుక్తముగ గాంచుచున్నాను గాన, శోభావతినైయున్నాను.

భోగైరభుక్తైస్తుష్యామి భుక్తైరివ సుదూరగైః
న హృష్యామి న కుప్యామి తేనాస్మి శ్రీమతీ స్థితా. 24

అనుభవించిన భోగములచే నేనెట్లు సంతుష్టనో, దూరప్రదేశముననున్న అనుభవింపని భోగములచే, గూడ అట్లనే సంతుష్టనైయున్నాను. మఱియు వాని ప్రాప్తిచే సంతోషముగాని, అప్రాప్తిచే దుఃఖమునుగాని పొందను, ఇక్కారణముగ శోభావతినై యొప్పియున్నాను.

ఏకైవాకాశసంకాశే కేవలే హృదయే రమే
న రమే రాజలీలాసు తేనాస్మి శ్రీమతీ స్థితా. 25

ఆకాశమువలె స్వచ్ఛమై. కేవలహృదయస్థితమైనట్టి బ్రహ్మమున నేను ఏకాకినై క్రీడించుచున్నాను, రాజ్యలీలలందుకాదు. అందువలననే శోభిల్లుచున్నాను.

ఆత్మన్యేవ హి తిష్ఠామి హ్యాసనోద్యాన భూమిషు
న భోగేషు న లజ్జాసు తేనాహం శ్రీమతీ స్థితా. 26

పద్మస్వస్తికాద్యాసనరూపములగు వనవాటికలందున్నదాననై, (దేహమందున్నను) పూర్ణాత్మయందే స్థితినొందియున్నానుగాని భోగములందుగాని, వాటి యలాభముచే గలుగు లజ్జాదులందుగాని స్థితినొందియుండలేదు. కాననే సుశోభితనైయున్నాను.

జగతాం ప్రభురేవాస్మి న కించిన్మాత్రరూపిణీ
ఇత్యాత్మన్యేవ తుష్యామి తేనాహం శ్రీమతీ స్థితా 27

ఆకారమేమియు ధరింపకున్నను, నేను అనేకబ్రహ్మాండములకు ప్రభునైయున్నాను. ఇట్లు ఆత్మయందే సంతుష్టనైయున్నందున శోభావతినై మెలఁగుచున్నాను.

ఇదం చాహమిదం నాహం సత్యా చాహం న చాప్యహమ్
సర్వమస్మి న కించిచ్చ తేనాహం శ్రీమతీ స్థితా. 28

అధిష్ఠానదృష్టిచే ఈ దేహాదులు నేనైయున్నాను, కాని అపవాదదృష్టిచే నేనెద్దియు కాను. అట్లనే అధిష్ఠానదృష్టిచే నేను సత్యమేయగుదును, కాని దేహాత్మదృష్టిచే నేను సత్యమున్నుగాను.

వెయ్యేల, అంతయు నేనే, అంతయు నేఁగాదు. ఇట్టి దృష్టి నవలంబించినందుచే శోభాసమేతనై యున్నాను.

న సుఖం ప్రార్థయే నార్థం నానర్థం నేతరాం స్థితిమ్
యథాప్రాప్తేన పశ్యామి తేనాహం శ్రీమతీ స్థితా. 29

నేను సుఖమును గోరుటలేదు, అర్థమును వాంఛించుటలేదు; లేక అనర్థము నిచ్ఛగించుటయు లేదు, లేక మఱియేస్థితినైనను గాంక్షించుటలేదు. యథాప్రాప్తమగు వస్తువుచే సంతుష్టిని బొందుచున్నాను. గాన శోభాయమానముగ నున్నాను.

తనువిద్వేషరాజాభిః ప్రజ్ఞాభిః శాస్త్రదృష్టిభిః
రమే సహ వయస్యాభిస్తేనాహం శ్రీమతీ స్థితా. 30

రాగద్వేషములు నశించినట్టి బుద్ధితోడను, శాస్త్రదృష్టియను సఖులతోడను క్రీడించుచున్నాను గాన శోభావతినై యొప్పుచున్నాను.

పశ్యామి యన్నయనరశ్మిభిరిన్ద్రియైర్వా
చిత్తేన చేహ హి తదఙ్గ న కించిదేవ
పశ్యామి తద్విరహితం తు న కించిదన్తః
పశ్యామి సమ్యగితి నాథ చిరోదయాస్మి. 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూడాలోపాఖ్యానే చూడాలాత్మలాభో నామైకోనాశీతితమః సర్గః ॥ 79 ॥

నేత్రప్రకాశములచేతను, ఇతరేంద్రియములచేతన్న, మనోబుద్ధులచేతను, ఈ ప్రపంచమున నేళమి చూచుచున్నానో, అనుభవించుచున్నానో అదియంతయు మిథ్యారూపమైయున్నది. మఱియు నింద్రియమనంబులనుండి వియోగమొంది నిష్ప్రపంచవస్తువును అభ్యంతరమున గాంచుచున్నాను. బాహ్యాభ్యంతరములందు నియబాధిత ఆత్మవస్తువును లెస్సగ వీక్షించుటచే శాశ్వతముగ అభ్యుదయ సహితనై శోభాయుక్తనై వెలయుచున్నాను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున చూడాలోపాఖ్యానమున చూడాలాత్మలాభమను డెబ్బదితొమ్మిదవ సర్గము ॥79॥

---

## అశీతితమః సర్గః

[అజ్ఞేన రాజ్ఞా తద్వాక్యస్యాసంబద్ధత్వవర్ణనమ్
ఖేచరత్వాది సిద్ధీనాం బీజం చాత్ర నిరూప్యతే

అజ్ఞుఁడగు రాజు ఆవాక్యముల అసంబద్ధత్వమును వర్ణించుట; ఆకాశగమనాది సిద్ధులయొక్క బీజమ్ము నిరూపింపఁబడుట యిచటఁగాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏవమాత్మని విశ్రాన్తాం వదన్తీం తాం వరాననామ్
అబుద్ధ్వా తద్గిరామర్థం విహస్యోవాచ భూపతిః. 1

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఇట్లు చెప్పుచున్న,—ఆత్మయందు విశ్రాంతినొందిన సుందరవదనయగు— చూడాలయుక్క అభిప్రాయమెఱుఁగక రాజు యిట్లు పల్కెను.

శిఖిధ్వజ ఉవాచ:—

అసంబద్ధప్రలాపాసి బాలాసి వరవర్ణిని
రమసే రాజలీలాభీ రమస్వావనిపాత్మజే 2

వరవర్ణినీ! నీవు బాలికవు. కనుకనే యిట్లసంబద్ధ ప్రలాపములు కావించుచున్నావు. ఓ రాజపుత్రీ! నీవింతవఱకు యేరాజ్యలీలలందు క్రీడించుచుంటివో, ఇపుడును వాటియందే క్రీడింపుము.

కించిత్త్యక్త్వా న కించిద్యో గతో ప్రత్యక్షసంస్థితమ్
త్యక్తప్రత్యక్షసద్రూపః స కథం కిల శోభతే. 3

ప్రత్యక్షమై, సద్రూపమైనట్టి ఆకారమును త్యజించి, అప్రత్యక్షమైన నిరాకారస్థితిని బొందిన శూన్యప్రాయుఁడెట్లు శోభించును ?

భోగైరభుక్తైస్తుష్టోఽహమితి భోగాన్జహాతి యః
రుషేవాసనశయ్యాదీన్స కథం కిల శోభతే. 4

'అనుభవింపని భోగములచే నేను సంతుష్టుడన'ని పలించువాఁడు, క్రుద్ధునివలె శయ్యాసనాదులఁ ద్యజించువాడు యెట్లు శోభనొందును ?

భోగాభోగే పరిత్యజ్య ఖే శూన్యే రమతే తు యః
ఏక ఏవాఖిలం త్యక్త్వా స కథం కిల శోభతే. 5

నిజభోగములను, మిత్ర భృత్యాదిరూపములగు ఆభోగములను, వానికి సాధనభూతములగు ధనాదులను త్యజించి ఏకాకియై, పిశాచమువలె ఆకాశమున క్రీడించువాఁడెట్లు శోభించును ?

వసనాసనశయ్యాదీన్సర్వాన్సంత్యజ్య ధీరధీః
య స్తిష్ఠత్యాత్మనైవైకః స కథం కిల శోభతే. 6

ఎవఁడు అతిక్రోధముచే వస్త్రభోజన శయ్యాది సమస్తమును పరిత్యజించి, తన ధీరత్వబలముచే శీతోష్ణ, క్షుత్పిపాసాదుల సహించుచునుండునో, ఆతఁడెట్లు శోభిల్లును ?

నాహం దేహోఽన్యథా చాహం న కించిత్సర్వమేవ చ
ఏవం ప్రలాపో యస్యాస్తి స కథం కిల శోభతే. 7

'నేను దేహమును కాను, అన్యమును; నేనేదియు కాను, అంతయు నేనే'— అని వచించువాఁడెట్లు శోభాయుక్తుఁడగును !

యత్పశ్యామి న పశ్యామి తత్పశ్యామ్యన్యదేవ యత్
ప్రలాప ఇత్యసంన్యస్య స కథం కిల శోభతే. 8

'నేత్రాదీంద్రియములచే దేనిని గాంచుచున్నానో, అది మిథ్య; నేను గాంచునది అన్య వస్తువు'—ఇట్టి అసద్వాక్యముల ప్రలపించువాఁడెట్లు శోభించును ?

తస్మాద్బాలాసి ముగ్ధాసి చపలాసి విలాసిని
నానాలాపవిలాసేన క్రీడామి క్రీడ సున్దరి. 9

ఓ విలాసవతీ ! సుందరీ ! ఇక్కారణమున నీవు బాలికవు, అప్రౌఢబుద్ధివి యగుదువు. రమ్ము! నానావిధములగు ఆలాప, విలాసములతో నేను క్రీడించుచున్నాను. నీవును నాతో క్రీడింపుము.

ప్రవిహస్యాట్టహాసేన శిఖిధ్వజ ఇతి ప్రియామ్
మధ్యాహ్నే స్నాతుముత్థాయ నిర్జగామాఙ్గనాగృహాత్. 10

ఓ రామచంద్రా ! ఈ ప్రకారముగ తన ప్రియురాలినిగూర్చి శిఖిధ్వజుఁడు బిగ్గరగా నవ్వుచు, అట్టహాసముతో బల్కి, మధ్యాహ్నసమయమున స్నానమాచరించుటకై యామెయొక్క గృహమును వీడి చనెను.

కష్టం నాత్మని విశ్రాన్తో మద్వచాంసి న బుద్ధవాన్
రాజేతి ఖిన్నా చూడాలా స్వవ్యాపారపరా భవత్. 11

తదనంతరము చూడాల తనమనమున నిట్లనుకొనెను–'అయ్యో ! దుఃఖకరమైన విషయము! రాజింకను ఆత్మయందు విశ్రాంతిని పొందలేదు. నా వాక్యములను గ్రహింపకుండెనే!' అని యిట్లు ఖిన్నయై మఱల యథారీతి తనయాత్మచింతనావ్యాపారమున సంలగ్నయయ్యె.

తదా తథాఙ్గ తత్రాథ తాదృగాశయయోస్తయోః
తాభిః పార్థివలీలాభిః కాలో బహుతిథో యయౌ. 12

ఓ రామచంద్రా! ఇట్టి యాశయములు కలిగియున్న వారిరువురకును రాజయోగ్యములగు ఆయా లీలలందు చాలకాలము గడచెను.

ఏకదా నిత్యతృప్తాయా నిరిచ్ఛాయా అపి స్వయమ్
చూడాలాయా బభూవేచ్ఛా లీలయా ఖగమాగమే. 13

ఇట్లుండ నొకసమయమున రాజు శత్రువులను జయించుటకై రెండుమూడు సంవత్సరములు విదేశములకు వెడలెను. అపుడు నిత్యతృప్తయు, ఇచ్ఛారహితయు నైనను, లీలార్థము చూడాలకు ఆకాశగమనమును గూర్చిన యిచ్ఛ స్వయముగ నుద్భవించెను.

ఖగమాగమసిద్ధ్యర్థమథ సా నృపకన్యకా
సర్వభోగాననాదృత్య సమాగమ్య చ నిర్జనమ్. 14
ఏకైవైకాన్తనిరతా స్వాసనావస్థితాఙ్గికా
ఊర్ధ్వాగ్రప్రాణపవనచిరాభ్యాసం చకార హ. 15

పిదప ఆరాజపుత్రి ఆకాశగమనసిద్ధి కొఱకు, సమస్తభోగములను త్యజించి ఏకాంతవాస నిరతయై నిర్జనస్థానమున కరిగి, ఏకాకినిగ, స్వాసనముపై అవయవములను దృఢపఱచుకొని, ఊర్ధ్వగామి యగు ప్రాణవాయువును, ఖేచరసిద్ధ్యనుకూలతకొఱకు భ్రూమధ్యాది ప్రదేశములందు నిరోధించుట యను అభ్యాసమును చిరకాల మాచరించెను.

శ్రీరామ ఉవాచః—

యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజంగమమ్
స్పన్దచ్యుతం క్రియానామ్నః కథమిత్యనుభూయతే. 16

శ్రీరాముడు.—ఓ మునీంద్రా! ఈ స్థావరజంగమాత్మకమగు ప్రపంచమంతయు క్రియాసిద్ధముగఁ గాన్పించుచున్నది. అట్టి క్రియ యను స్పందముయొక్క సిద్ధి దేనివలన కలుగును? సక్రియ వలనా, లేక కూటస్థునివలనా? సక్రియచేనగుచో, ఆత్మాశ్రయ, అనవస్థాది దోషములగును. ద్వితీయ పక్షమైనచో వ్యాఘాతదోషమగును.

కస్య స్పన్దవిలాసస్య ఘనాభ్యాసస్య మే వద
బ్రహ్మన్ఖగమనాద్యేతత్ఫలం యత్నైకశాలినః. 17

మఱియు, ఓ మహాత్మా! ఏ క్రియయొక్క దృఢాభ్యాసముచేత ప్రయత్నశీలునకీయాకాశగమనాది ఫలములు లభించునో వచింపవేడెద.

ఆత్మజ్ఞో వాప్యనాత్మజ్ఞః సిద్ధ్యర్థం లీలయాథవా
కథం సంసాధయత్యేతద్యథా తద్వద మే ప్రభో. 18

ప్రభూ! ఆత్మజ్ఞానికాని లేక అనాత్మజ్ఞుడుకాని సిద్ధికొఱకైనను, లేక విలాసముకొఱకైనను, ఆకాశగమనాది ఫలముల నెట్లు సాధించునో, అదియు దయచేసి తెలుపఁగోరెద.

శ్రీవసిష్ఠ ఉవాచః —

త్రివిధం సంభవత్యఙ్గ సాధ్యం వస్త్విహ సర్వతః
ఉపాదేయం చ హేయం చ తథోపేక్ష్యం చ రాఘవ. 19

ఓ రాఘవా! ఈ ప్రపంచమున నంతటు సాధ్యవస్తువులు ఉపాదేయ, హేయ, ఉపేక్ష్యములను ముత్తెఱఁగులుగా నుండును.

ఆత్మభూతం ప్రయత్నేన ఉపాదేయం చ సాధ్యతే
హేయం సంత్యజ్యతే జ్ఞాత్వా ఉపేక్ష్యం మధ్యమే తయోః. 20

ఆత్మకు అనుకూలమైన ఏవస్తువు ప్రయత్నముచే సాధింపబడుచున్నదో, అది ఉపాదేయ మనఁబడును. ఆత్మకు ప్రతికూలమైన ఏవస్తువు ప్రయత్నముచే త్యజింపబడుచున్నదో, అది హేయ మనఁబడును. ఈ రెంటికి మధ్యనున్నది ఉపేక్ష్య మనఁబడును.

యద్యదాహ్లాదనకరమాదేయం యచ్చ సన్మతే
తద్విరుద్ధమనాదేయముపేక్ష్యంమధ్యమం విదుః. 21

సుఖకరములైన పదార్థములెవ్విగలవో అవి ఉపాదేయములు. తద్విరుద్ధములు త్యాజ్యములు. ఈ రెండువిధములకాని వనఁగా మధ్యస్థములు ఉపేక్ష్యములు.

సమ్మతేర్విదుషో జ్ఞస్య సర్వమాత్మమయం యదా
త్రయ ఏతే తదా పక్షాః సంభవన్తి న కేచన. 22

సద్బుద్ధియగు జ్ఞానికి ఎపుడంతయు ఆత్మమయముగనో, అపుడీమూడు పక్షములున్ను సంభవములుకావు.

కేవలం సర్వమేవేదం కదాచిల్లీలయా తయా
ఉపేక్షాపక్షనిక్షిప్తమాలోకయతి హా న హా. 23

జ్ఞాని ఒకప్పుడు లీలగా ఈమూడుపక్షములను ఉపేక్షాపక్షమున గాంచును, గాంచకయునుండును.

జ్ఞస్యోపేక్షాత్మకం నామ మూఢస్యాదేయతాం గతమ్
హేయం స్ఫారవిరాగస్య శృణు సిద్ధిక్రమం కథమ్. 24

జ్ఞాని కెయ్యది ఉపేక్ష్యమో అదియే మూఢునకుపాదేయమగును; మఱియు, గొప్పవైరాగ్యశీలుర కదియే హేయమగును. ఇకనీమూఁటియొక్క సిద్ధిక్రమమును వినుము.

దేశకాలక్రియాద్రవ్యసాధనాః సర్వసిద్ధయః
జీవమాహ్లాదయన్తీహ వసన్త ఇవ భూతలమ్. 25

ఓ రామచంద్రా! వసంతఋతువు భూతలమును ప్రసన్నమొనర్చునట్లు, యథోచిత దేశకాల ద్రవ్యరూప సాధనములచే సిద్ధులన్నియు జీవునిఁ బ్రసన్నమొనర్చుచున్నవి.

మధ్యే చతుర్ణామేతేషాం క్రియాప్రాధాన్యకల్పనా
సిద్ధ్యాదిసాధనే సాధో తన్మయాస్తే యతః క్రమాః. 26

సాధువగు ఓరామచంద్రా! ఈ నాల్గింటియందు దేశకాలాదుల ఉత్తమత్వముచే క్రియయొక్కయు ఉత్తమత్వము చేకూరుచున్నది. మఱియు, ఉత్తమఫలసిద్ధియు ఉత్తమక్రియలచేతనే యగును.

గుటికాఞ్జనఖడ్గాది క్రియాక్రమనిరూపణమ్
తత్రాసతాం చ దోషోఽత్ర విస్తారః ప్రకృతార్థహా. 27

ఓ రామచంద్రా! ఆకాశగమనాది సిద్ధులయొక్క సాధనములైన సిద్ధగుటిక, సిద్ధాంజనము, సిద్ధఖడ్గము, సిద్ధపాదుక మొదలైనవి. ఉడ్డామరతంత్ర, యోగినీకల్పాది గ్రంథములందు ప్రసిద్ధములైయున్నవి. ఆక్రియలయొక్క నిరూపణము గావించుట నీప్రశ్నయొక్క ఆశయమైనచో, జిజ్ఞాసువులుకానివారికిని, అజ్ఞానులకును వానియందు ప్రవృత్తికలిగినచో మహాదోషము సంభవించునుగనుకను, వానియొక్క విస్తారము ప్రస్తుతమొనర్చుచున్న జ్ఞాననిరూపణమునకు హానికరముగనుకను తన్నిరూపణమిచట అనుచితము.

రసౌషధితపోమన్త్రక్రియాక్రమనిరూపణమ్
ఆస్తామేవ కిలైషోఽపి విస్తారః ప్రకృతార్థహా. 28

విస్తరించినశాఖలచే నలువైపులం జుట్టబడినదియు, మర్మస్థానము నాశ్రయించినదియు, వందలకొలది నాడులయొక్క సమాశ్రయమున్ను, ప్రేగులచే పరివేష్టింపబడినదియునగు సుషుమ్నయను నాడియొకటి కలదు.

వీణాగ్రావర్తసదృశీ సలిలావర్తసంనిభా
లిప్యర్ధోంకారసంస్థానా కుణ్డలావర్తసంస్థితా. 37

ఆనాడి వీణాదండముయొక్క మూలభాగమునందలి రేఖామయమగు ఆవర్తమువంటిదియు, జలావర్తమును బోలినదియు, లిపియందు ఓంకారాక్షరముయొక్క అర్ధభాగమువలె నుండునదియు, కుండలముతో సమానమైనదియు నైయున్నది.

దేవాసురమనుష్యేషు మృగనక్రఖగాదిషు
కీటాదిష్వబ్జజాన్తేషు సర్వేషు ప్రాణిషూదితా. 38

దేవ, అసుర, మనుష్య, మృగ, మకర, పక్ష్యాదులందును, కీట, పతంగాదులందును, జలజంతువులందును, ఇతరసమస్తప్రాణులందునుగూడ ఆ నాడి కలదు.

శీతార్తసుప్తభోగీన్ద్ర భోగవద్బద్ధమణ్డలా
సితా కల్పాగ్నివిగలదిన్దువద్బద్ధకుణ్డలీ. 39

మఱియు నది, చలిచే పీడితుడైనవానివలె ముడుచుకొనియున్నదియు, నిద్రించు సర్పముయొక్క శరీరమువలె చుట్టుకొనియున్నదియు, స్వచ్ఛమైనదియు, ప్రళయాగ్నిచే క్రింగబడు చంద్రునివలె కుండలాకృతి గలదియునై యున్నది.

ఊరోర్ధ్వాభ్రిమధ్యరన్ధ్రాణి స్పృశన్తీ వృత్తిచఞ్చలా
అనారతం చ సస్పన్దా పవమానేవ తిష్ఠతి. 40

ఆ సుషుమ్నానాడి గుదస్థానము మొదలు భ్రూమధ్య పర్యంతముగల రంధ్రములన్నింటిని స్పృశించునదియు, ఆభ్యంతరమున మనోవృత్తులచే చంచలమును, బాహ్యమున ప్రాణాదివాయువులచే స్పందసహితమునైయున్నది.

తస్యాస్త్వభ్యన్తరే తస్మిన్కదలీకోశకోమలే
యా పరా శక్తిః స్ఫురతి వీణా వేగలసద్గతిః. 41

కదళీకోశమువలె కోమలమైనట్టి ఆ కుండలియందు అనగా మూలాధారమున, వీణాశబ్ద వేగమువలె శోభాయుక్తమైన శబ్దబ్రహ్మరూపమగు పరాశక్తి స్ఫురించుచున్నది.

సా చోక్తా కుణ్డలీనామ్నా కుణ్డలాకారవాహినీ
ప్రాణినాం పరమా శక్తిః సర్వశక్తి జవప్రదా. 42

కుండలాకారముగ ప్రవహించుటచే ఆనాడిని కుండలియనియు నందురు. అది సర్వప్రాణులకు చైతన్యప్రదమగు శక్తియై యున్నది. మఱియు ప్రాణేంద్రియ మనోబుద్ధ్యాది సమస్త శక్తులయొక్క ప్రవృత్తికి హేతుభూతమగుటచే సర్వులకు జవ (స్ఫూర్తి) ప్రదమై యొప్పుచున్నది.

అనిశం నిఃశ్వసద్రూపా రుషితేవ భుజంగమీ
సంస్థితోర్ధ్వీకృతముఖీ స్పన్దనాహోతుతాం గతా. 43

అదిదే, తన యూర్ధ్వ కృతముఖముచే ప్రాణవాయువును పైకి, అపానమును క్రిందకు త్రోయుచు, స్పందమునకు కారణభూతమైన శ్వాస గైకొనుచు సర్పిణివలెనున్నది.

యదా ప్రాణానిలో యాతి హృది కుణ్డలినీపదమ్
తదా సంవిదుదేత్యన్తర్భూతతన్మాత్ర బీజభూః. 44

హృదయమందున్న ప్రాణవాయువు కుండలినిచే నాకర్షింపబడి, అపానవృత్తిచే కుండలినీ పదము నెపుడు పొందునో, అపుడు అపంచీకృత పంచభూతజనితమగు అంతఃకరణమున జీవసంవిత్తు (స్మృతి సంకల్పాదివృత్తి భేదములతో గూడిన జ్ఞానము) ఉదయించును.

యథా కుణ్డలినీ దేహే స్ఫురత్యబ్జ ఇవాలినీ
తథా సంవిదుదేత్యన్తర్మృదుస్పర్శవశోదయా. 45

ఈ విధముగా బుద్ధి, ప్రాణములకు జ్ఞాన, క్రియాశక్తుల నొసంగు కుండలిని కమలమునందు భ్రమరమువలె, దేహమందేయేవిధమున స్ఫురించుచుండునో, అయావిధమున అంతఃకరణమున ఇంద్రియ జ్ఞానము, అనగా ఇంద్రియార్థములం గూర్చిన స్ఫూర్తి ఉదయించుచుండును.

స్పర్శనం మృదునాన్యోన్యాలిఙ్గికా తత్ర యన్త్రయోః
యథా సంవిదుదేత్యుచ్చైస్తథా కుణ్డలినీ జవాత్. 46

కుండలిని యెట్లెట్లు వేగముగా స్ఫురించుచుండునో. అట్లట్లు నేత్రాదీంద్రియములతోటి విషయస్పర్శముయొక్కయు, కార్యకారణరూప యంత్రముయొక్క ప్రేరకుడగు ప్రమాతయొక్కయు, ఘటాది విషయములయొక్కయు స్పష్టజ్ఞానము జనించుచుండును.

తస్యాం సమస్తాః సంబద్ధా నాడ్యో హృదయకోశగాః
ఉత్పద్యన్తే విలీయన్తే మహార్ణవ ఇవాపగాః 47

ఆ కుండలినీ నాడియందు హృదయ కోశమందలి నాడులన్నియు సంబంధించియున్నవి. నదులు సముద్రమునుండియే ఉత్పన్నమై, మఱల సముద్రమందే లయించునట్లు, ఆనాడులన్నియు కుండలినియందే ఉత్పన్నమై, మఱల కుండలినియందే లయమగుచున్నవి.

నిత్యం పాతోత్సుకతయా ప్రవేశోన్ముఖయా తయా
సా సర్వసంవిదాం బీజం హ్యేకా సామాన్యదాహృతా. 48

ప్రాణరూపమున ఊర్ధ్వగమనమునందును, అపానరూపమున అధోగమనమునందును ఉన్ముఖమగుటచే ఆ కుండలిని సమస్త ఇంద్రియజ్ఞానములకును బీజమని సాధారణార్థమున వచింపబడుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

అకల్పాదనవచ్ఛిన్నా చిత్సంవిత్సర్వమస్తి హి.
తస్మాత్కుణ్డలినీకోశాత్కేనార్థేనోదయః స్ఫుటః. 49

శ్రీరాముడు:—ఓ మునీంద్రా! దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నమగు చిత్తు (చైతన్యము) మాత్రమే అంతటయునై యుండగా, అఖండదలినీ కోశముచేత నే సర్వవిధములగు సంవిత్తు (జ్ఞానము) యెట్లు, యేవిధమున నుదయించును?

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

సర్వత్ర సర్వదా సర్వం చిత్సంవిద్విద్యతేఽనఘ
కింత్వస్యా భూతతన్మాత్రవశాదభ్యుదయః క్వచిత్. 50

శ్రీవసిష్ఠుడు;—పాపరహితుండవగు ఓ రామచంద్రా! సర్వత్ర, సర్వకాలములందు, సమస్తము చైతన్యము మాత్రమేయైయున్నను; భూతతన్మాత్రలకారణముచే నచటచట నద్దాని విశేష అభివ్యక్తి కానుపించుచుండును.

సర్వత్ర విద్యమానాపి దేహేషు తరలాయతే
సర్వగోఽప్యాతపః సౌరో భిత్త్యాదౌ వై విజృమ్భతే. 51

సూర్యప్రకాశము సర్వత్రసమముగ వ్యాపించియున్నను దర్పణ, భిత్త్యాదులందు అధికముగా భాసిల్లునట్లు, చైతన్య మంతటను విద్యమానమైయున్నను దేహములందే (బుద్ధియందే) విశేషముగ భాసించుచున్నది.

క్వచిన్నష్టం క్వచిత్స్పష్టం క్వచిదుచ్ఛిన్నతాం గతమ్
వస్తు వస్తుని దృష్టం తత్తత్సద్భావై ర్విజృమ్భితమ్. 52

చిద్వస్తువు మృత్తికా, శిలాదులందు అప్రకటమైయున్నది. దేవ, మనుష్యాదులందు విస్పష్టముగ భాసించుచున్నది. మఱియొకచోట, (వృక్షాదులందు) ఇష్టానిష్టవివేకము లేనిదిగ కన్పించుచున్నది. కాని సామాన్యసత్తామాత్రముచే ఆయాపదార్థములన్నింటియందును బ్రకటమైయున్నది.

ఏతదభ్యుదయః క్రమేణాహం శృణు వక్ష్యామి తేఽనఘ
దేహే స్వే చ యథోదేతి భృశం సంవిన్మయక్రమః. 53

పాపరహితుండవగు ఓ రామచంద్రా! మనుష్య, పశు, స్థావరాది దేహములందు సంవిత్తు ఉదయించునట్టి క్రమమును నేను మఱల నీకు చెప్పుచున్నాను, వినుము.

చేతనాచేతనం భూతజాతం వ్యోమ తథాఖిలమ్
సర్వం చిన్మాత్రసన్మాత్రం శూన్యమాత్రం యథా నభః. 54

చేతనా చేతనరూపమగు ఈ కానుపించు ప్రపంచమంతయు, చిన్మాత్రమై, సన్మాత్రమై, ఆకాశమువలె పదార్థశూన్యమాత్రమై (అసంగమై సూక్ష్మమై, విభువై) యున్నది.

తద్ధి చిన్మాత్ర సన్మాత్ర మవికారం స్వనామయమ్
క్వచిత్స్థితం సంవిదేవ భూతతన్మాత్రపఞ్చకమ్. 55

అట్టి సన్మాత్ర, చిన్మాత్ర, అవికార, నిరామయమైనట్టి చైతన్యమున, మాయచే కల్పితమైన, ఏకదేశమున ఆకాశాది సూక్ష్మభూతములయొక్క అధ్యాసముచే ఆచైతన్యమే భూతతన్మాత్రరూపమ్ముగ, వెలసెను.

తత్పఞ్చధా గతం ద్విత్వం లబ్ధ్వాసే త్వం స్వసంవిదమ్
అన్తర్భూతవికారాది దీపాద్దీపశతం యథా. 56

ఆ పంచ భూత తన్మాత్రలే ప్రాణ, మన, బుద్ధి, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములను ఈ పంచవిధముల వ్యక్తమొందిన లింగశరీరమున ప్రతిబింబరూపమునఁ బ్రవేశించి, ఒకే దీపమునుండి నూఱు దీపములు వెలుగొందునట్లు, జన్మాదివికారములతోను, జాగ్రదాద్యవస్థాభేదములతోను గూడిన జీవ భావమున గన్పించుచున్నవి.

స్వసత్తామాత్రకేణైవ సంకల్పలవరూపిణా
పఞ్చకాని వ్రజన్తీహ దేహత్వం తాని కానిచిత్. 57

లింగశరీరనిర్మాణమున పరిశేషించిన కొన్ని పంచతన్మాత్రలు దేవమనుష్యాద్యాకారముల కనుకూలమైన వాసనానుసారమగు సంకల్పములతోఁగూడి తమ సత్తామాత్రముచే పంచీకరణముద్వారా స్థూలదేహభావమును పొందుచున్నవి.

కానిచిత్తిర్యగాదిత్వం హేమాదిత్వం చ కానిచిత్
కానిచిద్దేశతాదిత్వం ద్రవ్యాదిత్వం చ కానిచిత్. 58

మఱికొన్ని పంచతన్మాత్రలు పశుపక్ష్యాది తిర్యక్-శరీరభావమును పొందుచున్నవి. అట్లనే కొన్ని స్థావరాది శరీరభావమును, కొన్ని దేశాదిభావమును, కొన్ని ద్రవ్యాదిభావమును పొందుచున్నవి.

ఏవం హి పఞ్చకస్పన్దమాత్రం జగదితి స్థితమ్
చిత్సంవిదత్ర సర్వత్ర విద్యతే రఘునన్దన. 59

ఓ రఘునందనా! ఈ ప్రకారముగ ఈ జగత్తంతయు పంచతన్మాత్రలయొక్క క్రియయే యైయున్నది. అధిష్ఠానమగు చైతన్యము సత్తామాత్రముచే నంతటను యుండియున్నదిగాని వ్యక్తరూపముచే లేదు.

కేవలం పఞ్చకవశాద్దేహాదౌ చేతనాభిధా
జడస్పన్దాభిధా క్వాపి స్థావరాదౌ జడాభిధా 60

కేవలము ప్రాణాదిపంచక (ప్రాణ, మన, బుద్ధి, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ) కారణమునఁజే లింగశరీరప్రాధాన్యముద్వారా మనుష్యాదిదేహములందు ముఖ్యచేతనత్వము, తిర్యగాదిదేహములందు లింగ, స్థూలశరీరముల సమత్వకారణమున జడచేతనత్వము, స్థావరాదులందు లింగశరీరమునకు కేవల మంతర్జ్ఞానమాత్రమే యుండుటచేతను, బాహ్యచేతనత్వ మప్రకటమైయుండుట వలనను జడత్వమున్ను ప్రసిద్ధమైయున్నవి.

యథా స్తబ్ధః స్థితో వీచిరివ స్థలమివాస్థితః
పఞ్చకేషు తథైతచ్చిల్లోలరూపా జడాన్వితా. 61

ద్రవీభూతమగు ఘృతసముద్రము సాయంకాల శీతలవాయుస్పర్శచే, తీరమున ఘనీభావముచే నిశ్చలముగాను, ద్రవీభూతస్థానమున తరంగమువలె చంచలముగను, కొంచెము ఘనీభూతమగు స్థలమున కొంచెము చంచలముగను, అత్యంత ఘనీభూతస్థలమున చలింపకయును యెట్లుండునో, అట్లనే

ఈచైతన్యమున్ను మనుష్య, తిర్యక్, స్థావరాది దేహరూపపంచకములందు క్రమముగ, చంచలముగను, కొంచెము చంచలముగను, అత్యంతజడరూపముగను నున్నది.

ఇతః సౌమ్య ఇతో లోలః కిమబ్ధిరితి నోయథా
వికల్పాదా తథైవైతత్పఞ్చకం హి జడాజడమ్. 62

ఎట్లు సముద్రమున, ఒకచోట శాంతముగను, మఱియొకచోట చంచలముగను, వేఱొకచోట కొంచెము చంచలముగను నున్నను, 'ఇది సముద్రము కాద'ను వికల్పమెట్లు కలుగదో, అంతట సముద్రరూపత్వమే యెట్లు చెప్పబడునో, అట్లే మనుష్య పశుస్థావరాదులందును చంచలత్వముయొక్క న్యూనాధిక భావమున్నప్పటికి చైతన్యరూపత అంతటను నుండియేయున్నది.

దేహాదిపఞ్చకం జీవః స్పన్దః శైలాదికం జడమ్
స్థావరాద్యనిలస్పన్ది స్వభావవశతోఽనఘ. 63

పాపరహితుఁడవగు నో రామచంద్రా! దేహాదిరూపమున, బరిణతమైన పంచకము (పంచతత్త్వములు) ప్రాణధారణవలన చేష్టితములగుచు చేతనవంతమై యొప్పుచున్నది. కాని శిలాదిరూపమున బరిణతమైన యదిజడమై కాన్పించుచున్నది. అట్టి స్థావరాదులు బాహ్యవాయువుయొక్క అధీనమున చేష్టితములగుచు, అంతరమున చేతనములైయున్నవి. ఇవ్విధమున పంచకమున స్వభావవశముగ ననేక వికల్పములుచూడఁబడుచున్నవి.

వాచః పర్యనుయోక్తవ్యా స్వభావాద్రఘునన్దన
శీతోష్ణాది హిమాగ్న్యాది వాక్చేతి పరిదృశ్యతే. 64

అయితే, స్వభావము (స్వాత్మభావము) విరుద్ధవికల్పాత్మక మెట్లగునని ప్రశ్నించిన, అట్టి వికల్పము వాగ్విషయమున ననిమాత్రమే యన్వయించుకొనవలెను. అట్టి వాక్కులే చిజ్జడాది శబ్దరూపములు కానను శీతము,ఉష్ణము,హిమము, అగ్ని-ఇత్యాది వాగ్విరుద్ధస్వభావములంతటను గానుపించుచున్నవి.

గృహీతవాసనాంశానాం పుష్టాభావవికారిణామ్

స్థితయః పఞ్చకానాం హి యోజ్యాః పర్యనుయోజనే. 65

వాసనలయొక్క యంశములతోఁగూడినవై విరుద్ధ వికల్పభావముచే వికారవంతములైనట్టి పంచతత్త్వముల స్థితిఁగూర్చి యెందుల కాక్షేపించరాదు? ఏలయనిన వాక్కు పంచతత్త్వములకు, బరాధీనమై యున్నదేకదా.

వాసనాస్తు విపర్యస్తా ఇతో నేతుమితశ్చ తాః

పుంసా ప్రాజ్ఞేన శక్యన్తే సుఖం పర్యనుయోజితుమ్. 66

అథవా, పంచతత్త్వముల స్థితియొక్కయు నేయపరాధమున్ను లేదు. చిత్తమునిటునటు తీసికొని పోవుటయందు సమర్థములును, నలువైపుల విస్తరించినవియునగు వాసనలయెడలనే బుద్ధిమంతుడగువాఁడు సులభముగ నాక్షేపము గావింపవలసియున్నది.

అశుభే వా శుభే వాపి తేన పర్యనుయోజ్యతే

ప్రబుద్ధవాసనం చాన్యత్త్విచ్ఛకం సుప్తవాసనమ్. 67

దేవాది శుభరూపములందు ప్రబుద్ధవాసనాసహితముగను, తిర్యగ్, స్థావరాది అశుభరూపములందు సుప్తవాసనా సహితముగను ప్రాణాదిపంచకము స్థితి నొందియున్నది.

యత్ర పర్యనుయోగస్య ఫలం సమనుభూయతే
తత్ర తం సంప్రయుఞ్జీతా నాకాశం ముష్టిభిః క్షిపేత్. 68

వాసనావిషయమున నాక్షేపము గావించినచో, తద్వాసనాక్షయ రూపఫల మనుభూతమగుచున్నది. కాన దానిగూర్చియే యాక్షేపించవలెనుగాని స్వభావాదులఁగూర్చికాదు. ఆకాశముపై ధూళి విసరినచో గొంచెమైనను ఫలములేదుకదా!

తృణాగ్రనిష్ఠాః మేర్వాద్యాః పఞ్చకానాం హి రాశయః
వివేకనిష్ఠాః కీటాద్యా ఏతే స్థావరజంగమాః. 69

వాసనాక్షయముచే సుమేరు మున్నగు సువర్ణరాశులుగూడ తృణలేశమువలె తుచ్ఛముగా గానుపించును. మఱియు ఈసమస్తస్థావరజంగమ భోగములున్ను, వివేకనిష్ఠులగు దేవాదుల భోగశీలములగు దేహములున్ను కీటాదులవలె తుచ్ఛతరముగా గోచరించును.

ప్రసుప్తవాసనాః కేచిద్యథా స్థావరజాతయః
ప్రబుద్ధవాసనాః కేచిద్యథా నరసురాదయః. 70
సవాసనావిలాః కేచిద్యథైతే తిర్యగాదయః
ప్రక్షీణవాసనాః కేచిద్యథైతే మోక్షగామినః. 71

ప్రాణులలో స్థావరాది కొన్నిజాతులు సుప్తవాసనలు గలవియును, దేవమనుష్యాది మఱికొన్నిజాతులు ప్రబుద్ధవాసనలు గలవియు పశుపక్ష్యాదులు కలుషితవాసనలు గలవియు, మోక్షగాములు వాసనారహితులునై యున్నారు.

అథ స్వాస్వేవ సంవిత్సు మనోబుద్ధ్యాదికాః కృతాః
హస్తపాదాదిసంయుక్తైః సంజ్ఞాః పఞ్చకరాశిభిః. 72

వాసనావైచిత్ర్యము వలననే దేవమనుష్యాదులు పంచతత్త్వసమూహములచే తమతమ సంవిత్తులందు వ్యవహారయోగ్యములైన మనోబుద్ధ్యాదులు, హస్తపాదాద్యవయవములు-ఇత్యాది బాహ్యాభ్యంతర కరణరూప సంజ్ఞలను పొందుటఁబట్టి వారివారి స్వభావములున్ను విచిత్రములుగా గన్పించుచున్నవి.

తిర్యగాదిభిరప్యన్యైరన్యాః సంజ్ఞాః ప్రకల్పితాః
స్థావరాదిభిరప్యన్యైరన్యాన్యాః సంవిదః కృతాః. 73

అట్లే పశ్వాది తిర్యగ్జాతులచే నన్యములగు అనగా నాల్గుపాదములు, రెండుకొమ్ములు ఒకతోఁక-ఇట్టి సంజ్ఞలును, స్థావరాదులచే మఱికొన్ని సంజ్ఞలును, ఇట్లు తమతమ వాసనానురూపవ్యవహారయోగ్యములగు నవయవాది సంజ్ఞలు కల్పింపబడినవి.

ఇతి సాధో స్ఫురన్తీమే చిత్తాత్పఞ్చకరాశయః
రూపైరాద్యన్తమధ్యేషు చలాచలజడాజడైః. 74

సాధువగు నో రామచంద్రా! ఇవ్విధమున ఆద్యంతమధ్యములందు వికారవంతములై, చంచలములై, జడరూపములై, అధిష్ఠాన సద్రూప దృష్టిచే నచలములై, చేతనములైనట్టి రూపములచే నీ పంచతత్త్వ సమూహములన్నియు విచిత్రముగ స్ఫురించుచున్నవి.

ఏషా మేకోఽభిసంకల్పః పరమాణుర్మహీపతే
బీజమాకాశవృక్షాణాం సర్గాణాం తేష్వమానితు. 75
ఇన్ద్రియాణి చ పుష్పాది విషయామోదవర్తి హి
ఇచ్ఛా భ్రమరో రాజన్త్యమఞ్జర్యశ్చఞ్చలక్రియాః 76
లోకాన్తరాణి స్వచ్ఛాని గుల్మా మూలం సమేరవః
పల్లవా నీలజలదా లతాలోలా దిశో దశ. 77
వర్తమానాని భూతాని భవిష్యన్తి చ యాని తత్
జయన్తి తాన్యసంఖ్యాని ఫలాని రఘునన్దన. 78

ఓ రాజా! అందు, సర్వత్ర వ్యాప్తమగు సంకల్పరూప పరమాణువు సృష్టిరూప ఆకాశవృక్షములయొక్క బీజము; ఇంద్రియములు వాని పుష్పాదులు; విషయములు సుగంధము, ఇచ్ఛ భ్రమరము; చంచలములైన నింద్రియముల క్రియలు చిగుళ్ళు; నిర్మలములైన స్వర్గాది యితరలోకములు శాఖలు; మేరువు మున్నగు పర్వతములన్నియు వాని మూలములు; నీలమేఘములు పల్లవములు, దశదిక్కులు చంచలములైన లతలు; భూతభవిష్యద్వర్తమానములందలి యనంతములైన చతుర్విధప్రాణుల శరీరములన్నియు ఆ వృక్షములయొక్క ఫలములు.

పఞ్చబీజాస్త ఏతే హి రామ పఞ్చకపాదపాః
స్వయం స్వభావాజ్జాయన్తే స్వయం నశ్యన్తి కాలతః. 79

ఓ రామచంద్రా! ఇట్టి పంచబీజములు, పంచతత్త్వములను వృక్షములు స్వవివేకశూన్యత్వముచే స్వయముగ నాత్మనుండి యుత్పన్నమగుచు, మఱల కాలక్రమమున స్వయముగనే నశించుచున్నవి.

స్వయం నానాత్వమాయాన్తి చిరం జాడ్యాత్స్ఫురన్తి చ
స్వవివిక్తాః శమం యాన్తి తరఙ్గా ఇవ వారిధౌ. 80

ఇవియన్నియు స్వయముగనే వివిధరూపములం బొందుచు, జడత్వముచే స్ఫురించుచు, వివేకదృష్టిచే నాత్మచే గాంచబడినతోడనే, సముద్రమందు తరంగమువలె విలయమొందుచున్నవి.

ఇతో యాన్తి సముత్సేధమితో యాన్తి శమం స్వయమ్
ఏతే జాడ్య వివేకాభ్యాం తరఙ్గా ఇవ తోయధౌ. 81

సముద్రమందు తరంగము లొకవైపు పుట్టుచు, మఱొకవైపు నశించుచు నెట్లుండునో, అట్లే బహిర్ముఖదృష్టిగలవారికివన్నియు స్వయముగనే జడత్వముచే నున్నతిని బొందుచు, అంతర్ముఖదృష్టి గలవారికి స్వయముగనే వివేకముచే శమించుచునున్నవి.

యే నివేకవశమాలయం గతా రామ పఞ్చకవిలాసరాశయః
తేన భూయ ఇహ యాన్తి సంస్థితిం ప్రభ్రమన్తి జగతీతలే ముహుః 81

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పఞ్చకవిలాసో నామాశీతితమః సర్గః ॥ 80 ॥

ఓ రామచంద్రా! ఏ 'పంచక' (పంచతత్త్వ) సమూహములు నిర్వాసనా పర్యంతము వివేకవశమును బొందునో, అవి యీ ప్రపంచమున మఱల స్థితిఁ బొందనేరవు. తక్కినవి నిరంతర మీ సంసారమున దిరుగుచునే యుండును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున పంచక విలాసమను
యెనుబదవ సర్గము ॥ 80 ॥

---

## ఏకాశీతితమః సర్గః

[కుణ్డలిన్యాః ప్రసఙ్గేన రోగోద్భవశమక్రమః
సిద్ధిసిద్ధేక్షణోపాయాద్యశేషమిహ వర్ణ్యతే.

కుండలినీ ప్రసంగమున, రోగముల యుత్పత్తినిగూర్చియు, అవి శమించునట్టి క్రమమునుగూర్చియు వచింపఁబడుట—ఆకాశగమనాది సిద్ధులు, వాటిని దర్శించునట్టి యుపాయము వివరింపబడుట యిటఁ గాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతత్పఞ్చకబీజం తు కుణ్డలిన్యాం తదన్తరే
ప్రాణమారుతరూపేణ తస్యాం స్ఫురతి సర్వదా. 1

శ్రీవసిష్ఠుఁడు:—స్థూల శరీరమందలి మూలాధారప్రదేశమున కుండలినియందలి లోభాగమున, ఈ ప్రాణాది పంచకముయొక్క బీజము ప్రాణవాయు రూపమున సదాస్ఫురించుచుండును.

సాన్తః కుణ్డలినీస్పన్ద స్పర్శసంవిత్కలామలా
కలోక్తా కలనేనాశు కథితా చేతనేన చిత్. 2
జీవనాజ్జీవతాం యాతా మననాచ్చ మనఃస్థితా
సంకల్పాచ్చైవ సంకల్పా బోధాద్బుద్ధిరితి స్మృతా. 3

అట్లు కుండలిని ప్రాణరూపమున స్ఫురించినదై, వాయుధర్మముచేతను, నిజధర్మముచేతను, స్పంద, స్పర్శ, సంవిత్తులను మూఁడురూపములుగా గల్పింపబడి, కలనము (ఎఱుక) గావించుటచే కళయనియు, చేతితమొనస్సుటచే చిత్తనియు, జీవించుటచే జీవమనియు, మననము జేయుటచే మనస్సనియు, సంకల్పించుటచే సంకల్పమనియు, బోధనముచే బుద్ధియనియు, శీఘ్రముగఁ జెప్పఁబడినది.

అహంకారాత్మతాం యాతా సైషా పుర్యష్టకాభిధా
స్థితా కుణ్డలినీ దేహే జీవశక్తిరనుత్తమా 4

మఱియు నదియే అహంభావముచే నహంకారరూపత్వమును బొందుచున్నది. ఈ రీతిగ నీకుండలిని పుర్యష్టకమను పేరుచే పచింపఁబడినది. ఈ కుండలినియే దేహమందత్యుత్తమమైన జీవశక్తి రూపమున విద్యమానమైయున్నది.

అపానతాముపాగత్య సతతం ప్రవహత్యధః
సమానా నాభిమధ్యస్థా ఉదానాఖ్యోపరి స్థితా. 5

అదియే అపానరూపమును బొంది యధోదేశమునకు నిరంతరము ప్రవహించుచున్నది; నాభిమధ్యమున సమానవాయురూపమున నున్నది! ఉదానమను పేరుచే నూర్ధ్వప్రదేశమున వెలయుచున్నది.

అధస్త్వపానరూపైవ మధ్యే సామ్యైవ సర్వదా
పుష్టాప్యుదానరూపైవ పుంసః స్వస్థైవ తిష్ఠతి. 6

అధోదిశయందది అపానరూపముగనే యుండును. మధ్యప్రదేశమున నెల్లపుడు సమానరూపముగనే నిశ్చలముగ నుండును. అపాన, సమానములచే బరిపోషింపబడినను నూర్ధ్వవృత్తియుదానరూపముగనే యుండును. ఇట్లది దేహమున స్వస్థముగనే విలసిల్లుచుండును.

సర్వయత్నమధో యాతి యది యత్నాన్న ధార్యతే
తత్పుమాన్మృతిమాయాతి తయా నిర్గతయా బలాత్. 7

సమాన వృత్తిని ధరింపకున్నచో, సర్వప్రయత్నముచేత అపానవృత్తిద్వారా జీవసంవిత్తు అధోమార్గముగుండా బయటకుఁబోవును; మఱియు నట్లది బలముగా పోవుటచే మనుజుడు మృత్యువును బొందును.

సమస్తైవోర్ధ్వమాయాతి యది యుక్త్యా న ధార్యతే
తత్పుమాన్మృతిమాయాతి తయా నిర్గతయా బలాత్. 8

అట్లే సమానవృత్తిని ధరింపకుండిన, జీవసంవిత్తు సర్వయత్నముచేత యుదానవృత్తిద్వారా యూర్ధ్వముఖమునకు జనును. అట్లది బలముగా వెడలుటచే మనుజుడు మృత్యువునకు బాల్పడును.

సర్వథాత్మని తిష్ఠేచ్చేత్త్యక్త్వోర్ధ్వాధో గమాగమౌ
తజ్జనోర్జీయతే వ్యాధిరన్తర్మారుతరోధతః 9

ప్రాణాపానవృత్తి నిరోధముద్వారా యూర్ధ్వాధోగమనములను సర్వథాత్యజించి, సమానవృత్తిచే జీవసంవిత్తు ఆత్మయందు నెలకొనియున్నచో, ప్రాణియొక్క సమస్తవ్యాధులు నశించును, మృత్యువున్ను జయింపఁబడును.

సామాన్యనాడీవైధుర్యాత్సామాన్యవ్యాధిసంభవః
ప్రధాననాడీవైధుర్యాత్ప్రధానవ్యాధిసంభవః. 10

సామాన్యనాడుల వ్యాపారాభావముచే, అన్నరసము పచనముకామి, సామాన్యరోగములుత్పన్నమగును. ప్రధాననాడుల వ్యాపారాభావముచే, ప్రధానరోగములు జనించుచున్న

శ్రీరామ ఉవాచ:—

కిం వినాశః కిముత్పాదా శరీరేఽస్మిన్మునీశ్వర
ఆధయో వ్యాధయశ్చైవ యథావత్కథయాశు మే. 11

శ్రీరాముఁడు:— ఓ మునీశ్వరా! ఈ శరీరమున ఆధివ్యాధులు (మానసిక, శారీరకరోగములు) దేనిచే నశించును, దేనిచే నుత్పన్నమగు నను విషయము శీఘ్రముగ నాకు, దెలియఁజేయవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఆధయో వ్యాధయశ్చైవ ద్వయం దుఃఖస్య కారణమ్
తన్నివృత్తిః సుఖం విద్యాత్తత్క్షయో మోక్ష ఉచ్యతే. 12

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆధివ్యాధులు రెండును దుఃఖమునకు కారణభూతములు వాని నివృత్తిచే సుఖము కలుగుచున్నది. జ్ఞానముచే సవాసనమూలముగ నశించుటయే మోక్షమని చెప్పఁబడుచున్నది.

మిథః కదాచిజ్జాయేతే కదాచిత్సమమేవ చ
పర్యాయేణ కదాచిచ్చ ఆధివ్యాధీ శరీరకే. 13

ఆదివ్యాధులు రెండును నొకపుడు పరస్పరమొకదాని కొకటి కారణమగుటచే శరీరమున జనించును. ఒకపుడు రెండును కూడియే జనించును. మఱియొకపుడు సుఖానంతరమున క్రమముగ నుద్భవమగును.

దేహదుఃఖం విదుర్వ్యాధిమాధ్యాఖ్యం వాసనామయమ్
మౌర్ఖ్యమూలే హి తే విద్యాత్తత్త్వజ్ఞానే పరిక్షయః 14

శరీరసంబంధ దుఃఖమును వ్యాధియందురు. వాసనలకారణమున జనించునట్టి మనస్సంబంధ దుఃఖమును ఆధియందురు. అజ్ఞానమే యీరెంటికిని మూలకారణము. తత్త్వజ్ఞానముచే నద్దాని క్షయమగును.

అతత్త్వజ్ఞానవశతః స్వేన్ద్రియాక్రమణం వినా
హృది తానవముత్సృజ్య రాగద్వేషేష్వ నారతమ్. 15
ఇదం ప్రాప్తమిదం నేతి జాడ్యాద్వా ఘనమోహదాః
ఆధయః సంప్రవర్తన్తే వర్షాసు మిహికా ఇవ. 16

తత్త్వజ్ఞానము, ఇంద్రియ నిగ్రహములేని కారణముచేతను, చిత్తమున (నిశ్చలవాయువు వంటిదియు ఆరోగ్య కారణమున్నునగు) సూక్ష్మత్వమును త్యజించి నిరంతరము రాగద్వేషములందాసక్తి గల్గియుండుటచేతను, ఈ వస్తువును నేను బొందితిని, ఈ వస్తువును బొందలేదను నీ ప్రకారమగు జడత్వముచేత, వర్షాకాలమందు మంచువలె, మహామోహప్రదములగు ఆధులు (మానసికరోగములు) ప్రవృత్తములగుచున్నవి.

భృశం స్ఫురన్తీష్విచ్ఛాసు మౌర్ఖ్యే చేతస్యనిర్జితే

దురన్నాభ్యవహారేణ దుర్దేశాక్రమణేన చ. 17
దుష్కాలవ్యవహారేణ దుష్క్రియాస్ఫురణేన చ
దుర్జనాసఙ్గదోషేణ దుర్భావోద్భావనేన చ. 18
క్షీణత్వాద్వా ప్రపూర్ణత్వాన్నాడీనాం రన్ధ్రసంతతౌ
ప్రాణే విధురతాం యాతే కాయే తు వికలీకృతే. 19
దోషోత్థకారణం దోషాద్వ్యాధిర్దేహే ప్రవర్తతే
నద్యాః ప్రావృణ్ణిదాఘాభ్యామివాకార విపర్యయః 20

కోరికలు మఱల మఱల స్ఫురించుటచేతను, మూర్ఖత్వముచేతను, చిత్తమును జయింపకుండుటచేతను, దోషభూయిష్ఠమగు నన్నమును భుజించుటచేతను, దోషయుక్తమగు స్థలమున వసించుటచేతను, దోషయుక్తకాలములందు వ్యవహరించుట వలనను, దుష్కర్మలచేతను, దుర్జనసాంగత్యముచేతను, దుష్టభావములం భావించుటచేతను, అన్నరసము ప్రవేశింపమి నాడీరంధ్రములు క్షీణించుటవలనను, లేక, అన్నరసము ద్విగుణీకృతముగ బ్రవేశించుటచే నాడీరంధ్రము లధికప్రపూర్ణములగుటచేతను, కఫపిత్తాదుల ప్రకోపముచే ప్రాణము వ్యాకులమగుటచేతను, దెబ్బ మున్నగునవి తగులుటచే నవయవములు వికలములగుటవలనను, అనేకదోషములద్వారా యస్వస్థతకు కారణభూతమైనట్టి, వ్యాధి దేహమున నుత్పన్నమగుచున్నది. మఱియు, వర్ష, ఉష్ణత్వములచే నదియొక్క యాకారము మార్పు నొందునట్లు, యీ వ్యాధియు దేహాకారమును విపర్యయమొనర్చునదై యున్నది.

ప్రాక్తనీ చైహికీ వాపి శుభా వాప్యశుభా మతిః
యైవాధికా సైవ తథా తస్మిన్యోజయతి క్రమే. 21

పూర్వజన్మయొక్కగాని, ఈ జన్మయొక్కగాని శుభ, అశుభ బుద్ధులలో నేది యధికముగా నుండునో, అదియే యీ వ్యాధియొక్క క్రమమును నియోగించుచున్నది.

అథయో వ్యాధయస్త్వేవం జాయన్తే భూతపఞ్చకే
కథం శృణు వినశ్యన్తి రాఘవాణాం కులోద్వహ. 22

ఓ రఘుకులశ్రేష్ఠ! ఇవ్విధమున భూతపంచకమగు దేహమున నాధివ్యాధులు జనించుచున్నవి. ఇంక నవి యెట్లు నశించునో యా క్రమమును వినుము.

ద్వివిధో వ్యాధిరస్తీహ సామాన్యః సార ఏవ చ
వ్యవహారస్తు సామాన్యః సారో జన్మమయః స్మృతః. 23

వ్యాధి రెండువిధములుగా నుండును—ఒకటి సామాన్యము, మఱియొకటి సారము (దృఢతరము) అందు, ఆకలి, దప్పిక-ఇత్యాది వ్యవహారములచే నుత్పన్నమగునది సామాన్యవ్యాధియనియు, జన్మాది వికారములకు మూలమైనది సార (దృఢతర) వ్యాధియనియు జెప్పఁబడును.

ప్రాప్తేనాభిమతేనైవ నశ్యన్తి వ్యావహారికాః
అధిక్షయేణాధిభవాః క్షీయన్తే వ్యాధయోఽప్యలమ్. 24

ఇష్ట వస్తువు సంప్రాప్తమగుటచే క్షుత్పిపాసాదులవలన జనించు వ్యావహారిక వ్యాధినశించును. ఆధి (మానసికవ్యధ) క్షయించుటచే తదాధిచే నుత్పన్నమగు వ్యాధులున్ను క్షయించును.

ఆత్మజ్ఞానం వినా సారో నాధిర్నశ్యతి రాఘవ
భూయో రజ్జ్వవబోధేన రజ్జుసర్పో హి నశ్యతి. 25

ఓ రాఘవా ! ఆత్మజ్ఞానములేక 'సారము'_అనగా జన్మాది వికారములకు మూలమగు ఆధి నశింపదు. రజ్జువుయొక్క జ్ఞానము పూర్ణముగ లేనిచో సర్పభ్రాంతి నశింపదుకదా !

ఆధివ్యాధివిలాసానాం రామ సారాధిసంక్షయః
సర్వేషాం మూలహా ప్రావృణ్నదీవ తటపీరుధామ్. 26

ఓ రామచంద్రా! వర్షాకాలపు నది తీరముననున్న వృక్షములను సమూలముగ నశింపఁజేయున దెట్లగునో, అట్లనే సార (జన్మాది వికార) రూపమగు ఆధియొక్క క్షయము, సమస్త ఆధివ్యాధివిలాసములను సమూలముగ నిశింపఁజేయునదైయున్నది.

అనాధిజా వ్యాధయస్తు ద్రవ్యమన్త్రశుభక్రమైః
చికిత్సకాది శాస్త్రోక్తైర్నశ్యన్త్యన్యైరిహాథవా. 27

సామాన్యవ్యాధులు వైద్యులచేతను, శాస్త్రాదుల చేతను జెప్పబడిని, ఔషధి, మంత్రాది కర్మలచేతను, లేక, పెద్దలచే పరంపరగా జెప్పబడుచువచ్చిన చికిత్సాపద్ధతులచేతను వినాశమొందును.

స్నానమన్త్రౌషధోపాయా వక్తుశ్చాధిగతాని చ
త్వయా చికిత్సాశాస్త్రాణి కిమన్యదుపదిశ్యతే. 28

ఓ రామచంద్రా! లోలార్కాది పవిత్ర తీర్థములందలి స్నానము, మంత్రౌషధాద్యుపాయములు, పెద్దలచేతను, వైద్యశాస్త్రములచేతను జెప్పఁబడిన ఔషధములు నీవు స్వయముగనే యెఱింగియున్నావు. కాన అన్యముగ నీకు నే జెప్పఁవలసిన దేమున్నది?

శ్రీరామ ఉవాచ:—

ఆధేః కథం భవేద్వ్యాధిః కథం చ స వినశ్యతి
ద్రవ్యాదితరయా యుక్త్యా మన్త్రపుణ్యాదిరూపయా. 29

శ్రీరాముడు:___ మహాత్మా! ఆధిచే నుత్పన్నమగు వ్యాధి ఔషధములకంటె వేఱైన మంత్రపుణ్యాదిరూపయుక్తులచే నెట్లు నశించును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

చిత్తే విధురితే దేహః సంక్షోభమనుయాత్యలమ్
తథా హి రుషితో జన్తురగ్రమేవ న పశ్యతి 30

శ్రీ వసిష్ఠుఁడు.___ ఓ రామచంద్రా! మానసికవ్యధలచే చిత్తము వ్యాకులముకాఁగా దేహమున్ను నతివ్యాకుల మగుచున్నది. ఎట్లనిన, క్రోధపరవశుఁడు తన యెదుటనున్న పదార్థమును గూడ గాంచజాలడు కదా!

అనవేక్ష్య పురోమార్గమమార్గమనుధావతి
పరిక్షతం మార్గముత్సృజ్య శరార్తో హరిణో యథా. 31

మఱియు బాణముచేఁ బీడితమగు జింక తన యెదుటనున్న మార్గమును వదలి, అన్యమార్గమున బరువిడునట్లు, అట్టి మానసికవ్యథాగ్రస్తుఁడు సమ్ముఖమున నున్న మార్గమును గాంచక కుమార్గము వైపునకుఁ బరువిడును,

సంక్షోభాత్సామ్యముత్సృజ్య వహన్తి ప్రాణవాయవః
దేహే గజప్రవిష్టేన పయాంసీవ సరిత్తటే. 32

నదియందేనుఁగు ప్రవేశించుటచే తన్నదీజలము తీరమువైపునకుఁ బ్రవహించు నట్లు, మానసికవ్యథలచే వ్యాకులమగు ప్రాణవాయువు తన సమత్వమును వదలి యన్యమార్గమున, బ్రవహించును.

అసమం వహతి ప్రాణే నాడ్యో యాన్తి విసంస్థితిమ్
అసమ్యక్సంస్థితే భూపే యథా వర్ణాశ్రమక్రమాః. 33

రాజు అవ్యవస్థితుఁడై యుండిన, వర్ణాశ్రమక్రమము విషమమై పరఁగునట్లు, ప్రాణవాయువు అవ్యవస్థితముగాఁ బ్రవహించుటచే నాడులున్ను విషమత్వము, జెందును.

కాశ్చిన్నాడ్యః ప్రపూర్ణత్వం యాన్తి కాశ్చిచ్చ రిక్తతామ్
ప్రాణా విధురితే దేహే సర్వతః సరితో యథా. 34

ప్రాణవాయువుయొక్క విషమత్వముచే శరీరము విహ్వలముకాఁగా నదీస్రోతములవలె కొన్ని నాడు లధికపూర్ణములైయు, కొన్ని నాడులు రిక్తములుగాను నుండుచున్నవి.

కుజీర్ణత్వమజీర్ణత్వమతిజీర్ణత్వమేవ వా
దోషాయైవ ప్రయాత్యన్నం ప్రాణసంచారదుష్క్రమాత్. 35

ప్రాణసంచారముయొక్క క్రమము సరిలేమి భుజింపఁబడిన యన్నము కుజీర్ణత్వముఁగాని, అజీర్ణత్వముగాని, లేక, అతి జీర్ణత్వముఁగాని (ఇట్లాయాదోషములను) బొందుచుండును.

యథా కాష్ఠాని నయతి ప్రాచీదేశం సరిద్రయః
తథాన్నాని నయత్యన్తః ప్రాణవాతః స్వమాశ్రయమ్. 36

నదీ ప్రవాహము కాష్ఠములను దూర్పుదిక్కునకుఁ జేర్చునట్లు, సమానమను ప్రాణవాయువు భుజించిన యన్నములను రసమొనర్చి శరీరమంతటను నాయాస్థానములకుఁ జేర్చుచుండును.

యాన్యన్నాని నిరోధేన తిష్ఠన్త్యన్తశ్శరీరకే
తాన్యేవ వ్యాధితాం యాన్తి పరిణామస్వభావతః. 37

నిరోధముచే నేయన్నములు శరీరాంతర్గతమున నుండునో, అవియే ధాతువైషమ్యరూప పరిణామముచే స్వభావవశమున వ్యాధిత్వము నొందుచున్నవి.

ఏవమాధేర్భవేద్వ్యాధిస్తస్యాభావాచ్చ నశ్యతి
యథా మన్త్రైర్వినశ్యన్తి వ్యాధయస్తత్క్రమం శృణు. 38

ఓ రామచంద్రా! ఈప్రకారముగ, ఆధిచే వ్యాధి సంభవించుచున్నది; మఱియు ఆధిలేకుండిన వ్యాధియు నశించుచున్నది. ఇఁక మంత్రాదులచే వ్యాధి యెట్లు నశించునో, యా క్రమమునుగూర్చి వినుము.

యథా విరేకం కుర్వన్తి హారీతక్యః స్వభావతః
భావనావశతః కార్యం తథా యరలవాదయః. 39

హరీతకీ ఫలము (కరక్కాయ) లెట్లు విరేచనరూపకార్యమును స్వభావముగనే నొనర్పఁజేయుచున్నవో, అట్లే వాయ్వగ్నిభూజలాది బీజాత్మకములైన మంత్రవర్ణములున్ను మాంత్రికుని భావనావశమున్న, రోగాకారముగ, బరిణతినొందిన యన్నరసముల యొక్క పాచనాదికార్యములఁ జేయుచున్నవి.

శుద్ధయా పుణ్యయా సాధో క్రియయా సాధుసేవయా
మనః ప్రయాతి నైర్మల్యం నికషేణేవ కాఞ్చనమ్. 40

సాధువగు నో రామచంద్రా! ఒరపిడిరాతిచే బంగారము నైర్మల్యమునందునట్లు శుద్ధమై, పవిత్రమైనట్టి సాధుసేవయను క్రియచే మనస్సున్ను నిర్మలత్వము నొందుచున్నది.

ఆనన్దో వర్ధతే దేహే శుద్ధే చేతసి రాఘవ
పూర్ణేన్దావుదితే వ్యాప్త నైర్మల్యం భువనే యథా. 41

ఓ రాఘవా! పూర్ణచంద్రుఁ డుదయించుటచే నీప్రపంచమున నెట్లు ప్రకాశము విజృంభించునో, శుద్ధచిత్తమున నానందమున్ను యట్లే వృద్ధినొందును.

సత్త్వశుద్ధ్యా వహన్త్యేతే క్రమేణ ప్రాణవాయవః
జరయన్తి తథాన్నాని వ్యాధిస్తేన వినశ్యతి. 42

అంతఃకరణశుద్ధిచేత ప్రాణవాయువు సక్రమముగ బ్రవహించును. మఱియు నన్నమును లెస్సగ బచనమొనర్చును. దాన, సమస్తవ్యాధులు నశించును.

ఆధివ్యాధ్యోరితి ప్రోక్తా నాశోత్పత్తిక్రమా త్వయి
కుణ్డలిన్యాః కథా యోగాదధునా ప్రకృతం శృణు. 43

ఓ రామచంద్రా! ఇవ్విధమున కుండలినీకథాప్రసంగమున ఆధివ్యాధుల వినాశోత్పత్తి క్రమములను నీకెఱిఁగించితిని. ఇఁక ప్రస్తుతప్రసంగమునుగూర్చి యాలకింపుము.

పుర్యష్టకపరాఖ్యస్య జీవస్య ప్రాణనామికామ్
విద్ధి కుణ్డలినీమన్తరామోదస్యేవ మఞ్జరీమ్. 44

ఓ రామచంద్రా! సుగంధమునకు, బుష్పలత యాధారమైనట్లు, పుర్యష్టకమను పేరుగల జీవునకుఁ బ్రాణమను పేరుగల కుండలిని యాధారమైయున్నదని యెఱుఁగుము.

తాం యదా పూరకాభ్యాసాదాపూర్య స్థీయతే సమమ్
తదైతి మేరవం స్థైర్యం కాయస్యాపీనతా తథా. 45

ఆ కుండలినియందు పూరకమను ప్రాణాయామాభ్యాసముచే సమరూపమున నెపుడు జీవుడు స్థితుడగునో, అపుడు మేరువువంటి స్థిరత్వమున్ను, శరీరముయొక్క గురుత్వమున్ను సిద్ధించుచున్నవి.

యదా పూరకపూర్ణాన్తరాయత ప్రాణమారుతమ్
నీయతే సంవిదేవోర్ధ్వం సోఢుం ధర్మక్లమం శ్రమమ్. 46
సర్పీవ త్వరితైవోర్ధ్వం యాతి దణ్డోపమాం గతా
నాడీః సర్వాః సమాదాయ దేహబద్ధా లతోపమాః. 47

పూరకముచే నెపుడు శరీరమంతయు మూలాధారమునుండి బ్రహ్మరంధ్రమువఱకు దిన్నగా నిలిపి ప్రాణవాయువుయొక్క యాకర్షణపూర్వకముగ, శారీరిక, మానసిక పరిశ్రమను సహించుట కొఱకు కుండలినీ సంవిత్తు పైకి పంపబడునో, అపుడు ప్రాణవాయువుయొక్క యాకర్షణముచే కఱ్ఱ వలె దీర్ఘత్వమునొంది యా కుండలిని నాడులన్నింటిని దనతోఁ దీసికొని దేహమందు బంధింపఁబడిన లతవలె శీఘ్రముగఁ బైకిఁబోవుచున్నది.

తదా సమస్తమేవేదముత్ప్లావయతి దేహకమ్
నీరన్ధ్రం పవనాపూర్ణం భస్త్రేవామ్బుతలాన్తరమ్. 48

బావినుండి పైకి నీడ్వబడుచుండు చర్మపాత్రము (తోలుసంచి) తనయందుఁ బ్రవేశించిన జలము నెట్లు పైకి తీసికొనిపోవునో, అట్లే వాయువుచేఁ బూర్ణమగు ఛిద్రరహితమగు యాదేహము నున్ను నత్తఱి కుండలినీ సంవిత్తు పైకిఁ గొనిపోవుచున్నది. ఇదియే యోగియొక్క ఆకాశగమనము.

ఇత్యభ్యాసవిలాసేన యోగేన వ్యోమగామినా
యోగినః ప్రాప్నువన్త్యుచ్చైర్దీనా ఇన్ద్రిదళామిమ 49

ఇట్లు, ఆకాశగమనయోగముయొక్క యభ్యాసక్రియచే యోగులు, — దీనజనులింద్రపద విని బొందినట్లు యూర్ధ్వదికేను బొందుచున్నారు

బ్రహ్మనాడీ ప్రవాహేణ శక్తిః కుణ్డలినీ యదా
బహిరూర్ధ్వం కపాటస్య ద్వాదశాఙ్గులమూర్ధని. 50
రేచకేన ప్రయోగేన నాడ్యన్తరనిరోధినా
ముహూర్తం స్థితిమాప్నోతి తదా వ్యోమగ దర్శనమ్. 51

మఱియు నెపుడితరనాడీవ్యాపార నిరోధకమగు రేచకప్రాణాయామ ప్రయోగముచే కుండలినీ శక్తి బ్రహ్మ (సుషుమ్న) నాడియందు ప్రాణవాయు ప్రవాహముచే, శిరస్సుయొక్క యిరు కవాటముల సంధిరూపమగు కవాటమునకుఁ బన్నెండంగుళముల వెలుపలనున్న 'షోడశాంత'మను స్థానమున ముహూర్తకాలముండునో, అపు డాకాశమున సంచరించు సిద్ధులయొక్క దర్శనమగును.

శ్రీరామ ఉవాచ: —

దర్శనం కీదృశం బ్రహ్మన్నయనాంశుగణం వినా
అదివ్యానామిన్ద్రియాణాం తత్త్వమేవం కథం భవేత్. 52

శ్రీరాముఁడు:— బ్రహ్మస్వరూపా! మనయొక్క యింద్రియములు అదివ్యములై యుండ, దివ్యేంద్రియ (దివ్యనేత్ర) ప్రకాశము లేక, 'షోడశాంత' స్థానమున ప్రాణధారణ యొనర్చి నంతమాత్ర మున సిద్ధుల దర్శన మెట్లగునో, యాతత్త్వ మెఱింగింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

న కేచన మహాబాహో భూచరేణ నభస్వతః
అదివ్యేనాశ్రితా జ్ఞానైర్దృశ్యన్తే పురుషేన్ద్రియైః. 53

శ్రీవసిష్ఠుఁడు:— ఓ మహాబాహూ! భూమిపై, చరించు జనులు మలినమై, అజ్ఞానాశ్రిత మైనట్టి తమ యింద్రియములచే వాయురూపులగు ఆకాశచారులైన సిద్ధుల నెన్నిఁటికిని గాంచలేరు.

విజ్ఞానాద్దూరసంస్థేన బుద్ధినేత్రేణ రాఘవ
దృశ్యన్తే వ్యోమగాః సిద్ధాః స్వప్నవత్స్వార్థదా అపి. 54

ఓ రాఘవా! కాని, విజ్ఞానము (యోగాభ్యాసము) చే శుద్ధమైన మనస్సువలన దూరమున నున్నట్టి బుద్ధియను నేత్రముద్వారా ఆకాశచారులగు సిద్ధులు కానుపింతురు. మఱియు, స్వప్నము వలె వారు జనులకు వారివారి యభీష్టఫలములు నొసంగువారునై యున్నారు.

స్వప్నావలోకనం యద్వత్తద్వత్సిద్ధావలోకనమ్
కేవలోఽథ విశేషోఽయం సిద్ధప్రాప్తౌ స్థిరార్థతా. 55

స్వప్న దర్శనమువలెనే సిద్ధులయొక్క దర్శనమున్ను నగును. కాని సిద్ధుల ప్రాప్తియందు వరదానాది ఫలరూప పదార్థముల స్థిరత్వముండును— ఇంతమాత్రమే విశేషము.

ముఖాద్బహిర్ద్వాదశాన్తే రేచకాభ్యాసయుక్తితః
ప్రాణే చిరం స్థితిం నీతే ప్రవిశత్యపరాం పురీమ్. 56

రేచకాభ్యాసరూపమగు యుక్తిచే ముఖమునకుఁ బండ్రెండంగుళముల వెలుపల ప్రాణ వాయువును చిరకాలముంచుటచే యోగి మఱియొకశరీరమునఁ బ్రవేశింపగల్గును.

శ్రీరామ ఉవాచ:—

వద స్వభావస్య కథం బ్రహ్మన్నచల సంస్థితిః
వక్తారః సానుకమ్పా హి దుష్ప్రశ్నేఽపి న ఖేదినః. 57

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఈ మాయామయ ప్రపంచము అనియతస్వభావము గలదని పూర్వప్రసంగమున దామనేకపర్యాయములు వచించియుంటిరి. అట్లైన నొక్క స్వభావము యొక్క నియతమగు (అచంచల) స్థితి యెట్లు సంభవించునో వచింపవేడెద. దుష్టప్రశ్నలొనర్పబడినను వక్తలగు మహాత్ములు దయఁజూపుదురేకాని ఖేదము నొందరుగదా!

శ్రీవసిష్ఠ ఉవాచ:—

శక్త్యా తు స్వభావాఖ్యా యథా స్ఫురతి చాత్మనః
సర్గాదిషు తథైవాసౌ స్థితిం యాతీతి నిశ్చయః. 58

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సత్యసంకల్పుఁడగు పరమాత్మయొక్క స్వభావము, లేక నియతి యనుశక్తి కల్పాదియందెయ్యది స్ఫురించుచున్నదో అయ్యది కల్పపర్యంతము నుండుననుట నిక్కము.

అవస్తుత్వాదపిద్యాయా వస్తుశక్తిరపి క్వచిత్
భిద్యతే దృశ్యతే హ్యఙ్గ వసన్తే శారదం ఫలమ్. 59

ప్రియుఁడవగు రాఘవా! అవిద్య అవస్తువు అగుటఁబట్టి కొన్నికొన్ని దేశములందు శరదృతువుయొక్క (వ్రీహ్యాది) ఫలము వసంతకాలమునఁ గన్పడునట్లు — వస్తుశక్తియు నచటచట భిన్నముగా గన్పించుచుండును.

సర్వమేవమిదం బ్రహ్మ నానాఽనానాతయా స్థితమ్
జృమ్భతే వ్యవహారార్థం కేవలం కథితస్థితి. 60

ఏకముగను, అనేక రూపములుగను, అనియతస్వభావముగను నున్న యీ జగత్తంతయు బ్రహ్మరూపమే యైయున్నది. జీవుల కర్మ, తత్ఫలభోగ వ్యవహారము కొఱకు మాత్రము అజ్ఞాతమగు బ్రహ్మమే కొంతకాలమువఱకు నియతస్థితిని ధరించి విజృంభించుచున్నది.

శ్రీరామ ఉవాచ:-

సూక్ష్మచ్ఛిద్రాదిగత్యర్థం పూరణార్థం చ ఖస్యవా
అణుతాం స్థూలతాం వాపి కాయోఽయం నీయతే కథమ్ 61

శ్రీరాముఁడు:—ఓ మునీశ్వరా! సూక్ష్మరంధ్రముగుండా పోవుటకై దేహముయొక్క అణుత్వమును, ఆకాశమును బూర్ణమొనర్చుటకై దేహముయొక్క స్థూలత్వమును యోగులెట్లు పొందగలరు!

శ్రీవసిష్ఠ ఉవాచ:—

కాష్ఠక్రకచయోః శ్లేషాద్యథా ఛేదః ప్రవర్తతే
ద్వయోః సంఘర్షణాదగ్నిః స్వభావాజ్జాయతే తథా. 62

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కొయ్య, ఱంపము — ఈరెంటియొక్క సంఘర్షణముచే కొయ్య రెండుభాగము లగునట్లు, ప్రాణాపానముల సంఘర్షణముచే జఠరాగ్ని స్వభావముగనే యుత్పన్నమగుచున్నది.

మాంసం కుయన్త్రజఠరే స్థితం శ్లిష్టముఖం మిథః
ఊర్ధ్వాధః సంమిలత్స్థూలద్వ్యాస్యః స్థైరివ వైతసమ్. 63

ఈ దేహమను యంత్రముయొక్క యుదరభాగమున నాభికి, పైనను, క్రిందను బరస్పరము కలియుచుండు ముఖములుగల, భస్త్రద్వయము (రెండుతోలుతిత్తులు) వంటి స్థూలమాంసము — క్రింద జలముచేతను, పైన వాయువుచేతను నీడ్వఁబడుచుండు, ఘాసనల పొదరింటివలె — కదలుచున్నది.

తస్యాకుణ్డలినీ లక్ష్మీర్నిలీనా న్తర్నిజాస్పదే
పద్మరాగసముద్గస్య కోశే ముక్తావళీ యథా. 64

దాని యధోభాగమున, అనఁగా మూలాధారమను దననిజస్థానమున, సర్వులకుఁ బ్రాణప్రద మగుటచే లక్ష్మివంటిదైన కుండలిని,-ముత్యముల పెట్టెలో ముక్తాహారమువలె వెలయుచున్నది.

ఆవర్తఫలమాలేవ నిత్యం సలసలాయతే
దణ్డాహ తేవ భుజగీ సమున్నతివివర్తినీ. 65

తిరుగుచున్న రుద్రాక్షమాలవలె నది నిత్యము సరసరలాడుచుండును. మఱియు, కఱ్ఱచే గొట్టఁబడిన ఆఁడుసర్పమువలె నూర్ధ్వముఖముచే బరివర్తనశీలమై యుండును.

ద్యావాపృథివ్యోర్మధ్యస్థా క్రియేవ స్పన్దధర్మిణీ
సంవిన్మధువిభోధార్కా హృత్పద్మస్ఫుటషట్పదీ. 66

భూమ్యాకాశముల మధ్య ప్రాణులయొక్క యూర్ధ్వాధోగతులకు నిమిత్తములై విహిత నిషిద్ధ క్రియలెట్లు కలవో, అట్లనే యీ కుండలిని ప్రాణాపానముల యూర్ధ్వాధోగతులకుఁ గారణమై యుండుటచే సంచలన శీలమును, నేత్రాదుల జ్ఞానమున, రూపాది విషయాస్వాదనా బోధనమున సూర్యునివంటిదియు, హృదయకమలముయొక్క భ్రమరమునునై యొప్పుచున్నది.

తత్సర్వం శక్తిపద్మాది బాహ్యానాభ్యన్తరైస్తయా
హృది వ్యాధూయతే వాతైః పత్రవృన్దమివాభితః. 67

బాహ్యవాయువు చెట్లయాకులనంతటను, గదల్చునట్లు, జ్ఞాన, కర్మేంద్రియ శక్తులు, హృదయకమలము, నాడీ సమూహము—వీటినన్నిటిని కుండలిని అభ్యంతరవాయువుచేఁ జలింపఁ జేయుచున్నది.

యద్వద్వ్యోమ స్ఫురత్యఙ్గ స్వభావాత్తత్ర వాయవః
బలవన్మృదు యత్కించిద్భృశం కవలయన్తి తత్. 68

విశాలరూపముగ స్ఫురించు ఈ బాహ్యాకాశమున వాయువెట్లు బలవత్తరమైన కాష్ఠశిలాదులను, కోమలమైన తృణాదులనుగూడ జీర్ణీభూతమొనర్చుచున్నదో, అట్లే యాభ్యంతర హృదయాకాశమునను ప్రాణవాయువు భుజించిన యన్నాదులను జీర్ణమొనర్చుచున్నవి.

వాతైరాహన్యమానం తత్పద్మాది తరలాయతే
హృద్యన్యాన్యేతి కార్శ్యేన పల్లవాది యథా తరోః. 69

హృదయపద్మము, నాడులు మున్నగునవి ప్రాణవాయువుచే గొట్టఁబడి కంపించుచున్నవి. అట్లవి కంపించుటచే హృదయమందు ప్రవేశించిన యన్నము—వృక్షమందుఁ బ్రవేశించిన భూమియందలి రసము పల్లవ, పుష్ప, ఫలాదులరూపమున బరిణతి నొందునట్లు — ప్రథమమున రసముగను, రసమునుండి రక్తముగను, రక్తమునుండి మాంసముగను. మాంసమునుండి త్వక్కుగను, త్వక్కునుండి మేదస్సుగను, మేదస్సునుండి మజ్జగను, మజ్జనుండి అస్థిగను అస్థినుండి శుక్రము రేతస్సుగను ఇట్లు విచిత్రముగా నొకపదార్థమునుండి మఱియొక పదార్థమున పరిణతి నొందుచున్నది.

దేహేష్వాజరణం సర్వరసానాం పవనోఽన్వహమ్
జనయత్యగ్నిమన్యోన్య సంఘర్షా ద్వనవేణువత్. 70

అరణ్యమున నున్న వెదుళ్లు యొకదానినొకటి రాచుకొని యగ్ని నుత్పన్న మొనర్చునట్లు దేహమందలి ప్రాణవాయువు, రసములన్నింటిని, యంతిమధాతువైన శుక్రపర్యంతము పరిణామ మొందించుటకై ప్రతిదిన మగ్ని నుత్పన్న మొనర్చుచున్నది.

స్వభావశీతవాతాత్మా దేహస్తేనోష్ణ్యమేత్యథ
ఉదితేన స సర్వాఙ్గే భువనం భానునా యథా. 71

సూర్యునిచే ముల్లోకము లుష్ణతను బడయునట్లు, శరీరమంతట ప్రదీప్తమైన జఠరాగ్నిచే శీతవాతస్వభావముగల యీదేహ మూష్ణతను బడయుచున్నది.

సర్వతో విచరేదస్మిం స్తత్తేజస్తారకాకృతి
హృత్పద్మహేమభ్రమరో యోగినాం చిన్త్యతాం గతమ్. 72

నక్షత్రములవంటి యాకారము గలదియు, హృదయకమలమున బంగారపు తుమ్మెదవలె నున్నదియు, యోగులయొక్క ఉపాస్యమును నగు ఆ (జఠరాగ్ని) తేజము దేహమందంతటను సంచరించుచున్నది.

తత్ప్రకాశమయం జ్ఞానం చిన్తితం సత్ప్రయచ్ఛతి
యేన యోజనలక్షస్థం వస్తు నిత్యం హి దృశ్యతే. 73

అట్టి ప్రకాశమునే చిద్రూపముగా, జింతించినచో సర్వ పదార్థ దర్శనసిద్ధి యుదయించును. అత్తఱి, యోగి లక్షయోజనముల దూరమున నున్న వస్తువునుగూడ నిత్యమున లోకింపఁగల్గును.

తస్యాగ్నే ర్వాడవస్యేవ జలం సంశుష్కమిన్ధనమ్
మాంసపఙ్కజఖణ్డాఢ్యం హృత్సరః కోశవాసినః. 74

సముద్రజలము బడబాగ్నికి ఇంధనమగునట్లు, మాంసరూప కమలముయొక్క ఖండములచే, బూర్ణమైన హృదయమను దటాకమున వసించు ఆ జఠరాగ్నికి, శరీరసంబంధములైన యన్నజలాదులు శుష్కించిన యింధనముల పగిది యగును.

యదచ్ఛం శీతలత్వం చ తదస్యాత్మేన్దురుచ్యతే
ఇతీన్దోరుత్థితః సోఽగ్నిరగ్నీషోమౌ హి దేహకః. 75

శరీరమున స్వచ్ఛత్వ, శీతలత్వము లెవ్వి కలవో, అవి యీ యగ్నికి చంద్రుఁడగును. ఇవ్విధమున చంద్రునిచే నయ్యగ్ని ప్రకటితమగు చున్నది. ఏలయనిన, దేహ మగ్ని, చంద్రమయముగదా!

సర్వం తూష్ణాత్మకం కించిత్తే జోఽర్కాగ్న్యభిధం విదుః
శీతాత్మకం తు సోమాఖ్యమాభ్యామేవ కృతం జగత్. 76

బాహ్యమున నుష్ణవంతమగు జగత్తెయ్యది కలదోయది సూర్యునియొక్క, లేక, అగ్నియొక్క తేజోరూపమేయైయున్నది. అట్లే శీతమగు జగత్తు చంద్రరూపమేయగును, ఏలయనిన ఈరెంటిచేతనే జగత్తు నిర్మింపఁబడినది

విద్యావిద్యా స్వరూపేణ సర్వం సదసదాత్మనా
జగద్వా యేన నిర్వృత్తం తదేవైవం విభజ్యతే. 77

అథవా, చిజ్జడములను నుభయస్వరూపఘటితమగు సదసదాత్మక మైన అవిద్యాశబల బ్రహ్మమే జగదాకారముగ, బ్రవర్తించి ప్రకాశ శీతలత్వములచే నగ్ని, చంద్రరూపములుగ విభజింపఁబడినది.

సంవిత్ప్రకాశం విద్యాది సూర్యమగ్నిం విదుర్బుధాః
అసజ్జాడ్యం తమో విద్యాద్యావాహుః సోమం మపినీణః 78

సంవిత్ (జ్ఞాన) ప్రకాశము, విద్య (ఆత్మజ్ఞానము) మున్నగువానిని బుద్ధిమంతులగు పండితులు సూర్యుడు, లేక, అగ్నియనుచున్నారు. అథేవిధమున, అసత్తు, జడత్వము, అవిద్య మున్నగువానిని చంద్రుడను చున్నారు.

శ్రీరామఉవాచ!—

వహ్నిర్వాయ్వాత్మనః సోమాదుదేతీతి మునీశ్వర
సోమస్యోత్పత్తిమధునా వద మే వదతాంవర. 79

శ్రీ రాముడు.— ఓ మునీశ్వరా! వాయురూపుఁడగు చంద్రునిచే నగ్నియొక్క యుత్పత్తి యగునని తాము వచించిన సంగతిఁ దెలిసికొంటిని, ఇఁక నిపుడు చంద్రునియొక్క యుత్పత్తిని దెలియఁజేయుఁడు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అగ్నిషోమౌ మిథః కార్య కారణే చ వ్యవస్థితే
పర్యాయేణ సమం చైతౌ ప్రజీవేతే పరస్పరమ్. 80

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! అగ్ని చంద్రులిరువురును బరస్పరము కార్యమొనర్చుటకు వ్యవస్థితులై యున్నారు. వారు క్రమముగను, ఏకకాలమునను నొకరికొకరుపజీవకులై యుందురు.

జన్మాఙ్గబీజాఙ్కురవత్తథా దివసరాత్రివత్
స్థితిశ్ఛాయాతపసమా కేవలా స్సైతయోర్భవేత్. 81

ఆ యగ్ని చంద్రుల యుత్పత్తి, బీజాంకురములవలె యొకటి మఱియొకదానియుపాదానముగను, దినరాత్రులవలె పరస్పర నిమిత్తముగను, నుండును. మఱియు వానిస్థితి ఛాయాతపములవలె పరస్పర ప్రతిఘాతమై యొప్పును.

తుల్యకాలోపలమ్భాసా విత్థం ఛాయాతపస్థితిః
కేవలైకోపలమ్భాభ్యా స్థితిర్దివసరాత్రివత్. 82

ఏకకాలమున నవి సంప్రాప్తించినపుడు, వానిస్థితి ఛాయాతపములవలె నుండును. క్రమముగ సంప్రాప్తించినపుడు దినరాత్రులవలె నుండును.

కార్యకారణభావశ్చ ద్వివిధః కథితోఽనయోః
స్వరూప పరిణామోత్థో వినాశపరిణామజః. 83

ఏకస్మాద్యద్ద్వితీయస్య సంభవోఽఙ్కుర బీజవత్
కార్యాకారణభావోఽసౌ సద్రూప పరిణామజః. 84

ఏకనాశే ద్వితీయస్య యద్భావో దినరాత్రివత్
కార్యకారణభావోఽసౌ వినాశ పరిణామజః. 85

వాని కార్యకారణభావము ద్వివిధముగా నుండును. ఒకటి సద్రూపపరిణామముచే నుత్పన్నమైనది; మఱియొకటి వినాశపరిణామముచే నుత్పన్నమైనది. బీజాంకురములవలె నొకదానినుండి మఱియొకదానియొక్క సంభవమగుట సద్రూపపరిణామముచే నుత్పన్నమైన కార్యకారణభావము. దినరాత్రులవలె నొకటి నశించినపుడు మఱియొకటి సంభవించుట వినాశపరిణామముచే నుత్పన్నమైన కార్యకారణభావము.

సద్రూపపరిణామస్య మృద్ఘటక్రమసంస్థితేః
అక్షోపలమ్భాదితరత్ప్రమాణం నోపయుజ్యతే. 86

మృత్తికనుండి ఘటమువంటి స్థితిరూపమగు సద్రూపపరిణామమునకుఁ బ్రత్యక్షముకంటె నన్యమగు ప్రమాణము యుక్తముకానేరదు,

వినాశ పరిణామస్య దినరాత్రిక్రమస్థితేః
అభావోఽప్యేకవస్తుస్థో గతో ముఖ్యప్రమాణతామ్. 87

దిన, రాత్రిక్రమముయొక్క స్థితిరూపమగు వినాశపరిణామమున–దినమందు రాత్రి కలియకుండుటచే–ఒకవస్తువుయొక్క అభావమును దెలియఁజేయునట్టి అనుపలబ్ధిప్రమాణము యుక్తమగును.

అనాస్థా నాస్తి కర్తృత్వమిత్యాద్యాః యుక్తివాదినః
అవజ్ఞయా బహిష్కార్యాః స్వానుభూత్యపలాపినః. 88

ప్రకాశమాత్రముచే నుపక్షీణమగు దినముయొక్క స్థానము రాత్రియొక్క రచనయందు లేదనియు, మృత్తిక యచేతనమగుటచే ఘటముయొక్క రచనయందు కర్తృత్వము లేదనియు ఇట్లనేక యుక్తుల, బల్కు వాదులను బుద్ధిమంతులగువారు తిరస్కారపూర్వకముగ బహిష్కరించవలెను. ఏలన, వారి మతమందు అనాస్థా (అస్థాన) బుద్ధి అకర్తృత్వ బుద్ధిని జనింపఁజేయుచున్నది.

ప్రత్యక్షవదభావోఽపి ప్రమైవ రఘునన్దన
అగ్న్యభావోఽపి శీతస్య ప్రమాణం సర్వజన్తుషు. 89

ఓ రఘునందనా! ప్రత్యక్షమువలె అభావమున్ను నొక ప్రమాణమే. ఎట్లనిన, ఉష్ణముయొక్క యభావము శీతముయొక్క యనుమానమందెల్లరకును బ్రమాణమైయున్నదిగదా!

అగ్నిర్ధూమతయా భాగాద్యాం ప్రయాతి పయోదతామ్
సద్రూపపరిణామేన తదగ్నిః సోమకారణమ్. 90

అగ్నిర్నష్టతయా శైత్యాదసావేవ ప్రయాతి యత్
వినాశపరిణామేన తదగ్నిః సోమకారణమ్. 91

ధూమభాగముచే నగ్ని మేఘరూపమును బొందు క్రియయందు, సద్రూపపరిణామముచే నగ్ని చంద్రునకుఁ గారణమైయున్నది. మఱియు, అగ్ని నశించి, శీతత్వముచే వాయురూపమును బొందు క్రియయందు, అగ్ని వినాశపరిణామముచే చంద్రునకుఁ గారణమైయున్నది.

సప్తామ్బుధిపయః పీత్వా ధూమోద్గారేణ వాడవః
పయోదతాం ప్రయాతేన తదేవ జనయత్యలమ్. 92

బడబాగ్ని! ధూమాతిశయములచే సప్తసముద్రముల జలమును ద్రావి, మేఘరూపమును ధరించి, మఱల జలరూప చంద్రుని పూర్ణరీతి నుత్పన్న మొనర్చుచున్నది.

అర్కః పీత్వా నిశానాథమామావాస్యం పునఃపునః
ఉద్గిరత్యమలే పక్షే మృణాలమివ సారసః. 93

సూర్యరూప తేజము అమావాస్యవఱకు చంద్రుని మఱల మఱల త్రాగి, తిరిగి శుక్ల పక్షమున సారసపక్షి కమలనాళమును గ్రక్కునట్లు యథ్దానిని వెడలఁగ్రక్కుచున్నది.

పీత్వామృతోపమం శీతం ప్రాణః సోమముఖాగమే
అభ్రాగమాత్పూరయతి శరీరం పీనతాం గతః. 94

ముఖముచలె శోభాయుక్తమైన చంద్రునితోఁగూడిన వసంత, గ్రీష్మర్తువులందు ఉష్ణవాయువుచే భూమియొక్క అమృతమువంటి శీతలజలమును ద్రాగి, తిరిగి వర్షర్తువునందు, మేఘముయొక్క యాగమనముచే స్థూలమై జల (రస) రూప, చంద్రునియొక్క వృష్టిచే జగత్తుయొక్క శరీరమును ఒరి పూర్ణమొనర్చుచున్నది.

జలమప్యుదపాం భోగే ప్రయాత్యర్కస్య రశ్మితామ్
సద్రూపపరిణామేన తజ్జలం వహ్నికారణమ్. 95

సూర్యునియొక్క కిరణములచేతనే జలము పానమొనర్పబడునదైన, అట్టి కల్పనచేఁగూడ జలము సద్రూప పరిణామముచే సూర్యునియొక్క కిరణస్థితిని పొందుటవలన, జలరూపచంద్రుడు అగ్నియొక్క కారణమాయెనుఁగదా!

నాశం త్వకతయా తోయమూష్ణత్వాదేతి హ్యగ్నితామ్
వినాశపరిణామేన తత్తోయం వహ్నికారణమ్. 96

ఉష్ణత్వకారణమున నాశముద్వారా జలమున్ను అగ్నిరూపత్వమును బొందుచున్నది. కాన, వినాశ పరిమాణముచే ఆజలము అగ్నికి, గారణమైయున్నది.

అగ్నేర్వినాశే సద్రూపపరిణామో నిశాకరః
ఇన్దోర్వినాశే సద్రూపపరిణామో హుతాశనః 97

అగ్నియొక్క నాశమున సద్రూప పరిణామము చంద్రుడును, చంద్రుని నాశమున సద్రూపపరిణామ మగ్నియు నైయున్నది.

హుతాశో నాశమాగత్య సోమో భవతి వై తథా
దివసో నాశమాగత్య రాత్రిర్భవతి వై యథా. 98

పగలు నాశమొంది రాత్రిరూప మెట్లగుచున్నదో, అట్లే అగ్ని నశించి చంద్రరూపమగుచున్నది.

తమఃప్రకాశయోశ్ఛాయాతపయోర్దినరాత్రయోః
మధ్యే విలక్షణం రూపం ప్రాజ్ఞైరపి న లభ్యతే. 99

తమఃప్రకాశ, ఛాయాతప, దినరాత్రుల మధ్య తద్విలక్షణమైన సద్రూప బ్రహ్మము ప్రాజ్ఞులచేఁగూడ (శృంగగ్రాహిక న్యాయమువలె 'ఇదంతా'రూపమున) లభింపఁజాలదు.

సంధిరప్యవిలోపః స్యాదేతయోరేవ తద్వపుః
భావాభావైర్యథైకాస్థానిష్ఠావేతౌ తథైవ హి. 100

ఈ తమఃప్రకాశాదుల రెంటియొక్క సంధియున్ను అశూన్యరూపమేయగును. ఏలయనిన, ఆసంధి యీరెంటియొక్కయు రూపమైయున్నది. మఱియు, భావాభావరూపముచే నీరెండున్ను ఏకవస్తురూపము లెట్లగునో, సంధియందును నట్లే యైయున్నవి.

ద్వాభ్యాం చైతన్యజాడ్యాభ్యాం భూతాని ప్రస్ఫురన్తి హి
యథా తమఃప్రకాశాభ్యామహోరాత్రా మహీతలే. 101

చిద్రూపజడరూపాభ్యామారబ్ధేయం జగత్స్థితిః
జలామృతాభ్యాం మిశ్రాభ్యాం శీతా తనురివైన్దవీ. 102

భూమిపై తమఃప్రకాశములచే రాత్రిందినము లెట్లగునో, అట్లే చిత్, జడములచే ఈ ప్రపంచమందలి సమస్తప్రాణులున్ను స్ఫురించుచున్నవి. మఱియు మిశ్రితమైన జల, అమృతములచేఁ జంద్రుని శరీర మెట్లు శీతలముగ నిర్మింపఁబడియున్నదో, అట్లే చిద్రూప, జడరూపములచే ఈజగత్స్థితియు నిర్మింపఁబడినది.

ప్రకాశమనలం సూర్యం చిద్రూపం విద్ధి రాఘవ
జడాత్మకం తమోరూపం విద్ధి సోమశరీరకమ్. 103

ఓ రాఘవా! అగ్ని, సూర్య, ప్రకాశములను చిద్రూపమనియు, చంద్రుని జడ, తమోరూపమనియు నెఱుంగుము.

చిత్సూర్యే నిర్మలే దృష్టే నామ నశ్యేద్భవోదయమ్
వ్యోమసూర్యే బహిర్దృష్టే యథా కృష్ణనిశాతమః. 104

బాహ్యాకాశమున సూర్యుఁడు గాంచబడినతోడనే కృష్ణవర్ణముగల్గినట్టి రాత్రియొక్కయంధకారమంతయు నశించునట్లు, నిర్మలమైన చిత్ - సూర్యుఁడవలోకింపఁబడగనే సంసారోదయమున్ను వినాశమొందును.

సోమదేహే జడే దృష్టే చిన్నిజేఽసత్యవద్భవేత్
నిశీథే విలసత్యబ్ధే యథా సారప్రభాభరః. 105

అర్ధరాత్రియందు చంద్రుఁడు ప్రకాశింప, సూర్యప్రకాశము తచ్చంద్రరూపముచే స్ఫురించినను స్వసత్తచే అసత్తువలె భాసించునట్లు, జడమగు దేహమున చైతన్యమున్ను (తాదాత్మ్యముచే స్ఫురించుచుండినప్పటికిని) స్వసత్తచే అసత్తువలె భాసించును. (లేనట్లు అజ్ఞులకు తోఁచును.)

సోమం ప్రకటయత్యగ్నిశ్చిద్దేహస్య చిరం ప్రభామ్
స్వసంవిన్మయమిన్దుశ్చిద్దేహస్థం రూపమర్కజమ్. 106

చంద్రమండలమునఁ బ్రవేశించిన సూర్యప్రకాశరూపమగు అగ్ని జలమయమగు ఆ చంద్రబింబమును స్ఫురద్రూప మొనర్చుచున్నది. అట్లే దేహమున జీవరూపముగ ప్రవిష్టమగు చిద్రూపమైన అగ్ని జీవితపర్యంతము అహంభావనను ప్రకాశితమొనర్చుచున్నది. ఇట్లు పరస్పరము కలియుటచే, అభేదాధ్యాసముచే సూర్యునిచే నుత్పన్నమగు ప్రభామండలము చంద్రుఁడగుచున్నది. చిత్తున్ను స్వసంవిన్మయమై 'నేను మనుష్యుఁడను, చేతనుఁడను,'-ఇత్యాది స్వకీయానుభవము ననుసరించి దేహస్థరూపమగుచున్నది.

చిన్నిష్క్రియాత్మనామూ సా కేవలా నోపలభ్యతే
ఆలోక ఇవ దీపేన దేహే నైవావగమ్యతే. 107

క్రియ, ఉపాధి లేకుండ కేవలచైతన్యము పైకి భాసింపదు. దీపముద్వారా ప్రకాశమెఱుఁగఁబడునట్లు దేహముద్వారాయే ఆచైతన్య మెఱుఁగఁబడుచున్నది.

చితశ్చేత్యోన్ముఖత్వేన లాభః సైవ చ సంసృతిః
నిశ్చేత్యాయాః శుభో లాభో నిర్వాణం వా తదేవ హి. 108

అజ్ఞానముచే నావృతమై చైతన్యము విషయములవైపునకు దిరుగుటయే సంసారరూపమైన అనర్థప్రాప్తియగును. విషయరహితమగు చైతన్యమే శుభము, లాభము; లేక, మోక్షము

అన్యోన్యలబ్ధసద్భావాక్యావేవం కుడ్యప్రకాశవత్
అగ్నీషోమావిమౌ జ్ఞేయౌ సంపృక్తౌ దేహదేహినౌ. 109

ఈ ప్రకారముగ భిత్తి(గోడ,) సూర్యప్రకాశమువలె పరస్పరము కలిసియున్న యీ దేహము, (దేహిచైతన్యము) అగ్ని, చంద్రరూపములైయున్నవి.

అతిశాయిని నిర్వాణే జాడ్యే చైవాతిశాయిని
అగ్నీషోమస్య చైవాజ్ఞ స్థితిర్భవతి కేవలా. 110

ఉపాధియొక్క నివృత్తిచే, అత్యంతానంద ముద్భవించుటచే నపుడగ్నియొక్క కేవలస్థితి సంభవించుచున్నది. మఱియు నత్యంత జడత్వముచే జలశిలాదులందు చంద్రునియొక్క కేవలస్థితి సంభవమగుచున్నది,

ప్రాణోఽగ్నిరుష్ణప్రకృతిరపానః శీతలః శశీ
ఛాయాతపవదిత్యేతౌ సంస్థితౌ ముఖమార్గగౌ. 111

ఉష్ణప్రకృతిగల ప్రాణవాయువు అగ్నిరూపమై యున్నది, అట్లే శీతలప్రకృతిగల యపానము చంద్రరూపమై బరఁగుచున్నది. ఛాయాతపములవలె నీరెండును ముఖమను మార్గమున వెలయుచున్నవి.

అపానే శీతలే సత్తామేత్యుష్ణః ప్రాణపావకః
ప్రతిబిమ్బమివాదర్శే స చ తస్మింస్తథైవ హి. 121

శీతల స్వభావముగు అపానమున, ఉష్ణస్వభావమైన అగ్నిరూపముగు ప్రాణవాయువు సత్తను బొందుచున్నది. మఱియు, అద్దమునం బ్రతిబింబమువలె అపానమున్న నట్లే ప్రాణమున సత్తను బడయుచున్నది. (ఇట్లారెంటికిని అన్యోన్యతాదాత్మ్యస్థితి గలదు)

చిదగ్నిః పద్మపత్రస్థం సోమం వాచాత్మకం త్విషా
జనయత్యనుభూత్యేహా కుడ్యాలోకం యథా బహిః. 113

బాహ్యమున భిత్తి మున్నగువానియొక్క ప్రకాశమున సూర్యుడు జనింపఁజేయు నట్లు, మూలాధారమునుండి మొదలుకొని కంఠమువఱకు గల పద్మపత్రములందున్నదియు, పర, మొదలుకొని వైఖరి, వఱకుగల వాక్కుయొక్క స్వరూపమునగు చంద్రునియొక్క ప్రకాశనశక్తిని, మఱియు ననుభవమును చిద్రూపమగు అగ్ని యుత్పన్న మొనర్చుచున్నది.

సంసృత్యాదౌ యథా కాచిత్సంవిచ్ఛీతోష్ణరూపిణీ
అగ్నీషోమాభిధాం ప్రాప్తా సైవ సర్గే నృణామిహ. 114

సృష్ట్యాదియందు మాయాశబలితబ్రహ్మ సంవిత్తు శీతోష్ణరూపమగు బ్రహ్మాండాకారముచే అగ్ని, చంద్రనామముల నెట్లు బొందునో అట్లే జీవులవ్యష్టి దేహముల సృష్టియందును గూడ బొందుచున్నది.

యత్ర సోమకలా గ్రస్తా క్షణం సూర్యేన షోడశీ
ముఖాద్ద్వితస్తిమాత్రం స్యాత్తత్ర బద్ధపదో భవ. 115

ఓ రామచంద్రా! ముఖమునకు దాదాపు పన్నెండంగుళముల దూరమున చంద్రుని (అపానము) యొక్క పదునాఱవ కళ సూర్యుని (ప్రాణవాయువు)చే నగుచున్నది. అచట—అనగా ప్రాణాపానముల సంధియందు నీవు స్థిరముగ నుండుము.

నూనం సూర్యపదం ప్రాప్తో యత్ర సోమో హృదమ్బరే
నూనం కేవలయా స్థిత్యా తత్రబద్ధపదో భవ. 116

హృదయాకాశమున నెచట సూర్యుని స్థానమున (ప్రాణవాయువుయొక్క సమాప్తియందు) చంద్రుడు (అపానము) కేవలము నిజస్థితిచే బొందఁబడుచుండునో అచట నీవు స్థితిగల్గియుండుము.

ఉష్ణమగ్నిశ్చిదాదిత్యః శైత్యం సోమ ఉదాహృతమ్
యత్రైతౌ ప్రతిబిమ్బస్థౌ తత్ర బద్ధపదో భవ. 117

ఓ రామచంద్రా! చిదాదిత్యుఁడు ఉష్ణరూపుఁడు లేక అగ్నిరూపుఁడనియు, చంద్రుడు శీతరూపుఁడనియు, జెప్పబడెను. అర్ధరేచక, అర్ధపూరకముల యంతరాళమున నెచట నీయగ్నిచంద్రులు లేక ప్రాణాపానములు ప్రతిబింబరూపమున నుండునో, అచట నీవు స్థిరముగ నుండుము.

శరీరే సోమసూర్యాగ్నిసంక్రాన్తిజ్ఞో భవానఘ
తత్ర సంక్రాన్తికాలా హి బాహ్యాస్తృణసమాః స్మృతాః 118

పాపరహితుఁడవగు రామచంద్రా! వసంత, గ్రీష్మ, వర్ష, శరదృతువులందు క్రమముగ నుష్ణముచే శీతము గ్రసింపఁబడుటచేఁ జంద్రునియొక్క అగ్నిసంక్రాంతి యగును. మఱియు శరత్,

హేమంత, శిశిరఋతువులందు క్రమముగ శీతముచే నుష్ణము గ్రసింపఁబడుటచే నగ్నియొక్క చంద్ర సంక్రాంతియునగును. ఆరెంటియొక్క సంధికాలమున మేషాదిరాసులందు సూర్యునియొక్క సంక్రాంతి సంభవించును, అదేరీతిగ, శరీరమందును జఠరాగ్నిచే నపానముయొక్క శీతత్వము గ్రసింపఁబడినపుడు చంద్రునియొక్క అగ్ని సంక్రాంతియు, ప్రాణముయొక్క యుష్ణత్వము బాహ్య శీతత్వముచే గ్రసింపఁబడినపుడు అగ్నియొక్క చంద్ర సంక్రాంతియునగును, ఆ రెండిటియొక్క సంధియందు సూర్యసంక్రాంతి సంభవించును, ఇట్లు, శరీరమున నీవు చంద్రసూర్యాగ్నుల సంక్రాంతుల నెఱుంగుము. ముఖ్య సంక్రాంతి కాలము లివియే. బాహ్య సంక్రాంతి కాలములు తృణసమానములు.

సంక్రాన్తిముత్తరమథాయనమఙ్గ సమ్య
క్కాలం తథా విషువతో యది దేహవార్తైః
అన్తర్బహిష్ఠమివ వేత్సి యథానుభూతం
తచ్ఛోభసేఽత్ర న పునః పరమభ్యుపేతః. 119

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే అగ్నిషోమవిచారణ నామైకాశీతితమః సర్గః ॥ 81 ॥

ఓ రామచంద్రా! బాహ్యప్రసిద్ధములగు సంక్రాంతి, ఉత్తరాయణము, దక్షిణాయనము మొదలగు వానిని దేహమందలి ప్రాణాపానముల గతిభేదముద్వారా యాభ్యంతరముననే యున్నట్లు నీవెఱింగినచో నపుడే యోగుల సభయందు శోభితుఁడవగుదువు. లేనిచో కావు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున అగ్నిషోమ విచారణమను నెనుబదియొకటవ సర్గము ॥ 81 ॥

---

## ద్వ్యశీతితమః సర్గః॥

[అణుతాస్థూలతోపాయా జ్ఞానసాధ్యం చ యోగినః
పరకాయాప్తి భోగాశ్చ వర్ణ్యన్త ఇహ యుక్తిభిః

యోగి దేహముయొక్క అణుత్వ, స్థూలత్వోపాయములు, పరకాయ ప్రవేశము, ఇత్యాది విషయము లిచట యుక్తులతోటి వర్ణింపబడినవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అణుతాం స్థూలతాం వాపి యథా గచ్ఛతి యోగినామ్
దేహకో నామ తథా సమ్యగ్వక్ష్యమాణమిమం శృణు. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! యోగుల దేహమే ప్రకారమణుత్వ స్థూలత్వములఁ బొందునో, యా క్రమమంతయు నుత్తమరీతి వచింపఁబోవుచున్నాను, వినుము.

హృద్యబ్జచక్రకోశోర్ధ్వం ప్రస్ఫురత్యానలః కణః
హేమ భ్రమరవత్సాన్ధ్యవిద్యుల్లవ ఇవామ్బుదే. 2

హృదయ కమల చక్రకోశముపై నగ్నికణము బంగారపు తుమ్మెదవలెను, లేక, సాయంకాలపు మేఘమండలి మెఱుపువలెను ప్రకాశించుచున్నది.

స ప్రవర్ధన సంవిత్త్యా వాత్యయేవాశు వర్ధతే
సంవిద్రూపతయా నూనమర్కవద్భాతి చోదయమ్. 3

ఆ యగ్నికణము ప్రవర్ధనోపాయమగు జ్ఞానముచే గొప్పవాయువువలె శీఘ్రముగ వృద్ధినంది జ్ఞానరూపముచే, దేహమున నిక్కముగ సూర్యునివలె, ప్రకాశించుచున్నది.

సంధ్యాభ్రప్రథమార్కాభో వృద్ధిమభ్యాగతః క్షణాత్
గాలయత్యఖిలం సాఙ్గం దేహం హేమ యథానలః. 4

ప్రాతః కాలమున నాకాశమందు సూర్యునివలె నయ్యగ్నికణము వృద్ధినొంది, బంగారమును నగ్ని ద్రవింపఁజేయునట్లు, దేహము నంతటిని ద్రవింపఁజేయుచున్నది.

జలస్పర్శాసహో యుక్త్యా గలయేత్ప్రపదాదపి
బాహ్య ఏవానలస్పర్శాత్స్వాన్తే వస్తు విశేషతః. 5

జలస్పర్శను సహింపనటువంటి యా యగ్ని పాదముల పర్యంతము యోగయుక్తిచే ద్రవింపఁజేయుచున్నది. మఱియుఁ దనయుష్ణత్వముచే, (ద్రవోపసంహార రూపయుక్తిద్వారా) జలమునున్ను శోషింపఁజేయుచున్నది. ఇవ్విధమున దేహమునుండివేఱై, మనోరూప సూక్ష్మదేహమున నుండుచున్నది.

స శరీరద్వయం పశ్చాద్విధూయ క్వాపి లీయతే
విక్షోభితేన ప్రాణేన నీహారో వాత్యయా యథా. 6

ఇట్లు, పార్థివ, జలమయ శరీరముల రెంటిని ద్రవింపఁజేసి, విక్షోభితమైన ప్రాణవాయువుద్వారా తానున్ను, వాయువుచే మంచువలె, లీనమైపోవుచున్నది.

ఆధారనాడీనిర్హీనా వ్యోమస్థైవావశిష్యతే
శక్తిః కుణ్డలినీ వహ్నేర్ధూమలేఖేవ నిర్గతా. 7

అత్తఱి కుండలినీశక్తియున్ను సుషుమ్నానాడీరహితమై, తత్సంస్కారముచే శోభితమగు ఆతివాహిక దేహాకాశమందు అగ్నినుండి బయల్వెడలిన పొగవలె స్థితినొందుచున్నది.

క్రోడీకృతమనోబుద్ధిమయజీవాదహంకృతిః
అన్తఃస్ఫురచ్చమత్కారా ధూమలేఖేవ నాగరీ. 8

మనోబుద్ధిజీవాది సహితమగు సూక్ష్మశరీరమున నహంకారమును ప్రవేశింపఁజేయునదియు, అభ్యంతరమున స్వేచ్ఛావిహార శక్తియుతమును చిత్ప్రకాశముయొక్క చమత్కార సహితమునగు అయోధ్యాదినగరము నందలి ధూమపంక్తివలె శోభించుచున్నది.

బిసే శైలే తృణే భిత్తావుపలే దివి భూతలే
సా యథా యోజ్యతే యత్ర తేన నిర్యాత్యలం తథా. 9

ఆశక్తి కమలనాళ, పర్వత, తృణ, భిత్తి, శిల, స్వర్గ, భూతలాదులందెలిచటికేగుటకై నియోగింపఁబడుచున్నదో, అచ్చోటికే వెస్సగ నేగుచున్నది.

సంవిత్తిః సైవ యాత్యజ్జ రసాద్యన్తం యథాక్రమమ్
రసేనాపూర్ణతామేతి తన్త్రీభార ఇవామ్బునా. 10

ఆ కుండలినీశక్తియే పూర్వమగ్నియందుపసంహరించిన జలభాగము నెపుడు త్యజించుచున్నదో, అపుడు మఱల స్థూలభావనచే క్రమముగ బావియందు విడువఁబడిన చర్మపాత్ర నీటిచే నింపబడునట్లు - రసముచే నంతటఁ బరిపూర్ణమగుచున్నది.

రసాపూర్ణా యమాకారం భావయత్యాశు తత్తథా
ధత్తే చిత్రకృతో బుద్ధౌ రేఖా రామ యథా కృతిమ్. 11

ఓ రామచంద్రా! అట్లు రసముచేఁ బూర్ణమై యే యాకారమునది భావనచేయునో, ఆ యాకారము నే-చిత్రకారుని బుద్ధియందు రేఖాకృతివలె,- శీఘ్రముగ ధరించుచున్నది.

దృఢభావవశాదస్తరస్థీన్యాప్నోతి సా తతః
మాతృగర్భనిషణ్ణేషు సుసూక్ష్మేవాఙ్కురస్థితిః. 12

తల్లిగర్భముననున్న సూక్ష్మమగు బీజశక్తి హస్తపాదాద్యంకురస్థితి నెట్లు పొందునో, అట్లే యా కుండలినీశక్తి తదనంతరము దృఢభావనావశమున అస్థి మొదలగు రూపములఁ బొందుచున్నది.

యథాభిమతమాకారం ప్రమాణం వేత్తి రాఘవ
జీవశక్తిరవాప్నోతి సుమేర్వాది తృణాది చ. 13

పిదప తానభిలషించినట్టి, సుమేరు మున్నగువానివంటి గొప్పయాకృతిని గాని, తృణాదులవంటి యల్పాకృతిని గాని యా జీవశక్తి పొందుచున్నది

శ్రుతం త్వయా యోగసాధ్యమణిమాద్యర్థసాధనమ్
జ్ఞానసాధ్యమిదానీం త్వం శృణు శ్రవణభూషణమ్. 14

ఓ రామచంద్రా! యోగసాధ్యమగు అణిమాది పదార్థముల సాధనమును నీవు వింటివి. ఇఁక శ్రవణభూషణమగు జ్ఞానసాధ్యక్రమమును వినుము.

ఏకం చిన్మాత్రమస్తీహ శుద్ధం సౌమ్యమలక్షితమ్
సూక్ష్మాత్సూక్ష్మతరం శాన్తం న జగన్న జగత్క్రియా. 15

ఏకమై, శుద్ధమై, అలక్షితమై, సూక్ష్మముకంటెను సూక్ష్మమై, శాంతమైనట్టి చిన్మాత్రవస్తువే యీప్రపంచమునఁ గలదు. జగత్తుగాని, యద్దాని క్రియగాని వాస్తవముగ లేవు.

తచ్చినోత్యాత్మనాత్మానం సంకల్పోన్ముఖతాం గతమ్
యదా తదా జీవ ఇతి ప్రోక్తమావిలతాం గతమ్. 16

ఆ చిన్మాత్ర మెపుడధ్యాసముచే దనకుఁదానే సంకల్పమువై పున కున్ముఖమగునో, అపుడు కలుషత్వమును బొందిన దానివలెనున్నదై జీవుడని చెప్పఁబడును.

అసత్యమేవ సంకల్ప భ్రమేణేదం శరీరకమ్
జీవం పశ్యతి మూఢాత్మా బాలో యక్షమివోద్ధతమ్. 17

మూఢబాలకుఁడు ఉద్ధతుఁడగు యక్షుని గాంచువిధమున, ఆ జీవుఁ డసత్యభావనా వశము వనే తనయందు స్థూలశరీరమును గాంచుచున్నాఁడు.

యదా తు జ్ఞానదీపేన సమ్యగాలోక ఆగతః
సంకల్పమోహో జీవస్య క్షీయతే శరదభ్రవత్. 18

జ్ఞానదీపముచే నెపుడు సమ్యక్ ప్రకాశమును బొందునో, అపుడాజీవునకు శరత్కాలమేఘము వలె సంకల్పముయొక్క మోహము క్షయించును.

శాన్తిమాయాతి దేహోఽయం సర్వసంకల్ప సంక్షయాత్
తదా రాఘవ నిఃశేషం దీపస్తైలక్షయే యథా 19

ఓ రాఘవా! సంకల్పక్షయముచే ఈ స్థూలదేహము తైలరహిత దీపమువలె శమించును.

నిద్రావ్యపగమే జనుర్యథా స్వప్నం న పశ్యతి
జీవోఽపి భావితే సత్యే తథా దేహం న పశ్యతి. 20

నిద్రనుండి మేల్కాంచిన పిదప ప్రాణి స్వప్నమును జూడనట్లు, సత్యము నెఱింగిన పిమ్మట జీవుఁడిఁక దేహమును గాంచకుండును.

అతత్త్వే తత్త్వభావేన జీవో దేహావృతః స్థితః
నిర్దేహో భవతి శ్రీమాన్ సుఖీ తత్త్వైకభావనా 21

అతత్త్వములగు దేహాదులందు తత్త్వభావనచేయుటచే జీవుఁడు దేహయుక్తుఁడై యుండుచున్నాఁడు. కాని, ఏకతత్త్వమగు బ్రహ్మముయొక్క భావనఁజేయుటచే దేహరహితుఁడై, శ్రీమంతుఁడై, సుఖియగుచున్నాడు.

అనాత్మని శరీరాదావాత్మభావనమఙ్గ యత్
సూర్యాద్యాలోకదుర్భేదం హార్దం తద్దారుణం తమః. 22

అనాత్మరూపములగు శరీరాదులందు ఆత్మభావన యొనర్చుట యను గాఢమైన హృదయమందలి తమస్సు సూర్యాదుల ప్రకాశముచే నశింపనేరదు.

ఆత్మన్యేవాత్మ భావేన సర్వవ్యాపి నిరఞ్జనమ్
చిన్మాత్రమమలోఽస్మీతి జ్ఞానాదిత్యేన నశ్యతి. 23

కాని, ఆత్మయందాత్మభావనచేయుటచేత నుదయించు 'సర్వవ్యాపియై, నిరంజనమై, నిర్మలమైనట్టి చిన్మాత్రమే నేనను జ్ఞానరూపసూర్యునిచేతనే అయ్యది నశించును.

అన్యే చ విదితాత్మానో భావయన్తి యథైవ యత్
తత్తథైవాశు పశ్యన్తి దృఢభావనయా తయా. 24

అన్యులగు ఆత్మజ్ఞానులును, సత్యసంకల్పయుతులునైన మహాత్ములున్ను తామెట్లు భావనఁజేయుదురో, అట్టి దృఢభావనచే శీఘ్రమ మట్లే గాంచుదురు.

దృఢభావానుసంధానాద్విమూఢా అపి రాఘవ
విషం నయన్త్యమృతతామమృతం విషతామపి. 25

ఓ రాఘువా! దృఢభావనయొక్క యనుసంధానముచే నతిమూఢులైనను విషము నమృతముగను, అమృతమును విషముగను గావించుచున్నారు.

ఏవం యథా యదేవేహ భావ్యతే దృఢభావనాత్
భూయతే హి తదేవాశు తదిత్యాలోకితం ముహుః. 26

ఇట్లు దృఢభావనచే నేపదార్థమెపుడెట్లు భావింపఁబడుచున్నదో, అపుడదియట్లే యగుచుండుట లోకమందనేకసారులు చూడబడినది.

సత్యభావనదృష్టోఽయం దేహో దేహో భవత్యలమ్
దృష్టస్త్వసత్యభావేన వ్యోమతాం యాతి దేహకః. 27

ఈదేహము సత్యభావనచేఁ జూడబడినచో దేహమేయగుచున్నది. అసత్య భావనచే జూడబడినచో బ్రహ్మాకాశరూపత్వము నందుచున్నది.

అణిమాదిపదప్రాప్తౌ జ్ఞానయుక్తిరితి శ్రుతా
భవతా సాధునా రామ యుక్తిమన్యామిమాం శృణు. 28

ఓ రామచంద్రా! ఇట్లు అణిమాది పదప్రాప్తియందలి జ్ఞానయుక్తిని సాధుస్వరూపుడవగు నీవు వింటివి. ఇఁక నిపుడు మఱియొక యుక్తిని వినుము.

రేచకాభ్యాసయోగేన జీవః కుణ్డలినీ గృహాత్
ఉద్ధృత్య యోజ్యతే యావదామోదః పవనాదివ. 29

మనుజుడు పుష్ప సుగంధమును వాయువునుండి యాకర్షించి ఘ్రాణమున నియోగించునట్లు రేచకాభ్యాసముచే జీవుడు కుండలినీరూపగృహమునుండి బయల్వెడలి యన్యదేహమునఁ దన్నెంతవఱకు నియోగించుకొనునో, అంతవఱకు, దన పూర్వదేహము త్యజింపఁబడును.

త్యజ్యతే విరతస్పన్దో దేహోఽయం కాష్ఠలోష్టవత్
దేహేఽపి జీవేఽపి మతావాసేచక ఇవాదరః. 30

స్థావరే జంగమే వాపి యథాభిమతయేచ్ఛయా
భోక్తుం తత్సంపదం సమ్యగ్జీవోఽన్తర్విని వేశ్యతే. 31

అపుడు చేష్టారహితమగు యాదేహమును కాష్ఠమువలెను, శిలవలెను త్యజించుచున్నాడు. చెట్లకు నీరుపోయువాఁడు దానే వృక్షమునకు, లతకు నీరు పోయదలంచునో యదానికే యాదరమున

జలసించన మొనర్చునట్లు యోగియు తనయిచ్ఛానుసారముగ స్థావరములలో గాని జంగమములలో గాని యేదేహమున, బ్రవేశింప, దలంచునో, వాని సంపద ననుభవించుటకొఱకై, వాని దేహ, జీవ, బుద్ధులందు, దాను బ్రవేశించుచున్నాఁడు.

ఇతి సిద్ధిశ్రియం భుక్త్వా స్థితం చేత్తద్వపుః పునః
ప్రవిశ్యతే స్వమన్యద్వా యద్యత్తాత విరోచతే. 32

ఇట్లు యోగి యన్యశరీరమున సిద్ధిసంపద ననుభవించి, తన పూర్వదేహముండి యున్నచో నద్దానియందు మఱల బ్రవేశించును, లేక, తన కిష్టమైన మఱియే యితర దేహముననైన బ్రవేశించును.

దేహోదయ స్తథా బిమ్బాన్వ్యాప్య వత్యఖిలానథ
సంవిదా జగదాపూర్య సంపూర్ణం స్థీయతేఽథవా. 33

లేక, యోగులు అన్యశరీరభోగానంతరము స్థావరజంగమాది సమస్త ప్రతిబింబభూతోపాధులను, బింబభూతములగు సమస్త జీవులను, జగత్తును, వ్యాప్తవంతమగు తమయాత్మ సంవిత్తుచే బరిపూర్ణమొనర్చి యుందురు.

జ్ఞాత్వా సదాభ్యుదితముజ్ఝితదోషమీశో
యద్యద్యథా సమభివాఞ్ఛతి చిత్ప్రకాశః
ప్రాప్నోతి తత్తదచిరేణ తథైవ రామ
సమ్యక్పదం విధురనావరణత్వ మేవ. 24

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే అణిమాదిలాభయోగోపదేశో నామ
ద్వ్యశీతితమః సర్గః ॥82॥

ఓ రామచంద్రా! యోగైశ్వర్యముచే సంపన్నమగు చిత్ప్రకాశము, సదాదోషరహితమై, నిత్యోదయము నొందిన దైనట్టి తన స్వరూపము నెఱింగి, దేనిదేనిని వాంఛించునో, దానిదానిని శీఘ్రముగ బొందుచున్నది, కాని, తత్త్వజ్ఞాని యీ యల్పసిద్ధులను నధికముగ దలంపక నిరతిశయానందరూపమగు దన యాత్మనే యధికముగ దలంచును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
అణిమాది లాభయోగోపదేశమను నెనుబదిరెండవ సర్గము ॥82॥

---

## త్ర్యశీతితమః సర్గః

[చూడాలా సిద్ధివిభవా అప్రబోధశ్చ భూపతేః
గురూపదేశసాఫల్యే కిరాటాఖ్యానమీర్యతే.

చూడాలయొక్క సిద్ధియొక్క వైభవము, రాజుయొక్క అజ్ఞానము వర్ణింపఁబడుట గురూపదేశముయొక్క సాఫల్యమున కిరాటాఖ్యానము వచింపఁబడుట యిచట గాననగును.]

శ్రీరామ ఉవాచ:—

అణిమాదిగుణైశ్వర్యయుక్తా సా నృపభామినీ
ఏవం బభూవ చూడాలా ఘనాభ్యాసవతీ సతీ. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! పైనఁదెల్పినవిధమున ప్రాణాయామాదుల దృఢాభ్యాసముచే రాజపత్నియగు యాచూడాల అణిమాది సిద్ధులయొక్క గుణములచే సంపన్నురాలాయెను.

జగామాకాశమార్గేణ వివేశామ్బుధికోటరమ్
చచార వసుధాపీఠం గఙ్గేవామల శీతలా. 2

మోహకాలుష్యముయొక్కయు, తాపత్రయముయొక్కయు వినాశముచే, గంగవలె నిర్మలయై శీతలయై నట్టి యాచూడాల యొకప్పుడు ఆకాశమార్గమున బోవును, మఱియొకప్పుడు సముద్రకోటరమున ప్రవేశించును, వేఱొకప్పుడు భూమండలముపై సంచరించును.

క్షణమప్యాగతా భర్తుర్వక్షసశ్చేతసస్తథా
సర్వేషామాస రాజ్యేషు లక్ష్మీరివ జగత్సు చ. 3

ఆ సిద్ధులచే దనపతియొక్క వక్షస్థలమునుండి గాని, చిత్తమునుండి గాని, క్షణమైనను వియుక్తముగాక యుండెను. మఱియు సమస్త రాజ్యములందును, సమస్తలోకములందును లక్ష్మివలె నివసించుచుండెను.

ఆకాశగామినీ శ్యామా విద్యుత్ప్రారమ్యభూషణా
ఒభ్రామ మేఘమాలేవ గిరిమాలా మహీతలే. 4

మెఱుపువలె ప్రకాశించు నాభూషణములచే శోభితయై యాకాశమార్గమున జనుచు, పర్వతములతోగూడిన భూతలమున మేఘపంక్తివలె నామె పరిభ్రమించుచుండెను.

కాష్ఠం తృణోపలం భూతం ఖం వాతమనలం జలమ్
నిర్విఘ్నమవిశత్సర్వం తన్తుర్ముక్తాఫలం యథా. 5

ముత్తెమునందు దారము ప్రవేశించు నట్లు, కాష్ఠ, తృణ, శిల భూత, ఆకాశ, వాయు, అగ్ని, జలాది సమస్త పదార్థములందును నామె నిర్విఘ్నముగ ప్రవేశించెను.

మేరోశ్శిఖరశృఙ్గాణి లోకపాలపురాణి చ
దిగ్వ్యోమోదరరన్ధ్రాణి విజహార యథాసుఖమ్. 5

మేరుపర్వత శిఖరములందును, లోకపాలకుల నగరములందును, ఆకాశ, దిశల యంతరాళములందును ఆచూడాల సుఖముగ విహరించెను.

తిర్యగ్భూతపిశాచాద్యైః సహ నాగామరాసురైః
విద్యాధరాప్సరస్సిద్ధైర్వ్యవహారం చకార సా. 7

పశుపక్ష్యాదులతోను, పిశాచాదులతోను, నాగ, దేవ, దైత్యులతోను, విద్యాధర, అప్సర సిద్ధులతోను, నామె భాషణాది వ్యవహారములఁ గావించెను.

యత్నేన తం చ భర్తారమాత్మజ్ఞానామృతం ప్రతి
బహుశో బోధయామాస చూడాలా న వివేద సః 8

మరియు ననేకమారులామె మిగుల యత్నముతో దనపతికి జ్ఞానామృతము నుపదేశించెను; కాని యాతఁ డద్దానిని గ్రహింపఁజాలకుండెను.

కలా విదగ్ధా ముగ్ధా చ బాలేయం గృహిణీ మమ
ఇత్యేవం కేవలం రాజా స చూడాలాం వివేద తామ్. 9

ఈ నాగృహిణి సమస్తకళలయందును బ్రవీణురాలు; ఈమె ముగ్ధ, బాలిక అని మాత్రమే చూడాలను గూర్చి రాజెఱిఁగియుండెను.

ఏతావతాపి కాలేన తామేవం గుణశాలినీమ్
బాలో విద్యామివ నృపశ్చూడాలాం న వివేద సః. 10

పసిబాలుఁడు విద్య నెఱుఁగనట్లు, ఇంతకాలము వఱకు ననేక సిద్ధ్యాది గుణములచేను సంపన్నయైనట్టి చూడాలను రాజెఱుఁగజాలకుండె.

సాప్యలబ్ధాత్మవిశ్రాన్తేస్తాం సిద్ధిశ్రియమాత్మనః
దర్శయామాస నో రాజ్ఞః శూద్రస్యేవ మఖక్రియామ్. 11

శూద్రునకు యజ్ఞక్రియ, జూపనట్లు, చూడాలయున్ను ఆత్మయందు విశ్రాంతిని పొందని యారాజునకుఁ దన సిద్ధియొక్క మహిమను జూపకుండెను.

శ్రీరామ ఉవాచ:—

మహాత్మ్యాః సిద్ధయోగిన్యాస్తస్యా అపి శిఖిధ్వజః
యత్నేన ప్రాప నో బోధం బుధ్యతేఽన్యః కథం ప్రభో. 12

శ్రీ రాముఁడు:— ప్రభూ! గొప్ప సిద్ధురాలును, యోగినియునైన చూడాలకే, శిఖిధ్వజునకు మిగుల బ్రయాసముచేతనుగూడ నుపదేశించుటకు శక్తిలేకయుండఁ నిఁకనితర గురువుల కెట్లుండును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఉపదేశక్రమో రామ వ్యవస్థామాత్ర పాలనమ్
జ్ఞప్తేస్తు కారణం శుద్ధా శిష్యప్రజ్ఞైవ రాఘవ. 13

శ్రీ వసిష్ఠుఁడు — ఓ రాఘవా! ఉపదేశక్రమము కేవలము శాస్త్రముయొక్క మర్యాదను పాలించుటకొఱకే గాని యథార్థముగా జ్ఞానప్రాప్తికి శిష్యునియొక్క శుద్ధబుద్ధియే కారణమగును.

న శ్రుతేన న పుణ్యేన జ్ఞాయతే జ్ఞేయమాత్మనః
జ్ఞానాత్మ్యాత్మానమాత్మైవ సర్పః సర్పపదానివ. 14

శ్రవణము (శాబ్దజ్ఞానము, లేక, పరోక్షజ్ఞానము) చేత గాని, పుణ్యముచేత గాని జ్ఞేయము ఆత్మ తెలియఁబడదు. సర్పముయొక్క పాదములను సర్పమే యెఱుంగునట్లు, ఆత్మయే ఆత్మ నెఱుంగగలదు.

శ్రీరామ ఉవాచః-

ఏవం స్థితే నాథ మునే కథమేతజ్జగత్స్థితా
క్రమో గురూపదేశాఖ్యః స్వాత్మజ్ఞానస్య కారణమ్. 15

శ్రీ రాముఁడు:— ఓ మునీశ్వరా! అట్లైనచో ఈజగత్తునందు గురూపదేశక్రమము ఆత్మజ్ఞానమున కెట్లు కారణమగును?

శ్రీవసిష్ఠ ఉవాచ;—

అత్యన్తకృపణః కశ్చిత్కిరాటో ధనధాన్యవాన్
అస్తి విన్ధ్యాటవీకక్షే కుటుమ్బీ బ్రాహ్మణో యథా. 16

శ్రీ వసిష్ఠుఁడు;— ఓ రామచంద్రా. — వింధ్యాచల ప్రదేశమున దనధాన్య సంపన్నుడును అతికృపణుడును నైన కిరాతుఁడొకడు కుటుంబియగు బ్రాహ్మణునివలె, వసించుచుండెను.

తస్యైకదా నిపతితా గచ్ఛతో విన్ధ్యజఙ్గలే
ఏకా వరాటికా నామ తృణజాలకసంవృతే. 17

ఒక సమయమున నాతఁడు వింధ్యాచలారణ్యమున జనుచుండ నాతని యొకగవ్వ తృణసమూహమునఁ బడిపోయెను.

కార్పణ్యాత్స ప్రయత్నేన సర్వం తృణతృషాదికమ్
కపర్దకార్థకార్థమభితో దుధావ దివసత్రయమ్. 18

లోభియగుటచే నాతఁడద్దానికొఱకై నలువైపుల తృణాదులలో మూఁడుదినముల వఱకు వెదకుచు నేయుండెను.

కపర్దకాః స్యుర్భవతా చత్వారోఽష్టౌ చ కాలతః
తతః శతం సహస్రం చ సహస్రే చేతి చేతసా. 19

కలయఞ్జఙ్గలే దీనో రాత్రిందివమతన్ద్రితః
జనహాససహస్రాణి బుబుధే న పరం తు సః. 20

ఈ గవ్వ నా చేతికిఁ జిక్కినచో గానియొక్క క్రయవిక్రయములచే నెనిమిది గవ్వలగును; దానినుండి క్రమముగ రెండు వేలగును, పిదప నూఱు వేలగును_అను నభిప్రాయముచే నాదీనుడు జనులొనర్చు వేలకొలఁది హాస్యములపై, గూడ దృష్టినుంచక, అప్రమత్తుఁడై యట్లు పర్యాలోచించుచునే అయ్యరణ్యమున నుండెను. *

* తద్విజ్ఞానార్థః స "గురుమేవాభిగచ్ఛేత్" — ఆత్మ నెఱుంగుటకొఱకు గురువుసమీపమునకే పోవలెన నునది శాస్త్రమర్యాద.

తతో దినత్రయస్యాన్తే తేన తస్మాచ్చ జఙ్గలాత్
పూర్ణేన్దుబిమ్బప్రతిమో లబ్ధశ్చిన్తామణిర్మహాన్. 21

అటు పిమ్మట మూఁడుదినములు పరిశ్రమ గావించిన తదుపరి, తుదకాయరణ్యమున నాతనికి పూర్ణచంద్రునివలె దేదీప్యమానమైన యొకగొప్ప చింతామణి దొఱకెను.

తం ప్రాప్య తుష్టహృదయః సమాగమ్య గృహం సుఖమ్
ప్రాప్తాఖిల జగద్భూతి శాన్తసర్వతయా స్థితః. 22

దానిని బొందుటచే, ప్రసన్నచిత్తుఁడై, సుఖపూర్వకముగ దనగృహమున కేగి, ప్రపంచమునందలి సమస్త భోగైశ్వర్యములు పొందుటచేతను, దారిద్ర్యాది అనర్థములన్నియు నశించుటచేతను ప్రసన్నుడై యుండెను.

ఏవం యథా కిరాతేన కపర్దాన్వేషణేన తత్
రత్నం లబ్ధం జగన్మూల్యమహోరాత్రమఖేదినా. 23

ఇవ్విధమున దుఃఖరహితుఁడగు ఆకిరాతుఁడు గవ్వను వెదుకఁబోయి జగన్మూల్యమైనట్టి చింతామణిని బొందెను.

తథా శ్రుతోపదేశేన స్వాత్మజ్ఞానమవాప్యతే
అన్యదన్విష్యతే చాన్యల్లభ్యతే హి గురుక్రమాత్. 24

అట్లే శాస్త్రోపదేశముచే గూడ ఆత్మజ్ఞానము సంప్రాప్తించును. గురూపదేశక్రమముచే శబ్దజన్యమగు పరోక్షజ్ఞానమన్వేషింపబడ, నిత్యమై, అపరోక్షమైనట్టి యాత్మజ్ఞానము లభించుచున్నది.

బ్రహ్మ సర్వేన్ద్రియాతీతం శ్రుతాదీన్ద్రియసంవిదః
తేనోపదేశాదనఘ నాత్మతత్త్వమవాప్యతే. 25

పాపరహితుఁడగు రామచంద్రా! బ్రహ్మమింద్రియము లన్నింటికంటెను బరమైనది. శబ్దశ్రవణ, శబ్దబోధాదులన్నియు నింద్రియజ్ఞానమునకు సంబంధించిన చిత్తవృత్తులేయగును, ఇట్లు గురూపదేశముచే శాబ్దవృత్తులు మాత్రమే జనింపఁబడుచున్నవి. గావునను, నిత్యాపరోక్ష బ్రహ్మము శిష్యుని శుద్ధబుద్ధియందే స్ఫురించును గావునను, కేవలముపదేశమాత్రమే ఆత్మతత్త్వోదయమునకు హేతువు కానేరదు.

గురూపదేశం చ వినా నాత్మతత్త్వాగమో భవేత్
కేన చిన్తామణిర్లబ్ధః కపర్దాన్వేషణం వినా. 26

ఇఁక గురూపదేశములేకయు ఆత్మతత్త్వము సంప్రాప్తింపదు. ఏలయనిన, గవ్వను వెదకఁబోవని యెవనికి చింతామణి లభించినది?

తత్త్వస్యాస్య మహార్థస్య గురూపకథనం గతమ్
అకారణం కారణతాం మణేరివ కపర్దకః 27

మహాదర్శరూపమగు ఈయాత్మతత్త్వమునకు గురూపదేశము కారణముగాకున్నను, గవ్వను వెతకుట చింతామణికిఁ గారణమైనట్లు, కారణమగుచునే యున్నది.

పశ్య రాఘవ మాహేయం మోహినీ మహతామపి
అన్యదన్విష్యయతే యత్నాదన్యదాసాద్యతే ఫలమ్. 28

ఓ రాఘవా! చూడుము! ఈ మాయ మహాత్ములనుగూడ మోహితమొనర్చునదై యున్నది. యత్నముచే నొకవస్తువు నన్వేషించుచుండ, మఱియొక ఫలము సంప్రాప్తించుచున్నది గదా!

అన్యత్కరోతి పురుషః ఫలమన్యదేవ
ప్రాప్నోతి యస్త్రిషు జగత్స్వవలోక్యతే చ
తస్మాదనన్తరభవస్య జగద్భ్రమస్య
శ్రేయోతివాహనమసఙ్గమనిచ్ఛయైవ. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే కిరాటోపాఖ్యానం నామ త్ర్యశీతితమః సర్గః ॥ 83 ॥

మనుజుఁడొక కార్యమును యత్నముచే జేయుచు మఱియొక ఫలమును బొందుచున్నాడు. ఇవ్విధమున ముల్లోకములందును జూడఁబడుచున్నది, వినఁబడుచున్నది, కాన, ఆత్మజ్ఞానము లభించిన పిదప శేషించిన జీవితమున ఈజగద్భ్రమను అసంగముగను, అనిచ్ఛా పూర్వకముగను గడపుట శ్రేయోదాయకము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
కిరాటోపాఖ్యానమను నెనుబదిమూడవ సర్గము ॥83॥

---

## చతురశీతితమః సర్గః

[శిఖిధ్వజస్య వైరాగ్యం చూడాలాశ్వాసనం వనే.
నిశి చైకస్య నిర్యాణం మన్దరే స్థితిరీర్యతే.

శిఖిధ్వజుని వైరాగ్యము, వనమున చూడాలయొక్క ఆశ్వాసనము, రాత్రి శిఖిధ్వజుఁడు వెడలుట, మందరపర్వతముపై యాతని స్థితియున్నగు విషయములిందు దెలుపఁబడినవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

తతః శిఖిధ్వజో రాజా తత్త్వజ్ఞానపదం వినా
ఆజగామ పరం మోహం తమోఽన్ధత్వమివాప్రజాః. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అటుపిదప, తత్త్వజ్ఞానములేని శిఖిధ్వజుఁడు, పుత్రులులేని మనుజుఁడు శోకాద్యులచే నంధత్వము నొందునట్లు మహామోహమును బొందెను.

దుఃఖాగ్నిదీపితమనా మనాగపి విభూతిషు
తాస్వభీష్టోపనీతాసు న రేమేఽగ్నిశిఖాస్వివ. 2

దుఃఖాగ్నిచే సంతప్తమైన చిత్తముగల యారాజు అభీష్టవస్తువులఁ బ్రాప్తింపఁజేయు రాజ్యవిభూతులందపుడు అగ్నిజ్వాలలందువలె కొంచెమైనను రమింపలేదు

ఏకాన్తేషు దిగన్తేషు నిర్ఝరేషు గుహాసు చ
ఆజగామ రతిం జన్తుర్ముక్తేషుర్వ్యాధతో యథా. 3

బాణము విడిచినపిదప మృగాదులఁగూర్చి వ్యాధున కెట్టి ప్రీతియుండునో, అట్టి ప్రీతియే యేకాంతస్థానములందును, దిగంతములందును, పర్వతస్రోతములందును, కొండగుహలయందును, రాజునకపుడుండియుండెను,

రాఘవ త్వమివాశేషాః సాన్త్వానునయబోధనైః
ప్రార్థితః కార్యతే భృత్యైర్మహీపో దివసక్రియాః. 4

ఓ రాఘవా! నీవంటివారల సాంత్వన, అనునయ బోధనమునములచేతను, భృత్యుల ప్రార్థనలచేతను ఆరాజు దైనిక క్రియలన్నింటిని జేయుచుండెను.

నిత్యముద్దామవైరాగ్యః పరివ్రాడివ శాన్తధీః
ఖిద్యతే చ మహాభోగాన్స భోక్తుం చ శ్రియం స్థితః. 5

నిరంతరము ప్రబల వైరాగ్యశీలుఁడును, సన్న్యాసివలె శాంతబుద్ధియు నగుశిఖిధ్వజుఁడపుడు మహాభోగములను, రాజ్యసంపదను ననుభవించుటయందు ఖేదమొందుచుండెను,

దదావతితరాం దానం గోభూమికనకాదికమ్
దేవేభ్యో బ్రాహ్మణేభ్యశ్చ స్వజనేభ్యశ్చ మానద. 6

మానప్రదుఁడవగు రామచంద్రా! అతఁడు దేవతలకు, బ్రాహ్మణులకు, స్వజనులకు, గోభూమిసువర్ణాద్యనేకములను దానముచేసెను.

చచార స తపః కర్తుం కృచ్ఛ్రచాన్ద్రాయణాదికమ్
పరిబభ్రామ తీర్థాని వనాన్యాయతనాని చ. 7

తపమొనరించుటకై కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతముల సల్పెను. మఱియు, తీర్థములందును, వనములందును, ఇతర పవిత్రస్థానములందును సంచరించెను.

స తథాపి విశోకత్వం న మనాగపి లబ్ధవాన్
అనిధానాం ఖనన్భూమిం నిధానార్థీ నిధిం యథా. 8

కాని, అట్లొనర్చినను, నిధిఁ గోరువాఁడు నిధిలేనిస్థలమును ద్రవ్వుటచే నద్దానిని బొందనట్లు రాజు శోకరాహిత్యమును బడయకుండెను.

రాత్రిందివ మహామనేష శుష్యత్యేవ కృశానునా
చిన్తయా చిన్తయామాస సంసారవ్యాధిభేషజమ్. 9

మహానుభావుఁడగు నారాజు రాత్రిందినములు చింతయను నగ్నిచే శుష్కించుచు సంసార వ్యాధి కౌషధమున జంతించుచుండెను.

చిన్తాపరవశో దీనో రాజ్యం స్వస్య విషోపమమ్
మహావిభవమప్యగ్రే నాపశ్యత్ఖిన్నయా ధియా. 10

చింతాపరవశుఁడైన దీనుఁడగు నారాజు తనరాజ్యమును విషమువలె జూచుచుండెను. ఖేద బుద్ధితో గూడినవాఁడై సమ్ముఖముననున్న మహావిభవమును గూడ గాంచుటలేదు.

అథైకదైకాన్తగతాం చూడాలామఙ్కమాగతామ్
ఇదం మధురయా వాచా సమువాచ శిఖిధ్వజః. 11

అటు పిమ్మట నొకానొకసమయమున నేకాంతస్థానమున నంకముపైఁ గూరుచున్న చూడాలనుగూర్చి మధురవాక్కుతో శిఖిధ్వజుఁ డిట్లనియె

శిఖిధ్వజ ఉవాచ:—

భుక్తం రాజ్యం చిరం కాలం భుక్తా విభవభూమయః
అధునాస్మి విరాగేణ యుక్తో గచ్ఛామి కాననమ్. 12

శిఖిధ్వజుఁడు:— ప్రియా! చిరకాలము రాజ్యమును, అనేకవిభవములను ననుభవించితిని. ఇఁక నిపుడు వైరాగ్యయుక్తుఁడనై వనమున కేగుచున్నాను.

న సుఖాని న దుఃఖాని నాపదో న చ సంపదః
క్రోడీకుర్వన్తి తన్వఙ్గి మునిం వననివాసినమ్. 13

సూక్ష్మాంగీ! వనవాసియగు మునిని దుఃఖములుగాని, సుఖములుగాని, యాపదలుగాని, సంపదలుగాని మోహితమొనర్పజాలవు.

న దేశభఙ్గసంమోహో న సంగ్రామే జనక్షయః
రాజ్యాదప్యధికం మన్యే సుఖం వననివాసినామ్. 14

మఱియు నట్టి వనవాసియగు మునికి దేశభంగమునుగూర్చిన సంమోహముగాని, యుద్ధము నందలి జనక్షయమునుగూర్చిన దుఃఖమునుగాని లేవు. కాన వనవాసులయొక్క సుఖము రాజ్యము కంటెను నధికమని తలంచుచున్నాను.

స్తబకస్తనధారిణ్యో రక్తపల్లవపాణయః
మఞ్జరీజాలహారిణ్యో లోలశుభ్రామ్బుదాంశుకాః 15
స్వపరాగాఙ్గరాగిణ్యః కృతకౌసుమమణ్డనాః
ఆసేవ్య కాఞ్చనశిలా నితమ్బతటశోభితా. 16
తరఙ్గహారకిస్రోతసరిన్మక్తాలతావృతాః
లతావయస్యావలితా ముగ్ధ ముగ్ధమృగాత్మజాః, 17
స్వభావోద్దామసౌగన్ధ్యా వితీర్ణఫలభోజనాః

షట్పద శ్రేణినయనాః పుష్పాపూరలతాఙ్గికాః. 18
ఆస్వాద్య స్యన్దతాం యాతాః శీలతామలగాత్రికాః
రమయన్తి త్వామివ మాం వనవీథ్యో వరాననే. 19

సుందరముఖీ! పుష్పగుచ్ఛములను స్తనముల ధరించినవియు, రక్తపల్లవములను హస్తములు గలవియును, సుగంధముచే ననురాగయుక్తములును, పుష్పములను నాభూషణములచే శోభితములును సేవింపయోగ్యమగు సువర్ణశిలారూప నితంబతటముచే శోభాయుక్తములును, తరంగములను ముత్యముల సమూహముచే గ్రుచ్చబడిన నదీరూపము క్తాలతలచే నాచ్ఛాదితములును, లతలను సఖులచే, బరివేష్టింపబడినవియు, ముగ్ధమృగరూప బాలకులతోటి గూడియున్నవియు, స్వభావముగనే విశేషసుగంధమును గలిగియున్నవియు, ఫలరూప భోజనమొసంగునదియు, తుమ్మెదల సమూహమను నేత్రములు గలవియు, పుష్పములచేఁ బరిపూర్ణములైన లతలను అవయవములు గలవియు, ఆస్వాదింప యోగ్యమైన జలముగల సెలయేళ్ళతో గూడినవియు, శీతలములై, నిర్మలములైనట్టి అవయవములు గలవియునగు వనవీథులు, నీవలెనే నన్నానందింపఁజేయు చున్నవి.

యథా వివిక్తమేకాన్తే మనో భవతి నిర్వృతమ్
న తథా శశిబిమ్బేషు న చ బ్రహ్మేన్ద్రసద్మసు. 20

ఏకాంతమగు వనప్రదేశమున మనస్సెట్లు సుఖమునందునో, అట్లు చంద్రబింబములందు గాని, బ్రహ్మ, ఇంద్రుల స్థానములందు (బ్రహ్మలోక, స్వర్గములందు) గాని సుఖమునొందదు.

అస్మిన్నస్మత్ప్రణే తన్వి న విఘ్నం కర్తుమర్హసి
భర్తుర్విఘటయన్తీచ్ఛాం న స్వప్నేఽపి కులస్త్రియః. 21

సూక్ష్మాంగీ! ఇట్టి వనగమనమును నుత్తమ విచారమున నీవు నాకు విఘ్నమును గలిగింపఁ జనదు. కులస్త్రీ లెన్నఁటికిని తమ భర్తయొక్క కోర్కెకుఁ బ్రతికూలమొనర్పరుగదా!

**చూడాలోవాచ:—**

ప్రాప్తకాలం కృతం కార్యం రాజతే నాథ నేతరమ్
వసన్తే రాజతే పుష్పం ఫలం శరది రాజతే. 22

చూడాల:—ప్రాణనాథా! సమయమున కనుకూలమగు కార్యమే శోభించును గాని యన్యము గాదు. ఎట్లనిన, వసంతకాలమున, బుష్పము శోభించును, శరత్కాలమున ఫలము శోభించును.

జరాజర్జర దేహానాం యుక్తో వనసమాశ్రయః
న యూనాం త్వాదృశామేవ తేనైతన్మే న రోచతే. 23

వార్ధక్యముచే గ్రస్తమగు దేహములు గలవారికే వన నివాసము యుక్తమైయున్నదిగాని మీవంటి యౌవనవంతులకుఁగాదు. కాన నిపుడే మీరు వనమునకేగుట నాకిష్టములేదు.

యావనేన మహారాజ న యావద్వయముజ్ఝితాః
పుష్పౌఘేణేవ తరవస్తావచ్ఛోభామహే గృహే. 24

పుష్పధానా పుష్పమితజ్జరసా సహ కాననమ్
సమం గృహాద్గమిష్యావో హంసా ఇవ సరోవరాత్. 25
అప్రాప్తకాలం నృపతేః ప్రజాపాలనముజ్ఝతః
రాజన్యస్యైవ రన్ధ్రస్య మహాదేనో భవిష్యతి. 26
అప్రాప్తకారిణం భూపం రోధయన్తి చ వై ప్రజాః
రోధయన్తి హ్యకార్యేభ్యః ప్రభుం భృత్యాః పరస్పరమ్. 27

మహారాజా! ఇక్కారణమున నెంతవఱకు మనమిరువురము యౌవనమునుండి విముక్తులము గాకయుందుమో. అంతవఱకు-పుష్పసమూహములచే వృక్షమువలె-మనము గృహమందే శోభించెదము. పుష్పములతోఁగూడిన లతలవంటి కేశములు (వార్ధక్యచిహ్నముగా) మనమెప్పుడు శిరములఁ గలిగియుందుమో, అపుడు, సరోవరమునుండి హంసలవలె, మనమరణ్యమునకేగెదము. సమయముకాని సమయమున ప్రజాపాలనమును వదలివేయు రాజునకు రాజ్యచ్ఛిద్రమునుగూర్చిన గొప్పపాపము సంభవించును. మఱియు సమయము ప్రాప్తింపకమునుపే కార్యమొనర్చునట్టి రాజును ప్రజలు నిరోధించెదరు. అకార్యములనుండి తమప్రభువును భృత్యులు పరస్పరము నివారించెదరుగదా!

శిఖిధ్వజ ఉవాచ:—

అలముత్పలపత్రాక్షి విఘ్నేనాభిమతస్య మే
విద్ధి మాం గతమేవేతో దూరమేకాన్తకాననమ్. 28

శిఖిధ్వజుఁడు:— కమలనేత్రి! ఈ నాయభీష్టకార్యమును విఘ్నమొనర్పకుము. దూరమైన యేకాంతమగు నరణ్యమునకు వెడలినట్లే నన్నిపుడు భావింపుము.

బాలా త్వమనవద్యాఙ్గి నాగన్తవ్యం వనం త్వయా
పుంసామపి హి మృద్వఙ్గి దుర్విగాహ్యో వనాశ్రయః. 29

సూక్ష్మాంగీ! నీవింకను బాలికవు. కాన వనమున కేఁగుట నీకుఁదగదు. వనవాసము పురుషులకుఁగూడ నతికష్టసాధ్యమైనదేయగును.

సమర్థా న వనావాసే యోషితః కఠినా అపి
కాననే పుష్పమఞ్జర్యః సోఢుం శస్త్రాలిమక్షమాః. 30

అరణ్యమునందు జనించిన పుష్పలతలు కఠినములైయున్నను, శస్త్రసమూహము నెట్లు సహింపఁజాలవో, అట్లనే కఠినములైన యవయవముల గల స్త్రీలైనప్పటికి వనవాసమున కసమర్థులై యుందురు.

భవత్యా పాలయన్త్యేహ రాజ్యే స్థాతవ్యముత్తమే
కుటుమ్బభారోద్వహనం పత్యౌ యాతే వ్రతం స్త్రియః. 31

ఉత్తమురాలైన యో ప్రియా! ఈ రాజ్యమును పాలింపుచు నీవిచటనే యుండుము. ఏలయనఁగా, పతి వెడలినతరువాత కుటుంబభారమును వహించుట (లేక, రాజ్యపాలన మొనర్చుట) స్త్రీల వ్రతమైయున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా దయితాం రాజ తామిన్దువదనాం వశీ
ఉత్తస్థౌ స్నాతుమఖిలం దినకార్యం చకార చ. 32

శ్రీవసిష్ఠుఁడు.—ఓ రామచంద్రా! జితేంద్రియుఁడగు ఆరాజు చంద్రవదనయగు తన ప్రియురాలితో నిట్లు పచించి, పిమ్మట స్నానమొనర్చుటకై లేచి దైనిక కార్యములన్నిఁటిని నెరవేర్చెను.

అథోజ్ఝితప్రజాచేష్టో రవిరస్తాచలం యయౌ
శిఖిధ్వజో వనమివ సమస్తజనదుర్గమమ్. 33

అటుపిమ్మట, శిఖిధ్వజుఁడు ప్రజలందఱిని వదలి దుర్గమమైన యరణ్యమునకు, బోయినట్లు, సూర్యభగవానుఁడు ప్రజలందఱియొక్క క్రియలను వదలి అస్తాచలమునకుఁ బోయెను.

సంహృత్య వితతం రూపం తమేవానుయయౌ ప్రభా
నాథం భవననిష్క్రాన్తం చూడాలేవానురాగిణీ. 34

మఱియు, అనురాగిణియగు చూడాల రాజభవనమునుండి బయలుదేఱిన తన పతిననుసరించి వెనుకనే వెడలినట్లు తన వ్యాపకరూపము నుపసంహరించి సూర్యప్రభయు సూర్యుననుసరించి వెనుకనే పోయెను.

ఆయయౌ యామినీ శ్యామా భువనం భస్మధూసరమ్
ధృతవ్యోమాపగం శర్వం సంశ్లేషా యమునేవ సా. 35

విభూతిని, గంగను ధరించు నీశ్వరుని నాలింగనమొనర్చు యమునానదివలె, భస్మముచే ధూసరితమైనట్లున్నదైన ప్రపంచమున నత్తఱి శ్యామవర్ణముగల రాత్రి ప్రవేశించెను.

దిక్షు సంధ్యాబ్దదన్తాసు స్థితాసు కృతమణ్డలమ్
తమాలబాలకాఙ్క్షాసు జ్యోత్స్నాహాసోదయాఙ్కితమ్. 36
గచ్ఛతోఽపరం పారం దంపత్యోః స్వైరవం పదమ్
దేవోద్యానమయం రన్తుం దినశ్రీదిననాథయోః. 37
ఆగచ్ఛతోరిదం పారం వ్యాఘతీక్ష్ణకరోజ్ఝితమ్
నిశానిశానాయకయోర్దంపత్యోః స్వైరవం పునః. 38
తారాగణోఽథ దదృశే వికీర్ణో వ్యోమకుట్టిమే
ముక్తోమఙ్గలలాజానాం దిగ్వధూభిరివాఞ్జలిః. 39

సంధ్యాకాలమేఘములను దంతముల ధరించినవై తమాలవృక్షములను బాలకులోడియందు గలవై చంద్రికయను హాస్యముతోఁగూడినవై, మండలాకారముగ దిక్కులు వెలయుచుండ దినముయొక్క శోభయు, దిననాథుఁడు (సూర్యుఁడు) నను దంపతులు దేవోద్యానమయమగు మేరుపర్వతముయొక్క యావలితటమున క్రీడించుటకై వెడలుచుండ, తాపయుక్తములగు తీక్ష్ణకిరములచే విడువబడిన, మేరువుయొక్క యీవలి తటమున రాత్రియు, చంద్రుడు (నిశానాథుఁడు)నను దంపతులు

క్రీడార్థమై యేతెంచుచుండ, ఆకాశమను మిద్దెపైనుండి దిక్కులను స్త్రీలచే, జల్లబడిన మంగళకరము లైన పేలాలువలె నక్షత్ర తారాగణంబు కానుపించెను.

చన్ద్రాననా తమఃశ్యామా క్రాన్తా కుసుమ హాసినీ
యామినీ యౌవనం ప్రాప సరోజ ముకుల స్తనీ. 40

మఱియు నపుడు చంద్రుడను ముఖము గలదియు, అంధకారముచే శ్యామవర్ణయుతమును, తన ప్రియుని వెదకుటలో నలసటను బొందినదైన కుముదాది పుష్పములచే హాస్యయుక్తముగనున్నదియు, ముకుళించిన కమలములను స్తనములు గలదియు నగు రాత్రియను స్త్రీ యౌవనమును దాల్చెను.

కృతసంధ్యా సమాచారః సహ చూడాలయేష్టయా
సుష్వాప శయనే భూయో మైనాక ఇవ సాగరే. 41

అట్టి సమయమున శిఖిధ్వజుడు సంధ్యాదికార్యముల నిర్వర్తించి, మైనాక పర్వతము మఱల సముద్రమునందు నిదురపోయినట్లు, తనప్రియురాలగు చూడాలయొక్క శయనస్థానమున నిదురించెను.

అథార్ధరాత్రసమయే దేశే నిఃశబ్దతాం గతే
ఘననిద్రాశిలాకోశ నిలీనే సకలే జనే. 42
స తస్యాం సంప్రసుప్తాయాం శయనే కోమలాంశుకే
భృశం నిద్రావిమూఢాయాం భ్రమర్యామివ పఙ్కజే. 43
తత్యాజ దయితాం సుప్తామఙ్కాద్రాజా శిఖిధ్వజః
స్వైరం స్వైరం ముఖం రాహోర్దిశం చాన్ద్రీప్రభామివ. 44

తదుపరి, అర్ధరాత్రిసమయమున దేశమంతయు శబ్దరహితము కాగా, ఘనీభూతమగు నిద్రయను శిలాకోశమున జనులందఱు విలీనులు కాగా, కమలమునందు భ్రమరమువలె శయనమున గోమల వస్త్రముపై చూడాల గాఢనిద్రయందుండగా, తూర్పుదిక్కున రాహువుయొక్క ముఖము చంద్ర ప్రభను మెల్లమెల్లగా త్యజించునట్లు శిఖిధ్వజుడు నిదురించిన తన ప్రియురాలిని త్యజించెను.

ఉత్థితసా శయనాల్లీనవధూకార్దాఞ్చలాంశుకాత్
సలక్ష్మీకా స్తలోలోర్మేర్హరిః క్షీరార్ణవాదివ. 45

ఎద్దాని యర్థభాగమున దనప్రియ నిదురించుచుండెనో, అట్టి చంచలవస్త్రయుక్తమగు శయన స్థానమునుండి, లక్ష్మీశోభాసహితమై, చంచలతరంగయుక్తమైనట్టి క్షీరసాగరమునుండి విష్ణుభగవానుడు లేచునట్లు, రాజు లేచెను.

వీరక్రమార్థం యామీతి తత్రైవానుచర వ్రజన్
యోజయిత్వా జగామాసౌ పురాన్నిర్గత్య పూర్ణధీః. 46

చోరాది దుష్టజన నిగ్రహార్థము రాత్రిసంచారమను వీరుల కార్యమొనరించుటకై నేను వెడలుచున్నానని చెప్పి తనసేవకుల నచటనే నియోగించి, నిస్పృహుడగు నారాజు నగరమునుండి బయల్వెడలెను.

రాజ్యలక్ష్మి నమస్తుభ్యమిత్యుక్త్వా మణ్డలాద్గతః
వివేశోగ్రామరణ్యానీమేకో నద ఇవార్ణవమ్. 47

'ఓ రాజ్యలక్ష్మీ! నీకు నమస్కారమని చెప్పి యాతఁడు తన రాజభవనమును వీడి, నదము మహాసముద్రమున, బ్రవేశించునట్లు, ఒక భయంకరమైన మహారణ్యమునఁ బ్రవేశించెను.

ఘనాన్ధకారగుల్మాఢ్యా క్షుద్రభూతౌఘ కర్కశా
సారణ్యానీనిశా సార్ధం సమం తేనాతివాహితా. 43

ఘనీభూతమగు నంధకారముచేతను, లతలచేతను బరిపూర్ణమై, క్షుద్రజంతువులచేఁ గర్కశమైనట్టి యా మహారణ్యమును దాఁటఁగా నతనికా రాత్రి గడచెను.

ప్రాతః శూన్యామరణ్యానీం స నీత్వా వితతం దినమ్
సమమర్కేణ కస్యాంచిద్విశశ్రామ వనావనౌ. 49

ప్రాతఃకాలము కాఁగా, మఱల యాదినమంతయు నొకవిశాలమైన శూన్యారణ్యమునఁ బోవుచు, సూర్యభగవాను డస్తాచలమున విశ్రాంతి నొందుసమయమున, ఒకానొక వనభూమిపైఁ దానును విశ్రమించెను.

భానావదృశ్యతాం యాతే తత్ర స్నానాదిపూర్వకమ్
కించిత్ఫలాదికం భుక్త్వా తాం నినాయ తమస్వినీమ్. 50

సూర్యుఁ డదృశ్యుఁడు కాఁగా నచట స్నానసంధ్యాది కృత్యముల నెరవేర్చి కొన్ని ఫలములను భుజించి, ఆరాత్రి గడపెను.

పునః ప్రాతః పురాణ్యుచ్చైర్మణ్డలాని గిరీన్నదీః
జవాదుల్లఙ్ఘయామాస రాజా ద్వాదశశర్వరీః. 51

మఱల ప్రాతఃకాల మయినపిమ్మట బయలుదేఱి వేగముగాఁబోవుచు గొప్ప గొప్ప పురములను, మండలములను, పర్వతములను, నదులను, పండ్రెండు దినములలో దాటివైచెను.

తతో మన్దరశైలస్య తటస్థం జనదుర్గమమ్
ప్రాప కాననమత్యన్తదూరస్థజనతాపురమ్. 52

అనంతరము, జననివాసమున కతిదూరమున నున్నదియు మందరపర్వత తటముపై వర్తించునదియు, మనుజులకు దుర్గమమైనదియునగు అరణ్యము నొకదానిని బొందెను.

రటత్ప్రణాలసలిలవాపీబలితపాదపమ్
శీర్ణవేద్యాలయజ్ఞాత భూతపూర్వద్విజాశ్రమమ్. 53
క్షుద్రప్రాణివినిర్ముక్త సిద్ధసేవ్యలతాలయమ్
ఆపూర్ణపాదపలతం ప్రాణవృత్తికరైః ఫలైః. 54

ఆయరణ్యము శబ్దముతోఁగూడి ప్రవహించుచున్న జలము గలిగిన నడబావులచే మహాబలయుక్తములుగ నొనర్పఁబడిన వృక్షములు గలదియు, పూర్వకాలపు ద్విజుల యాశ్రమముల జ్ఞప్తికిఁ

దెచ్చుకటువంటి పురాతన వేదికలు గల్గియున్నదియు, క్షుద్రజీవులు లేనిదియు, సిద్ధులచే సేవ్యములగు లతాగృహములతోఁ గూడియున్నదియు, ప్రాణుల జీవిక కుపయోగించునట్టి ఫలములచేఁ బైనుండి క్రిందివఱకుఁ బరిపూర్ణమైనట్టి వృక్షములు, లతలుగలదియునై, విరాజిల్లుచుండెను.

తత్రైకస్మిన్సమే శుద్ధే స్థలే సలిలమాలితే
శీతలే శాద్వలశ్యామే స్నిగ్ధే సఫలపాదపే. 55
స మఞ్జరీభిర్వల్లీభిః స చకారోటజాలయమ్
ప్రావృట్కాలః సవిద్యుద్భిర్నీలాభ్రైరివ పఞ్జరమ్. 56

అచ్చట, జలముచే వేష్టితమై, శీతలమై పచ్చని తృణములచే శ్యామవర్ణయుతమై, మనోహరమై, ఫలసహితములగు వృక్షములతో గూడినదైనట్టి యొకస్థానమున, వర్షాకాలమున మెఱపులతో గూడిన మేఘములచే పంజరము నిర్మింపబడునట్లు, నూతనపల్లవ సహితములగు లతలచే నారాజొక పర్ణశాలను నిర్మించెను.

మసృణం వైణవం దణ్డం ఫలభోజన భాజనమ్
అర్ఘపాత్రం పుష్పభాణ్డమక్షమాలాం కమణ్డలుమ్. 57
కన్థాం శీతాపనోదాయ బృసీం చైవ మృగాజినమ్
ఆనీయాయోజయత్తస్మిన్మఠికామన్దిరే నృపః. 58
యత్కించిదన్యద్వా వస్తు యోగ్యం తాపసకర్మణి
తత్తత్ర స్థాపయామాస జగతీవ క్రమం విధిః. 59

సులలితమైనట్టి వెదురుదండము, ఫలములు, భోజనపాత్ర, పూజాపాత్ర, పుష్పపాత్ర, కమండలువు, రుద్రాక్షమాల, శీతనివారణకై యొక బొంత, ఆసనము, మృగచర్మము, అనుసీపదార్థములన్నింటిని దీసికొనివచ్చి రాజు తన కుటీరమున స్థాపనముచేసెను. బ్రహ్మదేవుఁడు తన జగద్వ్యవహారమునకు వలసిన వస్తువులన్నింటిని సమకూర్చునట్లు ఇంకను తాపసులకార్యమునకు యోగ్యములగు వస్తువులన్నింటినిగూడ నాతఁడు తన కుటీరమున సమకూర్చియుంచెను.

సంధ్యాపూర్వం జపం ప్రాతః ప్రహరే స తదాకరోత్
పుష్పోచ్చయం ద్వితీయే తు స్నానం దేవార్చనం తతః. 60
పశ్చాద్వనఫలం కించిద్వనకన్దం బిసాది చ
భుక్త్వా జప్యపరో భూత్వా నినాయైకో నిశాం వశీ. 61

ఆరాజు దినమందలి మొదటి జామున, ప్రాతస్సంధ్యా పూర్వక జపమును కావించును; రెండవజామున, పుష్పాదుల సంచయమొనర్చును; అనంతరము మూఁడవజామున మఱల స్నాన, దేవతార్చనాది కార్యములఁ జేయును. తదుపరి నాల్గవజామున వనమందలి ఫల, కంద, మూల, కమలదండాదులఁ గొన్ని భక్షించి జపతత్పరుఁడై రాత్రిని గడపును.

ఇతి దివసమఖేదం మన్దరోపాన్తకచ్ఛే
స్థిరచిత్త ఉటజేఽన్తర్మాలవేశో నినాయ

నవనృపతివిలాసం తం న సస్మార కం వా
స్ఫురతి హృది వివేకే రాజ్యలక్ష్మ్యో హరన్తి. 62

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే శిఖిధ్వజప్రవజ్యా నామ చతురశీతితమః సర్గః ॥ 84 ॥

ఓ రామచంద్రా! ఇట్లు మందరాచలతటమున నిర్మింపఁబడిన పర్ణశాలయందు స్థితుఁడై మాలవదేశాధిపుఁడగు శిఖిధ్వజుఁడు ఖేదరహితుఁడై జపాదులఁ గావించుచు చాలదినములు గడపెను. తన నూతనరాజ్యవిలాసముల వేటిని నాతఁడపుడు స్మరింపకుండెను. ఏలయనిన, వివేకము హృదయమున స్ఫురింప, రాజ్యసంపదలిఁక నే దరిద్రుని చిత్తము నైన, హరింపగలవా? (హరింపవని భావము)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజప్రవజ్యయను
నెనుబది నాల్గవ సర్గము ॥84॥

---

## పఞ్చాశీతితమః సర్గః

[రాజ్ఞ్యా ప్రబుద్ధయా రాజ్ఞోఽన్వేషణం పథి దర్శనమ్
భావ్యర్థదర్శనం కాలే బోధనం చోపవర్ణ్యతే.

చూడాల మేల్కొని రాజునకై వెదకుట; మార్గమున వానిఁ గాంచుట; రాజుయొక్క భవిష్యదర్థము నవలోకించుట, కాలక్రమమున నాతనికి బోధించుట మున్నగు విషయము లిట వర్ణింపఁబడినవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ: —**

ఏవం శిఖిధ్వజః పూర్ణమఠికాయాం వనే స్థితః
ఇదానీం శృణు చూడాలా సా కిం కృతవతీ గృహే. 1

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఇట్లు, వనమున శిఖిధ్వజుఁడు సర్వవస్తుపరిపూర్ణమగు తన కుటీరమందుండ, అట చూడాల తన గృహమున నేమి కావించెనో వినుము.

తత్రార్ధరాత్రసమయే దూరం యాతే శిఖిధ్వజే
హారిణీ గ్రామసుప్తేవ చూడాలా బుబుధే భయాత్. 2

అచట, అర్ధరాత్రియందు శిఖిధ్వజుఁడు దూరమునకు వెడలిపోగా, గ్రామమందు నిదురించుచున్న లేడివలె భయముచే నారాణి మేల్కాంచెను.

అపశ్యత్పతినిర్ముక్తం శయనం శూన్యతాం గతమ్
అభాస్కరమపూర్ణేందు శాన్తశోభమివామ్బరమ్. 3

తాదృశం పతిమాలోక్య స్థిత్వా గగనకోటరే
భవిష్యచ్చిన్తయామాస సర్వం భర్తురఖణ్డితమ్. 11

ఆకాశ కోశమున నున్నదై యాప్రకారము తన భర్త నవలోకించి యపుడామె యాతని భవిష్యత్తునుగూర్చి పూర్ణముగా నాలోచించెను.

యథా యేన యదా యత్ర యావత్కార్యం యథోదయమ్
యథా చ నిర్వృతిః స్ఫారా గన్తవ్యా తేన రాఘవ. 12

ఓ రాఘవా! ఎట్లు, ఏనిమిత్తముచే, ఏ దేశకాలములందు, ఎట్టిక్రియచే నాతనికి నభ్యుదయమగునో, ఏ ప్రకారమాతనికి నిరతిశయ బ్రహ్మానందప్రాప్తియగునో, అదంతయు యోగబలముచే నామె వీక్షించెను.

అవశ్యం భవితవ్యం తద్భర్తుర్దృష్ట్వా పురః స్థితమ్
తదేవ సంవాదయితుం గమనాత్సా న్యవర్తత. 13

యోగబలముచేఁ బ్రత్యక్షమువలె నున్నదియు, తన భర్తకవశ్యముగ భవితవ్యమై యొప్పునదియునగు యెద్దానినామె గాంచెనో, తదనుకూలముగ నాచరించుటకుఁగాను, అపుడు తన గమనము నుండి నివర్తించెను.

ఆస్తాం మమాద్య గమనం కాలేనాతి చిరేణ హి
మయాస్య పార్శ్వే గన్తవ్యం నియతేరేష నిశ్చయః. 14

నా గమనమిపుడుకాదు; చాలకాలమైన పిదపయే నేను భర్త్రుసమీపమునకు బోవలసియుండును. ఈశ్వరనియతి యొక్క నిశ్చయమైయున్నది.

ఇతి సంచిన్త్య చూడాలా ప్రవిశ్యాన్తఃపురం పునః
సుష్వాప శయనే శంభోః శిరసీవైన్దవీ కలా. 15

ఇట్లు విచారించి చూడాల మఱల యాంతఃపురమున, ప్రవేశించి, శివుని శిరముపైఁ జంద్రకళవలె, తన శయనస్థానమునఁ బరుండెను.

కేనచిత్కారణేనాసౌ గతః సంప్రతి భూపతిః
ఇతి పౌరం జనం సర్వమాశ్వాస్యాతిష్ఠదఙ్గనా. 16

ఏదియో విశేషకారణముచే రాజు ప్రవాసమునకుఁ జనెనని యీప్రకారముగ చూడాల నగరవాసులకున్ను, సర్వప్రజాగణంబునకున్ను వచించినదై వారలనోదార్చి నివసింపఁదొడఁగెను.

రాజ్యం రరక్ష భర్తుస్తత్క్రమేణ సమదర్శనాత్
యథా కాలేన కేదారం పక్వం కలమగోపికా. 17

కాలక్రమమునఁ బరిపక్వమైన ధాన్యమును క్షేత్రపాలిని సంరక్షించునట్లు, చూడాలయు సమదృష్టిచేఁ దన భర్తయొక్క రాజ్యమును క్రమరూపమున, పాలించెను.

తయోస్తదావహాత్కాలో దంపత్యోః స్థితయోస్తథా
అదృష్టాన్యోన్యముఖయో రాజ్యకానన పాలయోః. 18

ఒకరి ముఖమును నొకరు చూడనివారును, రాజ్య, అరణ్యముల, క్రమముగ, పాలించువారునగు యాస్త్రీపురుషులిరువురికిని కాలము గడచుచుండెను.

జగామాథ దినం పక్షో మాసోఽథఋతువత్సరః
శిఖిధ్వజస్య విపినే చూడాలాయాః స్వమన్దిరే. 19

శిఖిధ్వజునకు వనమందును, చూడాలకుఁ దన రాజమందిరమునను దిన, పక్ష, మాస, ఋతు, సంవత్సరరూప కాలము గడచుచువచ్చెను.

బహునాత్ర కిముక్తేన వర్షాణ్యష్టా దశాఙ్గనా
చూడాలోవాచ సదనే వనగుచ్ఛే శిఖిధ్వజః. 20

వెయ్యేల! పదునెనిమిది వత్సరములవఱకు చూడాల రాజభవనమునందును, శిఖిధ్వజుఁడు వనసమూహమునను వసించిరి.

అథ యాతేషు బహుషు వర్షేషు జరసా వృతే
శిఖిధ్వజే మహాశైలతటకోటర వాసిని 21
భర్తుః కషాయపాకం తదాలక్ష్య పాలితం చిరాత్
తదా తస్యాథ యాతేషు వర్షేషు జరసా వనే. 22
తదా తస్యాత్మకార్యస్య భవితవ్యతయా తథా
భర్తుః సమీపగమనే మమ కాలోఽయమిత్యథ. 23
సంచిన్త్య మన్దరోపాన్తం గన్తుం బుద్ధిం చకార సా
చచారాన్తఃపురాద్రాత్రౌ తతార నభసః పథమ్. 24

అనంతరము చాల వత్సరములు గడువ, వార్ధక్యముచే గ్రస్తుఁడైన శిఖిధ్వజుఁడు మహాపర్వతకోటరమున నివసించుచుండ, అపుడు, పతియొక్క రాగద్వేషాది కషాయము లెంతవఱకు, బరిపక్వము కాకయుండెనో, అంతవఱకు వేచియున్నదై ఆపిమ్మట చూడాల పతియొక్క బోధనరూపమగు ఆత్మకార్యముయొక్క భవితవ్యమునుబట్టి భర్తృసమీపమునకు, బోవుటకిది తగినసమయమని యాలోచించి మందరపర్వతారణ్యమున కేగుటకై నిశ్చయించి రాత్రియందంతఃపురమునుండి బయలుదేఱి యాకాశమార్గమున నెగసిపోయెను.

జగామ వాతస్కన్ధేన గచ్ఛన్తీ ఖే దదర్శ సా
కల్పవృక్షాంశుకచ్ఛన్నరత్నస్తబకభూషితాః. 25
నన్దనోద్యాననిలయా రక్తాః సిద్ధాభిసారికాః
పరామృష్టేన్దుశకలాన్ప్రాలేయకణవర్షిణః. 26
సిద్ధోత్తమాత్తసౌగన్ధ్యస్సర్వయామాస మారుతాన్

చన్ద్రబిమ్బామృతామ్భోధేర్మహావీచిపరమ్పరామ్. 27
అపశ్యన్నిర్మలజ్యోత్స్నామమ్బరాన్తరతాం గతా
మేఘాన్తరేణ గచ్ఛన్తీ మేఘలగ్నాశ్చ విద్యుతః. 28
అవియుక్తాః స్వభర్త్రా సా భూయో భూయో వ్యలోకయత్

వాయుమండలముగుండా యామె జనెను, ఆకాశమార్గమునఁ బోవుచు నామె కల్పవృక్షముయొక్క వస్త్రములచే నాచ్ఛాదితులును, రత్నసమూహములచే నలంకృతులును, నందనవననివాసినులును తమ ప్రియులందరనురక్తులు నగు సిద్ధుల యప్సరసలఁ జూచెను. మఱియు చంద్రఖండమును స్పృశించునవియు, హిమబిందువుల వర్షించునవియు ఉత్తమ సిద్ధులచే గ్రహింపఁబడిన సుగంధములు గలవియునగు వాయువులను స్పృశించెను. అట్లాకాశమధ్యమున నేగుచు నామె చంద్రబింబమును అమృతసముద్రముయొక్క మహాతరంగసమూహములతోఁ గూడినట్టి నిర్మల చంద్రికను గాంచెను. అట్లే మేఘమండలమునఁ బోవుచు మేఘములందు సంలగ్నమైనదియు, మేఘపంక్తినుండి వియుక్తము కానిదియునగు విద్యుత్సమూహమును మఱిమఱి వీక్షించెను.

ఉవాచ చాత్మనైవాహో యావజ్జీవం శరీరిణామ్. 29
న స్వభావః శమం యాతి మమాప్యుత్కణ్ఠితం మనః
కదాప్యగేన్ద్రి స్కన్ధం తం ప్రణయప్రవణం పునః. 30
పశ్యామి కాన్తమిత్యుక్తం మమాప్యుత్కణ్ఠతే మనః
మఞ్జరీజాలలలితా స్తరుం వల్ల్యః స్వకం పతిమ్ 31
న ముఞ్చన్తి క్షణమితి మమాప్యుత్కణ్ఠతే మనః
యథేయమగ్రజా కాన్తమేతి సిద్ధాభిసారికా. 32
తథా కదాహమేష్యామి మమాపీతి మనః స్థితమ్
ఇమే మన్దాశ్చ మరుత ఏతే చ శశినః కరాః. 33
వనరాజయ ఏతాశ్చ మమాప్యుత్కణ్ఠయ న్త్యహో
హే చిత్తజ్ఞ ముధైవాన్తః కిం త్వం తాణ్డవితం స్థితమ్ 34
సా వ్యోమ నిర్మలా సాధో క్వ తే యాతా వివేకితా
అథవా చిత్త భర్తారం స్వం ప్రత్యుత్కణ్ఠసే సఖే. 35

అట్లు వానిఁగాంచి తన మనంబున నిట్లనుకొనెను —— ఆహా! జీవితపర్యంతము ప్రాణులయొక్క స్వభావము శమింపదు. నామనస్సున్ను యుత్కంఠితమాయెను. ప్రేమయందు నిమగ్నుఁడును, సింహమువంటి భుజస్కంధములు గలవాఁడు నగు నాప్రాణప్రియుని మఱల నెప్పుడు గాంతును? ఆహా వివేకాదులచే బోధింపఁబడినదైనను నామనస్సు యుత్కంఠితమగుచున్నదే! అనేక మొగ్గలతోఁ గూడుకొనియున్న లతలు తమ పతియగు వృక్షమును క్షణకాలమైనను విడువకయున్న విధమున నా మనస్సున్ను మత్ప్రియునికొఱకై వ్యాకులితమగుచున్నది. మఱియు సిద్ధుల యభిసారిక తన పతి సమీపమునకుఁ బోవుచున్న చందమున నేనున్ను నాప్రాణనాథుని చెంతకెపుడు చేరుదును? ఈ మెల్లనివాయు

వులు, ఈ చంద్రకిరణములు, ఈ వనసమూహములు, నామానసము నుత్కంఠిత మొనర్చుచున్నవి. ఓ అజ్ఞచిత్తమా! వ్యర్థమగు నాడంబరముతోఁగూడి యేలఁయుంటివి? ఓ సాధూ! చిత్తమా! ఆకాశము వలె నిర్మలమైన నీవివేక మెచటికిఁబోయెను? కాదు సఖీ అది నీదోషము కాదు. ఏలయనిన, నీవు నీపతికై యుత్కంఠితమగుచున్నావు, ఓచిత్తమా! నీవట్లే యుత్కంఠితమై యుండుము దానిచే నాకేమి.

తిష్ఠోత్కణ్ఠాభివలితం కిం సముత్కణ్ఠితేన మే
కిం వృథోత్కణ్ఠసే వా మే భర్తా యాతో జరాం భవేత్. 36

తపస్వీ కృశగాత్రశ్చ భవేన్నిర్వాసనస్తథా
మనోరాజ్యాద్యభోగేభ్యో మన్యేఽస్యామూలతాం గతమ్. 37

ఓ స్త్రీశరీరమా! నీవు వ్యర్థముగ నేల యుత్కంఠిత మగుచున్నావు? ఎవని గౌఁగిలింపుటకై నీవు తత్తఱపడుచుంటివో, ఆ నీపతి యిప్పటికి వృద్ధుఁడై యుండును. మఱియు, తపస్వియు కృశించిన శరీరము కలవాఁడును, వాసనారహితుఁడునై యుండును, కాన ఆతని మనస్సు రాజ్యభోగములందు నిర్మూలమైయుండునని తలంచెద.

వాసనాలతికా ప్రావృణ్ణదీ నదగతా యథా
ఏకాన్తరత ఏకాత్మా నీరసః శాన్తవాసనః. 38

అల్పవర్షముచే జనించిన నది మహానదమునఁ గలిసి తద్భిన్నముగ గోచరింపనట్లు, నాపతి యొక్క వాసనారూపలత ఆత్మకంటె భిన్నముకా నేరదు. ఆతఁడేకాంతమున నాసక్తుఁడై, ఏకాత్మరూపుడై, ఇచ్ఛారహితుఁడై యుండును.

మన్యే భవతి మే భర్తా శుష్కవృక్షసమస్థితిః
తథాపి చిత్తకోత్కణ్ఠా భవతోత్కణ్ఠయాన్వితమ్. 39

మతిముద్బోధ్య యోగేన శ్లేషయిష్యామ్యహం పతిమ్
ప్రమృష్టకలనం భర్తుః సమీకృత్య మనో మునేః. 40

రాజ్య ఏవ నియోక్ష్యామి నివత్స్యావః సుఖం చిరమ్

ఓ చిత్తమా! నా భర్త శుష్కించిన వృక్షమువలె నుండునని యూహించుచున్నాను. అయినప్పటికి నీతోఁగూడ నేనును నాతనికై యుత్కంఠిత యగుచున్నాను. నేను నా యోగబలముచే నాపతిని ఆత్మజ్ఞానిగఁ జేసి, ఆ మునియొక్క మనస్సును సంకల్పమువైపునకు ద్రిప్పి, ఆతని నాలింగన మొనర్చుకుందును మఱియు, శేషించిన జీవితమున మఱల యాతనిని రాజ్యపాలనమున నియుక్తునిగఁ జేసి ఇరువురము సుఖముగ, చిరకాలము నివసించెదము.

అహో ను చిరకాలేన మనోరథమిమం శుభమ్. 41

అహమాసాదయిష్యామి యద్భర్తా శమచిన్తితః
సమగ్రానన్దవృన్దానామేతదేవోపరి స్థితమ్. 42

యత్సమానమనోవృత్తిసఙ్గమాస్వాదనే సుఖమ్

ఆహా! చిరకాలమున కీనామనోరథము సిద్ధించినది. నాతో సమానమైనట్టి తత్త్వజ్ఞానియు, బాహ్యాభ్యంతరములందు సమానమైన విచారములు కలవాఁడునగు పతిని నేనిప్పుడు పొందుదును. ఏలయనిన; సమానమైనట్టి మనోవృత్తుల సంగమముయొక్క యాస్వాదనమునఁ గలుగు సుఖము సమస్తసుఖముల కంటెను నధికమైనది.

ఇతి చిన్తయతీ వ్యోమ్నా చూడాలోల్లఙ్ఘ్య పర్వతాన్. 43
దేశానబ్దాన్దిగన్తాంశ్చ ప్రాప మన్దరకన్దరమ్
అదృశ్యైవ నభస్థైవ ప్రవివేశ వనాన్తరమ్. 44

ఇట్లు చింతించుచు ఆచూడాల యాకాశమార్గముగుండా పర్వతములను, దేశములను, మేఘములను, దిగంతములను నుల్లంఘించి మందరపర్వతకందరమును జేరి, అదృశ్యరూపమున నాకాశముననున్నదై మఱియొకవనమున, బ్రవేశించెను.

వాత్యేవ పాదపలతాః స్పన్దవేద్యగమాగమా
వనైకదేశే కస్మింశ్చిత్కృతపర్ణోటజే పతిమ్. 45
దృష్ట్వా యోగేన బుబుధే దేహాన్తరమివాస్థితమ్

వృక్షలతాదుల కదలికచే నూహింపఁబడు గమనాగమనయుక్తమగు వాయుమండలముగల యావనమందలి యొకానొక ప్రదేశమునఁ బర్ణశాలను నిర్మించుకొనియున్న తనపతిని, గాంచి, ఏకాగ్రచిత్తముతో నవలోకింప నాతనిని అన్యదేహమందున్నవానివలె నెఱింగెను.

హారకేయూరకటకకుణ్డలాదివిభూషితః. 46
అభవన్మేరుకాన్తిర్యస్తమేవాత్ర దదర్శ సా
కృశాఙ్గం కృష్ణవర్ణం చ జీర్ణపర్ణమివ స్థితమ్. 47
కజ్జలామ్బుభరస్నాతం భృఙ్గీశమివ నిస్పృహమ్
చీరామ్బరధరం శాన్తమేకాకినమవస్థితమ్. 48

ఎవఁడిదివఱకు హార, కేయూర, కటక, కుండలాదులచే భూషితుఁడై, సువర్ణమువలె శోభించుచుండెనో, అట్టివానినిపుడు కృశించిన శరీరముగల వానినిగను, నల్లని వర్ణముతోఁ గూడియున్న వానినిగను, జీర్ణపత్రమువలెనున్నట్లును గాంచెను. మఱియు, కాటుకనీటియందు స్నానమొనర్చిన వానివలెను, ఇచ్ఛారహితునిగను, ఈశ్వరుని ప్రసిద్ధగణమగు భృంగీశునివలె నున్నవానినిగను, వల్కలములే వస్త్రములుగా ధరించినట్లుగను శాంతునిగను, ఏకాకిగను వీక్షించెను.

స్థలీనిషణ్ణం పుష్పాణి గ్రథయన్తం జటాఙ్కితమ్
తమాలోక్యానవద్యాఙ్గీ చూడాలా పీవరస్తనీ. 49
కించిజ్జాతవిషాదేవమువాచాత్మని చేతసా
అహో ను విషమం మౌర్ఖ్యం తదనాత్మజ్ఞతాత్మకమ్. 50
ఏవంవిధాః సమాయాన్తి దశా మౌర్ఖ్యప్రసాదతః

అయం స రాజా లక్ష్మీవాన్యతో మేఽతిప్రియః పతిః. 51
హృది మే హాఘనజ్ఞాముమాామభ్యాగతో దశామ్
తదవశ్యమిహాద్యైవ నాథం విదితవేద్యతామ్. 52
నయామ్యత్ర న సందేహో భోగమోక్షశ్రియం తథా

వనమున గూర్చుండి పుష్పములను మాలగ గట్టుచున్నట్టి. జటాధారియగు ఆతన పతినిం గాంచి ఉత్తమ శరీరముగలదియు, స్థూలస్తనధారిణియునగు చూడాల కొంచెము విషాదము నొందినట్లున్నదై తన చిత్తముతో నిట్లు పల్కెను— ఆహా! అజ్ఞానముచే గలుగు యీమూర్ఖత్వ మెంత భయంకరమైనది! మూర్ఖత్వమువలన ప్రాణులిట్టి దశలనే పొందుదురు. ఏలయనిన, శ్రీమంతుండైన నృపాలుండగు యీ నాప్రియతముండైన పతి, హృదయమందలి గాఢమైన యజ్ఞానముచే నభ్యస్తమైన యీ దశను బొందెను కాన, నేనిపుడే యిచ్చోట నా ప్రాణనాథుని ఆత్మజ్ఞానినిగ నొనర్చి భోగైశ్వర్య, మోక్షైశ్వర్యముల రెంటినింగూడ పొందింపంజేసెదను.

ఇదం రూపం పరిత్యజ్య రూపేణాన్యేన కేనచిత్. 53
సకాశమస్య గచ్ఛామి బోధం దాతుమనుత్తమమ్
బాలేయం మమ కాన్తేతి మదుక్తం న కరోత్యలమ్. 54
తస్మాత్తాపసరూపేణ బోధయామి పతిం క్షణాత్

ఇంకనిపుడీరూపమును వదలి మఱియొకరూపమును ధరించి, పతికి సర్వోత్తమజ్ఞానము నొసంగుటకై యాతని చెంతకుం బోవుదును. ఈ రూపముననే పోయినచో 'ఈబాలిక నాప్రియయే' అని యెఱింగినవాడై నావాక్యములను బూర్ణముగ విశ్వసింపకుండును. కాన, తపస్విరూపమున నొక్కక్షణములో నాపతికి బోధనము గావించెదను.

భర్తా కషాయపాకేన పరిపక్వమతిః స్థితః. 55
చేతస్యస్యాద్య విమలే స్వం తత్త్వం ప్రతిబిమ్బతి
ఇతి సంచిన్త్య చూడాలా బభూవ ద్విజదారకః. 56

ఇపుడు నా పతి రాగద్వేషాదుల బరిపాకతచేం బరిపక్వబుద్ధి కలిగియున్నాడు. కావున, ఈతని నిర్మల చిత్తమున ఆత్మతత్త్వము లెస్సగం బ్రతిఫలించును—అని యిట్లు విచారించి చూడాల బ్రాహ్మణకుమారుండాయెను.

ఈషద్ధ్యానాద్గతాన్యత్వం క్షణాదమ్బుతరఙ్గవత్
పపాత విపినే తస్మిన్ద్విజపుత్రకరూపిణీ. 57

ఓ రామచంద్రా! జలము తరంగరూపత్వమును బొందునట్లు పూర్వోక్తమగు అగ్ని, చంద్ర ధారణారూపమైన ఒకింత ధ్యానముచే నపుడా చూడాల క్షణములోనే యట్టి బ్రాహ్మణపుత్రుని రూపమును ధరించి, అవ్వనముననే శీఘ్రముగం గ్రిందికి దిగెను.

భర్తురధ్యాజగామాగ్రం మన్దస్మితలసన్ముఖీ
దదర్శ ద్విజపుత్రం తం పురో యాతం శిఖిధ్వజః. 58

మందహాసముచే శోభించు ముఖముగల చూడాల భర్తృసమీపమునకు రాఁగా, శిఖిధ్వజుఁడు తన సమ్ముఖమున నున్న యాబ్రాహ్మణకుమారునిఁ గాంచెను.

వనాన్తరాదుపాయాతం తపోమూర్తిమివాసితమ్
ద్రవత్కనకగౌరాఙ్గం ముక్తాహారవిభూషితమ్. 59
శుక్లయజ్ఞోపవీతాఙ్గం శుక్లామ్బరయుగావృతం
కమణ్డలుధరం కాన్తం పురో యాతం శిఖిధ్వజః. 60
వ్యాప్తప్రకోష్ఠద్విగుణేనాక్షసూత్రేణ చారుణా
భూమావలగ్నగాత్రేణ కిఞ్చిన్మాత్రేణ చ స్థితమ్. 61
కున్తల వ్యాప్తమూర్ధానం సాలిమాలమివామ్బుజం
భాసయన్తం ప్రదేశం తం శారీరైర్దీప్తిమణ్డలైః. 62
కుణ్డలాభూషితముఖం నవమర్కమివోదితం
శిఖాసంప్రోతమన్దారం శృఙ్గస్థేన్దుమివాచలమ్. 63
కాన్తోపశాన్తవపుషమూర్జితం విజితేన్ద్రియం
హిమాభభస్మతిలకం భూషితాలోకసున్దరమ్. 64
మేరుహేమతటీలీనపూర్ణేన్దుమివ చఞ్చలమ్
తమాలోక్య ద్విజసుతం సముత్తస్థౌ శిఖిధ్వజః. 65

మఱియొక వనమునుండి యేతెంచి మూర్తిమంతమైన తపంబువోలె చెన్నొందుచున్నవాఁడును, కరఁగిన బంగారువలె స్వచ్ఛమైనకాంతిగల అవయవములు గలవాఁడును, ముత్యాలహారములచే శోభితుఁడును, తెల్లని జందెము, తెల్లని రెండు వస్త్రములు ధరించినవాఁడును, కమండలువు గలవాఁడును, మిగుల శోభాయుక్తుఁడును, మనికట్టుకంటె రెండింతలగు బాహుప్రదేశమును వ్యాపించిన వాఁడును, సుందరమైన రుద్రాక్షమాల గలవాఁడును, భూమినంటక హస్తప్రమాణమెత్తున నిలఁబడిన వాఁడును, ధాన్యపుమాలలచే కమలమువలె జడలచే నావృతమగు శిరస్సుగలవాఁడును. దేహకాంతులచే నచ్చోటును ప్రకాశింపఁజేయువాఁడును, కుండలములచే నలంకరింపబడిన ముఖము గలవాఁడును, నూతన సూర్యునివలె నుదయించినవాఁడును, శిఖయందు మందారపుష్పములు గ్రుచ్చబడిన వాఁడును, శిఖరమున చంద్రుడు గల్గిన పర్వతమువలె యొప్పుచున్నవాఁడును, కాంతియుతుఁడును, శాంతశరీరధారియు, బలవంతుఁడును, జితేంద్రియుఁడును, మంచువంటి తెల్లని భస్మమును తిలకముగా ధరించినవాఁడును, భూషితమగు ప్రకాశముచే సుందరుఁడును, సుమేరు పర్వతముయొక్క సువర్ణతటమున లీనమైన గంగా ప్రవాహమున, ప్రతిబింబించిన పూర్ణచంద్రునివలె చంచలుఁడును నగు ఆ బ్రాహ్మణకుమారునిఁ జూచి శిఖిధ్వజుఁడు లేచి నిలఁబడెను.

దేవపుత్రాగమధియా సంపరిత్యక్తపాదుకః
దేవపుత్ర నమస్కార ఇదమాసనమాస్యతామ్. 66
ఇత్యస్య దర్శయామాస పాణినా పత్రవిష్టరమ్

దదౌ చ ద్విజపుత్రస్య పుష్పముష్టిం కరోత్కరే. 67
చన్ద్రః కుముదఖణ్డస్య ప్రాలేయమివ పల్లవే
హే రాజర్షే నమస్తుభ్యమితి ద్విజసుతోఽవదత్. 68
గృహీత్వా కుసుమాన్యస్మాద్వివేశ పత్రవిష్టరే

దేవపుత్రుఁ డేతెంచెనని యెంచి తన పాదుకలను విసర్జించి రాజిట్లనెను—'ఓ దేవపుత్రా! నమస్కారము. ఇదిగో, ఆసనము స్వీకరింపుఁడు.'-అని చెప్పి తనచేతితో పత్రాసనముఁ జూపి, కుముద ఖండముయొక్క పల్లవమునఁ జంద్రుఁడు మంచుబిందువునుంచునట్లు, ఆబ్రాహ్మణుని కరతలమున రాజు పుష్పాంజలినుంచి మఱల నిట్లనెను—ఓ రాజర్షీ ! తమకు నమస్కారము. అపుడు దేవపుత్రుఁడును రాజునుండి పుష్పముల గ్రహించి పత్రాసనముపైఁ గూరుచుండెను.

శిఖిధ్వజ ఉవాచ:—

దేవపుత్ర మహాభాగ కుత ఆగమనం కృతమ్
దివసః సఫలో మన్యే యత్త్వామద్యాస్మి దృష్టవాన్. 69
ఇదమర్ఘ్యమిదం పాద్యం పుష్పాణీమాని మానద
ఇమాః ప్రగ్రథితా మాలా గృహ్యన్తాం భద్రమస్తు తే. 70

శిఖిధ్వజుఁడు— ఓ దేవపుత్రా ; తామెటనుండి యేతెంచితిరి ? తమ దర్శనముచే నేటి దినము సఫలమైనదని నమ్ముచున్నాను. మానప్రదా ! ఇదిగో యర్ఘ్యము, ఇదిగో పాద్యము, ఇవిగో పుష్పములు, ఇవిగో గ్రుచ్చఁబడిన పూలమాలలు—గైకొనుఁడు, తమకు శుభమగుగాత !

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా పాద్యమర్ఘ్యం చ మాలాం పుష్పాణి చానఘ
శిఖిధ్వజస్తదిష్టాయై దదౌ దేవ్యై యథాఖిలమ్. 71

శ్రీవసిష్ఠుఁడు:—పాపరహితుఁడవగు ఓ రామచంద్రా ! ఇట్లు వచించినవాఁడై శిఖిధ్వజుఁడర్ఘ్యపాద్యపుష్పమాలాదులను శాస్త్రోక్తవిధిగా బ్రాహ్మణరూపధారిణియగు తన ప్రియురాలకొసంగెను.

చూడాలోవాచ:—

సుబహూని పరిభ్రాన్తో భూతలాయతనాన్యహమ్
త్వత్తః పూజా యథా ప్రాప్తా మయేయం న తథాన్యతః. 72
పేశలేనానురూపేణ ప్రశ్రయేణామునానఘ
మన్యేఽహం నూనమత్యన్త చిరంజీవీ భవిష్యసి. 73

చూడాల:—ఓ రాజర్షీ ! ఈ భూతలముపై నేన నేకస్థానములందు సంచరించితిని. కాని నీనుండి పొందిన పూజాసత్కారమును నేను మఱెచటను బొందలేదు. ఓ పాపరహితుఁడా ! ఈ కోమలమై, నీయనురూపమైనట్టి వినయముచే నీవు చిరంజీవుఁడవగుదువని నేను నమ్ముచున్నాను.

శాన్తేన మనసోదారమారాదున్ముక్తకల్పనమ్

నిర్వాణార్థం తపః సాధో కచ్చిత్సంభృతవానసి. 74
అసిధారాసమం సౌమ్య శాన్తవ్రతమిదం తవ
స్ఫీతం యద్రాజ్యముత్సృజ్య మహావన నిషేవణమ్. 75

ఓ సాధూ ! శాంతమనస్సుచే, ఫలమునుగూర్చిన సంకల్పము దూరముగఁ ద్యజింపఁబడినట్టి యుదారతపమును మోక్షముకొఱకై నీవు సంచయమొనర్చియున్నావా ? విశాలమగు రాజ్యమును బరిత్యజించి నీవు మహావనమును సేవించియున్నావు. క్రోధరహితులగు శాంతులైన వానప్రస్థులయొక్క యీవ్రతము ఖడ్గధారవంటిదైయున్నది. (అసిధారావ్రతము)

శిఖిధ్వజ ఉవాచ:—

జానాసి భగవన్సర్వం దేవ స్త్వం కోఽత్ర విస్మయః
శ్రియైవ లోకోత్తరయా జ్ఞాయసే చిహ్నరూపయా. 76
ఏతాన్యఙ్గాని తే చన్ద్రాద్ఘటితానీతి మే మతిః
అథవా కిం సమాలోకాదమృతేనేవ సిఞ్చసి. 77
అస్తి మే దయితా కాన్తా పాతి మద్రాజ్యమద్య తత్
తవేవ తస్యా దృష్టాని తాన్యఙ్గానీహ సున్దర. 78
ఉపశాన్తం చ కాన్తం చ వపురాపాదమస్తకమ్
శృఙ్గం శుభ్రామ్బుదేనేవ పుష్పేణాచ్ఛాదయామునా. 79
నిష్కలఙ్కేన్దుసంకాశమఙ్గమాదిత్యతేజసా
మన్యే తే గ్లానిమాయాతి సుమనఃపత్రపేలవమ్. 80
దేవార్చనాయోపచితమిదమిత్థం సితం మయా
అఙ్గ త్వదఙ్గసఙ్గేన తత్ప్రయాతు కృతార్థతామ్. 81

శిఖిధ్వజుఁడు:—మహాత్మా ! తమరు దేవులు; అంతయు నెఱుంగుదురు. ఇందాశ్చర్యమేమున్నది ? లోకోత్తర చిహ్నములతోఁ గూడిన శోభచే తాము గొప్పప్రభావశాలురుగఁ గన్పట్టుచున్నారు. నాదృష్టియందు యీతమ అవయవములన్నియు అమృతమయమైన చంద్రునిచే విరచితములై యున్నవి. వేయేల ! తాము తమ దర్శనముచే అమృతమును వెదచల్లుచున్నారు. ఓ సుందరా !ఇపుడు రాజ్యపాలనముఁ జేయుచున్న నాప్రియురాలగు పత్నియొక్క అవయవములవలెనే తమ యంగములన్నియు శోభించుచున్నవి. మహాత్మా ! శిరమునుండి పాదములవఱకు తమ యీ శాంత, రమణీయ దేహమును శ్వేతపంగు పుష్పమాలచే,—తెల్లని మేఘముచే మేరుపర్వత శిఖరమునువలె—కప్పివేయుడు. నిష్కళంకమగు చంద్రునివలెను, పుష్పదళమువలె కోమలమైనట్టి తమ యంగములు సూర్యతేజముచే గ్లానినొందుచున్నవి. దేవపూజకై నేను నిర్మించిన యీ తెల్లని పుష్పమాల తమ అవయవముల సంయోగముచే సాఫల్యమునొందును గాక !

జీవితం యాతి సాఫల్యం స్వమభ్యాగతపూజయా
దేవాదప్యధికం పూజ్యః సతామభ్యాగతో జనః. 82

పరివేల్లితమన్యోన్యం ఫలకాన్తం ద్రుమం యథా
ద్రుతహేమరసాపూరనిర్భరా భోగభాసురైః. 91
కుర్వన్తమురుభిః కామమన్దిర స్తమ్భసంచయమ్
నిర్మలీకృతచన్ద్రేణ వ్యాప్తాం వ్యోమవిలాసినీమ్. 92
లావణ్యరసపూరేణ తర్జయన్త మివాపగాం
ప్రకారైరమనోద్యానరథ చక్రైర్మనోభువః. 93
ఉత్పథార్పితగఙ్గామ్బునితమ్బతటసేతుభిః
సర్వత్ర దృష్టసర్వాఙ్గం విశ్వరూపమివ స్థితమ్. 94
ప్రతిబిమ్బితసర్వాఙ్గమన్యోన్యాదర్శతాం గతమ్

పురుషులు లేనట్టి యాప్రదేశమున క్రీడించుచున్న ఆయప్సరసలు సువర్ణకమలములయొక్క మొగ్గలవంటి స్తనభాగముచే నొప్పుచున్నవారును, వస్త్రములు విడిచి క్రీడించుచున్నవారును, ఒకరి నొకరు పరివేష్టించుచున్నవారును, కరగిన బంగారు రస ప్రవాహమువలె కాంతిచే ప్రకాశశీలురై వెలయుచున్నవారును, తమ యూరువులచే మన్మథుని మందిరమునకు స్తంభముల సంచయమొనర్చుచున్నవారునునై యుండిరి. మఱియు, తన జలమునం బ్రతిబింబించిన చంద్రునింగూడ నిర్మలమొనర్చునట్టి సర్వవ్యాపినియగు నాకాశగంగనున్ను ఆస్త్రీసమూహము తమసౌందర్య రసప్రవాహముచే దిరస్కారమొనర్చుచున్నట్లుండిరి. మన్మథుని నందనోద్యానమున ఆక్రీడాసమయమున వారు తమ నితంబరూప రథచక్రములచే జలమును నిరోధించుటచే ఆగంగాజలము నూర్ధ్వమార్గమునకు, బంపుచున్నట్లుండిరి. మఱియు వారి సర్వాంగములున్ను సర్వత్రకన్పట్టుచుండుటచే, ఆస్త్రీసమూహము కాలరూప పరమాత్మచే దాల్చబడిన విశ్వరూపమువలె నుండెను, మిగుల స్వచ్ఛములగుటబట్టి వారి సర్వాంగములును సర్వులయందు ప్రతిబింబించుటచే వారు పరస్పరము అదృశ్యత్వము నొందియుండిరి.

కాలకల్పతరోర్వర్షవిటపాత్పతితపల్లవాత్. 95
వివిధస్థలతాజాలాద్దినశ్రీకలికాకులాత్
ఆలోకపుష్పరజసో జాతాద్గగనకాననే. 96
స్ఫురజ్జలఖగప్రోతాత్పస్తాబ్ధ్యకాలవాడకాత్
స్తనస్తబకవృన్దేషు స్పర్ధయాతిరసాన్వితమ్. 97
ఉద్ధూతోర్ధ్వధూత్యా సంపూర్ణదలితామ్భోజపల్లవమ్
ఆలోలాలకకేశాక్షితారకాదిమధువ్రతమ్. 98
అమ్భతాపద్విఘాతాయ కోశసంచయకారిభిః
దుష్ప్రాపే భూతసంఘానాం వికసత్కనకామ్బుజే. 99
పద్మినీపల్లవాచ్ఛన్నే గుప్తే మేరోర్గుహాన్తరే
శీతలే స్వాదునీతీరే తోయోన్మత్తమలే స్ఫురైః. 100
చన్ద్రబిమ్బకలాపూరమేకత్రైవోపసంహృతమ్

సత్సరములను శాఖలచేతను, పత్త్రములను పల్లవములచేతను శోభితమై, వివిధఋతువులను లతా సమూహములచే నావృతమై దినశోభయను మొగ్గలతోఁగూడినదై, ప్రకాశమను పుష్పపరాగసంయుక్తమై, అవ్యక్తాకాశమను వనమందుత్పన్నమై, చంచలశరీరులగు దేవతలను పక్షులచే, వ్యాప్తమై, సప్తసముద్రములను నాలవాలముగలదై నట్టి కాలమను కల్పవృక్ష భగవంతునిచే సద్భూతమగు విశ్వరూపమువలె ఆస్త్రీసమూహము భాసిల్లుచుండెను. మఱియు, కమలపు మొగ్గలవంటి స్తనములుగలవారు సౌందర్య, సమత్వకారణమున, ఆ కమలపుష్పములతో స్పర్ధగలవారై, నాటిని నాళములతోఁగూడ పెరికి త్రొక్కివైచుచుండిరి. వారు తమ ముఖరూపకమలములందు — దీర్ఘకేశములు, నల్లని కనుగ్రుడ్లు, లలాటమున, గూర్పబడిన నీలమణులు—అను తుమ్మెదలచే శోభితలైయుండిరి, అమృతమును సంచయమొనర్చునట్టి దేవతలు. అమృతమును హరించునట్టి రాహువున్నుగు యాపదల నశింపఁజేయుటకై - ప్రాణిసమూహముచే దుష్ప్రాప్యమున్ను, శోభాయమానములగు సువర్ణకమలములచే విభూషితమున్ను, కమలపల్లవములచే నాచ్ఛాదితమగు శీతలమైన యాకాశగంగాజలముచే విశుద్ధమున్ను, అతిసురక్షితమునగు మేరు పర్వతగుహయందు చంద్రికళాప్రవాహము నొకచో సమకూర్చి స్థాపించియుంచిరా యనునట్లా స్త్రీ సమూహము గోచరమగుచుండెను.

స్త్రైణమాలోక్య తత్కాన్తం సహసైవ మనో మునేః. 101
అనాశ్రితవివేకాంశం బభూవానన్దితం స్ఫురత్
ఆనన్దవలితే చిత్తే క్షుబ్ధే ప్రాణానిలే స్థితే. 102
బభూవ తస్య హృష్టస్య మదనస్ఖలితం తదా
ఫలం రసాపూర్ణమివ గ్రీష్మాన్త ఇవ తోయదః. 103

ఇట్లు రమణీయమైన యాస్త్రీసమూహమును గాంచ నారదమునియొక్క మనస్సు అకస్మాత్తుగ వివేకరహితమున్ను, ప్రమత్తమ్మున్ను నాయెను. చిత్తము ప్రమత్తమై, ప్రాణవాయువు క్షోభితము కాఁగా, రసపూరితఫలమువలెను, గ్రీష్మాంత మందలి మేఘమువలెను, అతని వీర్యముస్ఖలితమయ్యెను.

ప్రత్యగ్రపాదపచ్ఛిన్నలతావృన్త ఇవోత్తమ
అవశ్యాయకణస్పన్దీ శశాఙ్క ఇవ వా మునిః. 104
బిసం ద్విధాపాతమివ గలత్సారరసోఽభవత్

ఉత్తముడవగు నోరాజా! అత్తతి శాఖామూలభాగము ఛేదింపబడిన వృక్షమువలెను, జలకణముల వర్షించు చంద్రునివలెను, లేక, తత్కాలమున రెండుగాఁద్రుంచఁబడిన కమలనాళమువలెను, ఆముని చ్యుతవీర్యుఁడాయెను.

శిఖిధ్వజ ఉవాచ:—

తాదృశోఽపి బహుజ్ఞోఽపి జీవన్ముక్తోఽప్యసౌ మునిః. 105
నిరిచ్ఛోఽపి నిరాగోపి న కించిదుపమోఽప్యలం
సబాహ్యాభ్యన్తరం నిత్యమాకాశ విశదోపి చ. 106
నారదోపి కథం బ్రహ్మన్ మదనస్ఖలితోఽభవత్

శిఖిధ్వజుఁడు:—మహాత్మా! మహాజ్ఞానియు, జీవన్ముక్తుఁడును, రాగవర్జితుఁడును, ఇచ్ఛారహితుఁడును, నిరుపమానియు, బాహ్యాభ్యంతరములందు నిత్య మాకాశమువలె విశదుఁడునైయున్న నారదముని యేప్రకారముగ చ్యుతవీర్యుఁడెట్లాయెను?

చూడాలో వాచ,—

సర్వస్యా ఏవ రాజర్షే భూతజాతేర్జగత్త్రయే. 107
దేవాదేరపి దేహోయం ద్వయాత్మైవ స్వభావతః

చూడాల:—ఓ రాజర్షీ! ఈముల్లోకము లందున్నట్టి సమస్తప్రాణిజాతికిని, అంతేకాక దేవజాతికినిగూడ స్వభావముగ దేహమిరువిధములుగ నుండును.

అజ్ఞమస్త్వథ తజ్జ్ఞం వా యావత్స్వాన్తం శరీరకం. 108
సర్వమేవ జగత్యజ్ఞ సుఖదుఃఖమయంస్మృతమ్
తృప్త్యాదినా పదార్థేన కేనచిద్వర్ధతే సుఖం. 109
ఆలోక ఇవ దీపేన మహామ్బుధిరివేన్దునా
క్షుధాదినా పదార్థేన దుఃఖం కేనచిదేవ హి. 110
తమో మేఘపటేనేవ స్వభావో హ్యత్ర కారణం

అజ్ఞుఁడైనను, లేక, జ్ఞానయుక్తుఁడైనను, ఈ దేహము స్వనాశపర్యంతము సమస్తప్రాణులకును సుఖదుఃఖమయమైయున్నది. తృప్తికరమగు పదార్థములచే, - దీపముచే ప్రకాశమువలెను, చంద్రునిచే మహాసముద్రమువలెను, - సుఖము వృద్ధినొందును. అట్లే, క్షుదాదులచే దుఃఖమున్ను, మేఘపటలముచే నంధకారమువలె వృద్ధియగును. అట్లగుటయందు స్వభావమే కారణమైయున్నది.

స్వరూపే నిర్మలే సత్యే నిమేషమపి విస్మృతే. 111
దృశ్యముల్లాసమాప్నోతి ప్రావృషీవ పయోధరః

ఓ రామచంద్రా! తన సత్య, నిర్మల స్వరూపము నొక్కక్షణమైన మఱచినచో, వర్షాకాలమున మేఘమువలె, ఈ దృశ్య ముల్లాసమును బొందును.

అనారతానుసంధానదప్యన్మేషమనిస్మృతే. 112
స్వరూపే నోల్లసత్యేష చిత్తే దృశ్యపిశాచకః

నిరంతరమాత్మను సంధానమొనర్చుటచేతను, క్షణముల సంధికాలమునఁగూడ అతి స్వల్ప సమయమునను ఆత్మను విస్మరింపకుండుటచేతను, ఈదృశ్యపిశాచము చిత్తమం దుల్లాసమును బొందదు.

యథా తమఃప్రకాశాభ్యామహోరాత్రౌ స్థితిం గతౌ. 113
తథైవ సుఖదుఃఖాభ్యాం శరీరం స్థితిమాగతమ్

తమ ప్రకాశములచే రాత్రిందినములు స్థితినొందునట్లు సుఖదుఃఖములచే ఈ శరీరమున్ను స్థితిఁబొందుచున్నది.

ఏవం హి సుఖదుఃఖే ద్వే జన్మకారణదర్శనాత్. 114
అజ్ఞస్య గాఢతాం యాతే పటే కుఙ్కుమవద్దృఢమ్

ఇవ్విధమున, దేహాదులం దాత్మభావమును దర్శించుటచే, సుఖదుఃఖములు రెండును, తెల్లని వస్త్రముపై కుంకుమరంగువలె, అజ్ఞానికి గాఢముగ నాటుకొనుచున్నవి.

తజ్జస్య త్వజ్ఞలగతో మనాగపి న తద్వశాత్. 115
యథా శుభాశుభా రాగాదినాక్రాన్తతరా మణేః

స్ఫటికమణికి శుభాశుభవర్ణము (రంగు) లెవ్వియు నంటనట్లు, ఆ సుఖదుఃఖములు జ్ఞానినిం తత్త్వజ్ఞానవశమున, స్పృశింపనేరవు.

స్ఫురఃస్థవస్తుభావేన రఞ్జనాం స్ఫటికో యథా . 116
తజ్జస్తథా నైతి బోధాజ్జీవన్ముక్తమతిర్మునిః

స్ఫటికమణి జపా, కుంకుమాదిరంగులు సమీపమునయున్నచో, తత్కాలమున నారంగులతో, గూడినదగును, కాని, జీవన్ముక్తుండగు ముని యట్లుకాక, తత్త్వజ్ఞానకారణమున, సుఖదుఃఖములచేం గొంచెమైనను ప్రభావితుండు కాకయుండును.

వసునః శ్లేషమాత్రేణ ఘనరఞ్జితమేతి ధీః. 117
గతేఽపి వస్తుని దృఢం బుద్ధిర్యా పరితాపితా
గతేఽపి కుఙ్కుమే వస్త్రం తదీయమనురఞ్జనమ్. 118

వస్తువుయొక్క సన్నిధిమాత్రముచే మూఢునియొక్క బుద్ధి దానిచే రంజితమగును. కుంకుమ యనువస్తువు నశించినను, వస్త్రము మిగుల యెఱ్ఱగానే యుండునట్లు, వస్తువు నశించినను మూఢుని బుద్ధి పరితప్తమగుచునే యుండును.

న జహాతి యథా మూఢస్తథా విషయరఞ్జనమ్

వస్త్రము కుంకుమరంగును త్యజించనట్లు మూఢుండు విషయమను రంగును త్యజింపండు.

అనేనైవ క్రమేణేతౌ బన్ధమోక్షౌ వ్యవస్థితౌ. 119
భావనాతానవం మోక్షో బన్ధో హి దృఢభావనా

ఇట్టి క్రమమునుబట్టి బంధమోక్షములు బుద్ధియందే వ్యవస్థితములై యున్నవగుచున్నవి. విషయభావనయొక్క సూక్ష్మతయే మోక్షము. విషయముల దృఢభావనయే బంధము.

శిఖిధ్వజ ఉవాచ:—

స్వోత్పత్తికారణప్రాప్తౌ కథం దుఃఖం సుఖం చ వా. 120
అభ్యుదేతీతి వద మే పూరస్థానామపి ప్రభో
అత్యుదారమతీవాచ్ఛం బహ్వర్థం వచనం తవ. 121
శ్రోతుం తృప్తిం న గచ్ఛామి మయూరోఽభ్రరవేష్వివ

శిఖిధ్వజుఁడు.—ప్రభూ ! దూరముననున్నట్టిగాని, లేక, సమీపముననున్నట్టిగాని పుత్ర రాజ్యాది విషయములఁగూర్చిన లాభ, వినాశముల యుత్పత్తియందు తదభిమానియగు జీవునకు సుఖ, దుఃఖము లేక్రమమునఁ గలుగుచున్నవో దయచేసి తెలియఁజేయుఁడు. ఉదారములును, అతిస్వచ్ఛములును, విశాలార్థయుక్తములు నగు తమ వచనముల వినుటయందు, మయూరము (నెమలి) మేఘశబ్దములచేఁ దృప్తిఁబొందనట్లు, నేను తృప్తిఁబొందకున్నాను.

చూడాలోవాచ:—

స్వోత్పత్తికారణం హృద్యం లబ్ధ్వా కాయాక్షిపాణిభిః. 122
సుఖసంవిదియం బాలా నూనముల్లసతి స్వతః
హృద్గతా క్షోభమాయాతా జీవం కుణ్డలినీగతమ్. 123

చూడాల.— ఓ రాజర్షి ! సమీపస్థ విషయములందు, శరీర, నేత్ర, హస్తాదులచేతను, దూరస్థ విషయములందు శబ్ద, అనుమాన ప్రమాణాదులచేతను, అనుకూల పదార్థమును బొందుటచే— (అనంతమగు స్వాత్మతత్త్వము నెఱుఁగని కారణమున) బుద్ధియందున్న యా సుఖసంవిత్తు క్షోభమొంది కుండలినీనాడియందున్న భోక్తయగు జీవునియెడల స్వయముగఁ బ్రకటితమగుచున్నది.

జీవస్య నియతా నాడ్యః పృథగ్దేహే స్థితిం గతాః
ప్రాణావపూరితా నాడీర్జీవ ఆక్రామతి స్ఫురన్. 124
సంస్పర్శైకప్రబుద్ధాత్మా రసో ద్రుమలతా ఇవ
సుఖప్రబోధసంచారే దుఃఖబోధాగమే తథా. 125

హృదయమందున్న జీవునియొక్క భోగానుభవముకొఱకై దేహమున వేలువేలు నాడులు కలవు. ప్రాణవాయువుచేఁ బూరితములగు నాడులను, జీవుఁడు స్ఫురించుచు నాక్రమించును. మఱియు, వృక్షములయొక్కయు, లతలయొక్కయు, మూలభాగమునకు నీరుపోయుటచే, వృక్షమంతటను, లతలయందంతటను రసము ప్రవేశించునట్లు, స్పర్శమాత్రముచే జాగృతుఁడగు ఈజీవుఁడు సుఖ, దుఃఖానుభవమొనర్చుటకై శరీరమంతటను బ్రవేశించుచున్నాఁడు.

జీవస్య నియతా నాడ్యః పృథగ్దేహస్థితిం గతాః
సుఖినః ప్రస్ఫురత్యేషా ధీరతాశు న దుఃఖినః. 126

సుఖాదుల యనుభవముకొఱకై జీవునకు దేహమున వేర్వేఱు నాడులు కలవు. ఏలయనిన, సుఖానుభవమునఁ బ్రవృత్తుఁడగు జీవునకు స్వస్థత శీఘ్రముగా స్ఫురించుచున్నది. కాని దుఃఖానుభవమునఁ బ్రవృత్తుఁడగు జీవునకుఁ గాదు.

యే హి మార్గాః సువేషస్య కువేషస్య న తే శుభాః

అందువలననే లోకమున, భోగానుభవమునఁ బ్రవృత్తులగు నుత్తమవేషధారులైన రాజాదులకు సుఖదాయకములగు కర్పూర, చందన, ధూపాదిమార్గములు ప్రసిద్ధములైయున్నవి. కాని, నిందితవేషధారులగు నీచుల కవి కావు; తద్విపరీతములు.

న తత్సుఖాది నో తన్మే ముధా చాయమహం స్థితః. 134
ఇతి జీవః ప్రబుద్ధో హి నిర్వాణం యాతి శామ్యతి

మఱియు, 'సాంసారిక సుఖాదులు శుద్ధరూపుఁడనగు నాయందులేవు, ఈ విషయ సుఖాదులను వ్యర్థముగ నాయందు కల్పించుకొంటిని' అనునీప్రకారముగ ప్రబుద్ధుఁడగు జీవుఁడు పరమశాంతిని, నిర్వాణము (మోక్షము)ను బొందును.

సుఖాద్యవస్తుతద్రూప మిత్యన్తర్బోధసంవిదా. 135
న తదున్ముఖతాం యాతి జీవః శామ్యతి కేవలమ్

విషయజనిత సుఖాదులు ఆ వస్తువులను నాభ్యంతరజ్ఞానముచే జీవుఁడిక వానిపై పునః మఱలక కేవలము శాంతుఁడై యొప్పును.

సర్వమేవ చిదాకాశం బ్రహ్మేతి ఘననిశ్చయే. 136
స్థితిం యాతే శమం యాతి జీవో నిఃస్నేహదీపవత్
దీపవచ్ఛమమాయాతి సుఖాదిస్నేహసంక్షయే. 137

అంతయు చిదాకాశమగు బ్రహ్మమను దృఢనిశ్చయము తనయందు నెలకొనగా, జీవుఁడు రాగరహితుఁడై, తైలరహితదీపమువలె శమత్వమొందును. అట్లే సుఖాదులఁ గూర్చిన రాగాదులు నశించునపుడును, తైలము క్షయించిన దీపమువలె, శాంతినొందును.

సర్వమేవమితి జ్ఞానాజ్జీవోఽద్విత్వవిభావనాత్
సర్వమాకాశమేవేతి బుద్ధ్వా క్షోభం న గచ్ఛతి. 138

అంతయు చిదాకాశమగు బ్రహ్మమేయను జ్ఞానముచేతను, జీవబ్రహ్మైక్యభావనముచేతను, జగత్తంతయు శూన్యమాత్రమను బోధచేతను జీవుఁడు క్షోభ నొందకుండును.

జీవస్యానేన శూన్యస్య కః కిల క్షోభవిభ్రమః
జీవేనదృగ్విధేనైవ యథా ప్రథమసర్గతః. 139
స్వయం సంవిదితో మార్గస్తేనైవాద్యాపి గచ్ఛతి

ఇట్లు, బ్రహ్మముతోటి ఏకత్వముచే జీవునకిక క్షోభయు, విభ్రమము నెచట? ప్రథమ సృష్టియందు కల్పితుఁడగు హిరణ్యగర్భుఁడనై, సర్వజీవాత్మల రూపమున ఈ సంసారమునఁ దిరుగాడును. మఱియు తత్త్వబోధచే ముక్తుఁడనగుదునను నీ స్వకల్పనచేతనే జీవుఁడు స్వయముగ బంధమోక్షమార్గములఁ గల్పించుకొని, తానే వానిననువర్తించుచున్నాడు.

శిఖిధ్వజ ఉవాచః —

సుఖసంచారయోగ్యాసు జీవే సరతి నాడిషు. 140
దేవపుత్ర భవత్యేవ తద్వీర్యచ్యవనం కథమ్

శిఖిధ్వజుఁడు;— ఓ దేవపుత్రా! సుఖసంచారమునకు యోగ్యములైన నాడులందు జీవుఁడెపుడు వెడలునో, అపుడు వానియొక్క వీర్యపతన మెట్లగును.

చూడాలోవాచ: —

జీవః క్షోభయతి క్షుబ్ధః ప్రాణాదిపవనావలిమ్. 141
సంవిదా జ్ఞాంశమాత్రేణ సేనామివ మహీపతిః
వాతస్పన్దేన మేదోఽస్రమ్మజ్జాసారశ్చ సంస్థితః. 142
త్యజత్యాశు ప్రసౌగన్ధ్యం రజః పత్రఫలాదికం
చలితం తత్త్వధో యాతి గఙ్గాదివ ఘనాది ఖే. 143
దేహనాడీప్రణాలేన యాతి శుక్రం బహిః స్వతః

స్త్రీస్వరూపమును జీవుఁడెపుడు కాంచునో, అపుడు రాగవాసనోద్బోధముచే నాతఁడు స్వయముగ క్షుబ్ధుఁడై, - రాజు తనయాజ్ఞచే సేననువలె - ప్రాణాదివాయువులను క్షోభితములుగ నొనర్చుచున్నాడు. అత్తఱి ప్రాణాపానవాయువుయొక్క చేష్టచే మేధస్సునందలి, మజ్జయందలి సారము - తొడిమనుండి వేఱుచేయఁబడిన పత్రఫలాదులు తమయందలి జలాంశమును త్యజించునట్లు- తన సుగంధయుక్తమగు రజమును (సూక్ష్మాంశమును) త్యజించుచున్నది. అట్లు బయలుదేఱిన యా రజము, వాయుప్రేరణచే నాకాశమందలి జలము పృథివ్యాద్యధోభాగములకుఁ జనునట్లు, శుక్రరూపమున నాడిద్వారాయధోభాగమున స్వభావముగనే బయటకుఁ బోవుచున్నది.

శిఖిధ్వజ ఉవాచ: —

దేవపుత్ర మహాజ్ఞోఽసి వేత్సి పూర్వాం చ తత్స్థితిమ్. 144
జ్ఞాయసే వచనాదేవ స్వభావో హి కిముచ్యతే

శిఖిధ్వజుడు:—ఓ దేవపుత్రా! తా మాత్మజ్ఞానులు. కాన పూర్వకాల జగత్స్థితిని నెఱింగియున్నారు. తాము తమవచనములచేతనే నాకు జ్ఞానిగఁ దోచుచున్నారు. కాన దయచేసి 'స్వభావ' శబ్దమున కర్థమేమియో వచింపవేడెద.

చూడాలోవాచ:—

ఆద్యస్సర్గే యథా సద్యః స్ఫురితం బ్రహ్మ బ్రహ్మణి. 145
ఘటావటపటాద్యాత్మ తథైవాద్యవ్యవస్థితం
కాకతాలీయవద్వారి బుద్బుదోత్పత్తినాశవత్
ఘుణాక్షరవదుచ్చ్యానం తం స్వభావం విదుర్బుధాః. 146

చూడాల:—ఓ రాజర్షీ! సృష్ట్యాదియందు ప్రాణుల కర్మ ననుసరించి బ్రహ్మదేవుడే యే ప్రకారమగు ధర్మముచేతను, ఏ యే పదార్థరూపముచేతను తనయందు స్ఫురించియుండెనో, ఇప్పుడును ఆ ఘటపటవృక్షాది పదార్థరూపముచేతనే స్ఫురించుచున్నాఁడు. దీనిపేరే స్వభావము. అథవా, కాకతాళీయన్యాయమువలెను, లేక, జలబుద్బుధముయొక్క యుత్పత్తినాశములవలెను, లేక, ఘుణాక్షరన్యాయమువలెను మాయామాత్రమగుటచే, ఆకస్మికముగనే యేపదార్థ మేయేధర్మముతో (అగ్ని యుష్ణముగను, జలము శీతలముగ నున్నట్లు) కూడియున్నదో, దానినే పండితులు స్వభావమని చెప్పుదురు.

అస్మిన్స్వభావవశతో జగతి ప్రరూఢే
దేహా భ్రమన్తి పరితో వివిధా వికారాః।
ప్రక్షీణవాసనతయా న భవన్తి కేచి
ద్భూయో భవన్తి చ పునస్త్వితరే ఘనాస్థాః॥ 147

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే సుఖవిచారయోగోపదేశో నామ
పఞ్చాశీతితమః సర్గః ॥ 85 ॥

ఓ రాజా! స్వభావకారణముననే, ఈ మహావృద్ధినొందిన జగత్తునందు పలువిధవికారయుక్తములగు దేహములు పరిభ్రమించుచున్నవి. అందు, కొన్ని వాసనాక్షయముచే జ్ఞానయుక్తములై మఱల నీప్రపంచమునకుఁ దిరిగి వచ్చుటలేదు. అజ్ఞానుల దేహములైననో, విషయభోగములందు దృఢభావము గల్గియుండుటచే మఱల మఱల యీ ప్రపంచమునకు వచ్చుచు, పోవుచున్నవి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలోపాఖ్యానమున సుఖవిచారయోగోపదేశమను
నెనుబదియైదవ సర్గము ॥ 85 ॥

---

## షడశీతితమః సర్గః

[కుమ్భకుమ్భస్య జన్మాత్ర వృద్ధిర్బ్రహ్మసమాగమః
తదా శిష్యస్య సార్వజ్ఞ్యమిత్యాదిరిహ వర్ణ్యతే.

ఘటమున కుంభఋషియొక్క జన్మము, బ్రహ్మదేవుని సమాగమముచే నాతని యభివృద్ధి, అపుడు శిష్యునియొక్క సర్వజ్ఞత్వము, మొదలగు విషయములిట వర్ణింపఁబడుచున్నవి.]

**చూడాలోవాచ:—**

ఆత్మస్వభావవశతో జాతం జగదిదం మహత్
స్థితిం వాసనయాభ్యేత్య ధర్మాధర్మవశే స్థితమ్. 1

చూడాల:—ఓ రాజా! ఈ జగత్తు ఆత్మస్వభావవశమున నుత్పన్నమై, వాసనలచే స్థితిఁ బొంది, ధర్మాధర్మవశమున వెలయుచున్నది.

వాసనాహ్రాసమానీయ ధర్మాధర్మైర్న గృహ్యతే
తతో న జాయతే జన్తురితి నో దర్శనం మునే. 2

ఓ మునీ! వాసనాక్షయముచే జీవుఁడిక ధర్మాధర్మములఁగూర్చిన బంధనమునందు తగుల్కొనఁడు. కాన మఱల యీ సంసారమున జన్మింపనేరఁడు – ఇది మాయనుభవమైయున్నది.

శిఖిధ్వజ ఉవాచ:—

అత్యుదారం మహార్థం చ వక్షి త్వం వదతాం వర
అనుభూతిముపారూఢం గూఢం చ పరమార్థవత్. 3
త్వద్వాక్య విభవేనాద్య శ్రుతేనానేన సున్దర
ప్రీతేనేవామృతే నాహమ న్తర్యాతోఽస్మి శీతతామ్. 4
తత్సమాసేన తాం తావదాత్మోత్పత్తిం వదాశు మే
తతః శ్రోష్యామి యత్నేన జ్ఞానగర్భాం గిరం తవ. 5
తేన పద్మజపుత్రేణ మునినా నారదేన తత్
క్వ కృతం వీర్యమార్యేణ కథయాద్య యథాస్థితమ్. 6

శిఖిధ్వజుఁడు.—వక్తలలో శ్రేష్ఠుఁడవగు నో దేవపుత్రా! అత్యుదారములును, మహార్థయుక్తములును, అనుభవయోగ్యములును, నిగూఢములును, పరమార్థసాధకములు నగు వచనముల దాము పల్కుచున్నారు. ఓ సుందరా! నేడు తమ యీ వాక్యముల వైభవమును వినుటచే నమృతపానముచే నట్లే లోన మిగులతృప్తుఁడను, శాంతుఁడను నైతి. కాన, సంక్షేపము గాఁదమ యుత్పత్తిని నాకుఁదెలియఁజేయుఁడు. అటుపిదప ఆత్మజ్ఞాన పూరితమగు తమవాక్కును సావధానముగ విందును ఆ బ్రహ్మదేవుని పుత్రుఁడగు నారదుఁడు తన వీర్యము నెచట నేవిధమున స్థాపన మొనర్చెను?

చూడాలోవాచ:—

తతో నిబధ్య తా తేన మనోమత్తమతఙ్గజమ్
వివేకవిపులాలానే శుద్ధయా ధీవరత్రయా. 7

చూడాల:—ఓ రాజర్షీ! ఆయప్సరసలను జూచిన తదుపరి నారదముని తనమనస్సును మదపుటేనుఁగును, వివేకమను గొప్ప కట్టుకంబమున, బుద్ధియను చర్మరజ్జువుచేఁ గట్టివైచెను.

తద్వీర్యం కల్పకాలాగ్ని గలితేన్దుద్రవోపమం
రసానాం పారదాదీనాం దివ్యానామనురఞ్జనమ్. 8
మునినా పార్శ్వగే కుమ్భే స్ఫాటికే విలసద్రుచౌ
అద్భుతే విద్రుతాకారం చన్ద్రే చన్ద్ర ఇవార్పితమ్. 9

ప్రళయకాలపు అగ్ని, ద్రవీభూతచంద్రులవలె నున్నదియు, పాదరసము మున్నగు దివ్యరసములఁ బోలినదియు నగు తన యా వీర్యము నపుడు నారదముని, సమీపముననున్నట్టి, స్ఫటికమణి రచితమై, శోభాయమానమై, అద్భుతమైనట్టి యొక ఘటమున, చంద్రుని చంద్రునియందు స్థాపించునట్లు, స్థాపనము గావించెను.

తత్ర శైలే బృహత్కాన్తే స్థూలః పార్శ్వేషు చాభితః
గమ్భీరకుక్షిః సుదృఢశ్చోపలాహననక్షమః. 10
సంకల్పితేన క్షీరేణ స కుమ్భస్తేన పూరితః
అమృతాపూరభిన్నేన విధినేవామృతార్ణవః. 11

మహత్తరమై, రమణీయమైనట్టి యా మేరుపర్వతమున, నలువైపుల విశాలమైనదియు, గంభీరమైన యుదరము కలదియు, రాతిచేతనుగూడ పగులగొట్టఁబడజాలనంత సుదృఢమైయున్నదియు నగు ఆ ఘటమును స్వసంకల్పముచే రచితమగు అమృతప్రవాహముచే బ్రహ్మదేవుఁడు సముద్రమును నింపునట్లు, స్వసంకల్పరచితమగు క్షీరముచే నపుడా నారదమహర్షి పూరించెను.

తత్ర మాసాద్గతో వృద్ధిం మునిమన్త్రాహుతిక్రమః
అమృతాబ్ధౌ శుభో గర్భ ఇన్దోరిన్దురివానుజః. 12

ఆ క్షీరమున నమ్మునీశ్వరుఁడు కావించిన అగ్నికార్యాహుతులక్రమముచే నొకమాసములో ఆ వీర్యము, అమృతసాగరమున సుందరమైన చంద్రుని ప్రతిబింబమువలె, వృద్ధినొందెను.

ఇన్దుం మాస ఇవాపూర్ణం కాలేన సుషువే ఘటః
గర్భం కమలపత్రాక్షం ప్రసూనమివ మాధవః. 13

కాలక్రమమున ఆ ఘటము, మాసము అపూర్ణచంద్రుని నుత్పన్నమొనర్చునట్లును, విష్ణుభగవానుఁడు కమలము నుద్భవింపఁజేయునట్లును, కమలములవంటి నేత్రములుగల బాలకునిఁగనెను.

పరిపూర్ణసమస్తాఙ్గః కుమ్భాద్గర్భో వినిర్యయౌ
ఇన్దుః సూక్ష్మాదివామ్భోధే రపరః క్షయవర్జితః. 14

ఘటపరిమితమగు క్షీరసముద్రమునుండి నాశరహితమగు నపరచంద్రునివలె, అపుడాఘటమునుండి పరిపూర్ణములగు సమస్తావయవములతో పూర్ణగర్భము బయలుపడెను.

దినైః కతిపయైరేవ వృద్ధిమభ్యాజగామ సః
అప్రమేయాఙ్గసౌన్దర్యః శుక్లపక్షే శశీ యథా. 15

అపారసౌందర్యయుక్తుఁడగు ఆ బాలకుఁడు, శుక్లపక్షమునఁ జంద్రునివలె, కొలదిదినములలోనే వృద్ధినొందెను.

సర్వసంస్కారసంపన్నే స తస్మిన్నారదో మునిః
భాణ్డాద్భాణ్డ ఇవాశేషం విద్యాధనమయోజయత్. 16

ఒక అక్షయపాత్రనుండి ధనమునుతీసి మఱియొకపాత్రలో నుంచునట్లు, జాతకర్మ, ఉపనయనాది సంస్కారయుక్తుఁడైన యా పుత్రునియందు, నారదుఁడు తన యందున్న విద్యాధనమును సమర్పించెను.

దినైః కతిపయైరేవ విజ్ఞాతాశేషవాఙ్మయమ్
చకారైనం మునివరః ప్రతిబిమ్బమివాత్మనః. 17

కొలఁది దినములలోనే, సమస్తవిద్యలను నెఱిఁగినట్టి యా పుత్రుని మునిశ్రేష్ఠుఁడగు నారదుఁడు తన ప్రతిబింబమువలె, గావించెను.

తేనారాజత పుత్రేణ మునినా మునినాయకః
రత్నాదా ప్రతిబిమ్బేన సంధ్యోదిత ఇవోడురాట్. 18

ఆ ముని రూపబాలకునిచే మునినాయకుడగు నారదుడు సంధ్యాకాలమున స్ఫటికపర్వతముపై నుదయించిన పూర్ణచంద్రునివలె విరాజిల్లెను.

అథైనం పుత్రమాదాయ బ్రహ్మలోకం స నారదః
జగామాథ స్వపితరం బ్రహ్మాణం చాభ్యవాదయత్. 19

అటుపిమ్మట ఆ పుత్రుని నారదుడు తన తండ్రియగు బ్రహ్మదేవునియొద్దకు గొనిపోయి, యాతనితో, బ్రసంగించెను.

కృతాభివన్దనం బ్రహ్మా పౌత్రమాదాయ తం తదా
అభివాదితవేదాదిం స్వయమఙ్కే న్యవేశయత్. 20

అత్తఱి ప్రణామ మాచరించినట్టియు, వేదాది సర్వవిద్యలందును నభిముఖముగ బరీక్షింపబడినట్టియు, ఆ పౌత్రుని బ్రహ్మదేవుడు తన యొడియందు గూర్చుండబెట్టుకొనెను.

అథాశీర్వాదమాత్రేణ సర్వజ్ఞం జ్ఞానసారగం
పౌత్రం తం కుమ్భనామానం చకార కమలోద్భవః. 21

తదుపరి యాశీర్వాదమాత్రముచేతనే బ్రహ్మదేవుడాతనిని సర్వవిద్యలందు, పారంగతునిగ జేసి సర్వజ్ఞునిగనొనర్చి, కుంభుడని నామకరణము గావించెను.

సాధో సోఽహమయం కుమ్భః పౌత్రోఽహం పద్మజన్మనః
పుత్రోఽహం నారదమునేః కుమ్భనామాస్మి కుమ్భజః. 22

ఓ సాధూ! అట్లు కుంభము (ఘటము)నుండి జన్మించి, బ్రహ్మదేవుని పౌత్రుడై నారదముని యొక్క పుత్రుండై, కుంభుడను పేరుచే నొప్పువాడు నేనే.

నివసామ్యబ్జజపురే పిత్రా సహ యథాసుఖం
చత్వారః సుహృదో వేదా మమ లీలావిలాసినః. 23

బ్రహ్మదేవునిచే విరచితమగు పురమున నేను నా జనకునితో, గూడ సుఖముగ నివసించుచున్నాను. మఱియు నాల్గువేదములున్న నాయొక్క క్రీడావిలాసులగు మిత్రులై యున్నారు.

మాతృష్వసా మే గాయత్రీ మమ మాతా సరస్వతీ
బ్రహ్మలోకే మమ గృహం పౌత్ర స్తత్రాస్మి సుస్థితః. 24

నా పినతల్లి గాయత్రి. తల్లి సరస్వతి. బ్రహ్మలోకము నా గృహము. బ్రహ్మదేవుడు నా పితామహుడు, ఇట్లు నేనచట సుఖముగ వసించుచున్నాను. [సాక్షాత్తుగ, తల్లి లేనందుచే, తండ్రి యొక్క తల్లి, పినతల్లులే, తనయొక్క తల్లి. పిన తల్లులను ఆశయముచే నిట్లు చెప్పెను]

యథా కామమశేషేణ జగన్తి విహరామ్యహం
లీలయా పరిపూర్ణత్వాన్న తు కార్యేణ కేనచిత్. 25

లీలచే, బరిపూర్ణుడ నగుటచే నేనేకార్యముయొక్క నిమిత్తము లేకయే, బ్రహ్మాండము లందంతట స్వేచ్ఛాపూర్వకముగ లెస్సగ విహరించుచున్నాను.

ధరాం పతతి మే పాదా పతతో న మహీంతలే
రజః స్పృశన్తి నాఙ్గాని గ్లానిం నాయాతి మే వపుః. 26

నేనెపుడు భూమిపై, బోదలంతునో, అపుడు నా యవయవములు భూమినిఁ దాకవు. పృథివియొక్క రేణువు లెవ్వియు నాయంగములు స్పృశింపవు. మఱియు నా శరీరమెపుడును గ్లాని బొందదు.

అద్యాకాశపథా గచ్ఛన్దృష్టవాం స్త్వామహం పురః
ఇహ తేనాగతోఽస్మ్యఙ్గ సర్వం కథితవానితి. 27

ఇపుడాకాశమార్గమునఁ బోవుచు, సమ్ముఖమున నిన్ను గాంచి యిచటి కేతెంచితిని. ఇట్లు నా వృత్తాంతమంతయు నీకు దెలియఁజేసితిని.

ఏషోఽహమిత్యఖిలమేవ యథానుభూతం
తే వర్ణితం నను మయా వనవాసతజ్జ్ఞ
సన్తో హి సంకథనమార్యజనోత్తమేషు
నిర్మాన్త్యలం సుభగ సంవ్యవహారదక్షాః. 28

వనవాసగుణములను తత్ఫలమగు చిత్తశుద్ధిని నెఱింగిన యోరాజర్షీ! ఇట్లు,నా జన్మాదులఁ గూర్చిన వృత్తాంతమును యథారీతి మీకు వర్ణించి చెప్పితిని. ఏలయనిన, ఉత్తములైనవారు ప్రశ్నింప, ప్రశ్నోత్తర సంవ్యవహార దక్షులగు మహాత్ములు, నిపుణత్వముతో, బత్యుత్తర మొసంగుటకుఁ దత్పరులై యుందురు.

శ్రీ వాల్మీకిరువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ
స్నాతుం సభా కృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహాజగామ. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే కుమ్భజననకథనం నామ
షడశీతితమః సర్గః॥ 86॥

(అష్టాదశో దివసః)

శ్రీ వాల్మీకి.— ఓ అరిష్టనేమిరాజా! వసిష్ఠమునీంద్రుఁడిట్లు పల్క, అపుడు సాయం సమయమయ్యెను. సూర్యభగవానుఁడున్ను సాయంకాలవిధి నెరవేర్చుటకై యస్తమించెను. అత్తతి సభాసదులందఱు నొకరికొకరు నమస్కరించుకొని, స్నాన. సంధ్యాది కృత్యముల నొనర్చుటకై వెడలిరి. ఆ రాత్రి గడచినపిమ్మట, సూర్యోదయము కాఁగానే మరల వారందఱును సభాస్థలమునకు విచ్చేసిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలో
పాఖ్యానమున కుంభజననకథనమను నెనుబది యాఱవ సర్గము ॥86॥
(పదునెనిమిదవ రోజు)

---

## సప్తాశీతితమః సర్గః

[కుమ్భప్రశంసా రాజ్ఞోఽత్ర నిజదుఃఖనివేదనమ్
శిష్యత్వముపదేశార్థే విశ్వాసశ్చోపవర్ణ్యతే.

కుంభఋషియొక్క ప్రశంస, రాజు తన దుఃఖమును దెలుపుకొనుట, ఉపదేశముకొఱకై శిష్యత్వము నంగీకరించుట. విశ్వాసమును బ్రకటించుట మున్నగు విషయములిట వర్ణింపఁబడుచున్నవి.]

శిఖిధ్వజ ఉవాచః—

సర్గే స్ఫురద్భిరత్యుక్తైర్యస్య సంప్రేషితో భవాన్
అలక్ష్యైః సంభృతైర్భద్రా బృహద్వాతైరివామ్బుదః. 1

శిఖిధ్వజుఁడు — ఓ దేవపుత్రా! జన్మపరంపరారూపమగు ఈసంసారమున నాచే గావింపఁబడిన యదృశ్యములై, దేదీప్యమానములైనట్టి పుణ్యములచేతనే, గొప్పవాయువుచే మేఘమువలె, తామీ పర్వతముపైకి, బంపఁబడినారు.

అద్య తిష్ఠామ్యహం సాధో ధన్యానాం ధురి ధర్మతః
అమృతస్యన్దివచసా యత్త్వయాస్మి సమాగతః. 2

మహాత్మా! నేనిపుడు భాగ్యవంతులలో శ్రేష్ఠుఁడనై యొప్పుచున్నాను. ఏలయనిన, అమృతప్రవాహమువంటి వాక్యముల వచించు తమతోడి నాకు సాంగత్య మబ్బెను.

న కేచన తథా భావాశ్చేతః శీతలయన్తి మే
రాజ్యలాభాదయోఽప్యేతే యథా సాధుసమాగమః. 3

దేవా! తమవంటి మహాత్ములతోడి సమాగమము చిత్తమును శీతలమొనర్చు విధమున, రాజ్యలాభాది మఱియే యితర పదార్థమున్ను శీతలమొనర్పఁజాలదు.

నిరర్గలరసో యత్ర సామాన్యేన విజృమ్భతే
ముక్తరాగాదిమననం తత్కల్పనసుఖావహమ్. 4

ఏలయనిన, సాధుసమాగమమున రాగద్వేషాదిరాహిత్య పూర్వకమగు అపరిచ్ఛిన్న బ్రహ్మానందము దరిద్రులు మొదలగు సర్వజనసామాన్యమునకుఁగూడ ప్రకాశితమగుచున్నది. రాజ్యాదిలాభమైననో, కల్పనామాత్రముచే తుచ్ఛసుఖమును గలుగఁజేయునదై, సర్వసామాన్యము కానిదై యున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచః —

ఏవంవాదిని సైవాస్య వాక్యమాక్షిప్య భూపతేః

భూయః ప్రోవాచ చూడాలా మునిదారకరూపిణీ. 5

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు చెప్పుచున్న శిఖిధ్వజుని వాక్యములను నిరోధించి మునిబాలకరూపమును ధరించిన చూడాల యాతనితో నిట్లనియె.

చూడాలోవాచ:—

ఆస్తామేషా కథా తావత్సర్వం తే వర్ణితం మయా
త్వం మే కథయ హే సాధో కస్త్వమత్రా కరోషి కిమ్. 6
కియత్సర్వ్యవసానేయం భవతో వనవాసితా
సత్యం కార్యం చ నో సత్యం వక్తుం జానన్తి తాపసాః 7

చూడాల:— ఓ రాజర్షీ! ఇదంతయు నట్లుండనిమ్ము. నేను నా జన్మాది వృత్తాంతమంతయు నీకుఁ దెలియఁజేసితిని. ఇఁక నీపర్వతముపై మీరేమి చేయుచున్నారో, ఎంతకాలము వఱకు నీ వనవాసము చేయుదురో, ఇట్టి వనవాసముచే నే కార్యమును మీరు సాధింపఁదలంచితిరో, అదంతయు సత్యముగా వచింపుఁడు. తాపసులు సత్యమే పలుకుదురు కాని, అసత్యము పలుకరు.

శిఖిధ్వజ ఉవాచ:—

దేవపుత్రోఽసి జానాసి సర్వమేవ యథాస్థితం
లోకవృత్తాన్తతజ్ఞోఽసి కిమన్యత్కథయామ్యహమ్. 8

శిఖిధ్వజుఁడు:— ఓ దేవపుత్రా! తాము లోకవృత్తాంతమంతయు నున్నదియున్నట్లు సమగ్రముగ నెఱింగినవారు. కావుననిఁక నేనేమి చెప్పఁగలను?

సంసారభయభీతత్వాన్నివసామి వనాన్తరే
జానతోఽపి హి మామార్య కథయామ్యేవ తే మనాక్. 9

(జననమరణరూప) సంసారభయముచే భీతిల్లి నేనీ వనవాసము చేయుచున్నాను. ఆర్యా! నా విషయమై తామంతయు నెఱింగియున్నారు. అయినను దయయాజ్ఞచే నొకింత చెప్పుచున్నాను.

శిఖధ్వజోఽహం భూపాలస్త్యక్త్వా రాజ్యమిహాస్థితః
భృశం భీతోస్మి తత్త్వజ్ఞ సంసృతౌ జన్మతః పునః. 10

ఆత్మజ్ఞా! నేను శిఖిధ్వజుఁడను పేరుగల రాజును. ఈ సంసారమున మఱలమఱల గలుగునట్టి జననమరణములచే నేను మిగుల భయభీతుఁడనై, రాజ్యమును త్యజించి తపము చేయుచుంటిని.

సుఖం పునః పునర్దుఃఖం పునర్మరణజన్మనీ
భవత స్తేన తప్యేఽహం తత్త్వజ్ఞ వనవీథిషు. 11

తత్త్వజ్ఞా! ఈ సంసారమున సుఖదుఃఖములు, జననమరణములు మఱలమఱల గలుగుచున్నవి. కాన నే వనమార్గములందు నేను తపమొనరించుచున్నాను.

భ్రమన్నపి దిగన్తేషు చరన్నపి పరంతపః
నాసాదయామి విశ్రాన్తిమేకాం నిధిమివాధనః. 12

మహాత్మా! దిగంతములందు సంచరించుచున్నను, ఉగ్రతపమాచరించుచున్ననుగూడ, దరిద్రుఁడు నిధిని పొందనట్లు, నేనొకింత విశ్రాంతినైనను బొందజాలకున్నాను.

అయత్నోఽప్యఫలోఽప్యేకో హ్యాపూర్ణోఽప్య స్తసంగతిః
శుష్యామ్యత్ర వనే సాధో ఘుణక్షుణ్ణ ఇవద్రుమః. 13

ఓ సాధూ! శాంతితయత్నుఁడనై, ఫల, సహాయతారహితుఁడనై. కీటములచే భక్షింపఁబడిన వృక్షమువలె నేనీ వనమున శుష్కించుచున్నాను.

ఇమామఖణ్డితాం సమ్యక్ క్రియాం సంపాదయన్నపి
దుఃఖాద్గచ్ఛామి దుఃఖౌఘమమృతం మే విషం స్థితమ్. 14

(ఉపవాస, దేవాతిథిపూజాది రూపమగు ఈ) అఖండ తపఃక్రియను లెస్సగ నాచరించుచున్నను, ఒక దుఃఖమునుండి మఱియొకదుఃఖసముద్రములోనికిఁ బోవుచున్నాను. అమృతతుల్యమగు వేదోక్తకర్మసముచితమైన యుపాసన, నాకు విశ్రాంతి కలుగఁజేయమి, విషమువలె నున్నది.

చూడాలోవాచః—

పితామహమహం పూర్వం కదాచిత్పృష్టవానిదం
యత్క్రియాజ్ఞానయోరేకం శ్రేయ స్తద్బ్రూహి మే ప్రభో. 15

చూడాల:— ఓ రాజర్షీ! పూర్వమొకప్పుడు బ్రహ్మదేవునిఁ గూర్చి నేనిట్లుడిగితిని. ప్రభూ! జ్ఞాన, క్రియల రెంటిలో నేది శ్రేయోదాయకమైనది?

బ్రహ్మోవాచః—

జ్ఞానం హి పరమం శ్రేయః కైవల్యం తేన వేత్త్యలమ్
కాలాతివాహనాయైవ వినోదాయోదితా క్రియా. 16

బ్రహ్మదేవుఁడిట్లనియె:— వత్సా! జ్ఞానమే పరమశ్రేయమైయున్నది. అద్దానిచేతనే జీవుఁడు పూర్ణరీతి మోక్షభాగి యగుచున్నాఁడు. క్రియ కేవలము స్వర్గాది భోగముల వినోదము కొఱకును, కాలముగూపనకొఱకును జెప్పఁబడినది.

అలబ్ధజ్ఞానదృష్టీనాం క్రియా పుత్ర పరాయణమ్
యస్య నాస్త్యమ్బరం పట్టం కమ్బలం కిం త్యజత్యసౌ. 17

ఎవరికి జ్ఞానము సంప్రాప్తింపలేదో, అట్టివారికి క్రియయే యాశ్రయమై యున్నది. ఏలయనిన, పీతాంబరము లభింపనివాఁడు కంబళిని త్యజించునా?

వాసనామాత్రసారత్వాదజ్ఞస్య సఫలాః క్రియాః
సర్వా ఏవాఫలా జ్ఞస్య వాసనామాత్ర సంక్షయాత్. 18

వాసనాయుక్తుఁడగుటచే, అజ్ఞానియొక్క సమస్తక్రియలు ఫలయుక్తము లగుచున్నవి. వాసనలు క్షయించుటచే జ్ఞానియొక్క సమస్తక్రియలు ఫలరహితములగుచున్నవి.

సర్వా హి వాసనాభావే ప్రయాన్త్యఫలతాం క్రియాః
అశుభాః ఫలవన్త్యోఽపి సేకాభావే లతా ఇవ. 19

జలసేచనము లేనిచో, ఫలసహితమైన లతయైనను నిష్ఫలత్వమును బొందునట్లు ఫలమొసంగుటకుఁ బ్రారంభించిన క్రియలైనను అన్నియు వాసనల అభావముచే నిష్ఫలత్వము నొందుచున్నవి.

ఋత్వన్తరే యథా యాతి విలయం పూర్వమార్తవమ్.
తథైవ వాసనానాశే నాశమేతి క్రియాఫలమ్. 20

శరదృతువునందు వర్షర్తువుయొక్క మేఘాదులు నాశమొందునట్లు, వాసనానాశముచే క్రియలయొక్క ఫలమున్ను నశించుచున్నది.

న స్వభావేన ఫలతి యథా శరలతా ఫలమ్
క్రియా నిర్వాసనా పుత్ర ఫలం ఫలతి నో తథా. 21

స్వభావముగనే జెల్లుతీగెకు ఫలములేనట్లు, వాసనారహితమగు క్రియ ఫలమొసంగజాలదు.

సయక్షవాసనో బాలో యక్షం పశ్యతి నాన్యథా
సదుఃఖవాసనో మూఢో దుఃఖం పశ్యతి నాన్యథా. 22

భూతప్రేతాదులఁ గూర్చిన వాసనలు గల్గియున్నచే బాలుఁడట్టి భూతప్రేతాదులఁ గాంచునుగాని, లేనిచో గాంచనట్లు, సుఖదుఃఖములఁ గూర్చిన వాసనలతోఁగూడియున్న మూఢుడే యట్టి సుఖదుఃఖములఁ గాంచునుగాని యన్యుఁడు కాఁడు.

ఆకారభాసురాప్యుచ్చైర్న దదాతి ఫలం క్రియా
శుభాశుభా వా తజ్జ్ఞస్య ఫుల్లా శరలతా యథా. 23

వికసించినదైనను, జెల్లుతీగె, ఫలమును గల్గఁజేయనట్లు, గొప్ప యాకారములతోఁ గూడి ప్రకాశించుచున్న మహత్తరమైన శుభక్రియగాని, అశుభక్రియగాని యైనను, జ్ఞానికి ఫలమును గలుగఁజేయఁజాలదు.

వాసనా చేహ నాస్త్యేవ నాహంకారాదిరూపిణీ
అసత్యైవోదితా మోహాద్యన్మరుభూమావివామ్బుధిః. 24

వాస్తవముగ, అహంకారాది రూపమగు వాసన యేయొకవస్తువున్నుగాదు. అయ్యది మిథ్యగనే, మరుభూమియందు సముద్రమువలె అజ్ఞానముచే నట్లుదయించినదగును.

యస్య మౌర్ఖ్యం క్షయం యాతం సర్వం బ్రహ్మేతి భావనాత్
నోదేతి వాసనా తస్య ప్రాజ్ఞస్యేవామ్బుధిర్మరౌ. 25

ప్రాజ్ఞునకు మరుభూమియందు సముద్ర ముదయించునట్లు 'అంతయు బ్రహ్మమే' అను నీ భావనచే నెవని అజ్ఞానము నశించినదో, అట్టి జ్ఞానికిఁక వాసన యుదయింపదు.

వాసనామాత్రసంత్యాగాజ్జరామరణవర్జితమ్.
పదం భవతి జీవోఽస్తర్యాభయో జన్మవివర్జితమ్. 26

వాసనామాత్రమును లెస్సగఁ బరిత్యజించుటచే, జరామరణవర్జితమై, పునర్జన్మరహితమైనట్టి పరమపదము (పరమపురుషార్థవస్తువు) జీవునకుఁ బ్రాప్తించును.

సవాసనం మనో జ్ఞేయం జ్ఞానం నిర్వాసనం మనః
జ్ఞానేన జ్ఞేయమభ్యేత్య పునర్జీవో న జాయతే. 27

వాసనా సహితమైన మనస్సే మనస్సుయొక్క స్వరూపమగును. వాసనారహితమైన మనస్సు జ్ఞానరూపమే అయియున్నది. జ్ఞానముచే జ్ఞేయవస్తువు సంప్రాప్తించుచున్నది. అట్టి జ్ఞేయమును బొందిన జీవుఁడిఁక మఱల జన్మను బొందనేరఁడు.

చూడాలోవాచ:—

జ్ఞానమేవ పరం శ్రేయ ఇతి బ్రహ్మాదయోఽపి తే
ప్రాహుర్మహాన్తో రాజర్షే త్వం కిమజ్ఞానవాన్స్థితః. 28

చూడాల:—ఓ రాజర్షి ! బ్రహ్మాది మహాత్ములందఱును జ్ఞానమునే పరమశ్రేయముగ వచింప, మీ రజ్ఞానివలె నేల యుండియున్నారు ?

ఇతః కమణ్డలురితో దణ్డకాష్ఠమితో బృసీ
ఇత్యనర్థవిలాసేఽస్మిన్రమసే కిం మహీపతే. 29

ఇచట దండము, ఇచట కమండలువు, ఇచట యాసనము - ఇత్యాది తపోరూపములైన యనర్థ విలాసములందు నీవేల క్రీడించుచున్నావు ?

కోఽహం కథమిదం జాతం కథం శామ్యతి చేతి భోః
రాజన్నావేక్షసే కస్మాత్కిమజ్ఞ ఇవ తిష్ఠసి. 30

ఓ రాజా ! 'నే నెవరను; ఈ ప్రపంచ మెట్లుత్పన్నమైనది; ఏ ప్రకారమిది శమించును' - ఈ మున్నగు విషయముల విచారింపక, అజ్ఞానివలె నేల యున్నావు ?

కథం బన్ధః కథం మోక్ష ఇతి ప్రశ్నానుదాహరన్
పారావారవిదాం పాదాన్కస్మాద్రాజన్న సేవసే. 31

బంధమెట్లు కలుగును, మోక్షమెట్లు సంప్రాప్తించును,—మున్నగు ప్రశ్నలఁగావించుచు, శోధిత 'తత్త్వమ్' పదముయొక్క యఖండవాక్యార్థము నెఱింగిన మహాత్ముల చరణముల నేల సేవింపకుంటివి !

దుఃస్వప్నసంవిదా శైలకోటరే క్రియయానయా
జీవితం క్షపయన్కిం త్వం శిలాకీటవదాస్థితః. 32

బహిర్ముఖవృత్తిరూపమై, దుఃఖప్రదమైనట్టి యీ తపోరూపకార్యమున, శిలయందలి కీటము వలె, ఈ పర్వతగుహయందు నీ జీవితము నశింపఁజేసికొనుచు నేల యున్నావు ?

సాధూనాం సమదృష్టీనాం పరిప్రశ్నేన సేవయా
సంగమేన చ సా యుక్తిర్లభ్యతే ముచ్యతే యయా. 33

సమదృష్టి గలిగినసాదు మహాత్ములఁ బ్రశ్నించుటచేతను, వారిని సేవించుటచేతను, వారి సాంగత్యముచేతను జ్ఞానమను యుక్తి లభింపుచున్నది. అద్దానిచే జీవుఁడు ముక్తుఁడగును.

సాధునైవ సమం గ్రాసం భుఞ్జానో వనకోటరే
తిష్ఠావష్టబ్ధదృష్టిష్టో ధరావివరకీటవత్. 34

గురువుతోడ సమముగ భుజించుచు, క్లేశదాయకములగు బహిర్ముఖ వృత్తుల నిరోధించి, గురుసేవా పరాయణుఁడవై, తద్గురూపదిష్టార్థమున, పృథివీబిలమున కీటమువలె నిశ్చలముగనుండుము.

శ్రీ వసిష్ఠ ఉవాచః—.

కాన్తయా దేవరూపిణ్యా తయైవం ప్రతిబోధితః
అశ్రుపూర్ణముఖో వాక్యం శిఖిధ్వజ ఉవాచ హ. 35

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! దేవరూపధారిణియగు చూడాల తన పతికిట్లుబోధింప నంత నాతఁడశ్రుపూరితముఖుఁడై యిట్లు వచించెను.

శిఖిధ్వజ ఉవాచః —.

అహోను బోధితోఽస్మ్యద్య చిరాత్సురసుత త్వయా
మహార్యాదార్యసమాసఙ్గం ముక్త్వాహమవసం వనే. 36

శిఖిధ్వజుఁడు:—ఓ దేవపుత్రా! ఆహా! చిరకాలమునకు నేఁడు తమచే బోధితుఁడనైతి. నేను నా యజ్ఞానముచే మహాపురుషుల సాంగత్యమును వదలి యీ వనమున వసించుచున్నాను.

అహో ను మే క్షయం యాతం మన్యే పాపమశేషతః
యత్త్వమేవ సమాగత్య సంప్రబోధయసీహ మామ్. 37

ఆహా! నా పాపమంతయు నిపుడు నశించినదనియే నేను దలంచుచున్నాను. ఏలయనిన, తాము స్వయముగనే వచ్చి నాకు జ్ఞానమొసంగుచున్నారు.

గురుస్త్వం మే పితా త్వంమే మిత్రం త్వం మే వరానన
శిష్యో నమస్కరోమ్యద్య పాదౌ తవ కృపాం కురు. 38

శ్రేష్ఠముఖా! తమరే మా గురువు, తమరే మాతండ్రి; తమరే మా మిత్రులు నేను తమ శిష్యుఁడను. తమ పాదములకు నమస్కరించుచున్నాను. నాపై దయఁజూపుఁడు.

యదుదారతమం వేత్సి యస్మిన్ జ్ఞాతే న శోచ్యతే
భవామి నిర్వృతో యేన తద్బ్రహ్మోపదిశాశు మే. 39

ఎద్దానిని తాము సర్వమునకంటె శ్రేష్ఠమని నమ్మచున్నారో, ఎద్దాని నెఱుంగుటచే జీవుఁ డిఁక మఱల దుఃఖమును బొందఁడో, దేనిచే నేను సుఖస్వరూపమున విశ్రమింతునో, అట్టి బ్రహ్మము యొక్క యుపదేశమును నాకు శీఘ్రముగఁ గావింపుఁడు.

ఘటజ్ఞానాదయో జ్ఞానే విభాగాః సన్త్యనేకశః
జ్ఞానానాం పరమం జ్ఞానం కతరత్తారకం భవేత్. 40

జ్ఞానములలో ఘటపటాదిజ్ఞాన (విభాగ) ము లనేకములు కలవు. కాని, వానియన్నింటిలో సర్వోత్తమమైన జ్ఞానము, అనఁగా, సంసారదుఃఖమును దరింపఁజేయునట్టి జ్ఞాన మెయ్యది?

చూడాలో వాచ,—

యద్యుపాదేయవాక్యోఽహం రాజర్షే తద్వదామి తే
యథాజ్ఞానమిదం కించిన్న వక్ష్యే స్థాణుకాకవత్. 41

చూడాల.— ఓ రాజర్షీ ! నావాక్యములందు మీకు శ్రద్ధయున్నచో, మీ ప్రశ్నకనుకూలమగు నుత్తరము వచించెదను. అట్లు శ్రద్ధలేనిచో, స్థాణువుయెదుట కాకిశబ్దమువలె నా వాక్యములపుడు వ్యర్థములగునుగాన, నేను జ్ఞానోపదేశము చేయను.

అనుపాదేయవాక్యస్య వక్తుః పృష్టస్య లీలయా
వ్రజన్త్యఫలతాం వాచస్తమసీవాక్షిసంవిదః. 42

వినోదమునకై ప్రశ్నించువాఁడును, శ్రద్ధారహితుఁడు నగువానియెడల వక్తయొక్క వాక్కు, అంధకారమున నేత్రజ్ఞానమువలె నిష్ఫలమగును.

శిఖిధ్వజ ఉవాచ:—

యద్వక్షి తదుపాదేయం మయా విధిరివ శ్రుతేః
అవిచారితమేవాశు సత్యమేతద్వచో మమ. 43

శిఖిధ్వజుఁడు.—మహాత్మా ! తమ వచనములను వేదవిధివలె, విచారింపకనే శీఘ్రముగ నేను గైకొందును, సత్యముగ బల్కుచున్నాను.

చూడాలోవాచ:—

యథా బాలః పితుర్వాక్యం ముక్తహేతూపపాదనమ్
ఆదత్తే హి తథైవ త్వం గృహాణైతద్వచో మమ. 44

చూడాల:—ఓ రాజర్షీ ! హేతువును బ్రశ్నింపకనే బాలుఁడు తండ్రియొక్క వాక్యమునెట్లు గ్రహించునో అట్లే నీవున్ను నా వాక్యములను గ్రహింపుము.

శ్రవణానన్తరం బుద్ధ్వా శుభమిత్యేవ భావయన్
శృణు గీతమివ త్యక్త్వా హేత్వన్తిత్వం వచో మమ. 45

'శ్రవణానంతరము ఇది నాకు హితకరముగనుండునని భావించుచు, హేతువును త్యజించి కర్ణానందజనకమగు గీతమునువలె ప్రీతిపూర్వకముగ నిపుడు నా వాక్యముల వినుము.

స్వచరితసదృశం తథోదయన్త్యా
శ్చిరసమయేన విబోధనం చ బుద్ధేః
భవభయసుతరం మహామతీనాం
శృణు కథయామి యథాక్రమం మనోజ్ఞమ్. 46

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే శిఖిధ్వజావబోధో నామ
సప్తాశీతితమః సర్గః 87॥

ఓ రాజర్షీ ! నీ చరిత్రను బోలినదియు, మందమతుల బుద్ధికిఁగూడ చిరకాలమునకు విచారణ ద్వారా బోధజనకమైనదియు, బుద్ధిమంతులను శీఘ్రముగనే సంసారభయమునుండి దాటింపఁజేయునది యునగు నుత్తమకథాక్రమమును వచింపఁబోవుచున్నాను, వినుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజబోధమను
నెనుబదియేఁడవ సర్గము ॥87॥

---

## అష్టాశీతి తమః సర్గః

[మౌర్ఖ్యాచ్చిన్తామణిం ప్రాప్తముపేక్ష్య తపసా చిరాత్
కాచం కశ్చిన్మణిభ్రాన్త్యా జగ్రాహేతి కథోచ్యతే.

చాలకాలము తపస్సుచేసి యొకానొకఁడు చింతామణిని బొందెను. కాని మూర్ఖత్వముచే నాతడద్దానినిత్యజించి కాచఖండమును (గాజుముక్కను) గ్రహించెనను కథ యిటఁ జెప్పఁబడుచున్నది.]

చూడాలోవాచ:—

అస్తి కశ్చిత్పుమాన్ శ్రీమాన్ స్థానం నిత్యవిరుద్ధయోః
గుణలక్ష్మ్యోరశేషేణ యథాబ్ధిర్వాడవామ్బునోః. 1

చూడాల:— ఓ రాజర్షీ ! ఒకానొక ధనాఢ్యుఁడగు పురుషుఁడు, సముద్రజల బడబాగ్నులవలె నిత్యము పరస్పర విరుద్ధమైనట్టి సంపూర్ణ ఔదార్యాది గుణములయొక్కయు, లక్ష్మి (ధనము) యొక్కయు స్థానమై వెలయుచుండెను.

కలావానస్త్రకుశలో వ్యవహారవిచక్షణః
సర్వసంకల్పసీమాన్తో నతు జానాతి తత్పదమ్. 2

మఱియు నాతఁడు కళలయందు నేర్పరియు, అస్త్రవిద్యయందు నిపుణుఁడును, వ్యవహారమందు దక్షుఁడు నైయుండెను. కాని పరమాత్మపదమును నెఱుఁగనివాఁడై యుండెను.

అనన్తయత్నసంసాధ్యే స చిన్తామణిసాధనే
ప్రవృత్తో వాడవో వహ్నిరబ్ధిసంశోషణే యథా. 3

సముద్రమును శోషింపఁజేయుటయందు బడబాగ్ని ప్రవృత్తమగు నట్లు, ఆతఁడనేకయత్నములచే సాధ్యమగునట్టి చింతామణిని బొందుటకై ప్రవృత్తుఁడాయెను.

తస్య యత్నేన మహతా కాలేనాధ్యవసాయినః
సిద్ధశ్చిన్తామణిః కింవా న సిద్ధ్యత్యుద్యతాత్మనామ్. 4

ప్రయత్నశీలుఁడగు నాతని మహాయత్నముచే కాలక్రమమున నాతనికి చింతామణి లభించెను. యత్నశీలురకేపదార్థము సిద్ధింపదు?

ప్రవృత్తిముద్యమం ప్రజ్ఞాం ప్రయుఙ్క్తే చేదఖేదవాన్
అకించనోఽపి శక్తత్వం సమవాప్నోత్యవిఘ్నతః. 5

ఎవఁడు ప్రజ్ఞ నాశ్రయించి ఖేదరహితుఁడై యత్నమునఁ బ్రవృత్తుఁడగునో, అట్టివాఁడు దరిద్రుఁడైనను నిర్విఘ్నముగ సామర్థ్యమును బొందగలడు.

మణిమగ్రే స్థితప్రాయం హస్తప్రాప్యం దదర్శ సః
మేరావుదయశృఙ్గస్థో మునిరిన్దురివోదితమ్. 6

మేరుపర్వతశిఖరముపైనున్న వాఁడుదయించిన చంద్రునిఁ గాంచునట్లు. ఆతఁడు తన యెదుట చేతితోఁ గైకొనుటకు వీలుగా నున్నట్టి యొకమణిని గాంచెను

బభూవ మణిరాజేన్ద్రే నతు నిశ్చయవానసౌ
రాజ్యే ద్రాగితి సంప్రాప్తే సుదీన ఇవ పామరః. 7

కాని శీఘ్రముగ సంప్రాప్తించిన రాజ్యమందతిదరిద్రునకు నిశ్చయములేకుండు నట్లు, ఆతని కామణియందు నిశ్చయము లేకుండెను.

ఇదం సంచిన్తయామాస మనసా స్మయశాలినా
సంప్రాప్తోపేక్షయా దీర్ఘదుఃఖసంభ్రమలిశానా. 8

అపుడాశ్చర్యముతోను, ఉపేక్షతోను మిగులదుఃఖముతోను, సంభ్రమముతోను గూడిన మనస్సుచే నాతఁడిట్లు విచారించెను —

అయం మణిర్మణిర్నాయం మణిశ్చేత్తద్భవేన్న సః
స్పృశామి న స్పృశామ్యేనం కదాచిత్స్పర్శతో వ్రజేత్. 9

ఇది యేమి? చింతామణియా, కాదా? చింతామణియైనచో నాకుఁ బ్రత్యక్షము కాకుండెడిదే. దీనిని దాకుదునా? తాకకుందునా! ఒకవేళ తాకినచో నియ్యది మాయమై పోవునేమో

నైతావతైవ కాలేన మణీన్ద్రః కిల సిధ్యతిః
యత్నేన జీవితాన్తేన సిధ్యతీత్యాగమక్రమః. 10

ఇంత స్వల్పకాలముననే చింతామణి సిద్ధింపదు. ఏలయనిన, ఆజీవితము యొనర్చు మహత్తర ప్రయత్నముచేతనే అయ్యది లభించునని పెద్దలు చెప్పుదురు.

కృపణః కూణితేనాక్ష్ణా లోలాలాతలతోపమమ్
రత్నాలోకం ప్రపశ్యామి ద్విచన్ద్రత్వమివ భ్రమాత్. 11

నేనులోభిని. అట్టి లోభత్వకారణమునను, భ్రాంతి చేతను, సంకుచితనేత్రము చేతను, చలించు యాలాత (కొఱవి) చక్రమువలె గల్పితమైనట్టి యీరత్నప్రకాశమును, భ్రమచే రెండు చంద్రులనువలె నేనిపుడు గాంచుచున్నాను.

కుత ఏతావతీ స్ఫీతా భాగ్యసంపన్మమాగతా
అద్యైవ యదాప్నోమి మణీన్ద్రం సర్వసిద్ధిదమ్. 12

ఇంత స్వల్పకాలముననే యిట్టి గొప్ప భాగ్యోదయము నాకెట్లైనది? అపుడే, సర్వసిద్ధిదాయకమగు మణిరాజము (చింతామణి) నాకెట్లు లభించినది?

కేచిదేవ మహాన్తస్తే మహాభాగ్యా భవన్తి హి
యేషామల్పేన కాలేన భవన్త్యభిముఖాః శ్రియః. 13
అహమల్పతపాః సాధువరాకో మానుషః కిల
సిద్ధయః కథమాయాన్తి మామభాగ్యైకభాజనమ్. 14

అల్పకాలముననే గొప్పయైశ్వర్యమును బొందునట్టి మహాభాగ్యశాలురు కొందఱుందురు, కాని నావంటి యల్పతపస్సు కలిగియుండిన అభాగ్యుఁడగు దీనుఁడైన మనుజునకు సిద్ధులెట్లు సంప్రాప్తించును?

ఏవం వికల్పసంకల్పైశ్చిరమజ్ఞః పరామృశన్
న మణిగ్రహణే యత్నమకార్షీన్మౌర్ఖ్యమోహితః. 15

ఓ రాజా! ఈప్రకారముగ నాయజ్ఞాని యనేక సంకల్ప వికల్పములచే విచారించుచు, అజ్ఞానముచే మోహితుఁడై యామణిని గ్రహించుటయందుఁ బ్రయత్నము చేయకుండె.

న యదా యేన లబ్ధవ్యం న తత్ప్రాప్నోత్యసౌ తదా
చిన్తామణిరవాప్తోఽపి దుర్ధియా హేలయోజ్ఝితః. 16

ఎపుడేవస్తు వెవనికి లభ్యముకాఁదగినదిగా నుండదో, అపుడాతఁడద్దానిని పొందనేరఁడు, చూడుము! ఆతఁడు చింతామణిని బొందియు, తన దుర్బుద్ధిచే దానిని నిరాదరణపూర్వకముగఁ ద్యజించివేసెను!

ఇతి తస్మిన్స్థితే యాతో మణిరుడ్డీయ సిద్ధయః
త్యజన్తి హ్యవమన్తారం శరోగుణమివోజ్ఝితః. 17

ఈప్రకారముగ నాతఁడుండ నంత ఆచింతామణి యెచటికో యెగిరిపోయెను. ఏలయనిన, ధనుస్సునుండి విడువఁబడిన బాణము, ఆధనుస్సుయొక్క త్రాడును విడిచిపోవుచందమున, అనాదరణ చేయువారినిన్ని సిద్ధులు వీడిచనును.

హత్వా ప్రాజ్ఞపదం పుంసః సంయాన్తి కిల సిద్ధయః
ఆగతాః సంప్రయచ్ఛన్తి సర్వం యాన్త్యసహాత్యలమ్. 18

సిద్ధులు యేతెంచినపుడు మనుజునకవి విచక్షణత్వ మొసంగును. కాని, ఎవఁడు వాని నుపేక్షించునో, ఆట్టివానియొక్క విచక్షణత్వాది గుణముల నవి నశింపఁజేసి వెడలును.

పుమాన్స్వాయః క్రియాయత్నం చక్రే రత్నేన్ద్రసాధనే
నోద్విజన్తే స్వకార్యేషు జనా అధ్యవసాయినః. 19

ఆ పురుషుఁడు మణిరాజము (చింతామణి) యొక్క సిద్ధికొఱకై మఱల ప్రయత్నించెను. ప్రయత్నశీలురు తమకార్యములం దుద్విగ్నులు కారుకదా!

దదర్శాథ కచద్రూపం కాచఖణ్డమఖణ్డితం
హాసద్భిర్వ్యఙ్గ్యకైః సిద్ధైః పురస్కృతమలక్షితైః. 20

ఆ తరువాత, పరిహాసపరులగు వంచకులైన సిద్ధులచే వానియెదుట నుంచబడిన యొక యఖండితమగు కాచము (గాజుముక్క) నాతఁడు కాంచెను.

అయం చిన్తామణిరితి మూఢ స్తస్మిన్నవస్తుతాం
బుబుధే మోహితో హ్యజ్ఞో మృదం హేమేతి పశ్యతి. 21

అప్పుడా మూఢుఁడు, ఇది చింతామణి యని తలంచి యద్దానిని గ్రహింపనెంచెను. ఏలయనఁగా, అజ్ఞానముచే మోహితుఁడగు మూఢుఁడు మృత్తికనుగూడ సువర్ణముగా నెఱుఁగును.

అష్టౌ షష్ఠం ద్విషం మిత్రం రజ్జుం సర్పం స్థలం జలం
చన్ద్రౌ ద్వౌ కురుతే చిత్తగతో మోహోఽమృతం విషమ్. 22

చిత్తమందున్న యజ్ఞాన మొకపు డెనిమిది ఆఱుగను, శత్రువును మిత్రునిగను, రజ్జువును సర్పముగను, స్థలమును జలముగను, ఒకచంద్రుని రెండు చంద్రులుగను, అమృతమును విషముగను గావించును.

తం దగ్ధమణిమాదాయ ప్రాక్తనీం చ శ్రియం జహౌ
సర్వం చిన్తామణేరస్మాత్ప్రాప్యతే కిం ధనైరిహ. 23

ఆ వ్యర్థమగు కాచమణిని బొంది యాతఁడు తన పూర్వకాలపు సంపదయంతటిని త్యజించెను. ఏలయనిన, ఈ చింతామణిచే సమస్తము ప్రాప్తించును గాన నిఁక యీ ధనధాన్యాది సంపదలచే నేమి ప్రయోజనమని యాతఁడు తలంచెను.

దేశోఽయమసుఖో రూక్షో జనైః పాపిభిరావృతః
కిం తద్గేహం గతప్రాయం కిం నామ మమ బన్ధవః. 24
దూరం గత్వా యథాకామం సుఖం తిష్ఠామి సంపదా
ఇత్యాదాయ మణిం మూఢః శూన్యకాననమాయయౌ. 25

ఈ నా దేశము సుఖవర్జితమై, కాఠిన్యయుతమై, పాపులచే నావరింపఁబడియున్నది; మఱియు శిథిలమైన యీ గృహముచే నాకేమి ప్రయోజనము? ఈ నాబంధువులున్ను నెవరు? కాన, దూరముగాఁబోయి సంపదతోఁగూడినవాఁడనై నా యిచ్ఛానుకూలము సుఖపూర్వకముగ వసించెదనని నిశ్చయించి యామూఢుఁడా కాచఖండమును గైకొని శూన్యమగు నరణ్యమునకుఁ బోయెను.

తత్ర కాచకణే నాసౌ తేన తామాపదం యయౌ
కజ్జలాద్రేరివ నిభా మూర్ఖత్వస్యేవాజ్ఞ యా సమా. 26

ఆ కాచఖండముచే నాతఁడపుడు మూర్ఖత్వమున కనురూపమైనట్టియు, కాటుకకొండవలె గాఢాంధకారయుతమైనట్టియు నాపదను బొందెను.

దుఃఖాని మౌర్ఖ్యవిభవేన భవన్తి యాని
నైవాపదో న చ జరామరణేన తాని
సర్వాపదాం శిరసి తిష్ఠతి మౌర్ఖ్యమేకం
కృష్ణం జనస్య వపుషామివ కేశజాలమ్. 27

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షో
పాయేషు నిర్వాణప్రకరణేపూర్వార్ధే చూడాలోపాఖ్యానే
మణికాచోపాఖ్యానం నామ అష్టాశీతితమః సర్గః ॥ 88 ॥

ఓ రాజా! మూర్ఖత్వముచే నేయాపదలు, దుఃఖములు మనుజునకుఁ గలుగునో, అయ్యవి వార్ధక్య, మరణములచేఁ గూడ గలుగనేరవు. ఏలయనఁగా మనుజుని శిరమున నల్లని కేశసమూహము న్నట్లు, సమస్తయాపదల శిరమునను మూర్ఖత్వముండియున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలోపాఖ్యానమున మణికాచోపాఖ్యానమను
నెనుబది యెనిమిదవ సర్గము ॥88॥

---

## ఏకోననవతితమః సర్గః

[బద్ధవిన్ధ్యగజేన్ద్రస్య యత్నాచ్ఛిత్త్వాపి బన్ధనమ్
అనిఘ్నతో రిపుం ప్రాప్తం ఖాతే పాతోఽత్ర వర్ణ్యతే.

బంధింపబడియుండిన వింధ్యాచల గజేంద్రము తన బంధనమును దెగద్రుంచుట, శత్రువగు మావటివానిని బొందియు నాతనిని జంపకతానే కందకమునఁ బడుటయు నిటవివరింపబడు చున్నది.]

**చూడాలోవాచ:—**

అథేమమపరం రమ్యం వృత్తాన్తం శృణు భూమిప
పరం ప్రబోధనం బుద్ధేః సాధో సదృశమాత్మనః. 1

చూడాల:— సాధువగు నోరాజా! ఇఁకనిపుడు బుద్ధికి, ప్రబోధదాయకమై నీవృత్తాంతము బోలినట్టి మఱియొక రమణీయ చారిత్రమును జెప్పెద, వినుము.

అస్తి విన్ధ్యవనే హస్తీ మహాయూథపయూథపః
అగస్త్యశుద్ధయా బుద్ధ్యా విన్ధ్యేనేవోదితః స్వతః. 2

అగస్త్యఋషియొక్క శుద్ధబుద్ధిద్వారా వింధ్యపర్వతము వ్యక్తమొనర్పబా యన్నట్లు పూర్వము వింధ్యాటవియందు గజేంద్రమనఁదగు గొప్పయేనుఁగొకటి యుండెను.

వజ్రార్చిర్విషమా దీర్ఘా తస్యాస్తాం దశనౌ సితౌ
కల్పానిలశిఖాతుల్యౌ సుమేరూన్మూలనక్షమౌ. 3

దాని రెండుదంతములు, వజ్రాయుధజ్వాలలవలె తీక్ష్ణములును, మిగుల దీర్ఘములును, తెల్లని వర్ణముగలవియు, ప్రళయాగ్ని జ్వాలానసమానములును, సుమేరు పర్వతమునుగూడ పెల్లగించుటకు సమర్థములు నైయుండెను.

స బద్ధో లోహజాలేన హస్తి పేన కిలాభితః
మునీన్ద్రేణేవ విన్ధ్యాద్రి రుపేన్ద్రేణేవ వా బలిః. 4

అగస్త్యమునీంద్రుడు వింధ్యపర్వతమును, లేక వామనభగవానుఁడు బలిచక్రవర్తిని బంధించి నట్లు, ఆగజమును నొకమావటివాఁడినుపగొలుసులతోఁటి బంధించెను.

నిబద్ధో యన్త్రణామాప శస్త్రకుమ్భార్దితో గజః
తాం జగామ వ్యథాం ధీరో నవాగ్నా పురమేతి యామ్. 5

అచ్చోట దాను బంధింపఁబడిన శస్త్రములచే నాయేనుఁగు గండస్థలమున మిగుల బాధింపఁ బడినదై, ఈశ్వరుని బాణాగ్నిచే త్రిపురాసురునివలె చాల వ్యథనొందెను.

రిపౌ హస్తిపకే దూరాదపశ్యతి స వారణః
అయఃసముద్గకే యస్మిన్నినాయ దివసత్రయమ్. 6

శత్రువగు మావటివాఁడు దూరమున నుండుటచే దానిని గాంచకపోవుట వలన, ఆలోహ జాలసమూహమున నా గజము మూఁడుదినములట్టి వ్యథతోనే కాలము గడిపెను.

ఖేదాన్నిగడనిశ్ఛేదే యత్నవాన్స మతంగజః
చకార కింకిణీక్వాణం ముఖోద్ఘాతై రథాన్యదా. 7

అటుపిదప దుఃఖాతిశయముచే నది తనబంధనమును త్రెంచుటకై యత్నించి, ముఖము యొక్క యాఘాతములచే గొలుసులను శబ్దము గావించెను.

దన్తాభ్యాం యత్నతస్తాభ్యాం ముహూర్తద్వితయేన సః
బభఞ్జ శృఙ్ఖలాజాలం స్వర్గార్గలమివాసురః. 8

స్వర్గద్వారమును బలిచక్రవర్తి భేదించినట్లు, అపుడది నాల్గుగడియలలో, ప్రయత్న పూర్వకముగ దన రెండుదంతములచే నాశృంఖలాజాలమును విరుగగొట్టెను.

తం తస్య నిగడచ్ఛేదమపశ్యద్దూరతో రిపుః
బలేః స్వర్గావదలనం హరిర్మేరుతలాదివ. 9

స్వర్గమునుండి బలిచక్రవర్తియొక్క యధఃపతనమును మేరుపర్వతతలమునుండి విష్ణుభగ వానుఁడు వీక్షించినట్లు, ఆయేనుఁగట్లుబంధనము ఛేదించుటను దూరమునుండి మావటివాఁడు చూచెను.

తస్య విచ్ఛిన్నపాశస్య మూర్ధ్ని తాలతరో రిపుః
పపాత క్రమతః స్వర్గం హరిర్మేరోర్బలేరివ 10

తన మూఁడవపాదమును బూరించుటకొఱకు విష్ణుభగవానుఁడు మేరుపర్వతమునుండి బలిచక్ర వర్తియొక్క శిరస్సుపైఁ బడినట్లు, బంధనమును విరుగగొట్టిన యాయేనుఁగు యొక్క శిరస్సుపైనపుడు తాటిచెట్టుపైనుండి యా మావటివాఁడు పడెను.

స పతన్పాదపద్మాభ్యామప్రాప్య కరిణః శిరః
పపాతోర్వ్యాం ఫలం పక్వం వాతాహతమివాకులః. 11

అతఁడట్లు తన చరణకమలములతో పడుచు నా యేనుగుయొక్క శిరమును బొందజాలక వ్యాకులుఁడై, గాలిచే బడగొట్టబడిన పక్వఫలమువలె, భూమిపై బడెను.

తం పురః పతితం దృష్ట్వా మహేభః కరుణాం యయౌ
స్ఫురత్స్ఫారగుణాః సన్తః సన్తి తిర్యగ్గతావపి. 12

ఆతఁడు తనయెదుట బడుటఁజూచి యాగజేంద్రము కరుణాపూరితయయ్యె. ఏల యనగా తిర్యగ్జాతియందును దేదీప్యమానములైన విశాలగుణములు కలిగిన మహాత్ములు కలరు

పతితం దలయామీతి కిం నామ మమ పౌరుషమ్
వారణోఽపీతి కలయన్న జఘాన స తం రిపుమ్. 13

ఈపడిన మనుష్యుని ఏనుఁగైన నేను మర్దించి వైచినచో నా పురుషార్థమును గూర్చి జను లేమని చెప్పుకొందురు? అనియిట్లు విచారించుచు ఆతఁడాశత్రువునయ్యది చంపకుండెను.

కేవలం నిగడవ్యూహం విదార్యాభి జగామ హ
వితతం సేతుముత్సార్య విపులౌఘ ఇవామ్భసః. 14

విశాలమైన నీటికట్టనుగూడ గొప్ప జలప్రవాహము త్రెంచుకొని పోవునట్లు, ఆగజము కేవలము తన బంధనజాలమును నలువైపుల ద్రెంచివైచి వెడలిపోయెను.

దయామాశ్రిత్య మాతఙ్గో భఙ్క్త్వా జాలం జగామహ
విదార్య మేఘసంఘాతం నభసీవ దివాకరః. 15

ఆ యేనుఁగు దయనాశ్రయించి, బంధనజాలమును ద్రెంచివేసి, ఆకాశమును మేఘసమూహమును విదీర్ణమొనర్చి సూర్యుఁడు వెడలునట్లు, వెడలిపోయెను.

గజే గజే సముత్తస్థౌ హా స్విపః స్వస్థదేహధీః
గజేనైవ సమం తస్య వ్యథా దూరతరం గతా. 16

అట్లు ఏనుఁగు వెడలగా, ఆమావటివాఁడు దేహ, బుద్ధులు స్వస్థపడ యటనుండి లేచెను. ఏలయనిన ఆయేనుఁగుతోఁబాటు యాతని బాధయుఁ దొలగిపోయెను.

ప్రోచ్చలత్తాలశిఖరాత్స తథా పతితోఽపి సన్
న భేదమాప దుర్భేదా మన్యే దేహా దురాత్మనామ్. 17

మిగుల యెత్తైన తాటిచెట్టుపైనుండి పడినను, ఆ మావటివాని హస్తపాదాద్యవయవము లెవ్వియు విరుగలేదు. దీనిచే, దుష్టుల యవయవము లతి కఠినములుగా నుండునని నేనుదలంచుచున్నాను.

వర్ధతే ప్రావృషీవాభ్రం శుకార్యేష్వసతాం బలం
ఆసీదధికముత్సాహీ స చ చంక్రమణే తదా. 18

నిందిత కార్యము లాచరించుటయందు దుష్టుల బలము వర్షాకాలపు మేఘమువలె వృద్ధినొందును. ఏలయనగా! ఆ దుష్టుఁడు తాటిచెట్టుపైనుండి పడినను, నడుమటయందు అధికోత్సాహము గలిగియుండెను.

వారణారిరసిద్ధార్థో గతేభో దుఃఖమాయయౌ
ఆగత్యోపగతే౽నర్థం నిధాన ఇవ వర్ధనః. 19

ధనము సంప్రాప్తించి మరల పోయినపుడు వర్ధనశీలుఁడగు వైశ్యుఁడెట్లు దుఃఖించునో, అట్లే తన యుపాయము సిద్ధింపకపోవుటచేతను, ఏనుఁగు వెడలిపోవుటచేతను, ఆమావటివాఁడు మిగుల దుఃఖము నొందెను.

సో౽న్విష్యేమం గజం యత్నాద్గుల్మకాన్తరితం వనే
పయోదపిణ్డితం భోక్తుం రాహురిన్దుమివామ్బరే. 20

ఆకాశమున మేఘాచ్ఛన్నమగు చంద్రుని మ్రింగుటకై రాహువు వెదకునట్లు, ఆ మావటివాఁడంత లతాగుల్మములందు దాగుకొని, అయ్యరణ్యంబున, బ్రయత్నపూర్వకముగ నాయేనుఁగును వెదకసాగెను

చిరేణాలభతేభేన్ద్రం కస్మింశ్చిత్కాననే స్థితం
విశ్రాన్తం తం తరుతలే సమరాదివ నిర్గతమ్. 21

యుద్ధమునుండి వెడలినదానివలె నొకవృక్షముక్రింద విశ్రమించుచున్నట్టి యా గజేంద్రము నాతఁడపుడు చిరకాలమునకుఁ బొందెను.

అథ యత్ర స్థితో నాగస్తత్ర తద్బన్ధనక్షమం
పరయా రాజసామగ్ర్యా గిజలమ్పటభూమయా. 22
స ఖాతవలయం చక్రే హస్తిపః కాననే౽భితః
సర్వదిక్కం విధిర్భూమా సముద్రవలయం యథా. 23

బ్రహ్మదేవుఁడు భూమియొక్క నలుపైపుల సముద్రమను కంకణమును నిర్మించినట్లు, అటుపిదప నాతఁడా యేనుఁగున్నట్టి ప్రదేశమున, గజలోభులగు రాజుల యధిక సామగ్రిచే, దాని నలువైపుల, తద్బంధనయోగ్యమైనట్టి కందకము నొకదానిని ద్రవ్వెను.

ఉపర్యస్థగయద్వాలలతౌఘేన స తం శఠః
శూన్యతాతనుజాలేన శరత్కాల ఇవామ్బరమ్. 24

శరత్కాలమున నాకసమును మేఘసమూహము కప్పునట్లు, ఆతఁడా కందకమును కోమలములగు లతాజాలములచేఁ గప్పివైచెను.

దినైః కతిపయైరేవ వారణో విహరన్వనే
తస్మిన్నిపతితః ఖాతే శుష్కాబ్ధావివ పర్వతః. 25

కొన్ని దినములలోనే యా యరణ్యమున సంచరించుచున్నట్టి యా గజము, శుష్కించిన సముద్రమునందుఁ బర్వతమువలె నాకందకమునఁ బడిపోయెను.

వ్రజన్పర్యాకృతౌ కూపే పాతాలతలభీషణే
ఖాతకుష్యాబ్ధ్యధోభాగే గజరత్నసముద్గకే. 26

వలయాకారముగనున్న, శుష్కించిన సముద్రమును బోలిన, భయంకరమైన యా కందకము యొక్క యధోభాగమున సంచరించుచు మఱల అయ్యది శృంఖలాజాలమున బంధింపఁబడెను.

ఇతి భూయో దృఢం బద్ధస్తేన హాస్తిపకేన సః
తిష్ఠత్యద్యాపి దుఃఖేన భూసద్మని యథా బలిః. 27

ఇట్లు మావటివానిచేత దృఢముగ బంధింపఁబడిన యాగజము, పాతాళమున బలిచక్రవర్తి వలె, ఇపుడును నుండియున్నది.

అహనిష్యత్పురైవాసౌ యద్యగ్రే పతితం రిపుం
తన్నాలప్స్యత్తతో దుఃఖం గజః ఖాతనిబన్ధనమ్. 28

మొదట నే యాగజము మావటివానిని జంపియుండినచో, కందకముయొక్క బంధనమును గూర్చిన దుఃఖము బొందక యుండెడిదే.

మౌర్ఖ్యాదాగామినం కాలం వర్తమానక్రియాక్రమైః
అశోధయన్నరో దుఃఖం యాతి విన్ధ్యగజో యథా. 29

వర్తమాన క్రియాక్రమములచే నే మనుజుఁడు తన మూర్ఖత్వకారణమున ఆగామి కాలమును శోధింపకయుండునో, అట్టివాఁడు వింధ్యాచలగజేంద్రమువలె దుఃఖమును పొందును.

ముక్తోఽస్మి శస్త్రనిగడాదితి తుష్టో హి వారణః
దూరస్థోఽపి పునర్బద్ధో మౌర్ఖ్యం క్వ చ న బాధతే. 30

'శస్త్రముల బంధనమునుండి విముక్తిని బొందితి'నను జ్ఞానముచే ఆగజేంద్రము సంతుష్టిఁ జెందినదై దూరప్రదేశమున నున్నను మఱల బంధనమున దగుల్కొనెను-మూర్ఖత్వ మెచట దుఃఖ బాధను గలుగఁజేయకుండును!

మౌర్ఖ్యం హి బన్ధనమవేహి పరం మహాత్మ
న్బద్ధో న బద్ధ ఇతి చేతసి తద్విముక్త్యై
ఆత్మోదయం త్రిజగదాత్మమయం సమస్తం
మౌర్ఖ్యే స్థితస్య సహసా నను సర్వభూమిః 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూడాలోపాఖ్యానే
హాస్తిపకోపాఖ్యానం నామ ఏకోననవతితమః సర్గః ॥ 89 ॥

ఓ మహాత్మా! ఈ మూర్ఖత్వమునే పరమబంధనముగా నెఱుంగుము. మఱియు, 'నేను బద్ధుఁడను గాన'ను భావమే ముక్తిని గలుగఁజేయును. కాన, త్రివిధ (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధి

దైవిక) బంధనములచే, పరిచ్ఛిన్నమైన జగత్తును, ఈ సమస్తమును, ఆత్మమయముగా, దెలిసికొనుము. మూర్ఖత్వమున (అజ్ఞానమున) నున్న జీవుని ఆత్మయే శీఘ్రముగ సర్వబంధాదిదుఃఖ బీజములయొక్క క్షేత్రమగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున హస్తిపకోపాఖ్యానమను
నెనుబది తొమ్మిదవ సర్గము ॥89॥

---

## నవతితమః సర్గః

[మణికాచ శుభాఖ్యానతాత్పర్యమిహ విస్తరాత్
వివృణోతి పురో రాజ్ఞశ్చూడాలా కుమ్భరూపిణీ.

కుంభఋషిరూపిణియగు చూడాల శిఖిధ్వజునకు మణికాచోపాఖ్యానము యొక్క తాత్పర్యమును విస్తారముగ నిరూపించుట యిట గాననగును.]

**శిఖిధ్వజ ఉవాచ: —**

మణిసాధకవిన్ధ్యేభ బన్ధనాద్యమరాత్మజ
సూచితం యత్కథాజాలం పునర్మే ప్రకటీకురు. 1

శిఖిధ్వజుండు:— ఓ దేవపుత్రా! మణిసాధకుని యొక్కయు, వింధ్యాచలమున బంధింపఁబడిన గజేంద్రము యొక్కయు కథలను తాము పూర్వప్రసంగమున వచించియుంటిరి. వాని తాత్పర్యమును మఱల నాకుఁ దెలుపవేడెద.

**చూడాలోవాచ: —**

వాక్యార్థదృష్టేర్నివృత్త్యా హృద్గృహే చిత్తభిత్తిషు
శృణు స్వయం కథాం చిత్రాంచిత్రమున్మీలయామి తే. 2

చూడాల:— ఓ రాజా! నీహృదయమను గృహమున, చిత్తమను గోడపై విచిత్రమైన యేకథలు రేఖామాత్రమున జిత్రింపఁబడినవో, ఆ చిత్రము నిపుడు వ్యాఖ్యావర్ణ వైచిత్ర్యముచే విస్తరింపఁబోవుచున్నాను. గాన సావధానచిత్తుఁడవై వినుము.

యోఽసౌ శాస్త్రార్థకుశలస్తత్త్వజ్ఞానే త్వపణ్డితః
రత్నసంసాధకః ప్రోక్తః స త్వమేవ మహీపతే. 3

శాస్త్రమందుఁ గుశలుఁడును, గాని తత్త్వజ్ఞానమున నసమర్థుఁడును నగు యేరత్నసాధకుఁడు వచింపఁబడియుండెనో, ఆతఁడే నీవు.

తజ్జ్ఞో భవతి శాస్త్రేషు రవిర్మేరుతటేష్వివ
తత్త్వజ్ఞానే తు విశ్రాన్తో న త్వం ద్రుమదివామ్బసి. 4

సూర్యభగవానుఁడు మేరుపర్వత తటమున విశ్రమించునట్లు, నీవు శాస్త్రజ్ఞానమునఁ గుశలుడవై యున్నావు. కాని జలమందు శిలవలె తత్త్వజ్ఞానమున మాత్రము విశ్రమించలేదు.

విద్ధి చిన్తామణిం సాధో సర్వత్యాగమకృత్రిమమ్
తమన్తం సర్వదుఃఖానాం త్వం సాధయసి శుద్ధధీః. 5

ఓ సాధూ! సర్వదుఃఖ వినాశమును, స్వాభావికమునగు సర్వత్యాగమును చింతామణియని యెఱుఁగుము ఆ చింతామణినే శుద్ధబుద్ధివై నీవు సాధించుచున్నావు.

సర్వత్యాగేన శుద్ధేన సర్వమాసాద్యతేఽనఘ
సర్వత్యాగో హి సామ్రాజ్యం కిం చిన్తామణినా భవేత్. 6

పాపరహితుఁడవగు నోరాజా! శుద్ధమగు సర్వత్యాగముచే సమస్తమున్ను లభింపఁగలదు. సర్వత్యాగమే సామ్రాజ్యము. చింతామణివలన నేమగును?

సిద్ధః సర్వపరిత్యాగః సాధో సంసాధ్యతస్తవ
శర్వే కృతజగద్ఖ్యాతిర్విద్యాస్వాత్మోదయస్తథా. 7

ఓ సాధూ! బ్రహ్మ(దేవుని)పదముయొక్క యైశ్వర్యమునుగూడఁ దుచ్ఛమొనర్చునదై విద్యారూపమై, నిరతిశయానంద దాయకమై, ఆత్మజ్ఞానోదయ కారకమైనట్టి యీ సర్వపరిత్యాగము నీకు సిద్ధించినది.

సంత్యక్తం భవతా రాజ్యం సదారధనబాన్ధవమ్
బ్రహ్మణేవ జగత్సర్గవ్యాపారః స్వనిశాగమే. 8

రాత్రి యేతెంచు సమయమున బ్రహ్మదేవుఁడు తన సృష్టివ్యాపారమునంతయుఁ ద్యజించునట్లు నీవు స్త్రీ, ధన, బాంధవ సహితముగ నీ రాజ్యమును ద్యజించితివి.

స్వదేశస్యాతిదూరస్థమాగతోఽసి మమాశ్రమమ్
భువోన్తమివ విశ్రాన్త్యై వైనతేయః సకచ్ఛపః. 9

మఱియు, తాఁబేలుతోఁగూడిన గరుత్మంతుఁడు భూమియొక్క యంతమునకేగినట్లు, నీ దేశమునకు అతిదూరమున నున్న నాయాశ్రమమునకు నీవు విచ్చేసితివి.

కేవలం సర్వసంత్యాగే శేషితాహం మతిస్త్వయా
మృష్టాఖిలకలఙ్కేన స్వసత్తేవానిలేన ఖే. 10

సమస్తకళంకములను నశింపఁజేయు శరదృతువుయొక్క వాయువాకాశమున దనసత్తను మాత్రము మిగిల్చియుంచునట్లు,నీవు సర్వత్యాగముచే కేవలము అహంబుద్ధినిమాత్రము మిగిల్చియుంచితివి.

మనోమాత్రే హృదస్త్యక్తే జగదాయాతి పూర్ణతామ్
త్యాగాత్యాగవికల్పైస్త్వం ఖమమ్భోదైరివావృతః. 11

హృదయమునుండి మనోమాత్రమును ద్యజించుటచే సంపూర్ణజగత్తు పూర్ణానందమగు బ్రహ్మస్వరూపముగు నున్నది. కాని, మేఘములచే నాకసమువలె నీవు త్యాగ, అత్యాగరూప వికల్పములచే

నావరింపఁబడియున్నావు ఇట్టికారణమున బ్రహ్మానందము నీయందు భాసించుటలేదు, నిక్కముగ, ఈ త్యాగరూపమైన ఆత్మానందరూప చింతామణితప్ప, మఱియే యితర చింతామణియు లేదు.

నాయం స పరమానన్దః సర్వత్యాగో మహోదయః
కోఽప్యుచ్చైరస్య ఏవాసౌ చిరసాధ్యో మహానితి. 12

ఈ సర్వత్యాగరూపమగు మహోదయము బ్రహ్మానందము కాదనియు, అది బ్రహ్మానందము చిరకాలసాధ్యమగు గొప్పదైన మఱియేదో యన్యమేయగుననియు నీవు తలంచుచున్నావు.

చిన్తయేతి గతే వృద్ధిం సంకల్పగ్రహణే శనైః
వాత్యయేవ వనస్పన్దే త్యాగః ప్రోడ్డీయతే గతః. 13

ఇట్టి చింతచే మెల్లమెల్లగ సంకల్పగ్రహణము దృఢముకాఁగా, గొప్పవాయువుచే వనవృక్షములు లెస్సగ! జలింప పత్ర్యాదుల నిశ్చలత్వ మెగిరిపోవునట్లు, నీయొక్క సర్వత్యాగమున్ను నెగిరిపోయినది.

త్యాగితా స్యాత్కుతస్తస్య చిన్తామప్యావృణోతి యః
పవనస్పన్దయుక్తస్య నిఃస్పన్దత్వం కుతస్తరోః 14

చింతాపూర్ణుఁడగువానికి ద్యాగమెట్లుండును? గొప్పవాయువు వీచగా వృక్షముయొక్క నిశ్చలత్వ ముండునా?

చిన్తైవ చిత్తమిత్యాహుః సంకల్పేతరనామకం
తస్యామేవ స్ఫురన్త్యాం తు చిత్తం త్యక్తం కథం భవేత్. 15

దేనికి సంకల్పమని మఱియొక పేరు కలదో, అట్టి చింతనే చిత్తమని చెప్పుదురు. అట్టి చింత స్ఫురించుచుండ నీక చిత్తముయొక్క త్యాగమెట్లు సంభవించును?

చిత్తే చిన్తాగృహీతే తు త్రిజగజ్జాలకే క్షణాత్
కథమాసాద్యతే సాధో సర్వత్యాగో నిరఞ్జనః. 16

ఓ సాధూ! ముల్లోకములను జాలమున కాధారభూతమగు చిత్తము క్షణకాలమైనను చింతచే గ్రస్తమైనచో, నిరంజనమగు సర్వత్యాగమెట్లు లభింపగలదు?

సంకల్పగ్రహణేనాన్తస్త్యాగః ప్రోడ్డీయతే గతః
శబ్దసంశ్రవణేనాఙ్గ యథా గ్రామనిహఙ్గమః. 17

శబ్దమును వినుటతోడనే గ్రామమందలి పావురములు మున్నగునవి యెగిరిపోవునట్లు. అంతఃకరణముయొక్క సంకల్పమాత్రగ్రహణముచే నీ త్యాగమెచటికో యెగిరిపోయినది.

నిశ్చిన్తత్వం పరం సర్వం త్యాగ ఆదాయ తే గతః
ఆమన్త్ర్యాపూజితో జన్తుః స దుఃఖం న కరోతి కిమ్. 18

మిగుల నాదరముతో సంప్రాప్తించిన త్యాగమును, అనాదరణచేయుటచే నీ యొక్క నిశ్చింతత్వము వెడలిపోయినది. ఆమంత్రణముగావించిన పూజ్యుని బూజింపకుండుటచే జీవుఁడవశ్యము దుఃఖమునొందునుగదా.

సర్వత్యాగమణావేవం గతే కమలలోచన
తపఃకాచమణిర్దృష్టస్త్వయా సంకల్పచక్షుషా. 19

కమలనేత్రుఁడవగు ఓ రాజా! ఇట్లు సర్వత్యాగమను చింతామణి వెడలిపోఁగా నీవు సంకల్పమను నేత్రముచే తపస్సను కాచమణి (గాజుసంబంధమైన మణి)ని గాంచితివి.

త్వయా తస్మింస్తపస్యేవ దుఃఖే దృష్టిభ్రమోదితే
గ్రాహ్యైకభావనాబద్ధా జలేన్దౌ శశినో యథా. 20

దృష్టిభ్రమముచే, జలమందు, ప్రతిఫలించిన చంద్రునియందు సత్యమగు చంద్రునిగూర్చిన భావనము జనులకుఁగలిగియుండు నట్లు, నీవు దుఃఖహేతువగు తపమున గ్రాహ్యబుద్ధి కలిగియుంటివి.

అవాసనమనాసక్త్యా కృతానన్తా సవాసనా
ఆద్యస్తుమధ్యవిషమా దుఃఖాయైవ తపఃక్రియా. 21

పూర్వము వాసనారాహిత్యపూర్వకముగను, అనాసక్తిపూర్వకముగను సర్వత్యాగము ప్రారంభించి, తదుపరి యనంతమగు సవాసనాతపఃక్రియ నెయ్యది నీవు గావించితివో, అది వ్యర్థమే యగును. మఱియు, గృహధనదారాదుల త్యాగముచే నాదియందును, ఫలాసంగముచే నంతమందును, వనవాస, శీతవాతాదుల సహనముచే మధ్యమందును నతిభయంకరమైయుండుటఁబట్టి నీ యొక్క తపఃక్రియ దుఃఖముకొఱకే యగును.

అమితానందముత్సృజ్య సుసాధ్యం యః ప్రవర్తతే
మితే వస్తుని దుఃసాధ్యే స్వాత్మహా స శఠః స్మృతః. 22

అపరిమితమును, ఆత్మానందదాయకమును, సుసాధ్యమునగు సర్వత్యాగమును వదలి, పరిమితమగు తపాదులందెవఁడు ప్రవృత్తుఁడగునో, అట్టి శఠుఁడాత్మహంతకుఁడనఁబడును.

సర్వత్యాగం సమారభ్య న చైష సాధితస్త్వయా
తథా దుఃఖైకతాజ్ఞానబద్ధేన వనసద్మని. 23

(ఉపరోక్తములగు) తపోదుఃఖములతోడ ఏకత్వమునొందుటయను అజ్ఞానముచే వనమను గృహమున బంధింపఁబడినట్టి నీవు సర్వత్యాగము నారంభించియు నద్దానిని సాధింపకయుంటివి.

రాజ్యబన్ధాద్వినిష్క్రమ్య ప్రసరద్దుఃఖపూరితాత్
వనవాసాభిధైః సాధో బద్ధోఽసి దృఢబన్ధనైః. 24

దుఃఖపూర్ణమగు రాజ్యమను బంధనమునుండి వెలువడి యిపుడు నీవు వనవాసమను దృఢమైన బంధనములచే బంధింపఁబడితివి.

ద్విగుణా ఏవ తే చిన్తాః శీతవాతాతపాదయః
బన్ధనాదధికం మన్యే వనవాసమజానతామ్. 25

శీత, వాత, ఆతపాదులఁగూర్చి నీకిపుఁడు ద్విగుణమగు చింతకలదు. కావున, వనవాసము నిదివఱకనుభవింపని సుకుమారులకీ వననివాసము బంధనముకంటెను నధికమని తలంచుచున్నాను.

చిన్తామణిర్మయా ప్రాప్త ఇత్యలం బుద్ధవానసి
న లబ్ధవాన్భవాన్సాధో స్ఫటికస్యాపి ఖణ్డికామ్. 26

'నేను చింతామణిని బొందితిని'ను బూర్ణబుద్ధి నీకుఁ గలదు. కాని యథార్థముగ నీవు స్ఫటికఖండమున్నైనను బొందకయుంటివి.

ఇత్యేతదజ్ఞ మణియత్న కథాసమానం
సమ్యఙ్మయా ప్రకథితం తవ పద్మనేత్ర
తద్బోధ్యమేవమమలం స్వయమేవ బుద్ధ్వా
యద్వేత్సి తత్పరిణతిం నయ చిత్తకోశే. 27

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చిన్తామణి సాధకవృత్తాంతవివరణం నామ నవతితమః సర్గః 90॥

కమలనేత్రుఁడవగు నో రాజా! ఇవ్విధమున, కాచమణిఁ గూర్చిన కథను సమానముగ నీ యొక్క కథను బ్రయత్నపూర్వకముగ విస్తరించి చెప్పితిని. ఇఁక నీవు నేఁజెప్పినదానిననుసరించి, స్వయముగనే నీబుద్ధిచే సర్వత్యాగ, తపంబుల రెంటిలో నెద్దానిని చింతామణివలె దోషరహితముగా నెఱుంగుదువో, దానినినే నీచిత్తకోశమున నెలకొల్పి, ఫలప్రాప్తిపర్యంతో మాచరింపుము.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున చూడాలోపాఖ్యానమున చింతామణి సాధకవివరణమను తొంబదవ సర్గము ॥90॥

---

## ఏకనవతితమః సర్గః

[ఇహ విన్ధ్యేభవృత్తాన్తదార్ష్టాన్తికముదీర్యతే
కుమ్భేన రాజ్ఞశ్చరితం బోధాన్తత్యాగసిద్ధయే.

వింధ్యపర్వత గజేంద్రవృత్తాంతమునకు దార్ష్టాంతికముగ రాజుయొక్క చరిత్రము బోధపర్యంతము, త్యాగసిద్ధికొఱకై, కుంభునిచేఁ జెప్పఁబడుచుండుట యిచటఁ గాననగును.]

చూడాలోవాచ:—

ఇదానీం రాజశార్దూల వస్తుసంప్రతిపత్తయే
శృణు విన్ధ్యేభవృత్తాన్త వివృతిం స్మయకారిణీమ్. 1

చూడాల:— ఓ రాజా! ఇఁక నిపుడు, ఆత్మవస్తుబోధనముకొఱకై, ఆశ్చర్యకరమైనట్టి వింధ్యాచలగజేంద్ర వృత్తాంతముయొక్క వివరణమును వినుము.

యోఽసౌ విన్ధ్యవనే హస్తీ సోఽస్మిన్భూమితలే భవాన్
యౌ వైరాగ్యవివేకౌ తౌ ద్వౌ తస్య దశనౌ సితౌ. 2

వింధ్యపర్వతవనమున గజమువలె నీవీ భూతలముపై నివసించుచున్నావు. దానికిఁగల తెల్లని రెండు దంతములే నీయొక్క వైరాగ్య, వివేకములు.

యశ్చాసౌ వారణాక్రాన్తి తత్పరో హస్తిపః స్థితః
తదజ్ఞానం తవాక్రాన్తి తత్పరం తవ దుఃఖదమ్. 3

ఆ యేనుఁగును బట్టుకొను మావటివాఁడే, నీకు శత్రురూపమై, దుఃఖప్రదమైనట్టి అజ్ఞానము.

అతిశక్తోఽప్యశక్తేన దుఃఖాద్దుఃఖం భయాద్భయమ్
హస్తీ హస్తిపకేనేవ రాజన్మౌర్ఖ్యేణ నీయసే. 4

ఓ రాజా! నీ వాగజమువలె మిగుల ప్రబలుఁడవైనను, అజ్ఞానమను మావటివానిచే నొకదుఃఖమునుండి మఱియొకదుఃఖమునకు, ఒకభయమునుండి మఱియొకభయమునకుఁ బొందింపఁబడుచున్నావు.

యల్లోహవజ్రసారేణ వారణః పరియన్త్రితః
తదాశాపాశజాలేన భవానాపదమావృతః. 5

గొలుసుచే నాయేనుఁగు బంధింపఁబడినట్లు, నీవాపాదమస్తకము ఆశాపాశముచే బంధింపడితివి.

ఆశా హి లోహరజ్జుభ్యో విషమా విపులా దృఢా
కాలేన క్షీయతే లోహం తృష్ణా తు పరివర్ధతే. 6

ఇనుపగొలుసుకంటెను, ఆశ యింకను దృఢమై, విశాలమైనది. ఏలయనిన, కాలక్రమమున నినుపగొలుసు క్షయించిపోవునుగాని ఆశ యింకను వృద్ధినొందుచునే యుండును.

యద్ద్వద్వేఽపేక్షతే వైరీ గజమారాదలక్షితః
ప్రేక్షతే త్వాం తదజ్ఞానం క్రీడార్థం బద్ధమేకకమ్. 7

ఏకాంతస్థలమునఁ దాగుకొని యేనుఁగును నద్దాని శత్రువగు మావటివాఁడు వీక్షించినట్లు, నీయొక్క యజ్ఞానము, ఏకాంతమున బంధింపఁబడిన నిన్ను వినోదముగఁ బరికించుచున్నది.

యద్బభఞ్జ గజః శత్రోః శృఙ్ఖలాజాలబన్ధనమ్
తత్త్యాజ భవాన్భోగభూమిం రాజ్యమకణ్టకం. 8

శత్రువుయొక్క శృంఖలాజాలమును గజేంద్రము విఱుగఁగొట్టినట్లు, భూమిపై, గంటకరహితమగు రాజ్యమును నీవు త్యజించితివి.

కదాచిత్సుకరం శస్త్రశృఙ్ఖలాబన్ధభేదనమ్
నత్వస్య మనసః సాధో భోగాశావినివారణం. 9

ఓ సాధూ! ఒకపుడా యేనుఁగు శస్త్రములచే నిర్మింపఁబడిన గొలుసును విఱుగఁగొట్టి నట్లు, నీవు భోగములఁ ద్యజించితివి. కాని మనస్సుచే తద్భోగములఁ గూర్చిన యాశను నివారింపలేదు.

యదిభే పాటయత్యుచ్చైర్బన్ధం హస్తిపకోఽపతత్
త్వయి త్యజతి తద్రాజ్యమజ్ఞానం పతితం కృతమ్. 10

ఆ గజేంద్రము, తన గొప్పబంధనమును త్రెంచువేళ మావటివాడద్దానిపైఁ బడినట్లు, రాజ్యమును ద్యజించువేళ నీపై అజ్ఞానము వచ్చిపడెను.

యదా విరక్తః పురుషో భోగాశాం త్యక్తుమిచ్ఛతి
తదా ప్రకమ్పతేఽజ్ఞానం ఛేద్యే వృక్షే పిశాచవత్. 11

విరక్తుఁడగు మనుజుఁడెపుడు భోగములఁ గూర్చిన యాశను ద్యజింపనెంచునో, అపుడు ఛేదింపఁబడుచున్న వృక్షముపైఁ బిశాచమువలె, అజ్ఞానమాతనిని గంపింపజేయును.

యదా వివేకీ పురుషో భోగాన్సంత్యజ్య తిష్ఠతి
తదా పలాయతేఽజ్ఞానం ఛిన్నే వృక్షే పిశాచవత్. 12

వివేకియగువాఁడు భోగములఁ ద్యజించి యెపుడుండునో, అపుడు, వృక్షము ఛేదింపఁబడిన పిదప పిశాచము పరుగెత్తునట్లు, అజ్ఞానమాతనినుండి పలాయనమగును.

భోగౌఘే నూనమున్ముక్తే పతత్యజ్ఞానసంస్థితిః
పాదపే క్రకచ చ్ఛిన్నే కులాయస్థగతో యథా. 13

అంపముచే వృక్షము నఱకఁబడగా నద్దానిపైనున్న గూళ్లుమొదలగునవి పడిపోవునట్లు, భోగజాలమును నిశ్చయపూర్వకముగఁ ద్యజించినమీఁదట, అజ్ఞానముయొక్క స్థితియు నట్లు పడిపోవును.

యదా వనం ప్రయాతస్త్వం తదాఽజ్ఞానం క్షతం త్వయా
పతితం సన్న నిహతం మనస్త్యాగమహాసినా. 14

నీవు వనమునకేతెంచినపుడు, అజ్ఞానమును శిథిలమొనర్చితివి. కాని యపుడే మహాత్ముని నుండియైన జ్ఞానమును బొంది శుభత్యాగరూపమగు మహాఖడ్గముచే నాయజ్ఞానమును వినాశమొనర్పక యుంటివి.

తేన భూయః సముత్థాయ స్మృత్వా పరిభవం కృతమ్
తపఃప్రపఞ్చఖాతేఽస్మిన్గహనే త్వం నియోజితః 15

ఇక్కారణమున మఱల ఆయజ్ఞానము లేచినదై, నిన్నోడించి. ఈ తపస్సను లోతైన కందకమున నిన్ను బడద్రోచినది.

తద్వై వాఘాతయిష్యస్త్వం యద్యజ్ఞానం తథాగతమ్
రాజ్యత్యాగవిధౌ తత్త్వాం నాహనిష్యత్తయం గతమ్. 16

రాజ్యము వీడు సమయమున నేయజ్ఞానము నీయందుండియుండెనో, అద్దాని నపుడే జ్ఞానప్రాప్తిచే సమూలముగ నశింపఁజేసియుండినచో, అట్టి నశించిన యజ్ఞానము మఱల నిన్ను బాధింపకయుండెడిదికదా!

యత్ఖాతవలయ స్తేన వైరిణా హాస్తినః కృతః
తత్తపో దుఃఖమఖిలమజ్ఞానేన తవార్పితమ్. 17

ఆ యేనుఁగుయొక్క శత్రువు వలయాకారముగఁ గండకమును నిర్మించినట్లు, నీయొక్క యజ్ఞానము సమస్త తపోరూపదుఃఖములను నీకర్పించెను.

యా తస్య రాజరాజశ్రీర్గజారేర్నృపసత్తమ
సా త్వవజ్ఞానన్నృపతేశ్చిన్తాభ్యన్తరచారిణీ. 18

రాజోత్తమా! ఆ గజేంద్రుని శత్రువుయొక్క రాజసామగ్రి యేదికలదో, అదియే నీయజ్ఞానమను రాజుయొక్క యంతరంగమునఁ జరించు చింతయైయున్నది.

త్వం గజేన్ద్రి స్త్వయం సాధో దీర్ఘే వనేఽగజోపి సన్
అజ్ఞానవైరిణా తేన నిక్షిప్తస్తరసాభితః. 19

ఓ సాధూ! నీవు గజము కాకున్నను, అజ్ఞానమను శత్రువుచే గజమువలె నే క్షణకాలములో నివ్వనమందు నలుదెసలఁ దపోరూపకందకమున విసిరి పారవేయఁబడితివి.

యత్ఖాతవలయో బాలలతాభిరవగుణ్ఠితః
ఆవృతం తత్తపోదుఃఖమీాషత్సజ్జనవృత్తిభిః. 20

ఆకందకవలయము కోమలమైన లతలచే, గప్పఁబడినట్లు, నీయొక్క తపోదుఃఖము కొంచెము శాంత్యాది సజ్జనవృత్తులచే నావరింపఁబడియున్నది.

ఇత్యద్యాపి తపఃఖాతే దుఃఖే హ్యస్మిన్సుదారుణే
స్థితోఽసి పాతాలతలే నృప బద్ధో యథా బలిః. 21

ఇవ్విధమున. పాతాలమున బలిచక్రవర్తివలె, నీ వతిభయంకరమైన యీ తపోరూపకందకమున నేటికిని బద్ధుఁడవై పడియున్నావు.

గజస్త్వమాశా నిగడాని వైరీ
మోహో నిఖాతః పునరుగ్రబన్ధః
మహీతలం విన్ధ్య ఉదన్త ఇత్థం
త్వదీయ ఉక్తః కురు యత్కరోషి. 22

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే హస్తికాఖ్యానతాత్పర్యవివరణం
నామైకనవతితమః సర్గః॥ 91 ॥

ఓ రాజా! ఈలాగున నీవే యేనుఁగవు, ఆశయే గొలుసు అజ్ఞానమే శత్రువు, ఉగ్రతపమున గల పట్టుదలయే కందకము. ఈభూతలమే వింధ్యపర్వతము:— ఇట్లు, హస్తిపకోఖ్యానము ద్వారా నీయొక్క వృత్తాంతమును నేను దెలియఁ జేసితిని. దీని నెఱిఁగినవాడవై యిక యేది యుచితమో దాని నాచరింపుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున హస్తికోపాఖ్యాన తాత్పర్యవివరణమును
తొంబదియొకటవ సర్గము ॥ 91 ॥

---

## ద్వినవతితమః సర్గః

[ఇహ కుమ్భవచః శ్రుత్వా సర్వత్యాగపరో నృపః
త్యక్త్వా వనాదివహ్నౌ స్వం సర్వం భాణ్డమదీదహత్.

కుంభఋషి రూపిణియగు చూడాలయొక్క వాక్యములనువిని రాజు సర్వత్యాగతత్పరుఁడై వనాదులఁ ద్యజించి పాత్రాది సామగ్రినంతయు నగ్నియందు భస్మము గావించుట యిట వర్ణింపఁబడుచున్నది.]

చూడాలోవాచ:—

యదుక్తం నయశాలిన్యా తయా విదితవేద్యయా
తదా చూడాలయా జ్ఞానం తత్కస్మాన్నోరరీకృతమ్, 1

చూడాల — ఓరాజా! నీతినిపుణయు, ఆత్మజ్ఞానసంపన్నయునగు చూడాల యిదివఱకే జ్ఞానము నీకు వచించియుండెనో, దానినే నీవెందులకు స్వీకరించియుండలేదు.?

సా హి తత్త్వవిదాం ముఖ్యా యద్యద్వక్తి కరోతి చ
తత్సర్వం సత్యమేవాఙ్గ తదనుష్ఠేయమాదరాత్. 2

ఏలయనిన, ఆ చూడాల ఆత్మజ్ఞానులలో ముఖ్యురాలు. ఆమె యేదేది వచించునో, చేయునో అదియంతయు సత్యమున్ను ఆదరముతో ననుష్ఠింప యోగ్యమున్నై యున్నది.

అథ చేద్వచనం తస్యా స్త్వయా నానుష్ఠితం నృప
తత్సర్వసంపరిత్యాగః కస్మాన్న నిపుణీకృతః. 3

ఓ రాజా! ఒకవేళ ఆమె స్త్రీ యని దలంచి నీవామె వాక్యముల విశ్వసింపకయుండినచో, పోనీ స్వబుద్ధిచే నిశ్చయించిన సర్వత్యాగము (మనోబుద్ధ్యహంకారాదుల త్యాగము) నైన, యేలనీవు స్థిరమొనర్పలేదు?

శిఖిధ్వజ ఉవాచ;—

రాజ్యం త్యక్తం గృహం త్యక్తం దేశ స్త్యక్త స్తథావిధః
దారా స్త్యక్తాస్తథాప్యఙ్గ సర్వత్యాగో న కిం కృతః. 4

శిఖిధ్వజుఁడు,— మహాత్మా! నేను రాజ్యమును, గృహమును, అట్టిదేయగు దేశమును, ప్రాణప్రియయగు భార్యనుగూడఁ ద్యజించితిని. వీనిచే సర్వత్యాగము కాలేదా?

చూడాలోవాచ:—

ధనం దారా గృహం రాజ్యం భూమిశ్ఛత్రం చ బాన్ధవాః
ఇతి సర్వం న తే రాజన్సర్వత్యాగో హి కస్తవ, 5

చూడాల.— ఓరాజా ధనము రాజ్యము, గృహము, భూమి, ఛత్రము, బంధువులు ఇవన్నియు నీవికావు. అట్టిచో నీది సర్వత్యాగ మెట్లగును.

తవాస్త్యేవాపరిత్యక్తః సర్వస్మాద్భాగ ఉత్తమః
తం పరిత్యజ్య నిఃశేషమాయాస్యసి విశోకతామ్. 6

నీవు నీయొక్క సర్వోత్తమభాగము (మనస్సు, లేక, అహంకారము) నింకను బరిత్యజించలేదు, దానిని బరిత్యజించి దుఃఖరాహిత్యమును బొందుము.

శిఖిధ్వజ ఉవాచ:—

రాజ్యం చేన్మమ నో సర్వం తత్సర్వం వనమేవ మే
శైలవృక్షాదిగుల్మాఢ్యం తదప్యేతత్త్యజామ్యహమ్. 7

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! ఇపుడు రాజ్యాదులన్నియు నావికానిచో, ఈవనమే నాయొక్క సర్వస్వమై యున్నదిగాన పర్వత వృక్షలతాదులచేఁ బూర్ణమగు నివ్వనమును గూడ నేనుద్యజించుచున్నాను.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇతి రామ వదన్నేవ కుమ్భవాక్యప్రణోదితః
నిమేషాన్తరమాత్రేణ వశీ వీరః శిఖిధ్వజః. 8
ప్రమమార్జ వనాస్థాం తాం కృతః సుదృఢనిశ్చయః
ప్రావృడోఘస్తటగతాం రజోలేఖామివాత్మనా. 9

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఇట్లు వచించుచు, కుంభఋషివాక్యములచేఁ బ్రేరితుఁడై నట్టి, జితేంద్రియుఁడును, వీరుఁడునగు శిఖిధ్వజుఁడు దృఢనిశ్చయుఁడై, వర్షప్రవాహము తీరమందున్న ధూళినిదుడిచి వేయునట్లు, నిమిషమాత్రమున నే తన వననివాసమందలి ప్రీతిని దుడిచివైచెను.

శిఖిధ్వజ ఉవాచ:—

సవృక్షాద్రి వనశ్వభ్రాద్విపినాదపి వాసనా
పరిత్యక్తా మయా నూనం పరిత్యాగః స్థితో మమ. 10

శిఖిధ్వజుఁడు:—మహాత్మా! వృక్ష, పర్వత, వన, గర్తాదులతోఁగూడిన నియ్యరణ్యమును గూర్చిన వాసననుగూడ నేనిపుడ నిక్కముగ వదలివేసితిని. కావున నిపుడునాకు సర్వత్యాగము సిద్ధించినదిగదా!

కుమ్భ ఉవాచ:—

అద్రేస్తటం వనం శ్వభ్రం సలిలం పాదపస్థలమ్
ఇత్యాది తవ నో సర్వం సర్వత్యాగః కథం తవ. 11

కుంభుఁడు.— ఓ రాజా! పర్వతతటము, వనము, గర్తము, ఉదకము, వృక్షము, స్థలము, మున్నగునవన్నియు వనమునకు సంబధించినవేగాని నీవికావు. అట్టిచో వానిని త్యజించుటచే నీకు సర్వత్యాగమెట్లు సిద్ధించినదగును?

తవాస్త్యేవాపరిత్యక్తః సర్వస్మాద్భాగ ఉత్తమః
తం పరిత్యజ్య నిఃశేషం పరామాయాస్యశోకతామ్. 12

నీయొక్క యన్నింటికంటె నుత్తమమైన భాగము నింకను నీవు వీడకయున్నావు. అద్దానిని బూర్ణముగఁద్యజించి శోకరాహిత్యమును బడయుము.

శిఖిధ్వజ ఉవాచ:—

ఏతచ్చేన్మమ నో సర్వం తత్సర్వం స్వాశ్రమో మమ
వాపీస్థలోటజయుత స్తమేవాశు త్యజామ్యహమ్. 13

శిఖిధ్వజుఁడు:— ప్రభూ! ఈ వనాదులు నావికానిచో, వాపీస్థలకుటీరాదులతోఁగూడిన ఈ యాశ్రమమే నా సర్వస్వమైయున్నదిగాన, దీనిని గూడ శీఘ్రముగఁ ద్యజింపుచున్నాను.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇతి రామ వదన్నేవ కుమ్భవాక్యప్రబోధితః
నిమేషధ్యానమాత్రేణ వశీ వీరః శిఖిధ్వజః. 14
ప్రమమార్జాశ్రమాస్థాం తాం సంవిదా శుద్ధయా హృది
స్ఫురన్తీం స్ఫురణేనైవ రజోలేఖామివానిలః. 15

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు పలుకుచు, కుంభఋషివాక్యములచేఁ బ్రబోధితుఁడైనట్టి, జితేంద్రియుఁడును, వీరుఁడునైన శిఖిధ్వజుఁడు - కించిన్మాత్రమగు స్ఫురణము చేతనే ధూళిసమూహమును వాయువు తుడిచివైచునట్లు - హృదయమందు స్ఫురించినట్టి యాశ్రమమందలి ప్రీతిని క్షణకాలధ్యానముచేతనే త్యజించివైచెను.

శిఖిధ్వజ ఉవాచ:—

స వృక్షోటజ వీరుత్కాద్వాసనా స్వాశ్రమాదపి
పరిత్యక్తా మయా నూనం సర్వత్యాగః స్థితో మమ. 16

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! వృక్ష, కుటీర, లతాదిసహితమగు ఈ నాయాశ్రమమును గూర్చిన వాసనను గూడ నిపుడు నేను వదలివేసితిని. కాఁబట్టి నిక్కముగ నిపుడు నాకు సర్వత్యాగము సిద్ధించినదిగదా!

కుమ్భ ఉవాచ:—

వృక్షో వాపీ స్థలం గుల్మముటజం వ్రతతీవృతిః
ఇతి కించిన్న తే సర్వం సర్వత్యాగః కుత స్తవ. 17

కుంభుఁడు:— ఈ వృక్ష, కుటీ, వాపీ, స్థల, గుల్మ, లతాదులెవ్వియు నీసర్వస్వము కానేరవు. అట్టిచో వానిఁ త్యజించుటచే నీకు సర్వత్యాగమెట్లు సిద్ధించినదగును?

తవాస్త్యన్యోఽపరిత్యక్తః సర్వస్మాద్భాగ ఉత్తమః
తం పరిత్యజ్య నిఃశేషం పరామాయాస్యశోకతాం. 18

పరిత్యజింపఁదగిన నీయొక్క యన్నింటికంటె నుత్తమమైన భాగము (మనస్సు, లేక, అహంకారము) నింకను నీవు వీడకయున్నావు. అద్దానిని నిశ్శేషముగఁ ద్యజించి దుఃఖరాహిత్యమును బొందుము.

శిఖిధ్వజ ఉవాచ:—

ఏతచ్చేన్మమ నో సర్వం తత్సర్వం భజనాది మే
చర్మకుడ్యకుటీరాది తత్తావత్సంత్యజామ్యహమ్. 19

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! అవి యన్నియు నావికానిచో, ఈ నాయజ్ఞపాత్రాదులు చర్మము, కుడ్యము, కటీరము మున్నగువాని యన్నింటిని ద్యజించుచున్నాను.

శ్రీవసిష్ఠ ఉవాచ;—

ఇత్యుక్త్వా స సముత్తస్థావవిక్షుబ్ధమతిః శమీ
విష్టరాదవదాతాత్మా శృఙ్గాదివ శరద్ఘనః. 20

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు పల్కి, శాంతుఁడును, శుద్ధచిత్తుఁడును, జితేంద్రియుఁడునైన అరాజు, పర్వతశిఖరమునుండి శరత్కాలమేఘమువలె, తనయాసనముపై నుండిలేచెను.

కుమ్భస్త్వాలోకయన్నేవ తత్క్రియాః సస్మితః స్వయం
ఆసనే లోకకార్యేషు స్వస్యన్దన ఇవాంశుమాన్. 21

తన రథముపైనుండి జగత్క్రియలను సూర్యుఁడు వీక్షించునట్లు, కుంభఋషి (చూడాలయు) నాతని క్రియలన్నింటినిఁ దనయాసనముపైనుండి చూచుచుండెను.

యత్కరోతి కరోత్యేతదస్యైతత్పావనం పరం
ఇతి తూష్ణీం స్థితః కుమ్భః శిఖిధ్వజమవైక్షత. 22

ఈతఁడేమి చేయునో, చేయనిమ్ము. ఏలయనిన, ఇదియే యీతనికిఁ బరమపావనమైనదని, యిట్లు విచారించి కుంభుఁడు మెదలకయుండి శిఖిధ్వజుని, గాంచుచుండెను.

శిఖిధ్వజస్తు తత్సర్వం భాణ్డోపస్కరమాశ్రమాత్
ఏకత్రైవానయామాస భువో వార్యబ్ధిభూరివ. 23

సముద్రము క్రిందనున్న భూమి వర్షాదులవలనఁ గలిగిన భూజలము నొకచోఁ జేర్చునట్లు, అత్తఱి శిఖిధ్వజుఁడు తన యజ్ఞపాత్రాది సామగ్రియంతయు నాశ్రమమునుండి బయటకుఁ దీసికొనివచ్చి యొకచోటఁ జేర్చియుంచెను.

తత్సంస్థాప్యేన్ధనైః శుష్కైర్జ్వాలయామాస పావకం
కరైః సంచారవానర్కః సూర్యకాన్తపదం యథా. 24

నృపోఽగ్నావమ్బుధేర్వాతో దవవహ్నివివాచలాత్

ఓ రామచంద్రా! ఇట్లు పల్కి, యా రాజు తన రెండు చేతులతో దర్భాసనము పైనుండి మృగ చర్మమును దీసి, ప్రళయవాయువు సముద్రమునుండి పర్వతములఁదీసి దావాగ్నియందు, బడద్రోయునట్లు, అగ్నియందుఁ బడవైచెను.

మహావృత్తేన భవతా త్వయా వారి ధృతం మమ. 32
సాధో కమణ్డలో సమ్యక్ న తే ప్రతికృతం కృతం
సౌహార్దస్య మనోజ్ఞస్య సౌజనస్యాస్థిరస్య చ. 33
సాధుత్వస్య చ సర్వస్య త్వమేవ పరమాస్పదం
యేనైవ వహ్నినా దేహం సంశోధ్యాభ్యాగతోఽసి మామ్. 34
తేనైవ గచ్ఛ హే మిత్ర పన్థానః సన్తు తే శివాః

పిదప, కమండలువును గూర్చి యిట్లు వచించెను — ఓ సాధూ! సుందరమైన యాకృతిఁగలిగిన నీవు నాకొఱకై జలమును లెస్సగ ధరించియుంటివి. ఈ నీయుత్తమ మిత్రత్వమునకును, స్థిర సౌజన్యమునకును. గొంచెమైనఁ బ్రత్యుపకారము నేఁజేయలేదు. ప్రియమగు నోజలపాత్రమా! సాధుత్వమంతటికిని నీవే పరమాస్పదమై వెలయుచున్నావు. కాన నేయగ్నిచే నీవు నీదేహమును శుద్ధమొనర్చుకొని నాయొద్దకు వచ్చితివో, అట్టి యగ్నివలననే మరల శుద్ధిబొంది చనుము. మిత్రమా! ఈ మార్గము నీకు మంగళకరమగుఁగాక!

ఇత్యుక్త్వా శ్రోత్రియాయైవ కమణ్డలుమదాత్తదా. 35
అగ్నయే మహతే వాపి దాతవ్యం సాధు యద్భవేత్

ఓ రామచంద్రా! ఇట్లు వచించినవాఁడై యాతఁడా కమండలువు అగ్నియందు శుద్ధముగావించి, ఏశ్రోత్రియుఁడగు బ్రాహ్మణుని నుండి దానిఁగైకొనెనో, ఆతనికే తిరిగిదాని నిచ్చివైచెను:— ఏలయనిన, సానుగ్రహణయోగ్యమగు, పాత్రాదులనగ్నికిఁ గాని, మహాత్ములకుఁగాని యివ్వవలెను.

మూర్ఖస్యేవ మతిర్గుప్తే నిత్యమేవ పతస్యధః. 36
ఉచితా తే గతిఃసైవ బృసీకే భస్మతాం వ్రజ
ఇత్యుక్త్వాదాయ బృసీకామగ్నావేవ స మృద్వికాం. 37

పిమ్మట నాతఁడు తన దర్భాసనముఁగూర్చి యిట్లు పలికెను — ఓ యాసనమా! మూర్ఖుని బుద్ధి నిత్యము పాపమొనర్చుటకై యధోదిశకెట్లు చనుచుండునో, అట్టి యధోగతియే నీ కుచితమైనది కాన నోయాసనమా! నీవు భస్మమైపొమ్ము — అని యిట్లు చెప్పుచు తన కోమలయాసనమును నగ్నియందు వదలివేసెను.

శుద్ధ్యర్థమాసనార్థం వై చితి తత్యాజ భాసురే

చిత్తశుద్ధికొఱకు, చైతన్యమగు బ్రహ్మమున విశ్రాంతినొందుటకొఱకును ఇట్లాతఁడా పదార్థములన్నిఁటిని ప్రజ్వలించుచున్న యగ్నియందుఁ బడవైచెను.

యత్త్వాజ్యమచిరేణైవ త్యక్తవ్యం కిల తత్సదా. 38
విస్తరః క్రియతే సద్భిరుపాదేయ ఇతి స్థితిః
శీఘ్రమగ్నావిదం సర్వం భాణ్డజాతం త్యజామ్యహం. 39
ఏకవారం దహత్వగ్నిర్దాహ్యం భవతి తుష్టయే

మఱియు కుంభునిగూర్చి యిట్లనెను— గ్రహణయోగ్యములైన పాత్రాద్యుపకరణములు విద్యమానములైయున్నచో, అట్టి యుపాదేయవస్తువులందు సత్పురుషులు విస్తారము గావించుట యనునదిలోకస్థితియైయున్నదిగాన నేను వానినన్నింటిని నగ్నియందు శీఘ్రముగఁ బడవేయుచున్నాను. అంతేగాక, దహింపఁజేయఁదగిన వస్తువు లెవ్వేలవో వాని నొకేసారిగా నగ్ని జ్వలింపఁజేసినచో నాకు సంతుష్టియగును

సాధో క్రియోపకరణం నిష్క్రియాయ త్యజామ్యహమ్
న ఖేదస్తత్ర కర్తవ్యో నన్వయోగ్యం బిభర్తి కః. 40

దేవపుత్రుఁడవగు నోసాధూ! నేను నిష్క్రియుఁడ నగుటకొఱకే యీపాత్రాద్యుపకరణములన్నిటిని నగ్నియందు వైచుచున్నాను. దీనిచేఁ దాము ఖేదము నొందరాదు. ఏలయనగా లోకమునందెవఁడు అయోగ్యములగు వస్తువుల ధరించును?

ఇత్యుక్తవాన్ఝటితి భోజనభాజనాద్యం
సర్వం జుహావ వనవాస విలాసయోగ్యమ్
తద్భాణ్డజాలమనలే సమమేవ రాజా
కల్పాన్తతేజసి జగజ్జ్వలతీవ కాలః. 41

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ సర్వత్యాగకరణం నామ ద్వినవతితమః సర్గః ॥ 92 ॥

ఓ రామచంద్రా! శిఖిధ్వజుఁ డిట్లు పలికి, కల్పాంతమునాఁటి ప్రజ్వలితాగ్నియందు జగత్తును కాలము హోమమొనర్చునట్లు, తన సమస్త భోజనపాత్రాది సామాగ్రినంతయు శీఘ్రముగ నొకేకాలమునఁ బ్రదీప్తాగ్నియందు హోమము గావించెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలోపాఖ్యానమున సర్వత్యాగకరణమను
దొంబదిరెండవ సర్గము ॥92॥

## త్రినవతితమః సర్గః

[దగ్ధోపకరణం దేహం త్యక్తుకామః శిఖిధ్వజః
వినివార్యాత్ర కుమ్భేన చిత్తత్యాగాయ బోధ్యతే.

సామగ్రినంతయును జ్వలింపఁజేసి, త్యక్తుకాముఁడగు శిఖిధ్వజుఁడు తుదకుఁ దన దేహమును గూడ నగ్నియందు హోమింప నుద్యుక్తుఁడు కాఁగా అపుడు కుంభుఁడు నివారించుట, మఱియు, చిత్తత్యాగముకొఱకై బోధించుట మున్నగు సంగతు లిటగలవు.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

అథోత్థాయ దదాహాసౌ శుష్కం తత్తృణమన్దిరమ్
అజ్ఞేన స్వేన మనసా వృథా సంకల్పకల్పితమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అటుపిమ్మట లేచి, శిఖిధ్వజుఁడు, అజ్ఞానయుక్తమగు మనస్సుయొక్క సంకల్పముచే వ్యర్థముగఁ గల్పింపఁబడినట్టి, తన యా శుష్కతృణ మందిరమును గూడ నగ్నిచేఁ గాల్చివై చెను.

శిష్టం యత్కించిదభవత్తత్సర్వం స శిఖిధ్వజః
అసంరబ్ధమనా మానీ క్రమేణ సమయా ధియా. 2

దదాహ చ స చిక్షేప తత్యాజ చ బభఞ్జ వా
భాణ్డజాతం స్వవసనం భోజనాద్యపి తుష్టవత్. 3

ఇఁక నేయే పదార్థములు మిగిలియుండెనో, వానినన్నింటినిగూడ, శాంతచిత్తుఁడును, నగు నా శిఖిధ్వజుఁడు క్రమముగ జ్వలింపఁజేసెను, విసరివైచెను, త్యజించెను, విఱుగఁగొట్టెను. — వేయేల, ప్రసన్నచిత్తుఁడై యాతఁడు తన భోజన పదార్థములను, పాత్రసమూహమును, చీరవల్కలాది వస్త్రములనుగూడఁ ద్యజించివైచెను.

స బభూవాశ్రమస్తస్య దృష్టనష్టజనస్థితిః
వీరభద్రబలధ్వస్తదక్షయజ్ఞాశ్రమోపమః. 4

ఎద్దానియందిదివఱకనేకజనులు గన్పట్టుచుండిరో, కాని లేఁది యిపుడు విలీనమైపోయెనో, అట్టి యా రాజుయొక్క యాశ్రమమపుడు, వీరభద్రుని బలముచే నాశముగావింపఁబడిన దక్షుని యజ్ఞాశ్రమమువలె, గానుపించుచుండెను

ఆశ్రమాత్తే మృగగణాస్త్యక్తరోమన్థముద్యయుః
సాగ్నిదాహాత్పురవరాద్భీతభీతజనా ఇవ. 5

అగ్నిచే దహింపఁబడుచున్న శ్రేష్ఠనగరమునుండి జనులు భయభీతులై పరువిడునట్లు, ఆ యాశ్రమమువద్ద తృణాదుల భక్షించి నెమరువేయుచున్నట్టి మృగసమూహము లాయగ్నిదాహముఁజూచి యపుడు పరుగిడిపోయెను.

భాణ్డజాతందహత్యగ్నౌ సహాశుష్కేన్ధనేన తత్
కేవలాకృతిరస్నేహాస్తిష్ఠమానాహ భూపతిః. 6

ఎండిన చిదుగులచే నగ్ని పాత్రాదులన్నిటిని భస్మమొనర్చుచుండ నత్తఱి స్నేహశూన్యమగు శరీరమాత్రావశిష్టుఁడైన యా రాజు ప్రసన్నచిత్తుఁడై యిట్లు పలికెను.

శిఖిధ్వజ ఉవాచ: —

వాసనాం తత్ర సంత్యజ్య సర్వత్యాగీ స్థితో హ్యహమ్
అహో ను చిరకాలేన దేవపుత్ర ప్రబోధితః. 7

శిఖిధ్వజుఁడు:— దేవపుత్రా! ఆహా! చిరకాలమునకు తామీ జ్ఞానమును నా కొసంగితిరి. నేనిపుడు సమస్త పదార్థములందును మమత్వమును వదలి సర్వత్యాగినై స్థితినొంది యున్నాఁడను.

సంపన్నః కేవలం శుద్ధః సుఖేనోద్బోధవానహం
కిం నామ కిల వస్త్వేతద్భవేత్సాంకల్పికక్రమమ్. 8

ఇపుడు నేను కేవలము శుద్ధుఁడ, సులభముగఁ ప్రబోధమునొందినవాఁడనై, యున్నాఁడను. ఈ ప్రపంచమందలి సమస్త పదార్థములు మమత్వముచేఁ గల్పింపఁబడినవై తుచ్ఛములై పరగుచున్నవి.

యావద్యావత్ప్రహీయన్తే వివిధా బన్ధహేతవః
తావత్తావత్సమాయాతి పరమాం నిర్వృతిం మనః. 9

ఏయే ప్రకారముగ వివిధబంధనములయొక్క హేతువులు నశించుచుండునో, ఆయా ప్రకారముగ మనస్సు పరమశాంతిని బొందుచుండును.

శామ్యామి పరినిర్వామి సుఖితోఽస్మి జయామ్యహం
విబన్ధాః ప్రక్షయం యాతాః సర్వత్యాగో మయా కృతః. 10

మహాత్మా! నేనిపుడు శాంతుఁడనై, సర్వదా తృప్తుఁడనై, సర్వులకంటె నధికముగ సుఖవంతుఁడనై యొప్పుచున్నాను. ఏలయనిన, నా వివిధబంధనములన్నియు నశించినవి. ఇపుడు నేను సర్వత్యాగ మాచరించినాను.

దిగమ్బరో దిక్సదనో దిక్సమోఽయమహం స్థితః
దేవపుత్ర మహాత్యాగాత్కిమన్యదవశిష్యతే. 11

ఓ దేవపుత్రా! ఇపుడు నేను దిగంబరుఁడనై, దిక్కులే భవనముగఁ గలవాఁడనై, దిక్కులవలెనే యుండియున్నాను. ఇట్టి మహాత్యాగమున కన్యముగ నింకెయ్యది శేషించియున్నదో తామిపుడు తెలుపవేడెద.

కుమ్భ ఉవాచ:—

సర్వమేవ న సంత్యక్తం త్వయా రాజన్ శిఖిధ్వజ
సర్వత్యాగపరానన్దే మా ముధాభినయం కురు. 12

కుంభుఁడు:- ఓ రాజా! శిఖిధ్వజా! నీవింకను సంతయుఁ ద్యజింపలేదు. సర్వత్యాగము చేతనే పరమానందము కలుగును. వ్యర్థముగ సర్వత్యాగమును గూర్చిన యీయభినయమును గావింపకుము.

తవాస్త్యేవాపరిత్యక్తః సర్వస్మాద్భాగ ఉత్తమః
యం పరిత్యజ్య నిఃశేషం పరామాయాస్యశోకతామ్. 13

ఇఁకను నీయొక్క సర్వోత్తమమైన భాగము త్యజింపఁబడకనే యున్నది. అద్దానిని బూర్ణముగఁ ద్యజించినచో నీవు దుఃఖరహితస్థితిని బొందగలవు.

శ్రీవసిష్ఠ ఉవాచ;—

ఇతి శ్రుతవతా తేన కించిత్సంచిన్త్య భూభృతా
ఇదముక్తం మహాబాహో రామ రాజీవలోచన. 14

శ్రీ వసిష్ఠుఁడు.— కమలనేత్రుఁడవును, మహాబాహుఁవునగు నో రామచంద్రా! ఈవాక్యములు వినినతరువాత రాజొకింత విచారించి యిట్లనుడివెను.

శిఖిధ్వజ ఉవాచ:—

ఇన్ద్రియవ్యాలసంఘాతో రక్తమాంసమయాకృతిః
శిష్యతే సర్వసంత్యాగే దేహో మే దేవతాత్మజ. 15
తదుత్థాయ పునర్దేహం భృగుపాతాదవిఘ్నతః
వినాశాత్మకతాం నీత్వా సర్వత్యాగీ భవామ్యహమ్. 16

శిఖిధ్వజుఁడు:— ఓ దేవపుత్రా! ఇంద్రియములను సర్పసమూహముతోఁ గూడుకొనినదై రక్తమాంసాదిమయమగు ఆకృతిగల యీ నాదేహముమాత్ర మింకను సర్వత్యాగమున మిగిలియున్నది; కావున, లేచి నిర్విఘ్నముగ దీనినగ్నియందు బడవైచి భస్మమొనర్చి, సర్వత్యాగి యగుదును.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా దేహమగ్రస్థే శ్వభ్రే త్యక్తుమసౌ జవాత్
కరోతి యావదుత్థానం తావత్కుమ్భోఽప్యువాచ హ. 17

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు వచించినవాఁడై యెదుటనున్న యగ్నిగుండమునఁ దుముకుటకై రాజు వేగముగ లేవ, నింతలో కుంభఋషి యిట్లు పలికెను.

కుమ్భ ఉవాచ;—

రాజన్కిమితి దేహం త్వం నిరాగస్కం మహావటే
త్యజస్యజ్ఞో హి వృషభః కుపితో హన్తి తర్ణకమ్. 18

ఓ రాజా! నిరపరాధియగు ఈదేహము నేల నీవీ గొప్పయగ్నియందుఁ బడవైచెదవు? ఈ నీకార్యము, తెలివిలేని యెద్దు కోపమొంది తన దూడను జంపినట్టుగ నున్నది.

జడో వరాకో మూకాత్మా తపస్వీ దేహకో హ్యయమ్
న కశ్చన తవైతస్మిన్నా ముధైవ తనుం త్యజ. 19

జడమై, దీనమై, మూగదియై తపస్వియైనట్టి పాపమీదేహము నీకేయపరాధమున్ను జేసియుండలేదు. కావున దీనిఁ ద్యజింపకుము.

ఆత్మన్యేవైష మూకాత్మా ధ్యానవానవతిష్ఠతే
సంచాల్యతే పరేణేవ తరఙ్గేణేవ కాష్ఠకమ్. 20

ఈ దేహము తనయందుఁదాను మౌనముగా ధ్యానమున నెలకొనియున్నది. మఱియు, తరంగముచే కాష్ఠమువలె నింకొకదానిచే నది చలింపఁజేయఁబడుచున్నది.

క్షోభయత్యన్య ఏవైనం నిగ్రహార్హో ముహుర్బలాత్
తపస్వినం యథైకాన్తం సంస్థితం మత్తతస్కరః. 21

ఏకాంతవాసియగు తాపసిని మదించిన చోరుఁడు బాధించునట్లు, దండనయోగ్యుడగు మతియొక్కఁడే దీనిని మాటిమాటికి బలవంతముగ క్షోభఁబెట్టుచున్నాఁడు.

సుఖదుఃఖాదిభూత్యా హి నాపరాధి శరీరకమ్
నాత్మనః ఫలవానాత్మస్పన్దే వృక్షోఽపరాధవాన్. 22

వాయువుయొక్క చలనముచే ఫలవృక్షమునుండి ఫలములురాలిననో, అందులకు వృక్షమపరాధిగానట్లు సుఖదుఃఖముల యుత్పత్తికి స్థానమాత్రమగుటచే దేహ మపరాధి కానేరదు.

వాతః ఫలశిరఃపుష్పపాతనం కురుతే స్ఫురన్
తరుణా సాధునా సాధోరపరాద్ధం కిమాత్మనః. 23

ఓ సాధూ! చలించునట్టి వాయువు వృక్షముయొక్క ఫల, పుష్ప, పత్రాదులఁ బడఁగొట్టుటఁబట్టి యదియే యపరాధియగును గాని, దీనమగు వృక్షముగానట్లు. ఇచటను శరీరమును జలింపఁజేయునదే యపరాధిగాని శరీరముకాదు.

త్యక్తేనాపి శరీరేణ కిల తామరసేక్షణ
సర్వత్యాగో న తే యాతి నిష్పత్తిం విషమో హి సః. 24

కమలనేత్రుఁడవగు నో రాజా! శరీరమును ద్యజించినను సర్వత్యాగము ప్రాప్తింపనేరదు. ఏలయనిన, మరణానంతరము మరల జ్ఞానమున కధికారియగు దేహము ప్రాప్తించుట దుర్లభమగుటఁబట్టి సర్వత్యాగము జన్మాంతరమునఁగూడ దుస్సాధ్యమైనదే యగును.

భృఙ్గా కేవలమేతత్త్వం నిరాగస్కం శరీరకమ్
ముధా క్షిపసి నో దేహత్యాగే తత్త్యాగితా భవేత్. 25

కేవల మగ్నియందు దీనినిరపరాధియగు దేహమును వ్యర్థముగఁ ద్యజించుచున్నావు. ఇట్లు దీని, త్యజించుటచే నీకు సర్వత్యాగిత్వము సిద్ధింపదు

యేనాయం క్షోభ్యతే దేహో మత్తేభేనేవ పాదపః
తత్సంత్యజసి చేత్పాపం తన్మహాత్యాగవాన్భవాన్. 26

మదపుటేనుఁగు వృక్షమును జలింపజేయునట్లు, దేనిచే ఈ దేహము క్షుభితమగుచున్నదో, అట్టి పాపమును త్యజింతువేని యపుడు మహాత్యాగవంతుఁడవగుదువు.

తస్మింస్త్యక్తే భవేత్త్యక్తం సర్వం దేహాది భూపతే
నోచేన్నిమగ్నమప్యేతస్యాభూయోభూయః ప్రరోహతి. 27

ఓ రాజా! దానిని త్యజించుటచే ఈ దేహాదులు మరల నుత్పన్నముగానేరవు. అద్దానిని త్యజింపక, అగ్ని, జలాదులం దీదేహమును వశింపఁజేసినప్పటికి మరల మరల యది యుద్భవించుచునే యుండును.

శిఖిధ్వజ ఉవాచ: —

కేనాయం చాల్యతే దేహః కిం బీజం జన్మకర్మణామ్
కస్మింస్త్యక్తే పరిత్యక్తం సర్వం భవతి సున్దర. 28

శిఖిధ్వజుఁడు:— సుందరుడవగు నో దేవపుత్రా! ఈ దేహము దేనిచేఁ జలింపఁజేయఁబడుచున్నది ? జన్మకర్మముల బీజమేది ? ఎద్దానిని త్యజించుటచే నంతయుఁ త్యజింపబడినదగుచున్నది ?

కుమ్భ ఉవాచ: —

సాధో న దేహత్యాగేన న రాజ్యత్యజనేన చ
న చోటజాదిశోషేణ సర్వత్యాగో భవేన్నృప. 29

కుంభుడు:— ఓ సాధూ ! దేహమును త్యజించుటచేతను, రాజ్యాదులను వదలుటవలనను, లేక, కుటీరాదులను దగ్ధమొనర్చుటచేతను సర్వత్యాగము కానేరదు.

యత్సర్వం సర్వతో యచ్చ తస్మిన్సర్వైకకారణే
సర్వస్మిన్సంపరిత్యక్తే సర్వత్యాగః కృతో భవేత్. 30

కాని, ఏది యంతయునైయున్నదో, ఏది, నలుదెసల వ్యాపించియున్నదో ఏది సమస్తమునకు గారణమైయున్నదో అద్దానిని మనస్సును, వాసనను, లేక అహంకారమును సంపూర్ణముగఁద్యజించుటచే సర్వత్యాగమగును.

శిఖిధ్వజ ఉవాచ: —

సర్వం సర్వగతం సర్వహేయం త్యాజ్యం చ సర్వదా
సర్వం కిముచ్యతే బ్రూహి సర్వతత్త్వవిదాంవర. 31

శిఖిధ్వజుఁడు:— సర్వతత్త్వవేత్తలలో శ్రేష్ఠుఁడవగు నోదేవపుత్రా ! సర్వరూపమై, సర్వవ్యాపకమై, సర్వదా త్యాజ్యమైనట్టిది యేదియో దయచేసి నాకుఁదెలుప వేడెద.

కుమ్భ ఉవాచ:—

సాధో సర్వగతాకారం జీవప్రాణాదినామకమ్
న జడం నాజడం భ్రాన్తం చిత్తం సర్వమితి స్మృతమ్. 32

కుంభుఁడు:—— ఓ సాధూ! సర్వగతమగు యాకృతిగల్గి, జీవ, ప్రాణాది నామములుగలదై, జడముగాని, చేతనముగాని కానిదై, భ్రమశీలమైనట్టి యీ చిత్తమే సమస్తమని వచింపఁబడుచున్నది.

చిత్తమేవ భ్రమం విద్ధివిద్ధి చేతో నరం నృప
చిత్తం విద్ధి జగజ్జాలం చిత్తం సర్వమితి స్మృతమ్. 33

ఓ రాజా! చిత్తమునే నీవు భ్రమయని యెఱుంగుము. చిత్తమే మనుజుఁడని తెలిసికొనుము. చిత్తమే జగజ్జాలమని నమ్ముము. చిత్తమే సమస్తమనియుఁజెప్పఁబడినది.

రాజ్యాదేరథ దేహాదేరాశ్రమాదేర్మహీపతే
సర్వస్యైవ మనోబీజం తరుబీజం తరోరివ 34

ఓ రాజా! వృక్షమునకుఁ గారణము వృక్షబీజమైనట్లు, రాజ్యాదులకును, దేహాదులకును, ఆశ్రమాదులకును, సమస్తమునకును మనస్సే బీజమై (కారణమై) యున్నది.

సర్వస్య బీజే సంత్యక్తే సర్వం త్యక్తం భవత్యలమ్
సంభవాసంభవాద్భూప సర్వత్యాగో భవేదితి. 35

ఓ రాజా! సమస్తమునకు బీజమగు ఆ మనఁబును పూర్ణముగఁ ద్యజించుటచే, సర్వము లెస్సగఁ ద్యజింపఁబడినదగుచున్నది. కాన నపుడే సర్వత్యాగము సంభవమగును. అట్లు, దానిద్యజింప కున్నచో సర్వత్యాగ మసంభవమే యగును.

సర్వధర్మా అధర్మా వా రాజ్యాది విపినాది వా
సచిత్తస్య పరందుఃఖం నిశ్చిత్తస్య పరం సుఖమ్. 36

సమస్తధర్మాధర్మములుగాని, రాజ్యాదులు గాని, వన, తపశ్చర్యాదులుగాని చిత్తసహితునకుఁ గేవలము దుఃఖరూపములే యగును. చిత్తరహితునకవియన్నియూ సుఖరూపములగును.

ఇత్థం వివర్తతే సర్వం చిత్తమేవ జగత్తయా
దేహాద్యాకారజాలేన బీజం వృక్షతయా యథా. 37

బీజము వృక్షరూపమునఁ బరిణామమొందునట్లు, ఈ చిత్తమున్ను సమస్తజగద్రూపముననూ, దేహాదిసమూహరూపమునను బరిణామమొందుచున్నది.

పాదపః పవనేనేవ భూకమ్పేనేవ పర్వతః
భస్త్రా భస్త్రా భరేణాయం దేహశ్చిత్తేన చాల్యతే. 38

వాయువుచే వృక్షమున్ను, భూకంపముచేఁ బర్వతమున్ను, కమ్మరివానిచేఁ గొలిమితిత్తియు జలింపఁబడునట్లు, చిత్తముచే ఈ శరీరమున్ను జలింపఁబడుచున్నది.

సర్వభూతోపభోగానాం జరామరణజన్మనాం
మహామునీనాం సుదృఢం చిత్తం విద్ధి సముద్గకమ్. 39

ఓ రాజా! సమస్తప్రాణుల భోగములయొక్కయు, దేహధర్మములగు జరామరణాదులయొక్కయు, మునుల శమదమాది సుదృఢభావములయొక్కయు పేటిక చిత్తమనియే నీవెఱుంగుము.

ఇదం ప్రవర్తతే సర్వం చిత్తమేవ జగత్తయా
దేహాద్యాకారజాలేన చిత్తం జీవో మనోమయమ్. 40

ఈ సమస్త జగదాకారమునను, దేహాద్యాకారమునను ఈ మనస్సే పరిణతమగుచున్నది. వేయేల! జీవుఁడే మనోమయుఁడై యున్నాడు.

బుద్ధిర్మహదహంకారః ప్రాణాశ్చేత్యాదిభిర్మునే
క్రియానురూపైరభిధావ్యాపారైః శాన్తముచ్యతే. 41

ఓ మునీ! ఆ చిత్తమే తత్తత్క్రియానురూపములగు వ్యాపారములచే నంతఃకరణము, బుద్ధి, మహత్తు, అహంకారము, ప్రాణము, జీవుఁడు మున్నగు నామములచే, జెప్పఁబడుచున్నది.

చిత్తం సర్వమితి ప్రాహుస్తస్మింస్త్యక్తే మహీపతే
సర్వాధివ్యాధి సీమాన్తః సత్త్వత్యాగః కృతో భవేత్. 42

ఓ రాజా! చిత్తమే అంతయునని జెప్పఁబడినది. కాన నద్దానిని ద్యజించుటచే సమస్త ఆధి వ్యాధులయొక్క సీమాంతము (హద్దు) అయినట్టి సర్వత్యాగము గావింపఁబడినదగుచున్నది.

చిత్తత్యాగం విదుః సర్వత్యాగం త్యాగవిదాం వర
తస్మిన్సిద్ధే మహాబాహో సత్యం కిం నానుభూయతే. 43

త్యాగవేత్తలలో శ్రేష్ఠుఁడవును మహాబాహుఁడవునగు నోరాజా! చిత్తముయొక్క త్యాగమే సర్వత్యాగమని చెప్పఁబడుచున్నది. అయ్యది సిద్ధింప, పరమానందరూపమగు సత్యపదార్థముయొక్క యనుభవమిఁక కలుగకుండునా? అవశ్యము కలుగునని (భావము)

చిత్తే త్యక్తే లయం యాతి ద్వైతమైక్యం చ సర్వతః
శిష్యతే పరమం శాన్తమచ్ఛమేకమనామయమ్. 44

చిత్తము త్యజింపఁబడగా ద్వైతము (కార్యవిభాగ పరంపరయు)న్ను, ఐక్యము (కారణమున తిరోభావక్రమము)న్ను నంతట లయమొందు, కేవలము పరమశాంతమై, స్వచ్ఛమై, నిరామయమై ఏకమైనట్టి పరమాత్మయే శేషించును.

అస్యాశ్చిత్తం విదుః క్షేత్రం సంసృతేః సస్యసంతతేః
క్షేత్రే త్వక్షేత్రతాం యాతే శాలేః క ఇవ సంభవః. 45

ఈ సంసారమను సస్యసమూహముయొక్క యుత్పత్తికి క్షేత్రము చిత్తమనియే చెప్పఁబడినది. అట్టి క్షేత్రమే నశింప నిఁక ధాన్యమగు సంసారమెద్దానినుండి ప్రాదుర్భవించును.

చిత్తమేవ విచిత్రేహం భావాభావవిలాసినా
వివర్తతేఽర్థభావేన జలమూర్తితయా యథా. 46

విచిత్రప్రకారములగు క్రియల నొనర్చునదియు, భావాభావరూపమున విలాసము గావించునదియు నగు చిత్తమే :- జలము తరంగములరూపమునఁ బరిణామమొందునట్లు - అనేక పదార్థాకారములఁ బరిణతినొందుచున్నది.

చిత్తోత్సాదనరూపేణ సర్వత్యాగేన భూపతే
సర్వమాసాద్యతే సమ్యక్సామ్రాజ్యేనేవ సర్వదా. 47

ఓ రాజా! చిత్తత్యాగరూపమగు సర్వత్యాగముచే సామ్రాజ్యముచేవలె, సదా సర్వత్ర సమస్తమున్ను సంప్రాప్తించుచున్నది.

సర్వత్యాగస్య విషయో యథైవాన్యోఽస్తి తే తథా
త్వమప్యన్యస్య భవసి త్యాగిన్గృహ్ణాసి వై నృప. 48

త్యాగశీలుఁడవగు నృపాలా! పరిచ్ఛిన్నుఁడవగు నీకన్యమగు వస్తు వెట్లు సర్వత్యాగమునకు విషయమగునో, అట్లే నీవున్ను నిన్ను ద్యజించు మఱియొకవస్తువునకు విషయుమైయున్నావు. అట్టి యీ త్యాజ్యవస్తువునే నీవాత్మగా (నీవని) గ్రహించుచున్నావు. గాన నీకు సర్వత్యాగము సిద్ధింపకున్నది.

సూత్రం ముక్తాఫలేనేవ జగజ్జాలం త్రికాలకం
సర్వమన్తః కృతం తేన యేన సర్వం సముజ్ఝితమ్. 49

ఎవనిచే సమస్తమున్ను ద్యజింపఁబడినదో, యాతనిచే, - ముత్యముచే దారమువలె, — త్రికాలములందున్న యీ జగజ్జాలమంతయు నపరిచ్ఛిన్నమగు దన యాత్మస్వరూపములోన ధరింపఁబడినదగును.

యేన సర్వం పరిత్యక్తం తస్మిఞ్శూన్యేఽపి సంస్థితం
జగత్సర్వం త్రికాలస్థం తన్తౌ ముక్తావలీ యథా. 50

ఎవనిచే సమస్తము పరిత్యజింపఁబడినదో, అట్టి శూన్యస్వరూపునియందును, - దారమున ముత్యాల వరుసవలె - త్రికాలస్థమగు నీ జగత్తంతయు స్థితినొందుచున్నది.

అస్నేహేనేవ దీపేన యేన సర్వం సముజ్ఝితం
సస్నేహేనేవ దీపేన తేన సర్వం ప్రకాశితమ్. 51

తైలములేని దీపమువలె, ఎవనిచే సమస్తము పరిత్యజింపఁబడినదో, ఆతనిచేతనే తైలముగల దీపమువలె, సమస్తము ప్రకాశింపఁబడినదగును.

స్థితం సర్వం పరిత్యజ్య యః శేతేఽస్నేహదీపవత్
స రాజతే ప్రకాశాత్మా సమః సస్నేహదీపవత్. 52

చిత్తమునందున్న సమస్తపదార్థములఁ ద్యజించి, తైలములేని దీపమువలె నెవఁడు శాంతి నొందునో, అట్టి సర్వత్యాగరూపమగు, ప్రకాశాత్మ తైలముగల దీపమువలె సమముగ వెలుగొందును.

సమస్తవస్తునిష్కాసే యథా త్వమవశిష్యసే
సర్వత్యాగే కృతే తాదృగ్విజ్ఞానమవశిష్యతే. 53

రాజ్యము, మఱియు నితరమగు సమస్త సామగ్రిని వదలివేసినను నీవెట్లు శేషించియుంటివో అట్లే సర్వత్యాగము గావించినను జ్ఞానరూపమగు ఆత్మ శేషించియేయుండును!

సమస్తవస్తుదాహేఽపి యథా త్వం నేతరో నృప
సర్వత్యాగత ఏవాజ్ఞ యథా నిర్వాణముచ్యతే. 54

ఓ రాజా! సర్వవస్తువులను దహించివైచినను, నీవెట్లు శేషించియుంటివో, అట్లే సర్వత్యాగముచే శేషించు ఆత్మయే నిర్వాణమనఁబడును. అయ్యది నీకంటె నన్యము కాదు.

సర్వత్యాగో హి శూన్యాత్మా ఆశ్రయః సర్వసంవిదామ్
అనన్తానాముదారాణాం ఖమివేదం దివౌకసామ్. 55

గొప్ప ప్రకాశముగల సూర్యచంద్రాద్యనేక పదార్థములకున్ను, శూన్యమైనట్టి యాకాశమే నెలవైనట్లు, సర్వత్యాగముచే శేషించు శూన్యాత్మయగు (పదార్థశూన్యమగు) చిత్స్వరూపమే సమస్తజ్ఞానములకు నాశ్రయమైయున్నది.

సర్వత్యాగరసాపానే జరామరణభీతయః
న కాశ్చన ప్రబాధన్తే ఖస్యేవ వ్యోమలేఖకాః. 56

అసంగమై, ఉదాసీనమైనట్టి యాకాశమును ఉలిదెబ్బలు బాధించనట్లు, సర్వత్యాగమను అమృతపానముచే జరమరణాది భయములెవ్వియు మనుజుని బాధింపనేరవు.

సర్వత్యాగో మహత్త్వస్య కారణం నిర్మలద్యుతేః
సర్వం త్యజసి చేద్యస్మాద్బుద్ధిస్థైర్యం బృహత్తమమ్. 57

సర్వత్యాగమే గొప్పదై, నిర్మలమైనట్టి ప్రకాశమునకుఁ గారణమైయున్నది. ఏలయనిన, సర్వమును ద్యజించినపుడే నీవు బుద్ధియొక్క స్థిరత్వమున్ను, సర్వోత్తమత్వమును సంప్రాప్తించుచున్నది.

సర్వత్యాగః పరానన్దో దుఃఖమన్యత్సుదారుణమ్
ఇత్యోమిత్యురరీకృత్య యదిచ్ఛసి తదాచర. 58

సర్వత్యాగమే పరమానందము. తద్భిన్నమగు సమస్తము దారుణమైన దుఃఖమేయగును. ఇద్దానిని విచారించి, 'ఓమ్' అనుపదముయొక్క యర్థము నంగీకరించినవాడవై, ఇక, నీయిచ్ఛానుసారమాచరింపుము.

సర్వం త్యజతి యస్తస్య సర్వమేవోపతిష్ఠతే
యథైవామ్బు విశత్యగ్నౌ తథైవాయాతి వారిధౌ. 59

సముద్రమునఁ బడబాగ్నియందు జలమెట్లెట్లు ప్రవేశించుచుండునో, అట్లట్లు మరల నదీప్రవాహాదులద్వారా జలమాసముద్రమున వచ్చి చేరుచుండునట్లు, ఎవఁడంతయుఁ ద్యజించునో, అతఁడే యంతయుఁ బొందుచుండును.

సర్వత్యాగాన్తరేవాస్తి జ్ఞానమాత్మప్రసాదకమ్
యచ్ఛూన్యం కిల భాణ్డస్య తత్ర రత్నాది తిష్ఠతి. 60

పాత్రముయొక్క శూన్యస్థానముననే రత్నాదులుండునట్లు, అజ్ఞానము తత్కార్యాది సమస్తమున్ను ద్యజింపఁబడ, అట్టి సర్వత్యాగమునందే యాత్మప్రసాదకమగు జ్ఞానము వర్తిల్లుచుండును.

సర్వత్యాగవశాదేవ పాతకాలే కలావపి
శాక్యేన విగతాశఙ్కం మునినా మేరువత్స్థితమ్. 61

సర్వత్యాగకారణముననే, మిగులపాపిష్ఠమగు కలికాలమందును శాక్యముని (బుద్ధదేవుఁడు) సంశయరహితుఁడై మేరుపర్వతమువలె స్థితిగల్గియున్నాఁడు.

సర్వత్యాగో మహారాజ సర్వసంపత్సమాశ్రయః
న గృహ్ణాతి హి యత్కించిత్సర్వం తస్మై ప్రదీయతే. 62

ఓ మహారాజా! సర్వత్యాగమే సమస్తసంపదలకు నాశ్రయమై యున్నది. ఏలయనిన ఎవఁడేదియుఁ గైకొనఁడో, ఆతనికే సమస్తము నీయఁబడును.

కృత్వా సర్వపరిత్యాగం శాన్తః స్వస్థో వియత్సమః
సౌమ్యో భవసి యద్రూపస్తద్రూపో భవ భూపతే. 63

ఓ రాజా! సర్వపరిత్యాగముగావించి, శాంతమై, స్వస్థమై ఆకాశమువంటి యే (శుద్ధాత్మ) రూపుఁడవు నీవైయున్నావో, అట్టిరూపుడవే కమ్ము.

సర్వం పరిత్యజ్య మహాస్వభావ త్యజస్యథో యేన చ తద్విహాయ
త్యాగాభిమానం చ మలం విముచ్య విముక్తరూపో భవ భూమిపాల. 64

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజావబోధనం
నామ త్రినవతితమః సర్గః ॥ 93 ॥

ఓ మహానుభావుఁడగు రాజా! నీవంతయుఁ ద్యజించి, తుద కేమనస్సుచే సమస్తము ద్యజించుచున్నావో, అట్టి మనస్సునుగూడ విడనాడి అభిమానరూపమలమును, అహంకారమునున్ను బరిత్యజించి ముక్తరూపుఁడవు కమ్ము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలో పాఖ్యానమున శిఖిధ్వజావబోధనమను
తొంబదిమూఁడవ సర్గము ॥ 93 ॥

## చతుర్నవతితమః సర్గః

[ఇహ చిత్తం పరిత్యక్తుం తన్మూలపరిశోధనే
దేహాదివేద్యబాధేన పూర్ణచిచ్ఛేష ఈర్యతే.

చిత్తమును బరిత్యజించుటకై యద్దాని మూలమును బరిశోధించుట, దేహాది వేద్యపదార్థమును ద్యజించుటచే శేషించు పూర్ణచిన్మాత్రమును వర్ణించుట యిటఁ గాననగును.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

ఏవం వదతి వై కుమ్భే చిత్తత్యాగం ముహుర్ముహుః
అన్తర్విచారయన్సౌమ్యో రాజా వచనమబ్రవీత్. 1

శ్రీ వసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! కుంభఋషి యివ్విధమునఁ జెప్పుచుండ నపుడు సౌమ్యుఁడగు ఆరాజు చిత్తత్యాగమును గూర్చిన యుపాయమును మరలమరల నాలోచించుచు నిట్లు పలికెను-

**శిఖిధ్వజ ఉవాచ:—**

హృదయాకాశవిహగో హృదయద్రుమమర్కటః
భూయోభూయో నిరస్తం హి సమభ్యేత్యేవ మే మనః. 2

శిఖిధ్వజుఁడు.- మహాత్మా! హృదయమను నాకాశమందలి పక్షియు, హృదయమను వృక్షమందలి కోతియు నగు ఈ మనస్సును నేను మాటిమాటికి, ద్యజించినను మరలవచ్చుచునేయున్నది.

జానామి చైతదాదాతుం మత్స్యం జాల ఇవాకులమ్
త్యాగమస్య న జానామి చిత్తం ద్రవ్య ఇవోత్తమ. 3

ఉత్తముఁడవగు నో దేవపుత్రా! వ్యాకులమైన మత్స్యమును జాలమెట్లు పట్టుకొనునో, అట్లే యీమనస్సుయొక్కయు గ్రహణమును నే నెఱుంగుదునే గాని, మూర్తిమంతమగు బదార్థమువలె నిద్దానిని ద్యజించుట మాత్ర మెఱుంగను.

చిత్తస్యాదౌ స్వరూపం మే యథావద్భగవన్వద
తతశ్చిత్తపరిత్యాగం యథావద్వద మే ప్రభో. 4

ప్రభూ! మహాత్మా! మొట్టమొదట తాము చిత్తముయొక్క స్వరూపమును నాకుఁ దెలియఁజేయుఁడు. పిమ్మట యథాప్రకార మద్దానిని బరిత్యజించు విధానమున్ను దెలుపుఁడు.

**కుమ్భ ఉవాచ:—**

వాసనైవ మహారాజ స్వరూపం విద్ధి చేతసః
చిత్తశబ్దస్తు పర్యాయో వాసనాయా ఉదాహృతః. 5

కుంభుఁడు.— ఓ మహారాజా! వాసనయే చిత్తముయొక్క స్వరూపమని తెలిసికొనుము. వాసనయొక్క పర్యాయమే లోకమున చిత్తశబ్దముచేఁ జెప్పఁబడినది.

త్యాగస్తస్యాతిసుకరః సుసాధ్యః స్పన్దనాదపి
రాజ్యాదప్యధికానన్దః కుసుమాదపి సున్దరః. 6

అట్టి చిత్తముయొక్క త్యాగము మిగుల సులభమైనది, తృణమును జలింపఁజేయుట కంటెను మిగుల సుసాధ్యమైనది; రాజ్యముకంటె నధిక సుఖదాయకమైనది, పుష్పముకంటె నతిరమణీయమైనది,

మూర్ఖస్య తు మనస్త్యాగో నూనం దుఃసాధ్యతాం గతః
పామరస్యేవ సామ్రాజ్యం తృణస్యేవ సు మేరుతా. 7

పామరునకు సామ్రాజ్యమువలెను, తృణమునకు సుమేరుత్వమువలెను, ఈమనస్త్యాగము మూర్ఖునకు నిక్కముగ దుస్సాధ్యత్వము నొందినది.

శిఖిధ్వజ ఉవాచః—

స్వరూపం వేద్మి చిత్తస్య వాసనామయమాకులమ్
త్యాగః స మన్యే దుఃసాధ్యో వజ్రనిర్గిలనాదపి. 8

శిఖిధ్వజుఁడు:- మహాత్మా! వాసనామయ వ్యాకులమైనట్టి చిత్తముయొక్క స్వరూపమును తమ వచనములద్వారా నేనెఱింగితిని, కాని యిద్దాని త్యాగము వజ్రమును మ్రింగుటకంటెను మిగుల దుస్సాధ్యమైనదని తలంచెద.

సంసృత్యామోదపుష్పస్య దుఃఖదాహానలస్య చ
జగదబ్జమృణాలస్య మోహమారుతఖస్య చ. 9
శరీరయన్త్రవాహస్య హృత్పద్మభ్రమరస్య చ
అయత్నాచ్చేతసస్త్యాగో యథా భవతి తద్వద. 10

ప్రభూ! ఈ చిత్తము, సంసారమను సుగంధముతోఁగూడిన పుష్పమున్ను, దుఃఖమను దాహముఁ గలిగించు అగ్నియు, జగత్తను కమలముయొక్క తూఁడున్ను. మోహమను వాయువున కాకాశమున్ను, శరీరమను యంత్రముయొక్క వాహకమున్ను, హృదయమను కమలముయొక్క భ్రమరమున్నైయున్నది. ఇట్టిదీనియొక్క త్యాగము యత్నములేకయే యెట్లగునో తెలుపవేఁడెద.

కుమ్భ ఉవాచః—

సర్వనాశోఽస్య యః సాధో చేతసః సంసృతిక్షయః
స ఏవ చిత్తసంత్యాగ ఇత్యుక్తం దీర్ఘదర్శిభిః. 11

కుంభుఁడు:- ఓ సాధూ! ఈ చిత్తముయొక్క సమూలవినాశనమే సంసారముయొక్క క్షయమున్నైయున్నది. అదియే చిత్తముయొక్క త్యాగమని దీర్ఘదర్శులగు మహాత్ములు నుడువుదురు.

శిఖిధ్వజ ఉవాచః—

చిత్తత్యాగాదహం మన్యే చిత్తనాశః సుసిద్ధయే
అభావః శతశో వ్యాధేః కథమస్యాను భూయతే. 12

శిఖిధ్వజుఁడు:- మహాత్మా! చిత్తముయొక్క త్యాగముచేతనే చిత్తముయొక్క నాశమగునను విషయము నేనిపుడు బాగుగ నెఱింగితిని కాని వందలకొలఁది రోగములకు మూలభూతమైనట్టి యీ చిత్తముయొక్క యభావమెట్లను భూతమగునో తెలుపఁ బ్రార్థన.

కుమ్భ ఉవాచ:—

అహం బీజశ్చిత్తద్రుమః సశాఖాఫలపల్లవః
ఉన్మూలయ సమూలం తమాకాశహృదయో భవ. 13

కుంభుఁడు:- ఓ రాజా! శాఖాఫలపల్లవాది సహితమగు ఈచిత్తమను వృక్షమునకు, అజ్ఞానమే బీజమైయున్నది అట్టి వృక్షమును సమూలముగ, పెల్లగించుటకొఱకై, ఆకాశమువంటి (నిరావరణ, విక్షేపరహితమగు) హృదయము గలవాడవు కమ్ము.

శిఖిధ్వజ ఉవాచ:—

చేతసః కిం మునే మూలం కోఽఙ్కురః కోఽస్య సంభవః
కాః శాఖాః కేచ వా స్కన్ధాః కథమున్మూల్యతే చ సః. 14

శిఖిధ్వజుఁడు:- ఓ మునీ! ఈ చిత్తముయొక్క మూలమేమి? దీనియంకుర మెద్ది? దీనియుత్పత్తిస్థానమెయ్యది? దీని శాఖలు, స్కంధములెవ్వి? ఇది సమూలముగ నెట్లు పెల్లగింపఁబడును? తెలియఁజేయుఁడు.

కుమ్భ ఉవాచ:—

అహమర్థోదయో యోఽయం స చిత్తావేదనాత్మకః
ఏతచ్చిత్తద్రుమస్యాస్య విద్ధి బీజం మహామతే. 15

కుంభుఁడు:- ఓ మహామతీ! అజ్ఞానముచే నుదయించు అభిమానియగు జ్ఞాతయే యీ చిత్తమను వృక్షమునకు మూలమని యెఱుఁగుము.

పరమాత్మపదం క్షేత్రం క్షేత్రం మాయామయస్య తత్
ఏతస్మాత్ప్రథమోద్భిన్నాదఙ్కురోఽనుభవాకృతిః. 16

పరమాత్మ నాశ్రయించిన మాయయే దీనియొక్క క్షేత్రము. ఏలయనిన, మాయామయమగు ప్రపంచమంతటియొక్క క్షేత్రమదియేయైయున్నది. ప్రథమమున నుత్పన్నమైన యీ మూలమునుండి, పరిచ్ఛిన్నమైన 'అహం' నిశ్చయరూపమైనట్టి యనుభవాత్మకుఁడగు చిదాభాసుఁడను నంకురము జనించుచున్నది.

నిశ్చయాత్మా నిరాకారో బుద్ధిరిత్యేవ సోచ్యతే
అస్య బుద్ధ్యభిధానస్య యాఙ్కురస్య ప్రపీనతా. 17
సంకల్పరూపిణీ తస్యాశ్చిత్తనామ మనోభిధా
జీవో మిథ్యోపలమ్భాత్మా శూన్యాత్మా హ్యుపలోపమః. 18

నిశ్చయాత్మకమై, నిరాకారమైనట్టి యద్దాని రూపమునే బుద్ధి యందురు. ఇట్టిబుద్ధియను పేరుగల యంకురముయొక్క స్థూలత్వమేది గలదో, అయ్యది సంకల్పరూపమగుటచే చిత్తము, మనస్సు మున్నగు పేర్లచేఁ జెప్పఁబడుచున్నది. యథార్థముగ నిర్వికారమై, నాశరహితమైనట్టి చైతన్యమే మిథ్యాభూతమై, జడమైనట్టి చిత్తముయొక్క ధర్మములతోటి సంబంధమును బొందినట్లున్నదై జీవుఁడని వచింపఁబడుచున్నది అదియే దీని వృక్షము.

స్తంభః కాయోఽయమేతస్య స్నాయ్వస్థిరసరఞ్జితః
దేశాన్తరేఽఙ్కురోద్దేశే కాలస్కన్ధోఽస్య వాసనా. 19

నాడీ, అస్థి, రక్తాదులతోఁ గూడిన శరీరమే దీని స్తంభము; అనఁగా మూలమునుండి మొదలు కొని శాఖలవఱకుఁ గల మధ్యప్రదేశము. మఱియు, ఆ యా పదార్థములఁ గూర్చిన వాసన, ఈ యంకుర ప్రదేశమునుండి యితర శాఖాదిప్రదేశములందు, యితర వసంతాది కాలములందుఁ జనునట్టి రసమై యున్నది.

శాఖాయాశ్చిత్తవృక్షస్య దీర్ఘా దూరగతాస్తతాః
ఇన్ద్రియాణ్యల్పభోగాశ్చ భావా భావాత్మయోనయః. 20
విటపౌఘా మహాన్తోఽస్య శుభాశుభఫలాకులాః

ఈ చిత్తమను వృక్షముయొక్క దూరదూరమునకేగు దీర్ఘమైన శాఖలే యింద్రియములై పఱగుచున్నవి. జననమరణాద్యనేక అనర్థములకు, కారణభూతములై, అనేక అశుభకళలచేఁ బూర్ణమైనట్టి యింద్రియభోగములే దీని గొప్పవైన యవాంతర శాఖాసమూహములు.

ఈదృశస్యాస్య చిత్తస్య దుర్వృత్తస్య ప్రతిక్షణమ్. 21
శాఖావిలవనం కుర్వన్మూలకాషే భరం కురు

ఓరాజా! ఇట్టి చిత్తరూపమగు దుష్టవృక్షముయొక్క విషయభోగాసక్తిరూపమగు శాఖలను ప్రతి ప్రతిక్షణముఁ దెగ నఱుకుచు, అసంగమై, అద్వితీయమైనట్టి ఆత్మయొక్క దర్శనముచే నిద్దానిని (ఈ చిత్తవృక్షమును) సమూలముగ నాశమొనర్చుటకై యధికయత్నము నాచరింపుము.

శిఖిధ్వజ ఉవాచ:—

చిత్తద్రుమస్య శాఖాదేః కుర్వాణోఽహం వికర్తనమ్. 22
కథం కరోమి మూలస్య నిఃశేషకషణం మునే

శిఖిధ్వజుఁడు:—ఓ మునీ! ఈ చిత్తమను వృక్షముయొక్క శాఖాదులను ఛేదించుచు నిద్దాని మూలము నెట్లు నిశ్శేషముగ నున్మూలింపఁగలను?

కుమ్భ ఉవాచ:—

వాసనా వివిధాః శాఖాః ఫలస్పన్దాదినాన్వితాః 23
అభావితా భవన్త్యన్తమ్లానాః సంవిద్బలేన తే
అసంసక్తమనా మౌనీ శాన్తవాదవిచారణః. 24

కుంభుఁడు:— ఓ రాజా! ఫల, క్రియాసంయుక్తమగు వివిధ వాసనారూపమైన యీ చిత్తమను వృక్షముయొక్క శాఖలెన్ని గలవో, వానియందాసక్తి గావింపకుండుటచేతను, అంతర్ముఖ వృత్తిచే విచారించుటచేతను నయ్యవి ఛేదింపఁబడుచున్నవి. ఇవ్విధముగ నాసక్తిని మనంబునుండి త్యజించి మౌనివై, శాంతుఁడవై, సర్వవాదములను బరిత్యజించి ఆత్మవిచారణమునఁ దత్పరుఁడవు కమ్ము.

సంప్రాప్తకారీ యః సోఽన్తర్మ్లానశ్చిత్తలతో భవేత్
చిత్తద్రుమలతాజాలం పౌరుషేణ వికర్తయన్. 25

యస్తిష్ఠతి స మూలస్య యోగ్యో నికషణే భవేత్
గౌణం శాఖావిలవనం ముఖ్యం మూలవికర్తనమ్. 26

అనాసక్తబుద్ధిచే యథాప్రాప్తములగు కార్యముల నాచరించువాఁడు లోన చిత్తరూప వృక్షముయొక్క శాఖలఁ దెగఁద్రుంచువాఁడగును. ఇట్లు పురుషప్రయత్నముచే ఆశాఖాసమూహమును ఛేదించుచు నుండువాఁడు సమూలముగ ఈ చిత్తవృక్షమును ఛేదించుటయందు సమర్థుఁడగును. ఈ చిత్త వృక్షమును సమూలముగ ఛేదించుటయందే యధికప్రయత్నశీలుఁడై యుండవలెను. ఏలన, శాఖాచ్ఛేదనము గౌణమై, మూలచ్ఛేదనము ప్రధానమై యున్నది.

చిత్తవృక్షస్య తేన త్వం మూలకాషపరో భవ
ముఖ్యత్వేన మహాబుద్ధే మూలదాహమలం కురు. 27
చిత్తకణ్టకఖణ్డస్య భవత్యేవమచిత్తతా

గొప్పబుద్ధిగల ఓ రాజా! ఈ ప్రకారముగ, ఆత్మవిచారణమునఁ బరాయణుఁడవై ముఖ్యముగ నీవు చిత్తవృక్షముయొక్క మూలచ్ఛేదనమునఁ దత్పరుఁడవగుము. ఈ రీతిగఁ జిత్తమను కంటక వృక్షముయొక్క మూలమును సంపూర్ణముగ దహింపఁజేసివేయుము. అట్లొనర్చినచో నీకు 'అచిత్తత్వ' దశ సంప్రాప్తించును.

శిఖిధ్వజ ఉవాచః—

అహంభావాత్మనశ్చిత్తద్రుమబీజస్య హే మునే
కోఽనలో దహనాఖ్యేఽస్మిన్కర్మణ్యర్థకరో భవేత్. 28

శిఖిధ్వజుఁడు:— ఓ మునీ! అహంభావరూపమగు ఈ చిత్తవృక్షముయొక్క బీజమున దహింపఁజేయు క్రియయందే యగ్ని యుపకరించును?

కుమ్భ ఉవాచ!—

రాజన్స్వాత్మవిచారోయం కోఽహం స్యామితి రూపధృక్
చిత్తదుర్ద్రుమబీజస్య దహనే దహనః స్మృతః. 29

కుంభుఁడు.— ఓ రాజా! 'నేనెవరు' అనునీప్రకారమగు విచారణ మొదలుకొని సాక్షాత్కార పర్యంతముగల రూపమును ధరించినట్టి ఆత్మవిచారమే యీ చిత్తమను దుష్టవృక్షముయొక్క బీజమును దహింపఁజేయుటయందగ్ని యని చెప్పఁబడినది.

శిఖిధ్వజ ఉవాచః—

మునే మయా స్వయా బుద్ధ్యా బహుశః ప్రవిచారితమ్
యావన్నాహం జగన్నోర్వీవనమణ్డలమణ్డితమ్. 30
నాద్రేస్తటం న విపినం న పర్ణస్పన్దనాది చ
జడత్వాన్న చ దేహాది న మాంసాస్థ్యసృగాది చ. 31

కర్మేన్ద్రియాణ్యపి న చ న చ బుద్ధీన్ద్రియాణి చ
న మనో నాపి చ మతిర్నాహంకారశ్చ జాడ్యతః. 32

శిఖిధ్వజుఁడు:- ఓ మునీ! నేను నా స్వబుద్ధిచేతనే యనేకపర్యాయము లిట్లు విచారించితిని - 'నేను జగత్తును గాను, పృథివికాను, వనమండలములచే శోభితమగు పర్వతతటమును గాను, అరణ్యమును గాను, పత్రచలనాదులు కాను, అట్లే జడమై యుండుటచే దేహాదులు నేను గాను; నేను మాంసము కాను, ఎముకలు కాను, రక్తముకాను, కర్మేంద్రియములు కాను, జ్ఞానేంద్రియములు కాను, మనస్సు కాను, బుద్ధికాను, జడమైయుండుటచే అహంకారమున్ను గాను,

కటకత్వం యథా హేమ్ని తథాహంత్వం చిదాత్మని
జడం త్వసద్రూపతయా తేన తన్నాస్తి హే మునే. 33

ఓ మునీ! బంగారమునఁ గడియమను వస్తువు వేఱుగ లేనట్లు, చిదాత్మయందును జడమగు అహంకారము వేఱుగ లేదు. జడములగు శుక్తిరజత, మృగతృష్ణాదులు అసద్రూపముచేఁ బ్రసిద్ధమైయే యున్నవి. గాన జడమగు అహంకారమున్ను అసత్తే (లేనిదే) యగును.

సంనివేశనివాసాత్మా సర్వార్థాదిః పరే పదే
విద్యతే నాన్యదన్యత్వాన్నభసీవ మహాద్రుమః. 34

ఆకాశమున మహావృక్షము లేనట్లు పదునాల్గులోకములకు (బ్రహ్మాండమునకు) నాధారమున్ను శబ్దాదివిషయముల కాదికారణము నగు ప్రకృతియున్ను పరమపదమగుఁ చిదాత్మయందు వేఱుగ లేదు.

జానన్నపీతి భగవన్నహంత్వమలమార్జనమ్
అన్తర్వ్యజ్ఞం న జానామి తేన తప్యే చిరం మునే. 35

ఓ మునీ! ఇవ్విధమున అహంకారమను మలముయొక్క మార్జన మెఱిఁగియుండియు నయ్యానందైకసాక్షి చైతన్యము నెఱుఁగకయున్నాను. ఇక్కారణముననే చిరకాలమునుండియు దుఃఖితుఁడ నగుచున్నాను.

కుమ్భఉవాచ:—

ఏతావన్మాత్రకం వృన్దం యది న త్వం మహీపతే
జడత్వాత్తన్మహాబుద్ధే యోఽసి తద్వద మేఽనఘ. 36

కుంభుఁడు.— పాపరహితుఁడవును, మహాబుద్ధిమంతుఁడవునగు నో రాజా! శరీరమునుండి మొదలుకొని అహంకారమువఱకుఁ గల జడమైన దృశ్యసమూహము నీవుకానిచో, ఇఁక నీవెవ యగుదువో, దానిని నాకుఁ జెప్పుము!

శిఖిధ్వజ ఉవాచ:—

చిన్మాత్రమహమచ్ఛాత్మవేదనం విదుషాం వర
యత్ర భావాః స్వదన్తే తే నిర్ణీయన్తే చ యేన వా. 37
ఏవం రూపస్య మే లగ్నం నూనం మలమకారణమ్

సకారణం వాఽహమితి యత్పదం చ న వేద్మ్యహమ్. 38
అసదేతదనాత్మీయం ప్రమార్ష్టుం మలమాత్మనః
మునే యదా న శక్నోమి తేన తప్యే సుదారుణమ్. 39

శిఖిధ్వజుఁడు:— విద్వాంసులలో శ్రేష్ఠుఁడవగు నో దేవపుత్రా! ఏద్దానియందు, ఆనందము లేక, జడరూపములగు శబ్దాదివిషయము లనుభూతములగుచున్నవో, లేక, బుద్ధివృత్తియం దారూఢమై యద్దానిద్వారా యీ సమస్తముయొక్క విభాగము నిర్ణయింపఁబడుచున్నదో, అట్టి శుద్ధచిన్మాత్రసాక్షిచైతన్యము నే నేను, కాని యిట్టి శుద్ధుఁడనగు నాకీ దేహాహంకారాదుల ఆత్మాభిమానరూపముల మేదేని యొక కారణముచే సంలగ్నమైయున్నదో, లేక నిష్కారణముగ సంలగ్నమైయున్నదో, నేనెఱుఁగఁజాలను, మఱియు నేది బహ్మపదమైయున్నదో దానిఁగూడ నే నెఱుఁగను. ఓ మునీ! అసత్తై అనాత్మరూపమైనట్టి ఈ అహంకారాదులను ఆత్మయొక్క మలమును నేను రహితమొనర్పజాలకున్నాను. కాననే మహాద్దుఃఖ మనుభవించుచున్నాను.

కుమ్భ ఉవాచ:—

బ్రూహి కిం తన్మహాబాహో లగ్నం తవ మలం మహత్
స్థితోఽసి యేన సంసారీ సతా వాప్యథవాఽసతా. 40

కుంభుఁడు:— మహాబాహుఁడవగు నో రాజా! ఏమహామలము నీయందు సంలగ్నమైయున్నదో, దేనిచే నీవు సంసారివై పడియుంటివో, అది సత్తా, అసత్తా నాకుఁజెప్పుము.

శిఖిధ్వజ ఉవాచ:—

చిత్తద్రుమస్య యద్బీజమహంభావస్స మే మలమ్
తచ్చ త్యక్తుం న జానామి త్యక్తం త్యక్తముపైతి మామ్. 41

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! అది సత్తయో, అసత్తయో నాకుఁదెలియదు. చిత్తవృక్షమునకు, బీజమై, మలరూపమైనట్టి యహంభావమును గూడ విశేషముగ నే నెఱుఁగను, మఱియు, నద్దానిని త్యజించు నుపాయమున్నెఱుఁగను. ఒకవేళ యేవిధముగనైనఁ ద్యజించినను, మరలనావద్దకది వచ్చుచునే యున్నది,

కుమ్భ ఉవాచ:—

కారణాజ్జాయతే కార్యం యత్తత్సర్వత్ర సంభవేత్
అన్యత్త్వసద్విచన్ద్రాభం దృష్టమేతన్న విద్యతే. 42

కుంభుఁడు:— ఓ రాజా! కారణమునుండియే కార్యముత్పన్నమగుట లోకమున నంతటను బ్రసిద్ధమైయున్నది. కారణములేకయే యుత్పన్నమైన కారణము రెండు చంద్రులయునికివలె లేనిదే యగును. బాగుగఁ బరీక్షించినచో నది అసత్తే యగుచున్నది.

కారణాజ్జాయతే కార్యమహంభావాద్భవాఙ్కురః
ఇతి కారణమన్విష్య కథయస్వ మమాధునా. 43

ఏ యహంభావమను కారణమునుండి మనస్సు, ఇత్యాది జగత్తుయొక్క యంకుర ముత్పన్న మైనదో, ఆ యహంభావ మేకారణమునుండి జనించినదో, నీస్వబుద్ధిచే విచారించి యిపుడు చెప్పుము?

శిఖిధ్వజ ఉవాచ:—

మునేఽహామితి దోషస్య వేదనం వేద్మి కారణమ్
తద్యథోపశమం యాతి తన్మే వద మునీశ్వర. 44

శిఖిధ్వజుఁడు:— ఓ మునీశ్వరా! దేహాదిదృశ్య పదార్థములు స్ఫురించుటయే యీ యహంభావమను దోషమునకుఁ గారణమని నాకుఁదోచుచున్నది. అట్టిచో నేప్రకార మది శమింపఁగలదో దయచేసి వచింపుడు?

చిత్తశ్చేత్యోన్ముఖత్వేన దుఃఖాయాయమహం స్థితః
చేత్యోపశమనం బ్రూహి మునే తదుపశాన్తయే. 45

ఓ మునీ! చిత్తము విషయములవైపున కున్ముఖమగుటచే ఈ యహంభావము దుఃఖార్థము జనించుచున్నది. కాన నయ్యది రహితమగుటకొఱకై విషయోపశయనమను నుపాయమును దెలియఁ జేయుఁడు

కుమ్భ ఉవాచ:—

కారణం కారణజ్ఞోఽసి వేదనస్య వదాశు మే
తతస్త్వాంబోధయిష్యామి కారణాకారణక్రమమ్. 46

కుంభుఁడు:— ఓ రాజా! వేదనము (చిత్తము) వేద్యము (విషయముల) వైపున కున్ముఖ మగుటయందు వేద్యమే కారణమని నీవెఱిఁగియున్నావు. కనుక నీ యాస్వాభిప్రాయమును శీఘ్రముగ వెల్లడింపుము ఆపిదప, కారణ, అహంకారములఁగూర్చిన క్రమమును నేను దెలియఁజేసెదను.

వేద్యవేదనరూపస్య చేత్యసంచేతనస్య మే
అకారణం కారణతాం యద్యాతం తవ తద్వద. 47

సామాన్యముగ వేద్య వేదనములకును, విశేషముగ చేత్యచేతనములకును, వేద్యము (మిథ్యా రూపమగుటచే) అకారణమైయున్నను, కారణత్వమును బొందెనను నీయభిప్రాయము మేదిగలదో, దానిని నాకుఁ జెప్పుము.

శిఖిధ్వజ ఉవాచ:—

చేత్యచేతనరూపస్య వేద్యసంవేదనాకృతేః
ఇయం పదార్థసత్తేహ దేహాదిః కారణం మునే. 48

శిఖిధ్వజుఁడు;— ఓ మునీ! వేద్య వేదనములకును (చిత్త, విషయములకును,) చేత్య, చేతనము లకును, దేహాది పదార్థముల సత్తయే కారణమై యున్నది.

శరీరాదితయోదేతి వేదనం వస్తు సత్తయా
అసత్యాభాసయా స్పన్దో యథా పవనలేఖయా. 49

అసత్యముగఁ దోచు వాయుశక్తిచే వృక్షాదుల చలనమగునట్లు, శరీరాదివస్తువుల సత్తచే వానిఁగూర్చిన జ్ఞానము (వేదనము)న్ను నుదయించుచున్నది.

అసత్తాం వస్తుసత్తాయా నావగచ్ఛామ్యహం యథా
అహంత్వవేదనం చిత్తబీజం సముపశామ్యతి. 50

ఎద్దానిచే అహంభావము యొక్క స్ఫురణరూపమగు చిత్తముయొక్క బీజము నశించునో, అట్టి దేహాదివస్తువుల సత్తయొక్క యభావమును నే నెఱుఁగను.

కుమ్భ ఉవాచ:—

విద్యతే యది దేహాది వస్తు సత్తా తదస్తి తే
అభావాద్దేహసత్తాదేః కింనిష్ఠం తవ వేదనమ్. 51

కుంభుఁడు:- ఓ రాజా! దేహాది పదార్థముల సత్త యథార్థముగ నున్నచో, అపుడు నీవు తలంచినట్లు వాని జ్ఞానము (వేదన)యొక్క కారణము, ఆకారము యుండవచ్చును. కాని దేహాదుల సత్తయే లేకయుండ నిఁక వాని జ్ఞానమెట్లుండును?

శిఖిధ్వజ ఉవాచ:—

యస్యోపలభ్యతే కించిత్స్వరూపం కలనాత్మకమ్
అసద్రూపం కథం తస్మాత్ప్రకాశః స్యాత్కథం తమః. 52

శిఖిధ్వజుఁడు:- ఓ మునీశ్వరా! ఏ వస్తువుయొక్క స్వరూపము ప్రత్యక్షముగా లక్ష్యమగుచున్నదో, అయ్యది అసద్రూపమెట్లగును? ప్రకాశ మెపుడైన తమస్సు (చీఁకటి) అగునా?

హస్తపాదాదిసంయుక్తః క్రియాఫలవిలాసవాన్
సదానుభూయమానోఽయం దేహో నాస్తి కథం మునే. 53

ఓ మునీ! హస్తపాదాది సహితమై, క్రియా ఫలయుక్తమై, సత్తుగ ననుభూత మగునట్టి యీ దేహమెట్లు లేనిదియగును?

కుమ్భ ఉవాచ:—

కారణం యస్య కార్యస్య భూమిపాల న విద్యతే
విద్యతే నేహ తత్కార్యం తత్సంవిత్తిస్తు విభ్రమః. 54

కుంభుఁడు:- ఓ రాజా! ఏ వస్తువుయొక్క కారణము లేనిదియగునో, అట్టి యాకార్యమగు వస్తువున్ను లేనిదేయగును. మఱియు నద్దాని జ్ఞానమున్ను భ్రమరూపమే యగును.

కారణేన వినా కార్యం శరీరం న కదాచన
విద్యతే యస్య నో బీజం తద్ద్రివ్యం క్వేవ జాయతే. 55

కారణము లేనిచో, ఈశరీరమను కార్యమెపుడును నుండదు. ఏవస్తువునకు బీజమే లేకయున్నదో, ఆవస్తువెట్లు జనించును?

అకారణం తు యత్కార్యం సదివాగ్రేఽనుభూయతే
తద్ద్రష్టుర్విభ్రమాద్విద్ధి మృగతృష్ణాజలోపమమ్. 56

ఓ రాజా! ఏ కార్యము, కారణములేకయే సత్తువలె నెదుట ననుభూతమగుచున్నదో, అది యెండమావుల జలమువలె ద్రష్టయొక్క భ్రమవలననే గలిగినదని యెంచుము.

అవిద్యమానమేవ త్వం విద్ధి మిథ్యాభ్రమోదితమ్
నాతియత్నవతోఽప్యేతన్మృగతృష్ణాంబు లభ్యతే. 57

ఈ శరీరాది దృశ్యమును అసత్తుగను, మిథ్యగను, భ్రమచే నుదయించినదిగను నెఱుంగుము. ఏలయనిన, మిగుల యత్నమాచరించు వానికిఁగూడ మృగతృష్ణాజలము లభింపదుగదా!

శిఖిధ్వజ ఉవాచ:—

అసతోర్ద్వీన్దుబిమ్బాదేర్న యుక్తం కారణేక్షణమ్
వన్ధ్యాతనయసర్వాఙ్గమణ్డనం కస్య రాజతే. 58

శిఖిధ్వజుఁడు:— ఓ మునీ! కారణమును రెండు చంద్రబింబములవలె అసత్తని వచించుట యుక్తముకానేరదు. ఏలయనగా, వంధ్యాపుత్రుని సర్వాంగభూషణ మెవరికి నింపుగానుండునో నుడువుము?

కుమ్భ ఉవాచ:—

కారణేన వినా కార్యం శరీరాద్యస్థిపఞ్జరమ్
అవిద్యమానమేవేదం విద్ధ్యసంభవతో నృప. 59

కుంభుడు.— ఓ రాజా! శరీరాద్యస్థిపంజరరూపమగు, కార్యము కారణములేక యీ యనుభూతమగుచున్నది గాన,అట్టిది, యసంభవమగుటచే నద్దాని నసద్రూపముగనే యెఱుగుము.

శిఖిధ్వజ ఉవాచ:—

హస్తపాదాదియుక్తస్య శరీరస్య మునీశ్వర
నిత్యమాలక్ష్యమాణస్య పితా కస్మాన్న కారణమ్. 60

శిఖిధ్వజుఁడు:— ఓ మునీశ్వరా! నిత్యము ప్రత్యక్షరూపముగఁ గానుపించు హస్తపాదాసహితమగు ఈ దేహమునకుఁ దండ్రి కారణ మెందులకుఁ గానేరదు?

కుమ్భ ఉవాచ:—

కారణాభావతో రాజన్పితా నామ న విద్యతే
అసతో యత్తు సంజాతమసదేవ తదుచ్యతే. 61

కుంభుఁడు:— ఓ రాజా! యథార్థముగఁ దండ్రియు, కారణరహితుఁడై అసత్తై యున్నాఁడు. కావున అసత్తునుండి యుత్పన్నమైనవాఁడును అసత్తేయని చెప్పఁబడును.

పదార్థానాం చ కార్యాణాం కారణం బీజముచ్యతే
సంభవత్యఙ్గ జగతి న బీజేన వినాఙ్కురః. 62

పదార్థములయొక్కయు, కార్యములయొక్కయు కారణమును బీజమందురు. ఏలయనిన, ఈ ప్రపంచమందు బీజములేక అంకురమెన్నటికిని సంభవింపనేరదు.

తస్మాన్న కారణం యస్య కార్యస్యేహోపపద్యతే
బీజాభావే హి తన్నాస్తి తత్సంవిత్తిస్తు విభ్రమః. 63

కావున, యేకార్యముయొక్క కారణములేదో, ఆకార్యమున్ను లేనిదే యగును. బీజము లేనపుడు అంకురమున్ను లేకుండునుగదా? కాన నద్దానిఁగూర్చిన జ్ఞానమున్ను భ్రమయే యగును.

అవశ్యం ఖలు యన్నాస్తి నిర్బీజం తన్మతి భ్రమః
ద్వీన్దుత్వమరు భూమ్యమ్బు వన్ధ్యాపుత్రదశా సమమ్. 64

నిర్బీజమైన వస్తు వవశ్యము లేనిదేయగును. మఱియు నద్దాని జ్ఞానము రెండుచంద్రులవలెను, ఎండమావులందలి జలమువలెను, వంధ్యాపుత్రునివలెను మతియొక్క భ్రమయేయైయున్నది.

శిఖిధ్వజ ఉవాచ:—

పితామహానాం పుత్రాణాం పితౄణాం చ జగత్త్రయే
ఆద్యః పితామహః కస్మాత్పూర్వోత్పత్తౌ న కారణమ్. 65

శిఖిధ్వజుఁడు:— ఓ దేవపుత్రా! ఈ ముల్లోకములందలి ప్రజాస్రష్టలగు మను, దక్ష, మరీచ్యాదిపూర్వపు ఋషులయొక్కయు,, పుత్ర, పితృ, పితామహాది సమస్త ప్రాణికోట్లయొక్కయు, బ్రహ్మాండముయొక్కయు నుత్పత్తికిఁ గారణము. ఆదిపితామహుఁడగుహిరణ్యగర్భుఁడేల కాఁగూడదు?

కుమ్భ ఉవాచ:—

ఆద్యః పితామహో యఃస్యాత్సోఽపి నాస్త్యేవ భూపతే
కారణాభావతో నిత్యం యదా భావో న కస్యచిత్. 66

కుంభుఁడు:— ఓ రాజా! కారణాభావముచే ఆదిపితామహుఁడున్ను లేనివాఁడేయగును. ఏలయనఁగా కారణమే లేనపుడిఁక నేపదార్థముయొక్కయు నునికి యుండఁజాలదు.

కారణస్య స్వబీజస్య నిత్యాభావాత్పితామహః
అన్యః స దృశ్యమానోఽపి భ్రమాదన్యో న విద్యతే. 67

తన కారణరూపమగు బీజముయొక్క యనిత్యత్వముచే బితామహుఁడు (హిరణ్యగర్భుఁడు) (మాయాశబలిత బ్రహ్మమునుండి యుత్పన్నమగుటఁబట్టి) భ్రమచే నన్యునివలె, దోచినను, యథార్థముగ బ్రహ్మముకంటె నన్యుఁడుకాడు. ఏలయనిన, అవిద్యారూపమగు మాయ విద్యచే బాధింపఁబడ నట్టి భ్రమ నివారితమగును.

మృగతృష్ణామ్బువద్భ్రాన్తిరూప ఏవావభాసతే
పితామహార్థకారిత్వమపి తస్య భ్రమాత్మకమ్. 68

ఇక్కారణమున హిరణ్యగర్భుని సృష్ట్యాదిరచనారూప క్రియయున్ను భ్రమాత్మకమై, మృగతృష్ణాజలమువలె భ్రాంతిరూపమే యైయున్నది.

పితామహోదరే తస్య మిథ్యాప్రత్యయతఃస్థితిః
ఘనా తవ నివృత్తైవ మారయిష్యామ్యథేతరత్. 69

ఇట్టివిధమునఁ బితామహుని (హిరణ్యగర్భుని) యందరమందలి యాపితామహాదుల శరీరాది కార్యముల సత్యత్వమునుగూర్చిన దృఢప్రతీతి యేది నీకుండియుండెనో, అయ్యది నివృత్తమైనది. ఇఁక నిపుడు ప్రతిభాసమాత్రముచే నేది మిగిలియున్నదో దాని గూడ తత్త్వసాక్షాత్కార పర్యంతమగు నుపదేశముచే నివారింతును.

తస్మాచ్చిదాత్మకతయాత్మని చిత్తతోఽయం
నిత్యం స్వయం కచతి భూమిప దేవదేవః
తేనైవ పద్మజ ఇతి స్వయమాత్మనాత్మా
ప్రోక్తః స్వరూప ఇతి శాన్తమిదం సమస్తమ్. 70

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజావబోధనం నామ చతుర్నవతితమః సర్గః ॥ 94 ॥

ఓ రాజా! పూర్వోక్తరీతి, చైతన్యముకంటె భిన్నమగు పదార్థములు అసత్తగుటచే, హిరణ్యగర్భుని మొదలుకొని తృణపర్యంతముగల కార్యపరంపరారూపముచే వికసితుఁడగు సర్వదేవదేవుఁడగు ఈశ్వరుఁడు తనయందుదానే హిరణ్యగర్భాది నామములచే, ప్రసిద్ధుఁడగుచున్నాఁడు గాన ఈసమస్తద్వైతసమూహమున్ను శాంతమగు బ్రహ్మరూపమే యగును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజావబోధనమను తొంబదినాల్గవ సర్గము ॥ 94 ॥

---

## పఞ్చనవతితమః సర్గః

[ఘనతాతానవే నాత్రావిద్యోపశమనక్రమః
శిఖిధ్వజస్య బోధేన విశ్రాన్తిశ్చోపవర్ణ్యతే.

శిఖిధ్వజుని గాఢమైన అజ్ఞానమును సన్నగించుటద్వారా అవిద్యయొక్క నాశక్రమమును వచించుట, బోధచే విశ్రాంతి నొందింపఁజేయుట మున్నగు విషయము లిచట వర్ణింపఁబడుచున్నవి.]

శిఖిధ్వజ ఉవాచ:—

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం యద్యయం భాసతే భ్రమః
అర్థక్రియాసమర్థశ్చ తత్కథం దుఃఖకారణమ్. 1

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! బ్రహ్మదేవుని మొదలుకొని తృణమువఱకుఁగల యీ జగత్తంతయు మృగతృష్ణాజలమువలె మిథ్యగా భాసించుచో నిఁక ఈజగత్తునందలి పదార్థములం దర్థక్రియాసామర్థ్యము (అన్నజలాదులచే నాకలిదప్పులు శమించుట మున్నగునవి) యెట్లు సంభవించును? మఱియు ఈపదార్థములు దుఃఖకారణము లెట్లగును?

కుమ్భ ఉవాచ:—

ఏవం జగద్భ్రమస్యాస్య భావనం తావదాతతమ్ 2
శిలీభూతస్య శీతేన సలిలస్యేవ రూక్షతా.

కుంభుఁడు:— ఓ రాజా! శీతత్వముచే శిలీభూతమైన జలమెట్లు కఠినత్వమునొంది పీఠ, పాత్రాద్యర్థక్రియాసామర్థ్యము గలిగియుండునో, అట్లే భ్రమరూపమైన యీజగత్తునందున్న సత్యసంకల్పుఁడగు ఈశ్వరుని భావనయే, ఆయా యర్థక్రియాదులచే వ్యాపింపఁబడియున్నది?

అజ్ఞానం శిథిలీభూతమేవం నష్టం విదుర్బుధాః 3
న నాశేన వినోదేతి పూర్వసంస్థానవిచ్యుతిః.

అజ్ఞానము శిథిలము కాఁగా నీజగత్తున్న గ్రహము శిథిలమై, మూలాజ్ఞాననాశముచేఁదానున్న నశించుచున్నది. ఇట్టి విషయమును విజ్ఞులెఱింగియున్నారు. అజ్ఞానము నశింపనిదే జగత్స్థితి బాధింపఁబడనేరదు.

తనుత్వం సర్వబోధస్య య తదేవ హి కారణమ్ 4
సర్గోపశమసంపత్తౌ ప్రతిపన్నే పరే పదే.

నిరోధాభ్యాసముచేనగు బాహ్యాకారవృత్తియొక్క సూక్ష్మతయే, అజ్ఞానము శిథిలమగుటయందుఁ గారణమైయున్నది. మఱియు బాహ్యాకారవృత్తియొక్క సూక్ష్మత యధికరింప జ్ఞానోత్పత్తిచేఁ గ్రమముగఁ బరమపదము (ఆత్మ) సాక్షాత్కరింపబడ, జగత్తుయొక్క సంపూర్ణ విలయము సంభవించును.

తానవం దృశ్యతే యస్య తస్యానుక్రమతః స్వయమ్ 5
పూర్వసంస్థానవిగమాత్ప్రశమోప్యుపపద్యతే.

ఈ ప్రపంచమందున ఏ వస్తువుయొక్క సూక్ష్మత క్రమశః యగునో, అద్దాని పూర్వస్థూల)స్థితియొక్క నాశముచేఁ గ్రమముగ నది సంపూర్ణవినాశమున్ను బొందును.

అనేనైవ క్రమేణైనం త్వమాదిపురుషో నృపః 6
భ్రమసాకారోదయం విద్ధి మృగతృష్ణామ్బువత్స్థితమ్.

ఓ రాజా! ఇట్టి యజ్ఞాన శైథిల్యక్రమముచేతనే దేహాది సమస్తదృశ్య పదార్థములు బాధితములు కాఁగా, తుదకు శుద్ధచిన్మాత్రుఁడవగు ఆదిపురుషుండవైన నీవే శేషింతువు. మఱియు, చైతన్యముకంటె భిన్నమగు యీదృశ్యజగత్తు భ్రమాకారమై, మృగతృష్ణాజలమువలె మిథ్యారూపముగ నున్నదగును.

ఏషా పితామహాభావేఽప్యసతీ భూతసంతతిః 7
న కదాచన తత్సిద్ధం యదసిద్ధేన సాధ్యతే.

బ్రహ్మదేవుని (హిరణ్యగర్భుని) అభావమువలన ఈప్రాణిసమూహమున్ను అసత్తేయగున్నది. ఏలయనిన, ఎవఁడు స్వయముగనే అసిద్ధుఁడైయుండునో, అతనిచే నెపుడును నేకార్యమున్ను సిద్ధింపదు.

అయం భూతోపలమ్భో హి మృగతృష్ణామ్బువోదితః
విచారాద్విలయం యాతి శుక్తౌ రజతధీరివ 8

మృగతృష్ణాజలమువలె నుదయించిన యీప్రాణిసమూహముయొక్క ప్రత్యక్షరూపప్రాప్తి, తత్త్వవిచారముచే ముత్తెపుచిప్పయందలి వెండివలె నశించు చున్నది.

కారణాభావతః కార్యమభూత్వా భవతీతి యత్
మిథ్యాజ్ఞానాదృతే తస్య న రూపముపపద్యతే. 9

కారణములేకయే యేకార్యముండునో, అద్దానిరూపము మిథ్యాజ్ఞానముతప్ప, అన్యము యుక్తము కానేరదు.

మిథ్యాదృష్టిప్రేక్షితం తు న కదాచన విద్యతే
మృగతృష్ణామ్బునా కేన ఘటకాః పరిపూరితాః. 10

అట్టి మిథ్యాజ్ఞానముచే నుదయించు పదార్థమును మిథ్యాదృష్టిచే వీక్షించినచో నిక నది యెన్నటికి నుండజాలదు. ఏలయనిన మృగతృష్ణాజలముచే ఘటముల నెవఁడు నింపెను.

శిఖిధ్వజ ఉవాచ: –

స్రష్టురాద్యస్య పరమం బ్రహ్మ కస్మాన్న కారణమ్
అనన్తమజమవ్యక్తమమ్బరం శాన్తమచ్యుతమ్. 11

శిఖిధ్వజుఁడు:– మహాత్మా! అజమై, అవ్యక్తమై, శాంతమై, అచ్యుతమైనట్టి పరబ్రహ్మమే ఆదిస్రష్టయగు బ్రహ్మదేవుని కారణమేల కాఁగూడదు?

కుమ్భ ఉవాచ:—

హేతుత్వాభావతో బ్రహ్మ కార్యత్వాభావతస్తథా
అద్వైతేనాతిగన్తాత్మా న చ కార్యం న కారణమ్. 12

కుంభుఁడు:– ఓరాజా! తదేతద్బ్రహ్మ పూర్వమనపరమ్, 'నేహ నానాస్తి కించన' 'అసఙ్గో హ్యయం పురుషః' – ఇత్యాది శ్రుతివాక్యములచేఁ గూటస్థమగు బ్రహ్మము పరిణామరహితమున్ను, అద్వయమున్ను, ప్రపంచాతీతము నగుటచే కార్యకారణ భావవర్జితమై యున్నది. కాన నట్టి శుద్ధ బ్రహ్మము (ఆత్మ) కార్యముగాని, కారణముగాని కానేరదు.

అకర్తృకర్మకరణమకారణమబీజకమ్
అప్రతర్క్యమవిజ్ఞేయం బ్రహ్మ కర్తృ కథం భవేత్. 13

కర్తృకర్మకరణాదిరహితమై, ఉపాదాననిమిత్తకారణవర్జితమై, అప్రతర్క్యమై, అవిజ్ఞేయమైనట్టి బ్రహ్మ మెట్లు కర్త యగును.

అకారణత్వాత్కార్యత్వరహితం తజ్జగద్భవేత్
అద్వైతైక్యమనాద్యన్తం తదాద్యముపలమ్భనమ్. 14

బ్రహ్మము కారణముగానందున, కార్యత్వరహితమై యున్నది. ఒక వేళ కార్యకారణాత్మ మగు ఈ జగత్తు కలదని తలంచుచో, అయ్యది ద్వైతైక్యలక్షణ వర్జితమై, దేశ, కాల, వస్తు పరిచ్ఛే శూన్యమై, అనాదియై, అనంతమై, చిదేకరసమైన బ్రహ్మముగనే యుండియున్నదని భావింపుము.

అప్రతర్క్య మవిజ్ఞేయం యచ్ఛివం శాన్తమవ్యయం
తత్కథం కస్య కేనైవ కర్తృ భోక్తృ కదా భవేత్. 15

అప్రతర్క్యమై, అవిజ్ఞేయమై, శివమై, శాంతమై, అవ్యయమైన బ్రహ్మ మెపుడెట్లు! దేనిచే దేనికి కర్తయు, భోక్తయుఁ గాఁగలదు?

అతో నేదం కృతం కించిజ్జగదాది న విద్యతే
న కర్తాసి న భోక్తాసి సర్వం శాన్తమజం శివమ్. 16

ఇక్కారణమున ఈజగదాదులు దేనిచేతను గావింపఁబడినవికావు. అవి లేనివేయగును మఱియు నీవు కర్తవుకావు, భోక్తవుకావు. సమస్తము శాంతమై, అజమై, శివమై యొప్పుచున్నది.

కారణాభావతః కార్యం న కస్యచిదిదం జగత్
అకారణత్వాత్కార్యత్వం భ్రమాద్వృద్ధి త్విదం జగత్. 17

కారణాభావముచే ఈజగత్తు దేనియొక్కయుఁ గార్యముకాదు. కావున కారణములేమి ఈ జగద్రూపకార్యము భ్రమచేతనే సిద్ధించుచున్నదగును.

అకార్యత్వాచ్చ నాస్త్యేతత్సర్గ ఇత్థం న విద్యతే
యదా న కస్యచిత్కార్యం కారణస్య జగత్తదా. 18
పదార్థాభావసంసిద్ధి సత్సిద్ధా కస్య వేదనమ్
ఏవం తు వేదనాభావే నాస్త్యహం త్వస్య కారణమ్. 19
అతః శుద్ధో విముక్తోఽసి క్వైవ కిం బన్ధమోక్షయోః

దేనియొక్కయు కార్యము కానందుచే నీయావిర్భూతమగు సృష్టియు లేనిదేయగును. ఇట్లీ జగత్తు యేకారణముయొక్కయు కార్యముకానందుచే పదార్థముల యభావమే వాస్తవముగా సిద్ధించినది. పదార్థములే లేనపుడిక దేనియొక్క వేదన (జ్ఞాన) మగును? ఇవ్విధమున వేదనాభావముచే నట్టి వేదన మునకు, గారణమగు అహంభావమున్ను లేదు. గాన నీవు శుద్ధుఁడవు, విముక్తుఁడవు, (ఆత్మరూపుఁడవు) నైయుండ నిఁకనీకు బంధమోక్షము లెచట?.

శిఖిధ్వజ ఉవాచ:—

బుద్ధోఽస్మి భగవన్యుక్తియుక్తముక్తం త్వయోత్తమమ్. 20
కారణాభావతః కర్తృ నేదం బ్రహ్మేతి వేద్మ్యహం
కర్తృభావాజ్జగన్నాస్తి తేన నాస్తి పదార్థదృక్. 21

శిఖిధ్వజుఁడు:– మహాత్మా! (నేను ప్రబుద్ధుడనైతి నేనుశుద్ధమగు ఆత్మనే యైయున్నాను) తాము యుక్తి యుక్తమగు నుత్తమ కథనముఁ గావించితిరి. కారణాభావముచే ఈ బ్రహ్మము (ఆత్మ)

కర్తగాదని తెలిసికొంటిని. కర్తయొక్క అభావముచే ఈజగత్తున్ను లేనిదైయున్నదిగాన నామరూప దృష్టియు లేనిదగును.

నాతశ్చిత్తాది తద్బీజం నాతోఽహన్త్వాది కించన
ఏవం స్థితే విశుద్ధోఽస్మి విబుద్ధోఽస్మి శివోఽస్మి వా. 22

ఇక్కారణమున, ఆనామరూపజగత్తుయొక్క బీజమగు చిత్తాదులున్ను అహంత్వాదులున్ను గూడ నాకించుకయును లేవు. ఇట్లు, జగత్తు, చిత్తము, అహంకారము మున్నగునవి లేనివేయైయున్నందున నేను శుద్ధుడను, విబుద్ధుడను, శివరూపుడను నైయున్నాను.

నమో మహ్యం పరం చేత్యం న కించిదితి బోధితః
పదార్థవేదనాదిత్రమపదేవావభాసతే
అహమాద్యన్తమేతేన శాన్తమాసే ఖకోశవత్. 23

చైతన్యముకంటె బరముగనే విషయసమూహమున్ను లేదని తాము నాకు బోధించితిరి, ఈ తమయుక్తిననుసరించి పదార్థములంగూర్చి విచారించుటచే, అధ్యారోప, అపవాదములచే, ప్రపంచము మొదలుకొని అహంకారపర్యంతము సమస్తపదార్థము లసత్యములుగనే భాసించుచున్నవి. ఈవిధముగ సమస్తము బాధింపబడుటచే నాకాశకోశమువలె నేను విక్షేపరహితుడనై యున్నాను. అట్టి నాకు నమస్కారము.

జగత్పదార్థప్రవిభాగదృష్టిః సదేశదిక్కాలకలాక్రియాఘా
అహో ను కాలేన చిరేణ శాన్తా బ్రహ్మైవ శాన్తం స్థితమవ్యయాత్మ. 24

అహా! దేశకాలక్రియాసమూహసహితమగు ఈపదార్థము ల దృష్టి చిరకాలమునకు నేడు నాకు నశించినది. ఇపుడు, శాంతుడనై, అవినాశినై, నిర్వికారుడనై, బ్రహ్మమాత్రుడనై స్థితి నొందియున్నాను.

శామ్యామి నిర్వామి పరిస్థితోఽస్మి న యామి నోదేమి న చాస్తమేమి
తిష్ఠామి తిష్ఠ స్వయభాస్థితాత్మా శివం శుభం పావనమానమస్మి. 25

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే చూ॥ శిఖిధ్వజ విశ్రాన్తిర్నామ పఞ్చనవతితమః సర్గః ॥ 95 ॥

నేను శాంతుడను, తృప్తుడను, సర్వత్రవెలయుచున్న వాడను అయియున్నాను. నేనుబోవుటలేదు, ఉదయించుటలేదు, అస్తమించుటలేదు; ఎట్లున్నానో యట్లనే యున్నాను. తామున్ను నట్టి యానందైకరసమగు ఆత్మయందే యుండుడు. నేను తమ ఆత్మరూపుడనేయై శుద్ధుడనై, శివరూపుడనై, పవిత్రుడనై, మానవంతుడనైయున్నాను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజ విశ్రాంతియను దొంబదియైదవ సర్గము ॥95॥

## షణ్ణవతితమః సర్గః

[ప్రతిబుద్ధస్య రాజ్ఞోఽత్ర దృశ్యసత్తావమార్జనమ్
యథా భవతి నిశ్శేషం తథా కుమ్భేన వర్ణ్యతే.

దృశ్యసత్త సంపూర్ణముగ నెట్లు తొలఁగునో యా క్రమమిచట ప్రబుద్ధుఁడైన రాజునకు కుంభునిచే వర్ణింపఁబడుచున్నది.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

ఇతి బ్రహ్మణి విశ్రాన్తిమవాప్య స శిఖిధ్వజః
ముహూర్తమాసీత్సంశాన్తమనా నిర్వాతదీపవత్ 1

**శ్రీవసిష్ఠుఁడు:—** ఓ రామచంద్రా! ఇట్లు అఖండబ్రహ్మాకారవృత్తి యుదయించుటచే బ్రహ్మమునందు విశ్రాంతిని బొందినవాఁడై యా శిఖిధ్వజుఁడు రెండుగడియలవఱకు శాంతచిత్తుఁడై, గాలిలేని స్థలమున నున్న దీపమువలె నిశ్చలముగ నుండెను.

నిర్వికల్పసమాధానపరేణాశు వివిక్షితమ్
స్వలీలమేతి కుమ్భేన ఝటిత్యేవ ప్రబోధితః. 2

అత్తఱి రాజు శీఘ్రముగ నిర్వికల్పసమాధియందుఁ బ్రవేశించుట కభిముఖుఁడు కాఁగా కుంభరూపధారిణియగు చూడాల స్వలీలచే నాతనిని త్వరితముగఁ బ్రబోధితమొనర్చెను.

**కుమ్భ ఉవాచ:—**

రాజన్నజ్ఞాననిద్రాతః ప్రబుద్ధోఽసి శివః స్థితః
కార్యం నాస్తమయేనైవ న చానస్తమయేన తే. 3

**కుంభుఁడు:—** ఓ రాజా! నీవిపుడు అజ్ఞాననిద్రనుండి మేల్కాంచి, శివరూపుఁడవై చెన్నొందుచున్నావు. కావునిఁక (నిర్వికల్పసమాధిచే) నీదృశ్యము నస్తమింపఁజేయుటవలనగాని, అస్తమింపకఁజేయుటవలనగాని నీకు ప్రయోజన మేమియులేదు.

సకృదేవ విభాతాత్మా నష్టానిష్టపదాత్మకః
కలాకలననిర్ముక్తో జీవన్ముక్తోఽద్య సాంప్రతమ్. 4

ఒక్క పర్యాయ మాత్మను దర్శించుటచేతనే నీయనిష్టములన్నియు నశించినవి కాన, నీవిపుడు సమస్తకల్పనలనుండి విముక్తుఁడవై జీవన్ముక్తుఁడవై వెలయుచున్నావు.

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

కుమ్భేన బోధితస్త్వేవం స బభూవావబోధవాన్
వినిర్గతో రరాజోచ్చైర్మహామోహానసముద్గకాత్. 5

**శ్రీవసిష్ఠుఁడు:—** ఓ రామచంద్రా! కుంభుఁడిటు పల్క, బోధయుక్తుఁడగునారాజు మహామోహబంధనమునుండి వినిర్గతుఁడై మిగుల శోభించెను.

విశ్రాన్తధీః క్షణేనైవ పశ్యన్దృశ్యస్య వస్తునః
అసత్తామేవ ముక్తాత్మా లీలయా సమువాచ హ. 6

క్షణకాలములోనే విశ్రాంతచిత్తుఁడై, ముక్తాత్ముఁడైన యారాజు దృశ్యవస్తువుయొక్క యసత్తను గాంచుచు లీలాపూర్వకముగ కుంభునితో నిట్లనియె—

శిఖిధ్వజ ఉవాచ:—

జ్ఞాతప్రాయమపీదం తు యత్పృచ్ఛామి తదుచ్యతామ్
భూయో నిపుణబోధాయ మమ మానద మోదద.

శిఖిధ్వజుఁడు:— మానప్రదా! ఆనందదాయకా! నాకుఁ దెలిసినట్లున్నదైనప్పటికి, దృఢబోధకొఱకై మఱల తమ్ముల నేదియడుగుదునో దానిని వచింపఁగోరెద.

శివే శాన్తే నిరాభాసే పదేఽనుల్లసితాత్మని
ద్రష్టృదర్శనదృశ్యాఖ్యో విశ్వాత్మా ప్రత్యయః కుతః. 8

శివమై, శాంతమై, నిరాభాసమై, అప్రకటితమైనట్టి ఆత్మయందు ద్రష్టృ, దర్శన, దృశ్యరూపమగు ఈప్రపంచముయొక్క ప్రతీతి యెటునుండి యేతెంచినది?

కుమ్భ ఉవాచ:—

సాధు పృష్టం మహారాజ రాజసే వాథ భాస్వరః
ఏతదేవ హి తే శిష్టం జ్ఞాతుం యత్తదిదం శృణు. 9

కుంభుఁడు:— ఓ మహారాజా! బాగుగఁ బ్రశ్నించితివి జ్ఞానావరణము తొలగుటచే నీవిపుడు సూర్యునివలెఁ బ్రకాశించుచున్నావు. నీకిపుడిదియే తెలిసికొనుట కింకను మిగిలియున్నది, కాన నద్దానినిగూడ వినుము.

యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజంగమమ్
సర్వం సర్వప్రకారాఢ్యం కల్పాన్తే తద్వినశ్యతి. 10

సర్వవిధములగు పదార్థములచేఁ బూర్ణమైనట్టి యేస్థావరజంగమాత్మకమగు ప్రపంచము కానవచ్చుచున్నదో, అదియంతయుఁ గల్పాంతమున నశించును.

తతః స్తిమితగమ్భీరం న తేజో న తమస్తతమ్
మహాకల్పవిలాసాన్తే సత్సారమవశిష్యతే. 11

ఆ మహాకల్పాంతమున నత్యంతనిశ్చలమై, గంభీరమై, తేజముగానిదై, అంధకారముగానిదై వ్యాపించినట్టి సారభూతమగు సన్మాత్రమే శేషించును.

చిన్మాత్రమమలం శాన్తమాభాతం పరమం నభః
సమస్తకలనోన్ముక్తం యుక్తం పరమయా ధియా. 12

యదేకోదితమత్యచ్ఛం శాన్తమాతతముజ్జ్వలమ్
పరమాత్మాత్మకం తేజస్తిమితం జ్ఞప్తిమాత్రకమ్. 13

అద్యాది చిన్మాత్రమై, నిర్మలమై, శాంతమై, ప్రకాశమయమై, అతిసూక్ష్మమగు చిదాకాశమై, సమస్తకల్పనావిముక్తమై, నిజస్వరూపమును సాక్షాత్కరించునట్టి బుద్ధితోఁగూడినదై, ఏకమై, అతిస్వచ్ఛమై, సర్వత్రవ్యాప్తమై, ఉజ్జ్వలమై, పరమాత్మమయమై, గంభీరమై, తేజోరూపమై, జ్ఞప్తిమాత్రమై యుండును.

అప్రతర్క్యమవిజ్ఞేయం సమం శివమనిన్దితమ్
బ్రహ్మ నిర్వాణమాపూర్ణమాపూర్ణోదిత సంవిదా. 14

మఱియు, ఆ పరమాత్మయగు బ్రహ్మము తర్కించుటకు యోగ్యముగానిదై, అవిజ్ఞేయమై, సర్వత్ర యేకరసమై, శివమై, అనిందితమై, నిర్వాణరూపమై, సర్వత్ర యుదయించిన నిజబోధచే బూర్ణమై యొప్పును.

అణీయసామణీయశ్చ స్థవిష్ఠం చ స్థవీయసామ్
గరీయసాం గరిష్ఠం చ శ్రేష్ఠం చ శ్రేయసామపి. 15

ఆ బ్రహ్మము సూక్ష్మతరపదార్థములకంటెను సూక్ష్మతమమై, స్థూలతరపదార్థములకంటెను స్థూలతమమై, గురుతరపదార్థములకంటెను గురుతమమై, శ్రేష్ఠతరపదార్థములకంటెను శ్రేష్ఠతమమై యున్నది.

ఈదృశం తత్పరం సూక్ష్మం తస్యాగ్రే యదిదం నభః
అణోః పార్శ్వే మహామేరురివ స్థూలాత్మ లక్ష్యతే. 16

ఆ యాత్మయగు బ్రహ్మమెంత సూక్ష్మమైనదనఁగా పరమాణువు ఎదుట మహామేరుపర్వతమెంత స్థూలముగాఁ గన్పట్టునో, ఆయాత్మయెదుట నీయాకాశమున్ను నంతస్థూలముగాఁ గన్పట్టును.

ఈదృశం తత్పరం స్థూలం యస్యాగ్రే యదిదం జగత్
పరమాణువదాభాతి క్వచిదేవ న భాతి చ. 17

మఱియు ఆ యాత్మ (బ్రహ్మము) యెంత స్థూలమైనదనఁగా—అద్దానియెదుట నీసమస్తబ్రహ్మాండమున్ను పరమాణువువలె గోచరించును. ఒకచో, కేవలము గోచరింపకనే యుండును.

విశ్వాత్మకచనం నామ పదేఽసంభవ వేధసః
తదహంవేదనం విద్ధి విరాడాత్మా జగత్స్థితమ్. 18

ఓరాజా! మాయాశబలితమగు నధిష్ఠానరూపమైన బ్రహ్మపదమున, పూర్వకాలపు జగత్తుయొక్క సంస్కారోద్భవముచే నుద్భూతులగు నాయాప్రాణుల కర్మననుసరించి, అధ్యాసముచే నేప్రపంచము యొక్క స్ఫురణమగుచున్నదో, దానినే నీవు పరమాత్మనుండి యుత్పన్నమైన బ్రహ్మదేవుని యహంభావరూపమగు జ్ఞానాధ్యాసమని యెఱుఁగుము. ఆ బ్రహ్మదేవుని యహంభావమునందే విషయరూపమున ఈజగత్తు స్థితినొందియున్నది. అట్టిజగత్స్థితినే విరాడ్రూపమగు విషయాధ్యాసమని తెలిసికొనుము.

వాతస్య వాతస్పన్దస్య యథా భేదో న విద్యతే
శూన్యత్వాఖతోర్వపమయోశ్చిన్మాత్రాహం త్వయోస్తథా. 19

వాయు చలనములకును, శూన్యత్వ, ఆకాశములకును భేద మెట్లులేదో, అట్లే చిన్మాత్ర, అహంభావరూపస్ఫురణము (హిరణ్యగర్భు)లకును భేదమేమియులేదు.

జలేఽస్తి దేశకాలాన్తే తథా జగదకారణం
పరేఽస్తి దేశకాలాన్తే తథా జగదకారణమ్. 20

దేశకాలములచే పరిచ్ఛిన్నమగు జలమునఁ దరంగాదులు సకారణముగ నున్నవిధమున, దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నమగుఁ బరమాత్మయందు కారణముగ నీజగత్తున్ను నున్నది.

హేమ్న్యస్తి దేశకాలాన్తే కటకాది సకారణమ్
బ్రహ్మణ్యదేశకాలాన్తే తథా జగదకారణమ్. 21

దేశకాలములచే, పరిచ్ఛిన్నమగు సువర్ణమునఁ గటకాద్యాభరణములు సకారణముగ నున్న విధమున, దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నమగు బ్రహ్మమున అకారణముగ నీజగత్తున్ను గలదు.

ఈదృశం తద్వరిష్ఠంచ జగద్రాజ్యం తదక్షతమ్
నద్వైతమమలం శాన్తం జగత్తృణలవాయతే. 22

ఇట్టిజగద్రూపరాజ్యమునకు ఆబ్రహ్మము మహారాజైయున్నది సర్వశ్రేష్ఠమై, నాశరహితమై, ద్వైతవర్జితమై, నిర్మలమై, శాంతమైనట్టి యాబ్రహ్మముయొక్క సమ్ముఖమున నీజగత్తు తృణమువలె, దుచ్ఛముగఁదోచును.

ఈదృశం తత్పరం శ్రేయస్తస్మిన్సతి యదీశ్వరే
జగత్పదార్థసార్థశ్రీః సా సత్తామేతి వేదనాత్. 23

ఇట్లు పరమశ్రేయోరూపమగు ఆబ్రహ్మముండుటచేతనే యీ జగత్తుయొక్క పదార్థముల శోభ స్ఫురణ (వేదనా)మాత్రముచే సత్తను బొందుచున్నది.

తత్సారమేకమేవేహ విద్యతే భూపతే తతమ్
ఏకమేకాన్తచిత్కాన్తం నైకమప్యద్వితావశాత్. 24

ఓ రాజా! సారభూతమైనట్టి యాబ్రహ్మమొకటియే సర్వత్ర వ్యాపించినదై, చిన్మాత్రస్వరూపమై నిరుపాధికప్రేమపదమై, అద్వితీయమై, ద్వైతైక్యపరివర్జితమైయున్నది.

తస్మాద్ద్వితీయా కలనా కాచిన్నామ న విద్యతే
ఆత్మతత్త్వమలం భాతం తదేవాపూర్ణమక్షయమ్. 25

ఇక్కారణమున ద్వితీయకల్పన యెద్దియును లేదు. సర్వథా పూర్ణమై, అక్షయమై నిర్మలమైనట్టి ఆత్మతత్త్వమే ప్రకాశించుచున్నది.

సంస్థితం సర్వదా సర్వ సర్వాకారమిహోదితమ్
అదృశ్యత్వాదలభ్యత్వాన్న తత్కార్యం న కారణమ్. 26

ఆయాత్మ సదా సర్వరూపమై, సర్వాకారముగ నుదయించు నట్లున్నదై యొప్పుచున్నది.

మఱియు నది నేత్రాదీంద్రియములచే నదృశ్యమున్ను, హస్తాదులచే నలభ్యమున్ను నగుటచే కార్యము గాకయు, కారణముగాకయు నున్నది.

ప్రత్యక్షాదేరగమ్యత్వాత్కిమప్యేవ తదుత్తమమ్
సర్వం సర్వాత్మకం సూక్ష్మమచ్ఛానుభవమాత్రకమ్. 27

ఆబ్రహ్మము ప్రత్యక్షాదిలౌకిక ప్రమాణములచేఁ బొందబడనిదియు, స్వానుభవైక గమ్యమున్ను, నిరతిశయానందస్వరూపమున్ను, సర్వశ్రేష్ఠమున్ను, సర్వరూపమున్ను, సర్వాత్మకమున్ను, అతి సూక్ష్మమున్ను, స్వచ్ఛమున్ను అనుభవమాత్రమున్నునై యున్నది.

అఖ్యానాఖ్యాస్వరూపస్య నిరాభాసప్రభాదృశః
సతో వాప్యసతో వాథ కథం కారణతా భవేత్. 28

శబ్ద,తదర్థ(సర్వవస్తు)స్వరూపమై—లేక, వ్యక్తావ్యక్తస్వరూపమై, నిరాభాసమైనట్టి దృఙ్మాత్రమై, పరమార్థదృష్టియందు సత్తుగను, వ్యవహారదృష్టియందు అసత్తుగను — ఇట్లు సదసద్రూపముల భాసించు ఆబ్రహ్మమునకుఁ గారణత్వమెట్లు సంభవించును?

యద్వై న కస్యచిద్బీజమనాఖ్యత్వాన్న కారణమ్
న కించిజ్జాయతే తస్మాత్ప్రమాణాది తతాత్మనః. 29

ఆ బ్రహ్మము నామరూపరహితమగుటచే దేనియొక్కయు బీజముగాని, కారణముగాని గాకయున్నది. కాన వ్యాపకరూపమగు ఆపరమాత్మనుండి ప్రమాణప్రమేయరూపమగు ఈ జగత్తు కించైనను జనింపనేరదు.

అకర్తృ కర్మకరణం సత్యం చిద్ఘనమక్షతం
ఆత్మరూపమనాభాసం స్వయంవేదనమక్షతమ్. 30

కర్తృ, కర్మ, కరణాదిరహితమై, సత్యమై, నాశరహితమై, చిద్ఘనమాత్రమై, నిరాభాసమైనట్టి, ఆ యాత్మస్వరూపము స్వయముగ ననుభవమాత్రమై యున్నది.

తస్మాన్న జాయతే కించిత్పరస్మాద్బ్రహ్మణో మునే
కథం కిం లభ్యతే కేన యత్నోర్వ్యాది సకారణమ్. 31
పరేఽస్తదేశకాలాన్తే యథా జగదకారణమ్

ఓ మునీ! కాన, ఆపరబ్రహ్మమునుండి యేదియు నుత్పన్నమగుటలేదు. ఏలయనిన, జలమునుండి సకారణముగ నుత్పన్నమైన తరంగాదులైనను జలముకంటె వేఱుగ నొకించైనను లభ్యముగాకయుండగా ఇంక బ్రహ్మమునుండి నిష్కారణముగ నుత్పన్నమైన జగత్తుఎట్లు ఎవనికి ఎందులకు భిన్నరూపముగ లభించును? దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్నమగు పరబ్రహ్మమున అకారణముగ ఈజగత్తు కలదను విషయము పూర్వము వచించియే యున్నాను.

శిఖిధ్వజ ఉవాచ:—

జలాదౌ యత్తరఙ్గాది తత్సకారణమస్తి హి. 32

పరే జగదహన్త్వాది నాకారణమువైమ్యహమ్

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! జలాదులందుఁ దరంగాదులు సకారణమైయు, బ్రహ్మమున జగదహంత్వాదులు అకారణములైయు నున్నవను విషయమును నేను గ్రహింపఁజాలకుంటిని.

కుమ్భ ఉవాచ:—

ఇదానీం తత్త్వతో జ్ఞాతమేతత్సత్యం మహీపతే. 33

కుంభుడు:— ఓ రాజా! పంచీకృతములగు జలాదులు సముద్రమునకుఁ గారణములు, మఱియు, బాహ్యవాయ్వాదులు సహకారికారణములు. కాన, జలముయొక్క పరిణామమగు దరంగాదులు సకారణములైయున్నవి. బ్రహ్మముయొక్క కారణము అప్రసిద్ధమైయుండుట చేతను, అట్టి సహకారి కారణము లేనందు చేతను, అద్దానియొక్క పరిణామము జగత్తు కాఁజాలదు. పైదృష్టాంతము వచించుటయందిదియే నాయభిప్రాయము. కాని, ఇవ్విషయమును తత్త్వజ్ఞానములేని అజ్ఞులెఱుంగఁజాలరు. నీవైతే యథార్థరూపమున సత్యము (అద్వైతవస్తువు) నెఱింగియున్నావు. గాన నివ్విషయ మిపుడు నీకు సుబోధకము కాఁగలదు.

ఇదం జగదహన్త్వాది నేహ కించిన్న విద్యతే
జగచ్ఛబ్దార్థరహితం జగదస్తి శివాత్మకమ్. 34

ఓ రాజా! ఈజగత్తుగాని, అహంత్వాదులుగాని యేవియు పరమాత్మయందు లేవు. కాని జగత్తుయొక్క శబ్దార్థములులేని, శివాత్మక (పరమాత్మరూప) మైనదేయగు జగత్తు యందుఁగలదు.

వ్యోమ్న్యేవ నిర్మితం శాన్తం వ్యోమ్నా సూక్ష్మతరేణ చ
యథా నభసి శూన్యత్వం తథేదం జగదీశ్వరే. 35

ఆకాశమునందాకాశముకంటె సూక్ష్మతరమైన మాయాకాశముచే నిర్మితమగు గంధర్వ నగరము మిథ్యాత్వముచే నిత్యశాంతమై యాకాశ సత్తవలెనే యెట్లు తోఁచునో, మఱియు శూన్యత్వ మాకాశమందెట్లుండునో, అట్లే యీజగత్తున్ను యీశ్వరునియందు (బ్రహ్మమున) గలదు.

సదృశం స్వస్వరూపేణ న వా రూపేణ కేనచిత్
ఏవం రూపం జగదిదం సమ్యగ్జ్ఞాతం శివం భవేత్. 36

ఈ జగత్తును చైతన్యరూపముగగాని, శూన్యరూపముగగాని లెస్సగ నెఱుఁగుటచే నది బ్రహ్మరూపమే కాఁగలదు.

సమ్యగ్జ్ఞానప్రభావేణ విషమప్యమృతాయతే
అసమ్యగ్జ్ఞాతమశివం జగద్దుఃఖప్రదం పరమ్. 37

సమ్యక్ - జ్ఞాన ప్రభావముచే విషమున్ను అమృతతుల్యమగుచున్నది. అసమ్యక్ - జ్ఞానముచే ఈజగత్తు అమంగళకరమై, మహాదుఃఖప్రదమై యొప్పును.

విషబుద్ధ్యామృతమపి భుక్తం విషరసాయతే
ఈదృశశ్చ యథా వేత్తి యద్యదేవ చిదీశ్వరః. 38
తత్తథైవాశు భవతి తాదృగ్రూపతయా శివః

విషమను దలంపుతో నమృతమును భుజించినను నది విషకార్యమునే యెట్లు చేయుచున్నదో, అట్లే మాయాశబలితుండగు నీశ్వరుండేయే యనుభవము నొందునో, శీఘ్రముగ నాయాపదార్థరూపమే యగుచున్నాడు.

యథా జ్వాలాభ్రమాజ్జాతా విచిత్రా కారవిభ్రమైః. 39
తిష్ఠత్యనన్యరూపైవ బ్రహ్మసత్తా తథైవ హి

జ్వాలా తిమిరాది నేత్రదోష విభ్రమముచే నాకసమున కేశములు, ముత్తెములు మున్నగు విచిత్రాకారము లుదయించినను. అవియన్నియు నాకాశరూపముగనే యుండునట్లు, ఈ జగత్తు స్ఫురించినదైనను బ్రహ్మసత్తగనే యుండును.

యత్పరం చిత్స్వరూపేణ స్థితమాత్మని మస్థరమ్. 40
తత్తేన దేహదేహ్యాదిర్జగదాదీవ లక్ష్యతే
కేవలం పరమేవేత్థం పరమం భాసతే శివమ్. 41

చిత్స్వరూపమగు పరబ్రహ్మము తనయందెపుడు మందప్రబోధయుక్తమై యుండునో, అప్పుడది దానిచే, దేహము, దేహి(జీవుడు) ఇత్యాది జగత్స్వరూపాదులవలెఁ గన్పట్టును కాని, దృఢజ్ఞానయుక్తముకాఁగా పరమ శాంతమగు కేవల శివరూపముగనే భాసించును.

అతో జగదహన్త్వాది ప్రశ్న ఏవాత్ర నోచితః
యద్వస్తు విద్యమానం సత్ప్రశ్నస్తత్ర విరాజతే. 42

ఇక్కారణమున, జగత్తు, అహంత్వాదులు బ్రహ్మమెట్లగునను ఈప్రశ్న అనుచితమేయగును. విలయనిన, ఏవస్తువు విద్యమానమైయుండునో దానినిగూర్చిన ప్రశ్నయే శోభించును.

ప్రేక్షితం యత్తు నాస్త్యేవ ప్రేక్షాప్రశ్నేన తత్రకిమ్
సంనివేశం వినా సత్తా యథా హేమ్నో న విద్యతే. 43
తథా జగదహంభావం వినా నేశస్య సంస్థితిః
అకారణత్వాన్నాస్తీదం బ్రహ్మైవేత్థం విజృమ్భతే. 44

విచారింపగా నెయ్యది లేనిదగునో, అద్దానింగూర్చిన విచారణచే గాని, ప్రశ్నచేగాని యేమి ప్రయోజనము? ఆకారరచనలేనిచో సువర్ణమెట్లుండదో, అట్లే జగదహంభావములులేనిచో, తత్ప్రశ్నార్హతయు నీశ్వరునియందుండదు. కారణములేక యున్నందున జగత్తు యథార్థముగ లేనిదే యగును. కాన బ్రహ్మమే జగద్రూపముగ విజృంభించుచున్నదగును.

అజృమ్భమానమేవేదం జగత్త్వేనేవ సంస్థితం
యన్మయా ఏవ తేనైవ మిథః సంప్రేరితాశయమ్. 45

ఆ పరమాత్మయే స్థూలరూపముయొక్క కల్పనచే ప్రకాశీలుఁడై స్వయముగ విరాట్ (బ్రహ్మదేవుని) రూపమును ధరించుచున్నాఁడు. మఱియు వ్యష్టిజీవభావముచే జగద్భ్రాంతికారణమున నీజగత్తును సత్యముగ జూచుచున్నాడు. లేక, పరమార్థదృష్టిచే నధిష్ఠానమగు సత్తుగ దీని గాంచుచున్నాడు. అతఁడే భావనాదార్ఢ్యముచే నండజాది చతుర్విధజీవరూపత్వమును, దృశ్యరూపత్వమును క్షణములో బొందుచున్నాఁడు.

శాన్తం జగత్ప్రసరరూపతయా స్వభావ
శబ్దార్థముక్తమిదమవ్యపదేశ్యమేకం
వస్తు స్థితం నిజ చమత్కరణావలోక
రూపం జగత్స్వరహితానుభవాత్మతత్త్వమ్. 52

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజావబోధనం నామ.
షణ్ణవతితమః సర్గః ॥ 96 ॥

ఈ శాంతమగు బ్రహ్మము స్వభావముగనే నామరూపరహితమై అనిర్వచనీయమై యొప్పుచున్నది. యథార్థముగ, ప్రకాశరూపమై, అనుభవాత్మకమై, ఏకమైనట్టి పరబ్రహ్మమే స్వమాయచే నిజ చమత్కృతిద్వారా జగత్తువలె దృశ్యదర్శనరూపమై వెలయుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యామున శిఖిధ్వజావబోధమను దొంబదియాఱవ సర్గము ॥96॥

---

## సప్తనవతితమః సర్గః

[పూర్వత్రాకారణం న జాతమితి మార్జితమ్
విమార్జ్యతేఽత్ర యత్నేన దృశ్యవేదనతా చితః.

క్రిందటి సర్గయందు దృశ్యముయొక్క అకారణత్వము, లేమి వర్ణింపఁబడెను. ఈ సర్గయందు దృశ్యజగత్తుయొక్క మార్జనము, మఱియు నద్దాని చిద్రూపత్వము వర్ణింపఁబడుచున్నవి.]

కుమ్భ ఉవాచ:—

హేమ్న్యస్తి దేశకాలాన్తే ఇత్థం జన్యజనిక్రమః
న కించిజ్జాయతే శాన్తాన్న కించిత్ప్రవిలీయతే. 1

కుంభుఁడు:— ఓ రాజా! ఇవ్విధమున. దేశకాలములచే బరిచ్ఛిన్నమైన సువర్ణమునఁగటకాద్యాభరణములు సకారణముగ నెట్లున్నవో, అట్లే పరమాత్మయం దీజగత్తుయొక్క జన్యజనక భావక్రమమున్ను నిష్కారణముగఁగలదు. ఏలయనిన, శాంతమగు పరమాత్మనుండి యేమియు నుత్పన్నమగుటలేదు, అంతేమియు లయమగుటయును లేదు.

స్వసత్తాయాం స్థితం బ్రహ్మ న బీజం న చ కారణం
శుద్ధానుభవమాత్రం తత్తస్మాదన్యన్న విద్యతే. 2
కించిజ్జగదహన్తాది తదేవాన న్తమస్తి హి

బ్రహ్మము తన సత్తయందే తానుండియున్నది. అది దేనికిని బీజముగాని, కారణముగాని కాదు. అది శుద్ధమగు అనుభవమాత్రమేగాని యంతకంటె వేఱేమియుఁగాదు. జగత్తు అహంభావాదు లెవ్వియును లేవు. ఆ బ్రహ్మమే యనంతమై, సమస్తమునై యున్నది.

శిఖిధ్వజ ఉవాచ:—

శివే జగదహంతాది మునే నాస్తీతి వేద్మ్యహమ్ 3
సర్గవేదనమాభాతి కథమేతద్వదాశు మే

శిఖిధ్వజుఁడు:— ఓ మునీశ్వరా! పరమాత్మయందు జగదహంత్వాదు లెవ్వియు లేవను తమ భావమును నేను గ్రహించితిని గాని యీ సృష్టియొక్క జ్ఞాన మెట్లు భాసించుచున్నదో శీఘ్రముగ నాకుఁ దెలియఁజేయుఁడు?

కుమ్భ ఉవాచ:—

విస్తారం తదనాద్యన్తం తత్సంవిదివ తిష్ఠతి. 4
తత్తద్భువనమత్యచ్ఛం తత్తన్మాత్రం జగద్వపుః
న విజ్ఞానమయోఽర్థోఽస్తి న బాహ్యార్థో నాపి శూన్యతా. 5

కుంభుఁడు:— ఓ రాజా! ఈ సృష్టిని విస్తరింపఁజేయునట్టి అనాదియై, అనంతమైన యధిష్ఠానమగు సన్మాత్రమే సృష్టిజ్ఞానమువలె భాసించుచున్నది. ఇక్కారణమున, అధ్యస్తములగు జగదాదులు అధిష్ఠానమగు స్వచ్ఛమైన సచ్చిన్మాత్రమే అయి జగద్రూపముగ భాసించుచున్నవి. కాన జగత్పదార్థరూపము విజ్ఞానవాదుల మతానుసారము విజ్ఞానపరిణామమే యనియు, గౌతమకణాదుల మతానుసారము బాహ్యపృథివ్యాది పంచభూతముల సత్తయే యనియు మాధ్యమికుల మతానుసారము శూన్యత్వమే యనియు వచించుట యుక్తముకాదు.

వేదానామాత్రసారత్వాద్యథా చిత్సార ఉచ్యతే
ద్రవత్వం సలిలస్యేవ చిదచిత్త్వమకారణమ్. 6

సర్వవాదుల మతమునను జ్ఞానమే ముఖ్యమైనది. జ్ఞానమే లేనిచో వస్తుసాక్షాత్కారమెట్లు కలుగును? కాన జలమందు ద్రవత్వమువలె, సమస్తపదార్థములందును చిన్మాత్రమే (జ్ఞానమే) సారమైనది. మఱియు, చిత్తుయొక్క జడజగద్రూపమున భాసించుట యెట్లు గలదో, అది ముత్తెపుచిప్పయందలి వెండివలె కారణరహితమై (అనిర్వచనీయమై) యున్నది.

స్వాత్మనీశమనన్తం తద్యథా స్థితమవస్థితమ్
ప్రతియోగివ్యవచ్ఛేదాభావతః సత్త్వభావయోః. 7

సత్త్వ,తద్విరుద్ధభావములఁగూర్చిన ప్రతియోగీ; వ్యవచ్ఛేదముల అభావముచే, అనంత, చిన్మాత్రమగు పరమాత్మ స్వాత్మయందు జగదాకారముగను, చిన్మాత్రరూపముగను భాసించుటయందు సమ

ర్థమైయున్నను, తానెట్లున్నదో అట్లే తనస్వరూపమున (ద్వంద్వములకుఁబరమైన సద్వస్తువున) స్థితి నొంది యున్నది.

అసత్త్వాత్తేన పరమే స్వచ్ఛభావవ్యవస్థితా
యది కారణతాపత్తియోగ్యం శాన్తం పదం భవేత్. 8

అనిర్జితమనాభాసమప్రతర్క్యం కథం భవేత్
అతో న కారణం నైవ బీజం బ్రహ్మ కదాచన. 9

కార్యస్య కస్యచిన్నామ తేన సర్గో నవిద్యతే
న చాన్యథోపపత్తిర్హి సర్గస్యాస్యోపపద్యతే. 10

చిద్విరుద్ధములగు, అసత్వ, అస్వచ్ఛత్వము లసత్యములగుటచే చిన్మాత్రమగు పరమ పదమునకు స్వచ్ఛభావనయే వ్యవస్థితమైయున్నది స్వచ్ఛమగు చిద్రూపమే అస్వచ్ఛమగు జగద్భావమునకుఁ గారణమనినచో, శ్రుతి, స్మృతి. విద్వదనుభవములందు వచింపఁబడినట్టి, చేష్టా, స్ఫురణరహిత, అప్రతర్క్య అవిజ్ఞేయత్వాదులు చిన్మాత్రమున కెట్లు సంభవించును? కాన, బ్రహ్మము ఏకార్యమునకుఁ గారణముఁ గాని, బీజముగాని కాదు. ఇక్కారణమున ఈసృష్టియున్న యథార్థమున లేనిదేయగును. చైతన్యమందలి అధ్యాసమనుటదప్ప ఈసృష్టినిఁగూర్చి మఱియే యుక్తియున్నదగదు.

చిన్మాత్రకాదృతే తస్మాజ్జడసర్గో న విద్యతే
యదిదం దృశ్యతే కించిత్తచ్చిద్ఘనమిహోత్థితం. 11

అహంభావ జగచ్ఛబ్ద శబ్దార్థరసరఞ్జనమ్
కార్యం న కారణాభావాత్సదార్థే తూపపద్యతే. 12

చిన్మాత్రముతప్ప, జడమైన ఈసృష్టి కొంచెమైనను లేదు. అహంభావము, జగత్తు అను ఈ శబ్దార్థములెవ్వి గన్పట్టుచున్నవో అవి చిద్ఘనమగు పరమాత్మయే తత్తద్రూపముల నావిర్భవించి నట్లున్నదగును. మఱియు, యదృచ్ఛావాదిమతాను సారముగ ఈ జగత్తాకస్మికముగ నుదయించినదియుఁ గాదు. ఏలయనిన, పదార్థములందు, కారణములేక యేకార్యమున్న నుండజాలదు.

ద్విత్వైక్యాద్యాత్మకం వ్యోమ పుష్పవత్స్వానుభూతితః
వస్తునాశైకనిష్ఠత్వాన్న వా జ్ఞముపపద్యతే. 13

పరమాత్మ ద్విత్వైకత్వ, కార్యకారణ భావరహితుఁడైయున్నాడు. ఈ ప్రపంచము నందుఁ దోఁచు జడాంశము ఆకాశపుష్పమువలె కల్పనామాత్రమేయగును. నశ్వర స్వభావము గలదగుటచే ఈ జగత్తు జ్ఞానికి భాసింపకుండును.

ఉపలమ్భకరో నాశో జన్మనస్తస్య వా కుతః
అథచైనం సదా సన్తం నిత్యం నష్టం చ వేత్సివా. 14

పదార్థౌఘం తదేవేత్థమేకరూపేఽపి కిం వృథా
ఉపలమ్భస్తు యశ్చాయమేషా చిత్తచమత్కృతిః. 15

చిద్రూపమునకే నాశము గలదనుచో, అట్టి చిత్తుయొక్క జన్మ, నాశములఁ బ్రకాశింపఁ జేయునదేది ? ఏలయనిన, చిత్తుయొక్క జన్మ, నాశనముల యనుభవము చిత్తుకుఁదప్ప మఱిదేనికగును? స్వభావవాదియొక్క మతమునననుసరించి యొకచో చిత్తు నిత్యముత్పన్నమగునదిగను, నిత్యము నశించునదిగను దలంచుచో, శ్రుతి, విద్వదనుభవసిద్ధమగు నఖండ చిదేకరూపమున వ్యర్థముగ నీకీ బాధయేల? ఈ ప్రపంచమున ననేకపదార్థముల ప్రాప్తి ఎయ్యది సంభవించుచున్నదో, అది కేవలము చిత్తుయొక్క చమత్కారముమాత్రమే యగును.

చితత్త్వమాత్రసత్తాస్తి ద్విత్వమైక్యం చ నాస్త్యలమ్
అతః పదార్థసత్తాయా అభావే సతి భూపతే. 16

ఓ రాజా ! కేవలము చిన్మాత్రముయొక్కయే సత్తగలదు. ద్విత్వ, ఏకత్వములు సర్వథా లేనేలేవు. కాన, యథార్థముగఁ బదార్థముల సత్త లేనిదేయగును.

అసంభవాద్భావనస్య నాహన్తాభావనాస్తి తే
అహంభావాసంభవతశ్చిత్తమన్యత్కిముచ్యతే. 17

పదార్థముల యసంభవముయొక్క భావనచే నీకహంత్వాదులెవ్వియు నుండవు. మఱియు, బదార్థముల యసంభవముచే చిత్తున కన్యముగ చిత్తమనునది యెట్లుండును?

ఇతి చిత్తమహంరూపం నాస్త్యతో న చ భిన్నతా
నిర్వాసనః శాన్తమనా మౌనీ పరనభోమయః. 18

ఓరాజా! ఇక్కారణమున, చిత్తముగాని, అహంరూపము గాని భిన్నత్వముగాని (జీవబ్రహ్మభేదము, చిదచిద్భేదము, దృశ్యానుభవభేదము మున్నగునవి) లేవు. కాన వాసనారహితుఁడవై, శాంతమనస్కుఁడవై, మౌనివై, చిదాకాశమయుఁడవై, ఆత్మమాత్రుఁడవైనట్టి నీవే (ఆత్మయే) శేషింతువు.

సదేహో వా విదేహో వా భావస్థోఽప్యచలోపమః
సంబన్ధాచ్ఛుద్ధచిద్దృష్టేః పదార్థాభావసిద్ధితః. 19

శుద్ధ చైతన్యదృష్టి లభించుటచేతను, జడపదార్థముల అభావము సిద్ధించుటచేతను, సదేహుఁడవైనను, విదేహుఁడవైనను, సమస్తపదార్థములందున్నను, వాటికంటె భిన్నముగ నున్నను, నీవు పర్వతమువలెస్థిరముగ శుద్ధాత్మరూపుఁడవేయై యుందువు.

భావనాభావశ్చిత్తే నాస్త్యేవాహామితి స్వయమ్
ఏవం బ్రహ్మేతి వేదార్థభావనాదనుభూతితః
చేతితార్థైకసత్త్వాత్త్వాచ్చిన్తా నామ క్వ విద్యతే. 20

చిత్తమున భావనయొక్క అభావముచే అహంభావమున్ను లేదు. వేదార్థభావనచేతను, విద్వాంసుల యనుభవముచేతను సత్యజ్ఞానానందమైన అనంత బ్రహ్మమే శేషించుచున్నది. బ్రహ్మచింతనచే ననుభూతమగునట్టి బ్రహ్మమొకటియే సత్యమగుటచే, చింతాదిరూపవృత్తియున్ను క్రమముగ స్వబోధముచే బాధితమై, బ్రహ్మేతరిక్తమగు నెద్దియు మిగిలియుండదుగాన నిఁక చింతనయనునది యెట్లుండును?

తేనాసి నిర్మలమకారణమాదిముక్తం
తద్బ్రహ్మ శాశ్వతమశేషమనేకమేకం
శూన్యం నిరామయమసత్పదనాదిమధ్యం
సర్వం జగచ్చిదపి బ్రహ్మ యథాస్థితం తత్. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజప్రబోధనం నామ సప్తనవతితమః సర్గః ॥ 97 ॥

ఓ రాజా! ఇక్కారణమున, నిర్మలమై, అకారణమై, సమస్తమునకు ఆదియై, ముక్తమై, నిత్యమై, అనేకరూపమైనను ఏకరూపమై, శూన్యమై, నిరామయమై, అసత్పదార్థముల కధిష్ఠానమై, సర్వజగద్రూపమైనను అవికారమైనట్టి శ్రుతిప్రతిపాద్యమగు ఏబ్రహ్మముగలదో, అదియే నీవై యున్నావు

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజప్రబోధమను దొంబదియేడవ సర్గము. ।97॥

---

## అష్టనవతితమః సర్గః

[చిత్తం నాస్తీతి బోధస్య దృఢీకారాయ విస్తరాత్
చేత్యాసత్త్వాదచిత్తం తత్యద్బ్రహ్మైవేతి వర్ణ్యతే.

చిత్తములేదు అను ఈబోధను దృఢపఱచుటకొఱకై, విషయములయొక్క అసత్యత్వము ద్వారా బ్రహ్మమే సత్యమని విస్తారముగ నిటవర్ణింపఁబడుచున్నది.]

శిఖిధ్వజ ఉవాచ:—

చిత్తం నాస్తీతి మే బోధో యథా యుక్త్యా స్ఫుటం భవేత్
తామన్యామథవా బ్రూహి బుద్ధం న నిపుణం మయా. 1

శిఖిధ్వజుఁడు:—మహాత్మా! 'చిత్తములేదు' అను ఈ నాబోధ ఏయుక్తిచే దృఢపడునో అట్టి పూర్వోక్తమగు యుక్తినిగాని, లేక మఱియొక యుక్తినిగాని విస్తారముగ నాకుఁ దెలియఁ జేయుండు. ఏలయనిన, చిత్తముయొక్క అభావమును నేను దృఢముగ నెఱుఁగలేదు.

కుమ్భ ఉవాచ:—

చిత్తం నాస్త్యేవ హే రాజన్కదాచిత్కించన క్వచిత్
యచ్చేదం చిత్తవద్భాతి తద్బ్రహ్మాభిధమవ్యయమ్. 2

కుంభుఁడు:—ఓ రాజా! చిత్తమెప్పుడును ఏదేశకాల వస్తురూపమునను లేదు. చిత్తమువలె నేది భాసించుచున్నదో అది అవ్యయమగు బ్రహ్మమే.

అతోఽజ్ఞానాత్మకం యత్తజ్జగదేవ న విద్యతే
తత్రాహం త్వం తదిత్యాది కల్పితాః కలనాః కుతః. 3

జ్ఞానముచే నెప్పుడజ్ఞానరూపమగు ఈ జగత్తే లేకయుండునో, ఇఁక నపుడు నీవు, నేను, వాఁడు మున్నగు ఈ కల్పితములకు భావము లెచటనుండి కలుగును ?

నాస్త్యేవ జగదేవేదం యచ్చేదం కించనోదితం
బ్రహ్మైవాస్తీహ సకలం కేన తద్బుధ్యతే కథమ్. 4

ఈ జగత్తు యథార్థముగ లేదు, ఇటనే కొంచెముదయించినట్లు తోచుచున్నదో, అదియంతయు బ్రహ్మమే యను నీజ్ఞానము కలిగినపిమ్మట నిఁక నది యెవనికి గోచరించును ? ఏలయనిన, ఏస్థితియందంతయు బ్రహ్మముగనే భాసించునో, అట్టి స్థితియందెవఁక దేని నెవఁడెఱుఁగును ?

మహాప్రలయసర్గాదావేవేదం నోదితం జగత్
నిర్దేశస్త్విదమిత్యత్ర త్వద్బోధాయ మయా కృతః. 5

మహాప్రళయానంతరము సృష్ట్యాదియందును జగత్తు యథార్థముగ నుత్పన్నము గాకయే యున్నది. ఇది చిత్తమువలె భాసించుచున్నదని నీకుఁ దెలిపిన విషయము, నీయొక్క బోధకొఱకు మాత్రమే వచించినదగును.

ఉపాదానాత్మకాదీనాం కారణానామభావతః
అకారణం చ భావానామశేషాణాం త్వసంభవాత్. 6
ఏవమజ్ఞానబుద్ధ్యాత్మ జగత్తస్మాన్న విద్యతే
తస్మాద్యదిదమాభాతి భాసనం బ్రహ్మ నేతరత్. 7

ఉపాదానకారణముల అభావముచేతను, శేషించిన (నిమిత్తకారణరూప) పదార్థముల యసంభవముచేతను, కారణరహితమగు అజ్ఞానరూపబుద్ధియు, చిత్తాత్మకమగు ఈజగత్తున్ను లేనివే యగును. కాన, జగదాకారముగ భాసించు నిదియంతయు బ్రహ్మమేగాని యన్యము గాదు.

అనాఖ్యేఽనాకృతౌ దేవే కరోతీదమితి త్వసత్
భాషితం నోపపత్త్యాత్మ న సత్యం నానుభూయతే. 8

నామరూపరహితుఁడగు పరమాత్మనుగూర్చి 'ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా, ఏకం రూపం బహుధా యః కరోతి'-(ఏకమై, సమస్తమునకుఁ బ్రభువై, సర్వభూతముల యంతరాత్మయై నట్టి పరమాత్మ యొకేరూపము ననేకవిధములుగఁ జేయుచున్నాఁడు)- ఈ మున్నగు వచనములు ఈశ్వరుని విషయమున అర్థవాదమాత్రములే యైయున్నవి. యథార్థముగ యుక్తిశూన్యమగుటచే ఉపపత్తి (కారణ) రహితమగు ఆయాత్మయొక్క విషయమునఁ బై వాక్యములు 'నిష్కలమ్, నిష్క్రియమ్,' మున్నగు శ్రుతి ప్రమాణములచేతను బాధింపఁబడినవై, సత్యములుగానివై, విద్వదనుభవ విరుద్ధములై యున్నవి.

అనాఖ్యోఽప్రతిఘః స్వాత్మా నిరాకారో య ఈశ్వరః
సకరోతి జగదితి హాసాయైవ వచోఽధియామ్. 9

వాస్తవముగ శీతవాతాది ద్వంద్వవర్జితుఁడై, నామరూపరహితుఁడై, నిరాకారుఁడైనట్టి యీశ్వరుఁడు 'జగత్తును రచించుచున్నాఁడను' నీ మొదలగు తాత్పర్యరహితములైన యర్థవాదవచనములు కేవలము హాస్యాస్పదములే యైయున్నవి.

అనేనైవ ప్రయోగేణ రాజంశ్చిత్తం న విద్యతే
జగదేవ న సత్యార్థో కుతశ్చిత్తాది తద్గతమ్. 10

ఓ సాధూ ! ఈప్రకారముగ చిత్తము లేనిదైయున్నది. వాస్తవముగ జగత్తే లేనపుడిఁక తదంతర్గతములగు చిత్తాదులెచట నుండును.

చేతో హి వాసనామాత్రం వాస్యే తు సతి వాసనా
వాస్యం జగత్తదేవాసదతశ్చిత్తాస్తితా కుతః. 11

చిత్తము వాసనారూపమేయైయున్నది. వాసనయొక్క కర్మ (విషయ) మగు జగత్తే లేకయుండ నిక చిత్తముయొక్క అస్తిత్వమెటులుండును?

యదిదం కచతి బ్రహ్మ స్వయమాత్మాత్మనాత్మని
కృతం తస్యైవ తేనైవ చిత్తమిత్యాదినామకమ్. 12

జగత్, చిత్తాదులరూపమున ననుభూతమగు ఇదియంతయు మాయాశబలిత బ్రహ్మము తనయందు, దానేనిర్మించిన చిత్తాదినామకమగు సమూహమేయగును.

జగద్దృశ్యమిదం వాస్యం తదేవోత్పన్నమేవ నో
కారణాభావతః పూర్వమేవాతశ్చిత్తతా కుతః. 13

వాసనా విషయమగు ఈదృశ్యజగత్తు వాస్తవముగ నుత్పన్నముగాకయే యున్నది. కాన కారణముయొక్క అభావముచే నిఁక చిత్తత్వమెచట?

అతశ్చిద్వ్యోమమాత్రాత్మ పరమాకాశనామకమ్
స్ఫారం వేదనమేవేదం కచత్యస్తి కుతో జగత్. 14

ఇక్కారణమున, పరమాకాశ (పరబ్రహ్మ) మను పేరుగల చిదాకాశమమాత్రమే విశాలరూపముగ ననుభూతమగుచున్నది. కాన నిఁక జగత్తెచ్చట?

యత్కించిత్పరమాకాశ ఈషత్క చకచాయతే
చిదాదర్శేన జాతత్వాన్న చిత్తం నో జగత్క్రియా. 15

చిత్స్వరూపమను సద్దమున అనిర్వచనీయరూపముచే నే కొంచెము భాసించుచున్నదో, అది చిదాకాశమే అయియున్నది. ఏలయనిన, యథార్థముగ చిత్తముగాని, జగత్తుయొక్క క్రియగాని యుత్పన్నముగాకయే యున్నవి.

అహం త్వం జగదిత్యేషా ప్రతిప్రత్తిర్న వాస్తవీ
మిథ్యా స్వప్న ఇవాభాతి నూనం మేఽశేషకారిణీ. 16

సర్వానర్థకారకమగు 'నేను, నీవు, ఈజగత్తు' అను నీజ్ఞానము వాస్తవముగాదు. సాక్షియగు నాకిదియంతయు స్వప్నమువలె భాసించుచున్నది.

వాస్యస్య జగతోఽభావాద్యతో నాస్త్యేవ వాసనా
అతస్తదాత్మకం చిత్తం కీదృశం క్వ కుతః కథమ్. 17

వాసనయొక్క విషయభూతమగు జగత్తుయొక్క అభావముచే వాసనయున్ను లేనిదేయగుచున్నది. కాన నిఁక వాసనారూపమగు చిత్తమెచట నెవ్విధముగ నెట్లుండఁగలదు?

అప్రబుద్ధైరవగతం చిత్తం దృశ్యమిదం జగత్
అసచ్చిత్తం నిరాకారం పూర్వముత్పన్నమేవ నో. 18

అజ్ఞానులు చిత్తము, జగత్తు, దృశ్యము మున్నగురూపములచే నెద్దాని నెఱింగిరో, అట్టిఅసత్తై నిరాకారమైనట్టి చిత్తము మొదటనే యుత్పన్నము గాకయున్నది.

నోత్పన్నం కారణాభావాత్సర్గాదావేవ సర్వదా
లోకశాస్త్రానుభవతో న చ దృశ్యస్య వస్తునః. 19
అనాదిత్వమజత్వం వా స్థైర్యం వా హ్యుపపద్యతే
సాకారస్యాస్య జగతః స్థూలస్య ప్రతిఘాకృతేః. 20

కారణముయొక్క అభావముచే సృష్ట్యాదియం దీజగత్తు సర్వదా యుత్పన్నము గాకయే యున్నది. మఱియు, సాకారమై, స్థూలమై, ప్రతిఘాతయోగ్యమగు ఆకృతిగల్గిన దృశ్యజగద్రూప వస్తువును, అనాదియనియు, జన్మాదివికారరహితమనియు, స్థిరమనియు లోక శాస్త్ర, స్వానుభవముల బట్టి వచించుట తగదు.

సమస్తకారణాభావాల్లోకశాస్త్రానుభూతిభిః
యుజ్యన్తే చ నిరాకర్తుం న మహాప్రలయాదయః. 21

సమస్తకారణముల అభావముచేతను, లోక శాస్త్రానుభవములచేతను మహా ప్రళయాదులను (జగత్తుయొక్క వికారములను) నిరాకరించుటకు వీలులేదు.

శాస్త్రానుభవవేదార్థ సిద్ధా నైస్తే త్రయోఽపి వా
ప్రలయాశ్చ న సన్తీతి వక్త్యున్మత్తక ఏవ చ. 22

ఏలయనిన, శాస్త్ర, అనుభవ, వేదార్థ సిద్ధాంతములచే, ప్రళయములు లేవనిగాని, లేక, శాస్త్ర, వేదానుభవములే లేవనిగాని వచించువాఁడున్మత్తుఁడే యగును.

లోకః శాస్త్రాణి వేదాశ్చ ప్రమాణం యస్య నో మతేః
అసదోభ్య హ్యాతిమూఢం స సజ్జనస్తం న సంశ్రయేత్. 23

ఎవని యభిప్రాయమున లోక, శాస్త్ర, వేదములు ప్రమాణములు కావో, అట్టివాఁడు కేవలము లోకమును మాత్ర మాశ్రయించు చార్వాకులకంటెను అతినీచుఁడగును. మఱియు నట్టివానిని సజ్జనులాశ్రయింపరాదు,

నచ సప్రతిఘస్యాస్య దృశ్యస్యాప్రతిఘం క్వచిత్
కారణం భవితుం శక్తం సాకారస్య నిరాకృతి. 24

సాకారమై, ప్రతిఘాతయోగ్యమగు ఈ దృశ్యజగత్తునకుఁ గారణము, నిరాకారమై, అప్రతిఘమైనట్టి బ్రహ్మము కాఁజాలదు.

ఇత్థ మాలక్ష్యమాణం తత్తదేవం సతతం మునే
నచ నార్థక్రియాకారి భవేన్నిత్యమిదం జగత్. 25

ఓ మునీ! ఇవ్విధమునఁ బరమార్థమున బ్రహ్మదృష్టిచే నిత్య మలక్ష్యమగు ఈజగత్తు వ్యవహారదృష్టిచే సాకారత్వమును బొందుటఁబట్టి అర్థక్రియా సమర్థమగుచున్నది.

తస్మాదిదం నిరంశస్య చిద్వ్యోమ్నోఽప్రతిఘాకృతేః
నిరాకృతేరనన్తస్య పూర్వాత్పూర్వ నిరంశతః. 26

బ్రహ్మణః సర్వరూపస్య శాన్తస్యాత్తస్య యత్సమమ్
స్వత ఏవాత్మకచనం సర్గప్రలయరూపధృక్. 27

కాన, నిరంశమై, చిదాకాశమై, ప్రతిఘాత యోగ్యమగు రూపములేనిదై, నిరాకారమై, అనంతమై, పూర్వముకంటెఁ బూర్వమై, పూర్ణస్వభావయుక్తమై, శాంతమై, సర్వత్ర వర్తించునదైనట్టి బ్రహ్మముయొక్క సమమగు ఆత్మప్రకాశమను నిజస్వరూపము స్వయముగనే ప్రళయాదిరూపముల ధరించుచున్నదగును.

స్వకం వపుశ్చ తేనైవ జ్ఞాతం జగదివ క్షణాత్
క్షణాన్తరానుబుద్ధం సద్బ్రహ్మైవాస్తే నిరాత్మని. 28

ఆత్మస్వరూపము అజ్ఞానదశయందు క్షణకాలములోనే జగద్రూపముగ భాసించుచున్నది. మఱుక్షణముననే 'తత్త్వమసి' మున్నగు మహావాక్యములద్వారా ద్వైతరహితమగు బ్రహ్మరూపముగనే భాసిల్లుచున్నది.

బ్రహ్మైవేదమతః సర్వం క్వచిన్న జగదాదిధీః
క్వాచిత్తాది క్వచిత్తాది క్వ ద్వైతైక్యాది కల్పనా. 29

కాన, శాస్త్రీయమగు బోధచే నంతయు బ్రహ్మమే యగుచున్నది. ఇఁక జగదాదులగూర్చిన బుద్ధియెచట? చిత్తాదులెచట? అచిత్తాదులెచట? ద్వైత, అద్వైతాదుల కల్పన యెచట?

సర్వం నిరాలమ్బమజం ప్రశాన్తమనాదిరిత్యాత్మ యథాస్థితం సత్
ఇదం తు నానేవ న చాప్యనానా యథాస్థితం తిష్ఠ సుకాష్ఠమౌనమ్.

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూడా॥ శిఖిధ్వజావబోధనం నామ అష్టనవతితమః సర్గః॥ 98॥

ఇట్లు జ్ఞానము కలుగఁగా ఈజగ త్తంతయు ప్రశాంతరూపమై, నిరాలంబమై జన్మరహిత మై అనాదియై, యథాస్థితమైనట్టి బ్రహ్మమే యగుచున్నది. కాని, అజ్ఞానుల దృష్టియందలి ఈ జగత్తు మిగుల అసత్తగుటచే నానారూపముగాని, ఏకరూపముగాని, గాకయున్నది. కాన నోరాజా! వ్యవ హారదృష్టిచే యథాప్రాప్తమగు వ్యవహారము నాచరించుచు, తత్త్వదృష్టిచే కాష్ఠమౌన మవలంబించి (వాగాదీంద్రియ వ్యాపారరహితుఁడవై) యుండుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజావబోధనమను
దొంబదియెనిమిదవ సర్గము ॥ 98 ॥

---

## ఏకోనశతతమః సర్గః

[ప్రబుద్ధోఽపి నరేన్ద్రోఽత్ర భూయః కుమ్భేన బోధ్యతే
స్థూణానిఖననన్యాయాదోర్చ్యథోఽస్య సుదృఢోఽస్త్వితి.

రాజు జ్ఞానమును బొందినను, స్థూణానిఖనన న్యాయముచే బోధయొక్క దృఢత్వముకొఱకై మరల కుంభునిచే బోధింపఁబడుట యిటఁ గాననగును.]

శిఖిధ్వజ ఉవాచ:—

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మహామునే
స్థితోఽస్మి గతసందేహో విశ్రాన్తమతిరాత్మవాన్. 1

శిఖిధ్వజుఁడు:— ఓ మహామునీ! తమ యనుగ్రహముచే నా యజ్ఞానము నశించినది. ఆత్మ స్వరూపముయొక్క స్మరణము కలిగినది. ఇపుడు సంశయరహితుఁడనై ఆత్మయందు విశ్రాంతి నొంది యున్నాను.

జ్ఞాతజ్ఞేయో మహామౌనీ తీర్ణమాయామహార్ణవః
శాన్తోఽహమనహంరూపో జ్ఞః స్థితోఽస్మి నిరామయః. 2

మహాత్మా! నేను జ్ఞేయపదార్థము నెఱింగితిని. మాయారూప మహాసముద్రమును దాటితిని. నేనిపుడు మహామౌనినై, శాంతుఁడనై, అహంకారవర్జితుఁడనై, ఆత్మజ్ఞానసంపన్నుఁడనై, వికార రహితుఁడనై యున్నాను.

అహో ను సుచిరం కాలం ప్రభ్రాన్తోఽహం భవామ్బుధౌ
స్థానమక్షయమత్యుబ్ధమధునా ప్రాప్తవానహమ్. 3

ఆహా! అతిదీర్ఘకాలమువఱకు నేనీ సంసారసాగరమునఁ దిరుగాడితిని. ఇపుడు దుఃఖరహిత మగు నక్షయస్థానమును బొందియున్నాను.

ఏవం స్థితే మునే నాస్తి సాహన్త్వాదిజగత్త్రయమ్
మూర్ఖబుద్ధమిదం భాతి యత్తద్బ్రహ్మేతి వేద్మ్యహమ్. 4

ఓ మునీ! అజ్ఞానులచే నెఱుఁగఁబడిన అహంకారసహితమగు యీత్రైలోక్యము వాస్తవముగ లేనిదేయగును. ఈ భాసించునదంతయు బ్రహ్మముగనే నేనెఱుఁగుచున్నాను,

**కుమ్భ ఉవాచ:—**

జగదేవ న యత్రాస్తి తత్రాహన్త్వం విభాసనమ్
ఇత్థమమ్బరసంసారః క్వ కుతః కీదృశః కథమ్. 5

కుంభుఁడు:—ఓ రాజా! నిజమే. జగత్తే యెప్పుడు లేదో యిఁక అహంత్వమెట్లు భాసించును? ఈవిధముగ గంధర్వనగరమువలె యీజగత్తెచట నేవిధముగ నేకారణముచే నెట్లు సత్యము కాఁగలదు?

యథాస్థితవ్యవహృతిర్మానీ శాన్తమనామునిః
సౌమార్ణవోదరావర్త పరిస్పన్దవదాస్స్వ భోః. 6

ఓ రాజా! నీవు యథాప్రాప్తములగు వ్యవహారములఁ జేయుము, మానివై, శాంతమనస్కుఁడవై, మననశీలుఁడవై, శాంతసముద్రమున శాంతమగు నావర్తముఁబోలి యుండుము.

బ్రహ్మరూపమిదం శాన్తమిత్థమస్తి యథాస్థితమ్
అహం జగదిదం చేతి శబ్దార్థాత్మ నభోమయమ్. 7

ఇదియంతయు యథాస్థితమగు శాంతమైన బ్రహ్మరూపమే యైయున్నది. 'నేను, ఇది' జగత్తు మున్నగు శబ్దార్థముల స్వరూపము శూన్యమే యగును.

ఇదమాద్యన్తరహితం సర్వం సంసారనామకమ్
చిచ్చమత్కృతినామాత్త నభః కచకచాయతే. 8

చిత్ - చమత్కృతియను పేరుగల్గినట్టి ఆత్మరూపమగు ఆద్యంతరహితమైన చిదాకాశమే తన చాకచక్యముచే ఈ జగద్రూపమునఁ బ్రకాశించుచున్నది.

సంనివేశదృశః శాన్తౌ తదస్తి కనకం యథా
జగదాద్యర్థసంశాన్తౌ బ్రహ్మేదం విద్యతే తథా. 9

కటకకుండలాద్యాభరణముల యాకారము నశింప కేవలము సువర్ణము మాత్రమెట్లు మిగిలి యుండునో, అట్లే జగత్తుయొక్క నామరూపములు శమింప నిదియంతయు బ్రహ్మమాత్రముగనే మిగిలియుండును.

తథా స్వయంభూః సంకల్పః స్వయం నామ తథైవ హి
ఏతౌ స్వవేదనాయత్తౌ బన్ధమోక్షౌ వ్యవస్థితౌ. 10

సమష్ట్యహంకారాత్మకుఁడగు బ్రహ్మదేవుఁడు సంకల్పమాత్రుఁడెట్లగునో, అట్లే వ్యష్ట్యహంకారాత్మకుఁడగు జీవుఁడున్ను స్వయముగ సంకల్పమాత్రుఁడే యగును. సంకల్పముచే బంధమున్ను, తత్పరిత్యాగముచే మోక్షమున్ను వ్యవస్థితములై యున్నవి.

అహమిత్యేవ సంకల్పో బన్ధాయాతి వినాశినే
నాహమిత్యేవ సంకల్పో మోక్షాయ విమలాత్మనే. 11

'దేహాది సంఘాతము నేను' అను సంకల్పమే నాశకరమగు బంధమును గలుగఁజేయుచున్నది. 'దేహాదులు నేనుగాను' అను సంకల్పమే నిర్మలమగు మోక్షమును గలుగఁజేయుచున్నది.

యద్బన్ధమోక్షసంకల్ప శబ్దార్థానాం సదా సతామ్
స్వరూపవేదనం తత్సత్కైవలత్వం చ కథ్యతే. 12

సదా పర్యాయముగానుండునట్టి బంధమోక్ష, సంకల్పాది శబ్దార్థములకు సాక్షిభూతమగు ఏయాత్మగలదో, అద్దానిస్వరూపముయొక్క సాక్షాత్కారజ్ఞానమే సద్బ్రహ్మయనియు, కైవల్యమనియుఁ జెప్పఁబడుచున్నది.

అనహంవేదనం సిద్ధిరహంవేదనమాపదః
సోఽహమేవానహమితి శుద్ధబోధో భవాత్మవాన్. 13

అహంభావజ్ఞానము లేకయుండుటయే మోక్షము. అహంభావజ్ఞానము గలిగియుండుటయే బంధరూపమగు ఆసక్తి కావునట్టి అహంభావమును త్యజించి, 'నేను సద్రూపుడను, అహంభావరహితుఁడను' అను జ్ఞానముచే శుద్ధాత్మబోధివి కమ్ము.

అసంకల్పనమాత్రేణ సమ్యగ్జ్ఞానోదయాత్మనా
సంకల్పః క్షీయతే సిద్ధ్యై స్వయమేవాసదాత్మకః. 14

సమ్యగ్ జ్ఞానమును గలుగఁజేయునదైన 'నిస్సంకల్పన' మాత్రముచే మోక్షసిద్ధి చేకూరును. మఱియు అసద్రూపమగు సంకల్పమపుడు తనంతటఁదానే నశించును.

అప్రతర్క్య స్వరూపే హి నాస్తి కారణతా శివే
కారణాభావతః కార్యపదార్థోఽపి న విద్యతే. 15
పదార్థా భావసంసిద్ధా వేదనం నోపపద్యతే
కారణాభావతో నిత్యమహంభావస్య నోదయః. 16
అహంభావానుదయతః సంసారః కస్య కీదృశః
సంసారాభావతః సర్వం పరమేవావశిష్యతే. 17

అప్రతర్క్య స్వరూపమగుఁ బరమాత్మయందుఁ గారణత్వము సంభవింపదు. కారణాభావముచే కార్యపదార్థమున్ను నుండఁజాలదు. పదార్థముల అభావముచే వానిజ్ఞానమున్ను సిద్ధింపనేరదు. మఱియు కారణాభావముచే అహంభావమెపుడును నుదయింపనేరదు. అహంభావ ముదయింపమి యీ ప్రపంచ మెవనికి నెట్లుండఁగలదు? ప్రపంచముయొక్క అభావముచే సమస్తము కేవలము పరబ్రహ్మమాత్రమై శేషించును.

యదిదం భాసతే తత్సత్పరమేవాత్మని స్థితం
పరం పరే పరాపూర్ణం సమమేవ విజృమ్భతే. 18

జ్ఞానమునకుఁ బూర్వము జగదాకారముగ భాసించునదియు, పరమార్థమున సద్రూపమగు పరబ్రహ్మమే తనయాత్మయందు తాను స్థితమైయున్నదగును. జ్ఞానానంతరము కేవలము తన పరమ స్వభావమున పరమాత్మచే పూర్ణమైన సమస్వరూపమగు పరమాత్మయే ప్రకటమగుచున్నది.

తేన నిస్తిమితం సర్వం శిలాకీర్ణమివాచలమ్
విద్ధి రశ్మిమయాకారమివ బ్రహ్మ జగత్థితమ్. 19

ఇక్కారణమున దట్టమైనట్టి వజ్రశిలయొక్క యుదరభాగమువలె సమస్తము నిశ్చలముగ నున్నది. అట్టి పరమాత్మయందున్న జగత్తును ఆ పరమాత్మయను వజ్రమణియొక్క కిరణసమూహ మయు మైన ప్రతిబింబాకారముగ నీవెఱుఁగుము.

పురః సంకల్పకే నష్టే సంకల్పనగరస్య యత్
రూపం తద్విద్ధి జగతః ఖాదచ్ఛం సదసన్మయమ్. 20

సంకల్పము నశింప, సంకల్పనగరముయొక్క స్వరూపమేది గలదో అదియే యాకాశము కంటె స్వచ్ఛమై, సదసన్మయమైనట్టి యీ జగత్తుయొక్క స్వరూపమని యెఱుఁగుము.

ఛాయాపురుషవత్స్పష్టి శాన్తం నిర్మననం జగత్
జగచ్ఛబ్దార్థరహితం యః పశ్యతి స పశ్యతి. 21

వజ్రశిలయందు ప్రతిబింబించిన పురుషునివలె చలనముగలిగి యున్నదానివలెను (యథార్థముగఁ చలనములేనిదిగను) శాంతముగను, మననరహితముగను, జగచ్ఛబ్దార్థశూన్యముగను, ఈ జగత్తు నెవఁడు గాంచునో ఆతడే నిజముగఁ గాంచువాడగును.

రూపాలోకమనస్కారా నీరసాగమభావనా
సమ్యగ్జ్ఞానావబోధస్య నిర్వాణం వై విదుర్బుధాః. 22

సమ్యగ్ జ్ఞానోదయముచే బాహ్యరూపాలోకములున్ను, అంతరికమనఃకల్పనలున్ను నన్నియు నిస్సారములుగఁదోచును. అట్టి స్థితినే నిర్వాణ (మోక్ష)మని విజ్ఞులు పల్కుదురు.

యథాస్తి వాతో నిఃస్పన్దో యథాస్తి ఖగతోపి వా
యథా హేమా సంనివేశమస్తి బ్రహ్మ జగత్తథా. 23

చలనముయొక్క సన్నివేశములేకయే వాయువున్ను, దీపాద్యాకారముల సన్నివేశములేకయే యాకాశమందలి ప్రకాశమున్ను, కటకాద్యాభరణముల సన్నివేశములేకయే సువర్ణమున్ను యెట్లుగలవో అట్లే జగత్తుయొక్క సన్నివేశములేకయే బ్రహ్మముగలదు.

నీరసా అసదాభాసా జగత్ప్రత్యయకారిణః
రూపాలోకమనస్కారాః సన్తిమే బ్రహ్మరూపిణః 24

బోధచే బ్రహ్మభూతమైనట్టి జగత్తుయొక్క జగత్ప్రత్యయకారకములగు రూపాలోక మనః కల్పనాదులు నీరసములై, మిథ్యాభాసయుతములై యొప్పును.

ఊర్మిశబ్దార్థరహితం యాదృగమ్బు బహూన్యపి
సర్గశబ్దార్థరహితం తాదృగ్బ్రహ్మ నిసర్గవత్. 25

సముద్రమునం దరంగాదు లనేకములున్నను, అవియన్నియు, దరంగశబ్దార్థరహితములై జలమాత్రమే యెట్లుగునో, అట్లే బ్రహ్మమున ననేక సృష్టులున్నను, అవియన్నియు సృష్టిశబ్దార్థరహితములై బ్రహ్మమాత్రమే యగును.

సర్గ ఏవ పరం బ్రహ్మ పరం బ్రహ్మైవ సర్గదృక్
సర్గశబ్దార్థరహితో వాక్యార్థస్త్వేష శాశ్వతః. 26

వాస్తవముగ సృష్టియొక్క శబ్దార్థరహితమగు ఈసృష్టియే బ్రహ్మము, మఱియు బ్రహ్మమే యీసృష్టి ఇదియే 'సర్వం ఖల్విదం బ్రహ్మ'=(ఇదియంతయు బ్రహ్మమే) అను శ్రుతియొక్క శాశ్వతమగు వాక్యార్థము.

బ్రహ్మశబ్దార్థసంపత్తౌ సర్గశబ్దార్థధీః కృతా
సర్గశబ్దార్థసంసిద్ధా బ్రహ్మ శబ్దార్థధీః కృతా. 27

బ్రహ్మమను శబ్దమునకు వృద్ధిపొందించునదియని యర్థముగాన బ్రహ్మశబ్దార్థమందు 'సర్గ' (సృష్టి) శబ్దార్థబుద్ధి గావింపఁబడినది. అట్లే, సర్గశబ్దమునకు త్యాగమను నర్థముగాన సర్గశబ్దార్థమందు బ్రహ్మ (త్రివిధపరిచ్ఛేదత్యాగరూప) శబ్దార్థబుద్ధి గావింపఁబడినది. (అనఁగా, రెంటికి నొకే యర్థమని భావము)

సమస్తశబ్దశబ్దార్థ భావనాభావనోదయమ్
శుద్ధం తిష్ఠతి చిద్వ్యోమ బ్రహ్మశబ్దేన కథ్యతే. 28

సమస్తశబ్దములు, శబ్దార్థములు, వాని భావనలు, భావనలయొక్క యుదయము, ఇట్టి సర్వరూపముచే వర్తించు యేచిదాకాశము గలదో, అదియే 'బ్రహ్మ' శబ్దముచేఁ జెప్పఁబడుచున్నది.

సమ్యగ్దర్శనసంసిద్ధావుభయోరప్యవేదనే
యచ్ఛిష్టమజరం శాన్తం తతో వాగ్వినివర్తతే. 29

సమ్యగ్దర్శనము సిద్ధింప జగచ్ఛబ్ద బ్రహ్మశబ్దముల వాచ్యార్థము నివృత్తముకాఁగా, లక్షణావృత్తిచే శేషించు, అజరమై, అమరమై, శాంతమైనట్టి పరబ్రహ్మమేది గలదో, అద్దానినుండి (బ్రహ్మశబ్దాది) వాక్కున్ను మరలుచున్నది.

సంశాన్తసర్వాత్మకవేదనాఖ్య మస్తీదమేకాత్మక స్వస్వరూపమ్
యథాస్థితం సర్వజగత్స్వరూపమ్ పాషాణరూపం చ పరం జ్ఞరూపమ్. 30

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణేపూర్వార్థే చూ॥ శిఖిధ్వజావబోధనం నామ ఏకోనశతతమః సర్గః ॥ 99 ॥

యథాస్థితమగు ఈజగత్తెయ్యది గలదో, అది అతిదృఢమగుటచే వజ్ర, శిలారూపము వంటిదై, పరబ్రహ్మస్వరూపమై యున్నది. అజ్ఞానముచే నెపుడు సర్వాత్మకజ్ఞానము శమించునో, అపుడున్ను విట వాస్తవముగ ఏకాత్మకస్వరూపమగు బ్రహ్మమేయుండి యుండును. (బ్రహ్మ, జగత్తుల కొకే సత్తయని వచించుట.)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున
చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజావబోధమను
దొంబదితొమ్మిదవ సర్గము ॥99॥

---

## శతతమః సర్గః

[వార్యతే బ్రహ్మవత్సత్త్వం జగతో బ్రహ్మసత్తయా
జన్మాదివిక్రియాఽస్పృష్టం బ్రహ్మైవ సదితీర్యతే.

బ్రహ్మసత్తవలెఁ దోచు జగత్సత్త బ్రహ్మసత్తచే నివారింపఁబడుట, జన్మాది వికారములచే స్పృశింపఁబడని బ్రహ్మమే సత్తుయని తెలుపఁబడుట యిటఁ గానగును.]

**శిఖిధ్వజ ఉవాచ:—**

ఏవం చేత్తన్మహాబుద్ధే యాదృశం కారణం పరమ్
కార్యం తాదృశమే వేదం జగదిత్యేవ వేద్మ్యహమ్. 1

శిఖిధ్వజుఁడు:—ఓ మహాబుద్ధీ! బ్రహ్మము, జగత్తుల కొకే సత్తయగుచో, పరబ్రహ్మమను కారణము సత్యమైనట్లు, జగద్రూపకార్యమున్ను సత్యమగునని నేను నమ్ముచున్నాను.

**కుమ్భ ఉవాచ:—**

యత్ర కారణతా తస్య కార్యం తదుపపద్యతే
యన్న కారణమేవాద్దా తస్మాత్కార్యం కుతో భవేత్. 2

కుంభుఁడు:—ఓ రాజా! మాయాశబలితమగు బ్రహ్మమున జగత్తుయొక్క కారణత్వము గలదు. కాన నద్దానికిఁ గార్యము తగును. నిర్గుణ, శుద్ధబ్రహ్మమునఁ గారణత్వములేదు. కాన నద్దానికి గార్యమెట్లుండును?

నేహాస్తి కారణం కించిన్న చ కార్యం కదాచన
విద్యమానమిదం సర్వం సర్వం శాన్తమజం జగత్. 3

నిర్విశేషమగు బ్రహ్మమునఁ గారణముగాని, కార్యముగాని యేవియు లేవు. మాయాదృష్టిచేతనే యీకార్యకారణభావము స్వీకరింపఁబడినది. యథార్థముగ ఈవిద్యమానమగు జగత్తంతయు శాంతమై, అజమైనట్టి బ్రహ్మమే యగును.

జాయతే కారణాత్కార్యం యత్తత్కారణవద్భవేత్
యన్న జాయత ఏవేహ తస్మిన్సదృశతా కుతః. 4

కారణమునుండి యుత్పన్నమైన కార్యమా కారణమును బోలియే యుండును. కాని, ఏది యుత్పన్నమే గాక యున్నదో, అద్దానియందు సాదృశ్యభావ మెచట ?

బీజమేవ న యస్యాస్తి తత్కథం వద జాయతే
అప్రతర్క్యమనాఖ్యం చ యత్తస్య క్వేవ బీజతా. 5

దేనికి బీజమేలేదో, అది యెట్లుత్పన్నము కాఁగలదు ? అప్రతర్క్యమై, నామరూపరహితమైన దానియందు బీజత్వ మెచట ?

దేశకాలవశాత్సర్వే హేతుమన్తః ప్రమాణగాః
అకర్తృబ్రహ్మవిషయః ప్రమా కారణయోః కథమ్. 6

దేశకాలవస్తువుల వశముచేతనే సమస్తకారణములును, ప్రమాణములును సిద్ధించుచున్నవి. అట్టిచో అకర్తయగు బ్రహ్మము ప్రమాణమునకుఁగాని కారణమునకుగాని విషయమెట్లగును ?

అకర్తృకర్మకరణే నాస్తి కారణతా శివే
తస్మాత్తత్కారణం నాస్తి జగచ్ఛబ్దార్థవేదనమ్. 7

కర్తృ, కర్మ, కరణ రహితమగు పరబ్రహ్మమునఁ గారణత్వములేదు. కాన, జగచ్ఛబ్దార్థానుభవమునకును గారణములేదు.

బ్రహ్మైవ త్వం స్వరూపం సద్యత్స్థితం ధారయస్వ తత్
అసమ్యగ్దృష్టివిషయం తదేవ జగదాచితమ్. 8

ఓ రాజా ! సద్రూపమై, శుద్ధాకాశమువలె నిర్విశేషమైనట్టి బ్రహ్మమే నీవను భావము హృదయమున ధరింపుము. అజ్ఞానుల దృష్టియందా బ్రహ్మమే జగద్రూపముచే వ్యాప్తమైయున్నది.

చిన్మాత్రమజరం శాన్తం యదేకం తత్ప్రమీయతే
తేనైవాయం జగద్బ్రహ్మ సచ్ఛాన్తం బుధ్యతే వపుః. 9

ఏకమై, శాంతమై, అజరమై, చిన్మాత్రమైనట్టి ప్రమ (బ్రహ్మజ్ఞానము) చే ఈజగత్తు బ్రహ్మరూపముగ ప్రమాణీత మొనర్పబడుచున్నది. బ్రహ్మాకారవృత్తి రహితమగు మనస్సుయొక్క భ్రాంతిచే అశాంతమైనట్టి సద్ బ్రహ్మము జగద్రూపమున నెఱుఁగబడుచున్నది.

అన్యథైవ చ యో భావశ్చేతసః పృథివీపతే
స ఏవ నాశః కథితః స్వానుభూతశ్చ పణ్డితైః. 10

ఓ రాజా ! చిత్తముయొక్క అన్యథాభావమునే పండితులనుభవముచే బ్రహ్మస్వరూపముయొక్క హానియని వచించిరి.

చిత్తం నాశస్వభావం తద్విద్ధి నాశాత్మకం నృప
క్షణనాశో యతః కల్ప చిత్తశబ్దేన కథ్యతే. 11

ఓ రాజా ! చిత్తమును నీవు నాశస్వభావము గలదిగను, నాశాత్మకముగను నెఱుంగుము. క్షణకాల మాత్మస్వరూపముయొక్క విస్మరణమును నాశము కల్పకాలమునఁ బడుట చిత్తశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది.

అసంకల్పనమాత్రేణ సమ్యగ్జ్ఞానోదయాత్మనా
సంకల్పః క్షీయతే సిద్ధ్యై స్వయమేవాసదాత్మకః. 12

సమ్యగ్జ్ఞానమును గలుగఁజేయునట్టి అసంకల్పన మాత్రముచే, అసత్తగు సంకల్పరూప చిత్తము క్షయింప మోక్షసిద్ధిచేకూరుచున్నది.

నామ్నైవాఙ్గీకృతాభావం యది విశ్వం హి కథ్యతే
విద్యమానం కథం తత్స్యాన్నను తామరసేక్షణ. 13

కమలనేత్రుఁడవగు నోరాజా! 'తన యధిష్ఠానమగు బ్రహ్మమునఁ బ్రవేశించునది'ని విశ్వ శబ్దమున కర్థము, ఇట్లు తన పేరుచేతనే యీ విశ్వము తన యభావమును స్వీకరించుచుండ నిఁక నిది విద్యమానమై యెట్లుండఁగలదు ?

హస్తావుత్క్షిప్య యో బ్రూతే శూద్రోఽస్మీతి భృశం గిరా
కథం స విప్రో భవతి విప్రత్వం త్వస్య కీదృశమ్. 14

ఎవఁడు తన రెండుచేతుల నెత్తి 'నేను శూద్రుఁడ'నని మాటిమాటికి గొంతెత్తి పలుకునో, ఆతఁడు బ్రాహ్మణుఁడెట్లగును ? మఱియు నాతనికిఁ బ్రాహ్మణత్వ మెట్లుండును ?

విస్మృతధాతురత్యుచ్చైర్మృతోఽస్మీతి విరౌతి యః
మృతిమేవాగతం విద్ధి జీవనం తస్య సంభ్రమః. 15

సన్నిపాతాదులచేఁ గుపితమగు ధాతువుగల మనుజుఁడు 'నేను జచ్చితి'నని మరలమరల బిగ్గరగా నఱచును. అట్టివానిని మరణించినట్లే నీవెఱుఁగుము. వాని జీవితము కేవలము భ్రమమాత్రమే యగును.

భ్రమాకృతి యదస్తీహ దృశ్యతేఽలాతచక్రవత్
మృగతృష్ణాద్విచన్ద్రాది బాలవేతాలకాదివత్. 16

భ్రమాకారములగు జగత్, చిత్తాదులెవ్వి గలవో, అవియన్నియు అలాత (కొఱవి) చక్రమువలెను, మృగతృష్ణాజలమువలెను, రెండు చంద్రులవలెను, బాలునిచేఁ గల్పింపబడిన బేతాళాదులవలెను మిథ్యయైయున్నవి.

తత్కథం కిల నామ స్యాత్సత్యం శ్రమభరాత్మకం
అజ్ఞానభ్రాన్తిరేవాన్తశ్చిత్తమిత్యేవ కథ్యతే. 17

ఏది సర్వథా భ్రాంతిపుంజమే యైయున్నదో, అది సత్యమెట్లగును ? అజ్ఞానజనితమగు భ్రమయే, అంతఃకరణ, చిత్తాదిశబ్దములచేఁ జెప్పఁబడుచున్నది.

అజ్ఞానముచ్యతే చిత్తమసత్సదివ సంస్థితం
అసంవేదనమజ్ఞానం జ్ఞానం సంవేదనం భవేత్. 18

సత్తువలె నున్నట్టి అసత్తగు అజ్ఞానమే చిత్తశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. మఱియు, బ్రహ్మముయొక్క యనుభవము జ్ఞానమనియు, అట్టి యనుభవములేమి అజ్ఞానమనియుఁ బేర్కొనఁబడును.

అజ్ఞానసత్వసంవిత్తే ర్జ్ఞానాత్సంవేదనాత్మయః
జలజ్ఞానం ముధా భ్రాన్తిః సాధో మరుమరీచిషు. 19

ఓ సాధూ ! అజ్ఞాన సత్తయొక్క యనుభవము జ్ఞానానుభవమాత్రముచే నశించును. ఎండమావులందు జలమునుగూర్చిన జ్ఞానము వ్యర్థభ్రాంతియేగదా !

నైతజ్జలమితి జ్ఞానాత్సంవిత్తేః ప్రవిలీయతే
ఇదం చిత్తమితి ప్రౌఢం యదజ్ఞానమలం హృది. 20
నాస్తి చిత్తమితి జ్ఞానాత్తత్సమూలం వినశ్యతి

'జలములేద'ను నీజ్ఞానముచే నెండమావులందలి జలమునుగూర్చిన భ్రాంతియెట్లు నశించునో, అట్లే 'ఇది చిత్తమ'ను హృదయమందలి గాఢమైన అజ్ఞానరూప మాలిన్యము 'చిత్తములేద'ను నీజ్ఞానముచే సమూలముగ నశించును.

యథా రజ్జ్వాంభుజజత్వ మజ్ఞాన భ్రమసంభవమ్. 21
న సర్పోఽయమితి జ్ఞానాద్ధృది రూఢాత్ప్రణశ్యతి
తథాత్మని మనోభూతమజ్ఞాన భ్రమసంభవమ్. 22
చిత్తం నాస్తీతి విజ్ఞానాద్ధృది రూఢాద్వినశ్యతి

అజ్ఞానభ్రమచే నుండయించిన రజ్జువునందలి సర్పత్వభావము, 'ఇది సర్పము కాద'ను నీ జ్ఞానము హృదయమందు రూఢిపడఁగా నెట్లు సంపూర్ణముగ నశించునో, అట్లే, ఆత్మయందు భ్రమచే నుదితమగు మనస్సు, లేక, చిత్తమను అజ్ఞానము, 'చిత్తములేద'ను దృఢజ్ఞానము హృదయమందు రూఢిపడ, వినాశమొందుచున్నది.

చిత్తం మనోఽహమిత్యన్తర్యావదజ్ఞానసంభవమ్. 23
న చిత్తమస్తి నో చైవమహంకారాది సంయుతం
కించిదేవ జగత్యస్మిన్సంవిదేకాన్తనిర్మలా. 24

చిత్తము, మనస్సు, అహంకారము మొదలగు సమస్తమున్ను అజ్ఞానమువలననే జనించుచున్నది. యథార్థముగఁ నీ ప్రపంచమున చిత్తముగాని, అహంకారాదియు క్తమను దేహాదులుగాని లేవు. కేవలము శుద్ధమైనట్టి, ఏకమగు బ్రహ్మసంవిత్తుమాత్రమే గలదు.

తయా సంకల్ప చిత్తాది కృతమాసీద్విమూఢయా
అద్యా సంకల్పతః సర్వం పరిత్యక్తం ప్రబుద్ధయా. 25

అజ్ఞానయుక్తమగునపుడు ఆ చిన్మాత్ర సంవిత్తు సంకల్ప, చిత్తాదుల నిర్మించుచున్నది. కాని జ్ఞానయుక్తమగునపుడు సంకల్పముయొక్క అభావముచే సమస్తమును బరిత్యజించుచున్నది.

సంకల్పేన యథా యాతి త్వసంకల్పేన గచ్ఛతి
పవనేన మహాబాహో జ్వాలాజాలమివానలే. 26

ఓ మహాబాహూ! వాయువుచే నగ్నియందుత్పన్నమైన జ్వాలాసమూహము, తిరిగి, ఆ వాయువుయొక్క అభావముచే నెట్లు నశించుచున్నదో, అట్లే సంకల్పముచే నేది యుత్పన్నమగుచున్నదో, అది సంకల్పాభావముచేత నశించుచున్నది.

ఆత్మతత్త్వైకఘనయా తతయా బ్రహ్మసత్తయా
జగత్సర్వమితి వ్యాప్తం సముద్ర ఇవ వారిణా. 27

సముద్రము జలముచే వ్యాపింపఁబడినట్లు ఆత్మతత్త్వముచే ఘనీభూతమగు సర్వవ్యాపకమైన బ్రహ్మసత్తచే నీజగత్తంతయు వ్యాపింపఁబడియున్నది.

నాహమస్మి న చాన్యోఽస్తి న త్వం నైతే న చిత్తకమ్
నేన్ద్రియాణి న చాకాశమాత్మా త్వేకోఽస్తి నిర్మలః. 28

ఓ రాజా! ఈ ప్రపంచమున నేనుగాని, మఱియొకరుగాని, నీవుగాని, చిత్తముగాని, ఇంద్రియములుగాని, ఆకాశముగాని లేవు. కేవలమేకమై, నిర్మలమైనట్టి ఆత్మమాత్రమే గలదు.

ఘటాద్యాకారరూపేణ స ఏవాయం విలోక్యతే
ఇదం చిత్తమయం చాహమితి కైవ కుకల్పనా. 29

ఆ యాత్మయే ఘటాద్యాకారరూపమునఁ గానుపించుచున్నది అట్టిచో 'ఇది చిత్తము, ఈతఁడు నేను, అనునీకు కల్పన యేమి?

న జాయతే న మ్రియతే కిఞ్చిదస్మిఞ్జగత్త్రయే
కేవలోఽయం చిదుల్లాసః సదసద్భావనాత్మనా. 30

ఈ ముల్లోకములందు నేదియు మరణించుటలేదు, ఏదియు జన్మించుటలేదు, సదసద్భావనారూపమగు నిదంతయుఁ గేవలము చైతన్యముయొక్క విలాసమాత్రమేయైయున్నది.

సర్వమాత్మా పరంబ్రహ్మ సకృత్ప్రకటమాతతమ్
ద్విత్వైకత్వే న విద్యేతే న భ్రాన్తిర్న చ సంభ్రమః. 31

ఏకకాలమున సర్వరూపమున పరబ్రహ్మమగు ఆత్మయే ప్రకటమైనది. ద్విత్వ, ఏకత్వములుగాని భ్రాంతి, మరణాది భయములుగాని యెవ్వియు లేవు.

సర్వేన్ద్రియగణాకారే సన్నేవాసి సఖే తతః
న దహ్యసే మహాబుద్ధే న చ క్వచన లిప్యసే 32

సఖుఁడవగు నో మహాబుద్ధీ! నీవు సమస్త ఇంద్రియసమూహమునను, ఇంద్రియములచే

గ్రాహ్యములగు అగ్న్యాద్యాకారములందును సత్తామాత్రముచే వ్యాపించియున్నావు. కాన నీవు దేని చేతను దహింపఁబడఁజాలవు, దేనియందును లిప్తుఁడవుకాఁజాలవు.

న తే వినశ్యతి సఖే న చ కించిద్వివర్ధతే
నిర్మలాకాశరూపస్య కైవల్యానన్తరూపిణః. 33

సఖుఁడా! నిర్మలాకాశమువంటిదియు, మోక్షరూపమును, అనంతమునగు నీయొక్క స్వరూపమొకించేని నశింపదు. వృద్ధినొందదు.

ఇచ్ఛానిచ్ఛాత్మికే శక్తీ యేతరాపి త్వమేవ చ
న హ్యంశువ్యతిరేకేణ శశాఙ్క ఉపలభ్యతే. 34

ఇచ్ఛ, అనిచ్ఛ, క్రియాది శక్తులున్న నీవే. ఏలయనిన, కిరణములకంటె భిన్నముగఁ జంద్రుఁడు పొందఁబడఁడుగదా!

అజమజరమనాద్యజస్వభావం
సకృదమలం విలసత్సదైకరూపమ్
విగలితకలనం కలాఖ్యలీలం
సముదితమాద్యమజం తదాత్మతత్త్వమ్. 35

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజపరమావబోధనం నామ శతతమః సర్గః ॥ 100 ॥

జరాజన్మరహితమై, అనాదియై, వృద్ధి, పరిణామాది వికారములు లేనిదై, సదా నిర్మలమై, ప్రకాశరూపమై, సద్రూపమై, ఏకమై, కల్పనారహితమై, స్వస్వరూపపరిచయమను లీలగలదై, సన్మాత్రముతోడ నుదితమై, సర్వవ్యవహారములందును బూర్వసిద్ధమైనట్టి వస్తువేది గలదో, అదియే ఆత్మ.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజపరమావబోధనమను నూఱవ సర్గము ॥100॥

---

## ఏకాధికశతతమః సర్గః

[జ్ఞానదార్ఢ్యేన రాజ్ఞోఽత్ర వర్ణ్యతే కృతకృత్యతా
జీవన్ముక్తావచిత్తత్వం స్థితిస్తత్త్వస్య చేర్యతే.

జ్ఞానముయొక్క దృఢత్వముచే రాజుయొక్క కృతకృత్యత, జీవన్ముక్తియందలి అచిత్తత్వము, తత్త్వస్థితి—అను నీవిషయములిచట పొందుపఱుపఁబడుచున్నవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:-

ఇతి కుమ్భవచో రాజా భావయం స్తదకృత్రిమమ్
స్వయమాత్మపదే తస్మిన్ క్షణం పరిణతోఽభవత్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు రాజగు శిఖిధ్వజుఁడు కుంభుని యా అకృత్రిమవాక్యముల విచారించుచు క్షణకాలములో స్వయముగఁ దన పూర్వభావమును త్యజించి ఆత్మపదమునఁ బరిణతుఁడాయెను.

బభూవామీలితమనోలోచనః శాన్తవాఙ్మునిః
శిలాతలాదివోత్కీర్ణో నిస్పన్దావయవాకృతిః. 2

నేత్ర, మనోవ్యాపారరహితుఁడై, వాగ్వ్యాపారవర్జితుఁడై, శిలయందుఁ జెక్కఁబడిన విగ్రహమువలె నమ్మునీంద్రుఁడు చేష్టారహితుఁడై యుండెను.

తతో ముహూర్తమాత్రేణ ప్రబుద్ధం స్ఫురితేక్షణమ్
తమువాచ మహాబాహో చూడాలా కుమ్భరూపిణీ. 3

ఓ మహాబాహూ! తదుపరి రెండుగడియలకాలమునకు వికసితనేత్రుఁడై, ప్రబుద్ధుఁడైనట్టి యారాజుతో కుంభరూపధారిణియగు చూడాల యిట్లు పలికెను.

కుమ్భ ఉవాచ:-

కచ్చిదస్మిన్పదే స్ఫారే శుద్ధే వితతనిర్మలే
సుతల్పే నిర్వికల్పానాం సుఖం విశ్రాన్తవానసి. 4

కుంభుఁడు:— ఓ రాజా! మహత్తరమై, శుద్ధమై, వ్యాపకమై, నిర్మలమై, నిర్వికల్పసమాధియందుండు యోగులకు నుత్తమశయ్యాభూతమైనట్టి, నిరతిశయానందదాయకమగు ఆత్మపదమున నీవు విశ్రాంతి లభించినదా?

కచ్చిదన్తఃప్రబుద్ధోఽసి కచ్చిద్భ్రాన్తిస్త్వయోజ్ఝితా
కచ్చిజ్జ్ఞేయం పరిజ్ఞాతం దృష్టం ద్రష్టవ్యమేవ వా. 5

నీ యంతఃకరణమునఁ బ్రబోధమైనదా? నీవు భ్రాంతిని వదలితివా! జ్ఞేయవస్తువు నెఱింగితివా? చూడఁదగినదానిని జూచితివా?

శిఖిధ్వజ ఉవాచ:-

భగవంస్త్వత్ప్రసాదేన మహావిభవ భూమికా
మహతీ పదవీ దృష్టా సర్వస్యోర్ధ్వం స్థితామయా. 6

శిఖిధ్వజుఁడు:—మహాత్మా! తమ యనుగ్రహముచే మహావిభవరూపమగు (నిరతిశయానందమే లక్షణముగాఁగల) భూమికను నేను బొందితిని. మహత్తరమైన ఆత్మపదవిని గాంచితిని. మఱియు

సర్వోపరి (హిరణ్యగర్భుని యానందము వఱకుఁగల విషయానందమునకుఁ బైఁగల దశయందు) స్థితి నొందియున్నాను.

సతాం విదితవేద్యానామహో బత మహాత్మనామ్
అపూర్వైకామృతమయః సఙ్గః సారఫలప్రదః. 7

ఆహా ! వేద్యపదార్థము నెఱిగిన తమవంటి మహాత్ములయొక్క సాంగత్యమపూర్వమై, అమృతమయమై, సారయుక్తమైనట్టి ఫలము నొసంగునదై యున్నది.

జన్మనాపి మయాలబ్ధం యన్నామ న మహామృతమ్
తదద్య త్వత్సమాసఙ్గాత్తేనైవాసాదితం స్వయమ్. 8

మహాత్మా ! ఏ మహామృతమును నేను నాజీవితమందెపుడును ద్రాగకయుంటినో, అయ్యది నేఁడు తమ సాంగత్యముచే స్వయముగ నాకు లభించినది.

అనన్తమాద్యమమృతం చైతత్కమలలోచన
కథం నాసాదితమభూత్పూర్వమాత్మపదం మయా. 9

కమలనేత్రా ! అనంతమై, ఆద్యమై, అమృతస్వరూపమైనట్టి యీ ఆత్మపదమును నేను బూర్వమే యేలఁ బొందకుంటిని ?

కుమ్భ ఉవాచ:—

మనస్యుపశమం యాతే త్యక్తభోగైషణే స్థితే
కషాయపాకే నివృత్తే సర్వేన్ద్రియగణస్య చ. 10
యాన్తి చేతసి విశ్రాన్తిం విమలా దేశికోక్తయః
యథా సితాంశుకే శుద్ధే బిన్దవః కుఙ్కుమామ్భసః. 11

కుంభుఁడు:—ఓ రాజా! మనస్సు శమింప, భోగములఁగూర్చిన యాషణలు త్యజింపఁబడ, సర్వేంద్రియసమూహముయొక్కయు, మనస్సుయొక్కయు కషాయములు నివృత్తముకాఁగా, తెల్లని శుద్ధవస్త్రముపై కుంకుమజలబిందువులవలె; చిత్తమున నిర్మల గురూపదేశవాక్యములు విశ్రమించును.

కషాయాణామనన్తానాం సంభృతానాం శరీరకైః
స్వవాసనా స్వరూపాణామద్యపాకస్తవోదితః. 12

అనేకజన్మలందు సంచితమొనర్పఁబడినవై, స్వవాసనాస్వరూపములై, అనంతములైనట్టి నీయొక్క కషాయముల పరిపాకము నేఁడుదయించినది.

దేహాన్మలాని సర్వాణి కాలేన కమలేక్షణ
సాధో వృక్షాత్ఫలానీవ పాకేన విగలన్త్యధః. 13

కమలనేత్రుఁడవగు నోసాధూ! పరిపక్వతా కారణమున వృక్షమునుండి ఫలములు క్రిందకు రాలునట్లు, లింగదేహమునుండి రాగద్వేషాదికషాయములు, పాపములుమున్నగు సమస్తమలములు తపస్సుమున్నగువానిచే, గాలక్రమమునఁ బడిపోవుచున్నవి.

వాసనాత్మసు యాతేషు మలేషు విమలం సఖే
యద్వాక్యం గురురన్తస్తద్విశతీషుర్యథా బిసే. 14

సఖుఁడా! వాసనాదిరూపమలము లెపుడు తొలఁగునో అపుడు గురువు వచించు వాక్యములు, కమలనాళమను లక్ష్యమున బాణమువలె, నిర్మలాంతః కరణమున ప్రవేశించును.

కషాయపాకే సంపన్నే త్వం మయాద్య విబోధితః
తేనాద్యైవ తవాజ్ఞానక్షయో జాతో మహామతే. 15

ఓ మహామతీ! తపస్సుచే నీయొక్క కషాయములు పరిపక్వము లైనందున యిపుడు నేను నీకు బోధించితిని. కాన నీయజ్ఞానమిపుడే నశించినది.

అద్య పక్వకషాయ స్త్వమద్యైవ జ్ఞానసంకథామ్
అద్యేహ సోపదేశ స్త్వ మద్యైవాసి ప్రబుద్ధవాన్. 16

ఇపుడే నీయొక్క కషాయములు పరిపక్వము లైనవి. కాన నిపుడే జ్ఞాన ప్రసంగము నీకు రుచించినది. కనుక నే యుపదేశింపఁబడిన యర్థముల నిపుడే నీవు హృదయమున ధరించితివి మఱియు నిపుడే ఆత్మసాక్షాత్కారరూపజ్ఞానముచే నీవు యుక్తుఁడ వైతివి.

శుభాశుభానాం సర్వేషాం కర్మాణామద్య సంక్షయః
సత్సఙ్గవ్యపదేశేన తవ నివృత్తిమాగతః. 17

సత్సంగమను మిషచే నేఁడు నీయొక్క సమస్తశుభాశుభకర్మలయొక్క క్షయముసిద్ధించినది.

యావదస్య దినస్యైష పూర్వభాగో మహీపతే
తావచ్చేతోహంమమేతి తవాజ్ఞానం బభూవ హ. 18

ఓ రాజా! నేఁటి మధ్యాహ్నమువఱకు నీయందు చిత్తము, అహంకారము, మమకారము మున్నగు వానితోఁగూడిన యజ్ఞానసత్త యుండియుండెను.

ఇదానీం మద్వచోబోధాచ్చేతసి క్షయమాగతే
హృదయాత్సంపరిత్యక్తే సంప్రబుద్ధోఽసి భూపతే. 19

ఓ నృపాలా! మధ్యాహ్నానంతరమిపుడు నావాక్యముల బోధచే ఆయజ్ఞానసత్త హృదయమునుండి త్యజింపఁబడినదికాఁగా చిత్తము క్షయము నొంద నీవు ప్రబుద్ధుఁడవైతివి. (ఆత్మజ్ఞానసంయుక్తుఁడవైతివి.)

హృది యావన్మనః సత్తా తావదజ్ఞాన సంస్థితిః
చిత్తే చిత్తతయా త్యక్తే జ్ఞానస్యాభ్యుదయో భవేత్. 20

హృదయమున నెంతవఱకు మనస్సుయొక్క సత్త యుండునో, అంతవఱకజ్ఞానముయొక్క స్థితియునుండియేయుండును, చిత్తమెపుడు చిత్తరూపమునఁ ద్యజింపఁబడునో, అపుడు జ్ఞానోదయమగును.

ద్విత్వైకత్వదృశౌ చిత్తం తదేవాజ్ఞానముచ్యతే

ఏతయోర్ద్వ్యేకయోర్దృష్టేః స్వజ్ఞానం సా పరా గతిః. 21

ద్విత్వ, ఏకత్వముల దృష్టియే చిత్తము. దానినే అజ్ఞానమందురు. పరమాత్మసాక్షాత్కారముచే నీరెంటియొక్క నాశమే జ్ఞానము. అదియే పరాగతి.

ప్రబుద్ధోఽసి విముక్తోఽసి త్యక్తం చిత్తం త్వయా నృప
సదసత్తామయత్వం హి త్వయా త్యక్తమసత్పదమ్. 22

ఓరాజా! నీవు ప్రబుద్ధుఁడవు, విముక్తుఁడవు. ఏలయనిన, అసత్పదమై, సదసన్మయమగు జగత్తుయొక్క కల్పనకు స్థానభూతమైనట్టి చిత్తమును నీవు త్యజించితివి.

వీతశోకో నిరాయాసో నిఃసఙ్గోఽనన్య ఆత్మవాన్
మహోదయో మునిర్మానీ స్వరూపే తిష్ఠ నిర్మలే. 23

ఇఁక నీవిపుడు దుఃఖరహితుఁడవై, ఆయాసవర్జితుఁడవై, నిస్సంగివై, అద్వైతాత్మజ్ఞానసంపన్నుడవై, మహోదయయుక్తుఁడవై, మునివై, మానివై, నిర్మలమగు ఆత్మస్వరూపమున స్థితిగల్గియుండుము.

శిఖిధ్వజ ఉవాచః—

ఏవం హి భగవన్ జన్తోర్మూర్ఖస్యైవాస్తి చిత్తభూః
ప్రబుద్ధస్య న తజ్జస్య చిత్తం నామ కిల ప్రభో. 24

జీవన్ముక్తాస్తదేతే హి విహరన్తి కథం వద
అవిద్యమానమనసో యుష్మదాద్యాస్తథా నరాః. 25

ఇతి మే కథయాశేషమన్యైః స్వవచనాంశుభిః
హార్దం తమో మే నిపుణమేవంప్రాయైః ప్రమార్జయ. 26

శిఖిధ్వజుఁడు.— మహాత్మా తాము వచించినట్లు చిత్తభూమి మూర్ఖుని కొఱకే యగును అయితే, ఓప్రభూ! ప్రబుద్ధుఁడును, ఆత్మజ్ఞానియునగువానికి చిత్తము లేనిచో, అమనస్కులై, జీవన్ముక్తులైనట్టి తమవంటి మహాత్ము లీప్రపంచమున నెట్లు విహరించుచున్నారో తెలియఁజేయుడు? ఇవ్విషయమును దాము సంపూర్ణముగ వచింపవేడెద, మఱియు నన్యులచే దుర్వచములగు దమ వచనరూపకిరణములచే నా హృదయమందలి యజ్ఞానాంధకారమును లెస్సగ దూరీకరింపుఁడు.

కుమ్భ ఉవాచః—

యథా వదసి తత్త్వజ్ఞ తత్తథైవ హి నాన్యథా
చిత్తం హి జీవన్ముక్తానాం నాస్త్యఙ్కుర ఇవాశ్మనామ్. 27

కుంభుఁడు.— తత్త్వజ్ఞుడవగు నోరాజా! నీవు వచించునది సత్యమే శిలలకు అంకురము లేనట్లు, జీవన్ముక్తులకు చిత్తము లేదు.

పునర్జననయోగ్యా యా వాసనా ఘనవాసనా
సా ప్రోక్తా చిత్తశబ్దేన న సా తజ్జ్ఞస్య విద్యతే. 28

మరల మరల యుత్పన్నమగునట్టి ఘనీభూతమగు వాసన యేదిగలదో, అదియే చిత్తశబ్దముచే చెప్పఁబడినది. అయ్యది జ్ఞానికి లేదు.

యయా వాసనయా తజ్జ్ఞా విహరన్తీహ కర్మసు
తాం త్వసత్త్వాభిధాం విద్ధి పునర్జననవర్జితామ్. 29

ఏవాసనతోఁగూడి తత్త్వజ్ఞాను లీప్రపంచమున గార్యములందు విహరించుచున్నారో, దానిని (వేయించిన విత్తనమువలె) మరల నంకురింపనిదానినిగను, సత్త్వమను పేరుగలదిగను నెఱుఁగుము.

జీవన్ముక్తా మహాత్మానః సత్త్వస్థాః సంయతేన్ద్రియాః
విహరన్తి గతాసఙ్గం న చిత్తస్థాః కదాచన. 30

జీవన్ముక్తులును, సత్త్వమందున్నవారును, జితేంద్రియులునగు మహాత్ములు సంగరహితులై విహరింతురుగాని, చిత్తమందెపుడును నుండరు.

మూఢం చిత్తం చిత్తమాహుః ప్రబుద్ధం సత్త్వముచ్యతే
అప్రబుద్ధా హి చిత్తస్థాః సత్త్వస్థాస్తు మహాధియః. 31

మూఢచిత్తమునే చిత్తమందురు. జ్ఞానయుక్త చిత్తమును సత్త్వమందురు. అజ్ఞానులే చిత్తమందుందురు. జ్ఞానయుక్తులగు మహాబుద్ధిమంతులు సత్త్వమందుందురు.

భూయః ప్రజాయతే చిత్తం సత్త్వం భూయో న జాయతే
అప్రబుద్ధస్య బన్ధోఽస్తి న ప్రబుద్ధస్య భూపతే. 32

ఓ రాజా! చిత్తము మరల మరల యుత్పన్నమగును. సత్త్వ మట్లుత్పన్నముకాదు. అజ్ఞానికి బంధము కలదు. జ్ఞానికి లేదు.

సత్త్వావానసి సంజాతో మహాత్యాగీ స్థితో భవాన్
అశేషేణ త్వయా చిత్తం త్యక్తమద్యేతి వేద్మ్యహమ్. 33

ఓ రాజా! నీవున్ను సత్త్వయుతుఁడవై మహాత్యాగివై యుండియున్నావు. ఏలయనిన, నీవిపుడు చిత్తమును బరిపూర్ణముగఁ ద్యజించివైచితివని నేనెఱుఁగుదును.

సమస్తవాసనోన్ముక్తో రాజన్నద్యైవ రాజసే
ఆకాశసామ్యమాయాతం మన్యే తవ మునే మనః. 34

ఓ రాజా! నీవిపుడు వాసనల నన్నింటిని ద్యజించినవాఁడవై శోభించుచున్నావు. మఱియు ఓమునీ! నీమనస్సిపు డాకాశముతోటి సామ్యమును బొందెనదని నేను నమ్ముచున్నాను.

శమం ప్రాప్తోఽపి పరమం సిద్ధః సమసమస్థితిః
అయం హి స మహాత్యాగః సర్వం యత్తత్సముజ్ఝితమ్. 35

నీవిపుడు సమస్థితిని, ఉత్తమశమమును బ్రాప్తినొందితివి. ఏది సర్వరూపమైయున్నదో యట్టి చిత్తమును నీవు పరిత్యజించితివి, ఇదియే నీయొక్క మహాత్యాగము.

స్వర్గాపవర్గవిత్తాది తపోదానఫలాద్యపి
ప్రబుద్ధమేధయా సాధో ధియా పరమబోధయా. 36

ఓ సాధూ! స్వర్గ మోక్షములను, ధనాదులను, తపోదానాదుల ఫలాదులను, ప్రబుద్ధమైన మేధాశక్తితోడను. పరమజ్ఞానయుక్తమగు బుద్ధితోడను నీవు త్యజించివైచితివి.

తపో నామ కియన్మాత్రదుఃఖక్షయకరం భవేత్
క్షయాతిశయనిర్ముక్తం యత్సుఖం సమతామయమ్. 37

తపోదానాదు లేమాత్రము దుఃఖమును క్షయింపఁజేయగలవు? మనస్త్యాగరూప సమత్వముచేఁ బ్రత్యక్షముగ లభించిన జ్ఞానఫలమగు ఆత్మసుఖము క్షయాతిశయ వర్జితమైయున్నది.

తత్సత్తద్వస్తు తత్కించిన్న తు స్వర్గాది భఙ్గురం
భావాభావైరుపారూఢం స్థితాధిగత వేదనమ్ 38

జ్ఞానముచే నుత్పన్నమగు ఫలము సత్యవస్తువైయున్నది. స్వర్గాదిరూపఫలము క్షణభంగురమై, ఉత్పత్తినాశములచే గ్రస్తమై, స్వప్నపదార్థమువలె కేవలము వర్తమానకాలమందే యనుభూతమగునదై యున్నది.

స్వర్గో నామ కియానన్దః సోపి సందేహసంస్థితః
అప్రాప్తస్యాత్మసంసిద్ధేః క్రియాకాణ్డః శుభో భవేత్. 39

స్వర్గసుఖ మతితుచ్ఛమైనది. అదియు, ననేక అపరాధములచే నశ్యమానమగుటఁజట్టి సందేహగ్రస్తమే యగును. ఎవని కాత్మజ్ఞానసిద్ధి లభింపలేదో, అట్టివానికే క్రియాకాండ శుభప్రదమగును.

యేన నాసాదితం హేమ రీతిం కిం స పరిత్యజేత్
చూడాలాది సమాసఙ్గాద్భవేజ్జత్వం సుఖేన తే. 40

తత్కిమర్థమనర్థేఽస్మిన్నిమగ్నస్త్వం తపోమయే
ఆశ్రమాది వికల్పాంశసాధ్యస్యాద్య కుకర్మణః. 41

బంగారమెవనికి లభింపలేదో యట్టివాఁడిత్తడి నేల పరిత్యజింపవలెను? చూడాలాదుల యుత్తమసాంగత్యముచే నీకు జ్ఞానము సులభముగ లభించియుండెడిది. అట్టిచో, వానప్రస్థాశ్రమాదులకు సంబంధించినవై చింతాది అనేక వికల్పవిక్షేపములతోఁగూడినట్టి తపఃక్లేశములను యీయనర్థమున నింతవఱకేల నిమగ్నుఁడవై యుంటివి?

ఆద్యన్తావస్య సుమతే మధ్య ఏవ సుఖం స్మ భోః
యతస్తే సమయో జాతో యస్మిన్పరిణమన్తి చ. 42
తపోరూపా వికల్పాంశాస్తత్ర బద్ధపదో భవ.

ఓ సుమతీ ! ఈ తపస్సుయొక్క యాద్యంతములందు (ఆచరణకాలమున, ఫలక్షయకాలమున) సుఖములేదు. కేవలము మధ్య (భోగానుభవకాలమందు) మాత్రమే గలదు. తపస్సుచే నీయొక్క చిత్తకషాయములు పరిపక్వములై యిపుడు తత్త్వబోధసమయము జనించినదిగాన, తపోరూపవికల్పాంశములన్నియు నేతత్త్వజ్ఞానమునఁ బరిణమించుచున్నవో, మఱియు నేతత్త్వజ్ఞానఫలముచే ఫలవంతము లగుచున్నవో, అట్టియాత్మజ్ఞానమున స్థితుఁడవుకమ్ము.

చిద్వ్యోమ్నో నభశోత్యచ్ఛాత్సర్వే భావాః సముత్థితాః. 43
తథైవ పరిదృశ్యన్తే తత్రైవ విలయం గతాః

సమస్త పదార్థములు నట్టి యతిస్వచ్ఛమగు చిదాకాశమునుండియే యావిర్భవించినవై కానుపించుచున్నవి. మఱియు నద్దానియందే తిరిగి లీనమగుచున్నవి. ఆ చిదాకాశము నే నీవెఱుఁగుము.

ఇదం కార్యమిదం నేతి సంకల్పా బ్రహ్మబిన్దవః. 44
వన్థ్యం శిఖిధ్వజ త్యక్త్వా పూర్ణమేవ సమాశ్రయ

ఓ శిఖిధ్వజా ! 'ఇది చేయఁదగినది, ఇది చేయఁదగనిది,' అను నీయున్నగు (ఇష్టానిష్టాది రూప) సంకల్పములు బ్రహ్మసముద్రముయొక్క నిష్ఫల బిందువులై యున్నవి. కాన, వానిని త్యజించి నీవు పూర్ణసముద్రమునే యాశ్రయింపుము.

ఇష్టం మే ప్రార్థయస్వేతి యథైవ ప్రార్థ్యతే సఖే. 45
స్త్రియా తథైవ స కథం దయితః ప్రార్థ్యతే స్వయమ్

ప్రియుఁడు లభింపని స్త్రీ, తత్ప్రియుని 'నాయిష్టవస్తువును లభింపఁజేయుము'ని ప్రార్థించుచున్నది. అట్టి యాపె స్వయముగ నా ఆప్రియునికోఱకే యేల ప్రార్థింపరాదు ? అపుడు సమస్తమనోరథములును నాతని ద్వారా సిద్ధించునుగదా ! [ఇతర ఇష్టపదార్థములను బ్రార్థించుటకంటె నిరతిశయానందరూపమగు ఆత్మలాభమును బ్రార్థించుట శ్రేష్ఠమని భావము]

సంకల్ప రచితానేతాన్బాహ్యానాపత భాసురాన్. 46
గృహ్ణాన్తి న మహాత్మానః ప్రాజ్ఞా జలరవీనివ

ఓ రాజా ! ప్రజ్ఞావంతులు ప్రతిబింబించిన సూర్యుని గ్రహింపనట్లు, సంకల్పరచితములును విపత్తివలె అరమణీయములు నగు ఈ ప్రాపంచిక పదార్థములను మహాత్ములు గ్రహింపరు.

స్వర్గమోక్షాదిఫలదం యత్కించిత్సర్వమేవ తత్. 47
త్యక్త్వా సమసమభాసో యోఽస్యసావేవ వై భవ

కాన, (జ్ఞానలాభానంతరము) స్వర్గ మోక్షాదిఫలదాయకములగు కర్మలన్నింటిని త్యజించి, అంతట సమరూపముగ భాసించు ఆత్మయొక్క రూపముకలవాఁడవు కమ్ము.

సత్త్వం సత్త్వేన నాశేన నాశ్యం హి విగతస్పృహాః. 48
పదార్థౌఘమిమం గృహ్ణంస్తిష్ఠాస్పన్దిత చిత్తభూః

సర్వపదార్థములందును సదంశమును సత్వరూపముగను, అసదంశమును నాశరూపముగను గ్రహింపవలెను. కాన నీ విచ్ఛారరహితుఁడవై యీ సమస్తపదార్థ సమూహమును అచంచల చిత్తముతో గ్రహించుచు నుండుము.

అపరిస్పన్ద చిత్తస్య సంసృతిర్నేహ ధావతి. 49
పౌరుష ప్రభవా సాధో విపత్తిర్హి మతౌ యథా

ఓ సాధూ ! వివేకజ్ఞాన ముదయింప, స్వాభావిక ప్రవృత్తియను పురుషాపరాధముచే నుత్పన్నమగు విపత్తి మనుజుని చెంతకుఁ బరువిడునట్లు, చిత్త చాంచల్యములేని వాని సమీపమునకీ సంసారమున్ను బరువిడదు.

యాని యానీహ దుఃఖాని ప్రస్ఫురన్తి జగత్త్రయే. 50
చేతశ్చాపలజాన్యేవ తాని తాని మహీపతే

స్థిరం శాన్తం గతస్పన్దం యస్య చిత్తమచాపలం
సదైవ స మహానన్ద సామ్రాజ్యస్య స భాజనమ్. 51

ఓ నృపాలా ! ఏయేదుఃఖము లీముల్లోకములందును గానుపించుచున్నవో, అవియన్నియును చిత్తచాంచల్యముచేత నేయుత్పన్నమైనవగును. కాన, ఎవని చిత్తము స్థిరమై, శాంతమై, చేష్టారహితమై, అచంచలమై యుండునో, ఆతఁడే సదా మహానందసామ్రాజ్యమునకుఁ బాత్రుఁడగును.

అథ చేతసి తత్త్వజ్ఞ స్పన్దాస్పన్దౌ త్వమేకతాం
నీత్వా తిష్ఠ యథాకామమైక్యమాగత్య శాశ్వతమ్. 52

తత్త్వజ్ఞుఁడవగు నో రాజా ! ఇఁక నీవు స్పందాస్పందములను (చేష్టను, చేష్టయొక్క అభావమును), తత్సాక్షిమాత్రుఁడుగానుండుట ద్వారా నైక్యపఱచి, సాక్షినిగూడ బ్రహ్మైక్యమును బొందించి భూమానందభావముతోఁ గూడి పూర్ణకాముఁడవై యుండుము.

శిఖిధ్వజ ఉవాచ:—

కథమైక్యం విభో యాతః స్పన్దాస్పన్దావిమావుభౌ
సర్వసంశయ విచ్ఛేదకారిన్నేతద్వదాశు మే. 43

శిఖిధ్వజుఁడు:—సర్వసంశయముల భేదించునట్టి యో ప్రభూ ! చేష్టయు, చేష్టయొక్కయభావమున్ను నెట్లేకత్వమొందునో శీఘ్రముగ నాకుఁ దెలియఁజేయ ప్రార్థన.

కుమ్భ ఉవాచ:—

ఏకం వస్తు జగత్సర్వం చిన్మాత్రం వారివామ్బుధిః
తదేవ స్పన్దతే ధీభిః శుద్ధవారివ వీచిభిః. 54

కుంభుఁడు:—ఓ రాజా ! తరంగాదులరూపమున భేదమున్నను, జలమాత్రముచే సముద్రమెట్లభిన్నమైయున్నదో, అట్లే యధిష్ఠానమగు చిన్మాత్రముచే సమస్త మొకేవస్తువై యున్నది. ఆ చిన్మాత్రమే, తరంగములచే సముద్రమందలి నిశ్చలజలమువలె, బుద్ధివృత్తులచేఁ జేష్టించుచున్నది.

బ్రహ్మ చిన్మాత్రమమలం సత్యమిత్యాదినామకం
యద్గీతం తదిదం మూఢాః పశ్యన్త్యజ్ఞ జగత్తయా. 55

ఏది సత్య, జ్ఞాన, అనంతాది నామములచే వేదములందు వర్ణింపఁబడియున్నదో అట్టి నిర్మలమైన చిన్మాత్రమగు బ్రహ్మమే అంతయునైయున్నది. అద్దానినే మూఢులు జగద్రూపముగఁ గాంచుచున్నారు.

చిత్స్పన్ద ఏవ సర్వస్వం సర్గే తస్మాద్ధి సంసృతిః.
పరిస్పన్దో హి విన్ధ్యాది శబ్దస్పన్దసమం పరమ్. 56

చైతన్యముయొక్క స్పందమే (చేష్ట, లేక స్ఫురణమే) సృష్టియొక్క సర్వస్వమైయున్నది. కనుకనే వింధ్యాచలాది రూపపరిస్పందముతోను, రెండవదగు నామపరిస్పందముతోను గూడినదై చైతన్యమే యీప్రపంచరూపముగ భాసించుచున్నది.

చితః స ఏవ చేత్స్పన్దస్తథాస్పన్దశ్చ భావితః
ఏకరూపతయా నామ తత్రేదమమలం శివమ్. 57

సాక్షియగు ఆత్మనే చైతన్యముయొక్క స్పందాస్పందముల యేకరూపత్వముగా భావించినచో, ఆత్మరూపమగు నిర్మలమైన శివబ్రహ్మమే శేషించును.

సర్గశ్చిత్స్పన్దమాత్రాత్మా సమ్యగ్దృష్టౌ విలీయతే
ఉదేత్య సమ్యగ్దృష్టీనాం రజ్జ్వాం సర్పభ్రమో యథా. 58

చిత్తుయొక్క స్పందమాత్రమే సృష్టియను సమ్యగ్దృష్టి కలవారి కాసృష్టి లయించిపోవుచున్నది, కాని యట్టి సమ్యగ్దృష్టి లేనివారి కయ్యది రజ్జువునందు సర్పభ్రమవలె నుదయించుచున్నది.

సస్పన్దా చిత్తదభిధా నిఃస్పన్దా త్వియమాతతా
తుర్యాతీతపదారూఢా వాచా వక్తుం న పార్యతే. 59

స్పందసహితమగు చిత్తు (చైతన్యము) సృష్టియను పేరుచేఁ జెప్పఁబడుచున్నది. అట్టి చిత్స్పందముచేతనే యీజగత్తు వ్యాపింపఁబడియున్నది. స్పందరహితమగు చిత్తు తురీయాతీతపదమున నారూఢమైయున్నది. అది వాక్కుచే వచింపఁబడుట కలవికానిది.

శాస్త్రసజ్జనసంపర్క సంతతాభ్యాస యోగతః
కాలేనామలతాం యాతే చేతసీన్దావివోదితా. 60

నేత్రముయొక్క తిమిరాదిదోషములు తొలగగాఁ జంద్రునియొక్క యేకత్వ ముదయించునట్లు, శాస్త్ర సజ్జనసహవాసములను నిరంతర మభ్యసించుచురాఁగా కాలక్రమమున చిత్తము నిర్మలమై సాక్షియగు ఆత్మతోఁటి జగత్తంతటియొక్క యైక్యముదయించును.

ఏతత్కేవల మాభాతం స్వానుభూతిభిరాతతం
కథ్యతే స్వానుభూతేషు స్వయం స్వం రూపమాత్మనా. 61

సాక్షియగు చైతన్యముతోటి సమస్తముయొక్క ఐక్యము కేవలము అనుభవమాత్రముగనే భాసించును. ఎవరు తమ స్వరూపము ననుభవముగావింప కోరియున్నారో, అట్టివారి చేతనే తమ స్వరూపము స్వయముగ, జెప్పబడుచున్నది (లోకదృష్టి.)

ప్రాప్తోఽసి సారం స్వమనాదిమధ్య
మత్రైవ తిష్ఠ స్వపదే నివిష్టః
నో రూపనిర్భేద మహో చిదాత్మా
జాతోఽసి సాధో ఖలు వీతశోకః. 62

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షో
పాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజబోధనం
నామైకాదిక శతతమః సర్గః ॥ 101 ॥

ఓ సాధూ! నీవిపుడు సమస్తమునకు సారభూతమైనట్టి, ఆదిమధ్యరహితమగు స్వస్వరూపమును బొందితివి. అట్టి స్వాత్మపదముననే నీవు స్థిరముగ నెలకొనియుండుము. శరీరాదులభేదమును మిథ్యయని యెఱుంగుటచే నీవు (తత్త్వబోధచే) మహాచిత్స్వరూపుడవై ప్రాదుర్భవించితివి. కాబట్టి శోకమోహవిరహితుఁడవై యుండుము (తత్రకో మోహః కశ్శోక ఏకత్వమను పశ్యతః—శ్రుతి)

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజ బోధనమను నూటొకటవ సర్గము ॥101॥

---

## ద్వ్యధిక శతతమః సర్గః.

[ఆమన్త్ర్య నిర్గతే కుమ్భే విస్మితస్య మహీపతేః
చిరం విమృశ్య విశ్రాన్తిః సమాధావిహ వర్ణ్యతే.

తాను వెడల వలసియున్నదని చెప్పి కుంభఋషి యంతర్ధానమగుట, విస్మితుఁడగు రాజు పిదప చిరకాలము విచారించుట, సమాధియందు విశ్రాంతిని బొందుట మున్నగు సంగతులిచట వర్ణింపఁబడుచున్నవి.]

కుమ్భ ఉవాచ:—

ఇతి తే కథితం సర్వం శిఖిధ్వజ మహీపతే
యథేదముత్థితం సర్వం యథా చ ప్రవిలీయతే. 1
ఏతచ్ఛ్రుత్వా చ బుద్ధ్వా చ మత్వా చ మునినాయక
యథేచ్ఛసి తథా తిష్ఠ దృష్టే స్పష్టే పరే పదే, 2
స్వర్గం గచ్ఛామ్యహం పర్వకాలేఽస్మిన్నారదో మునిః
బ్రహ్మలోకాత్స మాయాతో భవత్యమరసంసది. 3

న మాం పశ్యతిచే త్తత్ర తతోఽపముపగచ్ఛతి
నోద్వేజనీయా భవ్యేన గురవో హి కదాచన. 4

కుంభుఁడు.— ఓ శిఖిధ్వజ రాజా! ఈ ప్రకారముగ, ప్రపంచ మెట్లుత్పన్నమగుచున్నది. (అధ్యారోపము), ఎట్లు లయించుచున్నది (అపవాదము) అను విషయమునంతయు నీకు వచించితిని. ఓ మునినాయకా! దీనిని విని, ఎఱిఁగి, మననము గావించి, స్పష్టముగఁ గాంచఁబడిన పరమపదమున నీయిష్టమువచ్చినట్లు స్థితిగల్గియుండుము. నేనిపుడు స్వర్గమునకుఁ బోవుచున్నాను. ఏలయనఁగా, ఈ పర్వకాలమున బ్రహ్మలోకమునుండి నారదముని యింద్రసభకు వచ్చియుండును. నన్నచటఁ గాంచనిచో నాతఁడు కోపమునుబొందును. ఉత్తముఁడగువాఁడు గురువుల నెన్నఁడును ఉద్విగ్నులఁ గావింపరాదు.

త్యక్త సంకల్ప లేఖేన న కించిదభివాఞ్ఛతా
త్వయా సదైవ వస్తవ్యం దృష్టిరేషైవ పావనీ. 5

నీవు సంకల్పమును, యిచ్ఛను, సదా పరిత్యజించి నాచేఁ జెప్పఁబడిన యీ పవిత్రమగు ఆత్మదృష్టియందు స్థితిగల్గియుండుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ: —

ఇతి యావత్ప్రతివచః పుష్పహస్తః శిఖిధ్వజః
ప్రణామయా దదాత్యేష తావదన్తర్ధిమాయయా 6

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ప్రతివచనసహితముగాఁ బ్రణామ మాచరించుటకై శిఖిధ్వజుఁడు పుష్పాంజలిని గ్రహించుచుండ నింతలోఁ గుంభరూపిణియగు చూడాల యంతర్ధానమయ్యెను.

ప్రతిభానగతం వస్తు యథైవాప్తే న దృశ్యతే
న దృష్టవాంస్తథా కుమ్భమగ్రే రాజా శిఖిధ్వజః. 7

స్వప్నాదులందుఁ బ్రాప్తించిన ధనాదులు అంతమునఁ గాన్పింపనట్లు, శిఖిధ్వజరాజు తన యెదుటఁ గుంభునిఁ గాంచకుండె.

గతే కుమ్భే మహీపాలః పరం విస్మయమాయయౌ
తమేవ చిన్తయంశ్చిత్రం చిత్రార్పిత ఇవాభవత్. 8

కుంభుఁడు వెడలినమీఁదట రాజు మిగుల యాశ్చర్యమునొందెను. ఆతనినే ధ్యానించుచు నాతఁడు లిఖిత చిత్రమువలె కదలక మెదలక నుండెను.

ఇదం సచిన్తయామాస చిత్రం విలసితం విధేః
యత్కుమ్భవ్యపదేశేన బోధితోఽస్మి చిరోదయమ్. 9
క్వ నారదసుతః కుమ్భః క్వాహం నామ శిఖిధ్వజః
కేవలం కాలయుక్త్యైవ సోఽహం సంపరిబోధితః. 10

అహోను సమ్యక్కథితం దేవపుత్రేణ యుక్తిమత్
అహోను సంప్రబుద్ధోఽస్మి మోహనిద్రాకులశ్చిరాత్. 11

అపుడు విధియొక్క విచిత్రవిలాసముఁ గూర్చి యాతఁడిట్లు చింతించెను—'ఆహా! కుంభుని మిషచే నాకు సదా ప్రకాశరూపమైన బ్రహ్మముయొక్క యుపదేశము గావింపఁబడినది. నారద పుత్రుఁడగు కుంభుఁడెచట, శిఖిధ్వజుఁడగు నేనెచట! కేవలము భాగ్యోదయకాలముయొక్క సంయోగముచేతనే నాకిట్టిబోధ లభించినది. ఆహా! దేవపుత్రుఁడెట్టి యుత్తమ యుక్తియుక్తమగు యుపదేశము గావించెను! ఆహా! మోహనిద్రయందుఁ జిరకాలము వ్యాకులుఁడనైన నేనిపుడు ప్రబుద్ధుఁడనైతి.

క్వాహమాసం వినిర్మగ్నం క్రియాజాల కుకర్దమే
ఇదం కార్యమిదం నేతి మిథ్యావిభ్రమచక్రకే. 12
అహో ను శీతలా శుద్ధా శాన్తేయం పదవీ నిజా
రసాయనోద్భవాకారా సత్వం శీతయతీహ మే. 13

'ఇది చేయవలెను, ఇది చేయఁగూడదు'— ఇత్యాది మిథ్యాభ్రమమయ చక్రయుక్తమగు క్రియాజాలమను దుష్టపంకమున (బురదయందు) నేను జిక్కువడియుండుట యెచట: ఈ అమృతోత్పన్నమగు ఆకృతిని ధరించినదై, శీతలమై, శుద్ధమై, వాసనారహితముగ నామనస్సును శీతలమొనర్చునదై, సాక్షాత్కరింపఁబడినదైనట్టి ఈ స్వాత్మసామ్రాజ్యపదవి యెచట!

శామ్యామి పరినిర్వామి సుఖమాసే చ కేవలమ్
తృణాగ్రమపి నేచ్ఛామి సంస్థితోఽస్మి యథాస్థితమ్. 14

ఆహా! నేను శాంతుఁడను, తృప్తుఁడను; సుఖపూర్వకముగ నుండియున్నాను. తృణలేశమునైన నేనిపుడు కోరను. యథాస్థితముగ నాస్వరూపమున స్థితిగల్గియున్నాను.'

ఏవం సంచిన్తయన్రాజా నూనం నిర్వాసనాశయః
శైలాదివ సముత్కీర్ణో మౌనమేవావతస్థివాన్. 14

వాసనారహితమగు యంతఃకరణముగల యారాజిట్లు చింతనజేయుచు, శిలయందుఁ జెక్కఁబడిన విగ్రహమువలె మౌనము ధరించి సమాధిస్థుఁడయ్యెను.

తస్మిన్నేవ తతో మౌనే నిఃసంకల్పే నిరాశ్రయే
ప్రతిష్ఠాం నిశ్చలాం ప్రాప్య స తస్థౌ గిరిశృఙ్గవత్. 16

సంకల్పవర్జితమై, ఆశ్రయరహితమైనట్టి యా మౌనసమాధియందే స్థిరప్రతిష్ఠను బొందినవాఁడై, పర్వతశిఖరమువలె నాతఁడపుడు నిశ్చలముగ నుండెను.

స తత్ర సంశాన్తభయోఽచిరేణ
చిరేణ విశ్రాన్తమతిః సమాత్మా
చిరేణ సంప్రాప్త నిజామలాత్మా
యోగేన సుష్వాప తతోఽదితాత్మా. 17

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూడా॥ శిఖిధ్వజసమాధానం నామ ద్వ్యధికశతతమః సర్గః॥ 102 ॥

ఆ సమాధియందాతఁడు సమరసమైన తన యాత్మస్వరూపమును బొందుటచేఁ జిరకాలమునకు విశ్రాంతచిత్తుఁడై, శీఘ్రముగ నిర్భయుఁడై, చిరకాలప్రవృత్తమగు యోగముచే నఖండ (పూర్ణ) స్వభావమొంది సుషుప్తియందువలె విశ్రమించెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యామున శిఖిధ్వజసమాధానమను నూటరెండవ సర్గము ॥102॥

---

## త్ర్యధికశతతమః సర్గః

[చూడాలాయాః పరం గత్వా త్ర్యహేణ పునరాగమః
యత్నాద్వ్యుత్థాపనం రాజ్ఞస్తత్ర్యాలాపశ్చ వర్ణ్యతే.

చూడాల స్వస్థానమునకేగి మూఁడుదినములైన పిదప మరల భర్తవద్దకు వచ్చుట, ప్రయత్నపూర్వకముగ నాతనిని సమాధినుండి లేపుట యను విషయము లిట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

నిర్వికల్పసమాధానాత్కాష్ఠకుడ్యోపమస్థితిః
ఏవం శిఖిధ్వజో రాజా చూడాలామధునా శృణు. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు నిర్వికల్పసమాధియందుండుటచే శిఖిధ్వజరాజు కాష్ఠమువలెను, శిలవలెను నుండియుండెను. ఇఁక చూడాలఁ గూర్చిన వృత్తాంతము నిపుడు వినుము.

శిఖిధ్వజం తం భర్తారం కుమ్భవేషేణ తేన సా
ప్రబోధ్యాన్తర్ధిమాగత్య తతార తరసా నభః. 2
దేవపుత్రాకృతిం వ్యోమ్ని జహౌ మాయావినిర్మితామ్
విదగ్ధముగ్ధమాకారం స్త్రైణం జగ్రాహ సున్దరమ్. 3
నభసా స్వపురం ప్రాప వివేశాన్తఃపురం క్షణాత్
దృశ్యా బభూవ లోకస్య నృపకర్మ చకార చ, 4

కుంభఋషివేషము ధరించిన యా చూడాల యట్లు తన భర్తయగు శిఖిధ్వజున కుపదేశము గావించి, అంతర్ధానమై వేగముగ నాకాశమార్గమున నేగెను. అట్లాకాశమునఁజని మాయారచితమగు దేవపుత్రుని యాకారమును త్యజించి సుందరస్త్రీరూపమును ధరించెను. పిదప, ఆకాశమార్గముగుండా

తన నగరమును బొంది క్షణకాలములో నంతఃపురమును బ్రవేశించి, తదుపరి ప్రజాపాలనమను రాజ కార్యము నొనర్చెను.

వాసరత్రితయేనాథ పునరమ్బరమేత్య సా
బభూవ కుమ్భో యోగేన శిఖిధ్వజవనం యయౌ. 5
తథా తత్రైవ తం భూపమపశ్యద్వనభూమిగా
నిర్వికల్పసమాధిస్థం సముత్కీర్ణమివ ద్రుమమ్. 6

మూఁడు దినములైనపిమ్మట మరల యాకాశమును బ్రవేశించి తన యోగశక్తిచే కుంభఋషి రూపమును ధరించి శిఖిధ్వజుఁడున్నట్టి వనమునకేగెను. అచటి వనప్రదేశమును బొంది, చిత్రమందలి వృక్షమువలె స్థిరముగ నిర్వికల్పసమాధియందుండియున్నట్టి తన పతిని గాంచెను.

అహో ను ఖలు భో దిష్ట్యా విశ్రాన్తోఽయమిహాత్మని
స్థితః స్వస్థః సమః శాన్త ఇత్యువాచ పునః పునః. 7
తదేనం తావదేతస్మాద్బోధయామి పరాత్పదాత్
ఇదానీమేవ కిం దేహత్యాగమేష కరోతి వై. 8
కించిత్కాలం స్ఫురత్వేష రాజ్యేన విపినేన వా
సమమేవ గమిష్యావ స్వ్యక్తదేహావిమౌ సహ. 9
తస్యోపదేశోఽవిషమః పరిణామం న గచ్ఛతి
అనేనాభ్యాసయోగేన తావదాబోధయామ్యహమ్. 10

'ఆహా! సౌభాగ్యవశమున నీతఁడు స్వస్థుఁడై, శాంతుఁడై, సమదృష్టిగల్గి ఆత్మయందు విశ్రమించుచున్నాఁడు' అని యామె మరలమరలఁ బలికెను. మఱియు నిట్లు చింతించెను—'ఈతని నిపుడీ పరమపదమునుండి మేలుకొలిపెదను. ఏలయనఁగా, ఇప్పుడే దేహత్యాగము నీతఁడేల చేయవలె! కొంతకాలమువఱకు రాజ్యమునగాని అరణ్యమునగాని కర్మయాచరించుగాక ! ఆపిమ్మట దేహమును త్యజించి యిరువురము విదేహముక్తిని బొందెదము. నేను బూర్వమీతనికిఁ గావించిన యుపదేశ మిపుడే సప్తమభూమికాస్థితి పర్యంతము పరిణామమును బొందకుండుగాక ! కావున నిపుడీతనిని సమాధియొక్క యభ్యాసమునుండి మేలుకొలిపెదను'—

ఇతి సంచిన్త్య చూడాలా సింహనాదం చకార సా
భూయోభూయః ప్రభోరగ్రే వనేచర భయప్రదమ్. 11
న చచాల శిలేవాద్రౌ యదా నాదేన తేన సః
భూయోభూయః కృతేనాపి తదా సా తం వ్యచాలయత్. 12
చాలితః పాతితోఽప్యేష యదా న బుబుధే నృపః
తదా సంచిన్తయామాస చూడాలా కుమ్భరూపిణీ. 13

ఇవ్విధమున నిశ్చయించి చూడాల వనచరులకుఁగూడ భయమును గొల్పునట్టి సింహనాద మును దన భర్తయెదుట మరలమరల గావించెను. అట్లు గావించినను నాతఁడు పర్వతశిలవలెఁ జలింప

కరయే యుండెను. అప్పుడామె యాతనిని దనహస్తముతోఁ గదలించెను. అట్లు కదలించినను, తుదకుఁ బహుప్రోచినను గూడ రాజు సమాధియుండి లేవకయుండ నంత కుంభరూపిణియగు చూడాల యిట్లు విచారించెను

అహో పరిణతః సాధుః స్వపదే భగవానయమ్
తదేనం హి కయా యుక్త్యా సాంప్రతం బోధయామ్యహమ్. 14
అథవైనం మహాత్మానం కిమర్థం బోధయామ్యహం
విదేహం బోధమాసాద్య తిష్ఠత్వేష యథా సుఖమ్. 15
అహమప్యఙ్గనాదేహమిమం త్యక్త్వా పరం పదం
అపునర్జననాయైవ గచ్ఛామీహ హి కిం సమమ్. 16

ఆహా! ఈ సాధుమహాత్ముఁడు తన యాత్మజ్ఞానపదమున సప్తమభూమికాప్రవేశమువఱకుఁ బరిణతుఁడాయెను. అట్టి యీతనినే యుక్తిచే మేలుకొలుపుదును? అథవా ఈ మహాత్ముని సమాధినుండి లేపుటయెందుకు? విదేహముక్తినొంది సుఖపూర్వకముగ నటనుండుగాక! నేనున్ను ఈస్త్రీ శరీరమును వదలి, మరల జన్మలేనిదాననై, నాపతితోఁగూడఁ బరమపదమును బొందుదును.

ఇతి సంచిన్త్య దేహం స్వం త్యక్తుమభ్యుద్యతా సతీ
పునః సంచిన్తయామాస చూడాలా సా మహామతిః 17
ఆలోకయామి చ తావదేనం దేహం మహీపతేః
యద్యస్య సత్త్వశేషోఽస్తి బోధబీజం హృదన్తరే. 18
తత్కాలేనైష భగవాన్సంప్రబోధముపైష్యతి
మూలకోశరసాలీనం పుష్పజాలమివ ద్రుమే. 19
తదేవం విరహాజ్జీవన్ముక్త ఏవ భవత్యలం
ముక్తో భవత్యథ యది మన్యే గచ్ఛామి తత్సమమ్. 20

ఇట్లు విచారించి దేహమును ద్యజించుట కెపుడుద్యమించెనో, అపుడు మహాబుద్ధిమతియగు చూడాల యానృపాలునిగూర్చి మరల యిట్లు చింతించెను — ఈ రాజుయొక్క దేహమున నంతఃకరణములోపల జాగ్రత్తునకు బీజభూతమైన మనస్సుయొక్క శేషమేమైన యుండునేమో మొదట చూచెద. మనస్సుయొక్క శేషముండినచో, వృక్షముయొక్క మూలభాగమున రసరూపమున లీనమై యున్న పుష్పసమూహమువలె నీతఁడు మరల జాగృతుఁడగును. కాన నట్లు జాగృతుఁడై విహరించుచు బూర్ణరీతి జీవన్ముక్తుఁడేయై మెలంగుగాక! ఒకవేళ విదేహముక్తుఁడగుచో, నేనున్ను నీతనితోటి సమముగ నేగెదను.

ఇతి సంచిన్త్య చూడాలా స్పర్శనేన నయేన చ
పతిమాలోక్య సాశఙ్కమువాచ వరవర్ణినీ 21
అస్త్యేవ సత్త్వశేషోఽస్య హృది సంబోధకారణం
సంబోధహేతూదయేన సత్త్వశేషం వ్యబుధ్యత. 22

ఇట్లు విచారించి, శ్రేష్ఠవర్ణముగల యాచూడాల సంశయముతో గూడుకొనినదై స్పర్శచేతను. నీతిచేతను బతి నవలోకించి యిట్లు పలికెను — ఈతనిదేహమున జాగ్రత్తునకుఁ గారణభూతమగు మనస్సుయొక్క శేషము గలదు అని యిట్లు యుష్ణత్వాది చిహ్నములచే నామె మనఃశేషము నెఱిఁగెను.

శ్రీరామ ఉవాచ—:

భృశం సంశాన్తచిత్తస్య కాష్ఠలోష్ఠసమస్థితేః
సత్త్వశేషః కథం బ్రహ్మన్ జ్ఞాయతే ధ్యానశాలినః. 23

శ్రీరాముఁడు.- మహాత్మా! పూర్ణముగ శమించిన చిత్తముగలవాఁడును, కాష్ఠమువలెను, లోష్ఠము (మట్టిగడ్డ) వలెను అచంచలమైన స్థితి గలవాఁడును నగు ధ్యానశీలుని మనస్సుయొక్క శేషమెట్లెఱుంగఁబడును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ప్రబోధకారణం యస్య దుర్లక్ష్యోఽణువపుర్హృది
విద్యతే సత్త్వశేషోఽన్తర్బీజే పుష్పఫలం యథా. 24

శ్రీ వసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! సూక్ష్మదృష్టిచేతను, జ్ఞానదృష్టిచేతను లక్షింపఁబడునట్టి హృదయమున ప్రబోధకారణమగు మనఃశేషము బీజమునందు పుష్పఫలములవలె నుండుచున్నది.

చిత్తస్పన్దవియుక్తస్య తస్యాస్పన్దితసచ్చితః
ద్విత్వైకత్వవిహీనస్య సమస్యాచలసంస్థితేః 25
కాయః సమసమాభోగో న గ్లాయతి న హృష్యతి
నాస్తమేతి న చోదేతి సమమేవావతిష్ఠతే. 26

చిత్తముయొక్క చేష్టలులేనివాఁడును, ద్విత్వ ఏకత్వరహితుఁడును సచ్చిదాత్మస్వరూపమున నిశ్చలముగ నున్నవాఁడును, నిర్వికల్పసమాధియందు సమరూపమున అచంచలముగ స్థితినొందియున్నవాఁడును నగు మనుజునిదేహము గ్లానిని బొందదు, ప్రసన్నముగాదు, అస్తమింపదు, ఉదయింపదు, సమరూపముననే స్థితిగలిగియుండును.

ద్విత్వైకత్వాదియుక్తస్య యస్య ప్రస్పన్దతే మనః
తస్య దేహోఽన్యతామేతి నాస్పన్దస్య కదాచన. 27

ద్వైతాజ్ఞానయుక్తుఁడై, చేష్టలనొనర్చుచున్న మనంబు గలిగియున్నవాని దేహమే వృద్ధిక్షయాది అన్యభావముల నొందును గాని సమాధియందున్నవాని దేహమెన్నఁడును గాదు.

చిత్తస్పన్దో హి సర్వేషాం కారణం జగతః స్థితేః
రామ భావవికారాణాం కుసుమానాం యథా మధుః. 28

ఓ రామచంద్రా! పుష్పములకు వసంతర్తువు కారణమైనట్లు, సమస్త భావవికారములతోఁ గూడిన జగత్తుయొక్క స్థితికి చిత్తముయొక్క చేష్టయే కారణమైయున్నది.

అస్మిన్ప్రయాస్యతో దేహే చేతసో హి ముహుర్ముహుః
హర్షః కోపో న సంమోహో వశమేతి రఘూద్వహ. 29

రఘుకులోత్తముఁడవగు రామచంద్రా! ఇక్కారణమున పునర్జన్మమునకు బీజభూతమగు చిత్తముయొక్క శేషముండఁగా, ఒకదేహమునుండి మఱియొక దేహమునకు చిత్తము పోవుచుండ మరలమరల నిగ్రహింపఁబడినను హర్ష కోప సంమోహములు నిగ్రహింపఁబడఁజాలవు.

చిత్తే ప్రశమమాయాతే కామో యః సత్త్వవర్జితః
బాధతే నామ్బరస్యేవ తస్య భావవికారభూః. 30

చిత్తము ప్రశాంతినొందగా, అట్టి నిర్వాసనచిత్తముచేఁ ద్యజింపఁబడిన భావవికారస్థానమగు దేహమున్ను ఆకాశమునువలె మనుజుని బాధింపనేరదు.

వీచ్యాది న యథోదేతి సమాయా జలసంతతేః
తథా న దృశ్యతే దోషః సమాయాః సత్త్వసంతతేః. 31

జలముయొక్క సమస్థితియందుఁ దరంగాదులు లేనట్లు, చిత్తముయొక్క సమస్థితియందును వృద్ధిక్షయాది వికారములుగాని, రాగాది దోషములుగాని గానుపించవు.

సత్త్వస్యానుపలమ్భోఽస్తి న తస్యోపశమాదృతే
యావద్భాతి సమం తత్త్వం కాలాచ్ఛామ్యతి కేవలమ్. 32

ప్రారబ్ధకర్మము సంపూర్ణముగా క్షయించునంతవఱకు సత్త్వము (జీవన్ముక్తుల మనఃశేషము) యొక్క అభావ మెన్నఁటికిని కానేరదు. ప్రారబ్ధకర్మము నివృత్తముకాఁగా నయ్యది పూర్ణముగ శమించుచున్నది.

దేహే యస్మింస్తు నో చిత్తం నాపి సత్త్వం చ విద్యతే
స తాపే హిమవద్రామ పఞ్చత్వేన విలీయతే. 33

ఓ రామచంద్రా! ఏదేహమున చిత్తముగాని, సత్త్వముగాని యుండదో, అది యెండయందు మంచు విలీనమగునట్లు మృత్యువుచే విలీనమైపోవును.

శిఖిధ్వజస్య దేహోఽసౌ నిశ్చిత్తస్తేజసోర్జితః
సత్త్వాంశేన చ సంయుక్తస్తేన న గ్లానిభాజనమ్, 34

ఈ శిఖిధ్వజుని దేహము చిత్తరహితమైయున్నను, తేజముతోను, సత్త్వాంశముతోనుగూడి యున్నదిగాన గ్లానిని బొందదు.

తం తథాభూతమాలోక్య భర్తుర్దేహం వరాఙ్గనా
అనుజ్ఝితవతీ దేహం చిన్తయామాస సత్వరమ్. 35
చిత్తత్త్వం సర్వగం శుద్ధం ప్రవిశ్యాబోధయామ్యహమ్
భవిష్యద్బోధనం కాన్తమథ తత్ర హి సంస్థితా. 36

న బోధయామి యద్యేనం చిరాత్తద్బుధ్యతే స్వయమ్
కిమేకైవావతిష్ఠేఽహమిత్యేవం బోధయామ్యహమ్. 37

ఉత్తమస్త్రీయగు ఆచూడాల యట్లు తన భర్తృదేహముఁగూర్చి తన దేహమును త్యజింపక, శీఘ్రముగ నిట్లు విచారించెను. సర్వవ్యాపకమై, శుద్ధమైనట్టి యీతని చిత్తమునఁ బ్రవేశించి, అచటనే యుండి, దీర్ఘకాలమునకు సమాధినుండి లేచునట్టి యీ నాపతిని యిపుడే మేలుకొలిపెదను. ఒకవేళ నేనీతని నిపుడు మేలుకొలపనిచోఁ గాలక్రమమున నీతఁడే స్వయముగ జాగృతుఁడగును. కాని యొంటరిగ నేనేలయుండవలెను ? కావున సమాధినుండి యీతనిని మేలుకొల్పెదను.

ఇతిసంచిన్త్య చూడాలా దేహం కరణపఞ్జరమ్
సన్త్యజ్య ప్రాప చిత్తత్వే స్థితిమాద్యన్తవర్జితే. 38

ఇట్లు విచారించి చూడాల యింద్రియపంజరరూపమైనట్టి నిజదేహంబును వీడి, భర్తృదేహంబునఁ బ్రవేశించి, ఆతనియొక్క యాద్యంతరహితమైనట్టి శుద్ధ చిత్ - తత్త్వమున స్థితిఁబొందెను.

తత్ర సా చేతనాస్పన్దం కృత్వా సత్త్వవతః ప్రభోః
స్వం వివేశ పునర్దేహం స్వం నీడమివ పక్షిణీ. 39

అచట, సత్త్వయుక్తుఁడగు తనపతియొక్క నిర్వికల్పసమాధియందు, జలక్షీరములవలె చైతన్యముతోడ ఏకరసభూతమైయున్న యాతని బుద్ధిని మేలుపఱచునట్టి స్పందక్రియను గావించి, పక్షి తన గూటియందుఁ బ్రవేశించునట్లు, తిరిగి తన దేహమునఁ బ్రవేశించెను.

కుమ్భాకృతిరథోత్థాయ నివిష్టా కుసుమస్థలే
సామగాతుం ప్రవృత్తా సా భ్రమరీవృన్దనిఃస్వనా. 40

మఱియు, నామె కుంభఋషిరూపమును ధరించినదై పుష్పమయమై యొప్పుచున్న స్థలముపైఁ గూర్చుండి, తుమ్మెదల సమూహమును శబ్దరహితమొనర్చునట్టి సామగానమునఁ బ్రవృత్తయాయెను.

తం సామస్వనమాకర్ణ్య చిత్సత్త్వ గుణశాలినీ
బుబుధే భూపతేర్దేహే వసన్త ఇవ పద్మినీ. 41

ఆ సామగానశబ్దమును వినగనే, వసంతకాలమునఁ దామరకొలనువలె నారాజుదేహమున సత్త్వగుణముచే శోభితమగు చిత్తు (చిదాభాసవ్యాప్తమగు ఆతని బుద్ధి) ప్రబుద్ధమయ్యెను.

దృశం వికాసయామాస తాం తదార్క ఇవాబ్జినీమ్
గృహీతసత్త్వసంపత్తిః శిఖిధ్వజమహీపతిః. 42

సూర్యుఁడు కమలసరోవరమును వికసింపఁజేయునట్లు సత్త్వసంపత్తిని గ్రహించునట్టి యా శిఖిధ్వజమహారాజపుడు (సమాధియందు మూసుకొనియున్నట్టి) తన దృష్టిని వికసింపఁజేసెను.

అపశ్యత్కుమ్భమగ్రస్థం సామగాయనతత్పరమ్
పరేణ వపుషా యుక్తం సామవేదమివాపరమ్. 43

అత్తఱి, దివ్యశరీరధారియై, అన్యమగు మూర్తిభవించిన సామవేదమువలె నొప్పుచు దన యెదుట నున్నట్టి కుంభఋషిని జూచెను.

అహోబత వయం ధన్యాః పునః ప్రాప్తో మునిః స్వతః
ఇత్యేవోదాహరన్రాజా కుమ్భాయ కుసుమం దదౌ. 44

'ఆహా! మేము ధన్యులము! ఈ ముని స్వయముగనే మరల యిటకేతెంచెను' అని వచించుచు రాజు కుంభునకుఁ బుష్పప్రదానము గావించెను.

దిష్ట్యోదితాః స్మో భగవంస్తవ చేతసి పావనే
కే నామ వా మహాసత్త్వాః ప్రసాదేష్వఙ్గ నో స్థితాః. 45

మహాత్మా! తమ పవిత్రచిత్తమున మేము మరల యుదయించితిమిగాన నిది మా సౌభాగ్యమైయున్నది. అథవా, నాభాగ్యముచే మహాత్ములితరుల ననుగ్రహించుట కొఱకై స్వయముగనే యుద్యతులై యుండవచ్చును.

అస్మత్పవిత్రీకరణమేవాగమనకారణం
న చేత్కిం చాగమే బ్రూహి ద్వితీయం కారణం భవేత్. 46

మహాశయా! మమ్ములఁ బవిత్రమొనర్చుటకొఱకే తమయొక్క యాగమనమైయున్నది. అట్లుకానిచో దమయాగమనమునకు మఱియొక కారణమేమి యున్నదో వచింపుడు?

కుమ్భ ఉవాచ:—

యతః ప్రభృతి యాతోఽస్మి త్వత్సకాశాదనిన్దితః
తతః ప్రభృతి చేతో మే త్వయైవేహ సమం స్థితమ్. 47

కుంభుఁడు.— ఓ రాజా! అనిందితుఁడవగు నీయొక్క సమీపమునకు నేనెపుడేతెంచితినో, అప్పటినుండియు నాచిత్తము నీతోడ నిచటనే స్థితినొందియున్నది.

రమ్యే స్వర్గే న తిష్ఠామి సమీపే తవ సాంప్రతం
అభీష్టముద్యదేవాఙ్గ రమ్యాణాం తత్పురః స్థితమ్. 48

ప్రియుఁడా! రమణీయమగు స్వర్గమునఁగూడ నేనుండజాలకపోతిని. ఇపుడు నీచెంత సుఖముగనున్నాను. ఏలయనఁగా, రమ్యములగు అనేకవస్తువులమధ్య చిత్తమున కేది యిష్టమైయుండునో, అది ప్రయత్నముచేతనే సమ్ముఖమునఁ బ్రాప్తించును. (నిన్ను జూచుటకొఱకే నారాక అనిభావము)

త్వాదృశో బన్ధురాప్తశ్చ సుహృన్మిత్రం తథా సఖా
విశ్వాస్యోవాపి శిష్యశ్చ మన్యే జగతి నాస్తి మే. 49

ఓ సాధూ! నీతోటి సమానమగు బంధువు, ఆప్తుడు, సుహృదుఁడు, మిత్రుఁడు, సఖుఁడు, విశ్వాసపాత్రుఁడు, అథవా శిష్యుడు, ఈజగంబున నాకు మఱియొకఁడు లేడని నేను నమ్ముచున్నాను.

శిఖిధ్వజ ఉవాచ:—

అహో ను ఫలితం పుణ్యపాదపైర్నః కులాచలే
యస్మాద్భవానసఙ్గోఽపి వాఞ్ఛత్యస్మత్సమాగమమ్. 50

శిఖిధ్వజుఁడు:- మహాత్మా! ఆహా! ఈ(మందర) పర్వతముపైఁ గల పవిత్రవృక్షములచే నాపుణ్యము ఫలించినది. ఏలయనఁగా, తామసంగులైనను నాయొక్కసమాగమమును వాంఛించుచున్నారు.

ఇదం వనమిమేవృక్షా భృత్యోఽయమహామాదృతః
రోచతే తేన చేత్స్వర్గస్తదిహ స్థీయతాం ప్రభో. 51

ప్రభూ! ఇదిగో యుత్తమవనము; ఇవిగో రమణీయములగు వృక్షములు; తమ్ముల సత్కరించు వీఁడు తమ భృత్యుఁడు, కానస్వర్గము తమకు రుచింపనిచో నిచటనే నివాసము చేయుఁడు.

భవద్వితీర్ణయా యోగయుక్త్యా విశ్రాన్తవానహం
యథా సాధో తథా మన్యే స్వర్గే విశ్రమణం కుతః. 52

ఓ సాధూ! తాము వచించినట్టి యోగయుక్తిచే నేనెట్లు విశ్రాంతిబడసితినో, అట్టివిశ్రాంతి స్వర్గమందుగూడ లేదని నేను విశ్వసించుచున్నాను

తామేవ సంస్థితిం స్వచ్ఛామవలమబ్య ప్రకాశినీం
విహారేహ యథాకామం స్వర్గే భూమితలే తథా. 53

అట్టి స్వచ్ఛమై, ప్రకాశయుక్తమైనట్టి స్థితి నాశ్రయించి యిట స్వర్గమునఁగాని, భూమిపైగాని యథేచ్ఛగ సంచరింపుఁడు.

కుమ్భ ఉవాచ:—

పరే పదే మహానన్దే కచ్చిద్విశ్రాన్తవానసి
ఇదం భేదమయం దుఃఖం కచ్చిత్సంత్యక్తవానసి. 54

కుంభుఁడు.— ఓరాజా! మహత్తరమైన పరమపదమున నీవు విశ్రాంతి నొందితివా? దుఃఖపూర్ణమై, భేదమయమైనట్టి యీసంసారమును నీవేమైన త్యజించితివా?

కచ్చిదాపాతరమ్యేభ్యః సంకల్పేభ్యోరతిర్భృశం
నిర్మూలతాం గతా రాజన్భోగనీరసమేవ తే. 55

విచారింపని కారణముచే రమణీయముగఁదోచు సంకల్పముల యందును, నీరసములగు భోగములందును నీయొక్క అత్యంతప్రీతి నిర్మూలమయినదా?

హేయోపాదేయదశాతీతం శాన్తం శమసమస్థితి
యథా ప్రాప్తేష్వనుద్వేగం కచ్చిత్తవ మనః స్థితమ్. 56

హేయోపాదేయ (త్యజించుట గ్రహించుటయును) దశకంటె నతీతమై, శాంతమై, సమస్థితిగల్గియున్నట్టి నీయొక్క చిత్తము యథాప్రాప్తములగు వస్తువులందుద్వేగములేక స్థిరముగనున్నదా

శిఖిధ్వజ ఉవాచ:—

త్వత్ప్రసాదేన భగవన్దృష్టా దృశ్యాతిగా గతిః
ప్రాప్తః సంసార సీమాన్తో లబ్ధో లబ్ధవ్యనిశ్చయః. 57

శిఖిధ్వజుఁడు:— మహాత్మా! తమ యనుగ్రహముచే నేను దృశ్యమునకుఁ బరమైయున్న గతిని గాంచితిని; సంసారముయొక్క సీమాంతము (హద్దు) నుబొందితిని. పడయఁదగిన నిశ్చిత పదార్థమును బడసితిని.

చిరాదతి చిరేణైవ విశ్రాన్తోఽస్మి నిరామయః
లబ్ధం లబ్ధవ్యమఖిలం తృప్తః సంశ్విరసంస్థితః. 58

బహుకాలమైన పిదపనిపుడు మూఁడుదినములవఱకు నిర్విఘ్నముగ విశ్రాంతినొందితిని. పొందఁదగినదంతయుఁ బొందితిని ఇపుడు శాశ్వతమగు తృప్తిని బడసియున్నాను.

నోపదేష్టవ్యమస్మాకం కించిదప్యుపయుజ్యతే
సర్వాత్రైవాతితృప్తోఽస్మి సంస్థితోఽస్మి గతజ్వరః. 59

నాకిఁక నుపదేశముయొక్క యుపయోగ మొకింతైనను లేదు అంతట సర్వథా తృప్తుఁడనై దుఃఖరహితుఁడనై యున్నాను.

జ్ఞాతమ జ్ఞాతమప్రాప్తం త్యక్తం త్యక్తవ్యమాశ్రితమ్
తత్త్వం పరత్వం సత్వం మే స్వస్యైవాస్తి న కించన. 60

తెలిసికొననిదానిని దెలిసికొంటిని, పొందనిదానిని బొందితిని, త్యజింపఁదగినదానిని ద్యజించితిని; నాయొక్క వాసనారహితమగు మనస్సు ఆత్మయను పరత్వమునే యాశ్రయించినది. నాకు నాయాత్మకంటె భిన్నముగ నేదియు భాసించుటలేదు.

నిఃసంసృతిర్విగతమోహభయో విరాగో
నిత్యోదితః సమసమాశయసర్వసౌమ్యః
సర్వాత్మకః సకలసంకలనావియుక్త
ఆకాశకోశవిశదః సమమాస్థితోఽస్మి. 61

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణేపూర్వార్ధే చూ॥ కుమ్భపునరాగమనం నామ త్ర్యధికశతతమః సర్గః ॥ 103 ॥

నేనిపుడు సంసార, మోహ, భయ, రాగాదిదోషములు లేనివాఁడనై, నిత్యోదయరూపుఁడనై, సముఁడనై, సమమగు నంతఃకరణముగలవాఁడనై, సర్వథా సౌమ్యుఁడనై, సర్వరూపుఁడనై. సర్వకల్పనావినిర్ముక్తుఁడనై, ఆకాశకోశమువలె నిర్మలుఁడనై, సర్వత్రయేకరూపుఁడనై యున్నాను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున చూడాలోపాఖ్యానమున కుంభపునరాగమనము నూటమూఁడవ సర్గము ॥103॥

---

## చతురధికశతతమః సర్గః

[కుంభస్య రమతో రాజ్ఞా సంభోగేచ్ఛాత్ర వర్ణ్యతే
స్వర్గాపదేశాత్పూర్వ్యానం విషణ్ణపునరాగమః.

రాజుతో కుంభునియొక్క సంభోగమునుగూర్చిన యిచ్ఛ, స్వర్గముయొక్క నెపమున నగరమున కేగుట, ఖిన్నుఁడై తిరిగి వచ్చుట, మున్నగు విషయము లిచట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

ఇత్యధ్యాత్మ విచిత్రాభిః కథాభిస్తౌ పరస్పరమ్
ఆసాతే వేద్యవేత్తారౌ ముహూర్తత్రితయం వనే. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు విచిత్రమైన యాధ్యాత్మికకథను బరస్పరము వచించుకొనుచు ఆజ్ఞానులిరువురును నవ్వనమున నాలుగడియలవఱకు నుండిరి.

తత ఉత్థాయ కస్మింశ్చిత్సానౌ సరససారసే
సరోవరే వనే చైవ విహృతౌ నన్దనే వనే. 2

అటుపిమ్మట, అటనుండి లేచి, స్నిగ్ధములగు సారసపక్షిద్వయములచే శోభితమును, తటాకయుక్తమును, నందనవనమువలె నానందదాయకమునగు ఒకానొక పర్వతశిఖరముపై విహరింపసాగిరి.

తేనాచారేణ తాభిశ్చ కథాభిస్తౌ వనే తతః
నీతవన్తౌ దినాన్యష్టౌ తాసు కాననవీథిషు. 3

అట్టి జీవన్ముక్తుల యాచారముతోఁ గూడినవారై, ఆయా విచిత్రకథలఁ జెప్పుకొనుచు వారిరువురున్ను నవ్వనమార్గములం దెనిమిదిదినములు గడపిరి.

అథ కుమ్భ ఉవాచాన్యద్వనం యావో గిరావితి
తదోమితి నృపో మత్వా తావుభౌ ప్రవిచేరతుః. 4

తదుపరి కుంభుఁడు 'మఱియొక పర్వతవనమున కేగుదము' ని వచింప, రాజు సల్లెయని నంత నిరువురును నచ్చోటు వీడి చనిరి.

వనాన్యనేకరూపాణి జఙ్గలాని తటాని చ
సరాంసి గుల్మజాలాని శృఙ్గాణి గహనాని చ. 5
నదీ దేశాంస్తథా గ్రామాన్నగరాణి వనాని చ
మఞ్జుఘోషాన్గిరీన్కుఞ్జాంస్తీర్థాన్యాయతనాని చ. 6

అపుడు వారు పలువిధములగు వన, తట, తటాక, కుంజ, శిఖర, అరణ్యములందు విహరించిరి. మఱియు నదులు, దేశములు, గ్రామములు, నగరములు, వనములు, మధురధ్వనితోఁగూడిన పర్వతములు, కుంజములు, తీర్థములు, ఆశ్రమములు మున్నగు చోట్ల సంచరించిరి.

సమమేవ సమస్నేహా సమవేతౌ స్థితావుభౌ
సమసత్త్వౌ సమోత్సాహౌ శంసన్తౌ తన్తతుః సదా. 7

వారిద్దఱును సమానమైన స్నేహముగలవారై, సమానధైర్యోత్సాహములతోఁ గూడుకొనినవారై, పరస్పరము ప్రశంసించుకొనుచు సదా కూడియేయుండుచుండిరి.

ఆనర్చతుః పితౄన్దేవాన్బుభుజాతే చ రాఘవ
సమం తప్తే చ సిక్తే చ సమబుద్ధీ బభూవతుః. 8

ఓ రామా! వారిరువురును గలిసియే దేవతలను, పితరులను బూజించుచుండిరి. కలిసియే భుజించుచుండిరి. మఱియు, శీతోష్ణప్రదేశములయెడల సమబుద్ధి గలిగియుండిరి.

తమాలవనఖణ్డేషు మన్దారగహనేషు చ
దంపతీ స్నిగ్ధహృదయౌ సుహృదౌ తౌ విరేజతుః. 9

స్నేహయుక్తులగు ఆదంపతులిరువురును తమాలవనఖండములందును, మందార కుంజములందును మిత్రరూపమున విహరింపసాగిరి.

ఇదం గేహమిదం నేతి వికల్పకలనా మనః
న జహార తయో రామ వాత్యేవ విబుధాచలమ్. 10

ఓ రామచంద్రా! గొప్పవాయువు సుమేరుపర్వతమును జలింపఁజేయనట్లు, 'ఇది గృహము, ఇది గృహము కాద'ను నీమున్నగు వికల్పనలువారి మనంబును హరింపఁజాలకుండె.

విచేరతుస్తౌ సహృదౌ క్వచిద్ధూలివిధూసరౌ
క్వచిచ్చన్దనదిగ్ధాఙ్గౌ క్వచిద్భస్మానురఞ్జితౌ. 11
క్వచిద్దివ్యామ్బరధరౌ చిత్రామ్బరధరౌ క్వచిత్
క్వచిత్పల్లవసంఛన్నౌ క్వచిత్కుసుమమణ్డితౌ. 12

ఆ మిత్రులిరువురును నొకపుడు ధూళిచే లిప్తమైన శరీరములుగల్గియు, ఒకపుడు చందనముచే భూషితమైన అవయవములు గల్గియు, ఒకపుడు భస్మముచే నలంకృతులైయు, చరింపఁదొడఁగిరి. అట్లే యొకపుడు దివ్యవస్త్రముల ధరించుచు, ఒకపుడు చిత్రవిచిత్రములైన వస్త్రములఁ గట్టుకొనుచు ఒకపుడాకులచే శరీరమును గప్పుకొనుచు, ఒకపుడు పుష్పములచే భూషితులగుచు విహరించుచుండిరి

దినైః కతిపయైరేవ సమచిత్తతయా తయా
సత్త్వోదాత్తతయా చైవ రాజా కుమ్భవదాబభౌ. 13

కొలఁది దినములలోనే, సమానమైన చిత్తము గలిగియుండుటచేతను, వాసనారహితమగు చిత్తముయొక్క యౌత్కృష్ట్యముచేతను నారాజు కుంభునితోటి సమానముగ శోభించెను.

అథ తం సురగర్భాభం చూడాలా సా శిఖిధ్వజమ్
దృష్ట్వా శోభాముపగతం చిన్తయామాస మానినీ. 14

అయం పతిరదీనాత్మా రమ్యాశ్చ వనభూమయః
ఇయం స్థితిరనాయాసా యా న కామేన వఞ్చితా. 15

జీవన్ముక్తధియాం భోగం యథాప్రాప్తమతిష్ఠతామ్
ఏకాగ్రహాత్మికా తుచ్ఛా మూఢత్వైవోదితా భవేత్. 16

నిజః పతిరుదారాత్మా నిరాధిశ్చ నవం వయః
గృహాణి పుష్పజాలాని సా హతా యా న కామినీ. 17

వనపుష్పలతాగేహే స్వాయత్తే భర్తరి ప్రియా
రమతే యా న నిర్దుఃఖా సా హతైవ దురఙ్గనా. 18

రమ్యం వివాహితం కాన్తం పతిమాసాద్య నిర్జనే
స్త్రీ సతీ యా న రమతే తాం ధిగస్తు దురఙ్గనామ్. 19

సముజ్ఝితా యథాప్రాప్తమపి వేద్యవిదా సదా
అనిన్ద్యం సముదారార్థం కిం తజ్జ్ఞేన కృతం భవేత్. 20

తత్కించిద్రచయామ్యాశు ప్రపఞ్చం ప్రేక్షయా వనే
యేనాయం భూపతిర్భర్తా రమతే మయి మానదః. 21

ఇతి సంచిన్త్య చూడాలా కుమ్భవేషధరా పతిమ్
ప్రాహ కాననగుల్మస్థా కోకిలం కోకిలా యథా. 22

అటుపిదప దేవపుత్రునితోటి సమానమగు శోభను బొందిన శిఖిధ్వజనృపాలుని, మానినియగు చూడాల గాంచి తన మనంబున నిట్లు విచారించుకొనెను. ఈతఁడుదారచిత్తుఁడగు నాపతి, ఇవి రమణీయమైన వనభూములు—రాగముచే వంచితముకాని యిట్టి స్థితి పరిశ్రమలేకయే ప్రాప్తించినది. యథాప్రాప్తములగు భోగములయెడల అనివృత్తదశగల జీవన్ముక్తులొక భోగనివృత్తియందే పట్టుదల వహించియుండుట మూఢత్వ ముదయించుటయేయగును. ఉదారాత్ముఁడగు యీనాపతి వ్యాధిరహితుఁడై, నవవయస్కుఁడై యున్నాఁడు. మఱియు పుష్పజాల సమన్వితములైన లతాగృహములిట విరాజిల్లుచున్నవి. ఇట్టి స్థితియందే స్త్రీ కామవతి గాకుండునో ఆపె హతప్రాయయే యగును. వనపుష్పలతాగృహములందుఁ దనయధీనుఁడైన ప్రియుఁడగు పతితోడ సుఖముగ రమింపని దుష్టవనిత నశించినదే యగును. మనోహరమైన నిర్జనప్రదేశమునఁ దన వివాహితుఁడగు పతిని బొందియు నెవతె రమింపకుండునో యట్టి దుష్టస్త్రీకి ధిక్కారమగుగాత! సదా యనిన్ద్యమై, ఉదారార్థయుక్తమైనట్టి యథాప్రాప్తమగు భోగమును ద్యజించు వేద్యవిదుఁడగు జ్ఞాని యట్లు చేయుటచే నేమి యధికఫలమును బొందినట్లగును? కావున నా స్వబుద్ధిచే నివ్వనమున నేనిపుడొక తంత్రమును బన్నెదను. దానిచే మానప్రదుఁడగు ఈ నాపతి నాతోటి రమింపఁగలఁడు—అని యిట్లు చింతించి కుంభవేషధారిణియు, అరణ్యకుంజములందున్నట్టిదియునగు చూడాల ఆఁడు కోకిల మగకోకిలతో వచించునట్లుగఁ దనపతితో నిట్లనియె—

కుమ్భ ఉవాచ:—

చైత్రమాసస్య శుక్లోఽయం ప్రతిపద్దివసో మహాన్
అద్యాస్థానం మహారమ్యం స్వర్గే భవతి వైహరేః. 23
సంనిధానం మయా తత్ర కర్తవ్యం పితురగ్రతః
యథాస్థితా హి నియతిర్న సంత్యాజ్యా కదాచన. 24
ప్రతిపాలయితవ్యం మే త్వయేహ చ వనావనౌ
క్రీడతా నవ పుష్పాయాం సముద్వేగమగచ్ఛతా. 25
ఆగచ్ఛామి దినాన్తేఽద్య నిర్వికల్పం నభస్తలాత్
సర్గాదతితరామేవ త్వత్సఙ్గోమమ తుష్టయే. 26
ఇత్యుక్త్వా మఞ్జరీం కుమ్భో దదౌ మిత్రాయ కౌసుమీమ్
ప్రీతయే స్వామివ ప్రీతిం కాన్తాం నన్దన వృక్షజామ్. 27
ఆగన్తవ్యం త్వయా శీఘ్రమేవం వదతి భూపతౌ
పుప్లువేఽథ వనాద్వ్యోమ శరన్ముఖపయోదవత్. 28
పుష్పాఞ్జలిం జహౌ వ్యోమ వ్రజన్కుసుమదామజం
విసారి వనవాతేన హిమం హైమ ఇవామ్బుదః. 29
శిఖిధ్వజో వ్రజన్తం తం దదర్శాదర్శనం తదా
ఉన్నిద్రోఽబ్దం యథా బర్హీ ధీమత్ప్రీతిర్హి దుస్త్యజా. 30
శిఖిధ్వజ దృశామన్తే వ్యోమ్ని కుమ్భవపుర్జహౌ
శాన్తావర్తేవ వారిశ్రీర్ముగ్ధా స్వం రూపమాయయౌ. 31

కుంభుఁడు:_ ఓ రాజా! నేఁడుచైత్రశుద్ధపాడ్యమి గనుక చాలగొప్పదివసమైయున్నది. నేఁడు స్వర్గమున నింద్రుని మహాసభ జరుగును. అట పెక్కురు దేవతలు, ఋషులు సమావేశమగుదురు. అచట మజ్జనకుని సమ్ముఖమునకు నేనగత్యమేగవలసియున్నది. ఏలయనఁగా, యథాస్థితమగు మర్యాద నెపుడును ద్యజింపఁగూడదు. నూతన పుష్పయుక్తమగు నివ్వన భూమియందు విహరించుచు నుద్వేగరహితుఁడవై నీవు నాకొఱకై ప్రతీక్షించుచుండుము. నేఁటి సాయంకాలమున నాకాశమునుండి నీవద్దకు నేను తప్పక తిరిగివచ్చెదను. ఎందుకనఁగా, స్వర్గముకంటెను నధికప్రసన్నత నీసాంగత్యముచే నాకుఁ గలుగుచున్నది_ఇట్లు వచించి కుంభుఁడు రాజును ప్రసన్నమొనర్చుటకుఁగాను, తన ప్రీతినివలె కల్పవృక్షముయొక్క పూగుత్తుల నాతనికొసంగెను. మరల శీఘ్రముగఁ దిరిగి రావలెనని రాజు వచించుచుండఁగా కుంభరూపిణియగు చూడాల శరదృతువు నందలి నిర్జలమేఘమువలె నవ్వనమునుండి యాకసమున కెగిరిపోయెను అట్లాకాశమందు, జనుచు, మంచుతోఁగూడిన మేఘము మంచుబిందువుల వర్షించునట్లు. వనవాయువుచే నలువైపుల విస్తరించు పుష్పమాలలతోఁగూడిన పుష్పాంజలినామె క్రిందకు విడిచెను. కుంభుఁడేగుచుండ శిఖిధ్వజుఁడాతనిని, తనదృష్టి చనునంతవఱకుఁ గంఠముపైకెత్తి, మయూరమ్ము మేఘమును గాంచునట్లు గాంచెను. బుద్ధిమంతుల ప్రీతిదుస్త్యాజ్యముగదా! రాజుయొక్క దృష్టిని

మీఁటి యెపుడు పోయెనో, అపుడు చూడాల, ఆవర్తము శమింప జలము తన పూర్వశోభను బొందునట్లు, తన కుంభరూపమును వదలి చూడాలరూపమును ధరించెను.

ప్రాప మఞ్జరితాకామి కల్పవృక్షోపమం పురమ్
స్ఫురత్పతాకమాత్మీయం స్వర్గరమ్యం దివః పథా. 32
అన్తఃపురమదృశ్యైవ వివేశ లలనాకులం
మధుమాస మహాలక్ష్మీర్లసల్లతమివ ద్రుమమ్. 33
రాజకార్యాణి సర్వాణి తత్ర సంపాద్య సత్వరం
శిఖిధ్వజస్య పురతః పపాత ఫలపుష్పవత్. 34

అట్లు చూడాల యాకాశమున నేగుచు, లతలచే జుట్టఁబడిన కల్పవృక్షమువలె శోభించుచున్నదియు, ఎగురుచున్న పతాకములతోఁగూడినదియు, స్వర్గమువలె రమణీయమై యొప్పుచున్నదియునగు తన నగరమును బొందెను. వసంతలక్ష్మి లతావేష్టితమగు వృక్షమునఁ బ్రవేశించునట్లు, స్త్రీజనంబుచే వ్యాప్తమైయున్నట్టి యంతఃపురమున నపుడామె యదృశ్యరూపమునఁ బ్రవేశించెను. అచట రాజకార్యములన్నింటిని శీఘ్రముగ నెరవేర్చి, వృక్షమునుండి ఫల పుష్పములు పడునట్లు, మరల శిఖిధ్వజునియెదుటవచ్చి వ్రాలెను.

తత్ర కాలద్యుతిముఖం చకారాఖిన్నమానసా
ఇన్దుం సనీహారమివ శ్యామా ఖిన్నమివామ్బుజమ్. 35
తం దృష్ట్వా తాదృశాకారం సముత్తస్థౌ శిఖిధ్వజః
బభూవ ఖిన్నచేతాశ్చ సముపాచేదమాదృతః 36

మంచుతోఁగూడిన చంద్రుడు ఖిన్నమగు కమలమును నలుపువర్ణముగఁ జేయునట్లు, యౌవనమధ్యమును నొందినదియు, ఖిన్నచిత్తయునగు చూడాల యపుడు తనముఖ చంద్రుని కాంతిని కృష్ణవర్ణముగా నొనర్చెను. ఆమెయొక్క యట్టి యాకృతిఁగాంచి శిఖిధ్వజుఁడు వెంటనే లేచి విషాదచిత్తముతో నాదరముగ నిట్లు పల్కెను —

దేవపుత్ర నమస్తేస్తు విమనా ఇవ లక్ష్యసే
కుమ్భ స్త్వం త్యజ సంరమ్భమిదమాసనమాస్యతామ్. 37
సన్తో విదితవేద్యా యే తే హి హర్షవిషాదజామ్
నాశ్రయన్తి స్థితిం స్వస్థాః పద్మా ఇవ జలార్ద్రితామ్. 38

దేవపుత్రా! తాము చింతాగ్రస్తులుగఁ గన్పట్టుచున్నారు. తాము కుంభులుకాన మనస్సంతాపమును త్యజించి ఇయ్యాసనముపైఁ గూరుచుండుడు మహాత్మా! కమలము జలముయొక్క యార్ద్రిత (చెమ్మ)ను స్వీకరింపనట్లు, తమవంటి తత్త్వవేత్తలు సుఖదుఃఖములచే నుత్పన్నమగు స్థితి నాశ్రయింపరు.

శ్రీ వసిష్ఠ ఉవాచ: —

తేన జ్యోత్స్నాపతినేత్యుక్తే కుమ్భ ఆహాసనే విశన్
గిరా విషణ్ణయా శీర్ణవంశస్వనసమానయా. 39

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! రాజిట్లు పలుక నంత కుంభుఁడాసనముపై గూర్చొనుచు పాతవెదురుయొక్క శబ్దమునుబోలిన విచారయుక్తమగు ధ్వనితో (గద్గదస్వరముతో) నిట్లు వచించెను—

యావద్దేహమవస్థాసు సమచిత్తతయైవ యే
కర్మేన్ద్రియైర్న తిష్ఠన్తి న తే తత్త్వవిదః శఠాః. 40

ఎంతవఱకుఁ బ్రారబ్ధకర్మముండునో, అంతవఱకు దేహావస్థలయందు సమచిత్తులై, కర్మేంద్రియములచే యథాప్రాప్తములగు భోగముల నెవరనుభవింపరో వారు శఠులేగాని తత్త్వవేత్తలుకారు.

యే హ్యతత్త్వవిదో మూఢా రాజన్బాలతయైవ తే
అవస్థాభ్యః పలాయన్తే గృహీతాభ్యః స్వభావతః. 41

ఓరాజా! తత్త్వవేత్తలుగాని మూఢులు శరీరమునకు స్వభావముగ సంప్రాప్తించు అవస్థలనుండి తమమూర్ఖత్వకారణముననే పరువిడుచున్నారు.

యావత్తిలం యథా తైలం యావద్దేహం తథా దశా
యో న దేహదశామేతి స చ్ఛిన్త్యసినామ్బరమ్. 42

నువ్వు లెంతవఱకుండునో, అంతవఱకు నూనెయు నుండునట్లు, ఎంతవఱకీశరీరముండునో అంతవఱకు కర్మేంద్రియముల హర్షశోకాద్యవస్థలున్ను నుండును. కర్మేంద్రియముల యవస్థనెవఁడు త్రెంచునో, ఆతఁడు ఖడ్గముచే నాకాశమును ఛేదించువాఁడే యగును.

ఏష దేహదశాదుఃఖపరిత్యాగో హ్యనుత్తమః
యత్సామ్యం చేతసో యోగాన్న తు కర్మేన్ద్రియస్థితేః. 43

ఈ దేహదశలందె దుఃఖము కలుగునో, అద్దానిని సమాధియున్నగువాని బలమున గాంచకుండుటయే తత్పరిత్యాగమగును. అదియే యుత్తమమైనదిగాని కర్మేంద్రియములను హఠముగ నిగ్రహించి తద్దుఃఖమును సహించుటకాదు.

యావద్దేహం యథాచారం దశాస్వజ్ఞ విజానతా
కర్మేన్ద్రియైర్హి స్థాతవ్యం నతు బుద్ధీన్ద్రియైః క్వచిత్. 44

దేహదశ లెంతవఱకుండునో, అంతవఱకు జ్ఞానియున్ను కర్మేంద్రియములచే యథాప్రాప్తములగు నాచారములఁ గావించుచుండవలెను. కాని, మనస్సుమున్నగు జ్ఞానేంద్రియములచే సదా సమముగనే యుండవలెను.

పరమేష్ఠిప్రభృతయః సర్వ ఏవోదితాశయాః
దేహావస్థాసు తిష్ఠన్తి నియతేరేష నిశ్చయః. 45

బ్రహ్మదేవుఁడు మొదలుగాఁగల మహనీయులందఱున్ను దేహావస్థలందు (సమముగ) స్థితిగల్గియున్నారు. ఇది ఈశ్వరుని నియతియొక్క నిశ్చయమైయున్నది.

అజ్ఞత త్త్వజ్ఞ భూతాని దృశ్యజాతమిదం హి యత్
తత్సర్వమేవ నియతిం ధావత్యమ్బు యథామ్బుధిమ్. 46

జలము సముద్రమునై పునకుఁ బరువిడునట్లు అజ్ఞానియైనను, జ్ఞానియైనను సరే జగత్తునందలి ప్రాణిమాత్రులందఱును, ఈశ్వరనియతినిగూర్చియే పరుగిడుచున్నారు.

తజ్జ్ఞా బుద్ధ్యాదిసామ్యేన పాణ్యాదిచలనేన చ
నియతిం యాపయన్తీమాం యావద్దేహమఖణ్డితామ్. 47

జ్ఞానులగువారు బుద్ధ్యాదుల సామ్యత్వముగలిగి, హస్తపాదాది కర్మేంద్రియములచే కార్యములాచరించుచు దేహస్థితిపర్యంత మీశ్వరనియతిని బూర్ణముగఁ బాలించుచున్నారు.

అజ్ఞాస్తు సర్వక్షోభేణ సుఖదుఃఖ దశాహతాః
నియతిం యాపయన్త్యజ్ఞ దేహలక్షైర్వ్యఖణ్డితామ్. 48

ప్రియుఁడా! అజ్ఞానులైతే మిగుల క్షోభతో గూడుకొనినవారై, సుఖదుఃఖదశలచే హతులై, లక్షలకొలఁది దేహములను ధరించుచు; దేహస్థితి పర్యంత మపూర్ణముగనే యీశ్వరనియతిని బాలించుచున్నారు

ఇత్థం సుఖేషు నను దుఃఖదశాసు చేత్థం
స్థాతవ్యమిత్యధిగతం యదిహాజ్ఞ జీవైః
అజ్ఞజ్ఞభూత నివహాస్ఫురితస్తదేవం
దుర్లఙ్ఘ్య ఏష నియతో నియతేర్విలాసః. 49

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ జీవన్ముక్త వ్యవహార ప్రతిపాదనం నామ చతురధికశతతమః సర్గః । 104 ॥

ఓ రాజా! 'ఈ ప్రాణి యీ జన్మయందిటు సుఖస్థితులందుండవలెను, ఈ ప్రాణి యిట్లు దుఃఖస్థితులందుండవలెన'ను నీ ప్రకారముగ జీవులందఱు న దమ ప్రారబ్ధకర్మానుసారము లలాటలిఖితాక్షరములఁ బొందియుండిరి. కాన జ్ఞానికైనను అజ్ఞానికైనను నియతియొక్క ప్రారబ్ధకర్మవిలాసము నుల్లంఘించుట కష్టతరమే యగును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యానమున జీవన్ముక్తవ్యవహార ప్రతిపాదనమను నూటనాలుగవ సర్గము ॥ 104 ।

## పఞ్చాధికశతతమః సర్గః

[కుమ్భేన నిశి దుర్వాసః శాపాత్స్త్రీత్వేఽప్తిరుచ్యతే
పరస్పరం సమాధానైః ప్రీతయోశ్చ తథా స్థితిః

దుర్వాసఋషి శాపముచే కుంభునకు స్త్రీరూపప్రాప్తి, పరస్పరసమాధానములచే నట్టి దశయందుఁ బ్రీతిపూర్వకమగు వారిస్థితి యిట వర్ణింపఁబడుచున్నవి.]

**శిఖిధ్వజ ఉవాచ:—**

ఏవం స్థితే మహాభాగ కథముద్వేగమీదృశమ్
లబ్ధవానసి దేవోఽపి వద వేద్యవిదాంవర. 1

శిఖిధ్వజుఁడు:- మహాభాగా! వేదవిద్వరా! ఈ ప్రకారముగ నియతి ననుసరించియే సమస్త ప్రాణులును వర్తించుచుండ, తాము దేవపుత్రులైయు నిట్టి క్షోభ నెట్లు పొందితిరి?

**కుమ్భ ఉవాచ:—**

శృణు కార్యమిదం చిత్తం మదీయం వసుధాధిప
కథయామి తవాశేషం స్వర్గే యద్వృత్తమద్య మే. 2

కుంభుఁడు:- ఓ రాజా! సావధానచిత్తుఁడవై నా స్థితినిగూర్చి వినుము. నేఁడు స్వర్గమున నేవృత్తాంతము జరిగినదో దానినంతయు నీకుఁజెప్పెదను.

సుహృద్యావేదితం దుఃఖం పరమాయాతి తానవమ్
ఘనం జడం కృష్ణమపి ముక్తవృష్టిరివామ్బుదః. 3

ఏలయనఁగా, నల్లని మేఘమైనను వర్షించినపిదప తెల్లనిరూపముబొందునట్లు, తనదుఃఖము నుగూర్చి మిత్రున కెఱింగించినచో నయ్యది చాలవఱకుఁ దగ్గిపోవును,

సుహృదా పృచ్ఛతా సాధు చేతో యాతి ప్రసన్నతామ్
స్వచ్ఛతోపగతేనాశు కతకేన జలం యథా. 4

ఓ సాధూ! చిల్లగింజచే జలము వెంటనే స్వచ్ఛమగునట్లు, నిష్కపటియగు మిత్రుఁడడుగఁగా చిత్తము ప్రసన్నత్వము నొందును.

అహం తావదితో యాతో భవతే పుష్పమఞ్జరీమ్
దత్త్వా గగనముల్లఙ్ఘ్య సంప్రాప్తశ్చ త్రివిష్టపమ్. 5
తతః పిత్రా మహర్షిస్య సభాస్థానే యథాక్రమం
స్థితోత్థాయ తథోత్థానకాలే పిత్రా వివర్జితః. 6
ఇహాగన్తుమహం త్యక్త్వా స్వర్గం సంప్రాప్తవాన్నభః
దివాకరహయైః సార్ధం వహామ్యనిలవర్త్మని. 7
అథైకత్ర గతో భానురేకేనాన్యేన వర్త్మనా.

ఆగచ్ఛామ్యహమాకాశం సాగరాపతితాకృతిః. 8
అథాగ్రే వారిపూర్ణానాం మేఘానాం మధ్యవర్త్మనా
అపశ్యం మునిమాయాన్తమహం దుర్వాససం జవాత్. 9
పయోధరపటచ్ఛన్నం విద్యుద్వలయ భూషితం
అభిసారికయా తుల్యం ధారాధౌతాఙ్గ చన్దనమ్. 10
స్థితాం సుతరుసుచ్ఛాయామాపగాం వసుధాతలే
వేగేనాభిసరన్తం తాం తపోలక్ష్మీమివ ప్రియామ్. 11
తస్య కృత్వా నమస్కారముక్తం ఖే వహతా మయా
మునే నీలాభ్రవస్త్రస్త్వమభిసారికయా సమః. 12
ఇత్యాకర్ణ్య ముమోచాసౌ మయి మానద శాపకమ్
స్తనకేశవతీ కాన్తా హావభావవిలాసినీ. 13
గచ్ఛానేన దురుక్తేన రాత్రౌ యోషా భవిష్యసి
ఇతి శ్రుత్వాఽశుభం వాక్యముత్థితం జర్జరద్విజాత్. 14
విమృశామి మనాగ్యావత్తావదన్తర్హితో మునిః

ఓ రాజా! నేను నీచేఁ బుష్పగుచ్ఛ మొసంగి యిటనుండి వెడలి, ఆకాశమును దాటి స్వర్గమును జేరితిని. తదుపరి మహేంద్రుని సభాస్థానమున, దంద్రితోఁ గూడఁ గూరుచుంటిని సభా కార్యమైనపిదప లేచి తేంద్రిపద్ద సెలవు గైకొంటిని. ఇచటికి వచ్చుటకై స్వర్గమును వదలి, యాకాశ మార్గమును బొంది సూర్యుని గుఱ్ఱములతో బాటు వాయుమార్గమునఁ బోయితిని. తదనంతరము సూర్యుఁడన్యమార్గమునఁ బోవ, నేనున్ను సముద్రమున నీదుచున్నట్లుగా నాకాశమున మఱియొకమార్గమున వచ్చుచుంటిని. పిమ్మట, జలపూరితములగు మేఘముల మధ్యమార్గముగుండా దుర్వాసమహర్షి వేగముగ నేగుదెంచుటను గాంచితిని. ఆతఁడు మేఘసమూహముచేఁ గప్పఁబడిన మెఱుపుయను గంకణముచే భూషితుఁడును, అభిసారిక (నీలమేఘముచేఁ గప్పఁబడుటచే వ్యభిచారిణి స్త్రీ) వలెఁ జూపట్టుచున్నవాఁడును, జలధారలచే సర్వాంగములందును దుడిచివేయఁబడిన చందనము గలవాఁడునై యుప్పుచుండెను. తన తపోలక్ష్మియను బ్రియురాలివద్దకా యనునట్లాతఁడుత్తమ వృక్షముల దట్టమైన నీడతోఁగూడిన పృథివీతలముననున్న గంగానదినిగూర్చి వేగముగాఁ బోవుచుండెను. ఆకాశమార్గమున నేగుచున్న నేనాతనికి నమస్కరించి యిట్లంటిని – 'ఓ మునీ! నీలమేఘమను వస్త్రము ధరించుటచే మీరభిసారిక (వ్యభిచారిణి) స్త్రీవలెఁ గన్పట్టుచున్నారు.' – మానప్రదుఁడవగు నో రాజా! ఆ వాక్యముల విని యాతఁడు నన్నిట్లు శపించెను. – 'ఇట్టి దుర్వాక్యములఁ బల్కుటఁబట్టి నీవు ప్రతిరాత్రియు స్తనకేశాదులతోఁగూడి హావభావములచే విలాసవతియైన స్త్రీ వగుదువుగాక!' – ఈ ప్రకారమగు అశుభశాపమావృద్ధ దుర్వాసబ్రాహ్మణుని ముఖమునుండి వెడలఁగా నేను వింటిని. పిమ్మట నేనొకింత విచారించులోపలనే యమ్ముని యంతర్ధానమయ్యెను.

ఇత్యుద్వేగమనాః సాధో సంప్రాప్తోఽహం నభస్తలాత్. 15
ఏతత్తే కథితం సర్వం సంపన్నోఽస్మి నిశాఙ్గనా

అతివాహ్యం దినాన్తేషు స్త్రీత్వమేతన్మయా కథమ్. 16
యోషిత్స్తనవతీ రాత్రౌ వక్తవ్యం కిం మయా పితుః
సంసృతౌ భవితవ్యానామహో ను విషమా గతిః. 17
అహమప్యద్య యద్దేవాద్యా నామామిషతాం గతః
కష్టం మదపహారేణ కలహో జాయతేఽధునా. 18
దివి దేవకుమారాణాం కామాకుల ధియామిహ
గురుదేవద్విజాతీనాం లజ్జాపరవశాత్మనా. 19
కథమగ్నే మయా సమ్యగ్వస్తవ్యం యామినీస్త్రియా

ఓ సాధూ! ఇక్కారణమున ఖిన్నమానసుఁడనై యాకసమునుండి యిటకు నేనేతెంచితిని. ఓ రాజా! ఇట్లు నా వృత్తాంతమంతయు నేను నీకుఁ జెప్పితిని. ఇఁక రాత్రులందు నేను స్త్రీరూపమును బొందుదును. కాన, దినాంతములందట్టి స్త్రీరూపత్వదశను నేనెట్లు గడపఁగలను? రాత్రియందు స్తన కేశాదులతోఁగూడిన స్త్రీరూపమును ధరించి నేను నా తండ్రియెదుట యేమి వచించుదును? ఆహా! సంసారమున నుండునట్టి ప్రాణుల గతి చాలభయంకరముగా నున్నది. ఇఁక నేనున్న (గృధ్రమాంసన్యాయమువలె) యువకుల కలహమునకు విషయమైతిని. అయ్యో! నన్నపహరించుటకొఱకై యిపుడిఁక యువకులందుఁ గలహము జనించునుగదా! స్వర్గమునందు దేవగురువుయెదుటను దేవతుల యెదుటను, ద్విజులయెదుటను లజ్జాపరవశుఁడనై రాత్రులందు స్త్రీరూపమున నేనెట్లు వసింపఁగలను?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా క్షణమేకం సా తూష్ణీం స్థిత్వా మునిస్థితౌ. 20
ధైర్యమాశ్రిత్య కుమ్భోఽత్ర పునరాహ రఘూద్వహ

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! ఇట్లు వచించి కుంభరూపధారిణియగు యా చూడాల క్షణకాలము వఱకు మౌనము వహించియుండెను. పిదప మరల ధైర్యము దెచ్చుకొని యివ్విధమున నుడివెను.

కిమజ్ఞ ఇవ శోచామి కిం మమ క్షతమాత్మనః. 21
యథాగతమయం దేహో మత్తోఽన్యోఽను భవిష్యతి

అజ్ఞానివలె నేనేల దుఃఖించుచున్నాను? స్త్రీరూపమైనచో నా యాత్మకేమి హానిగలుగును? యథాప్రాప్తమగు కర్మను నాకంటె నన్యమగు యీదేహమే యనుభవించునుగాని నేనుగాదు.

శిఖిధ్వజ ఉవాచ:—

పరిదేవనయా కోఽర్థో దేవపుత్ర తథైతయా. 22

శిఖిధ్వజుఁడు:- ఓ దేవపుత్రా! ఈ తమ విలాపముచే నేమి ప్రయోజనము!

యదాయాతి తదాయాతు దేహస్యాత్మా న లిప్యతే
కానిచిద్యాని దుఃఖాని సుఖాని విహితాని చ. 23.

తాని సర్వాణి దేహస్య దేహినో నతు కానిచిత్

దేహమున కేమి వచ్చిన నది రానిండు ఆత్మకు దానిచే నేసంబంధమున్ను లేదు. (అది నిర్లేపమైనది.) సుఖములుగాని, దుఃఖములుగాని యేవి నియతిచే విధింపఁబడినవో, అవియన్నియు దేహమునకేగాని, దేహి (ఆత్మ) కొఱకుగాదు.

యది త్వమపి కార్యాణామఖేదార్హోఽపి ఖిద్యసే. 24
తదన్యేషాముపాయః స్యాత్క ఇవాగమభూషణః
ఖేదే ఖేదోచితం వాచ్యమితి కించిత్త్వముక్తవాన్. 25
ఇదానీం సమతామేత్య తిష్ఠాఖిన్నో యథాస్థితమ్

ప్రపంచకార్యములందు ఖేదింపఁదగని తామే ఖేదమొందినచో నిఁక నితరులకు దుఃఖచికిత్సయందు తమవంటి శాస్త్ర తత్త్వానుభవకుశలురగు చికిత్సకులు మఱెవరు శరణ్యులగుదురు? కాన నిది తమ ఖేదముకాదు. ఖేదమందు తత్ఖేదోచితముగ వచింపఁదగిన వాక్యమును మాత్రము చెప్పినవారైతిరి. ఇపుడు సమత్వమొంది, దుఃఖరహితులై, యథారీతి స్థితిగల్గియుండుఁడు.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

తావేవమాదిభిర్వాక్యై రన్యోన్యాశ్వాసనం స్వయమ్. 26
కృత్వా స్థితౌ వనస్నిగ్ధౌ సుహృదౌ ఖేదినౌ మిథః

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ మున్నగు వాక్యములచే వారిరువురు పరస్పరము సమాధానపఱచుకొని మిగుల స్నేహయుక్తులై, పరస్పరము ఖిన్నచిత్తులై యావనమందుండిరి.

అథారోఽప్యస్య కుమ్భస్య స్త్రీత్వముత్పాదయన్నివ. 27
జగామాస్తం జగద్దీపో దీపః స్నేహక్షయాదివ
వ్యవహారభరైః సార్ధం పద్మాః సంకోచమాయయుః. 28
మార్గాశ్చ పథికైః సార్ధం పాన్థస్త్రీహృదయాని చ
దాశవద్విహగాన్సర్వాన్కుర్వదేకత్ర సంచితాన్. 29
తారకారత్నజాలాఢ్యం భువనం సామ్యతాం యయౌ
ఖం హసదివ తారాఢ్యం వికాసికుముదాకరమ్. 30
యయావున్నాద చక్రాహ్వభ్రమద్భ్రమరపేటకమ్

తైలము నశించినచో దీపమదృశ్యమగునట్లు, అనంతరము జగద్దీపకుఁడగు సూర్యభగవానుఁడున్ను కుంభునకు స్త్రీత్వధర్మము గలుగఁజేయుటకాయనునట్లస్తాద్రి గ్రుంకెను. అత్తఱి సర్వవ్యవహారములతోఁబాటు కమలగణంబును సంకుచితమయ్యె. బాటసారుల మార్గముల స్ఫుటములుకాఁజొచ్చెను. వారియొక్కయు వారిస్త్రీలయొక్కయు హృదయములున్ను (వియోగదుఃఖముచే) సంకోచమొందసాగెను. భువనమండలము పక్షులన్నింటి నొకచోట సంచయమొనర్చుచు, నక్షత్రములను రత్నసమూహములచేఁ బూర్ణమై, సముద్రద్వీపములందు పక్షులను, రత్నములను సంగ్రహమొనర్చునట్టి పల్లెవారితోటి సామ్యత్వము నందజొచ్చెను. గొప్పశబ్దముచేయు చక్రవాకపక్షులున్ను పరిభ్రమించు తుమ్మె

దల సమూహముచున్ను, వికసించిన కలువలఁజూచి నవ్వుచున్నట్లున్నట్టి నక్షత్రములతోఁగూడిన యాకాశమును గూర్చి యెగురసాగెను.

సుహృదౌ తావథోత్థాయ సంధ్యాముద్యన్నిశాకరామ్. 31
వన్దయిత్వా తథా కృత్వా జప్యం గుల్మాన్తరే స్థితౌ
తతః కుమ్భః శనైస్తత్ర స్త్రైణమభ్యాహరన్వపుః. 32
శిఖిధ్వజం పురః సంస్థం ప్రోవాచ గలదక్షరమ్

పిమ్మట వారిరువురు మిత్రులున్ను లేచి, ఉదయించుచున్న చంద్రునితోఁగూడిన సంధ్యకు నమస్కరించి, సాయంకాల జపమాచరించినవారై, లతాగుల్మములమధ్య నుండిరి. తదుపరి గుంభుఁడచట తన స్త్రీరూపమును మెల్లమెల్లగఁ బ్రకటమొనర్చుచు, గద్గదస్వరముతోఁగూడి యెదుటనున్న శిఖిధ్వజునితో నిట్లనియె:—

పతామీవ స్ఫురామీవ ద్రవామీవాఙ్గయష్టిభిః. 33
లజ్జయేవ చ తేరాజన్మన్యే స్త్రీత్వం వ్రజామ్యహమ్
పశ్యేమే పరివర్ధన్తే రాజన్మమ శిరోరుహాః. 34
ప్రస్ఫురత్తారకామాలా దినాన్తతిమిరా ఇవ
పశ్యేమౌ మమ జాయేతే ప్రోన్ముఖావురసి స్తనౌ. 35
కోరకావివ పద్మిన్యా వసన్తే గగనోన్ముఖౌ
ఆగుల్ఫమేవ లమ్బాని సంపద్యన్తేఽమ్బరాణి మే. 36
దేహాద్దేవ సఖే పశ్య స్త్రియా ఇవ శనైః శనైః
భూషణాన్యత్ర రత్నాని మాల్యాని వివిధాని చ. 37
పశ్యేమాన్యఙ్గ జాయన్తే స్వాఙ్గేభ్యో వృక్షపుష్పవత్
పశ్యాయం స్వయమేవాద్య చన్ద్రాంశుక్షరశోభనః. 38
మూర్ధ్ని పట్టాంశుకో జాతో నీహారోఽద్రావివాఙ్గ మే
సర్వాణి కాన్తాలిఙ్గాని జాతాని మమ మానద. 39
హా ధిక్కష్టం విషాదో మే కింకరోమ్యఙ్గనాస్మ్యహమ్
హా ధిక్కష్టమహో సాధో స్థిత ఏవాహమఙ్గనా. 40
సంవిదానుభవామ్యన్తర్నితమ్బజఘనే త్విమే

ఓ రాజా! లజ్జచే నేను క్రుంగుచు, చలింపఁబడుచు, అవయవములను చేతికఱ్ఱలతోఁగూడి చనునట్లుగఁదోఁచు చున్నాను. నీయెదుటనే నేనిపుడు స్త్రీరూపమును బొందుచున్నాను. చూడుము— దినాంతమున స్ఫురించు నక్షత్రసమూహమను మాలతోఁగూడిన యంధకారమువలె నాకేశములెట్లు వృద్ధి నొందుచున్నవో! వసంతఋవు నందాకాశమువైపునకు ముఖము గల్గియున్న తామరకొలనుయొక్క రెండు మొగ్గలవలె నావక్షఃస్థలమున స్తనద్వయ మెట్లు ప్రోన్ముఖమై వృద్ధినొందుచున్నదో చూడుము! నావస్త్రములు చీలమండవఱకుఁ బెరుఁగుచున్నవి. సఖుఁడా! స్త్రీకి యోగ్యములైన సమస్త ఆభూషణ

ములు, రత్నములు, పలువిధములగు మాలలు నాదేహమునుండియే వెలువడుచున్నవి చూడుము! వృక్షముయొక్క శాఖలనుండి పుష్పము లుద్భవించునట్లు, నాయంగములనుండి వస్త్రాది పదార్థము లావిర్భవించుచున్నవి. పర్వతముపై మంచు జనించునట్లు, చంద్రకిరణములవలె శోభాయమానమగు పట్టువస్త్రము నాశిరస్సుపై జనించుచున్నది. గాంచుము! మానప్రదుఁడవగు రాజా! వేయేల! స్త్రీయొక్క చిహ్నము లన్నియు నాకిపుడు గలిగినవి. అయ్యో! ధిక్కారము! అయ్యో! సాధూ! చాల కష్టతరమైన విషయము! నేనిపుడు స్త్రీనే అయితిని: ఇవి నాపిఱుఁదలనియు, ఇవి నాజఘనము (మొల)లనియు నేను నాయంతఃకరణమున నిపుడనుభవమును బొందుచున్నాను.

విపినే కుమ్భ ఇత్యుక్త్వా తూష్ణీం ఖిన్నో బభూవ హ. 41
రాజాపి చ తమాలోక్య తథైవాసీద్విషణ్ణధీః
ముహూర్తమాత్రేణోవాచ శిఖిధ్వజ ఇదం వచః. 42

ఇట్లు వచించి యావనమున కుంభుఁడు ఖిన్నచిత్తుఁడై యూరకుండెను. రాజున్ను నాతనిని జూచి యట్లనే దుఃఖితమనస్కుఁ డాయెను. రెండు గడియలకాలమైనపిదప శిఖిధ్వజుఁడాతనితో నీవాక్యములఁ బల్కెను—

కష్టం సోఽయం మహాసత్త్వః సంపన్నా వరవర్ణినీ
సాధో విదితవేద్యస్త్వం జానాసి నియతేర్గతిం. 43

ఆహా! కష్టతరమగు విషయము! ఈ మహాసత్త్వసంపన్నుఁడు త్తమ స్త్రీ యాయెను. సాధూ! తామాత్మవేత్తలు కావున నియతియొక్కగతి నెఱిఁగియున్నారు.

అవశ్యభావిన్యర్థేఽస్మిన్మా ఖిన్నహృదయో భవ
ఆపతన్తి దశాస్తాస్తాః సుధియాం దేహమాత్రకే. 44
న చేతస్యధియాం త్వేతాశ్చిత్తం యాన్తి న దేహకమ్

అవశ్యము జరుగునట్టి భావికాల వస్తువునుగూర్చి తాము ఖిన్నచిత్తులు కావలదు. ఆ యా సుఖదుఃఖదశలు బుద్ధిమంతుల శరీరమాత్రమునకే వచ్చి పడునుగాని; చిత్తమునకుఁ గాదు. కాని, అజ్ఞానుల చిత్తమందును నవి ప్రవేశించును. దేహమాత్రమున నే కాదు.

కుమ్భ ఉవాచ: —

ఏవమస్త్వనుతిష్ఠామి యామినీ స్త్రీత్వమాత్మనః. 45
న ఖేదమనుగచ్ఛామి నియతిః కేన లఙ్ఘ్యతే
ఇతి నిర్ణీయ తౌ ఖేదం తం నీత్వా తనుతామివ, 46
ఏకతల్పే నిశాం తూష్ణీం నీతవన్తౌ చిరేణతామ్
అథ ప్రభాతే తత్స్త్రైణం వపురుత్సృజ్య యావనమ్. 47
బభూవ కుమ్భః కుమ్భాభః కుచప్రోజ్ఝితమూర్తిమాన్

కుంభుఁడు:— 'ఓ రాజా! అట్లే యగుఁగాక! రాత్రులందు ఆనాస్త్రీత్వమునే ధరించెదను. ఇఁక దుఃఖమును బొందను. ఏలయనఁగా, ఈశ్వరనియతి నెవఁడుల్లంఘింపఁగలఁడు!'— ఇట్లు నిర్ణ

యించి వారిరువురును దమఖేదమును సన్నగిల్లఁజేసిరి. ఒకే శయ్యపై మెదలక వారారాత్రి చాలకాలము గడపిరి. మరల ప్రాతఃకాలముకాఁగా యౌవనయుక్తమై స్తనాది సహితమైనట్టి యాస్త్రీశరీరమును ద్యజించి కుంభుఁడు కుంభరూపుఁడాయెను.

ఇతి సా రాజమహిషీ చూడాలా వరవర్ణినీ. 48
కుమ్భత్వమాస్థితా భర్తుః పశ్చాత్స్త్రీత్వముపాగతా
విజహార వనాన్తేషు కుమారీధర్మిణీ నిశి
కుమ్భరూపధరా చాహ్ని భర్త్రా మిత్రేణ సంయుతా. 49
కైలాసమన్దరమహేన్ద్రిసుమేరుసహ్య
సానుష్వవిస్ఖలితయోగగమాగమా సా
సాకం ప్రియేణ సుహృదా భవతా యథేచ్ఛం
స్రగ్దామహారవలితా విజహార నారీ.

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ ॥ కుమ్భస్యస్త్రీత్వలాభోనామ పఞ్చాధిక శతతమః సర్గః ॥ 105 ॥

ఓ రామచంద్రా! ఇవ్విధమున ఆ రాజుయొక్క పట్టపుదేవియైన శ్రేష్ఠవర్ణయుక్తయగు చూడాల మొదట కుంభరూపము ధరించి; పిమ్మట తనపతికొఱకై స్త్రీరూపమును దాల్చెను. అప్పుడు రాత్రియందవివాహితయగు కన్యయొక్క ధర్మమును బాటించుచు, పగటియందు కుంభరూపమును ధరించుచు, తనపతికి మిత్రురాలై యొప్పుచు నవ్వనమున సంచరించుచుండెను. కైలాస, మందరాచల, మహేంద్ర, సుమేరు, సహ్యాది పర్వతముల శిఖరములపై అనిరుద్ధమగు గమనాగమనములు గలిగినదై, వివిధపుష్పహారములచేఁ బరివేష్టితయై యాస్త్రీ తనప్రియపతితోఁటి యిచ్ఛాపూర్వకముగ విహరించెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యామున కుంభుని స్త్రీత్వలాభమను
నూటయైదవ సర్గము ॥105॥

---

## షడుత్తరశతతమః సర్గః

[వర్ణ్యతేఽత్ర మహేన్ద్రాద్రౌ వివాహోఽగ్నిపురస్కృతః
తయోర్గుహాయాం సౌవర్ణ్యాం పుష్పతల్పే చ సంగమః.

మహేంద్ర పర్వతముపై నగ్నిసాక్షిగ వారి వివాహము, సువర్ణగుహాయందు బుష్పశయ్యపై వారి సంగమము యిట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

తతః కతిపయేష్వేవ దివసేషు గతేషు సా
ఇదం ప్రోవాచ భర్తారం కుమ్భరూపధరా సతీ. 1

శ్రీవసిష్ఠుఁడు:_ ఓ రామచంద్రా! కొన్నిదినములు గడువగనే కుంభరూపధారిణియైన సతి యగు చూడాల తన భర్తతో నిట్లనియె.

రాజన్రాజీవ పత్రాక్ష మమేదం వచనం శృణు
నిశాయాం ప్రత్యహం తావత్స్త్రీ నత ఏవాహమఙ్గనా. 2
తదిచ్ఛామ్యఙ్గనాధర్మం నిపుణీకర్తుమీదృశం
భర్త్రే కస్మైచిదాత్మానం వివాహేన దదామ్యహమ్. 3
తద్భవానేవ మే భర్తా రోచతే భువనత్రయే
గృహాణ మాం వివాహేన భార్యాత్వే నిశి సర్వదా. 4
అయత్నోపనతం సాధో ప్రియేణ సుహృదా సహ
స్త్రీ సుఖం భోక్తుమిచ్ఛామి మా మే విఘ్నకరో భవ. 5
క్రమప్రవృత్తమాసృష్టేః సుఖం సాధ్యం మనోరమమ్
ప్రకృతం కుర్వతః కార్యం దోషః క ఇవ జాయతే. 6
ఇచ్ఛానిచ్ఛే ఫలే త్యక్త్వా సమస్తాత్సర్వవస్తుషు
వయం న సేచ్ఛా నానిచ్ఛాః కుర్మ స్తేనేదమీప్సితమ్. 7

కమలపత్రములవంటి నేత్రములుగల యో రాజా! నా యీ వాక్యమును వినుము. నేను ప్రతిరాత్రియందును స్త్రీ రూపమును ధరించుచున్నాను. కాన నట్టిస్త్రీరూపమును సఫలమొనర్పదలఁచి యొకానొక పతికి వివాహమున సన్నర్పణచేయ నిచ్ఛగించితిని. మఱియు ముల్లోకములందును నీవొకఁడవే భర్తగ నాకిష్టుఁడవగుచున్నావు. కావున నన్ను వివాహమాడి రాత్రికాలమందు సదా నన్ను భార్యగా స్వీకరింపుము. సాధూ! పరిశ్రమలేకయే ప్రాప్తించిన ప్రియమిత్రునితోటి నేను స్త్రీ సుఖ మనుభవింపఁడలంచుచున్నాను. అందుచే నీ విద్విషయమున అనంగీకారముచే విఘ్నము కలిగింపకుము ఓ రాజా! సృష్ట్యారంభమునుండి నేఁటివఱకుఁ గ్రమముగ ప్రాప్తించినదియు, సులభసాధ్యమును, మనోరమమునగు వివాహమును ఈ ప్రస్తుతకార్యము, జేసినచో నేమి దోషము జనించును? మఱియు మన మిద్దరమును సర్వత్ర సమస్తవస్తువులందు ఇచ్ఛానిచ్ఛలను, తత్ఫలములను త్యజించియుంటిమి గాన మన మిచ్ఛానిచ్ఛారహితులమై యున్నాము. కావున ఈ యభీష్టకార్యముఁ జేయుదము.

శిఖిధ్వజ ఉవాచ:—

కృతేనానేన కార్యేణ న శుభం నాశుభం సఖే
పశ్యామి తన్మహాబుద్ధే యథేచ్ఛసి తథా కురు. 8

శిఖిధ్వజుఁడు:— మహాబుద్ధిమంతుఁడగు మిత్రమా! ఇక్కార్యము నాచరించుటచే నేను శుభమును గాని, అశుభమును గాని గాంచుటలేదు. కాన తమకెట్లు సమ్మతమో యట్లు చేయుఁడు.

సమతాం సంప్రయాతేన చేతసేదం జగత్త్రయం
స్వరూపమేవ పశ్యామి యథేచ్ఛసి తదాచర. 9

చిత్తమందు సమత్వమే తెంచుటచే ముల్లోకములను నేను స్వాత్మరూపముగనే గాంచుచున్నాను. కావున తమకెట్లిష్టమో యట్లాచరింపుడు.

కుమ్భ ఉవాచ:—

యద్యేవం తన్మహీపాల లగ్నమద్యైవ శోభనమ్
రాకేయం శ్రావణస్యాస్య హ్యః సర్వం గణితం మయా. 10
రాత్రావద్యోదితే చన్ద్రే పరిపూర్ణకలామలే
జన్యత్రో నౌ మహాబాహో ద్వయోరేవ భవిష్యతి. 11
మహేన్ద్రాద్రి శిరఃశృఙ్గసానావద్య మనోరమే
రత్నదీపప్రకాశాఢ్యే మణికన్దర మన్దిరే. 12
పుష్పభారానతోత్తుఙ్గ వృక్షరాజివిరాజితే
వనపుష్పలతాలాస్య నారీనృత్యమనోహరే. 13
నిశి వ్యోమగతాస్తారాః భర్త్రాపూర్ణేన్దునా సహ
ఆవయోః పరిపశ్యన్తు కర్ణాన్తాయతలోచన. 14
ఉత్తిష్ఠాత్మ వివాహార్థం కుర్వః కాననకోటరాత్
రాజంశ్చన్దనపుష్పాదిసంభారం రత్నసంయుతం. 15

కుంభుడు:— ఓ రాజా! అట్లైనచో నేడే శుభలగ్నము. ఈదినము శ్రావణపూర్ణిమయైయున్నది. నిన్ననే నేను వివాహలగ్నమును గణించి శుద్ధపఱచియుంచితిని. నేటి రాత్రి నిర్మల పరిపూర్ణచంద్రుడుదయింప, మన యిరువురయొక్క గాంధర్వవివాహము జరుగును. విశాలనేత్రా! మనోరమమైన మహేంద్రపర్వతశిఖరముపై, రత్నములను దీపముల ప్రకాశముచే బూర్ణమైన మణిమయమగు కందరాగృహమున, పుష్పభారముచే వంగినట్టి యెత్తైన వృక్షముల సమూహముచే శోభితమై వనపుష్పలతలను స్త్రీలయొక్క నృత్యముచే మనోహరమైనట్టి ప్రదేశమున, మనయిరువురి వివాహమున్ను ఆకాశమందలి నక్షత్రములను స్త్రీజనము పూర్ణచంద్రుడను దమ భర్తతోఁగూడ వీక్షించుగాక? కాన నోరాజా! లెమ్ము; ఆ మన వివాహముకొఱకై యివ్వనమునుండి రత్న, చందన, పుష్పాది సామగ్రిని బ్రోగుచేసెదము.

ఇత్యుక్త్వా కుమ్భ ఉత్థాయ సహ తేన మహీభృతా
కుసుమావచయం చక్రే తథా రత్నాది సంచయం. 16
తతో ముహూర్తమాత్రేణ రత్నసానౌ సమే శుభే
సమాలమ్బన పుష్పాణాం తాభ్యాం వై రాశయః కృతాః 17
హారామ్బర మణీన్ద్రాది రాశయస్తావరేఽజిరే

సౌభాగ్యస్యేవ కామేన కోశాః కాలేన సంభృతాః. 18
తథా జన్యత్ర సంభారం కృత్వా కాఞ్చనకన్దరే
యయతుస్తౌ మహామిత్రే స్నాతుం మన్దాకినీం నదీం. 19
తత్రైనం స్నాపయామాస మహారాజం మహాదరాత్
గజకుమ్భోపమస్కన్ధం కుమ్భో మఙ్గలపూర్వకం. 20
భవిష్యద్దయితారూపాం భవిష్యద్దయితోఽఙ్గనామ్
చూడాలాం స్నాపయామాస కుమ్భరూపధరాం ప్రియామ్. 21

ఓ రామచంద్రా! ఇట్లు వచించి కుంభుఁడా రాజుతోఁగూడ లేచి పుష్పరత్నాది పదార్థములఁ బ్రోవుచేయ నారంభించెను. పిమ్మట రెండుగడియల కాలములోనే వారు, సమమై, సుందరమైనట్టి భూప్రదేశముగల రత్నశిఖరరూప ప్రాంగణమున దేవతాదుల పూజనమునకై యనేకపుష్పరాశుల సమకూర్చియుంచిరి. మఱియు' అనుభవింపఁజేయుటకుగాను సుకృతపరిపాక కాలము సౌభాగ్యకోశముల నొకచోఁ జేర్చునట్లు, రత్నహార, మణి, వస్త్రాదుల రాశులను వారు మఱియొక శిఖరముపైఁ జేర్చియుంచిరి. అట్లు సువర్ణకందరమున వివాహసామగ్రినంతయు సమకూర్చి యా మహామిత్రు లిరువురును మందాకినీ (ఆకాశగంగా)నది యందు స్నానమొనర్చుటకై వెడలిరి. అచటికేగిన పిదప ఏనుఁగుయొక్క కుంభస్థలము వంటి స్కంధములుగల యా మహారాజును కుంభుఁడత్యాదరముతో మంగళపూర్వకముగ స్నానమాచరింపఁజేసెను. పిమ్మట భావికాలమునఁ బ్రియురాలగు పత్నీరూపమును ధరింపఁబోవు కుంభరూపిణియగు చూడాలనున్ను రాజుస్నాన మొనర్పఁజేసెను,

పూజయామాసతుః స్నాతౌ తత్ర దేవపితౄన్మునీన్
యథా క్రియాఫలేఽనిచ్ఛౌ క్రియాత్యాగే తథైవ తౌ. 22
నిత్యజ్ఞానరసాతృప్తౌ వ్యవస్థాయాం జగత్స్థితేః
చక్రాతే భోజనం భవ్యం తావన్యోన్యసమీహితం. 23
కల్పవృక్షదుకూలాని పరిధాయ సితాని తౌ
ఫలాని భుక్త్వా జన్యత్రస్థానమాయయతుః క్రమాత్. 24

స్నానమాచరించిన పిదప వారిరువురు నచట దేవతలను, పితరులను, ఋషులను బూజించిరి. ఏలయనఁగా వారు క్రియా ఫలమున నెట్లిచ్ఛారహితులో, అట్లు క్రియాత్యాగమునను నిచ్ఛారహితులై యుండిరి. నిత్యము జ్ఞానామృతముచేఁ దృప్తులైనట్టి వారు జగత్తుయొక్క మర్యాదకొఱకై పరస్పర సిద్ధిబలములచేఁ గల్పింపఁబడిన యుత్తమభోజనమును భుజించిరి. కల్పవృక్షమునుండి లభించిన స్వచ్ఛమైన వస్త్రముల ధరించి, ఫలముల భుజించి, శాస్త్రోక్తరీతిగా వారిరువురును వివాహవేదికవద్దకు వచ్చిరి.

ఏతావతాథ కాలేన తయోర్జన్యత్రసోత్కయోః
క్రియం కర్తుమివాస్త్రాదిం ప్రాగిత్యేవావిశద్రవిః. 25
అథ సంధ్యాక్రమే వృత్తే కృతే జప్యాఘమర్షణే
వివాహదర్శనాయైవ తారాజాలే ఖమాగతే. 26

మిథునైకసఖీయామా కుముదోత్కరహాసినీ
ప్రాలేయజాలప్రకరం వికిరన్తీ సమాయయౌ. 27

ఇంతలో, వివాహమునకై మిగుల యభిలాషగల్గియున్న వారిద్దఱకిని ప్రియము గలుగఁజేయుట కాయనునట్లు సూర్యభగవానుఁడున్ను శీఘ్రముగ నస్తాద్రిఁ గ్రుంకెను. పిమ్మట సంధ్యావందనవిధి, అఘమర్షణజపము సమాప్తముకాఁగా వివాహకౌతుకమును వీక్షించుట కాయనునట్లు నక్షత్రసమూహ మాకాశమునఁ బ్రకటమయ్యె. మఱియు, దంపతులకుఁ బ్రధానసఖియగు రాత్రి కలువపువ్వుల సమూహముతోఁగూడి నవ్వుచున్నట్లున్నదై మంచుబిందువుల వర్షించుచు నేతెంచెను.

రత్నదీపాన్బహూన్సానౌ కుమ్భః సమ్యగయోజయత్
జ్యోతీంషీవర్క్షయుక్తాని పద్మోద్భవ ఇవామ్బరే. 28
భూషయామాస రాజానం స్త్రీత్వం గచ్ఛన్నిశాగమే
చన్దనాగురుకర్పూరపూర్ణైర్మృగజకుఙ్కుమైః. 29
హారకేయూరకటకైస్తథా కల్పలతాంశుకైః
స్రగుద్దామావతంసైశ్చ మాల్యైశ్చ వివిధోచితైః. 30
తథా కల్పలతాగుచ్ఛైర్మన్దారైః పారిజాతకైః
సన్తానైర్బహురత్నైశ్చ మౌలినా చేన్దురూపిణా. 31
ఏతావతాథ కాలేన వధూత్వం కుమ్భ ఆయయౌ
ఘనస్తనభరాక్రాన్తో బభూవాశు విలాసవాన్. 32
ఇదం సంచిన్తయామాస సంపన్నోఽయమహం వధూః
కామాయాత్మా మయా దేయః కార్యం కాలోచితం కిల. 33
ఇయమస్మి వధూః కాన్తా భర్తా త్వం మే పురఃస్థితః
గృహాణ కామ మామేహి కాలోఽయం తవ హృచ్ఛయః. 34
ఇతి సంచిన్త్య భర్తారమగ్రస్థ గహనస్థితమ్
ఉదయన్తమివాదిత్యం రతిః కామమివాభ్యగాత్. 35

బ్రహ్మదేవుఁ డాకాశమున సూర్యచంద్ర నక్షత్రముల నియోగించినట్లు, అత్తఱి చూడాల యనేకవిధములగు ప్రకాశవంతములైన రత్నదీపములను బర్వతశిఖరముపై బాగుగ నమర్చెను. రాత్రియందు స్త్రీరూపమును ధరించుచు కుంభుఁడు చందనాగరు కర్పూరాదులతోను, హార, కేయూర, కటకాద్యాభరణములతోను, కల్పవృక్షమునుండి లభించిన యనేక వస్త్రములతోను, పుష్పములతోను, శిరోభూషణములతోను, ఉత్తమమాలలచేతను, కల్పలతాగుచ్ఛంబులతోను, మందార, పారిజాత, సంతానములను గల్పవృక్షపుష్పములచేతను, అనేక రత్నములతోడను, చంద్రసదృశమగు ముకుటముతోను రాజు నలంకరించెను. ఇంతలో, ఘనస్తనధారిణియై, స్త్రీలకు యోగ్యములైన వివిధవిలాసములతోఁగూడి కుంభుఁడు స్త్రీరూపమును శీఘ్రముగ ధరించి యిట్లు విచారించెను — నేనిపుడు సంపూర్ణముగ స్త్రీరూపిణినైతిని. కాన, కామరూపవరము నాకీయఁదగినది. హృదయనివాసియగు నోస్వామీ! ఈ

యుత్తమవనితనగు నేను నీదానను. నాపతియగు నీవు నాయెదుట నున్నావు. కాన రమ్ము. ఇచ్ఛాపూర్వకముగ నన్ను బాణిగ్రహణము చేయుము, ఇది నీయొక్క సమయము—ఇట్లు చింతించి యామె, కామదేవుని వద్దకు రతి యేతెంచునట్లు, ఎదుట వనమందున వేదికాస్థానమువద్ద, ఉదయించు సూర్యుని వలెఁ బ్రకాశమానుఁడై యున్నట్టి తనపతియొక్క సమీపమున కేగి యిట్లు నుడివెను-

అహం మదనికా నామ భార్యాస్మి తవ మానద
పాదయోస్తే ప్రణామోఽయం సస్నేహం క్రియతే మయా. 36

ఇత్యుక్త్వా సానవద్యాఙ్గీ లజ్జావనమితాననా
లోలాలకేన శిరసా ప్రణనామ లసత్పతిమ్. 37

ఉవాచేదం చ హే నాథ త్వం మాం భూషయ భూషణైః
క్రమేణాగ్నిం చ సంజ్వాల్య మత్పాణిగ్రహణం కురు. 38

రాజసేఽతితరాం రాజన్నాం కరోషి స్మరాతురామ్
రతేర్వివాహే మదనమభిభూయాధితిష్ఠసి. 39

ఇన్దోరివాంశుజాలాని రాజన్మాల్యాని తాని తే
మేరుగఙ్గాప్రవాహాభాం ధత్తే హారస్తవోరసి. 40

మన్దారకుసుమప్రోతైః కున్తలైర్నృప రాజసే
కనకాబ్జమివోల్లోలైర్భృఙ్గైః ఖచితకేసరైః. 41

రత్నాంశుజాలైః కుసుమైః శ్రియా స్థైర్యేణ తేజసా
రత్నస్థానం విభో మేరుమభిభూయావతిష్ఠసే. 42

మానప్రదుఁడవగు స్వామీ! మదనికయను పేరుగల నేను నీభార్యను. నీచరణములకుఁ బ్రీతిపూర్వకముగ నమస్కరించుచున్నాను— ఉత్తమ శరీరము గలదియు, లజ్జచే వినమ్రయైయున్నదియు నగు ఆచూడాల యిట్లు వచించి, చంచలకేశపాశములుగల శిరంబుతో శోభాయమానుఁడైయున్న తనపతికిఁబ్రణమిల్లి మరల యిట్లు పలికెను-నాథా! ఇపుడలంకారములచే నీవునన్ను భూషితగనొనర్చి, క్రమముగ అగ్నిని బ్రజ్వలించి నాయొక్క పాణిగ్రహణముఁ జేయుము. ఓ రాజా! నీవు మిగుల శోభాయమానుఁడవై కన్పట్టుచున్నావు. మఱియు నన్ను గామముచేఁ బీడితగఁ జేయుచున్నావు. రతియొక్క వివాహమునఁ గామదేవుని గూడఁ బరాజయమొనర్చి నీవు వెలయుచున్నావు. నీ కంఠమున నున్న యీ మాలలు చంద్రకిరణములవలె నొప్పుచున్నవి. నీవక్షఃస్థలమున నున్న హారము సుమేరు పర్వతముపైఁగల ప్రసిద్ధగంగా ప్రవాహముయొక్క శోభనువహించుచున్నది. ఓ రాజా! పుష్పకేసరములతోఁగూడిన చంచలభ్రమరములచే సువర్ణకమలము శోభించునట్లు, మందారపుష్పములు గ్రుచ్చబడినట్టి కేశములతోఁ గూడి నీవు శోభించుచున్నావు. ప్రభూ! రత్నకిరణ సమూహములచేతను, పుష్పములచేతను, స్వశోభచేతను, స్థిరతేజముచేతను, రత్నస్థానమగు సుమేరుపర్వతమునుగూడఁ బరాజయమొనర్చి నీవు వెలయుచున్నావు.

ఏవమాది వదాన్తౌ తౌ భవిష్యన్నవదమ్పతీ
ప్రచ్ఛన్నపూర్వదామ్పత్యౌ మిథస్తుష్టౌ బభూవతుః. 43
మహారాజ్ఞీం మదనికాం మహారాజః శిఖిధ్వజః
కాఞ్చనోపలపర్యఙ్కే నివిష్టో భూషయత్స్వయం. 44
అవతంసై స్తథా మాల్యైర్మణిరత్నవిభూషణైః
వస్త్రైర్విలేపనైః పుష్పై రుచిరస్థానకార్పితైః. 45
సా బభౌ భూషితా తన్వీ మదనీ మదదాయినీ
గిరిజేవ వివాహోత్కా కామకాన్తేవ కామినీ. 46
మహారాజో మహారాజ్ఞీం భూషయిత్వేదమాహ తాం
రాజసే మృగశావాక్షి లక్ష్మీరివ నవోదితా. 47
శక్రేణ సహ యచ్ఛచ్యా యల్లక్ష్మ్యా హరిణా సహ
యద్గౌర్యాః శంభునా సార్ధం తత్తే భవతు మఙ్గళమ్. 48
పద్మకోశాఙ్కురహృదా లోలనీలోత్పలేక్షణా
ఆమోదశుభఝాంకారస్వాస్థితా పద్మినీవ సా. 49
సురక్తపల్లవకరా స్తనస్తబకధారిణీ
త్వమనేకఫలా మన్యే కామకల్పతరోర్లతా. 50
హిమశీతావదాతాఙ్గీ జ్యోత్స్నాప్రసరహాసినీ
పూర్ణేన్దుశ్రీరివోద్యుక్తా హృష్టేవాహ్లాదయస్యలమ్. 51
తదుత్తిష్ఠ వరారోహే వేదీం వైవాహికీం స్వయమ్

ఓ రామచంద్రా! ఇట్లు పూర్వకాల దాంపత్యభావమును గప్పిపుచ్చి ఆ భవిష్య ద్దంపతు లిరువురు నొకరిశోభ నొకరు వర్ణించుకొనుచు, పరస్పరము సంతుష్టులై యుండిరి. పిదప మహారాణి యగు మదనికను మహారాజగు శిఖిధ్వజుఁడు సువర్ణ పీఠముపైఁ గూరుచుండి స్వయముగ నలంకరించెను. శిరోభూషణముల చేతను, మాలల చేతను, రత్న విభూషణాల చేతను, వస్త్రముల చేతను, లేపనద్రవ్యముల చేతను ఆయా భూషణోచితస్థానములం దుంచఁబడిన పుష్పముల చేతను నలంకరింపఁబడినదై మదమునొసంగు ఆసూక్ష్మాంగి వివాహోత్కంఠితయగు పార్వతివలెను, కామదేవుని పత్నియగు రతివలెను శోభించెను. ఇట్లు మహారాజగు శిఖిధ్వజుఁడామె నలంకరించి నిట్లనెను. — మృగశాబక (శిశు) నేత్రీ! నూతనముగ నావిర్భవించిన లక్ష్మీవలె నీవు ప్రకాశించుచున్నావు. ఇంద్రుని తోటి శచీదేవికిని విష్ణువుతోటి లక్ష్మికిని, ఈశ్వరునితోటి పార్వతికిని యేమంగళమాయనో, నాతోటి నీకును నట్టి మంగళమగుగాత! ఓ రామచంద్రా! ఆ త్తతి పద్మకోశముయొక్క యంకురమువంటి స్తనముల వక్షస్థలమున ధరించి, చంచల నీలకమలమువంటి నేత్రములుగల్గి సుగంధముచే నుత్తమమైనదియు, తుమ్మెదల ఝుంకారశబ్దముతోఁగూడి స్వస్థముగ నున్నదియునగు పద్మినివలె నామె శోభించుచుండెను. అపుడు శిఖిధ్వజుఁడు ఘురల యిట్లనియె—ఉత్తమరక్తపల్లవములవంటి హస్తములుగల్గి పుష్పగుచ్ఛంబులవంటి స్తనములచే శోభిం

చుచు, అనేకఫలముల నొసంగుచు నున్నదానవగు నిన్ను గల్పవృక్షముయొక్క లతగా నేఁ దలంచుచున్నాను. ప్రియా! మంచువలె శీతలములై శుద్ధములైనట్టి అవయవముల ధరించి, వెన్నెలవంటి వ్యాపించిన హాస్యములతోఁ గూడుకొనినదానవై నీవు కేవలము నీదర్శనమాత్రముచేతనే నా కాహ్లాదమును గొల్పుచున్నావు. ఓ యుత్తమాంగీ! లెమ్ము! వివాహవేదికను స్వయముగ నలంకరింపుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

తత్ర పుష్పలతాజాలైః కాఞ్చనప్రతి శిలాఙ్కితైః 52
ముక్తాకుసుమజాలానాం ప్రకరైః స్తబకోపమైః
చతుర్దిక్కం చతుర్భిశ్చ నాలికేరమహాఫలైః. 53
పూర్ణకుమ్భైస్తథా గఙ్గావారిపూర్ణైః ప్రకల్పితైః
జ్వాలయామాసతుస్తస్యా మధ్యే చన్దనదారుభిః. 54
జ్వలనం జ్వాలితజ్వాలం దక్షిణస్థం ప్రదక్షిణం
పూర్వాభిముఖమేవాగ్నేరగ్రే పల్లవవిష్టరే. 55
నియోజ్య దంపతీ కాన్తౌ తయోర్వివిశతుః స్వయం
స హుత్వా తిలలాజాని పావకాయ శిఖిధ్వజః. 56
ఉత్థాయోత్థాయ కాన్తాం స పాణిభ్యాం స్వయమాదదే
అన్యోన్యం శోభమానౌ తౌ భవావివ వనే శివౌ. 57
చక్రతుర్దంపతీ తస్య పావకస్య ప్రదక్షిణం
స్వదాయం జ్ఞానసర్వస్వం హృదయం ప్రేమచాపలమ్. 58
దదతుస్తౌ మిథోన్యోన్యస్మితకాన్తముఖశ్రియా
ప్రదక్షిణాత్రయం కృత్వా లాజాం స్త్యక్త్వాథ వహ్నయే. 59
భార్యావరౌ సమం తుష్టౌ కరౌ తత్యజతుః క్రమాత్

శ్రీవసిష్ఠుఁడు;- ఓ రామచంద్రా! అచట పుష్పలతాసమూహములతోడను, ప్రతికాడయందును ఫలగుచ్ఛాకారముగల నవరత్నశిలలచే చిహ్నితములైన పదార్థములతోడను, ముత్తెముల సమూహములతోడను, నాలుగువైపుల నుంచఁబడిన నాలుగు నారికేళ ఫలములతోడను, గంగాజలముచేఁ బూరితములగు కల్పిత కలశములతోడను, ఆ వేదికను వారిరువురు నలంకరించిరి. పిమ్మట నా వేదికామధ్యమునఁ జందనపుకొయ్యలచే వారగ్నిని బ్రజ్వలింపఁజేసిరి. ఆ యగ్నికి బ్రదక్షిణమాచరించి పూర్వాభిముఖులై యగ్నిదేవుని సమ్ముఖమున పల్లవాసనముపై నాదంపతులిరువురును గూర్చుండిరి. పిదప శిఖిధ్వజుఁడగ్నియందు దిలలను, లాజలను (పేలాలను) హోమమొనర్చి, లేచి తన రెండుహస్తములతో బ్రియురాలిని గ్రహించెను. అవ్వనమందుఁ బార్వతీపరమేశ్వరులవలె శోభాయమానులై, మంగళరూపులైనట్టి యాస్త్రీపురుషులిరువురు పిమ్మటనగ్నికిఁ బ్రదక్షిణము గావించి, సంపూర్ణజ్ఞానయుక్తులై, ప్రేమచే చంచలములగు తమహృదయములను వివాహమున బరస్పరము దాన మొసంగిరి. తదుపరి మందహాసయుక్తమగు సుందరముఖముయొక్క శోభను ధరించిన యాభార్యాభర్తలిరువురు మరల అగ్నికిఁ

ప్రదక్షిణమొనర్చి మంగళలాజల నగ్నియందు విడచి, సమముగ సంతుష్టులై యొకరిహస్తమును మఱియొకరు క్రమముగ విడిచిపెట్టిరి.

స్మయమానముఖౌ కాన్తౌ చన్ద్రావివ నవోదితౌ. 60
పూర్వోపరచితే పుష్పతల్పే వివిశతుర్నవే
ఏతస్మిన్నన్తరే చన్ద్రశ్చతుర్భాగం నభస్తలాత్. 61
శనైరాక్రమయామాస శోభాం ద్రష్టుమివానయోః
తస్మింశ్చ లలనాచ్ఛిద్రం ద్రష్టుం దృష్టిరివాభితః. 62
లోలః సంచరయామాస కరానిన్దులతాగృహే
తైస్తైర్నవకథాలాపైరిన్దావభ్యుదితే త్వథ. 63
తావాసాంచక్రతుః కాన్తౌ దంపతీ సుముహూర్తకమ్
అథోత్థాయ జ్వలద్రత్నదీపాం కాఞ్చనకన్దరామ్. 64
స్వయం పూర్వోపరచితాం గుప్తాం వివిశతుః ప్రియౌ
దదర్శతుర్నవం తత్ర తల్పం కుసుమకల్పితమ్. 65
పరితో వ్యాప్తముత్కీర్ణైర్హైమపఙ్కజరాశిభిః
మన్దారాదిభిరన్యైశ్చ పుష్పైర్గ్లానివివర్జితైః. 66
ఉచ్చకైః సుప్రమాణేన నిర్మితైః కుసుమైః సమైః
దీర్ఘేన్దుబిమ్బప్రతిమైస్తుషారస్థలశీతలైః. 67
క్షీరోద జలధారాభం జ్యోత్స్నాసంపిణ్డ సున్దరమ్
ప్రతిబిమ్బమనఙ్గస్య నతం భిత్తావివ స్థితం. 68
సుగన్ధమున్నతం కాన్తం చిరాదన్యతయోత్థితమ్
మిథునం పుష్పరాశౌ తన్న్యషీదత్పరితోఽమలే
తస్మిన్నసమసమాభోగే క్షీరోదే మన్దరో యథా. 69

నూతనముగ నుదయించిన చంద్రునివలె మందహాసయుక్తమగు ముఖముగల్గిన యతిసుందరులగు వారిద్దఱును బూర్వమే రచింపఁబడినట్టి నూతన పుష్పశయ్యపైఁ బ్రవేశించిరి. వారివివాహకౌతుకమును జూచుటకా యనునట్లింతలో చంద్రుఁడాకాశముయొక్క నాలుగవభాగము నాక్రమించెను. మఱియు, ఆలలనాఛిద్రము (స్త్రీదౌర్బల్యమును) గాంచుటకై ఆ లతాగృహమందలి శయ్యపై చంచల చంద్రుఁడు తన దృష్టిరూపకిరణములను నలువైపుల బ్రసరించెను. పిదప నూతన నూతన కథావార్తాలాపముల గావించుకొనుచువారు చంద్రుఁడు పూర్ణముగ నుదయించినమీదట సంగమముయొక్క యుత్తమముహూర్తముకొఱకై ప్రతీక్షించుచుఁ గొంతకాలముండి, తదనంతరము లేచి ప్రదీప్తమై, రత్నమయమై, దీపసంయుక్తమై, సువర్ణమయమై, పూర్వమే పూర్వపరిచితమైనట్టి యొకానొక గుహాయందు బ్రవేశించిరి. అచట నూతనపుష్పములచే నిర్మితమై, అంతటను సువర్ణకమలరాశులచే వ్యాపింపఁబడినదై, వికసిత మందారపుష్పములతోను తదితర పుష్పములతో గూడుకొనియున్నదై, శయ్యాప్రమాణమున

నెత్తుగ సమానములైన పుష్పములచే నిర్మింపఁబడినదై, దీర్ఘచంద్రుని ప్రతిబింబమువలె నొప్పుచున్నదై. మంచువలె శీతలములైనట్టి పుష్పములచే వ్యాప్తమై, సంకల్పకల్పితమైనట్టి శయ్యను వారు గాంచిరి క్షీరసాగరమునందలి జలధారవలెనున్నదియు, వెన్నలవలె సుందరమైనదియు, విశాల నిర్మలపుష్పరాశి యునగు యాశయ్యపై,మన్మథుని ప్రతిబింబమువలెనున్నవారును, ఉత్తమ సుగంధయుతులును, మనో హరరూపులును, చిరకాలము అన్యస్త్రీపురుషులవలె నున్నవారును నగు యాదంపతు లిరువురును, క్షీర సముద్రమున మందరపర్వతమువలె వెలయుచుండిరి.

తైస్తైర్మిథః ప్రణయపేశలవాగ్విలాసై
స్తత్కాలకార్యసుభగైః ప్రణయోపచారైః
సత్కాన్తయోర్నవనవేన తయోః సుఖేన
దీర్ఘా ముహూర్త ఇవ సా రజనీ జగామ. 70

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షో పాయేషు నిర్వాణప్రకరణేపూర్వార్ధే చూ॥ లీలావివాహోనామ షడుత్తరశతతమః సర్గః ॥ 106 ॥

ఓ రామచంద్రా! ఆయా యుత్తమ కోమల ప్రణయవాగ్విలాసములచేతను, తత్కాలో చితములగు యోగ్యప్రణయోపచారములచేతను, నూతన నూతన సుఖములచేతను ఆశ్రేష్ఠదంపతులిర్వు రకును నాటిరాత్రి యొక్క ముహూర్తకాలమువలెనే గడచిపోయెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యానమున లీలావివాహమను నూటయాఱవ సర్గము ॥ 106 ॥

---

## సప్తాధికశతతమః సర్గః

నానాగిరివిహారాది తథా మాయేన్ద్రదర్శనమ్
అసంసక్తిపరీక్షార్థం స్వర్గాహ్వానాది వర్ణ్యతే.

[పలువిధములగు గిరివిహారములు, మాయావియైన యింద్రుని దర్శనము, అసంసక్తి యొక్క పరీక్షకొఱకై స్వర్గమున కాహ్వానము మున్నగు సంగతులిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అథసూర్యాఖ్యరక్తేన రఞ్జితే భువనోదరే
శిఖిధ్వజాఙ్గనా ప్రాతర్మదనీ కుమ్భతాం యయౌ. 1
ఏవం మహేన్ద్రదర్యాం తావుభౌ కుమ్భశిఖిధ్వజౌ
స్వయం వివాహితావిష్టౌ సంపన్నౌ దేవదంపతీ. 2

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఆరాత్రిగడచినమీదట ప్రాతఃకాలమున సూర్యుఁడెపుడు బ్రహ్మాండోదరమును బ్రకాశింపఁజేసెనో, అపుడు శిఖిధ్వజుని భార్యయగు మదనిక కుంభరూపమును బొందెను. ఇట్లామహేంద్ర పర్వతగుహయందు స్వయముగ వివాహితులై, అతిప్రేమయుక్తులై యున్న యా శిఖిధ్వజ, కుంభు లిద్దరును దేవసమాన భోగములను భుజించుటచే దేవదంపతులే యైరి.

విలేసతుర్విచిత్రాసు ప్రత్యహం వనరాజిషు
ప్రపక్వఫలభారాసు పుష్పవల్లవినీషు చ. 3
దివా ప్రీతతరౌ మిత్రే యామిన్యామిష్టదంపతీ
ప్రభాదీపావివ శ్లిష్టౌ న వియుక్తౌ బభూవతుః. 4
రేమాతే వనకుఞ్జేషు గుహాసు చ మహీభృతామ్
తమాలజాలఖణ్డేషు మన్దారగహనేషు చ. 5
సహ్యదర్దుర కైలాసమహేన్ద్రి మలయేషు చ
గన్ధమాదన విన్ధ్యాద్రి లోకాలోకతటేషు చ. 6

పరిపక్వఫలములచేఁ బూర్ణమై, పుష్పపల్లవాదులచే శోభితమైనట్టి విచిత్ర వనప్రదేశములందు వారు ప్రతిదినము విహరించుచుండిరి. వారిద్దఱు పగటియందు ప్రియమిత్రులై, రాత్రియందుఁ బ్రియదంపతులైయుండు చుండిరి. మఱియు, దీపఁ ప్రకాశములవలె సదా కూడియేయుండిరి గాని, వియోగమెన్నఁడును బొందలేదు. వనకుంజములందును, పర్వతగుహలందును, తమాల వృక్షప్రదేశములందును, మందారవనములందును, సహ్య, దర్దుర, కైలాస, మహేంద్ర, మలయ, గంధమాదన, వింధ్యాచల, లోకాలోకాది పర్వతములపైనను వారు క్రీడాపూర్వకముగ విహరించుచుండిరి.

దినైస్త్రిభిస్త్రిభిర్గత్వా నిద్రాం గతవతి ప్రియే
చూడాలా రాజకార్యాణి కృత్వా స్వాభ్యాయయౌ పునః. 7
తౌ దివా సుహృదౌ మిత్రే దంపతీ కుమ్భభూమిపౌ
నానాకుసుమ సంవీతౌ తస్థతుర్ముదితౌ మిథః. 8
మాసమేకం మహేన్ద్రాద్రౌ రమ్యే సరలసఙ్కులే
రత్నకుడ్యే గుహాగేహే పూజితౌ సురకిన్నరైః. 9

ప్రియుఁడు నిదురించినమీఁదట మూఁడుమూఁడు దినముల కొకపర్యాయము చూడాల తన నగరమునకుఁ బోయి రాజ్యకార్యముల నిర్వహించి మరల తనపతి చెంత కేతెంచుచునుండెను. మిక్కిలి ప్రియ మిత్రులగు యా కుంభశిఖిధ్వజు లిరువురును పగటియందు వివిధపుష్పములచే నలంకృతులై, అతి ప్రసన్నచిత్తులైయుండుచుండిరి.

హా సలభ్యోదితామేఘు మన్దారవనమాలితే
ఏవం శుక్తిమతః పృష్ఠే పక్షం కల్పలతాగృహే. 10
మాసద్వయం పక్షవతో గిరేర్దక్షిణ దిక్తటే
పారిజాతవనే దేవ పుష్పస్తబకమణ్డపే. 11

జమ్బూఖణ్డతలే మేరోః పాదే జమ్బూనదీతటే
జామ్బూనదమయే మాసం జమ్బూఫలరసాసవైః. 12
దశోత్తరకురూణాం చ మణ్డలే దివసాని తౌ
కోసలేషూత్తరస్థేషు సప్తవింశతి వాసరాన్. 13
ఏవమన్యేషు దేశేషు విచిత్రేషు మహీభృతామ్
స్థితవన్తౌ మహాభాగౌ సుహృదౌ నిశి దంపతీ. 14

సరళవృక్షములచే వ్యాప్తమై, రత్నమయములగు గోడలతోఁ గూడుకొనిన గుహాసమూహముల చేఁ బూర్ణమై, మిగుల రమణీయమైనట్టి మహేంద్రపర్వతముపై వారొకమాసము వఱకు నుండిరి. చేతుల కందునట్టి యమోఘములైన ఫలపుష్పములు గల్గినట్టి మందారవనములు గలదియు, కల్పవృక్షములచేఁ బరివేష్టితమైనదియు, లతాగృహములచే శోభితమగు శుక్తిమాన్ పర్వతముపై వారొకపక్షము వఱకుండిరి. పారిజాతవనములచే వ్యాప్తమై దేవతలనుభవించుటకు యోగ్యమైన పుష్పమండపములతోఁ గూడుకొనినట్టి మైనాకపర్వతముయొక్క దక్షిణతటమున వారిరువురును రెండుమాసముల కాలము వఱకుండిరి. మేరుపర్వతముయొక్క దక్షిణభాగమున జంబూవృక్షవనమున, సువర్ణమయమగు జంబూనదీతటమున, జంబూ(నేరేడు)ఫలరసమను మదిరను పానముచేయుచు నొకమాసమువఱకు వారుండిరి. అట్లే యుత్తరకురుదేశమునఁ బదిదినములును, ఉత్తరకోసలదేశమున నిరువదియేడు దినములును వారు వసించిరి. ఇంకను ననేక రాజులయొక్క విచిత్ర విచిత్ర దేశములందును వారు పగటియందు మిత్రులుగను, రాత్రియందు దంపతులుగను నివాసముచేసిరి.

తతో యాతేషు మాసేషు శనైః కతిపయేషు సా
చూడాలా చిన్తయామాస దేవపుత్రకరూపిణీ. 15
సురూపభోగభారేణ పరీక్షేఽహం శిఖిధ్వజమ్
మా కదాచన చేతోఽస్య భోగేషు రతిమేష్యతి. 16
ఇతి సంచిన్త్య చూడాలా మాయయా విపినావనౌ
ఆగతం దర్శయామాస ససురాప్సరసం హరిమ్. 17

తదుపరి కొన్నిమాసములు గడచినపిమ్మట దేవపుత్రరూపధారిణియగు చూడాల యిట్లు చింతించెను. ఈతని చిత్తము భోగములందెప్పుడైన ఆసక్తిని బొందుచుండుటకై నేనీతని ననేక భోగజాలములచే బరీక్షించెదను. ఇట్లు విచారించి చూడాల యావనభూమియందు దనమాయచే దేవతాఽప్సరగణంబుతోఁగూడి యేతెంచిన యింద్రుని దర్శనమాతనికిఁ గావింపఁజేసెను.

ఇన్ద్రమభ్యాగతం దృష్ట్వా పరివారసమన్వితమ్
యథావత్పూజయామాస వనసంస్థః శిఖిధ్వజః. 18

శిఖిధ్వజ ఉవాచ:—

ఆత్మనా కిం కృతా దూరాదభ్యాగమకదర్థనా
దేవరాజ యథా తన్మే ప్రసాదాద్వక్తుమర్హసి. 19

అట్లు పరివార సహితముగ నేతెంచిన యింద్రుని జూచి వనమందున్న యాశిఖిధ్వజుఁడు విధిపూర్వకముగ నాతనిఁ బూజించి యిట్లనెను.— దేవరాజేంద్రా! తాముస్వయముగ నింతదూర మేతెంచునట్టి పరిశ్రమ యేల గావించిరి? తమ యాగమన కారణం బెద్దియో దయచేసి నాకుఁదెలియఁజేయుఁడు.

ఇన్ద్ర ఉవాచ:—

ఇమే వయమిహాయాతా స్త్వద్గుణాతిశయేన ఖాత్
హృది లగ్నేన సూత్రేణ ఖగా వనగతా ఇవ. 20
ఉత్తిష్ఠ స్వర్గమాగచ్ఛ తత్ర సర్వే త్వదున్ముఖాః
త్వద్గుణ శ్రవణాశ్చర్యాః స్థితా దేవాఙ్గనాగణాః. 21
పాదుకాగుటికాఖడ్గరసాదీదమథాపి చ
గృహీత్వా సిద్ధమార్గేణ స్వీకురు స్వర్గమణ్డలమ్. 22
ఆగత్య వివిధా భోగా స్త్వయా విబుధసద్మని
జీవన్ముక్తేన భోక్తవ్యా స్తేన త్వామహమాగతః. 23
విమానయన్తి సంప్రాప్తాం న తిరస్కుర్వతే శ్రియం
నాభివాఞ్ఛన్తి న ప్రాప్తాం త్వాదృశాః సాధు సాధవః. 24
అవిఘ్నమాగతేనాద్య సుఖం విహరతా త్వయా
స్వర్గః పవిత్రతాం యాతు హరిణేవ జగత్త్రయమ్. 25

ఇంద్రుఁడు.— ఓ రాజా! హృదయమందుఁ దగుల్కొనిన దారముచే వనమందలి పక్షులీడ్వఁబడునట్లు, మీయొక్క గుణాధిక్యతచే మేమందఱము స్వర్గమునుండియిటకు రప్పింపఁబడితిమి. లెండు! స్వర్గమునకుఁ బోవుదము. అచట నందఱు మీకొఱకై యుత్కంఠితులై యున్నారు. మఱియు మీగుణాతిశయమును విని యాశ్చర్యయుతులైనట్టి దేవతలు, దేవతాస్త్రీలు మీరాకకై యెదురుచూచుచున్నారు. సిద్ధపాదుక, గుటిక, ఖడ్గరసాదుల గ్రహించి సిద్ధమార్గమున స్వర్గమండలమున కేగుట కంగీకరింపుడు. అచటికేగి, దేవతల నివాసమందనేక దివ్యభోగములను జీవన్ముక్తరూపమున ననుభవింపుడు. అందులకై మిమ్ముల నాహ్వానించుటకొఱకు నేనిచటి కేతెంచితిని. మీవంటి సాధువులగు మహాత్ములు స్వయముగ సంప్రాప్తించినట్టి యైశ్వర్యమును దిరస్కరించుటద్వారా నిరాదరణగావింపరు. మఱియు ప్రాప్తింపని యైశ్వర్యమును వాంఛింపరు. విష్ణువుచే ముల్లోకములున్ను బవిత్రమగునట్లు, నిర్విఘ్నముగ నేడు మీరిటనుండి యేగి సుఖపూర్వకముగ నట విహరించుటచే స్వర్గము పవిత్రము కాఁగలదు.

శిఖిధ్వజ ఉవాచ:—

సర్వం స్వర్గసమాచారం వేద్మి దేవాధినాయక
కింతు సర్వత్రమే స్వర్గే నియతో నతు కుత్రచిత్, 26
సర్వత్రైవ హి తుష్యామి సర్వత్రైవ రమే ప్రభో
అవాఞ్ఛనత్వాన్మనసః సర్వత్రానన్దవానహమ్. 27

నియతం కించిదేకత్ర స్థితం స్వర్గకమీదృశం
శక్ర గన్తుం న జానామి త్వదాజ్ఞాం న కరోమ్యహమ్. 28

శిఖిధ్వజుఁడు:— దేవేంద్రా! నేనన్నిస్థానములను స్వర్గసమముగనే నెఱుఁగుచున్నాను. మఱియు మా స్వర్గము (చిదాత్మ) అంతటను నుండియున్నదేగాని పరిచ్ఛిన్నము (ఏకదేశస్థము)కాదు. కాన నోప్రభూ! నేనెల్లెడల సంతుష్టుఁడనైయున్నాను. సర్వత్ర క్రీడించుచున్నాను. మఱియు నామనస్సు ఇచ్ఛారహితమైయుండుటచే సర్వత్ర యానందవంతుఁడనైయున్నాను. నియతమై, ఏకదేశస్థమై తుచ్ఛమైనట్టి స్వర్గమునకు నేఁబోఁదలంచలేదుగాన ఈ తమ యాజ్ఞను నేను నెరవేర్పఁజాలను.

శక్ర ఉవాచః—

సాధో విదితవేద్యానాం పరిపూర్ణధియాం సమమ్
సజ్జనాచరితం యుక్తం మన్యే భోగోపసేవనమ్. 29

ఇంద్రుడు:— సాధూ! మీవంటి విదితవేద్యులును, పూర్ణబుద్ధియుతులును నగు మహాత్ములకు భోగములను సేవించుట, సేవింపకపోవుట రెండును సమానమే అయినను, సజ్జనులకు ప్రారబ్ధకర్మక్షయముకొఱకు భోగములసేవనమే యోగ్యమైనదని నేను నమ్ముచున్నాను.

దేవేశే ప్రోక్తవత్యేవం తూష్ణీమేవ స్థితే నృపే
కిమిత్యో నాపయాస్యేష త్వమితి ప్రోక్తవాన్ హరిః. 30
నాహమద్యైవ కాలేన వదతీతి శిఖిధ్వజే
కల్యాణం తేఽస్తు కుమ్భేతి వదన్నన్తర్ధిమాయయౌ. 31

దేవేంద్రుఁడిట్లు పలికిన పిదప రాజు మౌనముపహింప మరల యాతఁడు స్వర్గమునెడల మీరు నిరపేక్షులగుచో, ఇఁక నేనిటనుండి వెడలుటయే యుక్తమని వచింప నంత శిఖిధ్వజుఁడు ఇపుడు కాదు, మరల యేతెంచెదనని చెప్పుచుండగనే యింతలో కుంభుఁడా! తమకు మంగళమగుఁగాత? అని పల్కుచు నింద్రుఁ డంతర్ధానమయ్యెను.

తద్దేవవృన్దమఖిలం త్రిదశేశయుక్తం
తత్ర క్షణాదలమదృశ్యమభూద్ద్వితీయం
కల్లోలరాశిరివ వారినిధౌ ప్రశాన్తే
వాతే స్ఫురన్మకరఫేనఫణీన్ద్రవృన్దమ్. 32

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శక్రగమనం నామ
సప్తోత్తరశతతమః సర్గః॥ 107 ॥

వాయువు శమింప, సముద్రమున చంచలమకర ఫేన (నురుఁగు) సర్పాదిసహితమగు తరంగరాశియంతయును శమించునట్లు, ఇంద్రుఁడంతర్ధానము కాగానే తక్కిన దేవతా సమూహమంతయును విలుప్తమయ్యెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున చూడాలోపాఖ్యానమున శక్రగమనమను నూటయేడవ సర్గము ॥107॥

---

## అష్టోత్తరశతతమః సర్గః

[ఇహ క్రోధపరీక్షార్థం షిఙ్గసఙ్గశ్చ మాయయా
రాజ్ఞ్యా ప్రదర్శ్యతే రాజ్ఞే నిజరూపం చ పాకతః.
క్రోధమును పరీక్షించుటకొఱకై మహారాణియొక్క వ్యభిచారి పురుషునితోటి సంగమము, పరిపాకమువలన తన నిజరూపమును రాజునకు జూపుట యనువిషయము లిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచః —

తాం మాయాం శమమానీయ చూడాలా సమచిన్తయత్
దిష్ట్యా భోగేచ్ఛయా నాయం హ్రియతే వసుధాధిప. 1
శాన్తః సమసమాభోగ ఏవం శక్రసమాగమే
అసంరమ్భమహేలం చ కృతవాన్వ్యావహారికమ్. 2
భూయ ఏవ ప్రపశ్యేన విమృశామ్యేవ సాదరమ్
రాగద్వేషప్రధానేన కేనచిద్బుద్ధిహారిణా. 3

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! చూడాల యాయింద్రునిమాయ నుపసంహరించి యిట్లు విచారించెను— రాజుయొక్క మనస్సు భోగేచ్ఛచే వశీభూతము గాకయుండుట సౌభాగ్యకరమైన విషయము. ఇంద్రుని యాగమనమున నాతఁడాకాశమువలె ప్రశాంతుఁడై యుండెను. మఱియు క్రోధరహితుడై శిష్టులవలెనే యింద్రుని పూజించుట మున్నగు వ్యావహారిక కర్మనుగూడఁ జేసెను. ఇఁకనిపుడు రాగద్వేషప్రధానమై, క్రోధకారకమైనట్టి యొకానొక తంత్రమును మరల పన్ని యాదరపూర్వకముగ నీతనిఁ బరీక్షించెదను—

ఇతి సంచిన్త్య సా రాత్రావిన్దావభ్యుదితే వనే
గృహీతమఙ్గనారూపం కాన్తా మదనికా సతీ. 4
వాతే వహతి ఫుల్లాఢ్యే మధురామోదమాంసలే
సంధ్యాజప్యపరే నద్యాస్తీర సంస్థే శిఖిధ్వజే. 5
సంతానకలతాగేహం నీరన్ధ్రైః పుష్పగుచ్ఛకైః
శుద్ధాన్తం వనదేవీనాం ప్రవివేశ మదాన్వితా. 6
తత్ర సంకల్పితే పుష్పశయనే మాల్యమాలితా
కణ్ఠే సంకల్పితం కాన్తం జఙ్ఘమాదాయ సంస్థితా. 7

ఆగత్యాన్వివిష్య కుఞ్జాత్స ప్రదదర్శ శిఖిధ్వజః
లతాగేహే మదనికా కణ్ఠే ఖిఙ్గం మనోహరమ్. 8

ఇట్లు చింతనఁజేసి యారాత్రి చంద్రుఁడు డయించినమీదట, చూడాల మదనికా ప్రియసతీ రూపంబును దాల్చి, శీతలమందసుగంధవాయువు వీచుచుండ, నదీతీరమున శిఖిధ్వజుఁడు సంధ్యాజపతత్పరుఁడైయుండ నపుడు పూఁగుత్తులతోఁటి దట్టమై, కల్పవృక్షలతారూపగృహసంయుత మైనట్టి వనదేవతాస్త్రీల శుద్ధాంతఃపురమున మదసహితయై ప్రవేశించి, అచట సంకల్పరచితమగు పుష్పశయ్యపై, సంకల్పరచితుఁడగు వ్యభిచారిపురుషుని కంఠమున గ్రహించి పుష్పమాలలచేఁ బరివేష్టితయై పరుండెను. ఇంతలో శిఖిధ్వజుఁడు తనప్రియను కుంజములందు వెదకుచువచ్చి లతాగృహమున ఆమదనికను, ఆపె కంఠమందు సంలగ్నుఁడైయున్న యొక వ్యభిచారిపురుషుని గాంచెను.

కున్తలావలితస్కన్ధం సమాలబ్ధం చ చన్దనైః
శయనావృతినిక్షేపపర్యాకులితశేఖరమ్. 9
హేమాభే ద్విగుణాకార బాలా బాహూపధానకే
సంసక్తశ్రవణాపాఙ్గ కపోలతల కున్తలమ్. 10
మిథునం తద్దదర్శాథ మిథః ప్రహసితాననమ్
అన్యోన్యవదనాసక్తం ఛన్నం కల్పలతాంశుకైః. 11
ఆలోలమాల్యశయనం మదనాతురమాకులమ్
అఙ్గలగ్నచ్ఛలేనాత్మరాగమన్యోన్యమర్పయత్. 12
అభ్యున్ముఖం సమానన్దముద్దామమదమన్థరమ్
పరస్పరాహతం పుష్పైర్వక్షోభ్యాం పీడితస్తనమ్. 13

మదనికయొక్కయు తనయొక్కయు, కేశములచేఁ బరివేష్టింపఁబడిన స్కంధము కలవాఁడును, చందనములచే లేపనముగావింపఁబడిన దేహము గల్గియున్న వాఁడును, శయ్యపై నిటు నటు పొరలుటచే చెదిరినట్టి శిరోభూషణములు గలవాఁడును, బంగారమువలె శోభాయమానమైయున్న మదనికయొక్క ద్విగుణాకారమగు బాహువు తలగడగాఁ గల్గియున్నవాఁడును, తనశ్రవణ, కపోలతలములం దాసక్తమైయున్న మదనికాకేశపాశముచే శోభితుఁడును నగు యావిటపురుషుని శిఖిధ్వజుఁడవలోకించెను. మఱియు, పరస్పరహాస్యయుక్తమగు ముఖములుగలవారును, వకరు మఱియొకరి ముఖమున సంలగ్నులైయున్నవారును, కల్పలతయొక్క సూక్ష్మవస్త్రములచే గప్పఁబడినవారును, చంచలమాలాయుక్తమగు శయ్యపై నున్నవారును, మన్మథునిచే వ్యాకులముగావింపఁ బడినవారును, సంలగ్నతచే నొకరికొకరు ప్రేమ నర్పించుకొనుచున్నవారును, ఒకరు మఱియొకరివైపునకుఁ దిరిగియున్నవారును, ఆనందయుక్తులును, ప్రబలమన్మథావేశముతోఁగూడియున్నవారును, పుష్పములచే నొకరినొకరు కొట్టుకొనుచున్నవారును, భుజద్వయముచే బీడితమైన స్తనభాగములు గలవారునగు యాస్త్రీపురుషులను రాజు గాంచెను.

తదాలోక్యావికారేణ చేతసాలం తుతోష సః
అహో సుఖం స్థితౌ ఖిఙ్గావిత్యాహ స శిఖిధ్వజః. 14

తిష్ఠతాఙ్గ యథాకామం సుఖంఖిన్నౌ యథాస్థితమ్
విఘ్నం మాకరవం భీతావిత్యుక్త్వా నిర్జగామ సః. 15

అట్టి స్త్రీపురుషులఁగాంచి రాజు వికారమునొందని చిత్తముతోఁ గూడినవాఁడై, అతిప్రసన్నుఁడై యిట్లు పలికెను- ఆహా! ఈవ్యభిచారిస్త్రీపురుషు లెంత సుఖవంతము గానున్నారు! ప్రియులారా! మీరిరువురు సుఖముగా నుండుడు. నన్నుజూచి భీతిల్లకుఁడు. నేను మీకు విఘ్నమును గలిగింపను — అని చెప్పి యచటనుండి వెడలిపోయెను.

తతో ముహూర్తమాత్రేణ ప్రపఞ్చం తముపేత్యసా
నిర్వ్యయా దర్శయన్తీ స్వం రతిఫుల్లాకులం వపుః. 16

తదుపరి యామాయాప్రపంచము నొక్కముహూర్తమాత్రకాలములో నుపేక్షించివైచి, విటపురుషుని సంగమముచేఁ బ్రసన్నమును, వ్యాకులము నైనముఖమును దర్శింపఁజేయుచు ఆమదనిక రాజు చెంతకుఁ బోయెను.

ఉపవిష్టం దదర్శైనం నృపం హేమశిలాతలే
సమాధిసంస్థమేకాన్తే మనాగ్వికసితేక్షణమ్. 17
తం ప్రదేశముపాగమ్య లజ్జావనమితాననా
తూష్ణీమాసీత్ క్షణం ఖిన్నా మ్లానా మదనికాఙ్గనా. 18
క్షణాచ్ఛిఖిధ్వజో ధ్యానాద్విరతస్తామువాచహ
అత్యన్తమధురం వాక్యమిదమక్షుబ్ధయా ధియా. 19

ఏకాంతమున నొక బంగారుశిలపైఁ గూర్చుండి సమాధియందుఁ దత్పరుఁడై, కొంచెము వికసించిన నేత్రములు గలవాఁడైయున్న రాజును గాంచి లజ్జచే వంగినశిరంబుగలదై, ఖిన్నయై మ్లానముఖముఁ గల్గియున్నట్టి మదనిక యాస్థానమున కేతెంచి మెదలకనుండెను. క్షణకాలమైన పిదప శిఖిధ్వజుఁడు సమాధినుండి లేచి క్షోభరహితమగు బుద్ధిచే నత్యంతమధురముగ నీ వాక్యములఁ బల్కెను —

తన్వి కిం శీఘ్రమేవ త్వం విఘ్నితానన్దమాగతా
ఆనన్దాయైవ భూతాని యతన్తే యాని కానిచిత్. 20
భూయస్తోషయ తం గచ్ఛ కాన్తం ప్రణయవృత్తిభిః
పరస్పరేప్సితస్నేహో దుర్లభో హి జగత్త్రయే. 21
అహమేతేన చార్థేన నోద్వేగం యామి మానిని
యద్యదిష్టతమం లోకే తత్తదేవం విజానతా. 22
అహం కుమ్భశ్చ తన్వఙ్గి వీతరాగావిహేతరా
దుర్వాసః శాపజా బాలా త్వం యదిచ్ఛసి తత్కురు. 23

ఓ సూక్ష్మాంగీ! ఇంత త్వరలోనే మీకార్యమున కెవరు విఘ్నమును గలిగించిరి? నీ వానందము నొందితివా? ఏలయనఁగా, సమస్తప్రాణులును ఆనందముకొఱకే ప్రయత్నించుచున్నవి. పోయి

ప్రణయవృత్తులచే మరల నీప్రియుని సంతుష్టిపఱచుము. ఎందుకనిన, ముల్లోకములందును బరస్పర స్వాభావిక ప్రేమ అతిదుర్లభమైనది. మానినీ! ఈనీకృత్యముచే నేను క్రుద్ధుఁడను గాని, క్షుభితుఁడను గాని కాలేదు. ఏలయనఁగా, ప్రపంచమున ప్రియవస్తువేదేని గలదో, అయ్యది సర్వులయుపభోగమునకై యగునని విజ్ఞుఁడెఱుంగవలెను. సూక్ష్మాంగీ! నేనును, కుంభుఁడును వీతరాగులగు మిత్రులము. నీవైతే, దుర్వాసుని శాపమువలన నేర్పడినట్టి మట్రియొకదానవు. కావున నేది చేయఁదలంచుదువో యదినిస్సందేహముగ నాచరింపుము

మదనికో వాచ: —

ఏవమేవ మహాభాగ స్త్రీస్వభావో హి చఞ్చలః
కామోహ్యష్టగుణః స్త్రీణాం న కోపం కర్తుమర్హసి 24
అబలాహమనేనాస్మి రాత్రౌ గహనకాననే
త్వయి సన్ధ్యాజపపరే కిం కరోమి వరాకికా. 25
అబలా వా కుమారీ వా జారం న రతిరోధనం
కరోతి పరిఖఙ్గేన నాఙ్గే స్వే వినివేశితమ్. 26
స్త్రియః సున్దరతాం యాతాః పురఃపుంసామసఙ్గమే
మన్యుర్నిషేధ ఆక్రన్దః సతీ త్వం కిం కరిష్యసి. 27
అబలా స్త్రీ తథా బాలా మూఢాహమపరాధినీ
క్షన్తుమర్హసి నాథ త్వం క్షమవన్తో హి సాధవః. 28

మదనిక:— మహాత్మా! తాము వచించినది సత్యమే. స్త్రీస్వభావమతి చంచలమైనది. మఱియు స్త్రీలకుఁ బురుషులకంటె నెనిమిదిరెట్లధికముగ గామముండును. కాన తాము కోపగింపఁ జనదు. తాము సంధ్యాకాల జపతత్పరులైయున్న సమయంబున నీదట్టమైన యాటవియందీకాముకుఁడు నన్నుఁ బ్రార్థింప దీనయై, అబలయైనట్టి నేనేమి చేయుదును? వివాహితస్త్రీయైనను, కుమారియైననుసరే ఏకాంతమున జారుని పొందినదైన రతినిరోధము చేయఁజాలదు. స్త్రీలకు సౌందర్యము లేకపోవుటయే పురుషుల అసంగమమునకు హేతువుగాని యన్యము కాదు. అట్టి సౌందర్యమును బొందినచో, మఱియు నేకాంతమున సమ్ముఖమున పురుషుఁడు సంప్రాప్తించినచో నపుడు క్రోధ, నిషేధ, (జనాపవాదరూప) ఆక్రందములుగాని, పాతివ్రత్యభావముగాని వారి సమాగమమును నిరోధించుటకసమర్థములైయుండును. నాథా! నే నబలను. చిన్నదానను మూఢురాలను. అపరాధిని, కావున, క్షమింపుడు. సాధుజనులు క్షమాశీలురుగదా!

శిఖిధ్వజ ఉవాచ: —

మన్యుర్మమ న బాలేఽన్తర్విద్యతే ఖ ఇవ ద్రుమః
కేవలం సాధునిన్ద్యత్వాన్నేచ్ఛామి త్వామహం వధూమ్. 29
సుహృత్త్వేనవనాన్తేషు పూర్వవత్సుఖమఙ్గనే
వీతరాగతయా నిత్యం సమమేవ రమావహే. 30

శిఖిధ్వజుఁడు:— బాలా! ఆకాశమున వృక్షము లేని చందమున నాయంతఃకరణమునఁ గ్రోధమున్ను లేదు. కేవలము సాధుజననింద్యవగుటచే నిన్నిఁక భార్యగా మాత్రము స్వీకరింపఁదలంచుట లేదు. పూర్వమువలె వీతరాగులగు మిత్రులమై సుఖముగ మనమిరువురము నిత్యము వనములందుఁ గలిసియే క్రీడించెదము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏవం సమతయా తత్ర స్థితే తస్మిఞ్ఛిఖిధ్వజే
చూడాలా చిన్తయామాస తత్సత్త్వోదితాశయా. 31

శ్రీ వసిష్ఠుఁడు:– ఓ రామచంద్రా! ఇట్లు శిఖిధ్వజుఁడు సమత్వము గల్గియుండ, మఱియు పరీక్షించినపుడు రాగద్వేషాదివాసనలులేనివాఁడై యొప్ప, అట్టియాతని సత్త్వస్వభావమును గాంచి ప్రసన్నచిత్తయైన చూడాల యిట్లు విచారించెను –

అహో బత పరం సామ్యం భగవానయమాగతః
వీతరాగతయాఽక్రోధో జీవన్ముక్తోఽవతిష్ఠతే. 32

నైవం హరన్తి తే భోగా న మహత్యోఽపి సిద్ధయః
న సుఖాని న దుఃఖాని నాపదో నచ సంపదః. 33

చిన్తితాః సకలా ఏకం ప్రయాన్త్యే నమనిన్దితా
మన్యే మహర్ధయః కాన్తా నారాయణమివాపరమ్. 34

ఆత్మవృత్తాన్తమఖిలం తమేనం స్మరయామ్యహమ్
కుమ్భరూపమిదం త్యక్త్వా చూడాలైవ భవామ్యహమ్. 35

ఆహా! ఈనాభర్తయగు మహాత్ముఁడు పూర్ణసమత్వమును బొందెను. వీతరాగుఁడగుటచే నీతఁడు క్రోధరహితుఁడై, జీవన్ముక్తుఁడై స్థితినొందియున్నాఁడు. ఆ గొప్పభోగములుగాని, మహత్తర సిద్ధులుగాని, సుఖదుఃఖములుగాని, సంపద్విపత్తులుగాని యీతని చిత్తమును హరింపఁజాలవు. నేను దలంచినట్టి శాంతి, ధైర్యము. క్షమ, తృప్తిమున్నగు సమస్త జీవన్ముక్తలక్షణములగు యుత్తమగుణములున్ను, నారాయణునియందువలె నీతనియొక్కనియందే వచ్చి చేరుచున్నవి. కావున నీతనికిపుడు నావృత్తాంతమంతయు స్మరింపఁజేసెదను. మఱియు నేనిపుడు కుంభరూపమును త్యజించి చూడాలరూపమునే ధరించెదను—

ఇతి సంచిన్త్య చూడాలా చూడాలావపురక్షతా
దర్శయామాస తత్రాశు త్యక్త్వా మదనికావపుః 36

తస్మాన్మదనికాదేహాచ్చూడాలా నిర్గతేవ సా
బభావస్య పురో యుక్తా నిర్గతేవ సముద్గకాత్ 37

తాం దదర్శానవద్యాఙ్గీం పునః ప్రణయపేశలామ్
కాన్తాం మదనికామేవ చూడాలాం దయితాం స్థితామ్. 38

ఇట్లు విచారించి చూడాల శీఘ్రముగఁ దన మదనికారూపమును త్యజించి పూర్ణమగు తన చూడాలరూపమును నాతనికిఁజూపెను. అపుడు యోగధారణాయుక్తమగు పేటికనుండివలె మదనికా దేహమునుండి బయల్వెడలినట్లున్నదై యా చూడాల రాజెదుట శోభించెను. ఉత్తమ శరీరముగలదియు, పతియొక్క చిత్తమును ప్రసన్నమొనర్చుటయందు చతురయు నగు యా మదనిక నే తన ప్రియయగు చూడాలరూపమున నున్నట్లు రాజపుత్రు గాంచెను.

సముదితామివ మాధవపద్మినీ
ముపగతామివ భూమితలాచ్ఛ్రియం
ప్రకటితామివ రత్నసముద్గకా
త్పరిదదర్శ నిజాం దయితాం నృపః. 39

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ చూడాలా స్వరూపదర్శనం నామ అష్టోత్తరశతతమః సర్గః ॥ 108 ॥

వసంతకాలమున నుదయించిన పద్మసరంబువలెను, భూతలమునుండి బయల్వెడలిన సీతారూపిణియగు లక్ష్మివలెను, రత్నపేటికనుండి బయల్వెడలిన దానివలెను నున్నట్టి ప్రియయగు చూడాల నపుడు రాజు వీక్షించెను.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున చూడాలస్వరూపదర్శనమను
నూటయెనిమిదవ సర్గము ॥108॥

---

## నవాధిక శతతమః సర్గః

[దృష్ట్వా పృష్ట్వా నృపో ధ్యానాద్బుద్ధ్వా సర్వం సువిస్మితః
తుష్టః ప్రశస్య చూడాలామాలిఙ్గ్య ప్రానయన్నిశామ్.

చూచి, అడిగి, ధ్యానముచే సంశయము నెఱిఁగి శిఖిధ్వజుఁడు పరమాశ్చర్యము నొందెను. మఱియు, ప్రసన్నుఁడై చూడాలను మిగుల ప్రశంసించి కౌఁగలించుకొని, ఆ రాత్రి యచటనే గడపెను విషయమిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అథ తాం దయితాం దృష్ట్వా విస్మయోత్ఫుల్లలోచనః
శిఖిధ్వజ ఉవాచేదమాశ్చర్యాకులయా గిరా 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అటుతరువాత తన ప్రియను గాంచి వికసిత నేత్రుఁడగు శిఖిధ్వజుఁడాశ్చర్యపూర్ణమగు వాక్కుతోఁ నిట్లు పలికెను—

కా త్వముత్పలపత్రాక్షి కుతః ప్రాప్తాసి సున్దరి
కిమిహాసి కియత్కాలం కిమర్థమిహ తిష్ఠసి. 2
అఙ్గేన వ్యవహారేణ స్మితేనానునయేన చ
మమ జాయా విలాసేన తత్కాలేవోపలక్ష్యసే. 3

ఓ సుందరీ! కమలపత్రాక్షీ! నీవెవతెవు? ఎటనుండి యిటకేతెంచితివి? ఎంతకాలము నుండి యేకారణమున నిట వసించుచుంటివి? శరీరశోభచేతను, వ్యవహారము చేతను, చిరునగవుచేతను, నమ్రతచేతను నీవు నాప్రియురాలివలెఁ జూపట్టుచున్నావు.

చూడాలోవాచ:—

ఏవమేవ ప్రభో విద్ధి చూడాలాస్మి న సంశయః.
అకృత్రిమేణ దేహేన లబ్ధోఽస్యద్య మయా స్వయమ్. 4
కుమ్భాది దేహనిర్మాణైస్త్వాం బోధయితుమేవ మే
ప్రవఙ్చః శతశాఖత్వమిహ యాతో వనాన్తరే, 5
యదా రాజ్యం పరిత్యజ్య మోహేన తపసే వనమ్
త్వమాగాస్తత్ప్రభృత్యేవ త్వద్బోధాయాహముద్యతా. 6
అనేన కుమ్భదేహేన మయైవ త్వం విబోధితః
కుమ్భాది దేహనిర్మాణం త్వాం బోధయితుమేవ మే. 7
మాయయా నతు కుమ్భాది కించిత్సత్యం మహీపతే
అథో విదితవేద్యస్త్వం ధ్యానేనైతదఖణ్డితం. 8
సర్వం పశ్యసి తత్త్వజ్ఞ ధ్యానేనాశ్వవలోకయ

చూడాల.— ప్రభూ! అట్లే యగును, నేను నిస్సందేహముగ చూడాలనే. నేఁడు నా స్వాభావిక దేహముచే నిన్ను నేను స్వయముగఁ బొందితిని. నీకు బోధించుటకొఱకై కుంభాది శరీరముల ధరించుటద్వారా నాతంత్ర మిప్పనమున వందలకొలఁది శాఖలు గలదాయెను. రాజ్యమును వదలి మోహవశమున తపంబొనరించుటకై నీవేతెంచినది మొదలు నీకు బోధసల్పుటయందు నేను ప్రయత్నశీలనై యుంటిని. ఈకుంభశరీరముచే నేను నీకు బోధించితిని. నాయీకుంభాదిదేహముల నిర్మాణము నీయొక్క బోధకొఱకేయగును. ఓ రాజా? ఈకుంభాదిదేహముల రచన మాయామాత్రమేగాని యొకింతైనను సత్యముకాదు, తత్త్వజ్ఞా! ఇప్పుడు నీవు విదితవేద్యుఁడ (జ్ఞాని) వైతివిగాన ఈసమస్త వృత్తాంతమును బూర్ణముగ ధ్యానముచే నవలోకింపుము.

అథ చూడాలయేత్యుక్తో బద్ధ్వా పరికరం నృపః. 9
ఆత్మోదన్తం విశేషేణ ధ్యానేనామలమైక్షత
అభిరాజ్యపరిత్యాగాచ్చూడాలాదర్శనావధి. 10
సర్వం ముహూర్తధ్యానేన చాత్మోదన్తం దదర్శ సః
ఆరాజ్యసంపరిత్యాగాద్వర్తమానక్షణక్రమమ్. 11

సర్వమాలోక్య భూపాలో విరరామ సమాధితః
సమాధివిరతో హర్షవికాసి నయనామ్బుజః. 12
విసార్య తరసా బాహూ పులకోజ్జ్వలతాం గతౌ
గలదఙ్గం ఘనస్నేహం ముఞ్చద్బాష్పం స్ఫురత్స్పృహమ్. 13
ఆలిలిఙ్గ చిరం కాన్తాం నకులో నకులీమివ

చూడాల యిట్లు వచింప నంత రాజు తద్ధారణాయోగ్యమగు నాసనమువై చికొని రాజ్యత్యాగమునుండి మొదలుకొని చూడాలాదర్శనమువఱకు గల తన వృత్తాంతమంతయు ధ్యానముద్వారా సంపూర్ణముగ నవలోకించెను. కేవల మొకముహూర్తకాల ధ్యానముచేతనే తనరాజ్యత్యాగసమయము మొదలుకొని వర్తమానక్షణపర్యంతముగల సమస్తవృత్తాంతమును గాంచిరాజు సమాధినుండి మేల్కాంచి హర్షాతిశయముచే వికసిత నేత్రములుగలవాఁడై, గగుర్పాటు నొందుటచే నుజ్జ్వలత్వము నొందిన తన భుజద్వయమును శీఘ్రముగఁ జాచి, అతిస్నేహయుతుఁడై, మిగుల యభిలాషతోఁగూడు కొనినవాఁడై ఆనందబాష్పముల వదలుచు, ముంగిస యాఁడు ముంగిసను గౌఁగలించుకొనునట్లు చిరకాలమునకుఁ దన ప్రియను గౌఁగలించుకొనెను.

తయోరాలిఙ్గనే తస్మింస్తత్ర భావో బభూవ యః. 14
న స వాసుకి జిహ్వాభిర్వక్తుం హర్షేణ శక్యతే
దివిష్ఠావివ పక్షేన కృతావివ మిలత్తనూ. 15
శైలావివ సముత్కీర్ణౌ శ్లిష్టావాస్తాం చిరం ప్రియౌ
ముహూర్తేన గలద్ఘర్మజలౌ పులకపీవరౌ 16
బాహూ విశ్లథతామీషన్నిన్యతుస్తౌ శనైః ప్రియౌ
అమృతాపూర్ణహృదయౌ సంశూన్యహృదయోపమౌ. 17
ఉన్ముక్తభుజమాస్తాం తావలక్షుస్థితలోచనమ్
ఘనానన్దక్షణం స్థిత్వా తూష్ణీం ప్రణయపేశలమ్. 18
కాన్తాం చిబుకసంలగ్నకరః ప్రోవాచ భూపతిః
అత్యన్తమధురస్నిగ్ధః కాన్తః స్వకులయోషితామ్. 19

అచట వారిరువురి యాలింగనసమయమునఁ బరస్పరయును రాగరూప స్థాయీభావమేది యుత్పన్నమాయెనో, అద్దానిని శేషభగవానుఁడు తనవేయి నాలుకలచేనైనను వర్ణింపఁజాలఁడు. అమావాస్యనాఁ డాకాశమున సమ్మిళితశరీరులగు సూర్యచంద్రులవలె యొప్పుచు వారి దేహములపుడు స్వేదరోమాంచములచేఁ దడిసినవారాయెను. అట్లు పులకితశరీరులై యాప్రియులిరువురును శిలపైఁ జెక్కఁబడిన విగ్రహములవలె చాలకాల మట్లుకూడియేయుండిరి. పిమ్మట, అమృతముచేఁ బూర్ణమైన హృదయములుగలవారును, ఆనందాధిక్యతచే మనస్సు జడముకాఁగా శూన్యచిత్తులవలెఁ దోచుచున్నవారును నగు యాప్రియులిద్వరును మెల్లమెల్లగాఁ దమభుజములను వేఱుచేసిరి. అట్లు గావించినపిదప క్షణకాలము గాఢప్రేమాన్వితులై, ప్రణయకౌశలములతోఁగూడుకొని, అస్థిరనేత్రములుగలవారై యొకింతసేపు

మానముగా నుండిరి. తదుపరి రాజు, స్వకులస్త్రీలలో నుత్తమురాలును, అతిమధురభాషిణియునగు తన ప్రియురాలి ముఖము (చిబుకము) పైఁ జేతినుంచి యిట్లు పలికెను—

పుణ్యశ్చరతి నిష్పన్నః స్వాదుర్నామామృతాదపి
కియత్ప్రమాణ స్సన్న్యాస్త్వ త్వయా బాలేన్దుముగ్ధయా. 20
అనుభూతిశ్చిరం క్లేశో భర్తురర్థేన దారుణః
ఏవం దురుత్తరా త్తస్మాత్సంసారకుహరా దహం. 21
ఉత్తారితో యయా బుధ్యా సా హి కేనోపమీయతే
అరున్ధతీ శచీ గౌరీ గాయత్రీ శ్రీః సరస్వతీ. 22
సమస్తాః వేలవాయన్తే తవ తన్వ్యా గుణశ్రియా
ధీః శ్రీః కాన్తిః క్షమా మైత్రీ కరుణాద్యాస్తు సున్దరి. 23
కాన్తా స్వాకారకాన్తాసు ప్రథమేవాభిలక్ష్యసే
పరేణా ధ్యవసాయేన త్వయాహమవబోధితః. 24
కేన ప్రత్యుపకారేణ పరితుష్యతి తే మనః

ప్రియా! పవిత్రమై, అమృతముకంటె నతిస్వాదిష్టమైనట్టి యీయనురాగప్రవాహమును ముగ్ధబాలవగు నీవెంత విస్తరింపఁజేసితివి? పతికొఱకై చాలకాలము నీవెన్నియో దారుణక్లేశము లనుభవించితివి. దుస్తరమగు యీ సంసారమను గర్తమునుండి యేబుద్ధిచే నీవు నన్నుద్ధరించితివో, అయ్యది దేనిచేఁ బోల్పనగును! అరుంధతి, శచి, గౌరి, గాయత్రి, లక్ష్మి, సరస్వతి, వీరందఱున్ను నీగుణశోభచే నల్పముగఁదోచుచున్నారు. ఓ సుందరీ! బుద్ధి, ఐశ్వర్యము, కాంతి, క్షమ, మైత్రి, కరుణ మున్నగు గుణములన్నియు స్త్రీలయందుఁ బ్రసిద్ధమైయున్నవి. కాని యట్టిస్త్రీలయందు నీవే సర్వప్రథమురాలుగ భాసించుచున్నావు. ఎట్టి మహాయత్నముచే నీవు నాకు జ్ఞానమొసంగితివి? ఏ ప్రత్యుపకారముచే నీ మనస్సిపుడు సంతుష్టిని బొందఁగలదు!

మోహాదినాదిగహనాదనన్తగహనాదపి. 25
పతితం వ్యవసాయిన్యస్తారయన్తి కులస్త్రియః

అనాదియై, అనంతమైనట్టి మోహసాగరమునఁ బడియున్న తమపతిని ప్రయత్నశీలలగు కులస్త్రీలు తరింపఁజేయుదురు.

శాస్త్రార్థగురుమన్త్రాది తథా నోత్తారణక్షమమ్. 26
యథైతాః స్నేహశాలిన్యో భర్తౄణాం కులయోషితః

స్నేహపరిపూర్ణలగు కులస్త్రీలు తమభర్తలను మోహసముద్రమునుండి దాటించుటయందెట్లు సమర్థులగుదురో, అట్లు శాస్త్రార్థ, గురుమంత్రాదులున్ను సమర్థములు కానేరవు.

సఖా భ్రాతా సుహృద్భృత్యో గురుర్మిత్రం ధనం సుఖమ్. 27
శాస్త్రమాయతనం దాసః సర్వం భర్తుః కులాఙ్గనాః
సర్వదా సర్వయత్నేన పూజనీయాః కులాఙ్గనాః. 28

లోకద్వయసుఖం సమ్యక్సర్వం యాతు ప్రతిష్ఠితమ్

కులస్త్రీయే తన పతికి సఖుఁడును, సోదరుఁడును, సుహృదుఁడును, భృత్యుఁడును, మిత్రుఁడును, ధనమును, సుఖమును, శాస్త్రమును, గృహమును, దాసుఁడును, సమస్తమును నగును. కావున సదా సర్వవిధముల ప్రయత్నముచే కులస్త్రీలను బూజింపవలెను. మఱియు సతీస్త్రీలయందు రెండులోకములయొక్క సుఖమును విశేషముగ నాధారపడియుండునుగాన వారి నన్నివిధముల సత్కరింపవలెను.

నిరిచ్ఛాయాః ప్రయాతాయాః పారం సంసారవారిధేః. 29
కథమస్యోపకారస్య కరిష్యే తవ ప్రతిక్రియాః
మన్యే కులాఙ్గనాం లోకే లోకే సర్వాస్త్వయాధునా. 30
నారీసౌజన్యచర్చాసు వ్యపదేశ్యా భవిష్యసి
త్వాం నిర్మితవతో ధాతుర్గుణజాలాతిశాయినీమ్. 31
మన్యే ప్రకుపితా నూనమనుర్ధత్యాదికాః స్త్రియః
సతీ త్వం రూపసౌజన్యగుణరత్న సముద్గికే. 32
ఏహి మే త్వద్గుణోత్కస్య పునరాలిఙ్గనం కురు

ఇచ్ఛారహితవు, సంసారసముద్రమును దాటినదానవునగు నీయీయుపకారమునకుఁ బ్రత్యుపకారము నేనెట్లు చేయఁగలను! నేనీప్రపంచమున నిన్ను బతివ్రతగ నే నమ్ముచున్నాను. మఱియు ప్రపంచమున నున్న పతివ్రతలందఱిని నీవు జయించితివి. ఇఁకమీఁద, స్త్రీల సౌజన్యాదిగుణములయొక్క చర్చలందు నీనామమే ప్రథమమున గైకొనఁబడును. సమస్తగుణసమూహముచే శోభాయమానమగు నిన్ను సృజించిన బ్రహ్మదేవునియెడ, అరుంధతిమున్నగు కులస్త్రీలు నిక్కముగఁ గుపితలైయుండురని తలంచుచున్నాను. రూపసౌజన్యాది గుణరత్నముల పేటికయగునో ప్రియా! నీవే సతివి (పతివ్రతవు.) నీ గుణములయెడల నేనుత్కంఠితుఁడ నగుచున్నాను. రమ్ము! మరల నన్నాలింగన మొనర్చుకొనుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా మృగశాబాక్షీం చూడాలాం తాం శిఖిధ్వజః. 33
ఆలిలిఙ్గ పునర్గాఢం నకులో నకులీమివ

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! శిఖిధ్వజుఁడిట్లు పలికి, ముంగిస యాఁడుముంగిసను గాఁగలించుకొనునట్లు మృగనేత్రయగు చూడాలను మరల గట్టిగాఁ గౌఁగలించుకొనెను.

చూడాలోవాచ:—

దేవ శుష్కక్రియాజాలపరే త్వయ్యాకులాత్మని. 34
భూయోభూయో భృశమహం త్వదర్థం దుఃఖితాభవం
తేన త్వదవబోధాత్మా స్వార్థ ఏవోపపాదితః. 35
మయా తదత్ర కిం దేవ కరోషి మమ గౌరవం

చూడాల:— దేవా! నీవువ్యాకులుఁడవై, శుష్కక్రియాజాలమునఁ దత్పరుఁడవైయుండ, నిన్నుఁగూర్చి నేను మరలమరల దుఃఖితనైతిని. కావున నీకు బోధించుటద్వారా నేను నా స్వార్థమునే సిద్ధింపఁజేసికొంటిని. కాన నివ్విషయమున నన్నేల గౌరవించెదవు?

శిఖిధ్వజ ఉవాచ:

త్వయా యథా వరారోహే స్వార్థః సంపాద్యతే శుభః 36
తమిదానీం తథా సర్వాః సాధయన్తు కులాఙ్గనాః

శిఖిధ్వజుఁడు:—శ్రేష్ఠురాలవగు నో ప్రియా! అట్లైనచో నీచే శుభమగు నీస్వార్థ మెట్లు సిద్ధింపఁబడెనో, అట్లే యితర కులస్త్రీలందరున్ను నిట్టిస్వార్థమునే సిద్ధింపఁజేసెదరుగాక!

చూడాలోవాచ:—

బుధ్యసే కాన్త విశ్రాన్తో జగజ్జాలతటే విభో. 37
అద్య తం ప్రాక్తనం కించిన్మోహం సమనుపశ్యసి
ఇదం కరోమి నేదం తు ప్రాప్నోమీదమితి స్థితిమ్. 38
అనర్థ్వాససి తాం కచ్చిద్దశాపేలవతాం ధియః
తాస్తుచ్ఛతృష్ణాకలనాస్తాః సంకల్పాః కుకల్పనాః. 39
త్వయి నాద్యావలోక్యన్తే దేవ వ్యోమ్నీవ పర్వతాః
కిం త్వమద్యాఙ్గ సంపన్నః కింనిష్ఠోసి కిమీహసే. 40
కథం పశ్యసి పాశ్చాత్యం దేహచేష్టాక్రమం విభో

చూడాల:—ఉత్తముఁడవగు ప్రభూ! ఈ జగజ్జాలముయొక్క యావలితటమున విశ్రాంతి నొందినవాఁడవై, తత్త్వపదార్థము నెఱింగితివా? ఇప్పుడేఁ బూర్వకాలపు అజ్ఞానము నేమైన గాంచుచుంటివా? 'దీనిని జేయుదును, దీనిని జేయను, దీనిని బొందుదు'నను నీప్రకారమగు నీ పూర్వకాలస్థితి ఎయ్యదిగలదో, అట్టి యపక్వబుద్ధిజనితమగు తుచ్ఛస్థితిని గూర్చి లోలోన నెప్పుడైన నవ్వుచుంటివా? ఆకాశమునఁ బర్వతములు లేనట్లు ఆ నీ పూర్వపు తుచ్ఛతృష్ణయు, సంకల్పములును, కుకల్పనలున్ను నిపుడేవియు నీయందు లేవుగదా? ఇప్పుడు నీవెట్లుంటివి? దేనియందు నిష్ఠగలిగి యున్నావు? దేనిని గోరుచున్నావు? పూర్వకాలపు దేహక్రియాక్రమము నిపుడెట్లు గాంచుచున్నావు.

శిఖిధ్వజ ఉవాచ:—

సుమనఃపూర్ణనీలాబ్జమాలాసారవిలోచనే. 41
త్వమేవ యస్య యస్యా న స తస్యాహముపస్థితః
నిరీహోఽస్మి నిరంశోఽస్మి నభఃస్వచ్ఛోఽస్మి నిస్పృహః. 42

శిఖిధ్వజుఁడు:—పుష్పములచేఁ బూర్ణమగు నీలకమలమాలాసదృశమగు నేత్రములుగల ఓప్రియా! ఏ వివేకమందు, (తత్త్వదర్శనమందు) అంతః ప్రకాశకరూపముచే నీవు స్థితిగల్గియున్నావో, నేనున్ను నట్టి వివేకమందే, ప్రకాశకసాక్షీరూపమున (సత్యాగాత్మరూపమున) స్థితిగల్గియున్నాను. మఱియు, స్వానుభవముచే నీవెట్లు గాంచుచున్నావో నేనున్ను నట్లనే గాంచుచున్నాను. ఇపుడు నేనిచ్ఛారహితుఁడను, అంశవర్జితుఁడను, నిస్పృహుఁడనునై యాకాశమువలె స్వచ్ఛముగా నున్నాను.

శాన్తోఽహమర్థరూపోఽస్మి చిరాయాహమహం స్థితః
తాం దశాముపయాతోఽస్మి యతశ్చిత్తైక వర్త్మని. 43

ప్రతిషేధన్తి సహసా న యాం హరిహరాదయః
న కించిన్మాత్ర చిన్మాత్రనిష్ఠోఽస్మి స్వస్థ ఆస్థితః. 44

నేను శాంతుఁడను, పరమార్థ స్వరూపుఁడను, చిరకాలమున కిపుడు అహంభావభ్రమను త్యజించి చిదాత్మనై, తద్రూపమున నే స్థితిగల్గియున్నాను. ఎద్దానిని హరిహరాదులైనను శీఘ్రముగ నిషేధింపఁజాలరో, అట్టి చిత్తముయొక్క యేకమార్గమం దధిష్ఠితమైయున్న నిరతిశయానందదశను నేను బొందితిని. అన్యమెద్దానియందునుగాక కేవలము చిన్మాత్రమందే నిష్ఠగల్గి స్వస్వరూపమున సుఖముగ నెలకొనియున్నాను.

భ్రమేణాహం విముక్తోఽస్మి సంసారేణాలిలోచనే
న తుష్టోఽస్మి న ఖిన్నోఽస్మి నాయమస్మి న చేతరత్. 45

కృష్ణనేత్రీ! నేనీసంసారభ్రమనుండి విముక్తుఁడనైతి. నేను సంతుష్టుఁడనుగాను. ఖిన్నుఁడనుగాను; నేను కార్యవర్గమగు దృశ్యమునుగాను, కారణమున్ను గాను.

న స్థూలోఽస్మి న సూక్ష్మోఽస్మి సత్యమస్మి చ సున్దరి
తేజోబిమ్బాత్ప్రయాతేన భిత్త్వావపతితేన చ. 46
క్షయాతిశయముక్తేన ప్రకాశేనాస్మి వై సమః
శాన్తోఽస్మి సామ్యనేతాస్మి స్వస్థోస్మి విగతాశయః. 47

ఓ సుందరీ! నేను స్థూలరూపుఁడనుగాను, సూక్ష్మరూపుఁడనుగాను. సత్య(అబాధిత)రూపుఁడనేయగుదును. సూర్యాదిమండలములనుండి వినిర్గతమై, భిత్తిపై ఆపతితమై, క్షయాతిశయ వర్జితమైనట్టి ప్రకాశమువలె నేను సమరూపుఁడను, శాంతుఁడను, ప్రపంచముయొక్క విషమత్వమును, త్యజించి సామ్యభావమును బొందినవాఁడను, మనోరహితుఁడును నైయున్నాను.

పరినిర్వాణ ఏవాస్మి సదృశోఽస్మి పతివ్రతే
యత్తదస్మి తదేవాస్మి వక్తుం శక్నోమి నేతరత్. 48

ఓ పతివ్రతా! సదా నిర్వాణరూపుఁడనై నేనిపుడు నీవలెను స్థితినొందియున్నాను. నేనేది (బ్రహ్మము) అయియున్నానో, అదియే అయియున్నాను. ఇంతకంటె వేఱేమియుఁజెప్పఁజాలను.

తరఙ్గతరలాపాఙ్గే గురుస్త్వం మే నమోస్తు తే
ప్రసాదేన విశాలాక్ష్యాస్తీర్ణోఽస్మి భవసాగరాత్. 49

తరంగమువలె చంచలమైన అపాంగము (కడకన్ను)గల యోప్రియా! విశాలాక్షీ! నీవు నాగురువు. నీకు నమస్కారము. నీయొక్క యనుగ్రహముచే నేను సంసారసాగరమును దాటితిని.

పునర్మలం న గృహ్ణామి శతధ్మాత సువర్ణవత్
శాన్తః స్వస్థోమ్మృదుర్వ్యక్తో వీతరాగో నిరంశ ధీః. 50
సర్వాతీతః సర్వగశ్చ ఖమివాయమహం స్థితః

అగ్నియందు నూఱుపర్యాయములు పుటమొనర్పఁబడిన బంగారువలె నేనిఁక మాలిన్యము కలిగియుండను. ఇపుడు నేను శాంతుఁడనై, స్వస్థుఁడనై, కోమలుఁడనై, జితేంద్రియుఁడనై, వీతరాగుఁడనై, వాసనారహితమగు బుద్ధిగలవాఁడనై, సర్వాతీతుఁడనై, సర్వవ్యాపినై, ఆకాశమువలె నంతటఁ స్థితినొందియున్నాను.

చూడాలోవాచ: —

ఏవం స్థితే మహాసత్త్వ ప్రాణేశ హృదయప్రియ. 51
కిమిదానీం ప్రభో బ్రూహి రోచతే తే మహామతే

చూడాల: — ఓమహాసత్త్వా! ప్రాణేశా! హృదయప్రియా! మహామతీ! ప్రభూ! అట్లైనచో నిపుడేమి నీకు రుచించుచున్నది?

శిఖిధ్వజ ఉవాచ: —

ప్రతిషేధం నజానామి న జానామ్యభివాఞ్ఛితం. 52
యదాచరసి తన్వి త్వం కదాచిద్వేద్మి తత్తథా
యద్యన్మతం తే సకలం తథాస్త్వవికలం ప్రియే. 53

శిఖిధ్వజుఁడు — ఓసూక్ష్మాంగీ! ప్రియా! నేను ప్రతిషేధమునుగాని, వాంఛితమునుగాని యెఱుఁగను. నీవేది యాచరించుచున్నావో, దానిని సమాధియొక్క వ్యుత్థానకాలమందే యట్లుగనెఱుగుచున్నాను, నీ కెయ్యది యభిమతమో, అదియే పూర్ణరూపముగ నగుఁగాత!

న కించిదనుసంధాతుం జానామ్యమ్బురసున్దరః
యదేవ కించిజ్జానాసి తదేవ కురు సున్దరి. 54

ఓ సుందరీ; నేను సుందరములైన నిర్లేపత్వమునుగాని, ఉదాసీనత్వమునుగాని కొంచెమైనను అనుసంధించుట నెఱుఁగను. నీవేది యెఱుఁగుచున్నావో, అదియే గావింపుము.

తదేవ ధారయిష్యామి ప్రతిబిమ్బం యథా మణిః
చేతసా గలితేష్టేన యథాప్రాప్తమనిన్దితమ్. 55
న స్తౌమి న చ నిన్దామి యదిచ్ఛసి తదాచర

మణి ప్రతిబింబమును గ్రహించునట్లు, ఇచ్ఛారహితమగు చిత్తముచే, అనిందితమగు యథాప్రాప్తవస్తువును నేనుధరించెదను. నేనెవరిని స్తుతించుటలేదు నిందించుటలేదు. కాన, నేనెట్లు తలంతువో యట్లాచరింపుము.

చూడాలోవాచ: —

యద్యేవం తన్మమహాబాహో సమాకర్ణయ మన్మతమ్. 56
ఆకర్ణ్య జీవన్ముక్తాత్మంస్త దేవాహర్తుమర్హసి
సర్వత్రైక్యావబోధేన పరార్థ్యక్షయ భువాన్వితాః. 57
నిరిచ్ఛాస్తావదాకాన్తవిశదాః సంస్థితా వయమ్

యాదృగేషణమస్మాకం తాదృశం తదనేషణమ్. 58
యత్ప్రాణా నైమిషే క్వోఽత్ర చిన్మాత్రోఽభ్యసతే హి కః
తస్మాదాద్యన్తమధ్యేషు యే వయం పురుషోత్తమ. 59
శేషమేకం పరిత్యజ్య త ఏవేమే స్థితా వయమ్
రాజ్యేన సాంప్రతేనేమం కాలం నీత్వా క్రమేణ వై. 60
విదేహతాం ప్రయాస్యామః ప్రభో కాలేన కేనచిత్

చూడాల:— మహాబాహూ! జీవన్ముక్తాత్మా! అజ్ఞానవహో నాయభిమతమును వినుము. వినియారీతిగనే ఆచరింపుము, సర్వత్ర యేకత్వజ్ఞానము గలిగియుండుటచే మనము అజ్ఞానరహితులమై యున్నాము. మఱియు, ఇచ్ఛారహితులమై యాకాశమువలె స్వచ్ఛముగ వెలయుచున్నాము. అట్టిమనకు రాజ్యాది భోగముల అపేక్షయు, అనపేక్షయు రెండును సమానములైయున్నవి. ఏలయనఁగా నేత్రాదీంద్రియములు తమకు తమకు యోగ్యములైన విషయముల సేవించుటచేఁ చిన్మాత్రమగు ఆత్మయందేమి విశేషత్వము గలుగును? మఱియు, ఆసక్తిపూర్వకముగనే తత్త్వజ్ఞాని విషయముల సేవన మభ్యసించును కాన నోపురుషోత్తమా! ఆద్యంతమధ్యములందు మనమే స్వభావముతో గూడియున్నామో, అట్టి స్వభావముచే, శేషించిన ప్రారబ్ధకర్మను ననుభవముద్వారా నశింపఁజేసి వెలయుదము. మఱియు నిపుడు మనకుఁ బ్రాప్తించిన రాజ్యముచే, శేషించిన నాయువును గడపి యొకానొకసమయమున నిరువురము విదేహముక్తిఁబొందెదము.

శిఖిధ్వజ ఉవాచ:—

వయమాద్యన్తమధ్యేషు కీదృశాస్తరలే వద. 61
శేషమేకం పరిత్యజ్య తిష్ఠామః కథమేవ వా

శిఖిధ్వజుఁడు.— ప్రియా! ఆద్యంతమధ్యములందు మన మెట్టి స్వభావముతోఁ గూడియున్నాము? మఱియు, శేషించిన ప్రారబ్ధము ననుభవించి మన మెట్లుందుము! వచింపఁగోరెద.

చూడాలోవాచ: –

వయమాద్యన్తమధ్యేషు రాజానో రాజసత్తమ. 62
మోహమేకం పరిత్యజ్య భవామః పునరేవ తే
స్వ ఏవ నగరే రాజా భవ త్వం స్వాసనే స్థితః. 63
లలామో నను కాన్తానాం మహిషీ తే భవామ్యహమ్
స నృపా మత్తవాస్త్వాస్య నృత్యన్నవనవాఙ్గనా. 64
సపతాకాధ్వనత్తూర్యా పుష్పప్రకరిణీ పురీ
లసద్వల్లాక్షి సమఙ్గార్యా రణత్పుష్పాలిమాలమా
మధుమాసలతాలక్ష్మ్యా చిరాద్భవతు సా సమా. 65

చూడాల:- రాజశ్రేష్ఠా! ఆద్యంతమధ్యములందు మనము రాజులము. మోహమొకదానిని త్యజించి మరల యారాజులమే యగుదము. స్వనగరముననే స్వరాజ్యాసనముపై వెలసి నీవు రాజువు కమ్ము. నేనో, అంతఃపురస్త్రీలందఱిలోను భూషణరూపమై నీయొక్క రాజమహిషి నగుదును. అత్తఱి ప్రభుసహితమగుటచే నగరమతిప్రసన్నమగు ప్రజాగణంబుతోఁ గూడుకొనినదై, నృత్యముచేయు నూతన యుత్తమస్త్రీసహితమై, పతాకములచే శోభితమై, తూర్యనాదములచే ఘోషితమై, పుష్పసమూహములచేతను, లతామంజరులచేతను బరివేష్టితమై, పుష్పములందలి భ్రమరగణముయొక్క శబ్దముచే వ్యాప్తమై, ఇట్లు వసంతకాలముయొక్క శోభతోఁ గూడుకొనినదై చిరకాలమునకు మరల తన పూర్వశోభను బొందఁగలదు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇతి చూడాలయా ప్రోక్తో విహస్య స శిఖిధ్వజః
ప్రోవాచ మధురం వాక్యమక్షుబ్ధం విగతజ్వరః. 66
ఏవం చేత్తద్విశాలాక్షి స్వాయాత్తా నస్త్రివిష్టపే
సిద్ధభోగశ్రియస్తాసు నివసామి న కిం ప్రియే. 67

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! చూడాల యిట్లు వచింప సంతాపరహితుఁడగు యా శిఖిధ్వజుఁడు నవ్వి, క్షోభత్యాగపూర్వకముగ నీమధురవాక్యములఁ బల్కెను:- ఓ విశాలనేత్రీ! ప్రియా! అట్లైనచో మనమిరువురము స్వర్గమందు నివసించుటకుఁగూడ స్వతంత్రులముగదా! ఎచట సిద్ధులగు దేవతల భోగైశ్వర్యములు గలవో, అచటనే వానియందేల వసింపఁగూడదు?

చూడాలోవాచ:—

న రాజ్యమ్మమ భోగేషు వాఞ్ఛా నాపి విభూతిషు
స్వభావస్య వశాదేవ యథాప్రాప్తేన మే స్థితిః. 68

చూడాల:— ఓ రాజా! నాకు భోగములందుగాని, ప్రాపంచికవిభూతులందుగాని కోర్కె లేదు. స్వభావవశమున యథాప్రాప్తమగు వస్తువునందే నాయొక్క స్థితిగలదు.

న సుఖాయ మమ స్వర్గో న రాజ్యం నాపి చ క్రియా
యథాస్థితమవిక్షుబ్ధా తిష్ఠామి స్వస్థచేష్టయా. 69

స్వర్గముగాని, రాజ్యముగాని క్రియగాని నాకు సుఖమును గలిగింపఁజాలవు. కాన క్షోభలేనిదాననై, స్వస్థచిత్తముతో యథారీతి స్థితిగల్గియున్నాను.

ఇదం సుఖమిదం నేతి మిథునే క్షయమాగతే
సమమేవ పదే శాన్తే తిష్ఠామీహ యథాసుఖమ్. 70

'ఇది సుఖము, ఇది సుఖముకాద'ను ఈ ద్వంద్వము నాకు నశించిపోయినది. ఇపుడు సమరూపముతోఁటి శాంతపదమున సుఖముగ వసించుచున్నాను.

శిఖిధ్వజ ఉవాచ:—

యుక్తముక్తం విశాలాక్షి త్వయైతత్సమయా ధియా

కో వార్థః కిల రాజ్యస్య గ్రహే త్యాగేఽపి వా భవేత్, 71

శిఖిధ్వజుఁడు:—విశాలనేత్రివగు ప్రియా! నీవు సమబుద్ధితోఁటి యోగ్యముగ వచించితివి. మనకు రాజ్యమును గ్రహించుటచేగాని, త్యజించుటచేగాని యేమి ప్రయోజనము?

సుఖదుఃఖదశాచిన్తాం త్యక్త్వా విగతమత్సరమ్
యథా సంస్థానమేవేమౌ తిష్ఠావః స్వస్థతాం గతౌ. 72

సుఖదుఃఖదశలఁ గూర్చిన చింతనను వదలి, మాత్సర్య రహితులమై, స్వస్థతనుబొంది, యథా రీతి స్థితిగల్గియుండెదము.

ఇతి తత్ర కథాలాపకథనేన తయోర్ద్వయోః
కాన్తయోశ్చిరదంపత్యోర్వ్యాసరస్తనుతాం యయౌ. 73

ఓ రామచంద్రా! ఇట్టి వార్తాలాపముచే నా ప్రియదంపతు లిర్వురికిని నా పగలంతయు గడచిపోయెను.

అథోత్థాయ దినాచారం యథాప్రాప్తమనిన్దితౌ
సోత్కణ్ఠావప్యనుత్కణ్ఠౌ చక్రతుః కార్యకోవిదౌ. 74

తదుపరి, కార్యకుశలురును, భోగములందు మిగుల యుత్కంఠత గలవారైనను వాసనా రహితులగుటచే నుత్కంఠారహితులునగు వారిరువురు లేచి సాయంసంధ్య నాచరించిరి.

స్వర్గసిద్ధమనాదృత్య తస్థతుః పూర్ణచేతసౌ
ఏకస్మిన్నేవ శయనే తైస్తైః ప్రణయచేష్టితైః
సా వ్యతీయాయ రజనీ తయోర్జీవద్విముక్తయోః. 75

స్వర్గసిద్ధిని నిరాదరించి, పూర్ణచిత్తులై, ఒకేశయ్యపై ఆయా ప్రణయచేష్టలతోఁ గూడుకొని యున్నవారైన జీవన్ముక్తులగు వారిర్వురికిని నాఁరేయి గడచిపోయెను.

తద్భోగమోక్షసుఖముత్తమయోః స్వయం స
మాశంసతోః ప్రణయవాక్యవిలాసగర్భమ్
ఉత్కణ్ఠతాం ప్రణయినోర్ధియమానయన్తీ
దీర్ఘా ముహూర్తవదసౌ రజనీ జగామ. 76

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే చూ॥ చూడాలాప్రకటీకరణం నామ

నవాధికశతతమః సర్గః ॥ 109 ॥

ప్రణయవాక్య విలాసముచేఁ బూర్ణులై, అనుభూతమైన భోగ, మోక్షసుఖమును వర్ణించుకొనుచున్నట్టి వారియొక్క బుద్ధిని ఉత్కంఠాయుతముగఁ గావించుచు, దీర్ఘమైనను నాఁటి రాత్రి యొకముహూర్తమువలెనే గడచిపోయెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
చూడాలోపాఖ్యానమున చూడాలా ప్రకటీకరణమను
నూటతొమ్మిదవ సర్గము ॥ 109 ॥

---

దశాధికశతతమః సర్గః

[సహ సంకల్పసైన్యేన గజేన స్వపురం గతౌ
తౌ కృత్వా సుచిరం రాజ్యం విముక్తావితి వర్ణ్యతే.

సంకల్పసేనతోను, ఏనుఁగులతోను ఇరువురును స్వనగరమునకుఁ బోవుట, చిరకాలము రాజ్యముచేసి విదేహముక్తులగుట యిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

తతః సముదితే సూర్యే వితమస్యమ్బరే స్థితే
సముద్గకాదివ జగన్మణౌ తస్మిన్వినిర్గతే. 1
వికసత్యరుణో పాన్తే చక్షుషీవామ్బుజాకరే
ఆచరేష్వివ లోకేషు ప్రసృతేష్వర్కరశ్మిషు. 2
దంపతీ తౌ సముత్థాయ కృతసంధ్యాక్రమౌ స్థితౌ
పత్రాసనే మృదుస్నిగ్ధే కాన్తౌ కాఞ్చనకన్దరే. 3

శ్రీ వశిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఆ రాత్రి గడచినమీఁదట, పేటికనుండి మణివలె జగన్మణియగు సూర్యభగవానుడు వినిర్గతుడుకాఁగా నాకప మంధకారరహితమయ్యెను. మఱియు, రక్తవర్ణ నేత్రములవలె కమలవనము వికసించెను. అత్తటి జగత్తునందలి ప్రాణికోట్లు, కర్మములందెట్లు ప్రవృత్తులైరో, అట్లు సూర్యకిరణములున్ను నంతటఁ బ్రసరింప నపుడాదంపతులిరువురును లేచి ప్రాతః కాల సంధ్యాక్రమమును నిర్వర్తించి, సువర్ణగుహయందుఁ బత్రములచే నిర్మితమైన కోమల స్నిగ్ధ యాసనముపైఁ గూర్చుండిరి.

అథోత్థాయాత్ర చూడాలా రత్నకుమ్భం పురఃస్థితమ్
కాన్తా సంకల్పయామాస పూర్ణం సప్తాబ్ధివారిభిః. 4
తేన మఙ్గలకుమ్భేన తం పూర్వాభిముఖం స్థితమ్
భార్యా భర్తారమేకాన్తే స్వరాజ్యేఽభిషిషేచ సా. 5
సంకల్పోపగతే హైమే స్వభిషిక్తం స్వవిష్టరే
స్థితం ప్రోవాచ తన్వీ సా చూడాలా దేవరూపిణీ. 6
కేవలం మానముత్సృజ్య తేజః శాన్తమిదం ప్రభో
అష్టానాం లోకపాలానాం తేజస్త్వం భర్తుమర్హసి. 7

చూడాలయేతి సంప్రోక్తో వనే రాజా శిఖిధ్వజః
వదన్నేవం కరోమీతి మహారాజత్వమాయయా. 8

పిదప రాజుయొక్క ప్రియపత్నియగు చూడాల తనయెదుటనున్న రత్నకుంభము సప్తసముద్రముల జలముచేఁ బూర్ణమగునట్లు సంకల్పించెను. అట్లాజలపూరిత ఘటముచే నామె పూర్వాభిముఖుఁడై యున్న తనభర్తను, ప్రియమగు స్వరాజ్యమున నభిషేకమొనర్చెను. అంత, సంకల్పముచే ప్రాప్తించిన సువర్ణసింహాసనముపైఁ గూర్చుండిన పూర్ణాభిషిక్తుఁడగు రాజుతోటి నూత్నాంగియు, దేవరూపిణియునగు చూడాల యిట్లు పలికెను – 'ప్రభూ! మునులకు యోగ్యమగు శాంత తేజమును వదలి, శాసించుటకు యోగ్యమైన యింద్రాద్యష్టలోకపాలకుల తేజస్సును నీవిపుడు ధరింపవలసియున్నది'– ఆ వాక్యములవిని వనమందున్న రాజగు శిఖిధ్వజుఁడు 'అట్లే గావించెదన'ని వచించి యమ్మహారాజపదవినిదాల్చెను.

అథ ప్రతీహారపదే తిష్ఠన్తీమాహ మానినీమ్
అద్య దేవీపదే రాజ్ఞీం త్వాం కరోమ్యభిషేకినీమ్. 9
ఇత్యుక్త్వా సరసి స్నాప్య మహాదేవీపదే తథా
అభిషిక్తాం నృపః కృత్వా స తామాహ నిజాం ప్రియామ్. 10
ప్రియే కమలపత్రాక్షి క్షణాత్సంకల్పసంభవమ్
మహావిభవముద్దామ సైన్యమాహర్తుమర్హసి. 11
ఇతి కాన్తవచః శ్రుత్వా చూడాలా వరవర్ణినీ
సైన్యం సంకల్పయామాస ప్రావృడ్ఘనమివోద్భటమ్. 12

పిమ్మట ద్వారపాలుని స్థానమున వినయముగ నున్నట్టి మానినియగు తనప్రియతోటి రాజిట్లు పలికెను – ప్రియా! నేఁడు నిన్ను రాజ్యమందభిషిక్తమొనర్చి మహారాణిపదమున స్థాపించెదను – అనిచెప్పి తటాకమున స్నానమాచరించి మహాదేవీపదమున తన ప్రియనభిషిక్తగఁజేసి యిట్లు డిగెను – 'కమలపత్రములవంటి నేత్రములుగల యో ప్రియా! క్షణకాలములో నీ సత్యసంకల్పముల ద్వారా వైభవయుతమగు గొప్పసేన నుత్పన్నముగావింపవలసినది' – ఉత్తమవర్ణముగల చూడాల పతియొక్క యావాక్యములవిని, వర్షర్తువు గొప్పమేఘమును సంకల్పించునట్లు, గొప్పసేననుగూర్చిన సంకల్పము గావించెను.

సైన్యం దదృశతుస్తత్ర వాజివారణ సంకులమ్
పతాకాపూరితాకాశం నీరన్ధ్రీకృతకాననమ్. 13
తూర్యారవధ్వనచ్ఛైలగుహాగహన కోటరమ్
మాలిరత్నమహోద్యోతవిచ్ఛూర్ణిత తమఃపటమ్. 14
తత్ర గన్ధద్విపవరే కృతపార్థివమణ్డపే
రక్షితే హృష్టసామన్తైరారూఢౌ నృపదంపతీ. 15

తతః శిఖిధ్వజో రాజా మహిష్యా సమమిష్టయా
పదాతిరథసంబాధం కర్షన్నతిబలో బలమ్. 16
చచాలాచలచాలిన్యా సేనయా స తతో వనాత్
భిన్దన్నివ రసాశైలం వాత్యయేవాశు భ్రామయా. 17

తదనంతరము, ఏనుఁగులచేతను, గుఱ్ఱములచేతను వ్యాప్తమై, పతాకములచే నాకాశమును బూర్ణమొనర్చునదై వనమును అవకాశరహితముగాఁ గావించునదై, తూర్యాదుల ప్రతిధ్వనులచేఁ బర్వతములయొక్కయు, గుహలయొక్కయు గహనకోటరములను శబ్దితములుగనొనర్చునదై, మకుటములందలి రత్నప్రకాశముచే అంధకారమును నశింపఁజేయునదైనట్టి గొప్పసేనను వారిరువురును గాంచిరి. రాజసమూహము గల్గియున్న యాసేనయందు, ప్రసన్నసామంతులచేఁ బరిరక్షింపఁబడియున్న మదగంధయుక్తమగు శ్రేష్ఠగజము నాదంపతు లపుడధిరోహించిరి. తదుపరి మహాబలశాలియగు శిఖిధ్వజనృపాలుఁడు తన ప్రియురాలగు రాణితోఁగూడ, కాల్బలము రథాదులతోఁగూడిన గొప్పసేన వెంట వచ్చుచుండ, పర్వతమువలె నేగుచున్న యా సేనతో పోవుచు భూమినుండి బయల్వెడలిన వాయువువలె పర్వతముల భేదించుకొని చనుచు శీఘ్రముగ నవ్వనమునుండి పయనమైపోయెను.

తస్మాన్మహేన్ద్రశైలేన్ద్రాచ్చలితః స మహీపతిః
పథి పశ్యన్గిరీన్దేశాన్నదీర్గ్రామాన్సజఙ్గలాన్. 18
దర్శయన్స్వప్రియాయా యాః స్వమాత్మవృత్తాన్తసంచయమ్
ప్రాగల్పేనైవ కాలేన స్వాం పురీం సర్వశోభనామ్. 19
తత్ర తే తస్య సామన్తాః సదాగమనమాదృతాః
వివిదుర్జయశబ్దేన నిర్జగ్ముశ్చోదితాశయాః. 20
ఏకతాం సంప్రయాతేన తారతూర్యనినాదినా
బలద్వయేన తేనాసౌ వివేశ నగరం నృపః. 21
లాజపుష్పాఞ్జలివ్రాతైరావృష్టః పౌరయోషితామ్
వణిక్మార్గమసౌ పశ్యన్పురం పరమనుత్తమమ్. 22
పతాకాధ్వజసంబాధం ముక్తాజాలమనోరమమ్
నృత్యగేయపరస్త్రీకం స్వభూమావచలస్థితమ్. 23
ప్రవిశ్యాథ గృహం తైస్తైః సంయుతం నృపమఙ్గలైః
సమ్యక్సమ్మానయామాస ప్రణతం ప్రకృతివ్రజమ్. 24

అట్లారాజు మహేంద్రపర్వతమునుండి యేగుచు మార్గమున పర్వతములను, దేశములను, నదులను, వనసహితములగు గ్రామములను జూచుచుఁబోయెను. రాజ్యమునుండి బయలుదేఱునాఁటి తన పూర్వవృత్తాంతము లట రాజు తనప్రియురాలికిఁ జూపుచు, స్వర్గమువలె శోభాయమానమైనట్టి తనపురమును అల్పకాలముననే చేరెను. జయజయ ధ్వనులవలన రాజుయొక్క యాగమమును దూరముననుండియే యెఱిఁగి, అతని మంత్రులున్ను, సామంతులున్ను ప్రసన్నులై, ఉత్కంఠతోఁ గూడినవారై

యాతనిని సన్మానించుటకై పురమునుండి బయలుదేరిరి. తూర్యాదుల యున్నతశబ్దములచే నేకత్వమును బొందిన యా యిరుసేనలతోఁగూడ రాజపుడు నగరమును బ్రవేశించెను. పురస్త్రీలచేఁ జల్లఁబడిన లాజల(పేలాల)తోటిన్ని, పుష్పాంజలులతోటిన్ని గప్పఁబడిన యారాజు ఉత్తరోత్తరమున నత్యుత్తమమగు వ్యాపారుల మార్గము నవలోకించుచు, బోయెను. పిదప అతఁడు పతాకములచేతను, ధ్వజములచేతను వ్యాప్తమై, ముత్యముల సమూహములచే మనోహరమై, ఉత్తమస్త్రీలనృత్యగానములచేఁ బూర్ణమై, స్వభూమిపైఁ గైలాసమువలె నున్నతముగనున్నదై, ఆ యా రాజయోగ్యములగు మంగళములతోఁగూడియున్నదైన తన రాజభవనమును బ్రవేశించి, నమ్రులై యున్న మంత్ర్యాది ప్రధానగణంబును బాగుగ సన్మానించెను.

పురోత్సవం భృశం కృత్వా దినసప్తకముత్తమం
అకరోద్రాజ్యకార్యాణి స్వాని స్వాన్తఃపురే నృపః. 25
దశవర్షసహస్రాణి రాజ్యం కృత్వా మహీతలే
సహచూడాలయా రామ విరతో దేహధారణాత్. 26
దేహముత్సృజ్య నిర్వాణమస్నేహ ఇవ దీపకః
అపునర్జన్మనే రామ జగామేతి మహామతిః. 27
దశవర్షసహస్రాణి నమదృష్టి తయాతయా
రాజ్యం తయా రమయ్యాపి నిర్వాణం పదమాప్తవాన్. 28

ఓ రామచంద్రా! ఏడు దినములవఱకు నగరమున గొప్పయుత్సవము గావించి యా రాజ రాజుకార్యములను, అంతఃపురమునందు స్వాభిమతములగు కార్యములను జేసెను. పిమ్మట, పదివేల సంవత్సరములు భూమండలముపై రాజ్యమేలి, చూడాలతో సహా తనదేహధారణమున విరక్తుఁడయ్యెను. అపుడు దేహమును త్యజించి యామహామతి మరల జన్మింపకుండుటకొఱకై, తైలములేని దీపమువలె, నిర్వాణప్రాప్తినొందెను. అట్లు పదివేల సంవత్సరములవఱకు సమదృష్టిచే రాజ్యమును బాలించి, చూడాలతో సహాక్రీడించియాతఁడు నిర్వాణపదమును బొందెను.

విగత భయవిషాదో మానమాత్సర్యముక్తః
ప్రకృతసహజకర్మా ముక్తనీరాగబుద్ధిః
ఇతి సమసమదృష్టిర్మృత్యుమార్గోఽథ జిత్వా
దశశిశిర సహస్రాణ్యేకరాజ్యం చకార. 29

ఓ రామచంద్రా! భయ, విషాద, అభిమాన, మాత్సర్యరహితుఁడై ప్రాప్తించిన సహజకర్మల జేయుచు, రాగవర్జితమగు బుద్ధిగలవాఁడై, సములకంటెను నధికసమబుద్ధితోఁగూడియుండి, ఆర్యుఁడగు యాశిఖిధ్వజరాజు మృత్యువును జయించి జంబూద్వీపమునఁ బదివేలవత్సరములు రాజ్యముచేసెను.

భుక్త్వా భోగాననేకాన్భువి సకలమహీపాల చూడామణిత్వే
స్థిత్వా వై దీర్ఘకాలం పరమమృతపదం ప్రాప్తవాన్సత్వశేషః
ఏవం రామాగతం త్వం ప్రకృతమనుసరన్కార్యజాతం విశోక
స్తిష్ఠ తిష్ఠ స్వయం వా ప్రసభమనుభవన్భోగమోక్షాదిలక్ష్మీః. 30

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే చూ॥ శిఖిధ్వజనిర్వాణం నామ దశోత్తరశతతమః సర్గః 110 ॥

శిఖిధ్వజనృపాలుఁడు దీర్ఘకాలమువఱకు మహీపాలురయొక్క చూడామణిపదమునఁ బ్రతిష్ఠితుఁడై, అనేకభోగముల ననుభవించి, సన్మాత్రమే శేషించియున్నవాఁడై, పరమమగు అమృతపదమును బొందెను. ఓ రామచంద్రా! నీవున్ను అదేప్రకారము యథాప్రాప్తమగు కార్యసమూహము నాచరించుచు, సమాధియందు స్థిరుఁడవై యుండుము. లేక స్వయముగ భోగమోక్షజ్ఞానాద్యైశ్వర్యమును బాగుగ ననుభవించుచు వ్యవహారమందైన నుండుము. (సమాధివ్యుత్థానములందు నీకు ఫలభేదము లేదని భావము)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున చూడాలోపాఖ్యానమున శిఖిధ్వజనిర్వాణమను నూటపదియవ సర్గము 110॥
చూడాలోపాఖ్యానము సమాప్తము.

---

## ఏకాదశాధికశతతమః సర్గః

[రాజ్ఞ్యా రాజేవ పిత్రాత్ర సర్వస్వం త్యాజితః కచః
అన్తేఽహంకారసంత్యాగాత్పూర్ణోఽభూదితి వర్ణ్యతే.

చూడాల రాజుచే సమస్తము త్యాగము చేయింపఁజేసినట్లు, కచుని తండ్రి కచునిచే సమస్తము త్యాగమొనర్పఁజేయుటయు, తుదకు అహంకారమునుగూడఁ ద్యజించి కచుఁడు పూర్ణరూపుఁడగుటయు నిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతత్తే సర్వమాఖ్యాతం శిఖిధ్వజకథానకం
అనేన గచ్ఛన్మార్గేణ న కదాచన ఖిద్యసే. 1

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! ఇవ్విధమున శిఖిధ్వజుని కథయంతయు సంపూర్ణముగ నీకు వచించితిని. ఇట్టిమార్గమునఁ బోయినచో నీవెపుడును ఖిన్నుఁడవుకానేరవు.

ఏతాం దృష్టిమవష్టభ్య రాగద్వేష వినాశినీం
నిత్యం నీరాగయా బుద్ధ్యా తిష్ఠావష్టభ్యతత్పరః. 2

రాగద్వేషవినాశినియగు యిట్టి దృష్టి నవలంబించి, రాగరహితబుద్ధిచే నీవు నిత్యము పూర్ణానందపదమున దృఢముగ నెలకొనియుండుము.

యథా శిఖిధ్వజో రాజ్యం కృతవానేవమీదృశమ్
రామ వ్యవహరన్రాజ్యే భోగమోక్షమయో భవ. 3

ఓరామచంద్రా! శిఖిధ్వజుఁడు రాజ్యమెట్లు చేసెనో, అట్లే నీవున్ను వ్యవహారమాచరించుచు భోగ మోక్షములచేఁ బూర్ణుఁడవు కమ్ము.

శిఖిధ్వజక్రమేణైవ యథా బోధమవాప్తవాన్
కచో బృహస్పతేః పుత్రస్తథా బుధ్యస్వ రాఘవ. 4

ఓ రాఘవా! శిఖిధ్వజునివలెనే బృహస్పతికొమరుఁడగు కచుఁడెట్లు జ్ఞానమును బొందెనో అట్లే నీవున్ను జ్ఞానయుక్తుఁడవు కమ్ము.

శ్రీరామ ఉవాచ:—

బృహస్పతేర్భగవతః పుత్రోఽసౌ భగవాన్కచః
యథా ప్రబుద్ధో భగవన్సమాసేన తథా వద. 5

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! భగవంతుఁడగు బృహస్పతియొక్క పుత్రుఁడెట్లు జ్ఞానము నొందెనో, ఆవిషయము నాకు సంక్షేపముగఁ దెలియఁజేయవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

శృణు రాజన్కథాం శ్రీమాఞ్ఛిఖిధ్వజవదేవ సః
ప్రబోధం పరమం యాతో దేవదేశికజః కచః. 6

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! శిఖిధ్వజునివలెనే దేవగురుపుత్రుఁడగు శ్రీమంతుఁడైన కచుఁడెట్లు పరమ జ్ఞానయుక్తుఁడాయెనో, ఆ కథను నీవు వినుము.

బాలభావాత్సముత్తీర్ణః సంసారోత్తరణోన్ముఖః
కచః పదపదార్థజ్ఞో బృహస్పతిమభాషత. 7

బాల్యావస్థను దాటి యౌవనమున, ప్రవేశించిన వెంటనే సర్వవిద్యాప్రవీణుఁడగు కచుఁడు సంసారమును దరింప నుద్దేశ్యముతో (తన తండ్రియగు) బృహస్పతినిగూర్చి యిట్లుపలికెను—

కచ ఉవాచ:—

భగవన్సర్వధర్మజ్ఞ కథం సంసృతిపఞ్జరాత్
అస్మాన్నిర్గమ్యతే బ్రూహి జన్తునా జీవతన్తునా. 8

సర్వధర్మజ్ఞుఁడవగు మహాత్మా! జీవితమను తంతువుచే బంధింపఁబడినట్టి జీవుఁడీ సంసారపంజరమునుండి యెట్లు వినిర్గతుఁడగునో వచింపుఁడు?

బృహస్పతి రువాచ:—

అనర్థమకరాగారాదస్మాత్సంసారసాగరాత్
ఉడ్డీయతే నిరుద్వేగం సర్వత్యాగేన పుత్రక. 9

బృహస్పతి:— కుమారా! అనర్థములను మొసళ్లకు ఆటపట్టైన యీ సంసారసాగరము సర్వత్యాగముచే నిర్భయముగ దాఁటఁబడును.

శ్రీ వసిష్ఠ ఉవాచ: —

ఇత్యాకర్ణ్య కచో వాక్యం పితుః పరమపావనమ్
సర్వమేవ పరిత్యజ్య జగామైకాన్తకాననమ్. 10

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! తన తండ్రి నుండి యా పరమపవిత్రమగు వాక్యమును విని కచుఁడు సమస్తమును బరిత్యజించి యేకాంతవనమునకు బోయెను.

బృహస్పతేస్తద్గమనం నోద్వేగాయ బభూవ హ
సంయోగే చ వియోగే చ మహాన్తో హి మహాశయాః. 11

పుత్రుఁడఱ్లేఁగుటచే బృహస్పతికి దుఃఖము కలుగలేదు. ఏలయనఁగా. సంయోగ, వియోగములందు మహాత్ములు మేరువువలె స్థిరబుద్ధి గలిగియుందురు.

అథ వర్షేషు జాతేషు త్రిషు పఞ్చసు సోఽనఘ
పునః ప్రాప మహారణ్యే కస్మింశ్చిత్పితరం కచః. 12

పాపరహితుఁడవగు రామచంద్రా! అటుపిమ్మట నెనిమిదివత్సరములు గడచిన తరువాత యొకానొక మహారణ్యమునఁ గచుఁడు తన తండ్రిని గలిసికొనెను.

పరిపూజ్యాభివాద్యైనం సమాలిఙ్గిత పుత్రకమ్
అపృచ్ఛద్వాక్పతిం భూయః స కచః కాన్తయా గిరా. 13

కచుఁడాతనికిఁ బూజాప్రణామాదులఁ గావించినపిదప తండ్రి యా తన పుత్రునిఁ గౌగలించుకొనెను, తిరిగి మనోహరమైన వాక్కుతోఁ గచుఁడు బృహస్పతి నిట్లడిగెను—

కచ ఉవాచ: —

అద్యేదమష్టమం వర్షం సర్వత్యాగః కృతో మయా
తథాపి తాత విశ్రాన్తిం నాధిగచ్ఛామ్యనిన్దితామ్. 14

కచుఁడు:— పూజ్యుఁడవగు తండ్రీ! నేను సర్వత్యాగ మాచరించి నేఁటికి నెనిమిది వత్సరములు గడచినవి. కాని అనిందితమగు విశ్రాంతిని నేనింకను బడయకున్నాను.

శ్రీ వసిష్ఠ ఉవాచ: —

ఏవమార్తవచస్తస్మిన్కచే వదతి కాననే
సర్వమేవ త్యజేత్యుక్త్వా వాక్పతిర్దివముద్యయౌ. 15

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! పుత్రుఁడిట్టి దీనవచనములఁ బల్కు సమస్తము త్యజింపుమని చెప్పి బృహస్పతి స్వర్గమునకు వెడలిపోయెను.

గతే తస్మిన్కచో దేహాద్వల్కలాద్యప్యథాత్యజత్
గతేన్ద్వర్కతారేణ శరద్వ్యోమ్నా సమోఽభవత్. 16

బృహస్పతి వెడలినమీఁదట, కచుఁడు చీరవల్కలాదులఁగూడ ద్యజించి, సూర్యోదయసమయమున చంద్ర నక్షత్రగణరహితమై వెలయు శరత్కాలాకాశమువలె నాయెను.

పునర్వర్షత్రయేనైష కస్మింశ్చిత్కాననాన్తరే
తత్యాజామ్బుదవర్షాది శరదీవ నభస్తలమ్. 17

మరల మూఁడు సంవత్సరముల పిమ్మట గచుఁడు మఱియొకవనమున యొకానొక కొండ గుహనాశ్రయించి, శరత్కాలాకాశమువలె మేఘవర్షాదులఁ ద్యజించెను.

ఉషాన్సెక్లో దిగన్తేషు శాన్తశూన్యవపుః శ్వసన్
దూయమానమనాః ప్రాప తమేవ పితరం గురుమ్. 18

అశ్లేకాంతమున దిగంతములందు దిగంబరుఁడై వసించుచు ఖిన్నచిత్తుఁడై యుండ నప్పుడచట మరల ఆతఁడుతన తండ్రియగు గురువును బొందెను.

కృతపూజాక్రమో భక్త్యా సమాలిఙ్గితపుత్రకమ్
అపృచ్ఛత్స కచో భూయః ఖేదగద్గదయా గిరా. 19

భక్తిపూర్వకముగఁ బూజాక్రమమును గావించిన పుత్రునిఁ దండ్రి కౌఁగలించుకొన నంత కచుఁడు ఖేదయుక్తుఁడై గద్గదస్వరముతో మరల ఆతని నిట్లడిగెను-

కచ ఉవాచ;—

తాత సర్వం పరిత్యక్తం కన్థాం వేఃఖలతాద్యపి
తథాపి నాస్తి విశ్రాన్తిః స్వపదే కింకరోమ్యహం. 20

కచుఁడు:-తండ్రీ! నేను నాబొంత, దండము, మున్నగువానితో సహాసమస్తమును బరిత్యజించితిని. అయినను, ఆత్మపదమున నాకింకను విశ్రాంతి కలుగలేదు. ఏమి చేయుదును.

బృహస్పతిరువాచ:—

చిత్తంసర్వమితిప్రాహుస్తత్త్యక్త్వా పుత్ర రాజసే
చిత్తత్యాగం విదుః సర్వత్యాగం సర్వవిదో జనాః. 21

బృహస్పతి:- కుమారా! చిత్తమే సమస్తమని వచించుచున్నారు. అద్దానిని ద్యజించి శోభితుఁడవగుము. ఏలయనఁగా, చిత్తత్యాగమునే సర్వవేత్తలగు జనులు సర్వత్యాగమని యెఱుఁగుదురు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా బాక్పతిః పుత్రం పుప్లువే తరసా నభః
అన్విష్యేమ కచశ్చిత్తం పరిత్యక్తుమఖిన్నధీః. 22

శ్రీవసిష్ఠుఁడు- ఓ రామచంద్రా! ఇట్లు పలికి బృహస్పతి వేగముగ నాకాశమున నెగిరి పోయెను. పిమ్మట, కచుఁడు ఖేదరహితమగు బుద్ధిగలవాఁడై చిత్తత్యాగమునకై యుపాయమును వెతుకసాగెను.

చిన్తయన్నప్యసౌ చిత్తం న యదా వేద కాననే
తదా సంచిన్తయామాస ధియైవ పితరం యయౌ. 23

అవ్వనమున చిత్తమునుగూర్చి చింతనచేయుచు నెపుడద్దాని నెఱుంగజాలకుండెనో, అపుడా తఁడు తనబుద్ధిచే దండ్రినిగూర్చి చింతించెను.

పదార్థవృన్దం దేహాది న చిత్తమితి కథ్యతే
తదేతత్కిం క్వవా వ్యర్థం నిరాగస్కం త్యజామ్యహమ్. 24

పదార్థసమూహమగు యీదేహాదులను చిత్తమని చెప్పరు. అట్లైన వ్యర్థముగ ఈరాగరహిత మగు దేహాదుల నేల త్యజింతును?

పితుః సకాశం గచ్ఛామి జ్ఞాతుం చిత్తం మహారిపుమ్
జ్ఞాత్వా తత్సంత్యజామ్యాశు తత్ర స్థాస్యామి విజ్వరః. 25

మహాశత్రువగు చిత్తమునుగూర్చి యెఱుంగుటకొఱకై నేను దండ్రివద్దకుఁ బోవుదును. దాని నెఱిఁగి శీఘ్రముగ నద్దానిని ద్యజించి వెచి సంతాపరహితుఁడనైయుండెదను.

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఇతిసంచిన్త్య స కచ ఉజ్జగామ త్రివిష్టపమ్
వాక్పతిం ప్రాప్య సస్నేహం వవన్దే ప్రణనామ చ. 26

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు విచారించి కచుఁడు స్వర్గమునకుఁజని స్నేహ పూర్వకముగ తనతండ్రికి వందన మాచరించెను.

అపృచ్ఛచ్చైనమేకాన్తే కిం చిత్తం భగవన్వద
స్వరూపం బ్రూహి చిత్తస్య యేన తత్సంత్యజామ్యహమ్. 27

మఱియు నేకాంతమునఁ దండ్రి నిట్లడిగెను—మహాత్మా! చిత్తముయొక్క స్వరూపమే దియో వచింపుడు? దానిఁదెలిసికొని నేనద్దానిని ద్యజింతును.

బృహస్పతిరువాచః—

చిత్తం నిజమహంకారం విదుశ్చిత్తవిదో జనాః.
అన్తర్యోఽయమహం భావో జన్తోస్తచ్చిత్తముచ్యతే. 28

బృహస్పతి:— పుత్రకా! మనుజునకు తన అహంకారమే చిత్తమని చిత్తజ్ఞులు పలుకుదురు. జీవుని అంతరమున నే యహంభావముగలదో, అదియే చిత్తమని పేర్కొనఁబడును.

కచఉవాచః—

త్రయ సింశన్మహాకోటిప్రమాణస్య మహామతే
గురో గీర్వాణవృన్దస్య కథమేతద్వదేతి మే. 29

కచుఁడు:— ముప్పదిమూఁడు కోట్ల దేవతలసమూహమునకు గురువగు నో మహామతీ! ఈ యహంభావము చిత్తమెట్లుగునో వచింపవేడెద.

> మన్యేఽస్య దుష్కరత్యాగో న సిద్ధిముపగచ్ఛతి
> కథమేవ కిల త్యక్తుం శక్యతే యోగినాం వర. 30

యోగివర్యా! నాదృష్టియం దిద్దానిత్యాగము దుష్కరముగనే కన్పట్టుచున్నది. అట్టిత్యాగము సిద్ధింపఁబడఁజాలకున్నది. కాన నీయహంకార మెట్లు త్యజింపఁబడునో తెలుపప్రార్థన.

బృహస్పతి రువాచ:—

> అపి పుష్పావదలనాదపి లోచనమీలనాత్
> సుకరోఽహంకృతేస్త్యాగో న క్లేశోఽత్ర మనాగపి. 31

బృహస్పతి.— కుమారా! (నిజమే దాని సాక్షి నెఱుఁగనిచో నద్దానిఁ ద్యజించుట కష్టతరమే. కాని, సాక్షి నెఱిఁగినచో) పూవును నలుపుటకంటెను. కనుమూయుటకంటెను అహంకారమును ద్యజించుట చాల సులభమేయగును ఇందొకింతైనను కష్టములేదు.

> యథైతదేవం తనయ తథా శృణు వదామి తే
> అజ్ఞానమాత్రసంసిద్ధం వస్తు జ్ఞానేన నశ్యతి. 32

పుత్రా! అది యెట్లగునో చెప్పెద వినుము— సాక్షియగు ఆత్మను గూర్చిన అజ్ఞానమాత్రముచే నేవస్తువు (అహంకారాదులు) సిద్ధించుచున్నదో, అది తదాత్మజ్ఞానమాత్రముచే నశించుచున్నది.

> వస్తుతో నాస్త్యహంకారః పుత్ర మిథ్యా భ్రమో యథా
> అసన్నన్నివ సంపన్నో బాలవేతాలవద్ధ్రితః. 33

కుమారా! మిథ్యయగు భ్రమవలె, అహంకారము యథార్థముగ లేనిదేయగును. బాలుని బుద్ధియందు బేతాళమువలె నిది అసత్తైనను సత్తువలె సంపన్నమై వెలయుచున్నది.

> యథా రజ్జ్వాం భుజంగత్వం మరావమ్బుమతిర్యథా
> మిథ్యైవభాసః స్ఫురతి తథా మిథ్యైవ్యహంకృతిః 34

రజ్జువునందు సర్పత్వమున్ను, మరుభూమియందు జలబుద్ధియు, మిథ్యాభాసమైనను నెట్లు స్ఫురించుచున్నవో, అట్లే అహంకారమున్ను మిథ్యయైనను స్ఫురించుచున్నది.

> అసదేవ యథా ద్విత్వం మోహాదిన్దౌ విలోక్యతే
> తథా స్ఫురత్యహంకారో న సత్యో వాప్యసన్న చ. 35

చంద్రునియందు ద్విత్వమసత్యమైనను నజ్ఞానముచే నెట్లు గాంచబడుచున్నదో, అట్లే సత్తుగాని అసత్తుగానికాని అహంకారమున్ను గాంచఁబడుచున్నది.

> ఏకమాద్యన్తరహితం చిన్మాత్రమమలాన్తరం
> ఖాదప్యతితరామచ్ఛం విద్యతే సర్వవేదనమ్. 36

ఏకమై, ఆద్యంతరహితమై, ఆకాశముకంటె నతిస్వచ్ఛమై, సర్వుల కనుభవరూపమై అత్యంతనిర్మలమైనట్టి చిన్మాత్రమగు ఆత్మయొకటియే సత్యమై వెలయుచున్నది.

సర్వత్ర సర్వదా సర్వప్రకాశం సర్వజన్తుషు
తదేవైకం కచత్యమ్బు విలోలాస్వబ్ధివీచిషు. 37

సర్వత్ర, సర్వదా, సర్వజీవులందును ప్రకాశరూపమై, ఆ యాత్మయొకటియే చంచల సముద్రతరంగములందు జలమువలె – స్ఫురించుచున్నది.

అత్ర కోఽయమహంభావః కుతో వా కథముత్థితః
క్వాప్సు జాతో రజోరాశిః క్వానలాదుత్థితం జలమ్. 38

ఇట్టి యాత్మయం దహంభావ మెట్లెటనుండి యేరూపమున నుత్పన్నమైనది? జలమందు ధూళిసమూహ మెచట నెట్లుత్పన్నమైనది? అగ్నినుండి జలమెట నేరూతమున నుద్భవించినది?

అయం సోఽహమితి వ్యర్థం ప్రత్యయం త్యజ పుత్రక
తుచ్ఛం పరిమితాకారం దిక్కాలవివశీకృతమ్. 39

పుత్రకా! దేశకాలవస్తువులచే బరిచ్ఛిన్నమై, తుచ్ఛమై, పరిమితమగు యాకారము గలదైన 'వీఁడు, వాఁడు, నేన'ను వ్యర్థమగు విశ్వాసమును బారద్రోలుము.

దిక్కాలాద్యనవచ్ఛిన్నం స్వచ్ఛం నిత్యోదితం తతమ్
సర్వార్థమయమేకార్థ చిన్మాత్రమమలం భవాన్. 40

దేశకాలాదుల పరిచ్ఛేదములేనిదై, స్వచ్ఛమై, నిత్యోదితరూపమై, సర్వవ్యాపకమై, సమస్తమునకధిష్ఠానమై, సర్వపదార్థమయమై, అద్వయమై, చిన్మాత్రమైనట్టి నిర్మలమగు ఆత్మయే నీవు.

ఫలకుసుమదళానాం సర్వదిక్సంస్థితానాం
రస ఇవ జగతాం త్వం సంస్థితః సర్వదైవ
విమలతరచిదాత్మా నిత్యమేవాస్యనన్తః
క ఇవ కచ తవాహం నిశ్చయో భావమూర్తేః. 41

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే కచోపాఖ్యానే కచప్రబోధో నామైకాదశోత్తరశతతమః సర్గః ॥ 111 ॥

ఓ కచుఁడా! నలువైపుల విస్తరించియున్న పుష్ప, ఫల, పత్రాదులయొక్క సారము వృక్షమందలి రసమైయున్నట్లు, సమస్తబ్రహ్మాండముల కాధారము. (సారము) సదా నీవేయైయున్నావు. కావున, అతినిర్మలమై, నిత్యమై, అనంతమై, నిత్యానందరూపమైనట్టి చిదాత్మయే నీవు. అఖండమై, అద్వయమై, సన్మాత్రరూపమైనట్టి నీకు పరిచ్ఛిన్నమైన 'అహం' నిశ్చయము లేనేలేదు.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున కచోపాఖ్యానమున కచప్రబోధమను నూటపదునొకండవ సర్గము ॥ 111 ॥

---

## ద్వాదశాధికశతతమః సర్గః

[కచాఖ్యానప్రబుద్ధస్య రామస్యప్రశ్నతోఽత్ర హి
మిథ్యాపురుషకాఖ్యానం ఖరక్షణముదీర్యతే.

కచాఖ్యానముచే ప్రబుద్ధుండైనట్టి శ్రీరామచంద్రుని ప్రశ్నను పురస్కరించుకొని, శ్రీవసిష్ఠుండు మిథ్యాపురుషుని ఆఖ్యానమును వచించుచు, ఆతని యాకాశ రక్షణమునుగూర్చి వర్ణించుట ఇటంగాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఇతి ప్రాప్య పరం యోగముపదేశ మనుత్తమమ్
జీవన్ముక్తో బభూవాసౌ తతో దేవగురోః సుతః. 1

శ్రీవసిష్ఠుండు:—ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ, ప్రత్యగాత్మ పరమాత్మల యైక్యమను బరమయోగమునుదెల్పు సర్వోత్తమమైన యుపదేశమును బొంది యటుపిమ్మట దేవగురుపుత్రుండైన కచుడు జీవన్ముక్తుండాయెను.

నిర్మమో నిరహంకారశ్ఛిన్నగ్రన్థిః ప్రశాన్తధీః
కచో యథా స్థితో రామ తథా తిష్ఠాఽవికారవాన్. 2

ఓ రాఘవా! అహంకారమమకార రహితుండై, హృదయగ్రంథుల ఛిన్నమొనర్చి, ప్రశాంతబుద్ధిగలవాండై, ఏ వికారములులేక కచుడెట్లుండునో అట్లే నీవున్నునుండుము.

అహంకారమసద్విద్ధి మేనమాశ్రయ మా త్యజ
అసతః శశశృఙ్గస్య కిల త్యాగగ్రహౌ కుతః. 3

అహంకారమును అసత్తుగనే నీవెఱుంగుము. దాని నాశ్రయించుటగాని, త్యజించుటగాని, గావింపకుము. మిథ్యయగు కుందేటికొమ్ముయొక్క గ్రహణముగాని, త్యాగముగాని యెచట?

అసంభవత్యహంకారే క్వ తే మరణజన్మనీ
నభఃక్షేత్రే తథా వ్యుప్తం కేన సంగృహ్యతే ఫలమ్. 4

అహంకారము అసంభవము కాంగా నీకు జననమరణము లెచట? ఆకాశమున విత్తనము నాటిన యెవనికి ఫలము లభించుచున్నది?

నిరంశం శాన్తసంకల్పం సర్వభావాత్మకం తతమ్
పరమాదప్యణోః సూక్ష్మం చిన్మాత్రం త్వమనోమయమ్. 5

అంశరహితమై, సంకల్పవర్జితమై, సమస్త పదార్థరూపమై, వ్యాపకమై, పరమాణువు కంటెను సూక్ష్మమై, మనోరహితమైనట్టి చిన్మాత్రమే నీవు.

యథామ్బునస్తరఙ్గాది యథా హేమ్నోఽఙ్గదాది చ
తదేవాతదివాభాసం తథాహంభావభావితః. 6

జలము తరంగాదుల రూపమునను, సువర్ణము అంగదాద్యాభరణరూపమునను భాసించునట్లు, నీవు చిన్మాత్రుండవైనను అహంభావరూపముచే భావింపబడుచున్నావు.

అబోధేన జగత్సర్వం మాయామయమివ స్థితమ్
బోధేన సకలం బ్రహ్మరూపం సంపద్యతేఽనఘ. 7

పాపరహితుండవగు రామచంద్రా! అజ్ఞానముచే ఈమాయామయమగు జగత్తంతయు స్థితిం బొందుచున్నది. జ్ఞానముచే నిదియంతయు బ్రహ్మరూపమే యగుచున్నది.

ద్వైతైకత్వమతీ త్యక్త్వా శేషస్థః సుఖితో భవ
మా దుఃఖితో భవ వ్యర్థం త్వం మిథ్యాపురుషో యథా. 8

ఓ రాఘవా! ద్వైత, ఏకత్వబుద్ధిని త్యజించి శేషించినదానియందు స్థితిగల్గి సుఖముగ నుండుము. మిథ్యాపురుషునివలె వ్యర్థముగ దుఃఖితుండవు గాకుము.

మాయేయమతిదుష్పారా సాంసారీ గాఢతాం గతా
శరదా మిహికేవాశు బోధేనాయాతి తానవమ్. 9

దాటుటకుం గష్టతరమైనట్టి యీ సాంసారికమాయ దృఢత్వమును బొందియున్నది. శరదృతువుచే మంచు నశించునట్లు అయ్యది జ్ఞానముచే శీఘ్రముగ వినాశమును బొందుచున్నది.

శ్రీరామ ఉవాచ: —

పరమామాగతోఽస్మ్యన్తస్తృప్తిం జ్ఞానామృతేన తే
అవగ్రహభయాక్రాన్తః స్వాసారేణేవ చాతకః. 10

శ్రీరాముడు;— మునీంద్రా! వర్షప్రతిబంధభయముతో గూడిన చాతకము, దైవశమున వర్షము కురియ, ఎట్లు తృప్తిం బొందునో, అట్లే తమ జ్ఞానామృతముచే నే నాభ్యంతరమునం దృప్తి బొందితిని.

అమృతేనేవ సిక్తోఽహమన్తర్గచ్ఛామి శీతతామ్
ఉపర్యపి సమస్తానాం తిష్ఠామ్యతులసంపదామ్. 11

మహాత్మా! అమృతముచేం దడుపంబడినట్లుగ నేను నాయంతఃకరణమున శీతలత్వమును బొందుచున్నాను. సమస్త అసమానసంపదలకు పైననే నేనిపుడు స్థితిగల్గియున్నాను.

న తృప్తిమనుగచ్ఛామి వచాంసి వదతస్తవ
ఐన్దవీనాం మరీచీనాం చకోరస్తృషితో యథా. 12

కాని, దప్పిఁగొన్న చకోరము చంద్రకిరణములచేఁ దృప్తిఁ బొందనట్లు, తమవచనములచే నేనింకను దృప్తిఁ బడయకున్నాను.

తృప్తోఽపి భూయః పృచ్ఛామి త్వాం ప్రశ్నమిమమీశ్వర
కో నామ తృప్తోఽప్యగ్రస్థం న పిబత్యమృతాసవమ్. 13

ఓ మునీశ్వరా! తృప్తుఁడనయినను తమ్ముల మరల యీ ప్రశ్న గావించుచున్నాను. తృప్తుఁడైనను అమృతపానము గావింపనివాఁ డెవఁడుండును?

కిముచ్యతే మునిశ్రేష్ఠ మిథ్యాపురుషనామకమ్
వస్త్వవస్తుకృతం జగద్వస్తుజాతం వదాశు మే. 14

మునిశ్రేష్ఠా! వస్తువును అవస్తువుగను, అవస్తువగు జగత్తును వస్తురూపముగను, గావించిన యీ మిథ్యా పురుషుఁ డెవఁడో శీఘ్రముగ వచింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

మిథ్యాపురుషబోధాయ శృణు రాఘవ శోభనాం
ఇమామాఖ్యాయికాం హాసజననీం మదుదీరితామ్. 15

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రాఘవా! మిథ్యాపురుషునిగూర్చి బోధించుటకై నాచే వచింపఁబడుచున్న, హాస్యజనకమై, శోభావంతమైనట్టి యీ ఆఖ్యాయికను వినుము

అస్తి కశ్చిన్మహాబాహో మాయాయన్త్రమయః పుమాన్
బాల పేలవధీమూఢో గూఢో మౌర్ఖ్యేణ కేవలమ్. 16

మహాబాహుఁడవగు రామచంద్రా! మాయాయంత్రమయుఁడును, బాలునివలె నల్పబుద్ధిగలవాఁడును, మూఢుఁడును, మూర్ఖత్వముచే నావృతుఁడునగు యొకానొక పురుషుఁడు గలఁడు.

స ఏకాన్తే క్వచిజ్జాతం శూన్యే తత్రైవ తిష్ఠతి
కేశోణ్డ్రకమివ వ్యోమ్ని మృగతృష్ణేవ వా మరౌ. 17

ఆకాశమున, కేశసమూహమువలెను. మరుభూమియందు జలమువలెను, ఆతఁ డొకానొక యేకాంతప్రదేశమున జన్మించినవాఁడై, అట్టి యేకాంతముననే యుండియుండెను,

తస్మాదన్యన్న తత్రాస్తి యదస్తి చ స ఏవ తత్
యచ్చాన్యత్తత్తదాభాసం న చ పశ్యతి దుర్మతిః. 18

అచ్చోట ఆమిథ్యాపురుషుఁడుతప్ప మఱియొవరును లేరు. ఏదియుండెనో అదియాతఁడొకఁడే యగును. అన్యమగు దేనిని నాతఁడు చూచుచుండునో, అది యాతనియొక్కయే ఆభాసమైయుండెను. కాని యా దుర్బుద్ధి యట్లెఱుఁగకుండెను,

సంకల్పస్తస్య సంజాతస్తత్ర వృద్ధిముపేయుషః
ఖస్యాహం ఖమహం ఖం మే ఖం రక్షామీతి నిశ్చలః. 19

ఆతఁడచట వృద్ధినొందిన పిమ్మట – 'నేనాకాశమునకుఁ జెందినవాఁడను; నేనాకాశమునే, ఆకాశము నాది; కావున నిశ్చలుండనై యాకాశమునే రక్షించెదనను' సంకల్పమువానికిఁ బొడమెను.

ఖం స్థాపయిత్వా రక్షామి వస్త్విష్టం స్వయమాదరాత్
ఇతి సంచిన్తయన్వ్యోమరక్షార్థం సోऽకరోద్గృహమ్. 20

'ఆకాశము నేదైన యుపాధియందుంచి యాదరముతో నద్దానిని రక్షించెదనని తలంచి యాతఁ డాకాశరక్షణార్థ మొక గృహమును నిర్మించెను.

తస్య కోశే బబన్ధాస్థాం రక్షితం ఖం మయేత్యసౌ
గృహాకాశేన సంతుష్టస్తతః స రఘునన్దన. 21

ఓ రఘునందనా! ఆగృహముయొక్క యంతర్భాగమునందలి యాకాశమునం దాతఁడు నేనాకాశమును రక్షించితినను విశ్వాసము గలిగియుండెను. మఱియు నాతఁడా గృహాకాశముచే సంతుష్టుఁడాయెను.

అథ కాలేన తత్తస్య గృహం నాశముపాయయౌ
ఋత్వన్తరేణాబ్ద ఇవ వాతేనేవ తరఙ్గకః. 22

తదనంతరము, శరదృతువుచే, బూర్వకాలిక వర్షమున్ను, వాయువుచే దరంగమున్ను, నశించునట్లు, వాని యాగృహమున్ను గాలక్రమమున నశించపోయెను.

హా గృహాకాశ నష్టం త్వం హా క్వ యాతమసి క్షణాత్
హా హా భగ్నమసిస్వచ్ఛమిత్యేవైతచ్ఛుశోచ సః. 23

అపుడాతఁడు అయ్యో! గృహాకాశమా! నీవు నశించిపోతివే! అయ్యో? క్షణకాలములో నీవెచటికిఁ బోతివి? అయ్యో! ఇట్టి స్వచ్ఛమైన నీవు నశించిపోయితివే! అని యివ్విధమున శోకింప సాగెను.

ఇతి శోకశతం కృత్వా పునస్తత్రైవ దుర్మతిః
కూపం చక్రే ఖరక్షార్థం కూపాకాశపరోऽభవత్. 24

ఇట్లు పలువిధముల శోకించి, యాదుర్మతి మఱల యాకాశరక్షణము కొఱకై యచ్చోటనే యొక కూపమును నిర్మించి, ఆకూపాకాశరక్షణమునఁ దత్పరుఁడై యుండెను.

తతో నాశం స కాలేన నీతః కూపోऽపి తస్య వై
కూపాకాశే గతే శోకనిమగ్నోऽసౌ తతోऽభవత్. 25

కాలక్రమమున ధూళి, మృత్తికాదులచే నాకూపము నింపఁబడి నశించిపోయెను. అట్లా కూపాకాశము నశించినమీదట మరల యాదుర్బుద్ధి శోకసాగరమున మునింగినవాఁడాయెను.

కూపాకాశప్రలాపాన్తే కుమ్భం శీఘ్రమథాకరోత్
కుమ్భాకాశపరో భూత్వా స్వయం నిర్వృతిమాయయౌ. 26

కూపాకాశమును గూర్చి దుఃఖించిన పిదప, యాతఁడు శీఘ్రముగ నొక ఘటమును నిర్మించి, తద్ఘటాకాశరక్షణమునఁ దత్పరుఁడై, దానియందలి యభిమానముచే స్వయముగనే సుఖమును బొందెను.

కుమ్భోఽపి తస్య కాలేన నాశం నీతో రఘూద్వహ
యామేవ దిశమాదత్తే దుర్భగః సా హి నశ్యతి. 27

రఘుకుల శ్రేష్ఠుఁడవగు రామచంద్రా! కొంతకాలమునకా ఘటమున్ను నశించిపోయెను. ఇట్లా భాగ్యహీనుఁడే యే పద్ధతి నవలంబించుచుండెనో, అదియది నశించి పోవుచుండెను.

కుమ్భాకాశప్రలాపాన్తే ఖరత్వార్థం చకార సః
కుణ్డం తథైవ తేనాసౌ కుణ్డాకాశపరోఽభవత్. 28

ఘటాకాశనాశమును గూర్చి విలపించిన తదుపరి యాతండాకాశరక్షణమునకై యొక కుండమును నిర్మించి, అదేరీతి యాకుండాకాశమును రక్షించుట యందుఁ దత్పరుఁడై యుండెను.

కుణ్డమప్యస్య కాలేన కేనచిన్నాశమాయయౌ
తేజసేవ తమస్తేన కుణ్డాకాశం శుశోచ సః. 29

ప్రకాశముచే నంధకారమువలె నదియుఁ గాలక్రమమున నశించిపోవ, ఆతఁడు దానికొఱకును విలపించెను.

కుణ్డాకాశస్య శోకాన్తే ఖరత్వార్థం చకార సః
చతుఃశాలం మహాశాలం తదాకాశమయోఽభవత్. 30

కుండాకాశ నాశమునుగూర్చి దుఃఖించిన యనంతరమాత డాకాశరక్షణమునకై నాలుగు శాలలతోఁగూడిన గొప్పశాల నొకదానిని నిర్మించి ఆ శాలాకాశమున నాసక్తిగలవాఁడై తన్మయుఁడై యుండెను.

తదప్యస్య జహారాశు కాలః కవలితప్రజః
జీర్ణపర్ణం యథా వాతస్తతః శోకపరోఽభవత్. 31

సమస్తప్రజలను గబళించునట్టి కాల మా మహాశాలనున్ను, ఎండిన యాకునువలె శీఘ్రముగ నశింపఁజేసెను. అపుడాతఁడు మరల దుఃఖాకులితుఁడయ్యెను.

స చతుఃశాలశోకాన్తే ఖరత్వార్థం చకార హ
కుసూలమమ్బుదాకారం తదాకాశపరః స్థితః. 32

ఆ చతుఃశాలాయుక్తమగు మహాశాలను గూర్చి శోకించిన పిదప, ఆతఁడాకాశరక్షణముకొఱకై మేఘాకారమగు నొక కుసూలము (ధాన్యముంచెడు కొట్టు)ను నిర్మించి, తత్కుసూలాకాశపరుఁడై యుండెను;

తదప్యస్య జహారాశు కాలో వాత ఇవామ్బుదం
కుసూలనాశశోకేన తేనాసౌ పర్యతప్యత. 33

కాని, వాయువు మేఘమును హరించునట్లు, ఆ కుసూలమునున్ను కాలము శీఘ్రముగ హరించివైచెను. ఆ కుసూలనాశముచేతను వాతఁడు మిగుల శోకగ్రస్తుఁడయ్యెను.

ఏవం గృహచతుఃశాలకుమ్భకుణ్డకుసూలకైః
తస్యాపర్యవసానాత్మా కాలోఽయమతివర్తతే. 34

ఓ రామచంద్రా! ఇవ్విధమున గృహ, కూప, ఘట, కుండ, చతుఃశాల, కుసూలాద్యాకాశములను రక్షించుచు నున్నట్టి యా మిథ్యాపురుషునకు అనంతకాలము గడచిపోవుచున్నది.

ఏవం స్థితః స వివశో గగనం గుహాయాం
గృహ్ణన్గ్రహేణ గహనేన కిలాత్మబుద్ధ్యా
దుఃఖాత్పరాద్ధ్నతరాద్ధ్నదుఃఖజాత
మాయాతి యాతి చ గతాగతిసఙ్గమూఢః. 35

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే మిథ్యాపురుషోపాఖ్యానే ఆకాశరక్షణం నామ ద్వాదశోత్తరశతతమః సర్గః ॥ 112 ॥

ఓ రామచంద్రా! ఇట్లామిథ్యాపురుషుఁడు గృహ, కూపాదులయందలి యాకాశమును తానుగా గ్రహించుచు, వానియందలి యభిమానముచే వాని నిర్మాణ, క్షయములందు అత్యంత మహద్దుఃఖమును బొందుచు, ఒకపుడు దానినుండి విడివడుచును నుండెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున మిథ్యాపురుషాఖ్యానమున ఆకాశరక్షణమను నూటపండ్రెండవ సర్గము ॥112॥

---

## త్రయోదశోత్తరశతతమః సర్గః

[మిథ్యాపురుషశబ్దాదేరర్థోఽత్ర స్ఫుటమీర్యతే
యథైవాఖ్యాయికాయాశ్చ తాత్పర్యం సామ్యవర్ణనాత్.

పైకథయొక్క తాత్పర్యమును వర్ణించుటద్వారా మిథ్యాపురుష శబ్దాదుల యర్థము స్పష్టముగ నిట వివరింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

మిథ్యానరప్రసఙ్గేన కిం మాయాపురుషః ప్రభో
కథితోఽయం త్వయా వ్యోమరక్షణం చ కిముచ్యతే. 1

శ్రీరాముఁడు:— ప్రభూ! ఈ మిథ్యాపురుషప్రసంగముచేఁ దామ్ము వచించిన మాయాపురుషుఁడెవఁడు? మఱియు నాకాశరక్షణము యొక్క తాత్పర్యమేమి?

శ్రీవసిష్ఠ ఉవాచః-

శృణు రామ యథాభూతమేతత్ప్రకటయామి తే
మిథ్యాపురుషవృత్తాన్తం కథా యా కథితాధునా. 2

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! ఇపుడు నీకు వచించినట్టి మిథ్యాపురుషాఖ్యానము యొక్క యథార్థవృత్తాంతమును బ్రకటింపఁబోవుచున్నాను, వినుము

మాయాయాయ స్త్వమయః ప్రోక్తో యః పుమాన్రఘునన్దన
ఏనం త్వం తమహంకారం విద్ధి శూన్యామ్బరోత్థితమ్. 3

రఘునందనా! మాయాయంత్రమయుఁడగు ఏపురుషునిగూర్చి చెప్పియుంటినో, ఆతఁడు శూన్యాకాశమునుండి యావిర్భవించిన అహంకారమని నీవెఱుఁగుము

యస్మిన్నాకాశకోశేఽస్మిన్నాధో జగదిదం స్థితమ్
తదనన్తమసచ్ఛూన్యం సర్గాదౌ భవతి స్వయమ్. 4

సాధూ! ఏయాకాశకోశమున ఈజగత్తు స్థితిగల్గియున్నదో, అది యనంతమై భాసించుచున్నది. కాని సృష్టికిఁ బూర్వమది స్వయముగనే అసత్తై, శూన్యమైయున్నది.

అన్తః స్థిత సుదర్లక్ష్యే బ్రహ్మవ్యోమ్న్యేఽథ శబ్దవత్
తస్మాదుదేత్యహంకారః పూర్వం స్పన్ద ఇవానిలాత్. 5

ఏమాయాకాశమునుండి యీఅహంకారముత్పన్నమగుచున్నదో, అద్దానిలోన నతిదుర్లక్ష్యమై అధిష్ఠానరూపముచే బ్రహ్మముండియున్నది. ఆ చిదాకాశమందు అధ్యస్తమైన మాయాకాశమునుండియే వాయువుచేఁ జలనమువలె ఈయహంకారముదయించుచున్నది.

వృద్ధిం యాతః స గగనే కల్పయత్యాత్మతాం గతః
అనాత్మాత్మాభిధానేన తేనాసౌ యతతే తతః. 6

అనాత్మయైనను ఆత్మత్వమున్బొందిన యీఅహంకారమా మాయాకాశముననే వృద్ధిని బొంది ఇది యిష్టము, యిది యనిష్టము-మున్నగు అనేకకల్పనలఁ గావించుచున్నది. మఱియు, కల్పితమగుయా అహంకారమును బేరుచే నది యిష్టప్రాప్తికైయు, అనిష్టపరిహారమునకైయు, బ్రయత్నించుచున్నది.

అనాత్మాత్మైకరక్షార్థం దేహాన్నానావిధానసౌ
భూయోభూయో వినాశేఽపి సృజత్యాకులతాం గతః. 7

అనాత్మయగు భూతదేహమును ఆత్మయని నమ్మి, దానిని రక్షించుటకొఱకుఁ బ్రవృత్తమై వ్యాకులత్వము నొంది, పూర్వపూర్వదేహములు నశించుచుండ నుత్తరోత్తరముగ ననేకవిధములగు దేహముల నది సృజించుచున్నది.

స ఏవ మాయాపురుషో మిథ్యాపురుష ఏవ సః
అసదేవోదితో వ్యర్థోఽప్యహంకారో హి మాయయా. 8

ఆ యహంకారమే మాయా పురుషుఁడు. అదియే మిథ్యాపురుషుఁడు అసత్తైనను మాయచే నది వ్యర్థముగ నుదయించుచున్నది.

కూపకుణ్డచతుఃశాలకుమ్భాదీన్దేహకానసౌ
కృత్వా రక్షిత ఆత్మేతి యాతి తద్వ్యోమ్ని భావనమ్. 9

కూప, కుండ, చతుఃశాలా గృహ, ఘటాదిరూప దేహములను నిర్మించి, తచ్ఛరీరావచ్ఛిన్నమైన రూపాకాశమును మాయచే ఆత్మయని నమ్మి దానినే యది (అహంకారము) రక్షించుచున్నది.

అహంకారస్య తస్యాస్య నామానీమాని రాఘవ
శృణు యైర్జగదాకార విభ్రమైర్మోహయత్యసౌ. 10

ఓ రాఘవా! ఏ యే క్రియోపాధికములగు జగదాకార విభ్రమములచే ఈ యహంకార మాత్మను మోహితమొనర్చుచున్నదో వానిపేర్లను వినుము —

జీవో బుద్ధిర్మనశ్చిత్తం మాయా ప్రకృతిరిత్యపి
సంకల్పః కలనా కాలః కలా చేత్యపి విశ్రుతైః. 11
ఏవమాద్యైస్తథాన్యైశ్చ నామభిర్బహుతాం గతైః
సహస్రరూపోఽహంకార కల్పితార్థైర్విజృమ్భతే. 12

జీవుఁడు, బుద్ధి, మనస్సు, చిత్తము, మాయ, ప్రకృతి, సంకల్పము, కల్పన, కాలము, కళ మున్నగు ప్రసిద్ధనామముల చేతను, తదితరములగు (కామసంకల్పాది) నామములచేతను, అనేకత్వముఁ బొంది, వేలకొలఁది రూపముల ధరించి, తనచేఁగల్పితమగు పదార్థములచే నది విజృంభించుచున్నది.

భూతాకాశే తతే శూన్యే జగన్నిర్మితి నిశ్చితమ్
సుఖదుఃఖాన్యనుభవన్మిథ్యైవ పురుషః స్థితః. 13

పూర్ణబ్రహ్మమున ఈ యహంకారమను మిథ్యాపురుషుఁడు భూతాకాశముయొక్క కల్పనగావించి, ఆ శూన్య, విస్తృతాకాశమున భిత్త్యాదులు లేకయే (వాయ్వగ్న్యాది భూతములతోఁ గూడిన) యీ జగత్తుయొక్క రచనను నిశ్చయించి, అనేకవిధములగు సుఖదుఃఖముల ననుభవించుచున్నది.

యథైవ మిథ్యాపురుషో రక్షన్వ్యోమాత్మశఙ్కయా
ఘటాకాశాదిషు క్లిష్ట ఏవం మా క్లేశవాన్భవ. 14

ఓ రామచంద్రా! మిథ్యాపురుషుఁడు ఘటాకాశాదులం దాత్మశంకచే నాయాకాశాదులను రక్షించుచుఁ గ్లేశముల నెట్లనుభవించెనో, అట్లు నీవనుభవింపకుము.

ఆకాశాదపి విస్తీర్ణః శుద్ధః సూక్ష్మః శివః శుభః
య ఆత్మా స కథం కేన గృహ్యతే రక్ష్యతేఽథవా. 15

ఆకాశముకంటెను విస్తృతమై, శుద్ధమై, సూక్ష్మమై, శివమై, శుభమైనట్టి ఆత్మయొక్క గ్రహణముగాని, రక్షణముగాని, యెట్లెవనిచే నొనర్పఁబడగలదు?

హృదయాకాశమాత్రస్య శరీరక్షయ సంక్షయే
వ్యర్థం భూతాని శోచన్తి నష్ట ఆత్మేతి శఙ్కయా. 16

హృదయాకాశమాత్రమగు శరీరమను నివాసస్థానము నశింప, ఆత్మయే నశించినదను శంకచే జనులు వ్యర్థముగ దుఃఖించుచున్నారు.

ఘటాదిషు ప్రణష్టేషు యథాకాశాద్యఖణ్డితం
తథా దేహేషు నష్టేషు దేహీ నిత్యమలేపకః. 17

ఘటాదులు నశించినను, ఆకాశ మఖండితముగనే యుండునట్లు దేహములు నశించినను దేహి (ఆత్మ) నిత్యమై, నిర్లేపమై, అవినాశియై యుండును.

శుద్ధశ్చిన్మాత్ర ఆత్మాయమాకాశాదప్యణోరణుః
స్వానుభూత్యంశమాత్రం హి ఖవద్రామ న నశ్యతి. 18

ఓ రామచంద్రా! శుద్ధచిన్మాత్రమై, ఆకాశముకంటెను సూక్ష్మమై, స్వానుభవమాత్రమైనట్టి యే ఆత్మగలదో, అది యాకాశమువలెనే నశింపక యే యుండును.

న జాయతే న మ్రియతే క్వచిత్కిం చిత్కదాచన
జగద్వివర్తరూపేణ కేవలం బ్రహ్మ జృమ్భతే. 19

ఆత్మ యెప్పుడును నెచటను నుత్పన్నముకాదు, నశింపదు. జగత్తుయొక్క వివర్తరూపముచే కేవలమదియే (ఆత్మ, లేక, బ్రహ్మము) విజృంభించుచున్నది.

సత్యమేకం పదం శాన్తమాదిమధ్యాన్తవర్జితం
భావాభావవినిర్ముక్తమితి మత్వా సుఖీ భవ. 20

ఓ రామచంద్రా! ఆ యాత్మపదము సత్యమై, ఏకమై, శాంతమై, ఆదిమధ్యాంతరహితమై, భావాభావవినిర్ముక్తమై యున్నదని తెలిసికొని సుఖవంతుఁడవు గమ్ము.

సర్వాపదాం నిలయమధ్రువమస్వతన్త్ర
మాసన్నపాతమవివేక మనార్యమజ్ఞం
బోధాదహం కృతిపదం సకలం విముచ్య
శేషే సుబద్ధపదము త్తమతాం ప్రయాసి. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే మిథ్యాపురుషాఖ్యానం నామ త్రయోదశోత్తర శతతమః సర్గః ॥ 113 ॥

ఓ రాఘవా! సమస్త ఆపదలకు స్థానమై, ధ్రువము కానిదై, అస్వాతంత్ర్యజనకమై, వివేకమునకు వైరియై, నింద్యమై, అజ్ఞానసహితమై, అభిమానవిషయములగు దేహేంద్రియాదిరూప సమస్తకళలతోఁ గూడుకొనినదైనట్టి అహంకారమును జ్ఞానముచేఁ ద్యజించి, శేషించిన ఆత్మపదమున దృఢముగ స్థితిగల్గియుండుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున మిథ్యాపురుషోపాఖ్యానమను నూటపదిమూఁడవ సర్గము ॥ 113 ॥

---

## చతుర్దశాధిక శతతమః సర్గః

[వివిచ్య సదసద్రూపే దృష్టాన్తైరిహ భూరిశః
అసద్రూపనిరాసేన సద్రూపే స్థైర్యమీర్యతే.

అనేక దృష్టాంతములచే సదసద్రూపముల విచారించుట, అసద్రూపమును నిరాకరించుటద్వారా సద్రూపమున స్థిరీభవించుట యిటుఁ గాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ: —

పరస్మాద్బ్రహ్మణః పూర్వం మనః ప్రథమముత్థితం
మననాత్మకమాభోగి తత్స్థమేవ స్థితిం గతమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సృష్ట్యాదికాలమున మననాత్మకమై, విశాలమైన రచనకు! కారణమైనట్టి మనస్సే మొట్టమొదట పరమాత్మనుండి యుత్పన్నమయ్యెను. అది యాపరమాత్మయందుండియే యితరకల్పనలకు హేతువై నేఁటివఱకును నుండియున్నది.

పుష్పకోశ ఇవామోదో మహోర్మిరివ సాగరే
రశ్మిజాలమివాదిత్యే మనో బ్రహ్మణి రాఘవ. 2

ఓ రాఘవా! పుష్పకోశమున సుగంధమువలెను, సముద్రమున మహాతరంగమువలెను, సూర్యునియందుఁ గిరణసమూహమువలెను ఈమనస్సు బ్రహ్మమున వర్తించుచున్నది.

తస్యాదృశ్యాత్మతత్త్వస్య విస్మృత్యైవ గతం స్థితిమ్
నాన్యస్మాదాగతం రామ జగద్రజ్జుభుజఙ్గవత్. 3

ఓ రామచంద్రా! అదృశ్యమగు ఆత్మతత్త్వమును మఱచి యీమనస్సు జగత్తుయొక్క కల్పనకు మూలమై స్థితినొందియున్నది. మఱియు, రజ్జుసర్పమువలెనిది మఱియొకచోటనుండి వచ్చినదికాదు.

ఆదిత్యవ్యతిరేకేణ యో భావయతి రాఘవ
రశ్మిజాలమిదం హ్యేతత్తస్యాన్యదివ భాస్వతః. 4

ఓ రాఘవా! ఎవఁడు సూర్యునికిరణములను సూర్యునికంటె వేఱుగ భావించునో, వానికవి సూర్యునికంటె నన్యముగనే భాసించును.

కనకవ్యతిరేకేణ కేయూరం యేన భావితం
కేయూరమేవ తత్తస్య న తస్య కనకం హి తత్. 5

సువర్ణముకంటె వేఱుగ కేయూరాది యాభరణములను భావించువానికి ఆయాకేయూరాదులే భాసించును గాని సువర్ణముకాదు.

ఆదిత్యావ్యతిరేకేణ రశ్మయో యేన భావితాః
ఆదిత్య ఏవ తే తస్య నిర్వికల్పః స ఉచ్యతే. 6

సూర్యకిరణములను సూర్యునికంటె వేఱుకానివిగ భావించువాని కయ్యవి నిక్కముగ సూర్యరూపమే యగును. అట్టివాఁడు (కిరణభేద) వికల్పరహితుఁడని చెప్పఁబడును.

సలిలవ్యతిరేకేణ తరఙ్గో యేన భావితః
తరఙ్గ బుద్ధిరేవైకా స్థితా తస్య న వారిధీః. 7

తరంగమును జలముకంటె సత్యముగ భావించువానికిఁ దరంగబుద్ధియే యుండునుగాని జలబుద్ధికాదు.

సలిలావ్యతిరేకేణ తరఙ్గో యేన భావ్యతే
అమ్బుసామాన్యతాబుద్ధిర్నిర్వికల్పః స ఉచ్యతే. 8

తరంగమును జలముకంటె వేఱుకానిదిగ భావించువానికి జలబుద్ధియే యుండును గాని తరంగబుద్ధికాదు. అట్టివాఁడు (తరంగభేద) వికల్పరహితుఁడని చెప్పఁబడును.

కనకా వ్యతిరేకేణ కేయూరం యేన భావ్యతే
కనకైక మహాబుద్ధిర్నిర్వికల్పః స ఉచ్యతే. 9

అట్లే, కేయూరాద్యాభరణములను సువర్ణముకంటె వేఱుకానివిగ భావించువాఁడు 'సువర్ణవికారములందు సువర్ణమే గలదను' మహాబుద్ధియుతుఁడై యుండును. అతఁడే నిర్వికల్పుఁడని చెప్పఁబడును.

పావక వ్యతిరేకేణ జ్వాలాలీ యేన భావితాః
తస్యాగ్ని బుద్ధిర్గలతి జ్వాలాధీరేవ తిష్ఠతి. 10

అగ్నిజ్వాలను అగ్నికంటె వేఱుగ (జ్వాలగ) భావించువానియందు అగ్నిబుద్ధినశించి జ్వాలబుద్ధియే యుండును.

జ్వాలా జాలాభ్రలేఖేవ రఞ్జితా సా తథా స్థితిః
తామేవాస్థాం సమాదత్తే తద్గతాన్వ్యాకులా మతిః 11

అగ్నిజ్వాలలందు మేఘపంక్తినిఁగూర్చిన కల్పన యెవఁడు గావించునో వానికయ్యవి యావిధముగనే గోచరించును. మఱియు నాతఁడు వ్యాకులబుద్ధిగలవాఁడై, జ్వాలలందలి యూర్ధ్వవక్రగమనాదులను మేఘములందలివిగనే గ్రహించును.

పావకావ్యతిరేకేణ జ్వాలాలీ యేన భావ్యతే
తస్యాగ్నిబుద్ధిరేకాస్తి నిర్వికల్పః స ఉచ్యతే. 12

అగ్నిజ్వాల నగ్నికంటె వేఱుకానిదిగ భావించువానికి జ్వాలాగ్నులయందగ్ని బుద్ధి యొకటిమాత్రమే యుండును. అట్టివాఁడు వికల్పరహితుఁడని చెప్పఁబడును.

యో నిర్వికల్పః స మహాన్సోఽసంక్షీణ మహామతిః
ప్రాప్తవ్యం యేన సంప్రాప్తం నాసౌ వస్తుషు మజ్జతి. 13

వికల్పరహితుఁడగువాఁడే మహాపురుషుఁడు. అట్టి మహామతియే సంశయముక్షయించినవాఁడు. అట్టివానిచేనిఁక పొందఁదగిన పదార్థము పొందఁబడినదగును. మఱియు నట్టివాఁడు వైకల్పిక వస్తువు లందు సత్యబుద్ధిచే మగ్నుఁడుకాఁడు.

నానాతామఖిలాం త్యక్త్వా శుద్ధచిన్మాత్ర కోటరే
సంవేద్యేన వినిర్ముక్తే సంవిత్తత్త్వే స్థితో భవ. 14

ఓ రామచంద్రా! మనస్సు మొదలగు వానియొక్క యనేకత్వమంతయుఁ ద్యజించి, సంవేద్యరహితమై, శుద్ధచిన్మాత్రమై, సాక్షీరూపమై, అభ్యంతరవస్తువైనట్టి ఆత్మతత్త్వమున స్థితిగల్గి యుండుము.

స్వయమేవాత్మనైవాత్మా శక్తిం సంకల్పనామికామ్
యదా కరోతి స్ఫురతా స్పన్దశక్తిమివానిలః. 15

తదా పృథగివాభాసం సంకల్పకలనామయమ్
మనో భవతి విశ్వాత్మా భావయన్స్వాకృతిం స్వయమ్. 16

వాయువు తనయందుఁ జలనశక్తిని బ్రకటించునట్లు, ఆత్మయు నెపుడు స్వయముగ తన ప్రకాశముచే సంకల్పాత్మకమగు శక్తియొక్క కల్పనగావించుచున్నదో, అపుడు వేఱుగనున్నట్లు భాసించునదై, సంకల్ప కల్పనామయమై ప్రపంచరూపమైనట్టి మనస్సు తన యాకృతిని భావన చేయుచు, స్వయముగ నుత్పన్నమగుచున్నది.

తత్సంకల్పాత్మకం చేతో యథేదమఖిలం జగత్
సంకల్పయతి సంకల్పైస్తథైవ భవతి క్షణాత్. 17

ఈ జగదాకారమగు, సంకల్పాత్మకమైన (హిరణ్యగర్భరూప) సమష్టి చిత్తమీ సమస్త ప్రపంచమును గూర్చి యెట్లు సంకల్పించునదో, అట్లే తన సంకల్పముల ననుసరించి క్షణకాలములో నగుచున్నది.

కీటత్వమబ్జజత్వం చ మేరుత్వం మరుతాం తథా
మనో జీవమహంకారబుద్ధి చిత్తాదినామకమ్. 18

అదియే కీటత్వము, బ్రహ్మదేవత్వము, మేరుత్వము, మనస్సు, జీవుఁడు, అహంకారము, చిత్తము మున్నగు నామములను స్వసంకల్పముచే ధరించుచున్నది.

సంకల్పతో ద్వితైకత్వమేత్య చేతో జగత్స్థితిమ్
తనోతి తస్యాం తదను నానాతాం గచ్ఛతి స్వయమ్. 19

సంకల్పముచే ఈచిత్తమేకత్వ, ద్వైతరూపమగు జగత్స్థితిని బొంది, తదనంతర మద్దాని యందు స్వయముగ ననేకత్వము నొందుచున్నది.

సంకల్పమయమేవేదం జగదాభోగి దృశ్యతే
న సత్యం న చ మిథ్యైవ స్వప్నజాలమివోత్థితమ్. 20

సంకల్పముచేతనే యీ విశాలమగు జగత్తు కాన్పించుచున్నది. ఇది సత్యముకాదు, మిథ్య యున్నుగాదు. స్వప్నజాలమువలె అనిర్వచనీయరూపముచే నావిర్భవించినదగును.

జన్తోర్యథా మనోరాజ్యం వివిధారమ్భభాసురమ్
బ్రాహ్మం తథేదం వితతం మనోరాజ్యం విరాజతే. 21

జీవుని మనోరాజ్యము వివిధకార్య కలాపముచే నెట్లు భాసించుచున్నదో, అట్లే బ్రహ్మదేవుని విశాలమగు మనోరాజ్యమున్ను భాసించుచున్నది.

యథా భూతార్థభావిత్వాత్తదేతత్ప్రవిలీయతే
పరమార్థేన దృష్టం చేత్తదిదం నైవ కించన. 22

యథార్థరూపముతో భావించుటచే దీని మాయారూపము లయించిపోవుచున్నది. ఏలయనఁగా, బ్రహ్మరూపముగఁ గాంచుటచే నిది (మాయారూపము) యేమియు నుండఁజాలదు.

దృశ్యం త్వపరమార్థేన ప్రయాతి శతశాఖతామ్
జలమూర్మితరఙ్గాదికలనాత్మం పరిస్ఫురన్. 23

సముద్రము జలమాత్రమేయైనను, ఊర్మితరంగాది వివిధకల్పనారూపములతోటి స్ఫురించునట్లు, అపరమార్థదృష్టిచే నీదృశ్యమనేక శాఖత్వమును బొందుచున్నది.

యథామ్బుధిర్వపుర్ధత్తే స్వభావేన తథా చితః
కుర్వన్కర్మ సహస్రాణి హ్యాణుచిత్స్పన్దనాదృతే. 24

నాపూర్వం కురుతే కించిత్కించిద్భేదమతస్త్యజన్
గచ్ఛన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ వదన్వ్యవహరన్స్వపన్. 25

నాపూర్వం విద్యతే కించిత్సత్యమిత్యేవ భావయన్
యద్యత్కరోషి తద్విద్ధి చిన్మాత్రమమలం తతమ్. 26

ఓ రామచంద్రా! సముద్రము తరంగాదికల్పనా రూపమున స్ఫురించినను, జలమాత్రమే యగుచు, సముద్రరూపము నెట్లు ధరించుచున్నదో, అట్లే జీవుడున్ను వేలకొలఁది కర్మల నాచరించుచున్నను, చిదాభాసయుక్తమగు మనస్సుయొక్క చలనముగావించుట తప్ప కూటస్థ చైతన్యమునందు అపూర్వమగు వికార మెుకింతేని కలుగఁజేయుటలేదు. అందుచే నీవున్ను తుచ్ఛమగు భేదమును త్యజించి, నడుచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, మూర్కొనుచున్నను, మాట్లాడుచున్నను, వ్యవహరించుచున్నను, నిద్రించుచున్నను, అపుడు నీయాత్మస్వరూపమున అపూర్వత్వ మేమియు నుండదు. మఱియు, సత్యమునుగూర్చి భావనచేయుచు నీ వేదేది చేయుదువో, లేక గాంచుదువో, అద్ధియంతయు నిర్మలమై, వ్యాపకమైనట్టి చిన్మాత్రమనియే యెఱుఁగుము.

బ్రహ్మ ప్రబృంహితాకారం తస్మాదన్యన్న విద్యతే
పదార్థజాతే సర్వస్మిన్సం విత్సారమయే స్థితే. 27

సమస్తమునకు సారభూతమగు సచ్చిత్స్వరూపమే సర్వపదార్థరూపమునను స్థితిగల్గియున్నది. దానికంటె నన్య మెద్దియు లేదు. విశాలరూపమున భాసించు నదియంతయు బ్రహ్మముమాత్రమే యగును.

సంవిదే వేదమఖిలం జగన్నాన్యాస్తి కల్పనా
సంవిత్స్ఫురణమాత్రేఽస్మిఞ్జగజ్జాలకనామని. 28
ఇదమన్యదిదం చాన్యదితి మిథ్యాగ్రహః కుతః
సంభవాదఖిలాకారేష్వేకస్యా ఏవ సంవిదః
సంవేద్యమపి నాస్త్యేవ బన్ధమోక్షావతః కథమ్. 29

ఈ జగత్తంతయు సంవిన్మాత్రమే యైయున్నది. ఇందు మఱియొక కల్పన లేనేలేదు. జగజ్జాలమను పేరుగల యీ సంవిత్ - స్ఫురణమాత్రమున 'ఇది వేఱు, ఇది వేఱు'ను మిథ్యాగ్రహణ మెట్లుండగలదు? మఱియు నంతటను నొకే సంవిత్తు (చైతన్యము) యుండియున్నందున యిఁక సంవేద్యమున్ను (తెలిసికొనఁబడునదియు) లేకయే యున్నది. కావున, బంధమోక్షములున్ను, నిఁక యెట్లుండఁగలవు?

మోక్షోఽయమేష ఖలు బన్ధ ఇతి ప్రసహ్య
చిన్తాం నిరస్య సకలాం విఫలాభిమానాం
మానీ వశీ విగతమానమదో మహాత్మా
కుర్వన్స్వకార్యమనహం కృతిరేవ తిష్ఠ. 30

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పరమార్థోపదేశో నామ చతుర్దశాధిక శతతమః సర్గః ॥ 114 ॥

ఓ రామచంద్రా! 'ఇది బంధము, ఇది మోక్షము'ను వ్యర్థాభిమానమునుఁగూర్చిన చింతను సర్వయత్నముచే విడనాడి, వాగాది సమస్తేంద్రియములను జయించి, యథాప్రాప్తములగు రాజ్యాది స్వకార్యములఁజేయుచు, మానివియు, సంయమియు, అభిమాన, మదాదిరహితుఁడవును, అహంకార వర్జితుఁడవును, మహాత్ముఁడవునై వెలయుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున పరమార్థోపదేశమను నూటపదునాల్గవ సర్గము ॥114॥

## పఞ్చదశాధిక శతతమః సర్గః

[మహాకర్త్రాదిశబ్దానాం వ్యాఖ్యాభిరిహ శంభునా
లక్ష్మాణి జీవన్ముక్తానాం వర్ణ్యన్తే భృఙ్గిణేఽర్థినే
మహాకర్త మున్నగుశబ్దముల వ్యాఖ్యలద్వారా యీశ్వరుఁడు జిజ్ఞాసువగు భృంగికి జీవన్ముక్తుల లక్షణములను దెలుపుట యిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

మహాకర్తా మహాభోక్తా మహాత్యాగీ భవానఘ
సర్వాః శఙ్కాః పరిత్యజ్య ధైర్యమాలమ్బ్య శాశ్వతమ్. 1

శ్రీవసిష్ఠుఁడు:— పాపరహితుఁడవగు రామచంద్రా! సంశయములన్నిటిని బారద్రోలి, నిర్భయమై, శాశ్వతమైనట్టి కూటస్థాత్మభావము నవలంబించి, నీవు మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి కమ్ము.

శ్రీరామ ఉవాచ:—

కిముచ్యతే మహాకర్తా మహాత్యాగీ కిముచ్యతే
కిముచ్యతే మహాభోక్తా సమ్యక్కథయమే ప్రభో. 2

శ్రీరాముఁడు:— ప్రభూ! మహాకర్తయన నేమియో, మహాభోక్తయన నేమియో, మహాత్యాగియన నేమియో నాకు బాగుగఁ దెలియఁజేయుడు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతద్వ్రతత్రయం రామ పురా చన్ద్రార్ధమాలినా
భృఙ్గీశాయ తు సంప్రోక్తం యేనాసౌ విజ్వరః స్థితః. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ (మహాకర్త్రాది) మూఁడువ్రతములను బూర్వము శివుఁడు భృంగీశునకుఁ జెప్పెను. వానిచే నాతఁడు దుఃఖరహితుఁడై యుండెను.

సుమేరావుత్తరే శృఙ్గే పూర్వం శశికలాధరః
అతిష్ఠదగ్నిసంకాశే సమగ్రపరివారవాన్. 4

అగ్నివలె దేదీప్యమానమగు సుమేరుపర్వతముయొక్క యుత్తరశిఖరమున సమస్తపరివారసమేతముగ చంద్రకళాధరుఁడగు పరమేశ్వరుఁడు పూర్వముండియుండెను.

తమపృచ్ఛన్మహాతేజాస్తను విజ్ఞానవాన్నతః
భృఙ్గీశః ప్రణతో రామ బద్ధాఞ్జలిరుమాపతిమ్. 5

ఓ రామచంద్రా! మందాత్మజ్ఞానము గలవాఁడును, మహాతేజస్వియునగు భృంగీశుఁడు చేతుల జోడించుకొని వందనమాచరించుచు, పార్వతీనాథుఁడగు యమ్మహాదేవుని నిట్లడిగెను—

భృఙ్గీశ ఉవాచ:—

భగవన్దేవదేవేశ సర్వజ్ఞ పరమేశ్వర
యదహం పరిపృచ్ఛామి కృపయా తద్వదాశు మే. 6

భృంగీశుఁడు:– భగవంతుఁడా! దేవదేవేశా! సర్వజ్ఞా! పరమేశ్వరా! దయచేసి నేనడుగు దానిని తాము శీఘ్రముగ సెలవిండు.

సంసారరచనాం నాథ తరఙ్గతరలామిమామ్
అవలోక్య విముహ్యామి తత్త్వవిశ్రాన్తివర్జితః. 7

మహాత్మా! తరంగమువలె జంచలమైనట్టి యీ సంసారరచనను గాంచి, ఆత్మతత్త్వమున విశ్రాంతిలేని నేను విమోహితుఁడ నగుచుంటిని.

కమన్తర్నిశ్చయం కాన్తమురరీకృత్య సుస్థితమ్
అస్మిఞ్జగజ్జీర్ణగృహే తిష్ఠామి విగతజ్వరమ్. 8

దేవా! ఎద్దానిని నేను నాయంతఃకరణమున నిశ్చయించి యీ జగద్రూపమగు జీర్ణగృహమున దుఃఖరహితుఁడనై యుండగలనో, అట్టి యుత్తమ, ప్రియవస్తువెద్ది?

ఈశ్వర ఉవాచ;—

సర్వాః శఙ్కాః పరిత్యజ్య ధైర్యమాలమ్బ్య శాశ్వతమ్
మహాభోక్తా మహాకర్తా మహాత్యాగీ భవానఘ. 9

ఈశ్వరుఁడు:– పాపరహితుఁడవగు భృంగీశా! సంశయములన్నిటిని విడనాడి నిర్భయమై శాశ్వతమైనట్టి కూటస్థాత్మభావమునవలంబించి, మహాభోక్తయు, మహాకర్తయు, మహాత్యాగియుకమ్ము.

భృఙ్గీశ ఉవాచ:—

కిముచ్యతే మహాకర్తా మహాభోక్తా కిముచ్యతే
కిముచ్యతే మహాత్యాగీ సమ్యక్కథయ మే ప్రభో. 10

భృగీంశుఁడు.— దేవా! మహాకర్తయన నేమియో మహాభోక్తన నేమియో, మహాత్యాగియన నేమియో నాకుఁ బూర్ణముగ వచింపుడు?

ఈశ్వర ఉవాచ:—

ధర్మాధర్మౌ మహాభాగ శఙ్కావిరహితాశయః
యః కరోతి యథాప్రాప్తౌ మహాకర్తా స ఉచ్యతే. 11

ఈశ్వరుఁడు:— మహాభాగా! 'ఆత్మయందు కర్తృత్వాది ధర్మములు లేవను నిశ్చయము గలవాఁడై, యథాప్రాప్తములగు ధర్మాధర్మములను సంశయరహితుఁడై యెవఁడాచరించునో ఆతఁడు మహాకర్త యనఁబడును.

రాగద్వేషౌ సుఖం దుఃఖం ధర్మాధర్మౌ ఫలాఫలే
యః కరోత్యనపేక్షేణ మహాకర్తా స ఉచ్యతే. 12

రాగద్వేష, సుఖదుఃఖ. ధర్మాధర్మ, ఇష్టానిష్టకర్మములను నిష్కామమనంబుచే, కేవలము లోకోపకారముకొఱకే యెవఁడాచరించునో, అతఁడు మహాకర్తయనఁబడును.

మౌనవాన్నిరహంభావో నిర్మలో ముక్తమత్సరః
యః కరోతి గతోద్వేగం మహాకర్తా స ఉచ్యతే. 13

మునుల కర్మయగు మననయోగాదులఁ గావించువాఁడును, అహంకారరహితుఁడును, నిర్మలుఁడును, మాత్సర్యాదులు లేనివాఁడును, ఉద్వేగరహితుఁడై కర్మల నాచరించువాఁడును; మహాకర్తయనఁబడును.

శుభాశుభేషు కార్యేషు ధర్మాధర్మైః కుశఙ్కయా
మతిర్న లిప్యతే యస్య మహాకర్తా స ఉచ్యతే. 14

శుభాశుభకార్యములందు ధర్మాధర్మములనుగూర్చిన కుశంకచే నెవని బుద్ధి లిప్తముగాకుండునో, యాతఁడు మహాకర్తయని చెప్పఁబడును.

సర్వత్ర విగతస్నేహో యః సాక్షివదవస్థితః
నిరిచ్ఛం వర్తతే కార్యే మహాకర్తా స ఉచ్యతే. 15

సర్వత్ర రాగరహితుఁడును, సాక్షివలె నుండువాఁడును, ఇచ్ఛారహితుఁడై కార్యములందు ప్రవర్తించువాఁడును మహాకర్తయనఁబడును.

ఉద్వేగానన్దరహితః సమయా స్వచ్ఛయా ధియా
న శోచతే యో నోదేతి మహాకర్తా స ఉచ్యతే. 16

ఎవఁడు సమమై, స్వచ్ఛమైనట్టి బుద్ధితోఁగూడి, ఉద్వేగ, ఆనందరహితుఁడై ఇష్టానిష్టములందు సుఖదుఃఖముల నొందకుండునో, అతఁడు మహాకర్తయనఁబడును.

యథార్థకాలే మతిమానసంసక్తమనా మునిః
కార్యానురూపవృత్తస్థో మహాకర్తా స ఉచ్యతే. 17

ఆ యా కాలములందుఁ సంప్రాప్తించిన కర్మములందు యథోచితముగఁ ప్రవర్తించువాఁడును, సంసక్తముగాని మనంబుగలవాఁడును. మనశీలుఁడును, బుద్ధిమంతుఁడును నగువాఁడు మహాకర్తయనఁబడును.

ఉదాసీనః కర్తృతాం చ కర్మాకర్మాచరంశ్చ యః
సమం యాత్యన్తరత్యన్తం మహాకర్తా స ఉచ్యతే. 18

ఉదాసీనుఁడును, దైవీకముగ సంప్రాప్తించు విహిత అవిహితకర్మలఁ జేయుచు కర్తృత్వము లేనివాఁడును, తత్కర్తృత్వమును అన్యప్రేరితమని యెఱింగి అంతరంగమున అత్యంత సమభావమునొందువాఁడును మహాకర్తయనబడును.

స్వభావేనైవ యః శాన్తః సమతాం న జహాతి వై
శుభాశుభం హ్యాచరన్యో మహాకర్తా స ఉచ్యతే. 19

స్వభావముగనే శాంతుఁడును, ప్రాప్తించిన శుభాశుభకర్మలఁ జేయుచుఁ దన సమత్వమును ద్యజింపనివాఁడును మహాకర్తయని చెప్పఁబడును.

జన్మస్థితివినాశేషు సోదయాస్తమయేషు చ
సమమేవ మనో యస్య మహాకర్తా స ఉచ్యతే. 20

జన్మ, స్థితి, వృద్ధి, క్షయ, వినాశములను పంచవికారమయములగు శరీరాది పదార్థములందు (నిర్వికార సన్మాత్రాత్మదర్శనముచే) యెవనిమనస్సు సమముగ నుండునో, అతఁడు మహాకర్త యనఁబడును.

న కించన ద్వేష్టి తథా న కించిదభికాఙ్క్షతి
భుఙ్క్తే చ ప్రకృతం సర్వం మహాభోక్తా స ఉచ్యతే. 21

ఎవనిని ద్వేషింపనివాఁడును, దేనిని గోరనివాఁడును, యథాప్రాప్తమగు సమస్తము ననుభవించువాఁడును మహాభోక్తయని చెప్పఁబడును.

నాదత్తేఽ ప్యాదదానశ్చ నాచరత్యాచరన్నపి
భుఞ్జానోఽపి న యో భుఙ్క్తే మహాభోక్తా స ఉచ్యతే. 22

ఇంద్రియములచే గ్రహించుచున్నను, అసంగమగు ఆత్మనుగూర్చిన బుద్ధిచే నేమియు గ్రహింపనివాఁడును, హస్తపాదాదులతో నాచరించుచున్నను, నిష్క్రియమగు ఆత్మనుగూర్చిన బుద్ధిగలిగియుండుటచే నేమియు నాచరింపనివాఁడును, అట్లే సమస్తము ననుభవించుచున్నను, నిత్యతృప్తమగు ఆత్మనుగూర్చిన బుద్ధిచే నేమియు ననుభవింపనివాఁడును మహాభోక్త యనఁబడును.

సాక్షివత్సకలం లోకవ్యవహారమఖిన్నధీః
పశ్యత్యవగతేచ్ఛం యో మహాభోక్తా స ఉచ్యతే. 23

సాక్షివలె ఇచ్ఛారహితుఁడై అఖిన్నబుద్ధితోటి సకలలోకవ్యవహారముల నెవఁడు గాంచునో, అతఁడు మహాభోక్త యనఁబడును.

సుఖైర్దుఃఖైః క్రియాయోగైర్భావాభావైర్భ్రమప్రదైః
యస్య నోత్క్రామతి మతిర్మహాభోక్తా స ఉచ్యతే. 24

సుఖదుఃఖదాయకములగు జయాపజయాది క్రియాయోగములచేతను, భ్రమదాయకములగు లాభవ్యయాది కార్యములచేతను నెవనిబుద్ధి విక్షేపము నొందకుండునో యాతఁడు మహాభోక్తయని చెప్పఁబడును.

జరా మరణమాపచ్చ రాజ్యం దారిద్ర్యమేవ చ
రమ్యమిత్యేవ యో వేత్తి మహాభోక్తా స ఉచ్యతే. 25

వార్ధక్యము, మరణము, ఆపద, రాజ్యము, దారిద్ర్యము - వీనినన్నింటినిగూడ బ్రహ్మదృష్టిచే నెవఁడు రమణీయముగనే యెఱుఁగునో, అతఁడు మహాభోక్తయనఁబడును.

మహాన్తి సుఖదుఃఖాని యః పయాంసీవ సాగరః
సమం సముపగృహ్ణాతి మహాభోక్తా స ఉచ్యతే. 26

సముద్రము సర్వవిధములగు జలములను దనయందు గ్రహించునట్లు, మహత్సుఖ, మహద్దుఃఖముల నెవఁడు సమబుద్ధిచే గ్రహించునో, అతఁడు మహాభోక్తయని చెప్పఁబడును.

అహింసా సమతా తుష్టిశ్చన్ద్రబిమ్బాదివాంశవః
నోప యస్మాచ్చ్యపయాన్తి మహాభోక్తా స ఉచ్యతే. 27

చంద్రబింబమునుండి స్వభావముగనే కిరణములు బయలుదేఱునట్లు, ఎవనినుండి అహింస, సమత్వము, సంతుష్టి మున్నగు యుత్తమగుణములు సహజముగనే బయలువెడలునో, కాని, బయలువెడలనట్లే యెవఁడను భవమునొందునో, అట్టివాఁడు మహాభోక్త యనఁబడును.

కట్వమ్లలవణం తిక్తమమృష్టం మృష్టముత్తమమ్
అధమం యోఽత్తి సామ్యేన మహాభోక్తా స ఉచ్యతే. 28

కారముగగాని, పులుపుగగాని, ఉప్పగగాని, చేఁదుగగాని, తీపిగగాని, శుద్ధముగగాని, అశుద్ధముగగాని, ఉత్తమముగగాని, నికృష్టముగగాని, యున్న యన్నము నెవఁడు సమబుద్ధిలో భుజించునో యాతఁడు మహాభోక్తయనఁబడును.

సరసం నీరసం చైవ సురతం విరతం తథా
యః పశ్యతి సమం సౌమ్యో మహాభోక్తా స ఉచ్యతే. 29

రసవంతమైనదానినిగాని, లేక నీరసమైనదానినిగాని, సురతమునుగాని, రతివిఘాతమునుగాని యే సౌమ్యుఁడగు మహాత్ముఁడు సమదృష్టితోటి వీక్షించునో యాతఁడుమహాభోక్త యనఁబడును.

క్షారే ఖణ్డప్రకారే చ శుభే హ్యశుభే తథా
సమతా సుస్థిరా యస్య మహాభోక్తా స ఉచ్యతే. 30

కారపువస్తువునందుగాని, లేక చెక్కెరమున్నగువానితోఁగూడిన స్వాదిష్ట పదార్థమునందుగాని, శుభమందుగాని, అశుభమందుగాని యెవనియొక్క సమత్వము సుదృఢమైయుండునో, అతఁడు మహాభోక్తయని చెప్పఁబడును

ఇదం భోజ్యమభోజ్యం చేత్యేవం త్యక్త్వా వికల్పితమ్
గతాభిలాషం యో భుఙ్క్తే మహాభోక్తా స ఉచ్యతే. 31

ఇది తినఁదగినది, ఇది తినఁదగనిదను, ఈవికల్పమును త్యజించి, అభిలాషారహితుఁడై యెవఁడు భుజించునో యాతఁడు మహాభోక్తయనఁబడును.

ఆపదం సంపదం మోహమానన్దమపరం పరమ్
యో భుఙ్క్తే సమయా బుద్ధ్యా మహాభోక్తా స ఉచ్యతే. 32

ఆపదను, సంపదను, మోహమును, ఆనందమును, నికృష్టమైనవియు, ఉత్కృష్టమైనవియు నగు అన్నాదులను నెవఁడు సమబుద్ధితోటి యనుభవించునో, అతఁడు మహాభోక్తయనఁబడును.

ధర్మాధర్మౌ సుఖం దుఃఖం తథా మరణజన్మనీ
ధియా యేనేతి సంత్యక్తం మహాత్యాగీ స ఉచ్యతే. 33

ధర్మాధర్మములను, సుఖదుఃఖములను, జన్మమరణములను, నిరతిశయానంద పరిపూర్ణాద్వయాత్మబుద్ధిచే నెవఁడు మిథ్యయని యెఱిఁగి త్యజించునో, అతఁడు మహాత్యాగియని చెప్పఁబడును.

సర్వేచ్ఛాః సకలాః శఙ్కాః సర్వేహాః సర్వనిశ్చయాః
ధియా యేన పరిత్యక్తా మహాత్యాగీ స ఉచ్యతే. 34

విషయములు బాధింపఁబడునని యెఱుఁగుటచే నెవనిచే సమస్తమైన కోర్కెలున్ను, సర్వసంశయములున్ను, సమస్త శారీరిక, వాచిక, మానసిక చేష్టలున్ను, సమస్త నిశ్చయములున్ను బూర్ణముగఁ ద్యజింపఁబడునో యాఁతఁడు మహాత్యాగి యనఁబడును.

దేహస్య మనసో దుఃఖై రిన్ద్రియాణాం మనఃస్థితేః
నూనం యేనోజ్ఝితా సత్తా మహాత్యాగీ స ఉచ్యతే. 35

దేహేంద్రియమనంబుల సత్తను వానివానిదుఃఖములతో సహాయెవఁడు నిక్కముగఁ బరిత్యజించునో, అతఁడు మహాత్యాగియని చెప్పఁబడును.

న మే దేహో న జన్మాపి యుక్తాయుక్తే న కర్మణి
ఇతి నిశ్చయవానన్తర్మహాత్యాగీ స ఉచ్యతే. 36

నాకు దేహములేదు, విహితనిషిద్ధకర్మలు గాని, ఇష్టానిష్టకర్మలు గాని లేవని యుల్లమునఁ దంతఃకరణమున నిశ్చయించునో, ఆతఁడు మహాత్యాగి యనఁబడును.

యేన ధర్మమధర్మం చ మనోమననమీహితమ్
సర్వమన్తః పరిత్యక్తం మహాత్యాగీ స ఉచ్యతే. 37

ఎవఁడు శారీరిక ధర్మాధర్మములను, మననాది మానసికచేష్టలను, వాగాదుల క్రియలను, సమస్తము నంతఃకరణముచే, బరిత్యజించునో యాతఁడు మహాత్యాగి యనఁబడును

యావతీ దృశ్యకలనా సకలేయం విలోక్యతే
సా యేన సుష్ఠు సంత్యక్తా మహాత్యాగీ స ఉచ్యతే. 38

ఈ కాన్పించు దృశ్యకల్పన నంతటిని యెవఁడు సమ్యగ్దర్శనముచే మిథ్యయని యెఱిఁగి త్యజించియుండునో, అతఁడు మహాత్యాగి యనఁబడును.

ఇత్యుక్తం దేవ దేవేన భృఙ్గీశాయ పురానఘ
ఏతాం దృష్టిమవష్టభ్య తిష్ఠ రామ గతజ్వరః. 39

పాపరహితుఁడవగు రామచంద్రా! ఇట్లు పూర్వకాలమున శ్రీపరమశివుఁడు భృంగీశునకు జెప్పెను. ఇట్టి దృష్టి నవలంబించి నీవు సంతాపరహితుఁడవై యుండుము.

నిత్యోదితం విమలరూపమనన్తమాద్యం
బ్రహ్మాస్తి నేతరకలాకలనం హి కించిత్

ఇత్యేవ భావయ నిరఞ్జనతాముపేతో
నిర్వాణమేహి సకలామలశాన్తవృత్తిః. 40

ఓ రామచంద్రా! పంచకోశవివర్జితమును, అవస్థాత్రయరహితమునగు నిరంజనరూపమును నీవు పొంది, నిత్యోదితమై, విమలరూపమై అనంతమై, ఆద్యమైనట్టి బ్రహ్మమే సమస్తమునైయున్నది. అన్యమగు కల్పన యొద్దియును లేదనిభావించుచు సమస్తకల్పనారూపములను శమించినవాఁడవై నిర్వాణ పదమును బొందుము.

అనామయం బ్రహ్మ సమస్తకల్ప
కార్యైకబీజం పరమాత్మరూపమ్
బృహచ్చ తద్బృంహితసర్వభావం
ఖమస్తి భాతీహ యదఙ్గ కించిత్. 41

ప్రియుఁడవగు రామచంద్రా! ఈ కాన్పించున దంతయు, సమస్తకల్పములందును ప్రసిద్ధములైన కార్యములయొక్క బీజభూతమైనట్టి నిరామయమైన పరమాత్మరూపమగు బ్రహ్మమేయగును. మఱియు, విశాల సృష్టిభేదములతోఁటి వృద్ధినొంది భాసించునట్టి యీ పదార్థసమూహమంతయు చిదాకాశమేయైయున్నది.

అన్యత్క్వచిత్కించిదిహ కదాచి
న్న సంభవత్యేవ సదప్యసచ్చ
ఇత్యేవ సాధో దృఢనిశ్చయోఽన్తః
స్థిత్వా గతాశఙ్కవిలాసమాస్స్వ. 42

ఓ సాధూ! బ్రహ్మముకంటె భిన్నముగ సత్తుగాని, అసత్తుగాని యెచటను గొంచెమైనను సంభవింపదని యంతఃకరణమున దృఢముగ నిశ్చయించి, సంశయముల విడనాడి సుఖముగ నుండుము.

అన్తర్ముఖః సన్సతతం సమస్తం కుర్వన్బహిష్ఠం ఖలు కార్యజాతమ్
న ఖేదమాయాసి కదాచిదేవనిరాకృతాహంకృతితాముపైషి. 43

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే వ్రతత్రయనిరూపణం నామ
పఞ్చదశాధికశతతమః సర్గః ॥ 115 ॥

ఓ రామచంద్రా! నీవంతర్ముఖుఁడవై నిరహంకృతిని బొందినచో. బహిర్ముఖములగు సమస్త కార్యము లాచరించుచున్నను ఖేదము నెన్నటికిఁ బొందకుందువు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
వ్రతత్రయనిరూపణమను నూటపదునైదవ సర్గము ॥115॥

## షోడశాధికశతతమః సర్గః

[చిత్తస్య గలతో నిత్యం చతుర్థాదిషు భూమిషు
గలితస్య చ లక్ష్మాణి వర్ణ్యన్తేఽత్ర ప్రమాశ్రయాత్.

చతుర్థాది భూమికలయందు శమించునట్టియు, మఱియు శమించినట్టియు చిత్తముయొక్క లక్షణము లిట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీరామ ఉవాచ:-**

భగవన్సర్వధర్మజ్ఞ చిత్తేఽహంకారనామని
గలితే వా గలద్రూపే లింగం సత్వస్య కిం భవేత్. 1

శ్రీరాముఁడు:—సర్వధర్మజ్ఞుఁడవగు మహాత్మా! అహంకారమను పేరుగల చిత్తమెప్పుడు శమించునో, లేక, శమింపఁదొడగునో, అప్పుడా వాసనాగహితమగు చిత్తమునకేయే లక్షణములుండునో వచింపవేడెద.

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

బలాదపి హి సంజాత న లిమ్పన్త్యాశయం సితమ్
లోభమోహాదయో దోషాః పయాంసీవ సరోరుహమ్. 2

ముదితాద్యాః శ్రియోవక్త్రం న ముఞ్చన్తి కదాచన
గలత్యహంకారమయే చిత్తే గలతి చుమ్కృతే. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అహంకార మయమగు చిత్తమెప్పుడు శమింపఁదొడగునో, మఱియు, జ్ఞానాగ్నిచేఁ బాపమెప్పుడు నశింపఁదొడగునో, అపుడు పరీక్షార్థము బలాత్కారముగ సంప్రాప్తించినను లోభమోహాది దోషములు, కమలమును జలమంటనట్లు, శుద్ధచిత్తమును స్పృశింపనేరవు. మఱియు, ప్రసన్నత్వము, మైత్రి, కరుణ మున్నగు సంపదలు యట్టి శుద్ధచిత్తుని ముఖము నెన్నఁటికిని వీడకుండును.

వాసనాగ్రన్థయశ్ఛిన్నా ఇవత్రుట్యన్త్యలం శనైః
కోపస్తానవమాయాతి మోహో మాన్ద్యం హి గచ్ఛతి. 4

చిత్తము శమించునప్పుడు వాసనాగ్రంథులు ఛిన్నాభిన్నములై నవివలె మెల్లమెల్లగ తెగిపోవుచుండును. మఱియు, కోపము సన్నగిలును. మోహము మందగించును.

కామః క్లమం గచ్ఛతి చ లోభః క్వాపి పలాయతే
నోల్లసన్తీన్ద్రియాణ్యుచ్చైః ఖేదః స్ఫురతి నోచ్చకైః. 5

కామము శిథిలత నొందును, లోభమెచటికో పారిపోవును. ఇంద్రియములు ప్రబలములు గాకయు, దుఃఖమును గల్గింపకయు నుండును. ఖేదమున్ను నధికముగాకయుండును.

న దుఃఖాన్యుపబృంహన్తి న వల్గన్తి సుఖాని చ
సర్వత్ర సమతోదేతి హృది శైత్యప్రదాయినీ. 6

దుఃఖములు వృద్ధినొందవు, సుఖములు అభిమానమును గల్గింపకుండును. తాపత్రయనివారక మగు సమత్వమే హృదయమున సర్వత్ర యుదయించును.

సుఖదుఃఖాదయ స్త్వేతే దృశ్యన్తే యది వాముఖే
దృశ్యన్త ఏవ తచ్ఛ్రుత్వాన్నానులిమ్పన్తి తే మనః. 7

ఒకవేళ సుఖదుఃఖాదుల చిహ్నము లెప్పుడైన ముఖముపైఁ గనుపించినను నవి యల్పకాలము వఱకే యుండును. అనంతరము వానియందు మిథ్యాత్వబుద్ధి గలుగుటచే నవి మనంబును స్పృశింప కుండును.

చిత్తే గలతి గీర్వాణగణస్య స్పృహణీయతా
సాధుర్గచ్ఛత్యుదేత్యస్య సమతా శీతచన్ద్రికా. 8

చిత్తము శమించునపుడు సాధుశీలుఁడగు సన్మనుజుఁడు దేవతాగణంబుచేతను వాంఛనీయుఁడగును. మఱియు నత్తఱి సమత్వమను శీతల చంద్రిక వానియం దుదయించును.

ఉపశాన్తం చ కాన్తం చ సేవ్యమప్రతిరోధి చ
నిభృతం చోర్జితం స్వచ్ఛం మహాతీర్థం మహద్వపుః. 9

శాంతమై, ప్రియమై, సేవనీయమై, అవిరోధియై, నమ్రమై, తేజోయుక్తమై, స్వచ్ఛమై నట్టి, మహత్తరదేహమును, చిత్తము శమించిన యాతఁడు స్వభావముగనే ధరించును.

భావాభావా విరుద్ధోఽపి విచిత్రేఽపి మహానపి
నానన్దాయ న ఖేదాయ సతాం సంసృతివిభ్రమః. 10

విభవ, దారిద్ర్యములచే భయంకరమై, విచిత్రమై, గొప్పదై యున్నప్పటికిని ఈ సంసార భ్రమ అహంకారరహితులగు మహాత్ముల కానందముగాని, దుఃఖముగాని గల్గింపకుండును.

బుద్ధ్యాలోకేన సాధ్యేఽస్మిన్వస్తున్యస్తమితాపది
ప్రవర్తతే న యో మోహాత్తం ధిగస్తు నరాధమమ్. 11

సమస్త ఆపదలను నశింపఁజేయునదియు, బుద్ధియొక్క ప్రకాశమాత్రముచే సాధ్యమైనదియు నగు ఈయాత్మజ్ఞానమున నెవఁడు మోహవశమునఁ బ్రవర్తింపకుండునో, అట్టి యధమమనుజునకు ధిక్కారమగుఁగాత!

విశ్రాన్తిమాప్తముచితాం చిరమజ్ఞదుఃఖ
రత్నాకరం జననసాగరముత్తితీర్షోః
కోఽహం కథం జగదిదం చ పరం చ కిం స్యా
త్కిం భోగకైరితి మతిః పరమోఽభ్యుపాయః 12

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే గలితచిత్తలక్షణకథనం నామ షోడశాధిక శతతమః సర్గః ॥ 116 ॥

ప్రియోత్తముడవగు రామచంద్రా! దుఃఖములను రత్నములకు నెలవై, జననమరణ రూపమైనట్టి సంసారసముద్రమును దాట నిచ్ఛగించు పురుషునకు, నిరతిశయానందరూపమగు ఆత్మయందుఁ జిరకాలోచితమగు విశ్రాంతినొందుటకొఱకై, 'నేనెవరు? ఈ ప్రపంచమేమి? ఆత్మతత్త్వమెట్టిది? తుచ్ఛభోగములచే నేమి ప్రయోజనము? అని యవిచ్ఛిన్నముగ నిరంతర మభ్యసింపఁబడిన విచారవైరాగ్యాత్మకమగు బుద్ధియే యన్నిటికంటె నుత్తమమైన ప్రథమోపాయము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున గలితచిత్త లక్షణ కథనమను నూటపదునాఱవ సర్గము ॥116॥

---

## సప్తదశాధిక శతతమః సర్గః

[కోఽహం కథం జగదితి విచారేఽత్ర నిదర్శనమ్
ఇక్ష్వాకోర్మనునా ప్రోక్తో వివేకః సంప్రకీర్త్యతే.

'నేనెవరు? ఈ ప్రపంచమేమి?'–అను నీ విచారమున నిదర్శనపూర్వకముగా, మనువుచే వచింపఁబడిన యిక్ష్వాకుయొక్క వివేక మిచటఁ దెలుపఁబడుచున్నది.]

### శ్రీవసిష్ఠ ఉవాచ:–

భవతామాది పురుష ఇక్ష్వాకుర్నామ భూపతిః
ఇక్ష్వాకువంశప్రభవ యథా ముక్తస్తథా శృణు. 1

శ్రీవసిష్ఠుడు:– ఇక్ష్వాకువంశమున జన్మించిన యో రామచంద్రా! మీయొక్క ఆదిపురుషుఁడైన ఇక్ష్వాకువను భూపాలుఁడెట్లు ముక్తుఁడయ్యెనో యావృత్తాంతమును వినుము.

ఇక్ష్వాకుర్నామ భూపాలః స్వరాజ్యం పరిపాలయన్
కదాచిదేకాన్తగతో మనసా సమచిన్తయత్. 2

ఇక్ష్వాకువను రాజు తనరాజ్యమును బరిపాలించుచు నొకప్రదేశాంతమునకుఁజని తన మనంబుచే నిట్లు చింతనగావించెను —

జరామరణ సంక్షోభసుఖదుఃఖ భ్రమస్థితేః
అస్య దృశ్య ప్రపఞ్చస్య కో హేతుః స్యాదితి స్వయమ్. 3

వార్ధక్యము, మరణము, సంక్షోభము, సుఖము, దుఃఖము మున్నగు భ్రమలకు స్థానభూతమైనట్టి యీ దృశ్యప్రపంచమునకుఁ గారణమెయ్యది? యని యాతఁడు స్వయముగ విచారించెను.

జగతో న వివేదాసౌ కారణం చిన్తయన్నపి
అథ కదా పృచ్ఛదసౌ బ్రహ్మలోకాగతం మనుమ్. 4
పూజితం స్వసభాసంస్థం భగవన్తం ప్రజాపతిమ్

అట్లు విచారించినను జగత్కారణమును నెఱుఁగమి, అంత నొకప్పుడు బ్రహ్మలోకమునుండి యేతెంచినవాఁడును, పూజితుఁడును, తన సభయందున్న వాఁడును, భగవంతుఁడునగు తన తండ్రియైన మనుప్రజాపతినిగూర్చి యాతఁడిట్లడిగెను.

ఇక్ష్వాకురువాచ:—

మాం యోజయతి ధార్ష్ట్యేన భగవన్కరుణానిధే. 5

భవత్ప్రసాద ఏవాయం భవన్తం ప్రష్టుమఞ్జసా
కుతః సర్గోఽయమాయాతః స్వరూపం చాస్య కీదృశమ్. 6
కియదేతజ్జగత్కస్య కదా కేనేతి కథ్యతే
అహం కథం చ విషమాదస్మాత్సంసృతి విభ్రమాత్. 7
విముచ్యేయ ఘనాస్తీర్ణా జ్జాలాదివ విహంగమః

ఇక్ష్వాకువు:—కరుణానిధియగు నో దేవా! తన కృపయే తమ్ముల నిర్విఘ్నముగ ధృష్టత్వముచే శీఘ్రముగ ప్రశ్నించుటకు నన్ను నియోజించుచున్నది—మహాత్మా! ఈ సృష్టి యెచటనుండి యేతెంచినది? దీని స్వరూపమేమి? దీని సంఖ్యయెంత? పరిమాణమెంత? ఎపుడెవఁడు దీనినినిర్మించెను? మఱియు, విశాలమైన వలనుండి పక్షివలె నే నీ భయంకరమైన సంసారవిభ్రమమునుండి యెట్లు విముక్తి నొందగలను.!

మనురువాచ:—

అహో ను చిరాకాలేన వివేకే సువికాసిని. 8
వితథానర్థ విచ్ఛేత్తా సారః ప్రశ్నస్త్వయా కృతః

మనువు:—ఆహా! గొప్ప అనర్థములను ఛేదించునటువంటి సారభూతమైన ప్రశ్నను చిరకాలమునకు - మహా ప్రకాశవంతమగు వివేకమున నీవు గావించితివి.

యదిదం దృశ్యతే కించిత్తన్నాస్తి నృప కించన. 9
యథా గన్ధర్వనగరం యథా వారి మరుస్థలే
యత్తు నో దృశ్యతే కించి త్తన్న కించిదివ స్థితమ్. 10

ఓ రాజా! ఈ కనుపించునదంతయు యాథార్థముగ లేనిదేయగును. గంధర్వనగరమువలెను. మృగతృష్ణాజలమువలెను, నిది మిథ్యయేయై యున్నది. విచారించిచూచిన ఏది కానుపించదో, అది వాస్తవముగ నొకింతైనను లేనిదేయగును.

మనః షష్ఠేన్ద్రియాతీతం యత్స్యాదపి న కించన
అవినాశం తదస్తీహ తత్సదాత్మేతి కథ్యతే. 11

ఏది మనస్సుకంటెను, తక్కిన పంచేంద్రియములకంటెను నతీతమైయున్నదో, దేనిఁగూర్చి సంభావనయున్ను లేకయున్నదో ఏది నాశరహితమైనదో, అదిమాత్రమే యిట కలదు. అదియే సద్రూపమగు ఆత్మయని చెప్పఁబడుచున్నది.

ఇదం తు సర్వ దృశ్యాఢ్యా రాజన్సర్గపరంపరా
తస్మిన్నేవ మహాదర్శే ప్రతిబిమ్బముపాగతా. 12

ఓ రాజా! దృశ్యములన్నింటిచేఁ బూర్ణమగు యీ సృష్టిపరంపర, ఆ చిదాత్మయను గొప్ప యద్దమునఁ బ్రతిబింబితమాయెను.

భాః స్వభావసముత్పన్నా బ్రహ్మస్ఫురణశక్తయః
కాశ్చిద్బ్రహ్మాణ్డతాం యాన్తి కాశ్చిద్గచ్ఛన్తి భూతతామ్. 13
అన్యాస్త్వన్యత్వమాయాన్తి భవత్యేవం జగత్స్థితిః

ఆపరమాత్మనుండి స్వభావముగనే యుత్పన్నమైన కొన్ని స్ఫురణశక్తులు (చిదాభాసములు) బ్రహ్మాండరూపమును బొందినవి; మఱికొన్ని పృథివ్యాది భూతరూపత్వము నొందినవి. తక్కినవి తక్కిన చతుర్విధ ప్రాణిసమూహరూపముఁ బొందినవి, ఇదియే జగత్తుయొక్క స్థితి.

న బన్ధోఽస్తి న మోక్షోఽస్తి బ్రహ్మైవాస్తి నిరామయమ్
నైక్యమస్తి న చ ద్విత్వం సంవిత్సారం విజృమ్భతే. 14

ఇట బంధముగాని, మోక్షముగాని లేదు. నిర్వికారమగు బ్రహ్మమే గలదు. ఇందేకత్వము గాని, ద్వైతముగాని లేదు. సారభూతమగు చిదాత్మయే యీ జగద్రూపముగ విజృంభించుచున్నది.

ఏకం యథా స్ఫురతి వారితరఙ్గభఙ్గై
రేవం పరిస్ఫురతి భిన్న చ కించిదేవ
త్వం బన్ధమోక్షకలనే ప్రవిముచ్య దూరే
స్వస్థో భవాఽభవభయోఽభవసార ఏవ. 15

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ఇక్ష్వాకుమను సంవాదో నామ సప్తదశాధిక శతతమః సర్గః ॥117॥

ఓ యిక్ష్వాకు రాజా! ఒకే జల మనేకతరంగ భేదములచే నెట్లు స్ఫురించుచున్నదో, అట్లే యొకే బ్రహ్మ మనేక జగద్రూపభేదములచే స్ఫురించుచున్నది. మాయామాత్రమగుటచే నీ భేదములు లేనివేయగును. కావున నీవు బంధమోక్షములఁగూర్చిన భ్రమను దూరముగఁ బరిత్యజించి, సంసారభయ రహితుఁడవై, అభయ సారభూత బ్రహ్మరూపుఁడవే కమ్ము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
ఇక్ష్వాకుమను సంవాదమను నూటపదునేడవ సర్గము ॥ 117 ॥

## అష్టాదశాధిక శతతమః సర్గః

[యతః సర్గః కదా కస్య కేనేత్యేషామిహోత్తరమ్,
తథాత్మదర్శనోపాయో మనునాత్ర ప్రకీర్తితః

సృష్టి యెటనుండి యెపుడు ఎవనిచే రచింపఁబడినది మున్నగు ప్రశ్నలకుత్తరమున్ను, ఆత్మదర్శనోపాయమున్ను మనువుచే నిట వర్ణింపఁబడుచున్నవి.]

మనురువాచ:—

సంకల్పోన్ముఖతాం యాతాః సత్యశ్చిన్మాత్రసంవిదః
అపస్తరఙ్గతామివ యాన్తి భూమిప జీవతామ్. 1

మనువు:- ఓ రాజా! ఆయా సంస్కారములచే విచిత్రమైయున్నట్టి అవిద్యయందు ప్రతిబింబించిన చిన్మాత్రసంవిత్తు సంకల్పమువైపున కున్ముఖమై, జలము తరంగరూపతను బొందునట్లు, జీవభావమును బొందుచున్నది.

తే జీవాః సంసరన్తీహ సంసారే పూర్వముత్థితే
సుఖదుఃఖదశామోహో మనస్యేవాస్తి నాత్మని. 2

ఆ జీవులు, పూర్వమే యావిర్భూతమైయున్న యీ సంసారమునఁ దిరుగాడుచున్నారు. వాస్తవముగ జీవుల సుఖదుఃఖదశలనుగూర్చిన మోహము మనస్సునందే కలదుగాని ఆత్మయందు లేదు.

అదృశ్యో దృశ్యతే రాహుర్గృహీతేన యథేన్దునా
తథానుభవమాత్రాత్మా దృశ్యేనాత్మావలోక్యతే. 3

రాహువు అదృశ్యరూపుఁడైనను నాతనిచే గ్రహింపఁబడిన చంద్రుని మూలమున నాతఁడు గానుపించునట్లు, ఆత్మ యదృశ్యరూపమై అనుభవమాత్రమైయున్నను, తత్సాక్షాత్కార మొనర్పుటయం దభిముఖమైన యంతఃకరణముచే నది కానుపించును.

న శాస్త్రైర్నాపి గురుణా దృశ్యతే పరమేశ్వరః
దృశ్యతే స్వాత్మనైవాత్మా స్వయా సత్త్వస్థయా ధియా. 4

ఈ పరమేశ్వరుఁడు (ఆత్మ) శాస్త్రములచేగాని, గురువుచేగాని కానుపింపఁడు. అహంకారమమకారరహితమగు బుద్ధిచేఁ దనచేత నే తాను కానుపించుచున్నాఁడు.

పథికాః పథి దృశ్యన్తే రాగద్వేషవిముక్తయా
యథా ధియా తథైవైతే ద్రష్టవ్యాః స్వేన్ద్రియాదయః. 5

మార్గమందు బాటసారులు రాగద్వేషరహితమను బుద్ధితోటి చూడఁబడునట్లు, అహంకారరహితమగు బుద్ధితోటి తన యింద్రియములున్ను నట్లే చూడఁబడవలయును.

ఏతేషు నాదరః కార్యః సతా నైవావధీరణమ్
పదార్థమాత్రతామిష్టాస్తిష్ఠన్త్వేతే యథాసుఖమ్. 6

బుద్ధిమంతుఁడగువాఁడే దేహేంద్రియాదుల నాదరింపఁగూడదు, (ఉపవాసాదులచే) అనాదరింపఁగూడదు. ప్రాప్తించిన పదార్థమాత్రముతోఁగూడినవై యవి సుఖపూర్వకముగ నుండుఁగాక!

పదార్థమాత్రం దేహాది ధియా సంత్యజ్య దూరతః
ఆశీతలాన్తఃకరణో నిత్యమాత్మమయో భవ. 7

ఓ రాజా! పదార్థమాత్రమగు దేహాదులను బుద్ధిచే దూరముగఁ ద్యజించి, పూర్ణశీతలాంతఃకరణుఁడవై, నిత్యము ఆత్మమయుఁడవు కమ్ము.

దేహోఽహమితి యా బుద్ధిః సా సంసారనిబన్ధనీ
న కదాచిదియం బుద్ధిరాదేయా హి ముముక్షుభిః. 8

నేను దేహమనను ఈబుద్ధి సంసారమున బంధింపనదై యున్నది. కావున ముముక్షువు లెన్నటికి నట్టిబుద్ధిని గ్రహింపఁగూడదు.

న కించిన్మాత్ర చిన్మాత్రరూపోఽస్మి గగనాదణుః
ఇతి యా శాశ్వతీ బుద్ధిః సా న సంసారబన్ధనీ. 9

నేనన్య మెద్దియుఁగాను, ఆకాశముకంటెను సూక్ష్మమైన చిన్మాత్రుఁడను, అను నిరంతర బుద్ధి సంసారమున బంధింపనిదై ముక్తిదాయకమైయున్నది.

యథా విమలతోయానాం బహిరన్తశ్చ భాసనం
తేజస్విష్ఠతి సర్వత్ర తథాత్మా సర్వవస్తుషు. 10

నిర్మలోదకముయొక్క బాహ్యాభ్యంతరములం దంతట సూర్యుని తేజ ముండునట్లు, ఆత్మ సర్వవస్తువులయొక్క బాహ్యాభ్యంతరములందును నుండియున్నది.

సంనివేశాంశ వై చిత్ర్యం యథా హేమ్నోఽఙ్గదాదితా
ఆత్మన స్తదతద్రూపా తథైవ జగదాదితా. 11

అంగద, కేయూరాద్యాభరణములం దంతట సువర్ణముమాత్రమే యెట్లు కలదో, కేవలము వాని యాకారములందు మాత్రమెట్లు వైచిత్ర్యమున్నదో, అట్లే జగదాదులం దంతటను ఆత్మయే గలదు, కేవలము మాయారచితమగు వాని యాకారమాత్రముననే భేదముకలదు.

వినాశవాడవాక్రాన్తం భీమం కామమహార్ణవం
జగజ్జాలతరఙ్గిణ్యో యాన్తి భూతతరఙ్గికాః. 12

వినాశమను బడబాగ్నిచే నాక్రమింపఁబడినట్టి భయంకరమైన కామమను మహాసముద్రమునుగూర్చి ప్రాణికోట్లను దరంగములతోఁగూడియున్న జగత్సమూహమను నదులు ప్రవహించుచున్నవి.

తథా ప్యద్యాప్యపూర్ణస్య యః పాతా కాలవారిధేః
తమాత్మానం మహాగస్త్యం రాజన్భావయ సర్వదా. 13

ఓ రాజా! అట్లైనను, నేఁటివఱకు నట్టి జగత్సమూహభక్షణముచేఁ దృప్తిఁబొందని యా కాలసముద్రమునకు, ఆత్మ మహాఅగస్త్యరూపమని నిరంతరము భావింపుము.

అనాత్మన్యాత్మతామస్మి న్దేహాదౌ దృశ్యజాలకే
త్యక్త్వా సత్త్వముపారూఢో గూఢస్తిష్ఠ యథా సుఖమ్. 14

అనాత్మరూపమగు దేహాది దృశ్యసమూహమున ఆత్మబుద్ధిని వదలి, నిర్వాసనాభావమున నారూఢుఁడవై. గూఢరూపమున సుఖపూర్వకముగ నుండుము.

కుచకోటరసంసుప్తం విస్మృత్య జననీ సుతం
యథా రోదితి పుత్రార్థం తథాత్మార్థమయం జనః. 15

పైటక్రింద నిదురించుచున్న బాలకుని మఱచి పుత్రునికొఱకుఁ దల్లి యేడ్చునట్లు, అంతఃకరణమున నే నిత్యములబ్ధమై యున్నట్టి ఆత్మను భ్రాంతిచే మఱచి యద్దానికై జీవుఁడు విలపించుచున్నాడు.

అజరామరమాత్మానమబుద్ధ్వా పరిరోదితి
హా హతోఽహమనాథోఽహం నష్టోఽస్మీతి వపుర్వ్యయే. 16

జరామరణరహితమైనట్టి ఆత్మ నెఱుఁగక, దేహము నశింప, అయ్యో నేజచ్చితి, నేనవాథుఁడను, నేను నశించితినని జీవుఁడేడ్చుచున్నాఁడు.

యథా వారిపరిస్పన్దాన్నానాకారం విలోక్యతే
తథా సంకల్పవశతశ్చిద్బ్రహ్మ పరిబృంహతి. 17

జలముయొక్క చలనమువలన తరంగాది అనేకరూపములుగనది కానుపించునట్లు, సంకల్పవశమువలన చిద్బ్రహ్మయే వివిధకార్యపరంపరగ వృద్ధినొందుచున్నది.

సంస్థాప్య సంకల్పకలఙ్కముక్తం
చిత్తం త్వమాత్మన్యుపశాన్తకల్ప
స్పన్దేఽప్యసంస్పన్దమివేహ తిష్ఠ
స్వస్థః సుఖీ రాజ్యమిదం ప్రశాధి. 18

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ఇక్ష్వాకుమనుసంవాదే అష్టాదశాధికశతతమః సర్గః ॥ 118 ॥

పుత్రకా! నీవు శమించిన సంకల్పముగలవాఁడవై సంకల్పమను కళంకములేని చిత్తమును ఆత్మయందు సంస్థాపనమొనర్చి, వ్యవహారార్థము శరీరాదులచే గ్రియలాచరించినను, అవి యాభాసమాత్రములే యగుటచే అసంగమగు ఆత్మచే నేమియు నాచరింపనివాఁడవై, స్వస్థుఁడవై, సుఖివై, ప్రాప్తించిన రాజ్యము నిటఁ బాలనయొనర్పుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఇక్ష్వాకుమను సంవాదమను నూటపదునెనిమిదవ సర్గము ॥ 118 ॥

## ఏకోనవింశాధికశతతమః సర్గః.

[వర్ణ్యతే పురుషస్యాత్ర స్వాతన్త్ర్యం మోక్షబన్ధయోః
విద్యావిద్యాత్మశక్తిభ్యాం సత్యాసత్యాత్మనిశ్చయాత్.

విద్య, అవిద్యయను ఆత్మయొక్క రెండుశక్తులఁబట్టి సత్యాసత్యములు నిశ్చితములు కాఁగా, బంధమోక్షముల విషయమున నిఁక మనుజుని స్వతంత్రతే యిట వర్ణింపఁబడుచున్నది.]

మనురువాచః—.

సర్గాత్మభిర్విభుః స్పన్దైః క్రీడతే బాలవత్స్వయం
సంహారాత్మకశక్త్యాథ సంహృత్యాత్మని తిష్ఠతి. 1

మనువు:—పుత్రకా! పరమాత్మ, సృష్టిరూపమగు తన అవిద్యా శక్తిచే తత్తత్సృష్టిరూప క్రియలఁగావించుచు, అజ్ఞదృష్టితోఁగూడి బాలకునివలె స్వయముగఁ గ్రీడించుచున్నాడు. మఱియు జ్ఞానదృష్టితోడ విద్యయను సంహారశక్తిచే నద్దానినంతయు సంహరించి సదాస్వాత్మయందే స్థితిగల్గి యుండుచున్నాఁడు.

స్వయమస్య తథా శక్తిరుదేత్యాం బధ్యతే యయా
స్వయమస్య తథా శక్తిరుదేత్యున్ముచ్యతే యయా. 2

దేనిచే నాతఁడు బంధింపఁబడునో, అట్టిశక్తి వానియందు స్వయముగ నుదయించుచున్నది. మఱియు, దేనిచే నాతఁడు ముక్తుఁడగునో, అట్టిశక్తియు వానియందు స్వయముగ నావిర్భవించు చున్నది.

చన్ద్రార్కవహ్నిరత్నాదీనాం యథార్చిషః
యథా పత్రాదివృక్షాణాం నిర్ఝరాణాం యథా కణాః. 3

తథేదం బ్రహ్మణి స్ఫారే జగద్బుద్ధ్యాదికల్పితం
దుఃఖప్రదమతజ్జ్ఞానాం తదేవా తదివ స్థితమ్. 4

చంద్ర, సూర్య, అగ్ని రత్న తప్తాయము (కాల్చిన యినుము)లనుండి వానిప్రకాశమున్ను, వృక్షములనుండి పత్రాదులును, సెలయేళ్లనుండి జలకణములును నెట్లు వేఱుగ, గల్పింపఁబడినవో, అట్లనే విశాలమగు బ్రహ్మమున జగత్తు, బుద్ధి మున్నగునవి వేఱుగఁ గల్పింపఁబడినవి. ఇదంతయు బ్రహ్మమేయైయున్నను, బ్రహ్మముకంటె వేఱుగనున్నట్లు తోఁచుచు అజ్ఞానులకు దుఃఖప్రదమై యొప్పుచున్నది.

అహో ను చిత్రా మాయేయం తాత విశ్వవిమోహినీ
సర్వాఙ్గప్రోతమప్యాత్మా యదాత్మానం న పశ్యతి. 5

పుత్రా! ఆహా! జగత్తును మోహింపఁజేయునట్టి యీ మాయ యెంతవిచిత్రమైనది. సర్వాంగములందును వ్యాపించియున్నను యీ యాత్మను జీవుఁడు గాంచుటలేదే!

చిదాదర్శమయం సర్వం జగదిత్యేవ భావయన్
యస్తిష్ఠత్యపశాన్తేచ్ఛం స బ్రహ్మకవచః సుఖీ. 6

ఈ జగత్తంతయుఁ చిదాదర్శ * మయమని భావించుచు నెవఁడు కోర్కెలు నశించినవాఁడై యుండునో, అట్టివాఁడు అజ్ఞానబాణములచే ఛేదింపనలవిగాని బ్రహ్మమే కవచముగఁ గలిగియుండును గాన నాతఁడే సుఖవంతుఁడగును.

అహమర్థవిముక్తేన భావేనాభావరూపిణా
సర్వం శూన్యం నిరాలమ్బం చిద్రూపమితి భావయేత్. 7

అహంకారరహితుఁడై, సమస్తవస్తువుల అభావరూప భావనచే, అంతయు శూన్యమై నిరాలంబమైనట్టి చిద్రూపబ్రహ్మమే యని భావించవలెను.

ఇదం రమ్యమిదం నేతి బీజం తే దుఃఖసంతతేః
తస్మిన్సామ్యాగ్నినా దగ్ధే దుఃఖస్యావసరః కుతః. 8

'ఇది రమ్యమైనది, ఇది రమ్యమైనదికాద'ను నీ ప్రకారమగు వైషమ్యకల్పనయే నీ యొక్క దుఃఖసమూహమునకు బీజమైయున్నది. సమత్వమను నగ్నిచే ఆ బీజము దహింపఁబడ నిఁక దుఃఖమునకు చోటెచట?

రాజన్నభావనాస్త్రేణ రమ్యారమ్యవిభాగితా
పౌరుషాతిశయేనాశు స్వేనైవాన్తర్విలూయతామ్. 9

ఓ రాజా! సమాధియొక్క యభ్యాసమువలన సర్వదృశ్య విస్మృతియను అస్త్రముచే మహాపురుషప్రయత్నముద్వారా రమ్యారమ్యవిభాగకల్పనను శీఘ్రముగ నీయంతఃకరణమున ఛేదించివేయుము.

అభావనేన భావనం విలూయ కర్మకాననం
పరం సమేత్య తానవం విశోక ఏవ తిష్ఠ భోః. 10

పుత్రకా! అభావన (సర్వదృశ్యవిస్మృతి)చే భావన (దృశ్యస్మరణ)ను, కర్మయను నరణ్యమును ఛేదించి, ఆకాశముకంటెను నతిసూక్ష్మమగు బ్రహ్మమును బొంది దుఃఖరహితుఁడవై యుండుము.

భరితభువనాభోగో భూత్వా విభాగబహిష్కృతో
గలితకలనాభాసోల్లాసో వివేకవిలాసవాన్
అధిగతపరమానన్దస్పన్దశ్చిరాయ నిరామయః
శమసమసిత స్వచ్ఛాభోగో భవాభయచిద్వపుః. 11

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ఇక్ష్వాకుమనుసంవాదే
ఏకోనవింశాధిక శతతమః సర్గః 119 ।

* చిదాదర్శము:—చైతన్యమను అద్దము అందు జగత్తు మిథ్యారూపమున ప్రతిబింబించినది.

పుత్రా! నీవు మొట్టమొదట వివేకమను విలాసముతోఁ గూడియుండి, పిమ్మట సమాధిచే నశించిన బాహ్యకల్పనాభాసము గలవాడవై, పూర్ణాత్మచే జగంబంతట వ్యాపించిన శరీరముగల్గి విభాగరహితుఁడవై పరమానందమును బొంది, శాశ్వతముగ సంసారరోగవర్జితుఁడవై, శాంతమై, సమమై, ఏకరసమై, స్వచ్ఛమైనట్టి చిన్మాత్రదేహంబు గలవాఁడవై, సంసార భయరహితుడవై యుండుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఇక్ష్వాకుమను సంవాదమను నూటపందొమ్మిదవ సర్గము ॥ 119 ॥

---

## వింశాధిక శతతమః సర్గః

[ముముక్షుభూమికాస్తిస్రో ముచ్యమానస్య తూత్తరాః.
ముక్తస్య పరత స్తిస్రో భూమికాః సప్త దర్శితాః.

ముముక్షువునకు మొదటి మూఁడుభూమికలు, ముక్తుఁడగుచున్నవానికి నాల్గవభూమిక, ముక్తునకుఁ దక్కిన మూఁడుభూమికలు — ఇట్లు సప్తభూమికల వర్ణనమిటఁ గావింపఁబడుచున్నది ]

మనురువాచ:—

శాస్త్రసజ్జనసంపర్కైః ప్రజ్ఞామాదౌ వివర్ధయేత్
ప్రథమా భూమికైషోక్తా యోగస్యైవ చ యోగినః. 1

మనువు — పుత్రా! శాస్త్రాభ్యాస, సజ్జనసహవాసములచే మొదట ప్రజ్ఞను వృద్ధిపఱచవలెను. ఇది యోగముయొక్కయు, యోగియొక్కయు మొదటిభూమికయని చెప్పఁబడినది.

విచారణా ద్వితీయా స్యాత్తృతీయాఽసఙ్గభావనా
విలాపనీ చతుర్థీ స్యాద్వాసనా విలయాత్మికా. 2

ఇఁక రెండవభూమిక 'విచారణ' మూఁడవది 'అసంగభావన' (అసంగాత్మను గూర్చిన భావన) నాల్గవది. వాసనల క్షయ భూతమగు అవిద్యలయించునట్టి 'విలాపనీ' అవస్థ.

శుద్ధసంవిన్మయానన్దరూపా భవతి పఞ్చమీ
అర్ధసుప్తప్రబుద్ధాభో జీవన్ముక్తోఽత్ర తిష్ఠతి 3

శుద్ధ చిన్మాత్ర సంవిత్తుచేఁ బూర్ణమై, ఆనందరూపమైన యైదవ భూమిక, జీవన్ముక్తుఁడగు యోగి యీభూమికయం దర్ధనిద్రితునివలెను, అర్ధజాగ్రతునివలెను నుండును.

స్వసంవేదనరూపా చ షష్ఠీ భవతి భూమికా
ఆనన్దైకఘనాకారా సుషుప్తసదృశస్థితిః. 4

స్వభావముగనే నిరతిశయానందమయమై, బ్రహ్మాకారానుభవవృత్తి రూపమై, సుషుప్తివలె నున్నట్టి స్థితి యాఱవ భూమిక.

తుర్యావస్థోపశాన్తాథ ముక్తిరేవేహ కేవలమ్
సమతా స్వచ్ఛతా సౌమ్యా సప్తమీ భూమికా భవేత్. 5

అట్టి వృత్తియున్ను క్షయించి, శమించిన తురీయావస్థ గలదై, కేవలము ముక్తిరూపమై సమమై, స్వచ్ఛమై, సౌమ్యమైనట్టి స్థితి యేడవభూమిక (తురీయాతీతావస్థ) యగును.

తుర్యాతీతా తు యావస్థా పరా నిర్వాణరూపిణీ
సప్తమీ సా పరిప్రౌఢా విషయః స్యాన్న జీవతామ్. 6

ఇట్టి తురీయాతీతావస్థ పరానిర్వాణరూపమైయున్నది. ఈ సప్తమభూమికయే మిగుల ప్రౌఢమైనచో విదేహముక్తి సంభవించును. అది జీవించియుండు యోగులకు విషయముకాదు.

పూర్వావస్థాత్రయం త్వత్ర జాగ్రదిత్యేవ సంస్థితమ్
చతుర్థీ స్వప్న ఇత్యుక్తా స్వప్నాభం యత్ర వై జగత్. 7

ఇందు మొదటి మూఁడవస్థలున్ను జాగ్రద్రూపములై యుండును. నాల్గవది స్వప్నరూపమని పేర్కొనఁబడినది. అందు జగత్తు స్వప్నతుల్యముగ భాసించును.

ఆనన్దైకఘనీభావాత్సుషుప్తాఖ్యా తు పఞ్చమీ
అసంవేదనరూపాథ షష్ఠీ తుర్యపదాభిధా. 8

ఆనందఘనమగు ఆత్మతో ఏకీభావమునొందుటచే నైదవభూమిక సుషుప్తిరూపమని చెప్పఁబడినది. ఇతరపదార్థముల జ్ఞానములేక కేవలము స్వరూపమాత్రమందలి స్థితియే గల్గియున్నదగుటచే ఆఱవది తురీయపదమని వచింపఁబడినది.

తుర్యాతీతపదావస్థా సప్తమీ భూమికోత్తమా
మనోవచోభిరగ్రాహ్యా స్వప్రకాశపదాత్మికా. 9

తురీయాతీత పదావస్థయుత్తమమైన యేడవ భూమికయగును. ఇది స్వప్రకాశరూపమగుటచే మనోవాక్కులకగ్రాహ్యమై పఱఁగుచున్నది.

అన్తః ప్రత్యాహృతివశాచ్చేత్యం చేన్న విభావితమ్
ముక్త ఏవాస్య సందేహో మహాసమతయా తయా. 10

అంతరంగమున సమస్తము లయించుటచే విషయమేమియు భాసింపకుండునట్టి యా సప్తమ భూమికారూపమహాసమత్వముచే యోగి ముక్తుఁడేయగును. ఇందు సందేహమేమియు లేదు.

యదోర్భోగసుఖదుఃఖాంశైరపరామృష్టపూర్ణధీః
సశరీరోఽశరీరో వా భవత్యేవంమతిః పుమాన్. 11

అట్టి భోగజనితములగు సుఖములచేగాని, దుఃఖములచే గాని యోగియొక్క పరిపూర్ణబుద్ధి కొంచమైనను స్పృశింపఁబడదు. మఱియు నపుడాతఁడు 'ఈ శరీరముండుగాక! లేకపోవుగాక!' అను భావము గలిగియుండును.

న మ్రియే న చ జీవామి నాహం సన్నాప్యసన్మయమ్
ఆత్మారామో నరస్తిష్ఠేత్తన్ముక్తత్వముదాహృతమ్. 12

'నేను మరణించుటలేదు, జీవించుటలేదు, నేను సత్తుగాను, అసత్తుగానైను నీప్రకారముగ ఆత్మారాముఁడై యే మనుజుఁడుండునో, ఆతఁడే జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

వ్యవహారీ వ్యపాస్తో వా గృహస్థో వాథవైకకః
అహం న కించిచ్చిదితి మత్వా జీవో న శోచతి. 13

'వ్యవహారము గలవాఁడైనను, లేక వ్యవహారము లేనివాఁడైనను, గృహస్థుఁడైనను, సన్న్యాసినైనను, 'నేనన్యమెద్దియుఁగాను, చిన్మాత్రుఁడనే' అని విశ్వసించి యోగియగు మనుజుఁడు దుఃఖమునొందకుండును.

అలేపకోఽహమజరో నీరాగః శాన్తవాసనః
నిర్మలోఽస్మి చిదాకాశ ఇతి మత్వా న శోచతి. 14

'నేను సంసారముచే లిప్తుఁడనుగాను, అజరుఁడ (వార్ధక్యవర్జితుఁడను,) రాగద్వేషరహితుఁడను, వాసనాశూన్యుఁడను, నిర్మల చిదాకాశమాత్రుఁడన'ని యెఱిఁగి యోగి దుఃఖింపకుండును.

అహమన్తాదిరహితః శుద్ధో బుద్ధోఽజరామరః
శాన్తః సమసమాభాస ఇతి మత్వా న శోచతి. 15

'నే నాద్యంతరహితుఁడను, శుద్ధుఁడను, బుద్ధుఁడను, అజరుఁడను, అమరుఁడను, శాంతుఁడను, సర్వత్ర సమముగ భాసిల్లుచున్నాఁడన'ని యెఱిఁగి యోగి శోకమును బొందకుండును.

తృణాగ్రేష్వమ్బరే భానౌ నరనాగామరేషు చ
యత్తదస్తి తదేవేతి మత్వా భూయో న శోచతి. 16

'తృణాగ్రములందును, ఆకాశమందును, సూర్యునియందును, మనుజులందును, నాగములందును, దేవతలందును ఏ సన్మాత్రముగలదో, ఆ ప్రత్యక్ - చిన్మాత్రమే నేన'ని యివ్విధమున అఖండ వాక్యార్థము నెఱిఁగి యోగి దుఃఖింపకుండును.

తిర్యగూర్ధ్వమధస్తాన్మే వ్యాపకో మహిమాచితః
తస్యానన్తవిలాసస్య జ్ఞాత్వేతి క ఇవక్షయః. 17

'చిద్రూపుఁడనగు నాయొక్క మహిమ తిర్యగూర్ధ్వాధోదిశల నంతట వ్యాపించియున్నదని యిట్లనంతవిలాసయుక్తుఁడగు పరమాత్ముని మహిమ నెఱిఁగి యెవఁడిఁక మరణాది దుఃఖముల నొందగల్గును.

బద్ధవాసనమర్థో యః సేవ్యతే సుఖయత్యసౌ
యత్సుఖాయ తదేవాశు వస్తు దుఃఖాయ నాశతః. 18

ఏ వస్తువు వాసనారహితముగ సేవింపఁబడునో, అదియే (ఆ సేవించుజ్ఞానికి) సుఖమును గలుగఁజేయుచున్నది. వాసనాయుతుఁడగు అజ్ఞానికియే పదార్థము సుఖమును గలుగఁజేయుచున్నదో, అది నశించుటచే తిరిగి యది వానికి శీఘ్రముగ దుఃఖమునే కలుగఁజేయుచున్నది.

అవినాభావ నిష్ఠత్వం ప్రసిద్ధం సుఖదుఃఖయోః
తనువాసన మర్థో యః సేవ్యతే వా వివాసనమ్. 19
నాసౌ సుఖాయతే నాసౌ నాశకాలే న దుఃఖదః

సుఖదుఃఖములకు అవినాభావస్థితి గలదు. (దేనిచే సుఖము గల్గుచున్నదో, దాని, అవభావమునందు దుఃఖమున్ను గల్గుచున్నది.) సూక్ష్మవాసనచేగాని, వాసనారహితముగగాని యే పదార్థమను భవింపఁబడుచున్నదో, అది సుఖమును గలిగింపదు. నశించుటచే దుఃఖమున్ను గలుగఁజేయదు.

క్షీణవాసనయా బుద్ధ్యా యత్కర్మ క్రియతేఽనఘ 20
తద్దగ్ధబీజవద్భూయో నాఙ్కురం ప్రతిముఞ్చతి
దేహేన్ద్రియాదినా కర్మ కరణౌఘేన కల్ప్యతే. 21

పాపరహితుఁడవగు పుత్రా! ఏలయనఁగా క్షీణవాసనాయుక్తమగు బుద్ధిచే నొనర్పఁబడు కర్మ దగ్ధబీజమువలె మరల అంకురింపకుండును. మఱియు, దేహేంద్రియాది కరణసమూహముచేతనే కర్మ కల్పింపఁబడుచున్నది.

ఏకః కర్తా చ భోక్తా చ క ఇవాత్రోపపద్యతే
భావనాం సర్వభావేభ్యః సముత్సృజ్య సముత్థితః. 22

ప్రియపుత్రా! ఆ యింద్రియాది సమూహమున నేకమైన శుద్ధచైతన్యము కర్త, భోక్త యెట్లగును? ఆ చైతన్యము సర్వపదార్థములనుండియు అహంత్వాధ్యాసమును ద్యజించి వేఱుగనున్నది.

శశాఙ్కశీతలః పూర్ణో భాతి భాసేవ భాస్కరః

ఆ చైతన్యము పూర్ణ, శీతల చంద్రునివలెనున్నదై, సూర్యునివలెఁ దన చిన్మయ దీప్తిచే స్వయముగఁ బ్రకాశించుచున్నది.

క్రియమాణా కృతా కర్మతూలశ్రీర్దేహశాల్మలేః. 23
జ్ఞానానిలసముద్ధూతా ప్రోడ్డీయ క్వాపి గచ్ఛతి

దేహమను బూరుగచెట్టుయొక్క, చేయఁబడుచున్నట్టియు, మఱియు, చేయఁబడినట్టియు కర్మయను దూదిరాశియంతయు జ్ఞానమను వాయువుచే నెగురగొట్టఁబడి యెచటికో కొట్టుకొని పోవుచున్నది.

సర్వైవ హి కలా జన్తోరనభ్యాసేన నశ్యతి. 24
ఏషా జ్ఞానకలా త్వన్తః సకృజ్జాతా దినేదినే
వృద్ధిమేతి బలాదేవ సుక్షేత్రవ్యుప్తశాలివత్. 25

మరల మరల అభ్యసింపమి జీవుల సర్వవిధములగు కళాకౌశల్యమంతయు కాలక్రమమున నశించుచున్నది. కాని, ఈ జ్ఞానకళ యంశీకరణమున నొక్క పర్యాయము ముదయించినచో నిక నది యుత్తమక్షేత్రమున నాటబడిన ధాన్యమువలె దినదినము వృద్ధినొందుచు నేయుండును.

ఏకః స్ఫురత్యఖిలవస్తుషు విశ్వరూప
ఆత్మా సరస్సు జలధిష్వివ తోయవచ్ఛమ్
సంశాన్తసంకలన భూరికలాపమేకం
సత్తాంశమాత్రమఖిలం జగదజ్ఞ విద్ధి. 26

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే సప్తభూమికా విభాగో నామ వింశత్యధిక శతతమః సర్గః 120 ॥

ప్రియపుత్రా ! సమస్త లేటాక, సముద్రములందును నొకే స్వచ్ఛమైన జలము స్ఫురించు నట్లు, సమస్త పదార్థములందును నొకే విశ్వరూపియగు సన్మాత్రమైన ఆత్మయే స్ఫురించుచున్నది. కావున, ఈ జగత్తంతటిని సమస్త విచిత్రకల్పనాకలాపరహితమై, ఏకమైన సత్తాంశమాత్రము (సన్మాత్రము) గనే యెఱుంగుము.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున సప్త భూమికావిభాగమను నూట యిరువదవ సర్గము ॥120॥

---

## ఏకవింశత్యధిక శతతమః సర్గః

[యయా ప్రకృష్యతే జీవో యయా చోత్కృష్య ముచ్యతే
అత్ర తే భావనే సమ్యగ్విభజ్య మను నేరితే.

దేనిచే నీడ్వబడి జీవుఁడు సంసారమునఁ దగుల్కొనుచున్నాఁడో, దేనిచే నందుండి వెడలి ముక్తుఁ డగుచున్నాఁడో, ఆ రెండుభావనలు మనువుచే నిట వచింపఁబడుచున్నవి.]

మనురువాచ:—

యావద్విషయభోగాశా జీవాఖ్యా తావదాత్మనః
అవివేకేన సంపన్నా సాప్యాశా హి న వస్తుతః. 1

మనువు:– పుత్రా ! ఎంతవఱకు విషయభోగములఁ గూర్చిన యాశయుండునో, అంతవఱకు ఆత్మకు జీవదశయుండును. మఱియు, ఆ విషయ భోగాశయున్ను అవివేకముచే సంప్రాప్తించినదేగాని వాస్తవముగఁ గాదు.

వివేకవశతో యాతా క్షయమాశా యదా తదా
ఆత్మా జీవత్వముత్సృజ్య బ్రహ్మతామేత్యనామయః. 2

వివేకముచే నెపుడు భోగాశ క్షయించునో, అపుడాత్మ తన జీవదశను త్యజించి, అనామయమగు బ్రహ్మరూపత్వమును బొందుచున్నది.

ఊర్ధ్వాదధ స్తథాధస్తాత్పునరూర్ధ్వం వ్రజంశ్చిరమ్
మా సంసారారఘట్టస్య చిన్తారజ్జ్వాం ఘటీ భవ. 3

పుత్రా! పైనుండి క్రిందకు, మరల క్రిందనుండి పైకి, ఇట్లు మరలమరల చిరకాలము తిరుగుచున్నట్టి సంసార (భోగ) మను అరఘట్టము (ఏతము) యొక్క చింతయను రజ్జువునందు ఘటమువలె నీవు బంధింపఁబడకుము.

ఇదం మమాహమస్యేతి వ్యవహార ఘనభ్రమమ్
యే మోహాత్పరిసేవన్తే అధస్తాద్యాన్త్యధః శఠాః. 4

'ఇది నాది, నేను వీనికి జెందితిని' అనునట్టి ఘనీభూతమగు వ్యవహారభ్రమ నెవరు మోహవశమున సేవింతురో. అట్టి మూర్ఖులు క్రిందనుండి యింకను క్రిందికి పడిపోవుదురు.

అస్యాహమేష మే సోఽయమహమేవం తు యైః కిల
మోహో బుద్ధ్యా పరిత్యక్త ఊర్ధ్వాదూర్ధ్వం ప్రయాన్తి తే. 5

'నేను వీనికిఁ జెందితిని, వీఁడు నావాఁడు, ఈ దేహము నేన'ను ఈ ప్రకారమగు మోహము నెవరు జ్ఞానముచేఁ బరిత్యజింతురో, అట్టి మహాత్ములు పైనుండి యింకను పైకి పోవుదురు.

స్వప్రకాశం స్వమాత్మానమవలమ్బ్య విలమ్బితమ్
ఆస్వ సంపూరితాకాశం జగన్తి నృప పశ్య హే. 6

ఓ రాజా! స్వప్రకాశరూపమగు నీయొక్క ఆత్మ నవలంబించి జగంబులన్నింటిని బూర్ణమొనర్చి వ్యాపించియున్నట్టి చిదాకాశము నే గాంచుము.

యదైవైవం చితో రూపం తతం బుద్ధమఖణ్డితమ్
తదైవ తీర్ణః సంసారః పరమేశ్వరతాం గతః. 7

ఎపుడివ్విధమున వ్యాప్తమై, అఖండితమైనట్టి చిద్రూపము కాంచఁబడెనో, అపుడే జీవుఁడు సంసారసాగరమును దాటి పరమేశ్వరత్వమును బొందుచున్నాఁడు.

బ్రహ్మేన్ద్రవిష్ణువరుణా యద్యత్కుర్వుం సముద్యతాః
తదహం చిద్వపుః సర్వం కరోమీత్యేవ భావయేత్. 8

'బ్రహ్మ, యింద్రుఁడు, విష్ణువు, వరుణుఁడు, ఈశ్వరుఁడు మున్నగు వారేదేది చేయుటకు యత్నించుచున్నారో, అది యెది యంతయు చిత్ – శరీరుఁడగు నేనేచేయుచున్నా నని భావించవలెను.

యేషు యేషు యదా యద్యద్దర్శనేషు నిగద్యతే
సర్వమేవాఙ్గ తత్సత్యం చిద్విలాసోహ్యనఙ్కుశః 9

ప్రియపుత్రా! ఏయే శాస్త్రములం దెపుఁడెపు డేదేది వచింపఁబడెనో, అద్దియది యంతయు సత్యమే యగును. ఏలయనఁగా! చిద్విలాసము అంకుశరహితమైనది.

చిన్మాత్రత్వం ప్రయాతస్య తీర్ణమృత్యోర్వరచేతసః
యో భవేత్పరమానన్దః కేనాసావుపమీయతే. 10

చిన్మాత్రత్వమును బొంది, మృత్యువును దాటి, శమించిన చిత్తముగలవానికి ఏపరమానందము లభించుచున్నదో, అది దేనితోటి పోల్చబడఁగలదు?

నాప్యశూన్యం న శూన్యం చ నాచిద్రూపం న చిన్మయం
నాత్మరూపం నాన్యరూపం భువనం భావయన్భవ. 11

ఓ రాజా! ఈజగత్తు శూన్యముకాదు, అశూన్యముకాదు, చిద్రూపముకాదు, అచిద్రూపముకాదు, ఆత్మరూపముకాదు, అనాత్మరూపముకాదని (అనిర్వచనీయరూపమని) భావించుచు బ్రహ్మస్వరూపుఁడవు కమ్ము.

ఏతత్స్వరూపమాసాద్య ప్రకృతిః పరిశామ్యతి
న దేశో మోక్షనామాస్తి న కాలో నేతరా స్థితిః. 12

ఇట్లు మనుజునకు తన ఆత్మయొక్క సాక్షాత్ పారమార్థికస్వరూపము ప్రాప్తించుటచే ప్రకృతి శమించుచున్నది. ఇదియే మోక్షము. మోక్షమే దేశముయొక్క గాని, ఏ కాలముయొక్క గాని పేరుకాదు. లేక, దానికి (ఆత్మరూపప్రాప్తితప్ప) మఱియే యితరస్థితియున్ను లేదు.

అహంకృతేర్విమోహస్య క్షయేణేయం విలీయతే
ప్రకృతిర్భావనానామ్నా మోక్షః స్యాదేష ఏవ సః 13

అహంకారమను మోహము నశించుటచే ప్రకృతియున్ను నశించుచున్నది. ఆత్మస్వరూపముయొక్క సాక్షాత్కార భావనయే మోక్షమని చెప్పఁబడుచున్నది.

ప్రశాన్తశాస్త్రార్థవిచారచాపలో నివృత్తనానారసకావ్యకౌతుకః
నిరస్తనిఃశేషవికల్పవిప్లవః సమః సుఖం తిష్ఠతి శాశ్వతాత్మకః. 14

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే ఇక్ష్వాకుమనుసంవాదో నామ
ఏకవింశాధిక శతతమః సర్గః ॥ 121 ॥

వివిధశాస్త్రార్థములఁ గూర్చిన జిజ్ఞాసయను చపలత్వము శమించినవాఁడును, నానాప్రకారములైన కావ్యనాటకాదుల కౌతుకములేనివాఁడును, సమస్త వికల్పోపద్రవములు తొలఁగినవాఁడును, సమరూపుఁడునగు జీవన్ముక్తుఁడైన మనుజుఁడు శాశ్వతమైన సచ్చిదానందరూపముతోటి సుఖపూర్వకముగ ఈప్రపంచమున వెలయుచుండును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశియందు నిర్వాణప్రకరణమున
ఇక్ష్వాకుమనుసంవాదమను నూటయిరువదియొకటవ సర్గము ॥121॥

## ద్వావింశత్యధికశతతమః సర్గః.

[నిరూఢస్యాత్మ బోధస్య తుర్యాతీత పదస్థితేః
ముక్తస్యేహ యతేశ్చర్యా లక్షణైర్మను నేర్యతే.

సుదృఢమైన ఆత్మబోధగలవాఁడును, తురీయాతీత పదమందున్నవాఁడునగు యతియొక్క దినచర్య లక్షణములతో సహా మనువుచే నిట వర్ణింపఁబడుచున్నది.]

మనురువాచః—

యేన కేనచిదాచ్ఛన్నో యేన కేనచిదాశితః
యత్రక్వచనశాయీ చ స సమ్రాడివ రాజతే. 1

మనువు; పుత్రా! ఎవరిచేతనో, వస్త్రములచేఁ గప్పఁబడినవాఁడై, ఎవరిచేతనో భుజింపఁ జేయఁబడినవాఁడై, తన యిచ్ఛానుసార మెచటనో పరుండుచు (తురీయాతీతపదస్థిత) జీవన్ముక్తుఁడు చక్రవర్తివలె శోభించును,

వర్ణధర్మాశ్రమాచార శాస్త్రయన్త్రిణయోజ్ఝితః
నిర్గచ్ఛతి జగజ్జాలాత్పఞ్జరాదివ కేసరీ. 2

వర్ణాశ్రమాచార, శాస్త్రరూపయంత్రములచే విడువఁబడినవాఁడై, అట్టి జీవన్ముక్తుఁడైన యతి, బోనునుండి సింహమువలె ఈ జగజ్జాలమునుంచి బయటకు వెడలుచున్నాఁడు.

వాచామతీతవిషయో విషయాశాదశోజ్ఝితః
కామప్యుపగతః శోభాం శరదీవ నభస్తలమ్. 3

వాక్కునకుఁ బరమైనట్టి నిరతిశయానందమును బొందినవాఁడును, కనుకనే విషయదశల నుండి విడువఁబడినవాఁడునగు యా యతివర్యుఁడు శరత్కాలాకాశమువలె నొకానొక యనిర్వచనీయమైనట్టి నిర్మల శోభను బడయుచున్నాఁడు.

గమ్భీరశ్చ ప్రసన్నశ్చ గిరావివ మహాహ్రదః
పరానన్దరసాక్షుబ్ధో రమతే స్వాత్మనాత్మని. 4

పర్వతముపైని గొప్పహ్రదము (మడుగు) వలె గంభీరమై, నిర్మలమై యొప్పువాఁడును, ఆత్మానంద రసాస్వాదమునుండి యెన్నఁడును చ్యుతుఁడుకానివాఁడునునై యాతఁడు తనయాత్మ యందే సదా క్రీడించుచుండును.

సర్వకర్మఫలత్యాగీ నిత్యతృప్తో నిరాశ్రయః
న పుణ్యేన న పాపేన లిప్యతే నేతరేణ చ. 5

సమస్త కర్మలయొక్క ఫలములను త్యజించినవాఁడై, నిత్యతృప్తుఁడై, నిరాశ్రయుఁడై, యమ్మహాత్ముఁడు పుణ్యపాపములచేగాని, తదితరములగు హర్షశోకాదులచేగాని యంటఁబడకయుండును.

స్ఫటికః ప్రతిబిమ్బేన యథా యాతి న రఞ్జనమ్
తజ్జ్ఞః కర్మఫలేనాన్తస్తథా నాయాతి రఞ్జనమ్. 6

ప్రతిబింబముచే స్ఫటిక మెట్లు రూపాంతరమును బొందకుండునో, అట్లే ప్రారబ్ధకర్మ ఫల రూపముగఁ బ్రాప్తించిన సుఖదుఃఖాదులచే జ్ఞాని తన యాత్మస్వభావమునుండి యెన్నటికిని చ్యుతుఁడు గాకయుండును.

విహరజ్జనతావృన్దే దేహకర్తనపూజనైః
ఖేదాహ్లాదౌ న జానాతి ప్రతిబిమ్బగతైరివ. 7

జనసమూహమున విహరించుచు నాతఁడు తనదేహము ఖండింపఁబడినను, పూజింపఁబడినను తద్దేహ ప్రతిబింబమువలె ఖేదమునుగాని, ఆహ్లాదమునుగాని పొందకుండును.

నిఃస్తోత్రో నిర్వికారశ్చ పూజ్యపూజావివర్జితః
సంయుక్తశ్చ వియుక్తశ్చ సర్వాచారనయక్రమైః. 8

పూజితుఁడైనను స్తుతిశూన్యుఁడును, పూజితుఁడు గాకున్నను వికారరహితుఁడునునై, జ్ఞాని సమస్త ఆచారనీతిక్రమములతోఁ గూడియు, ఒకపుడు కూడకయునుండును.

తస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ సః
రాగద్వేషభయానన్దైస్త్యజ్యతేఽపి చ యుజ్యతే. 9

ఆతనిచే లోకము భయము నొందదు, లోకముచే నాతఁడును భయభీతుఁడు కాఁడు. మఱియు రాగద్వేషభయానందములచే నొకపుడు త్యజింపఁబడును, ఒకపుడు వానితో (లీలామాత్రముగ) గూడి యుండును.

ప్రమేయే కస్యచిదపి న రోహతి మహాశయః
ప్రమేయీక్రియతే చాపి బాలేనాప్యదురాశయః. 10

గొప్పధీశాలిగూడ, తత్త్వజ్ఞానమున వాని యంతు కనుగొనఁజాలడు. వ్యవహారమున, శుద్ధ చిత్తుఁడైన బాలునిచేఁగూడ నాతఁడు వశీకృతుఁడగును.

తనుం త్యజతు వా తీర్థే శ్వపచస్య గృహేఽపి వా
మా కదాచన వా రాజన్వర్తమానేఽపి వా క్షణే. 11

ఓ రాజా! ఆతఁడేదేని తీర్థమందు దన శరీరత్యాగము చేసినను, లేక చండాలునిగృహమందుఁ దనదేహము విడినను, లేక తన శరీరము నెన్నడును వీడకనే యున్నను, లేక వర్తమానక్షణముననే వీడినను, అందే విశేషమున్ను లేదు. (దేహత్యాగమును గూర్చిన చింతయే యాతనికి లేదని భావము)

జ్ఞానసంప్రాప్తిసమయే ముక్తోఽసౌ విగతాశయః
అహంభ్రాన్తిర్నిబన్ధాయ మోక్షో జ్ఞానేన తత్క్షయః. 12

ఏకోర్కెలులేని యాతఁడు జ్ఞానప్రాప్తిసమయముననే ముక్తుఁడైయుండెను. ఏలయనఁగా, అహంకారభ్రాంతియే బంధమును గలిగించుచున్నది. జ్ఞానముచే నది నశింప, మోక్షము సంప్రాప్తించుచున్నది.

స పూజనీయః స స్తుత్యో నమస్కార్యః స యత్నతః
స నిరీక్ష్యోఽభివాద్యశ్చ విభూతివిభవైషిణా. 13

ఐశ్వర్యమును గోరు మనుజుఁడు ప్రయత్నముచే నట్టి జీవన్ముక్తుని బూజింపవలెను, స్తుతింపవలెను, నమస్కరింపవలెను, దర్శింపవలెను, వందనమాచరింపవలెను.

న యజ్ఞతీర్థైర్న తపఃప్రదానై
రాసాద్యతే తత్పరమం పవిత్రమ్
ఆసాద్యతే క్షీణభవామయానామ్
భక్త్యా సతామాత్మవిదాం యదఙ్గ. 14

ప్రియపుత్రా! సంసారరోగము శమించినవారును, ఆత్మవేత్తలునగు మహాత్ములయెడల భక్తి గల్గియుండుటచే, నే పరమ పవిత్రఫలము లభించుచున్నదో, అయ్యది యజ్ఞ, తీర్థ, తపోదానాదులచేతను లభింపఁజాలదు.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏవముక్త్వా స భగవాన్మనుర్బ్రహ్మగృహం యయౌ
ఇక్ష్వాకురపి తాం దృష్టిమవష్టభ్య స్థిరోఽభవత్. 15

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే ఇక్ష్వాకుమనుసంవాదే ఇక్ష్వాకుప్రబోధనం నామ ద్వావింశత్యధిక శతతమః సర్గః ॥ 122 ॥

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! భగవంతుఁడగు మను పిట్లు వచించి బ్రహ్మదేవుని సదనమునకుఁ జనెను. ఇక్ష్వాకువున్ను దత్ప్రోక్తమగు ఆత్మదృష్టిని దృఢముగ నవలంబించి, స్థిర చిత్తుఁడైయుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున ఇక్ష్వాకుప్రబోధనమను నూటయిరువది రెండవ సర్గము ॥ 122 ॥

---

## త్రయో వింశత్యధిక శతతమః సర్గః.

[జ్ఞస్యాజ్ఞేభ్యోఽన్యసిద్ధేభ్యః ఖేచరత్వాణిమాదిషు
అనిచ్ఛైవ హి పూర్ణత్వాద్విశేషోఽత్రాభిధీయతే.

అజ్ఞులగు సిద్ధులకంటె జ్ఞాని యన్నివిధముల పూర్ణుఁడగుటచే, ఆకాశగమనము, అణిమాది సిద్ధులు, మున్నగువానియొక్క కోర్కె వానికి యుండదు. ఇదియే వానియందలి విశేషత్వమని యిట తెల్పఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

ఏవం స్థితే హి భగవఞ్జీవన్ముక్తస్య సన్మతేః
అపూర్వోఽతిశయః కోఽసౌ భవత్యాత్మవిదాంవర. 1

శ్రీ రాముఁడు:—ఆత్మవేత్తలలో శ్రేష్ఠుఁడవగు నో మహాత్మా! ఇట్లుండుటచే సన్మతియగు జీవన్ముక్తునకు (ఆకాశగమనాది సిద్ధిరూపమగు) అపూర్వమైన అతిశయమేదేని యుండునా?

శ్రీవసిష్ఠ ఉవాచ: –

జ్ఞస్య కస్మింశ్చిదేవాంశే భవత్యతిశయేన ధీః
నిత్యతృప్తః ప్రశాన్తాత్మా స ఆత్మన్యేవ తిష్ఠతి. 2

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! జ్ఞానికి సాంసారిక సిద్ధుల విషయమున నొకింతైనను అతిశయమైన పట్టుదలయుండదు. అతఁడు నిత్యతృప్తుఁడై, శాంతచిత్తుఁడై ఆత్మయందే నెలకొని యుండును.

మన్త్రసిద్ధైస్తపః సిద్ధైస్తన్త్రసిద్ధైశ్చ భూరిశః
కృతమాకాశయానాది కా తత్ర స్యాదపూర్వతా. 3
అణిమాద్యపి సంప్రాప్తం తాదృశైరేవ భూరిశః
యత్నేన సాధితైస్త్వాత్మైర్నైతరేణాత్మ దర్శినా. 4

అనేకములైన మంత్రములచేతను, తపస్సులచేతను తంత్రములచేతను జనులాకాశగమనాది సిద్ధులనుబడయుదురు. కాని, వాని యన్నింటియందును దనరూపమును నే గాంచుటచే ఆత్మజ్ఞానికి వాని ప్రాప్తియందపూర్వత్వమేమి యుండును? ఆ విధముగనే యనేకములైన మంత్రాతాద్యులచే అణిమాదిసిద్ధులున్ను జీవులచే స్వయత్నముచే నే సాధింపఁబడుచున్నవి. కావున నవియన్నియు నపూర్వము లేగాని అపూర్వములుగా నేరవు. మఱియు, ఆత్మజ్ఞాని సర్వాత్మ భూతుఁడగుటఁబట్టి, ఇతరులచేఁ బ్రయత్నమువలన సాధింపఁబడు ఆయా సాంసారిక సిద్ధులున్ను దనచేతనే సాధింపఁబడిన వగును గాన మరల తాను వానిని సాధించుటవలసిన ప్రయోజనమేమియును లేదు.

ఏష ఏవ విశేషోఽస్య న సమో మూఢబుద్ధిభిః
సర్వత్రాస్థాపరిత్యాగాన్నీరాగమమలం మనః.
భవేత్తస్య మహాబుద్ధేర్నాసౌ వస్తుషు మజ్జతి. 5

ఆత్మజ్ఞాని మూఢబుద్ధులతోటి సమానముగ నుండడు. ఇదియే వానియందలి విశేషము. అంతటను ననురాగమును త్యజించినందువలన నట్టి రాగరహితుడైన మహాబుద్ధిమంతుని చిత్తము సదా నిర్మలముగా నుండును. అట్టివాఁడు పదార్థములందు నిమగ్నుఁడు కానేరడు.

ఏతావదేవ ఖలు లిఙ్గమలిఙ్గమూర్తేః
సంశాన్త సంసృతి చిరభ్రమనిర్వృతస్య

తజ్ఞస్య యన్మదనకోపవిషాదమోహ
లోభాపదామనుదినం నిపుణం తనుత్వమ్. 6

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఘూర్వార్థే అజ్ఞాదేర్జ్ఞస్య విశేషకథనం నామ త్రయోవింశత్యుత్తర శతతమః సర్గః|| 123 ||

ఓ రామచంద్రా! చిహ్నరహితుఁడును, శాంత చిత్తుఁడును, చిరకాల సంసారభ్రమతోలఁగినవాఁడునునగు జ్ఞానియొక్క చిహ్న మేమనఁగా — కామ, క్రోధ, లోభ, మోహ, శోకాదులవలనఁ గలుగు యాపదలు ప్రతిదిన మాతనికి లెస్సగ క్షయించుచుండును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున అజ్ఞాదేర్జ్ఞస్య విశేషకథనమను నూటయిరువదిమూఁడవ సర్గము ॥123॥

---

## చతుర్వింశత్యధిక శతతమః సర్గః.

నిష్కారణత్వం జీవానాం గ్రాహ్యరాగేణ బద్ధతా
రూపాణ్యవస్థాస్తుర్యం చ మృగవ్యాధీయమీర్యతే.

[జీవుల నిష్కారణత్వము, గ్రాహ్యవిషయములగూర్చిన రాగముచే బంధనము, జీవుల స్వరూపావస్థ, తుర్యావస్థ, మృగవ్యాధుని కథ మున్నగు విషయములిట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథా సత్త్వముపేక్ష్య స్వం శనైర్విప్రో దురీహయా
అఙ్గీకరోతి శూద్రత్వం తథా జీవత్వమీశ్వరః. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఒకానొక బ్రాహ్మణుఁడు దుష్టకోరికచే శూద్రస్త్రీయందాసక్తుడై, తన సాత్విక బ్రాహ్మణధర్మమును మెల్లగఁద్యజించి, తుదకు శూద్రత్వమంగీకరించునట్లు, ఈశ్వరుఁడున్ను బుద్ధ్యాదులతోఁగూడి తన నిత్యశుద్ధపూర్ణానందస్వభావమును ద్యజించి జీవత్వ మంగీకరించుచున్నాఁడు.

భూతాని ద్వివిధాన్యేవ ప్రతిసర్గం స్ఫురన్తి వై
ఆద్యవిస్పన్దజాతాని తాని నిష్కారణాని వై. 2

హిరణ్యగర్భాత్మకమగు ప్రథమస్పందముచే జనించిన భోక్తృ, భోగ్యములను రెండు విధములగు భూతములు ప్రతిసృష్టియందును గంధర్వనగరమువలె, గారణములేకయే స్ఫురించుచున్నవి.

ఈశ్వరాత్సముపాగత్య పునర్జన్మాన్తరాణి చ
భూతాన్యనుభవత్యజ్ఞ స్వకృతైరేవ కర్మభిః. 3

ప్రియుఁడవగు రామచంద్రా! ప్రథమమున, ఈశ్వరునినుండి యే తెంచినవారై సమస్తజీవులును మరల వారివారిచేఁగావింపఁబడిన కర్మలచేతనే యనేక శుభాశుభములగు జన్మాంతరముల ననుభవించు చున్నారు.

కార్యకారణ భావోఽయమిత్థం దృష్టో జన్మకర్మణోః
అకారణముపాయాన్తి సర్వే జీవాః పరాత్పదాత్. 4

ప్రథమమున సమస్తజీవులును, పరమపదమునుండి నిష్కారణముగనే యేతెంచుచున్నారు, జీవుల జన్మకర్మలఁగూర్చిన కార్యకారణభావ మివ్విధముగనే యుండును.

పశ్చాత్తేషాం స్వకర్మాణి కారణం సుఖదుఃఖయోః
ఆత్మజ్ఞానాత్సముత్పన్నః సంకల్పః కర్మకారణమ్. 5

తదుపరి జీవుల కర్మములు వారివారి సుఖదుఃఖములకుఁ గారణములగుచున్నవి. దేహాత్మజ్ఞానముచే నుత్పన్నమగు సంకల్పమే కర్మకుఁ గారణమైయున్నది.

సంకల్పిత్వం హి బన్ధస్య కారణం తత్పరిత్యజ
మోక్షస్తు నిఃసంకల్పిత్వం తదభ్యాసపరో భవ. 6

ఓ రామచంద్రా! సంకల్పముతోఁ గూడియుండుటయే బంధమునకుఁ గారణము. కావున నట్టి సంకల్పమును నీవుత్యజింపుము. సంకల్పములేకయుండుటయే మోక్షము గాన నీవట్టి యభ్యాసము ననే తత్పరుఁడవైయుండుము.

సావధానో భవత్వం చ గ్రాహ్యగ్రాహకసంభ్రమే
అజస్రమేవ సంకల్పదశాః పరిహరఞ్ఛనైః. 7

సంకల్పదశలను నిరంతరము మెల్లమెల్లగఁ ద్యజించుచు, గ్రాహ్యగ్రాహకములఁగూర్చిన భ్రమయందు బడక నీవు సావధానుఁడవై యుండుము.

మా భవ గ్రాహ్యభావాత్మా గ్రాహకాత్మా చ మా భవ
భావనామఖిలాం త్యక్త్వా యచ్ఛిష్టం తన్మయో భవ. 8

నీవు గ్రాహ్య(విషయ)భావుఁడవు గాకుము, గ్రాహకభావుఁడవు గాకుము. సమస్తభావనలను త్యజించి శేషించిన (సాక్షియగు) ఆత్మరూపమున తన్మయుఁడవగుము.

అజస్రం యం యమేవార్థం పతత్యక్షగణోఽనఘ
బధ్యతే తత్ర రాగేణ తత్రారాగేణ ముచ్యతే. 9

పాపరహితుఁడవగు రామచంద్రా! ఏ యే పదార్థములం దింద్రియసమూహము నిరంతరము పడుచుండునో, వానివానియందు రాగము గల్గియుండుటచే జీవుడు బంధింపఁబడుచున్నాడు. రాగరహితుఁడగుటచే ముక్తుఁడగుచున్నాఁడు.

కించిద్యద్రోచతే తుభ్యం తద్బద్ధోఽసి భవస్థితౌ
న కించిద్రోచతే చిత్తే తన్ముక్తోఽసి భవస్థితౌ. 10

ఓ రాఘవా! ఏ వస్తువైననీకు రుచించుచో (దానియందలి) రాగముచే ఈ సంసారస్థితియందు నీవు బంధింపఁబడినవాఁడవే యగుదువు. ఏవస్తువున్ను చిత్తమందు రుచింపనిచో నీకు ఈ సంసారస్థితి యందు నీవు ముక్తుఁడవే యగుదువు.

తస్మాత్పదార్థనిచయాత్సహ స్థావరజంగమాత్
తృణాదేర్దేవకాయాన్తాన్మాకించిత్తవ రోచతామ్. 11

కావున, తృణము మొదలుకొని బ్రహ్మదేవుని శరీరము వఱకుగల స్థావరజంగమాత్మకమైన సమస్తపదార్థ సమూహమందును నీ కొకింతైనను రుచింపకుండుగాక!

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
న కర్తాసి న భోక్తాసి తత్ర ముక్తమతిః శమీ. 12

నీ వేది చేయుచున్నను, తినుచున్నను, హోమమాచరించుచున్నను, దానమొనర్చుచున్నను, ఆ యా క్రియలన్నింటియందును నీవు కర్తవుగావు, భోక్తవుగావు. అభిమానరహితుఁడైన ఆత్మనిష్ఠుఁడవే యగుదువు.

సన్తోఽతీతం న శోచన్తి భవిష్యచ్చిన్తయన్తి నో
వర్తమానం చ గృహ్ణన్తి కర్మప్రాప్తమఖణ్డితమ్. 13

జ్ఞానులగు మహాత్ములు గడచినదానినిగూర్చి శోకింపరు, భవిష్యత్తునుగూర్చి చింతింపరు. ప్రారబ్ధకర్మచే సంప్రాప్తించిన వర్తమానమును మాత్రము పూర్ణముగ గ్రహింతురు.

మనసి గ్రథితా భావాస్తృష్ణామోహమదాదయః
మనసైవ మనోరామ చ్ఛేదనీయం విజానతా. 14

ఓ రామచంద్రా! తృష్ణ, మోహము, మదము మున్నగు వికారములు మనస్సునందే కూర్పఁబడియున్నవి. కాన, విజ్ఞుడైనవాఁడు మనస్సుచేతనే మనస్సును (తద్గతవికారములను) ఛేదింపవలయును.

వివేకేనాతితీక్ష్ణేన బలాదయ ఇవాయసా
మనసైవ మనశ్ఛిన్ధి సర్వభ్రమస్య శాన్తయే. 15

ఓ రామచంద్రా! ఇనుముచే ఇనుమును ఛేదించునట్లు, సమస్తభ్రమయు నశించుటకొఱకై తీవ్రవివేకయుక్తమగు మనస్సుచేతనే మనస్సును బలవంతముగ ఛేదించివేయుము.

క్షాలయన్తి మలేనైవ మలం క్షాలనకోవిదాః
వారయన్త్యస్త్రమస్త్రేణ విషం ప్రతివిషేణ చ. 16

కడుగుటయందు నేర్పరులైనజనులు క్షార, మలాదులచేతనే మలమును గడుగుదురు. అట్లే అస్త్రముచేతనే అస్త్రమును, విషముచేతనే విషమును నివారించుదురు.

జీవస్య త్రీణి రూపాణి స్థూలసూక్ష్మపరాణి చ
తత్రాస్య యత్పరం రూపం తద్భజ ద్వే పరిత్యజ 17

స్థూల, సూక్ష్మ, పరములను మూఁడు రూపములు జీవునకుగలవు. అందు స్థూల, సూక్ష్మముల రెంటిని బరిత్యజించి పర (చైతన్య) రూపమునే సేవింపుము.

పాణిపాదమయో యోఽయం దేహో భోగాయ వల్గతి
భోగార్థమేతజ్జీవస్య రూపం స్థూలమిహాసితమ్. 18

హస్తపాదాదిమయమై, భోగముకొఱకుఁ బరువిడుచు భోగార్థమైనట్టి యీ దేహమిట జీవునియొక్క స్థూలరూపమై పఱఁగుచున్నది.

స్వసంకల్పమయాకారం యానత్సంసారభావి యత్
చిత్తం తద్విద్ధి జీవస్య రూపం రామాతివాహికమ్. 19

ఓ రామచంద్రా! దేనియొక్క స్వసంకల్పాను సారము ప్రపంచములన్నియు గలుగుచున్నవో, అదియే చిత్తము. అట్టిచిత్తమునే జీవుని సూక్ష్మరూపముగ నీవెఱుఁగుము.

ఆద్యన్తరహితం సత్యం చిన్మాత్రం నిర్వికల్పకం
యత్తద్విద్ధి పరం రూపంతృతీయం విశ్వరూపకమ్. 20

ఆద్యంతరహితమై, సత్యమై, చిన్మాత్రమై, నిర్వికల్పమై, ప్రపంచమునకు సత్తను గలుగఁ జేయునదైనదానిని మూఁడవదగు - జీవుని పరరూపముగ నెఱుఁగుము.

ఏతత్తుర్యపదం శుద్ధమత్ర బద్ధపదో భవ
సంపరిత్యజ్య పూర్వే ద్వే మా తత్రాత్మమతిర్భవ. 21

ఓ రామచంద్రా! మొదటి రెంటిని వదలి మూఁడవదగు యీ తురీయ (చిత్) పదమునసే దృఢముగ ఆత్మబుద్ధిగలిగియుండుము. మొదటి రెంటియందును ఆత్మబుద్ధి గావింపకుము.

శ్రీరామ ఉవాచ:-

జాగ్రత్స్వప్నసుషుప్తేషు స్థితం త్రిష్వప్యలక్షితం
తుర్యం బ్రూహి విశేషేణ వివిచ్య మునినాయక. 22

శ్రీరాముడు:—ఓ మునీశ్వరా! జాగ్రత్స్వప్న సుషుప్తుల మూటియందును గూడ అలక్షిత రూపము చేనున్న తురీయరూపమును వివేచించి విశేషముగా వర్ణింప ప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచ:-

అహంభావానహంభావౌ త్యక్త్వా సదసతీ తథా
యదసక్తం సమం స్వచ్ఛం స్థితం తత్తుర్యముచ్యతే. 23

శ్రీవసిష్ఠుడు:—ఓ రామచంద్రా! అహంభావ, అనహంభావములను, సత్, అసత్తులనువదలి, దేనియందును సక్తము గాక, స్వచ్ఛమై, సమరూపమున నుండునదియే (శుద్ధచైతన్యమే) తుర్య (తురీయ) మనఁబడును.

యా స్వచ్ఛా సమతా శాన్తా జీవన్ముక్తవ్యవస్థితిః
సాక్ష్యవస్థా వ్యవహృతౌ సా తుర్యకలనోచ్యతే. 24

స్వచ్ఛమై, సమమై, శాంతమైనట్టి, జీవన్ముక్తులయొక్క వ్యవహారమందలి సాత్త్వ్యవస్థ యెయ్యది గలదో అదియే తుర్యపదమని చెప్పఁబడును.

నైతజ్జాగ్రన్న చ స్వప్నం సంకల్పానామసంభవాత్
సుషుప్తభావో నాప్యేతదభావాజ్జడతాస్థితేః. 25

సంకల్పములు సంభవింపమి, ఈతురీయావస్థ జాగ్రత్తు కాదు, స్వప్నము కాదు, మఱియు జడత్వములేనందుచే నిది సుషుప్తియున్ను గాదు.

శాన్తం సమ్యక్ప్రబుద్ధానాం యథాస్థితమిదం జగత్
విలీనం తుర్యమేవాహురబుద్ధానాం స్థిరం స్థితమ్. 26

జ్ఞానులకు లెస్సగ శమించి, విలీనమైనట్టి యీ జగత్స్థితియే తురీయమనఁబడును. అజ్ఞానులకీజగత్తు స్థిరముగ నుండును.

అహంకారకలాత్యాగే సమతాయాః సముద్భవే
విశరారౌ కృతే చిత్తే తుర్యావస్థోపతిష్ఠతే. 27

అహంకారకల్పన త్యజింపఁబడ, సమత్వముప్పన్నము కాఁగా, చిత్తము ప్రశమనమొంది, తురీయావస్థ చేకూరుచున్నది.

అథేమం శృణు దృష్టాన్తం కథ్యమానం మయాధునా
ప్రబుద్ధోఽపి యథా బోధముపైషి విబుధోపమ. 28

దేవతుల్యుఁడవగు రామచంద్రా! ఇపుడు నేను చెప్పఁబోవుచున్న యీ దృష్టాంతమును వినుము. దానిచే, ప్రబుద్ధుఁడవైనను నీవధికబోధను బొందగలవు.

కస్మింశ్చిత్కాననాభోగే మహామౌనం వ్యవస్థితం
దృష్ట్వాద్భుతమిదం కించిన్మునిం పప్రచ్ఛ లుబ్ధకః. 29
పశ్చాదుపగతో బాణభిన్నం మృగమభిద్రుతం
మునే మదీయబాణేన విద్ధో మృగ ఇహాగతః 30
క్వప్రయాతో మృగ ఇతి ప్రత్యువాచ స తం మునిః

ఒకానొక యరణ్యమున మహామౌనమును ధరించి యద్భుతముగ నున్నట్టి యొక మునిని, బాణముచే గొట్టఁబడిన మృగమును వెన్నంటుచుఁ బరువిడుచున్న యొక బోయవాఁడిట్లడిగెను — ఓ మునీ! నా బాణముచేఁగొట్టఁబడిన మృగమిచటకు వచ్చినదా! అది యెట బోయినది? — ఆవాక్యముల విని యమ్మునివానితో నిట్లనెను —

సమశీలా వయం సాధో మునయో వనవాసినః. 31
నాస్మాకమస్త్యహంకారో వ్యవహారేషు యః క్షమః

ఓ సాధూ! వనవాసులైన మునులమగు మేము సమశీలురమై యుందుము. వ్యవహారములందు సమర్థమగు అహంకారము మాకుండుటలేదు.

సర్వాణీన్ద్రియకార్యాణి కరోతి హి సఖే మనః. 32
అహంకారమయం తన్మే నూనం ప్రగలితమ్ చిరం
జాగ్రత్స్వప్నసుషుప్తాఖ్యా దశా వేద్మి న కాశ్చన. 33
తుర్య ఏవ హి తిష్ఠేఽహం తత్ర దృశ్యం న విద్యతే

సఖుఁడా! ఇంద్రియములయొక్క కార్యములన్నింటిని మనస్సు చేయుచున్నది. అట్టి అహంకారమయమగు నామనస్సు నిక్కముగ నెల్లపుడు ప్రశమనమొందియే యున్నది. జాగ్రత్స్వప్నసుషుప్తులనంబడు నేదశలను నే నెఱుఁగను, ఎద్దానియందు దృశ్యమే లేక యుండునో, అట్టి తురీయావస్థయందు, నేను స్థితిగల్గియున్నాను.

ఇతి తస్య వచః శ్రుత్వా మునినాథస్య రాఘవ. 34
లుబ్ధకోర్థమవిజ్ఞాయ జగామాభిమతాం దిశమ్

ఓ రామచంద్రా! మునీశ్వరుని యీ వాక్యముల విని యా బోయవాఁడు వానియర్థము తెలియఁగజాలక తనదారి నేగెను.

అతో వచ్మి మహాబాహో నాస్తి తుర్యేతరా దశా. 35

మహాబాహుఁడవగు రామచంద్రా! కావుననే తురీయదశయందు మఱియొకదశ యెద్దియు లేదని నేను వచించుచున్నాను.

నిర్వికల్పా హి చిత్తుర్యం తదేవాస్తీహ నేతరత్
జాగ్రత్స్వప్నసుషుప్తాఖ్యం తత్రరూపం హి చేతసః. 36

వికల్పరహితమగు శుద్ధచైతన్యమే తురీయము. వాస్తవముగ నిట ఆచైతన్యమేగలదుకాని అన్యమేమియును లేదు. జాగ్రత్స్వప్నసుషుప్తులనఁబడు మూఁడునో చిత్తముయొక్క రూపములేయై యున్నవి. (అవిమిథ్యయేయగును)

ఘోరం శాన్తం చ మూఢం చ ఆత్మచిత్తమిహాస్థితమ్
ఘోరం జాగ్రన్మయం చిత్తం శాన్తం స్వప్నమయం స్థితం. 37
మూఢం సుషుప్తభావస్థం త్రిభిర్హీనం మృతం భవేత్
యచ్చ చిత్తం మృతం తత్ర సత్త్వమేకం స్థితం సమమ్
తదేవ యోగినః సర్వే యత్నాత్సంపాదయన్తి హి. 38

ఘోరము, శాంతము, మూఢమను మూఁడురూపములతోఁటి చిత్తము స్థితిగల్గియున్నది. అందు ఘోరము జాగ్రన్మయము, శాంతము స్వప్నమయము, మూఢము సుషుప్తిమయము నైయున్నవి. ఈ మూఁడురూపములును లేనిది మృతచిత్తమనఁబడును. అట్టి మృతచిత్తముననే యేకమై, సమమైనట్టి సత్త్వము నెలకొని యుండును. దానినే యోగులందఱును ప్రయత్నముచే సంపాదించుచున్నారు.

సమస్తసంకల్పవిలాసముక్తం
తుర్యే పదే తిష్ఠ నిరామయాత్మా,

యత్రస్థితాః సాధు సదైవ ముక్తాః
ప్రశాన్తభేదా మునయో మహాన్తః. 39

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షో
పాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే మృగవ్యాధీయం నామ
చతుర్వింశత్యధిక శతతమః సర్గః ॥ 124 ॥

ఓ రామచంద్రా! సమస్త సంకల్పవిలాసములచే రహితమగు తురీయపదమున నిరామయమగు ఆత్మవై నీవు స్థితుఁడవగుము. అచ్చోట నెలకొనియే, సాధువులును, భేదముపశమించినవారును, మహాత్ములునగు మునులు సదా ముక్తులై వెలసిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
మృగవ్యాధీయమను నూటయిరువదినాల్గవ సర్గము ॥ 124 ॥

---

## పఞ్చవింశత్యధికశతతమః సర్గః.

[సర్వాపహ్నవసిద్ధాన్తే వాదనాం యత్ర విభ్రమః
తుర్యే తథావిధే స్థైర్యం సోపాయముపదిశ్యతే.

ఎద్దానిఁగూర్చి వాదులకు భ్రమ గలుగునో, అట్టి సర్వదృశ్య రహితమగు తురీయపదమున స్థిరత్వమొందుట కుపాయమిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచః—

సిద్ధాన్తోఽధ్యాత్మశాస్త్రాణాం సర్వాపహ్నవ ఏవ హి
నావిద్యాస్తీహ నో మాయా శాన్తం బ్రహ్మేదమక్రమం. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామచంద్రా! సమస్త (దృశ్య)ముయొక్క అపలాపమే (లేదనుటయే) అధ్యాత్మశాస్త్రములయొక్క సిద్ధాంతమైయున్నది. ఇట, అవిద్యలేదు, మాయయున్నులేదు. వాక్కుమున్నగువానిచే నగోచరమైనట్టి శాంతమగు బ్రహ్మమేగలదు.

శాన్త ఏవ చిదాభాసే స్వచ్ఛే సమసమాత్మని
సమగ్రశక్తిఖచితే బ్రహ్మేతి కలితాభిధే. 2

నిర్ణీయ కేచిచ్ఛూన్యత్వం కేచిద్విజ్ఞానమాత్రతామ్
కేచిదీశ్వరరూపత్వం వివదన్తే పరస్పరం. 3

శాంతమై, చిదాభాసరూపమై, స్వచ్ఛమై, సర్వాత్మరూపమై, సమమై సర్వశక్తులచేఁ బరిపూర్ణమైనట్టి బ్రహ్మమను పేరుగల వస్తువునందే జనులు వారివారిబుద్ధి ననుసరించి సిద్ధాంతములఁ గల్పించుకొని, కొందఱు శూన్యమని, కొందఱు విజ్ఞానమాత్రమని, కొందఱీశ్వరరూపమని వచించుచుఁ బరస్పరము వివాదమొనర్చుకొను చున్నారు.

సర్వమేవ పరిత్యజ్య మహామౌనీభవానఘ
నిర్వాణవాన్నిర్మననః క్షీణచిత్తః ప్రశాన్తధీః. 4

పాపరహితుఁడవగు రామచంద్రా! నీవు సమస్త వాదములను పరిత్యజించి (లేక, దృశ్యమం తటిని బార(ద్రోలి) మనోవర్జితుఁడవై, శాంతచిత్తుఁడవై, నిర్వాణయుక్తుఁడవై, ప్రశాంతబుద్ధిగల్గి, మహామౌనివై, ఆత్మయందే స్థితిగల్గియుండుము.

ఆత్మన్యేవాత్మనా శాన్తో మూకాన్ధబధిరోపమః
నిత్యమన్తర్ముఖో భూత్వా స్వాత్మనాన్తః ప్రపూర్ణధీః. 5

మూఁగవానిఁబోలియు, గ్రుడ్డివానిఁబోలియు, చెవిటివానిఁబోలియు నున్నవాఁడవై (దృశ్య సంపర్కములేకయుండి) నిత్య మంతర్ముఖుఁడవై, శాంతస్వభావుఁడవై, పూర్ణబుద్ధిగల్గి, ఆత్మయందే నెలకొనియుండుము.

జాగ్రత్యేవ సుషుప్తస్థః కురు కర్మాణి రాఘవ
అన్తః సర్వపరిత్యాగీ బహిః కురు యథాగతం. 6

ఓ రాఘవా! జాగ్రదవస్థయందు సుషుప్తియందువలె నుండి నీవు కర్మలఁజేయుము. అనఁగా నంతరంగమున సమస్తమును త్యజించుచు, బాహ్యమున యథాప్రాప్తములగు కర్మల నాచరించుచు నుండుము.

చిత్తసత్తా పరం దుఃఖం చిత్తాసత్తా పరం సుఖమ్
అతశ్చిత్తం చిదాకాశే నయ క్షయమవేదనాత్. 7

చిత్తముయొక్క యునికియే పరమదుఃఖము. చిత్తముయొక్క లేమియే పరమసుఖము. కావున, చిదేకాత్మస్వరూపుఁడవై, ప్రియ, అప్రియములఁ జింతింపక, చిత్తమును క్షయమొనర్పుము.

దృష్ట్వారమ్యమరమ్యం వా స్థేయం పాషాణవత్సమమ్
ఏతావతాత్మయత్నేన జితా భవతి సంసృతిః. 8

రమ్యమైనదియు రమ్యముగానిదియునగు వస్తువుఁ జూచియు, శిలవలె సమముగానుండవలెను. ఇంతమాత్రమగు స్వప్రయత్నముచేతనే యీ సంసారము జయింపఁబడినదగు చున్నది.

సవేదనీయం న సుఖం నాసుఖం న చమధ్యమం
ఏతావతాత్మయత్నేన దుఃఖాన్తోఽనన్త ఆప్యతే. 9

సుఖదుఃఖములను, తత్సాధనములను జింతింపఁగూడదు. ఇంతమాత్రమగు స్వప్రయత్నము చేతనే అనంతానందము సంప్రాప్తించుచున్నది.

ఆ పీన మణ్డలకశాఙ్కవదన్తరేవ
శ్రీమద్రసాయనమయః సుఖమేతి తజ్జ్ఞః
విజ్ఞాత సర్వభువనత్రయ వస్తుసారః
కుర్వన్న నామ కురుతే పరమశ్రియ్యపేతః. 10

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ రామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే పూర్వార్ధే తుర్యే స్థైర్యోపాయ కథనం నామ
పఞ్చవింశత్యుత్తర శతతమః సర్గః ॥ 125 ॥

ముల్లోకములందలి సమస్తవస్తువులయొక్క సారము నెఱింగినవాఁడును, సర్వత్ర ప్రకాశముచే శోభాయమానమగు నిరతిశయ బ్రహ్మానందామృతముచేఁ బరిపూర్ణుఁడును, పరిపుష్టమైన మండలముగల్గిన పూర్ణచంద్రునిఁ బోలినట్టి పరమాత్మను బొందినవాఁడునగు జ్ఞాని జీవన్ముక్తిసుఖము నొందుచున్నాఁడు. అతఁడు బాహ్యమున సమస్తకర్మలు చేయుచున్నను, అభ్యంతరమున నేమియుఁ జేయనివాఁడేయగును.

ఇతి శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
'తుర్యే స్థైర్యోపాయ కథన'మను నూటయిరువదియైదవ సర్గము ॥125॥

---

## షడ్వింశత్యధిక శతతమః సర్గః.

[ఉచ్యతే యోగభూమీనామ భ్యాసక్రమ లక్షణే,
అన్తరాలే మృతౌ భోగాస్తతో జన్మాన్తరే జయః.

యోగభూమికల యభ్యాస క్రమముల లక్షణములు, మధ్య, మృతినొందినచో వైభవములు సంప్రాప్తించుట. పిదప జన్మాంతరమున జయముచేకూరుట, మున్నగు విషయములఁగూర్చి యిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచః—

సప్తానాం యోగభూమీనా మభ్యాసః క్రియతే కథమ్
కీదృశాని చ చిహ్నాని భూమికాం ప్రతి యోగినః. 1

శ్రీరాముఁడు:- మునీంద్రా! సప్తభూమికల యభ్యాస మెటుల గావింపఁబడును? మఱియు నాయాభూమికలందు యోగుల కేయే చిహ్నములుండును?

శ్రీవసిష్ఠ ఉవాచః—

ప్రవృత్తశ్చ నివృత్తశ్చ భవతి ద్వివిధః పుమాన్
స్వర్గాపవర్గోన్ముఖయోః శృణు లక్షణమేతయోః. 2

శ్రీ వసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! ప్రవృత్తుఁడు, నివృత్తుఁడని వేదమార్గానుయాయియగు మనుజుఁడు రెండువిధములుగ నుండును. క్రమముగ స్వర్గ, మోక్షముల నభిలషించువారైనట్టి వారిరువురియొక్క లక్షణములనుగూర్చి వినుము.

కియత్తన్నామ నిర్వాణం వరం సంసృతిరేవ మే
ఇతి కర్తవ్యకర్తా యః స ప్రవృత్త ఇతి స్మృతః. 3

'విషయవర్జితమగు నిర్వాణమేమి? అనేకవిధములగు భోగములతోఁగూడిన సంసారమే నాకుత్తమమైనది.' అని యిట్లు తలంచి వేదవిహితములగు యజ్ఞాదికర్మలఁ జేయువాఁడు ప్రవృత్తుఁ డనఁబడును.

చలార్ణవయుగచ్ఛిద్రకూర్మగ్రీవాప్రవేశవత్
అనేకజన్మనామన్తే వివేకీ జాయతే పుమాన్. 4

యుగాంతమందు సంక్షోభమొందు సముద్రమందలి, కూర్మము తరంగచలనాదుల భయముచేఁ దన కంఠమును ద్వారితముగ లోనికిఁ బ్రవేశింపఁజేయుచు, మరల బయటకు రానిచ్చుచు నిట్లనేక పర్యాయములు గావించినట్లు, మనుజుఁడును మృత్యుముఖమునఁ బ్రవేశించుట, మరల వినిర్గతమగుట లక్షణముగాఁగల యనేకజన్మములయొక్క యంతమునఁ దుదకు వివేకవంతుఁడై, జనించును.

అసారా బత సంసారవ్యవస్థాలం మమైతయా
కిం కర్మభిః పర్యుషితైర్దినం తైరేవ నీయతే. 5

అపుడాతనికి 'ఈ సంసారముయొక్క వ్యవస్థ అసారమైనది. దీనిచే నాకేసుమంతైనను బ్రయోజనములేదు. అనుచిత పరిణామముగల కర్మలచే మనమేల దినములను గడుపుచున్నామా'ను వివేకము కలుగును.

క్రియాతిశయనిర్ముక్తం కిం స్యాద్విశ్రమణం పరం
ఇతి నిశ్చయవానన్తః స నివృత్త ఇతి స్మృతః. 6

'(ఉత్పత్తి, ప్రాప్త్యాది) క్రియాధిక్యరహితమగు పరమ విశ్రాంతిస్థానమేదై యుండును?' అని యిట్లెవఁడు లోన నిశ్చయము గలిగియుండునో, ఆతఁడు నివృత్తుఁడని చెప్పఁబడును.

కథం విరాగవాన్భూత్వా సంసారాబ్ధిం తరామ్యహం
ఏవం విచారణపరో యథా భవతి సన్మతిః. 7
విరాగము పయాత్యన్తర్భావ నాస్వనువాసరం
క్రియాసూదారరూపాసు క్రమతే మోదతేఽన్వహమ్. 8

వైరాగ్యవంతుఁడనై సంసారసముద్రము నెట్లు తరింపగలనను ఈ విచారమున సద్బుద్ధియగు జీవుఁడెపుడు తత్పరుఁడగునో, అపుడు భోగములందును, తత్సాధనములఁగూర్చిన చింతలందును ప్రతిదినమాతనికి వైరాగ్యముదయించును. మఱియు చిత్తశుద్ధికి హేతుభూతములైన జప, ఈశ్వరారాధనాదిక్రియలందును నాతఁడు తత్పరుఁడగును. వానిచే తృష్ణక్షయింప, అనుదినము ప్రసన్నుఁడగుచుండును.

గ్రామ్యాసు జడచేష్టాసు సతతం విచికిత్సతి
నోదాహరతి మర్మాణి పుణ్యకర్మాణి సేవతే. 9

గ్రామ్యములైన జడక్రియలం దెపుడును నాతఁడు రోతగలిగియుండును. ఇతరుల మర్మముల ప్రకటింపకుండును. పుణ్యకార్యముల సేవించును.

మనోనుద్వేగకారీణి మృదుకర్మాణి సేవతే
పాపాద్బిభేతి సతతం న చ భోగముపేక్షతే. 10

ఇతరుల మనస్సునకుగాని, తన మనస్సునకుగాని క్షోభను గలుగజేయు కార్యములను జేయకుండును. పాపముయెడల నెల్లప్పుడు భయము గలిగియుండును. భోగముల వాంఛింపకుండును.

స్నేహప్రణయగర్భాణి పేశలాన్యుచితాని చ
దేశకాలోపపన్నాని వచనాన్యభిభాషతే. 11

స్నేహ, ప్రీతియుక్తములై, కోమలములై, ఉచితములై, దేశకాలయోగ్యములైనట్టి వచనముల నాతఁడు పలుకుచుండును.

తదాసౌ ప్రథమామేకాం ప్రాప్తో భవతి భూమికామ్
మనసా కర్మణా వాచా సజ్జనానుపసేవతే. 12

అపుడాతఁడు (శుభేచ్ఛయను) ప్రథమభూమికను బొందినవాఁడగును. మఱియు మనోవాక్కర్మలచే సజ్జనులను సేవించును.

యతః కుతశ్చిదానీయ జ్ఞానశాస్త్రాణ్యవేక్షతే
ఏవం విచారవాన్యః స్యాత్సంసారోత్తారణం ప్రతి. 13
స భూమికావానిత్యుక్తః శేషః స్వార్థ ఇతి స్మృతః

జ్ఞానవర్ధకములైన శాస్త్రముల నెచటినుండియో తీసికొనివచ్చి చూచుచుండును.—ఇవ్విధమున సంసారమును దాటుటయందు విచారశీలుఁడైయుండువాఁడే భూమికయందున్నవాఁడని చెప్పఁబడును. తక్కినవారు స్వార్థసాధకులనియే యెన్నఁబడుదురు.

విచారనామ్నీమితరామాగతో యోగభూమికాం. 14
శ్రుతిస్మృతిసదాచారధారణాధ్యానకర్మణామ్
ముఖ్యయా వ్యాఖ్యయా ఖ్యాతాఞ్ఛ్రయతే శ్రేష్ఠపణ్డితాన్. 15

తదుపరి 'విచారణ' యను రెండవ యోగభూమికను మనుజుఁడు పొందును. అత్తఱి శ్రుతి, స్మృతి, సదాచార, ధారణా, ధ్యానకర్మముల అనుష్ఠాన, అనుష్ఠాపనములందు మిగుల ప్రసిద్ధులైనట్టి (ఆత్మతత్త్వముయొక్క అనుభవ, ఉపదేశములందు కుశలురైనట్టి) శ్రేష్ఠులగు పండితుల (గురువుల) నాశ్రయించును.

పదార్థప్రవిభాగజ్ఞః కార్యాకార్యవినిర్ణయమ్
జానాత్యధిగతశ్రవ్యో గృహం గృహపతిర్యథా. 16

స్వయముగ వ్యాకరణాది శాస్త్రముల పఠనముచే పస, పదార్థముల విభాగము నెఱిఁగినవాఁడై యాతఁడు గురుముఖతః శ్రవణము గావించి, గృహపతి తనగృహమును జక్కగ నెఱుఁగునట్లు, కార్యాకార్యముల నిర్ణయమును స్పష్టముగ నెఱుఁగును.

మదాభిమానమాత్సర్యమోహాలోభాతిశాయితామ్
బహిరప్యాశ్రితామీషత్త్యజత్యహిరివ త్వచమ్. 17

లోకమర్యాద ననుసరించి బాహ్యమున అభిమానాదులను స్వల్పముగ నాశ్రయించినను, సర్వముకుబుపమును విడమనట్లు, ఆ మద, అభిమాన, మాత్సర్య, లోభ, మోహాదుల నాతఁడంతరంగమున త్యజించియే వైచును.

ఇత్థంభూతమతిః శాస్త్రగురుసజ్జనసేవనాత్
సరహస్యమశేషేణ యథావదధిగచ్ఛతి. 18

ఇట్టి బుద్ధిగలవాఁడును శాస్త్రగురు, సజ్జనుల సేవనముచే తచ్ఛాస్త్రముల రహస్యమును యథార్థముగ సంపూర్ణముగ నెఱుఁగును.

అసంసఙ్గాభిధామన్యాం తృతీయాం యోగభూమికాం
తతః పతత్యసౌ కాన్తః పుష్పశయ్యామివామలాం. 19

కాంతుఁడు తన ప్రియయొక్క నిర్మల పుష్పశయ్యను బ్రవేశించునట్లు, ఆపిమ్మట సాధకుఁడు 'అసంసంగమ'ను మూఁడవయోగభూమికయందు, బ్రవేశించును.

యథావచ్ఛాస్త్రవాక్యార్థం మతిమాధాయ నిశ్చలమ్
తాపసాశ్రమవిశ్రామైరధ్యాత్మకథనక్రమైః. 20
సంసారనిన్దనైః సద్భిర్వైరాగ్యకరణక్రమైః
శిలాశయ్యాసమాసీనో జరయత్యాయురాతతమ్. 21

అపుడాతఁడు (తత్త్వమసి, అహంబ్రహ్మాస్మిమున్నగు) వేదాంతవాక్యార్థములందు నిశ్చలముగఁ దనబుద్ధిని స్థాపించి, భూ (శిలా) శయ్యపై నాసీనుఁడై, తాపసుల యాశ్రమములందు విశ్రాంతి నొందుటద్వారా, మఱియు, అధ్యాత్మశాస్త్రముల కథనాది క్రమములద్వారా, సంసారమును నిందించుటద్వారా, వైరాగ్యసాధనక్రమముల నవలంబించుటద్వారా తన జీవితవిస్తారమును గడుపును.

వనవాస విహారేణ చిత్తోపశమశోభినా
అసఙ్గ సుఖసౌమ్యేన కాలం నయతి నీతిమాన్. 22

చిత్తముయొక్క యుపశమముచే శోభితమై, అసంగత్వసుఖముచే సౌమ్యమైనట్టి వనవాస విహారముచే ఆ నీతిమంతుఁడు తన కాలమును గడుపును.

అభ్యాసాత్సాధుశాస్త్రాణాం కరణాత్పుణ్యకర్మణామ్
జన్తోర్యథావదేవేయం వస్తుదృష్టిః ప్రసీదతి. 23

ఇవ్విధమున సచ్ఛాస్త్రముల యభ్యాసముచేతను, పుణ్యకార్యముల యాచరణముచేతను జీవునకు ఆత్మదృష్టి ప్రసన్నమగుచున్నది.

తృతీయాం భూమికాం ప్రాప్య బుద్ధోఽనుభవతి స్వయమ్
ద్విఃప్రకారమసంసఙ్గం తస్య భేదమిమం శృణు. 24

ఓ రామచంద్రా! మూఁడవభూమికను బొంది బుద్ధిమంతుఁడగువాఁడు, రెండువిధములగు అసంగమును స్వయముగ ననుభవించును. వాని భేదమును నీవిపుడు వినుము.

ద్వివిధోఽయమసంసఙ్గః సామాన్యః శ్రేష్ఠ ఏవ చ

సామాన్యమని, శ్రేష్ఠమని యీ యసంగము రెండువిధములైనది.

నాహం కర్తా నభోక్తా చ న బాధ్యో న చ బాధకః. 25
ఇత్యసంజనమర్థేషు సామాన్యాసఙ్గనామకమ్

'నేను కర్తనుగాను, భోక్తనుగాను, బాధ్యుఁడనుగాను, బాధకుఁడనుగాన'ను నిశ్చయముచేఁబదార్థములందు సంసక్తముగాకుండుటయే సామాన్యసంగమని చెప్పఁబడును.

ప్రాక్కర్మనిర్మితం సర్వమీశ్వరాధీనమేవ చ. 26
సుఖం వా యది వా దుఃఖం కైవాత్ర మమ కర్తృతా
భోగాభోగా మహారోగాః సంపదః పరమాపదః. 27
వియోగాయైవ సంయోగా ఆధయో వ్యాధయో ధియః
కాలః కవలనోద్యుక్తః సర్వభావాననారతమ్. 28
అనాస్థయేతి భావానాం యదభావనమాన్తరం
వాక్యార్థలగ్నమనసః సామాన్యోఽసావసంగమః. 29

'అంతయు పూర్వకర్మనిర్మితమున్ను, ఈశ్వరాధీనము నైయున్నది. సుఖమందుగాని, దుఃఖమందుగాని నాకు కర్తృకత్వములేదు. భోగములు మహారోగములు. సంపదలు పరమాపదలు. సంయోగములన్నియు వియోగముకొఱకే. మానసికచింతలన్నియు బుద్ధియొక్క వ్యాధిరూపములేయై యున్నవి. కాలమెల్లపుడు సమస్తపదార్థములను గ్రసించుటకు ఉద్యుక్తమైయున్నది' – ఇట్లు, వాక్యార్థమున సంలగ్నమైన మనస్సుగల మనుజునియొక్క (విషయ) అనాసక్తిచే నాతనియందు జనించు పదార్థముల అభావనయే సామాన్యాసంగమనఁబడును.

అనేకక్రమయోగేన సంయోగేన మహాత్మనాం
వియోగేనాసతాం మన్త్రః ప్రయోగేణాత్మసంవిదామ్. 30
పౌరుషేణ ప్రయత్నేన సంతతాభ్యాస యోగతః
కరామలకవద్వస్తున్యాగతే స్ఫుటతాం దృఢమ్. 31
సంసారామ్బునిధేః పారే సారే పరమకారణే
నాహం కర్తేశ్వరః కర్తా కర్మ వా ప్రాకృతం మమ. 32
కృత్వా దూరతరే నూనమితి శబ్దార్థభావనం
యన్మౌనమాసనం శాన్తం తచ్ఛ్రేష్ఠాసఙ్గ ఉచ్యతే. 33

ఈ రీతిగా మహాత్ముల సాంగత్యముచేతను, దుష్టుల త్యాగముచేతను, శ్రవణమననాదుల ప్రయోగముచేతను, నిరంతరాభ్యాసముతోఁగూడిన పురుషప్రయత్నముచేతను, సంసారసముద్రముయొక్క యావలితీరమును, సమస్తమునకు సారమును, పరమకారణమునగు ఆత్మవస్తువు అరచేతియందలి యుసిరికపండువలెఁ బ్రత్యక్షముకాఁగా, 'నేను కర్తనుగాను; ఈశ్వరుఁడే కర్త; నాకుఁ బూర్వ

కర్మగాని, వర్తమానకర్మగాని లేవను నీశబ్దార్థభావనను గూడ దూరీకరించి శాంతముగను, మౌనముగను నుండుట యేదిగలదో, అది శ్రేష్ఠాసంగమని చెప్పఁబడును.

యన్నాన్తర్న బహిర్నాధో నోర్ధ్వం నాశాసు నామ్బరే
న పదార్థే నాపదార్థే న జడే న చ చేతనే. 34

ఆసితం భాసనం శాన్తమభాసం నభసా సమం
అనాద్యన్తమజం కాన్తం తచ్ఛ్రేష్ఠాసఙ్గ ఉచ్యతే. 35

ఏది లోనగాని, వెలుపలగాని, పైనగాని, క్రిందగాని, దిక్కులందుగాని, ఆకాశమునగాని, పదార్థమందుగాని, అపదార్థమందుగాని, జడమందుగాని, చిదాభాసునియందుగాని స్థితిగల్గియుండదో, ఏది స్వప్రకాశచిద్రూపమై, శాంతమై, వేఱొకప్రకాశములేనిదై, ఆకాశతుల్యమై, ఆద్యంతరహితమై, అజమై, సుందరమై యొప్పునో తద్బ్రహ్మమయమైయుండుటయే శ్రేష్ఠాసంగమని పేర్కొనఁబడును.

సంతోషామోదమధురః సత్కార్యామలపల్లవః
చిత్తనాలాగ్రసంలీనో విఘ్నకణ్టకసంకటః. 36

వివేకపద్మో రూఢోఽన్తర్విచారార్కవికాసితః
ఫలం ఫలత్యసంసఙ్గాం తృతీయాం భూమికామిమామ్. 37

సంతోషమను సుగంధముచే రమణీయమై, నిష్కామకర్మములను నిర్మలపల్లవములతోఁ గూడినదై, చిత్తమను మృణాళము (తామరతూఁడు) యొక్క చివర సంలీనమై యున్నదై, విఘ్నరూప కంటకములచే నిబిడమై అంతర్విచారమను సూర్యునిచే వికసితమైనట్టి వివేకమను కమల మెపుడంతఃకరణమున రూఢిఁబొందునో, అపుడు 'అసంసంగమ'ను పేరుగల యీ తృతీయ భూమికారూప ఫలము ఫలించుచున్నది.

సమవాయాద్విశుద్ధానాం సంచయాత్పుణ్యకర్మణాం
కాకతాలీయయోగేన ప్రథమోదేతి భూమికా. 38

శుద్ధాంతఃకరణయుక్తులగు మహాత్ముల సాంగత్యముచేతను, అనేకజన్మార్జితమగు పుణ్యముల సంచయముచేతను, కాకతాళీయయోగముచే శుభేచ్ఛయను ప్రథమభూమిక యుదయించుచున్నది.

భూమిః ప్రోదితమాత్రా తైరమృతాఙ్కురికేవ సా
వివేకేనామ్బుసేకేన రక్ష్యా పాల్యా ప్రయత్నతః. 39

భూమియందంకుర ముద్భవించగనే, అయ్యది వాడిపోకుండుటకొఱకై యాభూమిపై జలసించనాదు లెట్లు గావింపఁబడునో, అట్లే యీ ప్రథమభూమిక యుదయించగనే వివేకముచేఁ బ్రయత్నపూర్వకముగ నద్దానిని రక్షింపవలెను, పాలింపవలెను.

యేనాంశేనోల్లసత్యేషా విచారేణోదయం నయేత్
తమేవానుదినం యత్నాత్కృషీవల ఇవాఙ్కురమ్. 40

సాధనచతుష్టయమందలి వైరాగ్యాది యే అంశముచే ఈశుభేచ్ఛ ప్రథమమున నంకురించి యుల్లాసమునొందునో, ఆ యంశమునే విచారణచే నభివృద్ధిపఱచవలెను. దానినే, కర్షకుఁడు ధాన్యముయొక్క యంకురమును రక్షించునట్లు, ప్రతిదినము రక్షించుచుండవలయును.

ఏషా హి పరిమృష్టాన్తరన్యాసాం ప్రసవైకభూః
ద్వితీయాం భూమికాం యత్నాత్తృతీయాం ప్రాప్నుయాత్తతః 41

ఇది (శుభేచ్ఛ) అంతఃకరణమున రూఢిపడినచో నితరభూమికలయొక్కయు నుత్పత్తిస్థానము కాఁగలదు, దీనినుండియే ద్వితీయ తృతీయభూమికలను సాధకుఁడు ప్రయత్నముచే నొందగలడు.

శ్రేష్ఠాసంసక్తతా హ్యేషా తృతీయా భూమికాత్ర హి
భవతి ప్రోజ్ఝితాశేష సంకల్పకలనః పుమాన్. 42

ఓ రామచంద్రా! ఇట్టి అసంసంగమను శ్రేష్ఠమైన మూఁడవభూమికను నీకువర్ణించి చెప్పితిని. దీనియందు స్థితిగల్గియుండు మనుజుఁడు సమస్త సంకల్ప కల్పనలను బాఱద్రోలినవాఁడగును.

శ్రీరామ ఉవాచ: —

మూఢస్యాసత్కులోత్థస్య ప్రవృత్తస్యాధమస్య చ
అప్రాప్తయోగిసఙ్గస్య కథముత్తరణం భవేత్. 43

శ్రీరాముఁడు:– మునీంద్రా! మూఢుఁడును నీచకులమందు జన్మించినవాఁడును, భోగరాగాదులందుఁ బ్రవృత్తుఁడును, అధముఁడును, యోగుల సాంగత్యము లభింపనివాఁడు నగువాని యుద్ధారమెట్లు సంభవించును?

ఏకామథ ద్వితీయాం వా తృతీయాం చేతరాం చ వా
ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవన్గతిః. 44

మఱియు, మహాత్మా! మొదటి భూమికనుగాని, లేక రెండవభూమికనుగాని, లేక మూఁడవభూమికనుగాని, లేక మఱియే యితర భూమికనుగాని పొంది మృతినొందువాని కెట్టిగతి లభించును?

శ్రీవసిష్ఠ ఉవాచ: —

మూఢస్యారూఢదోషస్య తావత్సంసృతిరాతతా
యావజ్జన్మాన్తరశతైః కాకతాలీయయోగతః. 45
అథవా సాధుసంగత్యా వైరాగ్యం నాభ్యుదేతి హి

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! మూఢుఁడును, దోషారూఢుఁడు నగువానికి అనేకజన్మములందు కాకతాళీయయోగముచే (స్వవిచారముచే) గాని, లేక సాధుసాంగత్యముచేగాని వైరాగ్య మెంతవఱకు కుదయింపకుండునో, అంతవఱకీ విశాలమైన సంసారముండియే యుండును.

వైరాగ్యేఽభ్యుదితే జన్తోరవశ్యం భూమికోదయః 46
తతో నశ్యతి సంసార ఇతి శాస్త్రార్థసంగ్రహః.

వైరాగ్యముదయింపగనే మనుజునకు భూమికోదయము తప్పక యగును. తద్ద్వారా సంసారము నశించును. ఇదియే శాస్త్రసిద్ధాంతము.

యోగభూమికయోత్క్రాన్తజీవితస్య శరీరిణః. 47
భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతమ్
తతః సురవిమానేషు లోకపాలపురేషు చ. 48
మేరూపవనకుఞ్జేషు రమతే రమణీసఖః

ప్రథమభూమికయందుగాని, లేక ద్వితీయభూమికయందుగాని లేక తృతీయభూమికయందుగాని, లేక తదితరభూమికలందుగాని ఆరూఢుఁడైనవాని దేహము పతనమగుచో అయా భూమిక ననుసరించి వాని పూర్వకాలిక పాపము నశించును. తదుపరి యాదుష్కృతక్షయానుసారమాతఁడు దేవతల విమానములందును, లోకపాలుర నగరములందును, మేరుపర్వత వనకుంజములందును, అప్సరసలతోఁ గూడ క్రీడించును.

తతః సుకృతసంభారే దుష్కృతే చ పురా కృతే 49
భోగజాలే పరిక్షీణే జాయన్తే యోగినో భువి
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతామ్. 50
జనిత్వా యోగమేవైతే సేవన్తే యోగవాసితాః
తత్ర ప్రాగ్భావనాభ్యస్తయోగభూమిక్రమం బుధాః
స్మృత్వా పరిపతన్త్యుచ్చైరుత్తరం భూమికాక్రమమ్. 51

అపిమ్మట ఆ పూర్వకాల కృతపుణ్యసమూహమున్ను, దుష్కృతమున్ను క్షయింప భోగజాలమనుభవింపఁబడవారు తిరిగి భూలోకమందు యోగులై జన్మింతురు. శుద్ధులును, శ్రీమంతులును, గుణవంతులును, సజ్జనులునగువారి గృహమున జనించి, పూర్వకాలిక యోగవాసనచే మరల వారు యోగమునే సేవింతురు. మఱియు, పూర్వాభ్యాసముచే నాబుద్ధిమంతులు యోగభూమికా క్రమమును స్మరించి, ఉత్తరోత్తర భూమికల నధిరోహింపుచుఁ జనుచుందురు.

భూమికాత్రితయం త్వేతద్రామ జాగ్రదితి స్మృతం
యథావద్భేదబుద్ధ్యేదం తజ్జాగ్రదితి దృశ్యతే. 52

ఓ రామచంద్రా! ఈ మూఁడు భూమికలును జాగ్రత్తని చెప్పఁబడినవి. ఏలయనగా, యథాప్రకారము భేదబుద్ధిచే జాగ్రత్తువలెనే సమస్తవ్యవహారమందుఁ గానుపించును.

ఉదేతి యోగయుక్తానామత్ర కేవలమార్యతా
యాం దృష్ట్వా మూఢబుద్ధీనామభ్యుదేతి ముముక్షుతా. 53

యోగయుక్తుల కిట్టి యవస్థయందుఁ గేవలము ఆర్యత్వము (పూజ్యత్వప్రయోజక సద్గుణాధిక్యత) ఉదయించును. దానిఁగాంచి మూఢబుద్ధులకున్ను మోక్షమునుగూర్చిన యపేక్ష జనించును.

సత్తావశేష ఏవాస్తే పఞ్చమీం భూమికాం గతః
పఞ్చమీం భూమికామేత్య సుషుప్తపదనామికాం. 62

మొదటిమూఁడు భూమికలు జాగ్రత్తని చెప్పఁబడును. నాల్గవది స్వప్నమనఁబడును. శరత్కాల విచ్ఛిన్నమేఘమువలె సమస్తవ్యాపారములు లయించునట్టి సుషుప్తపదమను పేరుగల యైదవ భూమికను బొంది యోగి కేవలము సత్తామాత్రము శేషించినవాఁడై యుండును.

శాన్తాశేషవిశేషాంశః స్తిష్ఠత్యద్వైతమాత్రకే
గలితద్వైతనిర్భాసముదితోఽన్తః ప్రబుద్ధవాన్. 63

ద్వైతభావము నశించుటచే నతిప్రసన్నుఁడును, జ్ఞానయుక్తుఁడును నగు యోగి సమస్త విశేషములు శమించుటఁబట్టి అద్వైతబ్రహ్మముననే సదా స్థితిగల్గియుండును.

సుషుప్తఘన ఏవాస్తే పఞ్చమ్యాం భూమికామితః
అన్తర్ముఖతయా తిష్ఠన్బహిర్వృత్తిపరోఽపి సన్. 64

ఈ యైదవభూమికను బొందిన యోగి బాహ్యవ్యాపారతత్పరుఁడై యున్నను, సుషుప్తఘనుఁడు (ఆనందమయుఁడు)ను, అంతర్ముఖుఁడునై యుండును.

పరిశాన్తతయా నిత్యం నిద్రాలురివ లక్ష్యతే
కుర్వన్నభ్యాసమేతస్యాం భూమికాయాం వివాసనః. 65

ఈ పంచమభూమికయం దభ్యాసముఁ జేయుచు, వాసనారహితుఁడగు యోగి పూర్ణశాంతత్వ కారణమున నితరులకు నిద్రాళువువలెఁ గన్పట్టును.

షష్ఠీం తుర్యాభిధామన్యాం క్రమాత్క్రామతి భూమికామ్
యత్ర నాసన్న సద్రూపో నాహం నాప్యనహంకృతిః. 66

ఉక్తప్రకారముగ, క్రమముగ తురీయమను నాఱవభూమికను యోగిపొందును. అచ్చోట సత్తుగాని, అసత్తుగాని, అహంకారముగాని, అనహంకారముగాని భాసింపదు.

కేవలం క్షీణమననమాస్తే ద్వైతైక్యనిర్గతః
నిర్గ్రన్థిః శాన్తసందేహో జీవన్ముక్తో విభావనః. 67

అటయోగి మననవర్జితుఁడై ద్వైతాద్వైత వితర్కరహితుఁడై, గ్రంథిశూన్యుఁడై, సర్వసందేహవివర్జితుఁడై, భావనారహితుఁడై, కేవలము జీవన్ముక్తుఁడై వెలయును.

అనిర్వాణోఽపి నిర్వాణశ్చిత్రదీప ఇవ స్థితః
అన్తఃశూన్యో బహిఃశూన్యః శూన్యః కుమ్భ ఇవామ్బరే. 68

శరీరమును ధరించియున్నను ముక్తుఁడగుఁడును, చిత్రమందలి దీపమువలె నిశ్చలముగనుండు వాఁడును, జడజగత్స్వభావరహితుఁడగుటచే నాకాశమందలి శూన్యఘటమువలె బాహ్యాభ్యంతరములందు (పదార్థ) శూన్యత్వము గలవాఁడునై యోగి యచ్చోటభాసిల్లును.

కాని, మందగమనము గలదియు, మదోన్మత్తయు, యుద్ధతత్పరయు, గొప్పదంతములచే ఘీంకారము సల్పునదియు, అనంతములైన యనర్థములం గావించునదియు నగు యొక కరిణి (ఆఁడేనుఁగు) గలదు. అది చంపఁబడినచో మనుజుఁడు నిక్కముగ నీ యేడుభూమికలందును విజయము నొందఁగలడు. పరాక్రమముచే ఆమదోన్మత్తయగు గజమెంతవరకు జయింపఁబడకుండునో, అంతవఱకేవీరుఁడు సాంసారిక సంప్రదూపములైన యుద్ధభూములందైనను బ్రవేశింప సమర్థుఁడగును? (ఎవఁడును సమర్థుఁడుకాడని భావము)

శ్రీరామ ఉవాచ:—

కాసౌ ప్రమత్తా కరిణీ కాశ్చ తా రణభూమయః. 77
కథం నిహన్యతే చైషా క్వచైషా రమతే చిరమ్

శ్రీరాముఁడు:— మునీశ్వరా! ఆ మదించిన యేనుఁగెయ్యది? ఆ యుద్ధభూములెవ్వి! అది యెట్లు చంపఁబడును? చిరకాలమది యెచట క్రీడించును? దయచేసి తెలుపవేఁడెద.

శ్రీవసిష ఉవాచ: —

రామేచ్ఛా నామ కరిణీ ఇదం మేఽస్తీతిరూపిణీ. 78
శరీరకాననే మత్తా వివిధోల్లాసకారిణీ
మత్తేన్ద్రియోగ్రకలభా రసనాకలభాషిణీ, 79
మనోగహనసంలీనా కర్మదన్తద్వయాన్వితా
మదోఽస్యా వాసనావ్యూహాః సర్వతః ప్రసరద్వపుః. 80
సంసారదృష్టయో రామ తస్యాః సమరభూమయః
భూయో యత్రాను భవతి నరో జయపరాజయౌ. 81

శ్రీ వసిష్ఠుఁడు:_ ఓ రామచంద్రా! 'ఇది నాకులభించుగాక' అను నిట్టిరూపముగల కోరికయే యీ గజము. దేహమను నరణ్యమున నది యనేకవిధముల యుల్లాసము గావించుచున్నది. మదించిన యింద్రియములే దాని భయంకర శిశువులు. జిహ్వచేనది మధురముగ భాషించుచును. మనస్సను కాననమున నది లీనమైయుండును. శుభాశుభకర్మములను రెండు దంతములది గలిగియున్నది. నలువైపుల విస్తరించినట్టి వాసనాసమూహమే దాని మదము. ఎచ్చోట మనుజుఁడు జయాపజయంబుల మరలమరల అనుభవించునో, అట్టి సాంసారికదృష్టులే దాని యుద్ధభూములు.

ఇచ్ఛానాగీ నిహన్త్యేషా కృపణాఞ్జీవసంచయాన్
వాసనేహా మనశ్చిత్తం సంకల్పో భావనం స్పృహా. 82
ఇత్యాదినివహో నామ్నామస్యాస్త్వాశయకోశగః

ఇచ్ఛయను ఈ యేనుఁగు కృపణులగు జీవసమూహములను వధించుచున్నది. వాసన, చేష్ట, మనస్సు, చిత్తము, సంకల్పము. భావన, స్పృహ మున్నగునవన్నియు, చిత్తకోశమున నున్నట్టి దీని యొక్క వివిధనామములు.

ధైర్యనామ్నా వరాస్త్రేణ ప్రసృతామవహేలయా. 83
నాగీం సర్వాత్మికామేతామిచ్ఛాం సర్వాత్మనా జయేత్

వ్యాపించియున్నదియు, సర్వ (భోగ్య) పదార్థరూపమై యొప్పునదియునగు ఇచ్ఛయను ఈ యేనుఁగును శ్రేష్ఠమైన అస్త్రముచే నిరాదరపూర్వకముగ సర్వవిధముల జయించవలెను.

యావద్వస్త్విదమిత్యేవమియమన్తర్విజృమ్భతే. 84
తావదుగ్రా కుసంసారమహా విషవిషూచికా

ప్రపంచమందలి సమస్తవస్తురూపమున నంతఃకరణమున నిది యెంతవఱకు విజృంభించుచుండునో, అంతవఱకు మహాభయంకరమైన, దుష్టసంసారమను విషవిషూచిక యుండియే యుండును.

ఏతావానేవ సంసార ఇదమస్త్వితి యన్మనః. 85
అస్య తూపశమో మోక్ష ఇత్యేవం జ్ఞానసంగ్రహః

'ఇది నాకు లభించుగాక' అనునట్టి రూపముగల మనస్సేది గలదో, అదియే సంసారము. అది శమించుటయే మోక్షము—సమస్త జ్ఞానసారమిదియే.

ప్రసాదకారిణీ స్వచ్ఛా నిరిచ్ఛే విమలాకృతౌ. 86
తైలబిన్దురివాదర్శే విశ్రామ్యత్యుపదేశవాక్

ఇచ్ఛారహితుఁడును, నిర్మలాకారయుక్తుఁడు నగు మనుజునియందు—అద్దముపై తైలబిందువువలె ప్రసన్నత్వమును గలుగఁజేయునదియు, స్వచ్ఛమైనదియునగు ఉపదేశవాణి విశ్రమించును. (సఫలమగును).

అసంవేదనమాత్రేణ నోదేతీచ్ఛాభవాఙ్కురః. 87

విషయములను స్మరింపకున్నంతమాత్రముచే సంసారముయొక్క యంకురమైనట్టి యీ యిచ్ఛ యుదయింపకుండును.

మనాగభ్యుదితైవేచ్ఛా చ్ఛేత్తవ్యానర్థకారిణీ
అసంవేదనశస్త్రేణ విషస్యేవాఙ్కురావలీ. 88

కొంచెమైన నుదయించినవెంటనే, అనర్థకారిణియగు యీ యిచ్ఛను, విషయ విస్మరణ రూపమగు శస్త్రముచే, విషయుక్తమైన అంకురసమూహమును వలె భేదించివేయవలయును.

ఇచ్ఛావిచ్ఛురితో జీవో విజహాతి స దీనతాం
స్వసంవేదనయత్నస్తు తూష్ణీమేవాన్తరా సనమ్- 89

ఇచ్ఛచే వ్యాపింపఁబడిన జీవుఁడు జీవత్వమును వదలకుండును. విషయేచ్ఛావిస్మరణ (ప్రత్యాహార) రూపమగు యత్నమునఁ దక్షుఁడగు వాఁడు తూష్ణీభూతుఁడై ఆత్మయందే స్థితిగల్గియుండును.

అవధానవినిర్ముక్తం సుప్తం శవశతం యథా
తాం ప్రత్యాహారబడిశేనేచ్ఛామత్స్యీం నియచ్ఛత, 90

ఈ ప్రత్యాహార మభ్యాసదశయందు సావధానత్వముచే గలుగుచున్నది. కాని, పరిపక్వ దశయందు అవధానలేమికయే సుషుప్తిమరణావస్థలందువలె స్వతః సంభవించుచున్నది. ఓ రామచంద్రా! ఇట్టి ప్రత్యాహారమను గాలముచే ఇచ్ఛయను చేపను నిగ్రహింపుము.

ఇదం మే ఽస్త్వితి సంవేగమాహుః కల్పనము త్తమాః
అర్థస్యాభావనం యత్తత్కల్పనాత్యాగ ఉచ్యతే. 91

'ఇది నాకుఁ గలుగుగాక' అను తీవ్రేచ్ఛనే విజ్ఞులు కల్పనయని పేర్కొనిరి. మఱియు, పదార్థముల విస్మరణమేదిగలదో, అదియే కల్పనాత్యాగమని చెప్పఁబడుచున్నది.

స్మరణం విద్ధి సంకల్పం శివమస్మరణం విదుః
తత్ర ప్రాగనుభూతం చ నానుభూతం చ భావ్యతే. 92

ఓ రామచంద్రా! (విషయముల) స్మరణమునే సంకల్పమని యెఱుఁగుము. అట్టి స్మరణము లేకుండుటయే శివరూపమని యెంచఁబడినది. సంకల్పమున, పూర్వమనుభవించినదియు, అనుభవింపనిదియుఁగూడ భావింపఁబడును.

అనుభూతాం నానుభూతాం స్మృతిం విస్మృత్య కాష్ఠవత్
సర్వమేవాశు విస్మృత్య గూఢ స్తిష్ఠ మహామతిః. 93

ఓ రాఘవా! అనుభవించినదియు, అనుభవింపనిదియునగు రెండింటియొక్క స్మృతిని కాష్ఠమువలె శీఘ్రముగ విస్మరించి గూఢరూపుఁడవై స్థితినొంది యుండుము.

ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి తత్
అసంకల్పః పరం శ్రేయం స కిమన్తర్న భావ్యతే. 94

ఓ రామచంద్రా! నేను రెండుచేతులు పైకెత్తి అసంకల్పమే సంకల్పము లేకుండుటయే) పరమశ్రేయమని ఎలుఁగెత్తి మరల మరల పలుకుచున్నాను. కాని యీనావాక్యముల నెవరును వినుట లేదు. అట్టి అసంకల్పస్థితిని జనులేల తమయంతఃకరణమున భావించుటలేదు.

కిల తూష్ణీం స్థితేనైవ తత్పదం ప్రాప్యతే పరమ్
పరమం యత్ర సామ్రాజ్యమపి రామ తృణాయతే. 95

ఓ రామచంద్రా! సమస్తేంద్రియ, మనోవ్యాపారరహితుఁడై కేవలము తూష్ణీంస్థితియందుండుట మాత్రముచేతనే, బ్రహ్మదేవుని మహాసామ్రాజ్య సుఖమున్ను నెచట తృణమువలెఁ దుచ్ఛముగ భాసించునో; అట్టి పరమానందపదము (భూమానందస్థితి) సంప్రాప్తించుచున్నది.

గమ్యదేశైకనిష్ఠస్య యథా పాన్థస్య పాదయోః
స్పన్దో విగతసంకల్ప స్తథా స్పన్దః స్వకర్మసు. 96

గమ్యప్రదేశమునుఁగూర్చియే ఏకైకనిష్ఠగఁ జనుచుండు పథికుని పాదములు సంకల్పములేకయే చలించుచుండు విధమున, యోగియొక్క స్వభావమున్ను సంకల్పములేకయే స్వకర్మములందుఁ బ్రవర్తించుచుండును.

బహునాత్ర కిముక్తేన సంక్షేపాదిదముచ్యతే
సంకల్పనం పరో బన్ధస్తదభావో విముక్తతా. 97

ఇవ్విషయమున నధికముగఁ జెప్పనేల? సంక్షేపముగ నీకిది చెప్పుచున్నాను. వినుము - సంకల్పమే పరమబంధనము; సంకల్పములేకుండుటయే మోక్షము.

సర్వమేవమజం శాన్తమనన్తం ధ్రువమవ్యయం
పశ్యన్భూతార్థచిద్రూపం శాన్తమాస్స్వ యథాసుఖమ్. 98

ఓ రామచంద్రా! ఈ సప్తప్రపంచమును, అజమై, శాంతమై, అనంతమై, ధ్రువమై, అవ్యయమై, నిత్యసిద్ధమైనట్టి పరమార్థచిద్రూపముగ నవలోకించుచు, శాంతముగను, యథాసుఖముగను నుండుము.

అవేదనం విదుర్యోగం శాన్తమాసీనమక్షయం
యోగస్థః కురు కర్మాణి నిర్వాసనోఽథ మా కురు. 99

ఓ రామచంద్రా! సమస్తదృశ్యమును మఱచి, అక్షయమైన, శాంతరూపమున నుండుటయే యోగమని చెప్పఁబడినది. కావున నీవు వాసనారహితుఁడవై, యోగమున స్థితిగల్గి యథాప్రాప్తములగు కర్మలఁ జేయుము. లేక సమాధిపరుఁడవైనచో, జేయకను నుండుము.

అవేదనం విదుర్యోగం చిత్తక్షయమకృత్రిమం
అత్యన్తం తన్మయో భూత్వా తథా తిష్ఠ యథాసి భో. 100

ఓ రాఘవా! 'అహం, మమ' (నేను, నాది) అను అధ్యాసముయొక్క, లేక, సమస్తదృశ్యము యొక్క విస్మృతియే స్వాభావికమగు చిత్తక్షయమనియు, జీవబ్రహ్మల యోగమనియుఁ జెప్పుదురు. కాన నీ వాత్మయందు అత్యంతతన్మయుఁడవై యెట్లుంటివో, అట్లే యుండుము (ఆత్మరూపమున వెలయుము.)

శివం సర్వగతం శాన్తం బోధాత్మకమజం శుభమ్
తదేకభావనం రామ సర్వత్యాగ ఇతి స్మృతః
భావయఞ్ఛశ్వదన్తః స్వం కార్యం కర్మ సమాచర. 101

ఓ రామచంద్రా! శివమై, సర్వవ్యాపకమై, శాంతమై, బోధరూపమై, అజమై, శుభమైనట్టి పరమాత్మతోటి యేకత్వభావనయే సర్వత్యాగమని చెప్పఁబడినది. అట్టి భావనను నిరంతరము నీ యంతఃకరణమునఁ గావించుచు, కర్తవ్యములైన కార్యములను బాగుగ నాచరించుము.

అహంమమేతి సంవిదన్న దుఃఖతో విముచ్యతే
అసంవిదన్విముచ్యతే యదీప్సితం సమాచర. 102

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే పరమార్థస్వరూపవర్ణనం నామ షడ్వింశత్యుత్తర శతతమః సర్గః ॥ 126 ॥

ఓ రాఘవా! 'అహం, మమ' (నేను, నాది) మున్నగు భావనలచే జీవుడెన్నటికి దుఃఖమునుండి విముక్తుడు కానేరడు. అట్టి భావనలను త్యజించుటచేతనే విముక్తుడగును. ఇట్లెఱిఁగి ఇఁక నిపుడు నీ కెయ్యది యిష్టమో దాని నాచరింపుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున పరమార్థస్వరూప వర్ణనమను నూటయిరువదియాఱవ సర్గము ॥126॥

---

## సప్తవింశత్యధిక శతతమః సర్గః.

[ఇహ రామస్య విశ్రాన్తిర్భరద్వాజోత్సుకోక్తయః
లక్షణం జాగ్రదాదీనాం తురీయం చోపవర్ణ్యతే.

శ్రీరామచంద్రుని విశ్రాంతి, ఉత్కంఠతోఁగూడిన భరద్వాజుని వచనములు, జాగ్రదాదుల లక్షణములు, తురీయావస్థయొక్క వర్ణనము, ఇచట వివరింపఁబడుచున్నవి.]

భరద్వాజ ఉవాచ:—

ఇతి వరమునినోక్తం జ్ఞానసారం పురాణం
సకల మనునిశమ్య శ్రీరఘూణాం కులాగ్ర్యః
విమలమతి రపృచ్ఛత్కించిదన్యత్స్వయం వా
సమసుఖపరిపూర్ణః పూర్ణబోధస్థితోఽసౌ. 1

శ్రీ భరద్వాజుఁడు (వాల్మీకి మహర్షితో నిట్లనెను):— మహాత్మా! రఘుకులతిలకుఁడును, విమలమతియునగు శ్రీరామచంద్రుఁడు మునిశ్రేష్ఠుఁడైన వసిష్ఠునిచేఁ జెప్పఁబడిన యీ పురాతన (మహర్షి సంప్రదాయగతమగు) జ్ఞానసారమును విని యింకేమైన యడిగెనా? లేక, ఆ యుపదేశమాత్రముచే సందేహరహితుఁడై, పరమసుఖముతోఁగూడుకొని, పూర్ణబోధమయుఁడై యుండెనా? నాకుఁ దెలియఁ జేయుఁడు.

స ఖలు పరమయోగీ విశ్వవన్ద్యః సురేశో
జననమరణహీనః శుద్ధబోధస్వభావః
సకలగుణనిధానం సంనిధానం రమాయా
స్త్రిజగదుదయ రక్షానుగ్రహాణామధీశః. 2

మునీశ్వరా! శ్రీరామచంద్రుఁడు మహాయోగియు, జగద్వంద్యుఁడును, దేవేశుఁడును, జననమరణరహితుఁడును, శుద్ధబోధస్వరూపుఁడును, సకలగుణనిధియు, లక్ష్మీపతియు, ముల్లోకములయొక్క యుత్పత్తి, రక్షణ, అనుగ్రహముల కధీశుఁడునై యున్నాఁడు.

వాల్మీకిరువాచ:—

ఇతి శ్రుత్వా వసిష్ఠస్య వాక్యం వేదాన్తసంగ్రహమ్
విదితాఖిలవిజ్ఞానో రామః కమలలోచనః. 3

శక్తిపాతవశోన్మేష ప్రకటామల చిద్ఘనః
ముహూర్తమాసీదుద్బుద్ధశ్చైతన్యానన్దసాగరః. 4

శ్రీ వాల్మీకి:—ఓ భరద్వాజా ! వేదాంతసంగ్రహరూపమగు వసిష్ఠమునీంద్రుని యీ వాక్యములను విని సమ్యగ్జ్ఞానము నెఱింగినవాఁడైన కమలనేత్రుఁడగు శ్రీరామచంద్రుఁడు, చిత్తవృత్తియందు అఖండాకారవాక్యముచే జనించిన నిరతిశయానందమునకు వశీభూతుఁడై, వికసితనేత్రములచేఁ బ్రకటితమైన నిర్మలచిద్ఘనముయొక్కయు, ఆనందముయొక్కయు చిహ్నములు గలవాఁడై, ఒక ముహూర్తకాలమువఱకు చైతన్యానందసాగరమగు స్వస్వరూపమున జాగృతుఁడైయుండెను.

ప్రశ్నోత్తరవిభాగాద్రి పరిపాటీవివర్జితః
ఆనన్దామృతపూర్ణాసూ రోమకణ్టకితాఙ్గకః. 5

అప్పుడాతఁడు ప్రశ్నోత్తరవర్జితుఁడై, ఉక్తానుక్తవివేచనాది రహితుఁడై, మనోబుద్ధీంద్రియవ్యాపారశూన్యుఁడై, ఆత్మానందమను నమృతముచేఁ బూర్ణుఁడగుటచేఁ బులకితశరీరుఁడైయుండెను.

మహాసామాన్యరూపత్వాచ్చిద్వ్యాపకతయా స్థితః
నిత్యమష్టగుణైశ్వర్యతృణప్రాయమనోరథః. 6

మఱియు నాతఁడు మహాసామాన్య (సర్వాధిష్ఠాన సన్మాత్ర) రూపమున నుండుటచే, చిద్వ్యాపకత్వముచే నంకట స్థితినొందియున్నవాఁడైయుండెను. మఱియు, అష్టగుణైశ్వర్యములతోఁ గూడియుండుటచే నపుడు సమస్త మనోరథము లాతనికిఁదృణమువలెఁ దుచ్ఛముగ గోచరించుచుండెను.

న కించిదూచే సంపన్నః శివే పరిణతః పదే

నిరతిశయానందమగు బ్రహ్మముతోటి యేకత్వము నొందుటచే శ్రీరామచంద్రుఁడపుడేమియుఁ జెప్పఁజాలకుండెను.

భరద్వాజ ఉవాచ:—

అహో ఖలు మహాశ్చర్యం రామః ప్రాప్తో మహత్పదమ్. 7

శ్రీభరద్వాజుఁడు:—ఆహా! మహాత్మా! నాకాశ్చర్యము గలుగుచున్నది! శ్రీరామచంద్రుఁడు మహత్పదమును బొందెనుగదా!

కథమేతాదృశీ ప్రాప్తిరస్మాకం మునినాయక
మూర్ఖాః సబుధాశ్చ కించిజ్జ్ఞా మాదృశాః క్వ చ పాపినః
క్వ చ బ్రహ్మాదిభిః ప్రార్థ్యా దుర్లభా రామసంస్థితిః. 8
అహో మునీశ్వరగురో కథం విశ్రామ్యతే మయా
దుష్పారస్య భవామ్భోధేస్తీర్యతే తద్వదాశు మే. 9

మునిశ్రేష్ఠా! అట్టి ఆత్మపదము మాకెట్లు సంప్రాప్తింపఁగలదు? మావంటి మూర్ఖులు, సబుధులు, కించిజ్జ్ఞులు, పాపులెచట! బ్రహ్మాదిదేవతలచేతను బ్రార్థనీయమును, దుర్లభమునగు శ్రీరామచంద్రుని యుత్తమస్థితి యెచట; ఆహా! గురువర్యా! మునీశ్వరా! నాకు విశ్రాంతి యెట్టుల లభించును? ఈ దుస్తరమగు సంసారసముద్రమును నేనెట్లు దాటఁగలనో శీఘ్రముగఁ దెలియఁజేయుము?

శ్రీవాల్మీకిరువాచ:—

శ్రీరామ వృత్తాన్తమశేషమాదితో వసిష్ఠవాక్యానుగతం నిరూపితమ్
ధియా విచార్యాను పరామృశ ప్రభో మయాపి తాదృక్కథనీయమత్ర తే. 10

శ్రీ వాల్మీకి.- ఓ భరద్వాజా! వసిష్ఠమునీంద్రుని వాక్యముల ననుసరించి శ్రీ రామచంద్రుని వృత్తాంతమంతయు మొదటినుండి నేను నీకుఁదెలియఁజేసితిని. దీనిని నీ స్వబుద్ధిచే విచారించి, పరామర్శచేసి, అనుభవమున నారూఢమొనర్చుకొనుము. నేనుగూడ నీయనుభవమునకు వచ్చువిధమున, అవస్థాత్రయాదులఁగూర్చి చెప్పెదను, వినుము.

అవిద్యాయాః ప్రపఞ్చోఽయం నాస్తి సత్యమిహాణ్వపి
వివేచయన్తి విబుధా వివదన్త్యవివేకినః. 11

ఈ జగత్తంతయు అవిద్యచేఁ గల్పితమైయున్నది. ఇందుఁ గొంచెమైనను సత్యములేదు. ఇట్లు దీనిఁగూర్చి విజ్ఞులు వివేచనమొనర్చుచున్నారు, కాని అవివేకులు వివాదమొనర్చుకొనుచున్నారు.

నాస్తి భిన్నం చితః కించిత్కిం ప్రపఞ్చేన రుధ్యసే
అభ్యాసేన రహస్యానాం వయస్య విశదో భవ. 12

ప్రియుఁడా! చైతన్యముకంటె భిన్నముగ నొకింతైనను లేదు. అట్టిచో ఈప్రపంచముచే నీవేల నిరోధింపఁబడుచున్నావు! నీవు ప్రణవ మహావాక్యాది రహస్యముల యభ్యాసముచే శుద్ధచిత్తుఁడవు గమ్ము.

ప్రపఞ్చ విషయా వృత్తిర్జాగ్రన్నిద్రేతి కీర్తితా
సంప్రబుద్ధస్తు యస్యాన్తశ్చిత్ప్రదీపో నిరఞ్జనః. 13

ప్రపంచవిషయముల యావృత్తి జాగ్రత్తునందును నిద్రారూపముగఁజెప్పఁబడినది. దాని యంతరమున నిరంజనమైనట్టి చైతన్యప్రదీపము జాగృతమైయున్నది. (సాక్షియై మేలుకొనియున్నది.)

శూన్యమూలః ప్రపఞ్చోఽయం శూన్యతాశిఖరః సఖే
సారశూన్యతయా మధ్యేఽప్యనాస్థా సన్మనీషిణామ్. 14

సఖుఁడా! ఈప్రపంచ మాదిమధ్యాంతములందును శూన్యమైన అజ్ఞానమే కారణముగా, గలిగియున్నది. కావుననే సజ్జనులగు బుద్ధిమంతులకు దీనియం దపేక్షలేదు.

అనాదివాసనాదోషారసన్నేవాయమీక్ష్యతే
గన్ధర్వనగరాకారః సంసారో బహువిభ్రమః. 15

అనేక భ్రమలను గలుగఁజేయునట్టి యీ ప్రపంచ మసత్తైనను, అనాదియగు వాసనాదోషముచే గంధర్వనగరాకారమువలె, సత్తుగనున్నట్లు గోచరించుచున్నది.

త్వామనభ్యస్య కల్యాణీం చైతన్యామృతకన్దలీమ్
సంముహ్యసి కిమభ్యస్య వాసనావిషవీరుధః. 16

ఓ భరద్వాజా! శుభప్రదమైన చైతన్యమను అమృతకదళీవృక్షము నాశ్రయింపక, వాసన యనువిషలత నాశ్రయించి యేల విమోహితుఁడ వగుచుంటివి?

జాగ్రదేతన్న పతితం జ్ఞానాలమ్బ గ్రహాదధః
న సన్త్యపరి సర్వేషాం యే నిరాలమ్బసంవిదః. 17

తత్త్వదర్శనముచే నిరాలంబమైన జ్ఞానాలంబమును పరిగ్రహించుటచే, పూర్వకాలిక అజ్ఞానావస్థయందలి జాగ్రత్ప్రపంచమిఁక సంభవింపదు. అట్టి జాగ్రత్తునకు ఉపరిస్థితినొందియున్న తురీయావస్థను బొందినట్టి నిరాలంబజ్ఞానులగు యోగులందఱికిని ఈజాగ్రదాది మూఁడవస్థలు నుండవు.

తావద్రూఢా సుధాకారరసా సంవిన్మహానదీ
న యావదాత్మరూపేణ నిపుణై రవగాహ్యతే. 18

అమృతమువంటి రసప్రవాహముతోఁగూడిన యీ చైతన్యమహానదిని నెంతవఱకు బుద్ధిమంతులు ఆత్మరూపముగఁ దెలిసికొనరో, అంతవఱకు దీనియందు జగద్రూపతరంగములు గానుపించుచు నే యుండును. (అజ్ఞానకాలముననే జగత్తుభాసించునని యర్థము)

ప్రాజ్ఞాస్తి చరమే నాస్తి వస్తు సర్వమిదం సఖే
విద్ధి మధ్యేఽపి తన్నాస్తి స్వప్నవృత్తమిదం జగత్. 19

సఖుఁడా! ఈ జగత్తునందలి పదార్థము లన్నియును ఆద్యంతములందు లేవు. కావున మధ్యయందును లేనివేయగును. అందుచే ఈప్రపంచమును స్వప్నతుల్యముగనే యెఱుఁగుము.

అవిద్యాయోనయో భేదాః సర్వేఽమీ బుద్బుదా ఇవ
క్షణముద్భూయ గచ్ఛన్తి జ్ఞానైకజలధౌ లయమ్. 20

అవిద్యచే నుత్పన్నమగుటంబట్టి యీ సమస్త పదార్థభేదములును బుద్బుదములవలె క్షణకాలముపైకిలేచి తిరిగి యేకమైనట్టి జ్ఞానసముద్రమున విలీనమగుచున్నవి.

సుశీతలోదకనదీం విదిత్వాథ విగాహ్య తాం
బహిర్భ్రాన్తినిదాఘాన్తే నిర్యాన్తు కలితాసుఖమ్. 21

మిగుల శీతలమైనట్టి జలముఁగలిగిన ఆత్మయను నది నెఱిఁగి అద్దానియందు స్నానముచేయుము. అట్లైనఁ క్లేశదాయకమైన బాహ్యభ్రాంతియను ఈ ముష్ణత్వమంతయును వీడిపోవును.

ఏకశ్చాజ్ఞాన జలధిర్జగదాప్లావ్య తిష్ఠతి
జ్యేష్ఠోఽయమహమిత్యూర్మిరవిద్యావాతసంభవః 22

అజ్ఞానమను నొక గొప్ప (క్షార) సముద్రము జగత్తునంతయు వ్యాపించియున్నది. అందు అవిద్య (అనాదివాసన) యను వాయువుచే నుత్పన్నమైన అహంకారము ప్రథమతరంగమై యున్నది.

చిత్తస్ఖలన భేదాలీ రాగాద్యాశ్చ ప్రకల్పితాః
మమతోత్కలితావర్తః స్వతః స్వైరం ప్రవర్తతే. 23

చిత్తముయొక్క యనేకవిషయములందలి ప్రవృత్తికి హేతువులైన రాగాదులీసముద్రమున నల్పతరంగములై యున్నవి. మమత్వమను ఆవర్తము (సుడి) ఇట సంకటను స్వాయముగ యథేచ్ఛగఁ బ్రవర్తించుచున్నది.

రాగద్వేషావతిగ్రాహా గృహీతసమనస్నరః
తతశ్చానర్థపాతాలప్రవేశః కేన వార్యతే. 24

రాగద్వేషములను మహాబలముగల మొసళ్లింయుగలవు. అవి నిన్ను బట్టుకొనినచో నీకఁ అనర్థదాయకమగు పాతాళరూపమైన మృత్యుముఖమునందలి నీయొక్క ప్రవేశము నెవఁడు వారింపఁగలఁడు?

ప్రశాన్తా మృతకల్లోలే కేవలామృతవారిధౌ
మజ్జ మజ్జసి కిం ద్వైతగ్రహక్షారాబ్ధివీచిషు. 25

ఒకచో, సముద్రమున మునుంగుటకే నీకిచ్ఛయున్నచోఁ బ్రశాంతమై, అమృతమయ తరంగములచే శోభితమైనట్టి, అద్వైతరూప, ఆత్మానందామృత సముద్రముననే మునుంగుము. ద్వైతరూప క్షారసముద్రతరంగములందేల మునుక లిడుచున్నావు?

కస్తిష్ఠతి గతః కో వా కస్య కేన కిమాగతం
కిం ను మజ్జసి మాయాయాం పత మా త్వమతన్ద్రితః. 26

ఓ భరద్వాజా! శ్రీరామచంద్రుని ప్రపంచము జ్ఞానముచేఁ దొలఁగిపోయినది, నాప్రపంచమింకను దొలఁగలేదని నీవనుచుంటివి. ఉన్నదేది? పోయినదేది? ఎవని కేది దేనిచే వచ్చినది? ఇట్లు మాయయందేల నిమగ్నుఁడవగుచుంటివి? నీవు జాగరూకుఁడవై, వివేకివై మాయయందుఁ బడక యుండుము.

తత్త్వమేకం యదాత్మేతి జగదేతత్ప్రచక్షతే
తతోఽన్యః కస్తవాలీకో యస్తాత విషయః శుచామ్. 27

వేదాంతశాస్త్రములన్నియును ఏకమతముగ 'ఈ జగత్తంతయు ఆత్మయే' యని వాక్రుచ్చుచుండ, నీకఁ దాని కన్యముగ నేదిగలదు? ఇఁకఁ పోయినదేది? మఱియు నీకఁ శోకింపఁదగిన విషయమెద్ది?

బాలాన్ప్రతి వివర్తోఽయం బ్రహ్మణః సకలం జగత్
అవివర్తితమానన్దమాస్థితాః కృతినః సదా. 28

బ్రహ్మముయొక్క జగదాకార వివర్తము అవివేకులగు బాలురకొఱకేయగును. వివేకులగు జ్ఞానులైననో, సదా అపరివర్తమగు ఆనందము (బ్రహ్మము)ననే స్థితినొంది యుందురు.

అవివిక్తో జనః శోచత్యకస్మాచ్చ ప్రహృష్యతి
తత్త్వవిత్తు హసన్నాస్తే తస్య మోహో విడమ్బనమ్. 29

అవివేకియగు మనుజుఁడొకపుడు శోకించును, ఒకపు డకస్మాత్తుగఁ బ్రసన్నుఁడగును. కాని తత్త్వవేత్త సదా ప్రసన్నుఁడుగనే యుండును. అతని శోకాదిమోహము కించిత్కాలము, అజ్ఞానియొక్క యనుకరణమాత్రమే యగును.

తచ్చ సూక్ష్మమిదం తత్త్వం తిరోహితమవిద్యయా
యథా స్థలేషు లోకానాం జలేష్వాత్మసు సంశయః. 30

అజ్ఞానులైన జనులకు జలమందు స్థలభ్రాంతి, మరుస్థలమందు జలభ్రాంతికలుగునట్లు, ఈ సూక్ష్మమగు ఆత్మతత్త్వము అవిద్యచేఁ గప్పఁబడియున్నందున నట్టి అవిద్యాచ్ఛాదితులకు ఆనాత్మయం దాత్మత్వభ్రాంతి కలుగుచున్నది.

పృథివ్యాదిమహాభూతపరమాణుమయం జగత్
స్థితం యదా తదాపీహ కో గతో యోఽనుశోచ్యతే. 31

పృథివ్యాది మహాభూతములతోఁగూడి పరమాణుమయమై యీ జగత్తు వెలయుచున్నదను పరమాణువాదుల మతమందును దేహాదులకంటె ఆత్మభిన్నమగుటచే నిఁక అనాత్మరూపములగు తద్దేహాదుల నాశముచే శోకింపఁదగినట్టి యే పదార్థము పోవును.

అసతః సంభవో నాస్తి నాస్త్యభావః సతః సఖే
ఆవిర్భావతిరోభావాః సంస్థానానామమీ పరమ్. 32

సఖుఁడా! అసత్పదార్థమునకు ఉత్పత్తియులేదు, సత్పదార్థమునకు నాశమున్నులేదు. కేవలము మాయారూపములగు యీదేహాది సమస్తపదార్థముల యొక్కయే ఆవిర్భావ, తిరోభావములు సంభవించుచున్నవి.

కింత్వనేకపురోత్సాహా ద్విషతాముపగచ్ఛతి
భజ సంభరితాభోగం పరమేశం జగద్గురుమ్. 33

పూర్వసంచితములగు అనేక పుణ్యపాపములను హేతువుచే మాయారూపములగు యీ దేహాదులు విషతుల్యములగు మరణాద్యనేక అనర్థములను బొందుచున్నవి. వాని నాశముకొఱకై, భక్తానుగ్రహార్థము అర్ధనారీశ్వరాదిరూపముల ధరించిన జగద్గురువగు శ్రీశంకరుని (సగుణబ్రహ్మమును) ఉపాసింపుము.

దురితాని సమస్తాని పచ్యన్తేఽద్యాపి న ధ్రువం
కృతమేవాస్య దేవస్య పాశా విశ్రవతాం గతాః. 34

ఓ భరద్వాజా! ఇంతవఱకు నీపుణ్యపాపములన్నియు నిక్కముగ క్షయింపక నేయున్నవి. ప్రాణులచే నొనర్పఁబడు శుభాశుభకర్మలే యీ పశుపతిదేవునకు, ప్రాణుల బంధనార్థము శ్రుతిప్రసిద్ధమైన పాశరూపత్వము నొందుచున్నవి.

సాకారం భజ తావత్త్వం యావత్సత్వం ప్రసీదతి
నిరాకారే పరే తత్త్వే తతః స్థితిరకృత్రిమా. 35

నీ చిత్తము శుద్ధమగునంతవఱకు నీవు సాకారమగు శ్రీశంకరుని రూపమును ధ్యానింపుము, పిదపనంగా ఆతని సాకారరూపమును భజించుటచేతను, ధ్యానించుటచేతను, నిరాకారమగు బ్రహ్మమున స్వాభావికమగు స్థితినీకు లభించును.

ఇమాముద్దామతమసో జిత్వా సత్వబలాద్ధ్రువం
యమస్యానుసరాధ్వానం విశ్వస్తేనాన్తరాత్మనా. 36

సగుణేశ్వరోపాసనచే గల్గు శుద్ధసత్వముయొక్క బలముచేఁ బ్రచండమగు యీ యజ్ఞానవ్యామోహశక్తిని జయించి గురు, శాస్త్రోపదేశములందు విశ్వాసముగల్గినట్టి మనస్సుచే నింద్రియసహితమగు మనస్సును నిగ్రహించుటయను యమముయొక్క మార్గమును నీ వనుసరింపుము.

సమాధాయ క్షణం పశ్య ప్రత్యగాత్మానమాత్మనా
ఇయం విభాతు సా వ్యక్తం ప్రాగ్బుద్ధిరజనీ తవ. 37

తదుపరి క్షణకాలమైనను మనస్సును సమాధానపఱచి (సమాధి నాశ్రయించి) ప్రత్యగాత్మను (సాక్షిచైతన్యమును) అవలోకింపుము. దానిచే, తమోగుణాచ్ఛాదితమగు నీయొక్క రాత్రి (తమో)రూపమగుబుద్ధి ప్రాతఃకాల (ప్రకాశ)రూపత్వము నొందుగాక!

కృతం పురుషకారేణ కేవలేన చ కర్మణా
మహేశానుగ్రహాదేవ ప్రాప్తవ్యం ప్రాప్యతే నరైః. 38

భక్తిరహితమగు కేవల పురుషప్రయత్నముచేగాని, కర్మానుష్ఠానముచేగాని, ప్రయోజనము లేదు. మహేశ్వరుని అనుగ్రహముచేతనే మనుజులకు పొందఁదగిన వాంఛిత ఫలములు లభించుచున్నవి.

నాభిజాత్యం న చారిత్ర్యం న నయో న చ విక్రమః
బలవన్తి పురాణాని సఖే కర్మాణి కేవలమ్. 39

ప్రియుఁడా! ఈశ్వరానుగ్రహములేనిచో, కులీనత్వము, సదాచారము, తపము, పరాక్రమము మున్నగునవేమియుఁ జేయఁజాలవు. ఏలయనఁగా, పూర్వోపార్జిత కర్మము లనంతములు. వానిని జయించుటకొఱకై, తపస్సదాచారాదుల ప్రాబల్యమీశ్వరభక్తియొక్క సహాయములేమి సంభవింపదు.

అప్రతర్క్యాత్ప్రతీకారాత్కి మేవమవసీదసి
న లుమ్పతి లలాటస్థామీశ్వరోఽప్యక్షరావలిమ్. 40

సమూలాజ్ఞాననాశకమగు జ్ఞానము లేకుండినఁ, కేవల ముపాసనారూపమగు పురుషప్రయత్నమాత్రముచే నీశ్వరుఁడున్ను నొసట వ్రాయఁబడిన యక్షరములఁ దొలగింపనేరఁడు. కావున, ఉపాసనతోఁ బాటు యమనియమాదులద్వారా జ్ఞానమునున్ను సంపాదింపవలయును.

క్వ చిద్వక్తా క్వ వైదగ్ధ్యం క్వ చేయం మోహవల్లరీ
అచిన్తనీయా నియతిర్యదియం ద్వన్ద్వమోహితా. 41

మనోవాక్కులకు అగమ్యమగు చిద్బ్రహ్మము బోధింపఁగురువెచట! దానిఁ దెలుపఁగునట్టి శక్యాని నిపుణత్వ మెచట! శమదమాదుల క్రమముచే స్వవినాశముకొఱకుఁ బరిణతమగు యీ మోహలతయెచట! ఎద్దానిచే ఈసామగ్రియంతయుఁ బరస్పరము కలియునో, అట్టి యీశ్వరేచ్ఛారూపమగు నియతి అచింతనీయంబైనది.

హే భరద్వాజ మోహం త్వం వివేకేన జహి స్ఫుటం
అసామాన్యమిదానీం త్వం జ్ఞానం ప్రాప్స్యస్యసంశయమ్. 42

ఓ భరద్వాజుఁడా! నీవు వివేకముచే నీమోహమును, స్పష్టరూపమున వధింపుము. అట్టిచో అసాధారణజ్ఞానమును నిస్సంశయముగ నీవిపుడే పొందఁగలవు.

దూరముత్సహతే రాజా మహాసత్త్వో మహాపది
అల్పసత్త్వో జనః శోచత్యల్పేఽపి హి పరిక్షతే. 43

మహాశయుఁడును, ధన, సేనాది సామగ్రీయుతుఁడునగు రాజు యుద్ధము మొదలగు గొప్ప యాపదలు తటస్థించినపుడు, ఇతరుల మనోరథములకు దూరుఁడైనను, ప్రజాపాలన, దుష్టనిగ్రహాది కార్యములందు సమర్థుఁడగును. అల్పసామగ్రీయుతుఁడగు రాజు ధనాదినాశరూపమగు స్వల్పాపద లందును శోకమొందును. (మహత్కార్యమందైనను సర్వసామగ్రీసంపన్నుఁడవగు నీవు శోకింపఁదగ దని భావము)

బోధః పుణ్యాపరాధీనః ప్రథతే బహుజన్మభిః
అనుమీయేత ధీరేషు జీవన్ముక్తేషు కార్యతః. 44

బోధ (ఆత్మజ్ఞానము) ఈశ్వరోపాసనాది పుణ్యకార్యముల కధీనమైయున్నదై యనేక జన్మలకుఁ బ్రకటమగును. పుణ్యవంతులగు ధీరులందు భవిష్యత్కాలమున నుదయించునట్టి యా బోధ యొక్క యనుమానము గావింపఁబడుచున్నది. జీవన్ముక్తులందు వారి కార్యములచే నద్దాని యను మానము గావింపఁబడుచున్నది.

ద్విషద్ధుర్భాతేన యేనైవ కర్మణా బద్ధ ఈదృశః
సుహృద్ధుర్భాతేన తేనైవ మోక్షమాప్స్యసి పుత్రక. 45

పుత్రకా! రాగమున్నచో పుణ్యకర్మము శత్రురూపమై బంధనము గలిగించును. రాగము లేనిచో నదియే మిత్రరూపము కాఁగా, దానిచే మోక్షమును బొందఁగలవు.

సతాం సత్కర్మసంవేగః పురాణం ప్రణుదన్నయం
వర్షౌఘ ఇవ భూతానాం దవానలమసేచయత్. 46

సజ్జనుల రాగరహితమగు సత్కర్మము పూర్వసంచితములైన పాపాదులను నశింపఁజేయుచు, వర్షాసమూహము దావానలమును జల్లార్చునట్లు, జీవుల త్రివిధతాపములను జల్లార్చుచున్నది.

సఖే సంన్యస్య కర్మాణి బ్రహ్మణః ప్రణయీ భవ
నేష్యసే యది సంసార చక్రావర్తభ్రమః శమమ్. 47

ప్రియుఁడా! సంసార చక్రమను ఆవర్తముయొక్క భ్రమయందలి స్థితిని నీవు కోరనిచో నీకు సమస్తకర్మములను వదలి బ్రహ్మమున నాసక్తుఁడవగుము.

తావదేతద్వికల్పోత్థమిదం యావద్బహిర్గ్రహః
ప్రతికూలోఽబ్ధిరుల్లోలే కేవలం నిశ్చలే జలే. 48

సముద్రము సంక్షోభముతోఁ గూడియున్నంతవఱకు దానియందుఁ జంచలత్వమెట్లుండునో, నిశ్చల జలమందుఁ గేవలము శాంతమగు జలముమాత్రమే యెవ్విధమున నుండునో, అట్లే బాహ్యవిషయములందు చిత్తము చంచలముగానున్నంతవఱకు ఈ వికల్పజాలము లేచుచునేయుండును.

అయం కిమన్ధకరణస్త్వయా శోకోఽవలమ్బ్యతే
నిర్వాహయతు సైవ త్వాం ప్రజ్ఞా యష్టిరభఙ్గురా. 49

వివేకదృష్టి నాచ్ఛాదించునట్టి యీశోకమును నీవేల యవలంబించుచుంటివి? ఇట్టి శోకాంధదశయందు అకుంఠిత ప్రజ్ఞయను యష్టి (చేతికఱ్ఱ)యే నీయొక్క నిర్వాహము గావించుగాక!

న జాతు తే విగణ్యన్తే గణనాసు గరీయసాం
యే తరఙ్గైస్తృణానీవ హ్రియన్తే హర్షశోకయోః. 50

హర్షశోకములయొక్క శుభాశుభతరంగములచే తృణమువలె ఈ సంసారమునఁ గొట్టుకొనిపోవువారు మహాత్ముల గణన (లెక్క)యందెన్నఁటికిని రాఁజాలరు.

సమారూఢం దశాదోలామహోరాత్రమిదం జగత్
క్రీడ్యతే షడ్విధైః ప్రేఙ్ఖైః సఖే కిమితి ఖిద్యతే. 51

సఖుఁడా! సమస్తజీవులును హర్షశోకాదిదశారూపములగు యూయాలపైనెక్కి మహోరాత్రములను, (లేక షడృతువులను, లేక కామక్రోధాద్యరిషడ్వర్గములను) ఆఱువిధములగు డోలాయంత్రములతోఁగూడి కాలముతోఁ గ్రీడించుచున్నారు.

సూతే సంహరతి క్షిప్రం పునః సృజతి హన్తి చ
జగన్తి బహుపర్యాయైః కాల ఏవ కుతూహలీ. 52

క్రీడాకుతూహలియగు ఈ కాలమనేకరూపములచే ననేకపర్యాయము లనేక జగంబులను సృజించుచు, పాలించుచు, సంహరించుచుఁ గ్రీడించుచున్నది.

న విశేషగ్రహః కశ్చిన్న చ కశ్చిన్న కశ్చన
జన్తుష్వభ్యవహార్యేషు ప్రాక్రమ్య కాలభోగినః, 53

జీవుల నాక్రమించియున్న యీ కాలసర్పమునకుఁదన భక్ష్యములగు యా జీవులందేదైన విశేషదృష్టిగాని, విశేషకర్మను గాని విశేషధర్మిగాని లేదు. సర్వులను సమానరూపముగనే యది భక్షించుచున్నది.

కా కథా మర్త్యపిణ్డానాం నిమేషాన్తరవాసినాం
అపి దేవనికాయా యే తేఽపి దుష్కాలగోచరాః, 54

అల్పకాలస్థములగు మనుజ శరీరములఁగూర్చి చెప్పనేల, దీర్ఘకాలస్థములగు దేవతల శరీరములున్ను ఈదుష్టకాలమునకు అన్నరూపములగు చున్నవి.

స్వయం నృత్యసి కింప్రీతో విపత్తౌ వికలేన్ద్రియః
క్షణం నిశ్చలమాసీనః పశ్య సంసారనాటకమ్. 55

విపత్తియందు వ్యాకులములైన యింద్రియములుగలవాఁడవై, ఈకాలమందు నీవేల ప్రీతిగల్గి స్వయముగ (సంసారనాటకమున) నృత్య మొనర్చుచున్నావు? క్షణకాలము సాక్షిరూపమున (ఆత్మయందు) నిశ్చలముగ నున్నవాఁడవై యీ సంసారనాటకమును జూడుము.

అస్యానేక తరఙ్గస్య జగతః క్షణభఙ్గినః
న విషీదతి మనస్వీ భరద్వాజ మనాగపి. 56

ఓ భరద్వాజుఁడా! క్షణభంగురమైన యనేక తరంగములతోఁ గూడిన యీ జగత్తునుగూర్చి వివేకియగు జీవుఁడు కొంచెమైనను దుఃఖింపఁడు.

త్యజ శోకమమఙ్గల్యం మఙ్గలాని విచిన్తయ
చిదానన్దఘనం స్వచ్ఛమాత్మానం చ విభావయ. 57

అమంగళయోగ్యమైనట్టి శోకమును నీవు త్యజింపుము. ఆత్మదర్శన సాధనములగు మంగళములనే బాగుగఁ జింతింపుము. చిదానందఘనమై, స్వచ్ఛమైనట్టి ఆత్మస్వరూపమునుగూర్చి లెస్సగ విచారింపుము.

దేవ ద్విజ గురుశ్రద్ధాభవబన్ధురచేతసాం
సదాగమప్రమాణానాం మహేశానుగ్రహో భవేత్. 58

దేవ, బ్రాహ్మణ, గురువులందలి శ్రద్ధచేఁ బరిపూర్ణమైన చిత్తముగలవారును, సదా వేదములే ప్రమాణముగఁ గలవారునగు మనుజులకు మహేశ్వరుని యనుగ్రహము కలుగును.

భరద్వాజ ఉవాచః —

జ్ఞాతం తవ ప్రసాదేన సర్వమేతదశేషతః
న వైరాగ్యాత్పరో బన్ధుర్న సంసారాత్పరో రిపుః. 59

భరద్వాజుఁడు.— మహాత్మా! మీయనుగ్రహముచే నేనీజ్ఞానమంతయు నిశ్శేషముగ నెఱిగితిని— వైరాగ్యమునకు మించిన బంధువులేఁడు, సంసారమునకు మించిన శత్రువులేఁడు.

ఇదానీం శ్రోతుమిచ్ఛామి వసిష్ఠేనోపపాదితం
జ్ఞానసారమశేషేణ గ్రన్థేనోక్తం పదాత్మనా. 60

గురువర్యా! ఇఁక నిప్పుడు వసిష్ఠమునీంద్రుఁడు తన సంపూర్ణ గ్రంథముచే వచించిన జ్ఞానసారమును సంక్షేపముగ వినఁగోరుచున్నాను.

శ్రీ వాల్మీకిరువాచః—

భరద్వాజ శృణుష్వేదం మహాజ్ఞానం విముక్తిదం
యస్య శ్రవణమాత్రేణ భవాబ్ధౌ న నిమజ్జసి. 61

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! ముక్తిదాయకమగు యీ మహాజ్ఞానమునుగూర్చి నీవు వినుము, దానిని వినినంతమాత్రముననే నీవిఁక సంసారసముద్రమున మునుఁగ నేరవు.

సంహృతిస్థితి సంభూతిభేదైర్యోఽనేకధా స్థితః
ఏకోఽపి సన్నమస్తస్మై సచ్చిదానన్దమూర్తయే. 62

ఏ పరమాత్మ యొక్కఁడేయైనను, సృష్టి స్థితి సంహార భేదములచే ననేకరూపములుగ నుండి యున్నాడో, అట్టి సచ్చిదానందమూర్తికి నమస్కారము.

కృతే ప్రపఞ్చవిలయే యథా తత్త్వం ప్రకాశతే
తదుపాయం ప్రవక్ష్యామి సంక్షేపాచ్ఛ్రుతిశాసనాత్. 63

ప్రపంచమును దన కారణమందు లయమొనర్చుటచే నెవ్విధమున ఆత్మతత్త్వము ప్రకాశించునో, ఆయుపాయమును శ్రుతిప్రమాణముచే సంక్షేపముగ నీకుపదేశించుచున్నాను, వినుము.

పూర్వాపరవిచారార్హా కథం నష్టా తవస్మృతిః
తయైవ జ్ఞాయతే సర్వం కరామలకవత్స్వయమ్. 64

ఓ భరద్వాజా! పూర్వాపరవిచారయోగ్యమగు నీస్మృతి యెట్లు నశించినది? ఆస్మృతిచేతనే సమస్తమున్ను స్వయముగ కరతలామలకమువలె స్పష్టముగఁ గోచరించును.

స్వయం విచార్యం స్వయమేవ చేతసా
తత్ప్రాప్యతే యేన న శోచతే పునః
సత్సఙ్గసచ్ఛాస్త్రవివేకతః పున
ర్వైరాగ్యయుక్తేన విభావ్యమేతత్ 65

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్థే భరద్వాజానుశాసనం నామ సప్తవింశత్యధిక శతతమః సర్గః ‖ 127 ‖

దేనిని బొందుటచే జీవుఁడు మరల శోకింపఁడో, అట్టి వస్తువు స్వచిత్తముచే స్వయముగ విచారించుటచే సంప్రాప్తించుచున్నది. వైరాగ్యయుతుఁడగు మనుజుఁడు సత్సంగ, సచ్ఛాస్త్ర, వివేకముల ద్వారా ఆయాత్మతత్త్వమును విచారింపవలసియున్నది.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున భరద్వాజానుశాసనమను నూటయిరువదియేడవ సర్గము ‖127‖

---

## అష్టావింశత్యధికశతతమః సర్గః.

[ప్రవిలాపనయుక్త్యాత్ర భరద్వాజకృతార్థతా
వర్ణ్యతే జ్ఞానికర్తవ్యరామవ్యుత్థాపనక్రమౌ.

ప్రవిలాపనమను యుక్తిచే భరద్వాజుని కృతార్థత్వము, జ్ఞానుల కర్తవ్యము, శ్రీరామచంద్రుని వ్యుత్థాపనక్రమము, ఇట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవాల్మీకి రువాచ:—

శాన్తోదాన్తశ్చోపరతో నిషిద్ధాకామ్యకర్మణః
విషయేన్ద్రియసంశ్లేష సుఖాచ్చ శ్రద్ధయాన్వితః. 1

మృద్వాసనే సమాసీనో జితచిత్తేన్ద్రియక్రియః
ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి. 2

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! శాంతుఁడై, దాంతుఁడై, ఉపరతిగలవాఁడై (శమదమాదులతోఁ గూడుకొని), నిషిద్ధ, కామ్యకర్మలనుండియు, విషయేంద్రియ సంయోగముచేఁగలుగు సుఖము నుండియు విరతుఁడై, శ్రద్ధాయుతుడై మృదువైన యాసనముపైఁ గూరుచుండి, ఇంద్రియక్రియలను జయించి, మనస్సు ప్రసన్నమగునంతవఱకు 'ఓంకారము' నుచ్చరింపవలయును.

ప్రాణాయామం తతః కుర్యాదన్తఃకరణశుద్ధయే
ఇన్ద్రియాణ్యాహరేత్పశ్చాద్విషయేభ్యః శనైః శనైః 3

అటుపిమ్మట, అంతఃకరణశుద్ధికొఱకై ప్రాణాయామ మాచరింపవలెను. తదుపరి యింద్రియములను విషయములనుండి మెల్లమెల్లగ, దొలగింపవలెను.

దేహేన్ద్రియమనోబుద్ధి క్షేత్రజ్ఞానాం చ సంభవః
యస్మాద్భవతి తజ్జ్ఞాత్వా తేషు పశ్చాద్విలాపయేత్. 4

దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, జీవుఁడు—వీని యన్నింటియొక్క యుత్పత్తి దేనినుండి గలుగుచున్నదో యద్దాని (ఆత్మ) నెఱిఁగి, పిదప దానియందే యా సమస్తమును లయ మొనర్పవలయును.

విరాజి ప్రథమం స్థిత్వా తత్రాత్మని తతః పరం
అవ్యాకృతే స్థితః పశ్చాత్థ్సితః పరమకారణే. 5

మొట్టమొదట అకారవాచ్యమగు స్థూలభూతసమష్టిరూపమైన విరాట్టునందు అహంభావన యొనర్చియుండవలెను. పిమ్మట ఉకారవాచ్యమగు సూక్ష్మభూత సమష్టిరూపమైన హిరణ్యగర్భునియందా విరాట్టును లయమొనర్చి జ్ఞానియందహంభావన గావించి యుండవలయును. తదుపరి తత్కారణమగు 'మ'కారవాచ్యమైన అవ్యాకృతమున నా హిరణ్యగర్భుని లయింపఁజేసి దానియందహంభావన యొనర్చి యుండవలెను. అనంతర మాయవ్యాకృతమునుగూడ అర్ధమాత్ర వాచ్యమగు పరమకారణమైన శుద్ధబ్రహ్మమున లయ మొనర్చి అద్దానియందు స్థితిగల్గి యుండవలెను.

మాంసాదిపార్థివం భాగం పృథివ్యాం ప్రవిలాపయేత్
ఆప్యం రక్తాదికం చాప్సుతైజసం తేజసి క్షిపేత్. 6

వాయవ్యం చ మహావాయౌ నాభసం నభసి క్షిపేత్
పృథివ్యాదిము విన్యస్య చేన్ద్రియాణ్యాత్మయోనిషు. 7

దేహముయొక్క మాంసాది పృథివీ సంబంధ భాగమును పృథివియందును, జల సంబంధమైన రక్తాదులను జలమందును, తేజస్సంబంధ భాగమును తేజమందును, వాయు సంబంధ భాగమును వాయువునందును, ఆకాశ సంబంధభాగము నాకాశమందును లయము చేయవలెను. అట్లే ఘ్రాణాదీంద్రియములను తమతమ కారణములగు దేవతోపాధి భూత సూక్ష్మ పృథివ్యాది భూతములందు లయ మొనర్పవలెను.

శ్రోత్రాది లక్షణోపేతాం కర్తుర్భోగప్రసిద్ధయే
దిక్షు న్యస్యాత్మనః శ్రోత్రం త్వచం విద్యుతి నిక్షిపేత్. 8
చక్షురాదిత్యబిమ్బే చ జిహ్వామప్సు వినిక్షిపేత్
ప్రాణం వాయౌ వాచమగ్నౌ పాణిమిన్ద్రే వినిక్షిపేత్. 9
విష్ణౌ తథాత్మనః పాదౌ పాయుం మిత్రే తథైవ చ
ఉపస్థం కశ్యపే న్యస్య మనశ్చన్ద్రే నివేశయేత్. 10
బుద్ధిం బ్రహ్మణి సంయచ్ఛేదేతాః కరణదేవతాః
ఇన్ద్రియవ్యపదేశేన వ్యాదిశ్యన్తే చ దేవతాః. 11
శ్రుతివాక్యమనుస్మృత్య న స్వతః ప్రకటీకృతాః

పిమ్మట, కర్తయగు జీవునియొక్క శబ్దాదిభోగప్రసిద్ధికొఱకై శ్రోత్రాదిగోళములందుఁ బ్రవేశించి, ఆయా యింద్రియభావములతోఁ గూడుకొనియున్నట్టి దిగాదిదేవతలను గ్రమముగ నాయా దేవతలందే లయింపఁజేయవలయును. ఎట్లనఁగా, శ్రోత్రేంద్రియమును దిక్కులందును, త్వగింద్రియమును విద్యుత్తునందును, నేత్రేంద్రియమును సూర్యబింబమునందును, జిహ్వేంద్రియమును వరుణునియందును, ప్రాణమును వాయువందును, వాక్కు నగ్నియందును, హస్తేంద్రియము నింద్రునియందును, పాదేంద్రియమును విష్ణువందును, గుదేంద్రియమును మిత్రునియందును, ఉపస్థేంద్రియమును కశ్యపునియందును, మనస్సును చంద్రునియందును, బుద్ధిని బ్రహ్మదేవునియందును? లయింపఁజేయవలెను. ఓ భరద్వాజా! ఇంద్రియములను వేఱువస్తువులులేవు. ఈ దేవతలే యింద్రియముల మిషచే స్థితినొందియున్నారు. ఇత్యాది ఈ విషయములన్నిఁటిని నేను శ్రుతివాక్యముల ననుసరించియే వచించుచున్నాను, గాని స్వకపోలకల్పనచేఁ గాదు.

ఏవం న్యస్యాత్మనో దేహం విరాడస్మీతి చిన్తయేత్. 12

ఈ ప్రకారముగ మనుజుడు తన దేహమును సద్దానికారణమున లయింపఁజేసి 'నేను విరాట్టు' నని చింతింపవలెను.

బ్రహ్మాణ్డాన్తః స్థితో యోఽసావర్ధనారీశ్వరః ప్రభుః
ఆధారః సర్వభూతానాం కారణం తదుదాహృతమ్. 13
స యజ్ఞసృష్టిరూపోఽసౌ జగద్వృత్తౌ వ్యవస్థితః

బ్రహ్మాండమునందు ప్రభువై యున్నవాఁడును, అర్ధనారీరూపమును ధరించియున్నవాఁడునగు, ఈశ్వరుఁడే సమస్తభూతములకు నాధారమని, కారణమని చెప్పఁబడెను. ఆతఁడు యజ్ఞ, సృష్టి రూపములతోటి జగద్వ్యవహారమందు స్థితిగలిగియున్నాఁడు.

ద్విగుణాణ్డాద్బహిః పృథ్వీ పృథివ్యా ద్విగుణం జలమ్. 14
సలిలాద్ద్విగుణం తేజస్తేజసో ద్విగుణోఽనిలః
వాయోర్ద్విగుణమాకాశ మూర్ధ్వమేకైకశః క్రమాత్. 15

ఈ బ్రహ్మాండమునకు బాహ్యమునదీనికి రెండింతలు పృథివియు, పృథివికి రెండింతలు జలమును, జలమునకు రెండింతలు తేజమున్ను, తేజమునకు రెండింతలు వాయువున్ను, వాయువునకు రెండింత లాకాశమున్ను గలదు. ఈ ప్రకారముగ నుత్తరోత్తరక్రమముచే నొకటి మఱియొకదానికంటె ద్విగుణమైయున్నది.

వ్యస్తేన చ సమస్తేన వ్యాపినా గ్రథితం జగత్
క్షితిం చాప్సు సమావేశ్య సలిలం చానలే క్షిపేత్. 16
అగ్నిం వాయౌ సమావేశ్య వాయుం చ నభసి క్షిపేత్.
నభశ్చ మహదాకాశే సమస్తోత్పత్తికారణే. 17

అపంచీకృతములును, పంచీకృతములునగు ఈ భూతములచే ఈ ప్రపంచమంతయు వ్యాపించియున్నది. కావున, పృథివిని దానికారణమగు జలమందును, జలము నగ్నియందును, అగ్నిని వాయువందును, వాయువు నాకాశమందును, ఆకాశమును సమస్తోత్పత్తికారణమగు హిరణ్యగర్భాకాశమునను లయమొనర్పవలయును.

స్థిత్వాం తస్మిన్క్షణం యోగీ లిఙ్గమాత్రశరీరధృక్

ఆ హిరణ్యగర్భాకాశమున లింగశరీరమాత్రధారియై యోగి క్షణకాలముండవలెను.

వాసనా భూతసూక్ష్మాశ్చ కర్మావిద్యే తథైవ చ. 18
దశేన్ద్రియమనోబుద్ధిరేతల్లిఙ్గం విదుర్బుధాః

వాసనలు, సూక్ష్మభూతములు, కర్మ, అవిద్య, దశేంద్రియములు, మనస్సు, బుద్ధి - ఇవి యన్నియుఁ జేరినదానిని పండితులు లింగశరీరమందురు.

తతోఽర్ధోణ్డా ద్బహిర్యాత స్తత్రాత్మాస్తీతి చిన్తయేత్. 19
చతుర్ముఖోగ్రకే చాయం భూతసూక్ష్మవ్యవస్థితః

ఇట్లు స్థూలోపాధియొక్క విలయముచే అర్ధరూపమును బొందినవానివలెనుండి, తదుపరి బ్రహ్మాండాభిమానత్యాగముచే నద్దానికి బహిర్భూతుఁడై, సూక్ష్మభూతాత్మక సమష్టి లింగదేహమున 'నే నధిష్ఠాతయగు హిరణ్యగర్భుఁడనే' అని చింతింపవలయును. ఈ సమష్టిసూక్ష్మభూతాభిమానియే ప్రథమమున చతుర్ముఖరూపముగ వ్యవస్థితుఁడైయుండెను.

లిఙ్గమవ్యాకృతే సూక్ష్మే న్యస్యావ్యక్తే చ బుద్ధిమాన్. 20

అట్లే లింగశరీరమునున్ను దానికంటె సూక్ష్మమై దానికిఁ గారణభూతమైనట్టి అవ్యాకృతమున బుద్ధిమంతుఁడు లీనము చేయవలెను.

నామరూపవినిర్ముక్తం యస్మిన్సంతిష్ఠతే జగత్
తమాహుః ప్రకృతిం కేచిన్మాయామేకే పరే త్వణూన్. 21
అవిద్యామపరే ప్రాహు స్తర్కవిభ్రాన్తచేతసః

దేనియందీసమస్తజగత్తున్ను గలదో, అట్టి అవ్యాకృతము, లేక, అవ్యక్తము నామరూప రహితమైనది, దానినే కొందఱు ప్రకృతియనియు, కొందఱు మాయయనియు మఱికొందఱు పరమాణు వనియుఁ జెప్పుచున్నారు. అట్లే యింకకొందఱు (బౌద్ధులు) తర్కముచే భ్రమించిన చిత్తముగల వారై దానిని సంవృతిరూపమగు అవిద్యయనుచున్నారు.

త్రత సర్వే లయం గత్వా తిష్ఠన్త్యవ్యక్తరూపిణః. 22
నిః సంబన్ధా నిరాస్వాదాః సంభవన్తి తతః పునః
తత్స్వరూపా హి తిష్ఠన్తి యావత్సృష్టిః ప్రవర్తతే. 23

ప్రళయకాలమున సమస్తపదార్థములను దానియందు లయించి అవ్యక్తరూపమున నుండును. మరల సృష్టియగునపుడు ఆ అవ్యక్తమందే పరస్పర సంబంధ రహితములై, చిత్ భోగ్యత్వరూప ఆస్వాదవర్జితములై, తద్రూపముగనే యుండి తదుపరి మరల యందుండి యుత్పన్నమగును.

అనులోమ్యాత్స్మృతా సృష్టిః ప్రాతిలోమేన సంహృతిః

అనులోమ (అధ్యారోప) క్రమముచే సృష్టియగుచున్నది. ప్రతిలోమ (అపవాద) క్రమముచే సమస్తము దానియందు లయించుచున్నది.

అతః స్థానత్రయం త్యక్త్వా తురీయం పదమవ్యయమ్. 24
ధ్యాయేత్తత్ప్రాప్తయే లిఙ్గం ప్రవిలాప్య పరం విశేత్

కావున స్థానత్రయమును (విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతములను లేక, స్థూల సూక్ష్మ, కారణములను, లేక, జాగ్రత్స్వప్నసుషుప్తులను) త్యజించి నాశరహితమగు తురీయపదమును ధ్యానింపవలెను. మఱియు తత్ప్రాప్తికొఱకై చరమ సాక్షాత్కారవృత్తిచే ధ్యాన కర్తృకరణ రూపమగు లింగదేహమునుగూడ మూలాజ్ఞాన బాధచే శుద్ధబ్రహ్మమున విలయమొనర్చి' ఘట భంగముచే ఘటాకాశము మహాకాశమున బ్రవేశించునట్లు, నిరతిశయానందరూపమగు ఆ పరబ్రహ్మమున, బ్రవేశింపవలెను.

భూతేన్ద్రియమనోబుద్ధివాసనా కర్మవాయవః. 25
అజ్ఞానం చ ప్రతిష్ఠాః స్యుర్లిఙ్గమవ్యాకృతే సతి

పంచభూతములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, వాసన, కర్మ, ప్రాణవాయువు వీని యన్నింటియొక్క ప్రతిష్ఠ అజ్ఞానమే యైయున్నది. ఏలయనఁగా, శుద్ధ బ్రహ్మమున అజ్ఞానరూపావరణ ముండుటచేతనే అవ్యాకృతమేర్పడ, సూక్ష్మభూతములద్వారా లింగశరీరము జనించుచున్నది. కావున నజ్ఞానమే లింగశరీరమునకు మూలప్రతిష్ఠయైయున్నది. తన్నివృత్తిచే, లింగశరీరము శృంఖల విచ్ఛిన్నమగుచున్నది.

భరద్వాజ ఉవాచః—

ఇదానీం లిఙ్గనిగడాన్ముక్తోఽహం సర్వథా యతః. 26
చిదంశత్వాత్ప్రవిష్టోఽహం చైతన్యానన్దసాగరే
అభేదాత్పరమాత్మాస్మి సర్వోపాధివివర్జితః 27

భరద్వాజుడు:— మహాత్మా! నేనిపుడు లింగశరీరమను శృంఖలనుండి సర్వథా విముక్తుఁడ నైతి. ఏలయనగా, నేను చిదంశమగుటచే, చిద్రూపసాగరమున, బ్రవేశించితిని. మఱియు, దానితోటి అభేదమునొందుటచే సర్వోపాధి వర్జితుఁడగు పరమాత్మనే యైయున్నాను.

కూటస్థః కేవలో వ్యాపీ చిదచిచ్ఛక్తిమానహమ్
ఘటాభావే ఘటాకాశ కలశాకాశయోర్యథా. 28

ఒకటేయగు ఘటము నశింప ఘటాకాశమున్ను, కలశాకాశమున్ను రెండున్ను (ఒకే ఘటమునకు ఘటమని, కలశమని నామభేదము కల్పింపఁబడినందున) మహాకాశరూపమగునట్లు, ఒకే అజ్ఞానము నశింప, (జీవ, ఈశ్వర, దేవ, నరాది) సర్వనామాది భేదకల్పన నివృత్తముకాఁగా నేనిపుడు సర్వవ్యాపకుడనై, చిత్, అచిత్ శక్తివంతుడనై, కేవలము కూటస్థరూపుఁడనైయున్నాను.

తమాహుః శ్రుతయో బహ్వ్య ఏవమేవైక్యమాదరాత్

ఇవ్విధముననే ఐక్యమునుద్దేశించి యాకూటస్థాత్మను గూర్చి యనేక శ్రుతు లాదరమున, బల్కినవి.

యథాగ్నిరగ్నౌ సంక్షిప్తః సమానత్వమనువ్రజేత్. 29
తదాఖ్యస్తన్మయో భూత్వా గృహ్యతే న విశేషతః

అగ్నియందు, ద్రోయఁబడిన యగ్ని యాయగ్నితోటి యైక్యమునొంది, తన్మయమగుటచే ఆ యగ్నియను పేరుచేతనే చెప్పఁబడుచున్నది. గాని మఱియేవిశేష రూపముచేతను గ్రహింపఁబడుటలేదు,

యథా తృణాదికం క్షిప్తం రుమాయాం లవణం భవేత్. 30
అచేతనం జగన్న్యస్తం చైతన్యే చేతనీభవేత్

లవణసముద్రమున, బడవేయఁబడిన తృణ, కాష్ఠాదులు లవణరూపమే యగునట్లు, అచేతనమగు జగత్తును చైతన్యమున లయమొనర్పఁబడినచో, చైతన్యమే యగుచున్నది.

యథా వై లవణగ్రన్థిః సముద్రే సైన్ధవో యథా. 31
నామరూపాద్వినిర్ముక్తః ప్రవిశ్యేతి సముద్రతాం
యథా జలే జలం న్యస్తం క్షీరే క్షీరం ఘృతే ఘృతమ్. 32
అవినష్టా భవన్త్యేతే గృహ్యన్తే న విశేషతః
తథాహం సర్వభావేన ప్రవిష్టశ్చేతనే సతి, 33

సైంధవము (ఉప్పుగడ్డ) సముద్రమునఁ బ్రవేశించి తన నామరూపములఁ గోల్పోయి సముద్రరూపమే యగునట్లును, జలమందుఁ గలుపఁబడిన జలము జలరూపమే యగునట్లును, క్షీరమందుఁ గలుపఁబడిన క్షీరము క్షీరరూపమేయగును, నేతియందు గలుపబడిన నేయి నేతిరూపమేయగునట్లును. మఱియు ఈ జలాదులయుపాధులు నశించి తద్రూపములేయై, మఱియే విశేషరూపముచేతను గ్రహింపఁబడనట్లును, నేనున్ను సర్వవిధముల సత్స్వరూపమగు చైతన్యమునఁ బ్రవేశించి, తద్రూపుడ నేయై వెలయుచున్నాను.

నిత్యానన్దే సమస్తజ్ఞే పరే పరమకారణే
నిత్యం సర్వగతం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్. 34

నిత్యానందరూపమై, సర్వజ్ఞమై (సర్వసాక్షియై) పరమకారణమైనట్టి పరబ్రహ్మమున నేనున్న నిత్యమై, సర్వవ్యాపకమై, శాంతమై, దోషరహితమై, నిరంజనమైనట్టి బ్రహ్మరూపుఁడనే యైయున్నాను.

నిష్కలం నిష్క్రియం శుద్ధం తద్బ్రహ్మాస్మి పరం పరమ్
హేయోపాదేయనిర్ముక్తం సత్యరూపం నిరిన్ద్రియం. 35

నిష్కళమై, నిష్క్రియమై, హేయోపాదేయరహితమై, సత్యరూపమై, ఇంద్రియరహితమైనట్టి శుద్ధబ్రహ్మమే నేను.

కేవలం సత్యసంకల్పం శుద్ధం బ్రహ్మాస్మ్యహం పరమ్
పుణ్యాపాపవినిర్ముక్తం కారణం జగతః పరం. 36

కేవలము సత్యసంకల్పయుతమై, పుణ్యాపాపవర్జితమై, జగత్తుయొక్క పరమకారణమై, శుద్ధమైనట్టి పరబ్రహ్మమే నేను.

అద్వితీయం పరం జ్యోతిర్బ్రహ్మాస్మ్యానన్ద మవ్యయం
ఏవమాదిగుణైర్యుక్తం సత్వాదిగుణవర్జితం. 37
ప్రవిష్టం సకలం బ్రహ్మ సదా ధ్యాయేత్స్వకర్మకృత్

అద్వితీయమై, నాశరహితమై, పరమప్రకాశమై, ఆనందరూపమైనట్టి బ్రహ్మమునే నేను! పూర్వోక్తములగు సత్యసంకల్పాది గుణములతోఁ గూడుకొనినదై మాయికములగు సత్వాదిగుణములు లేనిదై, సర్వరూపమై, సర్వవ్యాపకమైనట్టి బ్రహ్మమును శ్రవణమననాది స్వకర్మముల నాచరించు సాధకుఁడు ధ్యానింపవలెను.

ఏవమభ్యసతః పుంసో మనోఽస్తం యాతి తత్ర వై. 38
మనస్యస్తంగతే తస్య స్వయమాత్మా ప్రకాశతే
ప్రకాశే సర్వదుఃఖానాం హానిఃస్యాత్సుఖమాత్మని. 39
స్వయమేవాత్మనాత్మానమానన్దం ప్రతిపద్యతే

ఇవ్విధమున బ్రహ్మమును ధ్యానించుట నభ్యసించు మనుజుని మనస్సు ఆబ్రహ్మమునందే లయ మొందుచున్నది. అట్లు మనస్సు లయింప నాతనికి ఆత్మ స్వయముగఁ బ్రకాశించుచున్నది. ఆనందరూపమగు ఆత్మ ప్రకాశింప సమస్తదుఃఖములయొక్క నాశము సంభవించుచున్నది. అపుడాత్మ స్వయముగఁ దన యానందరూపమును బొందుచున్నది.

సమస్తోఽస్వపరః కశ్చిచ్చిదానన్దమయః ప్రభుః. 40
అహమేకః పరం బ్రహ్మ ఇత్యాత్మాన్తః ప్రకాశతే

గురువర్యా! నాకంటె వేఱైన సచ్చిదానందమయుండగు ప్రభువింకొకఁడెవఁడును లేఁడు నేనొకఁడనే పరబ్రహ్మనని అట్టి ఆత్మ లోలోన ననుభవించుచున్నది.

శ్రీవాల్మీకిరువాచ:—

సఖే సంన్యస్య కర్మాణి బ్రహ్మణః ప్రణయీ భవ. 41
నేష్యసే యది సంసార చక్రావర్తభ్రమః శమమ్

శ్రీ వాల్మీకి:— సఖుఁడా! ఈ సంసారచక్రమను ఆవర్తముయొక్క భ్రమయందలి సుఖమును గోరకయున్నచో నీక సర్వకర్మములఁద్యజించి బ్రహ్మప్రాప్తికై ప్రయత్నము సల్పుము.

భరద్వాజ ఉవాచ:—

త్వయోక్తం సర్వమేవేదం జ్ఞానం బుద్ధం మయా గురో. 42
బుద్ధిశ్చ నిర్మలా జాతా సంసారో న విలమ్బ్యతే
ఇదానీం జ్ఞాతుమిచ్ఛామి జ్ఞానినః కర్మ కీదృశం. 43
ప్రవృత్తం వా నివృత్తం వా కర్తవ్యం చ న వా ప్రభో

భరద్వాజుఁడు:— గురుదేవా? తాము వచించినట్టి యీజ్ఞానము నంతయు నే నెఱిఁగితిని. తమ యనుగ్రహముచే నాబుద్ధి నిర్మలమైనది. మఱియు, సంసారభ్రమ నెఱుఁగుటయం దిపుడేమియు విలంబము (ఆలస్యము) లేదు. అయినను, జ్ఞానియొక్క కర్మమెట్టిదో యిపుడు తెలిసికొనఁగోరుచున్నాను. ప్రభూ! ఆతనికర్మ ప్రవృత్తిరూపముగానుండునా! లేక నివృత్తిరూపముగానుండునా! లేక ఆతనికి కర్తవ్యమే యేమియును లేదా! తెలుపవేఁడెద.

శ్రీవాల్మీకిరువాచ:—

తస్మాద్యన్న కృతే దోష స్తత్కర్తవ్యం ముముక్షుభిః. 44
కామ్యం కర్మ నిషిద్ధం చ న కర్తవ్యం విశేషతః

శ్రీ వాల్మీకి.— ఓ భరద్వాజుఁడా? (సమస్తమును త్యజించి బ్రహ్మమునుగూర్చిన యభ్యాసమొనర్చుటయే సంసారభ్రమనివర్తకమై యున్నది) కావున నేకర్మమాచరించుటచే దోషమేదియు నుండదో, అదియే ముముక్షువు లాచరింపఁదగినది. కాని కామ్య, నిషిద్ధ కర్మములు ముముక్షువులు విశేషముగ నాచరింపఁదగదు.

యదా బ్రహ్మగుణైర్జీవో యుక్తస్త్యక్త్వా మనోగుణాన్. 45
సంశాన్తకరణగ్రామస్తదాస్యాత్సర్వగః ప్రభుః

జీవుఁడెవుడు, మనస్సుయొక్క గుణములను వదలి బ్రహ్మగుణంబులతో, గూడియుండునో, అపుడు సమస్తేంద్రియములు లెస్సగ శమించుటచే నాతడు సర్వవ్యాపి యగు ప్రభువగును.

దేహేన్ద్రియమనోబుద్ధేః పరస్తస్మాచ్చ యః పరః. 46
సోఽహమస్మి యదా ధ్యాయేత్తదా జీవో విముచ్యతే

దేహేంద్రియ మనోబుద్ధులకంటె (అన్నమయాది నాల్గుకోశములకంటె) పరమగు యే యానందమయ కోశముగలదో, దానికంటెను పరమగు బ్రహ్మమే నేనని యెప్పుడు ధ్యానించునో, అప్పుడు జీవుడు విముక్తి నొందును.

కర్తృభోక్త్రాదినిర్ముక్తః సర్వోపాధివివర్జితః. 47
సుఖదుఃఖవినిర్ముక్తస్తదానీం విప్రముచ్యతే

మఱియు నెప్పు డాతఁడు కర్తృత్వ భోక్తృత్వరహితుఁడును, సర్వోపాధి వర్జితుఁడును, సుఖదుఃఖ వినిర్ముక్తుఁడు నగునో, అప్పుఁడు పూర్ణరూపముగ ముక్తుఁడగును.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని. 48
యదా పశ్యత్యభేదేన తదా జీవో విముచ్యతే

ఎప్పుడు సమస్తభూతములందును దన్నును, తనయందు సమస్తభూతములను అభేదరూపముగ, గాంచునో, అప్పుడు జీవుఁడు విముక్తుఁడగును.

జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యం హిత్వా స్థానత్రయం యదా. 49
విశేత్తురీయమానన్దం తదా జీవో విముచ్యతే

జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడవస్థలను వదలి యెప్పు డానందరూపమగు తురీయమునఁ బ్రవేశించునో, అపుడు జీవుఁడు విముక్తి నొందును.

జీవస్య చ తురీయాఖ్యా స్థితిర్యా పరమాత్మని. 50
అవస్థాబీజనిద్రాది నిర్ముక్తా చిత్సుఖాత్మికా
యోగస్య సేయం వా నిష్ఠా సుఖం సంవేదనం మహత్. 51

తురీయమను పేరుగల, జీవుని పరమాత్మయందలి స్థితియేదిగలదో, అది జాగ్రత్స్వప్నములకు బీజభూతమగు వాసనలు లేనిదై, నిద్రాదివిరహితమై (కర్మ, అజ్ఞానాది వర్జితమై,) సుషుప్తి కంటెను పరమైనట్టి చైతన్యము సుఖరూపమైయున్నది. ఈ మహత్తరమైన సుఖానుభవమే యోగము యొక్కయు, లేక, విచారమాత్రజన్యమగు సాక్షాత్కార జ్ఞానముయొక్కయు, పరాకాష్ఠయై పఱఁగును.

మనస్యస్తంగతే పుంసాం తదన్యన్నోపలభ్యతే
ప్రశాన్తామృత కల్లోలే కేవలామృతవారిధౌ, 52

శమించిన తరంగములుగల ఆత్మామృత సముద్రమున మనస్సు లయింప, మనుజులు కిఁక ఆత్మ తప్ప మఱియొద్దియు లభింపనేరదు.

మజ్జ మజ్జసి కిం ద్వైతగ్రహాక్షారాబ్ధివీచిషు
భజ సంభరితాభోగం పరమేశం జగద్గురుమ్. 53

ఓ భరద్వాజుఁడా! అట్టి ఆత్మరూపమగు అమృత సముద్రమునసే నీవు గ్రుంకుము. ఏల ద్వైతరూపమగు క్షారసముద్ర తరంగములందు మునుఁకలిడుచున్నావు? అట్టి జ్ఞానసిద్ధి కొఱకై నీవు భక్తానుగ్రహార్థ మర్ధనారీశ్వరాది రూపముల ధరించిన జగద్గురువగు పరమేశ్వరుని భజింపుము.

ఇతి తే వర్ణితం సర్వం వసిష్ఠస్యోపదేశనం
అనేన జ్ఞానమార్గేణ యోగమార్గేణ పుత్రక. 54
భరద్వాజ మహాప్రాజ్ఞ సర్వం జ్ఞాస్యసి నిశ్చితమ్

పుత్రకా! భరద్వాజా! ఇట్లు వసిష్ఠమునీంద్రుని యుపదేశమంతయు నేను నీకు వర్ణించి చెప్పితిని. మహాప్రాజ్ఞా! ఈ జ్ఞానమార్గముచేతను, యోగమార్గముచేతను నీవంతయు నిశ్చయరూపముగ నెఱుఁగఁగలవు.

పరామర్శేన శాస్త్రస్య గురువాక్యార్థ బోధనాత్. 55
అభ్యాసాత్సర్వసిద్ధిః స్యాదితి వేదానుశాసనం

ఏలయనఁగా శాస్త్రవిచారముచేతను, గురువాక్యముల యర్థము నెఱుఁగుటచేతను, అభ్యాసముచేతను సమస్తకార్యములయొక్క సిద్ధి యగునని వేదముయొక్క అనుశాసనమై (ఆజ్ఞయై) యున్నది.

తస్మాత్త్వం సర్వముత్సృజ్య కుర్వభ్యాసే స్థిరం మనః. 56

కావున నీవు సర్వము త్యజించి యభ్యాసముననే మనస్సును స్థిరమొనర్పుము.

భరద్వాజ ఉవాచః—

రామః ప్రాప్తః పరం యోగం స్వాత్మనాత్మని హే మునే
కథం వసిష్ఠదేవేన వ్యవహారః పరః కృతః. 57
ఇతి జ్ఞాత్వాహమప్యేవమభ్యాసార్థం యతే యథా
తథైవ వ్యవహారోఽపి వ్యుత్థానే మే భవిష్యతిః 58

భరద్వాజుఁడు:— ఓ మునీశ్వరా! శ్రీరామచంద్రుఁడు బ్రహ్మమందు స్వయముగ పరమ యోగమును (సమాధిద్వారా ఉపాధిత్యాగముచే బ్రహ్మముతో ఏకత్వమును) బొందెను. అట్టియాతఁడు మరల వసిష్ఠమునీంద్రునిచే వ్యవహారపరుఁడుగ నెట్లు గావింపఁబడెను? దీని నెఱిఁగి నేనున్ను వానియభ్యాసముకొఱకై ప్రయత్నించెదను. మఱియు సమాధియొక్క వ్యుత్థానకాలమున నేనును నట్లే వ్యవహారమాచరించెదను.

శ్రీ వాల్మీకిరువాచ: —

యదా పరిణతః సాధుః స్వస్వరూపే మహామనాః
విశ్వామిత్రస్తదోవాచ వసిష్ఠమృషిసత్తమమ్. 59

శ్రీవాల్మీకి:- ఓ భరద్వాజా! మహామనస్వియు (అపరిచ్ఛిన్న బ్రహ్మాకారచిత్తుఁడును) శుభాచరణశీలుఁడునగు శ్రీరామచంద్రుఁడు స్వస్వరూపమున నెపుడు పరిణతుఁడాయెనో, అపుడు ఋషిసత్తముఁడగు వసిష్ఠమునీంద్రుని గూర్చి విశ్వామిత్రుఁ డిట్లనెను—

విశ్వామిత్ర ఉవాచ: —

హే వసిష్ఠ మహాభాగ బ్రహ్మపుత్ర మహామనసి
గురుత్వం శక్తిపాతేన తత్క్షణాదేవ దర్శితమ్. 60

ఓ వసిష్ఠమునీంద్రా! బ్రహ్మపుత్రా! మహాభాగా! అనుగ్రహదృష్టి మాత్రముచే మీరు శిష్యునియందు బ్రహ్మజ్ఞానశక్తిని గలుగఁజేసి మీగురుత్వమును తత్క్షణముననే మాకు దర్శింపఁజేసితిరి.

దర్శనాత్స్పర్శనాచ్ఛబ్దాత్కృపయా శిష్యదేహకే
జనయేద్యః సమావేశం శాంభవం స హి దేశికః. 61

ఎవఁడు తన దర్శనముచేతను, స్పర్శనముచేతను, శబ్దప్రయోగముచేతను కృపచే శిష్యుని దేహమందు శివరూపమగు పరమాత్మయొక్క సమావేశమును గలుగఁజేయునో, అతఁడే గురువు.

రామోప్యయం విశుద్ధాత్మా విరక్తః స్వాత్మనైవ హి
విశ్రాన్తిమాత్రాకాఙ్క్షీ చ సంవాదాత్ప్రాప్తవాన్పదమ్. 62

మీ శిష్యుఁడగు శ్రీరామచంద్రుఁడున్ను స్వయముగ విశుద్ధాత్ముఁడున్ను, విరక్తుఁడునై యున్నాఁడు. కేవల మాత్మయందు విశ్రాంతిమాత్రము కోరినవాఁడై, మీసంవాదముచే నట్టి యుత్తమపదమును (ఆత్మస్థితిని) బొందినవాఁడాయెను.

శిష్యప్రజ్ఞైవ బోధస్య కారణం గురువాక్యతః
మలత్రయమపక్వం చేత్కథంబుధ్యతి పక్వవత్. 63

గురువాక్యముచే (శిష్యునియందు) బోధకలుగుటకు శిష్యునిప్రజ్ఞయే ముఖ్యకారణమైయున్నది. త్రివిధమలములు (శారీరిక, వాచిక, మానసిక దోషములు), లేక, దేహ, మనో, బుద్ధుల మాలిన్యములు, లేక, కామ, కర్మ, (వాసనలు) నశింపనిచో, నశించినవానివలెను శిష్యుఁడు గురుబోధ నెట్లు గ్రహింపఁగలఁడు?

జ్ఞానప్రత్యక్షమేవేదం గురుశిష్యప్రయోజనమ్
ఉభావపి యతో యోగ్యౌ సర్వేషామీదృశామపి. 64

మీచే బోధింపఁబడిన యీ ప్రత్యక్షజ్ఞానమే గురుశిష్యుల ప్రయోజనమైయున్నది. గురుశిష్యు లిరువురున్ను యోగ్యులగుచో నిటువంటి కైవల్యలక్షణముగల పురుషార్థము లన్నింటికిని వారు పాత్రులగుదురు.

ఇదానీం కృపయా రామవ్యుత్థానం కురుమర్హసి
పదే పరిణతస్త్వం హి కార్యావిష్టా వయం యతః. 65

ఇపుడు మాపై దయయుంచి శ్రీరామచంద్రుని, సమాధినుండి మీరు మేలుకొలుపవలసియున్నది. మీరైతే పరమపదమునఁ బరిణతులై, కృతకృత్యులైయున్నారు. మేమింకను లోకకార్యములందు బ్రవేశించియున్నాము.

స్మరన్కార్యం మమ విభో యదుద్దిశ్యాహమాగతః
ప్రార్థితశ్చాతికష్టేన రాజా దశరథః స్వయమ్. 66

ప్రభూ! ఏ కార్యము నుద్దేశించి నేనిచటి కేతెంచితినో, దేనికొఱకై రాజగు దశరథుని నేనతికష్టముతో స్వయముగఁ బ్రార్థించియుంటినో, దానిని స్మరించి శ్రీరామచంద్రుని సమాధినుండి మీరు లేపవలసియున్నది.

తద్వృథా మా కృథాః సర్వం శుద్ధేన మనసా మునే
దేవకార్యం చ రామాన్యదవతారప్రయోజనమ్. 67

కావున నోమునీంద్రా! అక్కార్యము నంతయును మీరు మీశుద్ధమనంబుచే విచారించుఁడు. వృథా చేయకుఁడు. మఱియు శ్రీరామచంద్రుఁడు సమాధినుండి లేచిన పిమ్మట, అన్యమగు అవతార ప్రయోజనమైనట్టి దేవకార్యమును మనము సంపాదన మొనర్చెదము.

సిద్ధాశ్రమం మయా సీతో రామో రాక్షసమర్దనమ్
కరిష్యతి తతోఽహల్యాముక్తిం చ జనకాత్మజాం. 68
పరిణేష్యతి కోదణ్డభఙ్గేన కృతనిశ్చయః
రామస్య జామదగ్న్యస్య కర్తా నష్టాం గతిం ధ్రువం. 69
పితృపైతామహం రాజ్యం విగతోభయనిస్పృహః
వనవాసచ్ఛలేనేహ దణ్డకారణ్యవాసినః. 70
ఉద్ధరిష్యతి తీర్థాని ప్రాణినో వివిధాని హి
సీతాహరణదార్గత్యచ్ఛలేన భువి శోచ్యతాం. 71
దర్శయిష్యతి సర్వేషాం రావణాదివధా దపి
స్త్రీసఙ్గినామథాస్వాస్థ్యం వానరాదేః పరావృతిం. 72
సీతా విశుద్ధిమన్విచ్ఛల్లోకానుమతిమాత్మనః

శ్రీరామచంద్రుని నేనెపుడు సిద్ధాశ్రమమునకు గొంపోవుదునో, అపుడాతఁడచట దుష్టరాక్షసుల వధించును. తదుపరి అహల్యకు మోక్షమిచ్చును. పిదప కృతనిశ్చయుఁడై శివధనస్సును విఱిచి సీతాదేవిని పరిణయ మొనర్చుకొనును. అనంతరము నిక్కముగ జమదగ్నిపుత్త్రుఁడగు పరశురాముని గతిని భంగ మొనర్చును. పిదప భయరహితుఁడై, నిస్పృహుఁడై పితృపైతామహిక రాజ్యమున కధికారి యగును. ఆ పిమ్మట వనవాసము మిషచే దండకారణ్యవాసులను, అనేక తీర్థములను, వివిధప్రాణులను నుద్ధరించును. తదుపరి సీతాదేవియొక్క హరణముచేఁ జనించిన శోకమోహాదివిడంబనము మిషచేతను, రావణాదుల వధచేతను, ప్రపంచమున స్త్రీసంగులగు జనులయొక్క శోచ్యత్వము (దీనత్వము)ను, అస్వస్థతను సర్వులకు దర్శింపఁజేయును. అనంతరమింద్రుని వరదానముచే, యుద్ధమందు మృతినొందిన వానరులఁ బునరుజ్జీవింపఁజేయును. పిదప అగ్నిప్రవేశముద్వారా సీతాదేవియొక్క విశుద్ధిని గోరినవాఁడై శిష్టజనులందుఁ దన యుత్తమచరిత్రయొక్క మాననీయత్వమును బ్రకటించును.

జీవన్ముక్తో నిస్పృహోఽపి క్రియాకాణ్డపరాయణః. 73
భవిష్యతి గతిం ద్రష్టుం జ్ఞాన కర్మసముచ్చయాం

తదనంతరము రాజ్యమం దభిషిక్తుఁడై, జీవన్ముక్తుఁడును, నిస్పృహుఁడు నైయున్నను, క్రియాకాండ పరాయణుఁడై, జ్ఞాన కర్మల రెంటియొక్క సముచ్చయరూపమగు గతిని దర్శింపఁజేయఁగలఁడు.

యైర్దృష్టో యైః స్మృతో వాపి యైః శ్రుతో బోధితస్తు యైః. 74
సర్వావస్థాగతానాం తు జీవన్ముక్తిం ప్రదాస్యతి

ఎవరీ శ్రీరామచంద్రుని గాంతురో, ఎవరీతని చరిత్రను స్మరింతురో, విందురో, లేక నితరులకు బోధింతురో, అట్టి భక్తులందఱికిని సర్వావస్థలందు నీతఁడు జీవన్ముక్తి నొసంగును.

ఇతి కార్యమశేషేణ త్రైలోక్యస్య మమాపి హి.
అనేన రామచన్ద్రేణ పురుషేణమహాత్మనా 75

ఇవ్విధమున ముల్లోకములయొక్కయు, నా యొక్కయుఁ గార్యమీ మహాత్ముఁడగు శ్రీరామచంద్రునిద్వారా సంపూర్ణముగ నెరవేరఁగలదు.

నమోఽస్మై జితమేవైతే కోఽప్యేవం చిరమేధతాం. 76

ఓ సభ్యులారా! ఈ మీరందఱున్ను శ్రీరామచంద్రునకు నమస్కరింపుఁడు. ఈతనికి నమస్కరించినంతమాత్రముననే మీరు సమస్తమును జయించినవారగుదురు. (పురుషార్థములన్నియుం సిద్ధించును.) మఱియు మీలో నెవరైనను శ్రేష్ఠుఁడగు మనుజుఁడే శ్రీరామచంద్రునివలెనే జీవన్ముక్తుఁడై చిరకాలము నిర్వికల్పసమాధి విశ్రాంతినిబొంది యధికసుఖమును బడయఁగలఁడు! కావున మీరట్లు మోక్షసుఖమును బడయుదురుగాక!

శ్రీవాల్మీకి రువాచ:—

ఇతి శ్రుత్వా చ తే సర్వే విశ్వామిత్రేణ భాషితమ్
సిద్ధాశ్చ వరయోగీన్ద్రా వసిష్ఠప్రముఖాః పునః. 77
రామాఙ్ఘ్రిపద్మరజసా మాదరస్మరణస్థితాః
దూరశ్రుతోత్తరకథాః కథయా మైథిలీపతేః. 78
న సంతుతోష భగవాన్వసిష్ఠోఽన్యే మహర్షయః
గుణాన్గుణనిధేస్తస్య బ్రువన్నాకర్ణయ త్ర్యుతం. 79
విశ్వామిత్రమునిం ప్రాహ వసిష్ఠో భగవానృషిః

శ్రీ వాల్మీకి:—ఓ భరద్వాజుఁడా! విశ్వామిత్రుని యా వాక్యములను విని యా సిద్ధులున్ను, వసిష్ఠాది శ్రేష్ఠయోగీంద్రులందఱున్ను మరల శ్రీరామచంద్రుని చరణకమలముల ధూళిని యాదరమున స్మరించుచునుండిరి. మఱియు, వసిష్ఠమునీంద్రులున్ను, అన్య ఋషిగణంబును జానకీనాథుఁడున్ను, గుణనిధియునగు శ్రీరామచంద్రుని యా దుర్లభమైనకథను, అతని గుణములనువిని తృప్తిఁబొందకుండిరి. అప్పుడు భగవంతుఁడగు వసిష్ఠఋషి విశ్వామిత్రునితో నిట్లు పలికెను —

శ్రీవసిష్ఠ ఉవాచ:—

బ్రూహి విశ్వామిత్ర మునే రామో రాజీవలోచనః
కోఽయమభూద్బుధః కిం వా మనుష్యోఽవాథ రాఘవః. 80

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ విశ్వామిత్రమునీశ్వరా! కమలనేత్రుఁడగు శ్రీరామచంద్రుఁడీజన్మమునకుఁబూర్వము దేవుఁడా, మనుజుఁడా యను విషయము శ్రోతలందఱుఁ దెలియుఁగునిమిత్తము వచింపుఁడు?

విశ్వామిత్ర ఉవాచ:—

అత్రైవ కురు విశ్వాసమయం స పురుషః పరః
విశ్వార్థమథితామ్భోధిర్గమ్భీరాగమగోచరః. 81

విశ్వామిత్రుఁడు:—సభ్యులారా! మీరీ శ్రీరామచంద్రుని యందు సాక్షాద్భగవంతుఁడేయను విశ్వాసముగలిగియుండుఁడు. ఎవఁడు విశ్వముకొఱకై సముద్రమును మథించెనో, ఎవనిని శ్రుతులన్నియుఁ బ్రతిపాదించుచున్నవో. అట్టి పరమపురుషుఁడగు సాక్షాద్వాసుదేవుఁడీతఁడే!

పరిపూర్ణపరానన్దః సమః శ్రీవత్సలాఞ్ఛనః
సర్వేషాం ప్రాణినాం రామః ప్రదాతా సుప్రసాదితః. 82

పరిపూర్ణ పరానందస్వరూపుఁడును, సర్వసముఁడును, శ్రీవత్సమణి మొదలగు చిహ్నములచే శోభితుఁడునునగు ఈ శ్రీరామచంద్రుఁడు భక్తిచేఁ బూర్ణముగఁ బ్రసన్నమొనర్పఁబడి సమస్తప్రాణులకును పురుషార్థములన్నింటి నొసంగుచున్నాఁడు.

అయం నిహన్తి కుపితః సృజత్యయమసత్స్వకాన్
విశ్వాదిర్విశ్వజనకో ధాతా భర్తా మహాసఖః. 83

క్రుద్ధుఁడై యీ శ్రీరామచంద్రుఁడే సమస్తమును సంహరించుచున్నాఁడు. మిథ్యాపదార్థముల నీతఁడే సృజించుచున్నాఁడు. విశ్వముయొక్క ఆదియును, జనకుఁడును, ధాతయు (ధరించువాఁడును), పాలకుఁడును, మహాసఖుఁడును నీతఁడే.

అయం వృక్ణాన్తనిఃసారమృదుసంసారసూత్రకైః
ఆనన్దసిన్ధుర్వితతో వీతరాగైర్విగాహ్యతే. 84

నిస్సారములును, అల్పములునగు సంసారముయొక్క కార్యకారణబంధము లెవరియొక్క ఆత్మానాత్మవిచారణచే బాధితములగునో, అట్టి, సంసారమును జయించు వీతరాగులగు మహాత్ములు విశాలానందసముద్రుఁడగు యీతనియందే ప్రవేశించుచున్నారు.

క్వచిన్ముక్త ఇవాత్మస్థః క్వచిత్తుర్యపదాభిధః
క్వచిత్ప్రణీతప్రకృతిః క్వచిత్తస్థః పుమానయమ్. 85

ఈతఁడే యొకచోట జ్ఞానముచే (ఆత్మస్థితిచే) ముక్తుఁడయు, ఒకచోట తురీయపదస్థితుఁడై నిత్యముక్తుఁడయు, వేఱొకచోట మాయయొక్క నియంతయైయును, ఇంకొకచోట మాయయందు బద్ధుఁడైయున్నవానిచందమునను గోచరించుచున్నాఁడు.

అయం త్రయీమయో దేవస్త్రిగుణ్యాగహనాతిగః
జయత్యఙ్గైరయం షడ్భిర్వేదాత్మా పురుషోఽద్భుతః. 86

వేదమయమగు శరీరముగల దేవుఁడీతఁడే త్రిగుణములను నరణ్యమున కావలపొందఁబడునదియు నీతఁడే. శిక్షా, కల్పాది షడంగములచే శోభితుఁడై, వేదములకాత్మయై బలగుచు, పారమార్థికస్వరూపభూతుఁడై వెలుఁగు యద్భుతపురుషుఁడీతఁడే.

అయం చతుర్బాహురయం విశ్వస్రష్టా చతుర్ముఖః
అయమేవ మహాదేవః సంహర్తా చ త్రిలోచనః. 87

ప్రపంచమును పాలించునట్టి చతుర్భుజుఁడగు విష్ణువీతఁడే ప్రపంచమును సృజించునట్టి చతుర్ముఖుఁడగు బ్రహ్మ యీతఁడే. మఱియు, ప్రపంచమును సంహారమొనర్చునట్టి త్రినేత్రుఁడగు మహేశ్వరుఁడునునీతఁడే.

అజోఽయం జాయతే యోగాజ్జాగరూకః సదా మహాన్
బిభర్తి భగవానేతద్విరూపో విశ్వరూపవాన్. 88

ఈతఁడు జన్మలేనివాఁడైనను మాయాశక్తిసంబంధముచే జన్మించు (అవతరించు)చున్నాఁడు. మోహనిద్రావరణ లేనందుచే మహాత్ముఁడు సదా జాగరూకుఁడైయే యుండును. రూపరహితుఁడైనను ఈ భగవంతుఁడు విశ్వరూపుఁడై సమస్తమును ధరించుచున్నాఁడు.

విజయో విక్రమేణేవ ప్రకాశ ఇవ తేజసా
ప్రజ్ఞోత్కర్షః శ్రుతేనేవ సుపర్ణేనాయముహ్యతే. 89

పరాక్రమముచే విజయమున్ను, తేజముచే ప్రకాశమున్ను, శాస్త్రముల పఠనాదులచే ప్రజ్ఞాతిశయమున్ను మోహింపఁబడునట్లు, గరుత్మంతునివలె సకల సద్విషయములందలి యుత్తమత్వముచే నీతఁడు శ్రేష్ఠపురుషుఁడగునని యూహింపఁబడుచున్నది.

అయం దశరథో ధన్యః సుతో యస్య పరః పుమాన్
ధన్యః స దశకణ్ఠోఽపి చిన్త్యశ్చిత్తేన యోఽమునా. 90

ఎవని పుత్రుఁడు సాక్షాత్ పరమపురుషుఁడాయెనో, అట్టి యీ దశరథుఁడు ధన్యుఁడు. ఎవని నీశ్రీరామచంద్రుఁడు తనచిత్తమున శత్రురూపమునఁ జింతించునో, అట్టి దశకంఠుఁడగు రావణుఁడున్ను ధన్యుఁడు.

హా స్వర్గమమునా శూన్యం హా పాతాలాదిహాగతః
తస్యాగమాదయం లోకో మధ్యమః శ్రేష్ఠతాం గతః. 91

ఆహా! స్వర్గ, పాతాళము లీమూర్తిధారియగు విష్ణువు గల్గియుండమి శోచనీయములై యున్నవి. ఈతఁ డవతరించుటఁబట్టి మధ్యదగు యీభూలోకము శ్రేష్ఠత్వమును బొందినది.

రామ ఇత్యవతీర్ణోఽయమర్ణవా న్నిశయః పుమాన్
చిదానన్దఘనో రామః పరమాత్మాయమవ్యయః. 92

క్షీరసముద్రశాయియగు విష్ణుభగవంతుఁడే రాముఁడను ఈ పురుషుఁడుగ నవతరించె. ఈ శ్రీరామచంద్రుఁడే చిదానందఘనుఁడును, నాశరహితుఁడునగు పరమాత్మయైయున్నాఁడు.

నిగృహీతేన్ద్రియగ్రామా రామం జానన్తి యోగినః
వయం త్వపరమేవాస్య రూపం రూపయితుం క్షమాః. 93

ఓ మునీంద్రా! ఇంద్రియసమూహమును జయించిన యోగులే శ్రీరామచంద్రుని యథార్థముగ నెఱుఁగుదురు. మన మీతని పూర్వపురూపమును గాంచుటకును, నిరూపించుటకును సమర్థులమై యున్నాము.

రఘూరఘూచ్ఛేదకారో భగవానితి శుశ్రుమ
వసిష్ఠ కృపయా త్వం హి వ్యవహారపరం కురు. 94

రఘువు (రఘువంశము) యొక్క పాపనాశకుఁడే భగవంతుఁడే యని పెద్దలవలనను మన మువినియున్నాము. కావున నోవసిష్ఠమునీంద్రా! దయచేసి యీతనిని వ్యవహారపరునిగఁ జేయుఁడు.

శ్రీవాల్మీకి రువాచ:—

ఇత్యుక్త్వావసిష్ఠతూష్ణీం విశ్వామిత్రో మహామునిః
వసిష్ఠస్తు మహాతేజా రామచన్ద్రమభాషత. 95

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! మహామునియగు విశ్వామిత్రుఁడిట్లు పల్కియూరకుండెను. అపుడు మహాతేజస్వియగు వసిష్ఠమునీంద్రుఁడు శ్రీరామచంద్రునితో నిట్లనెను—

శ్రీవసిష్ఠ ఉవాచ:—

రామరామ మహాబాహో మహాపురుష చిన్మయ
నాయం విశ్రాన్తికాలో హి లోకానన్దకరో భవ. 96

శ్రీ వసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! ఓ రామచంద్రా! మహాబాహూ! చిన్మయుఁడవగు మహాపురుషా! ఇది ఆత్మయందు విశ్రాంతినొందునట్టి సమయముకాదు. స్వర్గమునకు (దేవతలకు) లేక, ఈ ప్రపంచమునకు ఆనందకారకుఁడవు కమ్ము.

యావల్లోకపరామర్శో నిరూఢో నాస్తి యోగినః
తావద్రూఢ సమాధిత్వం న భవత్యేవ నిర్మలమ్. 97

అధికార సాధనరూపమగు లోకముల పరామర్శ యోగికి నెంతవఱకు బాగుగ రూఢిపడకుండునో, అంతవఱకు కాతనికి నిర్మలమగు స్థిర సమాధిత్వము యుక్తముకానేరదు.

తస్మాద్రాజ్యాది విషయాన్సర్వాలోక్య వినశ్వరాన్
దేవకార్యాదిభారాంశ్చ భజ పుత్ర సుఖీ భవ. 98

పుత్రకా! ఇక్కారణమున నశ్వరములగు రాజ్యాదివిషయములను గొంతకాల మనుభవించి, దేవకార్యాది అధికారభారములను బాగుగ నిర్వహించినవాఁడవై, పిమ్మట సమాధిద్వారా సుఖివి కమ్ము.

శ్రీవాల్మీకి రువాచ:—

ఇత్యుక్తోఽపి యదా రామః కించిన్నోచే లయం గతః
తదా సుషుమ్నయా సోఽపి వివేశ హృదయం శనైః. 99

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! వసిష్ఠమునీంద్రుఁడిట్లనుడవు, నిర్వికల్పసమాధియందు బ్రహ్మముతోటి యేకత్వమును బొందిన శ్రీరామచంద్రుఁడేమియుఁ బల్కకనుండ, అపుడు యోగాభ్యాసముచే సుషుమ్నానాడీద్వారా వసిష్ఠమునీంద్రుఁడు శ్రీరామచంద్రుని హృదయమున మెల్లగఁ బ్రవేశించెను.

శక్తిః ప్రాణమనః ప్రసక్తికరణో జీవః ప్రకాశాత్మకో
నాడీరన్ధ్రసుపుష్టసర్వకరణః ప్రోన్మీల్య నేత్రే శనైః
దృష్ట్వా తత్రవసిష్ఠముఖ్యవిదుషో నిర్ముక్తసర్వైషణః
కృత్యాకృత్య విచారణాదిరహితః సర్వాన్ప్రతీక్ష్య స్థితః. 100

అత్తతి, మొట్టమొదటఁ బ్రాణాదుల బీజరూపమగు యాధారశక్తియందు, క్రమముగఁ బ్రాణ, మనంబుల యావిర్భావమయ్యెను. పిమ్మట, ప్రకాశరూపుఁడగు జీవుఁడు ప్రాణముద్వారా సమస్తనాడీరంధ్రములందును బ్రవేశించి, జ్ఞాన, కర్మేంద్రియములన్నింటిని బరిపోషించెను. తదుపరి యా శ్రీ రామచంద్రుఁడు మెల్లగ నేత్రములఁ దెఱచి శ్రేష్ఠులగు శ్రీ వసిష్ఠాది ముఖ్యవిద్వాంసులందఱిని గాంచి సర్వాభిలాషావర్జితుఁడై, కృత్యాకృత్యములఁగూర్చిన విచారణాదులు లేనివాఁడై, వారందఱి వాక్యముల వినుటకై ప్రతీక్షించుచునుండెను.

శ్రుత్వా వసిష్ఠవచనం గురువాక్యమితి స్వయం
శ్రుత్వా ప్రోవాచ భగవాన్రామచన్ద్రః సమాహితః. 101

పిదప పూర్వోక్తములగు 'రామచంద్రా! రామచంద్రా! మహాబాహూ!' -మున్నగు వచనములను వసిష్ఠ మునీంద్రునిద్వారా మరల విని, గురువాక్యము అనుల్లంఘ్యమని స్వయముగనెంచి, పితృ, భ్రాతృబాంధవాదుల ప్రార్థననుగూడ నాలకించి భగవంతుఁడగు శ్రీ రామచంద్రుఁడపు డేకాగ్రచిత్తముతో నిట్లుపలికెను.

శ్రీరామఉవాచః-

న విధేర్న నిషేధస్య త్వత్ప్రసాదాదయం ప్రభుః
తథాపి తవ వాక్యం తు కరణీయం హి సర్వదా 102

శ్రీరాముడు:— మహాత్మా! తమ యనుగ్రహముచే ఈజీవుఁడు విధినిషేధములకుఁ బాత్రుఁడు కానివాఁడై స్వయముగ సాక్షాత్ ప్రభు (బ్రహ్మ) రూపుఁడాయెను. అయినను తమవాక్యము సదా కరణీయమై యున్నది.

వేదాగమపురాణేషు స్మృతిష్వపి మహామునే
గురువాక్యం విధిః ప్రోక్తో నిషేధస్తద్విపర్యయః. 103

ఓ మహామునీ! వేదశాస్త్రస్మృతి, పురాణములందును, గురువాక్యము విధియనియు, తదతిక్రమణము నిషేధమనియుఁ జెప్పబడినది.

ఇత్యుక్త్వా చరణౌ తస్య వసిష్ఠస్య మహాత్మనః
శిరసా ధార్య సర్వాత్మా సర్వాన్ప్రాహ ఘృణానిధిః. 104

ఇట్లు వచించి సర్వాత్ముఁడును, కృపానిధియునగు శ్రీ రామచంద్రుఁడు మహాత్ముఁడగు వసిష్ఠమునీంద్రగురుని చరణములను దన శిరస్సుచే ధరించి, పిదప సభ్యులందఱిని గూర్చి యిట్లు పలికెను.

శ్రీరామ ఉవాచ:—

సర్వే శృణుత భద్రం వో నిశ్చయం నః సునిశ్చితం
ఆత్మజ్ఞానాత్పరం నాస్తి గురోరపి చ తద్విదః. 105

శ్రీరాముడు:— ఓ సభ్యులారా! మీకు శుభమగుగాత! నిశ్చయముకంటె సునిశ్చితమగు ఈవాక్యమును మీరందఱును వినుఁడు ఆత్మజ్ఞానముకంటెను, దాని నెఱిఁగిన గురువుకంటెను, నుత్తమమైన దీప్రపంచమున మఱియొద్దియును లేదు.

సిద్ధాదయ ఊచుః:—

రామైవమేవ సర్వేషాం మనసి స్థితిమాగతం
త్వత్ప్రసాదాచ్చ సకలం సంవాదేన దృఢీకృతమ్. 106

సిద్ధాదులు:— శ్రీరామచంద్రా! తమ యనుగ్రహముచే తామువచించినట్లుగనే యందఱి మనస్సులందును ఆత్మభావము స్థితిగల్గినదాయెను. మఱియు, తమ సంవాదముచే నది యంతయు బాగుగ దృఢపడినది.

సుఖీ భవ మహారాజ రామచన్ద్ర నమోఽస్తు తే
వసిష్ఠేనాప్యనుజ్ఞాతా గచ్ఛామోఽద్య యథాగతమ్. 107

ఓ మహారాజా! శ్రీరామచంద్రా! నీవు సుఖివి కమ్ము, నీకు నమస్కారము. వసిష్ఠమునీంద్రుని నుండియు ననుజ్ఞగైకొని మేమెటనుండి యేతెంచితిమో యటకిపు డేగుచున్నాము.

శ్రీవాల్మీకిరువాచ:—

ఏవముక్త్వా గతాః సర్వే రామసంస్తవనే తతః
రామచన్ద్రస్య శిరసి పౌష్పీ వృష్టిః పపాత హ. 108

శ్రీ వాల్మీకి: ఓ భరద్వాజా! ఇట్లు పలికి యాసిద్ధాదులు శ్రీరామచంద్రుని స్తుతియొనర్చి తమతమ స్థానములకరిగిరి. అత్తఱి శ్రీరామచంద్రుని శిరంబుపై పుష్పవృష్టి కురిసెను.

ఏతత్తే సర్వమాఖ్యాతం రామచన్ద్రకథానకం
అనేన క్రమయోగేన భరద్వాజ సుఖీ భవ. 109

ఓ భరద్వాజా! ఇవ్విధమున శ్రీరామచంద్రుని యాఖ్యానమంతయు నీకుఁ దెలియఁ జేసితిని. ఇట్టి క్రమము చేతనే నీవున్ను సుఖవంతుఁడవుగమ్ము.

ఇతి రఘుపతిసిద్ధః ప్రోదితా యా మయా తే
వర మునివచనాలీ రత్నమాలా విచిత్రా
నిఖిల కవికులానాం యోగినాం సేవ్యరూపా
పరమగురుకటాక్షా న్ముక్తిమార్గం దదాతి. 110

ఈ నీకు వచించినట్టి శ్రీరామచంద్రుని సిద్ధిమునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠమునీంద్రుని వచనసమూహ రూపమగు రత్నముల విచిత్రమాలయైయున్నది. ఇయ్యది సమస్త కవికులములకును, యోగులకును సేవ్యమై యలరుచున్నది. మఱియు పరమగురువుయొక్క కటాక్షముచే నిది మోక్షమార్గము నొసంగు నదియునగుచున్నది.

య ఇమం శృణుయాన్నిత్యం విధిం రామవసిష్ఠయోః
సర్వావస్థోఽపి శ్రవణాన్ముచ్యతే బ్రహ్మ గచ్ఛతి 111

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే ద్వాత్రింశత్సాహస్ర్యాం సంహితాయాం బాలకాణ్డే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే పూర్వార్ధే రామవ్యుత్థానం నామ అష్టావింశత్యుత్తర శతతమః సర్గః ॥ 128 ॥

నిర్వాణ ప్రకరణే పూర్వార్ధం సంపూర్ణమ్.

ఓమ్ తత్ సత్.

ఎవఁడీ వసిష్ఠ శ్రీరామచంద్రుల సంవాదమును ప్రతిదినము శ్రవణముచేయునో, ఆతఁడు రాగాది సర్వదోషావస్థాయుతుఁడైనను తచ్ఛ్రవణమాత్రముచేతనే సర్వదోషములనుండి విడివడి, శాన్త్యాదిగుణ ప్రాప్తిక్రమముచే బ్రహ్మమును బొందును. (ఇక అధికారిని గూర్చి వేఱుచెప్పనేల యనిభావము)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణ పూర్వార్ధమున రామవ్యుత్థానమను నూటయిరువదియెనిమిదవ సర్గము, 128 ॥

నిర్వాణప్రకరణ పూర్వార్ధము
సమాప్తము.

ఓమ్

శ్రీ వాణ్యైనమః.

'ఓం నమోస్తు మిత్రావరుణయో రుర్వశ్యాత్మజాయ శతయాతవే వసిష్ఠాయ'

# శ్రీ వాసిష్ఠ మహారామాయణము.

---

## నిర్వాణ ప్రకరణము

### (ఉత్తరార్ధము)

### ప్రథమః సర్గః.

[నిర్మమా నిరహంకారా నిస్సంకల్పవికల్పనాః
యథా జీవన్తి చేష్టన్తే ముక్తా యుక్తిస్తథోచ్యతే.

అహంకార, మమకారరహితులును, సంకల్పవికల్పవర్జితులునగు జీవన్ముక్తులెట్లు జీవింతురు, ఆచరింతురను విషయమిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

నైష్కర్మ్యాత్కల్పనాత్యాగాత్తనుః పతతి దేహినః
కథమేతదతో బ్రహ్మన్సంభవత్యాశు జీవతః. 1

శ్రీరాముఁడు:—మహాత్మా! నైష్కర్మ్యము చేతను, దేహాదులందలి అహంకారాదుల కల్పనను త్యజించుటచేతను జీవుని శరీరము శీఘ్రముగఁ బడిపోవుచున్నది. అట్టిచోఁదాము వచించినట్టి యాతని జీవిత వ్యవహారమెట్లు సంభవించును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

జీవతః కల్పనాత్యాగో యుజ్యతే న త్వజీవతః
రూపమస్య యథాతత్త్వం శృణు శ్రవణభూషణం. 2

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! జీవించువానికే కల్పనాత్యాగము తగును గాని, జీవింపని వానికి గాదు. ఈ కల్పనాత్యాగముయొక్క స్వరూపమెట్లు జీవన విరుద్ధముకాదో యాక్రమమును యథార్థముగ వచింపఁబోవుచున్నాను. గాన అట్టిశ్రవణభూషణమైన ఈ విషయమును నీవాలకింపుము.

అహంభావన మేవాహుః కల్పనం కల్పనావిదః
నభోర్థభావనం తస్య సంకల్పత్యాగ ఉచ్యతే. 3

పరిచ్ఛిన్నమైన దేహాదులందు అహంభావనయొనర్చుటయే కల్పనయని కల్పనావేత్తలు పలుకుచున్నారు. అపరిచ్ఛిన్నమైన బ్రహ్మాకాశ (చిదాకాశ) భావన వానియందుఁ గావించుటయే కల్పనాత్యాగమనఁబడును.

పదార్థరస మేవాహుః కల్పనం కల్పనావిదః
నభోర్థభావనం తస్య సంకల్పత్యాగ ఉచ్యతే. 4

మతియును, పరిచ్ఛిన్నమైన పదార్థముల పృథక్-భావనయే కల్పనయనియు కల్పనావేత్తలు నుడువుచున్నారు. అంతట నవ్వియెసట్టి బ్రహ్మాకాశముయొక్క సత్తగా భావించుటయే కల్పనాత్యాగమనఁబడును.

ఇదం వస్త్వితి సంవేగమాహుః కల్పనముత్తమాః
నభోర్థభావనం తస్య సంకల్పత్యాగ ఉచ్యతే. 5

దేహాది పరిచ్ఛిన్నమైన దృశ్యవస్తువులు పరమార్థముగ సత్యములను గాఢబుద్ధినే విద్వాంసులు సంకల్పమందురు. ఆవస్తువులు పంచభూతముల వికారమాత్రములే గాని సత్యములని యెంచకుండుటయు, సమస్తమును బ్రహ్మాకాశమాత్రముగ భావించుటయు సంకల్పత్యాగమని చెప్పఁబడును.

స్మరణం విద్ధి సంకల్పం శివమస్మరణం విదుః
తచ్చ ప్రాగనుభూతం చ నానుభూతం చ భావ్యతే. 6

పదార్థముల (అనురాగపూర్వకమగు) స్మరణమే సంకల్పమనియు, అట్టిస్మరణము లేకుండుటయే మోక్షమనియుఁ జెప్పఁబడెను. ఆస్మరణము (సంయోగించిన) పూర్వమనుభవించిన విషయములఁగూర్చియు, అనుభవింపని విషయములఁగూర్చియుఁగూడ (భూత, భవిష్యద్విషయముల రెంటిఁగూర్చియు) నుండును.

అనుభూతాం నానుభూతాం స్మృతిం విస్మృత్య కాష్ఠవత్
సర్వమేవాశు విస్మృత్య గూఢ స్తిష్ఠ మహామతే. 7

మహామతివగు రామచంద్రా! అనుభవించినవియు, అనుభవింపనివియునగు రెండువిధములగు పదార్థములయొక్కయు స్మరణమును మాని, బ్రహ్మముకంటె అన్యమగు సమస్తవస్తువులను శీఘ్రముగ విస్మరించి, బ్రహ్మాకారవృత్తియందు లీనుఁడవై, కాష్ఠమువలెఁ నిశ్చలముగ నుండుము.

సర్వావిస్మరణమాత్రాత్మా తిష్ఠ యాతేషు కర్మసు
అర్ధసుప్త శిశుస్పన్ద ఇవాభ్యస్తోపపత్తిషు. 8

సమస్తపదార్థముల విస్మరణమాత్రముచే యథాప్రాప్తములగు అభ్యస్తవ్యవహారములందు, సగము నిద్రించిన బాలునివలె, చేష్టలొనర్చుచుండుము.

నిఃసంకల్పప్రవాహేణ చక్రం ప్రస్పన్దతే యథా
స్పన్దస్వ కర్మస్వేవ ప్రాక్సంస్కారవశాత్తథా. 9

సంకల్పరహితుఁడవగు రామచంద్రా! నిస్సంకల్పప్రవాహముచే, కుమ్మరివాని చక్రమువలె, పూర్వకాలిక సంస్కారవశముచే స్వకర్మలందుఁ జేష్టలొనర్చుము.

అవిద్యమానచిత్తస్త్వం సత్త్వసంస్కారమాగతః
ప్రవాహపతితేష్వేవ స్పన్దస్వ స్వేషు కర్మసు 10

ఓ రాఘవా. చిత్తరహితుఁడవై. నిర్వాసనారూపమగు సంస్కారమును బొంది ప్రవాహపతితములగు స్వకర్మలందు చేష్టసల్పుము.

ఊర్ధ్వబాహు విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి మే
అసంకల్పః పరం శ్రేయః స కిమన్తర్న భావ్యతే. 11

భుజముల రెంటిని పైకెత్తి అసంకల్పమే (సంకల్పములేకుండుటయే) పరమశ్రేయమని బిగ్గఱగా వచించుచున్నను, నాయీవాక్యము నెవరును వినుటలేదు. దాని నంతఃకరణమున నేల భావించుట లేదు?

అహో మోహస్య మాహాత్మ్యం యదయం సర్వదుఃఖహా
చిన్తామణిర్విచారాఖ్యో హృత్స్థోఽపి త్యజ్యతే జనైః. 12

ఆహా! మోహముయొక్క మహిమ యెట్టిది! సర్వదుఃఖముల నశింపఁజేయునదగు విచారమను (ఆత్మచింతనయను) చింతామణి హృదయమందున్నను దానిని జనులు విడిచిపెట్టుచున్నారే!

అవేదనమసంకల్పస్తన్మయేనైవ భూయతామ్
ఏతావత్పరమం శ్రేయః స్వయమేవానుభూయతాం. 13

దృశ్య, దర్శనరహితమగు ఆత్మతత్త్వమే అసంకల్పము. అద్దానితోటి తన్మయుఁడై యుండవలెను. ఇంతమాత్రమే పరమశ్రేయము. దానిని స్వయముగనే యనుభవింపవలయును.

కిల తూష్ణీం స్థితేనైవ తత్పదం ప్రాప్యతే పరం
పరమం యత్ర సామ్రాజ్యమపి రామ తృణాయతే. 14

ఓ రామచంద్రా! ఎచట సమస్తబ్రహ్మాండ సామ్రాజ్యమున్ను తృణమువలె గోచరించునో అట్టి పరమ పదము సంకల్పచేష్టలేని తూష్ణీంస్థితి మాత్రముచేతనే లభించును.

గమ్యదేశైకనిష్ఠస్య యథా పాన్థస్య పాదయోః
స్పన్దో విగతసంకల్పస్తథా స్పన్దస్వ పాదయోః. 15

గమ్యప్రదేశమును గూర్చి యేకైకనిష్ఠగఁ జనుచుండు పథికుని పాదములు సంకల్పములేకయే చలించుచుండునట్లు నీవున్ను సంకల్పరహితుఁడవై యథాప్రాప్తములగు స్వకర్మలందు చేష్టసల్పుము

సర్వాకర్మఫలాభోగములం విస్మృత్య సప్తవత్
ప్రవాహపతితే కార్యే స్పన్దస్వ గతవేదనమ్. 16

ఓ రామచంద్రా! సర్వకర్మఫలానుభవమును నిద్రించువానివలెఁ బూర్ణముగ మఱచి ప్రవాహపతితములగు కార్యములందు సంకల్పరహితుఁడవై చేష్టసల్పుము.

స్పన్దస్వాకృతసంకల్పం సుఖదుఃఖాన్యభావయన్
ప్రవాహపతితే కార్యే చేష్టితోన్మత్తశష్పవత్. 17

స్వతః యేచేష్టయులేనట్టి తృణము వాయువు మున్నగువాని ప్రవాహమువలన నితర తృణాదులతో సంయోగ వియోగరూప చేష్ట సల్పునట్లు, నీవున్ను సంకల్పరహితుఁడవై, సుఖదుఃఖాదులను భావింపక, ప్రవాహపతితములగు కార్యములందుఁ జేష్టయొనర్పుము.

రసభావనమ స్తస్తే మాలం భవతు కర్మసు
దారుయన్త్రమయస్యేవ పదార్థమివ కుర్వతః 18

ఇతరుల కౌతుకముకొఱకై నృత్యాదుల సల్పు కొయ్యబొమ్మవలె గర్మములందు శృంగారాది రసభావన నీకు లేకయుండుగాక!

నీరసా ఏవ తే సన్తు సమస్తేన్ద్రియ సంవిదః
ఆకారమాత్రసంలక్ష్యా హేమన్తరే లతా ఇవ. 19

ఓ రామచంద్రా! సమస్తేంద్రియముల యొక్క విషయానుభవములున్ను నీకు నీరసముగనే తోఁచుగాక! మఱియు, హేమంతఋతువందలి లతవలె నవియన్నియు ఆకారమాత్రములుగనే నీకుఁ గన్పట్టుగాక!

బోధార్క పీతరసయా స్పన్దషడ్వర్గ సత్తయా
యన్త్రస్పన్దోపమస్తిష్ఠ వల్ల్యేవ శిశిరే ద్రుమః 20

జ్ఞానసూర్యుని రసమును పానముచేయుచు, షడ్వర్గముల (పంచకోశసంవలితుఁడగు చిదాభాసుఁడు, మనస్సహిత ప్రాణవర్గము, జ్ఞానేంద్రియవర్గము, కర్మేంద్రియవర్గము, జ్ఞానకర్మేంద్రియ సహితమగు అంతఃకరణచతుష్టయము, శరీరవర్గము - వీని) సత్తచే యంత్రము యొక్క చలనము భంగి చేష్ట సల్పుచు శిశిరఋతువందు లతచేఁ జుట్టఁబడిన వృక్షమువలె నీరసముగ (విషయాస్వాదనరహితముగ) స్థితిగల్గి యుండుము.

చిదాన్తరరసాన్యేవ ప్రవృత్తాన్యపి ధారయ
స్వాయత్తేనేన్ద్రియాణ్యాశు హేమన్తరు స్తరూనివ 21

బాహ్యజలములేకున్నను హేమంతఋతువు, అభ్యంతరరసము చేతనే వృక్షములను జీవింపఁజేయునట్లు, స్వభావముగ బాహ్యరసాస్వాదనమునఁ బ్రవృత్తములైనను ఇంద్రియములను స్వాయత్తముచేనటునుండి శీఘ్రముగ నివారించి వానిని అభ్యంతరమునగల జీవనపుష్ట్యాది హేతువైనట్టి భూమానందరూపమైన చైతన్యరసములుగనే యొనర్చి ధరింపుము.

సరసేన్ద్రియవృత్తేస్తే కుర్వతోఽకుర్వతస్తథా
సంసారానర్థసార్థోఽయం న కదాచన శామ్యతి. 22

ఇంద్రియవ్యూహము విషయరసమందు నీవృత్తి అనురాగముగల్గియుండుచో నికనీవు విషయభోగము చేసినను, చేయకున్నను సంసారముయొక్క అనర్థసమూహ మెన్నఁటికిని శమింపకయే యుండును.

నిఃసంకల్పమరుజ్జ్వాలా యన్త్రామ్బుస్పన్దవద్యది
స్పన్దసే తదనన్తాయ శ్రేయసే పరికల్పసే 23

సంకల్పరహితుఁడవై, వాయువు, అగ్నిజ్వాల, యంత్రము, జలము - వీనివలె నీవు చేష్ట సల్పుచో నపుడు అనంతశ్రేయమును బొందఁగలుగుదువు.

ఏతదేవ పరం ధైర్యం జన్మజ్వర నివారణమ్
యదవాసనమభ్యస్తా నిజకర్మసు కర్తృతా. 24

నిజకర్మలందు అభ్యస్తమైనట్టి కర్తృత్వవాసన లేకయుండుటయే జన్మయను జ్వరముయొక్క నివారణమునకుఁ బరమోపాయమైయున్నది.

అవాసన మసంకల్పం యథాప్రాప్తానువృత్తిమాన్
శనైశ్చక్రభ్రమాభోగ ఇవ స్పన్దస్వ కర్మసు. 25

వాసనారహితుఁడవై. సంకల్పవర్జితుఁడవై, చక్రభ్రమణమువలె యథాప్రాప్తములగు నిజకర్మలందు చేష్టసల్పుచు మెల్లమెల్లగ నుపశమశీలుఁడవు కమ్ము.

మా కర్మఫలబుద్ధిర్భూర్మా తే సఙ్గోస్త్వకర్మణి
ఉభయం వా త్యజైతత్త్వముభయం వా సమాశ్రయ. 26

కర్మఫలమందు నీ కాసక్తి వలదు, కర్మత్యాగ ఫలమందును నీకాసక్తి యుండరాదు, ఈ రెంటిని ద్యజింపుము, లేక, రెంటిని నాశ్రయింపుము. (ఫలాసక్తి లేనపుడు కర్మ నాచరించుటయందు గాని, త్యజించుటయందుగాని విశేషమేమియు లేదని భావము)

బహునాత్ర కిముక్తేన సంక్షేపాదిదముచ్యతే
సంకల్పనం మనోబంధ స్తదభావో విముక్తతా. 27

ఇవ్విషయమున నధికముగ జెప్పనేల? సంక్షేపముగ నిట్లు వచించుచున్నాను — సంకల్పమే మనస్సుయొక్క బంధనము. అట్టి సంకల్పము లేకుండుటయే ముక్తి.

నేహ కార్యం న వా కార్యమస్తి కించిన్న కుత్రచిత్
సర్వం శివమజం శాన్తమనన్తం ప్రాగ్వదాస్యతామ్. 28

ఈ ప్రపంచమున నెచటను జేయదగినదిగాని, చేయదగనిదిగాని యొకింతైనను లేదు, సమస్తము శివమై, అజమై, శాంతమై, అనంతమైనట్టి బ్రహ్మరూపమేయైయున్నది. కావున, పూర్వమే యాత్మస్వరూపముతో నుంటివో, అట్టిరూపముతోనే యిపుడును సర్వత్ర స్థితిగలిగియుండుము.

పశ్యన్కర్మణ్యకర్మత్వమ కర్మణి చ కర్మతాం
యథా భూతార్థచిద్రూపః శాన్తమాస్స్వ యథాసుఖమ్. 29

సమస్తకర్మలందును నిష్క్రియమగు బ్రహ్మరూపత్వమును, నిష్క్రియ బ్రహ్మరూపత్వస్థితి యందు అవశ్యకర్తవ్యత్వమును గాంచుచు, యథార్థ చిద్రూపుఁడవై శాంతముగను, సుఖపూర్వకముగను నుండుము.

అవేదనం విదుర్యోగం చిత్తక్షయమకృత్రిమం
అత్యన్తం తన్మయో భూత్వా తథా తిష్ఠ యథాసి భోః 30

దృశ్యదర్శనరహితమగు ఆత్మతత్త్వమును అనుసంధానమొనర్చుటయే యోగమనఁబడును.

అదియే స్వాభావికమగు చిత్తక్షయమై యున్నది. కావున నో రామచంద్రా! అట్టి ఆత్మయందు మిగుల తన్మయుఁడవై, ఎట్లుంటివో యట్లుండుము. (ఆత్మరూపుఁడవై వెలయుము)

సమే శాన్తే శివే సూక్ష్మే ద్వైతైక్యపరివర్జితే
తతేఽనన్తే పరే శుద్ధే కిం కేన కిల ఖిద్యతే. 31

సమమై, శాంతమై, శివమై, సూక్ష్మమై, ద్వైతైక్యవర్జితమై, సర్వవ్యాపకమై, అనంతమై సమస్తమునకుఁ బరమై, శుద్ధమైనట్టి ఆత్మరూపమున నెవఁడెందులకు ఖేదమొందును?

నోదేతు త్వయి సంకల్పో మరుభూమావివాఙ్కురః
ఇచ్ఛా నోదేతు భవతి లతికేవోపలోదరే. 32

ఓ రామచంద్రా! మరుభూమియందు అంకురమువలె నీయందు సంకల్పముదయింపకుండుగాక! మఱియు శిలయందు లతవలె నీయందిచ్ఛయు నుత్పన్నముకాకుండుగాక!

అవేదనస్య శాన్తస్య జీవతో వాప్యజీవతః
నేహ కించిత్కృతేనార్థో నాకృతేనాపి కశ్చన. 33

సంకల్పరహితుఁడగు శాంతపురుషునకు! జీవించియున్నను, లేక జీవింపకయున్నను ఈప్రపంచమున నేదేని కార్య మొనర్చుటచేగాని, ఒనర్పకుండుటచేగాని ప్రయోజనమేమియును లేదు.

యత్కర్మాకర్మ శాన్తేఽన్తః శాశ్వతాభేదరూపిణి
న కర్మణి చ కర్మాణి న కర్తర్యపి కర్తృతా. 34

కర్మయు, అకర్మయు రెండును అంతఃకరణమున శమించినవాడవై, ఆయుభయస్థితులందును నిరంతరము అభేదరూపముననుండు నీయందిక, (ప్రాతిభాసిక కర్మరూపముచే వర్తించినను) కర్మకాని (ప్రాతిభాసిక కర్తృరూపముచే వర్తించినను) కర్తృత్వముగాని యుండనేరవు.

అహంమమేతి సంవిదన్ దుఃఖతో విముచ్యసే
అసంవిదన్విముచ్యసే యదీప్సితం తదాచర. 35

ఓ రామచంద్రా! దేహాదులందు 'అహం, మమ' (నేను, నాది) యను అభిమానమున్నచో దుఃఖములనుండి యెన్నడును విడివడనేరవు, అట్లు దేహాదులందాత్మాభిమానము లేకున్నచో విముక్తుఁడగుదువు. ఇఁక నీరెంటిలో నీకేది యిష్టమో దాని నాచరింపుము.

అహంమమేతి నాస్త్యలం యదస్తి తచ్ఛివం పరమ్
పరాత్పరం త్విదం శివాదశబ్దమర్థరూపకమ్. 36

ఈ 'అహం, మమ' యనునవి యెన్నడును లేనివై యున్నవి. ఏది కలదో, అదికేవలము పరమశివరూపమేయైయున్నది. ఏలయనగా, ఆనందఘనమైనట్టి శివరూపమగు పరమాత్మకంటె భిన్నమగు ఈదృశ్యజగత్తు, అనిర్వచనీయమై, అవస్తువై యొప్పుచున్నది.

యద్దృశ్యతే జగదిదం ఖలు కించిదేత
ద్ధేమ్నోఽఙ్గదత్వమివ భాతి న విద్యమానమ్

అస్య క్షయం విదుర వేదనమేవ పశ్చా
త్సత్యం తదేవ పరమార్థమథావశిష్టం. 37

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షో
పాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే ఇచ్ఛాది చికిత్సాయోగోపదేశో
నామ ప్రథమ సర్గః ॥ 1 ॥

సువర్ణముకంటె వేఱుగ కటక అంగదాద్యాభరణములు లేనిచందమున, ఈకాన్పించు జగత్తున్ను ఆత్మకంటె భిన్నముగ లేనిదేయైయున్నది. ఆత్మకంటె భిన్నముగ దీని యనుభవమును బొందకుండుటయే దీనియొక్క నాశమని వచింపఁబడుచున్నది. అట్టి దీనిబాధచేఁబిదపయధిష్ఠానము శేషించుచున్నదో, అదియే పరమార్థమగు సత్యరూపమైయున్నది.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
నుత్తరార్థమున, ఇచ్ఛాదిచికిత్సాయోగోపదేశమను నొకటవ సర్గము ॥ 1 ॥

---

## ద్వితీయః సర్గః.

[నిరూప్యతేఽత్ర ప్రథమం సర్వం శివమయం జగత్
కర్మబీజం తథాన్విష్య సమూలం వినివార్యతే.

ఈ జగత్తంతయు శివమయమని మొదట నిరూపించి' పిమ్మట కర్మబీజము నన్వేషించి, దానిని (కర్మబీజమును) సమూలముగ నివారించుట యిట, గాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అద్వైతైక్యం విమననం శాన్తమాత్మన్యవస్థితమ్
యథా పఙ్కమయం సైన్యం తథా శివమయం జగత్. 1

శ్రీ వసిష్ఠుఁడు:- ఓరామచంద్రా! ద్వైత, ఏకత్వరహితమై, మనన వర్జితమై శాంతమైనట్టి ఆత్మయే ఆత్మయందిట్లు జగద్రూపముగ నెలకొనియున్నదగును. మృత్తికచే నిర్మింపఁబడిన సేన మృత్తికామయమైయుండునట్లు ఈ జగత్తంతయు శివమయమైయున్నది.

మనోఽహంకారబుద్ధ్యాదిచిత్తమేవ చ తన్మయమ్
కాలాకారక్రియాశబ్ద శక్తిసందర్భసంయుతమ్. 2

కాల, ఆకార, క్రియా, శబ్దశక్తి సందర్భసహితమగు మనోబుద్ధిచిత్తాహంకారములన్నియు (చిద్వివర్తత్వముచే) చిన్మయములైయున్నవి.

శివపఙ్కమయా ఏవ రూపాలోకమనః క్రమాః
తన్మయత్వాదనన్తత్వాదతః కిం కేన చేత్యతే. 3

బాహ్యరూప, రస, గంధాదులున్ను, బాహ్యసవికల్పక గ్రహణ, త్యాగాది బుద్ధులున్ను, తద్విషయములున్ను శివపంకమయములేయై యున్నవి. సమస్తము శివమయమై, అనంతచిద్రూపమై యుండుటచే నీక నేని దేనిచే, ప్రకాశింపఁబడుచున్నది.

మాతృమేయ ప్రమాణాది దేశకాలౌ దిగాది చ
భావాభావవివర్తాదిశివపఙ్కమయాత్మకమ్. 4

ప్రమాతృ, ప్రమేయ, ప్రమాణాదులున్ను, దేశకాలములున్ను, దిక్కులు మొదలైనవియు, భావాభావ వివర్తాదులున్ను సమస్తము శివపంకమయాత్మకమై యున్నవి.

అహంమమేత్యతః సారాన్నేతరత్పరమేశ్వరాత్
అసంసక్తమతి స్తిష్ఠ హే శిలోదరమౌనవత్. 5

ఓ రామచంద్రా! ఇక్కారణమున సారభూతుడగు పరమేశ్వరునికన్న భిన్నముగ అహం, మమ మొదలు గాఁగల వివర్తము లెవ్వియును లేవు, కావున అసంసక్తమగు బుద్ధిగల్గి శిలయొక్క యుదరమువలె మౌనముగ నుండుము.

శ్రీరామ ఉవాచ:—

అహంమమేత్యసద్రూపం జ్ఞస్యాభావయతః ప్రభో
అశుభం కర్మణాం త్యాగాదనుష్ఠానాచ్చ కిం శుభమ్. 6

శ్రీ రాముఁడు:- ప్రభూ! 'అహం, మమ' మొదలు గాఁగల దృశ్యసమూహమును అసద్రూపముగ భావించు జ్ఞానికిఁ గర్తత్యాగముచే నే యశుభము, కర్మానుష్ఠానముచే నే శుభము గలుగును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

పృచ్ఛామి యదహం తత్త్వం కథయాశు మమానఘ
యది జానాసి తత్త్వేన కర్మ తావత్కిముచ్యతే. 7
విస్తారః కర్మణః కిం స్యాత్కిం మూలం తస్య చ కిం భవేత్
నాశనీయం చ నిపుణం కథం కథయ నాశ్యతే. 8

శ్రీ వసిష్ఠుఁడు:- పాపరహితుఁడవగు నో రామచంద్రా! నేను నిన్నడుఁగబోవు దానిని యథార్థముగ నీ వెఱిఁగినచో దానిని శీఘ్రముగ వచింపుము - కర్మయనగానేమి? కర్మయొక్క విస్తార మెట్టిది? దానిమూలమెద్ది? అందు నిపుణముగ నశింపఁజేయఁదగిన యంశమేది ? అట్లు నశింపఁజేయుట కుపాయమేమి?

శ్రీరామ ఉవాచ:—

యన్నాశనీయం నిపుణం తన్నాశం చ వినాశ్యతే
మూలకాషేణ భగవన్న శాఖాది వికర్తనైః. 9

శ్రీ రాముఁడు:- మహాత్మా! ఏది నిపుణముగ నశింపఁజేయఁదగినదై యున్నదో, దానిని నిక్కముగ మూలచ్ఛేదముచేత నే నశింపఁజేయవలెను గాని, శాఖాదుల ఛేదనములచేఁ గాదు.

శుభాశుభం నాశనీయం స్వకర్మ ఖలు ధీమతా
మూలకాషవినాశేన తచ్ఛ నష్టం భవత్యలమ్. 10

బుద్ధిమంతుఁడగువాఁడు తన శుభాశుభకర్మల రెంటిని నశింపఁజేయవలెను. వాని మూలమును ఛేదించుటచే నవి సంపూర్ణముగ నశించును.

కర్మ వృక్షస్య వక్ష్యామి బ్రహ్మన్మూలాని మే శృణు
యన్నికాషేణ నిర్మూలో న స భూయః ప్రరోహతి. 11

మహాత్మా! వేని ఛేదనముచే కర్మవృక్షము నిర్మూలమై మఱల యంకురింపదో, అట్టి యా వృక్షములయొక్క మూలములను వచించుచున్నాను. వినుఁడు.

దేహస్తావదయం బ్రహ్మన్కర్మవృక్షః సముత్థితః
రూఢసంసారవిపినే విచిత్రాఙ్గలతాఞ్చితః. 12

మహాశయా! ఈ దేహమే కర్మవృక్షముగాఁ బ్రకటమైయున్నది. హస్తాద్యంగములను విచిత్ర లతలచే శోభించుచు నియ్యది సంసారారణ్యమున రూఢిఁబొందియున్నది.

కర్మబీజం తరోరస్య సుఖదుఃఖఫలావలేః
క్షణతారుణ్యకాన్తస్య జరాకుసుమహాసినః. 13

సుఖదుఃఖఫలసమూహము నొసంగు యీ వృక్షమునకు కర్మయే బీజము. క్షణికమగు యౌవనముచే నిదిరమణీయముగ భాసించుచున్నది. మఱియు వార్ధక్యమను పుష్పములచే హాస్యమొనర్చుచున్నదై యున్నది.

ముహూర్తం ప్రతికాలోగ్రమర్కటధ్వంసితాకృతేః
నిద్రాహేమన్తజఠరలీనస్వప్నదలోద్గతేః. 14

మిగుల భయంకరమగు 'కాల'రూప మర్కటము ప్రతిముహూర్తము దీని యాకృతిని ధ్వంసముచేయుచున్నది. నిద్రయను హేమంతఋతువుయొక్క గర్భమందు స్వప్నరూపములైన దీని పత్రములు లీనమై (సంకుచితములై) యున్నవి.

స్వవార్ధకశరచ్ఛాన్తశీర్ణేహాపర్ణసంతతేః
జగజ్జఙ్గలజాతస్య కలత్రోపతృణావలేః. 15

జగత్తను అరణ్యమున జన్మించినదై స్త్రీపుత్రాదులను తృణసమూహముతోఁ గూడుకొనియున్నట్టి యీ శరీరమను వృక్షమునకు వార్ధక్యమను శిశిరఋతువునందు చేష్టలను పత్రసమూహము శమించిపోవుచున్నది.

పల్లవావయవా హస్తపాదపృష్ఠాదయోఽరుణా
పత్రాణి తనువృత్తాని సురేఖాణి చలాని చ. 16

హస్తపాదపృష్ఠాద్యవయవము లీ వృక్షముయొక్క యెఱ్ఱని మృదుపల్లవములు, కొంచెము కఠినమైనట్టి హస్తపాదాదుల యుత్తమరేఖాసహితములగు తలప్రదేశములు దీని పత్రములు.

అరుణాః పవనాలోలా మృద్వ్యో మసృణమూర్తయః
స్నాయ్వస్థిదిగ్ధసరసా అఙ్గుల్యో బాలపల్లవాః. 17

లోన నాడులతోను, ఎముకలతోను గూడి రమ్యములై, కోమలములై, రక్తవర్ణయుతములై నట్టి వ్రేళ్లు వాయుకంపితములగు దీని లేతచిగుళ్ళు.

మృద్వ్యో మసృణతీక్ష్ణాగ్రా వృత్తా రూఢాః పునఃపునః
ద్వితీయేన్దుకలాకారాః కలికా నఖపఙ్క్తయః. 18

కోమలములై నునుపుగానున్నవై తీక్ష్ణమైనట్టి యగ్రభాగముగలవై, కోసినను మరలమరల పెరుగునవై, రెండవచంద్రకలవంటి యాకృతిగలవైనట్టి నఖపంక్తులు (గోళ్లు) దీని మొగ్గలు.

కర్మణః పరిఫుల్లస్య దేహరూపతయేతి హి
కర్మేన్ద్రియాణి మూలాని దుష్టాని గ్రన్థిమన్తి చ. 19

దేహరూపమున వికసితమై, ప్రరూఢమైనట్టి యీ కర్మ-వృక్షమునకు దుష్టములై, గ్రంథి సహితములైనట్టి కర్మేంద్రియములే మూలములు.

సిరాస్థిగ్రన్థినద్ధాని పఙ్కమగ్నాత్మకాని చ
వాసనారసపీతాని నిజరక్తరసాని చ. 20

గుల్ఫవన్తి దృఢాఙ్గాని సుత్వక్చి మసృణాని చ
తేషామతి చ మూలాని విద్ధి బుద్ధీన్ద్రియాణి హి. 21

దృఢమైన అస్థులయొక్క గ్రంథులచే బద్ధములై, నాడులందుఁ బరిపూర్ణమైయున్న అన్న రసమున మగ్నములై, వాసనయను రసమును బానమొనర్చు తమరక్తమను రసముచే సరసములై, గుల్ఫ (పాదగ్రంథి) సహితములై, దృఢాంగములై, ఉత్తమ చర్మముతోఁగూడినవై, నునుపుగానున్న వైనట్టి యా కర్మేంద్రియములకు మూలములు జ్ఞానేంద్రియములై యున్నవి.

సుదూరమపి జాతాని పఞ్చస్తమ్బాని తాని తు
వాసనాపఙ్కమగ్నాని రసవన్తి మహాన్తి చ. 22

ఆ జ్ఞానేంద్రియములు నిజవిషయరూపమగు దూరప్రదేశమునకుఁ జనునవై యున్నను, నేత్ర, నాసికా, కర్ణాది పంచస్థానముల నాశ్రయించియున్నవి. మఱియు నవి తమతమ విషయరూప పంకమున మగ్నములై, రాగసహితములై, నిగ్రహించుటకుఁ గఠినములై యొప్పుచున్నవి.

తేషాం మూల బృహత్స్తమ్భం మనో వ్యాప్తజగత్త్రయం
పఞ్చస్రోతః శిరాకృష్టముక్తానన్తరసద్రవమ్. 23

పంచేంద్రియప్రవాహరూపములగు నాడులచే నాకర్షింపఁబడునదియు, భోగానంతరము విడిచిపెట్టఁబడు అనంతములైన రూపాదిరసద్రవములు గలదియు, ముల్లోకములందును వ్యాపించి యున్నదియు, గొప్ప స్తంభమువంటిదియునగు మనస్సు ఆ జ్ఞానేంద్రియములకు మూలమై యున్నది.

తస్య మూలం విదుర్జీవం చేత్యోన్ముఖ చిదాత్మకం
చేత్యస్య చేతనం మూలం సర్వమూలైకకారణమ్. 24

చితేస్తు బ్రహ్మ మూలం యత్తస్య మూలం న విద్యతే
అనాఖ్యత్వాదనన్తత్వా చ్ఛుద్ధత్వాత్సత్యరూపిణః. 25

చేత్యము (విషయముల) వైపునకు ఉన్ముఖుఁడగు చిదాభాసరూపుఁడగు జీవుఁడే యా మనస్సునకు మూలమగును. అటు, చేత్యాంశమునకు మూలము మాయాశబలితమగు చైతన్యమైయున్నది. చిదాభాసాంశమునకు మూలము సర్వమూలముల కేకైక కారణంబగు బింబభూతమైన బ్రహ్మమే (చైతన్యమే) యగును. మనోవాక్కులకు అవిషయమై, అనంతమై, శుద్ధమై, సత్యమైనట్టి యా బ్రహ్మమునకు మూలము మఱెద్దియును లేదు.

సర్వేషాం కరణామేవం వేదనం బీజముత్తమం
స్వరూపం చేతయిత్వాన్తస్తతః స్పన్దః ప్రవర్తతే. 26

విషయోన్ముఖమగు చైతన్యమే సమస్తకర్మములకును మూలమైయున్నది. అ చైతన్యము అహంకారముతోటి తాదాత్మ్యమును బొందినదై క్రియారూపమగు స్పందమై, తత్ఫలముకొఱకుఁ బ్రవర్తించుచున్నది.

మునే చేతనమేవాద్యం కర్మణాం బీజముచ్యతే
తస్మిన్సతి మహాశాఖో జాయతే దేహశాల్మలిః. 27

ఓ మునీంద్రా! జీవచైతన్యమే సమస్తకర్మములకును ఆదియగు బీజమని వచింపఁబడుచున్నది. ఏలయనగా నది యుండుటవలననే గొప్పశాఖలతోఁగూడిన యీ దేహమను శాల్మలీ (బూరుగు) వృక్షము జనించుచున్నది.

ఏతచ్చేతన శబ్దార్థభావనావలితం యది
తత్కర్మ బీజతామేతి నో చేత్తత్పరమం పదమ్. 28

ఈ జీవచైతన్యము అహంకారాదులతోఁగూడి 'నేను కర్తయగు చైతన్య'మను ఈ భావముతోఁగూడియున్నచో కర్మములకు బీజమగును. అట్లుకానిచో పరమపదరూపమగు సత్తేయగును.

చితిశ్చేతనశబ్దార్థ భావనావలితా యది
తత్కర్మ బీజతామేతి నోచేదాద్యం పరం పదమ్. 29

అనఁగా ఈ జీవచైతన్యమే అహంకారాది భావనలతోఁగూడియున్నచో కర్మములకు బీజత్వమొందును. అట్లుగాక, ఆ యహంకారాదులకు భిన్నమగు శుద్ధచిద్రూపభావన గల్గియున్నచో ఆదియగు పరమపదరూపమే (బ్రహ్మమే) యగును.

తస్మాద్వేదనమేవేహ కర్మ కారణమాకృతేః
యదేతత్కర్మణాం ప్రోక్తం త్వయ్యైవోక్తం మునీశ్వర. 30

కావున, దేహాదులను గూర్చిన అహంభావముయొక్క భావనయే కర్మములకు గారణమై యున్నది. ఓ మునీశ్వరా! నేను వచించినట్టి యీ కర్మలయొక్క మూలమును దామే యిదివఱకు సెలవిచ్చియున్నారు. (దాని ననుసరించియే యిప్పుడు నేను జెప్పితినని భావము).

శ్రీవసిష్ఠ ఉవాచః—

అస్య రాఘవ సూక్ష్మస్య కర్మణో వేదనాత్మనః
కస్త్యాగః కిమనుష్ఠానం యావద్దేహమితి స్థితమ్. 31

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రాఘవా! ఎంతవఱకీ ఉపాధియుండునో, అంతవఱకు జీవచైతన్యము యొక్క అహంకారముతోఁటి అభేదభావనారూపమగు సూక్ష్మమైన కర్మముయొక్క త్యాగమేమి? అనుష్ఠానమేమి?

యచ్చేత్యతే ను తేనాశు బహిరన్తశ్చ భూయతే
సత్యాకారమసత్యం వా భవత్వాహితవిభ్రమమ్. 32

సత్యమైనను, భ్రమయుక్తమై, అసత్యమైనను, బాహ్యమైనను, అభ్యంతరమైనను నగు ఏ దృశ్యమునైనను ఈ జీవచైతన్యము ఉన్ముఖమగుచున్నదో, దానినే యది శీఘ్రముగ బొందుచున్నది. ననుభవించుచున్నది.

న చేత్యతే చేత్తదలం భ్రమాదస్మాద్విముచ్యతే
భ్రమః సత్యోఽస్త్వసత్యో వా కిం విచారణయానయా. 33

దృశ్యమునైనను ఉన్ముఖముకానిచో నది ఈ సంసారభ్రమనుండి విడివడియే పోవుచున్నది. ఇఁక ఆ భ్రమ సత్యమా, అసత్యమాయను నీ విచారణచే నేమి ప్రయోజనము?

ఏతచ్చేతనమేవాన్తర్వికసత్యుద్భవభ్రమైః
వాసనేచ్ఛామనః కర్మసంకల్పాద్యభిధాత్మభిః. 34

ఈ జీవచైతన్యమే, వాసన, ఇచ్ఛ, మనస్సు, కర్మము, సంకల్పము మున్నగు పేర్లుగల్గి యుత్పన్నమగు భ్రమలతోఁ గూడినదై, సంసారరూపమున చేఁదనయందు వికసించుచున్నది.

ప్రబుద్ధస్యాప్రబుద్ధస్య దేహినో దేహగేహకే
ఆదేహం విద్యతే చిత్తం త్యాగస్తస్య న విద్యతే. 35

జ్ఞానియైనను, ఎంతవఱకు దేహముండునో, అంతవఱకు జీవునకీ దేహగృహమున చిత్తత్యాగము సంభవింపనేరదు.

జీవతాం తస్య సంత్యాగః కథం నామోపపద్యతే
కేవలం కర్మశబ్దార్థ భావనా భావనే సతి. 36

కర్తా కర్మత్వముత్సృజ్య స్వయమేవ భవత్యజః

ఏలయనగా, జీవించియుండువారికి చిత్తముయొక్క త్యాగ మెట్లు సంభవించును? కాని, యథాప్రాప్తమగు వ్యవహారకాలమందును 'నేనసంగమై, అద్వితీయమై, కూటస్థమైనట్టి చిన్మాత్రుఁడను;

శుద్ధచిద్రూపుఁడనగు నేనేమియుఁ జేయుటలేదను నీప్రకారమగు నిష్క్రియమైన ఆత్మస్వభావస్థితిచే కర్మశబ్దార్థముల భావన జనియింపకయుండ, కర్మ, అకర్మల వికల్పమును త్యజించి జీవచైతన్యము స్వయముగనే అజమైనట్టి బ్రహ్మరూపమగుచున్నది.

అసంభవతి సంత్యాగే కర్మణో యః కరోతి హి. 37
ఇదం కర్తవ్యతా త్యాగం న కించిత్తేన తత్కృతం

కర్మాకర్మల వికల్పమును త్యజింపక, శరీరమాత్రముచే విహితకర్మలఁ ద్యజించువాఁడు కర్మత్యాగ మొకింతేని గావించినవాఁడు కాఁడు.

బోధాదిదన్తాసంవిత్తేః స్వయం విలయనాత్తు యత్. 38
జగతస్తం విదుస్త్యాగమసఙ్గం మోక్షమేవ చ

జ్ఞానముచే దృశ్య ప్రతిభాసము స్వయముగనే లయింప, జగత్తుయొక్క అత్యంతాభావము సంభవించుటయేదిగలదో, అదియే త్యాగమనియు, అసంగమనియు, మోక్షమనియుఁ జెప్పఁబడును.

వేదనా సతి సంవేద్యే సర్గాదావేవ వేద్యదృక్. 39
నోత్పన్నా విద్యతే నైవ తస్మాత్కిం క్వేవ వేదనం

వేదన (చిదాభాస రూపచైతన్య)మున్నప్పుడే వేద్య (విషయ)ముండును. కాని వేద్యదృష్టి యథార్థముగ (తత్త్వదృష్టిచే) నుత్పన్నముగాకయేయున్నది. గాన లేనిదేయగును. అట్టిచోనిక నెచట నేమి వేదనము?

వేద్యోన్ముఖత్వం సంత్యజ్య రూపం యద్వేదనస్య వై. 40
న వేదనం తన్నో కర్మ తచ్ఛాన్తం బ్రహ్మ కథ్యతే

వేద్య(విషయో)న్ముఖత్వమును త్యజించిన శుద్ధమగు వేదనము (చిదాభాసరూప చైతన్యము) యొక్క స్వరూపమేదిగలదో, అది వేదనము గాదు, కర్మ (క్రియారూపము) గాదు; శాంతమగు బ్రహ్మమే యగును.

చేతనం ప్రోచ్యతే కర్మ సంసృత్యాభ్రవికాసితం. 41
అచేతనం విదుర్మోక్షం జ్ఞం ప్రత్యేవోపదేశగీః

జలాదులందుఁ బ్రతిబింబించు మేఘమువలె బుద్ధ్యాద్యుపాధుల వ్యాపారముచే వికసించునదగుటఁబట్టి చిదాభాసరూపమగు చైతన్యము క్రియారూపమనియే చెప్పఁబడుచున్నది. కావున, అనుభవజ్ఞులు చిదాభాసశూన్యమునే మోక్షమని పలుకుదురు. అట్టివారియొక్క యుపదేశవాణి వివేకవంతుఁడగు శిష్యునిగూర్చియే యగును.

త్యాగో హి కర్మణాం తస్మాదాదేహం నోపపద్యతే. 42

కావున నో రామచంద్రా! దేహ మెంతవఱకుండునో, అంతవఱకుఁ గర్మలయొక్క త్యాగము సంభవింపదు.

యేను సంపూజ్యతే కర్మ తన్మూలం తైర్న ముచ్యతే
మూలం స్వకర్మణాం సంవిన్మనసో వాసనాత్మనః. 43

కర్మ నెవరు పూజింతురో, వారు దాని మూలమును త్యజింపక యుందురు. మఱియు, మను జానకుండన కర్మయొక్క మూలము వాసనామయమై, మనస్సంబంధమైనట్టి చిదాభాసరూపమగు సంవిత్తైయున్నది.

సా చాదేహం సముచ్ఛేత్తుం స్మృతే బోధాన్న శక్యతే
రామ కేవలమేషాన్తః కర్మమూలకరా పరా. 44

అట్టి చిదాభాసరూపమగు సంవిత్తుయొక్క యుచ్ఛేదనము, దేహముండునంతవఱకు జ్ఞానముచే దప్ప మఱిదేనిచేతను సాధ్యముకాదు. ఓ రామచంద్రా! కేవలమీ చిదాభాసరూపమగు సంవిత్తే అంతఃకరణమునందలి యితర కర్మమూలములగు కామవాసనాదులను గలుగఁజేయునదై, కర్తృత్వకారులందు శ్రేష్ఠమై యొప్పుచున్నది.

సూక్ష్మసంవిదసంవిత్త్యా స్వయత్నేన నికృన్త్యతే
యేన సంవిదసంవిత్త్యా స్వయత్నేన విచార్యతే. 45

కావున నెవఁడు చిదాభాసరూపమగు సంవిత్తును మూలాజ్ఞానముతోసహా స్వయత్నముచే (ఆత్మవిచారముచే) యథార్థముగ నెఱిఁగి, దానిస్వరూపమును దొలఁగఁద్రోసి శుద్ధ చిద్రూపము నెఱుఁగుచున్నాఁడో, అతఁడట్టి సూక్ష్మ చిదాభాస సంవిత్తుయొక్క అనుసంధానము గావింప కుండుటయను స్వయత్నముచేతనే దానిని ఛేదించివైచుచున్నాఁడు.

తేన సంసృతివృక్షస్య మూలకాషో వితన్యతే. 46

అతఁడే సంసారవృక్షముయొక్క మూలచ్ఛేదనమును గావించినవాఁడగును.

అచేతనాకాశమనన్యదేకం
తదేవమస్తీత్యిదమర్థహీనమ్
తదవ్యయమరూపం యత ఏతదేవం
నిరామయం చేతనసారమాహుః. 47

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే కర్మబీజదాహయోగోపదేశో నామ ద్వితీయః సర్గః ॥ 2 ॥

చిదాభాసవర్జిత ఆకాశరూపమై, సజాతీయ, విజాతీయ, స్వగత భేదశూన్యమై, ఏకమై, దృశ్యపదార్థరహితమైనట్టి బ్రహ్మముమాత్రమే గలదు. చిదాకాశరూపమై, నిరామయమైనట్టి యా బ్రహ్మమే సమస్త చేతనములయొక్క సారమని బ్రహ్మవేత్తలు పలుకుదురు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున కర్మబీజదాహయోగోపదేశమను రెండవ సర్గము ॥ 2 ॥

## తృతీయః సర్గః.

[అత్యన్తం మార్జితే వేద్యే యథా తత్త్వమవేదనమ్
నిష్క్రియం చాపి విదుషాం తథోపాయ ఇహోచ్యతే.

వేద్యము (విషయము) సంపూర్ణముగఁ దొలగింపఁబడ, చిదాభాసరహితమై, నిష్క్రియమైనట్టి బ్రహ్మ మెట్లు విజ్ఞుల కనుభూతమగునో, ఆ యుపాయమిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

అవేదనం వేదనస్య మునీన్ద్ర క్రియతే కథమ్
నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః. 1

శ్రీరాముఁడు:—ఓ మునీంద్రా! అవేదనమని (జ్ఞానరహితమైనదని) * వేదనము (జ్ఞానము) నెట్లు చెప్పుచున్నారు? అసత్తునకు ఉనికిగాని, సత్తునకు లేమిగాని లేదుగదా!

శ్రీవసిష్ఠ ఉవాచ:—

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
యదా తదైవ సుకరం వేదనావేదనం స్వయమ్. 2

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఎపుడు అసత్తున కునికిగాని, సత్తునకు లేమిగాని లేదనుట సిద్ధాంతమైయున్నదో, అపుడే స్వయముగ వేదనము అవేదనమగుట సులభమైయున్నది.

ఏతౌ వేదనశబ్దార్థౌ రజ్జుసర్పభ్రమోపమౌ
అసత్యావుదితౌ విద్ధి మృగతృష్ణామ్బుసా సమౌ. 3

ఈ 'వేదనము' యొక్క శబ్దార్థముల రెంటిని రజ్జువునందలి సర్పమువలెను, ఎండమావునందలి నీటివలెను భ్రమయుక్తములుగను, అసత్యముగనే యుదయించినవిగను నెఱుఁగుము.

అబోధస్త్వనయోః శ్రేయాన్బోధో దుఃఖాయచేతయోః
తస్మాత్సదేవ బుద్ధ్యస్వ మాऽసద్బుధ్యస్వ రాఘవ. 4

ఓ రాఘవా! ఈరెంటియొక్క విస్మరణమే పరమశ్రేయమైయున్నది. వాని జ్ఞానము దుఃఖమును గలుగఁజేయునదగును. (వాస్తవముగ విషయములు బాధింపఁబడుటఁబట్టి చేత్యము, లేక, వేద్యమే లేకయుండ నిఁక చేతనము, లేక, వేదనము—అనగా వానిజ్ఞాన మెట్లుండఁగలదు?) కావున, నీవు సద్రూపమగు ఆత్మనే యెఱుఁగుము. అసద్రూపమగు చిదాభాసుని నెఱుఁగకుము.

జన్తోర్వేదనశబ్దార్థబోధో దుఃఖకరః పరః
నిష్కృత్య జ్ఞప్తిశబ్దార్థబోధం తిష్ఠ యథాస్థితమ్. 5

* గత సర్గ (1) 42 వ శ్లోకమున 'అవేదనం విదుర్మోక్షం' అని వసిష్ఠులు చెప్పిరి. 'అవేదనం' అను పదమునకు జ్ఞానరహితమగునది యనునర్థము గైకొని శ్రీరాముఁడిటుఁ బ్రశ్నించుచున్నాఁడు. ఆ పదమునకు చిదాభాసరహితమగు చైతన్యమని వసిష్ఠుల తాత్పర్యము.

'వేదనము' యొక్క — శబ్దార్థములయొక్క — జ్ఞానము జీవునకు గొప్పదుఃఖము నేకలుగఁజేయును. కాబట్టి, యాజ్ఞప్తియొక్క — శబ్దార్థముల బోధను సమూలముగ ఛేదించినచో సుఖపూర్వకముగనుండుము.

సర్వావబోధావసరే జ్ఞప్తిశబ్దార్థయోరిహ
నిర్వాణోదయ ఇత్యేవ పరమోమితి శామ్యతామ్. 6

ఓ రామచంద్రా! సర్వవిధ త్రిపుటీబోధలక్షణమగు వ్యవహారకాలమందును, వ్యావహారిక జ్ఞప్తి శబ్దార్థములందు సర్వార్థ పరమగు కూటస్థ చిన్మాత్రమును సర్వశబ్దపరమగు ఓంకారముచే లక్షించి ఈ శుద్ధాత్మయే నిర్వాణోదయ మని నిశ్చయించి, ఏ విక్షేపమున్ను లేక వ్యవహరింపుము.

శుభాశుభాత్మకర్మ స్వం నాశనీయం వివేకినా
తన్నాస్తీత్యవబోధేన తత్త్వజ్ఞానేన సిధ్యతి. 7

వివేకియగువాఁడు తన శుభాశుభకర్మల రెంటిని కూడ నశింపఁజేయవలెను. అవి వాస్తవముగ లేవను ఈబోధచేతను, తత్త్వజ్ఞానముచేతను, ఆనాశము సిద్ధించును.

కర్మమూలని కాషేణ సంసారః పరిశామ్యతి
సువిచారితమన్విష్టం యావత్కర్మ న విద్యతే. 8

కర్మయొక్క — మూలమును (చిదాభాసరూపసంవిత్తును) ఛేదించుటచేతనే సంసారము శమించుచున్నది. మూల, ఫల, పుష్ప, శాఖోపశాఖాసహితమగు కర్మవృక్షమంతయు లేదనియే పూర్ణవిచారముచేఁ గాంచఁబడినది, మఱియు శాస్త్రాన్వేషణముచే నెఱుఁగబడినది.

చిద్రూపో బిల్వమజ్జా న్తశ్చిత్తసంజ్ఞాం యదాత్మని
కరోతి తద్యథా బిల్వాన్న స్వల్పమపి భిద్యతే. 9

బిల్వమజ్జ తనయందే బీజాదులను గలుగఁజేయునో, అయ్యవి యాబిల్వముకంటెఁ గొంచెమైనను వేఱుగానట్లు, చిద్రూపమును బిల్వమున్ను దనయందే చిత్తమను పేరుగల క్రియాకారకాది త్రిపుటిని రచించుచున్నదో, అవియు చిద్రూపముకంటె లేశమైనను భిన్నముకాదు.

న యథా సంనివేశాన్తః సంనివేశస్తతః పృథక్
తథా నభోర్థాది పృథఙ్న పరస్మాన్మనాగపి. 10

భూలోకాంతర్గతములగు జంబూద్వీపాదులా భూలోకమునకంటె వేఱుగానట్లు, ఆకాశము, తదంతర్గతములగు భూతి, భువనాదులున్ను, సన్మాత్రమగు పరమాత్మకంటె వేఱుగావు

యదేవామ్భస్తదేవాన్తర్ద్రవత్వమపృథగ్యథా
చిత్త్వమేవం తథా చిత్తం తద్రూపత్వాత్తదర్థయోః. 11

జలమందలి ద్రవత్వము జలముకంటె వేఱుగానట్లు, చిత్తమున్ను చిద్రూపమగుటచేతను, చిన్మాత్రార్థకమగు చితిధాత్వర్థము గలిగియుండుటచేతను, చిత్తు(చైతన్యము)కంటె వేఱుగాదు.

యథా ద్రవత్వం పయసి యథా౽౽లోకశ్చ తేజసి
తథా బ్రహ్మణ్యతద్భావం చిత్త్వం చిత్తం చ విద్యతే. 12

జలమందు ద్రవత్వమున్ను, అగ్నియందు ప్రకాశమున్ను యెట్లు కలవో, అట్లే బ్రహ్మము నందును గ్రాహకత్వ, స్మర్తృత్వాది ధర్మశూన్యమగు చిత్తమున్ను గలదు.

చేతనం కర్మ తతాన్వాన్తర్నిర్మూలం భ్రమయక్షవత్
ఉదేత్య హేతుకం తచ్ఛేనోన్నోదితం తన్న విద్యతే. 13

పదార్థములను ప్రకాశమొనర్చునది అను 'చేతన' శబ్దముయొక్క యర్థము క్రియాత్మక మగుటచేబట్టి నిష్క్రియ, కూటస్థ, చైతన్యమందు, భ్రమసిద్ధుడగు యక్షునివలె మిథ్యయేయైయున్నది. కారణములేకయే యేమిథ్యారూప ముదయించునో, అది యుదయించనిదై, లేనిదగు చున్నది.

చేతనం కర్మతచ్చైతద్భావి స్పన్ద ఇవానిలః
అహేతుకం యదా తైతద్బహిరన్తశ్చ సార్థకైః. 14

ఎపుడు చేతనము, దాని ప్రకాశనరూపక్రియ, వాయువు, అద్దానిచలనములవలె అభిన్నమై యున్నవో, అపుడు బాహ్యాభ్యంతరము లందలి — అనగా జాగ్రత్స్వప్నసుషుప్తులందలి పదార్థ బుద్ధియు ఆత్మరూపమే కాని వేఱుకానిదేయగును.

విస్తారః కర్మణాం దేహః సోహంతాత్మా ససంసృతిః
అచేతనానహన్త్వేన శామ్యత్యస్పన్దవాతవత్. 15

కర్మలయొక్క విస్తారమే యీ దేహము. అదియే అహంకారము అదియే సంసారము. చిదాభాసత్యాగ పూర్వకమగు అనహంభావనయను మూలోచ్ఛేదనముచే నయ్యది నిశ్చలవాయువువలె శమించుచున్నది.

అచేతనాదనన్తాత్మా భూత్వా జ్ఞోఽప్యుపలోపమః
సంసారమూలకషణం కురు క్రోడముఖాగ్రవత్. 16

ఓ రామచంద్రా! ఇవ్విధమున చిదాభాసుని త్యజించి, అనంతాత్ముడవై, చిద్రూపుడవై, శిలవలె నిశ్చలముగనుండి, వరాహముఖాగ్రమువలె (వరాహము తుంగగడ్డలు మొదలగువానిని ఛేదించునట్లు) సంసారమూలము నుచ్ఛేదన మొనర్పుము.

కర్మబీజకలాకోశత్యాగ ఏవం కృతో భవేత్
నాన్యథా రాఘవాన్తస్తే శాన్తమస్తు సదాస్థితమ్. 17

ఓ రాఘవా! ఈరీతిగనే కర్మబీజకళయొక్క కోశము త్యజింపబడును గాని మఱియొక విధముగ గాదు. కావున నీయంతఃకరణము చిదాభాసుని ఉచ్ఛేదన మొనర్చి సదాశాంతముగనుండుగాక!

కర్మబీజకలాత్యాగే త్వేతస్మాదిత రాత్మని
అవిద్యమానే జీవస్య తజ్జైర్విదితవస్తుభిః. 18

శాస్త్రైర్న గృహ్యతే కించిన్న చ సంత్యజ్యతేఽపి చ
త్యాగాదానేన జానన్తి తతస్తైః శాన్తమానసమ్. 19

ఆకాశశూన్యహృదయై స్తైర్యథా స్థితమాస్యతే
క్రియతే చ యథాప్రాప్తం నాప్యేతైః క్రియతేఽపి చ. 20

ఈ ప్రకారముగ కర్మబీజకళ త్యజింపఁబడ, బ్రహ్మముకంటె భిన్నములైన చిదాభాసుఁడు దృశ్యప్రపంచము జీవునకు మిథ్యకాఁగా, వేద్యమగు పరబ్రహ్మను నెఱిఁగినట్టి తత్త్వజ్ఞులగు శాంతులైన మహాత్ములు దేనిని గ్రహింపకయు, త్యజింపకయు నుందురు. ఏలయనఁగా, వారు గ్రహణత్యాగముల యనుభవమును బొందనివారై శాంతచిత్తులై, ఆకాశమువలె విశదమై, దృశ్యరహితమైనట్టి తమ యాత్మస్వరూపమునందే స్థితిగల్గియుందురు. మఱియు, ప్రవాహపతితములగు కార్యములఁ జేయుచున్నను వారేమియుఁ జేయనివారే యగుదురు.

ప్రవాహపతితం సర్వం స్పన్దతే శాన్తమానసమ్
తేషాం కర్మేన్ద్రియాణ్యేవమర్ధ సంసుప్తబాలవత్. 21

నదీప్రవాహమందుఁబడిన తృణ, కాష్ఠాది సమస్తమును చలించునట్లు, అట్టి తత్త్వజ్ఞుల కర్మేంద్రియములు మనోవికారములేకనే, సగము నిద్రించిన బాలునివలె, చేష్టల నల్పుచుండును.

రసే నిర్వాసనే లబ్ధే రసా అప్యతినీరసాః
నానన్దయన్తి న బహిరజ్ఞాననిపుణా ఇవ. 22

నిర్విషయమగు నిరతిశయానందము (బ్రహ్మము) లభింప, భోగాసక్తములగు కరణవృత్తులు రాగరహితములై, తమతమ విషయప్రకాశమున నసమర్థములైనవివలెనయి. అంతరమునగాని, బాహ్యమునగాని స్థితినొందకయుండును.

కర్మణో వేదనం త్యాగః స చ సిద్ధః ప్రబోధతః
అవస్తునేతరేణార్థః కిం కృతేనాకృతేన వా. 23

పూర్వోక్తమగు జ్ఞానమే కర్మత్యాగమైయున్నది. అట్టిజ్ఞానము ఆత్మప్రబోధముచే సిద్ధించును. మిథ్యారూపమైన తదితరములగు జీవితముయొక్క అదృష్టముచేఁ బ్రాప్తమగు దేహేంద్రియాదుల చేష్టలు ఒనర్చుటచేగాని, ఒనర్పకుండుటచేగాని ప్రయోజనమేమియును లేదు.

అవేదనమసంవేద్యం యదవాసనమాసితం
శాన్తం సమమనుల్లేఖం స కర్మత్యాగ ఉచ్యతే 24

చిదాభాసవర్జితమై, విషయజ్ఞానరహితమై, శాంతమై, సమమై, కృత, అకృత ప్రతిసంధానశూన్యమై, వాసనారహితమైనట్టి శుద్ధమైన ఆత్మస్థితియే కర్మత్యాగమనఁబడును.

అపునఃస్మరణం సమ్యక్ చిరవిస్మృతకర్మ తత్
స్థితం స్తమ్భోదరసమం స కర్మత్యాగ ఉచ్యతే. 25

చిరకాలముక్రిందట నాచరించిన కర్మను మఱచునట్లు, సాంసారిక దృశ్యపదార్థములను పూర్ణముగ విస్మరించునట్టి, స్తంభమధ్యభాగమువలె నిశ్చలమైన ఆత్మస్థితి యేదిగలదో, అదియే కర్మత్యాగమనఁబడును.

అత్యాగం త్యాగమితి యే కుర్వతే వ్యర్థబోధినః
సా భుఙ్క్తే తాన్పశూనజ్ఞాన్కర్మత్యాగపిశాచికా. 26

మూలమును (చిదాభాసుని) త్యజింపక, కేవలము కర్మేంద్రియ సంయమమాత్ర రూపక మైనట్టి త్యాగము నెవ రాచరింతురో, అట్టివ్యర్థబోధతోఁగూడిన పశుతుల్యులగు అజ్ఞులను కర్మత్యాగ రూపిణియగు పిశాచి తినివేయుచున్నది.

సమూలకర్మసంత్యాగేనైవ యే శాన్తిమాస్థితాః
నైవ తేషాం కృతేనార్థో నాకృతేనేహ కశ్చన. 27

సమూల కర్మత్యాగమొనర్చి యెవరు ప్రశాంతముగ నుందురో, అట్టివారికీప్రపంచమున కర్మ నాచరించుటచేగాని, ఆచరింపకపోవుటచేగాని ప్రయోజనమేమియును లేదు.

సమూలమలముద్ధృత్య కర్మబీజకలామితి
నిత్యమేవసమాధానాస్తజ్జ్ఞాస్తిష్ఠన్త్యతః సుఖమ్. 28

వివేకులగు జనులు కర్మబీజకళను సమూలముగఁ ద్యజించి, యేకమైనట్టి ఆత్మయందే నిత్యము సమాహితులై సుఖముగ వెలయుచుందురు.

ప్రవాహపతితే కార్యే ఈషత్స్పన్దా అతన్మయాః
ఘూర్ణమానా ఇవ క్షీబా యన్త్రసంచారితా ఇవ. 29

మోక్షలక్ష్మ్యా విలాసిన్యా వ్యసనోపహతా ఇవ
అర్ధసుప్తప్రబుద్ధాభాః కామప్యవనిమాగతాః. 30

వివేకులగువారు అనాసక్తులై, అభిమానాదివికారశూన్యులై ప్రవాహపతితములగు కార్యములనొకింత యాచరించుచు, మదిరోన్మత్తునివలెను, యంత్రసంచాలితములగు కాష్ఠాదిప్రతిమలవలెను నిస్పృహముగఁ దిరుగుచు, మోక్షలక్ష్మియను విలాసిని యందలి అత్యాసక్తిచే స్వదేహాదుల అనుసంధానము లేనివారివలె నొప్పుచు, సగము నిద్రించిన బాలునివలె చేష్టసల్పుచు పంచమాది భూమికలను బొందినవారై యుందురు.

యత్సమూలం పరిత్యక్తం తత్త్యక్తమితి కథ్యతే
అమూలకాషస్త్యాగో యః స శాఖాలవనోపమః. 31

సమూలత్యాగమే త్యాగమనఁబడును. అట్లు కానిది (మూలమును త్యజింపక చేయు త్యాగము) శాఖాచ్ఛేదనమువంటిదే యగును.

అకృష్టమూలశాఖాగ్రలవనః కర్మపాదపః
పునః శాఖాసహస్రేణ దుఃఖాయ పరివర్ధతే. 32

మూలము ఛేదింపఁబడక, శాఖలయొక్క యగ్రభాగము మాత్రము ఛేదింపఁబడినచో ఈ కర్మవృక్షము మరల వేలకొలఁది శాఖలతోఁగూడి వర్ధిల్లి దుఃఖమునే కలుగఁజేయును.

అవేదనాత్మనా తేన కర్మత్యాగోఽఙ్గ సిద్ధ్యతి
క్రమేణ నేతరేణాత ఏతదేవాహరన్భవ. 33

ప్రియుండవగు నో రామచంద్రా! చిదాభాసుని యుచ్ఛేదనముచే కర్మత్యాగము సిద్ధించుచున్నది. కావున, పూర్వోక్తక్రమము ననుసరించియే నీవభ్యాసమొనర్చుచునుండుము. ఇతర క్రమము ననుసరింపవలదు.

యే త్వేవ కర్మసంత్యాగ మకృత్వాన్యత్ప్రకుర్వతే
అత్యాగం త్యాగరూపాత్మ గగనం మార్గయన్తి తే. 34

ఎవరిట్టి కర్మత్యాగమాచరింపక, అన్యవిధములగు హఠాదులచే కర్మేంద్రియాదుల సంయమము మాత్రము గావింతురో, వారు అత్యాగమునే త్యాగమని యెంచి, ఆకాశమును బాధుచున్నవారగుదురు. (వ్యర్థక్రియ నాచరించుచున్నారని భావము)

బోధాత్మకతయా కర్మత్యాగః సంపద్యతే స్వయం
దగ్ధబీజా నిరిచ్ఛేచ్ఛర క్రియైవ భవేత్క్రియా. 35

ఆత్మజ్ఞానము గలుగుటచే కర్మత్యాగము స్వయముగ సిద్ధించుచున్నది. ఏలయనగా, దగ్ధబీజమువంటిదియు (వాసనావర్జితమును), ఇచ్ఛారహితమునునగు జీవన్ముక్తుల గొప్పయారంభముగల క్రియయు అక్రియయేయగును.

బుద్ధీన్ద్రియేహితం కర్మ సఫలం రసభావనాత్
చేష్టితవ్యం కుదాన్నేవ స్పన్దానో్య నిష్ఫలోఽఙ్గజః. 36

రజ్జువుచేఁ జుట్టఁబడిన కూపకాష్ఠముయొక్క క్రియచే జలముకూపమునుండి యీడ్వఁబడ ధాన్యాదిసంపద ఫలించునట్లును, కేవలము కూపకాష్ఠముయొక్క వ్యర్థక్రియచే ఫలింపనట్లును, బుద్ధిసహితమగు యింద్రియములచే భోగాసక్తిరసభావనతోఁగూడి యొనర్పఁబడుకర్మయే ఫలించును గాని, అన్యమగు శరీరాదుల చేష్టామాత్రముచే నొనర్పఁబడు (వాసనారహితమగు) కర్మ ఫలింపదు.

కర్మత్యాగే స్థితే బోధాజ్జీవన్ముక్తో వివాసనః
గృహే తిష్ఠత్వరణ్యే వా శామ్యత్వభ్యేతు వోదయమ్. 37

జ్ఞానముచే కర్మత్యాగము గావింపఁబడ నిఁక వాసనారహితుఁడగు జీవన్ముక్తుఁడు గృహమందుండినను, లేక, వనమందుండినను, ధనాదిసంపదలతోఁగూడియుండినను, లేక, కూడకయుండినను సమానమే.

గేహమేవోపశాన్తస్య విజనం దూరకాననం
అశాన్తస్యాప్యరణ్యాని విజనా సజనా పురీ. 38

జ్ఞానముచే ప్రశాంతినొందిన మనుజునకు గృహమే నిర్జనమగు దూరారణ్యమైయున్నది. అశాంతునకు జనశూన్యమగు మహారణ్యమున్ను అనేకజనసంయుక్తమగు పట్టణమైయున్నది.

పరిశాన్తమతేర్జ్ఞస్య స్వప్నేఽప్యప్రాప్తమానవా
నిర్మలా వితతా హృద్యా హృద్యేవ వనభూమికా. 39

ప్రశాంతబుద్ధియగు జ్ఞానికి, స్వప్నమందైనను మనుజసంసర్గము లేనిదై, నిర్మలమై, విశాలమై, మిగుల రమణీయమైనట్టి వనభూమి హృదయముననే విరాజిల్లుచున్నది.

జ్ఞస్య నిర్వాణదృశ్యస్య నిస్పన్దార్థా నభోమయీ
శాన్తాశేష విశేషార్థా జగదేవ మహాటవీ. 40

జ్ఞానాగ్నిచే శమించిన దృశ్యముగల జ్ఞానికి యీ జగత్తే, పదార్థముల చలనములేనియు, ఆకాశ (చిదాకాశ) మయమును, సమస్తవిశేషపదార్థములు శమించినదియునగు మహారణ్యమైయున్నది.

అనన్త సంకల్పవతో హృదయస్థజగత్స్థితేః
హృద్యేవావర్తతే భూమిరజ్ఞస్యాఖిలసాగరా. 41

అనేకసంకల్పములతోఁ గూడియుండువాఁడును, హృదయమున జగత్తుయొక్క స్థితిని ధరించువాఁడునగు యజ్ఞానికి హృదయముననే సర్వసముద్రములతోఁ గూడిన పృథివి విద్యమానమైయున్నది.

జయత్యాజ్ఞస్య దీనస్య వివిధద్వన్ద్వసంకటా
సారమ్భా వివిధాకారా హృద్యేవ గ్రామమణ్డలీ. 42

అజ్ఞానియగు దీనమనుజునకు, నానావిధ సుఖదుఃఖాది ద్వంద్వములను సంకటములచే వ్యాప్తమై, అనేక కార్యారంభసహితమై, పలువిధ ఆకారములతోఁగూడినదైనట్టి గ్రామసమూహము హృదయమందే గలదు.

వివిధకార్యవికారదశామయీ
సపురపత్తన మణ్డలపర్వతా
ముకురకోశ ఇవ ప్రతిబిమ్బితా
హృది భవత్యమలా మలినే మహీ. 43

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే దృశ్యోపశమయోగోపదేశో నామ తృతీయఃసర్గః ॥ 3 ॥

అద్దమందువలె మలినహృదయమున, ధనార్జన, వ్యయాది వివిధకార్యములచే సదాలోభమోహశోకభయాది వికారదశలచేఁ బూర్ణమై యొప్పునదియు, నగర, మహానగర, దేశ దేశాంతర, పర్వత, సహితమునగు యీ నిర్మల పృథివి ప్రతిబింబించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున దృశ్యోపశమయోగోపదేశమను మూఁడవసర్గము ॥ 3 ॥

## చతుర్థః సర్గః.

[ఈహాహంత్వైవ సంసారమూలమిత్యుప వర్ణ్యతే
తత్త్యాగశ్చానహంభావ భావనాదాత్మబోధతః.

అహంత్వమే సంసారమునకు మూలమనియు, ఆత్మజ్ఞానముచే అనహంభావన యొనర్చుటచే నది త్యజింపఁబడుచున్నదనియు, నిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సాహన్తాదిజగచ్ఛాన్తౌ బోధే సంవిత్కలాత్మని
సంశాన్త దీపసంకాశస్త్యాగః సిద్ధ్యతి నాన్యథా. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! తైలము క్షయింప దీపమున్ను క్షయించునట్లు, ఆత్మజ్ఞానరూపమగు చైతన్యకళ యుదయించుటచే 'అహంత్వా'ది సహితమగు జగత్తు సిద్ధించును. మఱియొక విధముగఁ గాదు. (దృక్కునకు సర్వదృశ్యత్యాగమే మోక్షము.)

న త్యాగః కర్మసంత్యాగో బోధస్త్యాగ ఇతి స్మృతః
అజగత్ప్రతిభైకాత్మా యేఽనహన్తాదిరవ్యయః. 2

కర్మత్యాగము త్యాగముకాదు. బోధయే (సర్వదృశ్యత్యాగరూపమగు ఆత్మస్థితియే) త్యాగమని చెప్పఁబడినది. జగత్ప్రతిభలేనిదై, శేషించునట్టి — ఏకమై, నాశరహితమై, అహంత్వవర్జితమైనట్టి ఆత్మయే సర్వ త్యాగరూపమగు మోక్షమగును.

అయం సోహమిదం తన్మ ఇతి నిఃస్నేహదీపవత్
శాన్తే పరమనిర్వాణే ప్రబోధాత్మేతి శిష్యతే. 3

'ఈ దేహమే నేను, ఈ శరీరసంబంధములగు గృహధనాదులు నావి'— ఇట్టి రూపమగు జగత్తు తైలములేని దీపమువలె శమింప, బోధ(చైతన్య)రూపమగు ఆత్మయే శేషించును. అదియే పరమ నిర్వాణమగు మోక్షము.

అయం సోహమిదం తన్మే శాన్తమిత్యేవ యస్య నో
న జ్ఞానం తస్య నో శాన్తిర్న త్యాగో న చ నిర్వృతిః. 4

'ఈ దేహమే నేను, ఈగృహాదులు నావి — ఇవ్విధమగు దృశ్యతాదాత్మ్యభావనయెవనకి శమింపకుండునో, ఆతనికి జ్ఞానముగాని, శాంతిగాని, త్యాగముగాని, మోక్షరూప సుఖముగాని యుండ నేరవు.

మమేదమయ మేవాహమిత్యేతావతి యః క్షయః
బోధాత్మా శివమాశాన్తం తస్మాదన్యన్న విద్యతే. 5

'ఈ ధనాదులు నావి, ఈ శరీరేంద్రియాదులు నేను— ఇట్టి రూపమగు జగత్తు యంతయు శమింప, బోధరూపమై, శివమై, సర్వథా శాంతమైనట్టి ఆత్మయే శేషించును. దాని కన్యముగ నెద్దియును లేదు.

అహమంశే విదా క్షీణే సర్వమేవ క్షయం గతమ్
న కించిచ్చ క్వచిత్క్షీణం నిర్వాణైకఘనం స్థితమ్. 6

తత్త్వబోధచే 'అహం' (దేహాభిమాన) అంశము క్షయింప, మమత్వాంశమగు జగత్తంతయునుగూడ క్షయించిపోవును. కాని, యథార్థముగ నేదియు క్షయించుటలేదు. ఏలయనఁగా సర్వత్ర నిర్వాణఘనమై, ఏకమైనట్టి ఆత్మయే స్థితిగల్గియున్నది.

అహం విదనహంవిత్త్వాదేవ శామ్యత్యవిఘ్నతః
ఏతావన్మాత్రసాధ్యేయం కిమివేయం కదర్థనా. 7

అహంభావన యొనర్చు జీవుఁడు 'అనహం'భావనామాత్రముచే నిర్విఘ్నముగ శాంతి నొందును. ఇంతమాత్రమగు సాధనచేతనే ముక్తి సిద్ధించుచుండ నిఁక అన్యసాధనములఁగూర్చిన క్లేశమేల?

అహంనాహమితి భ్రాన్తిర్నచ చిత్త్వాదృతేఽస్తి సా
చిత్త్వం చాకాశవిశదమతః క్వైవైషా భ్రమస్థితిః. 8

'నేను దేహాదులుకాను, శుద్ధచిన్మాత్రుఁడను అను ఈ అనహంబుద్ధియు ద్వైతకారణమున అహంబుద్ధివలెనే అధ్యాసమని (భ్రమయని) వచించుచో పంకముతోగూడ కతకరేణువు (చిల్లగింజ)వలె అది అహంబుద్ధితోసహా చైతన్యమున విలీనమగుచున్నది. కావున నది చైతన్యముకంటె భిన్నముకాదు. వాస్తవముగ చిత్స్వరూపము ఆకాశమువలె స్వచ్ఛమై, నిర్లేపమైయున్నది. అందీజగద్భ్రాంతి యెట్లుండగలదు?

న భ్రమో భ్రమణం నైవ న భ్రాన్తిర్భ్రామకోఽస్తి వా
అనాలోకనమే వేదమాలోకాన్నేదమస్తి తే. 9

యథార్థముగ భ్రమగాని, భ్రమణముగాని, భ్రాంతిగాని, భ్రామకముగానిలేవు, ఇవన్నియు అజ్ఞానముచేతనే సిద్ధించినవి. జ్ఞానముచే నవి నివర్తింప, లేనివేయగును.

విద్ధి చిన్మాత్రమే వేదమసద్రూపోపమం తతం
తేనాలం మౌనమాస్స్వైవం సర్వం నిర్వాణమాత్రకమ్. 10

ఓ రామచంద్రా! అసద్రూపమునుబోలి వ్యాపించినట్టి చిన్మాత్రముగనే నీవీసమస్తమును నెఱుఁగుము. అట్లు సర్వము నిర్వాణరూపమగు ఆత్మమాత్రముగనే యెఱిగిన వాఁడవై మౌనముగ నుండుము.

యేనైవాశు నిమేషేణ త్వహమిత్యేవ చేతతి
తేనైవ నాహమిత్యేవ చేతిత్వాశు న శోచ్యతే. 11

ఏ యే క్షణమందు జీవునకు శరీరాదులందు 'అహం'బుద్ధి, యుదయించునో, శీఘ్రముగ నాయా క్షణముననే ఈ శరీరాదులు నేనుగానను 'అనహం'భావన యొనర్చినచో మరల యాతఁడు దుఃఖము నొందకుండును.

అహం భావనభోర్థేన నిర్వ్యాచ్యారూఢబాణవత్
అజస్రమాశు వా క్షీణం తిష్ఠావష్టబ్ధతత్పదః. 12

ఓ రామచంద్రా! నిరంతరము 'అనహం'భావనయొక్క అభ్యాసముచే 'అహం'భావనను ఆకాశపుష్పమువలె సర్వథా మిథ్యగానొనర్చి, ధనుస్సున నారూఢమొనర్పఁబడిన బాణమువలె సదా అపరాఙ్ముఖుఁడవై, దృఢముగ బ్రహ్మపదమును శీఘ్రమవలంబించి శాశ్వతముగ వెలయుము.

సనభోర్థామహన్తాం త్వం చేతస్స్నవమనారతం
సర్వభావైరనారూఢో భవ తీర్ణభవార్ణవః. 13

అహంభావనను నిరంతరము ఆకాశపుష్పమువలె మిథ్యగ నెఱుఁగుచు, సర్వభావములచేతను అప్రాప్యమైనట్టి ఆత్మపదమునుబొంది సంసారసముద్రమును దాటినవాఁడవుకమ్ము.

స్వభావమాత్ర విజయే స్వయం యస్య న వీరతా
తస్యోత్తమపదప్రాప్తౌ పశోర్బ్రూహి కథైవ కా. 14

స్వాభావికమగు (అజ్ఞానజనితమైన) అహంకారమాత్రమును జయించుటయందెవనికి వీరత్వము లేదో, అట్టి పశువునకు ఉత్తమ బ్రహ్మపదప్రాప్తియం దేమి ప్రసంగముండునో చెప్పుము!

షడ్వర్గో నిర్జితః పూర్వం యేనోత్తమవిదా స్వతః
భాజనం స మహార్థానాం నేతరో నరగర్దభః. 15

ఏ యుత్తమజ్ఞాని స్వయముగ కామక్రోధాదులను దన యరిషడ్వర్గమును (ఆర్గురు శత్రువులను) ముందుగనే జయించునో, ఆతఁడే ముక్త్యాది మహాపదార్థములకుఁ బాత్రుఁడగును. గాని యితర మనుజరూప గర్దభములు కాదు.

యస్య స్వాన్తర్మనోవృత్తిర్జీయమానా జితాథవా
విషయః స వివేకానాం స పుమానితి కథ్యతే. 16

ఎవని యంతఃకరణమున మనోవృత్తి జయింపఁబడుచున్నదో, లేక, జయింపఁబడినదో, ఆతఁడే వివేకాదులకుఁ బాత్రుఁడగును మఱియు నాతఁడే మనుజుఁడనఁదగును.

అర్థో దృషదివామ్భోధౌ యో య ఆపతతి త్వయి
తస్మాదేవ పలాయస్వ నాహమిత్యేవ భావయన్. 17

ఓ రామచంద్రా! సముద్రమునఁ బడవేయఁబడిన శిలాది పదార్థములు సముద్రముతో అసంగముగ నుండునట్లు నీవున్ను నీకు సంప్రాప్తించిన క్రియాదులందు 'అనహం'భావన ('ఈ దేహాదులు నేనుగాను. అసంగమగు ఆత్మనే నేనను భావన) యొనర్చుచు నిర్లేపముగ నుండుము.

నాహమస్తీతి బుద్ధ్వాపి సోపపత్తికమప్యలం
జానానో జ్ఞప్తిమాత్రం చ కిమజ్ఞ ఇవ ముహ్యసి. 18

ఓ రామచంద్రా! 'ఈ శరీరాదులు నేనుగాను' అను 'అనహం'భావన నెఱిఁగియు, ఉత్తమ చిద్రూప సుఖమును లెస్సగ ననుభవించుచును అజ్ఞునివలె నేల మోహమొందుచుంటివి?

న జ్ఞేయమర్థతోఽస్తీహ హేమ్నీవ కటకాదితా
భ్రాన్తిమాత్రాదృతే సా చ శామ్యత్యస్మరణేన తే. 19

సువర్ణము నెఱింగినచో కటకాదులన్ని నెఱుఁగఁబడినవేయగును. గాన సర్వకారణకారణమగు ఆత్మనెఱింగిన నీకు తదన్యమగు ఏ పదార్థమున్ను నిఁక కారణతః నెఱుఁగనదిలేదు. నామరూపాత్మకమగు ఈసమస్తమున్ను కేవలము భ్రాంతిమాత్రమైయున్నది. అద్దాని విస్మరణముచే, లేక, ఆత్మజ్ఞానముచే నది శమించును.

యోయో భావ ఉదేత్యన్తస్త్వయి స్పన్ద ఇవానిలే
నాహమస్మీతి చిద్వృత్త్యా తమనాధారతాం నయ. 20

ఓ రామచంద్రా! వాయువందు చలనమువలె నేయే వృత్తి నీయంతఃకరణమున నుదయించునో, చిదాకారవృత్తితోఁ గూడినవాఁడవై, ఆయావృత్తి నేను గానను ఈభావనచే నద్దానిని నిరాధారముగ నొనర్చివేయుము.

లోభో లజ్జా మదో మోహో యేనాదావితి నో జితాః
నిరర్థకమనర్థోఽస్మిన్స కిమర్థం ప్రవర్తతే. 21

ఇట్లు, అనహంభావనచేలోభము, లజ్జ, మదము, మోహము మున్నగువానిని మొదటనే జయింపనివాని కీయధ్యాత్మజ్ఞానమున మనోరథము నిష్ఫలమగును. యథేష్టాచరణాదుల నిందించు ఈయధ్యాత్మశాస్త్రమున అనధికారియగు యాతఁడేల ప్రవర్తించుచున్నాఁడు?

అహం త్వం పవనే స్పన్ద ఇవ యత్త్వయి సంస్థితమ్
పరమాత్మని తన్నాన్యదేతత్స్పన్ద ఇవానిలే. 22

వాయువునందు చలనమువలె నీయందే 'అహం' త్వము గలదో, అది, బోధచే నీవు పరమాత్మరూపుఁడవు కాఁగా, వాయువుకంటె చలనము భిన్నముకానట్లు, నీకంటె వేఱుగాకుండును.

అసర్గసంవిదా సర్గః పరేఽస్తోఽతివిరాజతే
సంనివేశవిశేషేణ దుర్గోఽపి హి శోభతే. 23

కంఠమునందు ధరింపఁబడిన పుష్పమాలయందుఁ గల్పింపఁబడిన సర్పాదులబోధచే తన్మాలయందు విలీనమై తిరిగి పుష్పమాలగనే శోభించునట్లు, కూటస్థాద్వయ చిన్మాత్రజ్ఞానముచే పరమాత్మయందు విలీనమై, తద్రూపము నేపొంది శోభించును.

పరమాత్మా తు నోదేతి నాస్తం యాతి కదాచన
న చాస్మాదన్యదస్తీతి కో భావోఽభావ ఏవ వా. 24

యథార్థముగ పరమాత్మ యుదయించుటలేదు, అస్తమించుటలేదు. నిత్యసిద్ధమైయున్నది. (కల్పితవస్తువుయొక్క బాధచే అధిష్ఠానము బాధింపఁబడదుగాన,) మఱియు ఈ పరమాత్మకంటె నన్యముగ నెద్దియులేకయుండ నిఁక భావాభావములఁగూర్చి వేఱు చెప్పనేల?

పరం పరే పూర్ణం పూర్ణే శాన్తం శాన్తే శివం శివే
ఇత్యేవమాత్రం వితతం నాహం న చ జగన్న ధీః. 25

పరమై, పూర్ణమై, శాంతమై, శివమైనట్టి పరమాత్మ, పరమై, పూర్ణమై, శాంతమై, శివమై

నట్టి పరమాత్మయందు స్థితిగల్గియున్నది. ఇంతమాత్రమగు స్థితియే తత్త్వబోధచే విస్తారముగఁ జెప్పఁబడినది. కావున నీవిక అహంకారముగాని, బుద్ధిగాని, జగత్తుగాని యెంచుట!

అనిర్వాణే వినిర్వాణం శాన్తం శాన్తే శివే శివమ్
నిర్వాణమప్యనిర్వాణం సనభోర్థం న వాపి తత్. 26

నాశరహితమై, శాంతమై, శివమైనట్టి బ్రహ్మమందు, నాశరహితమై, శాంతమై శివమైనట్టి బ్రహ్మముస్థితినొందియున్నది. రజ్జువునందు కల్పితమగు సర్పముయొక్క శమనమువలె, నామరూపాత్మకమైన కల్పితజగత్తుయొక్క శమనము (నిర్వాణము) అశమనమేయగును. వాస్తవముగ బ్రహ్మము ఆకాశాది పదార్థసహితమై యెన్నడునులేదు.

శాస్త్రాఘాతాః ప్రసహ్యన్తే సహ్యన్తే వ్యాధివేదనాః
నాహమిత్యేవమాత్రస్య సహనే కా కదర్థనా. 27

మనుజుఁడు శస్త్రప్రహారములను సహించుచున్నాడు. వ్యాధిబాధలనుడఁగూడ నోర్చుకొనుచున్నాడు. అట్టిచో నాతనికి 'ఈ శరీరేంద్రియాదులు నేనుగాన'ను ఈ 'అనహం' భావనామాత్రము సహించుటయందేమి కష్టముగలదు?

జగత్పదార్థసార్థానామహమిత్యక్షయోఽఙ్కురః
తస్మిన్నిర్మూలతాం యాతే జగన్నిర్మూలతాం గతం. 28

జగత్తునందలి సమస్తపదార్థసమూహములకును దేహాదులందలి అహంభావనయే అక్షయమగు అంకురమైయున్నది. బోధచే నయ్యది నిర్మూలింపఁబడ ఈ జగత్తున్ను నిర్మూలమగుచున్నది.

బాష్పేణేవాహమర్థేన నిఃసారేణాపి సారవత్
వ్యామలః పరమాదర్శస్తచ్ఛాన్తౌ సంప్రసీదతి. 29

పరమాత్మయను స్వచ్ఛమైన యద్దము అహంకారమను ముఖబాష్పముచే మాలిన్యసహితముగఁ గోచరించుచున్నది. ఆ యహంకారమను నిస్సారబాష్పము శమింప ఆత్మ నిర్మలత్వము నొందుచున్నది.

అహమర్థః పరే వాయౌ స్పన్దస్తత్ప్రశమే తు తత్
అనిర్దేశ్యమనాభాసమనన్తమజమవ్యయం. 30

పరమాత్మయను వాయువందు అహంకారమను స్పందము (చలనము) గలదు. అయ్యది శమింప, అనిర్దేశ్యమై, చిదాభాసరహితమై, అనంతమై, అజమై, అవ్యయమైనట్టి చిదాకాశమాత్రము శేషించును.

అహమర్థః పురో ద్రవ్యప్రతిబిమ్బప్రదర్శ్చితి
తచ్ఛాన్తౌ సా నిరాభాసమనన్తమజమవ్యయం. 31

అహంకారము యెదుటనుండు పదార్థములయొక్క ప్రతిబింబమును చైతన్యమునఁ గలుగఁజేయుచున్నది. ఆ యహంకారము శమింప చైతన్య మాభాసరహితమై, అనంతమై, అజమై, అవ్యయమైనట్టి పరమాత్మరూపమే యగును.

**అహమర్థామ్బుదే క్షీణే పరమార్థశరన్నభః**
**పరయానన్తయా లక్ష్మ్యా స్వచ్ఛయాచ్ఛం విరాజతే.** 32

అహంకారమను మేఘము శమింప, ఆత్మయను శరత్కాలాకాశము, పరమై, అనంతమై, స్వచ్ఛమైనట్టి (మోక్ష) లక్ష్మితోడ నిర్మలమై విరాజిల్లును.

**అహమర్థమలోన్ముక్తమవ్యక్తం తామ్రమజ్జ చేత్**
**తత్పరం పరమాభాసం సంపన్నం హేమ కాన్తిమత్.** 33

ప్రియుఁడవగు రామచంద్రా! అహంకారమను తామ్రమలముతోటి చిరకాల సంపర్కముచే జీవత్వము (తామ్రత్వము) నొందిన, అవ్యక్తమైన బ్రహ్మమను సువర్ణము శ్రవణాద్యుపాయములచే అహంకారమలమునుండి విడివడినచో, తిరిగి పరమప్రకాశమానమై కాంతివంతమైనట్టి సువర్ణము (బ్రహ్మము)గనే చెన్నొందును.

**యథా నిరభిధార్థశ్రీర్భజత్యవ్యపదేశ్యతామ్**
**తథా నహన్తా హన్తేయం బ్రహ్మత్వమధిగచ్ఛతి.** 34

సముద్రమందు లీనమైన సైంధవాది పదార్థముల శోభ, సైంధవాది నామములనువీడి అనిర్వచనీయమై, సముద్రరూపత్వము నొందునట్లు, బ్రహ్మమందు లీనమైన అహంత్వమున్ను అనహంత్వమున్ను, బ్రహ్మరూపత్వమునే పొందుచున్నవి.

**అస్త్యహన్త్వే స్థితం బ్రహ్మ సనామేవ పదార్థవత్**
**శాన్తవత్ప్రదివాభాసం తద్వత్స్వవ్యపదేశవాన్.** 35

సద్రూపమై, శాంతమై, ప్రకాశమయమైనట్టి బ్రహ్మము, అవ్యపదేశ్యము (నిర్దేశింపఁదగనిది)అయినను అహంత్వము మున్నగు అల్పపదార్థములకంటె అతిక్రమణమును జూపుటకొఱకై, ప్రవృత్తినిమిత్తము బృహత్వలక్షణాదులఁ దెల్పు (బ్రహ్మ)మున్నగు నామములచేఁ గల్పింపబడి నామయుక్తపదార్థములవలెనే వ్యవహరింపబడుచు అహంత్వమందు స్థితిగల్గియున్నది.

**అహమర్థో జగద్బీజం యది దగ్ధమభావనాత్**
**తదహన్త్వం జగద్బన్ధ ఇత్యాదేః కలనైవ కా.** 36

అభావనచే(భావనామూలమగు అజ్ఞాననాశముచే) జగత్తుయొక్క బీజమగు అహంపదార్థము నశింప, ఇక అహంత్వము, జగత్తు, బంధము, మున్నగువాని కల్పనయే యెట?

**సద్బ్రహ్మ శివమాత్మేతి పరే నామ కలఙ్కితా**
**ఉదేత్యహన్తా కుమ్భత్వాదివ మృద్ధాతువిస్మృతిః.** 37

పరిచ్ఛిన్నమగు ఘటాకారముచే మృత్తికయొక్క విస్మృతియుదయించునట్లు,సత్తు (త్రికాలాబాధ్యము) బ్రహ్మము (అపరిచ్ఛిన్నము) శివము (నిరతిశయానందమయము) ఆత్మ (అపరోక్షచిదేకరసము) ఈ మొదలగు స్వభావములతోఁగూడిన ఆత్మయందు, అజ్ఞానమువలన, ఆస్వభావముల సంకోచ

రూపముగు నామముచే కళంకితమైనదియు, తత్స్వభావచతుష్టయ రహితమైనదియునగు, 'అహంత్వము' ఉదయించుచున్నది.

అహమర్థాదియం బీజాత్సత్తా బిమ్బలతోత్థితా
యస్యాం జగన్త్యనన్తాని ఫలాన్యాయాన్తి యాన్తి చ. 38

ఈ 'అహం' పదార్థమను బీజమునుండి యీదృశ్యసత్తయను ప్రతిబింబితలత యావిర్భవించినది. దానియందనంతములైన జగద్రూపఫలము లుత్పన్నములై నశించుచున్నవి.

సాద్ర్యబ్ధ్యుర్వీ నదీ సేయం రూపాలోకేక్షణాదికా
అహమర్థస్య మరిచిబీజస్యాన్తశ్చమత్కృతిః. 39

ఈ అహంకారమను మరిచబీజ (మిరియ) మందు పర్వత సముద్ర పృథివీ నదీసహితమున్ను, రూపాదిబాహ్యేంద్రియ విషయయుక్తమున్ను, మనస్సహితమున్ను తన్మనోగోచరములగు కామసంకల్పాది వృత్తియుతమున్ను నగు చమత్కృతి యుదయించుచున్నది.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
ఇత్యామోదోఽహమర్థోగ్రకుసుమస్య వికాసినః. 40

అంతరిక్షము, పృథివి, వాయువు, ఆకాశము, పర్వతములు, నదులు, దిక్కులు, ఇవి యన్నియు అహంకారమను వికసిత పుష్పము యొక్క సుగంధములు.

అహమర్థః ప్రవిసృతః ప్రకటీ కురుతే జగత్
సద్రూపాలోకమననం ప్రవృత్త ఇవ వాసరః. 41

దివసము (పగలు) ప్రారంభమగుటతోడనే రూపాదుల ప్రకాశమును, మననమును గావించునట్లు, ఆత్మయందు అహంకార ముదయించుటతోడనే జగత్తును ప్రకటమొనర్చుచున్నది.

ప్రవృత్తేన దినేనార్థః ప్రకటీక్రియతే యథా
అసజ్జగదహన్త్వేన క్షణాన్నిర్మీయతే తథా. 42

దివసము ప్రారంభమగుటతోడనే పదార్థములు బ్రకటించినట్లు, అహంకారము భావనామాత్రముచే క్షణకాలములో ఈయసత్తగు జగత్తును నిర్మించుచున్నది.

అహమిత్యర్థదుస్తైలలవో బ్రహ్మణి వారిణి
ప్రసృతో యత్తదా శ్వేతత్రిజగచ్చక్రకం స్థితం. 43

బ్రహ్మమను జలమందు, అహంకారమను దుష్టతైల బిందువు పడుటతోడనే అది వెంటనే విస్తరించి ముల్లోకములకు శ్వేతచక్రాకారముగ స్థితి నొందుచున్నది.

ఉన్మేషమాత్రేణాహన్తా జగన్త్యనుభవత్యహో
న నిమేషేణ దృగివ సత్యానీత్యప్యసన్త్యలన్.  44

ఆహా! తెఱచియుండు దోషయుక్తమగు నేత్రము, అసత్యములైనను జగత్తులను సత్యములుగ ననుభవించునట్లు, రెప్పపాటుకాలములో ఈ అహంత్వము అనేకజగంబుల ననుభవించుచున్నది.

అహమర్థే ప్రవిస్మృతే సంసారో హ్యనుభూయతే
నాస్తమర్ఘ్యాయ పరిక్షీణే లోచనస్యేవ తారకే. 45

మాయఁబడకయు, క్షయింపకయునుండు (తెఱచియుండు) కనుగ్రుడ్లు పదార్థములఁ గాంచునట్లు అహంకారము విస్తరింప జగత్తు ననుభవించుచున్నది.

అహమంశే నిరంశత్వం నీతే శాశ్వతసంవిదా
శామ్యతీయమశేషేణ సంసారమృగతృష్ణికా. 46

నిరంతరపరమాత్మజ్ఞానముచే అహంకారము నిశ్శేషముగ నశింప, ఈసంసారమను మృగతృష్ణ (ఎండమావులు) పూర్ణముగ శమించిపోవుచున్నది.

స్వసంవిద్భావనా మాత్రసాధ్యేఽస్మి న్వరవస్తుని
సిద్ధమాత్రాత్మని స్వైరం మా ఖేదం గచ్ఛ మా భ్రమిమ్. 47

ఓ రామచంద్రా! స్వప్రకాశమగు చిన్మాత్రముయొక్క భావనామాత్రముచే సాధ్యమై, స్వతస్సిద్ధమైనట్టి ఆత్మయను శ్రేష్ఠవస్తువుయొక్క ప్రాప్తియందు ఖేదమునుకాని, (అహంభావనాది) భ్రమను గాని పొందకుము.

స్వయత్నమాత్ర సంసాధ్యాదసహాయాది సాధనాత్
అనహంవేదనాన్నాన్యచ్ఛ్రేయః పశ్యామి తేఽనఘ 48

పాపరహితుఁడవగు నో రామచంద్రా! ఇతర సహాయకములగు సాధనలులేకనే, స్వయత్న మాత్రముచే సులభసాధ్యమగు ఈ 'అనహం' (బ్రహ్మ)భావనకంటె అన్యముగ నీకు శ్రేయప్రదమైనదగు మఱిదేనినిగూడ నేను గాంచుటలేదు.

విస్మృత్యాహంత్వమాస్స్వ ప్రవిసృతవిభవః పూరితాశేషవిశ్వో
విష్వక్ శైలాన్తరిక్షక్షితిజలధిమరున్మార్గరూపోఽమలాత్మా
స్వస్థః శాన్తో విశోకః కరణమలకలావర్జితో నిష్ప్రపఞ్చో
నిఃసంచారశ్చరాత్మా సకలమసకిలం చేతి సిద్ధాన్తసారః. 49

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అహన్తానిరాసో నామ
చతుర్థః సర్గః ॥ 4 ॥

ఓ రామచంద్రా! నీవు ప్రథమమున వ్యష్ట్యహంభావమును మఱచి, నలువైపుల విస్తరించియున్న పర్వత, అంతరిక్ష, పృథివీ, సముద్ర, వాయువులస్వరూపమును, వానిమార్గమగు ఆకాశముయొక్క స్వరూపమునుబొంది ఇవ్విధమున విశ్వమంతటిని పరిపూరితమొనర్చి, వ్యాపించిన విభవముగలవాఁడవై, సమష్టిభావముతోటియుండుము. పిదప, 'చరాచరజగంబంతయు నిష్ప్రపంచరూపమగు బ్రహ్మమే' అని యిట్లుప్రపంచమును నిషేధముగావింి, స్వస్థుఁడవై, శాంతుఁడవై, దుఃఖరహితుఁడవై, కరణముల (ఇంద్రియ, మానసాదుల) మలములుగాని, కళలుగాని లేనివాఁడవై, నిర్మలాత్ముఁడవై వెల

యును. ఏలయనగా, అధ్యారోప, అపవాదములచే శోషించు నిష్ప్రపంచమైనట్టి శుద్ధాత్మయే సర్వవేదాంత సిద్ధాంతసారమై యున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున
అహంతానిరాసమను నాల్గవ సర్గము ॥ 4 ॥

---

## పఞ్చమః సర్గః

[శాస్త్రం జితేంద్రియేష్వేవ సఫలం నేతరేష్వితి
వసిష్ఠేన భుశుణ్డోక్తా విద్యాధరకథోచ్యతే.

జితేంద్రియులయందే వేదాంతాదిశాస్త్రముల యధ్యయనము సఫలమగును గాని అజితేంద్రియులందు గాదను నివ్విషయముగూర్చి భుశుండునిచే వచింపఁబడిన విద్యాధరకథను వసిష్ఠమునీంద్రుఁడు శ్రీరామచంద్రునకు వర్ణించి చెప్పుట యిటఁ గాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

స్వభావం స్వం విజిత్యాదావిన్ద్రియాణాం సచేతసాం
ప్రవర్తతే వివేకే యః సర్వం తస్యాశు సిద్ధ్యతి. 1

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! విషయములపై పురుఁ బరువిడునట్టి తనయొక్క మనస్సహితమగు సమస్తేంద్రియముల స్వభావమును మొట్టమొదట జయించి, ఆపిమ్మట వివేకాదిసాధనములందుఁ బ్రవర్తించువానికి సర్వమున్ను శీఘ్రముగ సిద్ధించుచున్నది.

స్వభావమాత్రం యేనాన్తర్న జితం దగ్ధబుద్ధినా
తస్యోత్తమపదప్రాప్తిః సికతాతైలదుర్లభా. 2

నష్టబుద్ధియగు నెవఁడు మొదట తనస్వభావమాత్రమును అంతఃకరణమున జయింపకుండునో, అతనికి నిసుకయందుఁ దైలమువలె నుత్తమమగు ఆత్మపదప్రాప్తి దుర్లభమే యగును.

శుద్ధేఽల్పోఽప్యుపదేశో హి నిర్మలే తైలబిన్దువత్
లగత్యత్తానచిత్తేషు నాదర్శ ఇవ మౌక్తికమ్. 3

శుద్ధచిత్తునియందు అల్పోపదేశమైనను, నిర్మలవస్త్రాదులందు తైలబిందువువలె శీఘ్రముగఁ బ్రవేశించును. త్రిప్పిపెట్టిన యద్దమందు ముత్యములు ప్రతిబింబించనట్లు, సాధనచతుష్టయము లేని చిత్తముగలవారియందు దాయుపదేశము ప్రవేశింపదు.

అత్రైవోదాహరన్తీమమితిహాసం పురాతనం
మమ పూర్వం భుశుణ్డేన కథితం మేరుమూర్ధని. 4

ఇవ్విషయమున, పూర్వము మేరుపర్వతశిఖరముపై భుశుండునిచే నాకుఁ జెప్పఁబడిన యొక పురాతనమైన కథ నుదాహరించుచున్నాను, వినుము,

పురా భుశుణ్డః కస్మింశ్చిత్పృష్ట ఆసీత్కథాన్తరే
మయా కదాచిదేకాన్తే మేరోః శిఖరకోటరే. 5

పూర్వము మేరుపర్వత శిఖరముయొక్క యొకానొక గుహాయందేకాంతస్థానమున విరాజమానుఁడై యున్న భుశుండుని, అధ్యాత్మకథాప్రసంగమున నే నిట్లడిగితిని —

ముగ్ధబుద్ధిమనాత్మజ్ఞం కం త్వం సుచిరజీవితం
స్మరసీతి మయా పృష్టేనోక్తం తేనేదమఙ్గ మే. 6

'ప్రియుఁడా! ముగ్ధబుద్ధియు (ఇంద్రియజయములేనివాఁడును), ఆత్మజ్ఞానరహితుఁడును, దీర్ఘకాలము జీవించినవాఁడునగు నే ప్రాణిని నీవు స్మరించుచున్నావు?' నే నిట్లడుగ నంతనాతఁడిట్లు వచించె.

భుశుణ్డ ఉవాచ:—

ఆసీద్విద్యాధరః పూర్వమనాత్మజ్ఞః సుఖేదితః
లోకాలోకాన్తరశృఙ్గే శుష్క ఆర్యో విచారవాన్. 7

**భుశుండుఁడు:**—మహాత్మా! పూర్వము లోకాలోకాంతర పర్వత శిఖరముపై, ఆత్మజ్ఞానములేనివాఁడును, జయింపఁబడని యింద్రియములచే మిగుల ఖేదమొందువాఁడును, తపస్సు మున్నగువానిచే శుష్కించినవాఁడును, సదాచారసంపన్నుఁడును, విచారవంతుఁడునగు విద్యాధరుఁడొకఁడు గలఁడు.

తపసా బహురూపేణ యమేన నియమేన చ
అక్షీణాయురతిష్ఠత్స పురా కల్పచతుష్టయమ్. 8

అనేకవిధములగు తపస్సుచేతను, యమ, నియమములచేతను క్షయింపని యాయువుగలవాఁడై పూర్వము నాలుగుకల్పములవఱ కాతఁడుండియుండెను.

తతశ్చతుర్థే కల్పాన్తే వివేకస్తస్య చోదభూత్
విదూరస్యేవ వైదూర్యమాచిత్యాజ్జలదోదయాత్. 9

తదుపరి నాల్గవకల్పముయొక్క చివర, మేఘోదయముచే విదూరమను భూమియందు వైదూర్యమణి యుద్భవించునట్లు, చిరకాలతపస్సుచే నాతనికి వివేకము జనించెను.

పునర్మృతిః పునర్జన్మ జరా మేతి విభావయన్
లజ్జేఽహం తత్కిమేకం స్యాత్స్థిరమిత్యవమృశ్య సః. 10

'మఱలమరల జన్మము, మరలమరల మృత్యువు, మరలమరల వార్ధక్యము జీవునకుఁ గలుగుచున్నవి. దీనిని విచారించుచు నేను లజ్జితుఁడనగుచున్నాను. కావున నెచటనిదియుండదో, అటువంటి స్థిరవస్తువొకటి యేదియైయుండును? — అని యిట్లాతఁడు విచారణయొనర్చెను,

మామాజగామ సంప్రష్టుమష్టాదశమయీం పురీం
స్వాముపోహ్య విరక్తాత్మా సంసారారసతాం గతః. 11

పంచప్రాణ, దశేంద్రియ, మనో, బుద్ధి, స్థూలదేహంబులను బదునెనిమిది అవయవములతో గూడిన తినపురమును (ఉపాధిని) చిరకాలమువఱకు ధరించుటచే మిగుల శ్రాంతుఁడై, సంసారము యెడల విరక్తిగల్గి, (తారణోపాయమునుగూర్చి) నన్నడుగుటకై యాతఁడు నాచెంతకు వచ్చెను.

స మత్సమీపమాగత్య కృతోదారనమస్కృతిః
మత్పూజితోఽవసరత ఉవాచేదమనిన్దితమ్. 12

అట్లు నావద్దకువచ్చి, ఆదరముతోఁటి నమస్కరించెను. నేనున్ను నాతని నుచితరీతి సత్కరింప నంత ప్రశ్నావసరమును బొంది యాతఁడీయుత్తమవాక్యములఁ బల్కెను —

విద్యాధర ఉవాచ:—

మృదూని పరితాప్తీని దృఢద్ఘ్రఢబలాని చ
ఛేదే భేదే చ దక్షాణి స్వశస్త్రాణీన్ద్రియాణి చ. 13

విద్యాధరుఁడు:—మహాత్మా! విషయములందు శీఘ్రముగఁ బ్రవేశించుటచేఁ గోమలములును తదుపరి సంతానమును గలుగఁజేయునవియు, తమవిషయములనుండి తొలఁగనందుచే నతిదృఢములును, ఛేదన, భేదనములందు నిపుణులునునగు నిజేంద్రియములకును, శస్త్రములకును భేదమేమియును లేదు.

పర్యాకులాని మలినాని విపత్ప్రదాని
దుఃఖోర్మిమన్తి గుణకానన పావకత్వాత్
హార్దాన్ధకారగహనాని తమోమయాని
జిత్వేన్ద్రియాణి సుఖమేతి చ కిం మమూఢైః. 14

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే విద్యాధరప్రశ్నో నామ పఞ్చమః సర్గః ॥ 5 ॥

మహాశయా! ఈ యింద్రియములు హృదయమందు రూఢినొందిన అంధకారయుతములైన యరణ్యములవంటివై, తమోమయములై, కామాదిమర్కటములచే వ్యాకులములై, విపత్తినిగలుగఁజేయునవై, పదార్థములను దుఃఖరూపతరంగములచేఁ బూర్ణములై, మలినములై, గుణములను వనమును దగ్ధమొనర్చున వగుటచే దాహప్రదములైయున్నవి. వీనిని జయించుటచేతనే మనుజుఁడు సుఖవంతుఁడు కాఁగలఁడు. కావున, ఈవిద్యాధరభోగములచే నాకేమి ప్రయోజనము? (అనగా, వానియెడల విరక్తుఁడనై యుపదేశముకొఱకుఁ దమ్ముల శరణుబొందుటకై యేతెంచితినని భావము)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున విద్యాధరప్రశ్నయను నైదవ సర్గము ॥5॥

## షష్ఠః సర్గః.

[దివ్యభోగప్రసక్తేన చిరం స్వేన పరీక్షితాః
ఇహ విద్యాధరేణోక్తా విషయేన్ద్రియదుర్జయాః.

దివ్యభోగములం దాసక్తములును, చిరకాలమువఱకుఁ బరీక్షింపఁబడినవియునగు ఇంద్రియములయొక్కయు, విషయములయొక్కయు దుష్టత్వమును విద్యాధరుఁడు వర్ణించుట యిటఁ గాననగును]

విద్యాధర ఉవాచ:—

యదుదారమనాయాసం క్షయాతిశయవర్జితమ్.
పదం పావనమాద్యన్తరహితం తద్వదాశు మే. 1

విద్యాధరుఁడు:— మహాత్మా! సర్వదుఃఖరహితమై, సహజానందరూపమై, క్షయాతిశయవర్జితమై, ఆద్యంతరహితమైనట్టి పరమపావనమైన పదమేదిగలదో, అద్దానిని నాకు శీఘ్రముగ వచింపుము.

ఏతావన్తమహం కాలం సుప్త ఆసం జడాత్మకః
ఇదానీం సంప్రబుద్ధోఽస్మి ప్రసాదాదాత్మనో మునే. 2

ఓ మునీంద్రా! ఇంతకాలమువఱకు నేను జడాత్మకుఁడనై నిద్రించుచుంటిని. ఇపుడు మనస్సుయొక్క తీవ్రవైరాగ్యమను ప్రసన్నత్వముచే జాగృతుఁడనైతి.

మనో మహామయోత్తప్తం క్షుబ్ధమజ్ఞానవృత్తిషు
మాముద్ధర దురన్తేహం మోహాదహమితి స్థితాత్. 3

మహాత్మా! మనస్సుయొక్క మహారోగరూపమైన కామముచే సంతప్తుఁడనై, అజ్ఞానవృత్తులందు క్షోభనొందుచు, దుశ్ఛేద్యమైన కర్మతోఁ గూడుకొనియున్నట్టినన్ను, అనాత్మయం దాత్మాభిమానము కలుఁగజేయునదైన మోహము (అజ్ఞానము) నుండి యుద్ధరింపవేడెద.

శ్రీమత్యపి పదన్త్యాశు స్థాతనాః కాతరాదయః
గుణవత్యగ్రపత్రేఽపి తుహినానీవ పఙ్కజే. 4

లక్ష్మికి ఆధారమున్ను, గుణవతి (కమలసూత్రముతోఁగూడియున్నది)యు, గొప్పపత్రములు గలదియునైనను కమలముపై మంచుబిందువులు పడునట్లు, అనేక ఐశ్వర్యములతోఁ గూడియున్నవారును, గుణవంతులునైయున్నను, అజితేంద్రియత్వకారణమునను, ఆత్మజ్ఞానరాహిత్యమువలనను, విద్యాధరులపై కామ, క్రోధాది దుఃఖబాధలున్ను, భయ, కార్పణ్యాది దోషములున్ను వచ్చిపడుచున్నవి.

జాయన్తే చ మ్రియన్తే చ కేవలం జీర్ణజన్తవః
న ధర్మాయ న మోక్షాయ మశకా ఇవ పఙ్కజే. 5

జ్ఞానాభావముచే, కేవలము శిథిలీభూతులైన విద్యాధరాది దేవయోనులున్ను కమలమునందలి దోమలవలెఁ బుట్టుచు చచ్చుచున్నారు. మఱియు, విషయలంపటులగుటచే వారు ధర్మముకొఱకుగాని మోక్షముకొఱకుగాని ప్రయత్నించుటలేదు.

భావైస్తైరేవ తైరేవ తుచ్ఛాలమ్బ విడమ్బనైః
చిరేణపరిఖిన్నాః స్మో విప్రలమ్భాః పునః పునః. 6

తుచ్ఛమైన యల్పసుఖము నొసంగునవియు, పూర్వమనేక పర్యాయములనుభవింపఁబడినవియునగు ఆయాశబ్దాది విషయములచే, విషయేంద్రియ స్పర్శములను వంచనోపాయములద్వారా మరల మరల వంచింపఁబడినవారమై చిరకాలము మేము మిగుల ఖిన్నులమైయున్నాము.

నాన్తోస్త్యస్య న చ స్థైర్యావస్థా విశ్రాన్తమానసమ్
భ్రమన్తో భోగభఙ్గేషు మరు భూమిష్వివాధ్వనః. 7

మనస్సునకు విశ్రాంతి లేక, మరుభూములందువలె క్షణభంగురమైన భోగములందుఁ జరించుచున్న, నాకీ సంసారమార్గముయొక్క అంతముగాని, స్థిరత్వముగాని లేకయున్నది.

ఆపాతమధురారమ్భా భఙ్గురా భవహేతవః
అచిరేణ వికారిణ్యో భీషణా భోగభూమయః. 8

సంసార దుఃఖమునకు హేతువులైన యీభోగస్థితు లారంభమున క్షణకాలము మాత్రమే రమణీయముగఁ దోచునవియు, క్షణభంగురములును, శీఘ్రముగనే వికారయుక్తములగునవియు, భయంకరములు నైయున్నవి.

మానావమానపరయా దురహంకారకాన్తయా
నరేమే వామయా తాత హతవిద్యాధరశ్రియా. 9

ఓ మునీంద్రా! మానావమానతత్పరయు, దుష్టమగు అహంకారముగలవారికి ప్రియమైనదియు వివేకులకుఁ బ్రతికూలమైనదియునగు విద్యాధరసంపదయను కాంతతోటి నేను రమింపను.

దృష్టాశ్చైత్రరథోద్యాన భువః కుసుమకోమలాః
కల్పవృక్షలతా దత్తసమస్త విభవశ్రియః 10

పుష్పములచేఁ గోమలమైనట్టి నందనవనభూములను నేను గాంచితిని. కల్పవృక్షలతలచే నొసంగఁబడిన యైశ్వర్యము లన్నింటిని బొందితిని.

విహృతం మేరుకుఞ్జేషు విద్యాధరపురేషు చ
విమానవరమాలాసు వాతస్కన్ధస్థలీషు చ. 11

మహాత్మా! మేరుపర్వత కుంజములందును, విద్యాధరుల నగరములందును, శ్రేష్ఠములైన విమానములయొక్క మాలలందును, ఉత్తమవాయువుతోఁగూడిన స్థలములందును, నేను బాగుగ విహరించియుంటిని.

విశ్రాన్తం సురసేనాసు కాన్తాభుజలతాసు చ
హారిహారవిలాసాసు లోకపాలపురీషు చ 12

దేవతల సైన్యములందును, విలాసముచే మనస్సును హరించునట్టి స్త్రీల భుజాలతలయందును, లోకపాలుర పురములందును నేను చిరకాలము విశ్రమించితిని.

న కించిదుచితం సాధు సర్వమాధి విషోష్మణా
దగ్ధం భస్మాయతే తాత విజ్ఞాతమధునా మయా. 13

మహాశయా! కాని, ఇంకేదియు యోగ్యమైనదియు, సుఖదాయకమైనదియు లేదని యిపుడు నే నెఱిఁగితిని. మఱియు నవియన్నియు మానసిక వ్యథలను విషముయొక్క యుష్ణత్వముచే దగ్ధమై భస్మమువలె నిపుడు నాకుఁ గానుపించుచున్నవి.

రూపాలోకనలోలేన వనితానన గృధ్నునా
నావభాసేన దోషాయ దుఃఖం నీతోస్మి చక్షుషా. 14

రూపగ్రహణమునఁ జంచలములైనవియు, స్త్రీల ముఖములఁ గాంచుటయందు మిగుల యభిలాషగలవియు, ప్రకాశయుక్తములు నగు యీ నేత్రములచే (స్వవిషయసంగ కారణమున) దుంఖమునే పొందితిని.

ఇదం గుణావహం నేదమితి ముక్త్వా వికల్పనమ్
రూపమాత్రానుసారిత్వాదవస్తున్యపి ధావతి. 15

వనితాదులందు వస్త్రాభరణములే శోభాదాయకములు గాని రక్తమాంసాదులు కావు—అను నివ్విధముగ వస్తువులందు 'ఇది గుణావహమైనది, ఇది కాదను' ఈవివేకము లేకయే కేవలము రూపమాత్రము వెంట తుచ్ఛవస్తువునుగూర్చి యీ నేత్రము బరువిడుచున్నది.

తావదాయాతి విరతిం న వశం యావదాపదామ్
నానా బన్ధపరం చేతః పరానర్థేహితోన్ముఖమ్. 16

నానావిధములగు బంధనాదుల గలుగఁజేయు కర్మలందుఁ దత్పరమై, మరణాది మహా అనర్థముల గలిగించు దుర్వ్యాపనములం దాసక్తమై చిత్తమెంతవఱకు నరకాద్యాపదల వశమును బొందుచుండునో, అంతవఱకది విరతి (ఉపరతి) ని బొందనేరదు.

ఘ్రాణమేతదనర్థాయ ధావచ్చైవాభితః స్ఫుటమ్
న నివారయితుం తాత శక్నోమి హా హయం యథా. 17

ఓ మునీంద్రా! నలువైపుల ప్రత్యక్షముగ అనర్థముల కొఱకుఁ బరువిడుచున్న యీ ఘ్రాణేంద్రియమును, దుష్టాశ్వమునువలె నేనిట నివారింపజాలకున్నాను.

గన్ధోదక ప్రణాలేన ముఖశ్వాసానుపాతినా
వైరిణేవాతిదోషేణ ఘ్రాణేనాస్మి నియోజితః. 18

ఒకానొకఁడు గొప్పదోష కారణమున శత్రువుచే బలవంతముగ వశీకరింపఁ బడినవాఁడై దుర్గంధయుక్తమైన స్థానమున నియోగింపఁబడువిధమున, నేనున్ను శ్లేష్మాది దుర్గంధోదకముతోఁ గూడినదై, ముఖశ్వాసాది యుక్తమైనట్టి ప్రణాళికారూపమైన ఘ్రాణేంద్రియముచే నద్దానిబలమున నియోగింపఁబడుచున్నాను.

చిరం రసనయా చాహమనయా నయహీనయా
గజగోమాయుగుప్తేషు దుఃఖాద్రిష్వలమాహతః. 19

భక్ష్యాభక్ష్యముల గూర్చిన విచారణలేనట్టి యీ జిహ్వేంద్రియముచేతను, గజ, శృగాలము (నక్క) లచే రక్షింపబడునవై, క్రిమికీటకపశ్వాదియోనిరూపములైనట్టి దుఃఖరూప పర్వతములపై నేను విసరివేయఁబడుచున్నాను.

నిరోద్ధుం న చ శక్నోమి స్పర్శలమ్పటతాం త్వచః
గ్రీష్మకాలసమిద్ధస్య తాపమంశుమతో యథా. 20

గ్రీష్మకాలమందలి ప్రదీప్తుఁడగు సూర్యుని తాపమును నిరోధింపఁజాలనట్లు, త్వగింద్రియము యొక్క స్పర్శలోలత్వమును నేను నిరోధింపఁజాలకున్నాను.

శుభశబ్దరసార్థిన్యో మనేః శ్రవణశక్తయః
మాం యోజయన్తి విషమే తృణేచ్ఛా హరిణం యథా. 21

సుఖదాయకమైన శబ్దరసము యొక్క యాస్వాదనమున ననురాగము గలిగియున్న శ్రవణశక్తులు, కోమలతృణము నభిలషించు హరిణమునువలె నన్ను భయంకర స్థానమున నియోగించుచున్నవి.

ప్రణతాః ప్రియకారిణ్యః ప్రహ్వాభృత్యసమీరితాః
వాద్యగేయరవోన్మిశ్రాః శుభశబ్దశ్రియః శ్రుతాః. 22

ప్రియము నొనర్చువారును వందనమాచరించువారును, వినమ్రులునగు భృత్యాదులచే నుచ్చరింపఁబడిన వాద్య, గానశబ్దములచే మిళితములైన యనేకశుభశబ్దముల వైభవమును నేను వినియున్నాను.

శ్రియః స్త్రియో దిశశ్చైవ తటాశ్చామ్బోధిభూభృతామ్
దృష్టా విభవహారిణ్యః ప్రక్వణన్మణిభూషణాః. 23

శబ్దవంతములైన మణులయొక్క యాభరణములను ధరించువారును, తమ యైశ్వర్యములచే మనస్సున్ను హరించువారునునగు అనేక స్త్రీలను, విభవములను, దిక్కులను, సముద్ర, పర్వతాదుల తీరములను నేను గాంచితిని.

చిరమాస్వాదితాః స్వాదు చమత్కారమనోరమాః
ప్రహ్వాకాన్తా జనానీతాః షడ్రసాగుణశాలినః 24

తమరుచియొక్క చమత్కారముచే మనోరమమైనవియు, వినమ్రులగు స్త్రీలచేఁ గొనిరాఁబడినవియు, షడ్రసముల మేళన, పాకచాతుర్యరూప గుణములచే శోభాయమానములు నగు పదార్థములను జిరకాలము నేనాస్వాదించితిని.

కౌశేయకామినీహారకుసుమాస్తరణానిలాః
నిర్విఘ్నమభితః స్పృష్టా భృశమాభోగభూమిషు. 25

పట్టువస్త్రములను, స్త్రీలను, హారములను, పుష్పశయ్యలను, సుగంధ శీతలమంద వాయువులను, భోగస్థితులందు నేను బూర్ణముగ నిర్విఘ్నతా పూర్వకముగ స్పృశించితిని.

వధూముఖౌషధీపుష్పసమాలమ్భన భూమయః
అనుభూతా మునే గన్ధా మన్దానిలసమీరితాః. 26

ఓ మునీంద్రా! ఉత్తమస్త్రీల ముఖములను, చందనాద్యోషధులను, పుష్పములను, కస్తూరీ కర్పూరాదుల లేపనస్థితులను, మందవాయువుచేఁ గొనిరాఁబడిన యనేక సుగంధములను నే ననుభవించితిని.

శ్రుతం స్పృష్టం తథా దృష్టం భుక్తం ఘ్రాతం పునః పునః
సంశుష్కవిరసం భూయః కిం భజామి వదాశు మే. 27

మహాత్మా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయములను నేను మరల మరల వింటిని, స్పృశించితిని, కాంచితిని, భుజించితిని, మూర్కొంటిని. కాని యవియన్నియు నిపుడుమిగుల శుష్కప్రాయములుగను, రసహీనములుగను గన్పట్టుచున్నవి. కావున తిరిగి నేనిపుడు దేనిని సేవింపవలెనో శీఘ్రముగ వచింపవేడెద.

భుక్త్వా వర్షసహస్రాణి దుర్భోగపటలీమిమామ్
ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం న తృప్తిరుపజాయతే. 28

బ్రహ్మాదిస్తంబ (తృణ) పర్యంతముగల యీ దుష్టమైన భోగసమూహమంతటిని వేలకొలది వత్సరము లనుభవించినను తృప్తికలుగదు.

సామ్రాజ్యం సుచిరం కృత్వా తథా భుక్త్వా వధూగణమ్
భంక్త్వా పరబలాన్యుచ్చైః కిమపూర్వమవాప్యతే. 29

మహాత్మా! ఉత్తమ చక్రవర్తియొక్క రాజ్యమును చిరకాలమేలి, అనేక లలనాగణంబుల ననుభవించి, శత్రుబలంబులఁ బూర్ణముగఁ దనుమాడినను ఈ జీవుఁ డపూర్వమగు పదార్థమును దేనిని బొందుచున్నాఁడు?

యేషాం వినాశనం నాసీద్యైర్భుక్తం భువనత్రయమ్
తేఽపి శేఽప్యచిరేణైవ సమం భస్మపదం గతాః. 30

ఎవరికి (హిరణ్యకసిపుఁడు మున్నగువారికి) వినాశములేదో, ముల్లోకముల నెవ రనుభవించిరో ఆట్టివారుకూడ శీఘ్రముగనే భస్మపదమును బొందిరి.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్యమవశిష్యతే
తత్ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్కష్టయాపి హి చేష్టయా. 31

దేనిని బొందినచో మరలంపొందఁదగినదేదియు మిగిలియుండదో, అద్దానిప్రాప్తికొఱకే కష్టాచరణముచేనైనను బ్రయత్నింపవలెను.

యేన కాన్తాశ్చిరం భుక్తా భోగాస్తస్యేహ జన్తుభిః
దృష్టో న కస్యచిన్మూర్ధ్ని తరుర్వ్యోమప్లవశ్చ వా. 32

ఎవఁడు చిరకాలము పలితాగణంబును, తదితరములగు అనేక విషయభోగములను ననుభవించెనో, అట్టివాని శిరస్సుపై కల్పవృక్షమును గాని విమానమును గాని యెవరును గాంచలేదు.

చిరమాశు దురన్తాసు విషయారణ్యరాజిషు
ఇన్ద్రియైర్విప్రలబ్ధోఽస్మి ధూర్తైర్బాల ఇవార్భకైః. 33

దురంతములైన విషయములను మహారణ్యసమూహములందు, ధూర్తబాలకులచే సాధుబాలకునివలె నేను చిరకాలము వంచింపఁబడితిని.

అద్య త్వేతే పరిజ్ఞాతా మయా స్వవిషయారయః
కష్టా ఇన్ద్రియనామానో వఞ్చయిత్వా తు మాం పునః. 34
సంసారజఙ్గలే శూన్యే దగ్ధం నరమృగం శఠాః
ఆశ్వాస్యాశ్వాస్య నిఘ్నన్తి విషయేన్ద్రియలుబ్ధకాః. 35

శబ్దాదివిషయరూపములగు పంచభూతములనే మనస్సునుండి బయటకు లాగి తమతమ భోగార్థము శ్రోత్రాదీంద్రియరూపములచే స్థితినొందియున్నవియు, కష్టప్రదములునగు నా విషయములను శత్రువులను నేఁడు నేనెఱిఁగితిని. ఈ విషయములను శఠులగు బోయవారు శూన్యమైన యీ సంసారారణ్యమున హీనుఁడైన మనుజరూపమృగమగు నన్ను మోసగించి మోసగించి చంపుచున్నారు.

విషమాశీవిషైరేభిర్విషయేన్ద్రియపన్నగైః
యేన దగ్ధా న దృష్టాస్తే ద్విత్రా ఏవ జగత్యపి. 36

ఈ భయంకరమైన విషయేంద్రియ సర్పముల దృష్టివిషయములచే గాంచఁబడనివారును, దగ్ధముకానివారునునగు జనులు ఈ ప్రపంచమందంతట నేయిద్దఱో, ముగ్గురో యుందురు.

భోగభూమేభివలితాం తృష్ణాతరలవాగురామ్
లోభోగ్రకరవాలాఢ్యాం కోపకున్తకులాఙ్కితామ్. 37
ద్వన్ద్వజాలరథవ్యాప్తామహంకారానుపాలితామ్
చేష్టాతురంగమాకీర్ణాం కామకోలాహలాకులామ్. 38
శరీరసీమాన్తగతాం దురిన్ద్రియపతాకినీమ్
యే జేతుముత్థితాస్తాత త ఏవేహ హి సద్భటాః. 39

ఓ మునీంద్రా! భోగములను భయంకరములైన యేనుగులచేఁ జుట్టఁబడినదియు, తృష్ణయను జంచలమైన పాశముగలదియు, లోభమను తీక్ష్ణఖడ్గములచేఁ బూర్ణమును, క్రోధమను నీఁటెల సమూహముచేఁ జిహ్నితమైనదియు, శీతోష్ణాది ద్వంద్వంజాలమను రథములచే వ్యాప్తమును, అహంకారమను సేనాపతిచేఁ బాలితమును, చేష్టలనుఁ జంచలములైన యశ్వములచే బూర్ణమును, కామమను కోలాహలముతోఁ గూడినదియు, శరీరమను నగరముయొక్క యెల్ల నాక్రమించినదియు, దుష్టములైన యింద్రియములను పతాకములచే నొప్పునదియునగు సేనను జయించుటకెవఁడు సన్నద్ధుఁడగునో, అతఁడే యీప్రపంచమున నుత్తమవీరుఁడగును.

సుసాధ్యః కరటోద్భేదో మత్తైరావణదన్తినః
నోత్పథప్రతిపన్నానాం స్వేన్ద్రియాణాం వినిగ్రహః. 40

మదించిన 'ఐరావత'మను యేనుఁగుయొక్క గండస్థలమును జీల్చుటయు సులభమేకాని, కుమార్గమునఁబ్రవృత్తములగు తనయింద్రియములను నిగ్రహించుటమాత్రము సులభముకాదు.

పౌరుషస్య మహత్త్వస్య సత్యస్య మహతః శ్రియః
ఇన్ద్రియాక్రమణం సాధో సీమాన్తో మహతామపి. 41

ఓ సాధూ! తత్త్వవేత్తలకుఁగూడ, పౌరుషముయొక్కయు, మహత్త్వముయొక్కయు, మహాధైర్యముయొక్కయు, విశ్రాంతిసంపదయొక్కయు సీమాంతము (మేర) యింద్రియనిగ్రహమే యై యున్నది.

తావదుత్తమతామేతి పుమానపి దివౌకసామ్
కృపణైరిన్ద్రియైర్యావత్తృణవన్నాపకృష్యతే. 42

కుత్సితములైన యింద్రియములచేఁ దృణమువలె నీడ్వఁబడనంతవఱకు మనుజుఁడు దేవతలకును మాన్యుఁడగును.

జితేన్ద్రియా మహాసత్త్వా యే త ఏవ నరా భువి
శేషానహమిమాన్మన్యే మాంసయన్త్రగణాంశ్చలాన్. 43

జితేంద్రియులగు మహాత్ములే యీ ప్రపంచమున మనుష్యులనఁ దగుదురు. తక్కిన వారిని (అజితేంద్రియులను) చలించుచున్న మాంసయంత్రములుగనే నేనుదలంచుచున్నాను.

మనః సేనాపతేః సేనామిమామిన్ద్రియ పఞ్చకమ్
జేతుం చేదస్తి మే యత్నో జయామి తదలం మునే. 44

ఓ మునీశ్వరా! పంచేంద్రియములను చైతన్యమునకు సేనాపతియైనట్టి మనస్సును జయించుట కేదేని యుపాయమున్నచో నిఁక ఆ సైన్యమును బూర్ణముగ జయింపఁగలను.

ఇన్ద్రియోత్తమరోగాణాం భోగాశావర్జనాదృతే
నౌషధాని న తీర్థాని న చ మన్త్రాశ్చ శాన్తయే. 45

ఇంద్రియములను భయంకరరోగములయొక్క శమనమునకై భోగములఁగూర్చినయాశను త్యజించుటతప్ప వేఱు ఔషధములుగాని, తీర్థములుగాని, మంత్రములుగాని లేవని నేను నిశ్చయించితిని.

నీతోఽస్మి పరమం ఖేదమభిధావద్భిరిన్ద్రియైః
ఏక ఏవ మహారణ్యే తస్కరైః పథికో యథా. 46

మహారణ్యమున నొంటరిగానున్న బాటసారి చోరులవలన ఖేదమొందునట్లు నలువైపులఁ బరువిడు యీ యింద్రియములచే నేను మిగులఖేదమొందుచున్నాను.

పఙ్కవన్త్యప్రసన్నాని మహాదౌర్భాగ్యవన్తి చ
గన్ధశైవలతుచ్ఛాని పల్వలానీన్ద్రియాణి చ. 47

బురదతోఁగూడి మలినములై, మహాదౌర్భాగ్యయుతములై, దుర్గంధముతోను నాచుతోను గూడి తుచ్ఛములైనట్టి అల్పజలాశయము (మడుఁగు)లున్ను, ఇంద్రియములున్ను సమానములు.

దురతిక్రమణీయాని నీహారగహనాని చ
జనితాతఙ్కజాలాని జఙ్గలానీన్ద్రియాణి చ. 48

దాటుటకు కష్టసాధ్యములును, మంచుచే దట్టమైనవియు, భయమును గొల్పునవియునగు యరణ్యములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

పఙ్కజాని సరన్ధ్రాణి సుదుర్లక్ష్యగుణాని చ
గ్రన్థిమన్తి జడాఙ్గాని మృణాలానీన్ద్రియాణి చ. 49

బురదయందుఁ బుట్టునవియు, రంధ్రముతోఁగూడినవియు, మిగుల దుర్లక్ష్యమగు తంతువులు (వాసనలు) గలదియు, గ్రంథియుక్తములును, జడమైన అవయవములతోఁ గూడినవియునగు తామర తూండ్లును, యింద్రియములును సమానములు.

రూక్షాణి రత్నలుబ్ధాని కల్లోలవలితాని చ
దుర్గ్రహగ్రాహఘోరాణి క్షారామ్బూనీన్ద్రియాణి చ. 50

నిష్ఠురములును, రత్నలోభులును, తరంగ (షడూర్మి)యుక్తములును, గ్రహించుటకుఁ గష్టసాధ్యమైనట్టి మొసళ్లతోఁగూడి భయంకరమైనవియునగు సముద్రపు క్షారోదకములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

బాన్ధవోద్వేగదాయీని దేహాన్తరకరాణి చ
కరుణాక్రన్దకారీణి మరణానీన్ద్రియాణి చ. 51

బంధువులకు భయమును గొల్పునదియు, మఱియొక దేహమును బొందించునదియు, కరుణచే రోదనము గల్పింపజేయునదియునగు మరణమున్ను, ఇంద్రియములున్ను సమానములు.

అవివేకిష్వమిత్రాణి మిత్రాణి చ వివేకిషు
గహనాన్తరశూన్యాని కాననానీన్ద్రియాణి చ. 52

అవివేకులకు శత్రువులున్ను, వివేకులకు మిత్రులున్ను నైనవియు, దట్టములును, అనంతములును, జనశూన్యములునగు యరణ్యములున్ను ఇంద్రియములున్ను సమానులు.

ఘనాస్ఫోటాన్యసారాణి మలినాని జడాని చ
విద్యుత్ప్రకాశాస్యైతాని భీమాభ్రాణీన్ద్రియాణి చ. 53

గొప్పశబ్దముతోఁగూడినవియు, అసారములును, మలినములును, జడములును మెఱుపు యొక్క ప్రకాశమువలె క్షణకాలము సుఖముగను గలిగించునవియు, భయంకరములునగు మేఘములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

క్షుద్రప్రాణిగృహీతాని వర్జితాని కృతాత్మభిః
రజస్తమోభిభూతాని స్వేన్ద్రియాణ్యవటాని చ. 54

తుచ్ఛసుఖమందాసక్తిగల ప్రాణులచే గ్రహింపఁబడునవియు, మహాత్ములచే వర్జింపఁబడునవియు, రజస్తమోగుణంబులచే వ్యాప్తములునగు యింద్రియములున్ను, మురికిగుంటలున్ను సమానములు.

పాతన్తే కాన్తదక్షాణి దోషాశీవిషవన్తి చ
రూక్షకణ్టకలక్షాణి శ్వభ్రాగ్రాణీన్ద్రియాణి చ. 55

క్రిందఁబడఁద్రోయుటయందు దక్షనిపుణములును, దోషయుక్తములును, సర్పములతోఁగూడి విషయుతములై యుండునవియు, అనేకములగు కఠినములైన ముండ్లతోఁగూడియున్నవియు, శిథిలమైన ముఖములు గలవియునగు గోతులున్ను ఇంద్రియములున్ను సమములు.

ఆత్మంభరీణ్యనార్యాణి సాహసైకరతాని చ
అన్ధకారవిహారీణి రక్షాంసి స్వేన్ద్రియాణి చ 56

తమ యుదరపోషణమున మాత్రము ప్రవీణులును, అనార్యులును, నీచసాహసమందు నిరతులును, అంధకారమున విహరించువారునునగు రాక్షసులున్ను, ఇంద్రియములున్ను సమానములు.

అన్తఃశూన్యాన్యసారాణి వక్రాణి గ్రన్థిమన్తి చ
దహనైకార్థయోగ్యాని దుర్దారూణీన్ద్రియాణి చ. 57

లోన శూన్యముగనుండునవియు, సారరహితములైనవియు, వక్రములును, గ్రంథియుక్తములును కాల్చుటకు మాత్రము తగినవియు నగు శిథిలములైన వెదురు బొంగులున్ను, ఇంద్రియములున్ను సమములు.

ఘనమోహప్రబన్ధీని దుష్కూపగహనాని చ
మహావకరతుచ్ఛాని కుపురాణీన్ద్రియాణి చ. 58

చోరత్వము, జూదము, కలహము మున్నగు దుర్వ్యసనములతోఁ గూడియుండుటచే ఘనమోహసంయుక్తములును, శిథిలమైన కూపములచేఁ బరిపూర్ణములును, గొప్పధూళిచేఁ గప్పఁబడి నిందితములై యొప్పునవియునగు దుర్జననివాసములైన పురములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

అనన్తేషు పదార్థేషు కారణాని ఘటాదిషు
సంభ్రమాణి సపఙ్కాని చక్రకాణీన్ద్రియాణి చ. 59

అనంతములైన ఘటాదిపదార్థములకుఁ గారణములును, భ్రమయుక్తములును పంకసహితములగు కులాలుని (కుమ్మరివాని) చక్రములున్ను, ఇంద్రియములున్ను సమములు.

ఆపన్నిమగ్నమిమమేవమకించన త్వం
మాముద్ధరోద్ధరణశీల దయోదయేన
యే నామ కేచన జగత్సు జయన్తి సన్త
స్తత్సంగమం పరమశోకహరం వదన్తి. 60